ప్రథమ ముద్రణ 1958 ఫిబ్రవరి
ద్వితీయ ముద్రణ 1958 సెప్టెంబరు

# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము

సంచిక — 1

శ్రీ పురాణపండ రామమూర్తి

ఎడిటర్:
పి. యస్. ప్రకాశదీక్షితులు

# శ్రీ మహాభారత ప్రచారక సంఘము

## కాకినాడ

పాలకవర్గము :

శ్రీ [illegible] కృష్ణబ్రహ్మశాస్త్రి, బి. ఏ., బి. ఎల్.

శ్రీ పైండా వెంకటనారాయణ, యం. పి.

శ్రీ దంటు భాస్కరరావు,

కాకినాడ పురపాలక సంఘాధ్యక్షులు

శ్రీ కోట సీతారామస్వామి నాయుడు

శ్రీ [illegible] సన్యాసిరావు

కార్యాచరణ వర్గము

అధ్యక్షులు :

శ్రీ [illegible] రామమూర్తి

ఉపాధ్యక్షులు :

శ్రీ అకెళ్ల నరసింహావధానులు

సంయుక్త కార్యదర్శులు :

శ్రీ [illegible] రామమూర్తి

శ్రీ గొల్లపూడి చినవెంకటస్వామి

కోశాధికారి :

శ్రీ మాజేటి గోవిందరాజులు

## పాలకొల్లు

అధ్యక్షులు :

శ్రీ అద్దేపల్లి సత్యనారాయణమూర్తి, ఎం. ఎల్. ఏ.

ఉపాధ్యక్షులు :

శ్రీ బొళ్ల వెంకటసుబ్బారావు

కార్యదర్శి :

శ్రీ కలగ శంభుప్రసాద్

సహాయ కార్యదర్శి :

శ్రీ పినిశెట్టి చినవెంకటేశ్వరరావు

కోశాధికారి :

శ్రీ యిమ్మిడిసత్యనారాయణ

సభ్యులు :

శ్రీ చోడిశెట్టి సూర్యారావు

శ్రీ ఆచంట కేశవరావు

శ్రీ గాది వెంకట్రామయ్య

శ్రీ ఆబోతుల రామన్న

* *

సంపాదక సహకారం :

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి (విశారద)

శ్రీ [illegible] ప్రింటింగు ప్రెస్, ఆలమూరు, తూ.గో.జిల్లా.

ముద్రణ :

# పాంచజన్యం

కృష్ణభగవానుని రాయబారఘట్టం ప్రారంభ సంపుటంగా ఆంధ్రమహా భారతము మీహృదయాలముందు ఉంచాము. వేదవ్యాసభగవానుని ఆర్షవాణి అమృతమయమైనది. ఆ అమృతరసమాధురీఝరీశీకరాలనయినా ఆంధ్ర మహాజనులకు అందించాలనే మా సంకల్పానికి సహకారం చెయ్యటానికి ఎందరో ముందుకు వచ్చారు. భారతీయజనజీవితవైవిధ్యాన్నీ మనోరీతిపరిణామాన్నీ విపులీకరించిన వ్యాసమునిచంద్రుని భారతజ్యోత్స్నలో విహరించే మీరు ఇకనుండి నెల నెలా మొదటివారంలో ఒక్కో సంపుటాన్నే అందుకోగలరు. గ్రంథమూ మహత్తర పురుషార్థాలను ప్రతిబింబించే మహాభారతము. కార్యక్రమమూ బృహత్తర ప్రణాళికతో లక్ష రూపాయల వ్యయముతో కూడుకొన్నది.

పంచవర్ష ప్రణాళికగా రూపొందించుకొన్న ఈ కార్యక్రమం సుదర్శనధారి కరుణాకటాక్ష వీక్షణంతో ఈ లోగానే పరిపూర్ణం కాగలదని ఆశిస్తున్నాము. రాయబార సంపుటం వెలువడగానే తెలుగునేల నాలుగుచెరగులనుండీ మాకు లభించిన ప్రోత్సాహాన్ని చూసి మే మీ మాట అనగలిగాము. ఇక విజ్ఞులు చేసిన సూచనలు చాలవరకూ గ్రహించి ఈ సంపుటంలో ప్రదర్శించాము. అభినందించినవారితోపాటు అమూల్యమైన సలహా లిచ్చినవారికీ యిచ్చేవారికీ కృతజ్ఞత లందజేస్తున్నాము. ఆంధ్రజనతాహృదయాలను అలరించి ఆకర్షించే రీతిలో సకాలంలో సంపుటం అందజేయగలమని విశ్వసిస్తున్నాము.

సర్వే జనాః సుఖినో భవంతు

# వి ష య సూ చి

# మహాభారత సౌరభము

మంత్రహ్రదాత్కథాకుల్యా విద్యాకేదార మాగతా
మోక్షశ్రియః ప్రసూర్మధ్యే పీయతే కర్మమార్గగైః.

మంత్ర మనగా వేదము. వేదము హ్రదము. ఆ హ్రదమునుండి కథాకుల్య ప్రవహించినది. ఆ కాలువనీరు విద్యాకేదారమును తడిపినది. అక్కడ పండినపంట మోక్షశ్రీ. ఆకథాకుల్యలోని నీటితో కర్మపథానుయాయులునడుమ నడుమ దప్పిక తీర్చుకొనుచున్నారు. ఆ కథ— వారిదప్పికకు ఏర్పడి పాఱుచున్నది కాదు. వారితృష్ణను నివారించుట ఆ కాలువకు ఆనుషంగికము. మఱి— అది చేయవలసిన పని విద్యాకేదరమును తడుపుట; ముక్తిసస్యమును పండించుట.

భారదేశమున అధికారతారతమ్యముతో మహాభారతపారాయణము జరుగుచున్నది; జరుగును. ప్రవృత్తిసాధకముగా ఒకడు— నివృత్తి బోధకముగా మఱియొకడు భావించి పారాయణము చేయుచున్నారు; పురాణము చెప్పుచున్నారు. ఇది— ఇరువయిపుల పదునుగల చుఱకత్తి.

తత్త్వతః, భరతఖండము వేదగోక్షీరమునుండి తీసిన నవనీతఖండము. ఈ వెన్నముద్దలో సంగోరు, మహా తల్లి యశోదాదేవి సగుణకృష్ణునకు తినిపించినది. ఆ ముద్దబలముతో ఒడలుచేసి గడిదేఱి కృష్ణుడు పార్థునకు సారథ్యము నెఱపినాడు; అతనికి తన విశ్వరూపమును సిద్ధసాధనముగా చూపినాడు. చూడగా, మహాభారతతత్త్వము ప్రవృత్తిని ఊనుకొని నివృత్తిని ఆనుకొని యున్నది. నేడది నివురుగప్పిన నిప్పు.

మహాభారతాంతర్గతజ్యోతిర్మండలమధ్యవర్తియై వెలుగని 'గీత' ఒకటి యున్నది. అది గోచరమైనవానికి యావద్భాగతము మిథ్యాజగత్తు. కానివానికి, అది తెలిసికొనుటకు భారతముకంటె మించిన గతి లేదు. అంతకు మించిన జగద్భాష్యము మఱియొకటిలేదు. అలేఖ్యమైన ఆమ్నాయతత్త్వము నోటబెట్టరాని చేదుమందు. ఆ మందునకు లోకవ్యాఖ్యామకరందమును అనుపానము

చేసి భవరోగులకు ఒంటబట్టించుటకు యత్నించిన ఋషిశిఖరక్కు— వ్యాసులవారు. వారి అడుగుజాడలనుండి ఆచార్యశంకరపాదులు జగదభ్యుదయనిశ్శ్రేయస సాధకులో గణాధిపతిగంటమునకు పసిడిగంటలు అలంకరించిరి. భగవద్గీత— సనత్సుజాతీయము— విష్ణుసహస్రనామస్తోత్రము— ఇవియన్నియు ఆచార్యభాష్య ముద్ర గాంచిన భారతామృతబిందువులు.

ఇతిహాసములు ఎన్నియున్నను, యావద్భారతజాతిని నడపించు మహోత్తమ గ్రంథములు మూడేమూడు. అవి— అందఱకు తెలియు ననుకొనుచున్న భారత భాగవత రామాయణములు. రామాయణము త్రేతలోనిది కాగా, మిగిలినవి ద్వాపరములోనివి. యుగముల హద్దు పద్దు లేల? యుగయుగములకు ఈ మూడే చాలినవి.

రామాయణమున మానవ దానవ ధర్మాధర్మములకు జరిగిన పోరాటము చూచితిమి. దిగుణమునకు వినాశము తప్పదు. విభీషణుడు దానవజాతి. అయిన నేమి? పరమార్థమున అతనిది మానవధర్మముగల హృదయము. అందుకే, రావణానంతరము రాక్షసరాజ్యమున అతనికే అభిషేకము జరిగెను. సుగ్రీవుడు జాతికి వానరుడు. అగుగాక! అతనిలో కరడుకట్టినది నరధర్మము. ఈ ధర్మమే వాలివెనుక అతనిని కిష్కింధకు ఏలికను చేసినది. వానరులకు వానరుడే పాలకుడు. దానవులకు దానవుడే ఏలిక. ఈ ధర్మము రాముని యేలుబడిలో నిలబడినది. అటు ప్రభువైన విభీషణునకు— ఇటు ప్రభువైన సుగ్రీవునకు మనుస్మృతి ప్రమాణము కాని, దనువానరస్మృతులు కావు. రాముడు తానెవనిలో మానవధర్మమును పరికించెనో వానితలపై కిరీటపుబరువు పంచెను. సుగ్రీవ విభీషణులు రాముని ధర్మనికషమునకు గీటువచ్చినవారు. రామాయణమున— మానవేతరపాలకులలోకూడ మానవధర్మమే ఉండవలయునని రాముడు నిలబెట్టినాడు. పరదారాపహరణము ఒకమానవులకే కాదు, దానవ వానరులకును కానికార్యమే అని రామాయణము చాటినది.

రామాయణములోని రావణ వాలులకు కొంత తక్కువగా భారతమునందలి దుర్యోధనుని జీవునకు దానవ వానర లక్షణములు పట్టినవి. అప్పుడు-ధర్మాభిరాముడైన కృష్ణుని రాజకీయచక్రము ఒక్కసారి తిరిగినది. లీల ఒకనిదికాగా, జయమాల అర్జునుని మెడలో వచ్చిపడినది.

మహాభారతము మనకు ముందుయుగమున జరిగినది. మానవ రాక్షసుల పోరాటముకాక, మానవ కుటుంబములో జరిగిన పోరాటమగుటచే మనకు మఱియు సన్నిహితముగా అనుభూతముగా ఉన్నదనిపించు గాథ. ఓహో! ఒక నాటి భారతజాతీయకుటుంబ మిట్టిదా! అనుకొనుచు మనము చదువుకొని నెమరు వేయుచున్న గాథ.

వేదవ్యాసమహర్షి పురాణోపపురాణములు ముప్పదియాఱు రచించెను గాక— మహాభారతమొక్కటే మననేలలో గాలివలె సంచారము చేయుచున్నది. ఉపనిషత్తులలోని అధ్యాత్మవిద్యనుండి- సాహిత్యములోని ఖండకావ్యమువఱకు- అర్థముకాని వ్యాసఘట్టములనుండి ఆబాలము ఉపయోగపడు పిట్టకథలవఱకు మహాభారతము తన విశ్వరూపమును ప్రదర్శించుచున్నది. వైజ్ఞానికమైన సంపదకు— సాంఘికములైన మర్యాదలకు— రాజకీయమైన యెత్తుగడలకు— సారస్వతమైన పోకడలకు- సర్వమునకు- మహాభారతము వేయిపడగల శేషభోగి. భరతఖండముయొక్క సంస్కృతి సంప్రదాయములు- నీతి నియమములు- ధర్మ కర్మములు- ఈభారమంతయు దానిపై ఉన్నది. దీనిని ఎవ రెట్లు భావించిన వారికా రూపములో ప్రత్యక్ష మగును. ఇక్కడ ఆంధ్ర ప్రథమకవి నన్నయగారి పద్యము మనకు మూదల :

సీ. 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని యైతిహాసికు లితిహాసమనియు
పరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని మహిఁ గొనియాడుచుండ

ఆ. వె. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁడాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరఁగుచుండఁ జేసె భారతంబు.'

అందఱికంటెను ఆంధ్రుల జీవితానుభవములకు వారి మనఃప్రవృత్తులకు వారి మాటతీరులకు "భారతగాథ" దగ్గఱిచుట్ట మని ఎవడో యొక్కడే అన్న మాట కాదు. ఈనాడు తెలిసికొన్నదియు కాదు. తొమ్మిదివందల యేండ్లనాడే యీ ఎఱుక పరిమళించినది. అదిమొదలు 'కవిత్రయము' పోషణములో మహాభారతము ఫలితపారిజాతమై తెలుగువారి హృదయోద్యానమున తేనెవిందులు

ప్రాంశు పయోద నీల తనుభాసితు
ఉజ్జ్వల దండధారు పింగాంశు
జటచ్ఛటాభరణు ఆగమపుంజ
పదార్థ తత్త్వ నిస్సంశయకారు
కృష్ణమృగచర్మకృతాంబరకృత్య
భారతీవంశ వివర్ధనున్ త్రిదశవందితు
సాత్యవతేయు గొల్చెదన్.

# సంభవ పర్వము

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్.

బదరికాశ్రమవాసులగు నరనారాయణులకు వారి లీలలను వ్యాప్తముచేయు సరస్వతీదేవికి అష్టాదశపురాణప్రవక్త యగు వ్యాసమహర్షికి నమస్కరించి జయమును పఠింపవలెను.

'జయోనామేతిహాసోఽయం' అను వాక్యాన్ని అనుసరించి ఇదిలో ఈ మహాభారత ఇతిహాసం 'జయం' అనే పేరుతో వ్యవహరింపబడింది. ఈ జయఇతిహాసముయొక్క పఠన పాఠన లేఖనాదులయందు మంగళాచరణము అవశ్యము. భారతీయ సంప్రదాయానుసారము గ్రంథారంభమున గ్రంథమధ్యమున గ్రంథాంతమున మంగళాచరణ ముండితీరవలయును. కనుకనే పరమేశ్వర నమస్కారముతో గ్రంథము ఆరంభమైనది.

సర్వహృదయాంతర్యామి యగు నారాయణుడే కృష్ణుడుగా, ఆ నారాయణాంశయే అర్జునుడుగా అవతరించుటచే వారి లీలలనే ఈ ఇతిహాసము వివరించుటచేతనూ, యీ వివరణకు అక్షరరూపిణి అయిన శారద మూలకారణమగుట చేతనూ, ప్రవక్త వ్యాసమహర్షి యగుటచేతనూ వారందరికీ నమస్క్రియాచరణము జరిగినది.

అంతేగాక మంగళాచరణమునందే గ్రంథ ప్రతిపాదితాంశము శ్రీకృష్ణపరబ్రహ్మమనియూ, ప్రతిపాదించునది విద్యాధిష్టాన దేవతయగు సరస్వతి యనియూ, ప్రవక్త వేదవ్యాసు డనియూ నిర్దేశితమైనది. బృహత్కార్యనిర్వహణము నిర్విఘ్నముగ సాగుటకే ఈ మంగళాచరణము ఉద్దేశింపబడినది.

ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమః పితామహాయ ఓం నమః ప్రజాపతిభ్యః
ఓం నమో కృష్ణ ద్వైపాయనాయ
ఓం నమో సర్వవిఘ్న వినాయకేభ్యః.

ప్రణవము బ్రహ్మము. 'తస్య వాచకః ప్రణవః' అను సూత్రానుసారం ఓంకారము బ్రహ్మశబ్దమును బోధించునది యని వ్యక్తము కాగలదు. అట్టి పరబ్రహ్మ స్వరూపుడగు వాసుదేవునకూ పరమాత్మరూపుడగు పితామహునకు నమస్కారము. పరబ్రహ్మరూపులగు ప్రజాపతులకు, వేదవ్యాసునకు విఘ్నవినాశహేతుభూతు డగు గణనాథునకు నమస్కారము.

వాసుదేవ, పితామహ, ప్రజాపతి, వ్యాస, వినాయకాది నామాదులయందు ప్రణవం ఉండడంచేత వీ రందరినీ బ్రహ్మవస్తువుగనే భావించవలసినట్లు గోచరిస్తుంది. 'సదేవ సోమ్య దమగ్ర ఆసీదేకమేవా ఽద్వితీయమ్. ఏక మేవాఽ ద్వితీయం బ్రహ్మ. తత్వమసి శ్వేతకేతోః ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః' మొదలగు శ్రుతుల్ని అనుసరించి చూస్తే సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమైన పరమాత్మ ఒక్కడే అని నిర్ణయింపబడుతూ వుంది. అంతేగాక ఒక దేవుడు సర్వభూతములయందును అంతర్యామిగా గూఢంగా ఉన్నట్లు గోచరిస్తుంది. సృష్టికి పూర్వం పరబ్రహ్మరూపమైన సత్పదార్థం వినా ఇతరవస్తువేదీ ఉన్నట్లు గోచరించదు. కనకనే శ్రుతిసిద్ధాంతానుసారం బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాత్మకంగా ఇంద్ర, చంద్ర, సూర్యాత్మకంగా, రామ, కృష్ణాద్యవతారాత్మకంగా యే దేవతామంత్రోపాసనయందైనా ఆదిలో ప్రణవంతోనే మంత్రం ఆరంభమాతుంది. నిరూపమై, నిర్వికారమై, నిరంజనమై, సర్వవ్యాపకమై, సర్వజ్ఞత్వ, స్వేచ్ఛామయాది

లక్షణయుతమై, నిరతిశయానందానుభూతి స్వరూపమైన పరమాత్మ ఒక్కడే యైయుండియును "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా." యను శ్రుత్యర్థానుసారం పరమాత్మ తనయందభిన్నముగనున్న అఘటిత ఘటనా సామర్థ్యముగల మహామాయాశక్తిచే అనేక రూపములు కలవానివలె గోచరించుట సృష్టి క్రమమున ధర్మమే యగుటచే సృష్టియందు, తత్తత్కార్యానుగుణముగ సత్వ, రజ, స్తమో గుణానుసారము అనేకరూపముల నందుట వ్యావహారిక సత్యం. కనుకనే ఆ యా కార్యసాధనకై అనంతశక్తియుతుడైన పరమాత్మను అనేక నామరూపములతో ధ్యానించుట పూజించుట నమస్కరించుట యనునవికూడ సృష్ట్యారంభము నుండి వస్తూనే ఉన్నాయి. శ్రౌతస్మార్తాదులందును పౌరాణికాదులందును అనేక దేవతా రూపములు ప్రతిపాదించి మానవులను వారివారి అభిరుచుల ననుసరించి దైవికమునందు ప్రవేశపెట్టి సర్వమూ బ్రహ్మస్వరూపమే అని గుర్తించడానికి వీలుగా ప్రతిమంత్రాదియందు ప్రణవం చూపడంవల్ల "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అన్నారు. ఏ దేవతకు నమస్కరించినా కేశవునికే చెందుతుంది. ఇక్కడ కేశవుడంటే సృష్టిస్థితిలయహేతుభూతుడైన పరమేశ్వరుడని అర్థము గనుకనే వాసుదేవాది నామములనిస్తూ ఆదిని ప్రణవం ఉంచారు.

"వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రియం" అనే సూక్తి ననుసరించి సమస్తచరాచరప్రపంచం ఆతనియందూ ఆతడు ఈ ప్రపంచం లోనూ వసించడంచేత పరమాత్మకు వాసుదేవుడనే పేరు వచ్చింది. సమస్త జీవాశ్రియభూతుడైన వాసుదేవునికి నమస్కారం అని ఆదిలో చెప్పబడింది. సృష్టికారణమగు పితామహుడూ, మనకు శరీరమొసంగిన ప్రజాపతులు, సర్వవిద్యాధిష్ఠాత్రి యగు సరస్వతి, మహాప్రవక్త యగు వేదవ్యాసుడు, నిర్విఘ్నకారణుడగు వినాయకుడు గ్రంథముయొక్క నిర్విఘ్న పరిసమాప్తి కొరకే ప్రణుతింపబడిరి. మనకు వాసుదేవ రూపంలో ఆశ్రయమూ, ప్రజాపతిరూపంలో శరీరమూ ఇచ్చి వ్యాసస్వరూపంగా చతుర్వేదసారమైన జయమును ప్రసాదించాడు. మహాభారతానికి లేఖకుడుగా వినాయకరూపం పొందినవాడు ఆ పరమాత్మ అగుటచేతనే ప్రణవాన్ని ఆదియందుంచి నమస్కరించుట ఆయా నామాలకు సిద్ధమైంది.



లోమహర్షణపుత్ర ఉగ్రశ్రవాః సౌతిః పౌరాణికో
నైమిశారణ్యే శౌనకస్య కులపతేర్ద్వాదశవార్షికే సత్రే.
సుఖాసీనా నభ్యగచ్ఛ ద్బ్రహ్మర్షీన్ సంశితవ్రతాన్
వినయావనతో భూత్వా కదాచిత్ సూతనన్దనః.
ఏవం కృత్వా తతో దేవో మునిం గౌరముఖంతదా
ఉవాచ నిమిషేణేదం నిహతం దానవం బలం.
అరణ్యేఽస్మిం స్తత స్త్వేత న్నైమిశారణ్యసంజ్ఞితం
తమాశ్రమ మనుప్రాప్తం నైమిశారణ్యవాసినాం.
చిత్రాః శ్రోతుం కథా స్తత్ర పరివవ్రు స్తపస్వినః
అభివాద్య మునీంస్తాంస్తు సర్వా నేవ కృతాంజలిః.
అపృచ్ఛత్ స తపోవృద్ధిం సద్భి శ్చైవాభిపూజితః
అథ తేషూపవిష్టేషు సర్వే ష్వేవ తపస్విషు.
నిర్దిష్ట మాసనం భేజే వినయా ల్లోమహర్షణిః
సుఖాసీనం తత స్తంతు విశ్రాంత ముపలక్ష్య చ.
అథాపృచ్ఛదృషి స్తత్ర కశ్చి త్ప్రస్తావయన్ కథాః
కుత ఆగమ్యతే సౌతే క్వచాయం విహృత స్త్వయా.
కాలః కమలపత్రాక్ష శంసై తత్ పృచ్ఛతో మమ
ఏవంపృష్టోఽబ్రవీత్ సమ్యక్ యదావల్లోమహర్షణిః.
వాక్యం వచనసంపన్న స్తేషాం చ చరితాశ్రయం
తస్మిన్ సదసి విస్తీర్ణే మునీనాం భావితాత్మనాం.
జనమేజయస్య రాజర్షేః సర్పసత్రే మహాత్మనః
సమీపే పార్థివేంద్రస్య సమ్యక్ పారిక్షితస్య చ.
కృష్ణద్వైపాయనప్రోక్తాః సుపుణ్యా వివిధాః కథాః
కథితా శ్చాపి విధివత్ యా వైశంపాయనేన వై.
శ్రుత్వాహం తా విచిత్రార్థా మహాభారతసంశ్రితాః
బహూని సంపరిక్రమ్య తీర్థా న్యాయతనాని చ.
సమన్తపంచకం నామ పుణ్యం ద్విజనిషేవితం
గతవా నస్మి తం దేశం యుద్ధం యత్రాభవ త్పురా.
కురూణాం పాండవానాంచ సర్వేషాంచ మహీక్షితాం
దిదృక్షు రాగత స్తస్మాత్ సమీపం భవతా మిహ.

ఆయుష్మంతః సర్వ ఏవ బ్రహ్మభూతా హి మే మతాః
అస్మిన్ యజ్ఞే మహాభాగాః సూర్యపావకవర్చసః.
కృతాభిషేకాః శుచయః కృతజప్యాహుతాగ్నయః
భవన్త ఆసనే స్వస్థా బ్రవీమి కి మహం ద్విజాః.
పురాణసంహితాః పుణ్యాః కథా ధర్మార్థసంశ్రితాః
ఇతివృత్తం నరేన్ద్రాణా మృషీణాం చ మహాత్మనాం.
ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా
సురై ర్బ్రహ్మర్షిభి శ్చైవ శ్రుత్వా యదభిపూజితమ్.
తస్యాఖ్యాన వరిష్ఠస్య విచిత్రపదపర్వణః
సూక్ష్మార్థన్యాయయుక్తస్య వేదార్థై ర్భూషితస్య చ.
భారత స్యేతిహాసస్య పుణ్యాం గ్రంథార్థసంయుతాం
సంస్కారోపగతాం బ్రాహ్మీమురుశాస్త్రోపబృంహితాం.
జనమేజయస్య యాం రాజ్ఞో వైశంపాయన ఉక్తవాన్
యథావత్ స ఋషి స్తుష్ట్యా సత్రే ద్వైపాయనాజ్ఞయా
వేదై శ్చతుర్భిః సంయుక్తాం వ్యాసస్యాద్భుతకర్మణః
సంహితాం శ్రోతు మనసః పుణ్యాం పాపభయాపహాం
ఆద్యం పురుష మీశానం పురుహూతం పురుష్టుతం
ఋత మేకాక్షరం బ్రహ్మ వ్యక్తావ్యక్తం సనాతనం.
అస చ్చ సదస చ్చైవ యద్విశ్వం సదసత్పరం
పరావరాణాం స్రష్టారం పురాణంపర మవ్యయం.
మంగళ్యంమంగళం విష్ణుం వరేణ్య మనఘం శుచిం
నమస్కృత్య హృషీకేశం చరాచరగురుం హరిం.
మహర్షేః పూజిత స్యేహ సర్వలోకై ర్మహాత్మనః
ప్రవక్ష్యామి మతం పుణ్యం వ్యాస స్యాద్భుతకర్మణః.
ఆచఖ్యుః కవయః కేచిత్ సంప్రత్యాచక్షతే పరే
ఆఖ్యాస్యన్తి తథై వాన్యే ఇతి హాస మిమం భువి.
ఇదం తు త్రిషు లోకేషు మహజ్జ్ఞానం ప్రతిష్ఠితం
విస్తరై శ్చ సమాసై శ్చ ధార్యతే యద్ద్విజాతిభిః.
అలంకృతం శుభైః శబ్దైః సమయై ర్దివ్యమానుషైః
ఛందోవృత్తైశ్చ వివిధై రన్వితం విదుషాంప్రియం.

ఒకప్పుడు నైమిశారణ్యమందు కులపతి శౌనకుడు ద్వాదశవార్షిక సత్రయాగం ఆరంభించాడు. తీవ్రనియమానుష్ఠాన పరులైన బ్రహ్మర్షులూ ప్రాతర్మాధ్యందిన సాయంసవనాది విభాగంతో స్వాహాకార స్వధాకార వషట్కారాలతో సర్వసమర్థులైన ఋత్విజులూ ఆసత్రయాగాన్ని సక్రమంగా నిర్వహిస్తున్నారు.

ఒకానొక విశ్రాంతి సమయంలో రోమహర్షణుని పుత్రుడైన ఉగ్రశ్రవుడు అనేపేరుగల సౌతి ఆప్రాంతానికి విచ్చేశాడు. వచ్చిన సౌతి వినయంతో ఋషిమండలాన్ని తిలకించాడు. ఆయన సమస్త పురాణాలలోనూ పాండిత్యం కలవాడు. విశేషించి మహావక్త.

నైమిశారణ్యాన్ని గురించి వరాహ పురాణంలో ఇలా ఉంది.

గౌరముఖు డనుమహర్షితో భగవాను డిట్లు పలికెను: నేను నిమిషమాత్రమున రాక్షస బలాన్ని హరించిన కారణంచేత ఈ అరణ్యానికి నేటినుండి నైమిషారణ్య మనే వ్యవహారం కలుగుగాక. ఇంతేగాక మరొక కారణంకూడా ఉంది. పూర్వం మహర్షులు బ్రహ్మదగ్గరకు వెళ్ళి తపోదాన యాగాదులకు పవిత్ర ప్రదేశం చూపమన్నారు. బ్రహ్మ దర్భమయమైన చక్రాన్ని వదిలి ఈ చక్రం ఎక్కడపడితే అక్కడే మీ ఆశ్రమాలు నిర్మించుకోండి - అన్నాడు.

ఆ చక్రం ఒక మహారణ్య మధ్యంలో శిథిలమై పడింది. చక్రనేమి శిథిలమై పడినచోటు కాగా నాటినుండి అది నైమిశం అనే పేరుతో వ్యవహరింపబడసాగింది. ఈ కారణాలవల్లనే దీన్ని నైమిషమనీ నైమిశమనీ వ్యవహరింపసాగారు. పరమ పవిత్రప్రదేశమైన కారణంచేత ఈ నైమిశంలోనే శౌనకులు సత్రయాగం ఆరంభించారు.

కులపతి:

జిజ్ఞాసగల పదివేలమంది విద్యార్థులకు అన్న వస్త్రాదు లిచ్చి వారి అభ్యుదయము నపేక్షించు విద్వాంసుడగు బ్రాహ్మణుని కులపతి యందురు. ఈకారణమునకు ఉదాహరణముగ నిలచినవాడు శౌనకకులపతి.

సత్రయాగం:

అనేకులు కూడి చేయునది సత్రయాగము. ఇది అనేకులకు సదాచారసంపత్తినీ జ్ఞానమునూ ప్రసాదించును. అంతేగాక అసంఖ్యాకులను అన్నవస్త్రములతో పరితృప్తులనుచేసి జగత్కల్యాణ సంధాయక మగునది గాన దీనిని సత్రయాగము అన్నారు.

ఆ ఆశ్రమానికి వచ్చిన ఉగ్రశ్రవుడైన సౌతిని చూచి నైమిశారణ్యవాసులగు ఋషు లందరూ ఆనందపరవశు లయారు. సమస్త పురాణేతిహాసాదులను శ్రవణమనోహరంగా చెప్పడానికి సమర్థుడైన సౌతివలన సమస్త కథలను వినే ఇచ్ఛతో ఆతనిని పరివేష్టించారు.

ఉగ్రశ్రవు డామహర్షులందరికీ నమస్కరించి మీ తపోదీక్ష సక్రమంగా సాగుతోంది కదా! అని కుశలప్రశ్న చేశాడు. ఆ మహర్షులు సౌతికి యథోచితంగా స్వాగతమిచ్చారు. అనంతరం వారందరినీ ఉచితాసనాలపై కూర్చుండజేసి వినమ్రుడై రోమహర్షణపుత్రుడైన ఆ ఉగ్రశ్రవుడు తానూ తన ఆసనంమీద ఉపవిష్టు డయాడు.

సుఖాసీనుడైన ఉగ్రశ్రవుని చూచి ఒకమహర్షి ఇలా ప్రశ్నించాడు.

పుణ్యే హిమవతః పాదే మధ్యే గిరిగుహాలయే
విశోధ్య దేహం ధర్మాత్మా దర్భసంస్తర మాశ్రితః.
శుచిః సనియమో వ్యాసః శాన్తాత్మా తపసి స్థితః
భారత స్యేతిహాసస్య ధర్మే ణాన్వీక్ష్య తాం గతిం.
ప్రవిశ్య యోగం జ్ఞానేన సోఽపశ్యత్ సర్వమన్తతః
నిష్ప్రభేఽస్మిన్ నిరాలోకే సర్వత స్తమసా వృతే.
బృహదణ్డ మభూ దేకం ప్రజానాం బీజ మవ్యయం
యుగ స్యాది నిమిత్తం తన్మహ ద్దివ్యం ప్రచక్షతే.
యస్మిన్ సంశ్రూయతే సత్యం జ్యోతిర్బ్రహ్మసనాతనం
అద్భుతం చాప్యచిన్త్యం చ సర్వత్ర సమతాం గతం.
అవ్యక్తం కారణం సూక్ష్మం యత్తత్ సదసదాత్మకం
యస్మాత్ పితామహో జజ్ఞే ప్రభు రేకః ప్రజాపతిః.
బ్రహ్మా సురగురుః స్థాణు ర్మనుః కః పరమేష్ఠ్యథ
ప్రాచేతస స్తథా దక్షో దక్షపుత్రాశ్చ సప్త వై.
తతః ప్రజానాం పతయః ప్రాభవ న్నేకవింశతిః
పురుషశ్చాప్రమేయాత్మా యంసర్వఋషయోవిదుః
విశ్వేదేవా స్తథా దిత్యా వసవోఽథాశ్వినా వపి
యక్షాః సాధ్యాః పిశాచాశ్చ గుహ్యకాః పితర స్తథా.
తతః ప్రసూతా విద్వాంసః శిష్టాబ్రహ్మర్షిసత్తమాః
రాజర్షయ శ్చ బహవ స్సర్వే సముదితా గుణైః.
ఆపో ద్యౌః పృథివీ వాయు రన్తరిక్షం దిశ స్తథా
సంవత్సర ర్తవోమాసాంపక్షాహోరాత్రయః క్రమాత్
యచ్చాన్య దపి తత్సర్వం సంభూతం లోకసాక్షికం
యదిదం దృశ్యతే కించిత్ భూతం స్థావరజఙ్గమం.
పునః సంక్షిప్యతే సర్వం జగత్ ప్రాప్తేయుగక్షయే
యథర్తావృతులింగాని నానారూపాణి పర్యయే.
దృశ్యన్తే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు
ఏవ మేత దనాద్యన్తం భూతసంహారకారకం.
**అనాదినిధనం** లోకే చక్రం సంపరివర్తతే
**త్రయస్త్రింశత్సహస్రాణి** త్రయస్త్రింశత్ శతాని చ.
త్రయస్త్రింశ శ్చ దేవానాం సృష్టిః సంక్షేపలక్షణా
దివః పుత్రో బృహద్భాను శ్చక్షురాత్మా విభావసుః.
సవితా స ఋచీకోఽర్కో భాను రాశావహో రవిః
పురా వివస్వతః సర్వే మహ్యా స్తేషాం తథావరః.
దేవభ్రాట్ తనయ స్తస్య సుభ్రా డితి తతః స్మృతః
సుభ్రాజ స్త్రయః పుత్రాః ప్రజావన్తో బహుశ్రుతాః.
దశజ్యోతిః శతజ్యోతిః సహస్రజ్యోతి రేవ చ
దశపుత్రసహస్రాణి దశజ్యోతే ర్మహాత్మనః.
తతో దశగుణా శ్చాన్యే శతజ్యోతే రిహాత్మజాః
భూయ స్తతో దశగుణాః సహస్రజ్యోతిషస్సుతాః.
తేభ్యోఽయం కురువంశ శ్చ యదూనాం భరతస్య చ
యయాతీక్ష్వాకువంశ శ్చ రాజర్షీణాం చ సర్వశః.
సంభూతా బహవో వంశా భూతసర్గాః సువిస్తరాః
భూతస్థానాని సర్వాణి రహస్యం త్రివిధం చ యత్.
వేదా యోగః సవిజ్ఞానో ధర్మోఽర్థః కామ ఏవ చ
ధర్మకామార్థయుక్తాని శాస్త్రాణి వివిధాని చ.
లోకయాత్రావిధానం చ సర్వం తద్దృష్టవా నృషిః
ఇతిహాసాః స వైయాఖ్యా వివిధాః శ్రుతయోఽపి చ
ఇహ సర్వ మనుక్రాన్త ముక్తం గ్రన్థస్య లక్షణం
విస్తీర్యైత న్మహజ్జ్ఞాన మృషిః సంక్షిప్య చాబ్రవీత్.
ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్
మన్వాదిభారతం కేచి దాస్తీకాది తథా పరే.
తథోపరిచరా ద్యన్యే విప్రాః సమ్యగధీయతే
వివిధం సంహితాజ్ఞానం దీపయన్తి మనీషిణః.
వ్యాఖ్యాతుంకుశలాః కేచిద్గ్రన్థాన్ ధారయితుంపరే
తపసా బ్రహ్మచర్యేణ వ్యస్య వేదం సనాతనం.
ఇతిహాస మిమం చక్రే పుణ్యం సత్యవతీసుతః
పరాశరాత్మజో విద్వాన్ బ్రహ్మర్షిః సంశితవ్రతః.
తదాఖ్యానవరిష్ఠం స కృత్వా ద్వైపాయనః ప్రభుః
కథ మధ్యాపయా నీహ శిష్యా నిత్య న్వచిన్తయత్.

కమలములవంటి నేత్రములుగల సూత కుమారా! తమరు ఎక్కడనుండి ఇలా విజయం చేశారు? ఇంతవరకూ ఏఏ ప్రదేశాలలో విహారం చేశారు? అని తనసందేహాలను నివృత్తి చేయమన్నాడు.

ఇలా సభామధ్యంలో ప్రశ్నించగా సౌతి శుద్ధాంతరంగులైన మునులతో బ్రహ్మఋషులు, రాజఋషులు ఉన్న ఆ మహాసభలో ఇలా ప్రారంభించాడు.

మహర్షులార! మహాత్ముడూ, రాజర్షి ఐన పరీక్షిన్మహారాజుయొక్క పుత్రుడైన జనమేజయుడు సర్పయాగం చేశాడు. ఆ యజ్ఞంలో జనమేజయునికి వైశంపాయనుడు పవిత్రమైనట్టి చిత్రవిచిత్రార్థములతోగూడిన మహాభారతమందలి వివిధ కథలను విధిపూర్వకంగా చెప్పాడు. వానినన్నింటినీ విని నేనిలావచ్చాను.

నేను అనేక తీర్థములను సేవిస్తూ అనేక పుణ్యస్థలాలకు యాత్రలుచేస్తూ పుణ్యస్థలమైన శమంతపంచకం చూశాను. పూర్వం కురుపాండవులకు యుద్ధంజరిగిన కురుక్షేత్రం చూశాను. మిమ్మల్ని చూడాలని అక్కడినుంచి నేను మీ సన్నిధానమునకు వచ్చాను. బ్రాహ్మణులారా! ఈ యజ్ఞమందున్న మీరందరూ మహాత్ములూ, భాగ్యశాలురూ, సూర్యునితో అగ్నితో సమానమైన తేజశ్శాలురు.

మీరందరూ స్నాన, సంధ్యావందన, జప, అగ్నిహోత్రాదులు నెరవేర్చుకొని పరిశుద్ధులై మీమీఆసనాలపై స్వస్థచిత్తులై విరాజిల్లుతున్నారు. మీకు నేనేకథ చెప్పవలెనో సెలవిండు? ధర్మార్థ, గూఢ రహస్యాలతో అంతఃకరణ పవిత్రం చేసే పురాణగాథలను వినిపించనా! లేక ఉదారచరితుల, మహానుభావుల, ఋషుల, సామ్రాట్టుల పవిత్రగాథలు చెప్పనా!

సౌతీ! పరమఋషి శ్రీకృష్ణ ద్వైపాయనుడు ఏ ప్రాచీన ఇతిహాసరూపమైన పురాణవర్ణనం చేశాడో, దేవతలు, ఋషులు వారి వారి లోకాలలో విని దేనిని ప్రశంసించారో, ఆఖ్యానాలలో ఏది సర్వశ్రేష్ఠమైనదో దేని పద, వాక్య, పర్వములు విచిత్ర శబ్దవిన్యాసమై, రమణీయమైన అర్థాలతో పరిపూర్ణమైఉన్నవో, దేనియందు ఆత్మ, పరమాత్మలయొక్క సూక్ష్మరూప నిర్ణయం, వాటి అనుభూతికొరకు ఆవశ్యకములగు సూక్తులూ నిండిఉన్నాయో, ఏదిసమస్తవేదములయొక్క తాత్పర్యమున కనుకూలమైన అర్థంతో అలంకృతమైనదో ఆ మహాభారతేతిహాస గ్రంథంలోని భావాలను స్పష్టంచేసే పదవాక్యాల ఉత్పత్తితోగూడిన సమస్త శాస్త్రాభిప్రాయ సమ్మతమైన వ్యాస సంహితను వినాలని కుతూహలపడుతున్నాం. మహాభారతం నాలుగు వేదాలలోని అర్థంతో నిండి ఉంది. పరమార్థ రూపమైనదీ, పాపభయాలను నశింపజేసేది వేదవ్యాసుని ఆజ్ఞానుసారం జనమేజయుని యజ్ఞంలో వైశంపాయనుడు వినిపించిన మహాభారతం వినిపించు.

సమస్త జీవాంతర్యామి, సమస్త యజ్ఞములందునూ ఆవాహనచేయబడువాడూ సర్వజీవ నియంత యగువాడెవడో, ఎవని నుద్దేశించి హవిర్భాగములీయబడునో, ఎవడు అనేక నామరూపములతో స్తుతింపబడుచున్నాడో, ఎవడు సత్యస్వరూపుడో. ప్రణవరూపుడు సర్వవ్యాపకుడగు పరమాత్మ యెవడో, సాకార, నిరాకారరూపుడెవడో, ఎవడు సనాతనుడో, సదసద్రూపమున ఎవడు ప్రకాశిస్తున్నాడో,

తస్య తచ్చింతితం జ్ఞాత్వా ఋషే ర్ద్వైపాయనస్య చ
తత్రాజగామ భగవాన్ బ్రహ్మాలోకగురుః స్వయమ్.
ప్రీత్యర్థం తస్య చైవర్షే ర్లోకానాం హితకామ్యయా
తం దృష్ట్వావిస్మితోభూత్వాప్రాంజలిః ప్రణతః స్థితః.
ఆసనం కల్పయామాస సర్వై ర్మునిగణై ర్వృతః
హిరణ్యగర్భ మాసీనం తస్మిం స్తు పరమాసనే.
పరివృత్యాసనాభ్యాసే వాసవేయః స్థితోఽభవత్
అనుజ్ఞాతోఽథ కృష్ణ స్తు బ్రహ్మణా పరమేష్ఠినా.
నిషసా దాసనాభ్యాసే ప్రీయమాణః శుచిస్మితః
ఉవాచ స మహాతేజా బ్రహ్మాణం పరమేష్ఠినం.
కృతం మయేదం భగవన్ కావ్యం పరమపూజితం
బ్రహ్మన్ వేదరహస్యంచయచ్చాన్యత్ స్థాపితంమయా
సాంగోపనిషదాం చైవ వేదానాం విస్తరక్రియా
ఇతిహాసపురాణానా ము న్మేషం నిర్మితం చ యత్.
భూతం భవ్యం భవిష్యం చ త్రివిధం కాలసంజ్ఞితం
జరామృత్యుభయవ్యాధి భావాభావ వినిశ్చయః.
వివిధస్య చ ధర్మస్య హ్యాశ్రమాణాం చ లక్షణం
చాతుర్వర్ణ్యవిధానం చ పురాణానాం చ కృత్స్నశః.
తపసో బ్రహ్మచర్యస్య పృథివ్యా శ్చన్ద్రసూర్యయోః
గ్రహనక్షత్రతారాణాం ప్రమాణంచయుగైః సహ.
ఋచో యజూంషి సామాని వేదాధ్యాత్మంతథైవచ
న్యాయశిక్షా చికిత్సా చ దానం పాశుపతం తథా.
హేతునైవ సమం జన్మ దివ్యమానుషసంజ్ఞితం
తీర్థానాం చైవ పుణ్యానాం దేశానాం చైవకీర్తనం.
నదీనాం పర్వతానాం చ వనానాం సాగరస్య చ
పురాణాం చైవ దివ్యానాం కల్పానాం యుద్ధకౌశలం
వాక్యజాతివిశేషా శ్చ లోకయాత్రాక్రమ శ్చ యః
యచ్చాపి సర్వగం వస్తు తచ్చైవ ప్రతిపాదితం.
పరం న లేఖకః కశ్చి దేతస్య భువి విద్యతే
తపో విశిష్టా దపి వై శిష్టా న్మునిసంచయాత్.

మన్యే శ్రేష్ఠతరం త్వాం వై రహస్యజ్ఞానవేదనాత్
జన్మప్రభృతిసత్యాంతే వేద్మిగాం బ్రహ్మవాదినీం.
త్వయాచ కావ్యమిత్యుక్తంతస్మాత్ కావ్యంభవిష్యతి
అస్యకావ్యం కవయో న సమర్థా విశేషణే.
విశేషణే గృహస్థస్య శేషా స్త్రయ ఇవాశ్రమాః
కావ్యస్య లేఖనార్థాయ గణేశః స్మర్యతాం మునే.
ఏవ మాభాష్యతం బ్రహ్మాజగామ స్వం నివేశనమ్
తతః సస్మార హేరంబం వ్యాసః సత్యవతీసుతః.
స్మృతమాత్రో గణేశానో భక్తచిన్తితపూరకః
తత్రాజగామ విఘ్నేశో వేదవ్యాసో యతః స్థితః.
పూజిత శ్చోపవిష్ట శ్చ వ్యాసేనోక్తం సదాఽనఘ
లేఖకో భారత స్యాస్య భవ త్వం గణనాయక.
మయైవ ప్రోచ్యమానస్య మనసా కల్పితస్య చ
శ్రుత్వైతత్ ప్రాహవిఘ్నేశోయదిమేలేఖనీక్షణమ్
లిఖితో నావతిష్ఠేత తదాస్యాం లేఖకో హ్యహం
వ్యాసోప్యువాచతం దేవమబుద్ధ్వా మాలిఖక్వచిత్.
ఓ మిత్యుక్త్వా గణేశోఽపి బభూవ కిల లేఖకః
అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోకశతాని చ.
అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వానవా
తచ్ఛ్లోకకూట మద్యాపి గ్రథితం సుదృఢం మునే.
భేత్తుం న శక్యతేఽర్థస్య గూఢత్వాత్ ప్రశ్రితస్య చ
సర్వజ్ఞోపి గణేశో యత్ క్షణ మాస్తే విచారయన్.
తావ చ్చకారవ్యాసోఽపిశ్లోకానన్యాన్ బహూనపి
అజ్ఞానతిమిరాంధస్య లోకస్య తు విచేష్టతః
జ్ఞానాంజన శలాకాభి ర్నేత్రోన్మీలన కారకం
ధర్మార్థకామమోక్షార్థైః సమాసవ్యాసకీర్తనైః.
తథా భారతసూర్యేణ నృణాం వినిహతం తమః
పురాణపూర్ణ చంద్రేణ శ్రుతిజ్యోత్స్నాః ప్రకాశితాః
నృబుద్ధికైరవాణాం చ కృత మేతత్ ప్రకాశనం
ఇతిహాసప్రదీపేన మోహావరణ ఘాతినా.

సహస్రరూపభిన్ను డెవడో, ఈవిశ్వము ఎవనియందభిన్నమో, సమస్తస్థూలసూక్ష్మజగత్తును సృజించువా డెవడో, ఎవడు పురాణపురుషుడో, సర్వోత్కృష్టమైన పరమేశ్వరుడో, వృద్ధి, క్షయాది వికారశూన్యుడెవడో, ఎవనిని పాపములంటవో, సహజశుద్ధు డెవడో, ఆ పరబ్రహ్మయే మంగళమయుడగు విష్ణుమూర్తి. ఆ చరాచరప్రపంచగురుడూ, హృషీకేశుడూ (మనస్సు ఇంద్రియములు అనువానిని ప్రేరేపించువాడు) అగు శ్రీహరికి నమస్కరించి సర్వలోకపూజితుడూ అద్భుతకర్ముడూ అగు వేదవ్యాసమహర్షికి వందనమాచరించి అంతఃకరణహేతుభూతమగు ఈ ఇతిహాసం చెప్పుతున్నాను.

భూమండలంలో ఈ ఇతిహాసాన్ని ఎందరో కవులు వర్ణిస్తున్నారు. ముందు ముందు మహాకవులు వర్ణిస్తూ ఉంటారు. ఈ మహాభారతానికి త్రిలోకాలలోనూ ప్రతిష్ఠ ఉంది. అగ్రజాతులవారు దీన్ని విపులంగా సంక్షేపంగా పఠించటం, ఇతరులకు వినిపించటం చేస్తూ ధారణ చేస్తున్నారు. ఈమహాభారతం శుభప్రదమూ లలితమూ మంగళప్రదమూ అయిన పదాలతో అలంకృతమై ఉంది. వైదిక, లౌకిక సంకేతాలతో శోభాయమానమైనది. అనుష్టుప్, ఇంద్రవజ్రా మొదలైన ఛందస్సులచే బద్ధమైనది కావటంచేత పండితులకు ప్రియమైనది.

పరమపవిత్రమైన హిమాలయమందు ప్రశాంతమైన గుహలో ధర్మాత్ముడగు వ్యాసమహర్షి స్నానాది నిత్యకర్మపరిశుద్ధుడై కుశాసనమున ఆసీనుడై నియమబద్ధశాంతచిత్తంతో ఈశ్వరునియందు లగ్నమైన మనస్సుతో తపస్సు చేస్తున్నాడు. ధ్యానయోగంలో ఉన్న ఆ మహర్షి ధర్మపూర్వకమైన భారతేతిహాసంయొక్క స్వరూపాన్ని విచారించి జ్ఞానదృష్టితో దాన్ని విరచించాడు. మంత్రద్రష్టలవలె పంచమవేదరూపమైన మహాభారతమును వేదవ్యాసుడు ధ్యానయోగంలోనే చూసి ఆసత్యం వెల్లడించాడు.

సృష్టికి పూర్వమందు ఏ వస్తువిశేషము నామరూపాదులు లేక సర్వత్రా అంధకారం వ్యాప్తమై యున్నప్పుడు పెద్ద అండం ఆవిర్భవించింది. అదే సమస్తప్రజాబీజమై అవినాశనమైనదైంది. బ్రహ్మకల్పాదియందు ఆ బ్రహ్మాండమే చతుర్విధప్రాణికోటికి కారణమని చెప్పారు. దేనియందు సత్యస్వరూపుడూ జ్యోతిర్మయుడూ ఐన సనాతన బ్రహ్మ అంతర్యామిరూపమున ప్రవేశించి ఉంటాడో అదే యీ బ్రహ్మాండమని శ్రుతి ఘోషిస్తోంది. "తత్ సృష్ట్వా త దేవానుప్రావిశత్" పరబ్రహ్మ బ్రహ్మాండపిండాండములను సృజించి తా నందు ప్రవేశించెను. అని ఈశ్రుతి పై అర్థాన్నే బోధిస్తోంది.

ఆపరబ్రహ్మ అద్భుతమై, అచింత్యమై, సర్వత్ర, సమానరూపవ్యాప్తమై, అవ్యక్తమై, సూక్ష్మమై, సర్వకారణమై, అనిర్వచనీయమైనది. సత్, అసత్ రూపంలో ఉపలబ్ధమయే సర్వమూ ఆ పరబ్రహ్మమే. ఆ అండమందే ప్రథమదేహధారీ ప్రజాపాలకుడూ ప్రభువూ దేవగురుడూ పితామహుడైన బ్రహ్మ రుద్ర, మను, ప్రజాపతులూ, పరమేష్ఠీ, ప్రచేతసుడూ, దక్షుడూ, దక్షపుత్రులేడుగురూ ఆవిర్భవించారు. అనంతరం ఇరవైయొక్కమంది ప్రజాపతులు పుట్టారు. సమస్తఋషులూ మునులూ దివ్యజ్ఞానసంపత్తిచే మత్స్య కూర్మ వరాహాది రూపాలు పొందుతున్న శ్రీహరిని తెలిసికొంటూ ఉన్నారు. అప్రమేయాత్ముడు, విష్ణురూపుడు ఐన పురుషుడూ ఆతని విభూతిరూపులైన త్రయోదశవిశ్వేదేవులూ, ద్వాదశాదిత్యులూ, అష్టవసువులూ, అశ్వినీదేవ

[illegible] యథావత్ సంప్రకాశితం
సంగ్రహాధ్యాయబీజో వై పౌలోమాస్తీకమూలవాన్.
సంభవస్కంధవిస్తారః సభారణ్యవిటజ్కవాన్
అరణీపర్వరూపాఢ్యో విరాటోద్యోగసారవాన్.
భీష్మపర్వమహాశాఖో ద్రోణపర్వపలాశవాన్
కర్ణపర్వసితైః పుష్పైః శల్యపర్వసుగంధిభిః.
స్త్రీపర్వైషీకవిశ్రామః శాంతిపర్వ మహాఫలః
అశ్వమేధామృతరస స్త్వాశ్రమస్థాన సంశ్రియః
మౌసలః శ్రుతిసంక్షేపః శిష్టద్విజనిషేవితః
సర్వేషాం కవిముఖ్యానా ముపజీవ్యో భవిష్యతి.
పర్జన్య ఇవ భూతానా మక్షయో భారతద్రుమః
తస్య వృక్షస్య వక్ష్యామి శశ్వత్పుష్పఫలోదయం.
స్వాదుమేధ్యరసోపేత మచ్ఛేద్య మమరై రపి
మాతు ర్నియోగా ద్ధర్మాత్మా గాజ్గేయస్యచధీమతః
క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా
త్రీనగ్నీ నివ కౌరవ్యాన్ జనయామాస వీర్యవాన్.
ఉత్పాద్య ధృతరాష్ట్రం చ పాండు విదుర మేవ చ
జగామ తపసే ధీమాన్ పునరే వాశ్రమం ప్రతి.
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం
అబ్రవీద్భారతంలోకేమానుషే ఽస్మిన్ మహానృషిః.
జనమేజయేన పృష్టస్సన్ బ్రాహ్మణైశ్చ సహస్రశః
శశాస శిష్య మాసీనం వైశంపాయన మన్తికే.
ససదస్యైః సహాసీనః శ్రావయామాస భారతం
కర్మాన్తరేషు యజ్ఞస్య చోద్యమానః పునః పునః.
విస్తరం కురువంశస్య గాంధార్యా ధర్మశీలతాం
క్షత్తుఃప్రజ్ఞాంధృతింకుంత్యాఃసమ్యక్ ద్వైపాయనో ఽబ్రవీత్
వాసుదేవస్య మాహాత్మ్యంపాండవానాంచసత్యతాం
దుర్వృత్తంధార్తరాష్ట్రాణా ముక్తవాన్భగవాన్ ఋషిః.
ఇదం శతసహస్రం తు లోకానాం పుణ్యకర్మణాం
ఉపాఖ్యానైః సహాజ్ఞేయమాద్యం భారతముత్తమం.

చతుర్వింశతిసాహస్రీం చక్రే భారతసంహితాం
ఉపాఖ్యానై ర్వినా తావ ద్భారతం ప్రోచ్యతే బుధైః.
తతో ఽధ్యర్ధశతంభూయఃసంక్షేపం కృతవాన్ ఋషిః
అనుక్రమణికాధ్యాయం వృత్తాంతం సర్వపర్వణాం.
ఇదంద్వైపాయనః పూర్వంపుత్రమధ్యాపయచ్ఛుకం
తతో ఽన్యేభ్యో ఽనురూపేభ్యః శిష్యేభ్యః ప్రదదౌ ప్రభుః
షష్టిం శతసహస్రాణి చకారాన్యాం స సంహితాం
త్రింశచ్ఛతసహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితం.
పిత్ర్యే పంచదశప్రోక్తం గంధర్వేషు చతుర్దశ
ఏకం శతసహస్రం తు మానుషేషు ప్రతిష్ఠితం.
నారదో ఽశ్రావయ ద్దేవా నసితో దేవలః పితౄన్
గంధర్వయక్షరక్షాంసి శ్రావయామాస వై శుకః.
అస్మింస్తు మానుషేలోకే వైశంపాయన ఉక్తవాన్
శిష్యో వ్యాసస్య ధర్మాత్మా సర్వవేదవిదాం వరః.
ఏకం శతసహస్రం తు మయోక్తం వై నిబోధత.
దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః
స్కంధః కర్ణః శకుని స్తస్య శాఖాః.
దుశ్శాసనః పుష్పఫలే సమృద్ధే
మూలం రాజా ధృతరాష్ట్రో ఽమనీషీ.
యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కంధో ఽర్జునో భీమసేనో ఽస్య శాఖాః
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే
మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ.
పాండు ర్జిత్వాబహూన్ దేశాన్ బుద్ధ్యావిక్రమణేనచ
అరణ్యే మృగయాశీలో న్యవస న్మునిభిస్సహ.
మృగవ్యవాయనిధనాత్ కృచ్ఛ్రాం ప్రాప స ఆపదం
జన్మప్రభృతి పార్థానాం తత్రాచారవిధిక్రమః.
మాత్రో రభ్యుపపత్తిశ్చ ధర్మోపనిషదం ప్రతి
ధర్మస్యవాయోః శక్రస్య దేవయోశ్చతథాశ్వినోః.
తతో ధర్మోపనిషదః శ్రుత్వా భర్తుః ప్రియా పృథా

తలూ మొదలగువారు జన్మించారు. అనంతరం యక్ష, సాధ్య, పిశాచ, గుహ్యక, పితరులు, సదాచారపరాయణులు సాధుశిరోమణులు బ్రహ్మర్షులు ఆవిర్భవించారు. శౌర్యాది సద్గుణసంపన్నులైన రాజర్షులు ఉదయించారు. క్రమముగా ఆ బ్రహ్మాండంలోంచి జలము, ద్యులోకము, భూమి,వాయువు, ఆకాశము దిక్కులు ఆవిర్భవించాయి.

సంవత్సర ఋతు, మాస, పక్ష, దిన, రాత్రులుకూడా ఆ బ్రహ్మాండంనుంచే ఆవిర్భవించాయి. ఇంతేగాక ప్రపంచంలో కనిపించేవి వినిపించేవి అన్నీ ఈ బ్రహ్మాండంలోంచి పుట్టినవే.

ఈస్థావర జంగమాత్మకమైన ప్రపంచమంతా ప్రళయకాలంలో తనకు కారణమైన బ్రహ్మయందు లీనమగుతోంది. వసంతాది ఋతుకాలానుసారం ఫల, పుష్ప, పత్రాలు అనేక చిహ్నాలు ఏవిధంగా పుట్టి అంతరిస్తున్నాయో అలానే కల్పారంభంలో పూర్వరీతిగా వివిధపదార్థాలూ దృష్టిగోచరమై కల్పాంతంలో నశిస్తాయి. ఈరీతిగా అనాదీ, అనంతమూ ఐన కాలచక్రం లోకంలో నిత్యం తిరుగుతూ ఉంటుంది. ఈ భ్రమణమందే ప్రాణుల ఉత్పత్తీ సంహారం జరుగుతున్నాయి.

పూర్వకాలమందు దివఃపుత్రుడు, బృహాన్, భాను, చక్షు, ఆత్మా, విభావసు, సవితా, ఋచీక, అర్క, ఆశావః, రవి ఈ శబ్దాలతో సూర్యుడు వ్యవహరింపబడ్డాడు. వీనిలో చివరిదగు రవిశబ్దము పృధ్విలో గర్భస్థాపన చేయుటచేత పూజ్యమైనది. ఇతని కుమారుడు దేవభ్రాట్. దేవభ్రాట్టునికుమారుడు సుభ్రాట్ అని పిలువబడుచుండెడివాడు.

సుభ్రాట్‌కు ముగ్గురు పుత్రులు వారందరూ సంతానవంతులు. అనేక శాస్త్రాలు తెలిసినవారు. వారిలో పెద్దవాడు దశజ్యోతి రెండవవాడు శతజ్యోతి మూడవవాడు సహస్రజ్యోతి.

దశజ్యోతికి పదివేలమంది కుమారులు. శతజ్యోతికి తమ్మునిసంతతికన్న పదిరెట్లున్నది. అనగా ఆతనిసంతతి లక్ష. వారికి పదిరెట్లు మంది కుమారులు సహస్రజ్యోతికి గల్గిరి. అనగా ఆతని సంతతి పదిలక్షలు. వారినుండి ఈ కురు, యదు, భరత, యయాతి, ఇక్ష్వాకువంశాలూ మరికొన్ని రాజర్షి వంశాలూ బయలుదేరాయి. సృష్టిపరంపర వీరి నుండియే జరిగింది.

వేదవ్యాసభగవానుడు తన జ్ఞానదృష్టివల్ల సమస్త ప్రాణుల నివాసస్థానాలూ ధర్మ, అర్థ, కామ రూపరహస్యాలూ, కర్మోపాసనా జ్ఞానరూపమైన వేదమూ, విజ్ఞానసహితమైన యోగమూ, పురుషార్థత్రయ ప్రతిపాదకములైన అనేక శాస్త్రాలూ లోక వ్యవహారసిద్ధిదములైన, ఆయుర్వేద ధనుర్వేద, స్థాపత్యవేద, గాంధర్వ వేద ఆదిగాగల సమస్త శాస్త్రాల తత్త్వానుభవం పూర్తిగా పొందాడు.

ఆ వేదవ్యాసుడే ఈ మహాభారత గ్రంథంలో వ్యాఖ్యానంతో సమస్త ఇతిహాసాలలోని వేదాలలోని రహస్యాలనూ పరిపూర్ణంగా విపులంగా వివరించాడు. ఈపూర్ణత్వమే యీ గ్రంథలక్షణ మని చెప్పబడుతోంది.

వ్యాసమహర్షి ఈ గ్రంథంలో మహాజ్ఞానమును సంక్షేపంగానే కాక విస్తారంగా కూడా వర్ణించాడు..

"నారాయణం నమస్కృత్య" అను శ్లోకంతోనే కొందరీ గ్రంథం ఆరంభిస్తున్నారు. మరికొందరు ఆస్తీకపర్వంనుంచీ, ఉపరిచరవసు చరిత్రనుంచీ భారతారంభంగా గణిస్తున్నారు.

...ర్యాతిస్తే...న్ స్తుతిభి ర్జనైవ సుతవాఞ్ఛయా
...ర్యక్షి వాన్వినా వాజునైవ చ
తాపైః సహసంవృద్ధా మాతృభ్యాం పరిరక్షితాః
...శ్రేష్ఠేషు మహతా మాశ్రమేషు చ.
...రాష్ట్రాన్ ప్రతిస్వయం
...జ టి లా బ్రహ్మచారిణః.
పుత్రాశ్చ భ్రాతర శ్చేమే శిష్యా శ్చసుహృద శ్చ వః
పాండవా పత ...మునయో నర్షి తా స్తతః
తాం స్తైర్ని వేదితాన్ దృష్ట్వా పాండవాన్ కౌరవా స్తదా.
శిష్టా శ్చవర్ణాః పౌరాయే తేహర్షాచ్చుక్రుశు ర్భృశం
ఆహుః కేచి న్న తస్యై తే తస్యైత ఇ తి చాపరే.
యదా చిరమృతః పాండుః కథం తస్యేతి చాపరే
స్వాగతం సర్వథాదిష్ట్యా పాండోః పశ్యామ సంతతిం.
ఉచ్యతాం స్వాగతమితివాచోఽశ్రూయ న్త సర్వశః
త స్మి న్నుపరతే శ బ్దే ది శః స ర్వా నినాదయన్.
అన్తర్హితానాంభూతానాం నిస్స్వనస్తుములోభవత్
పుష్పవృష్టిః శుభాగంధాః శంఖదుందుభినిస్స్వనాః.
ఆ స న్ ప్ర వే శే పార్థానాం తదద్భుతమివాభవత్
తత్ప్రీత్యాచై వ సర్వేషాంపౌరాణాం హర్ష సంభవః.
శబ్ద ఆసీ న్మహాం స్త త్ర దివస్పృ క్కీ ర్తివర్ధనః
తేఽధీత్యనిఖిలాన్ వేదాన్ శాస్త్రాణి వివిధానిచ.
న్యవసన్ పాండవా స్తత్ర పూజితా అకుతోభయాః
యుధిష్ఠిరస్య శౌచేనప్రీతాః ప్రకృతయోఽభవన్.
ధృత్యా చ భీమసేనస్య విక్రమే ణార్జునస్య చ.
గురుశుశ్రూషయా క్షాన్త్యా యమయో ర్వినయేనచ
తుతోష లోకః సకల స్తేషాం శౌర్యగుణేన చ.

[ఆచా రా ప రి హా ర శ్చసంసర్గశ్చాప్యనిందితై॥
ఆచారే చ వ్యవస్థానం శౌ చ మి త్యభిధీయతేః
ఇష్టానిష్టార్థసంతత్తౌ చి త్త స్యా వి కృతి ర్ధృ తిః
సర్వాతిశయసామర్థ్యం వి క్ర మ ం పరిచక్షతే॥

వృత్తానువృత్తిః శుశ్రూషాక్షా న్తిరాగస్యవిక్రియా
జితేన్ద్రియత్వం వినయోఽథవా నుద్ధతశీలతా
శౌర్యమధ్యవసాయస్స్యాద్బలినోఽపి పరాభవే]

సమవాయేతతో రాజ్ఞాంకన్యాంభర్తృ స్వయంవరాం
ప్రాప్తవా నర్జునః కృష్ణాం కృత్వా కర్మసుదుష్కరం.
తతఃప్రభృతి లోకేఽస్మిన్ పూజ్యః సర్వధనుష్మతాం
ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యః సమరే ష్వపి చాభవత్.
ససర్వాన్ పార్థివాఞ్జిత్వాసర్వాంశ్చమహతోగణాన్
ఆజహా రార్జునో రాజ్ఞో రాజసూయం మహాక్రతుం.
అన్నవాన్ దక్షిణావాంశ్చ సర్వైఃసముదితోగుణైః
యుధిష్ఠిరేణ సంప్రాప్తో రాజసూయో మహాక్రతుః.
సు న యా ద్వా సు దే వ స్య భీమార్జునబలేన చ
ఘాతయిత్వా జరాసంధం చైద్యం చ బలగర్వితం.
దుర్యోధనం సమాగచ్ఛ న్నర్హణాని తత స్తతః
మణికాంచనరత్నాని గో హ స్త్య శ్వ ధ నా ని చ.
వి చి త్రా ణి చ వాసాంసి ప్రావారావరణాని చ
కంబళాజినరత్నాని రా జ్క వా స్త ర ణా ని చ.
సమృద్ధాంతాంతథాదృష్ట్వా పాన్డవానాంతదాశ్రియం
ఈర్ష్యాసముత్థః సుమహాం స్తస్య మన్యు రజాయత.
విమానప్రతిమాం తత్ర మయేన సుకృతాం సభాం
పాండవానా ముపహృతం స దృష్ట్వా పర్యతప్యత.
తత్రావహసితశ్చాసీత్ ప్రస్కందన్నివ సంభ్రమాత్
ప్ర త్య క్షం వాసుదేవస్య భీ మే నానభిజాతవత్.
స భోగాన్ వివిధాన్ భుఞ్జ న్రత్నాని వివిధాని చ
కథితో ధృతరాష్ట్రస్య వి వ ర్ణో హ రి ణః కృ శః.
అన్వజానాత్ తతోద్యూతం ధృతరాష్ట్రస్సుతప్రియః
త చ్ఛ్రుత్వా వాసుదేవస్య కోపః సమభవన్ మహాన్
నాతి ప్రీతమనాశ్చాసీత్ వివాదాం శ్చాన్వమోదత
ద్యూతాదీననయాన్ఘోరాన్వివిధాం శ్చాప్యుపైక్షత.
నిరస్య విదురం భీష్మ ద్రోణం శారద్వతం కృపం

విద్వాంసు లీ మహాభారతజ్ఞానం అనేక విధాలుగా ప్రకాశింపజేస్తున్నారు. కొంద రీగ్రంథం పఠించి వ్యాఖ్యానరూపంలో ఇతరులకు బోధించడంలో కుశలురుగాను మరికొందరు ధారణ చేయటంలో కుశలురు అవుతున్నారు.

సత్యవతీ నందను డగు వేదవ్యాసభగవానుడు తపోబ్రహ్మచర్యాదులతో సాధించిన శక్తితో సనాతనమైన వేదధర్మాన్ని విస్తరించి మహాభారతం రచించాడు.

బ్రహ్మచర్యాది వ్రతపరాయణుడు సర్వజ్ఞుడు పరాశరనందనుడు బ్రహ్మఋషి అయిన కృష్ణద్వైపాయనుడు ఇతిహాసాలలో శ్రేష్ఠమైన మహాభారతాన్ని వ్రాసి, దీన్ని శిష్యులచే అధ్యయనం చేయించి, ప్రజాసామాన్యంలో ప్రచారం చేయించడం ఎలా అని విచారిస్తుండగా సర్వజ్ఞుడు, లోకగురుడు ఐన పితామహుడు వ్యాసునివాంఛితం నెరవేర్చుటకూ, లోకహితం చేకూర్చడానికి వ్యాసాశ్రమానికి వచ్చాడు.

బ్రహ్మయొక్క ఆగమనం గుర్తించి వ్యాసమహర్షి పితామహునకు నమస్కరించి నమస్తుతులతో ఆతనికి సుఖాసన మిచ్చి ప్రాంజలియై యెదుట నిలిచాడు.

ఉత్తమమైన ఆ యాసనముపై హిరణ్యగర్భు డాసీను డయాడు. ఆసీనుడైన చతుర్ముఖునకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి వేదవ్యాసమహర్షి నిలబడ్డాడు.

బ్రహ్మయొక్క ఆజ్ఞను పొంది మందస్మితవదనారవిందుడైన వేదవ్యాసమహర్షి ఆ సమీపంలోనే ఆసనంమీద కూర్చున్నాడు.

అద్భుత తేజస్సుగల వేదవ్యాసమహర్షి బ్రహ్మతో ఇలా పలుకుతున్నాడు. సమస్తలోక పూజితమైన ఉత్తమకావ్యం వ్రాశాను.

ఓ పితామహా! యీ కావ్యమందు నేను వేదవేదాంగముల, సర్వశాస్త్రముల, ఉపనిషత్తుల సారం విస్తరించి వర్ణించాను.

ఇతిహాస పురాణాదులన్నీ మథించి వాని సారమంతా చేర్చాను. భూత, భవిష్యద్వర్తమాన కాలాల వివరాలు వివరించాను.

ఈ గ్రంథంలో ముసలితనం, భయం, రోగం పదార్థాల సత్యత్వం, మిథ్యత్వం విశేషంగా వర్ణించాను. చిన్నచిన్నధర్మాల, చిన్నచిన్న ఆశ్రమాల లక్షణాలు వివరించాను.

నాల్గువర్ణాలవారికీ వారివారి కర్తవ్యం పురాణమూలతత్వం ఇందు ప్రకటితమైనాయి. తపస్సు, బ్రహ్మచర్యం, అనుష్ఠానం వీటిఫలితం, భూమీ, చంద్రుడూ, సూర్యుడూ, గ్రహాలు, నక్షత్రాలు, తారలు, సత్య త్రేతా ద్వాపర,కలియుగాల పరిమాణాలు, ప్రమాణాలూ, ఋగ్యజుస్సామవేదాల ఆధ్యాత్మిక అభిప్రాయాలు, అధ్యాత్మశాస్త్ర విషయాలు ఈగ్రంధంలో వర్ణించబడ్డాయి.

న్యాయము, శిక్ష, చికిత్స, దానము,పాశుపతము ఈగ్రంథంలో విశదంగా నిరూపించబడ్డాయి. ఇంతేగాక దేవతలు మనుష్యులు జన్మించుటకు గల కారణాలు గూడా ఇందులో వివరించబడ్డాయి. లోకపావనములైన తీర్థాలు, దేశాలు, నదులు, పర్వతాలు, అరణ్యాలు, సముద్రాలు వీటన్నిటి యొక్క మహిమలు వివరించబడ్డాయి.

దివ్యమైన నగరనిర్మాణం, దుర్గనిర్మాణకౌశలం, యుద్ధనైపుణ్యం, భిన్న భిన్న భాషలు, జాతులు

విగ్రహే ఘటమానే తస్మిన్ దహన్ క్షత్రం పరస్పరం.
జయత్సు పాండుపుత్రేషు శ్రుత్వా సుమహదప్రియమ్
దుర్యోధనమతం జ్ఞాత్వా కర్ణస్య శకునే స్తథా.
ధృతరాష్ట్రశ్చిరంధ్యాత్వాసంజయం వాక్యమబ్రవీత్
శృణు సంజయ సర్వం మే న చాసూయితు మర్హసి.
శ్రుతవా నసి మేధావీ బుద్ధిమాన్ ప్రాజ్ఞసమ్మతః
న విగ్రహే మమ మతి ర్న చ ప్రీయే కులక్షయే.
న మే విశేషః పుత్రేషు స్వేషు పాండుసుతేషు వా
వృద్ధంమామభ్యసూయ న్తిపుత్రామన్యుపరాయణాః
అహంత్వచక్షుః కార్పణ్యాత్పుత్రప్రీత్యాసహామితత్
ముహ్యన్తం చానుముహ్యామి దుర్యోధనమచేతనం.
రాజసూయే శ్రియందృష్ట్వాపాండవస్య మహౌజసః
తచ్చావహసనం ప్రాప్య సభారోహణదర్శనే.
అమర్షణః స్వయం జేతు మశక్తఃపాండవాన్ రణే
నిరుత్సాహశ్చ సంప్రాప్తుం సశ్రియంక్షత్రియోపిసన్.
గాంధార రాజసహిత శ్ఛద్మద్యూత మమన్త్రయత్
తత్రయద్యద్యథాజ్ఞాతం మయా సంజయ తచ్ఛృణు.
శ్రుత్వా తు మమ వాక్యాని బుద్ధియుక్తాని తత్త్వతః
తతో జ్ఞాస్యసి మాం సౌతే ప్రజ్ఞాచక్షుషమిత్యుత.

యదా శ్రౌషం ధనురాయమ్య చిత్రం
విద్ధం లక్ష్యం పాతితం వై పృథివ్యాం
కృష్ణాం హృతాం ప్రేక్షతాం సర్వరాజ్ఞాం
తదా నాశంసే విజయాయ సంజయ.

యదా శ్రౌషం జాతుషాద్వేశ్మనస్తాన్
ముక్తాన్పార్థాన్పంచ కుంత్యాసమేతాన్
యుక్తం చైషాం విదురం స్వార్థసిద్ధా

యదా శ్రౌషం ద్రౌపదీం రంగమధ్యే
లక్ష్యం భిత్వా నిర్జితా మర్జునేన
శూరాన్పాంచాలాన్పాండవేయాంశ్చయుక్తాం

యదా శ్రౌషం మాగధానాం వరిష్ఠం
జరాసంధం క్షత్రమధ్యే జ్వలంతం
దోర్భ్యాం హతం భీమసేనేన గత్వా

యదా శ్రౌషం దిగ్విజయే పాండుపుత్రైః
వశీకృతాన్భూమిపాలాన్ప్రసహ్య
మహాక్రతుం రాజసూయం కృతం చ

యదా శ్రౌషం ద్రౌపదీ మశ్రుకంఠీం
సభాం నీతాం దుఃఖితామేకవస్త్రాం
రజస్వలాం నాథవతీ మనాథవత్

యదా శ్రౌషం వాససాంతత్రరాశిం
సమాక్షిపత్కితవో మందబుద్ధిః
దుశ్శాసనో గతవాన్నైవ చాంతం

ఆయా దేశవిభాగాలతో దేశీయవిదేశీయ వ్యవహారజ్ఞానంకోసం వివరింపబడ్డాయి. లోకానికి ఉపయోగపడే సమస్తపదార్థజ్ఞానం వివరింపబడింది. ఐహికంగా, ఆముష్మికంగా అవసరమైన సర్వవిషయాలూ యీ గ్రంథంలో అభివర్ణింప బడ్డాయి. కానీ ఈ గ్రంథానికి భూమండలంలో లేఖకుడు లేడనే విచారం నిరంతరం నన్ను వేధిస్తోంది.

ఓ వ్యాసా ! ఈలోకమందు గొప్పతపస్సు చేసినవారియందు, గొప్పకులమందు జన్మించినవారియందూ నువ్వే మహత్తరమైనవాడవని భావిస్తున్నాను. జగత్తులో జీవుడు, ఈశ్వరుడు అనువానియొక్క యథార్థతత్వము తెలిసినవాడవు నువ్వే.

ఓ శ్రీకృష్ణద్వైపాయన ! జన్మించినదాది సర్వకాల సర్వావస్థలయందు బ్రహ్మవిద్యయగు శారద సత్యమే పలుకుతుంది. అట్టివాణి నీ జిహ్వాగ్రంలో నివసిస్తోంది. నువ్వు దీన్ని కావ్యమని పలికావు గనక ఇది కావ్యంగానే పరిగణింపబడుతుంది. ప్రపంచ మండలి కవిశ్రేష్ఠులుకూడా ఈ కావ్యాన్ని మించిన రచనలు చేయలేరు. బ్రహ్మచర్యం, వానప్రస్థం, సన్యాసం తమ తమ విశేషత్వాలలో గృహస్థాశ్రమాన్ని అతిక్రమించి రా లేనట్లే మరే యితర రచనలూ దీన్నిమించి రాణించవు. మునిశ్రేష్ఠా ! నీకావ్యం వ్రాయడానికి గణనాథుని నియమించుకోవడం మంచిది.

ఉగ్రశ్రవమహర్షి చెప్పుచున్నాడు :

మహాత్ములారా ! బ్రహ్మ వ్యాసమహర్షితో ఇలా సంభాషించి తన నివాసమైన బ్రహ్మలోకం చేరాడు.

సత్యవతీనందనుడైన వ్యాసమహర్షి భగవంతుడైన గణనాథుని స్మరించాడు. భక్తుల కోర్కెలను తీర్చే గణేశ్వరుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు. వ్యాసుడు గణపతికి ఆదరంగా హృదయపూర్వకమైన స్వాగతమిచ్చి ఉచితాసనంమీద కూర్చుండపెట్టి ఇలా పలుకసాగాడు-

గణనాయకా ! నీవు నాచే నిర్మింపబడు ఈ మహాభారతగ్రంధానికి లేఖకుడువుగా ఉండాలి.

అది విని విఘ్నేశ్వరుడు మహర్షీ ! నేను వ్రాస్తూన్నప్పుడు ఒక క్షణకాలమైనా నా లేఖినికి విశ్రాంతి ఉండరాదు. అలా అయితే నేను ఈ గ్రంథం వ్రాస్తాను.

అనగా వ్యాసుడు నేనట్లే నీ గంటం ఆపకుండా చెప్తాను. నీవుమాత్రం అర్థంచేసికోకుండా ఒక అక్షరంకూడా వ్రాయరాదు అన్నాడు. గణపతి సంతోషించి ఓంకారం పలికి లేఖకుడయాడు.

అప్పుడు వ్యాసమహర్షి కుతూహల మనస్కుడై తన గ్రంథాదిని గూఢార్థాలతో గూడిన శ్లోకాలను చెప్ప నారంభించాడు. బాహ్యార్థ మొకరీతిగా అంతరార్థం యింకొకరీతిగా వచ్చేటట్లు శ్లోకాలు చెప్తున్నాడు. ఈ సందర్భంలో ప్రతిజ్ఞాపూర్వకంగా కృష్ణద్వైపాయనుడు ఈవిధంగా చెప్తున్నాడు.

ఈ గ్రంథంలో ఎనిమిదివేల ఎనిమిదివందల శ్లోకాలు మిక్కిలి కఠినంగా ఉంటాయి. వాటి అర్థం నే నెరుంగుదును. శుకదేవు డెరుంగును. సంజయుడు ఎరిగి ఉండవచ్చు. ఈ విషయంలో సందేహం ఉంది.

అవి మిక్కిలి గూఢమైనవీ గంభీరమైనవీ. కనుకనే ఈ రోజునగూడ వాని రహస్యం భేదించలేకపోతున్నాము. ఇందుకు కారణం వానికి అర్థం గూఢంగా నుండటమేగాక శబ్దంకూడా యోగవృత్తి

[illegible]

యదాశ్రౌషం స్నాతకానాం సహస్రై
రన్వాగతం ధర్మరాజం వనస్థం
భిక్షాం భుంజానం బ్రాహ్మణానాం మహాత్మనాం

యదాశ్రౌషం మర్జునం దేవదేవం
కిరాతరూపం త్ర్యంబకం తోష్యయుద్ధే
అవాప్తవంతం పాశుపతం మహాస్త్రం

యదాశ్రౌషం వనవాసే తు పార్థాన్
సమాగతాన్ మహర్షిభిః పురాణైః
ఉపాస్యమానాన్సగణై ర్జాతసఖ్యాన్

యదాశ్రౌషం త్రిదివస్థం ధనంజయం
శక్రాత్ సాక్షా ద్దివ్యమస్త్రం యథావత్
అధీయానం శంసితం సత్యసంధం

యదా శ్రౌషం కాలకేయా స్తత స్తే
పౌలోమానో వరదానాచ్చదృప్తాః
దేవై రజేయా నిర్జితా శ్చార్జునేన

యదాశ్రౌష మసురాణాం వధార్థే
కిరీటినం యాంత మమిత్ర కర్శనం
కృతార్థం చాప్యాగతం శక్రలోకాత్

యదాశ్రౌషం తీర్థయాత్రా ప్రవృత్తం
పాండోస్సుతం సహితం లోమశేన
తస్మాదశ్రౌషీ దర్జున స్వార్థలాభం

యదాశ్రౌషం వైశ్రవణేన సార్థం
సమాగతం భీమమన్యాంశ్చ పార్థాన్
తస్మిన్దేశే మానుషాణా మగమ్యే

యదాశ్రౌషం ఘోషయాత్రాగతానాం
బంధం గంధర్వై ర్మోక్షణం చార్జునేన
స్వేషాం సుతానాం కర్ణబుద్ధౌ రతానాం

యదాశ్రౌషం యక్షరూపేణ ధర్మం
సమాగతం ధర్మరాజేన సూత
ప్రశ్నాన్కాంశ్చిత్ విబ్రువాణం చ సమ్యక్

యదాశ్రౌషం న విదుర్మామకాస్తాన్
ప్రచ్ఛన్నరూపాన్ వసతః పాండవేయాన్
విరాటరాష్ట్రే సహ కృష్ణయా చ

యదాశ్రౌషం కీచకానాం వరిష్ఠం
నిషూదితం భ్రాతృశతేన సార్థం
ద్రౌపద్యర్థం భీమసేనేన సంఖ్యే

యదా శ్రౌషం మామకానాం వరిష్ఠాన్
ధనంజయే నైకరథేన భగ్నాన్
విరాటరాష్ట్రే వసతా మహాత్మనా

యదా శ్రౌషం సత్కృతాం మత్స్యరాజ్ఞా
సుతాం దత్తా ముత్తరా మర్జునాయ
తాంచార్జునః ప్రత్యగృహ్ణాత్ సుతార్థే

యదా శ్రౌషం నిర్జితస్యాధనస్య
ప్రవ్రాజితస్య స్వజనాత్ ప్రచ్యుతస్య
అక్షౌహిణీః సప్త యుధిష్ఠిరస్య

యదా శ్రౌషం మాధవం వాసుదేవం
సర్వాత్మనా పాండవార్థే నివిష్టం
యస్యేమాం గాం విక్రమనేకమాహుః

యదా శ్రౌషం నరనారాయణౌ తౌ
కృష్ణార్జునౌ వదతో నారదస్య
అహం ద్రష్టా బ్రహ్మలోకే చ సమ్యక్

గూఢవృత్తి మొదలైన రచనానైచిత్రితో గంభీరంగా ఉంటుంది.

సర్వజ్ఞుడైన గణనాథుడు కూడా ఆ శ్లోకాలను గూర్చి ఆలోచించుకొని వ్రాయటంలో కొంతసేపు ఆగవలసి వచ్చేది. ఈ సమయంలో వ్యాసమహర్షి అనేక శ్లోకాలు తన మనస్సులో ఆలోచించుకొనేవాడు.

సంసార సముద్రంలోని జీవుడు అజ్ఞానాంధకారంచే అంధుడై కొట్టుకుంటున్నాడు. ఈ మహాభారతం జ్ఞానమనెడి అంజనమునకు శలాకమై వాని కళ్ళు తెరుస్తుంది. ఆ శలాకం ధర్మార్థ, కామ మోక్ష రూపమైన పురుషార్థాలను విస్తారంగా వివరిస్తుంది. ఇది కేవలం అజ్ఞానాంధకారాన్ని పారద్రోలటమే గాక ప్రతిమానవునికీ సూర్యునితో సమానమైన జ్ఞానజ్యోతిని ప్రసాదిస్తుంది.

ఈ భారతం షోడశకళాపూర్ణుడైన చంద్రునితో సమానమైంది. చంద్రునివల్ల చంద్రకాంతి వ్యాప్తమవుతున్నట్లే ఈ భారత చంద్రునివలన జ్ఞానజ్యోతులు ప్రసరిస్తూంటాయి.

భారతచరిత్రయొక్క జాజ్వల్యమానమైన జ్ఞానజ్యోతి మోహాంధకారాన్ని బ్రద్దలుచేసి జనుల అంతఃకరణగర్భగృహాలలో ప్రవేశించి జ్ఞాన జ్యోతిని స్థాపించి ప్రకాశింపజేస్తుంది.

భారతవృక్షానికి బీజం సంగ్రహాధ్యాయము. పౌలోమ, ఆస్తీక, పర్వములే మూలము. సంభవ పర్వమే స్కంధము. సభా,అరణ్యపర్వము లీ వృక్షానికి కోటరాలు.

అరణీపర్వమే గ్రంథిస్థలము. విరాటోద్యోగ పర్వములే దీనికి సారము. భీష్మపర్వమే దీనికి శాఖలు. ద్రోణపర్వము పత్రములు.

కర్ణపర్వమే శ్వేతపుష్పములు. శల్యపర్వమే సుగంధము. స్త్రీ ఐషీకపర్వములు ఛాయ. శాంతి పర్వమే మహాఫలము.

అశ్వమేథపర్వము అమృతరసము. ఆశ్రమవాస పర్వమే నివాసాశ్రయము. మౌసలపర్వము శ్రుతి రూపమైన శాఖాగ్రభాగము. సదాచారము విద్య గల ద్విజులు దీనిని సేవిస్తున్నారు.

కవులందరికీ యీ కావ్యంరచన కాశ్రయభూతమవుతోంది. మేఘం సమస్త ప్రాణులకూ జీవనదాత అయినట్లే మహాభారతం సమస్తలోకాలకూ అక్షయమైన వృక్షం.

పవిత్ర స్వాదుపుష్పఫలాలే ధర్మ, మోక్షాలు. ఫల, పుష్పాలను దేవతలుకూడా వేరు చేయలేరు. అట్టిదానిని చెప్పుతున్నాను వినండి.

మహాశక్తివంతుడు ధర్మాత్ముడు జ్ఞాని అయిన కృష్ణద్వైపాయనుడు తల్లియగు సత్యవతియొక్క మహాజ్ఞానియైన భీష్మునియొక్క ఆదేశానుసారం విచిత్రవీర్యుని భార్యలైన అంబికాదులనుండి త్రేతాగ్నులవలె ప్రకాశించు ముగ్గురు కురుపుత్రులను ఉద్భవింపజేశాడు. వారే ధృతరాష్ట్ర, పాండురాజ, విదురులు.

ధృతరాష్ట్రాదులు జన్మించాక, వేదవ్యాసుడు తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. ధృతరాష్ట్రాది కురుకుమారులు ముగ్గురూ వృద్ధులై పరమగతినందిన తరువాత పరమర్షియగు వ్యాసభగవాను డీ మహాభారత గ్రంథం మనుష్యలోకంలో ప్రచారం చేశాడు. వేలకొలది బ్రాహ్మణులచే జనమేజయునిచే ప్రశ్నింపబడి వ్యాసభగవానుడు తన శిష్యుడగు వైశంపాయనుని సుబోధకమగునట్లు మహాభారతం వినిపించమని ఆజ్ఞాపించాడు.

యదా శ్రౌషం లోకహితాయ కృష్ణం
శమార్థినముపయాతం కురూణాం
శమం కుర్వాణమకృతార్థం చ యాతం

యదా శ్రౌషం కర్ణదుర్యోధనాభ్యాం
బుద్ధిం కృతాం నిగ్రహే కేశవస్య
తం చాత్మానం బహుధా దర్శయానం

యదా శ్రౌషం వాసుదేవే ప్రయాతే
రథస్యైకామగ్రతస్తిష్ఠమానాం
ఆర్తాం పృథాం సాంత్వితాం కేశవేన

యదా శ్రౌషం మంత్రిణం వాసుదేవం
తథా భీష్మం శాంతనవం చ తేషాం
భారద్వాజం చాశిషోఽనుబ్రువాణం

యదా శ్రౌషం కర్ణ ఉవాచ భీష్మం
నాహం యోత్స్యే యుధ్యమానే త్వయీతి
హిత్వా సేనామపచక్రామ చాపి

యదా శ్రౌషం వాసుదేవార్జునౌ తౌ
తథా ధనుర్గాండీవమప్రమేయం
త్రీణ్యుగ్రవీర్యాణి సమాగతాని

యదా శ్రౌషం కశ్మలేనాభిపన్నే
రథోపస్థే సీదమానేఽర్జునే వై
కృష్ణం లోకాన్ దర్శయానం శరీరే

యదా శ్రౌషం భీష్మమమిత్రకర్శనం
నిఘ్నంతమాజావయుతం రథానాం
నైషాం కశ్చిద్వధ్యతే ఖ్యాతరూపః

యదా శ్రౌషం చాపగేయేన సంఖ్యే
స్వయం మృత్యుం విహితం ధార్మికేణ
తచ్చాకార్షుః పాండవేయాః ప్రహృష్టాః

యదా శ్రౌషం భీష్మమత్యంతశూరం
హతం పార్థేనాహవేష్వప్రధృష్యం
శిఖండినం పురతః స్థాపయిత్వా

యదా శ్రౌషం శరతల్పే శయానం
వృద్ధం వీరం సాదితం చిత్రపుంఖైః
భీష్మం కృత్వా సోమకానల్పశేషాం

యదా శ్రౌషం శాంతనవే శయానే
పానీయార్థే చోదితేనార్జునేన
భూమిం భిత్త్వా తర్పితం తత్ర భీష్మం

యదా వాయుశ్చంద్రసూర్యౌ చ యుక్తౌ
కౌంతేయానామనులోమా జయాయ
నిత్యం చాస్మాంశ్శ్వాపదా భీషయంతి

యదా ద్రోణో వివిధానస్త్రమార్గాన్
నిదర్శయన్ సమరే చిత్రయోధీ
న పాండవాన్ శ్రేష్ఠతరాన్ నిహంతి

యదా శ్రౌషం చాస్మదీయాన్ మహారథాన్
వ్యవస్థితానర్జునస్యాంతకాయ
సంశప్తకాన్నిహతానర్జునేన

యదా శ్రౌషం వ్యూహమభేద్యమన్యైః
భారద్వాజేనాత్తశస్త్రేణ గుప్తం
భిత్త్వా సౌభద్రం వీరమేకం ప్రవిష్టం

యదాభిమన్యుం పరివార్య బాలం
సర్వే హత్వా హృష్టరూపా బభూవుః
మహారథాః పార్థమశక్నువంతః

యదా శ్రౌషమభిమన్యుం నిహత్య
హర్షాన్మూఢాన్ క్రోశతో ధార్తరాష్ట్రాన్
క్రోధాదుక్తం సైంధవే చార్జునేన

వైశంపాయనుడు జనమేజయుని యజ్ఞశాలయందు ఋత్విజులకు యజమానునకు సమీపమందే యుండుటవల్ల యజ్ఞకర్మయందలి విశ్రామకాలాలలో వారు ప్రశ్నిస్తూంటే మహాభారతం వారికి వినిపిస్తున్నాడు.

మహాభారతంలో వ్యాసమహర్షి కురువంశ ఖ్యాతి, గాంధారి ధర్మశీలత్వము, విదురుని ఉత్తమ ప్రజ్ఞ, కుంతీదేవి ధైర్యం లెస్సగా వర్ణించాడు. వసుదేవ నందనుడైన శ్రీకృష్ణుని మహాత్మ్యం, పాండవుల సత్యనిష్ఠ, దుర్యోధనాదుల దుర్మార్గం స్పష్టంగా వివరించాడు. పుణ్యాత్ముల ఉపాఖ్యానాలతో నూరువేల శ్లోకాలు రచించాడు. దీనికే మహాభారత మని పేరు.

ఉపాఖ్యానాల్ని విడిచి ఇరువదినాలుగువేల శ్లోకాలతో భారతసంహితను రచించా డని విద్వాంసులు చెపుతున్నారు. ఆ తరువాత ఆ మహర్షి పర్వ సహితమైన గ్రంథంలో వర్ణింపబడిన వృత్తాంతాల సంక్షిప్త పరిచయార్థం అనుక్రమణికాధ్యాయం నిర్మించాడు. దీనిలో నూటయాభై శ్లోకాలున్నాయి. వ్యాసుడు అందరికంటె ముందుగా ఈ మహాభారతాన్ని తన కుమారుడైన శుకునిచే చదివించాడు.

అటు తరువాత వ్యాసభగవానుడు అధికారులగు శిష్యులకుగూడ యీమహాభారతం ఉపదేశించాడు. అనంతరం వ్యాసర్షి అరవై లక్షల శ్లోకాలుగల మహాభారత సంహిత రచించాడు.

ఈ అరవై లక్షలలో ముప్ఫైలక్షలు దేవలోకానికి, పదినైదులక్షలు పితృలోకానికి పదునాలుగు లక్షలు గంధర్వలోకానికి ప్రసాదించాడు.

ఈ మనుష్యలోకమందు నూరువేలశ్లోకములు ప్రతిష్ఠింపబడ్డాయి. దేవలోకమున నారదుడు; అసిత దేవలుడు పితరులకు భారతం వినిపిస్తూంటారు.

గంధర్వ, యక్ష, రాక్షసులకు శ్రీశుకుడే మహాభారతకథను వినిపిస్తారు. సంపూర్ణమైన వేదవేత్త యగు వైశంపాయనుడు మనుష్యలోకంలో ఈ శత సాహస్రికమగు మహాభారత సంహితను వినిపించాడు. ఓ శౌనకాది మహర్షులార! ఆ మహాభారత సంహితనే నేను మీకు వినుపిస్తాను. వినుడు.

దుర్యోధనుడు క్రోధరూపమైన విశాల వృక్షం, కర్ణుడే స్కంధం, శకుని శాఖలు, దుశ్శాసనుడే సమృద్ధమైన పుష్పఫలాలు, అజ్ఞానియైన ధృతరాష్ట్రమహారాజే ఈ వృక్షమునకు మూలం.

యుధిష్ఠిరుడే ధర్మమయమైన విశాల వృక్షం, అర్జునుడు స్కంధము, భీమసేనుడు శాఖలు, నకుల సహదేవులు సుసమృద్ధమైన ఫలపుష్పములు, శ్రీకృష్ణపరమాత్మ, వేదము, బ్రాహ్మణులు మూలములు.

పాండుమహారాజు బుద్ధి, విక్రమం ఆధారంగా అనేక దేశాలను జయించి వేటయం దాసక్తికల వాడై మునులతో అరణ్యంలో నివసిస్తున్నాడు.

ఒకనాడొక ఋషిదంపతులు మృగరూపాలలో విహరిస్తూండగా పాండుమహారాజు వేటయందున్న వ్యసనంచేత మృగాన్ని వేధించాడు. వెంటనే ఆ ఋషి "నీవు స్త్రీని కూడినమాత్రాన మరణింతువు" అని శపించాడు. ఈ కష్టం కలిగినా పాండవులు జన్మించి విద్యాబుద్ధులు, శీలము మహర్షులవల్ల అరణ్యంలోనే గ్రహించారు.

భర్త శాపగ్రస్తుడైన కారణాన కుంతీ మాద్రులు భర్త ఆజ్ఞతో దుర్వాసునివలన ప్రాప్తించిన మంత్రానుష్ఠానమువల్ల యమ, వాయు, ఇంద్ర

యదా[illegible]షం సై[illegible]వార్థే ప్రతిష్ఠాం
[illegible]తాం తద్వధాయార్జునేన
[illegible]త్వాం తీర్ణాం శత్రుమధ్యే చ తేన

యదాశ్రౌషం శ్రాంతహయే ధనంజయే
ముక్త్వా హయాన్ పాయయిత్వోపవృత్తాన్
పునర్యుక్త్వా వాసుదేవం ప్రయాతం

యదాశ్రౌషం వాహనేష్వక్షమేషు
రథోపస్థే తిష్ఠతా పాండవేన
సర్వాన్ యోధాన్ వారితానర్జునేన

యదాశ్రౌషం నాగబలైః సుదుస్సహం
ద్రోణానీకం యుయుధానం ప్రమథ్య
యాతం వార్ష్ణేయం యత్ర తౌ కృష్ణ పార్థౌ

యదాశ్రౌషం కర్ణమాసాద్య ముక్తం
వధాద్భీమం కుత్సయిత్వా వచోభిః
ధనుష్కోట్యాఽఽతుద్య కర్ణేన వీరం

యదా ద్రోణః కృతవర్మా కృపశ్చ
కర్ణో ద్రౌణిర్మద్రరాజశ్చ శూరః
అమర్షయన్ సైంధవం వధ్యమానం

యదాశ్రౌషం దేవరాజేన దత్తాం
దివ్యాం శక్తిం వ్యంసితాం మాధవేన
ఘటోత్కచే రాక్షసే ఘోరరూపే

యదాశ్రౌషం కర్ణ ఘటోత్కచాభ్యాం
యుద్ధే ముక్తాం సూతపుత్రేణ శక్తిం
యయా వధ్యః సమరే సవ్యసాచీ

యదాశ్రౌషం ద్రోణమాచార్యమేకం
ధృష్టద్యుమ్నేనాభ్యతిక్రమ్య ధర్మం
రథోపస్థే ప్రాయగతం విశస్తం

యదాశ్రౌషం ద్రౌణినా ద్వైరథస్థం
మాద్రీసుతం నకులం లోకమధ్యే
సమం యుద్ధే మండలేభ్యశ్చరంతం

యదా ద్రోణే నిహతే ద్రోణపుత్రో
నారాయణం దివ్యమస్త్రం వికుర్వన్
నైషాంతం గతవాన్ పాండవానాం

యదాశ్రౌషం భీమసేనేన పీతం
రక్తం భ్రాతుర్యుధి దుశ్శాసనస్య
నివారితం నాన్యతమేన భీమం

యదాశ్రౌషం కర్ణమత్యంతశూరం
హతం పార్థేనాహవేష్వప్రధృష్యం
తస్మిన్ భ్రాతౄణాం విగ్రహే దేవగుహ్యే

యదాశ్రౌషం ద్రోణపుత్రం చ శూరం
దుశ్శాసనం కృతవర్మాణముగ్రం
యుధిష్ఠిరం ధర్మరాజం జయంతం

యదాశ్రౌషం విహతం మద్రరాజం
రణే శూరం ధర్మరాజేన సూత
సదా సంగ్రామే స్పర్ధతే యస్తు కృష్ణం

యదాశ్రౌషం కలహద్యూతమూలం
మాయాబలం సౌబలం పాండవేన
హతం సంగ్రామే సహదేవేన పాపం

యదాశ్రౌషం శ్రాంతమేకం శయానం
హ్రదం గత్వా స్తంభయిత్వా తదంభః
దుర్యోధనం విరథం భగ్నశక్తిం

యదాశ్రౌషం పాండవాంస్తిష్ఠమానాం
గత్వా హ్రదే వాసుదేవేన సార్థం
అమర్షణం ధర్షయతః సుతం మే

అశ్వినులవలన ధర్మ, భీమ, అర్జున, నకుల సహదేవు లను ప్రసవించారు.

భర్తయందు అనురాగంగల కుంతీదేవి ఆయన వల్ల ధర్మరహస్యాలు విని సంతానవాంఛగలదై మంత్రములను జపిస్తూ యమధర్మరాజునూ, వాయుదేవునీ, ఇంద్రునీ ఆవాహనచేసింది. కుంతి ఉపదేశం చేసినతరువాత మాద్రికూడా ఆ మంత్ర విద్య గ్రహించింది. ఆమె సంతానానికి అశ్వినీ కుమారులను ఆహ్వానించింది. పాండవులై దుగుతూ తమతల్లులచే రక్షింపబడుతూ మహారణ్యాలలో రోజులు గడుపుతున్నారు.

మహర్షులు పాండవులను తీసికొని ధృతరాష్ట్రుని వద్దకు వెళ్ళారు. అప్పటికే పాండవులు బాలురు. వారు చక్కని రూపాలతో ప్రకాశవంతులై వెలుగుతున్నారు. శిరస్సున జటలతో బ్రహ్మచారి వేషములు ధరించారు.

మహర్షులందరూ అక్కడికి వెళ్ళి ధృతరాష్ట్రు నకు ఆతని పుత్రులకూ వీరై దుగుతూ నీ పుత్రులు. వీరూ నీకొడుకులూసోదరులు. మాకు శిష్యులు. పాండు మహారాజు కుమారులు—అనిచెప్పి ఆ ఋషులు వారిని అప్పగించి అంతర్ధానమయారు.

ఋషులచే కొనిరాబడ్డ పాండవుల్ని చూసి సమస్త కౌరవులు, నగరవాసులు శిష్టులు ఆనందించారు.

వీరు పాండుపుత్రులు కారని, పాండుతనయులే వీరనీ పాండుమహారాజేనాడో మరణిస్తే వీరు పాండుతనయులెలా అవుతారనీ వాగ్వివాదాలు బయలుదేరాయి.

పాండవులకు స్వాగత వచనాలు పలుక నారం భించారు. మనమందరం అదృష్టవంతులం పాండవులను చూసేభాగ్యం కలిగిందని ప్రజలానందంతో 'పాండవులకు స్వాగతము, పాండవులకు జయం' అని నినాదాలు చెయ్యసాగారు.

చూసేవారి కా శబ్దం ప్రజలలో ఆగినసమ్మాట అనంతమైన ఆకసంలో వ్యాపించి దశదిశల ప్రతి ధ్వనులు బయలుదేరి దేవతలయందు సమ్మిళితమై అశరీరవాణి రూపంలో 'వీరు పాండవులే, వీరు పాండవులే' యని వినిపించ సాగింది.

పాండవులు నగరంలో ప్రవేశించిన సమయంలో పుష్పవర్షం కురిసింది. సుగంధము వ్యాపించింది. శంఖదుందుభి నాదాలు కూరుమ్రోగాయి.

పాండవులయం దున్న ప్రేమచే ఆనందపరవశు లైన నగరవాసు లందరూ పాండవుల్ని అభినందిస్తూ స్వర్గందాకా వ్యాపించునంత శబ్దం చేశారు. దాని వలన ధర్మరాజాదులకీర్తి నాకలోకం వరకు వ్యాప్తి చెందిందా ! అన్నట్లనిపించింది.

పాండవులు సాంగము లగు చతుర్వేదాలనూ సమస్త శాస్త్రాలనూ అధ్యయనం చేసి హస్తినా పురంలోనే నివసిస్తున్నారు. వారిని అందరూ పరమ ప్రీతితో చూడసాగారు. వారి కేవిధమైనభయమూ లేదు.

రాష్ట్రమందలి ప్రజలందరూ ధర్మరాజుయొక్క శౌచాచారపరాయణత్వం, భీమసేనుని ధృతి, అర్జు నుని విక్రమం, నకుల సహదేవుల గురు శుశ్రూష ఓర్పు, వినయమూ చూసి ఆనందిస్తున్నారు. పాం డవుల శౌర్యగుణముచే మిక్కిలి యానందం పొందు తున్నారు.

**శౌచము**

శాస్త్రీయమైన సదాచారం విడువకుండుట, సదాచార సంపత్తిగల్గి [illegible] గముసు,

యదాశ్రౌషం వివిధాంశ్చిత్రమార్గాన్
గదాయుద్ధే మండలశశ్చరంతం
మిథ్యాహతం వాసుదేవస్య బుద్ధ్యా.
యదాశ్రౌషం ద్రోణపుత్రాదిభిస్తైః
హతాన్పాంచాలాన్ ద్రౌపదేయాంశ్చసుప్తాం
కృతం బీభత్స మయశస్యం చ కర్మ.
యదాశ్రౌషం భీమసేనానుయాతే
నాశ్వత్థామ్నా పరమాస్త్రం ప్రయుక్తం
క్రుద్ధేనైషీకమవధీద్యేన గర్భం.
యదాశ్రౌషం బ్రహ్మశిరోఽర్జునేన
స్వస్తీత్యుక్త్వాఽస్త్ర మస్త్రేణ శాంతం
అశ్వత్థామా మణిరత్నం చ దత్తం.
యదాశ్రౌషం ద్రోణపుత్రేణ గర్భే
వైరాట్యా వై పాత్యమానే మహాస్త్రైః
ద్వైపాయనః కేశవో ద్రోణపుత్రం
పరస్పరేణాభిశాపైః శశాప.
శోచ్యా గాంధారీ పుత్రపౌత్రైర్విహీనా
తథా బంధుభిః పితృభిర్భ్రాతృభిశ్చ
కృతంకార్యం దుష్కరం పాండవేయైః
ప్రాప్తం రాజ్య మసపత్న్యం పునస్తైః.
కష్టం యుద్ధే దశ శేషాః శ్రుతామే
త్రయోఽస్మాకం పాండవానాం చ సప్త
ద్వ్యూనా వింశతి రాహతాక్షౌహిణీనాం
తస్మిన్ సంగ్రామే భైరవే క్షత్రియాణాం.
తమ స్త్వతీవ విస్తీర్ణం మోహ ఆవిశతీవ మాం
సంజ్ఞాం నోపలభే సూత మనో విహ్వలతీవ మే.
ఇత్యుక్త్వా ధృతరాష్ట్రోఽథ విలప్యబహు దుఃఖితః
మూర్ఛితఃపునరాశ్వ స్తఃసంజయం వాక్యమబ్రవీత్.
సంజయైవం గతే ప్రాణాం స్త్యక్తుమిచ్ఛామి మాచిరం
స్తోకం హ్యపి న పశ్యామి ఫలంజీవితధారణే.

తం తథా వాదినం దీనం విలపంతం మహీపతిం
నిశ్వసంతంయథానాగంముహ్యమానం పునః పునః.
గా వల్గణిరిదం ధీమాన్ మహార్థం వాక్యమ బ్రవీత్
శ్రుతవానసివై రాజన్ మహోత్సాహాన్మహాబలాన్.
ద్వైపాయనస్య వదతో నారదస్య చ ధీమతః
మహత్సు రాజవంశేషు గుణైః సముదితేషుచ.
జాతా న్దివ్యాస్త్ర విదుషః శక్ర ప్రతిమ తేజసః
ధర్మేణ పృథివీం జిత్వా యజ్ఞైరిష్ట్వాప్త దక్షిణైః.
అస్మి న్లోకే యశః ప్రాప్య తతఃకాల వశంగతాన్
శైబ్యం మహారథం వీరంసృంజయంజయతాంవరం.
సుహోత్రం రంతిదేవం చ కాక్షీ వంతమథౌసిజం
బాహ్లీకం దమనం చైద్యం శర్యాతి మజితం నలం.
విశ్వామిత్ర మమిత్రఘ్న మంబరీషం మహాబలం
మరుత్తం మనుమిక్ష్వాకుం గయం భరత మేవ చ.
రామం దాశరథిం చైవ శశబిందుం భగీరథం
కృతవీర్యం మహాభాగం తథైవ జనమేజయం.
యయాతిం శుభకర్మాణం దేవై ర్యోయాజితఃస్వయం
చైత్యయూపాంకితా భూమిర్యస్యేయం సవనాకరా.
ఇతి రాజ్ఞాం చతుర్వింశ న్నారదేన సురర్షిణా
పుత్రశోకాభితప్తాయ పురా శైవ్యాయ కీర్తితం.
తేభ్యశ్చాన్యే గతాఃపూర్వం రాజానోబలవత్తరాః
మహారథా మహాత్మానః సర్వైః సముదితా గుణైః.
పూరుః కురుర్యదుః శూరో విష్వగశ్వోమహాద్యుతిః
అణుహో యువనాశ్వశ్చ కకుత్స్థో విక్రమీ రఘుః
విజయో వీతిహోత్రోఽఙ్గోభవః శ్వేతో బృహద్గురుః
ఉశీనరః శతరథః కంకో దులి దుహో ద్రుమః.
దంభోద్భవం పరో వేనః సగర స్సంకృతి ర్నిమిః
అజేయః పరశుః పుండ్రః శంభుర్దేవావృధోఽనఘః
దేవాహ్వయః సుప్రతిమః సుప్రతీకో బృహద్రథః
మహోత్సాహో వినీతాత్మాసుక్రతు ర్నైషధోనలః.

సదాచారమందు ధృఢత్వము మొదలగువానికి శౌచమని పేరు. అట్టి శౌచాచారము ధర్మరాజు ప్రధానంగా ప్రదర్శిస్తున్నాడు.

ధృతి

తనయిచ్ఛ ననుసరించి అనుకూలమైన వస్తు సంపత్తి చేకూరుట లేక ప్రతికూల వస్తుసంపత్తి కలుగుట; ఈ రెండింటియందూ మనోవికారం పొంద కుండుట ధృతి అనబడుతుంది. ఈ ధృతి భీమసేనుడి ప్రధాన లక్షణం.

విక్రమము

సమస్త యోధులను అతిక్రమింపగల శక్తి కలిగి ఉండుటయే పరాక్రమము. అట్టి విక్రమము కలవాడు అర్జునుడు.

శుశ్రూష

సదాచార పరాయణులగు గురువులను సేవించుట శుశ్రూష యనబడును.

క్షమ

ఇతరులు తప్పుచేసినా వారిపై మనస్సులో అయినా కోపం లేకపోవటం క్షమ.

వినయము

ఇంద్రియజయము కలిగియుండుట లేక ఔద్ధత్యము లేకుండుట వినయ మనబడుతుంది. ఈ పై మూడూ నకుల సహదేవులందున్నవి.

శౌర్యము

బలవంతులగు శత్రువులను జయించుట శౌర్యము. ఈ శౌర్యము పాండవులైదుగురిలోనూ ఉంది.

అనంతరం పాంచాలరాజతనయయైన ద్రౌపదీస్వయంవరం అనన్యసామాన్యమైన మత్స్య యంత్రాన్ని ఛేదించి అర్జునుడు ద్రౌపదిని కొని వచ్చాడు.

అదిమొదలు పాండవు లీలోకంలో సమస్త ధనుర్వేదవేత్తలలో అగ్రగణ్యులుగా పరిగ ణింపబడుతున్నారు. సమరరంగంలో ప్రచండ ప్రతాపుడగు అర్జునుని ఎదిరించగలుగుట కెవరికీ శక్తిలేదు.

అర్జునాదులు సమస్త భూమండలాధీశులనూ ఒక్కొక్కరుగనూ, అనేకులుగా వచ్చినవారినీ జయించి ధర్మరాజుకు రాజసూయావకాశం కలి గించారు.

శ్రీకృష్ణపరమాత్మయొక్క నీతీ భీమసేనుని యొక్క బాహుబలమూ అర్జునుని ధనుర్విద్యా పాటవమూ ఆధారంగా మహాగర్వితులైన జరా సంధ శిశుపాలాది మహావీరుల్ని జయించి ధర్మరాజు రాజసూయయజ్ఞం చేశాడు. ఆ యజ్ఞం సర్వవిధాల ప్రశంసనీయమైంది.

ఆచార్యుడు, బ్రహ్మ, ఋత్విగ్గణము, సదస్యులు యజమానుడు, పత్ని, ధనసంపత్తి శ్రద్ధా, ఉత్సా హము, విధివిధానాన్ని సక్రమంగా పరిపాలించుట, సద్బుద్ధి మొదలైనవన్నీ యజ్ఞానికి చెప్పబడే ఉత్తమ సామగ్రిలలో ప్రధానమైనవి.

అప్పుడు అనేక దేశాలనుంచి మణులూ, బంగా రం, రత్నాలూ, గోవులూ, ఏనుగులూ, అశ్వాలూ, మొదలైన ధనసంపత్తీ విచిత్రవస్త్రాలూ, కంబళ్లూ, పరదాలూ, మృగచర్మాలూ, రంకమనే పేరుగల మృగసంబంధమగు రోమాలతో తయారయే మృదు వైన తివాసులూ, అమూల్యమైన ఉపహారాలూ కానుకలుగా వచ్చాయి. అనంతములైన వస్తుసము దాయమంతా కోశాగారం దగ్గరఉన్న దుర్యోధను డికి అందుతోంది.

సత్యవ్రతః శాంతభయః సుమిత్రః సుబలః ప్రభుః
జానుజంఘోऽనరణ్యోऽర్కః ప్రియభృత్యశ్శుచివ్రతః
బలబంధుర్నిరామర్దః కేతుశృంగో బృహద్బలః
ధృష్టకేతుర్బృహత్కేతుర్దీప్తకేతుర్నిరామయః.
అవిక్షిత్ప్రబలో ధూర్తః కృతబంధుర్దృఢేషుధిః
మహాపురాణసంభావ్యః ప్రత్యంగః పరహా శ్రుతిః.
ఏతే చాన్యే చ రాజానః శతశోऽథ సహస్రశః
శ్రూయంతే శతశశ్చాన్యే సంఖ్యాతాశ్చైవ పద్మశః.
హిత్వా సువిపులాన్ భోగాన్ బుద్ధిమంతో మహాబలాః
రాజానో నిధనం ప్రాప్తాస్తవ పుత్రా ఇవ ప్రభో.
యేషాం దివ్యాని కర్మాణి విక్రమస్త్యాగ ఏవచ
మహాత్మ్యమపి చాస్తిక్యం సత్యం శౌచం దయార్జవం.
విద్వద్భిః కథ్యతే లోకే పురాణే కవిసత్తమైః
సర్వర్ద్ధిగుణ సంపన్నాస్తే చాపి నిధనం గతాః.
తవపుత్రా దురాత్మానః ప్రతప్తాశ్చైవ మన్యునా
లుబ్ధా దుర్వృత్తభూయిష్ఠా న తాం శోచితుమర్హసి.
శ్రుతవానసి మేధావీ బుద్ధిమాన్ ప్రాజ్ఞ సమ్మతః
యేషాం శాస్త్రానుగా బుద్ధిర్న తేముహ్యంతి భారత.
నిగ్రహానుగ్రహౌ చాపి విదితౌ తే నరాధిప
నాత్యంత మేవానువృత్తిః కార్యా తే పుత్రరక్షణే.
భవితవ్యం తథా తచ్చ నానుశోచితు మర్హసి
దైవం ప్రజ్ఞా విశేషేణ కో నివర్తితు మర్హతి.
విధాతృ విహితం మార్గం న కశ్చిదతివర్తతే
కాలమూలమిదం సర్వం భావాభావే సుఖాసుఖే.
కాలః సృజతి భూతాని కాలః సంహరతే ప్రజాః
సంహరంతం ప్రజాః కాలం కాలః శమయతే పునః.
కాలోహి కురుతేభావాన్ సర్వలోకే శుభాశుభాన్
కాలః సంక్షిపతే సర్వాః ప్రజావిసృజతే పునః.
కాలః సుప్తేషు జాగర్తి కాలోహిదురతిక్రమః
కాలః సర్వేషు భూతేషు చరత్యవిధృత స్సమః.

అతీతానాగతా భావా యే చ వర్తంతి సాంప్రతం
తాన్కాలనిర్మితాన్బుద్ధ్వా న సంజ్ఞాం హాతుమర్హసి.
ఇత్యేవం పుత్రశోకార్తం ధృతరాష్ట్రం జనేశ్వరం
ఆశ్వాస్య స్వస్థమకరోత్ సూతో గావల్గణిస్తదా.
అత్రోపనిషదం పుణ్యాం కృష్ణద్వైపాయనోऽబ్రవీత్
విద్వద్భిః కథ్యతే లోకే పురాణే కవిసత్తమైః.
భారతాధ్యయనం పుణ్యమపి పాదమధీయతః
శ్రద్దధానస్య పూయంతే సర్వపాపాన్యశేషతః.
దేవా దేవర్షయో హ్యత్ర తథా బ్రహ్మర్షయోऽమలాః
కీర్త్యంతే శుభకర్మాణస్తథా యక్షా మహోరగాః.
భగవాన్వాసుదేవశ్చ కీర్త్యతేऽత్ర సనాతనః
సహి సత్యమృతం చైవ పవిత్రం పుణ్యమేవ చ.
శాశ్వతం బ్రహ్మపరమం ధ్రువం జ్యోతిః సనాతనం
యస్య దివ్యాని కర్మాణి కథయంతి మనీషిణః.
అసచ్చ సదసచ్చైవ యస్మాద్విశ్వం ప్రవర్తతే
సంతతిశ్చ ప్రవృత్తిశ్చ జన్మమృత్యూ పునర్భవాః.
అధ్యాత్మం శ్రూయతే యచ్చపంచభూతగుణాత్మకం
అవ్యక్తాదిపరం యచ్చ స ఏవ పరిగీయతే.
యత్తద్యతివరా ముక్తా ధ్యానయోగబలాన్వితాః
ప్రతిబింబ మివాదర్శే పశ్యంత్యాత్మన్యవస్థితం.
శ్రద్దధానః సదాయుక్తః సదా ధర్మపరాయణః
ఆసేవన్నిమమధ్యాయం నరః పాపాత్ ప్రముచ్యతే.
అనుక్రమణికాధ్యాయం భారతస్యేమ మాదితః
ఆస్తికః సతతం శృణ్వన్ న కృచ్ఛ్రేష్వవసీదతి.
ఉభే సంధ్యే జపన్ కించిత్ సద్యో ముచ్యేతకిల్బిషాత్
అనుక్రమణ్యా యావత్స్యాదహ్నా రాత్ర్యా చ సంచితం
భారతస్య వపుర్హ్యేతత్ సత్యం చామృత మేవచ
నవనీతం యథా దధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా.
ఆరణ్యకం చ వేదేభ్య ఓషధిభ్యోऽమృతం యథా
హ్రదానాముదధి శ్రేష్ఠో గౌర్వరిష్ఠా చతుష్పదాం.

ఆ యజ్ఞవేళ పాండవులకువచ్చే అమూల్యాలైన కానుకలూ యశస్సూ దుర్యోధనునికి ఈర్ష్యా, క్రోధ, దుఃఖకారకాలయాయి.

మయబ్రహ్మ పాండవులయందుండే సద్గుణాలను చూసి ఇంద్రసభను మించిన గొప్ప సభాభవనం నిర్మించి ఇచ్చాడు. అది విమానంలా ఉంటుంది.

ఆ సభాభవనంలో భూప్రదేశం జలప్రదేశంలాగ జలప్రదేశం భూస్థలిలా కన్పడడంవల్ల దుర్యోధనుడు స్థలమందు జలమందువలె, జలమందు స్థలమందువలె చరించుటలో పొందుతూన్న ప్రమాదాన్ని చూసి శ్రీకృష్ణ భీమసేనుడు నవ్వసాగారు.

దుర్యోధనుడు రాజభోగాలనూ, దివ్యరత్ననిచయాన్నీ అనుభవిస్తున్నా నానాటికీ బలహీనుడవుతున్నాడు. ఆరోజుకారోజు తెల్లబారిపోవడం చూసి అనుచరులు ధృతరాష్ట్రమహారాజుకి తెలియచేశారు.

ప్రేమతో పాండవులతో జూదమాడతానంటే అంగీకరించాడు. శ్రీకృష్ణుడి కీ విషయం తెలియగా ధృతరాష్ట్రుని చర్యను అభినందించలేకపోయాడు.

దుర్యోధనునకు పాండవులపై మాత్సర్యము కలుగుటచే ఆనందమే కలుగుటలేదు. గాన ధృతరాష్ట్రుడు మౌనము వహించి వారివారి పరస్పర వివాదాలను ఆమోదించి కౌరవులయొక్క అన్యాయాలనూ, ద్యూతాన్నీ, భిన్న భిన్న ప్రవృత్తులనూ చూచి ఉపేక్షవహించాడు.

ధృతరాష్ట్రుని ఉపేక్షకు కారణం ధర్మహానికికారణభూతులైన క్షత్రియుల సంహారమే.

పాండవుల విజయవార్త విని ధృతరాష్ట్రుడు దుర్యోధన, కర్ణ శకునుల దురాగ్రహ పూరితమైన ఈ నిశ్చయాలకు విచారించి సంజయునితో ఇలా అంటున్నాడు. సంజయా! నా మాట విను. ఈ యుద్ధంలో కలిగిన నాశనానికి నన్ను దోషిగా భావించకు. నువ్వు విద్వాంసుడవు, బుద్ధిమంతుడవు, పండితులకుగూడా ఆదరణీయుడవు. ఈయుద్ధంలో నా సమ్మతి యెంతమాత్రం లేదు. ఇది మా కులనాశనహేతుభూతమైనది. ఈ యుద్ధమును నేను వాంఛింపలేదు.

నాకు పుత్రులయిన దుర్యోధనాదులూ, పాండుపుత్రులైన ధర్మరాజాదులు సములే. అయినా ఏం చేయగలను. నా పుత్రులు క్రోధావేశులై నా మీదగూడా దోషారోపణ జేస్తున్నారు. నామాటను చెల్లనీయటంలేదు.

నేను అంధుణ్ణవటంచేత, దీనుణ్ణి అవటం చేతనూ పుత్రులయందు ఆసక్తిని చూపవలసి వచ్చింది. అందుచేత ఆ అన్యాయకృత్యాలన్నిటినీ సహిస్తున్నాను. మూర్ఖుడైన దుర్యోధనుడు అజ్ఞానవశం చేత దుఃఖితుడవుతూంటే వాడితో నేనూ దుఃఖించవలసివస్తోంది.

రాజసూయమందు మహాపరాక్రమశాలురైన పాండుపుత్రుల యొక్క అఖండ సంపదల్ని చూసి మయసభాభవనంలో జల స్థల భేదం గుర్తించలేక భీమునిచే అపహసింపబడ్డ దుర్యోధనుడు అసూయాపరుడయ్యెను. కాని పాండవుల్ని జయించే శక్తి లేదు. అందుచేత క్షత్రియుడై గూడా యుద్ధమందు ఉత్సాహం చూపలేకున్నాడు. పాండవుల ఉత్తమ సంపత్తిని హరించే ఉద్దేశ్యంతో గాంధార రాజగు శకుని సహాయంతో మాయా ద్యూతానికి ఆహ్వానించడానికి నిశ్చయించారు. సంజయా! దాని

సత్యవ్రతశ్శాంతభః సుమిత్ర స్సుబలః ప్రభుః
జానుజంఘోఽనరణ్యోర్కః ప్రియభృత్యశ్శుచివ్రతః
బలబంధుర్నిరామర్దః కేతుశృంగో బృహద్బలః
ధృష్టకేతు ర్బృహత్కేతు ర్దీప్తకేతుర్నిరామయః.
అవిక్షిచ్చపలో ధూర్తః కృతబంధు ర్దృఢేషుధిః
మహాపురాణసంభావ్యః ప్రత్యంగః పరహా శ్రుతిః.
ఏతేచాన్యే చ రాజానః శతశోఽథ సహస్రశః
శ్రూయంతే శతశశ్చాన్యే సంఖ్యాతాశ్చైవపద్మశః.
హిత్వా సువిపులాన్ భోగాన్ బుద్ధిమంతో మహాబలాః
రాజానో నిధనం ప్రాప్తాస్తవ పుత్రా ఇవ ప్రభో.
యేషాం దివ్యాని కర్మాణి విక్రమస్త్యాగ ఏవచ
మహాత్మ్యమపిచాస్తిక్యంసత్యం శౌచందయార్జవం.
విద్వద్భిః కథ్యతే లోకే పురాణే కవిసత్తమైః
సర్వర్ధిగుణ సంపన్నాస్తే చాపి నిధనం గతాః.
తవపుత్రా దురాత్మానః ప్రతప్తాశ్చైవ మన్యునా
లుబ్ధా దుర్వృత్తభూయిష్ఠా న తాం శోచితుమర్హసి.
శ్రుతవానసి మేధావీ బుద్ధిమాన్ ప్రాజ్ఞ సమ్మతః
యేషాం శాస్త్రానుగా బుద్ధిర్న తేముహ్యంతి భారత.
నిగ్రహానుగ్రహౌ చాపి విదితౌ తే నరాధిప
నాత్యంత మేవానువృత్తిః కార్యా తే పుత్రరక్షణే.
భవితవ్యం తథా తచ్చ నానుశోచితు మర్హసి
దైవం ప్రజ్ఞా విశేషేణ కో నివర్తితు మర్హతి.
విధాతృ విహితం మార్గం న కశ్చిదతివర్తతే
కాలమూలమిదం సర్వం భావాభావే సుఖాసుఖే.
కాలః సృజతి భూతాని కాలః సంహరతే ప్రజాః
సంహరంతం ప్రజాః కాలం కాలః శమయతే పునః.
కాలోహి కురుతేభావాన్ సర్వలోకే శుభాశుభాన్
కాలస్సంక్షిపతే సర్వాః ప్రజావిసృజతే పునః.
కాలః సుప్తేషు జాగర్తి కాలోహిదురతిక్రమః
కాలస్సర్వేషు భూతేషు చరత్యవిధృత స్సమః.
అతీతానాగతాభావా యే చ వర్తంతి సాంప్రతం
తాన్కాలనిర్మితాన్బుద్ధ్వా న సంజ్ఞాం హాతుమర్హసి.
ఇత్యేవం పుత్రశోకార్తం ధృతరాష్ట్రం జనేశ్వరం
ఆశ్వాస్య స్వస్థమకరోత్ సూతో గావల్గణిస్తదా.
అత్రోపనిషదం పుణ్యాం కృష్ణద్వైపాయనోఽబ్రవీత్
విద్వద్భిః కథ్యతే లోకే పురాణే కవిసత్తమైః.
భారతాధ్యయనం పుణ్యమపి పాదమధీయతః
శ్రద్దధానస్య పూయంతే సర్వపాపాన్యశేషతః.
దేవాదేవర్షయోహ్యత్ర తథా బ్రహ్మర్షయోఽమలాః
కీర్త్యంతే శుభకర్మాణస్తథా యక్షా మహోరగాః.
భగవాన్వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః
సహి సత్యమృతం చైవ పవిత్రం పుణ్యమేవ చ.
శాశ్వతం బ్రహ్మపరమం ధ్రువం జ్యోతిః సనాతనం
యస్య దివ్యాని కర్మాణి కథయంతి మనీషిణః.
అసచ్చ సదసచ్చైవ యస్మాద్విశ్వం ప్రవర్తతే
సంతతిశ్చ ప్రవృత్తిశ్చ జన్మమృత్యు పునర్భవాః.
అధ్యాత్మం శ్రూయతే యచ్చ పంచభూతగుణాత్మకం
అవ్యక్తాదిపరం యచ్చ స ఏవ పరిగీయతే.
యత్త ద్యతివరా ముక్తా ధ్యానయోగబలాన్వితాః
ప్రతిబింబ మివాదర్శే పశ్యంత్యాత్మన్యవస్థితం.
శ్రద్దధానః సదాయుక్తః సదా ధర్మపరాయణః
ఆసేవన్నిమమధ్యాయం నరః పాపాత్ ప్రముచ్యతే.
అనుక్రమణికాధ్యాయం భారతస్యేమ మాదితః
ఆస్తిక స్సతతం శృణ్వన్ న కృచ్ఛ్రేష్వవసీదతి.
ఉభేసంధ్యే జపన్ కించిత్ సద్యో ముచ్యేతకిల్బిషాత్
అనుక్రమణ్యా యావత్ స్యాదహ్నా రాత్ర్యా చ సంచితం
భారతస్య వపుర్హ్యేతత్ సత్యం చామృత మేవచ
నవనీతం యథాదధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా
ఆరణ్యకం చ వేదేభ్య ఓషధిభ్యోఽమృతం యథా
హ్రదానాముదధి శ్శ్రేష్ఠో గౌర్వరిష్ఠా చతుష్పదాం

ఆ యజ్ఞవేళ పాండవులకువచ్చే అమూల్యాలైన కానుకలూ యశస్సూ దుర్యోధనునికి ఈర్ష్యా, క్రోధ, దుఃఖకారకాలయాయి.

మయబ్రహ్మ పాండవులయందుండే సద్గుణాలను చూసి ఇంద్రసభను మించిన గొప్ప సభాభవనం నిర్మించి ఇచ్చాడు. అది విమానంలా ఉంటుంది.

ఆ సభాభవనంలో భూప్రదేశం జలప్రదేశంలాగ జలప్రదేశం భూస్థలిలా కన్పడడంవల్ల దుర్యోధనుడు స్థలమందు జలమందువలె, జలమందు స్థలమందువలె చరించుటలో పొందుతూన్న ప్రమాదాన్ని చూసి శ్రీకృష్ణ భీమసేనుడు నవ్వసాగారు.

దుర్యోధనుడు రాజభోగాలనూ, దివ్యరత్నవిచయాన్నీ అనుభవిస్తున్నా నానాటికీ బలహీనుడవుతున్నాడు. ఆరోజుకారోజు తెల్లబారిపోవడం చూసి అనుచరులు ధృతరాష్ట్రమహారాజుకి తెలియచేశారు.

ప్రేమతో పాండవులతో జూదమాడతానంటే అంగీకరించాడు. శ్రీకృష్ణుడికీ విషయం తెలియగా ధృతరాష్ట్రుని చర్యను అభినందించలేకపోయాడు.

దుర్యోధనునకు పాండవులపై మాత్సర్యము కలుగుటచే ఆనందమే కలుగుటలేదు. గాన ధృతరాష్ట్రుడు మౌనము వహించి వారివారి పరస్పర వివాదాలను ఆమోదించి కౌరవులయొక్క అన్యాయాలనూ, ద్యూతాన్నీ, భిన్న భిన్న ప్రవృత్తులనూ చూచి ఉపేక్షవహించాడు.

ధృతరాష్ట్రుని ఉపేక్షకు కారణం ధర్మహానికికారణభూతులైన క్షత్రియుల సంహారమే.

పాండవుల విజయవార్త విని ధృతరాష్ట్రుడు దుర్యోధన. కర్ణశకునుల దురాగ్రహ పూరితమైన ఈ నిశ్చయాలకు విచారించి సంజయునితో ఇలా అంటున్నాడు. సంజయా! నా మాట విను. ఈ యుద్ధంలో కలిగిన నాశనానికి నన్ను దోషిగా భావించకు. నువ్వు విద్వాంసుడవు, బుద్ధిమంతుడవు, పండితులకుగూడా ఆదరనీయుడవు. ఈయుద్ధంలో నా సమ్మతి యెంతమాత్రం లేదు. ఇది మా కులనాశనహేతుభూతమైనది. ఈ యుద్ధమును నేను వాంఛింపలేదు.

నాకు పుత్రులయిన దుర్యోధనాదులూ, పాండుపుత్రులైన ధర్మరాజాదులు సములే. అయినా ఏం చేయగలను. నా పుత్రులు క్రోధావేశులై నా మీదగూడా దోషారోపణ జేస్తున్నారు. నామాటను చెల్లనీయటంలేదు.

నేను అంధుణ్ణవటంచేత, దీనుణ్ణి అవటం చేతనూ పుత్రులయందు ఆసక్తిని చూపవలసివచ్చింది. అందుచేత ఆ అన్యాయకృత్యాలన్నిటినీ సహిస్తున్నాను. మూర్ఖుడైన దుర్యోధనుడు అజ్ఞానవశం చేత దుఃఖితుడవుతూంటే వాడితో నేనూ దుఃఖించవలసివస్తోంది.

రాజసూయమందు మహాపరాక్రమశాలురైన పాండుపుత్రుల యొక్క అఖండ సంపదల్ని చూసి మయసభాభవనంలో జల స్థల భేదం గుర్తించలేక భీమునిచే అవహసింపబడ్డ దుర్యోధనుడు అసూయాపరుడయ్యేను. కాని పాండవుల్ని జయించే శక్తి లేదు. అందుచేత క్షత్రియుడై గూడా యుద్ధమందు ఉత్సాహం చూపలేకున్నాడు. పాండవుల ఉత్తమ సంపత్తిని హరించే ఉద్దేశ్యంతో గాంధార రాజగు శకుని సహాయంతో మాయా ద్యూతానికి ఆహ్వానించడానికి నిశ్చయించారు. సంజయా! దాని

యథైతానీతిహాసానాం తథా భారత ముచ్యతే
యశ్చైనం శ్రావయేచ్ఛ్రాద్ధే బ్రాహ్మణాన్ పాదమన్తతః
అక్షయ్య మన్నపానం వై పితౄంస్త స్యోపతిష్ఠతే
ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్.
బిభేత్యల్ప శ్రుతాద్వేదో మామయం ప్రహరిష్యతి
కార్ష్ణం వేదమిమం విద్వాన్ శ్రావయిత్వార్థ మశ్నుతే.
భ్రూణహత్యాదికం చాపిపాపం జహ్యాదసంశయం
య ఇమం శుచిరధ్యాయం పఠేత్పర్వణి పర్వణి.
అధీతం భారతం తేన కృత్స్నం స్యాదితిమేమతిః
యశ్చైనంశ్రృణుయాన్నిత్యమార్షం శ్రద్ధాసమన్వితః.
స దీర్ఘమాయుః కీర్తించ స్వర్గతించాప్నుయాన్నరః

ఏకత శ్చతురో వేదాన్ భారతం చైతదేకతః
పురాకిల సురైః సర్వైః సమేత్య తులయాధృతం
చతుర్భ్యః సరహస్యేభ్యో వేదేభ్యోహ్యధికం యదా.
తదా ప్రభృతి లోకేఽస్మిన్ మహాభారత ముచ్యతే
మహత్త్వేచ గురుత్వేచ ధ్రియమాణం యతోఽధికం.
మహత్వాత్ భారవత్వాచ్చ మహాభారతముచ్యతే
నిరుక్తమస్య యో వేద సర్వ పాపైః ప్రముచ్యతే.

తపోన కల్కోఽధ్యయనం న కల్కః
స్వాభావికో వేదవిధిర్న కల్కః
ప్రసహ్య విత్తాహరణం న కల్కః
తాన్యేవ భావోపహతాని కల్కః.

* * *

కాద్యంతాలలో జరిగిన ఘట్టాలను ఆలోచిస్తే అపజయ హేతుకాలగు సూచనలే నాకు కనిపించాయి.

నా బుద్ధిపూర్వక వచనాలు వింటే నే నెంత ప్రజ్ఞకల వాడినో నీవు గ్రహించ గలవు.

అర్జునుడు ద్రౌపదీస్వయంవరంలో శరసంధానం చేసి అత్యద్భుతమైన మత్స్యయంత్రలక్ష్యాన్ని భేదించి, సభయందాసీనులైన రాజశ్రేష్ఠులందరూ నివ్వెర పోతూండగా ఆమత్స్యాన్ని భూపతితం చేసి శౌర్యధైర్యోత్సాహాలతో ద్రౌపదిని పరిగ్రహించిన నాడే నేను కౌరవుల విజయం మీద ఆశ వదులుకున్నాను.

సంజయా! అర్జునుడు బలపరాక్రమాలతో కృష్ణుని సోదరియైన సుభద్రను పరిగ్రహించగా వృష్ణివీరులు ఇంద్రప్రస్థానికి బహూకృతులతో వచ్చిననాడు, దేవేంద్రుణ్ణి ధిక్కరించి అర్జునుడు దివ్యాస్త్రాలతో అగ్నిదేవుడికి సంతృప్తి కలిగించిన నాడు, లాక్షాగృహంనుండి పాండవులు కుంతీ సహితంగా రక్షితులుకావడానికి విదురుడు శ్రద్ధపూనినట్లు విన్ననాడు, స్వయంవరోత్సవంలో మత్స్యయంత్రాన్ని ఛేదించి అర్జునుడు ద్రౌపదీపాణిగ్రహణం చేసిననాడు, పాంచాలపాండవవీరులకు పరస్పర మైత్రి కలిగిందని ఆకర్ణించిననాడే నేను విజయ కాంక్ష వదులుకున్నాను.

అంతేగాక మగధరాజశ్రేష్ఠుడైన జరాసంధుడు భీముని భుజబలానికి లొంగిపోయిన క్షణంలో, ధర్మజుని సోదరులు నలుదిక్కులూ జయించి అన్నగారిచేత రాజసూయం నిర్విఘ్నంగా చేయించిన సమయంలోనే నేను నిరాశ చేసుకున్నాను.

ఇన్నిటికంటె ముఖ్యమైనది ఉంది. సంజయా రజస్వలాస్థితిలో ఏకవస్త్రయై ఉన్న ద్రౌపదిని కురుసభామధ్యంలోకి దుశ్శాసనుడు ఈడ్చుకొని వచ్చినప్పుడు, అయిదుగురు భర్తలుకల ద్రౌపది అనాథలా రోదిస్తూంటే ఆమెకు మానభంగం చేయ

దానికి ప్రయత్నించి దుశ్శాసనుడు విఫలుడైన ముహూర్తంలోనే నాకు జయంమీద కాంక్ష పోయింది. మాయాద్యూతంలో ధర్మజుని సర్వ సంపదల్నీ శకుని అపహరించగా పాండవులు అగ్రజుని ఆజ్ఞాపాలకులై అరణ్యాల పాలవుతూన్నపుడు వారి మనస్సులోని భావాలను వ్యక్తీకరిస్తూ హస్తినాపురం విడిచి మహారణ్యాలలో బ్రాహ్మణసహస్రాలతో భిక్షాటనం చేస్తూ జీవిస్తున్నారని విన్నప్పుడే నాకు యుద్ధంలో జరిగే ఫలితం తెలిసిపోయింది—అని ధృతరాష్ట్రుడు ఇంకా కొనసాగిస్తున్నాడు.

కిరాతరూపంలో వచ్చిన పరమశివుణ్ణి మెప్పించి అర్జునుడు పాశుపతం పొందిననాడు, వనవాసంలో ఉన్న పాండవుల వద్దకు మార్కండేయాది ఋషిశ్రేష్ఠులు వచ్చి సఖ్యంగా ఉంటూండటం, అర్జునుడు దేవలోకానికి వెళ్ళి బ్రహ్మచర్యతపోదీక్షలతో వారిని మెప్పించి దివ్యాస్త్రాలు పొందాడని విన్ననాడే నేను భవిష్యత్తును నిశ్చయించుకున్నాను. వరబలగర్వంతో చరించే పౌలోమ కాలకేయాదుల్ని జయించలేక దేవేంద్రాదులే తికమకలు పడుతోంటే అర్జునుడు అవలీలగా వారిని జయించాడని విన్నప్పుడు, అసురసంహారార్థం అర్జునుడు ఇంద్రలోకానికి వెళ్ళాడని తెలిసినప్పుడు, తీర్థయాత్రలో అర్జునుడు దివ్యాస్త్రాలు సాధించాడని ధర్మజుడికి లోమశుడు చెప్పినట్లు తెలిసిన నాడే, భీమసేనాదులు కుబేరునికి మిత్రులైనట్లు ఆకర్ణించిన నాడే విజయం వారి దని నిశ్చయం చేసుకున్నాను.

కర్ణుని ఆలోచనప్రకారం నడిచే దుర్యోధనుడు ఘోషయాత్రలో గంధర్వులచేత బంధితుడై అర్జునునివల్ల విడిపింపబడ్డాడని ఎరిగిననాడు, యక్షరూపంలో యముడు వేసినప్రశ్నలకు సముచితంగా ధర్మరాజు సమాధానమిచ్చిననాడు నేను పూర్తిగా నిరాశచేసుకున్నాను.

ద్రౌపదీసమేతులై పాండవులు విరాటనగరంలో ఉండడం గుర్తించ లేకపోయిననాడు, కీచకుడు ద్రౌపదీమానభంగయత్నం చేసి భీమునిచేత నిహతుడైన నాడే విజయంమీద నా ఆశ సన్నగిల్లింది.

విరాటనగరంలో అజ్ఞాతవాసం సాగుతూండగా మన సైన్యం మహారథికులతో వెళ్ళి ఉత్తరగోగ్రహణ సమయంలో నరు డేకైక ధనుర్ధరుడై యుండగా అతని చేతుల్లో ఓడిపోయారని విన్నాడు, అర్జునుని పరాక్రమానికి ముగ్ధుడై విరాటుడు తన కుమార్తె ఉత్తరను పరిగ్రహించగోరగా పార్థుడు తన (అభిమన్యు) కుమారునికోసం స్వీకరించాడని తెలిసినప్పుడు, జూదంలో ఓడిపోయి ధర్మజుడు బంధుజనాన్ని వీడి అరణ్యాల పాలైననాడు, అనంతరం ఏడక్షౌహిణీలతో యుద్ధానికి సిద్ధపడ్డనాడు, భూమండలాన్ని ఒకేపాదంతో ఆక్రమించిన వామనుడే కృష్ణరూపంతో పాండవహిత సాధనకై కంకణం కట్టుకున్నాడని తెలిసిననాడు, నరనారాయణులే కృష్ణార్జును లని నారదుడు చెప్పిననాడు, జగద్బాంధవుడు లోకకళ్యాణార్థం సంధి చేయటానికి వచ్చి విఫలప్రయత్నుడై వెళ్ళిననాడు యుద్ధపరిణామం నాకు అవగతమైంది. అజ్ఞానులై కర్ణ దుర్యోధనాదులు కృష్ణుని బంధింప యత్నించినపుడు విశ్వరూపప్రదర్శనం జరిగిన క్షణంలో, రాయబారిగా వచ్చిపోయే వాసుదేవునితో కుంతి తన హృదయావేదన చెప్పుకోగా ఆ భగవానుడు అభయమిచ్చిన సుముహూర్తంలో, పాండవసచివుడైన శ్రీకృష్ణుని భీష్మద్రోణాదులు ఆశీస్సులతో పంపిన ఘడియలో,

కర్ణుడు భీష్మనిర్యాణపర్యంతం సంగరరంగములో కాలుపెట్టనని నిష్క్రమించిన క్షణంలో విజయశ్రీ ఎవరిని వరిస్తుందో అర్థమైపోయింది.

సాక్షాత్పరాత్పరుడైన శ్రీకృష్ణుడూ, మహావీరుడైన అర్జునుడూ, మహాశక్తివంతమైన గాండీవమూ ఒకపక్షంలో ఉన్నపుడు ప్రతిపక్షానికి జయం లభిస్తుందని నేననుకోలేను.

ఉభయపక్షాలూ యుద్ధరంగంలో మోహరించినప్పుడు అర్జునుడు వ్యామోహంతో విచారిస్తూండగా కృష్ణుడు తనలోనే బ్రహ్మాండాలన్నీ చూపించాడని విన్న క్షణంలో నేను భవిష్యత్తు నిశ్చయించుకున్నాను. మహావీరుడైన భీష్ముడు రోజుకి పదివేలమందిని సంహరిస్తున్నా ప్రతిపక్షంలో ఒక్క మహావీరుణ్ణీ ఆయన హతమార్చనప్పుడు, పైగా ఆయన తన మృత్యురహస్యం చెప్పినపుడు, శిఖండిని ముందుంచి అర్జునుడు గాంగేయుని జయించాడని తెలిసినప్పుడు నా ఆశ పూర్తిగా చల్లారింది— అని ధృతరాష్ట్రుడు సంజయునితో ఇంకా ఇలా అంటున్నాడు.

గాంగేయుడు చంద్రవంశ యోధులను ఎందరినో వధించినా అర్జునునివల్ల శరతల్పగతుడై, దాహంతో అర్జునివైపు చూడగా పాతాళ జలంతో దప్పిక చల్లార్చినట్లు విన్నప్పుడు, వాయువు అనుకూలంగా వీస్తూండగా రవిచంద్రులు పాండవులకు లాభస్థానంలో ఉండగా, కౌరవపక్షానికి అపజయాన్ని సూచిస్తూ కుక్కలు రోదిస్తూన్నప్పుడు, ధనురాచార్యుడు అతని అస్త్రవిద్యాకౌశలాన్ని ప్రదర్శిస్తూనే ఒక్క మహావీరుణ్ణీ చంపనప్పుడు, సంశప్తకులందరూ అర్జునుని చేతులలో నిహతులైనప్పుడు. శస్త్రపాణియై ద్రోణుడు నిలిచి ఉండగా బాలుడైన అభిమన్యుడు పద్మవ్యూహాన్ని ఛేదించినప్పుడు, మన మహారథికులు అర్జునుని ఎదుట నిలవలేకపోగా పదిమందీ కలిసి అభిమన్యుణ్ణి వధించారని తెలిసినప్పుడే నాకు విజయంమీద ఆశ పోయింది.

సంజయా! ఏనాడు నాకుమారులు అభిమన్యుణ్ణి వధించారో, ఏక్షణంలో అర్జునుడు సైంధవుణ్ణి యమపురికి పంపుతానని శపథంచేసి ఆ ప్రకారంగా చేశాడో అప్పుడే నాకు భవిష్యత్తు తేలిపోయింది. మహాఘోరంగాసాగేసంగ్రామంలో అర్జునుని రథాశ్వాలు అలసిపోగా కృష్ణుడు అదేసమయంలో వాని దాహంతీర్చి రథాన్ని మామూలుగా నడిపిస్తున్నాడని తెలిసినప్పుడు, యుద్ధరంగంలో తన గుర్రాలకు విశ్రాంతినిచ్చే ఊహతో అర్జునుడు రథం దిగికూడా వీరనాశనం చేస్తున్నాడని విన్నప్పుడు, సాత్యకి ఒక్కడూ ద్రోణాచార్యుని అధీనంలో ఉన్న సైన్యాలను చెల్లాచెదరుచేసి స్వేచ్ఛగా కృష్ణార్జునులను చేరినవార్త విన్నముహూర్తంలో, విరథుడై చేజిక్కిన భీముని హాయిగా కర్ణుడు వదిలేశాడని తెలిసినప్పుడు నాకు యుద్ధపరిణామం తెలిసింది.

ద్రోణ, కృప, కృతవర్మాదులూ, అశ్వత్థామ, కర్ణ, శల్యులూ సైంధవుని మృతికి ఏమీ చింతించలేదని విన్నప్పుడు, దేవేంద్రుడు ప్రసాదించిన శక్త్యస్త్రాన్ని కర్ణునిచేత శ్రీకృష్ణుడు ఘటోత్కచునిపై ప్రయోగింపజేశాడని విన్నప్పుడే నేను విజయశ్రీ మాదికాదని గ్రహించాను.

ధర్మజునివల్ల అశ్వత్థామ మరణించాడనే వార్త విని ప్రాయోపవేశం చేసిన ద్రోణాచార్యుని ధృష్టద్యుమ్నుడు దారుణంగా సంహరించాడని విన్నప్పుడు, మహాయోధుడైన అశ్వత్థామ వీరవిహారం

చేస్తుండగా నకులుడొక్కడూ ఎదురు నిలబడగలిగాడని విన్నప్పుడూ, నేను విజయలక్ష్మి మీద ఆశ వదలుకున్నాను.

ఆచార్యద్రోణుని మరణంతోపాటు, అశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రం కూడా పాండవులను హరించ లేదని తెలిసినప్పుడు, భీమసేనుడు దుస్ససేనుని రొమ్ముచీల్చి రక్తం త్రాగుతోంటే అక్కడ ఒక్కరూ ఆ ఘాతుకాన్ని ఆపలేదని విన్నప్పుడూ, పరాజయం ఎలాటిదో ఎరుగని కర్ణుడు నిహతుడైన ఘడియనూ, ధర్మజుడు మహాయోధులైన దుశ్శాసన, కృతవర్మ, అశ్వత్థామాదులను జయించాడని విన్నప్పుడు, కృష్ణునితో సమంగాసారథ్యం చేయగల శల్యుడు ధర్మజుని చేతుల్లో పడిపోయాడని చెప్పినప్పుడు, ఈ కక్షకు మూలకారణంగా కపటద్యూతం సాగించిన శకుని సహదేవుని చేజిక్కి మరణించాడని విన్నప్పుడు, నా జ్యేష్ఠుడు విరథుడై సరోవరంలో జలస్తంభనం చేశాడని విన్నక్షణంలో కృష్ణునితో పాండవులు ఆ సరస్సును చేరి దుర్యోధనుని ఉద్రిక్తపరచి యుద్ధం సాగిస్తూ గదాచాలనంలో విచిత్రగతులు ప్రదర్శించే వానిని కృష్ణుడు అన్యాయంగా భీమసేనుని చేత తొడలు విరగగొట్టించినప్పుడే నేను నిరాశ చేసుకున్నాను.

సంజయా! సుఖంగా నిద్రించే ధృష్టద్యుమ్నాది పాంచాలురతో ఉపపాండవుల్ని చంపి అశ్వత్థామ అపఖ్యాతి పొందాడు. వెంటాడే భీమసేనునిపై అలిగి బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు అశ్వత్థామ. అది అపాండవం చేయాలని అభిమంత్రించినా గర్భస్థ శిశువుకూడా కాపాడబడింది కదా!

అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామాస్త్రాన్ని - మంగళము కలిగించుగాక! అంటూ అర్జునుడు అదే అస్త్రంతో వారించినప్పుడే నాకు విజయాశ పోయింది. ఉత్తరాగర్భంలో ఉన్న పిండాన్ని అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం ఛిన్నంచేసినా శ్రీకృష్ణుడు దాన్ని పరీక్షించిన నాడు నేను విజయశ్రీకి నీళ్ళు వదులుకున్నాను.

కొడుకుల్నీ, మనుమల్నీ కోల్పోయి గాంధారి మహాదుఃఖంలో ఉంది. నిష్కంటకంగా రాజ్యం పాండవులచేతుల్లోపడిపోయింది. సంజయా! ఈ సంగ్రామంలో మిగిలిన మహాయోధులు వేళ్ళమీద లెక్కకువస్తారు. మా పక్షంలో కృతవర్మ, కృపాచార్యుడూ; అశ్వత్థామా మిగిలారు. పాండవులతోపాటు కృష్ణుడూ సాత్యకీ ఆ వర్గంలో ఉన్నారు. ఈ పదిమందీతప్ప మిగిలిన పద్దెనిమిది అక్షౌహిణీలసేనా ఆహుతి అయినట్లు వినవలసిన దుస్థితి నాకు పట్టింది. ఈ వార్త నా మనస్సును కలచి పారేస్తోంది. నాలో చైతన్యం పోతోంది—అంటూనే ధృతరాష్ట్రుడు స్మృతిహీనుడై కొంతసేపటికి తేరుకొని—సంజయా! ఈ సమయంలో నేనింకా బ్రతికి ఉండడంకంటె మరణించడమే మంచిది — అంటూ నిట్టూర్పులు విడుస్తూ స్మృతిని కోల్పోతూ ఉన్న ధృతరాష్ట్రునికి ఆశ్వాసన కలిపించే సంకల్పంతో సంజయుడు ఇలా అంటున్నాడు.

ధృతరాష్ట్ర మహారాజా! ఇతఃపూర్వం నువ్వు వ్యాస నారదాది మహాజ్ఞానులవల్ల ఎందరో పరాక్రమశాలుల చరిత్రలు విన్నావు. సర్వసద్గుణ సంపన్నులూ, అస్త్రశస్త్రపారంగతులూ ఉత్తమ క్షత్రియ వంశీయులూ, ఇంద్రసమపరాక్రమోపేతులూ అయిన రాజులందరూ ధర్మయుద్ధంలో

ఈ భూమండలాన్ని జయించి యజ్ఞయాగాదులు చేసి ప్రజలను శాంతంగా పరిపాలించి యశోధను లయారు. అయినా వారు కాలపాశాన్ని తప్పించుకోలేదు. శాశ్వతస్వర్గం వారికి ప్రాప్తించింది. మహారథిశైబ్యుడూ వీరవరుడు సృంజయుడూ సుహోత్రుడూ రంతిదేవుడూ కాక్షీవానుడూ ఔశిజుడూ బాహ్లీకుడూ దమనుడూ చైద్యుడూ శర్యాతీ నలుడూ ఆదిగా గలవారింకా ఎందరో ఉన్నారు – అంటూ సంజయుడు ధృతరాష్ట్రునికి గుండె నిబ్బరం కలిగించడానికి ప్రయత్నిస్తున్నాడు.

మహారాజా వారే కాక విశ్వామిత్ర, అంబరీష, మను, మరుత్త, ఇక్ష్వాకు, గయ, భరత, శ్రీరామ, శశిబిందులూ, ఈ ప్రకారం గతించినవారే. భగీరథ, కార్తవీర్య, జనమేజయ, యయాతులున్నారు. ఈ ఇరవైనలుగురు మహారాజులూ యజ్ఞకర్మలలో భూమండలాన్ని యూపస్తంభ చిహ్నలతో అలంకరించిన తేజశ్శాలులు. పుత్రశోకంలో ఉన్న శైవ్యత్యుడు అనేవానికి నారదర్షి వీరి ఉపాఖ్యానాలు చెప్పి శాంతి కలిగించాడు.

ఇలా చూస్తూంటే ఇంకా ఎందరో కనిపిస్తారు. మహారాజా! పురు కురు యదువంశీయులైన మహానీయులెందరు గతించలేదు. విష్వగశ్వ అణుహ యువనాశ్వ కకుత్స్థ విజయ వీతిహోత్ర అంగ భవ శ్వేత బృహద్గురు ప్రముఖులు తమ భూమిక నిర్వహించి వెళ్ళిపోయారు. ఉశీనర శతరథ కంక దలి దుహ ద్రుమ దంభోద్భవ పర వేన సగర సంకృతి నిమి అజేయ పరశు పుండ్ర శంభు దేవావృధులెందరు గతించలేదు.

దేవాహ్వయ సుప్రతిమ సుప్రతీకులూ బృహద్రథ నలులూ శాంతభయుడూ సత్యవ్రతుడూ సుమిత్రుడూ సుబలుడూ ప్రభు జానుజంఘ అనరణ్య అర్క – ప్రియభృత్య శుచివ్రత బలబంధు నిరామర్ద కేతుశృంగ బృహద్బల ధృష్టకేతు బృహత్కేతు దీప్తకేతు నిరామర్ద అవిక్షిత చపలధూర్త కృతబంధు దృఢేషుధి ప్రత్యంగ పరహ శ్రుతిశ్రము ఖులేకాకుండా శతసహస్రాధికసంఖ్యాకులు మరణించారు. అలానే నీకొడుకులూ గతించారు. ఈ మహాతేజస్సంపన్నులు తపోదానాదులలో త్యాగనిరతిలో పరాక్రమప్రదర్శనలో అలౌకికశక్తి సంపన్నులే అయినా మృత్యుదేవతకు లొంగక తప్పలేదు.

కామక్రోధాది అరిషడ్వర్గాలకూ దాసులైన నీకొడుకులు మరణించినందుకు విచారించనవసరంలేదు. ప్రాజ్ఞుడవైన నువ్వు విచారించడం చూస్తే ఆశ్చర్యంగా ఉంది. శాస్త్రనిపుణుడవైన నువ్వు మోహశోకాలకు లొంగకూడదు. పాండవుల యందు నిగ్రహాన్నీ, కౌరవులయందు అభిమానాన్నీ ప్రదర్శించిన నువ్వు ఈనాడు విచారించి ప్రయోజనంలేదు. పైగా విధిని దాటిపోగలవారులేరు. జననమరణాలకూ సుఖదుఃఖాలకూ కాలమే హేతువు అని కాలస్వరూపాన్ని వివరించే సంకల్పంతో సంజయుడు సాగుతున్నాడు.

మహారాజా! సృష్టికార్యాన్నీ సంహారకార్యాన్నీ కూడా కాలమే నిర్వహిస్తోంది. ఈ కాలాన్ని మహాకాలరూపుడైన పరమేశ్వరుడు ఉపశమింప జేస్తున్నాడు. శుభాశుభకర్మలన్నీ కాలశాసనంవల్లనే ప్రవర్తిల్లుతున్నాయి. ఇంద్రియాలన్నీ నిద్రిస్తూన్నప్పుడు కూడా జాగ్రదావస్థలోనే ఉండే కాలాన్ని ఎవడూ అతిక్రమించలేడు. కాలం నిష్పాక్షికంగా వ్యవహరిస్తుంది. ఈ సృష్టిలో భూత

వర్తమాన భవిష్యత్తులలోని జీవజాలానికీ, వస్తు సంతతికీ కాలమే కారణం— అని సంజయుడు ధృతరాష్ట్రునకు ఎన్నో విషయాలు చెప్పి పుత్రశోకం తగ్గించాడు.

ఈ ఇతిహాసం ఆధారంగా వ్యాసమహర్షి ఉపనిషత్సారంగా పరమపుణ్యప్రదమైనదిగా లోకశోకాన్ని ఉపశమింపజేసేరీతిలో మహాభారతాన్ని విరచించాడు. విద్వాంసు లీగాథను అనేకవిధాలుగా విరచిస్తున్నారు. ఈ మహాభారతం పఠించినవారికి అంతఃకరణ పరిశుద్ధ మవుతుంది. ఈ మహేతిహాసంలోని ఒక్కశ్లోకాన్ని లేదా ఒక్కపాదాన్ని పఠించినా పాపవిముక్తి కలుగుతుంది. ఈ మహాగ్రంథంలో నాగ యక్ష దేవతాపురుషుల గాథలే కాక దేవర్షి బ్రహ్మర్షి సంఘాల చరిత్రలున్నాయి. ఈ ఇతిహాసంలో శ్రీకృష్ణుని పరబ్రహ్మతత్త్వనిరూపణం ప్రధానాంశం. ఆ మహాపురుషుని సంకీర్తనంతో ఇది నిండిఉంది. శాశ్వతబ్రహ్మస్వరూపుడైన ఆ సనాతనజ్యోతిర్మూర్తి లీలలనే జ్ఞానులు గానంచేస్తూ ఉంటారు. ఆ పరమాత్మనుండి సదసద్రూపమైన ఈ విశ్వం ప్రభవించింది. జననమరణాదులన్నీ ఆ పరమాత్మవల్లనే జరుగుతున్నాయి.

ఈ ఉద్గ్రంథంలో జీవాత్మ వివేచన జరిగింది. సత్త్వరజస్తమో గుణాల,పంచమహాభూతాల విచారణ జరిగింది. అవ్యక్తమైన మూలప్రకృతికి హేతుభూతమైన పరబ్రహ్మ వివరణ యిందులో విస్తరించబడింది. కార్యకారణవిచారణ సాగింది. మట్టివల్ల ఘటం నిర్మింపబడుతోన్నట్లే దారంవల్ల బట్ట తయారవుతోంది. అదేరీతిగా పరమాత్మకారణంగా అవ్యక్తాలు పుడుతున్నాయి. కారణం లేనిదే కార్యం ఉండదు. కనక సర్వకారణుడైన పరమాత్మాకార్యరూపమైన అవ్యక్తాదులూ ఈ గ్రంథంలో సమగ్రంగా వివరించబడ్డాయి— అని సూతుడు మహాభారతమహేతిహాస ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తూంటే మును లందరూ కుతూహల చిత్తులై ఆకర్ణిస్తున్నారు.

ధ్యానయోగంతో జీవన్ముక్తి సాధించుకొన్న యతి తన హృదయదర్పణంలో ప్రతిబింబించే పరమాత్మను దర్శించి అలౌకికానుభూతి పొందుతున్నాడు. ధర్మపరాయణుడై శ్రద్ధాభక్తులతో ఈ అధ్యాయాన్ని పఠించే వ్యక్తికి పాపవిముక్తి కలుగుతుంది. ఆస్తికదృష్టితో ఈ అనుక్రమణికాధ్యాయాన్ని ఆకర్ణించినవాడు దుఃఖదూరు డవుతున్నాడు. ఉభయసంధ్యలలో మాధ్యాహ్నికసమయంలోకూడా దీనిని పఠించినవారిని పాపాలు అంటవు. మహాభారతానికి ఇది మూలం.

పెరుగులో నవనీతం, మనుష్యులలో బ్రాహ్మణుడు, వేదాలలో ఉపనిషత్తూ, ఓషధులలో అమృతమూ, జలాశయాలలో సముద్రమూ, జంతువులలో గోవూ శ్రేష్ఠములైనట్లే ఇతిహాసాలలో మహాభారతేతిహాసం ఉత్తమోత్తమమైనది. శ్రాద్ధవేళల బ్రాహ్మణ భోజనసమయాలలో ఈ అధ్యాయం అంతాగానీ నాలుగోవంతుగానీ ఆఖరికి ఒక్కశ్లోకమైనాపఠిస్తే వారి పితృదేవతలకు అక్షయలోకాలలో అన్నపానాలు లభిస్తాయి.

పురాణేతిహాసాలసాహాయ్యంతోనే వేదార్థం విస్తరించి చెప్పాలి. ఈ రెండుశక్తులనూ స్వాధీనం చేసికోకుండా వేదార్థం ప్రారంభించే వ్యక్తినిచూసి వేదం భయపడుతోంది. అల్పజ్ఞుడైన ఈ వ్యక్తి అపార్థాలు ఆపాదిస్తాడేమోనని వేదమాత భయం.

వేదవ్యాసప్రోక్తమైన ఈ ఇతిహాసాన్ని ఇతరులకు వినిపించే విద్వాంసునికి మనోభీష్టసిద్ధి కలుగుతుంది. ఈ మహాభారతం చదవటంవల్లనే కాక విన్నవాడికికూడా భ్రూణహత్యాది పాపాలు నశిస్తాయి. నిర్మలమైన పవిత్రహృదయంతో ఈ అధ్యాయం పర్వదినాలలో శ్రద్ధగా పఠిస్తే మహాభారతం సంపూర్ణంగా పఠించిన ఫలం పొందుతాడు. ఈ మహాభారతాన్ని ఆకర్ణించే వానికి ఆయురారోగ్యాలూ యశస్సూ స్వర్గమూ ప్రాప్తిస్తాయి— అని సూతుడు శౌనకాదులకు మహాభారత నామవైశిష్ట్యాన్ని వివరిస్తున్నాడు.

ఒకానొకప్పుడు దేవతలు నాలుగువేదాలనూ ఒకవైపునా మహాభారతాన్ని వేరొకవైపునా ఉంచి తూస్తే ఈగ్రంథమే మహాభారంగా ఉండటం వల్ల దీన్ని మహాభారతం అన్నారు. సత్యం అనే త్రాసులో తూచినప్పుడు మహత్వ గురుత్వములు దీనికే ప్రాప్తించాయి. ఈవిధంగా దీని నిర్వచనం తెలిసికొన్నవానికికూడా పాపము లంటవు.

శాస్త్రాధ్యయనం తపోదీక్ష వర్ణాశ్రమధర్మాచరణం వేదోక్తకర్మాచరణం కష్టార్జితధనం ఇవన్నీ పవిత్రమైనవే. ఇతరులకు హానికలిగించే ఉద్దేశంతో వీనిని సాగిస్తే పాపమే వస్తుంది— అంటే ఏపని అయినా చేసేటప్పుడు దానిప్రయోజనాన్ని బట్టి మంచిచెడ్డలు ఆధారపడి ఉంటాయనీ అందుచేతనే మనోభావం ప్రధానప్రాతిపదికగా ఈగ్రంథం సాగుతున్నదనీ గ్రహించాలి.

ఇది

అనుక్రమణికాధ్యాయము

* * *

# రెండవ అధ్యాయము

శమంత పంచకమితి యదుక్తం సూతనందన
ఏతత్సర్వం యథాతత్త్వం శ్రోతుమిచ్ఛామహే వయం.
శృణుధ్వం మమభో విప్రా బ్రువతశ్చ కథాః శుభాః
శమంతపంచకాఖ్యం చ శ్రోతుమర్హథ సత్తమాః.
త్రేతాద్వాపరయోః సంధౌ రామః శస్త్రభృతాం వరః
అసకృత్పార్థివం క్షత్రం జఘానామర్ష చోదిత.
ససర్వం క్షత్ర ముత్సాద్య స్వవీర్యేణానల ద్యుతిః
శమంత పంచకే పంచ చకార రౌధిరాన్హ్రదాన్.
స తేషు రుధిరాంభస్సు హ్రదేషు క్రోధమూర్ఛితః
పితౄన్ సంతర్పయామాస రుధిరేణేతినః శ్రుతం.
అథర్చీకాదయో౽భ్యేత్య పితరో రామమబ్రువన్
రామరామ మహాభాగ ప్రీతాః స్మ తవ భార్గవ.
అనయా పితృభక్త్యా చ విక్రమేణ తవ ప్రభో
వరం వృణీష్వ భద్రం తే యమిచ్ఛసి మహాద్యుతే.
యది మే పితరః ప్రీతా యద్యనుగ్రాహ్యతా మయి
యచ్చ రోషాభిభూతేన క్షత్రముత్సాదితం మయా.

కథా ప్రారంభం చేయనున్న ఉగ్రశ్రవుని ఉద్దేశించి శమంతపంచకగాథా వివరణానంతరం కథారంభం చేయవలసిందని ఋషులు కోరగా అతడు నల్లెయని సాగుతున్నాడు.

సాధుజనులైన మహర్షులకు కళ్యాణప్రద గాథను వర్ణిస్తూ శమంతపంచకమహాత్మ్యం చెపుతున్నాడు సూతుడు. అగ్ని సమానతేజస్కుడైన పరశురాముడు ప్రతీకారేచ్ఛతో క్షత్రియ వంశాలను సంహరించి శమంతపంచక క్షేత్రంలో అయిదు రక్త సరోవరాలను కల్పించాడు. ఆసరస్సులలోని రక్తంతోనే పితృదేవతలకు తర్పణాలు చేయగా వారు తృప్తులై అతనికి ప్రత్యక్షమై వరం కోరుకో మన్నారు.

ఆ సమయంలో పరశురాముడు తాను ఆవేశంతో చేసిన ఈ క్షత్రియవంశ నాశనం కారణంగా వచ్చే పాతకమునుండి విముక్తిని ప్రసాదిస్తూ ఈ సరోవరపంచక క్షేత్రం ప్రసిద్ధ తీర్థభూమిగా చేయవలసిందని కోరాడు. ఋచీకాది పితృదేవతలు అల్లే అని అంగీకరించి నాటినుండి పరశురాముని ప్రశాంతంగా జీవించమన్నారు. త్రేతాద్వాపరసంధి కాలంలో జరిగిన విషయ మిది. నాటినుండీ ఆది శమంతపంచక క్షేత్రం అనే పేరుతో ప్రసిద్ధి పొందింది.

కలిద్వాపరసంధి సమయంలో కురుపాండవ యుద్ధం జరిగిన దీ పవిత్రక్షేత్రంలోనే. పద్దెనిమిది అక్షౌహిణీలతో జగాజెట్టీలు పంచత్వం పొందిన కారణాన దీన్ని శమంతపంచక మని వ్యవహరిస్తారు. ఈ క్షేత్రం రమణీయపుణ్యలోకంగా ముల్లోకాలలోనూ పేరు పొందింది— అని సూతుడు పలుకగా ఋషులు మరియొక సందేహాన్ని వెలిబుచ్చుతున్నారు.

అక్షౌహిణీ అనే శబ్దానికి అర్థం వివరించమని కోరిన మునులకు సూతుడు వివరిస్తున్నాడు.

ఒక రథము ఒక ఏనుగు ఒక అశ్వము అయిదుగురు సైనికులూ కలిస్తే పత్తి అంటారు. ఆపత్తులు మూడు కలిస్తే సేనాముఖమనీ, మూడు సేనాముఖాలను గుల్మమనీ, మూడు గుల్మాలను గణమనీ, గణత్రయాన్ని వాహిని అనీ, వాహినులు మూడు కలిస్తే పృతనమనీ యుద్ధశాస్త్రవేత్తలు వ్యవహరిస్తున్నారు. పృతనాలు మూడుంటే చమూ అనీ, మూడు చమువులు అనీకిని పది అనీకినులు అక్షౌహిణి అని సేనారహస్యశాస్త్రజ్ఞులు ఏర్పరిచారు.

ఇరవైయొక్కవెయ్యి ఎనిమిదివందల డెబ్బైరథాలూ, అదే సంఖ్యలో ఏనుగులూ లక్షా తొమ్మిదివేల మూడువందల యాభై కాల్బలమూ అరవై అయిదువేల ఆరువందల పది అశ్వాలూ ఉంటాయని గణితవేత్త లన్నారు. ఇటువంటివి పద్దెనిమిది అక్షౌహిణీలు కురుక్షేత్రంలో నశించాయి.

శస్త్రాస్త్రవిదుడైన భీష్ముడు సర్వసైన్యాధిపతిగా పదిరోజులూ ద్రోణుడు అధిపతిగా అయిదు రోజులూ కర్ణుని ఆజ్ఞలలో రెండురోజులూ శల్యుడు సేనానిగా అర్ధదివసం యుద్ధం జరిగింది. అనంతరం దుర్యోధన భీమసేనుల గదాయుద్ధం సాగింది. పద్దెనిమిదోరోజున రాత్రి అశ్వత్థామ కృపాచార్య కృతవర్మలతో కలిసి నిద్రలోవున్న ధర్మజుని సేనల్ని సంహరించాడు.

జనమేజయుడు సర్పయాగం చేస్తూండగా వైశంపాయన ఋషి వినిపించిన మహాభారతాన్ని ఇప్పుడు మీకు చెపుతున్నాను. ఈ ఇతిహాసంలో

అతశ్చ పాపాన్ముచ్యేఽహమేష మే ప్రార్థితో వరః
హ్రదాశ్చ తీర్థభూతా మే భవేయుర్భువి విశ్రుతాః.
ఏవం భవిష్యతీత్యేవం పితరస్తమథాబ్రువన్
తం క్షమస్వేతి నిషిషిధుః తతస్సవిరరామ హ.
తేషాం సమీపే యో దేశో హ్రదానాం రుధిరాంభసాం
శమంతపంచకమితి పుణ్యం తత్పరికీర్తితం.
యేన లింగేన యో దేశో యుక్తస్సముపలక్ష్యతే
తేనైవ నామ్నా తం దేశం వాచ్యమాహుర్మనీషిణః.
అంతరే చైవ సంప్రాప్తే కలిద్వాపరయోరభూత్
శమంతపంచకే యుద్ధం కురుపాండవసేనయోః.
తస్మిన్పరమధర్మిష్ఠే దేశే భూదోషవర్జితే
అష్టాదశసమాజగ్ము రక్షౌహిణ్యో యుయుత్సయా.
సమేత్య తం ద్విజాస్తాశ్చ తత్రైవ నిధనం గతాః
ఏతన్నామాభినిర్వృత్తం తస్య దేశస్య వై ద్విజాః.
పుణ్యశ్చ రమణీయశ్చ స దేశో వః ప్రకీర్తితః
తదేతత్కథితం సర్వం మయా బ్రాహ్మణసత్తమాః
యథా దేశః స విఖ్యాతస్త్రిషు లోకేషు సువ్రతాః.
అక్షౌహిణ్య ఇతి ప్రోక్తం యత్త్వయా సూతనందన
ఏతదిచ్ఛామహే శ్రోతుం సర్వమేవ యథాతథం.
అక్షౌహిణ్యాః పరీమాణం నరాశ్వరథదంతినాం
యథావచ్చైవ నో బ్రూహి సర్వం హి విదితం తవ.
ఏకో రథో గజశ్చైకో నరాః పంచపదాతయః
త్రయశ్చ తురగాస్తజ్ఞైః పత్తిరిత్యభిధీయతే.
పత్తిం తు త్రిగుణామేతామాహుః సేనాముఖం బుధాః
త్రీణి సేనాముఖాన్యేకో గుల్మ ఇత్యభిధీయతే.
త్రయో గుల్మా గణో నామ వాహినీ తు గణాస్త్రయః
స్మృతాస్తిస్రస్తు వాహిన్యః పృతనేతి విచక్షణైః.
చమూస్తు పృతనాస్తిస్రశ్చమ్వస్త్వనీకినీ
అనీకినీం దశగుణాం ప్రాహురక్షౌహిణీం బుధాః.
అక్షౌహిణ్యాః ప్రసంఖ్యాతా రథానాం ద్విజసత్తమాః
సంఖ్యా గణితతత్త్వజ్ఞైః సహస్రాణ్యేకవింశతిః.
శతాన్యుపరి చైవాష్టౌ తథా భూయశ్చ సప్తతిః
గజానాం చ పరీమాణమేతదేవ వినిర్దిశేత్.
జ్ఞేయం శతసహస్రం తు సహస్రాణి నవైవ తు
నరాణామపి పంచాశత్ శతాని త్రీణి చానఘాః.
పంచషష్టిసహస్రాణి తథాశ్వానాం శతాని చ
దశోత్తరాణి షట్ ప్రాహుర్యథావదిహ సంఖ్యయా.
ఏతామక్షౌహిణీం ప్రాహుః సంఖ్యాతత్త్వవిదో జనాః
యాం వః కథితవానస్మి విస్తరేణ తపోధనాః.
ఏతయా సంఖ్యయా హ్యాసన్ కురుపాండవసేనయోః
అక్షౌహిణ్యో ద్విజశ్రేష్ఠాః పిండితాష్టాదశైవ తు
సమేతాస్తత్ర వై దేశే తత్రైవ నిధనం గతాః.
కౌరవాన్ కారణం కృత్వా కాలేనాద్భుతకర్మణా.
అహాని యుయుధే భీష్మో దశైవ పరమాస్త్రవిత్
అహాని పంచ ద్రోణస్తు రరక్ష కురువాహినీం.
అహనీ యుయుధే ద్వే తు కర్ణః పరబలార్దనః
శల్యోఽర్ధదివసం చైవ గదాయుద్ధమతః పరం.
తస్యైవ దివసస్యాంతే ద్రౌణిహార్దిక్యగౌతమాః
ప్రసుప్తం నిశి విశ్వస్తా జఘ్నుర్యౌధిష్ఠిరం బలం.
యత్తు శౌనక సత్రే తే భారతాఖ్యానముత్తమం
జనమేజయస్య తత్ సత్రే వ్యాసశిష్యేణ ధీమతా.
కథితం విస్తరార్థం చ యశో వీర్యం మహీక్షితాం
పౌష్యం తత్ర చ పౌలోమమాస్తీకం చాదితః స్మృతం.
విచిత్రార్థపదాఖ్యానమనేకసమయాన్వితం
ప్రతిపన్నం నరైః ప్రాజ్ఞైర్వైరాగ్యమివ మోక్షిభిః.
ఆత్మేవ వేదితవ్యేషు ప్రియేష్వివ హి జీవితం
ఇతిహాసః ప్రధానార్థః శ్రేష్ఠస్సర్వాగమేష్వయం.
అనాశ్రిత్యేదమాఖ్యానం కథా భువి న విద్యతే
ఆహారమనపాశ్రిత్య శరీరస్యేవ ధారణం.
తదేతద్భారతం నామ కవిభిస్తూపజీవ్యతే

మహారాజుల కీర్తికాంతులు ప్రకాశిస్తున్నాయి. వారి పతాకమాలు ఉజ్జ్వలంగా విహరిస్తున్నాయి. ప్రప్రథమంగా పౌష్య, పౌలోమ ఆస్తీకులను స్మరించి ఈ ఇతిహాసాన్ని మీకు వినిపిస్తాను— అని సూతుడు శౌనకాది మహామునులతో పలికాడు.

మోక్షాసక్తి గల మానవుడు వైరాగ్యంతో ధన్యుడైనట్లే ప్రాజ్ఞుడైనవాడు ఈ మహాభారతం వల్ల ధన్యుడౌతున్నాడు. ఐహిక పారలౌకిక ధర్మాలతో చిత్రాతిచిత్ర పదసముదాయంతో అద్భుతమైన అర్థసంపదతో జ్ఞానాన్ని ప్రబోధించే గాథలతో ఈ మహాభారతం నిండి ఉన్నది. ఆత్మజ్ఞానము, ప్రాణప్రీతి మానవుడికి ఎంత ఆవశ్యమైనవో పరమాత్మ ప్రాప్తిని కలిగించే వేదశాస్త్రార్థాలతో నిండిన మహాభారతాధ్యయనంకూడ అంత అవశ్యమైనది. జీవితానికి ఆధారభూతమైన ఆహారం లేకుండా శరీరం నిలబడనట్లే సమస్త ధర్మాలను ప్రబోధించే మహాభారత భూమిక లేకుండా ఏ ఆఖ్యానము ఉండలేదు. అంటే ధర్మప్రబోధాత్మకమైన సర్వగాథలకు భారతమే మూలం. జ్ఞానాన్ని కోరే వ్యక్తి ఈశ్వరసేవతో కృతార్థుడౌతున్నట్లు కవిపుంగవులు ఈమహాభారతాన్ని ఆరాధించి కృతకృత్యులవుతున్నారు. లౌకిక, వైదిక సంబంధమైన జ్ఞానం అంతా స్వరవ్యంజనాల్లో నిక్షిప్తమై ఉన్నట్లే సర్వ విద్యా బుద్ధులు ఈ మహేతిహాసంలో ఉన్నాయి. జ్ఞాననిలయమైన ఈ మహాభారతంలో సూక్ష్మాతి సూక్ష్మ పదార్థవివేచనతో వాని స్వరూపాన్ని తెలిపే యుక్తులు కూడా ఇందులో ఉన్నాయి. సర్వ ధర్మాలంకృతమై వేదార్థ ప్రతిపాదక శబ్దసముదంచితమై ఆశ్చర్యజనకార్థబోధా సమర్థమై అలరారే ఈ ఇతిహాసంలోని పర్వాలను వివరిస్తున్నాడు సూతుడు. ప్రథమాధ్యాయంలో పర్వానుక్రమణిక సాగించి ఈ ద్వితీయాధ్యాయంలో పర్వ సంగ్రహం చెబుతున్నాడు.

పౌష్య, పౌలోమ, ఆస్తీకాది అంశావతార పర్వాల అనంతరం శరీరాన్ని పులకింపజేసే సంభవ పర్వం వస్తుంది. క్రమంగా లాక్షాగృహదహనం, హిడింబ, బకాసురులవధ, చైత్రరథపర్వం, ద్రౌపదీ స్వయంవరం, వివాహం, విదురాగమనం రాజ్యలంభం, అర్జునవనవాసం, సుభద్రాహరణం,హరణాహరణం, ఖాండవదహనం, మయదర్శనం, వర్ణింపబడతాయి. అనంతరం సభాపర్వం, మంత్రపర్వం, జరాసంధవధ, దిగ్విజయపర్వం, రాజసూయం, అర్ఘ్యాభిహరణం, శిశుపాలవధ ప్రవచింపబడ్డాయి.

ద్యూత అనుద్యూత ఆరణ్యక కిర్మీరవధ అర్జునాభిగమన కైరాత ఇంద్రలోకాభిగమన నలోపాఖ్యాన తీర్థయాత్ర జటాసురవధ యక్ష యుద్ధ పర్వాలు క్రమంగా చెప్పబడ్డాయి. నివాతకవచ యుద్ధము ఆజగరపర్వమూ అయిన అనంతరం మార్కండేయ మునిచంద్రుని సమాశ్వాసనం వస్తుంది. ద్రౌపదీసత్యభామా సంవాదం ఘోషయాత్ర మృగస్వప్నోద్భవం అశ్వత్థామగాథ ఇంద్రద్యుమ్నోపాఖ్యానం ద్రౌపదీహరణం సైంధవ విమోచనం జరుగుతాయి. సావిత్రి ఉపాఖ్యానం రామకథ అయిన తరువాయి కుండలములు హరించటంఅరణ్యపర్వంచెపుతున్నాడు. విరాటపర్వంలో పాండవుల నగరప్రవేశంతో వారి ప్రతిజ్ఞాపాలనం ఉంటుంది. కీచవకథ గోగ్రహణం ఉత్తరాభిమన్యుల వివాహం వరుసగా వస్తాయి. అనంతరం అద్భుతావహమైన ఉద్యోగపర్వంలో సంజయయానపర్వం చెపుతాడు. ధృతరాష్ట్రుని విచారంవల్ల వచ్చిన

ఉదయ ప్రేక్షణీయైశ్చ కృత్స్నై రభిజాత ఇవేశ్వరః.
ఇతిహాసోత్తమే యస్మిన్నర్పితా బుద్ధిరుత్తమా
స్వరవ్యంజనయోః కృత్స్నా లోకవేదాశ్రయేవ వాక్
తస్య ప్రజ్ఞాభిపన్నస్య విచిత్ర పదపర్వణః
సూక్ష్మార్థన్యాయయుక్తస్య వేదార్థైర్భూషితస్యచ.
భారతస్యేతిహాసస్య శ్రూయతాం పర్వ సంగ్రహః
పర్వానుక్రమణీపూర్వం ద్వితీయః పర్వ సంగ్రహః.
పౌష్యం పౌలోమమాస్తీక మాదిరంశావతారణం
తత స్సంభవపర్వోక్త మద్భుతం రోమహర్షణం.
దాహోజతు గృహస్యాత్ర హైడింబం పర్వచోచ్యతే
తతో బకవధః పర్వ పర్వచైత్రరథం తతః.
తతః స్వయంవరో దేవ్యాః పాంచాల్యాః పర్వచోచ్యతే
క్షాత్రధర్మేణ నిర్జిత్య తతో వైవాహికం స్మృతం.
విదురాగమనం పర్వ రాజ్యలంభ స్తథైవ చ
అర్జునస్య వనేవాసః సుభద్రాహరణం తతః.
సుభద్రాహరణా దూర్ధ్వం జ్ఞేయాహరణహారికా
తతః ఖాండవదాహాఖ్యం తత్రైవమయదర్శనం.
సభాపర్వ తతః ప్రోక్తం మంత్రపర్వ తతః పరం
జరాసంధవధః పర్వ పర్వదిగ్విజయం తథా.
పర్వదిగ్విజయా దూర్ధ్వం రాజసూయిక ముచ్యతే
తతశ్చార్ఘాభిహరణం శిశుపాలవధ స్తతః.
ద్యూతపర్వః తతః ప్రోక్త మనుద్యూత మతః పరం
తత ఆరణ్యకం పర్వ కిర్మీర వధ ఏవచ.
అర్జునస్యాభిగమనం పర్వ జ్ఞేయ మతః పరం
ఈశ్వరార్జునయోర్యుద్ధం పర్వకైరాత సంజ్ఞితం.
ఇంద్రలోకాభిగమనం పర్వ జ్ఞేయ మతః పరం
నలోపాఖ్యాన మపిచ ధార్మికం కరుణోదయం.
తీర్థయాత్రా తతః పర్వ కురురాజస్య ధీమతః
జటాసుర వధః పర్వ యక్షయుద్ధ మతః పరం.
నివాతకవచై ర్యుద్ధం పర్వచాజగరం తతః
మార్కండేయసమాస్యాచ పర్వానంతరముచ్యతే.
సంవాదశ్చ తతః పర్వ ద్రౌపదీ సత్యభామయోః
ఘోషయాత్రా తతః పర్వమృగస్వప్నోద్భవంతతః.
వ్రీహి ద్రౌణికమాఖ్యాన మైంద్రద్యుమ్నం తథైవచ.
ద్రౌపదీహరణం పర్వ జయద్రథవిమోక్షణం.
పతివ్రతాయమాహాత్మ్యం సావిత్ర్యాశ్చైవ మద్భుతం
రామోపాఖ్యాన మత్రైవ సర్వజ్ఞేన మతః పరం.
కుండలాహరణం పర్వ తతః పరమిహోచ్యతే.
ఆరణేయం తతః పర్వ వైరాటం తదనంతరం
పాండవానాం ప్రవేశశ్చ సమయస్యచ పాలనం.
కీచకానాం వధః పర్వ పర్వగోగ్రహణం తతః
అభిమన్యోశ్చవైరాట్యాః పర్వవైవాహికం స్మృతం.
ఉద్యోగపర్వ విజ్ఞేయమత ఊర్ధ్వం మహాద్భుతం
తతస్సంజయయానాఖ్యం పర్వజ్ఞేయ మతః పరం.
ప్రజాగరం తథా పర్వ ధృతరాష్ట్రస్య చింతయా
పర్వ సానత్సుజాతం వై గుహ్య మధ్యాత్మదర్శనం.
యానసంధి స్తతః పర్వ భగవద్యాన మేవచ
మాతలీయ ముపాఖ్యానం చరితం గాలవస్యచ.
సావిత్రం వామదేవ్యంచ వైన్యోపాఖ్యాన మేవచ
జామదగ్న్య ముపాఖ్యానం పర్వషోడశరాజకం.
సభాప్రవేశః కృష్ణస్య విదులాపుత్ర శాసనం
ఉద్యోగః సైన్య నిర్యాణం విశ్వోపాఖ్యాన మేవచ.
జ్ఞేయం వివాదపర్వాత్ర కర్ణస్యాపి మహాత్మనః
నిర్యాణంచ తతః పర్వ కురుపాండవసేనయోః
రథాతిరథసంఖ్యా చ పర్వోక్తం తదనంతరం
ఉలూకదూతాగమనం పర్వామర్ష వివర్ధనం.
అంబోపాఖ్యానమత్రైవ పర్వజ్ఞేయ మతః పరం
భీష్మాభిషేచనం పర్వ తతశ్చాద్భుతముచ్యతే.
జంబూఖండ వినిర్మాణం పూర్వోక్తం తదనంతర
భూమిపర్వ తతః ప్రోక్తం ద్వీపవిస్తారకీర్తనం.

జాగరణ అనే పేరుగల ప్రజాగరపర్వం, ప్రసిద్ధమైన సనత్సుజాత పర్వం చెప్పబడ్డాయి. ఈ సనత్సుజాత పర్వం పరమరహస్యమైన అధ్యాత్మవిద్యను ప్రవచిస్తుంది. సనత్సుజాతీయం అని పిలవబడే అమూల్య వేదాంత గ్రంథం యిదే. తరువాయి యానసంధి భగవద్యానపర్వాలు వ్రాయబడ్డాయి. ఈ భగవద్యానపర్వంలోనే మాతలిఉపాఖ్యానం గాలవ చరిత్ర వైనతేయుని గాథ షోడశ మహారాజుల చరిత్ర అభివర్ణింపబడ్డాయి. కృష్ణుని సభాప్రవేశం విదులాపుత్రుని గాథ అయిన తరువాయి కర్ణవివాద, సైన్యనిర్యాణపర్వాలు వస్తాయి.

రథాతిరథ సంఖ్యాపర్వం ఉలూకదూతాగమన పర్వం అంబోపాఖ్యాన పర్వం భీష్మాభిషేచన పర్వం వర్ణించబడ్డాయి. జంబూఖండ వినిర్మాణ పర్వం భూమిపర్వం అయిన తరువాయి భగవద్గీత భీష్మవధ ద్రోణాభిషేచనం సంశప్తకవధ అభిమన్యువధ ప్రతిజ్ఞాపర్వాలు వస్తాయి. జయద్రథ ఘటోత్కచుల వధానంతరం ద్రోణవధ నారాయణాస్త్ర మోక్షపర్వం వివరింపబడ్డాయి.

కర్ణశల్యపర్వాలూ హ్రదప్రవేశ గదాయుద్ధాలూ అభివర్ణించాక తీర్థవంశ వివరాలతో సారస్వతపర్వం సౌప్తిక పర్వం చెప్పబడ్డాయి. ఐషీకజల ప్రదాన స్త్రీ విలాపపర్వాలయిన తరువాయి మృతజీవులకు ఊర్ధ్వలోక కర్మలను సాగించే శ్రాద్ధ పర్వం బ్రాహ్మణ వేషధారియూ చార్వాకుడూ అయిన రాక్షసనిగ్రహపర్వం వ్రాసిన అనంతరం ధర్మరాజు పట్టాభిషేకం గృహవిభాగం రాజధర్మ ఆపద్ధర్మ మోక్షధర్మాది సర్వధర్మ ప్రతిపాదకమైన శాంతి పర్వం శుకప్రశ్నాభిగమనం బ్రహ్మప్రశ్నానుశాసనం దుర్వాసోత్పత్తి మాయాసంవాదం ధర్మాధర్మ వివరణాత్మకమైన అనుశాసనిక పర్వం భీష్మాచార్యుల వారి స్వర్గారోహణం అశ్వమేధం అనుగీతాపర్వం ఆశ్రమవాసం పుత్రదర్శనం నారదాగమనం ఆది గాగల పర్వాలు క్రమంగా వస్తాయి.

మౌసల మహాప్రస్థాన స్వర్గారోహణముల అనంతరం హరివంశం విష్ణుపర్వం శ్రీకృష్ణుని బాల్యక్రీడలు కంసవధవర్ణింపబడ్డాయి. ఖిలపర్వమూ భవిష్యత్పర్వమూ కలిసి నూరుపర్వాలు. ఈ శతపర్వ గ్రంథాన్ని వేదవ్యాసమహర్షి విరచించాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవుడు ఈ గ్రంథాన్ని సమగ్రంగా అవగాహనం చేసికొని పదునెనిమిది పర్వాలుగా విభజించుకొని నైమిశారణ్యంలో ప్రవచింపసాగాడు.

సూతుడు విభజించిన పర్వక్రమం యిది - పౌష్య పౌలోమ ఆస్తీకాది అంశావతరణం సంభవ లాక్షా గృహదహన బకవధ చైత్రరథవృత్తాంతం ద్రౌపదీ స్వయంవరం వివాహ విదురాగమన రాజ్యలంభ అర్జునవనవాస సుభద్రాహరణ హరణాహరణ ఖాండవదహన మయదర్శనాములతో ఆదిపర్వం పూర్తి అవుతుంది. పౌష్యపర్వంలో ఉదంకోపాఖ్యానం పౌలోమంలో భృగువంశవిస్తరణ ఆస్తీకంలో నాగుల చరిత్ర గరుడోపాఖ్యానం క్షీరసాగర మథనం ఉచ్చైఃశ్రవాదుల ఉత్పత్తి జనమేజయ సర్పయాగం భరతవంశచక్రవర్తుల గాథలూ ఉన్నాయి.

సంభవపర్వంలో మహారాజుల జన్మవృత్తాంతాలు దేవతాంశావతారుల వృత్తాంతాలూ వీరుల జన్మం కృష్ణద్వైపాయనుని ప్రభవం వర్ణించబడ్డాయి. దైత్య దానవ యక్ష నాగ గంధర్వ పక్షి సర్వజాతుల జన్మకథలూ శకుంతలా దుష్యంతుల

పూర్వోక్తం భగవద్గీత పర్వ భీష్మవధస్తతః
ద్రోణాభిషేచనం పర్వ సంశప్తక వధస్తతః.
అభిమన్యు వధః పర్వ ప్రతిజ్ఞాపర్వచోచ్యతే
జయద్రథ వధ పర్వ ఘటోత్కచ వధస్తతః.
తతో ద్రోణ వధః పర్వ విజ్ఞేయం రోమహర్షణం
మోక్షో నారాయణాస్త్రస్య పర్వానంతరముచ్యతే.
కర్ణ పర్వ తతో జ్ఞేయం శల్యపర్వ తతః పరం
హ్రదప్రవేశనం పర్వ గదాయుద్ధ మతః పరం.
సారస్వతం తతః పర్వ తీర్థవంశానుకీర్తనం
అత ఊర్ధ్వం సుబీభత్సం పర్వ సౌప్తికముచ్యతే.
ఐషీకం పర్వ చోద్దిష్టమత ఊర్ధ్వం సుదారుణం
జలప్రదానికం పర్వ స్త్రీవిలాపస్తతః పరం.
శ్రాద్ధపర్వ తతో జ్ఞేయం కురూణా మౌర్ధ్వదేహికం
చార్వాకనిగ్రహః పర్వ రక్షసో బ్రహ్మరూపిణః.
ఆభిషేచనికం పర్వ ధర్మరాజస్య ధీమతః
ప్రవిభాగో గృహాణాం చ పర్వోక్తం తదనంతరం.
శాంతి పర్వ తతో యత్ర రాజధర్మానుశాసనం
ఆపద్ధర్మశ్చ పర్వోక్తం మోక్షధర్మస్తతః పరం.
శుకప్రశ్నాభి గమనం బ్రహ్మప్రశ్నానుశాసనం
ప్రాదుర్భావశ్చదుర్వాసః సంవాదశ్చైవ మాయయా
తతః పర్వ పరిజ్ఞేయ మానుశాసనికం పరం
స్వర్గారోహణికం చైవ తతో భీష్మస్య ధీమతః.
తతోఽశ్వమేధికం పర్వ సర్వపాపప్రణాశనం
అనుగీతా తతః పర్వజ్ఞేయ మధ్యాత్మవాచకం.
పర్వచాశ్రమవాసాఖ్యం పుత్రదర్శన మేవచ
నారదా గమనం పర్వ తతః పరమిహోచ్యతే.
మౌసలం పర్వచోద్దిష్టం తతో ఘోరం సుదారుణం
మహాప్రస్థానికం పర్వ స్వర్గారోహణికం తతః.
హరి వంశస్తతః పర్వ పురాణం ఖిల సంజ్ఞితం
విష్ణు పర్వ శిశోశ్చర్యా విష్ణోః కంసవధస్తథా.

భవిష్య పర్వచాప్యుక్తం ఖిలేష్వేవాద్భుతంమహత్
ఏతత్ పర్వశతం పూర్ణం వ్యాసేనోక్తంమహాత్మనా.
యథావత్ సూతపుత్రేణ లౌమహర్షణినా తతః
ఉక్తాని నైమిశారణ్యే పర్వాణ్యష్టాదశైవతు.
సమాసో భారతస్యాయ మత్రోక్తః పర్వ సంగ్రహః
పౌష్యం పౌలోమమాస్తీకమాదిరంశావతారణం
సంభవో జతువేశ్మాఖ్యం హిడింబ బకయోర్వధః
తథాచైత్రరథం దేవ్యాః పాంచాల్యాశ్చ స్వయంవరః.
క్షాత్రధర్మేణ నిర్జిత్యతతో వైవాహికం స్మృతం
విదురాగమనం చైవ రాజ్యలంభ స్తథైవచ.
వనవాసోఽర్జునస్యాపి సుభద్రాహరణం తతః
హరణా హరణం చైవ దహనం ఖాండవస్యచ.
మయస్య దర్శనం చైవ ఆదిపర్వణి కథ్యతే
పౌష్యే పర్వణి మహాత్మ్యముత్తంకస్యోపవర్ణితం.
పౌలోమే భృగువంశస్య విస్తారః పరికీర్తితః
ఆస్తీకే సర్వనాగానాం గరుడస్య చ సంభవః.
క్షీరోద మథనం చైవ జన్మోచ్చైః శ్రవసస్తథా.
యజతః సర్వసత్రేణ రాజ్ఞః పారీక్షితస్య చ.
కథేయ మభినిర్వృత్తా భరతానాం మహాత్మనాం
వివిధాః సంభవా రాజ్ఞా ముక్తాః సంభవపర్వణి.
అన్యేషాం చైవశూరాణా మృషేర్ద్వైపాయనస్య చ
అంశావతరణం చాత్రదేవానాం పరికీర్తితం.
దైత్యానాన్దానవానాంచయక్షాణాంచ మహౌజసాం
నాగానామథ సర్పాణాం గంధర్వాణాం పతత్రిణాం.
అన్యేషాం చైవ భూతానాం వివిధానాం సముద్భవః
మహర్షే రాశ్రమపదే కణ్వస్య చ తపస్వినః.
శకుంతలాయాం దుష్యం తాద్భరతశ్చాపిజజ్ఞివాన్
యస్యలోకేషు నామ్నేదం ప్రథితం భారతం కులం.
వసూనాం పునరుత్పత్తి ర్భాగీరథ్యా మహాత్మనాం
శాంతనోర్వేశ్మని పునస్తేషాం చారోహణం దివి.

శృంగారయజ్ఞ ఫలంగా భరతుని జననండున్నాయి. ఈ దేశానికి భరతదేశం అనీ ఈ వంశీయులకు భరత వంశీయులనీ పేరురావటానికి కారణం ఈ భరతుని మహోజ్జ్వల జీవితమే.

శంతనునివల్ల గంగాగర్భమునుండి వసువులు పుట్టుట వారు స్వర్గారోహణం చేయుట భీష్ముని జననం బ్రహ్మచర్యవ్రతం చిత్రాంగదుని దక్షణ అనంతరం విచిత్రవీర్యుడికి రాజ్యం ప్రాప్తింప జేయుట అణీమాండవ్యశాప కారణంగా ధర్మదేవ తాంశతో విదురుడు జన్మించుట కృష్ణద్వైపాయ నుని అనుగ్రహంవల్ల ధృతరాష్ట్ర పాండురాజుల జననం పాండవాదుల పుట్టుట పాండవుల వారణా వతయాత్ర దుర్యోధనుని కుటిలబుద్ధి విదురుడు యుధిష్ఠిరుని హితవుకోరి మ్లేచ్ఛభాషలో విషయము లను వివరించుట కూటనీతిజ్ఞుడైన పురోచనుడు దుర్యోధనశాసనానుసారం పాండవులవద్దకు వెళ్ళుట విదురోపదేశానుసారం సొరంగం త్రవ్వి పాండ వులు వెడలుట లాక్షాగృహంలో పోయిన స్త్రీ తన అయిదుగురు పుత్రులతో దగ్ధమగుట పురోచను డందే భస్మమగుట హిడింబదర్శనం హిడింబుని వధ ఘటోత్కచుని జన్మవృత్తాంతం ద్రౌపదీధృష్టద్యు మ్నుల జననం ద్రౌపదీస్వయంవరవార్త విని పాండ వులు పాంచాలదేశంలో ప్రవేశించటం గంగాతీరం లో అంగారపర్ణుని అర్జునుడు జయించి వానివలన తపతి వసిష్ఠ ఔర్వుల ఉత్తమ గాథలను వినుట — ఆదిగా గలవి ఈ పర్వంలో వర్ణింపబడ్డాయి.

నానాదేశాధీశులు పరివేష్టించి ఉన్న స్వయంవరోత్సవ మహాసభలో అర్జునుడు మత్స్య యంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని వివాహమాడడం అదే సమయంలో ఎదురు తిరిగిన చక్రవర్తుల్ని భీమార్జునులు ఓడించడం. వారి పరాక్రమంచూచి బ్రాహ్మణవేషంలో ఉన్న పాండవులే వీరని బల రాముడు కృష్ణుడు వెంబడించి పాండవులు వసి స్తూన్న కుమ్మరివాని యింటికి వెళ్ళడం అనంతరం పాండవులైదుగురూ ద్రౌపదిని వివాహమాడినట్లు విని విచారించడం పంచేంద్రోపాఖ్యానంలో ద్రౌపదీ వివాహం వర్ణింపబడడం ధృతరాష్ట్రుడు పాండవుల వద్దకు విదురుని పంపడం విదురుడు శ్రీకృష్ణుని దర్శించడం ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్య మీయడం ఇంద్రప్రస్థంలో ఉన్న పాండవులు నార దుని ఆదేశానుసారం ద్రౌపదిని ఒక్కొక్క సంవ త్సరం ఒక్కొక్కరి అధీనంలో ఉండేటట్లు నిర్ణ యించుకోవడం ఈ సమయంలో సుందోప సుందో పాఖ్యానం చెప్పడం ద్రౌపది ధర్మరాజుతో ఉండగా అర్జునుడు విప్ర సంరక్షణార్థం ఆయుధంకోసం ఆ మందిరంలోకి వచ్చి నియమభంగ కారణంగా తీర్థ యాత్రకు బయలుదేరి ఉలూపిని పొందడం తీర్థ యాత్రలో చిత్రాంగదవలన బభ్రువాహనుడు జన్మిం చుట అయిదుగురు అప్సరసలకు మకరరూపంనుండి శాపవిమోచనం జరగటం ప్రభాసతీర్థంలో కృష్ణా ర్జునుల సమాగమం ద్వారకలో కృష్ణార్జునులు ఒకరి యందొకరు బద్ధానురాగులవడం కృష్ణుని అను మతితో అర్జునుడు సుభద్రను తీసికొని ధర్మరా జాదులను కలియుట అభిమన్యుని జననం ద్రౌపది యందు ఉపపాండవుల జననం యమునాతీరంలో విహరించే కృష్ణార్జునులకు చక్రమూ, ధనుస్సూ లభిం చడం ఖాండవదహనం మయవిమోచనం అగ్నినుండి సర్పములకు మోక్షం వర్ణింపబడ్డాయి.

శార్ఙ్గపక్షి గర్భము నుండి మందపాల ఋషి పుత్రులను కనుట అను ఆఖ్యానముతో ఈ ఆది

తేజోఽంశానాంచసంపాతో భీష్మస్యాప్యత్ర సంభవః
రాజ్యాన్నివర్తనం తస్య బ్రహ్మచర్య వ్రతే స్థితిః.
ప్రతిజ్ఞా పాలనం చైవ రక్షా చిత్రాంగదస్య చ
హతే చిత్రాంగదే చైవ రక్షా భ్రాతుర్యవీయసః.
విచిత్రవీర్యస్య తథా రాజ్యే సంప్రతిపాదనం
ధర్మస్య నృషు సంభూతిరణీమాండవ్య శాపజా.
కృష్ణద్వైపాయనా చ్చైవ ప్రసూతి ర్వరదానజా
ధృతరాష్ట్రస్య పాండోశ్చ పాండవానాంచ సంభవః.
వారణావత యాత్రాయాం మంత్రో దుర్యోధనస్యచ
కూటస్య ధార్తరాష్ట్రేణ ప్రేషణం పాండవాన్ప్రతి.
హితోపదేశశ్చ పథి ధర్మరాజస్య ధీమతః
విదురేణ కృతో యత్రహితార్థం మ్లేచ్ఛభాషయా.
విదురస్యచ వాక్యేన సురంగోపక్రమ క్రియా
నిషాద్యాః పంచపుత్రాయాః సుప్తాయా జతువేశ్మని.
పురోచనస్య చాత్రైవ దహనం సంప్రకీర్తితం
పాండవానాం వనే ఘోరే హిడింబాయాశ్చ దర్శనం.
తత్రైవచ హిడింబస్య వధో భీమా న్మహాబలాత్
ఘటోత్కచస్య చోత్పత్తి రత్రైవ పరికీర్తితా.
మహర్షే ర్దర్శనం చైవ వ్యాసస్యామిత తేజసః
తదాజ్ఞ యైకచక్రాయాం బ్రాహ్మణస్య నివేశనే
అజ్ఞాత చర్యయావాసో యత్ర తేషాం ప్రకీర్తితః
బకస్య నిధనం చైవ నాగరాణాం చ విస్మయః.
సంభవశ్చైవ కృష్ణాయా ధృష్టద్యుమ్నస్య చైవహ
బ్రాహ్మణాత్సముపశ్రుత్య వ్యాసవాక్య ప్రచోదితాః.
ద్రౌపదీం ప్రార్థయంతస్తే స్వయంవర దిదృక్షయా
పంచాలానభితో జగ్ముర్యత్ర కౌతూహలాన్వితాః.
అంగారపర్ణం నిర్జిత్య గంగాకూలేఽర్జునస్తదా
సఖ్యం కృత్వా తతస్తేన తస్మాదేవ చ శుశ్రువే.
తాపత్యమథ వాసిష్ఠ మౌర్వం చాఖ్యానముత్తమం
భ్రాతృభి స్సహిత స్సర్వైః పంచాలానభితో యయౌ.

పాంచాలనగరే చాపి లక్ష్యం భిత్త్వా ధనంజయః
ద్రౌపదీం లబ్ధవానత్ర మధ్యే సర్వమహీక్షితాం.
భీమసేనార్జునౌ యత్ర సంరబ్ధాన్ పృథివీపతీన్
శల్యకర్ణౌచ తరసా జితవంతౌ మహామృధే.
దృష్ట్వా తయోశ్చ తద్వీర్యమప్రమేయమమానుషం
శంకమానౌ పాండవాంస్తౌ రామకృష్ణౌ మహామతీ.
జగ్మతుస్తైః సమాగంతుం శాలాం భార్గవవేశ్మని.
పంచానా మేకపత్నీత్వే విమర్శో ద్రుపదస్య చ.
పంచేంద్రాణాముపాఖ్యానమత్రైవాద్భుత ముచ్యతే
ద్రౌపద్యా దేవవిహితో వివాహశ్చాప్యమానుషః
క్షత్తుశ్చ ధృతరాష్ట్రేన ప్రేషణం పాండవాన్ప్రతి
విదురస్య చ సంప్రాప్తి ర్దర్శనం కేశవస్య చ.
ఖాండవప్రస్థవాసశ్చ తథా రాజ్యార్ధ సర్జనం
నారదస్యాజ్ఞ యాచైవ ద్రౌపద్యాః సమయక్రియా
సుందోపసుందయో స్తద్వదాఖ్యానం పరికీర్తితం
అనంతరం చ ద్రౌపద్యా సహాసీనం యుధిష్ఠిరం.
అనుప్రవిశ్య విప్రార్థే ఫాల్గునో గృహ్యచాయుధం
మోక్షయిత్వాగృహంగత్వావిప్రార్థం కృతనిశ్చయః.
సమయం పాలయన్వీరో వనం యత్ర జగామహ
పార్థస్య వనవాసే చ ఉలూప్యా పథిసంగమః.
పుణ్యతీర్థానుసంయానం బభ్రువాహన జన్మచ
తత్రైవమోక్షయామాస పంచసోఽప్సరసశ్శుభాః.
శాపాద్గ్రాహత్వమాపన్నా బ్రాహ్మణస్య తపస్వినః
ప్రభాసతీర్థే పార్థేన కృష్ణస్య చ సమాగమః.
ద్వారకాయాం సుభద్రాచ కామయానేన కామినీ
వాసుదేవ స్యానుమతే ప్రాప్తా చైవ కిరీటినా.
గృహీత్వా హరణం ప్రాప్తే కృష్ణే దేవకీనందనే
అభిమన్యోః సుభద్రాయాం జన్మచోత్తమ తేజసః
ద్రౌపద్యాస్తనయానాంచ సంభవోఽను ప్రకీర్తితః
విహారార్థంచ గతయోః కృష్ణయోర్యమునా మను.

పర్వము సమాప్తము. రెండువందల ఇరవై రెండు అధ్యాయాలతో ఎనిమిదివేల ఎనిమిదివందల ఎనభై నాలుగు శ్లోకాలతో అలరారే దీనిని తేజశ్శాలియైన వేదవ్యాస మహర్షి రసబంధురంగా రచించాడు.

రెండవది సభాపర్వం. సభానిర్మాణం కింకర నామకులైన రాక్షసదర్శనం నారదుడు లోకపాలుర సభలను వర్ణించటం రాజసూయారంభం జరాసంధవధ గిరివ్రజంలో బంధించిన మహారాజుల్ని శ్రీకృష్ణుడు విడిపించడం పాండవుల దిగ్విజయం మహారాజులందరూ కానుకలతో రాజసూయానికి రావటం పూజార్హుని విషయంలో మీమాంస శిశుపాలవధ దుర్యోధనుని విచారక్రోధాలు మయసభా సందర్శనంలో భీముడు అపహసించగా దుర్యోధనుడు క్రోధోద్రిక్తుడై ప్రతీకారంగా మాయాద్యూతం సాగించడం అందులో శకుని ధర్మరాజును ఓడించడం మహాదుఃఖంలో ఉన్న ద్రౌపదిని ధృతరాష్ట్రుడు ఓదార్చడం దుర్యోధనుడు మళ్ళీ జూదానికి ఆహ్వానించడం శకుని మాయాజాలంతో ద్రౌపదీ సమేతులై పాండవులు అరణ్యవాసం చేయవలసి రావడం ఈ సభాపర్వంలో వర్ణింపబడ్డాయి. డెబ్భై ఎనిమిది అధ్యాయాలతో రెండువేల అయిదువందల శ్లోకాలతో నిండి ఉన్నదిది. అనంతరం అరణ్య పర్వం. ధర్మరాజాదులు అరణ్యానికి పోతుంటే నగర ప్రజలు ధర్మరాజును అనుసరించడం తనతో వచ్చే విప్రవరులను పోషించడానికి అన్నౌషధులను ప్రసాదించుమని సూర్యుని ఆరాధించడంతో ఈ పర్వం ప్రారంభమవుతోంది.

ధృతరాష్ట్రునికి మైత్రేయుడు నీతిమార్గం చెప్పటం దుర్యోధనుని శపించటం భీమసేనుడు కిర్మీరుని సంహారించటం పాండవులను చూడటానికి యాదవపాంచాలురు రావటం శకుని మాయా ద్యూతంలో ధర్మజుని వంచించినవార్త విని కృష్ణుడు క్రోధోద్రిక్తుడు కాగా అర్జునుడు శాంతింపజేయటం ద్రౌపది పరాభవాన్ని చెప్పుకొని దుఃఖించగా కృష్ణుడు ఓదార్చి సుభద్రాభిమన్యులను ద్వారకకు తీసికెళ్ళడం ఉపపాండవులను ధృష్టద్యుమ్నుడు వెంటతీసికొనిపోగా పాండవులు ద్వైతవనానికి పరిక్రమించటం ద్రౌపదీధర్మరాజ సంవాదం ధర్మజ భీమసేన సంవాదం ద్వైతవనంలో వేదవ్యాసుడు ధర్మరాజునకు ప్రతిస్మృతి మంత్రవిద్యను ఉపదేశించటం పాండవుల కామ్యకవనప్రవేశం అర్జునుడు దివ్యాస్త్రాలకోసం వెళ్ళటం కిరాతవేషంలో ఉన్న పరమశివుని మెప్పించి పాశుపతాస్త్రం పొంది లోకపాలురను దర్శించి అర్జునుడు ఇంద్రలోకానికి వెళ్ళినవార్త విని ధృతరాష్ట్రుడు విచారించటం బృహదశ్వుని దర్శనంచేసి ధర్మజుడు తనగాథ వివరించటం నలోపాఖ్యానం ధర్మసంబద్ధమైన నలదమయంతుల గాథను చెప్పే బృహదశ్వుడు అక్షహృదయాన్ని కూడా వివరించాడు. రోమశమహర్షి పాండవుల వద్దకు వచ్చుట దివ్యాస్త్రాలతో స్వర్గంనుండి తిరిగి వచ్చిన అర్జునుని అభిమతానుసారం పాండవులు తీర్థయాత్ర సాగిస్తూ నారదాదేశానుసారం పులస్త్య తీర్థయాత్ర చేయటం ఇంద్రుడు కర్ణుని కవచకుండలాలు యాచించటం గయుని యజ్ఞం అగస్త్యుడు వాతాపిని భక్షించటం అగస్త్యుడు సంతానేచ్ఛతో లోపాముద్రను భార్యగా అంగీకరించడం ఋశ్యశృంగ పరశురాముల చరిత్రలూ ఈ పర్వంలోనే అభివర్ణింపబడ్డాయి.

కార్తవీర్యార్జునాదుల సంహారం యాదవులు ప్రభాసతీర్థంలో పాండవులతో కలియడం

సంప్రాప్తి శ్చక్రధనుషోః ఖాండవస్యచ దాహనం
మయస్య మోక్షో జ్వలనాద్భుజంగస్యచ మోక్షణం.
మహర్షే ర్మందపాలస్య శార్ఙ్గ్యాం తనయసంభవః
ఇత్యేతదాది పర్వోక్తం ప్రథమం బహువిస్తరం.
అధ్యాయానాం శతేద్వేతు సంఖ్యాతే పరమర్షిణా
సప్తవింశతి రధ్యాయా వ్యాసే నోత్తమ తేజసా.
అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోక శతానిచ
శ్లోకాశ్చ చతురాశీతిర్ముని నోక్తా మహాత్మనా.
ద్వితీయంతు సభాపర్వ బహువృత్తాంత ముచ్యతే
సభాక్రియా పాండవానాం కింకరాణాం చ దర్శనం.
లోకపాల సభాఖ్యానం నారదాద్దేవ దర్శినః
రాజసూయస్య చారంభో జరాసంధవధ స్తథా.
గిరివ్రజే నిరుద్ధానాం రాజ్ఞాం కృష్ణేన మోక్షణం
తథా దిగ్విజయోఽత్రైవ పాండవానాం ప్రకీర్తితః.
రాజ్ఞా మాగమనం చైవ సార్హణానాం మహాక్రతౌ
రాజసూయేఽర్ఘ సంవాదే శిశుపాల వధ స్తథా.
యజ్ఞేవిభూతిం తాం దృష్ట్వా దుఃఖామర్షానివతస్యచ
దుర్యోధనస్యా వహాసో భీమేన చ సభాతలే.
యత్రాస్యమన్యురుద్భూతోయేనద్యూతమకారయత్
యత్ర ధర్మసుతం ద్యూతే శకునిః కితవోఽజయత్.
యత్రద్యూతార్ణవేమగ్నాంద్రౌపదీంనౌరివార్ణవాత్
ధృతరాష్ట్రో మహాప్రాజ్ఞః స్నుషాం పరమదుఃఖితాం
తారయామాసతాం స్తీర్ణాంజ్ఞాత్వాదుర్యోధనోనృపః
పునరేవ తతోద్యూతే సమాహ్వాయత పాండవాన్
జిత్వా సవనవాసాయ ప్రేషయామాసతాం స్తతః
ఏతత్సర్వం సభాపర్వసమాఖ్యాతం మహాత్మనా,
అధ్యాయాః సప్తర్జ్ఞేయా స్తథాచాష్టౌ ప్రసంఖ్యయా
శ్లోకానాం ద్వేసహస్రేతు పంచశ్లోక శతానిచ.
శ్లోకాశ్చైకాదశజ్ఞేయాఃపర్వణ్యస్మిన్ద్విజోత్తమాః
అతః పరం తృతీయం తుజ్ఞేయ మారణ్యకం మహత్

వనవాసం ప్రయాతేషు పాండవేషు మహాత్మసు
పౌరానుగమనం చైవ ధర్మపుత్రస్య ధీమతః.
అన్నౌషధీనాం చ కృతే పాండవేన మహాత్మనా
ద్విజానాం భరణార్థం చ కృతమారాధనం రవేః.
ధౌమ్యోపదేశాత్తిగ్మాంశు ప్రసాదా దన్నసంభవః
హితంచ బ్రువతఃక్షత్తుఃపరిత్యాగోఽంబికాసుతాత్.
త్యక్తస్య పాండుపుత్రాణాం సమాపగమనం తథా
పునరాగమనం చైవ ధృతరాష్ట్రస్య శాసనాత్.
కర్ణప్రోత్సాహనాచ్చైవ ధార్తరాష్ట్రస్య దుర్మతేః
వనస్థాన్పాండవాన్ హంతుం మంత్రోదుర్యోధనస్యచ
తం దుష్టభావం విజ్ఞాయ వ్యాసస్యాగమనం ధృతం
నిర్యాణప్రతిషేధశ్చ సురభ్యాఖ్యాన మేవచ.
మైత్రేయాగమనం చాత్ర రాజ్ఞశ్చైవానుశాసనం
శాపోత్సర్గశ్చ తేనైవ రాజ్ఞో దుర్యోధనస్యచ.
కిర్మీర స్వవధశ్చాత్ర భీమసేనేన సంయుగే
వృష్ణీనామాగమశ్చాత్ర పంచాలానాంచ సర్వశః.
శ్రుత్వాశకునినాద్యూతే నికృత్యానిర్జితాంశ్చతాన్
క్రుద్ధస్యాను ప్రశమనం హరేశ్చైవ కిరీటినా.
పరిదేవనం చ పాంచాల్యా వాసుదేవస్య సంనిధౌ
ఆశ్వాసనం చ కృష్ణేన దుఃఖార్తాయాః ప్రకీర్తితం.
తథా సౌభవధాఖ్యాన మత్రైవోక్తం మహర్షిణా
సుభద్రాయాఃసుపుత్రాయాఃకృష్ణేనద్వారకాంపురీం
నయనం ద్రౌపదేయానాం ధృష్టద్యుమ్నేనచైవహ
ప్రవేశః పాండవేయానాం రమ్యే ద్వైతవనే తతః.
ధర్మరాజస్య చాత్రైవ సంవాదః కృష్ణయా సహ
సంవాదశ్చ తథా రాజ్ఞా భీమస్యాపి ప్రకీర్తితః.
సమీపం పాండుపుత్రాణాం వ్యాసస్యాగమనం తథా
ప్రతిస్మృత్యాథ విద్యాయాదానంరాజ్ఞో మహర్షిణా
గమనం కామ్యకే చాపి వ్యాసే ప్రతిగతే తతః
అస్త్రహేతోర్వివాసశ్చ పార్థస్యామిత తేజసః.

సుకన్య చరిత్ర అశ్వినీదేవతలకు సోమపానార్హత మాంధాత చరిత్ర జంతూపాఖ్యానం బహుపుత్ర ప్రాప్తికై సోమకుడు యాగంచేయటం శ్యేన కపోతోపాఖ్యానం అష్టావక్ర చరిత్ర యవక్రీతరైభ్యోపాఖ్యానం పాండవుల గంధమాదనయాత్ర నారాయణాశ్రమవర్ణన జటాసురసంహారం ఋషపర్వ ఆర్ష్టిసేనాదుల ఆశ్రమాలలో కాలం గడపటం భీముడు కైలాసశిఖరాధిరోహణవేళ మణిమంత్రాది యక్షులతో సంగ్రామం సాగించటం పాండవ కుబేరసమాగమనం నివాతకవచాది రాక్షస సంహారం అర్జునుడు ధర్మరాజువద్ద తన దివ్యాస్త్రాలను ప్రదర్శించబోగా నారదుడు వారించడం గంధమాదనంనుండి నిష్క్రమణం కొండచిలువ భీముని చుట్టుకోవడం ధర్మజ-అజగర సంవాదం కామ్యక వనానికి తిరిగివచ్చిన పాండవులను శ్రీకృష్ణుడు చూడటానికి రావడంకూడా ఈ పర్వంలోనే వర్ణించబడ్డాయి.

మార్కండేయాగమనం పృథుమహారాజచరిత్ర సరస్వతీ తార్క్ష్యసంవాదం మత్స్యోపాఖ్యానం ఇంద్రద్యుమ్నచరిత్ర దుందుమార కథ అంగిరసోపాఖ్యానం ద్రౌపదీ - సత్యభామా సంవాదం పాండవుల ద్వైతవనప్రవేశం ఘోషయాత్ర గంధర్వులచే బంధింపబడిన దుర్యోధనుని అర్జునుడు విడిపించడం. ధర్మజుడు స్వప్నంలో లేడిని చూడడం కామ్యకవనానికి రావడం. వ్రీహిద్రౌణ్యుపాఖ్యానం దుర్వాసోపాఖ్యానం జయద్రథపరాభవం రావణ సంహారాత్మకమైన రామకథ సావిత్రిచరిత్ర కర్ణుని దానశీలాన్ని అభినందిస్తూ ఇంద్రుడు ఏకవీరఘ్ని అనే శక్త్యస్త్రాన్నివ్వటం యముడు ధర్మజుడికి ఆరణేయోపాఖ్యానంతో ధర్మం ఉపదేశించడం పాండవులు వరాలుపొంది పశ్చిమదిశగా సాగటం అనే ఘట్టాలతో నిండిన ఈ అరణ్యపర్వంలో రెండు వందల అరవై తొమ్మిది అధ్యాయాలూ పదకొండు వేల ఆరువందల అరవై నాలుగు శ్లోకాలూ ఉన్నాయి. ఇది అరణ్య పర్వానికి సంక్షిప్త విషయ సూచిక.

ఆది సభా అరణ్య పర్వాలలోని విషయాన్ని వివరించిన సూతుడు విరాటపర్వంలోని విశేషాలను విశ్లేషించే సంకల్పంతో సాగుతున్నాడు.

అరణ్యవాసం పూర్తిచేసిన పాండవులు అజ్ఞాతవాస దీక్షకోసం శమీవృక్షం మీద ఆయుధాలుదాచుకుని ప్రచ్ఛన్న వేషాలతో విరటనగర ప్రవేశంచేసి కాలం గడుపుతూండడం కీచకుడు ద్రౌపదిని బలాత్కరించబోయి భీముని చేతుల్లో మరణించడం దుర్యోధనుని గూఢచారులు పాండవులను గుర్తించలేక తిరిగి రావటం త్రిగర్తాధీశుడు సుశర్మ విరటుని గోవులనుహరించగా భీముడుపోయి వానిని జయించి గోవులను కొనితేవడం కౌరవులు అదేసమయంలో ఉత్తరదిశలో గోవులను గ్రహించబోగా అర్జునుడు తన పరాక్రమంతో వారిని పరాజితుల్ని చేసి, గోవులను మరల్చుట విరాటుడు పాండవుల్ని గుర్తించి ఉత్తరను అభిమన్యుని కిచ్చి వివాహంచేయటంతో విరాటపర్వం పరిసమాప్తమవుతుంది. ఈ పర్వం అరవైయేడు అధ్యాయాలతో రెండువేల ఏభై శ్లోకాలతో అలరారేటట్లు వేదవ్యాసుడు విరచించాడు.

విరాటనగరాన్ని వీడి ఉపప్లావ్యంలో ప్రవేశించిన అనంతరం శ్రీకృష్ణునివద్దకు అర్జునుడు వెళ్ళడం అదేసమయానికి దుర్యోధనుడు రావడం ఉభయులూ వాసుదేవుని సాహాయ్యాన్నికోరి అక్షౌహిణీయుతమైన సైన్యాన్ని సలహాలుమాత్రమే

మహాదేవేన యుద్ధం చ కిరాతవపుషా సహ
దర్శనం లోకపాలానామస్త్రప్రాప్తిస్తథైవ చ.
మహేన్ద్రలోకగమనమస్త్రార్థే చ కిరీటినః
యత్ర చిన్తా సముత్పన్నా ధృతరాష్ట్రస్య భూయసీ.
దర్శనం బృహదశ్వస్య మహర్షేర్భావితాత్మనః
యుధిష్ఠిరస్య చార్తస్య వ్యసనే పరిదేవనం.
నలోపాఖ్యానమత్రైవ ధర్మిష్ఠం కరుణోదయం
దమయన్త్యాః స్థితిర్యత్ర నలస్య చరితం తథా.
తథాక్షహృదయప్రాప్తిస్తస్మాదేవ మహర్షితః
లోమశస్యాగమస్తత్ర స్వర్గాత్ పాండుసుతాన్ ప్రతి.
వనవాసగతానాం చ పాండవానాం మహాత్మనాం
స్వర్గే ప్రవృత్తిరాఖ్యాతా లోమశేనార్జునస్య వై.
సందేశాదర్జునస్యాత్ర తీర్థాభిగమనక్రియా
తీర్థానాం చ ఫలప్రాప్తిః పుణ్యత్వం చాపి కీర్తితం.
పులస్త్యతీర్థయాత్రా చ నారదేన మహర్షిణా
తీర్థయాత్రా చ తత్రైవ పాండవానాం మహాత్మనాం
కర్ణస్య పరిమోక్షోఽత్ర కుండలాభ్యాం పురందరాత్
తథా యజ్ఞవిభూతిశ్చ గయస్యాత్ర ప్రకీర్తితా.
ఆగస్త్యమపి చాఖ్యానం యత్ర వాతాపిభక్షణం
లోపాముద్రాభిగమనమపత్యార్థమృషేస్తథా.
ఋష్యశృంగస్య చరితం కౌమారబ్రహ్మచారిణః
జామదగ్న్యస్య రామస్య చరితం భూరితేజసః.
కార్తవీర్యవధో యత్ర హైహయానాం చ వర్ణ్యతే
ప్రభాసతీర్థే పాండూనాం వృష్ణిభిశ్చ సమాగమః.
సౌకన్యమపి చాఖ్యానం చ్యవనో యత్ర భార్గవః
శర్యాతియజ్ఞే నాసత్యౌ కృతవాన్ సోమపీథినౌ.
తాభ్యాం చ యత్ర స మునిర్యౌవనం ప్రతిపాదితః
మాన్ధాతుశ్చాప్యుపాఖ్యానం రాజ్ఞోఽత్రైవ ప్రకీర్తితం.
జన్తూపాఖ్యానమత్రైవ యత్ర పుత్రేణ సోమకః
పుత్రార్థమయజద్రాజా లేభే పుత్రశతం చ సః.

తతః శ్యేనకపోతీయముపాఖ్యానమనుత్తమం
ఇంద్రాగ్నీ యత్ర ధర్మస్య జిజ్ఞాసార్థం శిబిం నృపం.
అష్టావక్రీయమత్రైవ వివాదో యత్ర బందినా
అష్టావక్రస్య విప్రర్షేర్జనకస్యాధ్వరేఽభవత్.
నైయాయికానాం ముఖ్యేన వరుణస్యాత్మజేన చ
పరాజితో యత్ర బన్దీ వివాదేన మహాత్మనా.
విజిత్య సాగరం ప్రాప్తం పితరం లబ్ధవానృషిః
యవక్రీతస్య చాఖ్యానం రైభ్యస్య చ మహాత్మనః.
గంధమాదనయాత్రా చ వాసో నారాయణాశ్రమే
నియుక్తో భీమసేనశ్చ ద్రౌపద్యా గంధమాదనే.
వ్రజన్ పథి మహాబాహుర్దృష్టవాన్ పవనాత్మజమ్
కదలీషండమధ్యస్థం హనూమన్తం మహాబలం.
యత్ర సౌగంధికార్థేఽసౌ నలినీం తామధర్షయత్
యత్రాస్య యుద్ధమభవత్ సుమహద్రాక్షసైః సహ.
యక్షైశ్చైవ మహావీర్యైర్మణిమత్ప్రముఖైస్తథా
జటాసురస్య చ వధో రాక్షసస్య వృకోదరాత్.
వృషపర్వణశ్చ రాజర్షేస్తతోఽభిగమనం స్మృతం
ఆర్ష్టిషేణాశ్రమే చైషాం గమనం వాస ఏవ చ.
ప్రోత్సాహనం చ పాంచాల్యా భీమస్యాత్ర మహాత్మనః
కైలాసారోహణం ప్రోక్తం యత్ర యక్షైర్బలోత్కటైః.
యుద్ధమాసీన్మహాఘోరం మణిమత్ప్రముఖైః సహ
సమాగమశ్చ పాండూనాం యత్ర వైశ్రవణేన చ.
సమాగమశ్చార్జునస్య తత్రైవ భ్రాతృభిః సహ
అవాప్య దివ్యాన్యస్త్రాణి గుర్వర్థం సవ్యసాచినా.
నివాతకవచైర్యుద్ధం హిరణ్యపురవాసిభిః
నివాతకవచైర్ఘోరైర్దానవైః సురశత్రుభిః.
పౌలోమైః కాలకేయైశ్చ యత్ర యుద్ధం కిరీటినః
వధశ్చైషాం సమాఖ్యాతో రాజ్ఞస్తేనైవ ధీమతా.
అస్త్రసందర్శనారంభో ధర్మరాజస్య సన్నిధౌ
పార్థస్య ప్రతిషేధశ్చ నారదేన సురర్షిణా.

ఇవ్వడానికి అంగీకరించిన కృష్ణునీ దుర్యోధనార్జునులు క్రమానుసారం స్వీకరించడం పాండవులకు సాయం చేసే సంకల్పంతో చతురంగబలాలతో వచ్చే శల్యునికి సమస్తపరిచారాలు సాగించి దుర్యోధనుడు తన పక్షానికి తిప్పుకోవడం అయినా శల్యుడు ధర్మరాజాదులకు ఇంద్రవిజయం వినిపించి ధైర్యం చెప్పడం పాండవులు కౌరవులదగ్గరకు విప్రుని రాయబారిగా పంపడం ధృతరాష్ట్రుని ఆధ్యాత్మికోపన్యాసం సంజయుడు కృష్ణార్జునుల సౌహార్ద్రాన్ని ధృతరాష్ట్రునికి నివేదించడం సంజయుడు రాయబారిగా వచ్చి వెళ్ళాక సంధి సాగించే సత్సంకల్పంతో వాసుదేవుడు హస్తినాపురం ప్రవేశించడం లోకకళ్యాణదాయకమైన శాంతిసంస్థాపనార్థం శ్రీకృష్ణుడు దుర్యోధనునికి సంధివాక్యాలు చెప్పటం దుర్యోధనుని తిరస్కారం దంభోద్భవోపాఖ్యానం మాతలి ఉపాఖ్యానం గరుడగర్వభంగం గాలవోపాఖ్యానం దుర్యోధనాదులు వాసుదేవుని బంధింప యత్నింపగా విశ్వరూపం ప్రదర్శించడం కుంతీదేవి విదులోపాఖ్యానం ఏకాంతంలో కర్ణుడూ కృష్ణుడూ సంభాషించడం కృష్ణుడు ఉపప్లావ్యానికి తిరిగిరావడం పాండవులు సమాలోచనం సాగించి సమరసన్నాహం చేయటం చతురంగబలాలతో పాండవుల సమరయాత్ర యుద్ధసంరంభంలోఉండగా ఉలూకుని రాయబారం మహారథిక నిర్ణయం అంబోపాఖ్యానం ఈ పర్వంలో వర్ణించబడ్డాయి.

వాసుదేవుని సంధిసందేశము ఉలూకుని విగ్రహసందేశము ఈ రెండూ రాజ్యాంగతంత్రోక్తాలైన చతురుపాయాలతో సమగ్రంగా విపులీకరింపబడ్డాయి ఆరువేల ఆరువందల తొంభై యెనిమిది శ్లోకాలతో నూటయెనభై య్యారు అధ్యాయాలతో నిండినది ఉద్యోగపర్వము.

ఉద్యోగపర్వానంతరం భీష్మపర్వం. ఈ పర్వంలో సంజయుడు ధృతరాష్ట్రునికి జంబూద్వీపాన్ని గురించి వివరించడం భీష్ముని సర్వసైన్యాధిపత్యంతో పదిరోజుల యుద్ధం సాగటం యుద్ధరంగంలో అర్జునునికి శ్రీకృష్ణభగవానుని గీతోపదేశం భయంకరసంగ్రామంలో వాసుదేవుడు రథం దిగి భీష్ముని పైకి లంఘించటం అర్జునుని ఉద్రేకింపజేసి శిఖండిని ముందుంచి భీష్ముని గాయపరచడం శస్త్రసన్యాసం చేసిన భీష్ముడు శరతల్పగతుడు కావటం వర్ణింపబడ్డాయి. ఈ పర్వంలో అయిదువేల ఎనిమిదివందల ఎనభై నాలుగుశ్లోకాలు నూటపదిహేను అధ్యాయాలలో వర్ణింపబడ్డాయి.

అనంతరం ద్రోణపర్వం-

ధనుర్వేదాచార్యుడైన ద్రోణునికి సర్వసైన్యాధిపత్యాన్నియటం సర్వశస్త్రాస్త్రవిదుడైన ద్రోణుడు దుర్యోధనుని ప్రీతికై ధర్మరాజునిబంధించి తెస్తాననటం సంశప్తకులతో అర్జునుడు సుదూరాన యుద్ధం సాగించడం ఐరావతవంశంలో ఉత్పన్నమైన సుప్రతీకగజాన్ని అధిరోహించిన భగదత్తుడు అర్జునుని చేతిలో నిహతుడు కావటం బాలుడైన అభిమన్యుని సైంధవాదులందరూ కూడి సంహరించడం అర్జునుడు సైంధవసంహారార్థం కురుసేనామధ్యంలో ప్రవేశించగా ధర్మరాజుని ఆజ్ఞానుసారం సాత్యకీ భీమసేనులు మహాసేనావ్యూహంలో ప్రవేశించడం మహావీరులయిన తొమ్మిదికోట్ల సంశప్తకులనూ అర్జునుడు సంహరించడం ధృతరాష్ట్రపుత్రులూ మ్లేచ్ఛులూ నారాయణగోపాలురూ ఆదిగాగల వారేకాక అలంబుసశ్రుతాయు జలసంధ భూరిశ్రవ విరాట ద్రుపద ఘటోత్కచ ప్రముఖవీరులందరూ

అవరోహణంపునశ్చైవపాండూనాంగంధమాదనాత్
భీమస్య గ్రహణం చాత్ర పర్వతాభోగవర్ష్మణా.
భుజగేన్ద్రేణ బలినా తస్మిన్ సుగహనే వనే
అమోక్షయద్యత్రచైనం ప్రశ్నానుక్త్వాయుధిష్ఠిరః.
కామ్యకాగనం చైవ పునస్తేషాం మహాత్మనామ్
తత్రస్థాంశ్చపునర్ద్రష్టుం పాండవాన్పురుషర్షభాన్.
వాసుదేవస్యాగమన మత్రైవ పరికీర్తితమ్
మార్కండేయసమాస్యాయా ముపాఖ్యానానిసర్వశః
పృథోర్వైన్యస్య యత్రోక్తమాఖ్యానం పరమర్షిణా
సంవాదశ్చ సరస్వత్యాస్తార్క్ష్యర్షేః సుమహాత్మనః.
మత్స్యోపాఖ్యానమత్రైవ ప్రోచ్యతే తదనన్తరం
మార్కండేయ సమాస్యాచ పురాణం పరికీర్త్యతే
ఐన్ద్రద్యుమ్న ముపాఖ్యానం ధౌన్ధుమారం తథైవచ
పతివ్రతాయాశ్చాఖ్యానం తథైవాంగిరసం స్మృతం
ద్రౌపద్యాః కీర్తితశ్చాత్ర సంవాదః సత్యభామయా
పునర్ద్వైతవనం చైవ పాండవాః సముపాగతాః
ఘోషయాత్రాచగన్ధర్వైర్యత్రబద్ధః సుయోధనః
హ్రియమాణస్తుమన్దాత్మా మోక్షితోఽసౌకిరీటినా.
ధర్మరాజస్య చాత్రైవ మృగస్వప్న నిదర్శనం
కామ్యకే కాననశ్రేష్ఠే పునర్గమనముచ్యతే.
వ్రీహిద్రౌణికమాఖ్యాన మత్రైవ బహువిస్తరం.
దుర్వాససోఽప్యుపాఖ్యాన మత్రైవ పరికీర్తితమ్.
జయద్రథేనాపహారో ద్రౌపద్యాశ్చాశ్రమాన్తరాత్
యత్రైవమన్వయాద్భీమో వాయువేగ సమోజవే
చక్రేచైనం పంచశిఖం యత్ర భీమో మహాబలః
రామాయణముపాఖ్యాన మత్రైవ బహువిస్తరం.
యత్రరామేణ విక్రమ్య నిహతో రావణో యుధి
సావిత్ర్యాశ్చాప్యుపాఖ్యాన మత్రైవ పరికీర్తితం
కర్ణస్యపరిమోక్షోఽత్రకుండలాభ్యాం పురందరాత్
యత్రాస్య శక్తిం తుష్టోఽసావదాదేకవధాయ చ.

ఆరణేయముపాఖ్యానంయత్రధర్మోఽన్వశాత్ సుతం
జగ్ముర్లబ్ధవరా యత్ర పాండవాః పశ్చిమాం దిశం.
ఏతదారణ్యకం పర్వ తృతీయం పరికీర్తితం.
అత్రాధ్యాయశతే ద్వేతు సంఖ్యయా పరికీర్తితే.
ఏకోన సప్తతిశ్చైవ తథాధ్యాయాః ప్రకీర్తితాః
ఏకాదశ సహస్రాణి శ్లోకానాం షట్ శతాని చ.
చతుః షష్టిస్తథా శ్లోకాః పర్వణ్యస్మిన్ ప్రకీర్తితాః
అతః పరం నిబోధేదం వైరాటం పర్వవిస్తరం.
విరాటనగరే గత్వా శ్మశానే విపులాం శమీమ్
దృష్ట్వాసంనిదధుస్తత్ర పాండవాహ్యాయుధాన్యుత.
యత్ర ప్రవిశ్య నగరం ఛద్మనా న్యవసన్త తే
పాంచాలీం ప్రార్థయానస్యకామోపహతచేతసః.
దుష్టాత్మనో వధో యత్ర కీచకస్య వృకోదరాత్
పాండవాన్వేషణార్థం చ రాజ్ఞో దుర్యోధనస్య చ.
చారాః ప్రస్థాపితాశ్చాత్ర నిపుణాః సర్వతోదిశమ్
నచ ప్రవృత్తిస్తైర్లబ్ధాపాండవానాం మహాత్మనామ్.
గోగ్రహశ్చ విరాటస్య త్రిగర్తైః ప్రథమం కృతః
యత్రాస్యయుద్ధం సుమహత్తైరాసీల్లోమహర్షణం.
హ్రియమాణశ్చ యత్రాసౌ భీమసేనేన మోక్షితః
గోధనం చ విరాటస్య మోక్షితం యత్ర పాండవైః
అనన్తరం చ కురుభిస్తస్య గోగ్రహణం కృతమ్
సమస్తా యత్ర పార్థేన నిర్జితాః కురవో యుధి.
ప్రత్యాహృతం గోధనం చ విక్రమేణ కిరీటినా
విరాటేనోత్తరా దత్తాస్నుషా యత్ర కిరీటినః.
అభిమన్యుం సముద్దిశ్య సౌభద్ర మరిఘాతినమ్
చతుర్థమేతద్విపులం వైరాటం పర్వవర్ణితమ్.
అత్రాపి పరిసంఖ్యాతా అధ్యాయాః పరమర్షిణా
సప్తషష్టి రథో పూర్ణాఞ్ఛ్లోకానా మపిమే శృణు.
శ్లోకానాం ద్వేసహస్రేతుశ్లోకాః పంచాశదేవతు
ఉక్తాని వేదవిదుషా పర్వణ్యస్మిన్ మహర్షిణా.

ఈ పర్వంలోనే వర్ణించారు. పాండవులు ద్రోణాచార్యుని నిహతునిచేసిన వార్త విని అశ్వత్థామ నారాయణాస్త్రాన్ని ప్రయోగించటం— 

ఆగ్నేయాస్త్ర రుద్రమహాత్మ్యాలు వ్యాసుని ఆగమనం కృష్ణార్జునుల మహాత్మ్యం ఈ ద్రోణుని ఆధిపత్యంలోనే కురుపాండవ పక్షాలలో మహావీరులు మరణించటం జరిగింది. ఎనిమిదివేల తొమ్మిదివందల తొమ్మిది శ్లోకాలలో అలరారే ద్రోణపర్వంలో నూటడెబ్భై అధ్యాయాలున్నాయి.

మహామేధావియైన శల్యుని కర్ణునికి సారథిగా ప్రేరేపించడం త్రిపురాసుర కథావర్ణనం యుద్ధరంగానికి కదలబోయేముందు కర్ణశల్యుల మధ్య తీవ్రవివాదం కాకి హంసోపాఖ్యానం అశ్వత్థామ హస్తాలలో పాండ్యదేశాధీశుని మరణం దండసేన దండకుల వధ కర్ణయుధిష్ఠిరుల యుద్ధం ధర్మజుడు ప్రాణావశిష్టుడై తిరిగిపోవడం ధర్మజార్జునులు పరస్పరం నిందించుకుంటూండగా కృష్ణుడు అర్జుని శాంతింపజేయటం భీమసేనుడు కౌరవవీరులమధ్య దుస్ససేనుని రొమ్ముచీల్చి రక్తపానం చేయటం కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం పార్థుని చేతుల్లో కర్ణుడు ప్రాణాలు వీడడం అనే ప్రధానాంశాలు నాలుగువేల తొమ్మిదివందలఅరవై నాలుగు శ్లోకాలతో అరవై తొమ్మిది అధ్యాయాలతో కర్ణపర్వంలో ప్రతిపాదింపబడ్డాయి.

కురుసేనలో జెగాజెట్టీలు నిహతులై పోయాక శల్యుడు సర్వసైన్యాధిపత్యం వహించాడు. శల్యుని సేనానాయకత్వంలో సాగిన యుద్ధవిశేషాలను వర్ణించే శల్యపర్వంలో మూడువేల రెండువందల ఇరవై శ్లోకాలూ యాభై తొమ్మిది అధ్యాయాలూ ఉన్నాయి. కుమారస్వామిచరిత్ర శల్యునికి సైన్యాధిపత్యాభిషేకం రథికుల యుద్ధవర్ణన ధర్మజుడు శల్యుని మడియించుట సహదేవుడు శకునిని వధించుట సర్వసేనలూ నిహతమైన తరువాయి దుర్యోధనుని జలస్తంభనం ధర్మరాజు దుర్యోధనుని అవహేళన చేయటం దుర్యోధన భీమసేనుల గదాయుద్ధం బలరాముడు కురుక్షేత్రానికి రావడం సరస్వతీతీరస్థ తీర్థముల మాహాత్మ్యం గదాయుద్ధనియమాతిక్రమంగా భీముడు దుర్యోధనుని తొడలు విరగగొట్టడంతో ఈపర్వం పరిసమాప్తమవుతుంది.

సౌప్తిక పర్వం

దుర్యోధనుడు తొడలు విరిగి మహావ్యథ పడుతుండగా కృపాచార్య కృతవర్మ అశ్వత్థామలు చూడవచ్చుట రారాజు స్థితిని చూసి అశ్వత్థామ ఉద్రిక్తమనస్కుడై సర్వశత్రు సంహారం అయేవరకూ కవచం తీయనని ప్రతిజ్ఞ చేయటం. దుర్యోధనుని సముఖంలో ప్రతిజ్ఞ తీసికొని రథికత్రయం ప్రస్థానించి సూర్యాస్తమయ సమయానికి మహారణ్యంలో మర్రిచెట్టునీడను విశ్రమించి ఆ రాత్రివేళ నిద్రించే కాకులను ఆరగించే గుడ్లగూబను చూచి అశ్వత్థామ తన కర్తవ్యాన్ని నిర్ణయించుకోవటం పాండవశిబిరాన్ని చేరుతుండగా భీకరాకారుడైన రాక్షసుడు అడ్డగించి అశ్వత్థామ ప్రయోగించే శస్త్రాస్త్రాలను నిర్వీర్యం చేయడం ఆ భీకరరూపుడు పరమశివుడని గుర్తించి అశ్వత్థామ రుద్రుని స్తుతించి ప్రసన్నుని చేసికోవటం కృపాచార్య కృతవర్మల సహకారంతో ప్రతిపక్షశిబిరాలలో ప్రవేశించి ధృష్టద్యుమ్నాది పాంచాలవీరులతో ఉపపాండవులను కూడా సంహరించడం శ్రీకృష్ణుని అనుగ్రహవిశేషం చేత పాండవులతోపాటు సాత్యకి

ఉద్యోగపర్వవిజ్ఞేయం పంచమం శ్రుణ్వతః పరం
ఉపప్లవ్యే నివిష్టేషు పాండవేషు జిగీషయా.
దుర్యోధనోఽర్జునశ్చైవ వాసుదేవ ముపస్థితౌ
సాహాయ్యమస్మిన్ సమరే భవాన్ నౌ కర్తుమర్హతి.
ఇత్యుక్తే వచనే కృష్ణో యత్రోవాచ మహామతిః
అయుధ్యమానమాత్మానం మంత్రిణం పురుషర్షభౌ.
అక్షౌహిణీం వా సైన్యస్య కస్య కిం వా దదామ్యహం
వవ్రే దుర్యోధనః సైన్యం మందాత్మా యత్ర దుర్మతిః
అయుధ్యమానం సచివం వవ్రే కృష్ణం ధనంజయః
మద్రరాజంచ రాజానమాయాంతం పాండవాన్ ప్రతి.
ఉపహారైర్వంచయిత్వా వర్త్మన్యేవ సుయోధనః
వరదం తం వరం వవ్రే సాహాయ్యం క్రియతాం మమ
శల స్తస్మై ప్రతిశ్రుత్య జగామోద్దిశ్య పాండవాన్
శాన్తిపూర్వం చాకథయద్ యత్రేన్ద్రవిజయం నృపః.
పురోహిత ప్రేషణం చ పాండవైః కౌరవాన్ ప్రతి
వైచిత్రవీర్యస్య వచః సమాదాయ పురోధసః
తథేన్ద్రవిజయం చాపి యానం చైవ పురోధసః
సంజయం ప్రేషయామాస శమార్థీ పాండవాన్ ప్రతి
యత్ర దూతం మహారాజో ధృతరాష్ట్రః ప్రతాపవాన్
శ్రుత్వాచ పాండవాన్ యత్ర వాసుదేవపురోగమాన్
ప్రజాగరః సంప్రజజ్ఞే ధృతరాష్ట్రస్య చిన్తయా
విదురో యత్ర వాక్యాని విచిత్రాణి హితానిచ.
శ్రావయామాస రాజానం ధృతరాష్ట్రం మనీషిణం
తథా సనత్సుజాతేన యత్రాధ్యాత్మ మనుత్తమం.
మనస్తాపాన్వితో రాజా శ్రావితః శోకలాలసః
ప్రభాతే రాజసమితౌ సంజయో యత్ర వా విభోః.
ఏకాత్మ్యం వాసుదేవస్య ప్రోక్తవానర్జునస్యచ
యత్ర కృష్ణో దయాపన్నః సంధిమిచ్ఛన్ మహామతిః
స్వయమాగాచ్ఛమం కర్తుం నగరం నాగసాహ్వయం
ప్రత్యాఖ్యానం చ కృష్ణస్య రాజ్ఞా దుర్యోధనేనవై.
శమార్థే యాచమానస్య పక్షయో రుభయోర్హితం
దమ్భోద్భవస్య చాఖ్యానమత్రైవ పరికీర్తితం.
వరాన్వేషణమత్రైవ మాతలేశ్చ మహాత్మనః
మహర్షేశ్చాపి చరితం కథితం గాలవస్యవై.
విదులాయాశ్చ పుత్రస్య ప్రోక్తం చాప్యనుశాసనం
కర్ణదుర్యోధనాదీనాం దుష్టం విజ్ఞాయ మన్త్రితం.
యోగేశ్వరత్వం కృష్ణేన యత్ర రాజ్ఞాం ప్రదర్శితం
రథమారోప్య కృష్ణేన యత్ర కర్ణోఽను మన్త్రితః.
ఉపాయపూర్వం శౌటీర్యాత్ ప్రత్యాఖ్యాతశ్చ తేన సః
ఆగమ్య హాస్తినపురాదుపప్లవ్య మరిన్దమః.
పాణ్డవానాం యథావృత్తం సర్వమాఖ్యాతవాన్హరిః
తే తస్యవచనం శ్రుత్వా మన్త్రయిత్వాచ యద్ధితం.
సాంగ్రామికం తతః సర్వం సజ్జం చక్రుః పరంతపాః
తతో యుద్ధాయ నిర్యాతా నరాశ్వరథ దంతినః.
నగరాద్ధాస్తిన పురాత్ బలసంఖ్యానమేవ చ
యత్ర రాజ్ఞా హ్యులూకస్య ప్రేషణం పాండవాన్ప్రతి.
శ్వోభావిని మహాయుద్ధే దౌత్యేన కృతవాన్ ప్రభుః
రథాతిరథసంఖ్యాన మమ్బోపాఖ్యాన మేవ చ.
ఏత్ సుబహువృత్తాంతం పంచమం పర్వ భారతే
ఉద్యోగ పర్వ నిర్దిష్టం సంధివిగ్రహ మిశ్రితం.
అధ్యాయానాం శతం ప్రోక్తం షడశీతిర్మహర్షిణా
శ్లోకానాం షట్సహస్రాణి తావంత్యేవ శతానిచ.
శ్లోకాశ్చనవతిః ప్రోక్తాస్తథైవాష్టౌ మహాత్మనా
వ్యాసే నోదారమతినా పర్వణ్యస్మిం స్తపోధనాః.
అతః పరం విచిత్రార్థం భీష్మ పర్వ ప్రచక్షతే
జమ్బూఖండ వినిర్మాణం యత్రోక్తం సంజయే నహ.
యత్ర యౌధిష్ఠిరం సైన్యం విషాదమగమత్పరం
యత్ర యుద్ధమభూద్ఘోరం దశాహానీ సుదారుణం.
కశ్మలం యత్ర పార్థస్య వాసుదేవో మహామతిః
మోహజం నాశయామాస హేతుభిః మోక్షదర్శిభిః.

కూడా అశ్వత్థామకు చిక్కకపోవడం జరిగిన అంశాలను ధృష్టద్యుమ్నుని సారథి పాండవులకు నివేదించడం పుత్రశోకానికి భ్రాతృమరణ వార్తతోడు కాగా ద్రౌపదీదేవి విలపించి ప్రతీకారాన్ని కోరడం భీముడు ఉద్రిక్తుడై గదను ధరించి అశ్వత్థామను వెంటాడడం భీమునివల్ల భయంతో దైవప్రేరణతో పాండవనాశనోద్యోగియై అశ్వత్థామ దివ్యాస్త్రాన్ని సంధించడం శ్రీకృష్ణుడు అశ్వత్థామను శాంతవచనాలతో అనునయించి పాండవనాశనం జరగదని పలకటం పార్థుడు అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రాన్ని ఉపసంహరించడం పాపబుద్ధితో ఉన్న అశ్వత్థామను వేదవ్యాసుడూ శ్రీకృష్ణుడూ శపించటం అశ్వత్థామ శిరోభూషణాన్ని పాండవులు తీసికొని వచ్చి ద్రౌపదికీయటం — ఆదిగాగల వృత్తాంతాలతో ఉన్న ఈ సౌప్తికపర్వంలో ఎనిమిదివందల ఎనభై శ్లోకాలూ పద్ధెనిమిదధ్యాయాలలో విభాగింపబడ్డాయి.

## స్త్రీ పర్వం

పుత్రశోకార్తుడైన ధృతరాష్ట్రుడు భీమసేనునియందు ద్రోహచింతాపరుడు కావడం గమనించిన శ్రీకృష్ణుడు ఇనుముతో తయారైన భీముని విగ్రహాన్ని ధృతరాష్ట్రుని సమీపమందుంచగా ఆ వృద్ధుని ఆలింగనంలో అది పిండి పిండి అయిపోవటం ధృతరాష్ట్రుడికి విదురుడు మోక్షధర్మాన్ని ఉపదేశించడం దుఃఖభాగినులైన కౌరవ స్త్రీలు యుద్ధభూమికిపోయి విచారించటం గాంధారి దుఃఖం శ్రీకృష్ణుడు వారి శోకాన్ని ఉపశమింపజేయటం ధర్మాత్ముడైన ధర్మరాజు మృతవీరులకు శాస్త్రానుసారం దహనకర్మలు చేయటం చేయించటం తిలాంజలు లర్పించే సమయంలో కుంతి కర్ణుని జన్మవృత్తాంతం చెప్పటం ఆదిగాగల విషయాలతో ఈ స్త్రీపర్వం వివరింపబడుతుంది. ఏడువందల ఎనభై అయిదుశ్లోకాలతో ఇరవై రెండు అధ్యాయాలతో యిది అలరారుతోంది.

## శాంతి పర్వం

బుద్ధికి వికాసాన్ని కలిగించే పర్వం శాంతి పర్వం. ఇందులో పదునాల్గువేల ఏడువందల ముప్పై రెండు శ్లోకాలు మూడువందల ముప్పై తొమ్మిది అధ్యాయాలలో ఉన్నాయి.

గురుబంధుజనవధకారణంగా కలిగిన దుఃఖంతో ఉన్న ధర్మజునికి శరతల్పగతుడైన భీష్ముడు నీతిని ఉపదేశించటం విజ్ఞానజిజ్ఞాసువులయిన చక్రవర్తుల ఇతిహాసాలు కాలకారణాపేక్షితులైన దేశకాల విభాగం ఆపద్ధర్మవివరణం మోక్షధర్మవిశదీకరణం చేసే ఈ శాంతిపర్వాన్ని విజ్ఞానభాండాగారంగా విజ్ఞులు ప్రకీర్తించారు.

## అనుశాసనికం

భీష్మాచార్యుడు పాండవజ్యేష్ఠునికి ధర్మసిద్ధాంతాలు వివరించుట శోకమోహాదులను త్యజించి స్థిర సంకల్పుడు కావటం ధర్మార్థయుక్తమైన ఆచారదానాదిక వివరణం గోబ్రాహ్మణ మాహాత్మ్యం సామాన్య విశేష ఆపద్ధర్మాలలోని రహస్యాలను వివరించటం దేశకాలమహిమాతిశయ వర్ణనం కల ఈ పర్వం నూటనలభై యారు అధ్యాయాలతో ఎనిమిదివేల శ్లోకాలతో వేదవ్యాసుడు ప్రస్తరించాడు.

## అశ్వమేధం

సంవర్త మరుత్తుల ఉపాఖ్యానాలతో ఆరంభమైన ఈ అశ్వమేధపర్వంలో ధర్మజునికి సువర్ణకోశప్రాప్తి పరీక్షిత్తుయొక్క జననవృత్తాంతం

సమీక్ష్యాధోక్షజః క్షిప్రం యుధిష్ఠిరహితే రతః
రథాదాప్లుత్య వేగేన స్వయం కృష్ణ ఉదారధీః.
ప్రతోదపాణిరాధావద్భీష్మం హన్తుం వ్యపేతభీః
వాక్యప్రతోదాభిహతో యత్ర కృష్ణేన పాండవః.
గాండీవధన్వా సమరే సర్వశస్త్రభృతాం వరః
శిఖండినం పురస్కృత్య యత్ర పార్థో మహాధనుః.
వినిఘ్నన్ నిశితైర్బాణై రథాద్భీష్మమపాతయత్
శరతల్పగతశ్చైవ భీష్మో యత్ర బభూవ హ.
షష్ఠమేతత్ సమాఖ్యాతం భారతే పర్వ విస్తృతం
అధ్యాయానాం శతం ప్రోక్తం తథా సప్తదశాపరే.
పంచ శ్లోకసహస్రాణి సంఖ్యయాష్టౌ శతాని చ
శ్లోకాశ్చ చతురాశీతిరస్మిన్ పర్వణి కీర్తితాః.
వ్యాసేన వేదవిదుషా సంఖ్యాతా భీష్మపర్వణి
ద్రోణపర్వ తతశ్చిత్రం బహువృత్తాన్తముచ్యతే.
సేనాపత్యేఽభిషిక్తోఽథ యత్రాచార్యః ప్రతాపవాన్
దుర్యోధనస్య ప్రీత్యర్థం ప్రతిజజ్ఞే మహాస్త్రవిత్.
గ్రహణం ధర్మరాజస్య పాండుపుత్రస్య ధీమతః
యత్ర సంశప్తకాః పార్థమపనిన్యూ రణాజిరాత్.
భగదత్తో మహారాజో యత్ర శక్రసమో యుధి
సుప్రతీకేన నాగేన సహి శాన్తః కిరీటినా.
యత్రాభిమన్యుం బహవో జఘ్నురేకం మహారథాః
జయద్రథముఖా బాలం శూరమప్రాప్తయౌవనం.
హతేఽభిమన్యౌ క్రుద్ధేన యత్ర పార్థేన సంయుగే
అక్షౌహిణీః సప్త హత్వా హతో రాజా జయద్రథః.
యత్ర భీమో మహాబాహుః సాత్యకిశ్చ మహారథః
అన్వేషణార్థం పార్థస్య యుధిష్ఠిరనృపాజ్ఞయా.
ప్రవిష్టౌ భారతీం సేనామప్రధృష్యాం సురైరపి
సంశప్తకావశేషం చ కృతం నిఃశేషమాహవే.
సంశప్తకానాం వీరాణాం కోట్యో నవ మహాత్మనాం
కిరీటినాభినిష్క్రమ్య ప్రాపితా యమసాదనం.
ధృతరాష్ట్రస్య పుత్రాశ్చ తథా పాషాణయోధినః
నారాయణాశ్చ గోపాలాః సమరే చిత్రయోధినః.
అలంబుషః శ్రుతాయుశ్చ జలసంధశ్చ వీర్యవాన్
సౌమదత్తిర్విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః.
ఘటోత్కచాదయశ్చాన్యే నిహతా ద్రోణపర్వణి
అశ్వత్థామాపి చాత్రైవ ద్రోణే యుధి నిపాతితే.
అస్త్రం ప్రాదుశ్చకారోగ్రం నారాయణమమర్షితః
ఆగ్నేయం కీర్త్యతే యత్ర రుద్రమాహాత్మ్యముత్తమం
వ్యాసస్య చాప్యాగమనం మాహాత్మ్యం కృష్ణపార్థయోః
సప్తమం భారతే పర్వ మహదేతదుదాహృతం.
యత్ర తే పృథివీపాలాః ప్రాయశో నిధనం గతాః
ద్రోణపర్వణి యే శూరా నిర్దిష్టాః పురుషర్షభాః.
అత్రాధ్యాయశతం ప్రోక్తం తథాధ్యాయాశ్చ సప్తతిః
అష్టౌ శ్లోకసహస్రాణి తథా నవ శతాని చ
శ్లోకా నవ తథైవాత్ర సంఖ్యాతాస్తత్త్వదర్శినా
పారాశర్యేణ మునినా సంచిన్త్య ద్రోణపర్వణి.
అతః పరం కర్ణపర్వ ప్రోచ్యతే పరమాద్భుతం
సారథ్యే వినియోగశ్చ మద్రరాజస్య ధీమతః.
ఆఖ్యాతం యత్ర పౌరాణం త్రిపురస్య నిపాతనం
ప్రయాణే పరుషశ్చాత్ర సంవాదః కర్ణశల్యయోః.
హంసకాకీయమాఖ్యానం తత్రైవాక్షేపసంహితం
వధః పాండ్యస్య చ తథా అశ్వత్థామ్నా మహాత్మనా.
దండసేనస్య చ తతో దండస్య చ వధస్తథా
ద్వైరథే యత్ర కర్ణేన ధర్మరాజో యుధిష్ఠిరః.
సంశయం గమితో యుద్ధే మిషతాం సర్వధన్వినాం
అన్యోన్యం ప్రతి చ క్రోధో యుధిష్ఠిరకిరీటినోః.
యత్రైవానునయః ప్రోక్తో మాధవేనార్జునస్య హి
ప్రతిజ్ఞాపూర్వకం చాపి వక్షో దుశ్శాసనస్య చ.
భిత్త్వా వృకోదరో రక్తం పీతవాన్ యత్ర సంయుగే
ద్వైరథే యత్ర పార్థేన హతః కర్ణో మహారథః.

ధర్మరాజు అశ్వాన్ని విడవటం అర్జునుడు యజ్ఞాశ్వంతోబయలుదేరి నానాదేశాధీశులనూ జయిస్తూ బభ్రువాహనుని చేతులలో పరిమాదానికి గురికావటం నకులోపాఖ్యానం అభివర్ణితాలు. నూట మూడు అధ్యాయాలపర్వంలో మూడువేల మూడు వందల ఇరవై శ్లోకాలున్నాయి. ఇది పద్ధాలుగో పర్వం.

## ఆశ్రమవాసం

పదిహేనవపర్వంగావచ్చే ఈ ఆశ్రమవాసం పదిహేనువందల ఆరు శ్లోకాలతో నలభై రెండు అధ్యాయాలతో ముగిసింది.

గాంధారీసహితుడైన ధృతరాష్ట్రుని వెంటబెట్టుకుని విదురుడు అరణ్యానికి పోవటం కుంతీదేవి వారినే అనుసరించడం రణరంగంలో నిహతులైన పుత్రపౌత్రుల్ని గాంధారీ ధృతరాష్ట్రులు వ్యాసుని కరుణవల్ల చూడటం శోకరహితులైన ధృతరాష్ట్రాదులు ఉత్తమలోకాలు పొందడం యుధిష్ఠిరునికి నారదదర్శనం యాదవవంశనాశనాన్ని నారదుడు నివేదించటంతో ముగిసింది.

బ్రహ్మశాపంవల్ల ముసలం కారణంగా యదువంశవీరులు మరణించటం దైవవశాన యాదవులు పానశాలకు పోయి మద్యపానం చేసి ఉన్మత్తులై సముద్రతీరాన ఒకరినొకరు చంపుకోవడం బలవత్తరమైన కాలాన్ని ఎదుర్కోలేక అవతారాలు చాలించటం అర్జునుని ద్వారకాప్రవేశం వసుదేవునకు అంత్యక్రియలు సాగించటం యదువంశవీరులకు దహనసంస్కారాలు చేయించటం ద్వారకలోని బాలస్త్రీవృద్ధుల్ని కూడాతీసికొని పార్థుడు తిరిగివస్తూండగా భయంకరాకారులు అడ్డినప్పుడు పార్థుని అస్త్రాలన్నీ నిర్వీర్యాలు కావటం వ్యాసుని ఉపదేశానుసారం విరాగియై ధర్మజుని చేరి సన్యాసానికి అనుమతి కోరడం అనే అంశాలతోడి మౌసలపర్వంలో మూడువందలఇరవై శ్లోకాలూ ఎనిమిది అధ్యాయాలుగా విస్తరింపబడ్డాయి.

గృహాన్నీ నిద్రాహారాలనూ వదలి సంతోషంతో మృత్యుదేవికి స్వాగతం యిచ్చే సంకల్పంతో అనేక ప్రాంతాలు పర్యటించి ఉత్తరదిశాముఖంగా సాగిసాగి హిమవత్పర్వతప్రాంతానికి పోవటం ఆమరణాంతం ఉత్తరాభిముఖంగా ప్రయాణించడాన్ని మహాప్రస్థానం అంటారు. ఈ యాత్రలో ఎర్రసముద్రప్రాంతంలో అగ్నిహోత్రుని దర్శించి వానిప్రేరణతో గాండీవాన్ని వానికే అర్పించడం మధ్యమార్గంలో ద్రౌపదీసమేతంగా భీమసేనాదులు పడిపోతూంటే ధర్మరాజు నిర్లిప్తంగా సాగుతూండటం అనే అంశాలతో ఉన్న మూడధ్యాయాల ఈ మహాప్రస్థానపర్వం మూడునందలఅరవై శ్లోకాలతో ముగించాడు తత్వజ్ఞాని వ్యాసర్షి.

స్వర్గంనుండి ధర్మజునికోసం దివ్యరథాగమనం తనతో వచ్చే కుక్కను విడవటానికి ధర్మజుని హృదయం తిరస్కరించగా ధర్మజుని ధర్మబుద్ధికి మెచ్చి యమధర్మరాజు శ్వానరూపం విడిచి ధర్మజుని స్వర్గానికి తీసికొని వెళ్ళటం అక్కడ దేవదూత నరకలోకాన్ని చూపడం సోదరుల దుఃస్థితిని చూడటం యముడూ ఇంద్రుడు ధర్మరాజుకి యోగ్యమైన స్వర్గాన్ని చూపటం ఆకాశగంగా స్నానంతో మానుషదేహం వీడి దివ్యదేహం ధర్మరాజు ధరించడం ఇంద్రాదులచే భూషితుడై ధర్మజుడు స్వర్గభోగానుభూతి పొందడం అనే అంశాలతో నిండిన ఈ స్వర్గారోహణపర్వంలో శ్లోకాలు రెండు వందలతొమ్మిదీ అయిదు అధ్యాయాలతో ముగించాడు కృష్ణద్వైపాయనుడు.

అష్టమం పర్వ నిర్దిష్టమేతద్భారత చింతకైః
ఏకోన సప్తతిః ప్రోక్తా అధ్యాయాః కర్ణపర్వణి.
చత్వార్యేవ సహస్రాణి నవ శ్లోకశతాని చ
చతుఃషష్టిస్తథా శ్లోకాః పర్వణ్యస్మిన్ ప్రకీర్తితాః.
అతః పరం విచిత్రార్థం శల్యపర్వ ప్రకీర్తితమ్
హతప్రవీరే సైన్యే తు నేతా మద్రేశ్వరోఽభవత్
యత్ర కౌమారమాఖ్యానమభిషేకస్య కర్మ చ
వృత్తాని రథయుద్ధాని కీర్త్యంతే యత్ర భాగశః.
వినాశః కురుముఖ్యానాం శల్యపర్వణి కీర్త్యతే
శల్యస్య నిధనం చాత్ర ధర్మరాజాన్మహాత్మనః.
శకునేశ్చ వధోఽత్రైవ సహదేవేన సంయుగే
సైన్యే చ హతభూయిష్ఠే కించిచ్ఛిష్టే సుయోధనః.
హ్రదం ప్రవిశ్య యత్రాసౌ సంస్తభ్యాపో వ్యవస్థితః
ప్రవృత్తిస్తత్ర చాఖ్యాతా యత్ర భీమస్య లుబ్ధకైః
క్షేపయుక్తైర్వచోభిశ్చ ధర్మరాజస్య ధీమతః
హ్రదాత్ సముత్థితో యత్ర ధార్తరాష్ట్రోఽత్యమర్షణః.
భీమేన గదయా యుద్ధం యత్రాసౌ కృతవాన్ సహ
సమవాయే చ యుద్ధస్య రామస్యాగమనం స్మృతమ్.
సరస్వత్యాశ్చ తీర్థానాం పుణ్యతా పరికీర్తితా
గదాయుద్ధం చ తుములమత్రైవ పరికీర్తితమ్.
దుర్యోధనస్య రాజ్ఞోఽథ యత్ర భీమేన సంయుగే
ఊరూ భగ్నౌ ప్రసహ్యాజౌ గదయా భీమవేగయా.
నవమం పర్వనిర్దిష్టమేతదద్భుతమర్థవత్
ఏకోనషష్టిరధ్యాయాః పర్వణ్యత్ర ప్రకీర్తితాః
సంఖ్యాతా బహువృత్తాంతాః శ్లోకసంఖ్యాత్ర కథ్యతే
త్రీణి శ్లోకసహస్రాణి ద్వే శతే వింశతిస్తథా.
మునినా సంప్రణీతాని కౌరవాణాం యశోభృతా
అతః పరం ప్రవక్ష్యామి సౌప్తికం పర్వ దారుణమ్.
భగ్నోరుం యత్ర రాజానం దుర్యోధనమమర్షణమ్
అపయాతేషు పార్థేషు త్రయస్తేభ్యాయయూ రథాః.
కృతవర్మా కృపో ద్రౌణిః సాయాహ్నే రుధిరోక్షితం
సమేత్య దదృశుర్భూమౌ పతితం రణమూర్ధని.
ప్రతిజజ్ఞే దృఢక్రోధో ద్రౌణిర్యత్ర మహారథః
అహత్వా సర్వపంచాలాన్ ధృష్టద్యుమ్నపురోగమాన్
పాండవాంశ్చ సహామాత్యాన్న విమోక్ష్యామి దంశనం
యత్రైవముక్త్వా రాజానమపక్రమ్య త్రయో రథాః.
సూర్యాస్తమనవేలాయామాసేదుస్తే మహద్వనం
న్యగ్రోధస్యాథ మహతో యత్రాధస్తాద్వ్యవస్థితాః
తతః కాకాన్బహూన్రాత్రౌ దృష్ట్వోలూకేన హింసితాం
ద్రౌణిః క్రోధసమావిష్టః పితుర్వధమనుస్మరన్
పంచాలానాం ప్రసుప్తానాం వధం ప్రతిమనో దధే
గత్వా చ శిబిరద్వారి దుర్దర్శం తత్ర రాక్షసం.
ఘోరరూపమపశ్యత్ స దివమావృత్య ధిష్ఠితం
తేన వ్యాఘాతమస్త్రాణాం క్రియమాణమవేక్ష్య చ.
ద్రౌణిర్యత్ర విరూపాక్షం రుద్రమారాధ్య సత్వరః
ప్రసుప్తాన్ నిశి విశ్వస్తాన్ ధృష్టద్యుమ్నపురోగమాన్.
పంచాలాన్ సపరివారాన్ ద్రౌపదేయాంశ్చ సర్వశః
కృతవర్మణా చ సహితః కృపేణ చ నిజఘ్నివాన్.
యత్రముచ్యంత తే పార్థాః పంచ కృష్ణబలాశ్రయాత్
సాత్యకిశ్చ మహేష్వాసః శేషాశ్చ నిధనం గతాః.
పంచాలాన్ ప్రసుప్తానాం యత్ర ద్రోణసుతాద్వధః
ధృష్టద్యుమ్నస్య సూతేన పాండవేషు నివేదితః.
ద్రౌపదీ పుత్రశోకార్తా పితృభ్రాతృ వధార్దితా
కృతానశనసంకల్పా యత్ర భర్తౄనుపావిశత్.
ద్రౌపదీవచనాద్యత్ర భీమో భీమపరాక్రమః.
ప్రియం తస్యాశ్చికీర్షన్ వై గదామాదాయ వీర్యవాన్
అన్వధావత్ సుసంక్రుద్ధో భారద్వాజం గురోః సుతం
భీమసేనభయాద్ యత్ర దైవేనాభిప్రచోదితః.
అపాండవాయేతి రుషా ద్రౌణిరస్త్రమవాసృజత్
మైవమిత్యబ్రవీత్ కృష్ణః శమయంస్తస్య తద్వచః.

ఖిలపర్వంగా చేర్చబడే హరివంశంలో భవిష్యద్వర్ణనం సాగిస్తూ వేదవ్యాసర్షి పన్నెండు వేల శ్లోకాలు నిబంధించాడు. యుద్ధకాంక్షగల పద్ధెనిమిది అక్షౌహిణీల సైన్యం పద్ధెనిమిదిరోజులు అద్భుతసంగ్రామం సాగించిన కథ ఈ మహాగ్రంథంలో ఉన్నది. వేదవేదాంగాలను అధ్యయనం చేసిన వాడయినా మహాభారత మహేతిహాసాన్ని పఠించకపోతే విచక్షణాజ్ఞాన శూన్యుడే అవుతాడు.

ధర్మార్థకామమోక్ష శాస్త్రాలను ఈ మహేతిహాసంలో ప్రతిపాదించి చతుర్విధ పురుషార్థాలనూ మానవుడికి ఉపదేశించాడు. పుంస్కోకిలగానం ఆలకించిన వ్యక్తి మరొక కంఠాన్ని వినలేనట్లే ఈ మహేతిహాసాన్ని వినినవాడికి మరేకథవైపు మనసు పోదు.

భూతపంచకంనుండి ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికమైన సృష్టి జరిగినట్లు కావ్యరచనావసర సామగ్రి ఈ మహాభారతంనుండి కవికి లభిస్తుంది. అనంతాకాశంలో జరాయుజ స్వేదజ అండజ ఉద్భిజాది చతుర్విధప్రాణికోటి ఉన్నట్లే అష్టాదశపురాణోపపురాణసారం కూడా ఇందు ప్రతిపాదితమే. సర్వేంద్రియ వ్యాపారానికీ మనస్సు అధీనమైనట్లే లౌకిక వైదిక కర్మఫలసాధనకు ఈ మహాభారతమే ఆధారభూతము.

ఆహారం లేకుండా శరీరధారణకవకాశం లేనట్లే మహాభారతాన్ని ఆశ్రయించకుండా వెలువడ్డకథ కనిపించదు. కవులందరూ మహాభారతకథనే ఆశ్రయిస్తున్నారు ఆశ్రయిస్తారు. ఔన్నత్యాన్నికోరేవాడు గొప్పవానినెట్లాశ్రయిస్తాడో! బ్రహ్మచర్య, వానప్రస్థ యత్యాశ్రమాలు మూడూ గృహస్థాశ్రమాన్ని అతిక్రమించలేనట్లే ప్రపంచంలో యే కవీ మహాభారతాన్నతిక్రమించిన కావ్యాన్ని వ్రాయలేడు. తాపసోత్తములారా! మహాభారత పాఠకులార! మీరందరును సాంసారికములైన విషయభోగము లందాసక్తి లేనివా రగుదురుగాక! మీ బుద్ధులెప్పుడూ ధర్మమందే లగ్నమగుగాక! జీవికి పరలోకప్రయాణం చేసేటప్పుడూ పరలోకంలోనూ ధర్మమే సహాయపడుతుంది. జ్ఞానికూడ కాంతాకనకాలను సేవిస్తాడు. కాని వాటియొక్క శ్రేష్ఠతను విశ్వసించడు.

వ్యాసమహర్షి ముఖతఃవెలువడినట్టిది అప్రమేయము, పుణ్యదాయకము, పవిత్రము, పాపహారకము, మంగళప్రదము అగు నీ మహాభారతాన్ని ఎవడు ఇతరులవలన వినునో వాడు పుష్కరతీర్థాన్ని సేవించనవసరం లేదు. బ్రాహ్మణుడు ఇంద్రియాల ద్వారా పగలుచేసిన పాపాలన్నీ సాయంకాలమున భారత పఠనమాత్రాన నశించిపోతాయి. అట్లే ప్రాతఃకాలమున భారతాన్ని పఠిస్తే రాత్రిభాగంలో చేసిన పాపాలన్నీ పటాపంచలైపోతాయి. ఉత్తమమైన వేదవేదాంగవేత్తలగు బ్రాహ్మణులకు ప్రతిరోజూ విధివిధానంగా నూరు గోదానాలు చేసే వాడికి కలిగే ఫలమే ప్రతిరోజూ మహాభారతం వినే వాడికి కూడా కలుగుతుంది.

మహార్థంతోకూడిన మహాభారతం పర్వ సంగ్రహాధ్యాయంయొక్క సహాయంతోనే గ్రహించాలి. ఓడయొక్క సహాయంతో సముద్రయానం యెంత సులభ మవుతుందో పర్వ సంగ్రహాధ్యాయ పఠనం వల్ల మహాభారత సముద్రయానం కూడా అంత సుఖప్రద మౌతుంది.

* * * *

యత్రాస్త్రమస్త్రేణ చ తచ్ఛమయామాస ఫాల్గునః
ద్రోణేశ్చ ద్రోహబుద్ధిత్వం వీక్ష్య పాపాత్మనస్తదా.
ద్రౌణిద్వైపాయనాదీనాంశాపాశ్చాన్యోన్య కారితాః
మణింతథాసమాదాయద్రోణపుత్రాన్మహారథాత్
పాండవాః ప్రదదుర్హృష్టా ద్రౌపద్యైజితకాశినః
ఏతత్ వై దశమం పర్వసౌప్తికం సముదాహృతం.
అష్టాదశాస్మిన్నధ్యాయాః పర్వణ్యుక్తా మహాత్మనా
శ్లోకానాం కథితాన్యత్ర శతాన్యష్టౌ ప్రసంఖ్యయా.
శ్లోకాశ్చసప్తతిః ప్రోక్తా మునినా బ్రహ్మవాదినా
సౌప్తికైషీకే సంబద్ధే పర్వణ్యుత్తమ తేజసీ.
అత ఊర్ధ్వమిదం ప్రాహుః స్త్రీపర్వ కరుణోదయం
పుత్రశోకాభిసంతప్తః ప్రజ్ఞాచక్షుర్నరాధిపః
కృష్ణోపనీతాంయత్రాసావాయసీంప్రతిమాం దృఢామ్
భీమసేన ద్రోహబుద్ధి ర్ధృతరాష్ట్రోబభంజహ
తథా శోకాభితప్తస్య ధృతరాష్ట్రస్య ధీమతః
సంసారగహనం బుద్ధ్యా హేతుభి ర్మోక్షదర్శనైః.
విదురేణచ యత్రాస్య రాజ్ఞ ఆశ్వాసనం కృతమ్
ధృతరాష్ట్రస్య చాత్రైవ కౌరవాయోధనం తథా.
సాన్తః పురస్య గమనం శోకార్తస్య ప్రకీర్తితమ్
విలాపో వీరపత్నీనాం యత్రాతి కరుణః స్మృతః.
క్రోధావేశః ప్రమోహశ్చగాంధారీ ధృతరాష్ట్రయోః
యత్రతాన్ క్షత్రియాఃశూరాన్ సంగ్రామేష్వ నివర్తినః
పుత్రాన్భ్రాతౄన్పితౄంశ్చైవ దదృశుర్నిహతాన్రణే
పుత్రపౌత్రవధార్తాయాస్తథాత్రైవ ప్రకీర్తితా
గాంధార్యాశ్చాపి కృష్ణేన క్రోధోపశమనక్రియా
యత్ర రాజామహాప్రాజ్ఞః సర్వభృతాం వరః.
రాజ్ఞాంతాని శరీరాణి దాహయామాస శాస్త్రతః
తోయకర్మాణిచారబ్ధే రాజ్ఞా ముదకదానికే.
గూఢోత్పన్నస్యచాఖ్యానంకర్ణస్య పృథయాత్మనః
సుత స్యైతదిహప్రోక్తం వ్యాసేన పరమర్షిణా.

ఏతదేకాదశంపర్వ శోకవైక్లబ్య కారణమ్
ప్రణీతం సజ్జన మనోవైక్లవ్యాశ్రు ప్రవర్తకమ్.
సప్తవింశతి రధ్యాయాః పర్వణ్యస్మిన్ ప్రకీర్తితాః
శ్లోకసప్తశతీచాపి పంచసప్తతి సంయుతా.
సంఖ్యయా భారతాఖ్యానముక్తం వ్యాసేనధీమతా
అతఃపరం శాన్తిపర్వ ద్వాదశం బుద్ధివర్ధనం.
యత్ర నిర్వేదమాపన్నో ధర్మరాజో యుధిష్ఠిరః
ఘాతయిత్వా పితౄన్ భ్రాతౄన్ పుత్రాన్ సంబంధి మాతులాన్
శాన్తిపర్వణి ధర్మాశ్చవ్యాఖ్యాతాః శారతల్పికాః
రాజభిర్వేది తవ్యాస్తే సమ్యక్ జ్ఞాన బుభుత్సుభిః.
ఆపద్ధర్మాశ్చ తత్రైవ కాలహేతు ప్రదర్శనః
యాన్ బుద్ధ్వాపురుషః సమ్యక్ సర్వజ్ఞత్వమవాప్నుయాత్
మోక్షధర్మాశ్చ కథితా విచిత్రా బహువిస్తరాః
ద్వాదశం పర్వనిర్దిష్టమేతత్ ప్రాజ్ఞజనప్రియం.
అత్ర పర్వణి విజ్ఞేయమధ్యాయానాం శతత్రయం
వింశచ్చైవ తథాధ్యాయా నవచైవ తపోధనాః.
చతుర్దశ సహస్రాణి తథా సప్తశతానిచ
సప్తశ్లోకాస్తథైవాత్ర పంచవింశతి సంఖ్యయా.
అతఊర్ధ్వం చ విజ్ఞేయమనుశాసన ముత్తమం
యత్ర ప్రకృతి మాపన్నః శ్రుత్వా ధర్మ వినిశ్చయం
భీష్మాద్ భాగీరథీపుత్రాత్ కురురాజో యుధిష్ఠిరః
వ్యవహారోఽత్ర కార్త్స్న్యేనధర్మార్థీయః ప్రకీర్తితః.
వివిధానాంచ దానానాం ఫలయోగాః ప్రకీర్తితాః
తథా పాత్రవిశేషాశ్చ దానానాం చ పురోవిధిః.
ఆచారవిధియోగశ్చ సత్యస్య చ పరాగతిః
మహాభాగ్యం గవాంచైవబ్రాహ్మణానాం తథైవచ
రహస్యంచైవ ధర్మాణాం దేశకాలోపసంహితం
ఏతత్ సుబహువృత్తాన్తముత్తమంచానుశాసనం

భీష్మస్యాత్రైవసమ్ప్రాప్తిః స్వర్గస్య పరికీర్తితా
ఏతత్ త్రయోదశం పర్వధర్మ నిశ్చయకారకం.
అధ్యాయానాం శతంత్వత్రషట్చత్వారింశ దేవతు
శ్లోకానాంతుసహస్రాణి ప్రోక్తాన్యష్టౌప్రసంఖ్యయా.
తతోఽశ్వమేధికంనామ పర్వప్రోక్తం చతుర్దశం
తత్ సంవర్తమరుత్తీయంయత్రాఖ్యాన మనుత్తమం.
సువర్ణకోష సంప్రాప్తి ర్జన్మచోక్తం పరీక్షితః
దగ్ధస్యాస్త్రాగ్నినాపూర్వంకృష్ణాత్ సంజీవనంపునః.
చర్యాయాంహయముత్సృష్టం పాణ్డవస్యానుగచ్ఛతః
తత్ర తత్ర చ యుద్ధాని రాజపుత్రైరమర్షణైః.
చిత్రాంగదాయాః పుత్రేణ పుత్రికాయాధనంజయః
సంగ్రామే బభ్రువాహేణ సంశయం చాత్రదర్శితః.
అశ్వమేధే మహాయజ్ఞే నకులాఖ్యానమేవ చ
ఇత్యాశ్వమేధికం పర్వ ప్రోక్తమేతన్మహాద్భుతం.
అధ్యాయానాంశతంచైవత్రయోధ్యాయాశ్చప్రకీర్తితాః
త్రీణిశ్లోక సహస్రాణితావన్త్యేవ శతాని చ.
వింశతిశ్చ తథాశ్లోకాః సంఖ్యాతాస్తత్వ దర్శినా
తతస్త్వాశ్రమవాసాఖ్యం పర్వపంచదశం స్మృతమ్.
యత్రరాజ్యంసముత్సృజ్యగాంధార్యాసహితోనృపః.
ధృతరాష్ట్రోఽఽశ్రమపదం విదురశ్చ జగామహ.
యందృష్ట్వాప్రస్థితంసాధ్వీపృథాప్యనుయయౌ తదా
పుత్ర రాజ్యం పరిత్యజ్య గురుశుశ్రూషణేరతా.
యత్రరాజాహతాన్పుత్రాన్పౌత్రానన్యాంశ్చ పార్థివా
న్లోకాన్తరగతాన్ వీరానపశ్యత్ పునరాగతాన్.
ఋషేఃప్రసాదాత్ కృష్ణస్యదృష్ట్వాశ్చర్య మనుత్తమం
త్యక్త్వాశోకం సదారశ్చ సిద్ధిం పరమికాంగతః.
యత్ర ధర్మం సమాశ్రిత్య విదురః సుగతిం గతః
సంజయశ్చ సహామాత్యో విద్వాన్ గావల్గణిర్వశీ.
దదర్శనారదం యత్ర ధర్మరాజో యుధిష్ఠిరః
నారదాచ్చైవ శుశ్రావవృష్ణీనాం కదనం మహత్.
ఏతదాశ్రమవాసాఖ్యం పర్వోక్తం మహదద్భుతమ్
ద్విచత్వారింశ దధ్యాయాః పర్వైతదభి సంఖ్యయా
సహస్రమేకం శ్లోకానాం పంచశ్లోక శతాని చ
షడేవ చ తథా శ్లోకాః సంఖ్యాతాస్తత్వ దర్శినా.
అతఃపరం నిబోధేదం మౌసలం పర్వదారుణమ్
యత్ర తే పురుషవ్యాఘ్రాః శస్త్రస్పర్శహతాయుధి.
బ్రహ్మదండ వినిష్పిష్టాః సమీపే లవణామ్భసః
అపానేపానకలితా దైవేనాభి ప్రచోదితాః
ఏరకారూపిభిర్వజ్రై రిజఘ్నురితరేతరమ్
యత్రసర్వక్షయం కృత్వా తావుభౌ రామకేశవౌ.
నాతిచక్రామతుః కాలంప్రాప్తంసర్వహరంమహత్
యత్రార్జునో ద్వారవతీమేత్య వృష్ణివినాకృతాం.
దృష్ట్వా విషాదమగమత్ పరాం చార్తిం నరర్షభః
ససంస్కృత్య నరశ్రేష్ఠం మాతులం శౌరిమాత్మనః.
దదర్శయదువీరాణా మాపానేవైశసం మహత్
శరీరం వాసుదేవస్య రామస్య చ మహాత్మనః.
సంస్కారం లంభయామాసవృష్ణీనాంచప్రధానతః
స వృద్ధబాలమాదాయ ద్వారవత్యాస్తతో జనం.
దదర్శాపదికష్టాయాం గాండీవస్య పరాభవం
సర్వేషాంచైవ దివ్యానామస్త్రాణామ ప్రసన్నతాం.
నాశం వృష్ణికళత్రాణాం ప్రభావాణా మనిత్యతాం
దృష్ట్వా నిర్వేదమాపన్నో వ్యాసవాక్యప్రచోదితః.
ధర్మరాజం సమాసాద్యసంన్యాసం సమరోచయత్
ఇత్యేతన్మౌసలం పర్వ షోడశంపరికీర్తితం.
అధ్యాయాష్టౌసమాఖ్యాతాః శ్లోకానాంచశతత్రయం
శ్లోకానాం వింశతిశ్చైవ సంఖ్యాతాస్తత్వ దర్శినా.
మహాప్రస్థానికం తస్మాదూర్ధ్వంసప్తదశం స్మృతం
యత్ర రాజ్యం పరిత్యజ్య పాండవాః పురుషర్షభాః.
ద్రౌపద్యాసహితాదేవ్యా మహాప్రస్థాన మాస్థితాః
యత్రతేఽగ్నిం దదృశిరేలౌహిత్యం ప్రాప్యసాగరం.

యత్రాగ్నినా చోదితశ్చ పార్థస్తస్మై మహాత్మనే
దదౌ సంపూజ్య తద్దివ్యం గాండీవం ధనురుత్తమం.
యత్ర భ్రాతౄన్ నిపతితాన్ ద్రౌపదీంచ యుధిష్ఠిరః
నదృష్ట్వా హిత్వా జగామైవ సర్వాననవలోకయన్.
ఏతత్ సప్తదశం పర్వ మహాప్రస్థానికం స్మృతం
యత్రాధ్యాయాస్త్రయః ప్రోక్తాః శ్లోకానాంచ శత
త్రయం.
వింశతిశ్చ తథా శ్లోకాః సంఖ్యాతాస్తత్వదర్శినా
స్వర్గపర్వతతో జ్ఞేయం దివ్యం యాత్ తదమానుషం.
ప్రాప్తం దైవరథం స్వర్గాన్నేష్టవాన్ యత్ర ధర్మరాట్
ఆరోఢుం సుమహాప్రాజ్ఞ ఆనృశంస్యాచ్ఛునా వినా.
తామస్యావిచలాం జ్ఞాత్వా స్థితిం ధర్మే మహాత్మనః
శ్వరూపం యత్ర తత్ త్యక్త్వా ధర్మేణాసౌ సమన్వితః.
స్వర్గం ప్రాప్తః సచ తథా యాతనా విపులా భృశం
దేవదూతేన నరకం యత్ర వ్యాజేన దర్శితం.
శుశ్రావ యత్ర ధర్మాత్మా భ్రాతౄణాం కరుణాగిరః
నిదేశే వర్తమానానాం దేశే తత్రైవ వర్తతాం.
అనుదర్శితశ్చ ధర్మేణ దేవరాజేన పాండవః
ఆప్లుత్యాకాశగంగాయాం దేహం త్యక్త్వా సమా
నుషం
స్వధర్మనిర్జితం స్థానం స్వర్గే ప్రాప్య సధర్మరాట్
ముముదే పూజితః సర్వైః సేన్ద్రైః సురగణైః సహ.
ఏతదష్టాదశం పర్వ ప్రోక్తం వ్యాసేన ధీమతా
అధ్యాయాః పంచ సంఖ్యాతాః పర్వణ్యస్మిన్ మహాత్మనా.
శ్లోకానాం ద్వేశతే చైవ ప్రసంఖ్యాతే తపోధనాః
నవ శ్లోకాస్తథైవాన్యే సంఖ్యాతాః పరమర్షిణా.
అష్టాదశైవమేతాని పర్వాణ్యుక్తాన్యశేషతః
ఖిలేషు హరివంశశ్చ భవిష్యం చ ప్రకీర్తితం.
దశ శ్లోకసహస్రాణి వింశచ్ఛ్లోకశతానిచ
ఖిలేషు హరివంశే చ సంఖ్యాతాని మహర్షిణా.

ఏతత్ సర్వం సమాఖ్యాతం భారతే పర్వసంగ్రహః
అష్టాదశ సమాజగ్ముః అక్షౌహిణ్యో యుయుత్సయా.
తన్మహాదారుణం యుద్ధం మహాన్యష్టాదశాభవత్
యో విద్యాచ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః
నచాఖ్యానమిదం విద్యాన్నైవ స స్యాద్విచక్షణః
అర్థశాస్త్రమిదం ప్రోక్తం ధర్మశాస్త్రమిదం మహత్
కామశాస్త్రమిదం ప్రోక్తం వ్యాసేనామితబుద్ధినా
శ్రుత్వా త్విదముపాఖ్యానం శ్రావ్యమన్యన్న రోచతే.
పుంస్కోకిలరుతం శ్రుత్వా రూక్షా ధ్వాంక్షస్య వాగివ
ఇతిహాసోత్తమాదస్మాజ్జాయన్తే కవిబుద్ధయః.
పంచభ్య ఇవ భూతేభ్యో లోకసంవిధయస్త్రయః
అస్యాఖ్యానస్య విషయే పురాణం వర్తతే ద్విజాః.
అన్తరిక్షస్య విషయే ప్రజా ఇవ చతుర్విధాః
క్రియాగుణానాం సర్వేషామిదమాఖ్యానమాశ్రయః.
ఇన్ద్రియాణాం సమస్తానాం చిత్రా ఇవ మనః క్రియాః
అనాశ్రిత్యైతదాఖ్యానం కథా భువి న విద్యతే.
ఆహారమనపాశ్రిత్య శరీరస్యేవ ధారణం
ఇదం కవివరైః సర్వైరాఖ్యానముపజీవ్యతే.
ఉదయప్రేప్సుభిర్భృత్యైరభిజాత ఇవేశ్వరః
అస్య కావ్యస్య కవయో న సమర్థా విశేషణే.
సాధోరివ గృహస్థస్య శేషాస్త్రయ ఇవాశ్రమాః.
ధర్మే మతిర్భవతు వః సతతోత్థితానాం
స హ్యేక ఏవ పరలోకగతస్య బంధుః
అర్థాః స్త్రియశ్చ నిపుణైరపి సేవ్యమానా
నైవాప్తభావముపయాన్తి న చ స్థిరత్వమ్.
ద్వైపాయనోష్ఠపుటనిఃసృతమప్రమేయం
పుణ్యం పవిత్రమధ పాపహరం శివంచ
యో భారతం సమధిగచ్ఛతి వాచ్యమానం
కిం తస్య పుష్కరజలైరభిషేచనేన.
యదహ్నా కురుతే పాపం బ్రాహ్మణస్త్విన్ద్రియైశ్చరన్

# పౌష్య పర్వము

శ్రుతసేన ఉగ్రసేన భీమసేనులనే ముగ్గురు సోదరులూ ఉండగా పరీక్షిత్తు కుమారుడైన జనమే జయుడు కురుక్షేత్రంలో యజ్ఞానుష్ఠానం సాగిస్తు న్నాడు. చిరకాలంగా సాగుతున్న ఆ యజ్ఞశాల లోకి దేవతాశ్వానమైన సరమయొక్క సుతుడు సారమేయుడు వచ్చాడు. యజ్ఞవేదికను సమీ పించబోయే ఆ కుక్కను యజ్ఞదీక్షితుడైన జనమే జయుని సోదరులు అదలించారు. అది ఏడుస్తూ వెళ్ళిపోగా తల్లి దాని విచారానికి కారణం అడి గింది. అప్పుడు సారమేయుడు జరిగిన కథ వివరిం చాడు. వినిన తల్లి - నాయనా! నీవల్లనే ఏదో అప రాధం జరిగి ఉంటుంది. అనగా - అమ్మా! నేను ఆ హవిస్సు చూడలేదు. ముట్టలేదు. ఇక నేను చేసిన అపరాధం ఏమిటి-అన్నాడు సారమేయుడు. కొడుకు దుఃఖాన్ని చూసి విచారంతో జనమే జయుడు సత్రయాగం సాగించే స్థలానికి వచ్చింది. వచ్చిన సరమ జనమేజయుని సమీపించి — మహా రాజా! నా కుమారుడు ఏవిధమైనదోషం చెయ్య కుండా ఇక్కడ ఎందుకు కొట్టారు — అని ప్రశ్నిం చింది-

ఆ ప్రశ్నకు సోదరసహితుడైన జనమేజయుడు నిరుత్తరుడయాడు. సరమ గొంతువిప్పి - నిరపరా ధిని శిక్షించిన కారణంగా మీకు బ్రహ్మాండమైన భయం కలుగుగాక — అని వెళ్ళిపోయింది. దేవ శునక శాపభీతి జనమేజయుని హృదయాన్ని కద లించింది. అతడు సత్రయాగం పరిసమాప్తి చేసి దుఃఖితహృదయంతో హస్తినాపురానికివచ్చి సర్వ సమర్థుడైన పురోహితుని అన్వేషించసాగాడు. ఒక నాడు తన రాజ్యభాగంలోని అరణ్యానికి వేటకు వెళ్ళిన జనమేజయుడు ఒకానొక ఆశ్రమాన్ని అం దులో శ్రుతశ్రవసుడనే ఋషినీ చూశాడు. ఈ శ్రుతశ్రవసుని కుమారుడైన సోమశ్రవుని తనకు పురోహితునిగా దయచేయ కోరాడు.

మహారాజా! తపస్స్వాధ్యాయనిరతుడైన ఈ సోమశ్రవసుడు నా వీర్యాన్ని ఆరగించిన సర్ప గర్భం నుంచి ఆవిర్భవించాడు. పరాత్పరుడైన శంక రుని ఆజ్ఞలను మాత్రం వీడు నిరోధించ లేడు. నీ పాపకర్మలను నిర్మూలించడానికితను సమర్థుడు. ఒక్క రహస్యంమాత్రం నీకు చెప్పాలి. ఏ బ్రాహ్మ ణుడైనా వచ్చి దేహీ అంటే మాత్రం అసంతృప్త హృదయంతో తిరిగి వెళ్ళనివ్వడు. అతని అభిరుచిని సహించే ఔదార్యం నీలో ఉంటే నిస్సందేహంగా తీసికొని వెళ్లు — అన్నాడు శ్రుతశ్రవసుడు.

మహర్షి ఆయన అభీష్టానుసారం జరపడానికి కేమీ అభ్యంతరం లేదు — అని జనమేజయుడు సోమశ్రవసుని పురోహితునిగా స్వీకరించి నిజనగరా నికిపోయి విషయాలను సోదరులకు వివరించాడు. అది మొదలు వారందరూ సోమశ్రవసుని కనుసన్న లలో మెలగసాగారు. సోదరులు ముగ్గురినీ గురు పూజ్యుని అధీనంలో ఉంచి జనమేజయుడు తక్ష శిలపై దాడివెడలి దాన్ని జయించి వచ్చాడు.

ఆ కాలంలో ఆయోదధౌమ్యుడనే పేరుగల ఋషి ప్రఖ్యాతుడై ఉన్నాడు. ఆయనకు ముగ్గురు శిష్యులు .(ఉపమన్యువు, ఆరుణి, వేదుడు) ఆయో దధౌమ్యుడు ఒకనాడు ఆరుణిని పిలిచి పొలంపోయి

మహాభారతమాఖ్యాయ సంధ్యాం ముచ్యతి పశ్చిమాం
యద్రాత్రౌ కురుతే పాపం కర్మణా మనసా గిరా
మహాభారత మాఖ్యాయ పూర్వాం సంధ్యాం
ప్రముచ్యతే
యో గోశతం కనకశృంగమయం దదాతి
విప్రాయ వేదవిదుషే చ బహుశ్రుతాయ
పుణ్యాం చ భారతకథాం శృణుయాచ్చ నిత్యం
తుల్యం ఫలం భవతి తస్య చ తస్య చైవ.
ఆఖ్యానం తదిదమనుత్తమం మహార్థం
విజ్ఞేయం మహదిహ పర్వసంగ్రహేణ
శ్రుత్వాదౌ భవతి నృణాం సుఖావగాహం
విస్తీర్ణం లవణజలం యథా ప్లవేన.

ఇది
పర్వసంగ్రహాధ్యాయము

* * *

జనమేజయః పారిక్షితః సహ భ్రాతృభిః కురుక్షేత్రే దీర్ఘసత్రముపాస్తే తస్య భ్రాతరస్త్రయః శ్రుతసేన ఉగ్రసేనో భీమసేన ఇతి తేషు తత్సత్రముపాసీనేష్వాగచ్ఛత్సారమేయః.

స జనమేజయస్య భ్రాతృభిరభిహతో రోరూయమాణో మాతుః సమీపముపాగచ్ఛత్.

తం మాతా రోరూయమాణమువాచ కిం రోదిషి కేనాస్యభిహత ఇతి.

స ఏవముక్తో మాతరం ప్రత్యువాచ జనమేజయస్య భ్రాతృభిరభిహతోఽస్మీతి.

తం మాతా ప్రత్యువాచ వ్యక్తం త్వయా తత్రాపరాధం యేనాత్రాభిహత ఇతి.

స తాం పునరువాచ నాపరాధ్యామి కించిన్నావేక్షే హవీంషి నావలిహ ఇతి.

తచ్ఛ్రుత్వా తస్య మాతా సరమా పుత్రదుఃఖార్తా తత్సత్రముపాగచ్ఛద్యత్ర స జనమేజయః సహ భ్రాతృభిర్దీర్ఘసత్రముపాస్తే.

స తయా క్రుద్ధయా తత్రోక్తోఽయం మే పుత్రో న కించిదపరాధ్యతి నావేక్షతే హవీంషి నావలేఢి కిమర్థమభిహత ఇతి.

న కించిదుక్తవన్తస్తే సా తానువాచ యస్మాదయమభిహతోఽనపకారీ తస్మాదదృష్టం త్వాం భయమాగమిష్యతీతి.

జనమేజయ ఏవముక్తో దేవశున్యా సరమయా భృశం సంభ్రాన్తో విషణ్ణశ్చాసీత్.

స తస్మిన్ సత్రే సమాప్తే హాస్తినపుర ప్రత్యేత్య పురోహిత మనురూపమన్విచ్ఛమానః పరం యత్నమకరోద్యో మే పాపకృత్యాం శమయేదితి.

స కదాచిన్మృగయాం గతః పారీక్షితో జనమేజయః కస్మింశ్చిత్ స్వవిషయ ఆశ్రమమపశ్యత్.

తత్ర కశ్చిదృషిరాసాం చక్రే శ్రుతశ్రవా నామ తస్య తపస్యాభిరతః పుత్ర ఆస్తే సోమశ్రవా నామ.

తస్య తం పుత్రమభిగమ్య జనమేజయః పారీక్షితః పౌరోహిత్యాయ వవ్రే.

బోది గట్టుకు కట్టవేసి రమ్మన్నాడు. ఆరుణి ఎంత ప్రయత్నించినా గట్టు నిలబడలేదు. అంతట్లో తానే ప్రవాహానికి అడ్డంగా పడుకున్నాడు. తరువాయి ఆయోదధౌమ్యుడు ఆరుణి తిరిగి రాని వార్త విని శిష్యులతో చేనుగట్టుకు పోయి ఆరుణీ అని పిలిచాడు. ఆ పిలుపు విని ఆరుణి తక్షణం ఉపాధ్యాయుని దగ్గరకు వచ్చి జరిగిన విషయాన్ని విన్నవించాడు. ఆశ్చర్య చకితుడైన ఆచార్యుడు నాటి నుండీ ఆరుణిని ఉద్దాలక నామంతో పిలువసాగాడు.

ఉద్దాలకఆరుణియొక్క శుశ్రూషాపరాయణతకు పరమప్రమోదంచెందిన ఆచార్యుడు అతనిని ఆశీర్వదిస్తూ సర్వవేదశాస్త్రాలూ నీబుద్ధికిస్వయంగా ప్రకాశిస్తాయి. నీకు కళ్యాణార్హత ప్రాప్తించింది. నీ అభీష్టానుసారం వెళ్ళవచ్చు — అని అనుజ్ఞ యిచ్చాడు. ఉద్దాలకుడు యథేచ్ఛగా వెళ్ళిపోయాడు.

ఉపాధ్యాయుని ఆదేశానుసారం ఉపమన్యువు గోవుల్ని సంరక్షిస్తూ రాత్రిపడగానే గురువుయెదుట నిలబడి నమస్కరించేవాడు. ఒక నాడు ఉపాధ్యాయుడు ఉపమన్యువును చూచి నాయనా! నువ్వింత బలిష్ఠంగా ఉండడానికి హేతువేమిటి ? అన్నాడు. మహర్షీ! నేను భిక్షావృత్తితో జీవిస్తున్నాను—అన్నాడు శిష్యుడు. నేటినుండి నాకు సమర్పించకుండా నువ్వు భిక్షాన్నాన్ని ఉపయోగించకు — అన్న ఆచార్యుని వాక్యానుసారం చరించసాగాడు ఉపమన్యువు. భిక్షాటనంతో సంపాదించుకునే ఆహారాన్ని పూర్తిగా గురువుగారికే సమర్పిస్తూ గోసంరక్షణం చేస్తూనా్న ఉపమన్యువు శరీరం బలిష్ఠంగానే ఉండడం చూసి-ఇప్పుడు నువ్వు ఎలా జీవిస్తున్నావు — అనగా రెండోసారి భిక్షచేసి జీవిస్తున్నా — నని జవాబిచ్చాడు. రెండుసార్లు నువ్వు భిక్షచేయటంవల్ల ఇతరులకు హాని చేస్తున్నావు. అందుచేత నువ్వు రెండోసారి భిక్ష చేయటం మానెయ్యాలి — అన్నాడు ఉపాధ్యాయుడు. ఉపమన్యువు ఆ విధంగానే చేస్తూ సంధ్యాసమయంలో గురువు ఎదుట నిలిచేసరికి — శిష్యా! నువ్వు భిక్షనంతనూ నాకే అర్పిస్తున్నా ఇంకా ఇంత బలిష్ఠంగా ఎలా ఉన్నావు — అనగా గురువరా ! నేను మేపుతూన్న ఆవుపాలతో జీవిస్తున్నాను — అన్నాడు.

ఈ ఆవుపాలు ఆరగించడానికి నీకు నేను అనుమతి ఇవ్వలేదు. నువ్వు వీటిని త్రాగడం ఉచితం గాదు — అనడంతో ఉపమన్యువు నాటినుండీ పాలు త్రాగడం మానేసినా బలిష్ఠుడుగా ఉండం చూసి తిరిగీ ప్రశ్నించాడు. ఈ దూడలు పాలు త్రాగే సమయంలో వెలువడే నురగను ఆరగించి జీవిస్తున్నాను — అన్నాడు ఉపమన్యువు.

దూడలు ఉత్తమ గుణాలతో ఉన్నందువల్ల నీయందు దయతో ఎంతో నురగను వదిలేస్తున్నాయి. ఆ ఫేనాన్ని ఆరగించి నువ్వు వీని జీవనాహారాన్ని హరిస్తున్నావు. నేటినుంచి ఈ నురగ కూడా ఆరగించకు — అని గురువు ఆజ్ఞాపించటంతో ఉపమన్యువు రెండవసారి భిక్షాటనం మానేసినట్లే ఫేనాన్నికూడా విడిచేశాడు. ఆహారం లేకపోవడం వల్ల కలిగిన బాధతో అర్కపత్రాలు భక్షించాడు. చేదుతోకూడిన ఉప్పదనానికి ఘాటు తోడుకావడమే కాక ఈ జిల్లేడాకులు జీర్ణకోశంలో అగ్నిజ్వాలలుకూడా రేపాయి. ఆ అగ్ని కళ్ళను నాశనంచేసింది. అంధుడై ఉపమన్యువు అటూ ఇటూ తిరుగుతూ సమీపంలో ఉన్న ఓ నూతిలో పడిపోయాడు.

స నమస్కృత్య తమృషిమువాచ భగవన్నయం తవ పుత్రో మమ పురోహితోఽస్త్వితి.

స ఏవముక్తః ప్రత్యువాచ జనమేజయం భో జనమేజయ పుత్రోఽయం మమ సర్ప్యాం జాతో మహాతపస్వీ స్వాధ్యాయ సంపన్నో మత్తపోవీర్యసంభృతో మచ్ఛుక్రం పీతవత్యాస్తస్యాః కుక్షౌ జాతః.

సమర్థోఽయం భవతః సర్వాః పాపకృత్యాః శమయితుమన్తరేణ మహాదేవకృత్యాం.

అస్య త్వేకముపాంశువ్రతం యదేనం కశ్చిద్ బ్రాహ్మణః కంచిదర్థమభియాచేత్ తం తస్మై దద్యాదయం యద్యేతదుత్సహసే తతో నయస్వైనమితి.

తేనైవముక్తో జనమేజయస్తం ప్రత్యువాచ భగవంస్తత్ తథా భవిష్యతీతి.

స తం పురోహితముపాదాయోపావృత్తో భ్రాతౄనువాచ మయాయం వృత ఉపాధ్యాయో యదయం బ్రూయాత్ తత్ కార్యమవిచారయద్భిర్భవద్భిరితి తేనైవముక్తా భ్రాతరస్తస్య తథా చక్రుః స తథా భ్రాతౄన్ సందిశ్య తక్షశిలాం ప్రత్యభిప్రతస్థే తంచ దేశం వశే స్థాపయామాస.

ఏతస్మిన్నంతరే కశ్చిదృషిర్ధౌమ్యోనామాయోదస్తస్య శిష్యాస్త్రయో బభూవురుపమన్యురారుణిర్వేదశ్చేతి.

స ఏకం శిష్యమారుణిం పాంచాల్యం ప్రేషయామాస గచ్ఛ కేదారఖండం బధానేతి.

స ఉపాధ్యాయేన సందిష్ట ఆరుణిః పాంచాల్యస్తత్రగత్వా తత్ కేదారఖండం బద్ధుం నాశక్నోత్ స క్లిశ్యమానోపశ్యదుపాయం భవత్వేదం కరిష్యామి.

స తత్ర సంవివేశ కేదారఖండే శయానే చ తథా తస్మింస్తదుదకం తస్థౌ.

తతః కదాచిదుపాధ్యాయ ఆయోదో ధౌమ్యః శిష్యానపృచ్ఛత్ క్వ ఆరుణిః పాంచాల్యో గత ఇతి.

తే తం ప్రత్యూచుర్భగవం స్త్వయైవ ప్రేషితో గచ్ఛ కేదారఖండం బధానేతి స ఏవముక్తస్తాన్ శిష్యాన్ ప్రత్యువాచ తస్మాత్ తత్ర సర్వే గచ్ఛామో యత్ర సగత ఇతి.

స తత్ర గత్వా తస్యాహ్వానాయ శబ్దం చకార భో ఆరుణే పాంచాల్య క్వాసి వత్సైహీతి.

స తచ్ఛ్రుత్వా ఆరుణిరుపాధ్యాయాయ వాక్యం తస్మాత్ కేదారఖండాత్ సహసోత్థాయ తముపాధ్యాయ ముపతస్థే.

ప్రోవాచ చైనమయమస్మ్యత్ర కేదారఖండే నిస్సరమాణ ముదకమవారణీయం సంరోద్ధుం సంవిష్టో భగవచ్ఛబ్దం శ్రుత్వైవ సహసా విదార్య కేదారఖండం భవన్త ముపస్థితః.

తదభివాదయే భగవన్త మాజ్ఞాపయతు భవాన్ కిమర్థం కరవాణీతి.

స ఏవముక్త ఉపాధ్యాయః ప్రత్యువాచ యస్మాద్ భవాన్ కేదారఖణ్డం విదార్యోత్థితస్తస్మాదుద్దాలక ఏవ నామ్నా భవాన్ భవిష్యతీత్యుపాధ్యాయేనానుగృహీతః.

యస్మాచ్చ త్వయా మద్వచనమనుష్ఠితం తస్మాచ్ఛ్రేయోఽవాప్స్యసి సర్వే చ తే వేదాః ప్రతిభాస్యన్తి సర్వాణి చ ధర్మశాస్త్రాణీతి.

స ఏవముక్త ఉపాధ్యాయేనేష్టం దేశం జగామ అథాపరః శిష్యస్తస్యైవాయోదస్య ధౌమ్యస్యోపమన్యుర్నామ.

సాయం సంధ్యారోచులు ఆశ్రమప్రాంతాలలో విహరిస్తున్నా ఉపమన్యువు తిరిగి రాకపోవటాన్ని గమనించి గురువు వెదకడానికి బయల్దేరాడు. శిష్యులతో అరణ్యంలో తిరుగుతూ ఉపమన్యువును పిలవసాగాడు. కొంతసేపటికి నూతిలో నుండి ఉపమన్యువు తనస్థితిని వివరిస్తూ అరిచాడు. అప్పుడు గురువు అశ్వినీ దేవతలను స్తుతించమని ఆజ్ఞాపించాడు. శిష్యుడు ఋగ్వేదమంత్రాలతో స్తుతి చేయసాగాడు.

ఓ అశ్వినీకుమారులారా మీరు సృష్ట్యాదినుంచీ ఉన్నవారు. మీరే ముందుగా జన్మించినవారు. మీరే చిత్రభానులు. నేను నా వాక్కుతో నా తపస్సుతో మిమ్ము ప్రార్థిస్తున్నాను. దివ్యస్వరూపులూ అనంతులూ అయిన మీరు అందమైన రెక్కలుగల పక్షులవలె ఎప్పుడూ కలిసి విహరిస్తుంటారు. రజోహంకారశూన్యులై ఈ విశ్వానికి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తున్నారు. పారలౌకిక ఔన్నత్యసాధనసంపన్నులైన మీరు విజయశీలురు. సూర్యపుత్రులైన మీరు రాత్రింబవళ్ళనే దారాలతో సంవత్సర వస్త్రాన్ని నేస్తుంటారు. ఆ వస్త్రాలతో దేవయాన పితృయాన సుందర మార్గాలను ప్రసాదిస్తున్నారు.

పరమాత్మయొక్క కాల శక్తి జీవరూపమైన పక్షిని ఆహారంగా చేసుకుంటే అశ్వినీకుమారులనే జీవన్ముక్తులు జ్ఞానప్రసాదంతో కైవల్యసౌభాగ్యాన్నిచ్చి జీవికి కాలబంధంనుంచి ముక్తిని దయచేశారు. మాయావిమోహితుడై అజ్ఞానంతో రాగాది విషయలోలుడై ఉన్నంతవరకూ జీవి శరీర బంధనుడే. పగలు రాత్రి అనేవి మనోవాంఛాఫల క్షీరాలనిచ్చే మూడువందల అరవై గోవులు. ఇవి వత్సరరూపమైన దూడను కని బలిష్ఠంగా ఉంచుతాయి. ఈదూడ ఉత్పాదకమూ సంహారకమూ కూడా అవుతుంది. జిజ్ఞాసువులైన పురుషులు వత్సరవత్సాన్ని నిమిత్తమాత్రంగా భావించి ఈ గోవుల నుంచి విభిన్నమైన ఫలాలను పొందుతూ ఉంటారు. ఆ గోవులనుండి తత్త్వజ్ఞానరూపాక్షీరాన్ని పిండే మహామహులు మీరే అంటూ ఉపమన్యువు అశ్వినీ దేవతలను ఇంకా స్తుతిస్తున్నాడు.

ఓ అశ్వినీకుమారులారా! ఏకమాత్రసంవత్సరం నాభిగాగల ఈ కాలచక్రానికి రాత్రింబవళ్ళనే ఏడు వందలఇరవై ఆకులున్నాయి. మాయామయమూ అవినాశకరమూ అయిన ఈ కాలచక్రం నేమిరహితంగా అనియతిగతిలో చరిస్తూ ఇహ పరలోక ప్రజల్ని నశింపజేస్తూంటుంది. కర్మ ఫల ధారణకాధారభూతమైన ఈ కాలచక్రంనుండి నన్ను విముక్తుణ్ణి చేయండి. సదాచార సంపత్తితో సత్కీర్తితో మీరు అమృతచంద్రుల ఉజ్జ్వలత్వాన్ని త్రోసివేశారు. మేరువుని విడిచి సంతోషంతో పృథ్వీమీద విహరించే మీరు ఆనందబలాలను ప్రసాదిస్తుంటారు. సృష్ట్యాదిలో దిశావిభాగాన్ని చేసేవారు మీరే. అంతరిక్షంలో ప్రయాణిస్తూ ప్రపంచానికి ప్రకాశం యిచ్చే సూర్యునీ భూతపంచకాన్నీ మీరే తెలియబరుస్తారు. సూర్యుని ప్రస్థానాన్ని అనుసరించి ఋషిమండలం నడుస్తుంది. అధికారానుసారం దేవమానవులు స్వర్గమర్త్యాలలో చరిస్తారు. మీరు సృజించే ఓషధులే ఈ ప్రపంచాన్ని పోషిస్తున్నాయి. ప్రాణికోటి అంతా ఈ ఓషధులతోనే జీవిస్తున్నది. మిమ్మల్నీ మీరు ధరించిన కమలమాలికనూ పూజిస్తాను. మీరు దేవతలు మాత్రమే కాదు ; సత్యభాషణ ప్రచారంకోసం

తం చోపాధ్యాయః ప్రేషయామాస వత్సోపమ
న్యో గా రక్షస్వేతి.

స ఉపాధ్యాయ వచనా దరక్షద్ గాః ; సచా
హానిగా రక్షిత్వా దివసక్షయే గురుగృహమాగ
మ్యోపాధ్యాయస్యాగ్రతః స్థిత్వా నమశ్చక్రే.

త ముపాధ్యాయః పీవానమపశ్యదువాచ చైనం
వత్సోపమన్యో కేన వృత్తిం కల్పయసి పీవానసి
దృఢమితి.

స ఉపాధ్యాయం ప్రత్యువాచ భో భైక్ష్యేణ
వృత్తిం కల్పయామీతి.

తముపాధ్యాయః ప్రత్యువాచ మయ్యనివేద్య
భైక్ష్యం నోపయోక్తవ్యమితిసతథేత్యుక్త్వా భైక్ష్యం
చరిత్వోపాధ్యాయాయ న్యవేదయత్.

స తస్మాదుపాధ్యాయః సర్వమేవ భైక్ష్యమగృ
హ్ణాత్ సతథేత్యుక్త్వా పునరరక్షద్గాః అహనిరక్షి
త్వా నిశాముఖే గురుకులమాగమ్య గురోరగ్రతః
స్థిత్వా నమశ్చక్రే.

తముపాధ్యాయ స్తథాపి పీవానమేవ దృష్ట్వో
వాచ వత్సోపమన్యో సర్వమశేషత స్తే భైక్ష్యం
గృహ్ణామి కేనేదానీం వృత్తిం కల్పయసీతి.

స ఏవముక్తఉపాధ్యాయం ప్రత్యువాచ భగ
వతే నివేద్యపూర్వమపరం చరామి తేన వృత్తిం
కల్పయామీతి.

తముపాధ్యాయః ప్రత్యువాచ నైషాన్యాయ్యా
గురువృత్తిరన్యేషామపి భైక్షోపజీవినాం
వృత్త్యుపరోధం కరోషి ఇత్యేవం వర్తమానో
లుబ్ధోఽసీతి.

స తథేత్యుక్త్వా గా అరక్షత్ రక్షిత్వా చ
పునరుపాధ్యాయగృహ మాగమ్యోపాధ్యాయస్యా
గ్రతః స్థిత్వా నమశ్చక్రే.

తముపాధ్యాయ స్తథాపి పీవానమేవ దృష్ట్వా
పునరువాచ వత్సోపమన్యో అహం తే సర్వం
భైక్ష్యం గృహ్ణామి న చాన్యచ్చరసి పీవానసి
భృశం కేన వృత్తిం కల్పయసీతి.

స ఏవముక్త స్తముపాధ్యాయం ప్రత్యువాచ భో
ఏతాసాం గవాం పయసా వృత్తిం కల్పయామీతి.

తమువాచోపాధ్యాయో నైతన్న్యాయ్యం పయ
ఉపయోక్తుం భవతో మయాఽనాభ్యనుజ్ఞాతమితిః

స తథేతి ప్రతిజ్ఞాయ గా రక్షిత్వా పునరుపాధ్యా
య గృహమేత్య గురోరగ్రతః స్థిత్వా నమశ్చక్రే.

తము పాధ్యాయః పీవానమేవ దృష్ట్వోవాచ
వత్సోపమన్యోభైక్ష్యం నాశ్నాసి న చాన్యచ్చరసి
పయో న పిబసి పీవానసి భృశం కేనేదానీం వృత్తిం
కల్పయసీతి.

స ఏవముక్త ఉపాధ్యాయం ప్రత్యువాచ భోః
ఫేనం పిబామి య మిమే వత్సా మాతౄణాం
స్తనాత్ పిబన్త ఉద్గిరన్తి.

తముపాధ్యాయః ప్రత్యువాచ ఏతేత్వదనుక
మ్పయా గుణవన్తోవత్సాః ప్రభూతతరం ఫేనముద్గి
రన్తి తదేషామపి వత్సానాం వృత్త్యుపరోధం కరో
ష్యేవం వర్తమానః ఫేనమపి భవాన్న పాతుమర్హ
తీతి సతథేతిప్రతిశ్రుత్య పునరరక్షద్గాః.

తథా ప్రతిసిద్ధో భైక్ష్యం నాశ్నాతి న చాన్య
చ్చరతి పయోన పిబతి ఫేనం నోపయుఙ్క్తేస కదా
చిదరణ్యే క్షుధార్తోఽర్కపత్రాణ్యభక్షయత్.

స తై రర్కపత్రై ర్భక్షితైః క్షారతిక్తకటురూక్షై
స్తీక్ష్ణవిపాకై శ్చక్షుష్యుపహతోఽన్ధోబభూవ తతః
సోఽన్ధోఽపి చఙ్క్రమ్యమాణః కూపేపపాత.

అథ తస్మిన్ననాగచ్ఛతి సూర్యే చాస్తాచలా
వలంబిని ఉపాధ్యాయః శిష్యానవోచత్ నాయా

జీవికసాగిస్తున్నవారు ; మీ సహకారంతోనే సత్యాన్వేషణ సాగుతుంది.

యువదంపతులు అన్నరూపంలో సంతానోత్పత్తికై గర్భాన్ని ధరిస్తారు. అది పురుషునియందు వీర్యంగానూ స్త్రీయందు రజస్సుగానూ పరిణమిస్తుంది. జడరూపమైన వివి అనంతరం స్త్రీ గర్భంనుండి జన్మించిన శిశువు తల్లి స్తనాలనుండి పాలను త్రాగుతూ పెరుగుతుంది. ఈ ప్రకారంగా పెరిగే జీవులందరకూ జ్ఞానం యిచ్చి ముక్తి ప్రసాదించే మీరు నాకు నేత్రదానం చేసి రోగవిముక్తి కల్గించండి. మీ గుణగణాలను స్తుతించే శక్తి నాకు లేదు. నేను నేత్రాలులేక ఈ నూతిలో పడిపోయాను. శరణాగత వత్సలులైన మీరు నన్ను అనుగ్రహించండి — అని ఉపమన్యువు అనేక విధాల స్తుతించగా ప్రసన్నులైన అశ్వినీదేవతలు దర్శనమిచ్చి వానికి అపూపాలిస్తూ ఆరగించుమన్నారు. ఉపమన్యువు ఆ అపూపాలు గురువుగారికి నివేదించకుండా తినలేనన్నాడు. ఇతఃపూర్వం నీ గురువుకూడా వీనిని తన గురువుకు నివేదించకుండానే ఆరగించాడు. కనక నువ్వూ అదేవిధంగా చెయ్యి — అన్నారు అశ్వినులు.

ఏమయినా గురునివేదనం చేయకుండా నేను తినలేను - అన్నాడు ఉపమన్యువు. వాని గురుభక్తికి ప్రీతులై అశ్వినులు ఇలా అన్నారు. నాయనా! నీ గురువు దంతాలు ఇనుమువలె ఉన్నాయి. నీ దంతాలు సువర్ణమయాలవుగాక. నీకు నేత్రాలు కూడా ప్రాప్తించుగాక. నీకు కళ్యాణమగుగాక — అనివారు అనుగ్రహించేసరికి ఉపమన్యువు తన దృష్టిని పొంది గురుసన్నిధానానికి పోయి ఆయనకు అభివాదంచేసి విషయాలన్నీ చెప్పాడు. ఆయోద ధౌమ్యుడు సంతుష్టచిత్తుడై — వారు అనుగ్రహించినట్లు నువ్వు కళ్యాణభాగస్వామివి అవుతావు. వేదశాస్త్రాలన్నీ నీ బుద్ధికి గోచరిస్తాయి- అని అతనికి అనుజ్ఞ ఇచ్చాడు.

అనంతరం మూడోశిష్యుడైన వేదుని పిలిచి శుశ్రూషతో తనయింటివద్ద ఉండుమన్నాడు- ఉపాధ్యాయుడు. గురువాక్యపాలనం శుభావహమని వేదుడు ఆదేవిధంగా చరించసాగాడు. గురుశుశ్రూషలో వేదుడు నిద్రాహారాల్ని సైతం విస్మరించేవాడు. ఎంతటి భారాన్నయినా అనాయాసంగా వహించేవాడు. ఇలా గురువుయొక్క అనుగ్రహాన్ని పొంది సర్వశుభాలతో విద్యావిదుడైనాడు. సమావర్తనానంతరం స్నాతకుడై గృహస్థాశ్రమం స్వీకరించాడు వేదుడు. గురుగృహంలో పడిన క్లేశాలు తలపుకురాగా వేదుడు తనవద్దనున్న శిష్యత్రయంచేత ఎన్నడూ ఏపనీ చేయించేవాడు కాదు. శిష్యులయందు సంపూర్ణ హృదయంతో విద్య నేర్పేవాడు.

ఈప్రకారం వేదుడు జీవయాత్ర సాగిస్తుండగా జనమేజయ పౌష్యులు వచ్చి ఆయనను గురువుగా వరించి అధ్యయనం సాగించారు. ఒకనాడు వేదుడు ఏదోవాక కార్యార్థియై గ్రామాంతరం పోతూ ఉదంకుడనే పేరుగల శిష్యుని పిలచి అగ్నికార్యం నిర్వహించమని చెపుతూ ఇంటిలో ఏ పనయినా సరే నువ్వు పూర్తిచెయ్యి. నేను లేని లోటు నువ్వు కనిపించనివ్వకు— అని ఆచార్యవేదుడు వెళ్ళాడు. ఉదంకుడు ఆ ప్రకారంగా సాగిస్తూండగా ఆగృహంలోని మహిళామణులు ఉదంకుని పిలచి— ఉదంకా! గురుపత్ని రజస్వలై ఉంది. ఋతుకాలం నిష్ఫలం అవుతుందని ఆమె చింతిస్తోంది.

స త్వం సర్వశరీరేణ స ర్వ భ క్ష త్వ మేష్యసి.
అపానేహ్యర్చిషోయా స్తే సర్వం భక్ష్యంతితాః శిఖిన్
క్రవ్యాదాచ తనుర్యాతే సా సర్వం భక్షయిష్యతి.
యథాసూర్యాం శుభిస్సృష్టం సర్వం శుచివిభావ్యతే
తథా త్వదర్చిర్నిర్దగ్ధం సర్వం శు చి భవిష్యతి.
త్వ మగ్నే పరమం తేజః స్వప్రభావా ద్వినిర్గతం
స్వతేజసైవ తం శాపం కురుసత్య మృషేర్విభో.
దేవానాంచాత్మనోభాగంగృహాణత్వం ముఖేహుతం
ఏవ మస్త్వితి తం వహ్నిః ప్రత్యువాచ పితామహం
జగామ శాసనం క ర్తుం దేవస్య పరమేష్ఠినః
దేవర్ష యశ్చ ముదితా స్తతో జగ్ము ర్యథాగతం.
ఋషయశ్చయథాపూర్వం క్రియాస్సర్వాఃప్రచక్రిరే
దివి దేవా ముముదిరే భూతసంఘాశ్చ లౌకికాః.
అగ్నిశ్చ పరమాంప్రీతి మవాపహత క ల్మ షః
ఏవం సభగవాన్ శాపం లేభేఽగ్ని ర్భృగుతఃపురా.
ఏ వ మే ష పురావృత్తం ఇతిహాసోఽగ్నిశాపజః.
పులోమ్నశ్చ వినాశోఽయం చ్యవనస్యచ సంభవః.

7 వ అ ధ్యా య ము సమా ప్తము

ఎనిమిదవ అధ్యాయం

స చాపిచ్యవనో బ్రహ్మన్ భార్గవోఽజనయత్సుతమ్
సుకన్యాయాం మహాత్మానం ప్రమతిం దీప్తతేజసమ్.
ప్రమతిస్తు రురుంనామ ఘృతాచ్యాం సమజీజనత్
రురుః ప్రమద్వరా యాంతు శునకం సమజీజనత్.
శౌనకస్తు మహాభాగ శునకస్య సుతోభవాన్
శునకస్తు మహాసత్వః స ర్వ భా ర్గ వ నందనః
జాత స్తపసి తీవ్రేచ స్థితః స్థి ర య శా స్థ తః.
తస్యబ్రహ్మన్ రురోస్సర్వం చరితం భూరితేజసః
వి స్తరేణ ప్రవక్ష్యామి తచ్ఛృణుత్వ మ శేషతః.
ఋషిరాసీన్మహాన్ పూర్వం తపోవిద్యాసమన్వితః
స్థూలకేశ ఇతిఖ్యాత స్స ర్వ భూ త హి తే రతః.
ఏతస్మిన్నేవ కాలేతు మేనకాయాం ప్రజజ్ఞవాన్
గంధర్వరాజో వి ప్ర ర్షే విశ్వావసు రితిస్మృతః.
అప్సరా మేనకా తస్యతం గర్భం భృగునందనః
ఉత్ససర్జ యథాకాలం స్థూలకేశాశ్రమం ప్రతి.
ఉత్సృజ్యచైవ తం గర్భం నద్యా స్తీరగం జగ మసా
అప్సరామేనకా బ్రహ్మన్నిర్దయా ని ర ప త్ర పా.
కన్యామమరగర్భాభాం జ్వలంతీమివ చ శ్రి యా
తాం దదర్శ సముత్సృష్టాం నదీతీరే మహానృషిః.
స్థూలకేశ స్సతేజస్వీ విజనే బ ం ధు వ ర్జి తా మ్
సతాందృష్ట్వాతదాకన్యాం స్థూలకేశో మహాద్విజః.
జగ్రాహ చ మునిశ్రేష్ఠః కృపావిష్టః పుపోషచ
వవృధే సా వరారోహా తస్యాశ్రమ పదేశుభే.
జాతకాద్యాక్రియాశ్చాస్యావిధిపూర్వంయథాక్రమం
స్థూలకేశో మహాభాగశ్చకార సు మ హా నృ షిః.
ప్రమదాభ్యో వగా సా తు సత్వరూపగుణాన్వితా
తతః ప్రమద్వరే త్యస్యా నామచక్రే మహానృషిః
తామాశ్రమపదే తస్య రురుర్దృష్ట్వా ప్రమద్వరామ్
బ భూ వ కి ల ధర్మాత్మా మదనోపహత స్తదా.
పితరం సఖిభిస్సోఽథ శ్రావయామాస భార్గవమ్
ప్రమతిశ్చాభ్యయాచత్తాం స్థూలకేశం యశస్వినమ్.
తతః ప్రాదాత్పితాకన్యాం రురవేతాంప్రమద్వరాం
వివాహం స్థాపయిత్వాగ్రే నక్షత్రే భగదైవతే.
త తః క తిపయాహస్సు వి వా హే సముపస్థితే
స ఖీ భిః క్రీ డ తీ సా ర్థ ం సా క న్యా వ ర ర్ణి నీ.
నాపశ్యత్సం ప్రసుప్తంవై భుజంగంతిర్యగాయతమ్
పదాచైనం సమాక్రామన్ముమూర్షుః కాలచోదితా.
స తస్యాస్సం ప్రమత్తాయాశ్చోదితః కాలధర్మణా

స్థితి ప్రాప్తించింది—అంటూ ఆ సర్పం. అన విని రురుముని శాపకారణం అడుగగా సర్పం పలుకుతూ ఉన్నది.

10 వ అధ్యాయం సమాప్తము

## పదకొండవ అధ్యాయం

ఆర్యా! పూర్వం ఖగము ఖు డనే ద్విజశ్రేష్ఠు డుండేవాడు. అతడు నా సఖుడు. తపోబలసంపన్నుడు. అయినా అతని వాక్కుల్లో కఠోరత్వం కటుత్వం ఉండేవి. సరదాగా ఆ డు కుంటూ ఒకనాడు గడ్డిపాముతో అతనిని భయ పెట్టగా మూర్ఛితుడై కొంతసేపటికి లేచి క్రోధా రుణ నయనాలతో యిలా అన్నాడు — నన్ను భయ పెట్టడానికి సర్పాన్ని చూపించావు కనక నువ్వుకూడా అల్పశక్తిగల పామువే అయిపో.

ఆ మాటలశక్తి నెరిగిన నేను అతని చరణాలపై బడి వేళాకోళంగా చేసిన పనికి నన్ను క్షమించు — అని భయభీతహృదయంతో నిలిచిన నన్ను చూసి వేడి నిట్టూర్పులు విడుస్తూ — నా వచనం అమోఘము. అయినా నీ కొకదారి ఉంది. ఈ సర్పాకృతిలో ఉన్న నీకు ఒకనాడు ప్రమతి కుమారుడైన మహాతపస్వి రురు దర్శనం లభిస్తుంది. దానితో శాపవిమోచనం అవుతుంది—అన్నాడు. బహుశా ఆ రురుమహర్షివి నీవే అని తెలుస్తోంది. ఇదిగో నా రూపం నాకు లభిస్తోంది — అంటూండగానే సహస్రపాదుడు స్వస్వరూపంతో లేచి నిలిచి రురు వుతో ఈ ప్రకారంగా చెప్పసాగాడు.

ప్రాణికోటిలో సర్వోత్తముడ వైన ద్విజ శ్రేష్ఠుడా! అహింసయే పరమధర్మం. అందుచేత విప్రుడు ఎన్నడూ ఏ ప్రాణికీ హింస చెయ్యకూడదు. ద్విజుడు శాంతసౌమ్యస్వభావుడని శ్రుతి ఘోషిస్తూన్నది. వేదవేదాంగవిదుడై ఆతడు ప్రాణికోటికి అభయమిచ్చేవాడు. అంతేకానీ క్షత్రియధర్మాన్ని నువ్వు అనుష్ఠించకూడదు. ఉగ్రత్వం దండ ధారణ ప్రజాపాలన క్షత్రియ ధర్మాలు. పూర్వం జనమేజయుడు సాగించిన సర్పయాగంలో విద్వాంసుడైన ఆస్తీకుడు సర్పాలకు ప్రాణదానం చేశాడు!

11 వ అధ్యాయం సమాప్తము.

ఈ మాట లాలకించిన రురువు జనమేజయుడు సర్పయాగం చేసిన కారణాన్ని ప్రశ్నించి ఆస్తీకుడు రక్షించిన విధానాన్ని సమగ్రంగా వివరించమని కోరగా సహస్రపాదుడు యదార్థవాదులైన విప్రులవల్ల ఈ గాథ వినగలవని అదృశ్యుడయాడు. అదృశ్యుడైన సహస్రపాదుని అన్వేషిస్తూ బయలుదేరిన రురువు అరణ్యంలో ఒకచోట అలసి పడిపోయాడు. కొంతసేపటికి స్మృతి వచ్చి సహస్రపాదుని వాక్యాలే తలుచుకుంటూ ఇంటికి పోయి తండ్రిని అడుగగా ఆ మహర్షి ఆస్తీకోపాఖ్యానం చెప్పాడు — అని ఉగ్రశ్రవుడు మౌనం వహించాడు.

పౌ లో మ ప ర్వ ము సమాప్తం

విషోపలిప్తా దశనాం భృశ మంగే న్యపాతయత్.
సా దష్టా తేన సర్పేణ పపాత సహసా భువి
వివర్ణా విగతశ్రీకా భ్రష్టాభరణచేతనా.
నిరానందకరీ తేషాం బంధూనాం ముక్తమూర్ధజా
వ్యసురప్రేక్షణీయా సాప్రేక్షణీయతమా భవత్.
ప్రసుప్తేవా భవచ్చాపి భువి సర్పవిషార్దితా
భూయో మనోహరతరా బభూవ తనుమధ్యమా.
దదర్శ తాం పితా చైవ యే చైవాన్యే తపస్వినః
విచేష్టమానాం పతితాం భూతలే పద్మవర్చసమ్.

తతస్సర్వే ద్విజవరాః సమాజగ్ముః కృపాన్వితాః
స్వస్త్యాత్రేయో మహాజానుః కుశికశ్శంఖమేఖలః.
ఉద్దాలకః కఠశ్చైవ శ్వేతశ్చైవ మహాయశాః
భరద్వాజః కౌణకుత్స్య ఆర్షిషేణోऽథ గౌతమః
ప్రమతి సహపుత్రేణ తథాన్యే వనవాసినః
తాం తే కన్యాం వ్యసుం దృష్ట్వా భుజంగస్య విషార్దితాం.
రురుదుః కృపయా విష్టా రురుశ్చార్తో బహిర్యయౌ
తే చ సర్వే ద్విజశ్రేష్ఠా స్తత్రైవోపవిశం స్తదా.

8 వ అధ్యాయము సమాప్తము

## తొమ్మిదవ అధ్యాయము

తేషు తత్రోపవిష్టేషు బ్రాహ్మణేషు మహాత్మసు
రురుశ్చుక్రోశ గహనం వనం గత్వాదిదుఃఖితః.
శోకేనాభిహతస్సోऽథ విలపన్ కరుణం బహు
అబ్రవీద్వచనం శోచన్ ప్రియాం స్మృత్వా ప్రమద్వరాం.
శేతే సా భువి తన్వంగీ మమ శోకవివర్ధినీ
బాంధవానాం చ సర్వేషాం కిం ను దుఃఖమతః పరం.
యది దత్తం తపస్తప్తం గురవో వా మయా యది
సమ్యగారాధితాస్తేన సంజీవతు మమ ప్రియా.
యథా చ జన్మప్రభృతి యతాత్మాహం ధృతవ్రత
ప్రమద్వరా తథా హ్యేషా సముత్తిష్ఠతు భామినీ.
కృష్ణే విష్ణౌ హృషీకేశే లోకేశేऽసురవిద్విషి
యది మే నిశ్చలా భక్తిర్మమ జీవతు సా ప్రియా.
ఏవం లాలప్యతస్తస్య భార్యార్థే దుఃఖితస్య చ
దేవదూతస్తదాభ్యేత్య వాక్యమాహ రురుం వనే.
అభిధత్సే హ యద్వాచా రురో దుఃఖేన తన్మృషా
న తు మర్త్యస్య ధర్మాత్మన్నాయురస్తి గతాయుషః
గతాయురేషా కృపణా గంధర్వాప్సరసోః సుతా
తస్మాచ్ఛోకే మనస్తాత మా కృథాస్త్వం కథంచన.
ఉపాయశ్చాత్ర విహితః పూర్వం దేవైర్మహాత్మభిః
తం యదీచ్ఛసి కర్తుం త్వం ప్రాప్స్యసీహ ప్రమద్వరాం.

క ఉపాయః కృతో దేవైర్బ్రూహి తత్త్వేన ఖేచర
కరిష్యేऽహం తథా శ్రుత్వా త్రాతుమర్హసి మాం భవాన్
ఆయుషోऽర్ధం ప్రయచ్ఛ త్వం కన్యాయై భృగునందన
ఏవముత్థాస్యతి రురో తవ భార్యా ప్రమద్వరా.
ఆయుషోऽర్ధం ప్రయచ్ఛామి కన్యాయై ఖేచరోత్తమ
శృంగారరూపాభరణా సముత్తిష్ఠతు మే ప్రియా.
తతో గంధర్వరాజశ్చ దేవదూతశ్చ సత్తమౌ
ధర్మరాజముపేత్యేదం వచనం ప్రత్యభాషతామ్.
ధర్మరాజాయుషోऽర్ధేన రురోర్భార్యా ప్రమద్వరా
సముత్తిష్ఠతు కల్యాణీ మృతైవం యది మన్యసే.
ప్రమద్వరాం రురోర్భార్యాం దేవదూత యదీచ్ఛసి
ఉత్తిష్ఠత్వాయుషోऽర్ధేన రురోరేవ సమన్వితా.
ఏవముక్తే తతః కన్యా సోదతిష్ఠత్ప్రమద్వరా
రురోస్తస్యాయుషోऽర్ధేన సుప్తేవ వరవర్ణినీ.
ఏతద్దృష్టం భవిష్యే హి రురోరుత్తమతేజసః
ఆయుషోऽతిప్రవృద్ధస్య భార్యార్థేऽర్ధమలుప్యత.
తత ఇష్టేऽహని తయోః పితరౌ చక్రతుర్ముదా
వివాహం తౌ చ రేమాతే పరస్పరహితైషిణౌ.
స లబ్ధ్వా దుర్లభాం భార్యాం పద్మకింజల్కసుప్రభామ్
వ్రతం చక్రే వినాశాయ జిహ్మగానాం ధృతవ్రతః.

# ఆస్తీక పర్వము

సూతమహర్షీ నరపాల ప్రముఖుడు జనమేజయుడు ఏ కారణంగా సర్పవంశాన్ని అంతంచేసే సంకల్పంతో సర్పయాగం తలపెట్టాడో, ఎందువల్ల ఆస్తీకుడు ఆ యజ్ఞాన్ని ఆపుచేయించాడో ఆ ఆస్తీక మహర్షి ఏ మహాపురుషుని తనయుడో సవివరంగా సత్యవాక్యాలతో వివరించు — అని శౌనకుడు ప్రార్థించగా సదస్యుల కౌతుకలోచనాలనడుమ కించి ఉగ్రశ్రవుడు ప్రారంభిస్తున్నాడు.

శౌనకమహర్షీ మహత్తరమైన ఈ ఇతిహాసాన్ని వ్యాసమహర్షి ముఖతఃవిన్న నా తండ్రి రోమహర్షణుడు నైమిశారణ్యవాసులైన వారికి వినిపించాడు. దాన్ని యథాతథంగా వినిపిస్తాను. సర్వపాపనాశనకారి అయిన దీన్ని సావధానచిత్తంతో ఆకర్ణించండి.

ప్రజాపతి శ్రేణికి చెందిన ప్రభావశాలీ బ్రహ్మచర్యవ్రతుడూ ఆహారవిహారాదులలో సంయమనం కలవాడూ అయిన జరత్కారువు కుమారుడు ఆస్తీకుడు. ఈమహర్షి ఊర్ధ్వరేతుడు. యాయావారులలో శ్రేష్ఠుడు. ధర్మమర్మజ్ఞుడు. మునిగానే జీవితాన్ని సాగిస్తూ ప్రయాణించే జరత్కారుడు సాయంసంధ్యలలో ఏదో ఒక ప్రదేశంలో తన ఆవాసం నిర్మించుకొనే వాడు. పుణ్యక్షేత్రాలలోని తీర్థాలలో మునకలిడుతూ జరత్కారుడు మహాతీవ్ర నియమాలతో సాగుతున్నాడు. ఆహారనిద్రాదులను కూడాస్వాధీనంలో ఉంచుకొని వాయువునేఆహారంగా తీసికొంటూ అగ్నిసదృశతేజంతోఉండేవాడు.

ఈ ప్రకారంగా తిరుగుతూ ఒకానొక సమయంలో తన పితామహుల్ని చూశాడు. వారు తలలు క్రిందకు కాళ్ళు పైకి ఉంచి ఒక పెద్దకూపంలోకి వ్రేళ్ళాడుతున్నారు.

వారెవరో తెలియని జరత్కారుడు ఆ విధంగా ఎందుకు ఉండవలసి వచ్చిందని ప్రశ్నించాడు. పైగా వారు ఏ ఆధారంమీద ఇంకా అంతమాత్రమైనా వ్రేలాడుతున్నారో ఆ ఆధారం కూడా ఎలుకచేత చాలవరకూ ధ్వంసం చేయబడిందనగా వాని పితృదేవతలు ఇలా సమాధానం యిస్తున్నారు. మేము యాయావర వంశీయులమైన మహామునులం. మా దురదృష్టంవల్ల మా వంశంలో పుట్టిన వాడొకడు ఈనాడు తపోదీక్షలో ఉండి పితృదేవతలకు స్వర్గకారణమైన సంతానాన్ని కనటానికి అంగీకరించక అవివాహితుడుగా ఉండిపోవడంవల్ల ఈ స్థితి కలిగింది. వానిపేరు జరత్కారుడు.

మహాభాగా నువ్వెవరవు. క్లిష్టదశలో మాయందింత ఆదరం చూపిన నువ్వు ఆత్మీయుల కన్న అధికుడవు. మా దుఃఖస్థితి నువ్వెందుకు శోకిస్తావు అను పలుకులు విని జరత్కారుడు - మహాత్ములార నేనే జరత్కారుడను. మీరే నా పితృ పితామహులు. ఇప్పుడు నేను మీకు చేయదగ్గ సేవ ఏమిటో చెపితే చేస్తాను - అన్నాడు.

నువ్వు మన వంశాన్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నించు. మాకోసం నీకోసం ధర్మపాలనార్థం నువ్వు వివాహం చేసుకో. తపోధనుడికి కూడా లభించని ఉత్తమలోకాలు పుత్రవంతుడికి ప్రాప్తిస్తాయి. మాకు ఉత్తమగతులు కలగటంకోసం నువ్వు వివాహం చేసికొని సంతానవంతుడవు కావాలి — అని పితృదేవతలు పలికారు.

స దృష్ట్వా జిహ్మగాన్ సర్వాంస్తీవ్రకోపసమన్వితః
అభిహన్తి యథాసత్త్వం గృహ్య ప్రహరణం సదా.
స కదాచిద్ వనం విప్రో రురురభ్యాగమన్మహత్
శయానం తత్ర చాపశ్యద్ డుణ్డుభం వయసాన్వితమ్.

తత ఉద్యమ్య దణ్డం స కాలదణ్డోపమం తదా
జిఘాంసుః కుపితో విప్రస్తమువాచాథ డుణ్డుభః
నాపరాధ్యామి తే కించిదహమద్య తపోధన
సంరంభాచ్చ కిమర్థం మామభిహంసి రుషాన్వితః.

9 వ అధ్యాయము సమాప్తము

## పదవ అధ్యాయం

మమ ప్రాణసమా భార్యా దష్టాసీద్ భుజగేన హ
తత్ర మే సమయో ఘోర ఆత్మనోరగ వై కృతః.
భుజంగం వై సదా హన్యాం యం యం పశ్యేయమిత్యుత
తతోऽహం త్వాం జిఘాంసామి జీవితేనాద్య మోక్ష్యసే.

అన్యే తే భుజగా బ్రహ్మన్ యే దశన్తీహ మానవాన్
డుణ్డుభానహిగన్ధేన న త్వం హింసితుమర్హసి.
ఇతి శ్రుత్వా వచస్తస్య భుజగస్య రురుస్తదా
నావధీద భయసంవిగ్నమృషిం మత్వాథ డుణ్డుభమ్

ఉవాచ చైనం భగవాన్ రురుః సంశమయన్నివ
కామం మాం భుజగ బ్రూహి కోऽసీమాం విక్రియాం గతః.
అయం పురా రురో నామ్నా ఋషిరాసం సహస్రపాత్
సోऽహం శాపేన విప్రస్య భుజగత్వముపాగతః.
కిమర్థం శప్తవాన్ క్రుద్ధో ద్విజస్త్వాం భుజగోత్తమ
కియన్తం చైవ కాలం తే వపురేతద్ భవిష్యతి.

10 వ అధ్యాయము సమాప్తము

## పదకుండవ అధ్యాయము

సఖా బభూవ మే పూర్వం ఖగమో నామ వై ద్విజః
భృశం సంశితవాక్ తాత తపోబలసమన్వితః.
స మయాక్రీడ బాల్యే కృత్వా తార్ణం భుజంగమమ్
అగ్నిహోత్రే ప్రసక్తస్తు భీషితః ప్రముమోహ వై.
లబ్ధ్వా స చ పునః సంజ్ఞాం మామువాచ తపోధనః
నిర్దహన్నివ కోపేన సత్యవాక్ సంశితవ్రతః.
యథావీర్యస్త్వయా సర్పః కృతోऽయం మద్విభీషయా
తథావీర్యో భుజంగస్త్వం మమ శాపాద్ భవిష్యసి.

తస్యాహం తపసో వీర్యం జానన్నాసం తపోధన
భృశముద్విగ్నహృదయస్తమవోచమహం తదా.
ప్రణతః సంభ్రమాచ్చైవ ప్రాంజలిః పురతః స్థితః
సఖేతి సహసేదం తే నర్మార్థం వై కృతం మయా.
క్షన్తుమర్హసి మే బ్రహ్మన్ శాపోऽయం వినివర్త్యతాం
సోऽథ మామబ్రవీద్ దృష్ట్వా భృశముద్విగ్నచేతసం
ముహురుష్ణం వినిఃశ్వస్య సుసంభ్రాన్తస్తపోధనః

మహానుభావులారా! జీవితసుఖభోగాపేక్షతో భార్యను స్వీకరించమనీ, ధనార్జన చేయమనీ నిశ్చయించుకున్నాను. మీకు ఉత్తమ గతులు కలిగే పక్షంలో నేను వివాహం చేసుకుంటాను. అయితే నేను పెండ్లాడబోయే యువతి నా పేరు గలదే కావాలి. పైగా ఆమె సోదరులూ బంధుజనులూ ఆమెను నా కివ్వాలనే సంకల్పంతోనే ఉండాలి, ఆ ప్రకారంగా లభించిన కన్యను శాస్త్రోక్తంగా వివాహం చేసుకుంటాను. దరిద్రుడికి వివాహం చాల కష్టమైన విషయం కనుక అయాచితంగా ఎవరయినా తమ బిడ్డనిస్తే తప్పకుండా పరిగ్రహిస్తాను. ఆమె గర్భవతియై ఆ గర్భం పండితే ఆనాడు మీరు మీ పూర్వస్థానాలు పొందగలరు - అని సూతుడు జరత్కారుని కథ కొనసాగిస్తున్నాడు.

## 13 వ అధ్యాయం సమాప్తము

## పదునాల్గవ అధ్యాయం

అనంతరం జరత్కారుడు భార్యకోసం తిరుగసాగాడు. తిరుగుతూ కన్యాదానం చేయించవలసింది - అని భిక్షార్థియై మూడుసార్లు అర్థించాడు. ఆ సమయానికే నాగరాజు వాసుకి తన సోదరిని వెంటబెట్టుకుని వచ్చి మహర్షీ ఈమెను మీరు స్వీకరించండి - అనగా ఆమె తనపేరు గలదవునో కాదో అని పేరడిగాడు. వెంటనే వాసుకి తన చెల్లెలి పేరు జరత్కారువని చెప్పాడు. జరత్కారుడు జరత్కారువు విధివిధానంగా దంపతులయ్యారు.

## 14 వ అధ్యాయం సమాప్తము.

## పదిహేనవ అధ్యాయము

నాగమాత కద్రువకు తన సంతతి మీద ఆగ్రహం వచ్చి వారి నందరినీ జనమేజయుని సర్పయాగంలో మరణించమని శపించిన కారణంగా వాసుకి ఆ శాపశాంతికోసం తన చెల్లెలినిచ్చి జరత్కారునికి పెండ్లి చేశాడు. ఆమెగర్భాన ఆవిర్భవించిన మహాపురుషుడే ఆస్తీకుడు. పితృ మాతృ వంశాలను ఉద్ధరించగలిగిన ఆస్తీకుడు వేదవేదాంగ విశారదుడై సర్వజనహితుడై తపోనిధి అయ్యాడు.

ఇలా సాగుతూండగా కొంతకాలానికి పాండవ వంశీయుడైన జనమేజయుడు సర్పయాగం ప్రారంభించినట్లు విని అక్కడికి వెళ్ళి ఆ తీవ్ర యజ్ఞాన్ని ఆపించి నాగులకు ప్రాణదానం చేశాడు. అటు మాతృవంశీయుల్ని రక్షించడమే కాక తపోనిష్ఠతో గార్హస్థాశ్రమ స్వీకారంతో స్వీయ వంశోద్ధరణం చేసికొన్నాడు. స్వాధ్యాయానుష్ఠానాలతో వైదిక ఋణ విముక్తుడై యజ్ఞకర్మాచరణంతో దేవఋణ విముక్తుడయ్యాడు. బ్రహ్మచర్యపాలనంతో ఋషులకూ సంతానవంతుడై పితృదేవతలకూ తృప్తి కలిగించాడు. ఈ ప్రకారంగా జీవయాత్ర సాగించి పూర్వుల మార్గాన స్వర్లోకానికి వెళ్ళిపోయాడు. ఆస్తీకుని వంటి కుమారుని కన్న జరత్కారుడు కూడా స్వర్గవాసి అయ్యాడు — అని ఆస్తీకోపాఖ్యానం ముగించి తరువాయి ఏమి వినదలచుకున్నారని ఋషులను అడిగాడు.

## 16 వ అధ్యాయము సమాప్తము

నానృతం వై మయా ప్రోక్తం భవితేదం కథంచన.
యత్తు వక్ష్యామి తే వాక్యం శృణు తన్మే తపోధన
శ్రుత్వా చ హృది తే వాక్యమిదమస్తు సదానఘ.
ఉత్పత్స్యతి రురుర్నామ ప్రమతేరాత్మజ శ్శుచిః
తం దృష్ట్వా శాపమోక్షస్తే భవితా న చిరాదివ.
స త్వం రురురితి ఖ్యాతః ప్రమతే రాత్మజోఽపి చ
స్వరూపం ప్రతిపద్యాహమద్య వక్ష్యామి తే హితం.
స డుణ్డుభం పరిత్యజ్య రూపం విప్రర్షభ స్తదా
స్వరూపం భాస్వరం భూయః ప్రతిపేదే మహాయశాః.
ఇదంచోవాచ వచనం రురు మప్రతిమౌజసమ్
అహింసా పరమో ధర్మః సర్వప్రాణభృతాం వర.
తస్మాద్ ప్రాణభృతః సర్వాన్ న హింస్యాద్ బ్రాహ్మణః క్వచిత్
బ్రాహ్మణః సౌమ్య ఏవేహ భవతీతి పరా శ్రుతిః.
వేదవేదాఙ్గ విన్నామ సర్వభూతా భయప్రదః
అహింసా సత్యవచనం క్షమా చేతి వినిశ్చితమ్.
బ్రాహ్మణస్య పరోధర్మో వేదానాం ధారణాపి చ
క్షత్రియస్య హి యో ధర్మః సహినేష్యేత వై తవ
దణ్డధారణముగ్రత్వం ప్రజానాం పరిపాలనమ్
తదిదం క్షత్రియస్యాసీత్ కర్మవై శృణు మే రురో.
జనమేజయస్య యజ్ఞేఽస్మిన్ సర్పాణాం హింసనం పురా
పరిత్రాణం చ భీతానాం సర్పాణాం బ్రాహ్మణాదపి.
తపోవీర్యబలోపేతాద్ వేదవేదాఙ్గ పారగాత్
ఆస్తీకా ద్ద్విజముఖ్యా ద్వై సర్పసత్రే ద్విజోత్తమ.

ఇది 11వ అధ్యాయము సమాప్తం

## పదిరెండవ అధ్యాయము

కథం హింసితవాన్ సర్పాన్ స రాజా జనమేజయః
సర్పా వా హింసితాస్తత్ర కిమర్థం ద్విజసత్తమ.
కిమర్థం మోక్షితాశ్చైవ పన్నగాస్తేన ధీమతా
ఆస్తీకేన ద్విజశ్రేష్ఠ శ్రోతుమిచ్ఛామ్య శేషతః.
శ్రోష్యసి త్వం రురో సర్వమాస్తీకచరితం మహత్
బ్రాహ్మణానాం కథయతా మిత్యుక్త్వాన్తరధీయత.
రురుశ్చాపి వనం సర్వం పర్యధావత్ సమన్తతః
తంబుషిం నష్టమన్విచ్ఛన్ సంశ్రాన్తో న్యపతద్భువి.
స మోహం పరమం గత్వా నష్టసంజ్ఞ ఇవాభవత్
తదృషేర్వచనం తథ్యం చిన్తయానః పునః పునః.
లబ్ధసంజ్ఞో రురుశ్చాయాత్ తదాచఖ్యౌ పితుస్తదా
పితా చాస్య తదాఖ్యానం పృష్టః సర్వం న్యవేదయత్.

ఇది పౌలోమపర్వంసమాప్తము

# ఆస్తీకపర్వము

కిమర్థం రాజశార్దూలః స రాజా జనమేజయః
సర్పసత్రేణ సర్పాణాం గతోఽన్తం తద్వదస్వమే
నిఖిలేన యథాతత్త్వం సౌతే సర్వమశేషతః
ఆస్తీకశ్చ ద్విజశ్రేష్ఠః కిమర్థం జపతాం వరః.

## పదహారవ అధ్యాయము

మహాత్ముడైన ఆస్తీకుని చరిత్రను సమగ్రంగా వివరించి చెప్పావు. ఉగ్రశ్రవా మీ కథా కథనంలో ప్రత్యక్షరం ప్రతిపదం రమణీయ మాధుర్యంగా ఉన్నవి. మీరు మీ జనకులయిన రోమహర్షణునివలెనే చక్కగా చెప్పగలుగుతున్నారు. మాకు సంతోషంగా ఉంది - అన్నాడు శౌనకుడు.

నేను మా తండ్రిగారి ముఖతః విన్న ఆస్తీకోపాఖ్యానం యథాతథంగా చెపుతాను. దక్షప్రజాపతికి కద్రువ వినత అనే పేర్లుగల ఇద్దరు కన్యలు. అద్భుత సౌందర్యవతులైన ఆ బాలిక లిరువురూ కశ్యపుని భార్యలయారు. బ్రహ్మతో సమమైన శక్తిగల కశ్యపుడు తన భార్యలిరువురినీ పిలిచి వరం కోరుకోమన్నాడు. సంతోషంతో కద్రువ సమతేజంగల వెయ్యిమంది నాగుల్ని సంతానంగా కోరింది. బలపరాక్రమతేజాలలో కద్రువతనయుల్ని మించిన కొడుకులిద్దరిని వినత కోరింది. ఇరువురి అభీష్టాలు నెరవేరగలవని కశ్యపుడు అంగీకరించాడు. వినతాకద్రువలు ఆనందసాగరంలో ఈదులాడారు. మీ రిద్దరూ మీ గర్భాలను బహు జాగ్రత్తగా రక్షించుకోండి — అని కస్యపుడు అరణ్యానికి వెళ్ళిపోయాడు.

దీర్ఘకాలానికి కద్రువ వేయిగుడ్లూ పెట్టగా వినత రెండు గుడ్లను పెట్టింది. దాసీలు ఆ గ్రుడ్లను వేడిపాత్రలలో ఉంచారు. అయిదువందల యేళ్ళు అవి అలానే ఉన్నాయి. అప్పుడు కద్రువకొడుకులు ఆ గుడ్లలోంచి బయటకు వచ్చారు. ఈ విషయం వినతకు సిగ్గునూ బాధనూ కలిగించగా ఆమె ఒక గ్రుడ్డును చిదిపింది. అందులోని బిడ్డ శరీరపై భాగం సక్రమంగానే పెరిగింది. కానీ కింది భాగం పూర్ణం కాలేదు. పుడుతూనే ఆ బాలుడు క్రోధంతో — నీ లోభంవల్ల నేను సంపూర్ణంగా పెరగకుండానే గుడ్డు బద్దలు కొట్టావు. నీ సవతికన్న గొప్పదాన్ని కావాలనే ప్రలోభంవల్ల నువ్వీపని చేశావు. కనక అయిదువందల యేళ్ళు ఆమెకు దాసిగా ఉండు అప్పటికి ఈ రెండోగుడ్డులోని నాసోదరుడు సర్వాంగాలూ బలిష్ఠంగా పెరగగా ప్రభవిస్తాడు. వాడు నీకు దాస్యవిమోచనం కలిగిస్తాడు-అని అంతరిక్షంలోకిపోయాడు. అదిమొదలుగానే ప్రాతఃకాలంలో ప్రాచ్యదిశలో వినతానందనుడైన అనూరుని అరుణకాంతులు గోచరించసాగాయి. అతడే సూర్యుని రథసారధి.

గడువుకాలం పూర్తికాగానే రెండోగ్రుడ్డునుండి గరుత్మంతుడు ప్రభవించాడు. పుడుతూనే గరుడుడు ఆకలిబాధతో ఆకాశంలోకి ఆహారార్థం ఎగిరిపోయాడు.

16 వ అధ్యాయము సమాప్తము

## పదునేడవ అధ్యాయము

కాలం నడుస్తూన్నది. ఒక సాయంకాలం వేళ వినతాకద్రువ లిద్దరూ విహారార్థం బయలు దేరారు. ఆ వాహ్యాళిలో వారు కొద్దిదూరంలో తిరుగుతూన్న ఉచ్చైఃశ్రవమనే గుర్రాన్ని

మోక్షయామాస భుజగాన్ ప్రదీప్తాద్వసు రేతసః
కస్య పుత్రః స రాజాసీత్ సర్పసత్రం య ఆహరత్.
స చ ద్విజాతిప్రవరః కస్యపుత్రోఽభిదత్స్వ మే
మహదాఖ్యానమాస్తీకం యథాతత్ ప్రోచ్యతే ద్విజ.
సర్వమేతదశేషేణ శృణు మే వదతాం వర
శ్రోతుమిచ్ఛామ్యశేషేణ కథామేతాం మనోరమాం
ఆస్తీకస్య పురాణర్షేర్బ్రాహ్మణస్య యశస్వినః
ఇతిహాసమిమం విప్రాః పురాణం పరిచక్షతే.
కృష్ణద్వైపాయన ప్రోక్తం నైమిశారణ్యవాసిషు
పూర్వం ప్రధితః సూతః పితా మే రోమహర్షణః.
శిష్యో వ్యాసస్య మేధావీ బ్రాహ్మణేష్విద ముక్తవాన్
తస్మాదహముపశ్రుత్య ప్రవక్ష్యామి యథాతథం
ఇదమాస్తీకమాఖ్యానం తుభ్యం శౌనక పృచ్ఛతే
కథయిష్యామ్యశేషేణ సర్వపాపప్రణాశనం.
ఆస్తీకస్య పితా హ్యాసీత్ ప్రజాపతిసమః ప్రభుః
బ్రహ్మచారీ యతాహారస్తపస్యుగ్రే రతః సదా.
జరత్కారురితి ఖ్యాత ఊర్ధ్వరేతా మహాతపాః
యాయావరాణాం ప్రవరో ధర్మజ్ఞః సంసితవ్రతః.
స కదాచిన్మహాభాగస్తపోబలసమన్వితః
చచార పృథివీం సర్వాం యత్రసాయంగృహో మునిః.
తీర్థేషు చ సమాప్లావం కుర్వన్నటతి సర్వశః
చరన్ దీక్షాం మహాతేజా దుశ్చరామకృతాత్మభిః.
వాయుభక్షో నిరాహారః శుష్యన్ననిమిషో మునిః
ఇతస్తతః పరిచరన్ దీప్తపావకసప్రభః
అటమానః కదాచిత్ స్వాన్ స దదర్శ పితామహాన్.
లమ్బమానాన్మహాగర్తే పాదైరూర్ధ్వైరవాఙ్ముఖాన్.
తానబ్రవీత్ స దృష్ట్వైవ జరత్కారుః పితామహాన్
కే భవన్తోఽవలమ్బన్తే గర్తే హ్యస్మిన్నధోముఖాః.
వీరణస్తమ్బకే లగ్నాః సర్వతః పరిభక్షితే
మూషకేన నిగూఢేన గర్తేఽస్మిన్నిత్యవాసినా

యాయావరా నామ వయమృషయః సంశితవ్రతాః
సన్తానప్రక్షయాద్బ్రహ్మన్నధో గచ్ఛామ మేదినీమ్.
అస్మాకం సన్తతిస్త్వేకో జరత్కారురితి స్మృతః
మన్దభాగ్యోఽల్పభాగ్యానాం తప ఏవ సమాస్థితః.
న స పుత్రాఞ్జనయితుం దారాన్ మూఢశ్చికీర్షతి
తేన లమ్బామహే గర్తే సన్తానస్య క్షయాదిహ.
అనాథాస్తేన నాథేన యథా దుష్కృతినస్తథా
కస్త్వం బన్ధురివాస్మాకమనుశోచసి సత్తమ.
జ్ఞాతుమిచ్ఛామహే బ్రహ్మన్ కో భవానిహ స్థితః
కిమర్థం చైవ నః శోచ్యాననుశోచసి సత్తమ.
మమ పూర్వే భవన్తో వై పితరం సపితామహాః
బ్రూత కిం కరవాణ్యద్య జరత్కారురహం స్వయం.
యతస్వ యత్నవాంస్తాత సన్తానాయ కులస్య నః
ఆత్మనోఽర్థేఽస్మదర్థే చ ధర్మ ఇత్యేవ వా విభో.
న హి ధర్మఫలైస్తాత న తపోభిః సుసంచితైః
తాం గతిం ప్రాప్నువన్తీహ పుత్రిణో యాం వ్రజన్తి వై.
తద్దారగ్రహణే యత్నం సన్తత్యాం చ మనః కురు
పుత్రకాస్మన్నియోగాత్ త్వమేతన్నః పరమం హితం.
న దారాన్ వై కరిష్యేఽహం న ధనం జీవితార్థతః
భవతాం తు హితార్థాయ కరిష్యే దారసంగ్రహం.
సమయేన చ కర్తాహమనేన విధిపూర్వకమ్
తథా యద్యుపలప్స్యామి కరిష్యే నాన్యథా హ్యహం
సనామ్నీ యా భవిత్రీ మే దిత్సితా చైవ బన్ధుభిః
భైక్ష్యవత్తామహం కన్యాముపయంస్యే విధానతః
దరిద్రాయ హి మే భార్యాం కో దాస్యతి విశేషతః
ప్రతిగ్రహీష్యే భిక్షాం తు యది కశ్చిత్ ప్రదాస్యతి.
ఏవం దారక్రియాహేతోః ప్రయతిష్యే పితామహాః
అనేన విధినా శశ్వన్న కరిష్యేఽహమన్యథా.
తత్ర చోత్పత్స్యతే జన్తుర్భవతాం తారణాయ వై
శాశ్వతం స్థానమాసాద్య మోదన్తాం పితరో మమ.

13 వ అధ్యాయం సమాప్తము

చూశారు. ఆ అశ్వం సముద్రమథన సమయంలో పుట్టింది. దానిశరీరం కడుంగడు బలిష్ఠమైనది. సంపూర్ణశోభతో విరాజిల్లే దాని అంగాలన్నీ శుభలక్షణాలతో ఉన్నవి. దేవతల నుతులందుకొన్నదా అశ్వరాజము - అని ఉగ్రశ్రవుడు సాగుతూండగా శౌనకుడు గొంతువిప్పి - సూతమహర్షీ దేవతలు ఏ ప్రదేశంలో అమృతంకోసం సాగరాన్ని మథించి నదీ ఈ ఉచ్చైశ్శ్రవం ఏ ప్రకారంగా వచ్చినదీ వివరంగా చెప్పుమని కోరగా సూతుడు ప్రారంభిస్తున్నాడు.

మేరువు అనే పేరుతో ప్రసిద్ధికెక్కిన సువర్ణశిఖరాలతో అలరారే ఒక పర్వతరాజం ఉన్నది. అది కాంతిలో సూర్యుని ధిక్కరిస్తుంది. ఆ శైలం మీద దేవ గంధర్వులు నివసిస్తారు. పాపాత్ములు ఆ ప్రాంతాలలో అడుగు పెట్టలేరు. దాని పరిసరాలలో భయంకర సర్పా లున్నాయి. దానిమీద ఓషధులు దాని కాంతిని మరింత కాంతివంతం చేస్తున్నాయి. ఔన్నత్యంలో అది స్వర్గంలోకాన్ని ఆవరించి ఉన్నది. ప్రాకృతమానవుల మనో నేత్రానికి కూడా దానిరూపం అందదు. నదులతో వృక్షాలతో పక్షిసంతతులతో వాని కలస్వనాలతో అలరారుతూన్నది. దాని శిఖరాలు రత్నద్యుతులీనుతున్నవి. ఆ శిఖరాలు వైశాల్యంలో ఆకాశసదృశంగా ఉంటాయి.

అటువంటి మేరువుమీద కూర్చుని దేవతలు అమృతోత్పాదనను గూర్చి యోచించసాగారు. ఆ సమయంలో శ్రీమన్నారాయణుడు బ్రహ్మతో ఇలా అన్నాడు — దేవతలూ రాక్షసులూ కలిసి మహాసాగరాన్ని మథిస్తే అమృతం లభిస్తుంది — అని దేవతలవైపు తిరిగి — ఎన్ని ఓషధులూ రత్నాలూ లభించినా సరే మీరు మీ ప్రయత్నం మానకూడదు. అలా కృషిసాగిస్తే అమృతం లభిస్తుంది.

17 వ అధ్యాయం సమాప్తం

## పదునెనిమిదవ అధ్యాయం

ఈ విధంగా నిశ్చయానికి వచ్చిన దేవతలందరూ మందరాచలాన్ని పెల్లగించడానికి వెళ్ళారు. తెల్లనిమేఘంలా ప్రకాశిస్తూ గగనాన్ని చుంబించే శిఖరాలు గల ఆపర్వతంమీద రంగు రంగుల పూలతో నిండిన వృక్షాలపై కిలకిలధ్వానాలు చేస్తున్నవి శకుంతసంతతులు. భయంకరవ్యాఘ్రాలూ సింహాలూ దానిమీద విచ్చలవిడిగా విహరిస్తున్నవి. దానిమీద సుందరప్రదేశాలలో కిన్నరులూ దేవతలూ అప్సరసలూ విహరిస్తున్నారు.

పదకొండువేల యోజనాల యెత్తుతో భూమియొక్క అధోభాగాంతం వ్యాపించిన లోతులో ఉన్న ఆ పర్వతాన్ని కదల్చలేకపోయారు దేవతలు. బ్రహ్మనూ విష్ణువునూ ఉద్దేశించి — మీరు లోకకళ్యాణదృష్టితో మాకు ఉపాయం చెప్పండి మా హితవుఁకోరి దీన్ని కదలించే ప్రయత్నం చేయండి- అని అర్థించగా మనోబుద్ధులకు అతీతుడైన నారాయణుడు ప్రసన్నుడై నాగరాజయిన అనంతునికి ఆజ్ఞ యిచ్చాడు. బ్రహ్మప్రేరణతో నారయణాదే

## పదునాల్గవ వ అధ్యాయము

తతో నివేశాయ తదా స విప్రః సంశితవ్రతః
మహీం చచార దారార్థీ న చ దారానవిన్దత.
స కదాచిద్వనం గత్వా విప్రః పితృవచః స్మరన్
చుక్రోశ కన్యా భిక్షార్థీ తిస్రో వాచః శనైరివ.
తం వాసుకిః ప్రత్యగృహ్ణాదుద్యమ్య భగినీం తదా
న సతాం ప్రతిజగ్రాహ న సనామ్నీతి చిన్తయన్.
స నామ్నీం చోద్యతాం భార్యాం గృహ్ణీయామితి
తస్యహి
మనో నివిష్టమ భవజ్జరత్కారోర్మహాత్మనః
తమువాచ మహాప్రాజ్ఞో జరత్కారుర్మహాతపాః
కిం నామ్నీ భగినీయం తే బ్రూహిసత్యం భుజంగమ.
జరత్కారో జరత్కారుః స్వసేయమనుజా మమ
ప్రతిగృహ్ణీష్వభార్యార్థేమయాదత్తాంసుమధ్యమాం.
త్వదర్థం రక్షితాపూర్వంప్రతీచ్ఛేమాం ద్విజోత్తమ
ఏవ ముక్త్వా తతః ప్రాదాద్భార్యార్థే వరవర్ణినీం.
స చతాంప్రతిజగ్రాహ విధిదృష్టేన కర్మణా.

14 వ అధ్యాయము సమాప్తము

## పదిహేనవ అధ్యాయ్యము

మాత్రాహిభుజగాః శప్తాః పూర్వం బ్రహ్మవిదాం వర
జనమేజయస్య వో యజ్ఞే ధక్ష్యత్యనిలసారధిః.
తస్యశాపస్య శాన్త్యర్థం ప్రదదౌ పన్నగోత్తమః
స్వసారమృషయే తస్మై సువ్రతాయ మహాత్మనే.
స చతాంప్రతిజగ్రాహ విధి దృష్టేన కర్మణా
ఆస్తీకోనామ పుత్రశ్చ తస్యాం జజ్ఞే మహామనాః.
తపస్వీ చ మహాత్మా చ వేదవేదాంగపారగః.
సమః సర్వస్య లోకస్య పితృమాతృభయాపహః.
అథ దీర్ఘస్యకాలస్య పాండవేయో నరాధిపః.
ఆజహార మహాయజ్ఞం సర్పసత్రమితి శ్రుతిః.
తస్మిన్ప్రవృత్తే సత్రే తు సర్పాణామన్తకాయ వై
మోచయామాసతాన్నాగానాస్తీకః సుమహాతపాః.
భ్రాతౄంశ్చ మాతులాంశ్చైవ తథైవాన్యాన్ స
పన్నగాన్
పితౄంశ్చ తారయామాస సంతత్యాతపసాతథా.
వ్రతైశ్చవివిధై ర్బ్రహ్మన్ స్వాధ్యాయైశ్చాప్యృణో
భవత్
దేవాంశ్చ తర్పయామాస యజ్ఞైర్వివిధదక్షిణైః.
ఋషీంశ్చబ్రహ్మచర్యేణసంతత్యా చ పితామహాన్
అపహృత్య గురుం భారం పితౄణాం సంశితవ్రతః.
జరత్కారుర్గతః స్వర్గం సహితః స్వైః పితామహైః
ఆస్తీకం చ సుతంప్రాప్య ధర్మం చానుత్తమంమునిః,
జరత్కారుః సుమహతా కాలేన స్వర్గమేయివాన్
ఏతదాఖ్యాన మాస్తీకం యథావత్ కథితం మయా
ప్రబ్రూహి భృగుశార్దూల కిమన్యత్కథయామితే.

15 వ అధ్యాయము సమాప్తము

బలంతో మహాపరాక్రమశాలి అయిన శేషుడు మం
దరగిరిని కదలించేశాడు. అనంతరం దేవతలు ఆ
గిరిరాజుతో సాగరతీరానికి చేరి సముద్రుని పిలిచి —
మేము అమృతంకోసం నిన్ను మథిస్తాం అనగా
సముద్రుడు అమృతంలో నాకుకూడా భాగం యిస్తే
ఈ మందరగిరిని నాలో త్రిప్పడంవల్ల కలిగే బాధను
సహిస్తాను - అన్నాడు. అంగీకరించిన దేవాసురులు
సముద్రగర్భంలో ఉన్న కచ్ఛపరాజును పిల్చి —
మహాభాగా మీరే మందరగిరికి ఆధారంగా ఉండాలి-
అని కోరగా అతఁ డంగీకరించి తన వెన్నుపై ఆ
మహాగ్రావాన్ని ధరించాడు. దేవేంద్రుడు వజ్రం
తో పర్వతాన్ని నొక్కిపట్టాడు. ఈ ప్రకారంగా
దేవాసురులు మందరం కవ్వంగా వాసుకి రజ్జువుగా
అమృతం ఫలంగా సముద్రమథనం ఆరంభించారు.

రాక్షసులు తలవైపునా దేవతలు తోకనూ
పట్టుకొని మథిస్తూండగా వాసుకి నోటినుంచి ధూమ
భరితమైన మంటలు బయల్దేరాయి. ఈ ధూమం
మెరుపుతోకూడిన మేఘాలా అయి శ్రమపడే దేవ
తలకు ఆశ్వాసనగా జలధారలు వర్షించసాగింది.
ఆసమయంలో ఉభయులమీదనూ పుష్పవృష్టి కురి
సింది. మేఘగంభీరఘోష నిరంతరం వినవస్తూనే
ఉన్నది. వందలకొద్దీ జలచరాలు ఆ తాకిడికి
తట్టుకోలేక నశించిపోతున్నాయి. వరుణ పాతా
ళాదిలోకవాసులు ఆ అలజడికి తట్టుకోలేక నలిగి
పోసాగారు.

గిరగిర మందరం తిరుగుతూన్న సమ
యంలో దానిమీద వృక్షాలు ఒకదానితో ఒకటి
డీకొని పక్షులతో సహా వాలి పోయాయి. ఆ ఘర్ష
ణలో అగ్ని పుట్టింది. మెరపు మెరసినప్పుడు
మేఘం కనపడనట్టు ఆ జ్వాలల్లో పర్వతం అగో
చరమైంది. ఆ దవానలం పర్వతంమీద మత్తేభా
లను మృగేంద్రాలనూ భస్మం చేసేసింది. దేవేం
ద్రుడు వర్షాన్ని కురిపించి ఆ మహాగ్నిని చల్లార్చాడు.
అప్పుడు ఈ ఓషధీరసం బిందురూపంలో సము
ద్రంలో పడసాగింది. ఓషధులతో నిండిన రసంతో
మందరంమీద రత్నాలద్రవంతో దేవతలకు అమృ
తత్వం సిద్ధించింది. సర్వరసప్రవాహాలతో సమ్మిళిత
మైన ఆ సాగరం క్షీరసాగరమైంది. దానినుంచి
వెన్న రాసాగింది.

ఆసమయంలో దేవతలు బ్రహ్మనుద్దేశించి-
ప్రజాపతీ శ్రీమన్నారాయణుడు వినా మిగిలిన
అందరం అలసిపోయాం. సముద్రమథనం ప్రారం
భించి చిరకాలమయినా అమృతం సిద్ధించడంలేదు—
అని దీనంగా నిలబడగా— సర్వప్రాణికోటికీ ఆశ్రయ
భూతుడవైన ఓ నారాయణా వీరందరికీ బలాన్ని
ప్రసాదించు—అని బ్రహ్మ ప్రార్థించాడు. అప్పుడు
మహావిష్ణువు చిరునవ్వుతో వారందరికీ శక్తి ప్రసా
దించగా తిరిగి క్షీరసాగరమథనం తీవ్రంగా సాగు
తూన్నది. క్షీరసాగరం సంక్షుభితమైపోతున్నది.

ఆసమయంలో సూర్యసమతేజంతో శ్వేతవర్ణం
తో ప్రసన్నవదనంతో చంద్రుడు ప్రభవించాడు.
స్వచ్ఛ శ్వేతదుకూలాలతో శ్రీదేవి ఆవిర్భవించింది.
సురాదేవి శ్వేతాశ్వమూ అనంతకాంతకళికలతో
అలరారే కౌస్తుభమూ ఆవిర్భవించాయి. మహా
విష్ణువు వక్షఃస్థలంపై శోభించే కౌస్తుభం యిదే.
అనంతరం పారిజాతమూ సురభీ (కామధేనువు)
ఉద్భవించాయి. ఆక్షణంలో ఇవన్నీ ఆకాశమా
ర్గాన దేవలోకానికి వెళ్ళిపోయాయి.

అప్పుడు దివ్యశరీరంతో శ్వేతకలశహస్తుడై
ధన్వంతరి ఆవిర్భవించాడు. ఆయన చేతిలోని

## పదహారవ అధ్యాయం

సౌతే త్వం కథయస్వ మాం విస్తరేణ కథాం పునః
ఆస్తీకస్య కవేః సాధోః శుశ్రూషా పరమా హి నః.
మధురం కథ్యతే సౌమ్య శ్లక్ష్ణాక్షరపదం త్వయా
ప్రీయామహే భృశం తాత పితేవేదం ప్రభాషసే.
అస్మచ్ఛుశ్రూషణే నిత్యం పితా హి నిరతస్తవ
ఆచష్టైతద్యథాఖ్యానం పితా తే త్వం తథా వద.
ఆయుష్మన్నిదమాఖ్యానమాస్తీకం కథయామి తే
యథాశ్రుతం కథయతః సకాశాద్వై పితుర్మయా.
పురా దేవయుగే బ్రహ్మన్ ప్రజాపతి సుతే శుభే
ఆస్తాం భగిన్యౌ రూపేణ సముపేతేఽద్భుతేఽనఘ.
తే భార్యే కశ్యపస్యాస్తాం కద్రూశ్చ వినతా చ హ
ప్రాదాత్తాభ్యాం వరం ప్రీతః ప్రజాపతి సమః పతిః.
కశ్యపో ధర్మపత్నీభ్యాం ముదా పరమయా యుతః
వరాతిసర్గం శ్రుత్వైవం కశ్యపాదుత్తమం చ తే
హర్షాదప్రతిమాం ప్రీతిం ప్రాపతుః స్మ వరస్త్రియౌ
వవ్రే కద్రూః సుతాన్నాగాన్ సహస్రం తుల్యవర్చసః.
ద్వౌ పుత్రౌ వినతా వవ్రే కద్రూపుత్రాధికౌ బలే
తేజసా వపుషా చైవ విక్రమేణాధికౌ చ తౌ.
తస్యై భర్తా వరం ప్రాదాదత్యర్థం పుత్రమీప్సితం
ఏవమస్త్వితి తం వాహ కశ్యపం వినతా తదా.
యథావత్ప్రార్థితం లబ్ధ్వా వరం తుష్టాభవత్తదా.
కృతకృత్యా తు వినతా లబ్ధ్వా వీర్యాధికౌ సుతౌ.
కద్రూశ్చ లబ్ధ్వా పుత్రాణాం సహస్రం తుల్యవర్చసాం
ధార్యౌ ప్రయత్నతో గర్భావిత్యుక్త్వా స మహాతపాః.
తే భార్యే వరసంతుష్టే కశ్యపో వనమావిశత్
కాలేన మహతా కద్రూరండానాం దశతీర్దశ.
జనయామాస విప్రేన్ద్ర ద్వేభాండే వినతా తదా
తయోరండాని నిదధుః ప్రహృష్టాః పరిచారికాః.
సోపస్వేదేషు భాండేషు పంచవర్షశతాని చ
తతః పంచశతే కాలే కద్రూపుత్రా వినిఃసృతాః.
అండాభ్యాం వినతాయాస్తు మిథునం న వ్యదృశ్యత
తతః పుత్రార్థినీ దేవీ వ్రీడితా చ తపస్వినీ.
అండం బిభేద వినతా తత్ర పుత్రమపశ్యత
పూర్వార్ధకాయసమ్పన్నమితరేణాప్రకాశతా.
స పుత్రః క్రోధసంరబ్ధః శశాపైనామితి శ్రుతిః
యోఽహమేవం కృతో మాతస్త్వయా లోభపరీతయా
శరీరేణాసమగ్రేణ తస్మాద్దాసీ భవిష్యసి
పంచవర్షశతాన్యస్యా యయా విస్పర్ధసే సహ.
ఏష చ త్వాం సుతో మాతర్దాసీత్వాన్మోచయిష్యతి
యద్యేనమపి మాతస్త్వం మామివాణ్డవిభేదనాత్.
న కరిష్యస్యనఙ్గం వా వ్యఙ్గం వాపి తపస్వినం
ప్రతిపాలయితవ్యస్తే జన్మకాలోఽస్య ధీరయా.
విశిష్టం బలమీప్సన్త్యా పఞ్చవర్షశతాత్పరః
ఏవం శప్త్వా తతః పుత్రో వినతామన్తరిక్షగః.
అరుణో దృశ్యతే బ్రహ్మన్ ప్రభాతసమయే సదా
ఆదిత్యరథమధ్యాస్తే సారథ్యం సమకల్పయత్.
గరుడోఽపి యథాకాలం జజ్ఞే పన్నగభోజనః
స జాతమాత్రో వినతాం పరిత్యజ్య ఖమావిశత్.
ఆదాస్యన్నాత్మనో భోజ్యమన్నం విహితమస్య యత్
విధాత్రా భృగుశార్దూల క్షుధితః పతగేశ్వరః.

16 వ అధ్యాయము సమాప్తం

లోని కలశంలో ఉన్నదే అమృతం. ఈ అద్భుతాన్ని చూసిన దానవులలో అమృతపానేచ్ఛ ప్రబలి కోలాహలం రేగింది. నాది అంటే నాది అని అరవసాగారు. అటువంటప్పుడు నాలుగు దంతాలతో ధవళకాంతులతో ఐరావతం పుట్టింది. అది ఇంద్రుని అధీనంలోకి పోయింది. ఇంకా మథిస్తూండగా కాలకూటం పుట్టింది. విషవాసనతే త్రిలోకాలనూ భస్మంచేయబోగా బ్రహ్మవాక్కు ననుసరించి శంకరుడు దాన్ని మ్రింగేశాడు. దానిని కంఠదేశంలో ఉంచడంవల్లనే నాటినుండి శంకరునికి నీలకంఠుడనే ప్రసిద్ధి వచ్చింది. ఈ అద్భుతాన్ని అవలోకించే అసురులకు నిరాశకలిగి లక్ష్మికోసం అమృతంకోసం దేవతలతో వైరం పెంచుకున్నారు. అప్పుడు ఆదినారాయణుడు మాయామోహినీ రూపంలో దానవుల యెదుట ప్రత్యక్షమయాడు. దైత్యులూ దానవులూ ఆ మోహినికి తమ సర్వేంద్రియాలనూ వశంచేచేశారు. కామాంధులై అమృతభాండాన్ని జగన్మోహినిహస్తాలలో ఉంచారు. మాయానాటకసూత్రధారి ఆకలశాన్ని అందుకొని దేవతలకు అమృతం పంచిపెడుతూంటే దానవులు కోలాహలం చేయసాగారు.

18 వ అధ్యాయము సమాప్తం

## పందొమ్మిదవ అధ్యాయము

అమృతకలశం తమ చేతుల్లోంచి దాటిపోవడంతో దైత్యులు దానవులు కలసి కవచధారులై శస్త్రాస్త్రాలతో దేవతలమీద పడ్డారు. అనంతశక్తిశాలి యైన నారాయణుడు మోహినీ రూపంతో పంచిపెట్టిన అమృతాన్ని దేవతలు త్రాగుతున్నారు. రాహువు అనే దానవుడు దేవతా రూపం ధరించి అమృతము త్రాగబోతూండగా సూర్యచంద్రులు ఆ రహస్యాన్ని తెలియజేసిన మరుక్షణంలో విష్ణుమూర్తి యొక్క సుదర్శనచక్రం అతని శిరస్సును ఖండించింది. ఆశిరస్సు పర్వతశిఖరంలా ఉంది. అది భయంకరంగా గర్జిస్తూ ఆకాశంలో విహరిస్తూంది. మొండెం భూమిమీదపడి పర్వతారణ్యసహితమైన పృథివిని ప్రకంపింపజేస్తూ దొర్లుతూంది. నాటినుండీ సూర్యచంద్రులతో బద్ధవైరము ఏర్పడింది రాహువుకి. దానినే గ్రహణమంటారు.

శ్రీమన్నారాయణు మోహినీ రూపాన్ని వదలి శస్త్రాస్త్రాలతో దైత్యదానవ సేనల్ని చెల్లాచెదరు చేస్తున్నాడు. ఇరుపక్షాలవారికీ తీవ్రమైన బల్లెపుపోట్లు తగులుతున్నాయి. సుదర్శనచక్రమూ దేవతల అస్త్రాలూ దానవుల శిరస్సులను నేలమీద దొర్లిస్తూన్నాయి. యుద్ధభూమిలో పడిపోయిన రాక్షస శరీరాలు జేగురురంగుతో నిండిన పర్వతాలవలె ఉన్నవి. సధ్యానమయాలలో హాహాకారాలు దశదిశలా మారు మ్రోగుతున్నాయి. దూరదూరాల నిడిబడి దేవదానవులు లోహాయుధాలతో కొట్టుకుంటున్నారు. మరికొందరు ముష్టా

## పదిహేడవ అధ్యాయము

ఏతస్మిన్నేవ కాలే తం భగిన్యౌ తే తపోధన
అపశ్యతాం సమాయాతే ఉచ్చైఃశ్రవసమన్తికాత్.
యం తం దేవగణాః సర్వే హృష్టరూపమపూజయత్
మథ్యమానేఽమృతే జాతమశ్వరత్నమనుత్తమం.
అమోఘబలమశ్వానాముత్తమం జగతాం వరం
శ్రీమన్తమజరం దివ్యం సర్వలక్షణపూజితం
కథం తదమృతం దేవైర్మథితం క్వ చ శంస మే
యత్ర జజ్ఞే మహావీర్యః సోఽశ్వరాజో మహాద్యుతిః
జ్వలన్తమచలం మేరుం తేజోరాశిమనుత్తమం
ఆక్షిపన్తం ప్రభాం భానోః స్వశృఙ్గైః కాఞ్చనోజ్జ్వలైః.
కనకాభరణం చిత్రం దేవగన్ధర్వసేవితం
అప్రమేయమనాధృష్యమధర్మబహులైర్జనైః.
వ్యాళైరావారితం ఘోరైర్దివ్యౌషధివిదీపితమ్
నాకమావృత్య తిష్ఠన్తముచ్ఛ్రయేణ మహాగిరిమ్.
అగమ్యం మనసాప్యన్యైర్నదీవృక్షసమన్వితమ్
నానాపతగసంఘైశ్చ నాదితం సుమనోహరైః.
తస్య శృఙ్గముపారుహ్య బహురత్నాచితం శుభం
అనన్తకల్పముద్విద్ధం సురాః సర్వే మహౌజసః.
తే మన్త్రయితుమారబ్ధాస్తత్రాసీనా దివౌకసః
అమృతాయ సమాగమ్య తపోనియమసంయుతాః.
తత్ర నారాయణో దేవో బ్రహ్మాణమిదమబ్రవీత్
చిన్తయత్సు సురేష్వేవం మన్త్రయత్సు చ సర్వశః.
దేవైరసురసంఘైశ్చ మథ్యతాం కలశోదధిః
భవిష్యత్యమృతం తత్ర మథ్యమానే మహోదధౌ.
సర్వౌషధీః సమావాప్య సర్వరత్నాని చైవ హ
మన్థధ్వముదధిం దేవా వేత్స్యధ్వమమృతం తతః.

17 వ అధ్యాయము సమాప్తము

## పదునెనిమిదవ అధ్యాయ్యము

తతోఽభ్రశిఖరాకారైర్గిరిశృంగైరలంకృతమ్
మన్దరం పర్వతవరం లతాజాలసమాకులమ్.
నానావిహగసంఘుష్టం నానాదంష్ట్రిసమాకులమ్
కిన్నరైరప్సరాభిశ్చ దేవైరపి చ సేవితమ్.
ఏకాదశ సహస్రాణి యోజనానాం సముచ్ఛ్రితమ్
అధో భూమేః సహస్రేషు తావత్స్వేవ ప్రతిష్ఠితమ్.
తముద్ధర్తుమశక్తా వై సర్వే దేవగణాస్తదా
విష్ణుమాసీనమభ్యేత్య బ్రహ్మాణం చేదమబ్రువన్.
భవన్తావత్ర కుర్వాతాంబుద్ధింనైఃశ్రేయసీం పరామ్
మన్దరోద్ధరణే యత్నః క్రియతాం చ హితాయ నః.
తథేతి చాబ్రవీద్ విష్ణుర్బ్రహ్మణా సహ భార్గవ
అచోదయదమేయాత్మా ఫణీన్ద్రం పద్మలోచనః.
తతోఽనన్తః సముత్థాయ బ్రహ్మణా పరిచోదితః
నారాయణేన చాప్యుక్తస్తస్మిన్ కర్మణి వీర్యవాన్.
అథ పర్వతరాజానం తమనన్తో మహాబలః
ఉజ్జహార బలాద్బ్రహ్మన్ సవనం సవనౌకసమ్.

ముష్టియుద్ధము సాగిస్తూన్నారు. యుద్ధధ్వానాలు ఆకాశంలో మారుమోగుతున్నాయి.

చీల్చి చెండాడండి. పరుగెత్తండి. పడగొట్టండి— అన్న శబ్దాలు పదే పదే విన్పిస్తున్నాయి. మహాభయంకరంగా ద్వంద్వయుద్ధం సాగుతోంది. శ్రీమన్నారాయణుని నర నారాయణ రూపాలు రణభూమిలో విహరిస్తున్నాయి. నారాయణుడు నరుని ధనస్సు చూసి చక్రాన్ని ధరించాడు. శత్రుసంతాపకారియైన ఆచక్రం సూర్యసమతేజంతో మండలాకారంగా ప్రజ్వలిస్తూంటే శత్రుహృదయాలు గజగజలాడుతున్నాయి. పేరు సుదర్శమే అయినా శత్రుకోటికి దాని దర్శనం భయంకరంగానే ఉంది. శత్రునగరాలనే ధ్వంసం చేయగల శక్తి దానికుంది.

ఏనుగుతొండంతో సమానమైన భుజదండం గల, నారాయణుడు ఆ సుదర్శనాన్ని దానవసైన్యం మీాద విసిరాడు. ప్రళయ కాలాగ్ని జ్వాలలతో దైత్యదానవుల్ని హరిస్తూ చరిస్తూన్నది. ఒక్కొక్కప్పుడు ప్రజ్వలితాగ్నిలా భస్మంచేస్తూమరొక్కొక్కప్పుడు వాళ్ళను ముక్కలు ముక్కలు చేస్తూ భూమ్యాకాశాలమధ్య తిరుగుతూ పిశాచంలా రక్తపానం చేస్తూన్నది. మహా బలశాలులైన అసురులు కూడా నీరులేని మేఘాల వలె తెల తెల బోతున్నారు. సావకాశం దొరికినప్పుడు వినువీధి నుండి రాళ్ళవర్షం కురిపించి రాక్షసులు దేవతల్ని హింసిస్తున్నారు. ఎరుపు పసుపు నీలి రంగుల మేఘాలవంటి పర్వతాలు వృక్షాలతో సహా భూమి మీాద పడి భయం కలిగిస్తున్నాయి. ఆ పర్వతసంఘర్షణలో భయంకరధ్వనులు పుడుతున్నాయి. తీవ్రంగా సాగే ఆ సంగ్రామరంగంలో ప్రళయగర్జా సదృశ ధ్వనులు రేగుతూన్నాయి. ఆ సమయంలో నర రూపంలో ఉన్న భగవానుడు బంగారు కాంతితో మెరిసే అస్త్రాలతో భూమిమీాద పడే పర్వతాల్ని చూర్ణంజేస్తూ ఆకాశానికి అడ్డకట్ట వేశాడు. దేవతలచేత దెబ్బలు తిని సుదర్శనజ్వాలలకి తట్టుకోలేని దైత్యులు భూమిలోకి సముద్రంలోకి పోయి తల దాచుకొంటున్నారు.

దేవతలు విజయోత్సాహంతో మందరగిరిని సగౌరవంగా యథాస్థానంలో ఉంచారు. సింహగర్జనతో సమమైన నాదాలతో ఆకాశమార్గాన స్వస్థానాలకు వెళ్ళారు. దేవేంద్రుడు అమృత భాండాన్ని నరుని రక్షణలో పెట్టి అమితోత్సాహంతో అమరావతి చేరుకున్నాడు.

19 వ అధ్యాయము సమాప్తము

## ఇరువదియవ అధ్యాయము

ఉగ్రశ్రవుడు అనంతరకథ ఈ ప్రకారంగా సాగిస్తున్నాడు— దేవతలు అమృతము సాధించిన విధానం మీాకు వివరించాను. ఆ సమయంలోనే అత్యంత వేగశాలియైన సుందరాశ్వం జన్మించింది. ఈ గుర్రాన్ని చూచి కద్రువ వినతతో ఇలా అన్నది.

తతస్తేన సురాః సార్థం సముద్రముపతస్థిరే
తమూచురమృతస్యార్థే నిర్మథిష్యామహే జలమ్.
అపాంపతి రథోవాచ మమాప్యంశో భవేత్తతః
సోఢాస్మి విపులం మర్దం మన్దరభ్రమణాదితి.
ఊచుశ్చ కూర్మరాజానమకూపారే సురాసురాః
అధిష్ఠానం గిరేరస్య భవాన్ భవితుమర్హతి.
కూర్మేణ తు తథేత్యుక్త్వా పృష్ఠమస్య సమర్పితమ్
తం శైలం తస్య పృష్ఠస్థం వజ్రేణేంద్రో న్యపీడయత్.
మన్థానం మన్దరం కృత్వా తథా నేత్రం చ వాసుకిమ్
దేవా మథితుమారబ్ధాః సముద్రం నిధిమమ్భసామ్.
అమృతార్థే పురా బ్రహ్మంస్తథైవాసురదానవాః
ఏకమన్తముపాశ్లిష్టా నాగరాజ్ఞో మహాసురాః.
విబుధాః సహితాః సర్వే యతః పుచ్ఛం తతః స్థితాః
అనన్తో భగవాన్దేవో యతో నారాయణస్తతః
శిరఉత్క్షిప్య నాగస్య పునః పునరవాక్షిపత్.
వాసుకేరథ నాగస్య సహసాఽఽక్షిప్యతః సురైః
సధూమాః సార్చిషో వాతా నిష్పేతురసకృన్ముఖాత్.
తే ధూమసంఘాః సమ్భూతా మేఘసంఘాః సవిద్యుతః

అభ్యవర్షన్ సురగణాఞ్ఛ్రమసంతాపకర్శితాన్.
తస్మాచ్చ గిరికూటాగ్రాత్ ప్రచ్యుతాః పుష్పవృష్టయః
సురాసురగణాన్ సర్వాన్ సమన్తాత్ సమవాకిరన్.
బభూవాత్ర మహానాదో మహామేఘరవోపమః
ఉదధేర్మథ్యమానస్య మన్దరేణ సురాసురైః
తత్ర నానాజలచరా వినిష్పిష్టా మహాద్రిణా
విలయం సముపాజగ్ముః శతశో లవణామ్భసి.
వారుణాని చ భూతాని వివిధాని మహీధరః
పాతాళతలవాసీని విలయం సముపానయత్
తస్మింశ్చ భ్రామ్యమాణేఽద్రౌ సంఘృష్యన్తః పరస్పరం
న్యపతన్పతగోపేతాః పర్వతాగ్రాన్మహాద్రుమాః.
తేషాం సంఘర్షజశ్చాగ్నిరర్చిర్భిః ప్రజ్వలన్ముహుః
విద్యుద్భిరివ నీలాభ్రమావృణోన్మందరం గిరిం.
దదాహ కుంజరాంస్తత్ర సింహాంశ్చైవ వినిర్గతాన్
విగతాసూని సర్వాణి సత్త్వాని వివిధాని చ.
తమగ్నిమమరశ్రేష్ఠః ప్రదహన్తమితస్తతః
వారిణా మేఘజేనేంద్రః శమయామాస సర్వశః
తతో నానావిధాస్తత్ర సుస్రువుస్సాగరాంభసి
మహాద్రుమాణాం నిర్యాసా బహవశ్చౌషధీరసాః.
తేషామమృతవీర్యాణాం రసానాం పయసైవ చ
అమరత్వం సురా జగ్ముః కాంచనస్య చ నిఃస్రవాత్.
తతస్తస్య సముద్రస్య తజ్జాతముదకం పయః
రసోత్తమైర్విమిశ్రం చ తతః క్షీరాదభూద్ఘృతం.
తతో బ్రహ్మాణమాసీనం దేవా వరదమబ్రువన్
శ్రాన్తాస్స్మ సుభృశం బ్రహ్మన్నోద్భవత్యమృతం చ తత్.
వినా నారాయణం దేవం సర్వేఽన్యే దేవదానవాః
చిరారబ్ధమిదం చాపి సాగరస్యాపి మన్థనమ్.
తతో నారాయణం దేవం బ్రహ్మా వచనమబ్రవీత్
విధత్స్వైషాం బలం విష్ణో భవానత్ర పరాయణమ్.
బలం దదామి సర్వేషాం కర్మైతద్యే సమాస్థితాః
క్షోభ్యతాం కలశః సర్వైర్మందరః పరివర్త్యతాం.
నారాయణవచః శ్రుత్వా బలినస్తే మహోదధేః
తత్ పయః సహితా భూయశ్చక్రిరే భృశమాకులం.
తతః శతసహస్రాంశుర్మథ్యమానాత్తు సాగరాత్
ప్రసన్నాత్మా సముత్పన్నః సోమః శీతాంశురుజ్జ్వలః.
శ్రీరనన్తరముత్పన్నా ఘృతాత్ పాండురవాసినీ
సురాదేవీ సముత్పన్నా తురగః పాండురస్తథా.
కౌస్తుభస్తు మణిర్దివ్య ఉత్పన్నో ఘృతసంభవః
మరీచివికచః శ్రీమాన్ నారాయణ ఉరోగతః
పారిజాతశ్చ తత్రైవ సురభిశ్చ మహామునే

వినతా, ఈ ఉచ్చైశ్శ్రవమనే పేరుగలగుర్రం ఏరంగుదో తక్షణం చెప్పు- అనగా వినత- ఇది తెలుపు రంగు గుర్రం. నువ్వు ఏమనుకున్నావో చెప్పు. అప్పుడు మనం పందెం వేసుకుందాం— అన్నది. ఆ గుర్రంయొక్క తోకమాత్రం నల్లగా ఉందని నేను అంటున్నాను. నీమాట నిజమైతే నీకు నేను నా జీవితాంతం దాసీగా ఉంటాను. నామాట నెగ్గితే నువ్వు నాకు దాసీగా ఉండాలి. ఇదే పందెం- అన్నది కద్రువ.

ఆపూటకి వాళ్ళిద్దరూ ఇంటికి వెళ్ళి మరునాడు పరిశీలనగా చూద్దామనుకున్నారు. కద్రువ మనస్సులో కుటిలబుద్ధిపని చేసింది. వెయ్యిమంది కొడుకుల్నీ పిలిచి మీరు నల్లటి వెంట్రుకలై ఆ గుర్రముయొక్క తోకను చుట్టుకోండి. అందువల్ల నాకు దాసీత్వము తప్పిపోతుంది- అని కద్రువ చెప్పగా వారెవ్వరూ అందుకు అంగీకరించలేదు. ఆమె తీవ్రమైన కోపంతో— పాండవ వంశీయుడైన జనమేజయరాజర్షి చేసే సర్పయజ్ఞంలో మీరంతా భస్మమైపోండి- అని శపించింది. ఈ శాపాన్ని ఆకర్ణించిన బ్రహ్మ దాన్ని దైవసంఘటనగా భావించి లోకహితార్థం సర్పజాతి కొంత నాశనం కావాలనే ఊహతో కద్రువవాక్యాన్ని ఆమోదించాడు. దుస్సహపరాక్రమానికి ఘోరవిషం తోడుకాగా సదా ప్రాణిహింసచేసే సర్పాలకు ఈ శాపం అత్యావశ్యం ఇతరులకు హానినే తలపెట్టేవారికి దైవం ఇటువంటి శిక్షనే విధిస్తాడు— అని బ్రహ్మ కద్రువను ప్రశంసించి కస్యపప్రజాపతిని పిలిచాడు. కశ్యపా! ప్రజలను విషంతో బాధించే సర్పాలు నీవల్ల పుట్టాయి. దీర్ఘదేహాలతో విషదంష్ట్రలతో లోకకంటకులుగా ఉన్న వీళ్ళని కద్రువ శపించింది. అందులో ఆమె దోషం లేదు కనక నువ్వు ఆమెపై కోప్పడకు. యజ్ఞాలలో సర్పనాశనమౌతుందని నువ్వు ఎరుగనే ఎరుగుదువుగదా— అని చెప్పి సర్పాలలోంచి విషాన్నిహరించే విద్యను కశ్యపునికి చెప్పి బ్రహ్మ తిరోహితుడయ్యాడు.

ఆ ప్రకారంగా కద్రువ శపించేసరికి సర్పశ్రేష్ఠుడైన కర్కోటకుడు సంతోషభర హృదయంతో తల్లితో యిలా అన్నాడు. అమ్మా నువ్వు నిర్విచారంగా ఉండు. నేను ఆ గుర్రంలో ప్రవేశించి దానితోక నల్లగా చూపిస్తాను- ఈవిధంగా కర్కోటకుడు పలికేసరికి కద్రువ పరమ సంతోషంతో సరేనన్నది.

ఇది 20 వ అధ్యాయము సమాప్తము

## ఇరువది ఒకటవ అధ్యాయము

మహర్షులారా ఆ రాత్రి గడిచింది. తూర్పు దిక్కున సూర్యభగవానుని అరుణ కాంతులు లాస్యం చేస్తున్నాయి. ఆ ఉదయసంధ్యాశోభలో ముదిత హృదయులైన ప్రమదామణులు వినతా కద్రువలు ఉచ్చైశ్శ్రవాన్ని చూడటానికి వెళ్ళారు. అప్పుడే ఒకరినొకరు దాసిగా భావించుకుంటున్నారు.

జజ్ఞాతే తౌ తదాబ్రిహ్మన్ సర్వకామ ఫలప్రిదా.
శ్రీః సురాచైవ సోమశ్చ తురగశ్చ మనోజవః
యతో దేవా స్తతోజగ్మురాదిత్య పథమాశ్రితాః.
ధన్వన్తరి స్తతో దేవో వపుష్మానుదతిష్ఠత
శ్వేతం కమండలుం బిభ్రిదమృతం యత్రతిష్ఠతి.
ఏతదత్యద్భుతం దృష్ట్వా దానవానాం సముత్థితః
అమృతార్థే మహాన్నాదో మమేదమితి జల్పతాం.
శ్వేతై ర్దన్తైశ్చతుర్భిస్తు మహాకాయ స్తతః పరమ్
ఐరావతో మహానాగోఽభవద్వజ్రభృతాధృతః.
అతినిర్మథనా దేవ కాలకూట స్తతః పరః
జగదావృత్య సహసా సధూమోగ్నిరివజ్వలన్.
త్రైలోక్యం మోహితం యస్య గంధమాఘ్రాయ తద్విషమ్

ప్రాగ్రసల్లోకరక్షార్థం బ్రిహ్మణో వచనాచ్ఛివః.
దధార భగవాన్ కంఠేమంత్రమూర్తిర్మహేశ్వరః
తదా ప్రిభృతి దేవస్తు నీలకంఠ ఇతి శ్రుతిః.
ఏతత్ తదద్భుతం దృష్ట్వా నిరాశాదానవాః స్థితాః
అమృతార్థే చ లక్ష్మ్యర్థేమహాన్తం వైరమాశ్రితాః
తతో నారాయణో మాయాం మోహినీం సముపాశ్రితః
స్త్రీరూపమద్భుతం కృత్వా దానవానభి సంశ్రితః
తత స్తదమృతం తస్యై దదు స్తే మూఢ చేతసః
స్త్రియై దానవ దైతేయా స్సర్వే తద్గతమానసాః
సాతునారాయణీ మాయాధారయన్తీ కమండలుం
ఆస్యమానేషు దైత్యేషు పంక్త్యా చ ప్రతిదానవైః
దేవానపాయ యద్దేవీ న దైత్యాంస్తేచ చుక్రుశుః

18 వ అధ్యాయము సమాప్తం

## పందొమ్మిదవ అధ్యాయ్యము

అథావరణ ముఖ్యాని నానాప్రిహరణాని చ
ప్రగృహ్యాభ్యద్రవన్ దేవాన్ సహితాదైత్యదానవాః
తత స్తదమృతం దేవో విష్ణు రాదాయ వీర్యవాన్
జహార దానవేన్ద్రేభ్యో నరేణ సహితః ప్రిభుః.
తతో దేవగణాః సర్వే పపు స్తదమృతం తదా
విష్ణోః సకాశాత్ సంప్రాప్య సంభ్రిమే తుములేసతి.
తతః పిబత్సు తత్కాలం దేవేష్వమృత మీప్సితమ్
రాహుర్విబుధరూపేణ దానవః ప్రాపిబత్ తదా.
తస్య కంఠమనుప్రాప్తే దానవస్యామృతే తదా
ఆఖ్యాతం చంద్రిసూర్యాభ్యాం సురాణాం హిత కామ్యయా.
తతో భగవతా తస్య శిరశ్ఛిన్న మలంకృతమ్
చక్రాయుధేన చక్రేణ పిబతోఽమృతమోజసా.

తచ్ఛైలశృంగప్రితిమం దానవస్య శిరో మహత్
చక్రిచ్ఛిన్నం ఖముత్పత్య ననాదాతి భయంకరమ్.
తత్ కబంధం పపాతాస్య విస్ఫురద్ ధరణీతలే
స పర్వత వనద్వీపాం దైత్యస్యాకంపయన్ మహీమ్.
తతో వైర వినిర్బంధః కృతో రాహు ముఖేనవై
శాశ్వతశ్చంద్రిసూర్యాభ్యాంగ్ర సత్యద్యాపిచైనతౌ.
విహాయ భగవాంశ్చాపి స్త్రీరూప మతులం హరిః
నానాప్రిహరణై ర్భీమై ర్దానవాన్ సమకంపయత్.
తతః ప్రివృత్తః సంగ్రామఃసమీపే లవణాంభసః
సురాణామసురాణాం చ సర్వఘోరతరోమహాన్.
ప్రాసాశ్చ విపులా స్తీక్ష్ణా న్యపతన్త సహస్రశః
తోమరాశ్చ సుతీక్ష్ణాగ్రాః శస్త్రాణి వివిధాని చ.
తతో సురా శ్చక్రిభిన్నా వమన్తో రుధిరం బహు

నమస్తూ నమస్తూ వారు సముద్రాన్ని చూశారు. అగాధంగా బ్రహ్మాండమైన తరంగాలతో ఉన్నది ఆసముద్రం. అందులో పెద్దపెద్ద మొసళ్ళు తోకలు విదలిస్తూ సంక్షుబ్ధం చేస్తున్నాయి. పెద్దపెద్ద మత్స్యాలనే కాదు తిమి అనే పేరుగల భీకర జలచరాలను కూడా మింగేసే తిమింగలాలతో మహాఘోష చేస్తున్నది. నానారకాలయిన జలజంతువులు సహస్రాధిక సంఖ్యలో ఉన్నాయి. వికట భయానకాకారాలు గల నీటిప్రాణులతో నిండిన ఆ సాగరం చూడటానికే భయంగా ఉంది. పెద్దపెద్ద తాంబేళ్ళూ మొసళ్ళూ హాయిగా విహరిస్తున్నాయి. జలనిధియైన ఆ మహాసముద్రం రత్నముల గనియైన వరుణదేవుని నివాసస్థలమై నాగజాతి యొక్క అందమైన ఆవాససౌధంలా ఉంది. పాతాళాగ్ని బడబానలం కూడా అందులోనే ఉంది. రాక్షసులకు అభయమిచ్చే ఆప్తబంధువులా వున్న అది ఇతరజంతువులకు అపాయభీతి కలిగిస్తుంది. పారములేని ఆసాగరం అమృతానికి కూడా స్థానం కానటంవల్ల శుభప్రదంగా ఉంది. పవిత్రజలపరిపూర్ణమై అద్భుతంగా ఉంది. జలజంతుధ్వానాలతో భయంకరంగానూ ఉంది. సర్వప్రాణికోటికీ భయాన్ని కలిగించే సుడిగుండాలున్నాయి. ఒడ్డున వీచే గాలి ఆ సముద్రాన్ని ఉయ్యాలలో ఊపుతున్నట్లుంది. ఉద్వేగ క్షోభాలతో అది ఉత్తుంగ తరంగాలను లేపుతున్నది. కెరటాలనే హస్తాలతో అది నృత్యం చేస్తున్నట్లే ఉంది. మహావిష్ణుదేవుని హస్తాలలో అలరారే పాంచజన్యశంఖాన్ని ప్రసవించిన రత్నాకరమది.

మహాతేజస్వియైన ఆదినారాయణుడు వరాహరూపంలో పృథ్విని ధరించినప్పుడు ఈ సముద్రాన్నే మథించాడు. ఆ మథనంవల్లనే అది మలినంగా గోచరిస్తుంది. వశిష్ఠశాపగ్రస్తుడైన అత్రి అధోలోకాన్వేషణ చేస్తూ దాని అంతు కనుక్కోలేకపోయాడు. నూరు సంవత్సరాల కాలం అత్రి ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. పాతాళం దాటినా అంతు దొరకలేదు. ఆధ్యాత్మికయోగనిద్రలో ఉండే నారాయణుడు యుగాంతసమయం నుండి యుగాదివరకూ ఈ సాగరాన్నే శయ్యాగారంగా భావిస్తాడు. యుద్ధరంగంలో దెబ్బలుతిన్న అసురులకిదే ఆశ్రయం. వజ్రాయుధభీతితో వచ్చిన మైనాకునికీ శరణమిచ్చినదీ యిదే. ప్రజ్వలించే బడబానలంలోక జలరూపమైన హవిస్సు పోస్తూ లోకకళ్యాణాన్ని కాంక్షించే దీ సాగరమే. జలనాథుడైన సముద్రుడు ఈ ప్రకారంగా అప్రమేయు అగాధ అపార విస్తారాలతో రాజిల్లుతున్నాడు. పందెములతో మహానదులన్నీ సాగరంలో సంగమిస్తుంటాయి. తమ జలాలతో పరిపూర్ణం చేస్తాయి; తాలోత్తాల తరంగహస్తచాలనంతో నాట్యం చేస్తూ భయంకర జలచరాలతో భీతిని కలిగిస్తూ నిరంతరఘోషతో ఉంటుంది. ఆకాశంవలె స్వచ్ఛంగా ఉంటుంది. ఆయా విశేషాలతో విభ్రాంతిగొలిపే సాగరాన్ని వినతా కద్రువలు దర్శించారు.

21 వ అధ్యాయం సమాప్తం

అసిశక్తిగదారుగ్ణా నిపేతుర్ధరణీతలే.
ఛిన్నాని పట్టిశైశ్చైవ శిరాంసి యుధిదారుణైః
తప్తకాంచనమాలీని నిపేతురనిశం తదా.
రుధిరేణానులిప్తాంగా నిహతాశ్చ మహాసురాః
అద్రీణామివకూటాని ధాతురక్తాన్ని శేరతే.
హాహాకారః సమభవత్ తత్ర తత్ర సహస్రశః
అన్యోన్యంఛిందతాం శస్త్రైరాదిత్యే లోహితాయతి.
పరిఘైరాయసైస్తీక్ష్ణైః సంనికర్షే చ ముష్టిభిః
నిఘ్నతాంసమరేఽన్యోన్యంశబ్దో దివమివాస్పృశత్.
ఛింధి భింధి ప్రధావత్వం పాతయాభిసరేతి చ
వ్యశ్రూయంత మహాఘోరాశ్శబ్దాస్తత్రసమంతతః.
ఏవం సుతుములే యుద్ధే వర్తమానే మహాభయే
నరనారాయణౌ దేవౌ సమాజగ్మతురాహవం.
తత్ర దివ్యం ధనుర్దృష్ట్వా నరస్య భగవానపి
చింతయామాస తచ్చక్రం విష్ణుర్దానవసూదనమ్.

తతోఽమ్బరాచ్చింతితమాత్రమాగతం
మహాప్రభం చక్రమమిత్రతాపనమ్
విభావసోస్తుల్యమకుంఠమండలం
సుదర్శనం సంయతి భీమదర్శనమ్
తదాగతం జ్వలితహుతాశనప్రభం
భయంకరం కరికరబాహురచ్యుతః
ముమోచ వై ప్రబలవదుగ్రవేగవాన్
మహాప్రభం పరనగరావదారణమ్.
తదంతకజ్వలనసమానవర్చసం
పునః పునర్న్యపతత వేగవత్తదా
విదారయద్ దితిదనుజాన్ సహస్రశః
కరేరితం పురుషవరేణ సంయుగే.
దహత్ క్వచిజ్జ్వలన ఇవావలేలిహత్
ప్రసహ్య తానసురగణాన్న్యకృంతత
ప్రవేరితం వియతి ముహుః క్షితౌ తథా
పపౌ రణే రుధిరమథో పిశాచవత్.
తథాసురా గిరిభిరదీనచేతసో
ముహుర్ముహుః సురగణమార్దయంస్తదా
మహాబలా విగళితమేఘవర్చసః
సహస్రశో గగనమభిప్రపద్య హ.
అథాంబరాద్ భయజననాః ప్రపేదిరే
సపాదపా బహువిధమేఘరూపిణః
మహాద్రయః పరిగలితాగ్రసానవః
పరస్పరం ద్రుతమభిహత్యసస్వనాః
తతో మహీ ప్రవిచలితా సకాననా
మహాద్రిపాతాభిహతా సమంతతః
పరస్పరం భృశమభిగర్జతాం ముహూ
రణాజిరే భృశమభిసంప్రవర్తితే.
నరస్తతో వరకనకాగ్రభూషణై
ర్మహేషుభిర్గగనపథం సమావృణోత్
విదారయన్ గిరిశిఖరాణి పత్రిభిః
మహాభయేఽసురగణవిగ్రహే తదా.
తతో మహీం లవణజలం చ సాగరం
మహాసురాః ప్రవివిశురర్దితాః సురైః
వియద్గతం జ్వలితహుతాశనప్రభం
సుదర్శనం పరికుపితం నిశమ్య తే.
తతస్సురైర్విజయమవాప్య మందరః
స్వమేవ దేశం గమితః సుపూజితః
వినాద్య ఖం దివమపి చైవ సర్వశః
తతో గతాః సలిలధరా యథాగతమ్.
తతోఽమృతం సునిహితమేవ చక్రిరే
సురాః పరాం ముదమభిగమ్య పుష్కలాం
దదౌ చ తం నిధిమమృతస్య రక్షితుం
కిరీటినే బలభిదథామరైః సహ.

19 వ అధ్యాయం సమాప్తము

## ఇరువది రెండవ అధ్యాయము

నాగులన్నీ సమావేశమై ఏమైనా సరే తల్లియాజ్ఞ పాలించాలని నిశ్చయించుకున్నాయి. కద్రువ మనోరథం తీరకపోతే ఆ రోషంతో ఆమె మనల్నందర్నీ భస్మం చేస్తుందనీ ఆమె ఆశ నెరవేరితే తప్పకుండా సంతృప్త హృదయంతో శాపవిమోచనం ప్రసాదించి మేలు చేకూరుస్తుంది కనక మనం ఆ గుర్రపుతోకను నల్లగా ఉంచుదాం అని వారందరూ పోయి నల్లటి కేశాలుగా ఆ గుర్రపు తోకను ఆవరించుకున్నారు.

వినతా కద్రువ లిద్దరూ తమ పందెం విషయాన్ని మళ్ళీ ప్రస్తావించుకొని ఆ దక్షప్రజాపతి పుత్రికలైన వారిద్దరూ ఆకాశమార్గాన అవతలి తీరానికి గమిస్తూ ప్రబల వాయు తరంగఘాతాలతో సంక్షోభించే సముద్రాన్నీ అందులోని జలచరాల్నీ చూస్తూ ఆ మత్స్యకచ్ఛప తిమితిమింగిలాల ఘోష వింటూ రత్నాకరుడు వరుణావాసుడు బడబానలాశ్రయుడు అసుర శరణాలయుడు అనంతజలనిధి అవినాశీ అయిన సాగరం దాటుతున్నారు.

అంతేగాక అది శుభ్రమై దివ్యమై అచింత్యమై పరమ పవిత్ర జలపూర్ణమై అమృతోత్పత్తి స్థానమై ఉంది. మహానదులన్నీ అందులో కలవటం వారు చూశారు. సముద్రుడు అలలనే చేతులతో నర్తించడం కూడా వారు గ్రహించారు. తరళ తరంగాలతో ఆకాశ స్వచ్ఛంతో బడబానల శిఖాఛటోద్భాసితమై గంభీర ఘోషతో ఉన్న సముద్రాన్ని అవలోకిస్తూ వారు ముందుకు సాగారు.

ఇది 22 వ అధ్యాయం సమాప్తము

## ఇరువదిమూడవ అధ్యాయము

వేగంగా నడవగల కద్రువ వినతతో సముద్రందాటి ఉచ్చైశ్శ్రవం దగ్గరకు వచ్చింది. చంద్రకిరణాలవలె తెల్లని కాంతితో వెలిగే మహా వేగంగల ఆ ఉత్తమ అశ్వాన్ని వారిద్దరూ చూశారు. దానితోక ఘనీభవించిన నలుపులా ఉండటం చూసి వినతముఖం విషాదముతో పరిదీనమైపోయింది. ఉత్తరక్షణంలో కద్రువ వినతను దాసీగా నియోగించుకుంది. ఒడ్డిన పందెంలో ఓడిన వెనుక దుఃఖంతో కొంతసేపు బాధపడి నెమ్మదిగా తేరుకొని దాసీత్వాన్ని స్వీకరించింది.

సరిగా ఆసమయానికి గుడ్డు బద్దలుచేసుకొని గరుత్మంతుడు మహాతేజస్సుతో ప్రభవించాడు. ఆ తేజస్సు దశదిశలను ప్రకాశింపజేస్తున్నది. పరాక్రమ సాహసోపేతుడై గరుత్మతుండు ఏ ప్రదేశానికైనా యదేచ్ఛగా పోగలడు. అవక్రవిక్రమంతో చరించగలడు. అతడు కామరూపి. గగనచారియైన పక్షిరూపంలో అతడు జనించాడు. జ్వలిత జ్వాలాపుంజసదృశుడై అద్భుతప్రభాభాసమానుడై అత్యంతభయంకరంగా గోచరిస్తున్నాడు. అతని కన్నులు పింగళవర్ణంతో మెఱుపుతీగలవలె మెరు

## ఇ రు వ ద వ అ ధ్యా య ము

ఏతత్ తేకథితం సర్వమమృతం మథితం యథా
యత్రసోఽశ్వః సముత్పన్నః శ్రీమానతులవిక్రమః.
యంనిశమ్య తదా కద్రూర్వినతా మిదమబ్రవీత్
ఉచ్చైఃశ్రవాహికింవర్ణోభద్రేప్రబ్రూహిమాచిరమ్.
శ్వేతఏవాశ్వరాజోఽయం కింవాత్వం మన్యసేశుభే
బ్రూహివర్ణం త్వమప్యస్య తతోఽత్రవిపణావహే.
కృష్ణవాలమహం మన్యే హయమేనం శుచిస్మితే
ఏహిసార్థం మయాదీవ్య దాసీభావాయ భామిని.
ఏవంతే సమయంకృత్వా దాసీభావాయవై మిథః
జగ్మతుః స్వగృహానేవశ్వో ద్రక్ష్యావ ఇతిస్మహ.
తతః పుత్రసహస్రంతు కద్రూర్జిహ్మం చికీర్షతీ
ఆజ్ఞాపయామాస తదా వాలాభూత్వాంజనప్రభాః.
ఆవిశధ్వంహయంక్షిప్రం దాసీ నస్యామహం యథా
నావపద్యన్తయేవాక్యంతాన్ శశాప భుజంగమాన్.
సర్పసత్రే వర్తమానే పావకోవః ప్రధక్ష్యతి
జనమేజయస్య రాజర్షేః పాండవేయస్య ధీమతః.
శాపమేనం తు శుశ్రావ స్వయమేవ పితామహః
అతిక్రూరంసముత్సృష్టం కద్రూవా దైవాదతీవహి.
సార్ధం దేవగణైః సర్వైర్వాచంతా మన్వమోదత
బహుత్వం ప్రేక్ష్య సర్పాణాం ప్రజానాం హిత కామ్యయా.
తిగ్మవీర్యవిషాహ్యేతే దందశూకా మహాబలాః
తేషాం తీక్ష్ణవిషత్వాద్ధిప్రజానాంచ హితాయచ.
యుక్తం మాత్రాకృతం తేషాం పరపీడోపసర్పిణామ్
అన్యేషామపి సత్వానాం నిత్యం దోషపరాస్తుయే.
తేషాం ప్రాణాంతకోదండో దైవేన వినిపాత్యతే
ఏవం సంభాష్య దేవస్తుపూజ్యకద్రూంచతాం తదా.
ఆహూయకశ్యపం దేవ ఇదం వచనమబ్రవీత్
యదేతే దందశూకాశ్చ సర్పా జాతస్త్వయానఘ.
విషోల్బణా మహాభోగా మాత్రాశప్తాః పరంతప
తత్ర మన్యుస్త్వయా తాత నకర్తవ్యః కథంచన.
దృష్టం పురాతనం హ్యేతద్ యజ్ఞే సర్పవినాశనమ్
ఇత్యుక్త్వా సృష్టికృద్ దేవస్తంప్రసాద్యప్రజాపతిమ్
ప్రాదాద్ విషహారీం విద్యాం కశ్యపాయ మహాత్మనే.
ఏవం శప్తేషు నాగేషు కద్రూవాచ ద్విజసత్తమ
ఉద్విగ్నః శాపతస్తస్యాః కద్రూంకర్కోటకోఽబ్రవీత్.
మాతరం పరమప్రీతస్తదా భుజగసత్తమః
ఆవిశ్యవాజినం ముఖ్యం వాలోభూత్వాంజనప్రభః.
దర్శయిష్యామి తత్రాహమాత్మానం కామమాశ్వస
ఏవమస్త్వితి తం పుత్రం ప్రత్యువాచ యశస్వినీ.

20 వ అధ్యాయం సమాప్తం

## ఇ ర వై ఒ క ట వ అ ధ్యా య ము

తతోరజన్యాంవ్యుష్టాయాం ప్రభాతేఽభ్యుదితేరవౌ
కద్రూశ్చ వినతా చైవ భగిన్యౌతే తపోధన.
అమర్షితే సుసంరబ్ధే దాస్యే కృత పణే తదా
జగ్మతుస్తురగం ద్రష్టుముచ్చైఃశ్రవసమన్తికాత్.
దదృశాతేఽథతే తత్ర సముద్రం నిధిమమ్భసాం
మహాన్తముదకాగాధం క్షోభ్యమాణం మహాస్వనం

స్తున్నాయి. అవి ప్రళయాగ్నివలె ప్రజ్వలిస్తూ ప్రకాశిస్తున్నాయి. క్షణాలలోనే అతని శరీరం పెరిగిపోయింది. అతని కంఠధ్వని అత్యంత భయానకంగా ఉంది. భీషణబడబానలంలా కనుపించే గరుత్మంతుని చూచి దేవతలు విశ్వరూపధరుడైన అగ్నిహోత్రుని శరణుజొచ్చి నమస్కరిస్తూఇలాఅన్నారు. అగ్నిదేవా మీరు ఈప్రకారంగా జ్వలించి ప్రజ్వలించి మమ్మల్నందరినీ భస్మంచేయాలని అనుకోవటం లేదుకదా! మీ జ్వాలాతేజం ఎంతగా వ్యాపిస్తుందో చూడండి_అని సురలు పలుకగా విని రాక్షస సంహార సమర్థశక్తివంతులైన ఓ దేవతలారా, మీఊహ సరియైనదికాదు. ఇతడు మహాబలిష్ఠుడైన గరుత్మంతుడు. నాతో తూగగల తేజస్సు కలవాడు. ఈ మహాతేజస్వి వినతాసూనుడైన గరుత్మంతుడు. ఇతడు పుడుతూనే ఇలా పుట్టాడు. అతని కాంతిపుంజాన్ని తిలకించి మీరు భ్రమపడ్డారు. కశ్యపనందనుడైన ఈ గరుత్మంతుడు మీ హితవును కోరుతూ దైత్యదానవరాక్షసులకు శత్రువై నాగవంశనాశకుడౌతాడు. ఇతనివల్ల మీకు ఏవిధమైనబాధా లేదుకనక మీరు నాతో వచ్చి అతన్ని చూడండి_ అని పలికిన అగ్నిహోత్రుని మాటలువిన్న దేవతలు ఋషులు ఈ ప్రకారంగా స్తుతించసాగారు_ మంత్రద్రష్టవైన మహర్షిగణానివీ మహానుభావులైన దేవకోటివీ నువ్వే. నీవే మహాప్రభుడవు. తపన సూర్య ఇంద్రప్రజాపతి శివ జగన్నాథరూపుడవు నువ్వు. భగవన్ముఖరూపమైన బ్రహ్మతేజస్సువు. పద్మగర్భుడవైన బ్రహ్మవు. ధాతవు. విధాతవు. నారాయణుడువు. అగ్ని వాయు రూపుడవు. అహంకార మహత్తత్వాలు నీవే. సాగరబలంకల సాధుపురుషా! ఉదార సత్వగుణాలతో విరాజిల్లే నీవే మాకు సర్వరక్షకుడవు. యుద్ధభూమిలో నీ వేగతీవ్రతను ఎవ్వరూ సహించలేరు.

ఈ విశాలవిశ్వము నీవల్లనే జన్మించింది. సూర్యుడు తన కిరణకాంతితో ఈ ప్రపంచానికి వెలుగు నిస్తూన్నట్లు నువ్వు భూతభవిష్యద్వర్తమానరూపుడవై ప్రకాశిస్తున్నావు. సర్వసంహారకారకుడైన యముడవు నీవు. సూర్యకాంతిని ఉపసంహరించి ఈ జగత్తును లయం చేయగలవాడవు నువ్వు. అగ్నిసదృశప్రకాశం గల గరుత్మంతుడా! సూర్యుడు క్రోధోద్రిక్తుడైతే సర్వప్రపంచాన్ని భస్మం చేయగలిగినట్లే క్రోధమూర్తివైన నువ్వు కూడా బూడిదచేయగలవు. యుగాంతాన్ని కలిగించేయముడికి నువ్వు యముడవు. ప్రళయకాలంలో సర్వవస్తుప్రాణినాశనార్థం సంవర్తకాగ్నిరూపంలో ప్రభవించేవాడివి నువ్వు. ఈజీవకోటి కంతకీ ఆధారభూతుడవు. అధిపతివి. మహత్తరమైన ఓజస్సుతో తటిల్లతలా ప్రకాశిస్తూ అజ్ఞానాంధకారాన్ని పటాపంచలం చేస్తావు. గగనవీథిలో మేఘంవలె విహరించే నిన్ను శరణు వేడుచున్నాము. అజేయపరాక్రమంగల నువ్వే కార్యకారణస్వరూపుడవై వీరప్రదాతవై విశ్వసంతప్త కారణుడవౌతున్నావు. తప్తకాంచనవర్ణంతో వెలుగొందే మహాత్మా! నీ తేజస్సునుచూసి భయపడి విమానచరులైన దేవతలు దారిగానక బాధపడుతున్నారు. దయాహృదయంతో వారిని రక్షించు.

కశ్యపనందనా! ఈ భువనభవనంమీద నీ దయారసం ప్రవహింపజేయి. నీ గర్జనవల్ల భూమ్యాకాశాలేకాదు స్వర్గమే గజగజలాడి మాకు భయాన్ని కలిగిస్తూంది. ఓ పక్షిరాజా! ఈ భయంకరరూపాన్ని వదలి మాకు శాంతికలిగించండి. ఈ

తిమింగిలఝషాకీర్ణం మకరైరావృతం తథా
సత్త్వైశ్చబహుసాహస్రైర్నానారూపైః సమావృతం
భీషణైర్వికృతైరన్యైర్ఘోరైర్జలచరైస్తథా
ఉగ్రైర్నిత్యమనాధృష్యం కూర్మగ్రాహసమాకులం.
ఆకరం సర్వరత్నానామాలయం వరుణస్య చ
నాగానామాలయం రమ్యముత్తమం సరితాం పతిం.
పాతాళజ్వలనావాసమసురాణాం చ బాన్ధవమ్
భయంకరం చ సత్త్వానాం పయసాం నిధిమర్ణవం.
శుభం దివ్యమమర్త్యానామమృతస్యాకరం పరం
అప్రమేయమచిన్త్యం చ సుపుణ్యాజలమద్భుతమ్.
ఘోరం జలచరారావరౌద్రం భైరవనిస్స్వనం
గమ్భీరావర్తకలిలం సర్వభూతభయంకరం.
వేలాదోలానిలచలం క్షోభోద్వేగసముచ్ఛ్రితం
వీచీహస్తైః ప్రచలితైర్నృత్యన్తమివ సర్వతః
చన్ద్రవృద్ధిక్షయవశాదుద్వృత్తోర్మిసమాకులం
పాంచజన్యస్య జననం రత్నాకరమనుత్తమం.
గాం విన్దతా భగవతా గోవిన్దేనామితతేజసా
వరాహరూపిణా చాన్తరిక్షోభితజలావిలం.
బ్రహ్మర్షిణా వ్రతవతా వర్షాణాం శతమత్రిణా
అనాసాదితగాధం చ పాతాళతలమవ్యయం.
అధ్యాత్మయోగనిద్రాం చ పద్మనాభస్య సేవతః
యుగాదికాలశయనం విష్ణోరమితతేజసః.
వజ్రపాతనసంత్రస్తమైనాకస్యాభయప్రదం
డింబాహవార్దితానాం చ అసురాణాం పరాయణం.
బడబాముఖదీప్తాగ్నేస్తోయహవ్యప్రదం శివం
అగాధపారం విస్తీర్ణమప్రమేయం సరిత్పతిం.
మహానదీభిః బహ్వీభిః స్పర్ధయేవ సహస్రశః
అభిసార్యమాణమనిశం దదృశాతే మహార్ణవం
ఆపూర్యమాణమత్యర్థం నృత్యమానమివోర్మిభిః.

గంభీరం తిమిమకరోగ్రసంకులం తం
గర్జన్తం జలచరరావరౌద్రనాదైః
విస్తీర్ణం దదృశతు రమ్బరప్రకాశం
తేఽగాధం నిధిమురుమమ్భసామనన్తం.

21 వ అధ్యాయము సమాప్తం

## ఇరవై రెండవ అధ్యాయము

నాగాశ్చ సంవిదం కృత్వా కర్తవ్యమితి తద్వచః
నిఃస్నేహా వై దహేన్మాతా అసంప్రాప్తమనోరథా.
ప్రసన్నా మోక్షయేదస్మాంస్తస్మాచ్ఛాపాచ్చ భామినీ
కృష్ణం పుచ్ఛం కరిష్యామస్తురగస్య నసంసయ
తథా హి గత్వా తే తస్య పుచ్ఛే వాలా ఇవస్థితాః
ఏతస్మిన్నన్తరే తే తు సపత్న్యౌ పణితే తదా.
తతస్తే పణితం కృత్వా భగిన్యౌ ద్విజసత్తమ
జగ్మతుః పరయా ప్రీత్యా పరం పారం మహోదధేః.
కద్రూశ్చ వినతా చైవ దాక్షాయణ్యౌ విహాయసా
ఆలోకయన్త్యావక్షోభ్యం సముద్రం నిధిమమ్భసాం.
వాయునాతీవసహసా క్షోభ్యమాణం మహాస్వనం
తిమింగిలసమాకీర్ణం మకరైరావృతం తథా.
సంయుతం బహుసాహస్రైః సత్త్వైర్నానావిధైరపి
ఘోరైర్ఘోరమనాదృష్యం గంభీరమతిభైరవం.
ఆకరం సర్వరత్నానామాలయం వరుణస్య చ
నాగానామాలయం చాపి సురమ్యం సరితాం పతిం
పాతాళజ్వలనావాసమసురాణాం తథాలయమ్
భయంకరాణాం సత్త్వానాం పయసో నిధిమవ్యయం.

తీవ్రకాంతి మామనస్సులను విచలితము చేస్తూంది. ఋషిసమేతులై అమరులు స్తుతించగా గరుత్మం మా ప్రార్థనలను మన్నించి ప్రసన్నరూపంతో తుడు తన తేజస్సును అంతర్లీనం చేసుకుని ప్రశాంత కల్యాణకాంతులు వెదజల్లి మమ్మల్ని రక్షించు-అని కళ్యాణరూపుడై నాడు.

23 వ అధ్యాయం సమాప్తము

## ఇరువది నాల్గ వ అధ్యాయము

దేవర్షి సంఘాల స్తుతులు విన్న గరుత్మంతుడు ఒక్క-సారి తనశరీరాన్ని తిలకించి చూసుకుని దాన్ని సంకోచింపజేశాడు. అనంతరం తన దేహాన్ని చూసినంతలో ప్రాణికోటి భయపడనవసరం లేదని దేవతలకు చెప్పి తనయిచ్ఛానుసారం ఆకృతి మార్చుకుంటూ తిరిగి సోదరుడైన అరుణుని తన వీపుమీద ఎక్కించుకుని పితృగృహంనుండి తల్లిదగ్గరకువచ్చాడు. సూర్యుడు తేజోమూర్తియై ఈలోకాలను భస్మంచేసే సంకల్పంతో ఉన్నపుడు తన సోదరుని తీసికెళ్ళి అక్కడ విడిచి వచ్చాడు— అని చెప్పగా విని రురువు ఇలా ప్రశ్నించాడు— పితృపూజ్యా, ఆ సమయంలో దేవతలు ఏ అపకారం తలపెట్టారని సూర్యుడు క్రోధంతో లోకాలను భస్మం చేయాలనుకున్నాడు.

కుమారుని సందేహం ఆలకించి ప్రమతి చెపుతున్నాడు- అమృతాస్వాదన సమయంలో సూర్యచంద్రులకు రాహువుతో వైరం వచ్చిన కారణంగా రాహువు నిరంతరం సూర్యుని వేధించడంవల్ల అతనికి ఆగ్రహం కలిగింది. ఆపీడలో ఉన్న సూర్యునికి దేవతలుఒక్క-రూసహాయం చేయనందున సూర్యుడు ఆగ్రహంతోపశ్చిమాచలంమీదకూర్చునిపోయాడు. అక్కడేవుండి సమస్తవిశ్వాన్నీ నాశనం చేయటానికి తన వేడిని ప్రసరించసాగాడు. అప్పుడు మహర్షులందరూ దేవతలదగ్గరకుపోయి- ఈ అర్ధరాత్రివేళ సర్వలోకహారకమైన మహాగ్ని ఆవిర్భవిస్తున్నది— అనగా దేవతలు వారివెంట నడిచి బ్రహ్మను ప్రార్థించి— ఈ ప్రళయాగ్ని సూర్యుడు అస్తమించినప్పుడే వస్తే ఇక ఉదయవేళ ఏం చెప్పగలం— అనగా బ్రహ్మ చెపుతున్నాడు— సూర్యుడు లోకప్రళయసంకల్పంతో ఉన్నాడు. ఇతడు ఉదయించగానే లోకాలు భస్మమైతీరతాయి, భీషణాగ్నిచ్ఛటలనుండి రక్షణోపాయం ఆలోచించాను, కశ్యపమహర్షి కుమారుడైన అరుణుడు విశాలశరీరుడు. అతడు సూర్యరథానికి ముందు కూర్చుని సారథ్యం సాగిస్తే ఆ తేజస్సును హరించగలడు. అలా చేసిననాడు ఋషులకూ దేవతలకే కాదు ముల్లోకాలకూ శాంతి లభిస్తుంది-అని బ్రహ్మచెప్పగా విని అరుణుడు ఆప్రకారం ఆచరించాడు. అప్పుడు అరుణునిచేత ఆవరింపబడి సూర్యుడుఉదయించాడు. మహాశక్తిసంపన్నుడైన అరుణుడు సూర్యుని సారథిగా ఎందుకు ఉంటున్నాడోకూడా నేను వివరించాను. తరువాయి విషయం విను— అని ప్రమతి పలికాడు.

ఇది 24 వ అధ్యాయం సమాప్తము

శుభ్రం దివ్యమమర్త్యానా మమృతస్యాకరం పరం
అప్రమేయమచిన్త్యం చ సుపుణ్య జలసమ్మితమ్.
మహానదీభి ర్బహ్వీభి స్తత్ర తత్ర సహస్రశః
అపూర్యమాణ మత్యర్థం నృత్యంత మివచోర్మిభిః.

ఇత్యేవం తరళతరోర్మి సంకులంతం
గంభీరం వికసిత మంబరప్రకాశమ్.
పాతాళజ్వలనశిఖా విదీపితాంగం
గర్జంతం ద్రుతమభి జగ్మతు స్తత స్తే.

22 వ అధ్యాయం సమాప్తం

## ఇరవై మూడవ అధ్యాయము

తం సముద్ర మతిక్రమ్య కద్రూర్వినతయా సహ
న్యపతత్ తురగాభ్యాసే నచిరాదివ శీఘ్రగా.
తత స్తేతం హయశ్రేష్ఠం దదృశాతే మహాజవమ్
శశాంకకిరణప్రఖ్యం కాలవాలముభే తదా.
నిశమ్యచ బహూన్ వాలాన్ కృష్ణాన్ పుచ్ఛసమాశ్రితాన్
విషణ్ణరూపాం వినతాం కద్రూర్దాస్యే న్యయోజయత్.
తతః సా వినతా తస్మిన్ పణితేన పరాజితా
అభవద్ దుఃఖసంతప్తా దాసీ భావం సమాస్థితా.
ఏతస్మిన్నంతరే చాపి గరుడః కాలఆగతే
వినామాత్రా మహాతేజా విదార్యాండ మజాయత.
మహాసత్త్వ బలోపేతః సర్వావిద్యోతయన్ దిశః
కామరూపః కామగమః కామవీర్యో విహంగమః.
అగ్నిరాశిరివోద్భాసన్ సమిద్ధోఽతి భయంకరః
విద్యుద్విస్పష్టపింగాక్షో యుగాంతాగ్ని సమప్రభః.
ప్రవృద్ధః సహసా పక్షీ మహాకాయో నభోగతః
ఘోరోఘోరస్వనోరౌద్రోవహ్ని రౌర్వ ఇవాపరః.
తం దృష్ట్వా శరణం జగ్ముర్దేవా సర్వే విభావసుం
ప్రణిపత్యా బ్రువం శ్చైన మాసీనం విశ్వరూపిణం.
అగ్నేమా త్వం ప్రవర్ధిష్ఠాః కచ్చిన్నో నదిధక్షసి
అసౌహిరాశిః సుమహాన్ సమిద్ధ స్తవ సర్పతి.
నైతదేవంయథాయూయం మన్యధ్వమసురార్దనాః
గరుడో బలవానేష మమ తుల్యశ్చ తేజసా.
జాతః పరమతేజస్వీ వినతానందవర్ధనః
తేజోరాసిమిమందృష్ట్వాయుష్మాన్మోహః సమావిశత్
నాగక్షయకరశ్చైవ కాశ్యపేయో మహాబలః
దేవానాంచహితేయుక్త స్త్వహితో దైత్యరక్షసాం.
నభీః కార్యాకథంచాత్ర పశ్యధ్వం సహితా మమ
ఏవముక్తా స్తదా గత్వా గరుడం వాగ్భిరస్తువన్.
తే దూరా దభ్యుపేత్యైనం దేవాః సర్షిగణా స్తదా
త్వమృషి స్త్వం మహాభాగ స్త్వం దేవః పతగేశ్వరః.
త్వం ప్రభు స్తపనః సూర్యః పరమేష్ఠీ ప్రజాపతిః
త్వమింద్ర స్త్వంహయముఖ స్త్వం శర్వ స్త్వం జగత్పతిః.
త్వం ముఖం పద్మజో విప్ర స్త్వమగ్నిః పవన స్తథా
త్వం హి ధాతావిధాతా చ త్వం విష్ణుః సురసత్తమః.
త్వం మహానభిభూః శశ్వదమృతం త్వమహద్యశః
త్వం ప్రభా స్త్వమభిప్రేతం త్వం నస్త్రాణమనుత్తమం.

బలోర్మిమాన్ సాధురదీనసత్త్వ
సమృద్ధిమాన్ దుర్విషహ స్త్వమేవ
త్వత్తః సృతం సర్వమహీనకీర్తే
హ్యనాగతం చోపగతం చ సర్వమ్.
త్వముత్తమః సర్వమిదం చరాచరం
గభస్తిభి ర్భానురివావభాససే
సమాక్షిపన్ భానుమతః ప్రభాం ముహు
స్త్వమంతకః సర్వమిదం ధ్రువాధ్రువమ్.

వచ్చిన గరుత్మంతుడు ఓడిపోయిన తల్లి దాసీత్వంతో దుఃఖిస్తూఉండడం చూశాడు. వారిరువురూ కలిసిఉండగా ఒకనాడు కద్రువ వినయశీలయైన వినతను పిలిచి— కళ్యాణీ! ఈ సముద్రాంతర్భాగంలో మనోజ్ఞరమణీయమైన నాగలోకం ఉంది— అక్కడికి నువ్వు నన్ను తీసికొనివెళ్ళు— అన్నది. ఆమాటలువిన్న వినత తన వీపుమీద కద్రువనుంచుకొని మోసుకుపోసాగింది. ఇక్కడ గరుడుడు తల్లి ఆజ్ఞననుసరించి కద్రువబిడ్డలైన సర్పాలను వీపు మీద వుంచుకొని ఆకాశాని కెగిరాడు. ఆ ఎగరడంలో సూర్యమండలానికి సన్నిహితంగా పోవడం వల్ల సర్పాలు స్మృతివిహీనంగా నేలపడిపోగా చూసిన కద్రువ ఇంద్రుని స్తుతిస్తున్నది— ఓ సర్వదేవతా ప్రభూ! నీకు వందనాలు. నువ్వే వాయుదేవుడవు. మేఘుడవు. మాకు రక్షకుడవు. విద్వాంసులు నిన్నే మేఘుడంటారు. అనుపమానమైన వజ్రానివీ, ప్రళయకాల మేఘానివీ నువ్వే. ఈ సర్వజగత్స్రష్టవూ హర్తవూ నువ్వే. మహాశక్తివి. దేవశ్రేష్ఠుడవు. సహస్రాక్షుడవు. సర్వవ్యాపకుడవైన నారాయణుడవు. సర్వాశ్రయుడవు. అమృతరూపుడవు. సోముడవు. మాసఋతువత్సరాలు నీవు. దివారాత్రాలు నీస్వరూపం. అంధకారరహితమూ సూర్యసహితమూ అయిన ఆకాశానివి నువ్వు. మత్స్యమకరతిమింగిలావృతమైన సాగరరూపా! నువ్వు శీతలవర్షంతో నాకుమారులను జీవింపజెయ్యి.

నువ్వు మహాయశస్వివి— అని మహర్షులు మనీషులు నిన్ను స్తుతిస్తారు. యజ్ఞాలలో నువ్వు యజమానుని అభీష్టసిద్ధికోసం సోమరసాన్ని పుచ్చుకుంటావు వషట్కారాలతో అర్పించే హవిస్సును స్వీకరిస్తావు. నీమహిమ వేదాలలోగూడ వర్ణింపబడింది. యజ్ఞదీక్షితులైన విప్రవరులు నీకోసం వేదాంగజ్ఞానం పొందుతారు. అట్టి మహత్తరశక్తిసంపన్నుడవైన నువ్వు నాకుమారుల్ని రక్షించు అని కద్రువ ప్రార్థించింది.

25 వ అధ్యాయం సమాప్తం

## ఇరవై ఆరవ అధ్యాయము

పై విధంగా కద్రువ ప్రార్థించగా ప్రసన్నుడైన ఇంద్రుడు ఆకాశమునిండా కారుమేఘాలు క్రమ్మించి శీతలజలాన్ని వర్షించమని ఆజ్ఞాపించాడు. మెఱుపులతో మెఱిసేమేఘాలు ఆయాజ్ఞను అక్షరాలా పాలించాయి. ఉరుములురుముతూ— ఎడతెరిపిలేకుండా జలధారలు ఆకాశాన్ని చుట్టుముట్టడం చూస్తే ఆకాశమే సముద్రింవలె నాట్యం చేస్తున్నట్టున్నది. మెఱుపులతోనిండిన మేఘాలు వాయువిచలితములై జలధారలు కురిపిస్తున్నాయి. ఆమేఘాలతో సూర్యచంద్రులు కూడా కప్పబడిపోయారు. ఈ ప్రకారంగా వర్షించిన ఆ నిర్మల శీతలోదకాలు పాతాళం ముట్టగా నాగులు ఆనందించాయి. భూమి అంతా జలంతో నిండిపోయింది. సంతుష్టహృదయంతో సర్పాలు తల్లితో కలిసి నిజనివాసాలకు పోయినవి.

దివాకరః పరికుపితో యథా దహేత్
ప్రజాస్తథా దహసి హుతాశనప్రభ
భయంకరః ప్రళయ ఇవాగ్నిరుత్థితో
వినాశయన్ యుగపరివర్తనాంతకృత్.
ఖగేశ్వరం శరణముపాగతా వయం
మహౌజసం జ్వలనసమానవర్చసమ్
తడిత్ప్రభం వితిమిరమభ్రగోచరమ్
మహాబలం గరుడముపేత్య ఖేచరమ్.
పరావరం వరదమజయ్యవిక్రమం
తవౌజసా సర్వమిదం ప్రతాపితం
జగత్ప్రభో తప్తసువర్ణవర్చసా
త్వం పాహి సర్వాంశ్చసురాన్ మహాత్మనః.
భయాన్వితా నభసి విమానగామినో
విమానితా విపథగతిం ప్రయాంతి తే
ఋషేః సుతస్త్వమసి దయావతః ప్రభో
మహాత్మనః ఖగవర కశ్యపస్య హ.
సమాకుప్రిధః కురుజగతో దయాం పరాం
త్వమీశ్వరః ప్రశమముపైహి పాహినః
మహాశనిస్ఫురితసమస్వనేన తే
దిశోఽమ్బరం త్రిదివమియం చ మేదినీ.
చలన్తినః ఖగహృదయాని చానిశం
నిగృహ్యతాం వపురిదమగ్నిసంనిభం
తవ ద్యుతిం కుపితకృతాంత సన్నిభాం
నిశమ్య నశ్చలతి మనోఽవ్యవస్థితం
ప్రసీదనః పతగపతే ప్రయాచతాం
శివశ్చనో భవ భగవన్ సుఖావహః.
ఏవం స్తుతః సువర్ణస్తు దేవైః సర్షిగణైస్తదా
తేజసః ప్రతిసంహారమాత్మనః స చకార హ.

ఇది 23 వ అధ్యాయః సమాప్తః

## ఇరువది నాల్గవ అధ్యాయము

స శ్రుత్వా థాత్మనో దేహం సుపర్ణః ప్రేక్ష్య చస్వయం
శరీరప్రతిసంహారమాత్మనః న శ్రమ్మ చక్రమే.
నమే సర్వాణి భూతాని బిభియుర్దేహదర్శనాత్
భీమరూపాత్ సముద్విగ్నాస్తస్మాత్ తేజస్తుసంహరే.
తతః కామగమః పక్షీ కామవీర్యోవిహంగమః
అరుణం చాత్మనః పృష్ఠ మారోప్యసపితుర్గృహాత్.
మాతురన్తికమాగచ్ఛత్ పరం తీరం మహోదధేః
తత్రారుణశ్చ నిక్షిప్తోదిశం పూర్వాం మహాద్యుతిః.
సూర్యస్తేజోభిరత్యుగ్రైర్లోకాన్ దగ్ధుమనాయదా
కిమర్థం భగవాన్ సూర్యోలోకాన్ దగ్ధుమనాస్తదా
కిమస్యాపహృతం దేవైర్యే నేమం మన్యురావిశత్
చద్భ్రిర్యాభ్యాం యదా రాహు రాఖ్యాతోహ్యమృతంపిబన్.

వైరానుబంధం కృతవాం శ్చన్ద్రాదిత్యౌ తదాసఘ
వధ్యమానేగ్రహేణాథ ఆదిత్యే మన్యురావిశత్.
సురార్థాయసముత్పన్నో రోషోరాహోస్తుమాంప్రతి
బహ్వనర్థకరం పాపమేకోఽహం సమవాప్నుయాం.
సహాయ ఏవ కార్యేషు న చ కృచ్ఛ్రేషు దృశ్యతే
పశ్యన్తిగ్రసమానం మాం సహన్తేవైదివౌకసః.
తస్మాల్లోకవినాశార్థం హ్యవతిష్ఠే న సంశయః
ఏవం కృతమతిః సూర్యో హ్యస్తమభ్యగమద్గిరిం.
తస్మాల్లోకవినాశాయ సంతాపయత భాస్కరః

ఈప్రకారంగా శీతజలధారాస్నాతులైన నాగులు తమ రమణీయద్వీపాలకు చేరుకున్నారు. ఘోరమకరసంఘాలు నివసించే ఆ ప్రాంతంలో విశ్వకర్మనిర్మించిన ఆరమణీయద్వీపమే నాగవాసం. ఆప్రదేశానికి నాగులు వచ్చేసరికి లవణాసురుని వర్శనం జరిగింది. అనంతరం గరుడునితో ఆసర్పాలు సముద్రావృతమై తరంగాలజల్లులతో మనోహరం గాఉండే వనంలోకి వచ్చారు. అది పక్షిసంతతుల కిలకిలారావాలతో అలరారుతున్నది. పుష్ప ఫల భరితవృక్షాలతో అలరారే ఎన్నో వనాలు దాని చుట్టూ ఉన్నాయి. పద్మశోభతో నిండిన సరోవరాలు ఉన్నతమైనసౌధాలు ఆవనంలో ఉన్నాయి. సుగంధసౌరభాలతో వీచేవాయువు వింజామరవేస్తూన్నట్టుంది. ఎత్తుగా పెరిగిన మలయవృక్షాలు ఆకాశంలో ఎగురుతూ ఉన్నట్టున్నాయి. గాలి విసురికి అవి పూలవానలు కురుస్తున్నాయి. ఆవనంలోని వృక్షాలన్నీ నాగజాతిమీద పుష్పవర్షం కరిపిస్తూ అర్ఘ్యమిస్తూన్నట్లున్నాయి. మదబంభరాలు నలువైపులా భ్రమిస్తూ ధ్వనించాయి. ఆవనం గంధర్వులకు అప్సరసలకుం కోరదగ్గదిగా ఉన్నది. రమణీయమంగళకరమైన ఆపవిత్రవనం హృదయాకర్షకంగా కద్రువపుత్రులకు సంతోషజనకంగా ఉన్నది.

ఆవనవిహారంచేస్తూ సర్పాలు గరుడినితో ఇలా అన్నవి—నువ్వు ఆకాశంలో ఎగిరేటప్పుడు సుందర రమణీయప్రదేశాలెన్నో చూస్తావు. వానిలో నిర్మలజలాలున్న స్థానానికి మమ్మల్ని తీసికొనివెళ్ళు.

ఈమాటలు విన్న గరుడు ఆలోచించి తల్లిని పిలిచి—అమ్మా! నేను ఈసర్పాల ఆజ్ఞను ఎందుకు పరిపాలించాలి—అని అడగగా—నాయనా! నా దౌర్భాగ్యంవల్ల నేను కద్రువకు దాసీనిగాఅయాను. ఈసర్పాలు నన్ను మోసగించి ఓడించాయి—అని వినత జవాబిచ్చింది. ఆమాటలు విని గరుత్మంతుడు దుఃఖంతో— ఓ నాగులారా! మీకు నేను దేన్ని అర్పిస్తే మాతల్లి దాస్యవిముక్తురాలౌతుందో చెప్పండి. ఏప్రయోజనాన్ని ఆశించి మీరు జీవిస్తున్నారో చెప్పండి— అనగా సర్పాలు— గరుత్మంతుడా! నువ్వు నీ పరాక్రమంతో అమృతాన్ని సాధించి తెచ్చి మాకు ఇచ్చినట్లయితే ఈ దాసీత్వమునుంచి విముక్తి లభిస్తుంది- అన్నాయి.

27 వ అధ్యాయం సమాప్తం

## ఇరవై ఎనిమిదవ అధ్యాయము

సర్పాలమాటలు విన్న గరుత్మంతుడు— అమ్మా! నేను అమృతార్థం వెడుతున్నాను. అ మహాశ్రమకు ముందు నాకు కావలసిన ఆహారం ఎక్కడ లభిస్తుందో చెప్పు— అని అడుగగా వినత చెప్తూన్నది.

ఈ సముద్రమధ్యంలో ఉన్నద్వీపంలో వేలకొద్దీ నిషాదులు ఉన్నారు. వారిని ఆహారంగా స్వీకరించు. అయితే సమస్తప్రాణులకు పూజ్యులైన బ్రాహ్మణుల్ని మాత్రం మ్రింగకు. వారి తేజం అగ్నిసదృశమైనది. కుపితుడైన బ్రాహ్మణుడు సూర్య అగ్ని విష శస్త్రసమభయంకరుడు. ప్రాణికోటికి గురుత్వము వహించిన బ్రాహ్మణుడు సత్పు

తతో దేవానుపాగమ్య ప్రోచుశేవం మహర్షయః.
అద్యార్థరాత్రి సమయే సర్వలోక భయావహః
ఉత్పత్స్యతే మహాన్దాహస్త్రైలోక్యస్య వినాశనః.
తతో దేవాః సర్షిగణా ఉపగమ్య పితామహమ్
అబృవన్ కిమివేహాద్య మహద్దాహ కృతం భయం.
నతా వద్దృశ్యతే సూర్యః క్షయో౽యం ప్రతిభాతిచ
ఉదితే భగవన్ భానౌ కథమే తద్భవిష్యతి.
ఏష లోకవినాశాయ రవిరుద్యన్త ముద్యతః
దృశ్యన్నేవహి లోకాన్ స భస్మరాసీ కరిష్యతి.
తస్య ప్రతివిధానం చ విహితం పూర్వమేవహి
కశ్యపస్య సుతో ధీమా నరుణేత్య భి విశ్రుతః.
మహాకాయో మహాతేజాః సంస్థాస్యతి పురోరవేః
కరిష్యతి చ సారథ్యం తేజాశ్చాస్యహరిష్యతి.
లోకానాంస్వస్తి చైవంస్యా దృషీణాంచదివౌకసాం
తతః పితామహాజ్ఞాతః సర్వం చక్రే తదారుణః.
ఉదిత శ్చైవ సవితాహ్యరుణేన సమావృతం
ఏతత్తే సర్వమాఖ్యాతం యత్ సూర్యం మన్యురావిశత్.
అరుణశ్చ యథైవాస్య సారథ్యమకరోత్ప్రభుః
భూయ ఏవాపరంప్రశ్నంశృణుపూర్వము దాహృతం

24 వ అధ్యాయం సమాప్తం

## ఇరవై ఐదవ అధ్యాయము

తతః కామగమః పక్షీ మహావీర్యో మహాబలః
మాతురన్తికమాగచ్ఛత్ పరం పారం మహోదధేః
యత్రసా వినతా తస్మిన్ పణితేన పరాజితా
అతీవ దుఃఖసంతప్తా దాసీభావ ముపాగతా
తతః కదాచిత్ వినతాం ప్రణతాం పుత్రసంనిధౌ
కాలేచాహూయవచనం కద్రూరిద మభాషత.
నాగానామాలయంభద్రే సురమ్యం చారుదర్శనం
సముద్రకుక్షావేకాన్తే తత్ర మాం వినతేనయ.
తతః సుపర్ణమాతా తామవహత్ సర్పమాతరమ్
పన్నగాన్ గరుడశ్చాపి మాతుర్వచన చోదితః.
న సూర్యమభితోయాతి వైనతేమో విహంగమః
సూర్యరశ్మిప్రతప్తాశ్చ మూర్ఛితాః పన్నగా భవన్
తదవస్థాన్ సుతాన్దృష్ట్వాకద్రూః శక్రమథాస్తువత్
నమస్తే సర్వదేవేశ నమస్తే బలసూదన.
నముచిఘ్న నమస్తేస్తు సహస్రాక్ష శచీపతే
సర్పాణాం సూర్యతప్తానాం వారిణాత్వం ప్లవోభవ.
త్వమేవ పరమం త్రాణమస్మాకమమరోత్తమ
ఈశోహ్యసి పయః స్రష్టుం త్వమనల్పం పురందర.
త్వమేవమేఘ స్త్వంవాయు స్త్వమగ్నిర్వై ద్యుతోమ్బరే
త్వమభ్రగణవిక్షేప్తా త్వామేవాహుర్మహాఘనమ్.
త్వం వజ్రమతులం ఘోరం ఘోషవాం స్త్వం బలాహకః
స్రష్టా త్వమేవలోకానాం సంహర్తా చాపరాజితః.
త్వంజ్యోతిః సర్వభూతానాంత్వమాదిత్యోవిభావసుః
త్వం మహద్భూతమాశ్చర్యం త్వం రాజాత్వం సురోత్తమః.
త్వం విష్ణుస్త్వం సహస్రాక్షస్త్వందేవస్త్వంపరాయణం
త్వం సర్వమమృతం దేవత్వం సోమః పరమార్చితః.
త్వం ముహూర్తస్తిథిస్త్వం చ త్వం లవస్త్వం పునఃక్షణః
శుక్లస్త్వం బహుళస్త్వం చ కళాకాష్ఠాతృటిస్తథా
సంవత్సరర్తవోమాసా రజన్యశ్చ దినాని చ.

ఋషులకు ఆరాధనీయుడు. ఎంత క్రోధంలోనైనా నువ్వు బ్రహ్మహత్యను గూర్చి ఆలోచనయైనా రానీయకు. వారికి ఏవిధమైన ద్రోహము తల పెట్టకు. కఠోరవ్రతనిష్ఠాగరిష్ఠుడైన బ్రాహ్మణుడు కుపితుడైతే అగ్నిని సూర్యుని మించిన తేజస్సుతో ఎదుటివానిని భస్మం చేయగలడు. ఈ శక్తులు కల వాడే బ్రాహ్మణుడని గుర్తించు. సమస్తప్రాణు లకు అగ్రజుడై సర్వశ్రేష్ఠుడై గురువైనవాడు విప్రుడు-అను వినతనుచూసి గరుడుడు అమ్మా! బ్రాహ్మణుని రూపశీలపరాక్రమాలను సమగ్రంగా చెప్పు. చూడటానికి అగ్నిలా ఉంటాడా సౌమ్యంగా ఉంటాడా ఏశుభలక్షణాలనుబట్టి వానిని గుర్తించ వచ్చునో వివరంగా చెప్పుమన వినత వివరిస్తున్నది- నాయనా! నీకంఠంలో పడినప్పుడు అంగారకుడిలా మంట పుట్టించేవాడు చెదురుముల్లు గుచ్చుకొన్నట్లు బాధకలిగించే వాడు విప్రుడని గుర్తించు.

పుత్రవాత్సల్యం గల వినత తన కుమారునికి మరొక విషయాన్ని ఇలా చెప్పింది- నీ ఉదరంలో ఇముడనివాడే ద్విజుడు- అని పలికి ఆశీర్వదించే సంకల్పంతో- నాయనా! వాయుదేవుడు నీ రెక్కలను సూర్యచంద్రులు నీపృచ్ఛభాగాన్ని అగ్ని శిరస్సును వసువులు శరీరాన్ని సంరక్షించెదరుగాక. నేను కూడా నీశ్రేయస్సును కోరుతూ కళ్యాణకరమైన కార్యా లాచరిస్తాను. నిర్విఘ్నంగా ప్రయాణం చేసి కార్యసిద్ధుడవై రా.

తల్లిమాటలువిన్న గరుత్మంతుడు ఆకాశంలోకి ఎగిరాడు. క్షుధాతురుడైన యమునివలె సముద్ర ద్వీపంలోని నిషాదులను చేరాడు. సముద్రాకాశా లను కప్పివేసే ధూళితో ద్వీపాన్ని ముంచెత్తాడు. అచ్చటికి సమీపంలో ఉన్న సముద్రజలాన్ని శోషింపజేస్తూ పరిసరాలలోని పర్వతవృక్షాలను ప్రకంపింపజేసాడు. తననోటిని విప్పి నిషాదుల మార్గాన్ని ఆటంకపరిచాడు. పెనుగాలి దుమా రంలో ఆకాశంలో ఎగిరేపక్షులవలె గరుత్మంతుడు కల్పించిన వర్షవాయుధూళులలో అచేతనులైన నిషాదులు గరుడుని ఉదరంలోకి పోసాగారు. అనం తరం ఆ మహాబలిష్ఠుడు మత్స్యభుక్కులైన నిషాదు లను జీర్ణించుకునే తలంపుతో విశాలంగా తెరువ బడిఉన్న నోటిని మూసేశాడు.

28 వ అధ్యాయము సమాప్తం

## ఇరవైతొమ్మిదవ అధ్యాయం

గరుడుడు నిషాదులను భుజిస్తూన్న సమ యంలో ఒక విప్రుడు అతని కంఠంలో పడ్డాడు. అగ్నిహోత్రునివలె గొంతుకలో మంట పుట్టించే వానిని ఉద్దేశించి గరుత్మంతుడు అంటున్నాడు.

ఓద్విజశ్రేష్ఠా! నువ్వుతక్షణంబయటకువచ్చెయ్యి. ఎటువంటివాడైనా బ్రాహ్మణుడు నాకు వంద్యుడు అనగా- ఈనిషాదకన్య నాభార్య. ఈమెనుగూడా వదిలితేనే నేను వస్తాను- అని విప్రుడుపల్క- గరు త్మంతుడు అంగీకరించాడు. మరుక్షణంలో ఆ ద్విజుడు తన నిషాదసతితో గరుత్మంతునికంఠంనుండి వెలుపలికి వచ్చి ఆశీర్వదించి యథేచ్ఛగా వెళ్ళి పోయాడు. ఆవిధంగా ఆ విప్రుని విడచి గరుత్మంతుడు

త్వముత్తమా స గిరివనా వసుంధరా
స భాస్కరం వితిమిరమ్బరంతథా
మహోదధిః సతిమి తిమింగిలస్తథా
మహోర్మిమాన్ బహుమకరో ఝషాకులః.
మహాయశా స్త్వమితి సదాభిపూజ్యసే
మనీషిభిర్ముదితమనా మహర్షిభిః

అభిష్టుతః పిబసి చ సోమమధ్వరే
వషట్ కృతాన్యపి చ హవీంషి భూతయే
త్వం విప్రైః సతతి మహేజ్యసే ఫలార్థం
వేదాంగేష్వతుల బలౌఘగీయసే చ
త్వద్ధేతోర్యజన పరాయణా ద్విజేన్ద్రా
వేదాంగాన్యభిగమయన్తి సర్వయత్నైః

25వ అధ్యాయం సమాప్తము

## ఇరువది ఆరవ అధ్యాయము

ఏవంస్తుతస్తదా కద్ర్వా భగవాన్ హరివాహనః
నీలజీమూతసంఘాతైః సర్వమమ్బర మావృణోత్.
మేఘానాజ్ఞాపయామాస వర్షధ్వమమృతం శుభం
తేమేఘామముచుస్తోయం ప్రభూతంవిద్యుదుజ్జ్వలాః.
పరస్పరమివాత్యర్థం గర్జన్తః సతతం దివి
సంవర్తితమివాకాశం జలదైః సుమహాద్భుతైః.
సృజద్భిరతులం తోయమజస్రం సుమహారవైః
సంప్రనృత్తమివాకాశం ధారోర్మిభిరనేకశః.

మేఘస్తనితనిర్ఘోషైర్విద్యుత్పవనకంపితైః
తైర్మేఘైః సతతాసారం వర్షద్భిరనిశం తదా.
నష్టచంద్రార్కకిరణమమ్బరం సమపద్యత
నాగానాముత్తమోహర్షస్తథా వర్షతి వాసవే.
ఆపూర్వతమహీ చాపి సలిలేన సమన్తతః
రసాతలమనుప్రాప్తం శీతలం విమలం జలమ్.
తదా భూరభవచ్ఛన్నా జలోర్మిభిరనేకశః
రమణీయకమాగచ్ఛన్ మాత్రాసహ భుజంగమాః

ఇది 26 వ అధ్యాయం సమాప్తము

## ఇరువదిఏడవ అధ్యాయము

సంప్రహృష్టాస్తతో నాగా జలధారాప్లుతాస్తదా
సుపర్ణేనోహ్యమానాస్తే జగ్ముస్తం ద్వీపమాశు వై.
తం ద్వీపం మకరావాసం విహితం విశ్వకర్మణా
తత్రతేలవణం ఘోరం దదృశుః పూర్వమాగతాః.
సుపర్ణసహితాః సర్పాః కాననం చ వనోరమ్
సాగరాంబుపరిక్షిప్తం పక్షిసంఘనినాదితమ్.
విచిత్రఫలపుష్పాభిర్వనరాజిభిరావృతమ్

భవనైరావృతం రమ్యైస్తథా పద్మాకరైరపి.
ప్రసన్నసలిలైశ్చాపి హ్రదైర్దివ్యైర్విభూషితమ్
దివ్యగంధవహైః పుణ్యైర్మారుతైరుపవీజితమ్.
ఉత్పతద్భిరివాకాశం వృక్షైర్మలయజైరపి
శోభితం పుష్పవర్షాణి ముంచద్భిర్మారుతోద్ధతైః.
వాయువిక్షిప్తకుసుమైస్తథాన్యైరపి పాదపైః
కిరద్భిరివతత్రస్థాన్ నాగాన్ పుష్పాంబువృష్టిభిః

మహావేగంతో ఆకాశవీధికి ఎగిరాడు. మధ్యమార్గంలో కశ్యపుడు కనిపించాడు. తండ్రి అడుగగా గరుడుడు వార్తావిశేషాలు వివరించాడు. అప్పుడు కశ్యపుడు— నాయనా! మీరు కుశలంగా ఉన్నారా? నీకు భోజనాదిక సౌఖ్యాలు సక్రమంగా లభిస్తున్నవా? అని ప్రశ్నించగా గరుడుడు పూజ్యా! ఇంటిదగ్గర అమ్మ కుశలంగానే ఉన్నది. నాకు భోజనసుఖాల విషయంలో ఏదో అసంతృప్తి కలుగుతూంది.

ఈనాడు నన్ను అమృతం తెచ్చిపెట్టమని సర్పాలు పంపుతున్నాయి. నేనుకూడా అమ్మకు దాస్యవిముక్తిచేసే సంకల్పంతో బయలుదేరాను. ఆవిడ చెప్పినట్టు నేను సహస్రాధికసంఖ్యలో ఉన్న నిషాదులను భుజించినా నా ఆకలి తీరలేదు కనక నాకు సంపూర్ణ సంతృప్తి కలిగించే ఆహారం ఎక్కడ లభిస్తుందో చెప్పండి. దాన్ని ఆరగించి పోయి అమృతం తెస్తాను— గరుడుడు కోరగా కశ్యపుడు పలుకుతున్నాడు.

దేవలోకంలోకూడా ప్రఖ్యాతిపొందిన ఈ సరోవరంలో ఒకానొక ఏనుగు తనతొండంతో తాబేలును లాగుతూంటుంది. ఆ రెండూ గతజన్మసోదరులే. అప్పటివైరం ఇంకా కొనసాగుతూన్నది. వీటి క్రోధం ఎందువల్ల వస్తూన్నదో ప్రస్తుతం అవి ఎంతెంత విశాలాకారంతో జీవిస్తున్నవో చెపుతాను విను— పూర్వకాలంలో విభావసుడనే ఋషి ఉండేవాడు. ఆయనకు సుప్రతీకుడనే సోదరుడు. ఇతడుగూడా తపోనిష్ఠుడే. ఈసుప్రతీకుడు తనధనాన్ని అన్నగారివద్ద ఉంచడానికి ఇష్టపడేవాడుకాడు.

ఇలా సాగుతూండగా సుప్రతీకుడు తన ఆస్తి తనకు పంచిపెట్టమని వేధించ సాగాడు. అప్పుడు విభావసుడన్నాడు— సోదరా మనుష్యులు ప్రలోభంతో పంపకాలు చేసుకుంటారు. అయిన అనంతరం ధనమోహంలోపడి చంపుకుంటారు. వారిలో ద్వేషాలు ఏర్పడిన సమయం చూసి శత్రువులుకూడా మిత్రుల్లా వచ్చి చేరి వారి విద్వేషానికి ఆహుతులు వేసి రెచ్చగొడతారు. మళ్ళీ తామే మధ్యవర్తులుగ వస్తారు. ఇలా వీరు సర్వనాశనం అయిపోతారు. అందుచేతనే సోదరులు పంపకాలతో వేరయిపోవడం మంచిపనిగా సత్పురుషులు భావించరు. ఇలా పంపకాలు చేసుకున్నవీరు గురుస్వరూపంగా ఉన్న శాస్త్రమర్యాదలను పాటించలేరు. నిరంతరం సందేహదృక్కులతో ప్రసరించుకుంటారు.

"కనిష్ఠాన్ పుత్రవత్ పశ్యే జ్యేష్ఠో భ్రాతా పితుస్సమః"

అనిగదా శాస్త్రం. అంటే జ్యేష్ఠుడు తండ్రివలె తమ్ములను చూచుకోవాలి. ఈ ఆచారం వివాదాలలో సాగటం కష్టం. సుప్రతీకా నిన్ను నావశంలో ఉంచడం కష్టంగా ఉంది. భేదబుద్ధితో నువ్వు ధనాన్ని కోరుతున్నావు కనక తక్షణం ఏనుగుగర్భాన పుట్టు అని శపించగా— నువ్వు కచ్ఛపంగా జన్మించు—అని సోదరుడు శపించాడు.

ఈవిధంగా వారు రోషలోభదోషాలవల్ల మానవత్వాన్ని కోల్పోయి జంతువుల్లా పుట్టారు. ఆ గజకచ్ఛపాలు పూర్వవైరాన్ని విస్మరించలేక పరస్పర విద్వేషంతో ఈ సరోవరంలో నిర్విరామ సంగ్రామం సాగిస్తున్నాయి. అత్యంత సుందరంగా ఉండే ఆమహాగజం ఈకొలనుగట్టుకు వచ్చి ఘీంకరించేసరికి విశాలదేహం కల తాబేలు నీటిమీదికి

మనః సంహర్ష జం దివ్యం గంధర్వాప్సరసాం ప్రియం
మత్తభ్రమరసంఘుష్టం మనోజ్ఞాకృతి ద ర్శ న ం.
రమణీయం శివం పుణ్యం సర్వైర్జనమనోహరైః
నానాపక్షిరుతం రమ్యం కద్రూపుత్రప్రహర్షణమ్.
తత్ తే వనం సమాసాద్య విజహ్రుః పన్నగా స్తదా
అబ్రువంశ్చ మహావీర్యం సుపర్ణం పతగేశ్వరం.
వహాస్మానపరం ద్వీపం సురమ్యం విమలోదకమ్
త్వం హి దేశాన్ బహూన్ రమ్యాన్ వ్రజాన్ పశ్యసి ఖేచర.
సవిచిన్త్యాబ్రవీత్ పక్షీ మాతరం వినతాం తదా
కింకారణం మయా మాతః కర్తవ్యంసర్పభాషితమ్.
దాసీభూతాస్మిదుర్భాగ్యాత్ సపత్న్యాః పతగోత్తమ
పణం వి త థ మా స్థా య సర్వైరుపధినాకృతమ్.
తస్మింస్తు కథితే మాత్రాకారణే గ గ నే చ రః
ఉవాచవచనం స ర్పా స్తే న దుఃఖేన దుఃఖితః.
కిమాహృత్య విదిత్వావా కింవాకృత్వేహపౌరుషమ్
దాస్యాద్వోవిప్రముచ్యేయం తథ్యం వదతలేలిహాః.
శ్రుత్వా తమబ్రువన్ సర్పా ఆహరామృతమోజసా
తతో దాస్యాద్ విప్రమోక్షో భవితా తవ ఖేచర.

27 వ అధ్యాయం సమాప్తం

## ఇ ర వై ఎ ని మి ద వ అ ధ్యా య ము

ఇత్యుక్తోగరుడః సర్పై స్తతోమాతర మ బ్ర వీ త్
గచ్ఛామ్యమృతమాహర్తుంభక్ష్యమిచ్ఛామి వేదితుం
సముద్రకుక్షావేకాన్తే నిషాదాలయముత్తమమ్
నిషాదానాం సహస్రాణితాన్భుక్త్వామృతమానయ
నచతే బ్రాహ్మణం హన్తుం కార్యాబుద్ధిః కథంచన
అవధ్యఃసర్వభూతానాం బ్రాహ్మణోహ్యనలోపమః.
అగ్నిరర్కో-విషంశస్త్రం వి ప్రో భ వ తి కో పి తః
గురుర్హిసర్వభూతానాం బ్రాహ్మణః పరికీర్తితః.
ఏవమాదిస్వరూపైస్తుసతాంవై బ్రాహ్మణో మతః
స తే తాత నహన్తవ్యః సంక్రుద్ధేనాపి స ర్వ దా.
బ్రాహ్మణానామభిద్రోహో నకర్తవ్యః కథంచన
నహ్యేవమగ్నిర్నాదిత్యో భస్మకుర్యాత్ తథానఘ
యథా కుర్యాదభిక్రుద్ధో బ్రాహ్మణః సంశితవ్రతః
తదాత్రైర్వివిధైర్లింగై స్త్వం విద్యాన్తం ద్విజోత్తమం
భూతానామగ్రభూర్విప్రో వర్ణశ్రేష్ఠః పితాగురుః
కిం రూపో బ్రాహ్మణో మాతః కింశీలః కింపరాక్రమః
కింస్విదగ్నినిభోభాతి కింస్విత్ సౌమ్యప్రదర్శనః
యథాహమభిజానీయం బ్రాహ్మణం లక్షణైః శుభైః
తన్మే కారణతోమాతః పృచ్ఛతోవక్తుమర్హసి
యస్త్వేకంఠమనుప్రాప్తో నిగీర్ణం బడిశం యథా.
దహేదంగారవత్ పుత్రంతం విద్యాబ్రాహ్మణర్షభం
విప్రస్త్వయానహన్తవ్యః సంక్రుద్ధేనాపి స ర్వ దా.
ప్రోవాచచైనం వినతా పుత్రహార్దాదిదం వచః
జఠరే నచజీర్యేద్ యస్తంజానీహి ద్విజోత్తమమ్.
పునఃప్రోవాచ వినతా పుత్రహార్దాదిదః వచః
జానన్త్యప్యతులం వీర్యమాశీర్వాదపరాయణా.
ప్రీతాపరమదుఃఖార్తా నాగైర్విప్రకృతా సతీ
పక్షౌతేమారుతఃపాతు చంద్రసూర్యౌచపృష్ఠతః.
శిరశ్చపాతువహ్నిస్తే వసవః స ర్వ త స్త ను మ్
అహం చ తే సదాపుత్ర శాన్తిస్వస్తిపరాయణా.
ఇహాసీనాభవిష్యామి స్వస్తికారే ర తా స దా
అరిష్టంవ్రజ పం థా న ం పుత్రకార్యార్థసిద్ధయే.

వేలి అలలు లేకెత్తిస్తుంది. అంతతో ఈ పరాక్రమ శీలగజం తనతొండాన్ని పైకెత్తుతూ నీటిలోకి ఉరుకుతుంది. తన సర్వావయవవిక్షేపంతో సరస్సును కల్లోలపరుస్తుంది. అదేవిధంగా తాబేలు కూడా యుద్ధానికి ఎదురుసన్నాహం చేస్తుంది.

పన్నెండు యోజనాల పొడవుతో ఆరుయోజనాల ఎత్తున్నది ఏనుగు. పదియోజనాల విస్తీర్ణంతో మూడుయోజనాలమందంగలది తాబేలు. ఈరెండూ మదంతో ఒకదానినొకటి చంపాలనే కోరికతో ఉన్నాయి. నువ్వు హాయిగా వెళ్ళి ఆ రెంటినీ ఆహారంగా తీసికొని నీకార్యంలో సిద్ధి పొందు— పెద్దమేఘంలా కచ్ఛపమూ మహాపర్వతంలా మత్తేభమూ ఉన్నాయి. వానిని భక్షించి అమృతం సాధించి తెచ్చుకో.

ఇంకా కశ్యపు డిలా చెపుతున్నాడు—కుమారా! దేవతలతో యుద్ధం సాగించేటపుడు నీకు కళ్యాణమగుగాక. గోబ్రాహ్మణ పూర్ణకలశాలు నీకు శుభము లిచ్చుగాక. ఋగ్యజుస్సామవేద పరిపూతమైన హవిస్సూ వేదాలూ నీకు మాంగళ్యము చేకూర్చుగాక.

కశ్యపుని ఆశీస్సులతో గరుడుడు సరోవరతీరానికిపోయి నిర్మలజలాలలో నీటిపక్షుల కిలకిలలతో అలరారే దానినిచూస్తూనే ఆ ఖగేంద్రుడు ఒక కాలిగోళ్ళలో ఏనుగునూ వేరొక దానితో తాబేలునూ గ్రహించి ఎగిరి ఎగిరి అలంబతీర్థంచేరాడు. మేరుగిరిమీది ఆశిఖరంపై దివ్యవృక్షాలు సువర్ణద్యుతులతో ఉన్నవి. అతని రెక్కల విసురువల్ల వచ్చే గాలికి అవన్నీ గజగజలాడిపోయాయి. అభీష్టఫలాలనిచ్చే ఆ వృక్షాలను వదలి మరొకవైపు తిరిగిచూడగా అక్కడ చెట్లమీద వైడూర్యాలు భాసిస్తున్నాయి. రజత సువర్ణ ఫలశోభతో ఉన్నాయి. సముద్రజలంతో అభిషేచనం పొందే వానిని చూసి ఒక విశాలవటవృక్షంవైపు దృష్టి మరల్చాడు. అప్పుడు ఆమ్రి—ఖగేంద్రా! శతయోజన విస్తీర్ణమైన నాశాఖలపై ఆసీనుడవై నీ ఆహారం తీసికో— అన్నది.

అత్యంత విశాల శాఖలతో వేలకొద్దీ పక్షులకు ఆవాసంగా ఉన్న ఆమర్రిచెట్టు కొమ్మమీద పక్షీంద్రుడు వ్రాలేసరికి అది ఫెళఫెళార్భటులతో విరిగిపోయింది.

29 వ అధ్యాయం సమాప్తం

## ముప్పదియవ అధ్యాయము

మహాబలిష్ఠుడైన గరుత్మంతుడు వ్రాలగానే ఆ మర్రిచెట్టుకొమ్మ ఫెళఫెళార్భటులతో విరిగిపోయింది. విరిగినకొమ్మను చిరునవ్వుతో తిలకించే గరుత్మంతుని కన్నులకు అధోముఖులై తపస్సు చేసే వాలఖిల్యాది మహర్షులు గోచరించారు. ఈకొమ్మ క్రిందపడ్డటయితే వీరందరు నిస్సందేహముగా మరణిస్తారు-అని గ్రహించి గరుత్మంతుడు తనముక్కుతో ఆకొమ్మను గట్టిగా పట్టుకొన్నాడు. మునిజనరక్షణార్థమై గరుత్మంతుడు ఆ ప్రకారం చేశాడు. దేవతలకుకూడా సాధ్యంకాని గరుడుని

తతః స మాతుర్వచనం నిశమ్య
వితత్య పక్షౌ నభ ఉత్పపాత
తతో నిషాదాన్బలవానుపాగతో
బుభుక్షితః కాల ఇవాన్తకోఽపరః.
స తాన్ నిషాదానుపసంహరం స్తదా
రజః సముద్ధూయ నభఃస్పృశం మహత్
సముద్రకుక్షౌ చ విశోషయన్ పయః
సమీపజాన్ భూధరజాన్ విచాలయన్.
తతః స చక్రే మహదాననం తదా
నిషాదమార్గం ప్రతిరుధ్య పక్షిరాట్

తతో నిషాదాస్త్వరితాః ప్రవవ్రజుః
యతో ముఖం తస్య భుజంగభోజినః
తదాననం వివృతమతిప్రమాణవత్
సమభ్యయుర్గగనమివార్దితాః ఖగాః
సహస్రశః పవనరజోవిమోహితా
యథానిలప్రచలితపాదపే వనే.
తతః ఖగో వదనమమిత్రతాపనః
సమాహరత్ పరిచపలో మహాబలః
నిషూదయన్ బహువిధమత్స్యజీవినో
బుభుక్షితో గగనచరేశ్వరస్తదా.

28వ అధ్యాయం సమాప్తము

## ఇరవైతొమ్మిదవఅధ్యాయము

తస్యకంఠమనుప్రాప్తో బ్రాహ్మణః సహభార్యయా
దహన్ దీప్త ఇవాంగార స్తమువాచాన్తరిక్షగః.
ద్విజోత్తమ వినిర్గచ్ఛ తూర్ణమాస్యాదనావృతాత్
నహి మే బ్రాహ్మణో వధ్యః పాపేష్వపి రతస్సదా.
బ్రువాణమేనం గరుడం బ్రాహ్మణః ప్రత్యభాషత
నిషాదీ మమభార్యేయం నిర్గచ్ఛతుమయా సహ.
ఏతామపి నిషాదీం త్వం పరిగృహ్యాశు నిష్పత
తూర్ణం సంభావయాత్మానమజీర్ణం మమ తేజసా.
తతః స విప్రో నిష్క్రాన్తో నిషాదీ సహితస్తదా
వర్ధయిత్వా చ గరుడమిష్టం దేశం జగామ హ.
సహభార్యే వినిష్క్రాన్తే తస్మిన్ విప్రే చ పక్షిరాట్
వితత్య పక్షావాకాశ ముత్పపాత మనోజవః.
తతోఽపశ్యత్ స పితరం పృష్టశ్చాఖ్యాతవాన్ పితుః
యథాన్యాయమమేయాత్మా తం చోవాచ మహానృషిః.

కచ్చిద్ వః కుశలం నిత్యం భోజనే బహుళం సుత
కచ్చిచ్చ మానుషే లోకే తవాన్నం విద్యతే బహు.
మాతా మే కుశలా శశ్వత్ తథా భ్రాతా తథా హ్యహం
నహి మే కుశలం తాత భోజనే బహులే సదా.
అహం హి సర్పైః ప్రహితః సోమమాహర్తుముత్తమం
మాతుర్దాస్యవిమోక్షార్థ మాహరిష్యే తమద్య వై.
మాత్రా చాత్ర సమాదిష్టో నిషాదాన్ భక్షయేతి హ
న చ మే తృప్తిరభవద్ భక్షయిత్వా సహస్రశః
తస్మాద్ భక్ష్యం త్వమపరం భగవన్ ప్రదిశస్వ మే
యద్ భుక్త్వా మృతమాహర్తుం సమర్థః స్యామహం ప్రభో.
క్షుత్పిపాసా నిఘాతార్థం భక్ష్యమాఖ్యాతు మే భవాన్
ఇదం సరో మహాపుణ్యం దేవలోకేఽపి విశ్రుతమ్.
యత్ర కూర్మో గజం హస్తీ సదా కర్షత్యవాఙ్ముఖః

అద్భుతకర్మయకు ఋషులందరు ఆశ్చర్యచకితు
లయారు. మహాభారాన్ని మోస్తూ ఎగరగలిగిన
వాడు కావడంవల్ల గరుడు అని పేరెంచారు.
(గురుం ఆదాయ ఉడ్డీన్ ఇతి గరుడః.)

అనంతరం గరుత్మంతుడు పర్వతాలనుసైతం
ఊగిసలాడించే మహావేగంతో దేశదేశాలు ఎగు
రుతూ తిరిగి గంధమాదనపర్వతంమీదికి చేరాడు.
ఆపర్వతంమీద కశ్యపుడు తపోదీక్షలో ఉన్నాడు.
దివ్యతేజోబలపరాక్రమాలతో భానుబింబ సదృ
శంగా ధ్యానసమాప్తికి అందనిరూపంలో వీతిహో
త్రునిలా ఉన్న కుమారుని చూశాడు. అతిభయం
కరంగా ఉన్న కుమారుని చూచి కశ్యపుడు—
నాయనా! ఎప్పుడూ దుస్సాహసం చేయకు. అది
దుఃఖకారణం. సూర్యకిరణాలను ఆహారంగా చేసి
కొని జీవించే వాలఖిల్యాదులు నీయందు ఆగ్రహం
చూపకుందురుగాక-అని కశ్యపుడు ఆమహర్షుల నిలా
ప్రార్థించాడు. మహర్షులారా! గరుడుడు ప్రజాహి
తార్థం ఒక మహాకార్యాన్ని చేయబోతున్నాడు.
అతన్ని మీరు అనుగ్రహించండి.

కశ్యపుని పలుకులువిని వాలాఖిల్యాదులు
ఆశాఖవీడి మరొకప్రదేశానికి తపస్సుకు వెళ్ళి
పోయారు. అనంతరం వినతానందనుడై గరుత్మం
తుడు నోట్లో మర్రికొమ్మ ఉన్న కారణంగా కఠోర
ధ్వనితో— ఈవిశాలశాఖను ఏప్రదేశంలో విడిచి
పెట్టను— అని కోరగా కశ్యపుడు— మంచుతోనిండిన
గుహాలుగల నిర్జనపర్వతాన్ని నిర్దేశించగా గరుత్మం
తుడు గజకచ్ఛపసహితుడై మహావేగంతో ఎగిరి
శతసహస్రయోజనదూరంలో ఉన్న పర్వతం చేరి
ఆశాఖను విడిచాడు. గరుత్మంతుని రెక్కలనుండి
వెలువడే గాలికి ఆపర్వతం సమూలంగా కంపిం
చింది. పర్వతశోభను ఇనుమడింపజేసే సువర్ణరజత
శిఖరాలు చూర్ణమైపోయాయి. ఆకొమ్మపడి
కొన్నివేల వృక్షాలు నేలమట్టమయాయి. బంగారు
కాంతులీనే పుష్పాలుగల ఆచెట్లుకూడా శోభతోనే
ఉన్నాయి.

తదుపరి గరుత్మంతుడు గజకచ్ఛపాలను
భక్షించి మహావేగంతో దేవలోకానికి ఎగిరాడు.

అతని ఆగమనసందర్భంలో దేవలోకంలో
ఎన్నోఉత్పాతాలు పుట్టాయి. వజ్రాయుధం
భయంతో గజగజలాడిపోయింది. ధూమాగ్ని
జ్వాలలతో పట్టపగలు ఆకాశంనుండి ఉల్కలు పడ
సాగాయి. ఆదిత్య రుద్ర వసు సాధ్య మరుద్గ
ణాల ఆయుధాలు విపరీతమైన అలజడి చేశాయి.
దేవాసురసంగ్రామాలలో లేని వైపరీత్యం పొడ
సూపింది. వజ్రాయుధ ధ్వనితో గాలివానలు
లేచాయి. మేఘాలు లేకుండానే ఆకాశం గర్జి
స్తూంది. రక్తవర్షం కురుస్తున్నాడు పర్జన్యుడు.
దేవతాపుష్పహారం వాడిపోయింది. దేవతా కిరీ
టాలు ధూళిధూసరిత మయ్యాయి. ఈ పరిస్థితు
లన్నీ చూసి దేవేంద్రుడు భయకంపితహృదయంతో
బృహస్పతిని జేరి-మహాత్మా! యుద్ధరంగంలో సైతం
మమ్మ తేరిపారచూడలేని ఈప్రపంచంలో మాకు
ఇంతటిభయాన్ని కలిగించే మహాసాహసి ఎవరు?
ఈస్థితిగతులకు హేతువేమి?— అనగా బృహస్పతి—
దేవేంద్రా! మహాత్ములైన వాలఖిల్యమహర్షులకు
నువ్వు చేసిన అపచారంవల్ల వినతాకశ్యపనందను
డైన గరుత్మంతుడు అమృతాన్ని హరించటానికి
వస్తున్నాడు. మహాబలిష్ఠుడు యథేచ్ఛావిహారి
కామరూపధరుడు అయిన ఆ గరుత్మంతుడు అమృ
తాన్ని సులభంగా హరించగలడు. సమస్తశస్త్రులు

తయోర్జన్మాంతరే వైరం సంప్రవక్ష్యామ్య శేషతః.
తస్మే తత్వం నిబోధత్వ యత్ప్రమాణౌచతావుభౌ
ఆసీద్విభావసుర్నామ మహర్షిః కోపనోభృశమ్.
భ్రాతాతస్యానుజశ్చాసీత్ సుప్రతీకో మహాతపాః
సనేచ్ఛతిధనంభ్రాతా సహైకస్థం మహామునిః.
విభాగం కీర్తయత్యేవ సుప్రతీకోహి నిత్యశః
అథాబ్రవీచ్చతంభ్రాతా సుప్రతీకం విభావసుః
విభాగం బహవో మోహాత్ కర్తుమిచ్ఛన్తి నిత్యశః
తతో విభక్తా స్వన్యోన్యంవిక్రుధ్యన్తేఽర్థమోహితాం
తతః స్వార్థపరాన్ మూఢాన్ పృథగ్భూతాన్ స్వకైర్ధనైః
విదిత్వా భేదయన్త్యేతా నమిత్రా మిత్రరూపిణః
విదిత్వా చాపరే భిన్నానన్తరేషు పతన్త్యథ.
భిన్నానామతులోనాశః క్షిప్రమేవ ప్రవర్తతే.
తస్మాద్విభాగం భ్రాతౄణాం న ప్రశంసంతి సాధవః
గురుశాస్త్రే నిబద్ధానామన్యోన్యేనాభిశంకినాం.
నియన్తుం నహి శక్యస్త్వం భేదతో ధనమిచ్ఛసి
యస్మాత్ తస్మాత్ సుప్రతీకహస్తిత్వంసమవాప్స్యసి.
శప్తస్త్వేవం సుప్రతీకోవిభావసుమథాబ్రవీత్
త్వమప్యన్తర్జలచరః కచ్ఛపః సమ్భవిష్యసి.
ఏవమన్యోన్యశాపాత్ తౌ సుప్రతీకవిభావసూ
గజకచ్ఛపతాం ప్రాప్తావర్థార్థం మూఢచేతసౌ
రోషదోషానుషఙ్గేణ తిర్యగ్యోనిగతావుభౌ.
పరస్పరద్వేషరతౌ ప్రమాణ బలదర్పితౌ.
సరస్యస్మిన్ మహాకాయౌ పూర్వవైరానుసారిణౌ
తయోరన్యతరఃశ్రీమాన్ సముపైతి మహాగజః.
యస్య బృంహితశబ్దేన కూర్మోఽప్యన్తర్జలేశయః
ఉత్థితోఽసౌమహాకాయః కృత్స్నంవిక్షోభయన్సరః.
యం దృష్ట్వా వేష్టితకరః పతత్యేష గజోజలమ్
దన్తహస్తాగ్రలాంగూలపాదవేగేన వీర్యవాన్.
విక్షోభయం స్తతోనాగః సరోబహుఝషాకులం
కూర్మోఽప్యభ్యుద్యతశిరాయుద్ధాయాభ్యేతివీర్యవాన్.
షడుచ్ఛ్రితో యోజనాని గజస్తద్ద్విగుణాయతః
కూర్మస్త్రియోజనోత్సేధో దశయోజనమండలః.
తావుభౌ యుద్ధసమ్మత్తౌ పరస్పరవధైషిణౌ
ఉపయుజ్యాశుకర్మేదం సాధయేప్సితమాత్మనః.
మహాభ్రఘనసంకాశం తం భుక్త్వామృతమానయ
మహాగిరిసమప్రఖ్యం ఘోరరూపం చ హస్తినం.
ఇత్యుక్త్వా గరుడంసోఽథ మాఙ్గళ్యమకరోత్తదా
యుధ్యతః సహదేవైస్తే యుద్ధే భవతుమంగళం.
పూర్ణకుంభో ద్విజగావో యచ్చాన్యత్ కించిదుత్తమమ్
శుభం స్వస్త్యయనంచాపి భవిష్యతి తవాండజ.
యుధ్యమానస్య సంగ్రామే దేవైః పార్థంమహాబల
ఋచోయజూంషి సామాని పవిత్రాణిహవీంషిచ.
రహస్యాని చ సర్వాణి సర్వే వేదాశ్చతేబలం
ఇత్యుక్తో గరుడః పిత్రాగతస్తం హ్రదమన్తికాత్.
అపశ్యన్నిర్మలజలం నానాపక్షిసమాకులమ్
సతత్ స్మృత్వా పితుర్వాక్యం భీమవేగోఽన్తరిక్షగః.
నఖేన గజమేకేన కూర్మమేకేన చాక్షిపత్
సముత్పపాతచాకాశం తత ఉచ్చైర్విహంగమః.
సోఽలంబం తీర్థమాసాద్య దేవవృక్షానుపాగమత్
తే భీతాః సమకంపంత తస్య పక్షానిలాహతాః.
ననోభఞ్జ్యాదితి తదా దివ్యాః కనకశాఖినః
ప్రచలాంగాన్ సతాన్ దృష్ట్వామనోరథఫలద్రుమాన్.
అన్యానతులరూపాంగానుపచక్రామ ఖేచరః
కాంచనై రాజతైశ్చైవ ఫలైర్వైడూర్యశాఖినః.
సాగరామ్బుపరిక్షిప్తాన్ భ్రాజమానాన్ మహాద్రుమాన్
తమువాచ ఖగశ్రేష్ఠం తత్ర రౌహిణపాదపః
అతిప్రవృద్ధః సుమహానాపతన్తం మనోజవమ్ః

కల అతడు ఏకార్యాన్నైనా అవలీలగా నెరవేర్చ గలడు అన్నాడు.

అప్పుడు దేవేంద్రుడు అమృతాన్ని రక్షించే దేవతలవద్దకుపోయి- గరుత్మంతుడు తీవ్రసంకల్పంతో అమృతహరణార్థం వస్తున్నాడు. మీరు మీ శక్తులన్నీ వినియోగించి అమృతాన్ని రక్షించండి. వచ్చేవానిశక్తి మహత్తరమైనదని బృహస్పతుల వారు చెప్పారు- అన విని దేవతలు అమృతానికి నలువైపులా చేరి అప్రమత్తులై కాపలా కాయుచున్నారు. దేవేంద్రుడు స్వయంగా అమృతరక్షణార్థం నిలబడ్డాడు. దేవతలందరు మణిరత్నఖచిత కనకధారులై భుజకీర్తులు భాసిస్తుండగా శస్త్రాస్త్ర ధరులై తీక్ష్ణదృక్కులతో నిలిచారు. అగ్నిచ్ఛటలతో చలించే చక్రాలు త్రిశూల పరశు పరిఘాద్యాయుధాలు వారిచేతులలో వెలుగుతున్నాయి. భయంకరంగా ఖడ్గాలు గదలుకలాడుతున్నాయి. దివ్యాభరణభూషణభూషితులైన దేవతలు శస్త్రాస్త్రహస్తాలతో బలపరాక్రమతేజాలతో అసుర నగరవిధ్వంసక శక్తిసామర్థ్యాలతో అమృతరక్షణ నిశ్చయచిత్తులై సమరసన్నద్ధులై ఉన్నారు. సూర్యకిరణశోభితమైన ఆకాశాన్ని పరిహసించేతీరులో ఉన్నది ఆప్రదేశం.

30వ అధ్యాయము సమాప్తం

## ముప్పదియొకటవ అధ్యాయం

సూతనందనా! ఇంద్రుడు చేసిన ప్రమాదకరమైన అపరాధం ఏమిటి? వాలఖిల్యాదిమహర్షుల తపఃప్రభావంవల్ల గరుత్మంతుడు ఏ ప్రకారం జన్మించాడో వివరంగా చెప్పు. బ్రహ్మవిదుడుగదా కశ్యపుడు. అతడు ఖగనాథుని కుమారునిగా కనడం ఎలా సంభవించింది. ఆ పక్షికి యథేచ్ఛావిహారం కామరూపం ఎలా ప్రాప్తించాయో చెప్పు- అని శౌనకుడు ప్రశ్నించగా సూతుడు చెప్తున్నాడు.

బ్రహ్మర్షీ! ఈవిషయం పురాణాలనుంచి నేను గ్రహించినదాన్ని సంక్షిప్తంగా చెప్తున్నాను. కశ్యప ప్రజాపతి పుత్రకాముడై యజ్ఞం ఆరంభించగా దేవతలు గంధర్వులు ఋషులు సహకరించసాగారు. ఆ యజ్ఞంలో దేవేంద్రుడు సమిధలు తేవటానికి నియుక్తుడయ్యాడు. దేవగణాలు వాలఖిల్యాది మునిగణం అదేపనిలో నియోగించబడ్డారు. అతి బలవంతుడైన ఇంద్రుడు పర్వతసమాన సమిధల మోపును మోసికొనివస్తూ దారిలో అంగుష్ఠ మాత్ర శరీరులైన మహర్షులు ఒకమోదుగొమ్మను పట్టుకురావటం చూశాడు. తపోధనులైనవారు శారీరకబలంలేక చినచిన్న గుంటలనుకూడ దాటలేక పోవడం చూసి బలమదోన్మత్తుడైన దేవేంద్రుడు వారిని పరిహసించగా వారు కుపితులై దేవేంద్రునికి భయం కలిగింప సంకల్పించారు. ఆ సంకల్పంతో వారు మంత్రోక్తంగా అగ్నిహోత్రునికి ఆహుతు లర్పిస్తూ ఈ ఇంద్రుని హృదయాన్ని చీకాకుపరిచే బలపరాక్రమతేజస్సంపన్నుడైన మహాశూరుడు జన్మించాలి. వీర్యశౌర్యాలలో అతడు దేవేంద్రులి కంటె నూరురెట్లు మించినవాడు కావాలి.

వారి ఈసంకల్పాన్ని విని దేవేంద్రుడు దీనవదనుడై కశ్యపునిశరణుజొచ్చాడు. కశ్యపుడువిషయాన్ని

యైషా మమ మహాశాఖా శతయోజనమాయతా
ఏతామాస్థాయ శాఖాంత్వంఖా దేమాగజకచ్ఛపౌ.
తతో ద్రుమం పతగసహస్రసేవితం

మహీధరప్రతిమవపుః ప్రకమ్పయన్
ఖగోత్తమో ద్రుతమభిపత్య వేగవాన్
బభఞ్జ తా మవిరళపత్రసంచయామ్.

29 వ అధ్యాయం సమాప్తం

## ముప్పదవఅధ్యాయము

స్పృష్టమాత్రాతు పద్భ్యాం సా గరుడేన బలీయసా
అభజ్యత తరోః శాఖాభగ్నాంచైనామధారయత్.
తాం భఙ్క్త్వా స మహాశాఖాం స్మయమానో విలోకయన్
అథాత్రలంబతోఽపశ్యద్వాలఖిల్యానధో ముఖాన్.
ఋషయో హ్యత్రలంబంతేనహన్యామితితానృషీన్
తపోరతాన్ లంబమానాన్ బ్రహ్మర్షి నభివీక్ష్యసః.
హన్యాదేతాన్ సమ్పతన్తీ శాఖేత్యథవిచిన్త్యసః
నఖైర్దృఢతరం వీరః సంగృహ్య గజకచ్ఛపౌ.
స తద్వినాశసంత్రాసాదభిపత్య ఖగాధిపః
శాఖామాస్యేన జగ్రాహ తేషామేవాన్వవేక్షయా.
అతిదైవం తు తత్తస్య కర్మ దృష్ట్వా మహర్షయః
విస్మయోత్కమ్పహృదయా నామ చక్రుర్మహాఖగే.
గురుం భారం సమాసాద్యోడ్డీన ఏష విహంగమః
గరుడస్తు ఖగశ్రేష్ఠస్మాత్ పన్నగభోజనః.
తతఃశనైః పర్యపతత్ పక్షైఃశైలాన్ ప్రకంపయన్
ఏవంసోఽభ్యపతత్ దేశాన్ బహూన్సగజకచ్ఛపః.
దయార్థం వాలఖిల్యానాం న చ స్థానమవిన్దత
స గత్వా పర్వతశ్రేష్ఠం గంధమాదనమంజసా.
దదర్శ కశ్యపం తత్ర పితరం తపసి స్థితమ్
దదర్శ తం పితా చాపి దివ్యరూపం విహంగమం.
తేజోవీర్యబలోపేతం మనోమారుత తరంహసం
శైలశృంగప్రతికాశం బ్రహ్మదండమివోద్యతం.

అచిన్త్యమనభిజ్ఞేయం సర్వభూత భయంకరం
మహావీర్యధరం రౌద్రం సాక్షాదగ్నిమివోద్యతం.
అప్రధృష్యమజేయం చ దేవదానవరాక్షసైః
భేత్తారం గిరిశృంగాణాం సముద్రజలశోషణమ్.
లోకసంలోడనం ఘోరం కృతాన్తసమదర్శనమ్
తమాగతమభిప్రేక్ష్య భగవాన్ కశ్యపస్తదా
విదిత్వాచాస్య సంకల్పం మిదం వచనమబ్రవీత్.
పుత్రమాసాహసంకార్షీ ర్మాసద్యోలప్స్యసేవ్యథామ్
మాత్వాందహేయుః సంక్రుద్ధావాలఖిల్యామరీచిపాః.
తతః ప్రసాదయామాస కాశ్యపః పుత్రకారణాత్
వాలఖిల్యాన్ మహాభాగాంస్తపసా హతకల్మషాన్.
ప్రజాహితార్థమారంభో గరుడస్య తపోధనాః
చికీర్షతి మహత్కర్మ తదనుజ్ఞాతు మర్హథ.
ఏవముక్తాభగవతా మునయస్తే సమభ్యయుః
ముక్త్వాశాఖాం గిరిపుణ్యం హిమవన్తం తపోఽర్థినః
తతస్తేష్వపయాతేషు పితరం వినతాసుతః
శాఖావ్యాక్షిప్తవదనః పర్యపృచ్ఛత కశ్యపమ్.
భగవన్ క్వవిముఞ్చామి తరోః శాఖామిమామహం
వర్జితం మానుషైర్దేశ మాఖ్యాతు భగవాన్ మమ.
తతోనిఃపురుషం శైలం హిమ సంరుద్ధకందరమ్
అగమ్యం మనసాప్యన్యైస్తస్యా చఖ్యౌ సకశ్యపః
తంపర్వతం మహాకుక్షిముద్దిశ్య స మహాఖగః
జవేనాభ్యపతత్ తార్క్ష్యః సశాఖా గజకచ్ఛపః.

యాన్ని విని వాలఖిల్యమహర్షులను చేరి వాస్తవమేమిటని ప్రశ్నించాడు. వారు తమ స్థిరసంకల్పాన్ని కశ్యపునికి వివరించగా ఆబ్రహ్మర్షి వారితో ఇలా అన్నాడు—మహర్షులారా! బ్రహ్మ ఆజ్ఞవల్ల దేవేంద్రుడు ముల్లోకాలకు ప్రభువుగా ఉన్నాడు. ఈనాడు మీరు ప్రయత్నించి మరొక ఇంద్రుని సృష్టించబోతున్నారు. మీరందరు బ్రహ్మవాక్కును తిరస్కరించకండి. అంతమాత్రంచే మీ అభీష్టానికి వ్యతిరేకం కావాలని నేను కోరటంలేదు. ఇప్పుడు కలగబోయేపుత్రుడు బలసత్వ గుణసంపన్నుడై పక్షీంద్రుడు కాగలడు. దేవేంద్రుడు స్వయంగా భిక్షార్థియై మీవద్దకు వచ్చాడు.

కశ్యపుని మాటలువిని వాలఖిల్యులు ఆదరార్ద్రహృదయంతో— కశ్యప ప్రజాపతీ! మా అనుష్ఠానం ఇంద్రునికోసం జరిగింది. మీరు సంతానేచ్ఛతో యజ్ఞం చేస్తున్నారు. అందుచేత ఈఫలాన్ని మీరే స్వీకరించండి. సమస్త ప్రజాకళ్యాణకరమైన దానినే మీరు చేయండి.

ఆ సమయానికి శుభలక్షణలక్షితాంగియైన దక్షప్రజాపతికన్య వినత సంతానేచ్ఛతో తపశ్చర్య సాధిస్తూంది. ఋతుమతియైన ఆమె శుద్ధోదకస్నానపవిత్రయై తనభర్తను చేరగా ఆయన— దేవీ! నీమనోభీష్టం సిద్ధించుగాక, ముల్లోకాలను శాసించే శక్తిగల ఇద్దరు కుమార్లు నీకు కలుగుతారు వాలఖిల్యుల తపశ్శక్తి నా సంకల్పబలము తోడుకాగా జన్మించే ఆబాలులిద్దరూ ముల్లోకాలచేత పూజింపబడతారు. మహదభ్యుదయకారియైన నీ గర్భాన్ని అతిజాగ్రత్తతో సంరక్షించుకో. వారిద్దరూ పక్షీంద్రులౌతారు. స్వరూపానికి పక్షులైనా వారికి కామరూపశక్తి ఉన్నది—అని పలికి ఇంద్రుని వైపు తిరిగి— నాకుమారు లిద్దరూ నీకు స్నేహితులౌతారు. వారివల్ల నీకేప్రమాదమూ రాదు. దేవేంద్రుడవుగా నువ్వే ఉంటావు. వాగ్రూపమైన అమోఘవజ్రంకల బ్రహ్మవిదుల్ని అపహసించి అవమానించిన ప్రమాదం వస్తుందనే విషయాన్ని మరచిపోకు— అన్నాడు.

దేవేంద్రుడు సంతోషంతో స్వర్గానికి వెళ్ళాడు. వినత ప్రసన్నవదనయైనది. ఆమె కన్నకుమారులే అరుణుడు గరుడుడు. అరుణుడు సూర్యసారథి. గరుడుడు ఖగనాథుడు ఖగనాథుని పరాక్రమం వినండి.

ఇది 31 వ అధ్యాయం సమాప్తము

## ముప్పదిరెండవ అధ్యాయము

దేవతలందరూ యుద్ధసన్నద్ధులై ఉన్న సమయాన ఖగనాథుడు ఆ సమీపానికి వెళ్ళాడు. అతిబలవంతుడైన గరుత్మంతుని చూసి దేవతలందరూ గడగడలాడారు. వారి చేతులలోని ఆయుధాలు ఒకదానితో ఒకటి ఢీకొన్నాయి. విద్యుద్వహ్నిసముడైన విశ్వకర్మ అమృతభాండరక్షణకార్యంలో ఉన్నాడు. అతడు రెండే రెండు క్షణాలు గరుత్మంతునితో పోరాడి అలసి పడిపోయాడు. అనంతరం కశ్యపనందనుడు తనరెక్కలు విదలించి ధూళిరేపి ఆదుమ్ములో ముల్లోకాలలో

స తాం వధ్రీపరిణాహే చ్ఛతచర్మా మహాతనుమ్
శాఖినో మహతీం శాఖాం యాం ప్రగృహ్య యయౌ ఖగః.

స తత్ర శతసాహస్రం యోజనాన్తరమాగతః
కాలేన నాతిమహతా గరుడః పతగేశ్వరః.
స తం గత్వా క్షణేనైవ పర్వతం వచనాత్పితుః
అముఞ్చన్మహతీం శాఖాం సస్వనం తత్ర ఖేచరః.
పక్షానిలహతశ్చాస్య ప్రాకంపత స శైలరాట్
ముమోచ పుష్పవర్షం చ సమాగలిత పాదపః.
శృంగాణి చ వ్యశీర్యన్త గిరేస్తస్య సమన్తతః
మణికాంచన చిత్రాణి శోభయన్తి మహాగిరిమ్.
శాఖినో బహవశ్చాపి శాఖయాభిహతాస్తయా
కాంచనైః కుసుమైర్భాంతి విద్యుత్వన్త ఇవామ్బుదాః.
తే హేమవికచా భూమౌ యుతాః పర్వతధాతుభిః
వ్యరాజన్ శాఖినస్తత్ర సూర్యాంశు ప్రతిరంజితాః.
తతస్తస్య గిరేః శృంగమాస్థాయ స ఖగోత్తమః
భక్షయామాస గరుడస్తావుభౌ గజకచ్ఛపౌ.
తావుభౌ భక్షయిత్వా తు స తార్క్ష్యః కూర్మకుంజరౌ
తతః పర్వతకూటాగ్రాదుత్పపాత మహాజవః.
ప్రావర్తన్తాథ దేవానాముత్పాతా భయశంసినః
ఇన్ద్రస్య వజ్రం దయితం ప్రజజ్వాల భయాత్ తతః.
సధూమా న్యపతత్ సార్చిర్దివోల్కా నభసశ్చ్యుతా
తథా వసూనాం రుద్రాణామాదిత్యానాం చ సర్వశః.
సంధ్యానాం మరుతాం చైవ యే చాన్యే దేవతాగణాః
స్వం స్వం ప్రహరణం తేషాం పరస్పరముపాద్రవత్.
అభూతపూర్వం సంగ్రామే తదా దేవాసురేఽపి చ
వవుర్వాతాః సనిర్ఘాతాః పేతురుల్కాః సహస్రశః.
నిరభ్రమేవ చాకాశం ప్రజగర్జ మహాస్వనమ్
దేవానామపి యో దేవః సోఽప్యవర్షత శోణితమ్.
మమ్లుర్మాల్యాని దేవానాం నేశుస్తేజాంసి చైవ హి
ఉత్పాతమేఘా రౌద్రాశ్చ వవృషుః శోణితం బహు.
రజాంసి ముకుటాన్యేషా ముత్థితాని వ్యధర్షయన్
తతస్త్రాస సముద్విగ్నః సహ దేవైః శతక్రతుః
ఉత్పాతాన్ దారుణాన్ పశ్యన్నిత్యువాచ బృహస్పతిమ్.

కిమర్థం భగవన్ ఘోరా ఉత్పాతాః సహసోత్థితాః
నచ శత్రుం ప్రపశ్యామి యుధి యో నః ప్రధర్షయేత్.
తవాపరాధాద్ దేవేన్ద్ర ప్రమాదాచ్చ శతక్రతో
తపసా వాలఖిల్యానాం మహర్షీణాం మహాత్మనామ్.
కశ్యపస్య మునేః పుత్రో వినతాయాశ్చ ఖేచరః
హర్తుం సోమమభిప్రాప్తో బలవాన్ కామరూపధృక్.
సమర్థో బలినాం శ్రేష్ఠో హర్తుం సోమం విహంగమః
సర్వం సంభావయామ్యస్మిన్నసాధ్యమపి సాధయేత్.
శ్రుత్వైతద్ వచనం శక్రః ప్రోవాచామృత రక్షిణః
మహావీర్య బలః పక్షీ హర్తుం సోమమితోద్యతః.
యుష్మాన్సంబోధయామ్యేష యథా న స హరేద్బలాత్
అతులం హి బలం తస్య బృహస్పతి రువాచ హ.
తచ్ఛ్రుత్వా విబుధా వాక్యం విస్మితా యత్నదాస్థితాః
పరివార్యామృతం తస్థుర్వజ్రీ చేంద్రః ప్రతాపవాన్.
ధారయన్తో విచిత్రాణి కాంచనాని మనస్వినః
కవచాని మహార్హాణి వైడూర్య వికృతాని చ.
చర్మాణ్యపి చ గాత్రేషు భానుమన్తి దృఢాని చ
వివిధాని చ శస్త్రాణి ఘోరరూపాణ్యనేకశః.
శితతీక్ష్ణాగ్ర ధారాణి సముద్యమ్య సురోత్తమాః
స విస్ఫులింజ్వాలాని స ధూమాని చ సర్వశః.
చక్రాణి పరిఘాంశ్చైవ త్రిశూలాని పరశ్వధాన్
శక్తీశ్చ వివిధాస్తీక్ష్ణాః కరవాలాంశ్చ నిర్మలాన్
స్వదేహరూపాణ్యాదాయ గదాశ్చోగ్ర ప్రదర్శనాం.
తైః శస్త్రైర్భానుమద్భిస్తే దివ్యాభరణభూషితాః
భానుమన్తః సురగణాస్తస్థుర్విగత కల్మషాః.

అంధకారం వ్యాపింపజేసి దేవతల్ని కప్పివేశాడు ఆధూళిలో దేవతలు కన్నుగానక పడిపోయారు. ఆసమయంలోనే రెక్కలతో ముక్కుతో వారి అంగాలన్నీ చూర్ణంచేశాడు.

అప్పుడు ఇంద్రుని ఆజ్ఞానుసారం వాయుదేవుడు ఆ ధూళిని దూరంచేయగా దేవతలు శస్త్రాస్త్రాలతో గరుడునిపై బడ్డారు. వారిచే పీడింపజే గరుత్మంతుడు నిర్లక్ష్యంగా ప్రాణికోటికి భయం కలిగే ధ్వనిచేస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. ఎగిరి ఎగిరి దేవతాకోటికి పైభాగాన నిలిచాడు. కవచధారులయిన ఇంద్రాదిదేవతలు నిజాయుధాలతో వానిని కొట్టసాగారు. కాలాగ్నిసదృశాయుధాలు గరుత్మంతుని శరీరాన్ని వేధిస్తున్నవి. అవక్రపరాక్రమోపేతుడై గరుడుడు విజృంభిస్తున్నాడు. నిఖిల దేవసమూహాన్నీ దగ్ధంచేయనున్నాడా? అన్నట్లు అతడు వారిని పడగొడుతున్నాడు.

గరుత్మంతుని వాడిగోళ్ళూ ముక్కు దేవతలశరీరాలనుండి రక్తాన్ని ప్రవహింపజేస్తున్నవి. వారు చెల్లాచెదరయిపోతున్నారు. అతని ధాటికి ఓర్వలేని గంధర్వులూ సిద్ధులూ తూర్పుదిక్కుకు పలాయనం చిత్తగించారు. రుద్రగణాలూ వసువులూ దక్షిణ దిక్కుగా నిష్క్రమించారు. భయంతో వెనక్కి చూస్తూనే ఉన్నారు. ఆలాపోగా మిగిలిన అశ్వక్రంద, శూరవీర క్రథన తపన రేణుక శ్వసన నిమేష పులిన ప్రరుజ ఉలూకనామాలతో ప్రఖ్యాతులయిన యక్షవీరులతో పోరాడి ప్రళయరుద్రునిలా క్రోధ తామ్రాక్షుడై విహరిస్తూ ముక్కుతో గోళ్ళతో రెక్కలతో వారిని పరాజితుల్ని చేశాడు. వారందరూ రక్తధారలతో మేఘాలవలె ఉన్నారు. వారందరూ నేలకూలిన అనంతరం గరుత్మంతుడు అమృతభాండాన్ని సమీపించబోగా దానిచుట్టూ అగ్ని ప్రజ్వలించడం కనిపించింది. అది సూర్యమండలంతో సమంగా ఉన్నది. ప్రచండవాయుప్రేరణతో ప్రజ్వలించే అనలజ్వాలల్ని తిలకించి గరుత్మంతుడు తన శరీరంలో వేలకొద్దీ ముఖాలను సృష్టించుకొని మహానదీజలాలను త్రాగివచ్చి ఆ అగ్నిమీద గుమ్మరించాడు. అగ్నిని చల్లార్చి సూక్ష్మదేహంతో అమృతాన్ని సమీపించాడు.

32వ అధ్యాయము సమాప్తం

## ముప్పదిమూడవ అధ్యాయం

కథాకథనకుశలుడైన సౌతి ముందు వృత్తాంతాన్నిలా చెప్పసాగాడు— శౌనకాదులార! పక్షిరాజు గరుత్మంతుడలా సూక్ష్మరూపాన్ని ధరించి ప్రకాశిస్తూ జలవేగం సముద్రంలో ప్రవేశించినట్లు అమృతం ఉన్నస్థానంలో ప్రవేశించాడు. ఆఅమృత సంరక్షణార్థం అక్కడొక చక్రం స్థాపింపబడి ఉంది. ఆ చక్రం నిరంతరం పరిభ్రమిస్తూనే ఉంటుంది. దాని అంచులు చాలా పదునుగా ఉంటాయి. ఆ చక్రానికి నలుమూలలా పదునుగల కత్తులు కూడా అమర్చబడ్డాయి. వజ్రంకూడా ప్రవేశించడానికి వీలులేకుండా ఉంది. సూర్యాగ్నులతో సమానంగా జ్వలిస్తూ సమీపించిన ఏజీవినైనా ఖండఖండాలుగా నరికేస్తుంది. భయంకరాకారులైన రాక్షసులే దాన్ని చేరలేకపోయారు.

అనుపమ బలవీర్య తేజసో
ధృతమనసః పరిరక్షణేఽమృతస్య
అసుర పురవిదారణాః సురా
జ్వలన సమిద్ధవపుః ప్రకాశినః.

ఇతి సమర వరం సురాఃస్థితాస్తే
పరిఘ సహస్ర శతైః సమాకులమ్
విగళితమివ చాప్బరాన్తరం
తపన మరీచి కాశితం బభాసే.

30వ అధ్యాయం సమాప్తం

## ముప్పదియొకటవ అధ్యాయము

కోఽపరాధో మహేన్ద్రస్య కః ప్రమాదశ్చ సూతజ
తపసా వాలఖిల్యానాం సంభూతో గరుడః కథమ్.
కశ్యపస్య ద్విజాతేశ్చ కథం వై పక్షిరాట్ సుతః.
అధృష్యః సర్వభూతానా మవధ్యశ్చ భవత్ కథం
కథం చ కామచారీచ కామవీర్యశ్చ ఖేచరః
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం పురాణే యదిపఠ్యతే.
విషయోఽయంపురాణస్యయన్మాం త్వం పరిపృచ్ఛసి
శృణుమే వదతః సర్వమేతత్ సంక్షేపతోద్విజ.
యజతః పుత్రకామస్య కశ్యపస్య ప్రజాపతేః
సాహాయ్యమృషయోదేవా గన్ధర్వాశ్చ దదుఃకిల.
తత్రేధ్మానయనేశక్రో నియుక్తః కశ్యపేన హ
మునయోవాలఖిల్యాశ్చ యేచాన్యే దేవతాగణాః.
శక్రస్తు వీర్యసదృశ మిధ్మభారం గిరి ప్రభమ్
సముద్యమ్యానయామాస నాతికృచ్ఛ్రాదివ ప్రభుః.
అథాపశ్యదృషీన్ హ్రస్వా నంగుష్ఠోదరవర్ష్మణః
పలాశవర్తికామేకాం వహతః సంహతాన్ పథి.
ప్రలీనాన్ స్వేష్వివాంగేషు నిరాహారాంస్తపోధనాన్
క్లిశ్యమానాన్ మన్దబలాన్ గోష్పదే సంప్లుతోదకే.
తాన్ సర్వాన్ విస్మయావిష్టో వీర్యోన్మత్తః పురందరః
అపహాస్యాభ్యగాన్ శీఘ్రంలంఘయిత్వావ మన్యచ.
తేఽథరోషసమావిష్టాః సుభృశం జాతమన్యవః
ఆరేభిరే మహత్ కర్మ తదా శక్రభయంకరమ్.

జుహువుస్తే సుతపసో విధివజ్జాతవేదసమ్
మన్త్రైరుచ్చావచైర్విప్రాయేన కామేనతచ్ఛృణు.
కామవీర్యః కామగమో దేవరాజ భయప్రదః
ఇన్ద్రోఽన్యః సర్వదేవానాం భవేదితి యతవ్రతాః.
ఇన్ద్రాచ్ఛతగుణః శౌర్యే వీర్యే చైవమనోజవః
తపసోనః ఫలేనాద్య దారుణః సంభవత్వితి.
తద్బుధ్వా భృశసంతప్తో దేవరాజః శతక్రతుః
జగామ శరణం తత్ర కశ్యపం సంశితవ్రతమ్.
తచ్ఛ్రుత్వా దేవరాజస్య కశ్యపోఽథ ప్రజాపతిః
వాలఖిల్యానుపాగమ్య కర్మసిద్ధిమపృచ్ఛత.
ఏవమస్త్వితి తం చాపి ప్రత్యూచుః సత్యవాదినః
తాన్ కశ్యప ఉవాచేదం సాంత్వ పూర్వం ప్రజాపతిః.
అయమిన్ద్రస్త్రిభువనే నియోగాద్ బ్రహ్మణః కృతః
ఇన్ద్రార్థే చ భవన్తోఽపి యత్నవన్తస్తపోధనాః.
నమిథ్యా బ్రహ్మణో వాక్యం కర్తుమర్హథసత్తమాః
భవతాం హి సమిథ్యాయాం సంకల్పోవై చికీర్షితః.
భవత్వేష పతత్రిణామిన్ద్రోఽతిబలసత్త్వవాన్
ప్రసాదః క్రియతామస్య దేవరాజస్య యాచతః.
ఏవముక్తాః కశ్యపేన వాలఖిల్యాస్తపోధనాః
ప్రత్యూచురభిసంపూజ్య మునిశ్రేష్ఠంప్రజాపతిమ్.
ఇన్ద్రార్థోఽయంసమారంభః సర్వేషాం నః ప్రజాపతే
అపత్యార్థం సమారంభో భవతశ్చాయమీప్సితః.

నేటికి వినతాసుతుడు సుపర్ణుడు మాత్రం భయపడకుండా సూక్ష్మరూపంతో చక్రరంధ్రంలోంచి అమృతభాండాన్ని సమీపించాడు. అక్కడా భాండాన్ని రక్షించడానికి రెండు భయానక సర్పాలను కూడా ఉంచారు దేవతలు. ఆ సర్పాలు అగ్నివలె జ్వలిస్తున్నాయి. క్రోధంతో బుసలు కొడుతూంటే పొగలు బయలుదేరుతున్నాయి. ధూమమధ్యంలో నాలుకలు మెఱుపులవలె మెరుస్తున్నాయి. వాటి నేత్రాలు ఎర్రగా మాణిక్యాల్లా మెరుస్తున్నాయి. ఆ సర్పాలు క్రోధాన్ని విరజిమ్ముతూ చూసిన మాత్రాన యేజీవైనా భస్మంకావలసిందే. గరుత్మంతు డిదంతా చూశాడు. ఆలోచించాడు వాటి నేత్రాల్లో ధూళివిసిరేశాడు. వాటికి అంధత్వం సిద్ధించింది వెంటనే పక్షాలతో అణచివేస్తూ ఆ భయంకర సర్పాలను చీల్చివేశాడు. ఆ చక్రాన్ని కూడా తుత్తునియలు చేసి అమృతకలశం తీసుకుని వేగంగా పయనించాడు. వాయువేగమనోవేగాలను అధఃకరించిపోతూన్న వైనతేయుడు అతిదుర్లభమైన అమృతం హస్తంగతమైనా తానుమాత్రం త్రాగకుండానే వెడుతున్నాడు. ఆతనివాంఛల్లా మాతృదాస్య విమోచనమే— ఇంతలో శ్రీహరి దర్శనం యిచ్చాడు. అమితోత్సాహంతో నమస్కరించాడు గరుడుడు. భగవానుడు గరుత్మంతుని మాతృభక్తి స్వార్థరాహిత్యమూ, బలశౌర్య పరాక్రమాలూ చూసి ఆనందించి వరంకోరుకోమన్నాడు వైనతేయుడాహరి పలుకులాలించి ఇలా అన్నాడు.

దేవాధిదేవా! నేను మీధ్వజచిహ్నంగా ఉండాలని వరం కోరుతున్నాను. అంతేగాక అమృతం త్రాగకుండానే అజరామరత్వం కూడా అనుగ్రహించు— అనగా నారాయణుడు భక్తసులభుడై అనుగ్రహించాడు. తదుపరి గరుత్మంతుడు నారాయణుని అభీష్టం తెలుపుమని కోరగా గరుడుడు తనకు వాహనం కావాలన్నాడు మహావిష్ణువు. అంగీకరించాడు గరుత్మంతుడు.

గరుత్మంతుడు తీవ్రవేగంతో సాగిపోయాడు. ఖగనాథుడు అమృతం హరించుకుపోతూండడం గమనించిన ఇంద్రుడు వజ్రాయుధం ప్రయోగించాడు. గరుడుడు వజ్రపుదెబ్బతిని నవ్వుతూ ఏ మహర్షి అనుగ్రహంతో యిచ్చిన వెన్నెముక వజ్రంగా మారిందో ఎవరిచేతిలో ఈ ఆయుధం ఉన్నదో వారిరువురినీ నేను గౌరవభావంతోనే చూస్తాను. ఈవజ్రంకూడా నాకు గౌరవింపదగ్గ వస్తువే కనక నా రెక్కల్లోని ఒక ఈక విడుస్తున్నాను—అనగా వజ్రం పొంగిపోయింది. దానికే గరుడనామం ఉంచారు. ఈ రెక్కగలవ్యక్తి సుపర్ణుడనే నామంతో వ్యవహరింపబడతాడన్నారు. వజ్రఘాతంకూడా లక్ష్యపెట్టని ఈ మహాప్రాణి ఏదోమహత్తరశక్తి అని ఇంద్రుడు—నీ బలసంపదను సమగ్రంగా తెలిసికొని నీతో బద్ధసఖ్యం చేసికోవాలనుకుంటున్నాను అన్నాడు.

౩౩వ అధ్యాయం సమాప్తము

## ముప్పదినాల్గవ అధ్యాయము

పురందరా! నువ్వు కోరినట్లు నీతో స్నేహంగా ఉండడానికి నాకేమీ అభ్యంతరంలేదు.

తదిదం సఫలం కర్మత్వయైవ ప్రతిగృహ్యతామ్
తథా చైవం విధిత్స్వాత్ర యథా శ్రేయోఽనుపశ్యసి.
ఏతస్మిన్నేవ కాలే తు దేవీ దాక్షాయణీ శుభా
వినతా నామ కల్యాణీ పుత్రకామా యశస్వినీ.
తపస్తప్త్వా వ్రతపరా స్నాతా పుంసవనే శుచిః
ఉపచక్రామ భర్తారం తామువాచాథ కశ్యపః.
ఆరంభః సఫలో దేవి భవితా యస్త్వయేప్సితః
జనయిష్యసి పుత్రౌ ద్వౌ వీరౌ త్రిభువనేశ్వరౌ.
తపసా వాలఖిల్యానాం మమ సంకల్పజౌ తథా
భవిష్యతో మహాభాగౌ పుత్రౌ త్రైలోక్యపూజితౌ.
ఉవాచ చైనాం భగవాన్ కశ్యపః పునరేవ హ
ధార్యతామప్రమాదేన గర్భోఽయం సుమహోదయః.
ఏతౌ సర్వపతత్రీణామిన్ద్రత్వం కారయిష్యతః
లోకసంభావితౌ వీరౌ కామరూపౌ విహంగమౌ.
శతక్రతుమథోవాచ ప్రీయమాణః ప్రజాపతిః
త్వత్సహాయౌ మహావీర్యౌ భ్రాతరౌ తే భవిష్యతః
నైతాభ్యాం భవతా దోషః సకాశాత్ తే పురందర
వ్యేతు తే శక్ర సంతాపస్త్వమేవేంద్రో భవిష్యసి.
నచాప్యేవం త్వయా భూయః క్షేప్తవ్యా బ్రహ్మవాదినః
నచావమాన్యా దర్పాత్ తే వాగ్వజ్రా భృశకోపనాః
ఏవముక్తో జగామేన్ద్రో నిర్విశంకస్త్రివిష్టపమ్
వినతా చాపి సిద్ధార్థా బభూవ ముదితా తథా.
జనయామాస పుత్రౌ ద్వావరుణం గరుడం తథా
వికలాంగోఽరుణస్తత్ర భాస్కరస్య పురఃసరః.
పతత్రీణాం చ గరుడమిన్ద్రత్వేనాభ్యషించత
తస్యైతత్ కర్మ సుమహచ్ఛ్రూయతాం భృగునన్దన.

31 వ అధ్యాయం సమాప్తం

## ముప్పదిరెండవ వ అధ్యాయము

తతస్మిన్ ద్విజశ్రేష్ఠ సముదీర్ణే తథా విధే
గరుడః పక్షిరాట్ తూర్ణం సంప్రాప్తో విబుధాన్ ప్రతి.
తం దృష్ట్వాతిబలం చైవ ప్రాకంపన్త సురాస్తతః
పరస్పరం చ ప్రత్యఘ్నన్ సర్వప్రహరణాన్యుత.
తత్రాసీదమేయాత్మా విద్యుదగ్నిసమప్రభః
భౌమనః సుమహావీర్యః సోమస్య పరిరక్షితా.
స తేన పతగేన్ద్రేణ పక్షతుణ్డనఖక్షతః
ముహూర్తమతులం యుద్ధం కృత్వా వినిహతో యుధి.
రజశ్చోద్ధూయ సుమహత్ పక్షవాతేన ఖేచరః
కృత్వా లోకాన్ నిరాలోకాంస్తేన దేవానవాకిరత్.
తేనావకీర్ణా రజసా దేవా మోహముపాగమన్
న చైవం దదృశుశ్ఛన్నా రజసామృతరక్షిణః.
ఏవం సంలోడయామాస గరుడస్త్రిదివాలయమ్
పక్షతుండప్రహారైస్తు దేవాన్ స విదదార హ.
తతో దేవః సహస్రాక్షస్తూర్ణం వాయుమచోదయత్
విక్షిపేమాం రజోవృష్టిం తవేదం కర్మ మారుత.
అథ వాయురపోవాహ తద్రజస్తరసా బలీ
తతో వితిమిరే జాతే దేవాః శకునిమార్దయన్.
న నాదోచ్చైః సబలవాన్ మహామేఘ ఇవాంబరే
వధ్యమానః సురగణైః సర్వభూతాని భీషయన్.
ఉత్పపాత మహావీర్యః పక్షిరాట్ పరవీరహా
సముత్పత్యాన్తరిక్షస్థం దేవానాముపరి స్థితమ్.
వర్మిణో విబుధాః సర్వే నానాశస్త్రైరవాకిరన్
పట్టిశైః పరిఘైః శూలైర్గదాభిశ్చ సవాసవాః.
క్షురప్రైర్జ్వలితైశ్చాపి చక్రైరాదిత్యరూపిభిః
నానాశస్త్రవిసర్గైస్తైర్వధ్యమానస్సమన్తతః

ఇక నా బలమా! వాస్తవానికి ఉత్తమపురుషులు తమశక్తిని తాము ప్రకటించుకోవడానికి ఇష్టపడరు. స్నేహితుడుగా అడిగావు; కనక చెపుతున్నాను. అకారణంగాకూడా ఆత్మస్తుతి మంచిది కాదు కదా-మిత్రుడడిగితే మాత్రం చెప్పవచ్చు.

పర్వతారణ్యనదీనదాలతో ఈ విశాలవిశ్వాన్ని నావీపుమీద ఉంచుకుని విహరించగలను. ఈ చరాచరజగత్తునుకూడా అనాయాసంగా వహించి విహరించగలను—అని గరుడుడు పలుకగా దేవేంద్రుడు ఆనందించి అమృతం గరుత్మంతునికి అవసరం కాకపోతే తిరిగి యిచ్చివేయమన్నాడు— అంతే. ఎవరికోసం ఈఅమృతం వెడుతున్నదో వాళ్ళే దీన్ని తాగితే వారివల్ల అందరికీ హానికలుగుతుంది—అని ఇంద్రుడు చెప్పగా—నేను ఒకానొక ప్రయోజనాన్ని అపేక్షించి అమృతం తీసికొనివెడుతున్నాను. నేను గమ్యస్థానం చేరి అక్కడ ఉంచగానే నువ్వు హరించుకుపో— అన్నాడు గరుత్మంతుడు. దేవేంద్రుడు సంతోషిస్తూ వరంకోరుకోమనగా గరుడుడు సర్పాలదుష్టత్వం గుర్తుకురాగా— దేవేంద్రా! ఈ అమృతం ఎవ్వరికీ దక్కనివ్వను. సరే ఇదిమొదలు సర్పాలను నేను ఆహారంగా స్వీకరించే వరం అనుగ్రహించు—అని కోరగా ఇంద్రుడు అనుగ్రహించి ఈఅమృతం అక్కడ ఉంచిన క్షణంలోనే నేను పట్టుకుపోతాను—అని వెళ్ళిపోయాడు. గరుత్మంతుడు తన తల్లివద్దకు వెళ్ళాడు.

అనంతరం సర్పాలను చేరి — నాగులారా! ఇదిగో మీ కోసం అమృతం తెచ్చాను. ఈ దర్భల మీద ఉంచుతున్నాను. మీరందరూ స్నానాలు చేసి పవిత్రదేహాలతో వచ్చి ఆరగించండి. మన ఒడంబడిక ప్రకారంగా నా తల్లికి దాస్యవిముక్తి లభించింది — అని గరుత్మంతుడు అనగా సర్పాలు సంతోషంతో సమ్మతించి స్నానార్థం సాగగా శచీపతి అమృతాన్ని తీసికొని వెళ్ళిపోయాడు.

స్నానార్థం వెళ్ళిన సర్పాలు పవిత్రకార్యాలన్నీ నిర్వర్తించుకొని వచ్చేసరికి అక్కడ అమృతం లేకపోవడం చూసి మనమోసానికి ప్రతీకారమని గ్రహించి ఆ దర్భలనే నాకారు. అందువల్ల వాని నాలుకలు చీలిపోయాయి. గరుత్మంతుడు ఈ ప్రకారంగా సర్పాలకి ద్విజిహ్వత్వం ప్రాప్తింపజేశాడు.

అది మొదలుగా గరుత్మంతుడు తన తల్లితో స్వేచ్ఛగా ఉండసాగాడు. వినతకు ఆనందాన్ని కలిగిస్తూ ఖగాలకు ప్రభువై వర్తించే ఈ గరుడుని ఉపాఖ్యానం శ్రేష్ఠపురుషులవల్ల వినినా, తాము చదివినా పుణ్యలోకాలకు వెడతారు. ఇది ఫలశ్రుతి.

1 వ అధ్యాయమునుండి 34 వ అధ్యాయమువరకు సమాప్తము.



కుర్వన్ సుతుములం యుద్ధం పక్షిరాట్ సవ్యకంపత
నిర్దహన్నివచాకాశే వైనతేయః ప్ర తా ప వా న్
పక్షాభ్యామురసా చైవ సమంతాద్ వ్యాక్షిపత్ సురాన్.
తే విక్షిప్తాస్తతో దేవా దుద్రువుర్గరుడార్దితాః
నఖ తుండక్షతాశ్చైవ సుస్రువుః శోణితంబహు.
సాధ్యాః ప్రాచీం సగంధర్వా వసవోదక్షిణాందిశమ్
ప్రజగ్ముః సహితారుద్రాః పతగేంద్ర ప్రధర్షితాః.
దిశం ప్రతీచీ మాదిత్యా నాసత్యా వుత్తరాందిశమ్
ముహుర్ముహుః ప్రేక్షమాణా యు ధ్య మా నా మహౌజసః.
అశ్వక్రన్దేన వీరేణ రేణుకేన చ పక్షిరాట్
కథనేనచ శూరేణ త ప నే న చ ఖే చ రః.
ఉలూక శ్వసనాభ్యాం చ నిమేషేణ చ పక్షిరాట్
ప్రరుజేన చ సంగ్రాయం చ కా ర వు లి నే న చ.
తాన్ పక్షనఖతుండాగ్రైరభినద్ వినతా సు తః
యుగాన్తకాలేసంక్రుద్ధః పి నా కీ వ ప ర ం త పః
మహాబలా మహోత్సాహాస్తేన తే బహుధాక్షతాః
రేజురభ్రఘనప్రఖ్యా రుధిరౌఘ ప్ర వ ర్షి ణః.
తాన్కృత్వా పతగశ్రేష్ఠః సర్వానుత్క్రాన్తజీవితాన్
అతిక్రాన్తోఽమృతస్యార్థే సర్వతోఽగ్ని మపశ్యత.
ఆవృణ్వానం మహాజ్వాలమర్చిర్భిః సర్వతోఽమ్బరం
దహన్తమివతీక్ష్ణాంశుం చండవాయు సమీరితమ్.

తతో నవత్యా నవతీర్ముఖానామ్
కృత్వామహాత్మా గరుడస్తరస్వీ
నదీః సమాపీయ ముఖైస్తతస్తైః
సుశీఘ్రమాగమ్య పునర్జవేన.
జ్వలన్తమగ్నిం తమమిత్ర తాపనః
సమాస్తరత్పత్రరథో నదీభిః
తతః ప్రచక్రే వపురన్యదల్పం
ప్రవేష్టుకామోఽగ్ని మభిప్రశామ్య.

32 వ అధ్యాయం సమాప్తం

## ముప్పదిమూడవ అధ్యాయము

జాంబూనద మయో భూత్వా మరీచినికరోజ్జ్వలః
ప్రవివేశ బలాత్ పక్షీ వారివేగఇవార్ణవమ్.
సచక్రం క్షురపర్యన్త మపశ్య దమృతాన్తికే
పరిభ్రమన్త మనిశం తీక్ష్ణ ధార మయస్మయమ్.
జ్వలనార్కప్రభంఘోరం ఛేదనం సోమహారిణామ్
ఘోరరూపాంతదత్యర్థంయన్త్రందేవైః సునిర్మితమ్.
తస్యాంన్తరం స దృష్ట్వైవ పర్యవర్తత ఖేచరః
అరాన్తరేణాభ్యపతత్ సంక్షిప్యాంగం క్షణేనహ.
అధశ్చక్రస్య చై వాత్ర దీప్తా నలసమద్యుతీ
విద్యుజ్జిహ్వామహావీర్యాదీప్తా సౌ దీ ప్త లో చ నౌ.
చక్షుర్విషౌ మహాఘోరౌ నిత్యం క్రుద్ధౌ తరస్వినౌ
రక్షార్థ మేవామృతస్య ద ద ర్శ భుజగోత్తమౌ
సదా సంరబ్ధనయనౌ స దా చా ని మి షే క్ష ణౌ
తయోరేకోఽపి యం పశ్యేత్ స తూర్ణం భస్మ సాద్ భవేత్.
తయోశ్చక్షూంషి రజసా సుపర్ణః సహసావృణోత్
తాభ్యామదృష్టరూపోఽసౌసర్వతః సమతాడయత్.
తయోరంగే సమాక్రమ్య వైనతేయోఽన్తరిక్షగః
ఆచ్ఛినత్ తరసామధ్యే సోమమభ్యద్రవత్ తతః.
సముత్పాట్యామృతం తత్ర వైనతేయస్తతో బలీ

ఉత్పపాత జవేనైవ యన్త్రమున్మథ్య వీర్యవాన్.
అపీత్వైవామృతం పక్షీ పరిగృహ్యాశు నిఃసృతః
ఆగచ్ఛదపరిశ్రాన్త ఆవార్యార్కప్రభాం తతః.
విష్ణునా చ తదాకాశే వైనతేయః సమేయివాన్
తస్య నారాయణస్తుష్టస్తేనాలౌల్యేన కర్మణా.
తమువాచావ్యయో దేవో వరదోఽస్మీతి ఖేచరమ్
స వవ్రే తవ తిష్ఠేయముపరీత్యన్తరిక్షగః
ఉవాచ చైనం భూయోఽపి నారాయణమిదం వచః
అజరశ్చామరశ్చ స్యామమృతేన వినాప్యహమ్.
ఏవమస్త్వితి తం విష్ణురువాచ వినతాసుతమ్
ప్రతిగృహ్య వరౌ తౌ చ గరుడో విష్ణుమబ్రవీత్
భవతేఽపి వరం దద్యాం వృణోతు భగవానపి
తం వవ్రే వాహనం విష్ణుర్గరుత్మన్తం మహాబలమ్.
ధ్వజం చ చక్రే భగవానుపరి స్థాస్యసీతి తమ్
ఏవమస్త్వితి తం దేవముక్త్వా నారాయణం ఖగః.
వవ్రాజ తరసా వేగాద్ వాయుం స్పర్ధన్మహాజవః

తం వ్రజన్తం ఖగశ్రేష్ఠం వజ్రేణేన్ద్రోఽభ్యతాడయత్.
హరన్తమమృతం రోషాద్ గరుడం పక్షిణాం వరమ్
తమువాచేన్ద్రమాక్రన్దే గరుడః పతతాం వరః.
ప్రహసన్ శ్లక్ష్ణయా వాచా తథా వజ్రసమాహతః
ఋషేర్మానం కరిష్యామి వజ్రం యస్యాస్థిసంభవమ్
వజ్రస్య చ కరిష్యామి తవైవ చ శతక్రతో
ఏతత్ పత్రం త్యజామ్యేకం యస్యాన్తం నోపలప్స్యసే.
న చ వజ్రనిపాతేన రుజా మేఽస్తీహ కాచన
ఏవముక్త్వా తతః పత్రముత్ససర్జ స పక్షిరాట్.
తదుత్సృష్టమభిప్రేక్ష్య తస్య పర్ణమనుత్తమమ్
హృష్టాని సర్వభూతాని నామ చక్రుర్గరుత్మతః.
సురూపం పత్రమాలక్ష్య సుపర్ణోఽయం భవత్వితి
తద్ దృష్ట్వా మహదాశ్చర్యం సహస్రాక్షః పురందరః
ఖగో మహదిదం భూతమితి మత్వాభ్యభాషత.
బలం విజ్ఞాతుమిచ్ఛామి యత్ తే పరమనుత్తమమ్
సఖ్యం చానన్తమిచ్ఛామి త్వయా సహ ఖగోత్తమ.

ఇది ౩౩ వ అధ్యాయం సమాప్తము

## ముప్పది నాలుగవ అధ్యాయము

సఖ్యం మేఽస్తు త్వయా దేవ యథేచ్ఛసి పురందర
బలం తు మమ జానీహి మహచ్చాసహ్యమేవ చ.
కామం నైతత్ ప్రశంసన్తి సన్తః స్వబల సంస్తవం
గుణ సంకీర్తనం చాపి స్వయమేవ శతక్రతో.
సఖేతి కృత్వా తు సఖే పృష్టో వక్ష్యామ్యహం త్వయా
న హ్యాత్మస్తవసంయుక్తం వక్తవ్యమనిమిత్తతః.
సపర్వత వనాముర్వీం ససాగర జలామిమామ్
వహే పక్షేణ వై శక్ర త్వామప్యత్రావలంబినమ్.
సర్వాన్సంపిణ్డితాన్వాపి లోకాన్సస్థాణు జంగమాన్
వహేయమపరిశ్రాన్తో విద్ధీదం మే మహద్బలమ్.

ఇత్యుక్తవచనం వీరం కిరీటీ శ్రీమతాం వరః
ఆహ శౌనక దేవేన్ద్రః సర్వలోకహితః ప్రభుః.
ఏవమేవ యథాత్థ త్వం సర్వం సంభావ్యతే త్వయి
సంగృహ్యతామిదానీం మే సఖ్యమత్యన్తసత్తమం.
న కార్యం యది సోమేన మమ సోమః ప్రదీయతాం
అస్మాంస్తే హి ప్రబాధేయుర్యేభ్యో దద్యాద్భవానిమం
కించిత్కారణముద్దిశ్య సోమోఽయం నీయతే మయా
న దాస్యామి సమాదాతుం సోమం కస్మైచిదప్యహం.
యత్రేమం తు సహస్రాక్ష నిక్షిపేయమహం స్వయం
త్వమాదాయ తతస్తూర్ణం హరేథాస్త్రిదివేశ్వర.

వాక్యేనానేన తుష్టోఽహం యత్ త్వయోక్తమిహాండజ
యమిచ్ఛసి వరం మత్తస్తం గృహాణ ఖగోత్తమ.
ఇత్యుక్తః ప్రత్యువాచేదం కద్రూపుత్రాననుస్మరన్
స్మృత్వాచైవోపధికృతం మాతుర్దాస్య నిమిత్తతః.
ఈశోఽహమపి సర్వస్య కరిష్యామితు తేఽర్థితామ్
భవేయుర్భుజగాః శక్ర మమభక్ష్యా మహాబలాః
తథేత్యుక్త్వాన్వగచ్ఛత్ తం తతో దానవ సూదనః
దేవదేవంమహాత్మానం యోగినామీశ్వరం హరిమ్.
స చాన్వమోదత్ తంచార్థం యథోక్తం గరుడేన వై
ఇదం భూయో వచఃప్రాహభగవాన్ త్రిదశేశ్వరః.
హరిష్యామి వినిక్షిప్తం సోమమిత్యనుభాష్యతమ్
ఆజగామ తతస్తూర్ణం సుపర్ణో మాతురన్తికమ్.
అథ సర్పానువాచేదం సర్వాన్ పరమహృష్టవత్
ఇదమానీతమమృతం నిక్షేప్స్యామి కుశేషు వః.
స్నాత్వా మంగళసంయుక్తాస్తతఃప్రాశ్నీత పన్నగాః
భవద్భిరిదమాసీనైర్యదుక్తం తద్వచస్తదా.
అదాసీ చైవ మాతేయమద్యప్రభృతి చాస్తుమే
యథోక్తం భవతామేతత్ వచోమే ప్రతిపాదితమ్.
తతఃస్నాతుంగతాః సర్పాః ప్రత్యుక్త్వాతంతథేత్యుత
శక్రోఽప్యమృతమాక్షిప్య జగామ త్రిదివం పునః
అథాగతాస్తముద్దేశం సర్పాః సోమార్థినస్తదా
స్నాతాశ్చ కృతజప్యాశ్చ ప్రహృష్టాః కృతమంగళాః
యత్రైతదమృతం చాపి స్థాపితం కుశసంస్తరే
తద్విజ్ఞాయహృతంసర్పాః ప్రతిమాయాకృతంచతత్
సోమస్థానమిదం చేతి దర్భాంస్తే వివిహుస్తదా
తతో ద్విధాకృతా జిహ్వాః సర్పాణాం తేనకర్మణా.
అభవంశ్చామృతస్పర్శాత్ దర్భాస్తేఽథ పవిత్రిణః
ఏవం తదమృతం తేన హృతమాహృతమేవ చ
ద్విజిహ్వాశ్చ కృతాః సర్పా గరుడేన మహాత్మనా.

తతః సుపర్ణః పరమప్రహర్షవాన్
విహృత్య మాత్రా సహ తత్ర కాననే
భుజంగభక్షః పరమార్చితః ఖగై
రహీనకీర్తిర్వినతామనన్దయత్
ఇమాంకథాం యః శృణుయాన్నరః సదా
పఠేత వా ద్విజగణముఖ్యసంసది
అసంశయంత్రిదివమియాత్ స పుణ్యభాక్
మహాత్మనః పతగపతేః ప్రకీర్తనాత్.

మహాభారతేతిహాసాంతర్గతమయిన
ఆదిపర్వములోని అనుక్రమణికాది పర్వములతో
1వ అధ్యాయమునుండి 34 వ అధ్యాయము వరకూ
ఆంధ్ర వ్యాఖ్యానముతో ఇది

ప్రథమభాగము

ప్రథమ ముద్రణ 1958 మార్చి
ద్వితీయ ముద్రణ 1958 సెప్టెంబరు

# * ఆంధ్ర మహాభారతము *

## ఆది పర్వము

సంచిక – 2

శ్రీ పురాణపండ రామమూర్తి

ఎడిటర్ :
పి. యస్. ప్రకాశదీక్షితులు

# శ్రీ మహాభారత ప్రచారక సంఘము

## కాకినాడ

పాలకవర్గము :

శ్రీ తోపల్లి కృష్ణబ్రహ్మశాస్త్రి, బి. ఏ., బి. ఎల్.

శ్రీ పైండా వెంకటనారాయణ, యం. పి.

కాకినాడ పురపాలక సంఘాధ్యక్షులు

శ్రీ దంటు భాస్కరరావు,

శ్రీ రోళ్ళ సీతారామస్వామినాయుడు

శ్రీ బచ్చు సన్యాసిరావు

కార్యాచరణవర్గము

అధ్యక్షులు :

శ్రీ తెలికిచర్ల రామమూర్తి

ఉపాధ్యక్షులు :

శ్రీ ఆకెళ్ళ నరసింహచయనులు

సంయుక్త కార్యదర్శులు :

శ్రీ పలుకూరి రామమూర్తి

శ్రీ గొల్లపూడి చినవెంకటస్వామి

కోశాధికారి :

శ్రీ మాజేటి గోవిందరాజులు

## పాలకొల్లు

అధ్యక్షులు :

శ్రీ అద్దేపల్లి సత్యనారాయణమూర్తి, ఎం. ఎల్. ఎ.

ఉపాధ్యక్షులు :

శ్రీ బోళ్ళ వెంకటసుబ్బారావు

కార్యదర్శి :

శ్రీ కలగ శంభుప్రసాద్

సహాయ-కార్యదర్శి :

శ్రీ పినిశెట్టి చినవెంకటేశ్వరరావు

కోశాధికారి :

శ్రీ యిమ్మడి సత్యనారాయణ

సభ్యులు :

శ్రీ చోడిశెట్టి సూర్యారావు

శ్రీ ఆచంట కేశవరావు

శ్రీ గాది వెంకట్రామయ్య

శ్రీ అబోతుల రామన్న

ఎడిటర్ :

శ్రీ పి. యస్. ప్రకాశ దీక్షితులు

సంపాదక సహకారం :

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి (విశారద)

# విషయసూచి



ముద్రణ:
శ్రీ భారతి ప్రింటింగుప్రెస్, ఆలమూరు. తూ.గో.జిల్లా.

భుజంగమానాం శాపస్య మాతా చైవ సుతేన చ
వినతాయా స్త్వయా ప్రోక్తం కారణం సూతనన్దన.
వరప్రదానం భర్త్రా చ కద్రూవినతయో స్తథా
నామనీ చైవ తే ప్రోక్తే పక్షిణో ర్వైనతేయయోః.
పన్నగానాం తు నామాని న కీర్తయసి సూతజ
ప్రాధాన్యేనాపి నామాని శ్రోతుమిచ్ఛామహే వయమ్.
బహుత్వాన్నామధేయాని పన్నగానాం తపోధన
నకీర్తయిష్యే సర్వేషాం ప్రాధాన్యేన తు మే శృణు.
శేషః ప్రథమతో జాతో వాసుకి స్తదనన్తరమ్
ఐరావత స్తక్షకశ్చ కర్కోటక ధనంజయౌ.
కాళియో మణినాగశ్చ నాగశ్చాపూరణ స్తథా
నాగ స్తథా పిఞ్జరక ఏలాపత్రోఽథవామనః
నీలానీలౌ తథా నాగౌ కల్మాషశబలౌ తథా
ఆర్యకశ్చోగ్రకశ్చైవ నాగః కలశపోతకః.
సుమనాఖ్యో దధిముఖ స్తథా విమలపిండకః
ఆప్తః కర్కోటకశ్చైవ శంఖో వాలిశిఖ స్తథా.
నిష్టానకో హేమగుహో నహుషః పింగళ స్తథా.
బాహ్యకర్ణో హస్తిమఖ స్తథా ముద్గరపిండకః.
కంబళాశ్వతరౌ చాపి నాగః కాళీయక స్తథా.

వృత్తసంవర్తకౌ నాగౌ ద్వౌ చ పద్మావితి శ్రుతౌ.
నాగః శంఖముఖశ్చైవ తథా కూష్మాండకోఽపరః
క్షేమకశ్చ తథా నాగో నాగః పిండారక స్తథా.
కరవీరః పుష్పదంష్ట్రో బిల్వకో బిల్వపాండురః
మూషకాదః శంఖశిరాః పూర్ణభద్రో హరిద్రకః.
అపరాజితో జ్యోతికశ్చ పన్నగః శ్రీవహ స్తథా
కౌరవ్యో ధృతరాష్ట్రశ్చ ఖండపిండిశ్చ వీర్యవాన్.
విరజాశ్చ సుబాహుశ్చ శాలిపిండస్య వీర్యవాన్
హస్తిపిండః పిఠరకః సుముఖః కౌణపాశనః.
కుఠరః కుంజరశ్చైవ తథా నాగః ప్రభాకరః
కుముదః కుముదాక్షశ్చ తిత్తిరి ర్హాలిక స్తథా.
కర్దమశ్చ మహానాగో నాగశ్చ బహుమూలకః
కర్కరాకర్కరౌ నాగౌ కుండోదరమహోదరౌ.
ఏతే ప్రాధాన్యతో నాగాః కీర్తితా ద్విజసత్తమ
బహుత్వాన్నామధేయానామితరే నానుకీర్తితాః.
ఏతేషాం ప్రసవో యశ్చ ప్రసవస్య చ సంతతిః
అసంఖ్యేయేతి మత్వా తాన్ న బ్రవీమి తపోధన.
బహూనీహ సహస్రాణి ప్రయుతాన్యర్బుదాని చ
అశక్యాన్యేవ సంఖ్యాతుం పన్నగానాం తపోధన.

౩౫ వ అధ్యాయం సమాప్తం

## ముప్పదిఆరవ అధ్యాయము

ఆఖ్యాతా భుజగాస్తాత వీర్యవన్తో దురాసదాః
శాపం తం తేఽభివిజ్ఞాయ కృతవన్తః కిముత్తరమ్.
తేషాం తు భగవాన్ శేషః కద్రూం త్యక్త్వా మహాయశాః
ఉగ్రం తపః సమాతస్థే వాయుభక్షో యతవ్రతః.
గంధమాదనమాసాద్య బదర్యాం చ తపోరతః

గోకర్ణే పుష్కరారణ్యే తథా హిమవత స్తటే.
తేషు తేషు చ పుణ్యేషు తీర్థేష్వాయతనేషు చ
ఏకాన్తశీలో నియతః సతతం విజితేన్ద్రియః.
తప్యమానం తపో ఘోరం తం దదర్శ పితామహః
సంశుష్కమాంసత్వక్స్నాయుం జటాచీరధరంమునిం.
తమబ్రవీత్ సత్యధృతిం తప్యమానం పితామహః

## ముప్పదిఅయిదవ అధ్యాయము

శోకసంతప్తులతో ఆకర్ణించే మునిమండలికి పూజ్యస్థానీయుడైన శౌనకుడు సూతుని అభినందిస్తూ— కద్రువ తన సంతానాన్ని శపించింది. వినత తన కుమారునిచేత శాపం పొందింది. ఈ వృత్తాంతమంతా మీరు విశదీకరించారు. కానీ ఆ సర్పజాతివారి పేర్లుమాత్రం చెప్పారుకాదు. వారందరివీ చెప్పటం కష్టమయితే కొందరివయినా కనీసం ప్రముఖనాగుల నామాలైనా వినాలని కుతూహలపడుతున్నాం.

అనగా సూతుడు— మహర్షి శ్రేష్ఠులార! అసంఖ్యాకమైనది సర్పజాతి. ఆ పేరులన్నీ చెప్పడం అసంభవం. అందుచేత మీరు కోరినట్లు వారిలో ప్రముఖుల పేర్లు చెపుతాను. సర్పవంశంలో మున్ముందుగా జన్మించినవాడు శేషుడు. అనంతరమందు వాసుకి ఐరావత తక్షక కర్కోటక ప్రముఖులు ప్రభవించారు. వీరి తరువాయి ధనంజయ కాళియ మణినాగ అపూరణ పింజరక ఏలాపత్ర వామన నీల అనీల కల్మాష శబల ఆర్యక ఉగ్రక కలశపోతక సుమనాఖ్య దధిముఖ విమల పిండక ఆప్త శంఖ వాలిశిఖ నిష్టానక హేమగుహ నహుష పింగళాదులు క్రమక్రమంగా పుట్టారు.

వీరేకాక మరికొందరుకూడా విశిష్టశక్తిసంపన్నులున్నారు. వారిపేర్లుకూడా వినడానికి మీరు ఉత్సుకత్వం చూపుతున్నారు కనక వినండి. బాహ్యకర్ణ హస్తిపద ముద్గరపిండ కంబల అశ్వతర కాళీయక వృత్త సంవర్తక పద్మ శంఖముఖ కూష్మాండక క్షేమక పిండారక కరవీర పుష్పదంష్ట్ర బిల్వక బిల్వపాండుర మూషకాద శంఖశిర పూర్ణభద్ర హరిద్రక అపరాజిత జ్యోతిక శ్రీవహ కౌరవ్య ధృతరాష్ట్ర పరాక్రమి శంఖపిండ విరజ సుబాహు వీర్యవాహన శాలిపిండ హస్తిపిండ పిఠరక సుముఖ కౌణపాశన కుంజర కుఠర కుముద కుముదాక్ష కుంభోదర మహోదర కిర్కుర అకర్కుర బహుమూలక హాలిక తిత్తిర ప్రభాకర నామాలతో లబ్ధప్రతిష్ఠులైనవారు ఈ నాగులు.

నేను ప్రప్రథమంగా నివేదించినట్లు ఈ సర్పజాతి అసంఖ్యాకమైనది. కనక వారిలో గొప్పవారిపేర్లు మాత్రమే చెప్పాను. అదీగాక ఈ సర్పాలసంతానం ఆ సంతానాల తాలూకు సంతతి అపరిమిత సంఖ్యలో పెరిగిపోయింది. సహస్రసంఖ్యలో ప్రారంభమై అర్బుదాలను మించిపోయింది.

35 వ అధ్యాయం సమాప్తము

## ముప్పది ఆఱవ అధ్యాయము

మహాపరాక్రమోపేతులయిన నాగజాతి ప్రముఖులను గూర్చి చెప్పారు. అయితే కన్నతల్లి కద్రువ శపించిన విషయం వారెరుగనే ఎరుగుదురుగదా. ఆ శాపం తప్పించుకోవడానికి వారు ఏవిధమైన ప్రయత్నంచేశారో సమగ్రంగా వివరించవలసిందని కోరిన శౌనకాది మహర్షులకు రోమహర్షణపుత్రుడు ఉగ్రశ్రవసుడు చెపుతున్నాడు—

ఈ నాగులలో జన్మతః మాత్రమేకాక సర్వవిధాలా శ్రేష్ఠుడైన జ్యేష్ఠుడు శేషువు వాయుభక్షణంచేస్తూ సంయమనంకలిగితపోదీక్ష ఆరంభించాడు.

కిమిదం కురుషే శేష ప్రజానాం స్వస్తి వై కురు.
త్వం హి తీవ్రేణ తపసా ప్రజాస్తాపయసేఽనఘ
బ్రూహి కామం చ మే శేషయస్తే హృది వ్యవస్థితః
సోదర్యా మమ సర్వే హి భ్రాతరో మన్దచేతసః
సహ తైర్నోత్సహే వస్తుం తద్భవాననుమన్యతాం.
అభ్యసూయన్తి సతతం పరస్పరమమిత్రవత్
తతోఽహం తపఆతిష్ఠం నైతాన్ పశ్యేయమిత్యుత
నమర్షయన్తి ససుతాం సతతం వినతాం చ తే
అస్మాకం చాపరో భ్రాతా వైనతేయోఽన్తరిక్షగః.
తం చ ద్విషన్తి సతతం స చాపి బలవత్తరః
వరప్రదానాత్ స పితుః కశ్యపస్య మహాత్మనః.
సోఽహంతపఃసమాస్థాయమోక్ష్యామీదంకళేబరం
కథంమే ప్రేత్యభావేఽపినతైఃస్యాత్ సహ సంగమః.
తమేవం వాదినం శేషం పితామహ ఉవాచ హ
జానామి శేష సర్వేషాం భ్రాతౄణాం తేవిచేష్టితమ్.
మాతుశ్చాప్యపరాధాద్వై భ్రాతౄణాం తే
మహద్భయం

కృతోఽత్ర పరిహారశ్చ పూర్వమేవ భుజంగమ.
భ్రాతౄణాం తవ సర్వేషాం న శోకం కర్తుమర్హసి
వృణీష్వ చ వరం మత్తః శేషయత్తేఽభికాంక్షితమ్.
దాస్యామి హి వరం తేఽద్యప్రీతిర్మే పరమాత్వయి
దిష్ట్యా బుద్ధిశ్చ తే ధర్మే నివిష్టా పన్నగోత్తమ.
భూయో భూయశ్చ తే బుద్ధిర్ధర్మే భవతు సుస్థిరా.
ఏష ఏవ వరో దేవ కాంక్షితో మే పితామహ
ధర్మే మే రమతాం బుద్ధిః శమే తపసి చేశ్వర.
ప్రీతోఽస్మ్యనేన తే శేషదమేన చ శమేన చ
త్వయా త్విదం వచః కార్యం మన్నియోగా
త్ప్రజాహితం.
ఇమాం మహీం శైలవనోపపన్నాం
ససాగర గ్రామ విహార పత్తనాం
త్వం శేష సమ్యక్ చలితాం యథావత్
సంగృహ్య తిష్ఠస్వ యథాచలా స్యాత్.
యథాహ దేవో వరదః ప్రజాపతి
ర్మహీపతిర్భూతపతిర్జగత్పతిః
తథా మహీం ధారయితాస్మి నిశ్చలాం
ప్రయచ్ఛ తాం మే శిరసి ప్రజాపతే.
అధోమహీం గచ్ఛ భుజంగమోత్తమా
స్వయం తవైషా వివరం ప్రదాస్యతి
ఇమాం ధరాం ధారయతా త్వయాహి మే
మహత్ప్రియం శేష కృతం భవిష్యతి.
తథైవకృత్వా వివరం ప్రవిశ్య స
ప్రభుర్భువో భుజగవరాగ్రజః స్థితః
బిభర్తి దేవీం శిరసా మహీ మిమాం
సముద్రనేమిం పరిగృహ్య సర్వతః.
శేషోఽసి నాగోత్తమ ధర్మదేవో
మహీమిమాం ధారయసే యదేకః
అనంతభోగైః పరిగృహ్య సర్వాం
యథాహమేవం బలభిద్యథావా.
అధోభూమావసత్యేవంనాగోఽనన్తః ప్రతాపవాన్
ధారయన్ వసుధామేకః శాసనాద్బ్రహ్మణో విభుః.
సుపర్ణం చ సహాయం వై భగవానమరోత్తమః
ప్రాదాదనన్తాయ తదా వైనతేయం పితామహః.
అనన్తే చ ప్రయాతేతు వాసుకిః సుమహాబలః
అభ్యషిచ్యత నాగైస్తు దైవతైరివవాసవః

36 వ అధ్యాయం సమాప్తం

అతడు ముందుగానే తపస్సుకోసం వెళ్ళిపోయాడు. నియమనిష్ఠలతో గంధమాదన సమీపంలో ఉన్న బదరికాశ్రమం వద్ద తపస్సు సాగిస్తున్నాడు.

అక్కడ కొంతకాలం ఉండి గోకర్ణపుష్కర క్షేత్రాలలోనే కాక హిమాలయ ప్రాంతాలలో కూడా చరించి పవిత్రప్రదేశాలలో పుణ్యతీర్థాలలో ప్రశాంతంగా ఏకాంతవాసం చేస్తూ తపస్సు కొనసాగించుకుంటున్నాడు.

ఆ తపోదీక్షలో శేషుని శరీరం శుష్కించిపోతున్నది. మాంసం తరిగిపోయింది. చర్మం వాడిపోయింది. నాడులు సన్నగిల్లాయి. సత్యసంకల్పం సంయమనదీక్ష కవచాలుగా ఉన్న శేషుని అచంచల స్థితి బ్రహ్మలోకాన్ని కదపగా బ్రహ్మ స్వయంగా వచ్చి— నాగపురుషా! నీ తపస్సు తీవ్రమయ్యేకొద్దీ లోకాలు ఊగిసలాడుతున్నాయి. లోకకళ్యాణార్థం జీవయాత్ర సాగించవలసినవాడవు ఏ మహోద్దేశంతో నువ్వు ఈ దీక్ష స్వీకరించావో చెప్పు— అనగా శేషుడు అభివాదాలర్పించి—

మహాప్రభూ! నాసోదరులందరూ ఒకరితో ఒకరు కలహించుకుంటూ ఉంటే చూడలేక వారి విద్వేషాగ్నుల మధ్య చరించలేక నేనీ ప్రకారంగా వచ్చేశాను. ఆ కశ్మలమధ్యంలో ఒక్క క్షణంకూడా నేను ఉండలేను. నన్ను అనుగ్రహించండి. నా సోదరులు వినతనూ ఆమె బిడ్డల్నీ మరీ ద్వేషిస్తున్నారు. ఆకాశగమనం కల గరుత్మతుండు మా సోదరుడే కదా. అతనంటే మా వాళ్ళ కసలు పడదు. మా తండ్రి కశ్యపుడు గరుత్మంతునికి అత్యంత బలశక్తులు ప్రసాదించారు. అటువంటి వానితోనే విరోధం తెచ్చుకున్నారు. ఏమయినా ఆ పరస్పర కలహాలమధ్య నేను ఉండలేను. ఈ తపస్సుతోనే నా శరీరాన్ని త్యజిస్తాను. అందువల్ల మరణానంతరమైనా వారికీ నాకూ సమాగమం లేకుండా ఉంటుంది.

శేషుని సంకల్పం విని బ్రహ్మ— నేను నీ సోదరులందరి దుర్మార్గాలూ ఎరుగుదును. నీ తల్లి మాటను వ్యతిరేకించిన కారణంగా వారందరూ మహాప్రమాదంలో పడబోతున్నారు. అయితే ఆ అపాయంనుండి తప్పించుకునే ఉపాయాన్నికూడా నేను సిద్ధంగా ఉంచాను. అందుచేత నువ్వు వారి గురించి విచారించకు. నీ అభీష్టవరం కోరుకో. నీ యందు నాకున్న అభిమానంవల్ల నీకు వరం అనుగ్రహిస్తున్నాను. ధర్మదీక్షాబద్ధమైన నీ బుద్ధి నీకు సర్వశుభాలనూ చేకూరుస్తుంది. ఆ ధర్మమార్గమే నీకు రక్ష— అన్నాడు.

బ్రహ్మ వాక్కులు విని— పితామహా! నా బుద్ధి సర్వదా ధర్మనిష్ఠమైన మనోనిగ్రహంతో తపోదీక్ష సాగించేటట్లు నాకు వరం అనుగ్రహించు— అని శేషుడు కోరగా— నీ ఇంద్రియసంయమనం మనోనిగ్రహం నాకు సంతోషంగా ఉన్నాయి. అయితే లోకకళ్యాణార్థం ప్రజాశ్రేయస్సుకోసం నువ్వు ఒక్క పని చెయ్యాలి. సాగరపర్వతారణ్యపట్టణాలతోసహా ఈభూమి అప్పుడప్పుడు చలిస్తూ ఉంటుంది. అటువంటి ఉపద్రవాలు రాకుండా నువ్వు దీన్ని మోస్తూ ఉండాలి— అని బ్రహ్మ ఆజ్ఞాపించగా శేషుడు అంగీకరిస్తూ— ప్రజాపతీ! సర్వభూతకోటికీ అధీశులైన మీ ఆజ్ఞను అక్షరాలా పాలిస్తాను. ఈభూమిని నాశిరస్సుమీద ఉంచండి— అనగా బ్రహ్మ అటువంటిదేమీ కాదంటూ శేషునే స్వయంగా భూమికిందకు వెళ్ళమన్నాడు. భూమి బిలరూపంలో దారి యిస్తుందనీ, ఆ ప్రకారంగా

## ముప్పదిఏడవ అధ్యాయము

మాతుః సకాశాత్ తం శాపం శ్రుత్వా వై పన్నగోత్తమః
వాసుకిశ్చిన్తయామాస శాపోఽయం నభవేత్ కథం.
తతః స మన్త్రయామాస భ్రాతృభిః సహసర్వశః
ఐరావతప్రభృతిభిః సర్వధర్మపరాయణైః.
అయంశాపో యథోద్దిష్టో విదితం వ స్తథానఘాః
తస్య శాపస్య మోక్షార్థం మన్త్రయిత్వా యతామహే.
సర్వేషా మేవ శాపానాం ప్రతిఘాతో హి విద్యతే
నతు మాత్రాభిశప్తానాం మోక్షః క్వచన విద్యతే.
అవ్యయస్యాప్రమేయస్య సత్యస్య చ తథాగ్రతః
శప్తా ఇత్యేవమే శ్రుత్వా జాయతే హృదివే పథుః.
నూనం సర్వవినాశోఽయ మస్మాకం సముపాగతః
నహ్యేతాం సోఽవ్యయో దేవః శపన్తీమ్ ప్రత్యషేధయత్.
తస్మాత్ సమ్మన్త్రయామేఽద్య భుజంగానామనామయమ్
యథాభవేద్ధిసర్వేషాంమానఃకాలోఽత్యగాదయం.
సర్వ ఏవహి నస్తావద్ బుద్ధిమన్తో విచక్షణాః
అపిమన్త్రయమాణాహి హేతుం పశ్యామమోక్షణే.
యథా నష్టం పురాదేవా గూఢమగ్నిం గుహాగతమ్
యథా న యజ్ఞో న భవేద్ యథావాపి పరాభవః
జనమేజయస్య సర్పాణాం వినాశకారణాయవై.
తథేత్యుక్త్వా తతస్సర్వే కాద్రవేయాః సమాగతాః
సమయం చక్రిరే తత్ర మన్త్రబుద్ధి విశారదాః.
ఏకేతత్రాబ్రువన్ నాగావయం భూత్వాద్విజర్షభాః
జనమేజయంతు భిక్షామో యజ్ఞస్తేన భవేదితి.
అపరేత్వబ్రువన్ నాగాస్తత్ర పండిత మానినః
మంత్రిణోఽస్యవయం సర్వేభవిష్యామఃసుసమ్మతాః
సనః ప్రక్ష్యతి సర్వేషు కార్యేష్వర్థ వినిశ్చయమ్
తత్ర బుద్ధింప్రదాస్యామో తథా యజ్ఞోనివర్త్స్యతి.
సనో బుద్ధిమతాన్ రాజా బుధ్వా బుద్ధిమతాంవరః
యజ్ఞార్థం ప్రక్షతివ్యక్తంనేతివక్ష్యామహేవయమ్.
దర్శయన్తో బహూన్ దోషాన్ ప్రేత్యచేహాచ దారుణాన్
హేతుభిఃకారణైశ్చైవ యథా యజ్ఞోభవేన్ననః.
అథవా య ఉపాధ్యాయః క్రతౌ స్తస్య భవిష్యతి
సర్పసత్రవిధానజ్ఞో రాజకార్యహితే రతః.
తం గత్వా దర్శతాం కశ్చిద్ భుజంగః సమరిష్యతి
తస్మిన్ మృతే యజ్ఞకారే క్రతుస్స న భవిష్యతి.
యేచాన్యే సర్పసత్రజ్ఞా భవిష్యన్త్యస్య చర్త్విజః
తాంశ్చ సర్వాన్ దశిష్యామః కృతమేవం భవిష్యతి.
అపరే త్వబ్రువన్ నాగా ధర్మాత్మానో దయాలవః
అబుద్ధిరేషా భవతా బ్రహ్మహత్యా నశోభనం.
సమ్యక్సద్ధర్మమూలా వై వ్యసనే శాన్తిరుత్తమా
అధర్మోత్తరతానామ కృత్స్నం వ్యాపాదయేజ్జగత్.
అపరే త్వబ్రువన్ నాగాః సమిద్ధం జాతవేదసం
వర్షైర్నిర్వాపయిష్యామోమేఘాభూత్వా సవిద్యుతః.
స్రుగ్భాండం నిశి గత్వా చ అపరే భుజగోత్తమాః
ప్రమత్తానాం హరన్త్వాశు విఘ్న ఏవం భవిష్యతి.
యజ్ఞే వా భుజగాస్తస్మిఞ్ఛతశోఽథ సహస్రశః
జనాన్ దశన్తు వై సర్వే నైవం త్రాసో భవిష్యతి.
అథవా సంస్కృతం భోజ్యం దూషయన్తు భుజఙ్గమాః
స్వేన మూత్రపురీషేణ సర్వభోజ్యవినాశినా.
అపరే త్వబ్రువంస్తత్ర ఋత్విజోఽస్య భవామహే
యజ్ఞవిఘ్నం కరిష్యామో దీయతాం దక్షిణా ఇతి.
వశ్యతాం చ గతోఽసౌ నః కరిష్యతి యథేప్సితం
అపరే త్వబ్రువంస్తత్ర జలే ప్రక్రీడితం నృపమ్.

భూమిని ధరించిన అనంతరం అతనికి శ్రేయస్సు కలుగుతుందన్నాడు. ఆదేసమయంలో సముద్ర పర్వతారణ్యసమేతం భూమిని బ్రహ్మ ఆజ్ఞచేత శిరసా వహించాడు శేషువు. అప్పుడు బ్రహ్మ- నీవు శేషుడవు. ధర్మమే నీకు ఆరాధ్యం. ఇంద్రుడూ నేనూ ఏవిధంగా ధరించగలమో అదేరీతిగా నువ్వు ఈ భూమిని ధరిస్తావు— అన్నాడు.

అధరస్థః శేషుడు ఆప్రకారం ధరిస్తూ పాతాళంలో ఉంటాడు. శేషునికి సహకారంగా గరుత్మంతుని పంపాడు బ్రహ్మ. అప్పుడే నాగరాజ్యానికి మహాబలిష్ఠుడైన వాసుకిని అధిపతిగా చేశారు నాగులు. వాసుకి పట్టాభిషేకోత్సవం వైభవంగా జరిగింది.

36 వ అధ్యాయం సమాప్తం

## ముప్పది ఏడవ అధ్యాయము

కన్నతల్లి శపించినవార్త నాగరాజు వాసుకికి విచారాన్ని కలిగించింది. ఈ శాపంనుండి విముక్తి పొందే ఉపాయాన్ని ఆలోచించడానికి ఐరావతాది సోదర ప్రముఖులను ఆహ్వానించాడు. పాపచింతన లేని సోదరులందరినీ ఉద్దేశించి వాసుకి మాట్లాడుతూ ఏ శాపానికైనా విముక్తి ఉంది. కానీ అమ్మ శపించినదానికి విమోచనోపాయం తోచటంలేదు, మీరంతా తీవ్రంగా యోచించండి. వంశనాశనకరమైన ఈ అపాయంనుండి మనం విముక్తులంకావాలి. అత్యంత ప్రమాదం అతిసన్నిహితభావిలో గోచరిస్తున్నది. సత్యస్వరూపుడైన బ్రహ్మదేవుని సమక్షంలో అమ్మ శపించింది. ఆయనకూడా అమ్మను నివారించడానికి ప్రయత్నించకపోగా ఆమె శాపానికి ఆమోదముద్రవేశాడంటే సర్వనాశనమే మనకు అవశ్యంభావిలా ఉన్నది.

గుహాంతర్గతుడైన అగ్నిని పూర్వకాలంలో దేవతలు అన్వేషించినట్టు మనం ఒకఉపాయాన్ని అన్వేషించాలి. మనసోదరులందరూ ధీశాలులే. కనక తీవ్రంగా యోచించి పరిష్కార మార్గం చూడండి. అద్యతనభావిలో జనమేజయసరిపాలుడు ఆరంభింపబోయే సర్పయజ్ఞం ఎలా ఆపగలం. దానికి సాధనమేమిటి - అని వాసుకి సభాసదులైన సోదరులందర్నీ అవలోకిస్తుండగా కుశలబుద్ధులైన వారంతా ఒక నిశ్చయానికి వచ్చారు.

వారిలో కొందరు లేచి బ్రాహ్మణవేషాలతో జనమేజయుని వద్దకువెళ్ళి ఈ యజ్ఞం చేయడం సమంజసం కాదని చెపుదాం - అనగా మరికొందరు మనం జనమేజయునికి విశ్వాసపాత్రులమైన మంత్రిమండలిగావ్యవహరిస్తే ఆయన మన సలహాకోరి తీరతాడు. ఆసమయంలో మనం మనకార్యానికి అనుకూలంగా ఆయనబుద్ధిని త్రిప్పుకోవచ్చు. మనబుద్ధికుశలతను ప్రకటిస్తుంటే జనమేజయుడు విస్మితుడై తప్పనిసరిగా మనసలహా స్వీకరిస్తాడు. ఆయనకోరగానే ఈ యజ్ఞంవల్ల ఇహపరాలు రెండూ చెడతాయని హేతువులతో యుక్తులతో నివేదిస్తే యజ్ఞం ఆగిపోతుంది - అని మరొక ఉపాయాన్ని కూడా ప్రతిపాదిస్తున్నాయి సర్పాలు.

సర్పయజ్ఞం చేయించగల వానిని మనలో ఒకరం వెళ్ళి కాటువేస్తే ఆయన మరణిస్తాడు. ఆ మరణంతో సర్పయాగం ఆరంభమే కాదు. అలా

గృహమాణీయ బక్షిమః క్రతునేవం భవేన్న సః
అపరే త్వబృవం స్తత్ర నాగాః పండితమానినః.
దశామస్తం ప్రగృహ్యాశు కృతమేపం భవిష్యతి
ఛిన్నం మూలమనర్థానాం మృతేతస్మిన్ భవిష్యతి.
ఏపా నో నైష్ఠకీ బుద్ధిః సర్వేషామిూక్షణశ్రవః
అథ యన్మన్యసే రాజన్ ద్రుతం తత్సంవిధీయతాం.
ఇత్యుక్త్వా సముదైక్షన్త వాసుకిం పన్నగోత్తమం
వాసుకిశ్చాపి సంచిత్య తానువాచ భుజంగమాన్.

నైపావో నైసికీ బుద్ధిర్మతా కర్తుంభుజంగమాః.
సర్వేషామేవ మే బుద్ధిః పన్నగానాం న రోచతే.
కిం తత్ర సంవిధాతవ్యం భవతాం స్యాద్ధితం తు యత్
శ్రేయఃప్రసాధనం మన్యే కశ్యపస్య మహాత్మనః.
జ్ఞాతివర్గస్య సౌహార్దాదాత్మనశ్చ భుజంగమాః
న చ జానాతి మే బుద్ధిః కించిత్కర్తుం వచో హి వః
మయా హీదం విధాతవ్యం భవతాం యద్ధితంభవేత్
అనేనాహం భృశం తప్యే గుణదోషౌ మదాశ్రయౌ.

37 వ అధ్యాయం సమాప్తం

## ముప్పది ఎనిమిదవఅధ్యాయము

సర్పాణాం తు వచః శ్రుత్వా సర్వేషామితి చేతి చ
వాసుకేశ్చ వచః శ్రుత్వా ఏలాపత్రోఽబ్రవీదిదమ్.
న సయజ్ఞోన భవితా న సరాజా తథావిధః
జనమేజయః పాండవేషుయతో స్మాకంమహద్భయం
దైవేనోపహతో రాజన్ యో భవేదిహ పూరుషః
సదైవమేవాశ్రయత్తే నాన్యత్ తత్ర పరాయణమ్.
తదిదం చైవ మస్మాకం భయం పన్నగసత్తమాః
దైవమేవాశ్రియామోఽత్రశృణుధ్వంచనచోమమ
అహం శాపే సముత్సృష్టే సమశ్రౌషం వచస్తదా
మాతురుత్సంగ మారూఢో భయాత్ పన్నగ
సత్తమాః

దేవానాం పన్నగశ్రేష్ఠా స్తీక్ష్ణా స్తీక్ష్ణ ఇతి ప్రభో
పితామహముపాగమ్యదుఃఖార్తానాం మహాద్యుతే.
కాహిలబ్ధ్వాప్రియాన్పుత్రాచ్ఛపేదేవంపితామహ
ఋతే కద్రూం తీక్ష్ణరూపాం దేవదేవ తవాగ్రతః.
దధేతివచస్తస్యా స్త్వయాప్యుక్తం పితామహ
ఏతదిచ్ఛామి విజ్ఞాతుం కారణం యన్న వారితా.
బహవః పన్నగా స్తీక్ష్ణాఘోరరూపా విషోల్బణాః

ప్రజానాం హితకామోఽహంనచవారితవాం స్తదా.
యే దన్దసూకాఃక్షుద్రాశ్చపాపాచారావిషోల్బణాః
తేషాం వినాశో భవితా న తు యే ధర్మచారిణః.
యన్నిమిత్తంచభవితామాక్ష స్తేషాంమహాభయాత్
పన్నగానాం నిబోధత్వం తస్మిన్ కాలే సమాగతే.
యాయావరకులే ధీమాన్ భవిష్యతి మహానృషిః
జరత్కారు రితి ఖ్యాత స్తపస్వీనియతేన్ద్రియః.
తస్య పుత్రో జరత్కారోర్భవిష్యతి తపోధనః
ఆస్తీకోనామ యజ్ఞం స ప్రతిషేత్స్యతి తం తదా
తత్ర మోక్ష్యన్తి భుజగా యే భవిష్యన్తి ధార్మికాః.
స మునిప్రవరో బ్రహ్మన్ జరత్కారు ర్మహాతపాః
కస్యాం పుత్రంమహాత్మానంజనయిష్యతి వీర్యవాన్.
సనామయాం సనామాస కన్యాయాం ద్విజసత్తమః
అపత్యం వీర్యసంపన్నం వీర్యవాన్ జనయిష్యతి.
వాసుకేః సర్పరాజస్య జరత్కారుః స్వసా కల
స తస్యాంభవితాపుత్రః శాపాన్నాగాంశ్చమోక్ష్యతి.
ఏవమస్త్వితి తం దేవాః పితామహ మథాబ్రువన్
ఉక్త్వైవం వచనం దేవాన్ విరించిస్త్రిదివంయయౌ.

కాకపోతే ఆ యాగానికివచ్చే ఋత్విజుల్ని ఆ యాగ విధి తెలిసినవారినికూడా మన విషంతో పరలోక గతుల్ని చేసినా మన అభీష్టం నెరవేరుతుంది - అని కొందరు చెప్పగా దయాళువులైన వారు లేచి — మీదంతా పరమమూర్ఖంగా ఉంది. బ్రహ్మహత్య ఎవరికీ శుభం కాదు. ఆపత్సమయంలోనయినా ధర్మపథాన్ని విడకుండా చేసేదే శాంతికి దారి తీస్తుంది. తనకు కలిగిన ఆపదనుండి విముక్తి పొందడానికి అధర్మమార్గం తొక్కితే అది విశ్వనాశనం కలిగిస్తుంది - అని చెప్పారు.

అప్పుడు మరికొందరు లేచి - అయితే యజ్ఞం ఆరంభించే సమయానికి మనమంతా మేఘాల రూపంలో ఉరుములతో మెరుపులతో బ్రహ్మాండమైన వర్షధారలతో అగ్నికుండాన్ని ఆర్పుదాం. ఆ సమయంలో ఇతర సర్పాలు వెళ్ళి స్రుక్‌స్రువాల్నీ తదితరయజ్ఞసామగ్రినీ హరించుకు వస్తాయి. ఇది మీ కిష్టంకాకపోతే యజ్ఞానికి వచ్చే సదస్యులందర్నీ కాటు వేస్తూంటే సరిపోతుంది. యజ్ఞసంస్కారానికి అవసరమైన సర్వసామగ్రిని మనం కలుషితం చేసినా చాలు. భోజనపదార్థాలు కూడా పాడు చెయ్యాలి - అనగా మరికొందరు లేచి మేం ఆ యజ్ఞంలో ఋత్విజులుగా చేరి మాకు కావలసిన దక్షిణలిమ్మని కోరతాం అప్పుడైనా యజ్ఞవిఘ్నం జరుగుతుంది - అన్నారు.

మరికొందరు బుద్ధిమంతులు జనమేజయుడు జలక్రీడలాడే సమయంలో అతన్ని బంధించి తమ లోకానికి తెచ్చేస్తే ఏ అపాయం ఉండదన్నారు. దానికి పైభావంగా కొందరు - ఇంతఆలోచనదేనికి. మనం జనమేజయునరపాలుని కాటు వేస్తే ఈ అనర్థం అంతా పరిసమాప్తమవుతుంది - అని నాగులందరూ తమతమ బుద్ధికుశలతలను ప్రదర్శించి నాగరాజు యొక్క అభిమతంకోరగా ఆయన పలుకుతున్నాడు :

మీ అందరి ఆలోచనలూ ఆచరించడానికి యోగ్యమైనవి కావు. అయితే మీ అందరికీ శ్రేయస్సు కలుగ జేయటమనేది నావిధి. మన పితృభగవానుడైన కశ్యపుని ప్రార్థించి ఆయన సంకల్పం తెలిసికోవటం మనకు కళ్యాణప్రదం. అంతేకాని మానవజాతిని సోదరులనూ ఉద్ధరించే దృష్టితో మీ అభిప్రాయాలను అమలు జరపడానికి నేను అంగీకరించలేను. మీకు ఏది హితమో అదిచెయ్యడం నా కర్తవ్యం గనకనే ఆలోచిస్తున్నాను. మీ అందరిగుణదోషాల కారణంగా వచ్చే కీర్త్యపకీర్తులకూ నేనే బాధ్యుణ్ణి అవుతాను గదా - అని వాసుకి మౌనం వహించాడు.

37వ అధ్యాయం సమాప్తం

## ముప్పదిఎనిమిదవ అధ్యాయము

సర్పాల అభిప్రాయాలనూ సర్పరాజు ఊహానూ ఆకర్ణించి గ్రహించిన ఏలాపుత్రుడనే పేరుగల నాగప్రముఖుడిలా అంటున్నాడు : సహోదరులందరూ ఆ యజ్ఞం జరగదని భావించడం జరగకూడదని ఆశించడం తగదు. యజ్ఞం జరిగితీరుతుంది. ఆయనను మనమేమీ చెయ్యలేము ఈలోకంలో

గ్రాహయేనం ప్రయత్నేన వాసుకే భగినీం తవ
జరత్కారు రితిఖ్యాతాం తాం తస్మై ప్రతిపాదయ
భైక్షవద్భిక్షమాణాయ నాగానాం భయశాన్తయే
ఋషయే సువ్రతాయైనామేష మోక్షశ్శ్రుతో మయా.
ఏలాపుత్ర వచః శ్రుత్వా తే నాగా ద్విజసత్తమ
సర్వే ప్రహృష్టమనసః సాధుసాధ్విత్యథాబ్రువన్.
తతః ప్రభృతి తాం కన్యాం వాసుకిః పర్యరక్షత
జరత్కారుం స్వసారం వై పరం హర్షమవాప చ.
తతో నాతి మహాన్ కాలః సమతీత ఇవాభవత్
అథ దేవాసురాః సర్వే మమన్థుర్వరుణాలయం.
తత్ర నేత్ర మభూన్నాగో వాసుకిర్బలినాం వరః
సమాప్యైవ చ తత్ కర్మపితా మహముపాగమన్.
దేవా వాసుకినా సార్థం పితామహ మథాబ్రువన్
భగవచ్ఛాపభీతోఽయం వాసుకి స్తప్యతే భృశమ్.
అస్యైతన్మానసం శల్యం సముద్ధర్తుం త్వ మర్హసి
జనన్యాః శాపజం దేవజ్ఞాతీనాం హితమిచ్ఛతః.
హితో హ్యయంసదాస్మాకం ప్రియకారీచనాగరాట్

ప్రసాదం కురు దేవేశ శమయాస్య మనోజ్వరమ్.
మయైవ తద్ వితీర్ణం వై వచనం మనసామరాః
ఏలాపుత్రేణ నాగేన యదాస్యాభి హితం పురా.
తత్ కరోత్వేషనాగేన్ద్రఃప్రాప్తకాలంవచః స్వయమ్
వినశ్యన్తి యే పాపా నతుయే ధర్మచారిణః.
ఉత్పన్నః స జరత్కారు స్తపస్యుగ్రేరతో ద్విజః
తస్యైషభగినీం కాలే జరత్కారుం ప్రయచ్ఛతు.
ఏలాపుత్రేణ యత్ ప్రోక్తం వచనం భుజగేన హ
పన్నగానాం హితం దేవా స్తత్ తథా నతదన్యథా.
ఏతచ్ఛ్రుత్వా తు నాగేన్ద్రః పితామహ వచ స్తదా
సందిశ్య పన్నగాం సర్వాన్ వాసుకిః శాపమోహితః.
స్వసారముద్యమ్య తదా జరత్కారు మృషిం ప్రతి
సర్పాన్బహూన్జరత్కారౌ నిత్యయుక్తాన్
సమాదధత్.

జరత్కారుర్యదాభార్యామిచ్ఛేద్ వరయితుం ప్రభుః
శీఘ్రమేత్య తదాఖ్యేయం తన్నః శ్రేయోభవిష్యతి.

39 వ అధ్యాయం సమాప్తము

## నలుబదియవ అధ్యాయము

జరత్కారురితి ఖ్యాతో యస్త్వయా సూతనందన
ఇచ్ఛామి తదహం శ్రోతుంఋషే స్తస్య మహాత్మనః.
కిం కారణం జరత్కారో ర్నామైతత్ప్రథితం భువి
జరత్కారునిరుక్తిం త్వం యథావద్వక్తు మర్హసి.
జరేతి క్షయమాహు ర్వై దారుణం కారుసంజ్ఞితమ్
శరీరం కారుతస్యాసీ త్తత్సధీమాన్ శనైః శనైః.
క్షపయామాస తీవ్రేణ తపసేత్యత ఉచ్యతే
జరత్కారురితి బ్రహ్మన్ వాసుకే ర్భగినీ తథా.
ఏవముక్తస్తు ధర్మాత్మా శౌనకః ప్రాహస త్తదా

ఉగ్రశ్రవస మామన్త్ర్య హ్యుపపన్నమితి బ్రువన్.
ఉక్తంనామయథాపూర్వంసర్వంతచ్ఛ్రుతవానహమ్
యథా తుజాతో హ్యాస్తీక ఏతదిచ్ఛామి వేదితుమ్
తచ్ఛ్రుత్వా వచనం తస్య సౌతి ప్రోవాచ శాస్త్రతః
సందిశ్య పన్నగాన్ సర్వాన్ వాసుకిః సుసమాహితః
స్వసార ముద్యమ్య తదా జరత్కారుమృషిం ప్రతి
అథ కాలస్య మహతః సమునిః సంశితవ్రతః
తపస్యభిరతో ధీమాన్ సదారాన్ నాభ్యకాంక్షత.
సతూర్ధ్వరేతా స్తపసి ప్రసక్తః

దైవోపహతుడైనవాడు దైవాన్నే శరణువేడాలి. అంతేకాని దైవాన్ని వదలి మనం దేన్ని ఆశ్రయించినా ప్రయోజనంలేదు. ఈనాడు మనకుకలిగిన ఈ కష్టం దైవప్రేరణయే. అమ్మశపించే సమయంలో భయంతో నేను ఆమె వడిలోదూరి ఉండగా దేవతలందరూ బ్రహ్మనుచూసే సంకల్పంతో వచ్చి-స్త్రీలు ఎంత కఠోరహృదయులు - అని వారు బ్రహ్మతో ఇలా అన్నారు - పితామహా, కన్నసంతానాన్ని శపించే స్త్రీ ఈ లోకంలో కద్రువకాక మరెవరయినా ఉన్నదా! మీరుకూడా ఏ విధమైన అభ్యంతరం తెలపక ఆమె శాపానికి ఆమోదాన్ని తెలిబుచ్చారు. దీనికంతకూ ఏదో హేతువుంటుందనిపిస్తోంది— అనగా బ్రహ్మ సమాధానమిస్తున్నాడు :

ప్రమాదకరమైన ఘోరవిషాలుకల భయంకర సర్పాలు ప్రపంచంలో నిండిపోతున్నాయి. వానివల్ల ప్రజలకు ఎంతో హాని కలుగుతుంది.జన లోకకల్యాణార్థం ఆమె శాపాన్ని నేను ఆమోదించాను. అయితే ఒక్కవిషయం ఉన్నది. జనమేజయుడు సాగించబోయే సర్పయాగంలో సర్పజాతి సంపూర్ణంగా నాశనంకాదు. అత్యాచారంగా చరించే భీకర సర్పాలే నశిస్తాయి. మిగినవానికి విముక్తి లభించే విధానం చెపుతాను వినండి.యాయావరవంశంలో తపోదీక్షాసంపన్నుడై లోకవిఖ్యాతినిపొందిన జరత్కారుడనే మునిపుంగవుని పుత్రుడుగా ఆస్తీకుడనే ఉత్తమ పురుషుడు జన్మిస్తాడు. అతనివల్ల జనమేజయుని సర్పయాగం ఆపుచేయబడుతుంది. అందుచేత ధర్మబుద్ధిగల సర్పాలకు ఈశాపం తగలదు — అని బ్రహ్మ చెప్పాడు.

పితామహుని మాటలువిన్న దేవతలు జరత్కారుడు ఎవరిని భార్యగా గ్రహించి ఆస్తీకుని ప్రభవింపజేస్తాడో వివరింపమనగా జరత్కారువు అనే పేరుగల కన్యనే పత్నిగా స్వీకరిస్తాడనీ ఆమె వాసుకి చెల్లెలనీ ఆమెకు ఆస్తీకుడు పుడతాడనీ బ్రహ్మ పలికి తన లోకానికి వెళ్ళిపోయాడు. దేవతలుకూడా సాగిపోయారు — అని ఏలాపుత్రుడు విన్నవిషయాలను విశదీకరించి నాగరాజైన వాసుకి వైపు తిరిగి - మహారాజా! మీ సహోదరి జరత్కారువు. ఆమెను జరత్కారునికిచ్చి వివాహం చేయండి. ఉత్తమవ్రతశీలుడైన ఆయనకు ఈమెను సమర్పించడంవల్ల నాగజాతి శాపవిముక్తి పొందుతుంది. ఇదే మనకు అపాయంలేని ఉపాయం - అని ఏలాపుత్రుడు ఆసనం అలంకరించాడు.

ఏలాపుత్రుని ఉపన్యాసం నాగజాతి హృదయాలను అలరించింది. వారందరూ అతని అభిప్రాయంతో ఏకీభవించగా వాసుకిహృదయం సంతోషతరంగితమైంది. అదిమొదలు వాసుకి తన చెల్లెలిని మరింత ఆదరాభిమానాలతో చూడసాగాడు. ఇలా సాగుతూండగా దేవాసురులు అమృతసాధనకై సాగరమథనం చేయవలసివచ్చి మహాబలిష్ఠుడైన వాసుకిని మందరాచలమనే కవ్వానికి త్రాడుగా చుట్టి తమపని పూర్తిఅయిన అనంతరం అతనితో బ్రహ్మవద్దకు వెళ్ళి కద్రువశాపం కారణంగా నాగజాతి నాశనం కానున్నందున వాసుకిహృదయం వ్యథపడుతున్నదనీ సోదరబాంధవ నాశనం సమీపిస్తున్నదని తెలిసేకొద్దీ ఆ బాధ కంటక సదృశమవుతున్నదనీ అతని కాబాధ తొలగించాలనీ వాసుకి తమకు చేసిన మహోపకారానికే కాక సదా దేవహితాన్నే కోరే అతని హృదయంలోని బాధను తొలగించాలనీ ప్రార్థించారు.

[illegible] కృతాత్మా
[illegible] మహాత్మా
[illegible]
[illegible] కాలే కస్మింశ్చిదేవ తు
[illegible] బ్రహ్మన్ కౌరవవంశజః.
[illegible] ధనుర్ధరవరో యుధి
[illegible] పురాస్య ప్రపితామహః.
మృగాన్ [illegible] వరాహాంశ్చ తరక్షూన్మహిషాం
స్తథా
[illegible] వివిధాన్ వన్యాంశ్చ చార పృథివీపతిః.
స కదాచిన్మృగం విద్ధ్వా బాణేనానతపర్వణా
పృష్ఠతో ధను రాదాయ ససార గహనే వనే.
యథైవ భగవాన్ రుద్రో విద్ధ్వా యజ్ఞమృగందివి
అన్వగచ్ఛత్ ధనుష్పాణిః పర్యన్వేష్టు మితస్తతః.
న హి తేన మృగో విద్ధో జీవన్ గచ్ఛతి వై వనే
పూర్వరూపంతుతత్తూర్ణంసోఽగాత్ స్వర్గగతిం ప్రతి.
పరీక్షితో నరేన్ద్రస్య విద్ధో యన్నష్టవాన్ మృగః
దూరం చాపహృత స్తేన మృగేణ నమహీపతిః.
పరిశ్రాన్తః పిపాసార్త ఆససాదమునిం వనే
గవాంప్రచారేష్వాసీనం వత్సానాం ముఖనిః సృతం
భూయిష్ఠ ముపయుంజానం ఫేనమాపిబతాం పయః
తమభిద్రుత్య వేగేన సరాజా సంశితవ్రతమ్.
అపృచ్ఛద్ ధనురుద్యమ్యతంమునింక్షుచ్ఛ్రమాన్వితః
భోభో బ్రహ్మన్నహం రాజా పరీక్షిదభిమన్యుజః.
మయావిద్ధోమృగోనష్టః కచ్చిత్ తం దృష్టవానసి
సముని స్తం తు నోవాచ కించిన్మౌన వ్రతేస్థితః.

తస్యస్కన్ధేమృతంసర్పం క్రుద్ధో రాజా సమాసృజత్
సముత్క్షిప్య ధనుష్కోట్యా సచైనం సముపైక్షత.
న సకించిదువాచైనం శుభం వా యది వాఽశుభం
స రాజా క్రోధ ముత్సృజ్య వ్యధిత స్తం తథాగతం
దృష్ట్వా జగామ నగరమృషిస్త్వా సీత్ తథైవసః.
నహితం రాజశార్దూలం క్షమాశీలో మహామునిః
స్వధర్మనిరతం భూపం సమాక్షిప్తోఽప్యధర్షయత్.
న హితం రాజశార్దూల స్తథా ధర్మపరాయణం
జానాతి భరతశ్రేష్ఠ స్తతఏన మధర్షయత్.
తరుణ స్తస్యపుత్రోఽభూత్ తిగ్మతేజా మహాతపాః
శృంగీనామ మహాక్రోధో దుష్ప్రసాదో మహావ్రతః.
సదేవం పరమాసీనం సర్వభూత హితే రతమ్
బ్రహ్మాణ ముపతస్థే వై కాలే కాలే సుసంయతః.
సతేన సమనుజ్ఞాతో బ్రహ్మణా గృహమేయివాన్
సఖ్యోక్తః క్రీడమానేన సతత్రహసతా కిల
సంరంభాత్ కోపనోఽతీవ విషకల్పో మునేఃసుతః
ఉద్దిశ్యపితరం తస్య యచ్ఛ్రుత్వా రోషమాహరత్
ఋషిపుత్రేణ ధర్మార్థే కృశేన ద్విజసత్తమ.
తేజస్విన స్తవపితా తథైవ చ తపస్వినః
శవం స్కన్ధేన వహతి మాశృంగిన్ గర్వితోభవ.
వ్యాహరత్స్వృషి పుత్రేషు మాస్మకించిద్ వచోవద
అస్మద్విధేషు సిద్ధేషు బ్రహ్మవిత్సు తపస్విషు.
క్వతే పురుషమానిత్యం క్వతే వాచ స్తథా విధాః
దర్పజాః పితరం ద్రష్టాయ స్త్వంశవధరం తథా.
పిత్రా చ తవ తత్ కర్మనానురూప మివాత్మనః
కృతం మునిజనశ్రేష్ఠ యేనాహం భృశదుఃఖితః.

40 వ అధ్యాయం సమాప్తం

దేవతల ప్రార్థనకు బ్రహ్మ సమాధానమిస్తూ వాసుకిముందు ఏలాపుత్రుడిచేత ఆవాక్యాలు పలికించింది నేనే. నాగరాజు వాసుకి సమయసావకాశాల ననుసరించి తనచెల్లెలి వివాహం చేస్తాడు— అందువల్ల జనమేజయుని యాగంలో దుష్టసర్పాలు నాశనమయాక ఆ యజ్ఞం ఆగుతుంది. అప్పుడే జరత్కారుడు తపోదీక్షలో ఉన్నాడు. స్వల్పకాలంలోనే వాసుకి జరత్కారువును ఆయనవద్ద సేవకు నియోగిస్తాడు.

అందుచేత ఏలాపుత్రుడు చెప్పినదే నాగజాతికి శ్రేయోమార్గం. అతడు చెప్పినదానికి భిన్నంగా ఏ విపరీతమూ జరగదు— అని బ్రహ్మ తన యెదురుగా చెప్పిన వాక్యాలనుకూడా వాసుకి వివరించి తన చెల్లెలిని జరత్కారుమహర్షికి అర్పించాలని చెప్పి ఆ మహర్షిని అన్వేషిస్తూ సర్పసేవకులతో యిలా అన్నాడు: ఏక్షణంలో జరత్కారుమహర్షి బ్రహ్మచర్యదీక్షను వదలి వివాహితుడు కాగోరుతాడో ఆ ఉత్తరక్షణంలో నాకు తెలియబరచండి. ఆయన కళ్యాణమే మనకు కళ్యాణం.

౩౯వ అధ్యాయం సమాప్తం

## నలుబదియవఅధ్యాయము

జరత్కారుడు మహర్షి ప్రపంచంలోనే గాక సర్వప్రపంచంలోనూ అంతటి ప్రఖ్యాతి ఎలా సంపాదించగలిగాడని శౌనకుడు ప్రశ్నించగా సూతుడు యిలా చెప్తున్నాడు— మహర్షులారా! జర అనే శబ్దం క్షయం అనే అర్థాన్నిస్తుంది. కారు దారుణత్వాన్ని సూచిస్తుంది. ఈయన మంచి బలిష్ఠుడై ఉండి తీవ్రతపోదీక్షతో శరీరాన్ని కృశింపజేయటంవల్ల ఆపేరు ఆయనకు వచ్చింది— అనగా శౌనకుడు నవ్వు రాజిల్లెడి మోముతో సూతమహర్షిని ఉద్దేశించి ఆస్తీకోపాఖ్యానం వివరించుమని కోరాడు.

పురాణశాస్త్రాలలో ఉన్న ఆస్తీకోపాఖ్యానం వివరించే సంకల్పంతో సూతుడు గొంతుసవరించి— ఆ ప్రకారంగా నిశ్చయానికి వచ్చిన వాసుకి జరత్కారుని గురించి ఆలోచించసాగాడు— కాలం గడచిపోతున్నది. జరత్కారుని వ్రతతీవ్రత సూది మొనవాసికూడా తగ్గటంలేదు. ఆ తపోదీక్షలో కాలం కర్పూరఖండంలా హరిస్తున్నది.

ఆ మునిచంద్రుని మనస్సు గార్హస్థ్యజీవితంవైపు మొగ్గటంలేదు. నియమపూర్వక వేదాధ్యయనంతో ఊర్ధ్వరేతస్కుడైనాడు. ఆజరత్కారు బ్రహ్మచారి. సర్వేంద్రియాలనూ మనస్సుయొక్క అధీనంలో ఉంచి మనస్సును నిగ్రహించిన ఆపరమతపస్వి ఈ నేల నాలుగు చెరగులా పర్యటించాడు. ఏ ప్రాంతంలోనూ ఆ ఋషిహృదయం స్త్రీ చింతనే రానీయలేదు.

పూర్వకాలంలో కౌరవవంశీయుడైన పరీక్షిత్తు రాజ్యంపాలిస్తూ తన ప్రపితామహుడైన పాండురాజువలెనే వేటయందు ఆసక్తుడై ఒకనాడు వేటకువచ్చి అడవిదున్నలనూ, పులులనూ, సంహరిస్తూ తిరిగి తిరిగి ఒకమృగం బాణందెబ్బ తిని పడిపోక పారిపోతూంటే దాన్ని వెంబడించ సాగాడు

రాజ్ఞా పరిక్షితా తాత మృగయాం పరిధావతా
అవసక్తః పితుస్తేఽద్య మృతః స్కంధే భుజంగమః.
కిం మే పితా కృతం తస్య రాజ్ఞోఽనిష్టం దురాత్మనః
బ్రూహి తత్ కృశ తత్త్వేన పశ్య మే తపసో బలమ్.
సరాజా మృగయాం యాతః పరిక్షిదభిమన్యుజః
ససార మృగమేకాకీ విద్ధ్వా బాణేన శీఘ్రగమ్.
స చాపశ్యన్మృగం రాజా చరం స్తస్మిన్ మహావనే
పితరం తే స దృష్ట్వైవ పప్రచ్ఛానభిభాషిణమ్.
తం స్థాణుభూతం తిష్ఠన్తం క్షుత్పిపాసాశ్రమాతురః
పునః పునర్మృగం నష్టం పప్రచ్ఛ పితరం తవ.
సచ మౌనవ్రతోపేతో నైవ తం ప్రత్యభాషత
తస్య రాజా ధనుష్కోట్యా సర్పం స్కంధే సమాసృజత్.
శృంగిం స్తవ పితా సోఽపి తథైవాస్తే యతవ్రతః
సోఽపి రాజా స్వనగరం ప్రస్థితో గజసాహ్వయం.
శ్రుత్వైవ మృషిపుత్రస్తు శవం కంధే ప్రతిష్ఠితమ్
కోపసంరక్తనయనః ప్రజ్వలన్నివ మన్యునా.
ఆవిష్టః సహి కోపేన శశాప నృపతిం తదా
వార్యుపస్పృశ్య తేజస్వీ క్రోధవేగ బలాత్ కృతః.
యోఽసౌ వృద్ధస్య తాతస్య తథాకృచ్ఛ్రగతస్యహ
స్కంధే మృతం సమాస్రాక్షీత్ పన్నగం రాజకిల్బిషీ.
తం పాప మతిసంక్రుద్ధ స్తక్షకః పన్నగేశ్వరః
ఆశీవిష స్తిగ్మతేజా మద్వాక్యబల చోదితః
స ప్తరాత్రాదితో నేతా యమస్య సదనం ప్రతి
ద్విజానా మవమన్తారం కురూణా మయశస్కరమ్.
ఇతి శప్త్వాతి సంక్రుద్ధః శృంగీ పితర మభ్యగాత్
ఆసీనం గోవ్రజే తస్మిన్ వహన్తం శవపన్నగమ్.
స తమాలక్ష్య పితరం శృంగీ స్కంధగతే నవై
శవేన భుజగే నాసీద్ భూయః క్రోధసమాకులః
దుఃఖాచ్చాశ్రూణి ముముచే పితరం చేదమబ్రవీత్
శ్రుత్వేమాం ధర్షణాం తాత తవ తేన దురాత్మనా.

రాజ్ఞా పరిక్షితా కోపాదశపంత మహం నృపమ్
యథార్హతి సఏవోగ్రం శాపం కురుకులాధమః
సప్తమేఽహాని తం పాపం తక్షకః పన్నగోత్తమః.
వైవస్వతస్య సదనం నేతా పరమదారుణమ్
తమబ్రవీత్ పితా బ్రహ్మం స్తథా కోపసమన్వితం.
న మే ప్రియం కృతం తాత నైషధర్మ స్తపస్వినాం
వయంతస్య నరేంద్రస్య విషయే నివసామహే.
న్యాయతో రక్షితా స్తేన తస్య శాపం న రోచయే
సర్వథా వర్తమానస్య రాజ్ఞో హ్యస్మద్విధైః సదా.
క్షంతవ్యం పుత్రధర్మో హి హతో హన్తి న సంశయః
యది రాజా నసంరక్షేత్ పీడా నః పరమా భవేత్.
న శక్నుమో చరితుం ధర్మం పుత్ర యథాసుఖమ్
రక్ష్యమాణా వయంతాత రాజభిర్ధర్మదృష్టిభిః.
చరామో విపులం ధర్మం తేషాం భాగోఽస్తి ధర్మతః
సర్వథా వర్తమానస్య రాజ్ఞః క్షంతవ్యమేవ హి.
పరిక్షిత్తు విశేషేణ యథాస్య ప్రపితామహః
రక్షత్యస్మాం స్తథా రాజ్ఞ రక్షితవ్యాః ప్రజా విభో.
తేనేహ క్షుధితేనాద్య శ్రాన్తేన చ తపస్వినా
అజానతా కృతం మన్యే వ్రతమేతదిదం మమ.
అరాజకే జనపదే దోషా జాయన్తి వై సదా
ఉద్వృత్తం సతతం లోకం రాజా దండేన శాస్తి వై.
దండాత్ ప్రతిభయం భూయః శాన్తిరుత్పద్యతే తదా
నోద్విగ్నశ్చరతే ధర్మం నోద్విగ్నశ్చరతే క్రియాం.
రాజ్ఞా ప్రతిష్ఠితో ధర్మో ధర్మాత్ స్వర్గః ప్రతిష్ఠితః
రాజ్ఞో యజ్ఞక్రియాః సర్వా యజ్ఞాద్ దేవాః ప్రతిష్ఠితాః
దేవాత్ వృష్టిః ప్రవర్తేత వృష్టేరోషధయః స్మృతాః
ఓషధిభ్యో మనుష్యాణాం ధారయన్ సతతం హితం.
మనుష్యాణాంచ యోధాతా రాజా రాజ్యకరః పునః
దశశ్రోత్రియ సమో రాజా ఇత్యేవం మనురబ్రవీత్.
తేనేహ క్షుధితేనాద్య శ్రాన్తేన చ తపస్వినా

రుమ్రీడు మృగశిరానకుత్రాన్ని ఛేదించి దాన్ని అన్వేషిస్తూ తిరిగినట్లు తిరిగే పరీక్షిన్మహారాజుకి ఆ జంతువు అదృశ్యమైనట్లు తోచింది.

తిరిగితిరిగి అలసినాడు పరీక్షిన్నరపాలుడు. అలసి డస్సిపోయిన్న చక్రవర్తి శమీక ముని ఆశ్రమంవద్దకు వెళ్ళాడు. శమీకుడు మహా తపస్సంపన్నుడు. పాలు తాగే దూడల నోటినుంచి వెలువడే నురగ ఆహారంగా జీవిస్తూ తపశ్చర్యలో ఉన్నాడు. ఆ శమీకుని జేరి పరీక్షిత్తు మహర్షీ! నేను అభిమన్యుని కుమారుడను. నన్ను పరీక్షితుడని పిలుస్తారు. వేటలో నాబాణ ఘాతం తిన్న ఒకానొక మృగం ఇలా పరుగెత్తుకొని వచ్చింది. దాన్ని మీరు చూశారా— అని ప్రశ్నించగా శమీకుడు మౌనవ్రతంలో ఉన్న కారణంగా సమాధానమివ్వలేదు. మహారాజు కన్నులెర్రవారినవి. ఆక్షణంలోనే తన బాణం కొనతో ఒక మృతసర్పాన్ని ఆముని భుజాలమీద పడవేశాడు. ముని మౌనం వీడలేదు. అంతజరిగినా ముని మౌనవ్రతుడుగానే ప్రసన్నవదనుడై ఉండడం చూసిన చక్రవర్తిహృదయం చివుక్కుమన్నది. పశ్చాత్తాపం అతని హృదయాన్ని మెలివేసింది. అలానే రాజధానీ నగరానికి వెళ్ళిపోయాడు. మహర్షి యథాపూర్వం అవిచలిత మనఃకాయుడై ఉన్నాడు. అద్యఃప్రభృతి పరీక్షిత్తు ధర్మపథాన్ని వీడకుండా చరించసాగాడు. అందువల్లనే క్షమాశీలుడైన మహాముని చక్రవర్తిని అవమానపరచలేదు. భరతవంశ శ్రేష్ఠనరపాలుడైన పరీక్షిత్తు ఆ మహర్షిశక్తిని ఎరగకనే అంతపని చేశాడు.

శమీకునికి శృంగి అనే కుమారుడున్నా శృంగికూడా తపస్విలలో అగ్రేసరుడు. దుః తేజస్సంపన్నుడు. అతనికి అపారమైన క్రోధం. తుడైన శృంగిని శాంతింపజేయడం అసాధ్యం, శృంగికూడా సాధ్యమయినంతవరకూ కొ రాకుండానే ఇంద్రియాలను అధీనంలో ఉంచు గురుసేవాతత్పరతతో భూతదయార్ద్ర హృదయ చరిస్తున్నాడు. నాటివరకూ ఆచార్యుల ఆశ్రమం అధ్యయనం సాగించే శృంగి ఆనాడే గురు అభ్యనుజ్ఞతో నిజగృహానికి వస్తూ తనబా స్నేహితుడైన కృశుని కలిశాడు. కృశుడు నవ్వు కొంతసేపు ఏవోవిషయాలు ముచ్చటించి శమీ మహర్షికి జరిగిన అపచారం వివరించాడు. శృ కనుబొమలు ముడివడినవి. కన్నులలో చింతనిప్పు కురిసినవి. శృంగికి కోపంరాకుండా ఉండాలే కా అలా జరిగినట్లయితే వినాశనం తప్పదని తెలు కదా! ఆస్థితిని చూసి కృశుడు శృంగిని మరి ప్రోత్సహించే సంకల్పంతో— శృంగీ! నువ్వు చూ దుర్నిరీక్ష్యమైన తేజోనిధివి. మహా తపోధనుడవ నీతండ్రి సర్పకళేబరాన్ని మోస్తుండగా చూ సహించే నీకు బ్రహ్మవేత్తలయిన ఋషిమండలు మధ్య మాట్లాడే అవకాశంకూడా లేదు. పౌరుష అభిమానం గర్వం అహంకారం నీలో చచ్చి పోయాయా? నిరపరాధి అయిన నీతండ్రికి ఇం అవమానం జరిగితే నీకు చీమకుట్టినట్టుకూడా అనిపి చటంలేదు. ఆదృశ్యాన్ని చూచింది మొదలు నా హృదయం దుఃఖంతో నిండిపోతూన్నది— అని కృశుడు ఆగాడు.

40వ అధ్యాయం సమాప్తం



అజానతా కృతంమన్యే వ్రతమేతదిదం మమ.
కస్మాదిదంత్వయాబాల్యాత్సహసాదుష్కృతం కృతం
నహ్యర్హతి నృపః శాపమస్మత్తః పుత్ర సర్వథా.

41 వ అధ్యాయం సమాప్తము

## నలుబదిరెండవ అధ్యాయము

యద్యేతత్ సాహసం తాత యది వా దుష్కృతం కృతం
ప్రియం వాప్యప్రియం వా తే వాగుక్తాన మృషా భవేత్.
నైవాన్యథేదం భవితా పితరేష బ్రవీమి తే
నాహం మృషాబ్రవీమ్యేవ స్వైరేష్వపి కుతః శపన్.
జానామ్యుగ్రప్రభావం త్వాం తాత సత్యగిరం తథా
నానృతం చోక్తపూర్వం తే నైతన్మిథ్యా భవిష్యతి.
పితా పుత్రో వయః స్థోఽపి సతతం వాచ ఏవ తు
యథా స్యాద్ గుణసంయుక్తః ప్రాప్నుయాచ్చ మహద్యశః.
కిం పునర్బాల ఏవత్వం తపసా భావితః సదా
వర్ధతే చ ప్రభవతాం కోపోఽతీవ మహాత్మనాం.
సోఽహం పశ్యామి వక్తవ్యం త్వయి ధర్మభృతాం వర
పుత్రత్వం బాలతాం చైవ తదావేక్ష్య సాహసం.
సత్వం శమపరో భూత్వా వన్యమాహారమాచరన్
చర క్రోధమిమం హత్వా నైవం ధర్మం ప్రహాస్యసి.
క్రోధో హి ధర్మం హరతి యతీనాం దుఃఖసంచితం
తతో ధర్మవిహీనానాం గతిరిష్టా న విద్యతే.
శమఏవ యతీనాం హి క్షమిణాం సిద్ధికారకః
క్షమావతామయం లోకః పరశ్చైవ క్షమావతాం
తస్మాచ్చ రేథాః సతతం క్షమాశీలో జితేన్ద్రియః
క్షమయాప్రాప్స్యసేలోకాన్ బ్రహ్మణస్సమనన్తరాన్.
మయా తు శమమాస్థాయ యచ్ఛక్యం కర్తుమద్యవై
తత్ కరిష్యామ్యహం తాతప్రేషయిష్యే నృపాయవై
మమపుత్రేణ శప్తోఽసి బాలేనా కృతబుద్ధినా
మమేమాంధర్షణాం త్వత్తః ప్రేక్ష్యరాజన్నమర్షిణా
ఏవమాదిశ్య శిష్యం స ప్రేషయామాస సువ్రతః
పరిక్షితే నృపతయే దయాపన్నో మహాతపాః.
సందిశ్య కుశలప్రశ్నం కార్యవృత్తాన్తమేవ చ
శిష్యం గౌరముఖం నామ శీల వన్తం సమాహితం.
సోఽభిగమ్య తతః శీఘ్రం నరేన్ద్రంకురువర్ధనమ్
వివేశ భవనం రాజ్ఞః పూర్వం ద్వారస్థైర్నివేదితః.
పూజితస్తు నరేన్ద్రేణ ద్విజో గౌరముఖస్తదా
ఆచఖ్యౌ చ పరిశ్రాన్తో రాజ్ఞః సర్వమశేషతః.
శమీకవచనం ఘోరం యథోక్తం మంత్రిసన్నిధౌ
శమీకో నామ రాజేన్ద్ర విషయే వర్తతే తవ.
ఋషిః పరమధర్మాత్మా దాన్తః శాన్తో మహాతపాః
తస్య త్వయా నరవ్యాఘ్రసర్పః ప్రాణైర్వియోజితః
అవసక్తో ధనుష్కోట్యా స్కంధే మౌనాన్వితస్య చ
క్షాంతవాంస్తవ తత్ కర్మ పుత్రస్తస్య న చ క్షమే.
తేన శప్తోఽసి రాజేన్ద్ర పితురజ్ఞాతమద్య వై
తక్షకస్సప్తరాత్రేణ మృత్యుస్తవ భవిష్యతి.
తత్ర రక్షాంకురుష్వేతి పునః పునరథాబ్రవీత్
తదన్యథా న శక్యం చ కర్తుం కేనచిదప్యుత.
న హి శక్నోతి తంయన్తుం పుత్రం కోపసమన్వితమ్
తతోఽహం ప్రేషితస్తేన తవరాజన్ హితార్థినా.
ఇతి శ్రుత్వా వచో ఘోరం స రాజా కురునందనః
పర్యతప్యత తత్ పాపః కృత్వా రాజా మహాతపాః

## నలుబదిఒకటవ అధ్యాయము

కృశుని పలుకులతో శృంగి క్రోధం తారాస్థాయికి చేరుకుంది. తండ్రికి జరిగిన అవమానానికి దుఃఖం అన్యాయంగా అంతచేసిన వానిపై కోపం అతనిహృదయంలో చెలరేగాయి. ఒకక్షణంలో స్వస్థత తెచ్చుకొని మెలమెల్లగా తనతండ్రికి అటువంటి స్థితి ఎందుకు కలిగిందో చెప్పుమని కృశుని అడిగాడు.

పరీక్షిన్మహారాజు తన వేటజంతువును అన్వేషిస్తూ వచ్చి నీతండ్రి బుజాలమీద సర్పకళేబరం పడేశాడు— అని కృశుడు చెప్పగా శృంగి జరిగిన కథను వివరంగా చెప్పమన్నాడు. తనతండ్రి ఏ అపరాధం చేస్తే పరీక్షిత్తు ఆ సాహసానికి దిగాడో వివరిస్తే తనశక్తిని ప్రదర్శిస్తానన్న శృంగికి కృశుడు కథ చెపుతున్నాడు.

శృంగీ! అభిమన్యునికుమారుడైన పరీక్షిత్తు ఒంటరిగా వేటకువచ్చి ఒకఘాతుక మృగంమీద బాణం విసిరాడు. ఆ మృగం అరణ్యంలో ఏ మూలనో అదృశ్యంకాగా చక్రవర్తి దానికోసం వెదకుతూ వచ్చి నీ తండ్రిని అడిగాడు. రెండు మూడుసార్లు నరపాలుడు ప్రశ్నించినా ప్రతివచనం ఈయక మౌనంగా ఉన్న నీతండ్రిపై మృతసర్పాన్ని పడేసి వెళ్ళిపోయాడు. మౌనవ్రతదీక్షలో ఉన్న నీ తండ్రి ఇంకా అలానే కూర్చుని ఉన్నాడు.— అనవిని శృంగి క్రోధపరీతహృదయుడై ఆచమించి చేతిలోనికి జలం తీసికొని— అరుణారుణలోచనాలతో నిరపరాధియై తపోనిష్ఠలో ఉన్న నా ముసలితండ్రి భుజసీమపై చచ్చినపామును పడవేసిన పాపి కురుకుల కళంకి పరీక్షిత్తు ఈనాటికి ఏడుదినాల అనంతరం పన్నగులలో ప్రచండుడైన తక్షకుని విషంవల్ల యమసదనం చేరుతాడు— అని శపించాడు.

అలా శపించి శృంగి ఆశ్రమానికి వచ్చేసరికి గోశాలవద్ద ధ్యాననిష్ఠలో ఉన్న తండ్రి భుజంపై సర్పకళేబరం గోచరించింది. శృంగిదుఃఖం మిన్నంటింది.

పితృపూజ్యా! దురాత్ముడైన ఆ పరీక్షిత్కురుకులాధముడు మిమ్ము అవమానించిన వార్త వినగానే నేటికి ఏడవదినాన నాగలోకేశుడైన తక్షకుని విషంవల్ల మరణం ప్రాప్తించేటట్లు శపించి నా కర్తవ్యాన్ని ఉచితరీతిని నిర్వర్తించాను— అను శృంగి మాటలు విని శమీకుడు నాయనా! తపోనిధులకు క్రోధం తగనిది. పరీక్షిన్నరేంద్రుని ఏలుబడిలో ఉన్న ప్రాంతంలో మనం నిశ్చింతగా తపస్సు చేసికొంటున్నాముగదా! అటువంటి సత్పురుషుని శపించి నాహృదయానికి బాధ కలిగించావు. ఇది నాకే మాత్రం రుచించేదికాదు. ప్రస్తుతం పాలకుడుగా ఉన్న పరీక్షిన్నరపాలునికి సాధుపురుషులెవరూ హాని తలపెట్టరు. ధర్మాన్ని ధ్వంసంచేయ సంకల్పించిన వ్యక్తిని ధర్మం సహించదు. నాయనా! రాజు ధర్మపథాన చరిస్తూ మనల్ని రక్షిస్తున్నాడు కనకనే మనకు ఏ విఘ్నమూలేదు. అరాచకమైన దేశంలో మన ధర్మానుష్ఠానానికి సావకాశంలేదు. ధర్మదృష్టికల ప్రభువులపాలనలోనే సురక్షితంగా ధర్మాచరణ సాగుతుంది. అందుచేతనే ప్రజాపుణ్యంలో రాజుకి భాగం ఉన్నది. ధర్మమూర్తి అయిన పరీక్షిత్తును నువ్వు క్షమించడానికి ఈ హేతువులు చాలు, ఒకవిధంగా చూస్తే పాండురాజే ఆరూపంలో ప్రభవించాడనిపిస్తుంది.

తం చ మాసవ్రతం శ్రుత్వా వనే మునివరం తదా
భూయ ఏవాభవద్ రాజా శోకసంతప్తమానసః.
అనుక్రోశాత్మతాం తస్య శమీకస్యావధార్య చ
పర్యతప్యత భూయోఽపి కృత్వా తత్ కిల్బిషం మునేః.
నహిమృత్యుంతథారాజాశ్రుత్వావైశోఽన్వతప్యత
అశోచదమరప్రఖ్యో యథా కృత్వేహ కర్మతత్.
తతస్తం ప్రేషయామాస రాజా గౌరముఖం తదా
భూయః ప్రసాదం భగవాన్ కరోత్విహ మమేతివై.
తస్మింశ్చ గతమాత్రేఽథ రాజా గౌరముఖే తదా
మంత్రిభిర్మంత్రయామాస సహ సంవిగ్నమానసః.
సమ్మన్త్ర్య మన్త్రిభిశ్చైవ స తథా మన్త్రతత్త్వవిత్
ప్రాసాదం కారయామాస ఏకస్తంభం సురక్షితం.
రక్షాం చ విదధే తత్ర భిషజశ్చౌషధాని చ
బ్రాహ్మణాన్ మంత్రసిద్ధాంశ్చ సర్వతో వై న్యయోజయత్.
రాజకార్యాణి తత్రస్థః సర్వాణ్యేవాకరోచ్చ సః
మంత్రిభి స్సహ ధర్మజ్ఞ స్సమన్తాత్ పరిరక్షితః.
న చైనం కశ్చిదారూఢం లభతే రాజసత్తమమ్
వాతోఽపి నిశ్చరంస్తత్ర ప్రవేశే వినివార్యతే.
ప్రాప్తే చ దివసే తస్మిన్ సప్తమే ద్విజసత్తమః
కాశ్యపోఽభ్యాగమద్ విద్వాం స్తం రాజానం చికిత్సితుమ్.
శ్రుతం హి తేన తదభూద్ యథా తంరాజసత్తమం
తక్షకః పన్నగశ్రేష్ఠో నేష్యతే యమసాదనమ్.
తం దష్టం పన్నగేంద్రేణ కరిష్యేఽహమపజ్వరం
తత్ర మేఽర్థశ్చ ధర్మశ్చ భవితేతి విచిన్తయన్.
తం దదర్శ సనాగేన్ద్ర స్తక్షకః కాశ్యపం పథి
గచ్ఛన్త మేకమనసం ద్విజో భూత్వావయోఽతిగః
తమబ్రవీత్ పన్నగేన్ద్రః కాశ్యపం మునిపుంగవం
క్వ భవాం స్త్వరితో యాతి కిం చ కార్యం చికీర్షతి.
నృపం కురుకులోత్పన్నం పరిక్షితమరిందమం
తక్షకః పన్నగశ్రేష్ఠస్తేజసాద్య ప్రధక్ష్యతి.
తం దష్టం పన్నగేంద్రేణ తేనాగ్ని సమతేజసం
పాండవానాం కులకరం రాజాన మమితౌజసమ్
గచ్ఛామిత్వరితం సౌమ్యసద్యః కర్తుమపజ్వరం.
అహం సతక్షకో బ్రహ్మం స్తం ధక్ష్యామి మహీపతిం
నివర్తస్వ న శక్తస్త్వం మయా దష్టం చికిత్సితుం.
అహంత తం నృపతిం గత్వా త్వయా దష్టమపజ్వరం
కరిష్యామీతి మే బుద్ధిర్విద్యాబలసమన్వితా.

42 వ అధ్యాయం సమాప్తం

## నలుబదిమూడవ అధ్యాయము

యది దష్టం మయేహ త్వం శక్తః కించిచ్చికిత్సితుమ్
తతో వృక్షం మయా దష్టమిమం జీవయకాశ్యప.
పరం మంత్రబలం యత్ తేదద్ దర్శయయతస్వ చ
న్యగ్రోధమేనం ధక్ష్యామి పశ్యతస్తే ద్విజోత్తమ.
దశ నాగేంద్ర వృక్షం త్వం యద్యే త దభిమన్యసే
అహమేనం త్వయా దష్టం జీవయిష్యే భుజంగమ.
ఏవముక్తః స నాగేంద్రః కాశ్యపేన మహాత్మనా
అదశద్ వృక్షమభ్యేత్య న్యగ్రోధం పన్నగోత్తమః
సవృక్షస్తేన దష్టస్తు పన్నగేన మహాత్మనా
ఆశీవిషవిషోపేతః ప్రజజ్వాల సమన్తతః.
తం దగ్ధ్వా స సదంనాగః కాశ్యపం పునరబ్రవీత్
కురు యత్నం ద్విజశ్రేష్ఠ జీవయైనం వనస్పతిమ్.
భస్మీభూతం తతోవృక్షం పన్నగేంద్రస్య తేజసా
భస్మసర్వం సమాహృత్య కాశ్యపో వాక్యమబ్రవీత్

మరొక విశేషం ఏమంటే ఆయన ఆసమయంలో ఆకలిబాధకు దప్పిక తోడుకాగా అలమటిస్తున్నాడు. నేను మౌనవ్రతంలో ఉన్నవిషయమూ ఎరగడు. కనకనే అలా ప్రవర్తించాడని నేను గుర్తించ గలిగాను.

దేశం అరాచకమైనప్పుడు ప్రజలకు ధర్మంపట్టదు. చోరులు నిరంకుశులై చరిస్తారు. వారికి దండభీతి లేదు. చోరభయంతో నిండినప్పుడు ప్రజలకు ధర్మంవైపు దృష్టి పోదు. దండన ఉంటేనే అభయంతో శాంతి ఏర్పడి నిరంకుశ విహారం సన్న గిల్లుతుంది. భయోద్విగ్నహృదయం ఏ ధర్మ కార్యాన్నీ సక్రమంగా నిర్వహించలేదు.

ఇంతేకూ మూలం రాజు. ధర్మంకోసం పాటుపడే రాజువల్ల లోకంలో యజ్ఞాదికాలు జరుగుతూంటాయి వానివల్ల దేవతలు పరితృప్తులై వర్షాలనిచ్చి జీవ నాధారమైన ఆహారాన్ని ప్రసాదిస్తారు. జీవితానికి ఆధారమైన ఆహారానికి ధర్మప్రభువే ఆ ధా ర ం. పదిమంది వేదవేత్తలతో సముడు మహారాజు— అని మనువు చెప్పాడు— అని శమీకుడు తన తనయుని ఆగ్రహాన్ని నివారిస్తూ— వచ్చిన పరీక్షిత్తు ఆకలి దప్పికలలో అలసి ఉన్నాడు. నా మౌనం సంగతీ ఎరగడు. అందుచేత అలా చేశాడు. నువ్వుకూడా విషయాలు తెలిసికోకుండా దుష్కర్మ చేశావు. ధర్మ ప్రభువుని మనం శపించకూడదు— అన్నాడు.

41వ అధ్యాయం సమాప్తం

## నలుబదిరెండవ అ ధ్యా య ము

శాంత గంభీరంగా పలికిన శమీకునికి శృంగి సమాధానం యిస్తున్నాడు: పితృపూజ్యా! నేను దుష్కార్యమే చేశానో, సాహసమే చే శా నో అది మీకు ప్రీతికరమో కాదో నా కవసరంలేదు. నేను ఏనాడూ పరిహాసానికైనా అసత్యం ఆడలేదు. అందుచేత నాశాపానికి తిరుగులేదు. అది అలా జరిగి తీరవలసిందే— అనగా శమీకుడు— నాయనా! నీశక్తి నే నెరుగుదును. నువ్వు ఏనాడూ అసత్యం ఆడవు కనకనే నీవాక్కు యథార్థంగా జరిగి తీరు తుందని తెలుసు. మహత్తరసత్యవాదివి నువ్వు ఇన్నీ తెలిసినా నువ్వు ప్రాజ్ఞుడవని ఎరిగినా కుమా రుడికి తండ్రి సన్మార్గాన్ని ఉపదేశించడం విధి. తండ్రి యిచ్చే సముచితసందేశాన్ని సావధాన చిత్తుడై స్వీకరించేవాడు గుణశీలుడై ఖ్యాతి పొందు తాడు. అందుచేత నీకు ఉపదేశించడం నా కర్తవ్యం. తపోదీక్షతో నువ్వు మహా శక్తిసంపన్నుడ వయావు. యోగశక్తిసంపన్నుని కోపం సామాన్యుని క్రోధం కంటె తీవ్రమైనది. అందులో నీవంటివాని క్రోధం యొక్కశక్తి సామాన్యమా! అయితే నీ క్రోధం ధర్మగ్లానికే సహకరించింది. జరిగిందేదో జరిగింది కానీ ఇప్పుడింకా నీకు కొంతకాలంవరకూ ఉపదేశం చేయాల్సిన అవసరం ఉందని నాకు తెలిసింది. నువ్వు సర్వేంద్రియాలతో పాటు మనస్సుకూడా స్వాధీనంలో ఉంచుకొని ఉత్తమకార్యాలు చేస్తూఉండు. నువ్వు ఎంతోకాలం ఎన్నోక్లేశాలనుభవించి సాధించిన పరమార్థాన్ని క్రోధం నశింపజేస్తుంది. అలా ధార్మిక శక్తిని కోల్పోయిన వ్యక్తి అభీష్టాలు సిద్ధించవు. క్షమాశీలునికి సర్వసిద్ధులూ లభిస్తాయి. ఇహపరా

విద్యాబలం పన్నగేన్ద్ర పశ్య మేఽద్య వనస్పతౌ
అహం సంజీవయామ్యేనం పశ్యతస్తే భుజంగమ.
తతః స భగవాన్ విద్వాన్ కాశ్యపో ద్విజసత్తమః
భస్మరాశీకృతం వృక్షం విద్యయా సమజీవయత్.
అంకురం కృతవాం స్తత్ర తతః పర్ణద్వయాన్వితమ్
పలాశినం శాఖినం చ తథా విటపినం పునః.
తం దృష్ట్వా జీవితం వృక్షం కాశ్యపేన మహాత్మనా
ఉవాచ తక్షకో బ్రహ్మన్ నైతదత్యద్భుతం త్వయి.
ద్విజేన్ద్ర యద్ విషం హన్యా మమ వా మద్విధస్య వా
కం త్వమర్థమభిప్రేప్సు ర్యాసి తత్ర తపోధన.
యత్ తేఽభిలషితం ప్రాప్తుం ఫలం తస్మాన్నృపో
త్తమాత్

అహమేవ ప్రదాస్యామి తత్ తే యద్యపి దుర్లభమ్.
విప్రశాపాభిభూతే చ క్షీణాయుషి నరాధిపే
ఘటమానస్య తే విప్రసిద్ధిః సంశయితా భవేత్.
తతో యశః ప్రదీప్తం తే త్రిషు లోకేషు విశ్రుతమ్
నిరంశురివ ఘర్మాంశు రన్తర్ధానమితో వ్రజేత్.
ధనార్థీ యాస్యహం తత్ర తన్మే దేహి భుజంగమ
తతోఽహం వినివర్తిష్యే స్వాపతేయం ప్రగృహ్య వై.
యావద్ధనం ప్రార్థయసే తస్మాద్ రాజ్ఞస్తతోఽధికమ్
అహమేవ ప్రదాస్యామి నివర్తస్వ ద్విజోత్తమ.
తక్షకస్య వచః శ్రుత్వా కాశ్యపో ద్విజసత్తమః
ప్రదధ్యౌ సుమహాతేజా రాజానాం ప్రతిబుద్ధిమాన్.
దివ్యజ్ఞానః స తేజస్వీ జ్ఞాత్వా తం నృపతిం తదా
క్షీణాయుషం పాండవేయ మపావర్తత కాశ్యపః.
లబ్ధ్వా విత్తం మునివర స్తక్షకాద్ యావదీప్సితమ్
నివృత్తే కాశ్యపే తస్మిన్ సమయేన మహాత్మని.
జగామ తక్షక స్తూర్ణం నగరం నాగసాహ్వయమ్
అథ శుశ్రావ గచ్ఛన్ స తక్షకో జగతీపతిమ్.
మన్త్రై ర్గదై ర్విషహరై రక్ష్యమాణం ప్రయత్నతః

స చిన్తయామాస తదా మాయాయోగేన పార్థివః.
మయా వంచయితవ్యోఽసౌ క ఉపాయో భవేదితి
తతస్తాపసరూపేణ ప్రాహిణోత్ స భుజంగమాన్.
ఫలదర్భోదకం గృహ్య రాజ్ఞే నాగోఽథ తక్షకః
గచ్ఛధ్వం యూయమవ్యగ్రా రాజానం
కార్యవత్తయా
ఫలపుష్పోదకం నామ ప్రతిగ్రాహయితుమ్ నృపమ్
తే తక్షకసమాదిష్టాస్తథా చక్రుర్భుజంగమాః.
ఉపనిన్యుస్తథా రాజ్ఞే దర్భానాపః ఫలాని చ
తచ్చ సర్వం స రాజేంద్రః ప్రతిజగ్రాహ వీర్యవాన్.
కృత్వా తేషాం చ కార్యాణి గమ్యతామిత్యువాచ తాన్
గతేషు తేషు నాగేషు తాపసచ్ఛద్మరూపిషు.
అమాత్యాన్ సుహృదశ్చైవ ప్రోవాచ స నరాధిపః
భక్షయంతు భవంతో వై స్వాదూనీమాని సర్వశః.
తాపసై రుపనీతాని ఫలాని సహితా మయా
తతో రాజా ససచివః ఫలాన్యాదాతుమైచ్ఛత.
విధినా సంప్రయుక్తో వై ఋషివాక్యేన తేన
యస్మిన్నేవ ఫలే నాగ స్తమేవాభక్షయత్ స్వయం.
తతో భక్ష యత స్తస్య ఫలాత్ కృమిరభూదణుః
హ్రస్వకః కృష్ణనయనస్తామ్రవర్ణోఽథ శౌనక.
స తం గృహ్య నృపశ్రేష్ఠః సచివా నిదమబ్రవీత్
అస్తమభ్యేతి సవితా విషాదద్య న మే భయమ్.
సత్యవాగస్తు స మునిః కృమిర్మాం దశతా మయం
తక్షకో నామ భూత్వా వై తథా పరిహృతం భవేత్
తే చైన మన్వవర్తన్త మంత్రిణః కాలచోదితాః
ఏవముక్త్వా స రాజేంద్రో గ్రీవాయాం సంనివేశ్య హ
కృమికం ప్రాహసత తూర్ణం ముమూర్షుర్నష్టచేతనః
ప్రహసన్నేవ భోగేన తక్షకేణ త్వవేష్ట్యత.
తస్మాత్ఫలాద్వినిష్క్రమ్య యత్తద్రాజ్ఞే నివేదితం
వేష్టయిత్వా చ వేగేన వినద్య చ మహాస్వనమ్.
అదశత్ పృథ్వీపాలం తక్షకః పన్నగేశ్వరః.

లలో శుభం కలుగుతుంది. ఓరిమి కలవాళ్లే బ్రహ్మ సిద్ధి పొందుతారు. ప్రస్తుతం నేను పరీక్షిత్తువద్దకు నా శిష్యుని పంపి నీవల్ల జరిగిన శాపవిషయాలు తెలియజేస్తాను— అని శమీకముని గౌరవముఖుడనే శిష్యుని ఆదేశించి పంపాడు.

గౌరముఖుని రాకను ద్వారపాలకుడు చక్రవర్తికి నివేదించి లోపల ప్రవేశపెట్టాడు.

వచ్చిన గౌరముఖునికి అతిథి సత్కారాలు సాగించి విశ్రాంతి తీసికొన్న అనంతరం మంత్రి మండలిమధ్య సుఖాసనం ఇచ్చాడు పరీక్షిన్నరపాలుడు. గౌరముఖుడు మహాసభ అలకించేటట్లు శృంగి శాపవృత్తాంతాన్ని వివరింప సంకల్పించి— మహారాజా! మీ ఏలుబడిలో ఉన్న ప్రాంతంలో శమీకుడనే ధర్మసంపన్నుడైన మహర్షి ఉంటున్నాడు. జితేంద్రియుడైన ఆ ఋషి మౌనవ్రతంలో ఉండగా మీరు ఆయనమీద సర్పకళేబరం ఉంచారు. అయినా ఋషి క్షమాహృదయుడు కనక సహించాడు. కానీ ఆయన కుమారుడు ఈవార్తవిని తన తండ్రికి తెలీకుండానే ఇలా శపించాడు: సర్పజాతిలో ఘోరవిషంకల తక్షకునివల్ల నేటికి ఏడు దినాలలో పరీక్షిత్తు మరణించుగాక— అని. అది విని మహర్షి తనకుమారుని శాంతింపజేయ యత్నించాడు. ఫలించలేదు. ఆ శృంగి వాక్యం అమోఘం. కనక మీరు రక్షణచర్యలు తీసికోగలిగితే తీసికోవచ్చునని చెప్తూ నన్ను శమీకులు పంపారు— అనగా పరీక్షిత్తు తన వల్ల జరిగిన అపచారానికి తీవ్రంగా బాధపడసాగాడు.

దైవీగుణాలలో రాజిల్లే పరీక్షిత్తు హృదయం శాపాన్నిగురించి అంత ఆందోళన పడలేదు; తాను చేసిన అకృత్యమే ఆయనను వేధించసాగింది. కొన్ని క్షణాలాలోచించి— గౌరముఖమహర్షీ! శమీకులకు నాయందు అనుగ్రహం ఉంది కనక వారిని ఇక్కడకు వచ్చి నన్ను అనుగ్రహించమని చెప్పు—అనగా గౌరముఖుడు తిరోహితుడయాడు.

అనంతరం మేధావులయిన మంత్రులతో ఆలోచన సాగించి అత్యున్నతంగా ఒకానొక స్తంభాన్ని దానిమీద సౌధాన్ని నిర్మింపజేశారు. ఆ ఒంటిస్తంభపు మేడకు కావలసిన అన్ని రక్షణలూ ఏర్పాటయాయి. ఆసౌధంలో ఉండి రాజకార్యాలన్నీ సాగిస్తున్నాడు. గాలి దూరడానికి కూడా శక్యం కానివిధంగా నిర్మింపబడింది ఆసౌధం.

ఆరురోజులు గడిచాయి. ఏడవరోజు రానే వచ్చింది. మంత్రశాస్త్రనిష్ణాతుడైన కాశ్యపుడనే విప్రవరుడు మహారాజుకి అపాయం రాకుండా చికిత్స చేసే సంకల్పంతో ఆనాటికే వస్తున్నాడు. తక్షకుని విషానికి విరుగుడు వేసి ప్రభువును బ్రతికించాలనే స్థిరచిత్తంతో వస్తున్నాడు. తన్మూలంగా రాజసత్కారమే కాక ధర్మదృష్టికల ప్రభువును బ్రతికించిన పరమార్థంకూడా ఉంటుందని నిశ్చయించుకుని తదేకదీక్షతో హస్తినాపురివైపు సాగే కాశ్యపునికి దారిలో తక్షకుడు వృద్ధబ్రాహ్మణ రూపంలో యెదురుపడి— మహానుభావా! ఇంత శీఘ్రంగా ఎక్కడికి వెడుతున్నారు— అని అడిగాడు.

పాండవ వంశోద్ధారకుడైన పరీక్షిన్నరపాలుని వద్దకు వెడుతున్నాను. ఈరోజునే తక్షకుడనే నాగేంద్రుడు ఆ మహారాజును తన ఘోరదంష్ట్రలతో కాటువేస్తాడు. ఆ సమయంలో నా మంత్రశక్తిని ప్రదర్శించి ఆయనను జీవింపజేస్తాను— అనగా తక్షకుడు నవ్వుతూ— వెర్రివాడా! నేనే ఆ తక్షకుణ్ణి. నా విషానికి విరుగుడు లేదు. అతిఘోరమైన విషం నాది— అన్నాడు.

## నలుబదినాలుగవ అధ్యాయము

తే తథా మంత్రిణో దృష్ట్వా భోగేన పరివేష్టితం
విషణ్ణవదనాః సర్వే రురుదుః భృశదుఃఖితాః.
తం తు నాదం తతః శ్రుత్వా మంత్రిణ స్తే ప్రదు
దుద్రువుః
అపశ్య న్త తథా యా న్తమాకాశే నాగమద్భుతమ్
సీమ న్త మివ కుర్వాణం నభసః పద్మవర్చసమ్
తక్షకం పన్నగశ్రేష్ఠ భృశం శోకపరాయణాః.
తతస్తు తే తద్ గృహమగ్నినాఽఽవృతం
ప్రదీప్యమానం విషజేన భోగినః
భయాత్ పరిత్యజ్య దిశః ప్రపేదిరే
పపాత రాజాశనితాడితో యథా.
తతో నృపే తక్షకతేజసా హతే
ప్రయుజ్య సర్వాః పరలోకసత్క్రియాః
శుచిర్ద్విజో రాజపురోహిత స్తదా
తథైవ తే తస్యనృపస్య మంత్రిణః
నృపం శిశుం తస్య సుతం ప్రచక్రిరే
సమేత్య సర్వే పురవాసినో జనాః
నృపం యమాహు స్తమమిత్రఘాతినం
కురుప్రవీరం జనమేజయం జనాః.
స బాల ఏవార్యమతిర్నృపో త్తమః
సహైవ తై రచంత్రి పురోహితైస్తదా
శశాస రాజ్యం కురుపుంగవాగ్రజో
యథాస్య వీరః ప్రపితామహా స్తథా.
తతస్తు రాజానమమిత్రతాపనం
సమీక్ష్య తే తస్య నృపస్య మంత్రిణః
సువర్ణవర్మాణముపేత్య కాశిపం
వపుష్టమార్థం వరయాంప్రచక్రముః.
తతః స రాజా ప్రదదౌ వపుష్టమాం
కురుప్రవీరాయ పరీక్ష్య ధర్మతః
న చాపి తాం ప్రాప్య ముదాయుతోఽభవ
న్న చాన్య నారీషు మనోదధే క్వచిత్.
సరః సు ఫుల్లేషు వనేషు చైవ హి
ప్రసన్నచేతా విజహార వీర్యవాన్
తథా స రాజన్యవరో విజహ్రివాన్
యథోర్వశీం ప్రాప్య పురాపురూరవాః.
వపుష్టమా చాపి వరం పతివ్రతా
ప్రతీత రూపా సమవాప్య భూపతిమ్
భావేన రామా రమయాంబభూవ సా
విహార కాలేష్వవరోధసుందరీ.

**44 వ అధ్యాయం సమాప్తము**

## నలుబదిఅయిదవ అధ్యాయము

ఏతస్మిన్నేవ కాలే తు జరత్కారుర్మహాతపాః
చచార పృథివీం కృత్స్నాం యత్రసాయంగృహో
మునిః.
చరన్ దీక్షాం మహాతేజా దుశ్చరామకృతాత్మభిః
తీర్థేష్వాప్లవనం కృత్వా పుణ్యేషు విచచార హ.
వాయుభక్షో నిరాహారః శుష్యన్నహరహర్మునిః
స దదర్శ పితౄన్ గర్తే లంబమానానధోముఖాన్.
ఏకత న్త్వవశిష్టం వై వీరణ స్తంబమాశ్రితాన్
తం తన్తుం చ శనై రాఖుమాదదానం బిలేశయం.
నిరాహారాన్ కృశా న్దీనాన్ గర్తేస్వత్రాణమిచ్ఛతః

కాశ్యపుడు మురుగగోరుడై — తక్షకా! ఏటువంటి యంలో సందేహంలేదు— అన్నాడు.
విషాన్నయినా దించివెయ్యగల శక్తి నాకున్నది. అనిషు

42 వ అధ్యాయం సమాప్తం

## నలుబదిమూడవ అధ్యాయము

కాశ్యపుని మాటలు విని తక్షకుడు తన విషంతో భస్మమయ్యే ఈవృక్షాన్ని పునరుజ్జీవింపజేసినట్లయితే ఆ మంత్రబలం గ్రహిస్తాననగా కశ్యపుడు అంగీకరించాడు. తక్షకనాగేంద్రుడు సమీపంలోని విశాల వటవృక్షాన్ని కాటువేశాడు. వేసినక్షణంలో అది ప్రజ్వలిత జ్వాలల్లో భస్మమైపోయింది.

భస్మాకృతిలో ఉన్న ఆమఱ్ఱిచెట్టును కాశ్యపుడు తన మంత్రప్రభావంతో పునరుజ్జీవింపజేశాడు. అది ముందుగా అంకురించింది. అనంతరం పల్లవించింది. క్షణాలలో అది శాఖోపశాఖలతో యథాపూర్వస్థితికి వచ్చింది. అది చూసి తక్షకుడు— బ్రహ్మవేత్తా! దివ్యమంత్రశాస్త్రజ్ఞుడవైన నీకు ఇదొక విశేషకార్యం కాదు. అయితే నువ్వీ విద్యతో మాశక్తిని ధ్వంసం చేయాల్సిన అవసరం ఏమిటి? పరీక్షిత్తు విప్రశాపగ్రస్తుడయాడు. అతని ఆయుర్దాయంకూడా చెల్లిపోయింది. అటువంటిచోట నీవిద్య ఫలించకపోతే ఇతఃపూర్వం నువ్వు సాధించినకీర్తికూడా పోతుంది. కిరణకాంతిని కోల్పోయిన సూర్యునివలె అవుతావు. నీ విద్యవల్ల నువ్వు ఆ మహారాజుదగ్గరనుంచి ఏం పొందగోరుతున్నావో చెప్పు. అది నేనే యిస్తాను- అన్నాడు.

నేను ధనార్థినై వెడుతున్నాను. అది నువ్వు ఇవ్వగలిగితే నేను వచ్చినదారినే వెళ్ళిపోతాను—అని కాశ్యపు డనగా తక్షకుడు సమ్మతించాడు. కానీ కాశ్యపుని బుద్ధి ఒక్కక్షణం ఆలోచించింది. దివ్యజ్ఞానసంపన్నుడైన కాశ్యపుడు తన శక్తితో పరీక్షిన్మహారాజుయొక్క భవిష్యత్తును చూశాడు. తక్షకుడు చెప్పినట్లు ఆ మహారాజు ఆయుర్దాయం చెల్లిపోయింది. ఇంక దానికోసం ప్రయత్నించటంకంటె తక్షకుని ఊహనే అంగీకరించడం శ్రేయస్కరమనుకున్నాడు. అనుకుంటూనే తక్షకుడు ఇచ్చే ధనం తీసికొని గృహోన్ముఖుడయాడు. ఇటు తక్షకుడు హస్తినాపురంలో ప్రవేశిస్తూనే పరీక్షిన్మహారాజు చేసికొన్న ఏర్పాటులన్నీ గ్రహించాడు.

అనంతరం తన కార్యక్రమాన్ని గురించి ఆలోచించి తక్షకుడు కొందరు నాగులను కామరూపాలతో పరీక్షిత్తువద్దకు దర్భలు ఫలాలు తీసికొని వెళ్ళమన్నాడు. మీరు మహారాజుదగ్గరకు వెళ్ళి జాగ్రత్తగా ఈ ఫలాలర్పించాలి—అని మరోసారి హెచ్చరించాడు. వారు అక్షరశః ఆ ఆజ్ఞను పాలించారు. పరీక్షిత్తు వారందరికీ ఉచితసత్కారాలు జరిపించి వారికి సెలవిచ్చి మంత్రులతోసహా ఆ ఫలాలను అరగించబోతున్న సమయంలో బ్రాహ్మణ విధి వచనాలవల్ల ఏ ఫలంలో తక్షకుడు సూక్ష్మకీటక రూపంలో ఉన్నాడో అదేఫలం ఆయన చేతికి వచ్చింది. రాగిరంగుదేహంతో నల్లని కళ్ళతో ఉండే చిన్నికీటకంలా ఉన్న దానిని పరీక్షిత్తు చేత్తో తీసి— ఋషి శపించిన ఏడవదినం గడచిపోతున్నది.

ఆయనసేవకు గంధర్వాప్సరోభామినులు అనుక్షణం వేచి ఉండేవారు.

ఆరాజధానీనగర సమీపంలో శుక్తిమతీనది ప్రవహిస్తున్నది. దాని పరిసరాలలో కామరూప శక్తిగల కోలాహలపర్వతం ఆ నదీప్రవాహాన్ని అడ్డగించింది. అదిచూసి ఉపరిచరుడు తనపాదంతో ఆపర్వతాన్ని తన్నగా అది తునకలై పడింది. నది తిరిగి ప్రవహించసాగింది. ఆ దివ్యనదీగర్భం నుండి కోలాహలుడు ఒక కన్యనూ బాలునీ ప్రభవింపజేశాడు. తన గతికి అవరోధం తొలగించిన కృతజ్ఞతతో శుక్తిమతి ఆబిడ్డలను ఉపరిచరునికి అర్పించింది. ఆబాలుని పరాక్రమం చూసి వసురాజర్షి అతనిని సేనాపతిగా నియోగించాడు. ఆ కన్యను భార్యగా గ్రహించాడు. ఆమెపేరు గిరిక.

దాంపత్యజీవితం సాగించే గిరిక ఋతుస్నాతయై భర్తను చేరింది. ఆమె ముఖంలో మాతృత్వవాంఛ మసలుతున్నది. పితృదేవతలు వసువుకి అదే సమయంలో ఘాతుకమృగాలను హింసించమని ఆజ్ఞయిచ్చారు.

సర్వశుభలక్షణలక్షితాంగియై లక్ష్మీదేవిలాఉన్న ఆమెమీది కామం అరికట్టి పితృదేవతల ఆజ్ఞానుసారం వేటకు వెళ్ళాడు వసువు. చైత్రరథవనంలా ఉన్న అడవిలో వేట సాగిస్తున్నాడు.

మాధవీ రసాల చంపక పున్నాగ కరవీర పాటల అశోక అర్జున చందన నారికేళ తరుసంతతుల పుష్పఫలశోభతో కోకిలల పంచమస్వరాలతో తుమ్మెదలు ఝుంకారాలతో ఆవనం రమ్యంగా ఉన్నది. మహారాజు మనసులోని మన్మథభావ మేఘాలకు ఆ వసంతశ్రీ సముపేత వనశోభ ఉద్దీపన విభావశీతలవాయువైనది. ఆ క్షణంలో గిరికాసందర్శనం అపేక్షించి తిరుగులాడుతూ అరుణపల్లవ శోభతో రక్తారుణ పుష్పగుచ్ఛాలతో అలరారే అశోకతరుచ్ఛాయలో మకరంద వాసనలను ఆస్వాదిస్తూఆసీనుడయాడు. ఆయన హృదయంలోని ఆరాటం అంతకంతకు అధికమవుతూన్నది. విభావానుభావవ్యభిచారీసంయోగం జరిపి ఇంద్రియస్ఖలనమైంది.

మహారాజు మనసు మనసులోకి వచ్చింది. అమోఘమైన వీర్యం వృథాకారాదని దానిని ఒక ఆకులోకి తీసి సంతానోత్పత్తికి యోగ్యంగా అభిమంత్రించి తన విమానసమీపంలో ఉన్న గ్రద్దను చేరి— సౌమ్యుడా! నువ్వు ఈ వీర్యం నాభార్యకు అందజెయ్యి. ఆమె ఋతుస్నాతయై ఉంది— అన్నాడు. రాజర్షి ఆజ్ఞానుసారం ఆ వీర్యం తీసికొని గ్రద్ద ఆకాశమార్గాన వెడుతూండగా మరొకగ్రద్ద మాంసభ్రమతో దానిమీద పడింది. ఆ రెండూ పోరాడే సమయంలో రాజర్షి వీర్యం యమునా నదిలో పడ్డది.

బ్రహ్మశాపంవల్ల చేపరూపంలో ఉన్న అద్రిక అనే గంధర్వకాంత ఆ వీర్యం ఆరగించింది. పదవ మాసం రాబోతూండగా అది వల్లెవాళ్ళ వలలో చిక్కింది. వారుదాన్ని చీల్చారు. ఒక బాలుడూ బాలికా బైటపడగా ఆశ్చర్యచకితులై వారిని మహారాజుకు సమర్పించారు. ఆ బాలుడేమత్స్యుడు అనే నామంతో ప్రఖ్యాతి పొందాడు.

అదేక్షణంలో అద్రిక శాపవిముక్తి పొందింది. ఇద్దరు మనుష్యులను ప్రసవించిన ఉత్తరక్షణంలోనీకు శాపవిమోచనం జరుగుతుందని బ్రహ్మ చెప్పిన కారణంగా ఆమె అప్సరసగా మారి దివ్యమార్గాన గంధర్వలోకం చేరింది.

మత్స్యగర్భంనుండి ప్రభవించిన కారణాన ఆమె దేహంనుండి మత్స్యగంధం వెలువడేది.

పురోపవాహినీం తస్య నదీం శుక్తిమతీం గిరిః
అకరోత్సచ్చేతనాయుక్తః కామాత్ కోలాహలః కిల
గిరిం కోలాహలం తం తు పదా వసురతాడయత్
నిశ్చక్రామ తతస్తేన ప్రహారవివరేణ సా:
తస్యాం నద్యామజనయన్మిథునం పర్వతః స్వయం
తస్మాద్విమోక్షణాత్ ప్రీతానదీరాజ్ఞే న్యవేదయత్.
యః పుమానభవ త్తత్ర తం స రాజర్షిసత్తమః
వసుర్వసుప్రదశ్చక్రే సేనాపతి మరిందమః.
చకార పత్నీం కన్యాం తు తథా తాం గిరికాం నృపః
వసోః పత్నీ తు గిరికా కామకాలం న్యవేదయత్.
ఋతుకాలమనుప్రాప్తా స్నాతా పుంసవనే శుచిః
తదహః పితరశ్చైనమూచుర్జహి మృగానితి.
తం రాజసత్తమం ప్రీతా స్తదా మతిమతాం వర
స పితౄణాం నియోగం తమనతిక్రమ్య పార్థివః.
చకార మృగయాం కామీ గిరికామేవ సంస్మరన్
అతీవరూపసంపన్నాం సాక్షాత్ శ్రియమివాపరాం
అశోకైశ్చంపకైశ్చూతై రనేకై రతిముక్తకైః
పున్నాగైః కర్ణికారైశ్చ వకుళై ర్దివ్యపాటలైః.
పాటలై ర్నారికేళైశ్చ చందనైశ్చార్జునైస్తథా
ఏతై రమ్యైర్మహావృక్షైః పుణ్యైః స్వాదుఫలై ర్యుతం.
కోకిలాకుల సంనాదం మత్తభ్రమరనాదితం
వసంతకాలే త త్తస్య వనం చైత్రరథోపమం.
మన్మథాభిపరీతాత్మా నాపశ్య ద్గిరికాం తదా
అపశ్యన్ కామసంతప్తశ్చరమాణో యదృచ్ఛయా.
పుష్పసంఛన్న శాఖాగ్రం పల్లవై రుపశోభితం
అశోకం స్తవకైశ్ఛన్నం రమణీయమపశ్యత.
అధస్తాత్ తస్యచ్ఛాయాయాంసుఖాసీనో నరాధిపః
మధుగంధైశ్చ సంయుక్తం పుష్పగంధమనోహరం.
వాయునా ప్రేర్యమాణస్తుధూమ్రాయ ముద
మన్వగాత్

తస్య రేతః ప్రచస్కంద చరతో గహనే వనే.
స్కన్నమాత్రం చ త ద్రేతో వృక్షపత్రేణ
భూమిపః
ప్రతిజగ్రాహ మిథ్యా మే న పతే ద్రేత ఇత్యుత.
ఇదం మిథ్యా పరిస్కన్నం రేతో మే న భవేదితి
ఋతుశ్చ తస్యాః పత్న్యా మే న మోఘః స్యాదితి
ప్రభుః.
సంచింత్యైవం తదా రాజా విచార్య చ పునఃపునః
అమోఘత్వం చ విజ్ఞాయ రేతసో రాజసత్తమః.
శుక్రప్రస్థాపనే కాలం మహిష్యాః ప్రసమీక్ష్యవై
అభిమంత్ర్యాథతచ్ఛుక్రమారాత్ తిష్ఠంతమాశుగం
సూక్ష్మధర్మార్థతత్వజ్ఞో గత్వా శ్యేనంతతోబ్రవీత్
మత్ప్రియార్థమిదంసౌమ్యశుక్రంమమ గృహంనయ.
గిరికాయాః ప్రయచ్ఛాశు తస్యా హ్యార్తవమద్యవై
గృహీత్వా త త్తదా శ్యేనస్తూర్ణముత్పత్య వేగవాన్.
జవం పరమమాస్థాయ ప్రదుద్రావ విహంగమః
తమపశ్యదథాయాంతం శ్యేనం శ్యేనస్తథాపరః.
అభ్యద్రవచ్చ తం సద్యో దృష్ట్వైవామిషశంకయా
తుండయుద్ధమథాకాశే తావుభౌ సంప్రచక్రతుః.
యుధ్యతోరపత ద్రేతస్తచ్చాపి యమునాంభసి
తత్రాద్రికేతి విఖ్యాతా బ్రహ్మశాపద్వరాప్సరా .
మీనభావమనుప్రాప్తా బభూవ యమునాచరీ
శ్యేనపాదపరిభ్రష్టం తద్వీర్యమథ వాసవం.
జగ్రాహ తరసోపేత్య సాద్రికా మత్స్యరూపిణీ
కదాచిదపి మత్సీం తాం బబంధుర్మత్స్యజీవినః.
మాసే చ దశమే ప్రాప్తే తదా భరతసత్తమ
ఉజ్జహ్రురుదరాత్ తస్యాః స్త్రీం పుమాంసం చ
మానుషం.
ఆశ్చర్యభూతం త ద్గత్వా రాజ్ఞేఽథ ప్రత్యవేదయన్
కాయే మత్స్యా ఇమౌ రాజన్ సంభూతౌ మాను
షావితి.

ఆమెను రాజు ఆ పల్లీయులకే యిస్తూ— ఈమె రూపసత్వాలు సత్యమైనవి కనక సత్యవతీనామంతో వ్యవహరింపబడుతూ మీ యింటి బిడ్డగానే ఉంటుంది— అన్నాడు.

అలా మత్స్యగణరాజుతో నచ్చి ఆ సత్యవతి వానినే తండ్రిగా యెంచి యమునా నదిలో పడవ నడుపుతూ ప్రయాణీకులను నది దాటించేది. ఒక నాడు తీర్థయాత్రాపరాయణు డైన పరాశరుడు ఆ మార్గాన వచ్చాడు. వచ్చిన పరాశరుని దృష్టి సత్యవతీ సౌందర్య సుషమాతిశయ రూపంమీద నిలిచిపోయింది. రమణీయకదళికా శోభను తిరస్కరించే ఆమె ఊరువులూ సుందరదరహాస శ్రీరోచిః పూర్ణమైన ఆ అరవిందవదనం సిద్ధులనే సమ్మోహింప జేస్తుంది.

పరాశరుడు వసురాజనందనిపై కన్ను లుంచి ఆ కళ్యాణికి తన హృదయం విప్పిచెప్పాడు. నును సిగ్గుదొంతరల జల్లులాటలో సత్యవతి నదీతటాల వైపు చూపుడువ్రేలు నడిపి ఋషిమండలాన్ని చూపింది. ఆమె ఇంగితం గ్రహించి పరాశరుడు పరిసరాలలో తమస్సు ప్రసరించాడు. సత్యవతి నేత్రాలు ఆశ్చర్యచకిత సుందరము లైనవి. ఆమె మోముపై లజ్జాయవనిక లాస్యమాడుతున్నది.

భగవాన్! నేను కన్యను. నామీద నా తండ్రికే సర్వాధికారాలూ ఉన్నాయి. ఈ విషయం మీ వంటి మహర్షులకు తెలీదని నేనెలా అనుకోను? పైగా ఈ కార్యంవల్ల నా కన్యాత్వం దూషితమవుతుందిగదా. నాడు బంధుజనులకు నా ముఖం ఎలా చూపను. ఈ విషయాలన్నీ ఆలోచించి మీ మనసుకు నచ్చినట్లు చేయండి—అని మధుర మృదులంగా పలికిన ఆ కలంఠిపై ప్రసన్నదృష్టి ప్రసరిస్తూ పరాశరుడు భాషిస్తున్నాడు—ప్రవిత్రదరహాసభాసురవదన శోభాపులకితధారీ! ఇందువల్ల నీ కన్యాత్వం దూషితం కాదు. ఆ భయం వదిలి నీకు కావలసిన వరం వేడుకో. పరాశరుని—అనుగ్రహం అసామాన్యమైనది— అనగా ఆమె తన దేహం సుగంధవాసితం కావాలని కోరింది. అనుగ్రహించాడు పరమతపస్వి పరాశరుడు.

స్వీకృతవరదాన ప్రసన్నవదన సత్యవతి సమాగమోచితగుణభూషణ భూషితయై ఆమహర్షి మనోభీష్టం నెరవేర్చ సన్నద్ధురాలయింది. ఆ నిమేషంలోనే ఆమె శరీరంనుండి సుగంధవాయువులు వెడలి యోజనదూరంలో ఉన్న మానవులకుసైతంసుఖానుభూతి కలిగించసాగినది. అదిమొదలు ఆమె యోజనగంధి నామంతో ప్రఖ్యాతి పొందింది.

ఉల్లాస తరంగ సంగత హృదయంతో పరాశరుని మనోవాంఛ ఈడేర్చింది. ఉత్తరక్షణంలో మహాశక్తిసంపన్నతతో పరాశరనందనుడు ప్రభవించాడు. ప్రభవించిన మరుక్షణంలోనే తల్లియెదుట నిలిచి— అమ్మా! నువ్వు ఏసమయంలో నా అవసరం భావిస్తే అప్పుడు నీముందుటాను —అనిఆశక్తిశాలితపోదీక్షకై సాగిపోయాడు. ఈ విధంగా సత్యవతీ పరాశరుల గర్భశుక్తిముక్తాఫలంగా అవతరించినవారే వ్యాసభగవానులవారు. ద్వీపంలో విడువబడిన కారణాన ద్వైపాయన నామంతో వారు ప్రసిద్ధులయారు.

మహర్షికి మనోల్లాసం కల్గించి హర్షహృదయంతోయిల్లు చేరిన సత్యవతీలావణ్యదేహంనుండి వచ్చే మలయానిలగంధాలు ఆఘ్రాణిస్తూ ఆనందపరవశుడై తండ్రి దాశరాజు—అమ్మా! నీశరీరంనుండి ఇతఃపూర్వం మత్స్యగంధం వెలువడేది. ఈనాడింతటి సుగంధాలు ఎలా వస్తున్నాయమ్మా. ఆ

తయోః పుమాంసం జగ్రాహ రాజోపరిచరస్తదా
స మత్స్యో నామ రాజాసీ ద్ధార్మికః సత్యసంగరః.
సాప్యరా ముక్తశాపా చ క్షణేన సమపద్యత
యా పురోక్తా భగవతా తిర్యగ్యోనిగతా శుభా.
మానుషౌ జనయిత్వా త్వం శాపమోక్షమవాప్స్యసి
తతః సా జనయిత్వా తౌ విశస్తా మత్స్యఘాతినా.
సంత్యజ్య మత్స్యరూపం సా దివ్యం రూపమవాప్య చ
సిద్ధర్షి చారణపథం జగామాథ వరాప్సరాః.
సా కన్యా దుహితా తస్యా మత్స్యా మత్స్యసగంధినీ
రాజ్ఞా దత్తా చ దాసాయ కన్యేయం తే భవత్వితి.
రూపసత్త్వసమాయుక్తా సర్వైః సముదితా గుణైః
సా తు సత్యవతీ నామ మత్స్యఘాత్యభిసంశ్రయాత్
ఆసీత్ సా మత్స్యగంధైవ కంచిత్ కాలం శుచిస్మితా
శుశ్రూషార్థం పితుర్నావం వాహయంతీం జలే చ తాం
తీర్థయాత్రాం పరిక్రామన్నపశ్యద్వై పరాశరః
అతీవరూపసంపన్నాం సిద్ధానామపి కాంక్షితాం.
దృష్ట్వైవ స చ తాం ధీమాంశ్చకమే చారుహాసినీం
దివ్యాం తాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః.
సంగమం మమ కల్యాణి కురుష్వేత్యభ్యభాషత
సాబ్రవీత్ పశ్య భగవన్ పారావారే స్థితానృషీన్
ఆవయోర్దృష్టయో రేభిః కథం తు స్యాత్ సమాగమః
ఏవం తయోక్తో భగవాన్ నీహారమసృజత్ప్రభుః.
యేన దేశః స సర్వస్తు తమోభూత ఇవాభవత్
దృష్ట్వా సృష్టం తు నీహారం తతస్తం పరమర్షిణా.
విస్మితా సా భవత్ కన్యా వ్రీడితా చ తపస్వినీ
విద్ధి మాం భగవన్ కన్యాం సదా పితృవశానుగాం.
త్వత్సంయోగాచ్చ దుష్యేత కన్యాభావో మమానఘ
కన్యాత్వే దూషితే వాపి కథం శక్ష్యే ద్విజోత్తమ.
గృహం గంతుమృషే చాహం ధీమన్ నస్థాతుముత్సహే
ఏతత్ సంచిత్య భగవన్ విధత్స్వ యదనంతరం.
ఏవముక్తవతీం తాం తు ప్రీతిమానృషిసత్తమః
ఉవాచ మత్ప్రియం కృత్వా కన్యైవ త్వం భవిష్యసి.
వృణీష్వ చ వరం భీరు యం త్వమిచ్ఛసి భామిని
వృథా హి న ప్రసాదో మేభూతపూర్వః శుచిస్మితే.
ఏవముక్తా వరం భద్రే గాత్రసౌగంధ్యముత్తమం
స చాస్యై భగవాన్ ప్రాదాన్మనసః కాంక్షితం భువి.
తతో లబ్ధవరా ప్రీతా స్త్రీభావగుణభూషితా
జగామ సహ సంసర్గమృషిణాద్భుతకర్మణా.
తేన గంధవతీత్యేవం నామాస్యాః ప్రథితం భువి
తస్యాస్తు యోజనా ద్గంధమాజిఘ్రంతి నరా భువి.
తస్యా యోజనగంధేతి తతో నామాపరం స్మృతం
ఇతి సత్యవతీ హృష్టా లబ్ధ్వా వరమనుత్తమం.
పరాశరేణ సంయుక్తా సద్యో గర్భం సుషావ సా
జజ్ఞే చ యమునా ద్వీపే పారాశర్యః స వీర్యవాన్.
స మాతర మనుజ్ఞాప్య తపస్యేవ మనో దధే
స్మృతోఽహం దర్శయిష్యామి కృత్యేష్వితి చ సోఽబ్రవీత్.
ఏవం ద్వైపాయనో జజ్ఞే సత్యవత్యాం పరాశరాత్
న్యస్తో ద్వీపే స యద్బాల స్తస్మాద్ ద్వైపాయన స్మృతః.
తతః సత్యవతీ హృష్టా జగామ స్వం నివేశనం
తస్యాస్త్వా యోజనా ద్గంధమాజిఘ్రంతి నరా భువి.
దాశరాజస్తు త ద్గంధమాజిఘ్రన్ ప్రీతిమావహత్
త్వామాహుర్మత్స్యగంధేతి కథం బాలే సుగంధతా.
అపాస్య మత్స్యగంధత్వం కేన దత్తా సుగంధతా
శక్తేః పుత్రో మహాప్రాజ్ఞః పరాశర ఇతి స్మృతః.

మత్స్యగంధం పోద్రోలి ఈసువాసన అనుగ్రహిం చిన మహాపురుషు లెవరు—అని ప్రశ్నించగా సత్య వతి నాయందు ఇంత అనుగ్రహం వర్షించిన మహ నీయుడు శక్తిమహర్షి కుమారుడైన పరాశరుల వారు. వారు యమునానదితీరానికి వచ్చి నామీద దృష్టినిలిపి మత్స్యగంధం దూరంచేసి యోజన పర్యంతం వ్యాపించే సుగంధం నాకు ప్రసాదిం చారు. ఆమహర్షి వరప్రదానం సమస్తప్రజలకూ సంతోషం కలిగించింది- అన్నది.

యుగానికి ఒక్కో-పాదం లుప్తమయేధర్మంతో మానవుల ఆయుర్దాయమూ శక్తి క్షీణించటంచూసి విప్రవరులపై అనుగ్రహం చూపే దృష్టితో వేదా లను విస్తరింపజేసినందువల్ల ఆయన వేదవ్యాసు డయాడు. వ్యాసుడు నాలుగు వేదాలనూ పంచమ వేదాన్నీ జైమిని సుమంత పైల శుక వైశంపాయ నులచేత అధ్యయనం చేయించాడు. ఈ అయిదు గురూ మహాభారతంఅయిదువిధాలుగాప్రకటించారు.

అష్టమవసువు అశంనుండి మహాతేజస్వి భీష్ముడు గంగకు పుట్టాడు. వేదార్థవిజ్ఞాత అణీమాండవ్యుసి చోరుడనే భ్రమతో శూలానికి గుచ్చారు. ఆయన యమలోకానికి వెడుతూనే— ధర్మరాజా! నేను బాల్యావస్థలో ఓ కీటకానికి ముల్లు గుచ్చినంత మాత్రాన నన్నింతగా బాధించారు. నేను చేసిన మహాతపస్సు దాన్ని నశింపజెయ్యలేదా. మహా పాపకర్మగదా బ్రహ్మహత్య. నన్ను శూలారోప ణం చేసి నువ్వు పాపం కట్టుకున్నావు. తత్ఫలి తంగా నువ్వు శూద్రయోనిలో పుట్టు-అని శపిం చగా యమధర్మరాజు విదురుడై జన్మించాడు. అదేసమయంలో గవల్గణంనుండి సూత సంజయులు జన్మించారు. కుంతిభోజుని గారాబుబిడ్డ గర్భ నుండి సూర్యాంశతో కర్ణుడు ప్రభవించాడు. కర్ణుడు కవచకుండల కాంతులతో ప్రభవించాడు.

ఆద్యంతరహితుడూ అక్షరరూపుడూ అవ్య క్తుడూ త్రిగుణాత్మకుడూ విశ్వశిల్పి ప్రణవాక్షరుడూ అచలుడూ అనంతుడూ ధాత కైవల్యుడూ విశ్వ రూపుడూ వికారరహితుడూ సర్వవ్యాపకుడూ సర్వ భూతపితామహుడూ అయిన ఆదినారాయణుడు అంధకవృష్టివంశాలలో బలరామ శ్రీకృష్ణ రూపా లలో ప్రభవించాడు. వీరిరువురూ సమస్త శస్త్రాస్త్ర విశారదులై మహా పరాక్రమశాలు లయారు. సత్యకునివల్ల సాత్యకి హృదికునివల్ల కృతవర్మ జన్మించి అస్త్ర విద్యావేత్తలై కృష్ణుని అనుస రించారు.

మహాతపోనిధి భరద్వాజుని వీర్యంనుండి ద్రోణుడు పుట్టాడు. గౌతమ గోత్రీయుడైన శరద్వాసుని వీర్యంనుండి కృపి కృపాచార్యుడూ పుట్టారు. ద్రోణాచార్యుని గృహిణియై కృపి అశ్వత్థామను ప్రసవించింది. ద్రుపదమహారాజు యజ్ఞం చేస్తుం డగా అకుండనుండి అగ్ని సదృశరూపంతో ద్రోణా చార్యుని సంహరించే ధృష్టద్యుమ్నుడు ధనుర్ధారియై పుట్టాడు. ఆయజ్ఞవేదినుండి సుందర రూపంతో ద్రౌపది ప్రభవించింది. ప్రహ్లాదశిష్యుడు నగ్న జిత్తు సుబలచక్రవర్తిగా జన్మించాడు. దేవతా క్రోధంవల్ల ఆతని సంతతి ధర్మనాశనంకోసం పెరి గింది. ఈ సుబల తనయుడే ద్యూతకుశలుడు శకుని. ఈతని భగిని గాంధారి ధృతరాష్ట్రుని రాణి. వీరి రువురూ అర్థశాస్త్రవేత్తలు.

విచిత్రవీర్యమహారాజ పత్నులైన అంబికా అంబాలికకు కృష్ణద్వైపాయనుని అనుగ్రహవిశేషం ధృతరాష్ట్ర పాండురాజులూ, శూద్రస్త్రీ గర్భం

నావంవాహయమానాయా మమదృష్ట్వానుగృహీతం
అపాస్య మత్స్యగంధత్వంయోజనాద్గంధతాందదౌ.
ఋషేః ప్రసాదంద్రుష్ట్వాతు జనాః ప్రీతిముపాగమన్
పాదాపసారిణంధర్మం స తు విద్వాన్ యుగేయుగే
ఆయుశ్శక్తిం చ మర్త్యానాంయుగావస్థామవేక్ష్యచ.
బ్రహ్మణోబ్రాహ్మణానాంచతథానుగ్రహకాంక్షయా
వివ్యాసవేదాన్ యస్మాత్ స తస్మాద్వ్యాసస్స్మృతః.
వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్.
సుమంతుం జైమినింపైలంశుకంచైవస్వమాత్మజం.
ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయనమేవ చ
సంహితాస్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః.
తథా భీష్మః శాంతనవో గంగాయామమితద్యుతిః
వసువీర్యాత్ సమభవన్మహావీర్యో మహాయశాః.
వేదార్థవిచ్చ భగవానృషిర్విప్రో మహాయశాః
శూలే ప్రోతః పురాణర్షిరచౌరశ్చౌరశంకయా.
అణీమాండవ్య ఇత్యేవం విఖ్యాతః స మహాయశాః
స ధర్మమాహూయ పురా మహర్షిరిదముక్తవాన్.
ఇషీకయామయా బాల్యా ద్విద్ధా హ్యేకాశకుంతికా
తత్ కిల్బిషం స్మరే ధర్మనాన్యత్ పాపమహం స్మరే.
తన్మేసహస్రసమితం కస్మాన్నేహాజయత్తవః
గరీయాన్ బ్రాహ్మణవధః సర్వభూత వధాద్యతః.
తస్మాత్త్వం కిల్బిషీ ధర్మ శూద్రయోనౌ జనిష్యసి
తేన శాపేన ధర్మోఽపి శూద్రయోనావజాయత.
విద్వాన్ విదుర రూపేణ ధార్మీ తనురకిల్బిషీ
సంజయో మునికల్పస్తు జజ్ఞే సూతో గవల్గణాత్.
సూర్యాచ్చ కుంతికన్యాయాం జజ్ఞే కర్ణో మహాబలః
సహజం కవచం బిభ్రత్ కుండలోద్యోతితాననః.
అనుగ్రహార్థం లోకానాం విష్ణుర్లోకనమస్కృతః
వసుదేవాత్తుదేవక్యాంప్రాదుర్భూతోమహాయశాః.
అనాదినిధనో దేవః స కర్తా జగతః ప్రభుః
అవ్యక్తమక్షరం బ్రహ్మ ప్రధానం త్రిగుణాత్మకం.
ఆత్మానమవ్యయం చైవ ప్రకృతిం ప్రభవం ప్రభుం
పురుషం విశ్వకర్మాణం సత్వయోగం ధ్రువాక్షరం
అనంతమచలం దేవం హంసం నారాయణం ప్రభుం
ధాతారమజమవ్యక్తం యమాహుః పరమవ్యయం.
కైవల్యం నిర్గుణం విశ్వమనాదిమజమవ్యయం
పురుషః స విభుః కర్తా సర్వభూతపితామహః.
ధర్మసంవర్ధనార్థాయ ప్రజజ్ఞేఽంధకవృష్ణిషు
అస్త్రజ్ఞౌతు మహావీర్యౌ సర్వశాస్త్రవిశారదౌ.
సాత్యకిః కృతవర్మా చ నారాయణమనువ్రతౌ
సత్యకాద్హృదికాచ్చైవ జజ్ఞాతేఽస్త్రవిశారదౌ.
భరద్వాజస్య చ స్కన్నం ద్రోణ్యాం శుక్రమవర్ధత
మహర్షేరుగ్రతపసస్తస్మాత్ ద్రోణో వ్యజాయత.
గౌతమాన్మిథునం జజ్ఞే శరస్తంబాచ్ఛరద్వతః
అశ్వత్థామ్నశ్చ జననీ కృపశ్చైవ మహాబలః.
అశ్వత్థామా తతో జజ్ఞే ద్రోణాదేవ మహాబలః
తథైవ ధృష్టద్యుమ్నోఽపి సాక్షాదగ్నిసమద్యుతిః.
వైతానే కర్మణి తతః పావకాత్ సమజాయత
వీరో ద్రోణవినాశాయ ధనురాదాయ వీర్యవాన్.
తత్రైవ వేద్యాం కృష్ణాపి జజ్ఞే తేజస్వినీ శుభా
విభ్రాజమానా వపుషా బిభ్రతీ రూపముత్తమం.
ప్రహ్లాదశిష్యో నగ్నజిత్ సుబలశ్చాభవత్ తతః
తస్య ప్రజా ధర్మహంత్రీ జజ్ఞే దేవప్రకోపనాత్.
గాంధారరాజపుత్రోఽభూచ్ఛకునిః సౌబలస్తథా
దుర్యోధనస్య జననీ జజ్ఞాతేఽర్థవిశారదౌ.
కృష్ణద్వైపాయనాజ్జజ్ఞే ధృతరాష్ట్రో జనేశ్వరః
క్షేత్రే విచిత్రవీర్యస్య పాండుశ్చైవ మహాబలః.
ధర్మార్థకుశలో ధీమాన్ మేధావీ ధూతకల్మషః
విదురః శూద్రయోనౌ తు జజ్ఞే ద్వైపాయనాదపి.
పాండోస్తు జజ్ఞిరే పంచపుత్రా దేవసమాః పృథక్

నుండి విదురుడూ జన్మించారు. విదురుడు సర్వ ధర్మవేత్త. మేధావి. పాండురాజుకి ఇద్దరుభార్యలు. వారివల్ల పాండవులు పుట్టారు. యముని అంశవల్ల ధర్మరాజూ, వాయువునుండి భీముడూ, ఇంద్రునివల్ల అర్జునుడూ, కుంతికి జన్మించారు. అశ్వినీకుమారుల దయాప్రసాదంతో నకుల సహదేవులు గురుజన సేవాతత్పరులై జన్మించారు. ధీమంతుడు ధృతరాష్ట్రుడు దుర్యోధన శతానికీ తండ్రి అయాడు. ధృతరాష్ట్రునికి వైశ్యస్త్రీయందు యుయుత్సుడు జన్మించాడు. ఇతనినే కరణుడు అని పిలుస్తారు. (వైశ్యస్త్రీకి రాజపురుషునివల్ల కలిగిన సంతానాన్ని కరణుడు అని వ్యవహరిస్తారు.)

దుర్యోధన దుశ్శాసన దుస్సహ దుర్మర్షణ వికర్ణ చిత్రసేన వివింశతి సత్యవ్రత పురుమిత్ర యుయుత్సులు ధార్తరాష్ట్రులలో మహారథులు.

సుభద్రార్జునుల గర్భంనుండి పాండుపౌత్రుడు కృష్ణుని మేనల్లుడు అభిమన్యుడు పుట్టాడు. సమస్త శాస్త్రనిపుణులూ సుందరాకారులూ అయిదుగురు పుత్రులు ద్రౌపదీగర్భాన జన్మించారు. వీరిలో ధర్మరాజనందనుడు ప్రతివింధ్యుడు, భీమసేనతనయుడు సుతసోముడు, అర్జునపుత్రుడు శ్రుతకీర్తి, నకులకుమారుడు శతానీకుడు, శ్రుతసేనుడు సహదేవసూతి, ఘటోత్కచుడు హిడింబి భీముల ప్రియపుత్రుడు.

ద్రుపదరాజుకి కన్యగా పుట్టిన శిఖండి క్రమంగా పురుషాకృతి పొందింది. స్థూణాకర్ణుడనే యక్షుడు ఆమెమీది ప్రేమతో అలా చేశాడు. కౌరవసంగ్రామంలో పాల్గొనడానికి విచ్చేసిన యోధు లందరి పేర్లూ చెప్పడం ఎవరితరముకాదు. ఇప్పుడు చెప్పిన ప్రముఖరాజనామాలతో భారతేతిహాసం సాగింది.

63 వ అధ్యాయం సమాప్తం

## అరువది నాలుగవ అధ్యాయము

మహర్షీ! మీరు చెప్పిన మహారాజులూ మహారథికులూ ఈ భూమిమీద ఏ ఉద్దేశసిద్ధికై ఏప్రయోజన లక్ష్యంతో ఉద్యమించారో చెప్పండి. అని జనమేజయుడు కోరగా వైశంపాయనుడు వినిపిస్తున్నాడు.

పితామహుడైన బ్రహ్మకు అభివాదం చేసి ఈ దేవరహస్యం ప్రారంభిస్తున్నాను. జమదగ్నినందనుడు పరశురాముడు ఇరవైయొక్కసార్లు క్షత్రియవీరుల్ని సంహరించి మహేంద్రపర్వతంమీద తపస్సు ఆరంభించాడు. సర్వక్షత్రియపురుషులూ నాశనమవటంచేత వారి స్త్రీలు బ్రాహ్మణులను శరణువేడగా ఆవిప్రులు (కామవశచిత్తులు కాక) సంతానోత్పత్తి కోసం ఋతుకాలాలలో వారిని సంగమించారు. తన్మూలంగా వీరక్షత్రియులూ సుందరరాజరమణులూ ప్రభవించారు. తపశ్శక్తి సంపన్నులైన వారివల్ల ధర్మపూర్వకంగా క్షత్రియవంశాలు ఉద్ధరింపబడ్డాయి. అనంతరం చాతుర్వర్ణ్య వ్యవస్థ సుప్రతిష్ఠితమైంది. నాడు ఏ ప్రాణీ కామవశచిత్తంతో భార్యాసంగమం చేసేదిగాదు. ఋతుసమయంలో సంతానేచ్ఛతోనే ఆ వ్యాపారం సాగేది.

ధర్మవర్తనులై జీవించే ఆ ప్రాణులు వేలకొద్దీ సంవత్సరా లుండేవి. అభ్యుదయ పరంపరగా

త్వయోః స్త్రియోర్గుణజ్యేష్ఠస్తేషామాసీద్యుధిష్ఠిరః.
ధర్మా ద్యుధిష్ఠిరో జజ్ఞే మారుతాచ్చవృకోదరః
ఇంద్రాద్ధనంజయః శ్రీమాన్ సర్వశస్త్రభృతాంవరః
జజ్ఞాతే రూపసంపన్నావశ్విభ్యాం చ యమావపి
నకుల స్సహదేవశ్చ గురుశుశ్రూషణే రతౌ.
తథా పుత్రశతం జజ్ఞే ధృతరాష్ట్రస్య ధీమతః
దుర్యోధనప్రభృతయో యుయుత్సుః కరణ స్తథా.
తతో దుశ్శాసనశ్చైవ దుఃసహశ్చాపి భారత
దుర్మర్షణో వికర్ణశ్చ చిత్రసేనో వివింశతిః.
జయః సత్యవ్రతశ్చైవ పురుమిత్రశ్చ భారత
వైశ్యాపుత్రో యుయుత్సుశ్చ ఏకాదశమహారథాః.
అభిమన్యు స్సుభద్రాయామర్జునాదభ్య జాయత
స్వస్రీయో వాసుదేవస్య పౌత్రః పాండోర్మహాత్మనః
పాండవేభ్యో హి పాంచల్యాం ద్రౌపద్యాం

పంచ జజ్ఞిరే
కుమారా రూపసంపన్నా స్సర్వశాస్త్రవిశారదాః.
ప్రతివింధ్యోయుధిష్ఠిరాత్ సుతసోమోవృకోదరాత్
అర్జునాచ్ఛ్రుతకీర్తిస్తు శతానీకస్తు నాకులిః.
తథైవ సహదేవాచ్చ శ్రుతసేనః ప్రతాపవాన్
హిడింబియాం చ భీమేన వనే జజ్ఞే ఘటోత్కచః.
శిఖండీ ద్రుపదాజ్జజ్ఞే కన్యా పుత్రత్వమాగతా
యాం యక్షఃపురుషంచక్రేస్థూణఃప్రియచికీర్షయా.
కురూణాం విగ్రహే తస్మిన్ సమాగచ్ఛన్

బహూన్ యథా
రాజ్ఞాం శతసహస్రాణి యోత్స్యమానానిసంయుగే.
తేషామపరిమేయానాం నామధేయాని సర్వశః
న శక్యాని సమాఖ్యాతుం వర్షాణామయుతైరపి.
ఏతే తు కీర్తితా ముఖ్యాయైరాఖ్యానమిదం తతం.

63వ అధ్యాయం సమాప్తం

## అరువదినాల్గవ వఅధ్యాయము

య ఏతే కీర్తితా బ్రహ్మన్ యే చాన్యేనానుకీర్తితాః
సమ్యక్ తాంచ్ఛ్రోతుమిచ్ఛామి రాజ్ఞ శ్చాన్యాన్

సహస్రశః.
యదర్థమిహ సంభూతా దేవకల్పా మహారథాః
భువి తన్మే మహాభాగ సమ్యగాఖ్యాతుర్హసి.
రహస్యం ఖల్విదం రాజన్ దేవానామితి నః శ్రుతం
తత్తు తే కథయిష్యామి నమస్కృత్య స్వయంభువే.
త్రిః సప్తకృత్వః పృథివీం కృత్వానిః క్షత్రియాం పురా
జామదగ్న్య స్తప స్తేపే మహేన్ద్రే పర్వతోత్తమే.
తదా నిః క్షత్రియే లోకే భార్గవేణ కృతే సతి
బ్రాహ్మణాన్ క్షత్రియారాజన్

సుతార్థిన్యోఽభిచక్రముః.
తాభి స్సహ సమాపేతుర్బ్రాహ్మణాం సంశితవ్రతాః
ఋతా వృతౌనరవ్యాఘ్ర న కామాన్నా నృతౌ తథా
తేభ్యశ్చ లేభిరే గర్భం క్షత్రియాస్తా స్సహస్రశః
తతః సుషువిరే రాజన్ క్షత్రియాన్ వీర్యవత్తరాన్.
కుమారాంశ్చ కుమారీశ్చ పునః క్షత్రాభివృద్ధయే
ఏవం తద్బ్రాహ్మణైః క్షత్రం క్షత్రియాసు తపస్విభిః.
జాతం వృద్ధంచ ధర్మేణ సుదీర్ఘేణాయుషాన్వితం
చత్వారోఽపితతోవర్ణాబభూర్బ్రాహ్మణోత్తరాః.
అభ్యగచ్ఛన్నృతౌనారీం న కామాన్నానృతౌ తథా
తథైవాన్యాని భూతాని తిర్యగ్యోనిగతాన్యపి.
ఋతౌ దారాంశ్చ గచ్ఛన్తిత త్తథాభరతర్ష భ
తతోఽవర్ధ న్త ధర్మేణ సహస్రశతజీవినః.
తాః ప్రజాహః పృథివీపాల ధర్మవ్రతపరాయణాః
ఆధిభిర్వ్యాధిభిశ్చైవ విముక్తా స్సర్వశోనరాః.

వంశాలు విస్తరిల్లేవి. ప్రజలకు ఏబాధలూ ఉండేవి కావు. భౌతికంగా మానసికంగా ప్రశాంతజీవితం అనుభవించేవారు. ఆ విధంగా ప్రభవించిన క్షత్రియులు తిరిగి ఈ భూమండలం మీద ఆధిపత్యం సాధించారు. సర్వప్రజలకూ సంతోషం కలిగిస్తూ ధార్మికప్రభువులు ఏలేవారు. ఆ రాజులు కామ క్రోధాలకు వశులయేవారు కారు. అపరాధులను దండించడంలో అప్రమత్తత ప్రదర్శించేవారు.

కాలానుసారంగా ఇంద్రుడు వానలు కురిపించేవాడు. అకాలమరణాలు వారెరుగరు. యౌవనం వికసించేవరకూ స్త్రీలోలత్వం నరిలో ఉండేది కాదు. వారు దీర్ఘకాలజీవులు.

రాజులు భూరిదక్షిణలతో యజ్ఞాలు చేసేవారు. విప్రులు వేదవేదాంగాధ్యయన పరాయణులయేవారు వేదవిక్రియం కానీ శూద్రులు వినేట్లు అధ్యయనం చేయుటం కానీ వారు చెయ్యలేదు. వైశ్యులు ఎడ్లచేత భారమైన పని చేయించకుండా వ్యవసాయం సాగించేవారు. పనికిరాని పశువులకు కూడా మంచి మేత వేసి పోషించేవారు. లేగదూడలుపాలువిడిచిమేత మొదలు పెట్టేవరకూ వారు ఆవుపాలు పితికేవారు కారు. వ్యాపారంలో అక్రమం ఉండేదికాదు. ధర్మదృష్టితో ధర్మతత్పరతతో ధర్మకర్తలతో జీవితాన్ని నిర్వహించే ఆ కాలంలో ధర్మగ్లాని మచ్చుకులేదు. ఋతుక్రమానుసారం వృక్షాలూ లతలూ ఫలించి పుష్పించేవి. ఈ విధంగా ఆకాలం సత్యయుగాన్ని తలపించేది.

ఆ సమయంలో అసురులు కొందరు రాజపత్నులకు సుతులుగా పుట్టారు. దేవతలవల్ల పరాజితులై సర్వభ్రష్టులైన అసురులే ఆ ప్రకారం జన్మించారు. వారు మానవులుగానే కాక అశ్వ గో గజ ఖర యోనులలోకూడా పుట్టడంలో భూమికి మొయ్యలేనిబరువై పోయింది.

స్వర్గంనుండి పతనం చెందిన ఈ అసురులు రాజులుగా ప్రభవించి మదోన్మత్తులయారు. వారు పరాక్రమాహంకారాలతో నానారూపాలు ధరిస్తూ శత్రువుల ధనమదాలు హరిస్తూ ఈ విశాలవిశ్వం మీద విశృంఖలవిహారం ప్రారంభించారు. సమస్త ప్రాణుల్నీ హింసించేవారు లక్షల సంఖ్యలో ఈ భూగోళమంతా నిండిపోయారు.

వారి ఈ ఘాతుకాలలో లోకం అట్టుడికిపోతూంటే సహించలేక భూదేవి బ్రహ్మవద్దకు శరణువేడటానికివెళ్ళ సంకల్పించింది. దానవశక్తితో సాగే హింసామయమైన పృథ్విని ఆదికచ్ఛపం దిగ్గజాలు ఆదిశేషుడూ మొయ్యలేకపోతూంటే భయభీతయై భూదేవి బ్రహ్మ సమీపానికి వెళ్ళింది. అప్పటికే ఋషి దేవతా బ్రాహ్మణ సంఘాలు బ్రహ్మవద్ద ఉన్నారు. దేవకార్య నిర్వహణార్థం బ్రహ్మను ప్రసన్నుని చేసే సంకల్పంతో గంధర్వులూ అప్సరసలూ అంజలు లర్పిస్తున్నారు.

ఆ సన్నివేశంలో క్షమా స్వరూపిణి భూదేవి తన కష్టాలను ప్రజాపతి బ్రహ్మకు నివేదించి. కారణరూపుడైన బ్రహ్మ సర్వం ఎరిగినవాడు. ఆయన అంతకుముందే పరిష్కారమార్గం సిద్ధం చేసుకున్నాడు. సర్వజగత్స్రష్టకు విశ్వంభరలోని ప్రాణుల కష్టసుఖాలు తెలీకుండా ఉంటాయా. జగత్కల్యాణ వాంఛారతుడు విశ్వశిల్పి బ్రహ్మ భూదేవిని ఓదారుస్తూ— నీదుఃఖ నివారణార్థం దేవతలందరినీ నియోగిస్తున్నాను— అన్నాడు.

ఆలా ఆమెకు ఆశ్వాసన ఇచ్చి జగత్స్రష్ట దేవతలవైపు తిరిగి ఈ భూభారం హరించే లక్ష్యంతో

అథేమాం సాగరాపాంగీం గాం గజేన్ద్రగతాఖిలాం
అధ్యతిష్ఠత్పునః క్షత్రం సశైలవనపత్తనామ్.
ప్రశాసతి పునః క్షత్రే ధర్మేణేమాం వసున్ధరాం
బ్రాహ్మణాద్యాస్తతో వర్ణా లేభిరే ముదముత్తమామ్.
కామక్రోధోద్భవాన్దోషాన్నిరస్య చ నరాధిపాః
ధర్మేణ దండం దండ్యేషు ప్రణయన్తోఽన్వపాలయన్.
తథా ధర్మపరే క్షత్రే సహస్రాక్షః శతక్రతుః
స్వాదు దేశే చ కాలే చ వర్షేణాపాలయత్ప్రజాః.
న బాల ఏవ మ్రియతే తదా కశ్చిజ్జనాధిప
న చ స్త్రియం ప్రజానాతి కశ్చిదప్రాప్తయౌవనః
ఏవమాయుష్మతీభిస్తు ప్రజాభిర్భరతర్షభ
ఇయం సాగరపర్యన్తా సమాపూర్యత మేదినీ.
ఈజిరే చ మహాయజ్ఞైః క్షత్రియా బహుదక్షిణైః
సాంగోపనిషదాన్ వేదాన్ విప్రాశ్చాధీయతే తదా.
న చ విక్రీణతే బ్రహ్మ బ్రాహ్మణాశ్చ తదా నృప
న చ శూద్రసమభ్యాశే వేదానుచ్చారయన్త్యుత.
కారయన్తః కృషిం గోభిస్తథా వైశ్యాః క్షితావిహ
యుఞ్జతే ధురి నో గాశ్చ కృశాంగాశ్చాప్యజీవయన్.
ఫేనపాంశ్చ తథా వత్సాన్న దుహన్తిస్మ మానవాః
న కూటమానైర్వణిజః పణ్యం విక్రీణతే తదా.
కర్మాణి చ నరవ్యాఘ్ర ధర్మోపేతాని మానవాః
ధర్మమేవానుపశ్యన్తశ్చక్రుర్ధర్మపరాయణాః.
స్వకర్మనిరతాశ్చాసన్ సర్వే వర్ణా నరాధిప
ఏవం తదా నరవ్యాఘ్ర ధర్మో న హ్రసతే క్వచిత్.
కాలే గావః ప్రసూయన్తే నార్యశ్చ భరతర్షభ
భవన్త్యృతుషు వృక్షాణాం పుష్పాణి చ ఫలానిచ.
ఏవం కృతయుగే సమ్యగ్వర్తమానే తదా నృప
ఆపూర్యత మహీ కృత్స్నా ప్రాణిభిర్బహుభిర్భృశమ్.
ఏవం సముదితే లోకే మానుషే భరతర్షభ
అసురా జజ్ఞిరే క్షేత్రే రాజ్ఞాం తు మనుజేశ్వర.

ఆదిత్యైర్హి తదా దైత్యా బహుశో నిర్జితా యుధి
ఐశ్వర్యాద్భ్రంశితాః స్వర్గాత్ సంబభూవుః క్షితావిహ.
ఇహ దేవత్వమిచ్ఛన్తో మానుషేషు మనస్వినః
జజ్ఞిరే భువి భూతేషు తేషు తేష్వసురా విభో.
గోష్వశ్వేషు చ రాజేన్ద్ర ఖరోష్ట్రమహిషేషు చ
క్రవ్యాత్సు చైవ భూతేషు గజేషు చ మృగేషుచ.
జాతైరిహ మహీపాల జాయమానైశ్చ తైర్మహీ
న శశాకాత్మనాఽఽత్మానమియం ధారయితుం ధరా.
అథ జాతా మహీపాలాః కేచిద్బహుమదాన్వితాః
దితేః పుత్రా దనోశ్చైవ తదా లోక ఇహచ్యుతాః
వీర్యవన్తోఽవలిప్తాస్తే నానారూపధరా మహీం
ఇమాం సాగరపర్యన్తాం పురీయురరిమర్దనాః.
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాఞ్ఛూద్రాంశ్చైవాప్యపీడయన్
అన్యాని చైవ సత్త్వాని పీడయామాసురోజసా.
త్రాసయన్తోఽభినిఘ్నన్త స్సర్వభూతగణాంశ్చ తే
విచేరుః సర్వశో రాజన్ మహీం శతసహస్రశః.
ఆశ్రమస్థాన్ మహర్షీంశ్చ ధర్షయన్తస్తతస్తతః
అబ్రహ్మణ్యా వీర్యమదా మత్తా మదబలేన చ.
ఏవం వీర్యబలోత్సిక్తైర్భూరియత్నైర్మహాసురైః
పీడ్యమానా మహీ రాజన్ బ్రహ్మాణముపచక్రమే.
న హ్యమీ భూతసత్త్వౌఘాః పన్నగాస్సనగాం మహీం
తదాధారయితుం శేకుః సంక్రాంతాం దానవైర్బలాత్
తతో మహీ మహీపాల భారార్తా భయపీడితా
జగామ శరణం దేవం సర్వభూతపితామహం.
సా సంవృతం మహాభాగైర్దేవద్విజమహర్షిభిః
దదర్శ దేవం బ్రహ్మాణం లోకకర్తారమవ్యయం.
గంధర్వైరప్సరోభిశ్చ దేవకర్మసు నిష్ఠితైః
వన్ద్యమానం ముదోపేతైర్వవందే చైనమేత్యసా.

మీరందరూ మీమీ అంశలతో పృథ్వీమీద జన్మించండి. అక్కడవున్న అసురులతో విరోధం సాగిస్తే మన ప్రయోజనం నెరవేరుతుంది— అని తక్కంగల గంధర్వాదులతో మీరు కూడా మీ యిచ్ఛానుసారం దేవతలనే అనుసరించండి అన్నాడు. ఇంద్రాది దేవతలందరూ ప్రజాపతి ఆజ్ఞ శిరసా వహించారు. తమతమ అంశలు భూమిపై జన్మించాలనుకొంటూ వైకుంఠంచేరారు.

శంఖచక్రగదాద్యాయుధాలతో శ్రీవత్సలాంఛన శోభతో పీతాంబరధారియై కమలనేత్రాలతో నీల కాంతి తనువుద్దీపించు కమలనాభునితో— దేవా! భూభారహరణార్థం మీరు స్వయంగా అవతరించాలి— అని అర్థించగా హరి చిరునవ్వుతో అనుమయించాడు.

59 వ అధ్యాయం నుండి 64 వ అధ్యాయం వరకు సమాప్తము

## సంభవ పర్వము

దేవేంద్రుడు మహావిష్ణువుతో దేవతలకార్య క్రమం సమగ్రంగా చర్చించి ఆయన ఆజ్ఞానుసారం దేవత లందరినీ భూమిపై ఆయాప్రాంతాలలో జన్మించమని ఆదేశించి తనలోకానికి వెళ్ళాడు. దేవత లందరూ దేవేంద్రుని ఆదేశానుసారం భూమిమీద బ్రహ్మర్షి వంశాలలో రాజర్షి వంశాలలో జన్మించారు. కొందరు జంతురూపాలలో ప్రభవించారు. సర్వప్రాణికోటులలోనూ దేవతలు జన్మించి అసుర సంహార కార్యక్రమం ప్రారంభించారు. దైత్య దానవులనేకాక దుష్టులైన యక్షులనూ గంధర్వు లనూకూడా సంహరించసాగారు. అసుర సంహార కార్యక్రమం నిర్వహణలో పృథివిపై జన్మించిన అమరులందరూ అప్రమత్తులై చరిస్తున్నారు—అని వైశంపాయనుడు చెప్పగా వారందరు ఏఏ రూపాలలో ఏ ఏ ప్రకారం జన్మించి వారి కర్తవ్యం నిర్వర్తించినదీ వివరంగా తెలుపుమని కోరిన జనమేజయుని చూస్తూ వైశంపాయనుడు బ్రహ్మకూ మహావిష్ణువుకూ అభివాదా లర్పించి ప్రారంభిస్తున్నాడు.

మరీచి అత్రి అంగిరస పులస్త్య పులహ క్రతువు ఈ ఆరుగురు బ్రహ్మ మానసపుత్రులు. వీరిలో మరీచితనయుడు కశ్యపుడు. ఈ కశ్యపునివల్లనే సమస్త ప్రజలూ ఉద్భవించారు. బ్రహ్మపుత్రులలో మరియొకడు దక్షప్రజాపతి. ఈ దక్షప్రజాపతికి అదితి దితి దనువు దనాయువు సింహిక క్రోధ ప్రాధ విశ్వ వినత కాల కపిల కద్రువ ముని అనే పేర్లుగల పదముగ్గురు కుమార్తెలు. వీరి సంతతి అసంఖ్యాకమైనది. వారందరూ బలపరాక్రమ సంపన్నులు. ధాత మిత్ర అర్యమ ఇంద్ర వరుణ అంశ భగ వివస్వత పూష సవిత త్వష్ట విష్ణువులు పన్నెండుగురూ ద్వాదశాదిత్యులు. వీరు అదితినందనులు. ఆదిత్యులలో కనిష్ఠుడైన విష్ణువు గుణ గరిష్ఠుడు.

దితికి హిరణ్యకశిపుడు ఏకైకపుత్రుడు. వానికి ప్రహ్లాదుడు సంహ్లాదుడు అనుహ్లాదుడు శిబి వాష్కలుడు పుత్రులు. విరోచన కుంభ నికుంభులు ప్రహ్లాదసూనులు. విరోచనుని పుత్రుడు బలి. బలి తనయుడు బాణాసురుడు. పరమేశ్వరపారిషదులలో

అథ విజ్ఞాపయామాస భూమిస్తం శరణార్థినీ
సంనిధౌ లోకపాలానాం సర్వేషామేవ భారత
తత్ప్రధానాత్మన స్తస్యభూ మేఃకృత్యం స్వయంభువః
పూర్వమేవాభవ ద్రాజన్ విదితం పరమేష్ఠినః.
స్రష్టాహి జగతః కస్మాన్న సంబుధ్యేత భారత
ససురాసురలోకానామశేషేణ మనోగతం.
తామువాచ మహారాజభూమిం భూమిపతిః ప్రభుః
ప్రభవః సర్వభూతానామీశః శంభుః ప్రజాపతి.
యదర్థమభిసంప్రాప్తా మత్సకాశం వసుంధరే
తదర్థం సంనియోక్ష్యామి సర్వానేవ దివౌకసః.
ఇత్యుక్త్వా సమహీం దేవోబ్రహ్మారాజన్ విసృజ్యచ
ఆదిదేశతదాసర్వాన్ విబుధాన్ భూతకృత్ స్వయం.
అస్యా భూమేర్నిరసితుంభారంభాగైః పృథక్ పృథక్
అస్యామేవప్రసూయధ్వంవిరోధాయేతి చాబ్రవీత్.
తథైవ స సమానీయ గంధరాప్సరసాం గణాన్
ఉవాచ భగవాన్ సర్వానిదం వచనమర్థవత్.
స్వైః స్వైరంశైః ప్రసూయధ్వం యథేష్టం
మానుషేషు చ
అథ శక్రాదయ స్సర్వే శ్రుత్వా సురగురోర్వచః
తథ్యమర్థ్యం చ పథ్యం చ తస్య తేజగృహు స్తదా.
అథ తే సర్వశోంఽశైః స్వైర్గంతుం భూమిం
కృతక్షణాః
నారాయణమమిత్రఘ్నం వైకుంఠముపచక్రముః.
యః స చక్రగదాపాణిః పీతవాసాః శితప్రభః
పద్మనాభః సురారిఘ్నః పృథుచార్వంచితేక్షణః.
ప్రజాపతిపతిర్దేవః సురనాథో మహాబలః
శ్రీవత్సాంకో హృషీకేశః సర్వదైవతపూజితః.
తం భువః శోధనాయేంద్ర ఉవాచ పురుషోత్తమం
అంశేనావతరేత్యేవం తథేత్యాహ చ తం హరిః.

59 వ అధ్యాయమునుండి 64వ అధ్యాయము వరకు సమాప్తము.

శ్రీ ద్ధా స క్తు ల తో ఆ ల కిం చే జ న మే జ య
రా జ ర్షి కి వే ద వ్యా సా దే శా ను సా రం
వై శం పా య న బ్రి హ్మ ర్షి మ హా భా ర త
గా థ ప్రి స న్న మ ధు ర శ బ్దా ర్థా ల తో
య థా త థం గా వి వ రి స్తు న్నా డు.

# సంభవపర్వము

అథ నారాయణేనేంద్రశ్చకార సహ సంవిదం
అవతర్తుం మహీం స్వర్గాదంశత స్సహిత స్సురైః
ఆదిశ్య చ స్వయం శక్ర స్సర్వానేవ దివౌకసః
నిర్జగామ పున స్తస్మాత్ క్షయాన్నారాయణస్య చ.
తేఽమరారివినాశాయ సర్వలోకహితాయ చ
అవతేరుః క్రమేణైవ మహీం స్వర్గా ద్దివౌకసః.

ప్రముఖుడైన ఈబాణుని మహాకాలుడు అనిపిలిచే వారు. దనువునకు ముప్పై నలుగురుకొడుకులు. అగ్రజుడు ప్రచిత్తి శంబర నముచిపులోమఅసిలోమ కేశి దుర్జయ అయస్శిర అశ్వసిర అశ్వశంఖు గగన మూర్థ వేగవవంత కేతువాను స్వర్భాను అశ్వ అశ్వపతి వృషపర్వ అజక అశ్వగ్రీవ సూక్ష్మ మహా బలి తుహుండ ఇషుపాద ఏకచక్ర విరూపాక్ష హర అహర నిచంద్ర నికుంభ కుపట కపట శరభ శలభ సూర్య చంద్రులు దనువంశంలో ప్రఖ్యాతిపొందిన దానవులు. ఈ సూర్యచంద్రులు దేవగణంలోని వారు కారు. వీరందరూ మహాబల ధైర్య సాహస సంపన్నులు. వీరిలో పదిమంది దానవులు వంశకర్త లయ్యారు. ఏకాక్షుడు మృతకుడు ప్రలంబుడు నరకుడు వాతాపి శత్రుతపనుడు శఠుడు గవిష్ఠుడు వనాయువు దీర్ఘజిహ్వుడు అనువారి సంతతి అసంఖ్యాకమైంది.

సూర్యచంద్రులను పీడించే రాహువూ సుచంద్రుడు చంద్రహర్తుడు చంద్రప్రమర్దనుడు సింహిక కొడుకులు. క్రూరకు క్రోధవశ గణాలు పుట్టాయి. విక్షరుడు బలుడు వీరుడు వృత్రుడు అను నలుగురూ దనాయువు కొడుకులు. వివిధాస్త్రశస్త్ర ప్రయోగ కుశలులైన భయంకరస్వరూపులు కాలకు పుట్టారు. వినాశన క్రోధ క్రోధహంత క్రోధశత్రు కాలకేయాదులు వారిలో ప్రముఖులు.

సర్వరాక్షసులకూ గురువు శుక్రాచార్యులు. ఈ శుక్రునికే ఉశను డనిపేరు. వీనికి కలిగిన నలుగురు కొడుకులూ అసురపురోహితులే. వీరు కాక త్వష్టాధర అత్రి అనువారిద్దరూ శుక్రుని తనయులే. వీరు రౌద్రకార్యాలలో నిపుణులు. సూర్యసమ తేజులై బ్రహ్మలోకమే పరమలక్ష్యంగా ఉండేవారు. దేవాసురుల ఉత్పత్తిక్రమం నేను విన్నరీతిగా వివరించాను. వీరిసంతానం అగణితమైనది.

తార్క్ష్యుడు అరిష్టనేమి గరుత్మంతుడు అరుణుడు అరుణి వారుణి వినతాపుత్రులు. శేషుడు అనంతుడు వాసుకి తక్షకుడు కూర్ముడు కులికుడు కద్రువపుత్రులు. భీమసేన ఉగ్రసేన సుపర్ణ వరుణ గోపతి ధృతరాష్ట్ర సూర్యవర్చ సత్యవాక్ అర్కపర్ణ ప్రయుత భీమ సర్వజ్ఞ చిత్రరథ శాలిశిర పర్జన్య కలి నారదుడు ముని గర్భంనుండి జన్మించారు. అనవద్య మను వంశ అసుర మార్గణప్రియ అరూప సుభాగ భాసి అను కన్యలు ప్రాధకు కలిగారు. సిద్ధ,పూర్ణ, బర్హి, పూర్ణాయువు రతిగుణ బ్రహ్మచారి సుపర్ణ విశ్వావసు భాను సుచంద్రులు ప్రాధకొడుకులు. ప్రాధ కశ్యప సమాగమంతో అప్సరసలను కన్నది. అలంబుష మిశ్రకేశి విద్యుత్పర్ణ తిలోత్తమ అరుణ రక్షిత రంభ మనోరమ కేశిని సుబాహు సురత సురజ సుప్రియ అనునవి వారిపేర్లు.

అతిబాహు హాహాహూహూ తుంబుర నామధారులైన గంధర్వులుకూడా ప్రాధకే పుట్టారు. అమృత బ్రాహ్మణ గంధర్వ అప్సరసలు కపిల సంతానము.

ఇంతవరకూ నీకు నాగ గంధర్వ రుద్ర మరుద్గణాల జనక్రమం వివరించాను. ఇది శ్రవఃపేయము, ప్రశంసనీయము, పుణ్యదాయకము, ఆయుర్వృద్ధికరము, దేవ బ్రాహ్మణ సమక్షంలో నియమపూర్వకంగా దీనిని పఠించినవారికి ఆయురారోగ్యైశ్వర్యాలతో మోక్షం లభిస్తుంది.

65 వ అధ్యాయము సమాప్తము.

తతో బ్రహ్మర్షివం శేషు పార్థివర్షి కులేషు చ
జజ్ఞిరే రాజశార్దూల యథాకామం దివౌకసః.
పురుషాదాని చాన్యాని జఘ్నుః సత్త్వాన్యనేకశః.
దానవా రాక్షసాశ్చైవ గంధర్వాః పన్నగాస్తథా
న తాన్ బలస్థాన్ బాల్యేఽపి జఘ్నుర్భరతసత్తమ.
దేవదానవసంఘానాం గంధర్వాప్సరసాం తథా
మానవానాం చ సర్వేషాంతథా వై యక్షరక్షసాం.
శ్రోతుమిచ్ఛామి తత్త్వేన సంభవం కృత్స్నమాదితః
ప్రాణినాం చైవ సర్వేషాం సంభవం వక్తుమర్హసి.
హంత తే కథయిష్యామి నమస్కృత్య స్వయంభువే
సురాదీనామహం సమ్యగ్లోకానాం ప్రభవాప్యయం.
బ్రహ్మణోమానసాః పుత్రావిదితాః షణ్మహర్షయః
మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః.
మరీచేః కశ్యపః పుత్రః కశ్యపాత్తు ఇమాః ప్రజాః
ప్రజజ్ఞిరే మహాభాగా దక్షకన్యాస్త్రయోదశ.
అదితిర్దితిర్దనుః కాలాదనాయుః సింహికా తథా
క్రోధా ప్రాధా చ విశ్వా చ వినతా కపిలా మునిః.
కద్రూశ్చ మనుజవ్యాఘ్ర దక్షకన్యైవ భారత
ఏతాసాం వీర్యసంపన్నం పుత్రపౌత్రమనంతకం.
అదిత్యాంద్వాదశాదిత్యాఃసంభూతా భువనేశ్వరాః
యే రాజన్ నామతస్తాంస్తే కీర్తయిష్యామి భారత.
ధాతా మిత్రోఽర్యమా శక్రో వారుణస్త్వంశ ఏవ చ
భగో వివస్వాన్ పూషా చ సవితా దశమస్తథా.
ఏకాదశస్తథా త్వష్టా ద్వాదశో విష్ణురుచ్యతే
జఘన్యజస్తు సర్వేషామాదిత్యానాం గుణాధికః.
ఏక ఏవ దితేః పుత్రో హిరణ్యకశిపుః స్మృతః
నామ్నా ఖ్యాతస్తు తస్యేమే పంచ పుత్రా మహాత్మనః.

ప్రహ్లాదః పూర్వజస్తేషాం సంహ్లాదస్తదనంతరం
అనుహ్లాదస్తృతీయోఽభూత్ తస్మాచ్చ శిబిబాష్కలౌ
ప్రహ్లాదస్య త్రయః పుత్రాః ఖ్యాతాః సర్వత్ర భారత
విరోచనశ్చ కుంభశ్చ నికుంభశ్చేతి భారత.
విరోచనస్య పుత్రోఽభూ ద్బలిరేకః ప్రతాపవాన్
బలేశ్చ ప్రథితః పుత్రో బాణో నామ మహాసురః.
రుద్రస్యానుచరః శ్రీమాన్మహాకాళఇతిస్మృతః
చతుస్త్రింశద్దనోః పుత్రాః ఖ్యాతాః. సర్వత్రభారత
తేషాం ప్రథమజో రాజా విప్రచిత్తిర్మహాయశాః
శంబరో నముచిశ్చైవ పులోమా చేతి విశ్రుతః
అసిలోమా చ కేశీ చ దుర్జయశ్చైవ దానవః
అయశ్శిరా అశ్వశిరా అశ్వశంకుశ్చ వీర్యవాన్.
తథా గగనమూర్ధా చ వేగవాన్ కేతుమాంశ్చ సః
స్వర్భానురశ్వోఽశ్వపతిర్వృషపర్వాజకస్తథా.
అశ్వగ్రీవశ్చ సూక్ష్మశ్చ తుహుండశ్చ మహాబలః
ఇషుపాదేకచక్రశ్చ విరూపాక్షమహోదరౌ.
నిచంద్రశ్చ నికుంభశ్చ కుపటః కపటస్తథా
శరభ శలభశ్చైవ సూర్యాచంద్రమసౌ తథా
ఏతే ఖ్యాతా దనోర్వంశే దానవాః పరికీర్తితాః.
అన్యౌ తు ఖలు దేవానాం సూర్యాచంద్రమసౌ స్మృతౌ
అన్యౌ దానవముఖ్యానాం సూర్యాచంద్రమసౌ తథా.
ఇమే చ వంశాః ప్రథితాః సత్త్వవంతో మహాబలాః
దనుపుత్రా మహారాజ దశ దానవవంశజాః.
ఏకాక్షో మృతపో వీరః ప్రలంబనరకావపి
వాతాపీ శత్రుతపనః శఠశ్చైవ మహాసురః.
గవిష్ఠశ్చ వనాయుశ్చ దీర్ఘజిహ్వశ్చ దానవః
అసంఖ్యేయాః స్మృతాస్తేషాం పుత్రాః పౌత్రాశ్చ భారత.



## అరువదిఆరవ అధ్యాయము

బ్రహ్మమానసపుత్రులలో స్థాణువు ఏడవ వాడు. మృగవ్యాధ సర్ప నిర్ఋతి అజైకపాద అహిర్బుధ్న శత్రుసంతాపన పినాకి దహన ఈశ్వర కపాలి భవ ఆదిగాగల పదకొండుగురూ రుద్రులు. వీరు స్థాణుపుత్రులు. మరీచి అంగిరస అత్రి పులహ పులస్త్య క్రతువులు మహాతేజస్వులైన మహర్షులు.

బృహస్పతి ఉతథ్యుడు సంవర్తుడూ మరీచిమహర్షి నందనులు. అత్రికి అసంఖ్యాకంగా సంతానం కలిగింది వారందరూ వేదవేత్తలూ, సిద్ధులు. శాంతచిత్తులు. శరభ సింహ కింపురుష వ్యాఘ్ర భల్లూక ఈహామృగాలు పులహునికీ, సత్యవాదులూ వ్రతపరాయణులూ లోకవిఖ్యాతులూ సూర్యుని ముందు సాగేవారూ అయిన వాలఖిల్యాదులు క్రతువుకూ కలిగారు. బ్రహ్మదేవుని దక్షిణాంగుష్ఠం నుండి మహాతపస్వి శాంతచిత్తుడూ అయిన దక్షుడుద్భవించాడు. ఆయన వామాంగుళీయం నుండి దక్షుని భార్య ప్రభవించింది.

ఆమెగర్భంనుండి యాభైమంది కన్యలుపుట్టారు. వీరందరూ నవవికసిత కమలదళ లోచనాలతో సౌందర్య సుషమా సమన్వితులై అలరారేవారు. దక్షుడు తన పుత్రసంతతి అంతా నశించిపోయినందు వల్ల ఆ కన్యలను పుత్రికలుగా ఉంచి పుత్రికా ధర్మానుసారం పెళ్ళిళ్ళు చేశాడు.

(అపుత్రోఽనేన విధినాసుతాం కుర్వీత పుత్రికాం యదపత్యం భవేదస్యాం తన్మతుస్యాత్స్వధాకరం.)
--మనుస్మృతి.

పుత్రులు లేనివారు ఆడబిడ్డను పుత్రికగా చేసికొని ఆమెయందు కలిగిన బాలుడు నా శ్రాద్ధాది కాలుచేసే పుత్రుడగుగాక అంటారు).

దక్షుడు యమధర్మరాజుకి పదిమంది కన్యలనూ చంద్రునికి ఇరవైయేడుగురు బాలికల్నీ కశ్యపునికి పదముగ్గురు బిడ్డల్నీ యిచ్చి విధ్యుక్తంగా వివాహాలు చేశాడు.

కీర్తి లక్ష్మి ధృతి మేధ పుష్టి శ్రద్ధ బుద్ధి క్రియ లజ్జ మతి అనువారు యముని భార్యలు. వీరినే బ్రహ్మ ధర్మద్వారాలుగా నిశ్చయించాడు. కాలవిభాగాన్ని తెలిపేవారుగా ఖ్యాతినందినారు చంద్రసతులు, వారందరూ నక్షత్రనామాలతో వ్యవహరింపబడుతున్నారు. బ్రహ్మయొక్క వక్షస్సునుండి పుట్టిన ధర్ముడు బ్రహ్మతనయుడే నని అంటారు. యమధర్మరాజువల్ల దక్షుని కూతులకు కలిగిన సంతానం వసుగణంగా పేరొందారు.

ధరుడు ధృవుడు ధూమ్రతనయులు. మనస్వి సుతుడు చంద్రుడు. శ్వాసపుత్రుడు అనిలుడు. రతకు అహుడు శాండిక అనలుడూ ప్రభాతకు ప్రత్యూష ప్రభాసులూ పుత్రులు. ద్రవిణహుతహవ్యవహులుడు ధరుని పుత్రులు. సమస్తలోకాలనూ ఆహారంగా చేసికొనే కాలు ధ్రువనందనుడు. సోమునకు మనోహర గర్భాన వర్చుడు కలిగాడు. వీనివల్లనే ప్రజలు వర్చస్వులయారు. శిశురుడూ ప్రాణుడూ రమణుడూ సోముని పుత్రులే. జ్యోతి శముడు శాంతుడు ముని అహుని సంతానం. స్కందుడు అనలుని కుమారుడు. శాఖ విశాఖ నైగమేయులు స్కంద సోదరులు. ఆరుగురు కృత్తికల మాతృత్వం కారణంగా స్కందునికి కార్తికేయుడనే పేరుకూడా వచ్చింది.

అనిలునిభార్య శివ. ఈదంపతులకు మనోజవుడు అవిజ్ఞాతగతి అని యిద్దరుపుత్రులు. ప్రత్యూష

సింహికా సుషువే పుత్రం రాహుం చంద్రార్క మర్దనం
సుచంద్రం చంద్రహంతారం తథా చంద్రప్రమర్దనం.
క్రూరస్వభావం క్రూరాయాః పుత్రపౌత్రమనంతకం
గణః క్రోధవశో నామ క్రూరకర్మారిమర్దనః.
దనాయుషః పునః పుత్రాశ్చత్వారోఽసురపుంగవాః
విక్షరో బలవీరౌ చ వృత్రశ్చైవ మహాసురః.
కాలాయాః ప్రథితాః పుత్రాః కాలకల్పాః ప్రహారిణః
ప్రవిఖ్యాతా మహావీర్యా దానవేషు పరంతపాః.
వినాశనశ్చ క్రోధశ్చ క్రోధహంతా తథైవ చ
క్రోధశత్రుస్తథైవాన్యే కాలకేయా ఇతి శ్రుతాః.
అసురాణాముపాధ్యాయ శ్శుక్ర స్త్వృషిసుతోఽ భవత్
ఖ్యాతాశ్చోశనసః పుత్రాశ్చత్వారోఽసురయాజకాః
త్వష్టాధర స్తథాత్రిశ్చ ద్వావన్యౌ రౌద్రకర్మిణౌ
తేజసా సూర్యసంకాశా బ్రహ్మలోకపరాయణాః.
ఇత్యేష వంశప్రభవః కథిత స్తే తరస్వినాం
అసురాణాంసురాణాంచ పురాణేసంశ్రుతోమయా.
ఏతేషాం యదపత్యం తు న శక్యం తద శేషతః
ప్రసంఖ్యాతుం మహీపాల గుణభూతమనంతకం.
తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ తథైవ గరుడారుణౌ
ఆరుణిర్వారుణిశ్చైవ వైనతేయాః ప్రకీర్తితాః.
శేషోఽనంతో వాసుకిశ్చ తక్షకశ్చ భుజంగమః
కూర్మశ్చ కులికశ్చైవ కాద్రవేయాః ప్రకీర్తితాః.
భీమసేనోగ్రసేనౌ చ సుపర్ణో వరుణ స్తథా
గోపతిర్ధృతరాష్ట్రశ్చ సూర్యవర్చాశ్చ సప్తమః
సత్యవాగర్కపర్ణశ్చ ప్రయుతశ్చాపి విశ్రుతః
భీమశ్చిత్రరథశ్చైవ విఖ్యాతః సర్వవిద్వశీ
తథా శాలిశిరా రాజన్ పర్జన్యశ్చ చతుర్దశః
కలిః పంచదశ స్తేషాం నారదశ్చైవ షోడశః
ఇత్యేతే దేవగంధర్వా మౌనేయాః పరికీర్తితాః.
అథ ప్రభూతాన్యన్యాని కీర్తయిష్యామి భారత
అనవద్యాం మనుం వంశామసురాం మార్గణ ప్రియాం
అరూపాం సుభగాం భాసీమితి ప్రాధా వ్యజాయత
సిద్ధఃపూర్ణశ్చబర్హీశ్చ పూర్ణాయుశ్చ మహాయశాః.
బ్రహ్మచారీ రతిగుణః సుపర్ణశ్చైవ సప్తమః
విశ్వావసుశ్చ భానుశ్చ సుచంద్రో దశమ స్తథా
ఇత్యేతే దేవగంధర్వాః ప్రాధేయాః పరికీర్తితాః
ఇమం త్వప్సరసాం వంశం విదితం పుణ్యలక్షణం.
ప్రాధాసూత మహాభాగా దేవీ దేవర్షితః పురా
అలంబుషా మిశ్రకేశీ విద్యుత్పర్ణా తిలోత్తమా.
అరుణా రక్షితా చైవ రంభా తద్వన్మనోరమా
కేశినీ చ సుబాహుశ్చ సురతా సురజా తథా.
సుప్రియా చాతిబాహుశ్చ విఖ్యాతౌ చ హాహా హూహూ
తుంబురుశ్చేతి చత్వారః స్మృతా గంధర్వసత్తమాః.
అమృతం బ్రాహ్మణా గావో గంధర్వాప్సరస స్తథా
అపత్యం కపిలా యాస్తు పురాణే పరికీర్తితం.
ఇతి తే సర్వభూతానాం సంభవః కథితో మయా
యథావత్సంపరిఖ్యాతో గంధర్వాప్సరసాంతథా.
భుజంగానాం సుపర్ణానాం రుద్రాణాం మరుతాంతథా
గవాంచబ్రాహ్మణానాంచశ్రీమతాంపుణ్యకర్మణాం.
ఆయుష్యశ్చైవ పుణ్యశ్చ ధన్యః శ్రుతిసుఖావహః
శ్రోతవ్యశ్చైవ సతతం శ్రావ్యశ్చైవానసూయతా.
ఇమం తు వంశం నియమేన యఃపఠేత్
మహాత్మనాం బ్రాహ్మణ దేవసన్నిధౌ
అపత్యలాభం లభతే స పుష్కలం
శ్రియం యశః ప్రేత్య చ శోభనాం గతిం.

65వ అధ్యాయం సమాప్తం

పుత్రుడు దేవలుడు. దేవలకిద్దరుకుమారులు, బృహస్పతి సహోదరి విశ్వనారీ జనతలో విశిష్టురాలై బ్రహ్మవాదినిగా ప్రతిష్ఠపొంది అష్టమవసువైన ప్రభాసుని గృహలక్ష్మిఅయింది. దేవశిల్పిగా సర్వలోకవిఖ్యాతుడైన విశ్వకర్మ వీరి తనయుడు. దేవతావిమాన వినిర్మాణంలో విశేషరీతులు ప్రదర్శించిన విశ్వకర్మను ఆదర్శంగా ఉంచుకొని మానవులు కూడా ఆరాధిస్తున్నారు.

బ్రహ్మదేవుని దక్షిణ స్తనంలోంచి ప్రభవించిన ధర్మువుకుమారులు శముడు కాముడు హర్షుడు. వీరు సర్వప్రాణిహరులూ ధరులూ కూడా. శముని భార్య ప్రాప్తి. కాముని ధర్మపత్ని రతి. హర్షుని గృహిణి నంద. మరీచినందనుడు కశ్యపుడు దేవదానవ జనకుడు. త్వష్టకూతురు సంజ్ఞ సూర్యభగవానుని ఇల్లాలు. ఆమె అశ్వరూపంతో ఉండి అశ్వనీకుమారులను కన్నది. అదితికి ఇంద్రాదులు పన్నెండుగురు కలిగారు. వారిలో కనిష్ఠుడు మహావిష్ణువు సర్వలోకఖ్యాతుడు. అదేరీతిగా అష్టవసువులూ ఏకాదశరుద్రులూ ద్వాదశాదిత్యులూ ప్రజాపతీ వషట్కారుడూ ముఖ్యదేవతలు. ఇక వీరి వంశాలూ గణాలూ ఏవిధంగా ప్రవర్ధిల్లినవీ వివరిస్తాను; విను.

రుద్ర సాధ్య భార్గవ విశ్వదేవ మరుద్గణాలు గణాలలో ప్రముఖమైనవి. వినతానందనులు గరుత్మంతుడూ అరుణుడూ కాక బృహస్పతి కూడా ఆదిత్యులలోనే పరిగణింపబడుతున్నాడు. అశ్వినీకుమారులూ ఓషధులూ పశువులూ గుహ్యకవర్గం. వీరందరినీ కీర్తించి మానవుడు పాపవిముక్తుడవుతాడు.

బ్రహ్మహృదయం భేదించుకొని భృగువు పుట్టాడు. భృగుపుత్రుడు కవి. కవినందనుడుశుక్రాచార్యుడు. ఈ శుక్రుడే గ్రహమై ముల్లోక సంరక్షణార్థం వృష్టి అనావృష్టి భయం అభయం కలిగిస్తున్నాడు. సమస్తలోక సంచారియైన మహాధీశాలి శుక్రాచార్యులు రాక్షసగురువు. ఈ శుక్రుడే యోగబలంతో బ్రహ్మచర్యవ్రతపరాయణుడైన మేధావిగా ప్రభవించి బృహస్పతి నామంతో దేవగురువయాడు.

భృగునందనులలో చ్యవనుడు ధర్మబుద్ధితో తపోనిష్ఠతో ఉండేవాడు. మాతృదేవిని రక్షించే సంకల్పంతో మహారోషంతో జనని గర్భంనుండి చ్యుతుడయాడు. ఈయనభార్య ఆరుషి మనువు కూతురు. వీరికుమారుడు ఔర్వుడు.(ఊరువులనుండి ప్రభవించిన కారణంగా ఔర్వుడన్నారు.) ఆబాల్య ప్రభృతి సద్గుణసంపన్న తేజోనిధిఅయాడు ఔర్వుడు. ఔర్వనందనుడు ఋచీకుడు. ఋచీకుని కుమారుడు జమదగ్ని. జమదగ్నికి నలుగురు కొడుకులు. వారిలో పరశురాముడు కనిష్ఠుడు. సర్వవిద్యాశాస్త్ర పారంగతుడు పరశురాముడు క్షత్రియ సంహారకుడయాడు. ఔర్వునికి జమదగ్ని ప్రభృతులు నూరుగురు కుమారులు. వారికి సహస్రాధికంగా పుత్రులు కలిగారు. ఈవిధంగా భృగువంశం వ్యాపించింది.

ధాతవిధాతలు కూడా బ్రహ్మపుత్రులే. వీరు మనువుతో కలిసి ఉంటారు. లక్ష్మి వీరి సోదరి ఆకాశ విహారి అశ్వుడు లక్ష్మీమానసపుత్రుడు.

వరుణునిభార్య బలుడు అనే కుమారునీ సుర అనే కుమార్తెనూ ప్రసవించింది. క్షుద్బాధా పీడితమై ప్రజా సమూహం పరస్పర వినాశనేచ్ఛతో చరించే సమయంలో సర్వప్రాణినాశకుడు అధర్ముడు పుట్టాడు. వీనిభార్య నిరృతి. భయుడు మహాతి

## అరువదిఆరవ అధ్యాయము

బ్రహ్మణోమానసాఃపుత్రాఃవిదితాఃషణ్మహర్షయః
ఏకాదశ సుతాః స్థాణోః ఖ్యాతాః పరమతేజసః
మృగవ్యాధశ్చ సర్పశ్చ నిర్ఋతిశ్చ మహాయశాః
అజైకపాదహిర్బుధ్న్యః పినాకీ చ పరంతప.
దహనోఽథేశ్వరశ్చైవ కపాలీ చ మహాద్యుతిః
స్థాణుర్భవశ్చ భగవాన్ రుద్రా ఏకాదశస్మృతాః.
మరీచిరంగిరా అత్రిః పులస్త్యః పులహః క్రతుః
షడేతే బ్రహ్మణః పుత్రా వీర్యవంతో మహర్షయః
త్రయస్త్వంగిరసః పుత్రా లోకే సర్వత్ర విశ్రుతాః
బృహస్పతిరుతథ్యశ్చ సంవర్తశ్చ ధృతవ్రతః.
అత్రేస్తు బహవః పుత్రాః శ్రూయంతే మనుజాధిప
సర్వే వేదవిద స్సిద్ధాః శాంతాత్మానో మహర్షయః.
రాక్షసాశ్చ పులస్త్యస్య వానరాః కిన్నరాస్తథా
యక్షాశ్చ మనుజవ్యాఘ్ర పుత్రాస్తస్య చ ధీమతః.
పులహస్య సుతా రాజన్ శరభాశ్చ ప్రకీర్తితాః
సింహాఃకింపురుషాఃవ్యాఘ్రాఋక్షాఈహామృగాస్తథా
క్రతోః క్రతుసమాః పుత్రాః పతంగ సహచారిణః
విశ్రుతా స్త్రిషు లోకేషు సత్యవ్రతపరాయణాః.
దక్షస్త్వజాయతాంగుష్ఠాద్దక్షిణా ద్భగవాన్ఋషిః
బ్రహ్మణః పృథ్వీపాల శాంతాత్మా సుమహాతపాః.
వామాదజాయతాంగుష్ఠాద్భార్యా తస్యమహాత్మనః
తస్యాం పంచాశతం కన్యాః స ఏవా జనయన్మునిః
తాస్సర్వాస్త్వనవద్యాంగ్యఃకన్యాఃకమలలోచనాః
పుత్రికా స్థాపయామాస నష్టపుత్రః ప్రజాపతిః.
దదౌ స దశధర్మాయ సప్తవింశతి మిందవే
దివ్యేన విధినా రాజన్ కశ్యపాయ త్రయోదశ.
నామతో ధర్మపత్న్యస్తాః కీర్త్యమానా నిబోధ మే
కీర్తిర్లక్ష్మీ ర్ధృతి ర్మేధా తుష్టిః శ్రద్ధా క్రియా తథా.
బుద్ధి ర్లజ్జా మతిశ్చైవ పత్న్యో ధర్మస్యతా దశ
ద్వారాణ్యేతాని ధర్మస్య విహితాని స్వయంభువా.
సప్తవింశతిః సోమస్యపత్న్యో లోకస్య విశ్రుతాః
కాలస్య నయనే యుక్తాః సోమపత్న్యః శుచివ్రతాః.
సర్వా నక్షత్రయోగిన్యో లోకయాత్రావిధానతః
పైతామహో మునిర్దేవ స్తస్య పుత్రః ప్రజాపతిః
తస్యాష్టౌ వసవః పుత్రా స్తేషాం వక్ష్యామి విస్తరం.
ధరో ధ్రువశ్చ సోమశ్చాఽహశ్చైవానిలోఽనలః
ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽష్టౌప్రకీర్తితాః.
ధూమ్రాయాస్తు ధరః పుత్రో బ్రహ్మవిదో ధ్రువస్తథా
చంద్రమాస్తు మనస్విన్యాః శ్వాసాయాః శ్వసనస్తథా.
రతాయాశ్చాప్యహః పుత్రః శాండిల్యాశ్చ హుతాశనః
ప్రత్యూషశ్చ, ప్రభాసశ్చ ప్రభాతాయా స్సుతౌ స్మృతౌ.
ధరస్య పుత్రో ద్రవిణో హుతహవ్యవహస్తథా
ధ్రువస్య పుత్రో భగవాన్ కాలో లోక ప్రకాలనః.
సోమస్య తు సుతో వర్చా వర్చస్వీ యేన జాయతే
మనోహరాయాః శిశిరః ప్రాణోఽథరమణస్తథా.
అహ్నః సుత స్తథాజ్యోతిః శమః శాంత స్తథా మునిః
అగ్నేః పుత్రఃకుమారస్తుశ్రీరామాచ్ఛరవణాలయః
తస్య శాఖో విశాఖశ్చనైగమేయశ్చ పృష్ఠజః
కృత్తికాభ్యుపపత్తేశ్చ కార్తికేయ ఇతి స్మృతః.
అనిలస్య శివా భార్యా తస్యాః పుత్రో మనోజవః
అవిజ్ఞాతగతిశ్చైవ ద్వౌ పుత్రావనిలస్య తు.
ప్రత్యూషస్య విదుఃపుత్రమృషిం నామ్నాథ దేవలం
ద్వౌ పుత్రౌ దేవలస్యాపి క్షమావంతౌ మనీషిణౌ
బృహస్పతేస్తు భగినీ వరస్త్రీ బ్రహ్మవాదినీ.

భయుడు మృత్యువు పీరిసంతతి. ఈ మృత్యువుసర్వ ప్రాణిహంతకుడు. వీనికి భార్యా సంతతి లేదు. కాకి శ్యేని భాసి ధృతరాష్ట్రి శుకి అనే అయిదుగురు ఆడుబిడ్డలు తామ్రకుకలిగారు. కాకి గుడ్లగూబలనూ శ్యేని డేగలనూ కన్నారు. భాసి కోళ్ళనూ గ్రద్దలనూ కన్నది. ధృతరాష్ట్రి చక్రవాకాలనూ హంసలనూ కన్నది. శుకి చిలుకలను ప్రసవించింది.

తొమ్మిదిమంది క్రోధకన్యలను క్రోధవశ కన్నది; మృగి మృగమందహరి భద్రమన మాతంగి శార్దూలి శ్వేత సురభి సురస అని వారిపేర్లు. ఈ మృగాలన్నీ మృగసంతానం. మృగమంద భల్లూకజనని. భద్రమన ఐరావతగజమాత. అశ్వ వానరాలు హరిపుత్రులు. మదపుటేనుగులు మాతంగి సంతానం. సింహ వ్యాఘ్రాలు శార్దూలి సంతతి. దిగ్గజాలు శ్వేతసంతు. రోహిణి గంధర్వ అనువారు సురభి కూతుళ్ళు. విమల అనల రోహిణి కడుపు పంట. గోవృషభాలు రోహిణికి అశ్వాలు గంధర్వకి కలిగాయి. పిండరూప ఫలాలను కాసేవృక్షాలు అనలవల్ల ఉత్పన్నమయాయి. అనలకు శుకిపుట్టె. సురసకు కంకపక్షి కలిగె. శ్యేని అరుణ సమాగమంబున సంపాతి జటాయువులను కన్నది. సురస కద్రువలకు నాగపన్నగ జాతులు కలిగాయి. వినతానందనులు అరుణగరుడులు, సురసనూటఒక్కతలలుగల సర్పాలనూ కమలనయనాలు కల ముగ్గురు కన్యలనూ కన్నది. అనల రుహ వీరుధాలని వీరిపేర్లు తరు లతా గుల్మాది వనస్పతులు వీరి సంతతి.పూలులేని చెట్లు అనలవల్ల పుట్టినవి. ఇవే వనస్పతులు. పుష్పఫల వృక్షాలు రుహావల్ల లతాగుల్మాదులు వీరుధవల్ల ప్రవర్తిల్లాయి.

జనమేజయా ఈ భూతసముదాయోత్పత్తిని వినిన మానవులు పాపవిముక్తులై ఉత్తమగతులు పొందుతారు.

66 వ అధ్యాయం సమాప్తం

## అరువదిఏడవ అధ్యాయము

### అంశావతారదిగ్దర్శనం

పశుపక్షి సరీసృప మానవాదులతో దానవ గంధర్వ దేవగణాలు ఉత్పన్నమైన క్రమం సంపూర్ణంగా వివరింపగోరిన జనమేజయునికి వైశంపాయనుడు ప్రసన్న మధుర వాక్కులతో ప్రవచిస్తున్నాడు.

దానవరాజు విప్రచిత్తి జరాసంధుడై పుట్టాడు. హిరణ్యకశిపుడు శిశుపాలుడుగా పుట్టాడు. ప్రహ్లాద సహోదరుడు సంహ్లాదుడే శల్యుడు. అనుహ్లాదుడు దుష్టకేతువు. శిబి ద్రుముడు. బాష్కలుడు భగదత్తుడు. అయశ్శిరుడు, అశ్వశిరుడు, అయశ్శంఖుడు గగనమూర్ధుడు, వేగవంతుడు అను పేర్లు గల దైత్యులు కేకయాధీశు లయారు. కేతుమంతుడు అమితౌజు డయాడు. స్వర్భానువు ఉగ్రసేనుడుగా పుట్టాడు. అశ్వుడు అశోకుడు. అశ్వపతి హార్దిక్యుడు. వృషపర్వుడు దీర్ఘప్రజ్ఞుడు. అజకుడు సాల్వుడు. అశ్వగ్రీవుడు రోచమానుడు. సూక్ష్మసురుడే బృహద్రథుడు. మహుడు సేనాబిందుడు. ఇషుపాదుడు నగ్నజిత్తు. ఏకచక్ర విరూపాక్ష హర అహరులే ప్రతివింధ్య చిత్రధర్మ సుబాహు బాహ్లీకులుగా ప్రఖ్యాతు లయారు. నిచంద్ర నికుంభ శరభ కుపుట ప్రథులు మంజుకేశ దేవాధిప భూపాల

యోగసక్తా జగత్కృత్స్న మసక్తా విచచార హ
ప్రభాసస్య తు భార్యా సావసూనామష్టమస్య హ.
విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్ప ప్రజాపతిః
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వర్ధనిః.
భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకార హ.
మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః
పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయం.
స్తనం తు దక్షిణం భిత్త్వా బ్రహ్మణో నరవిగ్రహః
నిస్సృతో భగవాన్ ధర్మః సర్వలోకసుఖావహః.
త్రయ స్తస్య వరాః పుత్రాః స్సర్వభూతమనోహరాః
శమః కామశ్చ హర్షశ్చ తేజసా లోకధారిణః.
కామస్య తు రతిర్భార్యా శమస్య ప్రాప్తిరంగనా
నందా తు భార్యా హర్షస్య యాసులోకాః
ప్రతిష్ఠితాః.
మరీచేః కశ్యపఃపుత్రః కశ్యపస్య సురాసురాః
జజ్ఞిరే నృపశార్దూల లోకానాం ప్రభవస్తు సః.
త్వాష్ట్రీ తు సవితు ర్భార్యా వడవా రూపధారిణీ
అసూయత మహాభాగ సాంతరిక్షేఽశ్వినావుభౌ.
ద్వాదశై వాదితేః పుత్రాః శక్రముఖ్యానరాధిప.
తేషా మవరజో విష్ణుర్యత్ర లోకాః ప్రతిష్ఠితాః.
త్రయస్త్రింశత ఇత్యేతే దేవా స్తేషా మహం తవ
అన్వయం సంప్రవక్ష్యామి పక్షైశ్చ కులతోగణాన్.
రుద్రాణామపరః పక్షః సాధ్యానాం మరుతాం తథా
వసూనాం భార్గవం విద్యాద్విశ్వే దేవాం స్తథై వచ.
వైనతేయస్తు గరుడో బలవానరుణ స్తథా
బృహస్పతిశ్చ భగవానాదిత్యే ష్వేవగణ్యతే.
అశ్వినౌ గుహ్యకాన్విద్ధి సర్వౌషధ్య స్తథ పశూన్
ఏతేదేవగణా రాజన్ కీర్తితా స్తేఽనుపూర్వశః.
యాన్కీర్తయిత్వామనుజఃసర్వపాపైః ప్రముచ్యతే

బ్రహ్మణోహృదయం భిత్త్వా నిఃసృతో
భగవాన్ భృగుః
భృగోః పుత్రః కవిర్విద్వాన్ శుక్రః కవిసుతోగ్రహః
త్రైలోక్యప్రాణయాత్రార్థం వర్షావర్షే భయాభయే
స్వయంభువా నియుక్త స్సన్ భువనం పరిధావతి.
యోగాచార్యో మహాబుద్ధి ర్దైత్యానామభవద్గురుః
సురాణాం చాపి మేధావీ బ్రహ్మచారీ యతవ్రతః.
తస్మి న్నియుక్తే విధినా యోగక్షేమాయ భార్గవే
అన్యముత్పాదయామాస పుత్రం భృగురనిందితం.
చ్యవనం దీప్తతపసం ధర్మాత్మానం యశస్వినం
యఃసరోషాచ్చ్యుతోగర్భాన్మాతుర్మోక్షాయభారత.
ఆరుషీ తు మనోః కన్యా తస్య పత్నీ మనీషిణః
ఔర్వస్తస్యాం సమభవదూరుంభిత్త్వామహాయశాః.
మహాతేజా మహావీర్యో బాల ఏవ గుణైర్యుతః
ఋచీకస్తస్య పుత్రస్తు జమదగ్ని స్తతోఽభవత్.
జమదగ్నేస్తు చత్వార ఆసన్ పుత్రా మహాత్మనః.
రామ స్తేషాం జఘన్యోఽభూదజఘన్యైర్గుణైర్యుతః
సర్వశ స్త్రేషు కుశలః క్షత్రియాంతకరో వశీ.
ఔర్వస్యాసీత్ పుత్రశతం జమదగ్నిపురోగమం
తేషాం పుత్రసహస్రాణి బభూవుర్భువి విస్తరః.
ద్వౌపుత్రౌ బ్రహ్మణ స్త్వన్యౌ యయో స్తిష్ఠతిలక్షణం
లోకే ధాతా విధాతా చ యౌస్థితౌ మనునాసహ.
తయోరేవ స్వసాదేవీ లక్ష్మీః పద్మగృహా శుభా
తస్యాస్తు మానసాః పుత్రా స్తురగా వ్యోమచారిణః.
వరుణస్య భార్యాయాజ్యేష్ఠాశుక్రాద్దేవీ వ్యజాయత
తస్యాః పుత్రం బలం విద్ధి సురాం చ సురనందినీం.
ప్రజానామన్నకామానామన్యోన్య పరిభక్షణాత్
అధర్మ స్తత్ర సంజాతః సర్వభూత వినాశకః.
తస్యాపి నిఋతిర్భార్యా నైఋతా యేన రాక్షసాః
ఘోరా స్తస్యాస్త్రయఃపుత్రాఃపాపకర్మరతాఃసదా.

పౌరవ సుపార్శ్వ పార్వతేయులుగా ప్రభవించారు. శలభుడు బాహ్లీకవంశంలో ప్రహ్లాదుడుగా జన్మించాడు. దైత్యచంద్రుడే చంద్రవర్మ కాంభోజ రాజు. అర్కుడు ఋషీకుడు. మృతపుడు అనూప దేశాధీశుడు. గవిష్ఠాసురుడు ద్రుమసేనుడు. మయూరుడే విశ్వుడు. సుపర్ణుడు కాలకీర్తి. చంద్రహంతుడు రాజర్షి శునకుడు. చంద్రవినాశనుడు జానకీశుడు. దీర్ఘజిహ్వ రాహువులు కాశిరాజక్రోధులు.

విక్షుర బలాసుర వీరాసుర వృత్రాసుర క్రోధహంత క్రోధవర్ధనులు- వసుమిత్ర పాండ్యాధీశ పౌండ్ర మాత్స్యక మణిమాణ దండ దండధారు లయారు. కాలేయుని కొడుకులు ఎనమండుగురూ సింహాసమ పరాక్రమోపేతులైన చక్రవర్తు లయారు. వారిలో శ్రేష్ఠుడు జయత్సేనుడు మగధదేశాధీశుడు. రెండవ వాడు అపరాజితుడు. మూడవవాడు మాయావి యైన నిషాదుడు. శ్రేణిమానుడనే రాజర్షి ప్రవరుడు నాల్గవవాడు- మహౌజు డాతని అనుజుడు. ఆరవ వాడు అభీరుడు. సముద్రసేను డేడవవాడు. ఈ సముద్రసేనుడు ధర్మతత్వవేత్త. కాలేయులలో ఆఖరి వాడు బృహాతుడు. ఈ బృహాతుడు సర్వభూత దయాపరుడు.

దానవులలో బలిష్ఠుడైన కుక్షి పార్వతీయుడైనాడు. వాడు మేరునగధీశుడు. కథనుడు సూర్యాక్షుడు. సూర్యాసురుడు బాహ్లీక శ్రేష్ఠనరపాలుడైన దరదుడు. క్రోధవశగణ పరిచయం ఇదివరకే చేశాను. వారే మద్రక కర్ణవేష్ట సిద్ధార్థ కీటక సువీర సుబాహు మహావీర బాహ్లీక క్రథ విచిత్ర సురథ నీల నరేశ చీరవాస భూమిపాల దంతవక్త్ర దానవ దుర్జయ రుక్మి జనమేజయ ఆషాఢ వాయువేగ భూరితేజ ఏకలవ్య సుమిత్ర వాటధాన గోముఖ క్షేమధూర్తి శుతాయు ఉద్వహ బృహత్సేన క్షేమ ఉగ్రతీర్థ కుహర ఈశ్వరులు. వీరందరూ మహాబల యశశ్శ్రీ సంపన్నులు. కాలనేమి ఉగ్రసేననందనుడైన కంసుడు. ఇంద్ర సదృశతేజస్వంతుడు గంధర్వాధీశుడు దేవకుడయాడు.

దేవర్షి బృహస్పతి అంశనుండి అయోనిజుడైన బ్రహ్మర్షి శ్రేష్ఠుడైన భరద్వాజుడు ప్రభవించాడు. భరద్వాజనందనుడు ద్రోణాచార్యులు. ఆచార్య ద్రోణులే సర్వధనుర్ధర శ్రేష్ఠుడైన సర్వశస్త్రాస్త్ర విదుడుగా విశ్వవిఖ్యాతు డయాడు. మహాతేజస్వి సర్వవేదవేత్తా అయిన ద్రోణుడు కులమర్యాదానుసారం ప్రవర్తిస్తూ సర్వప్రజా హృదయాలలోనూ గౌరవ పీఠంసాధించుకున్నాడు.

కామ క్రోధ యమ మహాదేవాంశలనుండి పుట్టిన శత్రుసంతాపకరుడైన అశ్వత్థామ ద్రోణుని ప్రియ నందనుడు. మహాపరాక్రమశ్రీసమోపేతుడై లోక విఖ్యాతుడైనాడీ ద్రోణుడు. వసిష్ఠబ్రహ్మర్షిశాపం దేవేంద్రుని ఆదేశం కారణాలుగా వసువులు గంగాగర్భాన శంతనుడికి కొడుకులుగా పుట్టారు. వీరిలో భీష్ముడు కనిష్ఠుడు. కౌరవవంశత్రాతయైన భీష్ముడు అస్త్రశస్త్రవేత్తమాత్రమే కాదు ధర్మమర్మజ్ఞుడు. జమదగ్ని నందనుడైన పరశురాముని కెదురు నిలిచి పోరిన మహావీరుడు భీష్ముడు. రుద్రగణాంశతో బ్రహ్మర్షి కృపాచార్యులు ప్రభవించాడు. ద్వాపరాంశసంభూతుడు శకుని మహారథికుడు. వృష్ణివంశోద్ధారకుడు సాత్యకి మరుద్గణాంశవల్ల పుట్టాడు. శస్త్రవిద్యాకుశలుడు ద్రుపదుడూ రాజప్రముఖుడు కృతవర్మా శత్రుమర్దనుడూ విరటరాజూ మరుద్గణంవారే.

భయోమహాభయశ్చైవమృత్యుర్వ్యాధ్యాంతక స్తథా.
నతస్య భార్యాపుత్రోఽ వా కశ్చిద స్త్వంతకోహిసః.
కాకీం శ్యేనీం తథా భాసీం ధృతరాష్ట్రీం తథాశుకీం
తామ్రా తు సుషువేదేవీ పంచైతా లోకవిశ్రుతాః.
ఉలూకాన్ సుషువేకాకీ శ్యేనీశ్యేనాన్ వ్యజాయత
భాసీ భాసానజయద్గృధ్రాంశ్చైవ జనాధిప.
ధృతరాష్ట్రీ తు హంసాంశ్చ కలహంసాంశ్చ సర్వశః
చక్రవాకాంశ్చ భద్రా తు జనయామాస సైవతు.
శుకీ చ జనయామాస శుకానేవ యశస్వినీ
కళ్యాణగుణసంపన్నా సర్వలక్షణపూజితా.
నవ క్రోధవశా నారీః ప్రజజ్ఞే క్రోధసంభవాః
మృగీ చ మృగమందా చ హరీ భద్రమనా అపి.
మాతంగీ త్వథ శార్దూలీ శ్వేతాసురభిరేవ చ
సర్వలక్షణసంపన్నా సురసా చైవ భామినీ.
అపత్యం తు మృగాః సర్వే మృగ్యా నరవరోత్తమ
ఋక్షాశ్చ మృగమందాయాః సమరాశ్చ పరంతప.
తతస్త్వైరావతం నాగం జజ్ఞే భద్రమనాః సుతం
ఐరావతః సుత స్తస్యా దేవనాగో మహాగజః.
హర్యాశ్చ హరయోఽపత్యం వానరాశ్చ తరస్వినః
గోలాంగూలాశ్చ భద్రం తే హర్యాః పుత్రాన్ ప్రచక్షతే.

ప్రజజ్ఞే త్వథశార్దూలీ సింహాన్ వ్యాఘ్రాననేకశః
దీపినశ్చ మహాసత్వాన్ సర్వానేవ న సంశయః.
మాతంగ్యపి చ మాతంగానపత్యాని నరాధిప
దిశాం గజం తు శ్వేతాఖ్యం శ్వేతాజనయదాశుగం.
తథా దుహితరౌ రాజన్ సురభిర్వై వ్యజాయత
రోహిణీ చైవ భద్రంతే గంధర్వీ తు యశస్వినీ.
విమలామపి భద్రంతే అనలామపి భారత
రోహిణ్యాం జజ్ఞిరేగావోగంధర్వ్యాంవాజినస్సుతాః
సప్త పిండఫలాన్ వృక్షాననలానపి వ్యజాయత.
అనలాయాః శుకీ పుత్రీ కంకస్తు సురసాసుతః
అరుణస్య భార్యా శ్యేనీ తు వీరవంతౌ మహాబలౌ
సంపాతిం జనయామాస వీర్యవంతం జటాయుషం
సురసాజనయాన్నాగాన్ కద్రూః పుత్రాంస్తు పన్నగాన్.

ద్వౌ పుత్రౌ వినతాయాస్తు విఖ్యాతౌ గరుడారుణౌ
సురసాజనయత్ సర్పాఞ్ఛతమేకశిరోధరాన్
సురసాకన్యకా జాతా స్తిస్రః కమలలోచనాః.
వనస్పతీనాం వృక్షాణాం వీరుధాం చైవ మాతరః
అనలా రుహా చ ద్వేప్రోక్తే వీరుధాం చైవ తాః స్మృతాః.

గృహ్ణంతి యే వినా పుష్పం ఫలాని తరవః పృథక్
అనలాసుతా స్తే విజ్ఞేయాః తానేవాహుర్వనస్పతీన్.
పుష్పైః ఫలగ్రహాన్వృక్షాన్ రుహాయాః ప్రసవాన్ విభో

లతాగుల్మాని వల్యశ్చ త్వక్సారతృణజాతయః.
వీరుధాయాః ప్రజాస్తాః స్యురత్ర సంశః సమాప్యతే
ఇత్యేష సర్వభూతానాం మహతాం మనుజాధిప
ప్రభవః కీర్తితః సమ్యఙ్మయా మతిమతాం వర.
యం శ్రుత్వా పురుషః సమ్యఙ్ముక్తో భవతిపాప్మనః
సర్వజ్ఞతాం చ లభతే గతిమగ్ర్యాం చ విందతి.

66 వ అధ్యాయం సమాప్తం

## అరువదిఏడవ అధ్యాయము

దేవానాం దానవానాం చ గంధర్వోరగ రక్షసాం
సింహవ్యాఘ్రమృగాణాంచపన్నగానాంపతత్రిణాం
సర్వేషాం చైవ భూతానాం సంభవం భగవన్నహం
శ్రోతుమిచ్ఛామి తత్వేన మానుషేషు మహాత్మనాం

అరిష్టతనయుడు హంసుడే కురువంశవృద్ధికరుడైన ధృతరాష్ట్రమహీపాలుడు. విశాల బాహువులు కల ధృతరాష్ట్రుడు తనతల్లి అపచారంవల్ల మహర్షి వ్యాసుని క్రోధకారణంగా అంధుడయాడు. అతని అనుజుడు శక్తిసంపన్నుడు పాండురాజు. సత్యధర్మతత్పరుడు; పవిత్రుడు; ధీశాలి; శ్రేష్ఠసంతతి కలవాడు. సూర్యనందనుడైన యమధర్మరాజు అంశతో మహామతిమంతుడువిదురుడు జన్మించాడు.

దుష్టబుద్ధిదూషితస్వభావుడూ అయినకలిపురుషుని అంశతో దుర్యోధనుడు ఉత్పన్నుడయాడు. ఈ దుర్యోధనుడు మహాసంగ్రామం సాగించి వీర సంహారం చేశాడు. దుర్యోధన హేతువుచే ప్రజ్వలితమైన వైరాగ్ని సర్వప్రాణి నాశనం చేసేవరకూ చల్లారలేదు. పులస్త్యవంశీయులైన అసురులు దుర్యోధనుని సోదరులు.

దుశ్శాసన దుర్ముఖ దుస్సహాదు లందరూ క్రూర కార్యాచరణలో ఆరితేరిపోయారు. వారినామాలు అవసరానుసారం వస్తాయి. వీరందరూ అసురులే. వీరు నూరుగురూ కాక ధృతరాష్ట్రునికి వైశ్యస్త్రీ వల్ల యుయుత్సుడు జన్మించాడు—అనగా విని జనమేజయుడు ఆనూరుగురిపేర్లుచెప్పమన్నాడు. దుర్యోధన యుయుత్సు దుశ్శాసన దుస్సహ దుశ్శల దుర్ముఖ వివింశతి వికర్ణ జలసంధ సులోచన వింద అనువింద దుర్ధర్ష సుబాహు దుష్ప్రధర్షణ దుష్కరణ కర్ణ చిత్ర ఉపచిత్ర చిత్రాక్షచార చిత్రాంగద దుర్మద దుష్ప్రధర్ష వివిత్సు వికట సమ ఊర్ణనాభ పద్మనాభ నంద ఉపనంద సేనాపతి సుషేణ కుండోదర మహోదర చిత్రబాహు చిత్రవర్మ సువర్మ దుర్విరోచన ఆయుబాహు చిత్రచాప మహాబాహు సుకుండల భీమవేగ భీమబల బలాకి భీమ విక్రమ ఉగ్రాయుధ భీమశర కనకాయువు దృఢాయుధ దృఢవర్మ దృఢక్షత్ర సోమకీర్తి అనూదర జరాసంధ దృఢసంధ సత్యసంధ సహస్రవాక ఉగ్రశ్రవ ఉగ్రసేన క్షేమమూర్తి అపరాజిత పండితక విశాలాక్ష దురాధన దృఢహస్త సుహస్త వాతవేగ సువర్చ ఆదిత్యకేతు బహ్వాసి నాగదత్త అనుయాయి కవచ నిషంగ దండి దండదారి ధనుర్గ్రహ ఉగ్ర భీమరథ వీర వీరబాహు అలోలుప అభయ రౌద్రకర్మ దృఢరథ అనాధృష్య కుండ భేది విరావి మహాబాహు వ్యూఢోర కనకాంగద కుండజ చిత్రక-ఇవి వారిపేర్లు. వీరందరికీ చెల్లెలు దుస్సల

వారేకాక వైశ్యస్త్రీవల్ల కలిగిన యుయుత్సునితో ధార్తరాష్ట్రులు నూటయిద్దరు. ఈ క్రమాను సారమే వారుపుట్టారు. వీరందరూ రథికశ్రేష్ఠులు. మహావీరులు. విద్యావంతులు. వీరందరికీ వంశ మర్యాదానుసారం వివాహాలు జరిగాయి. శకుని ఆలోచన ప్రకారం దుస్సలను సింధుదేశాధీశుని అర్ధాంగిగా చేశాడు దుర్యోధనుడు.

ఇక యమధర్మరాజు అంశ ధర్మరాజుగా వచ్చింది. వాయువువల్ల భీముడు ఇంద్రునివల్ల అర్జునుడూ అశ్వినీకుమారులవల్ల అసదృశసౌందర్య తేజోవిరాజితులయిన నకులసహదేవులూ కలిగారు. చంద్రనందనుడు వర్చుడు అభిమన్యుడుగా జన్మించాడు. అభిమన్యుని యిస్తూనే చంద్రుడు - ఈనాకుమారుడు నాకు పరమప్రియతముడు. ఇతని వియోగం చిరకాలం నేను భరించలేను. అందుచేత మర్త్యలోకంలో వీనిని ఎంతకాలం ఉంచేదీ ముందుగా చెప్పండి. దేవకార్యార్థం కనక నేను అంగీకరిస్తున్నానే కానీ ఒక్కక్షణంకూడా వదలి ఉండలేను. మహాప్రతాపవంతుడైన పాండు నరపాలుని

జన్మకర్మ చ భూతానామేతేషామనుపూర్వశః.
మానుషేషు మనుష్యేంద్ర సంభూతా యే దివౌకసః
ప్రథమం దానవాంశ్చైవతాంస్తే వక్ష్యామిసర్వశః.
విప్రచిత్తిరితి ఖ్యాతో య ఆసీద్దానవర్షభః
జరాసంధ ఇతి ఖ్యాతః స ఆసీన్మనుజర్షభః.
దితేః పుత్రస్తు యో రాజన్ హిరణ్యకసిపుఃస్మృతః
స జజ్ఞే మానుషే లోకే శిశుపాలో నరర్షభః.
సంహ్లాద ఇతి విఖ్యాతః ప్రహ్లాదస్యానుజస్తు యః
స శల్య ఇతి విఖ్యాతో జజ్ఞే బాహ్లీకపుంగవః.
అనుహ్లాదాస్తు తేజస్వీ యోఽభూత్ ఖ్యాతో జఘన్యజః
ధృష్టకేతురితి ఖ్యాతః స బభూవ నరేశ్వరః.
యస్తు రాజన్ శిబిర్నామ దైతేయః పరికీర్తితః
ద్రుమ ఇత్యభివిఖ్యాతః స ఆసీద్భువి పార్థివః.
బాష్కలో నామ యస్తేషామాసీదసురసత్తమః
భగదత్త ఇతి ఖ్యాతః స జజ్ఞే పురుషర్షభః.
అయఃశిరా అశ్వశిరా అయఃశంకుశ్చ వీర్యవాన్
తథా గగనమూర్ధా చ వేగవాంశ్చాత్ర పంచమః
పంచైతే జజ్ఞిరే రాజన్ వీర్యవంతో మహాసురాః
కేకయేషు మహాత్మానః పార్థివర్షభసత్తమాః
కేతుమా నితివిఖ్యాతో యస్తతోఽన్యఃప్రతాపవాన్.
అమితౌజా ఇతి ఖ్యాతః సోగ్రకర్మా నరాధిపః
స్వర్భానురితి విఖ్యాతః శ్రీమాన్ యస్తు మహాసురః.
ఉగ్రసేన ఇతి ఖ్యాత ఉగ్రకర్మానరాధిపః
యస్త్వశ్వ ఇతి విఖ్యాతః శ్రీమానాసీన్మహాసురః
అశోకో నామ రాజాభూన్మహావీర్యోఽపరాజితః
తస్మాదవరజో యస్తు రాజన్నశ్వపతిః స్మృతః.
దైతేయ స్సోఽభవద్రాజా హార్దిక్యో మనుజర్షభః
వృషపర్వేతి విఖ్యాతః శ్రీమాన్ యస్తు మహాసురః
దీర్ఘప్రజ్ఞ ఇతి ఖ్యాతః పృథివ్యాంసోఽభవన్నృపః

అజకస్త్వవరో రాజన్ య ఆసీద్వృషపర్వణః.
స సాల్వ ఇతి విఖ్యాతః పృథివ్యామభవన్నృపః
అశ్వగ్రీవ ఇతి ఖ్యాతః సత్వవాన్ యో మహాసురః
రోచమాన ఇతి ఖ్యాతః పృథివ్యాంసోఽభవన్నృపః
సూక్ష్మస్తు మతిమాన్ రాజన్ కీర్తిమాన్ యః ప్రకీర్తితః.
బృహద్రథ ఇతి ఖ్యాతః క్షితావాసీత్ స పార్థివః
తుహుండ ఇతి విఖ్యాతో య ఆసీదసురోత్తమః.
సేనాబిందురితి ఖ్యాతః స బభూవ నరాధిపః
ఇషుపాన్నామ యస్తేషామసురాణాం బలాధికః.
నగ్నజిన్నామరాసీద్భువి విఖ్యాతవిక్రమః
ఏకచక్ర ఇతి ఖ్యాత ఆసీద్యస్తు మహాసురః
ప్రతివింధ్య ఇతి ఖ్యాతో బభూవ ప్రథితః క్షితౌ
విరూపాక్షస్తు దైతేయశ్చిత్రయోధీ మహాసురః.
చిత్రధర్మేతి విఖ్యాతః క్షితాసీత్ స పార్థివః
హరస్త్వరిహరో వీర ఆసీద్ యో దానవోత్తమః.
సుబాహురితి విఖ్యాతః శ్రీమానాసీత్ స పార్థివః
అహరస్తు మహాతేజాః శత్రుపక్షక్షయంకరః.
బాహ్లీకో నామ రాజా స బభూవ ప్రథితః క్షితౌ
నిచంద్రశ్చంద్రవక్త్రస్తు య ఆసీదసురోత్తమః.
ముంజకేశ ఇతి ఖ్యాతః శ్రీమానాసీత్ స పార్థివః
నికుంబస్త్వజితః సంఖ్యే మహామతిరజాయత.
భూమౌ భూమిపతిః శ్రేష్ఠో దేవాధిప ఇతి స్మృతః
శరభోనామ యస్తేషాం దైతేయానాం మహాసురః.
పౌరవో నామ రాజర్షి స బభూవ నరోత్తమః
కుపటస్తు మహావీర్యః శ్రీమాన్ రాజన్ మహాసురః
సుపార్శ్వ ఇతి విఖ్యాతః క్షితౌ జజ్ఞే మహీపతిః
క్రథస్తు రాజన్ రాజర్షిః క్షితౌ జజ్ఞే మహాసురః.
పార్వతేయ ఇతి ఖ్యాతః కాంచనాచలసంనిభః
ద్వితీయః శలభస్తేషామసురాణాం బభూవ హ.

కుమారుడుగా ఇంద్రుడు అర్జునరూపంలో జన్మిస్తున్నాడు. అతని కుమారుడుగా వర్చుడు ప్రభవిస్తాడు. బాల్యావస్థలోనే మహారథికుడై పదునారవయేట జరిగే కురుక్షేత్రంలో పాల్గొంటాడు. ఆసంగ్రామంలో మీరందరూ మీమీ ప్రతాపాలు ప్రదర్శిస్తారు. నరనారాయణులు దూరంగా ఉన్న సమయంలో పన్నె చక్రవ్యూహం ఛేదించి శత్రుసంహారం చేస్తాడు నా బాలుడు. మహారథికులనే గడగడలాడించి ఒక్కపూటలో శత్రువులలో నాల్గవ వంతును యమపురికి పంపుతాడు. అదే సాయంసంధ్యలో నన్ను చేరిపోతాడు. అయితే వంశోద్ధరణార్థం ఒక్క కుమారుడు అభిమన్యునికి కలుగుతాడు అనగా దేవతలు ఆమోదించారు. జనమేజయా! ఇది మీ తాతగారి విషయం.

అగ్ని అంశగా మహారథికుడు దృష్టద్యుమ్నుడూ, రాక్షసాంశతో శిఖండీ పుట్టారు. శిఖండి కన్యగా పుట్టి పురుషుడుగా మారాడు. విశ్వేదేవగణం అయిదుగురూ ద్రౌపదీనందనులయారు. ప్రతివింధ్య సుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులని వారిపేర్లు.

వసుదేవ జనకుడు శూరసేనుడు. ఈయన యదువంశశ్రేష్ఠుడు. ఆయనకూతురు పృథ. ఈమె అపురూపలావణ్యవతి. ఈశూరసేనుడు తన మేనమామ అయిన కుంతిభోజుడు సంతానంలేక బాధ పడుతూంటే తనకు కలిగిన తొలిచూలును ఆయన కిస్తానన్నాడు. ఆమాటప్రకారం పృథ కుంతిభోజుని దత్తపుత్రి అయినది. అక్కడ కుంతి అతిధిబ్రాహ్మణ సత్కారాలతో తృప్తిపడేది.

ఇలా ఉండగా ఒకనాడు కఠోరవ్రతధారీ మహానియమపరుడూ తీవ్రకోధుడూ అయిన దూర్వాసుడు వచ్చాడు. ఆయనను తన సత్కారాలతో సంతృప్తుని చేయగా ఆమహర్షి ఆమెయందు అనుగ్రహంతో— ఓకళ్యాణీ! నాకు నీమీద దయకలిగి ఈ మంత్రం ఉపదేశిస్తున్నాను. ఈ మంత్రోపాసనతో ఏదేవతను ఆహ్వానిస్తే ఆ దేవతనీకు పుత్రప్రాప్తి కలిగిస్తాడు—అన్నాడు.

ఆ మహర్షి మాటలు విని కన్యగా ఉన్న కుంతి కుతూహలంతో సూర్యభగవానుని ఆహ్వానించింది సూర్యుడు కుంతిని గర్భవతిని చేశాడు. ఆగర్భం నుండి కవచకుండల కాంతులతో సూర్యసదృశ తేజస్సుతో దేవతా విభవంబుతో శస్త్రాస్త్ర విద్యా విషయాభిజ్ఞుడైన కుమారుడు కలిగాడు. వానిని కుంతి నదిలో విడిచింది. ఆబాలుడు అతిరథుడనే పేరుగల సూతునికి దొరికాడు. అతిరథుడు ఆబాలుని తీసికొనివచ్చి భార్యయైన రాధ ఒడిలో ఉంచాడు. వారువానికి వసుషేణుడను నామకరణం చేశారు. పెరిగి పెద్దవాడై వసుషేణుడు సర్వలోక విఖ్యాతుడయాడు. వేదవేదాంగా లభ్యసించి జపదాననిరతుడై సత్యపరాక్రమంతో విరాజిల్లాడు వసుషేణుడు. అతనిముందు చెయ్యిచాపి దేహీ అని యాచించి అసంతృప్తుడై తిరిగిపోయిన బ్రాహ్మణుడు లేడు.

ఇంద్రుడు బ్రాహ్మణ వేషంతో వచ్చి కర్ణుని కవచకుండలాలర్థించాడు. శరీరంతో అతుక్కొని ఉన్నవానిని చీల్చి ఇచ్చాడు కర్ణుడు. వాని దానబుద్ధికి విస్మితుడై ఇంద్రుడు-ఓ మహాశూరుడా! ఈ శక్తిఅస్త్రాన్ని నవ్వు దేవదానవ నాగ గంధర్వాసుర మానవులలో ఎవరిపై ప్రయోగిస్తే వారు మరణిస్తారు—అని యిచ్చారు.

వసుషేణనామంతో ఉండే కర్ణుడు కవచకుండలాలు ఈయటంతో వైకర్తన నామంతో ప్రఖ్యాతు

ప్రహ్రాదో నామ బాహ్లీకః స బభూవ నరాధిపః
చంద్రస్తు దితిజశ్రేష్ఠో లోకే తారాధిపోపమః.
చంద్రవర్మేతి విఖ్యాతః కాంభోజానాం నరాదిపః
అర్క ఇత్యభివిఖ్యాతో యస్తు దానవపుంగవః
ఋషికో నామ రాజర్షిర్బభూవ నృపసత్తమః
మృతపా ఇతి విఖ్యాతో య ఆసీదసురోత్తమః.
పశ్చిమానూపకం విద్ధి తం నృపం నృపసత్తమ
గవిష్ఠస్తు మహాతేజాయః ప్రఖ్యాతో మహాసురః.
ద్రుమసేన ఇతి ఖ్యాతః పృథివ్యాంసోఽభవన్నృపః
మయూర ఇతి విఖ్యాతఃశ్రీమాన్ యస్తు మహాసురః
సువిస్వ ఇతి విఖ్యాతో బభూవ పృథివీపతిః
సువర్ణ ఇతి విఖ్యాతస్తస్మాదవరజస్తు యః
కాలకీర్తిరితి ఖ్యాతః పృథివ్యాం సోఽభవన్నృపః
చంద్రహంతేతి యస్తేషాం కీర్తితః ప్రవరోఽసురః
శునకో నామ రాజర్షిః స బభూవ నరాధిపః
వినాశనస్తు చంద్రస్య య ఆఖ్యాతో మహాసురః
జానకిర్నామ విఖ్యాతః సోఽభవన్మనుజాధిపః
దీర్ఘజిహ్వస్తు కౌరవ్య య ఉక్తో దానవర్షభః.
కాశిరాజ స్సవిఖ్యాతః పృథివ్యాం పృథివీపతే
గ్రహం తు సుషువేయంతు సింహికార్కేందుమర్దనం
సక్రాథ ఇతి విఖ్యాతో బభూవ మనుజాధిపః.
దనాయుషస్తు పుత్రాణాం చతుర్ణాం ప్రవరోఽసురః.
క్షురో నామ తేజస్వీ వసుమిత్రో నృపః స్మృతః.
ద్వితీయో విక్షరాద్యస్తు నరాధిప మహాసురః
పాండ్యరాష్ట్రాధిప ఇతి విఖ్యాతః సోఽభవన్నృపః.
బలీవీర ఇతి ఖ్యాతో యస్త్వాసీదసురోత్తమః
పౌండ్రమాత్స్యక ఇత్యేవం బభూవ స నరాధిపః.
వృత్ర ఇత్యభివిఖ్యాతో యస్తు రాజన్ మహాసురః
మణిమాన్నామ రాజర్షిః స బభూవ నరాధిపః.
క్రోధహంతేతి యస్తస్య బభూవావరజోఽసురః
దండ ఇత్యభివిఖ్యాతః స ఆసీన్నృపతిః క్షితౌ.
క్రోధవర్ధన ఇత్యేవం యస్త్వన్యః పరికీర్తితః
దండధార ఇతి ఖ్యాతః సోఽభవన్మనుజర్షభః.
కాలేయానాంతుయేపుత్రాస్తేషామష్టౌ నరాధిపాః
జజ్ఞిరే రాజశార్దూల శార్దూలసమవిక్రమాః.
మగధేషు జయత్సేనస్తేషామాసీత్ స పార్థివః
అష్టానాం ప్రవరస్తేషాం కాలేయానాం మహాసురః.
ద్వితీయస్తు తతస్తేషాం శ్రీమాన్ హరిహయోపమః
అపరాజీత ఇత్యేవం స బభూవ నరాధిపః.
తృతీయస్తు మహాతేజా మహామాయో మహాసురః
నిషాదాధిపతిర్జజ్ఞే భువి భీమపరాక్రమః.
తేషామన్యతమో యస్తు చతుర్థః పరికీర్తితః
శ్రేణిమానితి విఖ్యాతః క్షితౌ రాజర్షిసత్తమః.
పంచమస్త్వభవ తేషాం ప్రవరో యో మహాసురః
మహౌజా ఇతి విఖ్యాతో బభూవేహ పరంతపః.
షష్ఠస్తు మతిమాన్ యో వై తేషామాసీన్మహాసురః
అభీరురితి విఖ్యాతః క్షితౌ రాజర్షిసత్తమః.
సముద్రసేనస్తు నృపస్తేషామేవాభవద్ గణాత్
విశ్రుతః సాగరాంతాయాం క్షితౌ ధర్మార్థతత్త్వవిత్
బృహన్నామాష్టమస్తేషాం కాలేయానాం నరాధిప
బభూవ రాజాధర్మాత్మా సర్వభూతహితేరతః.
కుక్షిస్తు రాజన్ విఖ్యాతో దానవానాం మహాబలః
పార్వతీయ ఇతిఖ్యాతః కాంచనాచలసంనిభః.
క్రథనశ్చ మహావీర్యః శ్రీమాన్ రాజా మహాసురః
సూర్యాక్ష ఇతి విఖ్యాతః క్షితౌ జజ్ఞే మహీపతిః.
అసురాణాంతుయస్సూర్యః శ్రీమాంశ్చైవమహాసురః
దరదో నామ బాహ్లీకో వరః సర్వమహీక్షితాం.
గణః క్రోధవశో నామ యస్తే రాజన్ ప్రకీర్తితః
తతః సంజజ్ఞిరే వీరాః క్షితావిహనరాధిపాః.
మద్రకః కర్ణవేష్టశ్చ సిద్ధార్థః కీటకస్తథా
సువీరశ్చ సుబాహుశ్చ మహావీరోఽథబాహ్లికః.
క్రథో విచిత్రః సురథః శ్రీమాన్ నీలశ్చ భూమిపః

డయాడు. కవచకుండలశోభతో జన్మించిన పృథా సుతుడు కర్ణుడు అనే పేరుతోనే ప్రఖ్యాతుడై నాడు. సూతకులంలో పెరిగి అస్త్రశస్త్ర విద్యలు నేర్చి దుర్యోధనునికి ఆప్తమిత్రుడూ ఆంతరంగిక సచివుడూ అయి శత్రుసంహారకుడైన ఈ కర్ణుడు సూర్యాంశ సంభూతుడని గ్రహించు.

ఆదిదేవుడూ సనాతనుడూ అయిన నారాయణుడు వసుదేవనందనుడుగా ప్రభవించాడు. మహాబలవంతుడు బలరాముడే ఆదిశేషువు. సనత్కుమారాంశలో ప్రద్యుమ్నుడు పుట్టాడు. ఇదే ప్రకారం వసుదేవకులంలో దేవత లనేకులుపుట్టారు. ఇంద్రుని ఆదేశానుసారం అప్సరోగణం పదహారు వేల గోపికలై పుట్టారు. శ్రీకృష్ణభగవానునికి ఆనందం కలిగించడానికి లక్ష్మీదేవి భీష్మకుని ఇంట రుక్మిణియై పుట్టింది. శచీదేవి ద్రౌపదియై ద్రుపదుని యజ్ఞవేదికనుండి ప్రభవించింది.

ఆమె అవయవాలు నీలకమలగంధసంవాసితాలు. కమలదళసదృశనేత్రాలతో మనోహర నితంబంతో ఉంగరాలుతిరిగిన జుత్తుతో వైడూర్యమణిద్యుతులతో సర్వశుభ లక్షణ లక్షితాంగియై ఆమె పృథ్విపై విహరించింది. ఏకాంతంలో ఆమె పాండవప్రవరులకు సంతోషం కలిగించేది.

స్థితి—ధృతి అనువారలే కుంతీ—మాద్రి. సుబల రాజపుత్రి గాంధారిగా మతి పుట్టింది. దేవాసుర గంధర్వాప్సరోంశలతో రాక్షసాంశలతో పుట్టినవారందరినీ నీకు చెప్పాను. యుద్ధోన్మత్తులై పుట్టిన క్షత్రియులందరి వివరాలూ తెలిశాయికదా. దోష దృష్టి రహితుడై ఈ అంశలనూవారి జన్మలనూ పరమాత్మ స్వరూపలీలలనూ గ్రహించేవారిని ఏవిపత్తులూ బాధించవు. సర్వసుఖాలు ప్రాప్తిస్తాయి.

67 వ అధ్యాయం సమాప్తం

## శకుంతల

వేదవ్యాసశిష్యప్రవరుడైన వైశంపాయన మునిచంద్రుడు జనమేజయావనీశుని అభిమతానుసారం అంశావతారాదులను రేఖామాత్రంగా వివరించి కురువంశం ప్రవృద్ధమైన విధానాన్ని రసబంధురమైన శకుంతలోపాఖ్యానంతో ఆరంభిస్తున్నాడు.

దుష్యంతుడనే విఖ్యాతనామంగల చక్రవర్తివల్ల పురువంశం అభ్యుదయపరంపరలతో సాగివచ్చింది. ఆ మహారాజు వాక్కు చతుస్సముద్ర వేలావలయితమైన భూమండలమంతటా శాసనంగా చెల్లింది. ఆయన ఏలుబడి మ్లేచ్ఛదేశసీమాంతం ఉండేది. ఆ మహాప్రభువు ఏకచ్ఛత్రాధిపతి.

దుష్యంతుని పాలనలో అనులోమ విలోమ వివాహాలు జరగలేదు. వర్ణసాంకర్యం ఏర్పడలేదు. సర్వసస్యసంపత్సమృద్ధమై రత్నగర్భమై ఉండే భూమిమీద సమస్యలే లేవు ధర్మదృష్టితో సాగే ఆ జనసంఘంలో పాపచింతాపరుడైన వ్యక్తి లేడు. ప్రభుభక్తి పారమ్యంతో వారు చక్రవర్తినీ రాజ్యాన్నీకూడా సేవించేవారు. ఆ యీ కారణాలు దుష్యంతుని ధర్మార్థసంపన్నుని చేసినవి. ఆ ఏలుబడిలో చోరభీతీ అనారోగ్యపీడా ఆహారార్థమై దేవులాడే వారు లేరు (?) దేవురింపూ కల ప్రాణిలేదు.

నానాజాతులూ పరస్పరం గౌరవమర్యాదలు

చీరవాసాశ్చ కౌరవ్య భూమిపాలశ్చ నామతః.
దంతవక్త్రశ్చ నామాసీద్దుర్జయశ్చైవ దానవః
రుక్మీ చ నృపశార్దూలో రాజా చ జనమేజయః.
ఆషాఢో వాయువేగశ్చ భూరితేజాస్తథైవ చ
ఏకలవ్యః సుమిత్రశ్చ వాటధానోఽథగోముఖః.
కారూషకాశ్చ రాజానః క్షేమధూర్తిస్తథైవ చ
శ్రుతాయురుద్వహశ్చైవ బృహత్సేనస్తథైవ చ.
క్షేమోగ్రతీర్థః కుహరః కలింగేషు నరాధిపః
మతిమాంశ్చ మనుష్యేంద్ర ఈశ్వరశ్చేతి విశ్రుతః.
గణాత్ క్రోధవశాదేశరాజపూగోఽభవత్ క్షితౌ
జాతః పురా మహాభాగో మహాకీర్తిర్మహాబలః.
కాలనేమిరితి ఖ్యాతో దానవానాం మహాబలః
స కంస ఇతి విఖ్యాత ఉగ్రసేనసుతో బలీ.
యస్త్వాసీద్దేవకో నామ దేవరాజసమద్యుతిః
స గంధర్వపతిర్ముఖ్యః క్షితౌ జజ్ఞే నరాధిపః.
బృహస్పతేర్బృహత్కీర్తేర్దేవర్షేర్విద్ధి భారత
అంశాద్ద్రోణం సముత్పన్నం భారద్వాజమయోనిజం
ధన్వినాం నృపశార్దూల యః సర్వాస్త్రవిదుత్తమః
మహాకీర్తిర్మహాతేజాః స జజ్ఞే మనుజేశ్వర.
ధనుర్వేదే చ వేదే చ యం తం వేదవిదో విదుః
వరిష్ఠం చిత్రకర్మాణం ద్రోణం స్వకులవర్ధనం.
మహాదేవాంతకాభ్యాం చ కామాత్ క్రోధాచ్చ భారత
ఏకత్వముపపన్నానాం జజ్ఞే శూరః పరంతపః.
అశ్వత్థామా మహావీర్యః శత్రుపక్షభయావహః
వీరః కమలపత్రాక్షః క్షితావాసీన్నరాధిప.
జజ్ఞిరే వసవస్త్వష్టౌ గంగాయాం శాంతనోః సుతాః
వసిష్ఠస్య చ శాపేన నియోగాద్వాసవస్య చ.
తేషామవరజో భీష్మః కురూణామభయంకరః
మతిమాన్ వేదవిద్వాగ్మీ శత్రుపక్షక్షయంకరః.
జమదగ్న్యేన రామేణ సర్వాస్త్రవిదుషాం వరః
యోఽద్యత మహాతేజా భార్గవేణ మహాత్మనా.
యస్తు రాజన్ కృపో నామ బ్రహ్మర్షిరభవత్ క్షితౌ
రుద్రాణాం తు గణాద్విద్ధి సంభూత మతిపౌరుషం.
శకునిర్నామ యస్త్వాసీద్ రాజా లోకే మహారథః
ద్వాపరం విద్ధి తం రాజన్ సంభూత మరిమర్దనం.
సాత్యకిః సత్యసంధశ్చ యోఽసౌ వృష్ణికులోద్వహః
పక్షాత్ స జజ్ఞే మరుతాం దేవానామరిమర్దనః.
ద్రుపదశ్చైవ రాజర్షిస్తత ఏవాభవద్ గణాత్
మానుషే నృపలోకేఽస్మిన్ సర్వశస్త్రభృతాంవరః
తతశ్చ కృతవర్మాణం విద్ధి రాజజ్జనాధిపం
తమప్రతిమకర్మాణం క్షత్రియర్షభసత్తమం.
మరుతాం తు గణాద్ విద్ధి సంజాతమరిమర్దనం
విరాటం నామ రాజానం పరరాష్ట్రప్రతాపనం.
అరిష్టాయాస్తు యః పుత్రో హంస ఇత్యభివిశ్రుతః
సగంధర్వపతిర్జజ్ఞే కురువంశవివర్ధనః.
ధృతరాష్ట్ర ఇతి ఖ్యాతః కృష్ణద్వైపాయనాత్మజః
దీర్ఘబాహుర్మహాతేజాః ప్రజ్ఞాచక్షుర్నరాధిపః.
మాతుర్దోషాదృషేః కోపాదంధ ఏవ వ్యజాయత
తస్యైవావరజో భ్రాతా మహాసత్త్వో మహాబలః.
స పాండురితి విఖ్యాతః సత్యధర్మరతః శుచిః
అత్రేస్తు సుమహాభాగం పుత్రం పుత్రవతాం వరం
విదురం విద్ధి తం లోకే జాతం బుద్ధిమతాం వరం.
కలేరంశస్తు సంజజ్ఞే భువి దుర్యోధనో నృపః
దుర్బుద్ధిర్దుర్మతిశ్చైవ కురూణామయశస్కరః.
జగతో యస్తు సర్వస్య విద్విష్టః కలిపురుషః
యః సర్వాం ఘాతయామాస పృథివీం పృథ్వీపతే.
ఉద్దీపితం యేన వైరం భూతాంతకరణం మహత్
పౌలస్త్యా భ్రాతరశ్చాస్య జజ్ఞిరే మనుజేష్విహ.
శతం దుఃశాసనాదీనాం సర్వేషాం క్రూరకర్మణాం.

నమస్కరింటూ ప్రేమాభిమానాలతో ప్రవర్తించే వారు. సర్వభూతదయార్ద్రహృదయులు వారు. ధన ధాన్యసంపదలతో భూమండలం అలరారేది. అస త్యం ద్రోహచింతన లేకుండా బ్రాహ్మణులు కర్మ తత్పరులై ఉండేవారు. వర్ణాశ్రమధర్మవ్యవస్థ సుప్ర తిష్ఠంగా ఉండేది.

ఆ దుష్యంతుడు మహాపరాక్రమోపేతుడై తన వజ్రబాహువులతో మేరువునే బంతిలా ఎగురవేయ గలిగిన యౌవనంలో ఉన్నాడు. ప్రక్షేప విక్షేప పరిక్షేప అభిక్షేపములనే చతుర్విధగదాప్రహార కుశలుడయ్యాడు. ఫాలాక్షుని మెప్పు పొందగల ధను ర్విద్యావేత్త; ఏనుగును నడపడంలో, అశ్వాన్ని అధి రోహించడంలో, అద్భుత ప్రజ్ఞ ప్రదర్శించి ఆశ్చర్య చకితుల్ని చేసేవాడు. సాగరగంభీరుడు. విష్ణుసమ బలుడు. క్షమాశక్తిలో భూమివంటివాడు. ఆ మహా రాజు ఎదుటివారిని సముచితంగాగౌరవించిగౌరవాలు పొందేవాడు. వైదికశాసనానుసారం సాగే ఆరాజు ఏలుబడిలో ప్రజలందరూనిత్యసంతోషచిత్తులై ఉండే వారు. ప్రభువు ధర్మపరాయణుడై ప్రజలకు ఆద ర్శంగా ఉండేవాడు.

68 వ అధ్యాయము సమాప్తము.

## అరువది తొమ్మిదవ అధ్యాయము

### మృగయావినోదము

ఒకానొకనాడు ఆ దుష్యంతమహారాజు వేటకు బయలుదేరాడు. ఆమహారాజుకి ఇరువంకలా మహా వీరులు బారులు తీర్చి గదా ఖడ్గ శక్తి తోమర ముసలాద్యాయుధాలతో నడుస్తున్నారు. ఏనుగులూ గుర్రాలూ పంతులు తీర్చి సాగుతున్నాయి. హయ హేషలతో గజఘీంకారాలూ యోధుల శంఖధ్వ నాలూ భేరీ ఢక్కా కాహళనిస్వనాలూ దశదిశలా మార్మ్రోగుతున్నాయి. చిత్రవిచిత్ర వస్త్రాభరణా లంకృతులై సాగే వీరుల కరతాళధ్వనులు వానిలో లీనమవుతున్నాయి.

శత్రుసంహారం చేసి కీర్తికాంతను చేబట్టడంలో దేవేంద్రుని ధిక్కరించగలవాడూ సంగరరంగంలో వసువులతో సమమైన పరాక్రమం ప్రదర్శించగల వాడూ అయిన దుష్యంతరాజేంద్రుడు చతురంగ బలాలతో వేటకు సాగుతూంటే నగరనారీజనం సౌధాగ్రభాగాలనుండి తిలకిస్తూ శ్రవణసుభగంగా అభినుతిస్తున్నారు. స్వీయభుజబలంతో ఆబాలగోపా లానికి ప్రశాంతియుతమైన ప్రమోదజీవితం ప్రసా దించే ప్రభువుకి అంజలు లర్పిస్తున్నారు.

మేడలపైనుండి ప్రభువుపై పూలజల్లులు కురి పిస్తూంటే మధ్యే మధ్యే మార్గపార్శ్వాల నున్న భూసురశ్రేష్ఠులు ఆశీర్వాదసూక్తాలు పఠిస్తూంటే శార్దూల సింహ వనవరాహ ఖడ్గమృగాది భయం కర జంతు సంహారార్థం మహారాజు సాగుతూం డగా నాలుగు జాతులవారూ ఆయన వెన్నంటి జయజయధ్వానాలు నమపుతున్నారు. పురబహి ర్ద్వారం చేరేవరకూ వారిని వెంట రానిచ్చి సెల విచ్చాడు మహారాజు. పౌరజానపదులు స్వగృహో న్ముఖు లయ్యారు.

గరుత్మంతునితో సమంగా సాగగల రథంమీద దుష్యంతుడు సాగుతున్నాడు. సాగే రథధ్వని

దుర్ముఖో దుఃసహశ్చైవ తే చానే నానుకీర్తితాః.
దుర్యోధనసహాయాస్తే పౌలస్త్యా భరతర్షభ
వైశ్యాపుత్రో యుయుత్సుశ్చ ధార్తరాష్ట్రః
శతాధికః

జ్యేష్ఠానుజ్యేష్ఠతామేషాం నామధేయాని వా విభో
ధృతరాష్ట్రస్య పుత్రాణామానుపూర్వ్యేణ కీర్తయ.
దుర్యోధనో యుయుత్సుశ్చ రాజన్ దుఃశాసనస్తథా
దుఃసహో దుశ్శలశ్చైవ దుర్ముఖశ్చ తథాపరః
వివింశతి ర్వికర్ణశ్చ జలసంధః సులోచనః
విందానువిందా దుర్ధర్షః సుబాహుర్దుష్ప్రధర్షణః.
దుర్మర్షణో దుర్ముఖశ్చ దుష్కర్ణః కర్ణ ఏవ చ
చిత్రోపచిత్రౌ చిత్రాక్షశ్చారుశ్చిత్రాంగదశ్చ హ.
దుర్మదో దుష్ప్రధర్షశ్చ వివిత్సు ర్వికటః సమః
ఊర్ణనాభః పద్మనాభ స్తథా నందోపనందకౌ.
సేనాపతిః సుషేణశ్చ కుండోదర మహోదరౌ
చిత్రబాహుశ్చిత్రవర్మా సువర్మా దుర్విరోచనః.
అయోబాహుర్మహాబాహుశ్చిత్రచాపసుకుండలౌ
భీమవేగో భీమబలో బలాకీ భీమవిక్రమః.
ఉగ్రాయుధో భీమశరః కనకాయుర్దృఢాయుధః
దృఢవర్మా దృఢక్షత్రః సోమకీర్తి రనూదరః.
జరాసంధో దృఢసంధ స్సత్యసంధ స్సహస్రవాక్
ఉగ్రశ్రవా ఉగ్రసేనః క్షేమమూర్తి స్తథైవ చ.
అపరాజితః పండితకో విశాలాక్షో దురాధనః.
దృఢహస్త స్సుహస్త శ్చ వాతవేగ సువర్చసౌ.
ఆదిత్యకేతు ర్బహ్వాశీ నాగదత్తానుయాయినౌ.
కవచీ నిషంగీ దండీ దండధారో ధనుర్గ్రహః
ఉగ్రో భీమరథో వీరో వీరబాహు రలోలుపః.
అభయో రౌద్రకర్మా చ తథా దృఢరథశ్చ యః
అనాధృష్యః కుండభేదీ విరావీ దీర్ఘలోచనః.
దీర్ఘబాహుర్మహాబాహుర్వ్యూఢోరుఃకనకాంగదః
కుండజ శ్చిత్రకశ్చైవ దుశ్శలా చ శతాధికా.
వైశ్యాపుత్రో యుయుత్సుశ్చ ధార్తరాష్ట్రః శతాధికః
ఏతదేకశతం రాజన్ కన్యా చైకా ప్రకీర్తితా.
నామధేయానుపూర్వ్యాచ జ్యేష్ఠానుజ్యేష్ఠతాం విదుః
సర్వేత్వతిరథాశ్శూరాః సర్వే యుద్ధవిశారదాః.
సర్వే వేదవిదశ్చైవ రాజన్ శాస్త్రే చ పారగాః
సర్వే సంగ్రామవిద్యాసు విద్యాభిజనశోభినః.
సర్వేషా మనురూపాశ్చ కృతా దారా మహీపతే
దుస్సలాం సమయే రాజన్ సింధురాజాయ కౌరవః.
జయద్రథాయ ప్రదదౌ సౌబలానుమతే తదా
ధర్మస్యాంశం తు రాజానం విద్ధి రాజన్ యుధిష్ఠిరం.
భీమసేనం తు వాతస్య దేవరాజస్య చార్జునం
అశ్వినోస్తు తథైవాంశౌ రూపేణా ప్రతిమౌ భువి.
నకులః సహదేవశ్చ సర్వభూతమనోహరౌ
యస్తు వర్చా ఇతిఖ్యాతః సోమపుత్రః ప్రతాపవాన్.
సోఽభిమన్యు ర్బృహత్కీర్తి రర్జునస్యసుతోఽభవత్
యస్యావతరణే రాజన్ సురాన్ సోమోఽబ్రవీదిదం.
నాహం దద్యాం ప్రియంపుత్రంమమప్రాణై ర్గరీయసం
సమయః క్రియతామేష న శక్య మతివర్తితుం.
సురకార్యం హి నః కార్య మసురాణాం క్షితౌ వధః
తత్రయాస్యత్యయం వర్చా న చ స్థాస్యతి వై చిరం.
ఐంద్రిర్నస్తు భవితా యస్య నారాయణః సఖా
సోఽర్జునేత్యభివిఖ్యాతః పాండోః పుత్రః ప్రతాపవాన్
తస్యాయం భవితా పుత్రో బాలో భువి మహారథః
తతః షోడశవర్షాణి స్థాస్యత్యమరసత్తమాః.
అస్య షోడశ వర్షస్య స సంగ్రామో భవిష్యతి
యత్రాంశావః కరిష్యంతి కర్మ వీరనిషూదనం.
నరనారాయణాభ్యాం తు స సంగ్రామో వినాకృతః
చక్రవ్యూహం సమాస్థాయ యోధయిష్యంతివః
సురాః.

ఆకాశాన్ని తాకుతూన్నది. నందనవనసదృశమైనఒక వనం మహారాజు దృష్టిలో పడింది. అర్క బిల్వ చండ్రి వెలగచెట్లతో ఉన్న వనంలో రథం సాగు తోంది. ఉన్నత పర్వతాగ్రాలనుండి జారిపడిన రాతి బండలతో మార్గం క్లిష్టంగా ఉంది. యోజనాల వైశాల్యం గల ఆ అడవిలో జలప్రదేశంగానీ మనుష్యసంచారంగానీ గోచరించటంలేదు.

సింహ శార్దూల భల్లూకాది జంతుధ్వానాలు చెలరేగుతూన్న అరణ్యమధ్యంలోకి నిర్భయంగా సాగుతున్నాడు దుష్యంతుడు. అడుగు పెడుతూనే బాణం సంధించాడు. భటులు ఆయుధాలు విసరు తున్నారు. ఘాతుకమృగసంహారం ఆరంభమైంది. కత్తులతో శూలాలతో జంతువుల ప్రాణాలు యమ పురికి పోతున్నాయి. నానావిధమృగాలనూ అనే కాయుధాలతో సంహరిస్తూ గదాయుద్ధ కుశలు డైన మహారాజు మత్తేభాలను గదలతో మోది కుంభస్థలాలు చీలుస్తున్నాడు. స్వామిభక్తిపరా యణులైన సేవకులు మూలమూలలా గాలించి క్రూరమృగాలను సంహరిస్తున్నారు. మృగజాతులు సమూహాలుగా మరణిస్తున్నాయి. భయంతో పరు వులు తీసే మృగాలు దప్పికతో జలాశయస్థానాలకు పోయి ఎండిన సరోవరాలను చూచి అక్కడే నేల కొరిగిపోతున్నాయి. పెద్దపులి లక్షణాలు కల ఆట వికులు పచ్చిమాంసమే తినేస్తున్నారు. మరికొందరు అక్కడే అగ్నిని ప్రజ్వలింపజేసి కాల్చుకు తింటు న్నారు.

ఆ అరణ్యాకాశం మీాద సేనామేఘాలావరించి బాణవర్షంతో చీకాకు పరుస్తూంటే శరీరమంతా చిల్లులు పడి పరుగెత్తే ఏనుగులు ఇంద్రియాల పట్టు తప్పిపోయి రక్తంతో మలమూత్రాలతో మార్గాన్ని ధ్వంసం చేస్తున్నాయి. దుష్యంత మహా రాజు విడిచిన బాణాలతో నేలకూలిన సింహసము దాయం అరణ్యానికి నూతనశోభ సమకూర్చింది.

69 వ అధ్యాయం సమాప్తం

## డెబ్బదియ వ అధ్యాయము

### కణ్వాశ్రమం

అడవి మృగాలను సంహరిస్తూ దుష్యంతుడు ఒంటరిగా మరొక అరణ్యంలోకి వెళ్ళిపోయాడు. వేటలో అలసిన దుష్యంతుడు ఆకలి దప్పికలతో అటూ ఇటూ చూస్తూ సాగిపోతున్నాడు. సాగే దుష్యంతునికిఊసరక్షేత్రం స్వాగతమిచ్చింది. దాన్ని దాటి మరొక అడవిలో అడుగు పెట్టాడు. హృద యానికి ఉల్లాసమూ మనస్సుకు ఆనందమూ కలిగించే ఆశ్రమాలతో సుందరరమణీయంగా ఉంది ఆ అర ణ్యం. ఫలపుష్పసంభరిత వృక్షాలతో పచ్చిక బయ ళ్ళతో శుకపికసంతతుల కలస్వనాలతో విశాలతరు చ్ఛాయలతో తుమ్మెదల ఝంకారాలతో శీతల వాయువులతో ఆ అరణ్యం దుష్యంతమహారాజుకి స్వాగతం పలికింది. ఎత్తుగా పెరిగిన వృక్షాలూ వాని మీాది లతలూ పూలజల్లులతో మహారాజుకి అతిథి సత్కారం జరిపాయి. కోకిలల పంచమకూజితం చెవులకింపుగా వినవస్తోంది. రంగురంగుల పువ్వులు వస్త్రాలుగాధరించినచెట్లకొమ్మలమీాదమధులోలుపాలు

విముఖాన్ శాత్రవాన్ సర్వాన్ కారయిష్యతి మే సుతః
బాలః ప్రవిశ్య చ వ్యూహమేద్యం విచరిష్యతి.
మహారథానాం వీరాణాం కదనం చ కరిష్యతి
సర్వేషామేవ శత్రూణాం చతుర్థాంశం న యిష్యతి.
దినార్ధేన మహాబాహుః ప్రేతరాజపురం ప్రతి
తతో మహారథైర్వీరైః సమేత్య బహుశో రణే.
దినక్షయే మహాబాహుర్మయా భూయః సమేష్యతి
ఏకం వంశకరం పుత్రం వీరం వై జనయిష్యతి.
ప్రణష్టం భారతం వంశం స భూయో ధారయిష్యతి
ఏతత్ సోమవచః శ్రుత్వా తథాస్త్వితి దివౌకసః.
ప్రత్యూచుః సహితాః సర్వే తారాధిపమపూజయన్
ఏవం తే కథితం రాజంస్తవ జన్మ పితుః పితుః.
అగ్నేర్భాగం తువిద్ధి త్వం ధృష్టద్యుమ్నం మహారథం
శిఖండినమథో రాజన్ స్త్రీపూర్వం విద్ధి రాక్షసం.
ద్రౌపదేయాశ్చ యే పంచ బభూవుర్భరతర్షభ
విశ్వాన్ దేవగణాన్ విద్ధి సంజాతాన్ భరతర్షభ.
ప్రతివింధ్యః సుతసోమః శ్రుతకీర్తిస్తథాపరః
నాకులిస్తు శతానీకః శ్రుతసేనశ్చ వీర్యవాన్.
శూరో నామ యదుశ్రేష్ఠో వసుదేవపితాభవత్
తస్య కన్యా పృథా నామ రూపేణాసదృశీ భువి.
పితుఃస్వస్రీయపుత్రాయసో ఽనపత్యాయ వీర్యవాన్
అగ్రమగ్రే ప్రతిజ్ఞాయ స్వస్యాపత్యస్య వై తదా.
అగ్రజాతేతి తాం కన్యాం శూరో ఽనుగ్రహకాంక్షయా
అదదాత్ కుంతిభోజాయ స తాం దుహితరంతదా.
సా నియుక్తా పితుర్గేహే బ్రాహ్మణాతిథిపూజనే
ఉగ్రం పర్యచరద్ఘోరం బ్రాహ్మణం సంశితవ్రతం.
నిగూఢనిశ్చయం ధర్మే యం తం దుర్వాససంవిదుః
తముగ్రంశంసితాత్మానంసర్వయత్నైరతోషయత్

తుష్టోఽభిచారసంయుక్తమాచచక్షే యథావిధి
ఉవాచచైనాం భగవాన్ ప్రీతోఽస్మిసుభగే తవ.
యం యం దేవంత్వమేతేనమంత్రేణావాహయిష్యసి
తస్య తస్య ప్రసాదాత్ త్వం దేవి పుత్రాన్ జనిష్యసి.
ఏవముక్తా చ సా బాలా తదాకౌతూహలాన్వితా
కన్యా సతీ దేవమర్కమాజుహావ యశస్వినీ.
ప్రకాశకర్తా భగవాం స్తస్యాం గర్భం దధౌ తదా
అజీజనత్ సుతం చాస్యాం సర్వశస్త్రభృతాంవరం.
సకుండలం సకవచం దేవగర్భశ్రియాన్వితం
దివాకరసమం దీప్త్యా చారుసర్వాంగభూషితం.
నిగూహమానా జాతం వై బంధుపక్షభయాత్తదా
ఉత్ససర్జ జలే కుంతీ తం కుమారం యశస్వినం.
తముత్సృష్టం జలే గర్భం రాధాభర్తామహాయశాః
రాధాయాః కల్పయామాసపుత్రం సోఽధిరథ స్తథా
చక్రతుర్నామధేయం చ తస్య బాలస్య తావుభౌ
దంపతీ వసుషేణేతి దిక్షు సర్వాసు విశ్రుతం.
సంవర్ధమానో బలవాన్ సర్వాస్త్రేషూత్తమో ఽభవత్
వేదాంగాని చ సర్వాణి జజాప జయతాం వరః.
యస్మిన్ కాలే జపన్నాస్తే ధీమాన్సత్యపరాక్రమః
నాదేయం బ్రాహ్మణేష్వాసీత్ తస్మిన్ కాలేమహాత్మనః
తమింద్రో బ్రాహ్మణో భూత్వా పుత్రార్థే భూతభావనః
యయాచే కుండలే వీరం కవచం సహాంగజం.
ఉత్కృత్య కర్ణో హ్యదదాత్ కవచకుండలే తథా
శక్తిం శక్రోదదౌ తస్మై విస్మితశ్చేదమబ్రవీత్.
దేవాసురమనుష్యాణాం గంధర్వోరగరక్షసాం
యస్మిన్ క్షేప్స్యసి దుర్ధర్ష స ఏకో న భవిష్యతి.
పురా నామ చ తస్యాసీద్ వసుషేణ ఇతి క్షితౌ

(తుమ్మెదలు) మధురమధురంగా ఝుంకరిస్తు న్నవి. పుష్పగుచ్ఛాలతో నిండిన లతామండపాలతో అలరారే రమణీయ మనోహరప్రదేశాలు తిలకిస్తూ దుష్యంతుని రథం సాగుతోంది.

ఆకాశాన్నంటే వృక్షాలు ఇంద్రధ్వజాల్లా కని పిస్తున్నాయి. సిద్ధులూ చారణులూ గంధర్వులూ అప్సరసలూ కిన్నరులూ వానరులూ ఆ అరణ్యంలో ఆనందంగా గడుపుతున్నారు. మందమందంగా సుగంధవాయువు వనం అంతా చరిస్తోంది.

మాలినీనదీతీరాన ఉన్న ఆ అరణ్య శోభను చూస్తూ ముందుకుపోయే ఆ మహారాజు దృష్టి ఒక ఆశ్రమం మీద పడింది. ఆశ్రమ పరిసరాలలో పవిత్రాగ్ని హోత్రజ్వాలలు ప్రజ్వలిస్తున్నాయి.

త్యాగులూ విరాగులూ యతులూ వాలఖిల్యాది మహర్షులూ ఆ అరణ్యంలోనే వసిస్తున్నారు. పరి వేష్టించి ఉన్న చెట్లనుండి రాలినపువ్వులు పూల పానుపుల్లా ఉన్నాయి. ఆ ఆశ్రమం మాలినీనదీ తీరాన ఉన్నది. ఆనదిలో చరించే జలపక్షులు కిల కిలధ్వానాలు చేస్తున్నాయి. అక్కడి సర్పాలూ ఘాతుకమృగాలూ శాంతసౌమ్యస్వభావంతో ఉన్నాయి. అవక్రపరాక్రమసంపన్నుడైన దుష్యం తుడు దేవలోకంలా ఉన్న ఆ ఆశ్రమం సమీపిం చాడు. సర్వప్రాణికోటికీ మధురజలధారలర్పిస్తూ మాతృత్వ గౌరవం పొందే మాలినీనదిని చూశాడు మహారాజు. ఎన్నో పుష్పాలు ఆనదిలో నురగలా కొట్టుకుపోతున్నాయి. ఆనదీతటాన కిన్నరనివాసం ఉన్నది. అక్కడే వానరభల్లూకాలు చరిస్తున్నాయి. మాలినీ సికతాతలాలు నయనమనోహరాలు. ఆ పరి సరాలన్నీ మత్తేభాలతో మృగేంద్రాలతో ఘోర సర్పాలతో నిండిఉన్నాయి.

నిరంతర వేదాధ్యయన అధ్యాపనసంపన్నమై అలరారే ఆ ఆశ్రమం కాశ్యపవంశీయుడైన కణ్వ మహర్షి నిజావాసం. మాలినీ - కణ్వాశ్రమసాన్ని హిత్య సందర్శనంతో సంతృప్తిపొందిన దుష్యంతుడు ఆశ్రమంలో అడుగుపెట్టడానికి నిశ్చయించుకొన్నాడు. పావనమందాకినీ తటాన నరనారాయణాశ్రమంవలె ఉన్నదిమాలినీతీరాన కణ్వాశ్రమం. కుబేరుని చైత్ర రథవనంలా మత్తమయూర మనోహర నినాదాలతో అలరారే ఆ అరణ్యంలోని ఆశ్రమంలో అడుగు పెట్టాడు మహారాజు. అప్పటికి మహారాజును సమీ పించిన చతురంగబలాలనూ అక్కడే ఆగమని ఆదే శించి కణ్వమహర్షి సందర్శనార్థం తాను వెడుతు న్నానని చెప్పాడు.

ఆశ్రమదర్శనమాత్రేణ దుష్యంతుని క్షుత్పిపా సలు తీరినవి. రాజలాంఛనాలు విడిచి మంత్రిపురో హితులు వెంటరా ఆశ్రమంలోకి వచ్చే ఆ మహా రాజు చెవులకు వైదికఋక్కులు తృప్తి కలిగిస్తు న్నాయి. యజుర్వేదసూక్తాలు పులక లెత్తిస్తు న్నాయి. బ్రహ్మచర్యనియమంతో ఉన్న మహర్షుల మధురగళతంత్రులు సామగానం చేస్తున్నాయి. యజుస్సామాథర్వవేదవేత్తలు భారుండ సంజ్ఞతో ఉండే సామగీతాలతో అథర్వణవేద మంత్రాలను పఠిస్తున్నారు. పదక్రమాలతో సామగానం సాగు తూంటే అథర్వవేత్తలు పూగయజ్ఞ మంత్రాలు పఠి స్తున్నారు. విప్రబాలు రందరూ సంస్కారంపొంది శబ్దబ్రహ్మను ఉపాసిస్తున్నారు. స్థాన కరణ ప్రయ త్నాదులలో ధ్యానం ఉంచి సంస్కృత వాక్యాలు పఠిస్తున్నారు. ఉచ్చారణ దక్షులైన బ్రహ్మవిదుల వైదికగానముఖరితమై ఆ ఆశ్రమం ఆధ్యాత్మిక శోభతో అలరారుతున్నది.

తతో వైకర్తనః కర్ణః కర్మణా తేన సోఽభవత్.
ఆముక్తకవచో వీరో యస్తు జజ్ఞే మహాయశాః
స కర్ణ ఇతి విఖ్యాతః పృథాయాః ప్రథమః సుతః
స తు సూతకులే వీరో వవృధే రాజసత్తమ
కర్ణం నరవరశ్రేష్ఠం సర్వశస్త్రభృతాం వరం.
దుర్యోధనస్య సచివం మిత్రం శత్రువినాశనం
దివాకరస్య తం విద్ధి రాజన్నంశమనుత్తమం.
**యస్తు** నారాయణో నామ దేవదేవః సనాతనః
తస్యాంశో మానుషేష్వాసీద్ వాసుదేవః ప్రతాప
వాన్.
శేషస్యాంశశ్చ నాగస్య బలదేవో మహాబలః
సనత్కుమారం ప్రద్యుమ్నం విద్ధి రాజన్
మహౌజసం.
ఏవమన్యే మనుష్యేంద్ర బహవోంఽశా దివౌకసాం
జజ్ఞిరే వాసుదేవస్య కులే కులవివర్ధనాః.
గణస్త్వప్సరసాం యో వై మయా రాజన్ ప్రకీర్తితః
తస్య భాగః క్షితౌ జజ్ఞే నియోగా ద్వాసవస్య హ
తాని షోడశ దేవీనాం సహస్రాణి నరాధిప
బభూవర్మానుషే లోకే వాసుదేవపరిగ్రహాః.
శ్రియస్తు భాగః సంజజ్ఞే రత్యర్థం పృథివీతలే
భీష్మకస్య కులే సాధ్వీ రుక్మిణీనామ నామతః.
ద్రౌపదీ త్వథ సంజజ్ఞే శచీభాగాదనిందితా
ద్రుపదస్య కులే కన్యా వేదిమధ్యాదనిందితా.
నాతిహ్రస్వా న మహతీ నీలోత్పలసుగంధినీ
పద్మాయతాక్షీ సుశ్రోణీ స్వసితాంచితమూర్ధజా.
సర్వలక్షణసంపూర్ణా వైడూర్యమణిసంనిభా
పంచానాం పురుషేంద్రాణాం చిత్తప్రమథినీ రహః
సిద్ధిర్ధృతిశ్చ యే దేవ్యౌ పంచానాం మాతరౌ తు తే
కుంతీ మాద్రీ చ జజ్ఞాతే మతిస్తు సుబలాత్మజా.
ఇతి దేవాసురాణాం తే గంధర్వాప్సరసాం తథా
అంశావతరణం రాజన్ రాక్షసానాం చ కీర్తితం.
యే పృథివ్యాం సముద్భూతా రాజానో యుద్ధ
దుర్మదా
మహాత్మానో యదూనాం చ యే జాతా విపులే కులే.
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా మయా తే పరి
కీర్తితాః
ధన్యం యశస్యం పుత్రీయమాయుష్యం విజయా
వహం
ఇదమంశావతరణం శ్రోతవ్యమనసూయతా.
అంశావతరణం శ్రుత్వా దేవగంధర్వరక్షసాం
ప్రభవాప్యయవిత్ ప్రాజ్ఞో న కృచ్ఛ్రేష్వవసీదతి.

67 వ అధ్యాయం సమాప్తం



ఆత్మానుభవ సంపన్నులూ, వేదపారగులూ, న్యాయవేత్తలూ; క్రమశిక్షాకుశలులూ విరుద్ధంగా గోచరించే వాక్యాలకు ఏకత్వసిద్ధి చేయగలవారూ ఉపాసనావిషయాభిజ్ఞులూ సిద్ధాంతప్రవీణులూ మోక్షధర్మతత్పరులూ వ్యాకరణ ఛందో నిరుక్త జ్యోతిష శిక్షా కల్ప ప్రముఖ వేదాంగవేత్తలూ సత్వరజస్తమోగుణాత్మక పదార్థజ్ఞాతలూ కార్య కారణ భావజ్ఞులూ పశుపక్షి భాషావేత్తలూ మీమాంసా విషయజ్ఞులూ అయిన మహాపురుషులతో అలరారే ఆశ్రమంలో కఠోరనియమాలతో తపోదీక్ష సాగించే మహర్షులనూ జపహోమతత్పరులైన విప్రవరులనూ చూస్తూ ముందడుగువేస్తున్నాడా మహారాజు. విచిత్రాసనాలమీద ఆ మహాపురుషులు సాగించే దైవీపూజ చూసి బ్రహ్మలోకం అంటే ఇదే అనుకున్నాడాచక్రవర్తి. ఆ సన్నివేశాలను ఎంత చూసినా ఆ శబ్దాలను ఎంత విన్నా ఆయనకు సంతృప్తి కలగడం లేదు. మనోహరమూ మంగళప్రదమూ అయి కణ్వమహర్షి తపశ్శక్తితో పరిరక్షింపబడే ఆ ఆశ్రమం దుష్యంతుని హృదయాన్ని నిర్విరామంగా అలరిస్తున్నది.

70 వ అధ్యాయం సమాప్తం

## డెబ్బదిఒకటవ అధ్యాయము

### మేనక

దుష్యంతమహారాజు మహర్షి కణ్వుని ఆశ్రమాంగణంలో ప్రవేశించే ముందు మంత్రి పురోహితులను బైట ఉండమని ఆజ్ఞాపించి ఆనందంతో ఆశ్రమంలోకి అడుగువేశాడు. ఆ మహారాజు ఆశించినట్లు కణ్వుల దర్శనం లభించలేదు. ఆశ్రమంలో ఏ ఒక్కరూ లేకపోవడం చూసి-ఎవరిక్కడా అని మేఘగంభీరంగా పిలిచాడు.

ఆ పిలుపు విని—

రూపయౌవనశీలాలకు సదాచార సంపత్తి ఆచ్ఛాదనగా ఉండే శ్రీదేవివంటి ఒకానొక తాపస కన్య మహారాజు ఎదుట నిలిచింది.

నిలచిన తరుణి, పద్మదళనేత్రాలతో విశాల వక్షంతో సర్వాంగస్ఫూర్తితో సింహస్కంధుడూ దీర్ఘబాహుడూ అయి శుభలక్షణాలతో శోభిల్లే చక్రవర్తిని చూసింది. చూసిన ఉత్తరక్షణంలో వినయభారంతో గొంతువిప్పి—అతిథి దేవోభవ- అని దోయిలించిన హస్తాలతో దారిచూపుతూ తీసికొని వెళ్ళి అర్ఘ్యపాద్యాలర్పించి ఉచితాసనం చూపి మర్యాదానుసారం కుశలప్రశ్నలు వేసి దుష్యంతుని సమాధానాలతో సంతృప్తిపడి మృదుస్మితంతో-- ఆర్యా ! ఏప్రయోజనాపేక్షతో తమరు ఇలా విచ్చేశారు. ఈ ఆశ్రమంలో మీకు కావలసిన సేవలు కోరండి. ముందుగా మీ రెవరో తెలిసికోవచ్చునా?- అని ప్రశ్నించిన ఆ బాలను చూసి అతిథి మర్యాదలతో హర్షహృదయుడైన దుష్యంతుడు అరుణాబ్జాయతలోచనా ! నేను ఇలిల మహారాజు పుత్రుడను. ప్రజలు నన్ను దుష్యంతుడని పిలుస్తారు. మహర్షి కణ్వులను దర్శించి వారికి అభివాదాలర్పించి ఆశీర్వాదాలు తీసికొని వెడదామని వచ్చాను కానీ వా రున్న జాడ లేదు. అని సాభిప్రాయంగా ఆగాడు.

శ్రీ మహాభారతకథాశ్రవణ కుతూహలచిత్తుడైన
పరీక్షిన్నందనుడు జనమేజయ రాజర్షి
అంశావతారాదికాలను ఆకర్ణించి, అనంతరం
శకుంతలోపాఖ్యానం వినబోతున్నాడు.

# శకుంతల

త్వత్తః శ్రుతమిదం బ్రహ్మన్ దేవదానవ రక్షసాం
అంశావతరణం సమ్యగ్ గంధర్వాప్సరసాం తథా.
ఇమం తు భూయ ఇచ్ఛామి కురూణాం వంశమాదితః
కథ్యమానం త్వయా విప్ర విప్రర్షిగణసంనిధౌ.
పౌరవాణాం వంశకరో దుష్యంతో నామ వీర్యవాన్
పృథివ్యాశ్చతురంతాయా గోప్తా భరతసత్తమ.
చతుర్భాగం భువః కృత్స్నం యో భుంక్తే మనుజేశ్వరః
సముద్రావరణాంశ్చాపి దేశాన్ స సమితింజయః.
ఆమ్లేచ్ఛావధికాన్ సర్వాన్ స భుంక్తే రిపుమర్దనః
రత్నాకరసముద్రాంతాంశ్చాతుర్వర్ణ్యజనావృతాన్
న వర్ణసంకరకరో న కృష్యాకరకృజ్జనః
న పాపకృత్ కశ్చిదాశీత్ తస్మిన్ రాజని శాసతి.
ధర్మే రతిం సేవమానా ధర్మార్థావభిపేదిరే
తదా నరా నరవ్యాఘ్ర తస్మిన్ జనపదేశ్వరే.
నాసీచ్చోరభయం తాత న క్షుధాభయమణ్వపి
నాసీద్వ్యాధిభయం చాపి తస్మిన్ జనపదేశ్వరే.
స్వధర్మే రేమిరే వర్ణా దైవే కర్మణి నిస్పృహాః
తమాశ్రిత్య మహీపాలమాసంశ్చైవాకుతోభయాః
కాలవర్షీ చ పర్జన్యః సస్యాని రసవంతి చ
సర్వరత్నసమృద్ధా చ మహీ పశుమతీ తథా.
స్వకర్మనిరతా విప్రా నానృతం తేషు విద్యతే
స చాద్భుతమహావీర్యో వజ్రసంహననో యువా.
ఉద్యమ్య మందరం దోర్భ్యాం వహేత్ సవన కాననం
చతుష్పథగదాయుద్ధే సర్వప్రహరణేషు చ.
నాగపృష్ఠేఽశ్వపృష్ఠే చ బభూవ పరినిష్ఠితః
బలే విష్ణుసమశ్చాసీత్ తేజసా భాస్కరోపమః.
అక్షోభ్యత్వేఽర్ణవసమః సహిష్ణుత్వే ధరాసమః
సమ్మతః స మహీపాలః ప్రసన్నపురరాష్ట్రవాన్
భూయో ధర్మపరైర్భావైర్ముదితం జనమాదిశత్.

68 వ అధ్యాయము సమాప్తం.

## అరువది తొమ్మిదవ అధ్యాయం

సంభవం భరతస్యాహం చరితం చ మహామతేః
శకుంతలాయాశ్చోత్పత్తిం శ్రోతుమిచ్ఛామి తత్త్వతః
దుష్యంతేన చ వీరేణ యథా ప్రాప్తా శకుంతలా
తం వై పురుషసింహస్య భగవన్ విస్తరం త్వహం.
శ్రోతుమిచ్ఛామి తత్త్వజ్ఞ సర్వం మతిమతాం వర
న కదాచిన్మహాబాహుః ప్రభూతబలవాహనః.

పితృపాదులు ఫలాలకోసం ఆశ్రమం విడిచి వెళ్ళారు. రెండు ఘడియల్లో వచ్చేస్తారు. కూర్చోండి- అన్నది ఆమె కలకంఠం.

మధుర మందహాస సుషమా సుందర వదనంతో అలరారే ఆశోభనాంగి—మహర్షి ఆశ్రమంలో లేరనీ ఆయన వచ్చేవరకూ వేచి ఉండమనీ— అంటూ న్నది. తపస్సుతో ఇంద్రియసంయమనంతో పరి పుష్టమైన ఆమె శరీరం తేజోమయంగా ఉన్నది. యౌవనానురూపమైై ఉన్నదామె. ఈ విషయసర్వ స్వాభిభూతుడై దుష్యంతుడు గొంతువిప్పుతున్నాడు.

ఓ శుభమయీ! దర్శనమాత్రంచేత మాహృ దయం అలరించి హరించిన నువ్వెవరివో తెలిసికో వాలని మా మనస్సు తొందరపడుతూన్నది. అఖిల లోకాశ్చర్యకర సౌందర్య సుషమాన్విత లావణ్య రూపిణీ! నువ్వీ అరణ్యంలో ఎందుకు ఉండవలసి వచ్చింది? అసలు నువ్వెవరి బిడ్డవు— అని ఉద్వేగ హృదయంతో దుష్యంతుడు సాగుతున్నాడు— కళ్యాణీ! శ్రేష్ఠరాజర్షి పురువు. ఆ వంశంలో జన్మించిన మా హృదయం క్షత్రియేతర కన్యల మీద లగ్నం కావటానికి వీల్లేదు. అన్యజాతి స్త్రీల వైపు పురువంశీయుల దృష్టి ప్రసరించదు. పౌరవు లకు అంతఃకరణమే పరమప్రమాణం. ఇంద్రియ సంయమనం కల నా మనస్సు నీయందు లగ్న మైనప్పుడే నువ్వు క్షత్రియకన్య వని మా అంత రాత్మ ఘోషించింది. విప్రకన్యలపై మా మనస్సు మళ్ళదు.

మా అనురాగ తరంగితహృదయంలో శాశ్వత స్థానం ఏర్పరచుకొని రాజ్యభోగా లనుభవించు. అన్యథా శంకించకు— అని సంప్రార్థించే దుష్యంతు నికి చిరునవ్వుతో శకుంతల సమాధానమిస్తున్నది.

మహారాజా! సర్వధర్మమర్మజ్ఞుడూ ధైర్యశాలీ తపశ్శీలలితుడూ అయిన కణ్వమహాముని పుత్రికగా లోకులు నన్ను భావిస్తున్నారు. కశ్యపనందనుడు కణ్వుడు నాకు పితృపాదుడేకాదు గురుపూజ్యుడు. వారి అధీనంలో ఉన్న నన్ను వారి అనుమతి లేకుండా పొందడం ఉచితంకాదు. మీ ప్రియో జనసిద్ధికోసం మహర్షినే అర్థించండి— అని శకుంతల మృదుమధురంగా పలికింది.

భాగ్యవతీ! సర్వలోకపూజ్యుడు కణ్వమహర్షి బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుడు. యమధర్మరాజైన తన ధర్మపాలనలో తడబడవచ్చు కానీ కణ్వుని బ్రహ్మ చర్యదీక్ష అకుంఠితమైనదేది? అంతటి బ్రహ్మచర్య శిక్షాదీక్షితునికి కన్య కలగడం అసంభవం కదా! నా ధర్మసందేహాన్ని బహుశః నీవు నివారించగలవు.

అన విని శకుంతల—మహారాజా! నా జన్మచక్రి మాన్నీ కణ్వమహర్షికి నేను పుత్రికనైన విధానాన్నీ నే నెరిగినరీతిగా చెపుతున్నాను విను- అన్నది.

సత్పురుషుల సమక్షంలో వాస్తవాంశాలను దాచటానికి ప్రయత్నించేవారు ఆత్మవంచకు లవు తారు. కనుక నేను విన్న విషయం విన్నట్టుగా విన్నవిస్తాను. ఆ రోజున మా ఆశ్రమానికి ఒక మహర్షి వచ్చి మా తండ్రిని నా జన్మవృత్తాంతం అడుగుతూ-కణ్వమహర్షీ మీరు బ్రహ్మచర్యవ్రతులే, ఊర్ధ్వ రేతస్కులే, అయినా ఈ బాలిక ఎలా వచ్చింది? అని ప్రశ్నించగా మహర్షి కణ్వుడు ఇలా చెప్పాడు.

చాలా రోజులక్రితం మాట. విశ్వామిత్రుడు తీవ్రతపస్సు చేస్తున్నాడు. ఆయన తపస్సుకి దేవేం ద్రుడు భయపడి మేనకను పిలిచి— అప్సరోజనశిరో మణీ! గ్రీష్మభానుసమ తేజస్వియైన విశ్వామిత్రుడు

వనం జగామ గహనం హయనాగశతైర్వృతః
బలేన చతురంగేణ వృతః పరమవల్గునా.
ఖడ్గశక్తిధరైర్వీరైర్గదాముసలపాణిభిః
ప్రాసతోమరహస్తైశ్చ యయౌ యోధశతైర్వృతః.
సింహనాదైశ్చ యోధానాం శంఖదుందుభినిఃస్వనైః
రథనేమిస్వనైశ్చైవ సనాగవరబృంహితైః.
నానాయుధధరైశ్చాపి నానావేషధరైస్తథా
హేషితస్వనమిశ్రైశ్చ క్ష్వేడితాస్ఫోటితస్వనైః.
ఆసీత్ కిలకిలాశబ్దస్తస్మిన్ గచ్ఛతి పార్థివే
ప్రాసాదవరశృంగస్థాః పరయా నృపశోభయా.
దదృశుస్తం స్త్రియస్తత్ర శూరమాత్మయశస్కరం
శక్రోపమమమిత్రఘ్నం పరవారణవారణం.
పశ్యంతః స్త్రీగణాస్తత్ర వజ్రపాణిం స్మ మేనిరే
అయం స పురుషవ్యాఘ్రో రణే వసుపరాక్రమః.
యస్య బాహుబలం ప్రాప్య న భవంత్యసుహృద్గణాః
ఇతి వాచో బ్రువంత్యస్తాః స్త్రియః ప్రేమ్ణా నరాధిపం.
తుష్టువుః పుష్పవృష్టీశ్చ ససృజుస్తస్య మూర్ధని
తత్ర తత్ర చ విప్రేంద్రైః స్తూయమానః సమంతతః.
నిర్యయౌ పరమప్రీత్యా వనం మృగజిఘాంసయా
తం దేవరాజప్రతిమం మత్తవారణధూర్గతం.
ద్విజక్షత్రియవిట్శూద్రా నిర్యాంతమనుజగ్మిరే
దదృశుర్వర్ధమానాస్తే ఆశీర్భిశ్చ జయేన చ.
సుదూరమనుజగ్ముస్తం పౌరజానపదాస్తథా
న్యవర్తంత తతః పశ్చాదనుజ్ఞాతా నృపేణ హ.
సుపర్ణప్రతిమేనాథ రథేన వసుధాధిపః
మహీమాపూరయామాస ఘోషేణ త్రిదివం తథా
స గచ్ఛన్ దదృశే ధీమాన్ నందనప్రతిమం వనం
బిల్వార్కఖదిరాకీర్ణం కపిత్థధవసంకులం.
విషమం పర్వతప్రస్థైరశ్మభిశ్చ సమావృతం
నిర్జలం నిర్మనుష్యం చ బహుయోజనమాయతం.
మృగసింహైర్వృతం ఘోరైరన్యైశ్చాపి వనేచరైః
తద్వనం మనుజవ్యాఘ్రః సభృత్యబలవాహనః.
లోడయామాస దుష్యంతః సూదయన్ వివిధాన్ మృగాన్
బాణగోచరసంప్రాప్తాంస్తత్ర వ్యాఘ్రగణాన్ బహూన్.
పాతయామాస దుష్యంతో నిర్బిభేద చ సాయకైః
దూరస్థాన్ సాయకైః కాంశ్చిదభినత్ స నరాధిపః
అభ్యాసమాగతాంశ్చాన్యాన్ ఖడ్గేన నిరకృంతత
కాంశ్చిదేణాన్ సమాజఘ్నే శక్త్యా శక్తిమతాంవరః.
గదామండలతత్త్వజ్ఞశ్చచారామితవిక్రమః
తోమరైరసిభిశ్చాపి గదాముసలకంపనైః.
చచార స వినిఘ్నన్ వై స్వైరచారాన్ వనద్విపాన్
రాజ్ఞా చాద్భుతవీర్యేణ యోధైశ్చ సమరప్రియైః.
లోడ్యమానం మహారణ్యం తత్యజుః స్మ మృగాధిపాః
తత్ర విద్రుతయూథాని హతయూథపతీని చ.
మృగయూథాన్యథౌత్సుక్యాచ్ఛబ్దం చక్రుస్తతస్తతః
శుష్కాశ్చాపి నదీర్గత్వా జలనైరాశ్యకర్శితాః.
వ్యాయామక్లాంతహృదయాః పతంతి స్మ విచేతసః
క్షుత్పిపాసాపరీతాశ్చ శ్రాంతాశ్చ పతితా భువి.
కేచిత్ తత్ర నరవ్యాఘ్రైరభక్ష్యంత బుభుక్షితైః
కేచిదగ్నిమథోత్పాద్య సంసాధ్య చ వనేచరాః.
భక్షయంతి స్మ మాంసాని ప్రకుట్య విధివత్తదా
తత్ర కేచిద్గజా మత్తా బలినః శస్త్రవిక్షతాః.
సంకోచ్యాగ్రకరాన్ భీతాః ప్రద్రవంతి స్మ వేగితాః
శకృన్మూత్రం సృజంతశ్చ క్షరంతః శోణితం బహు.
వన్యాగజవరాస్తత్ర మమృదుర్మనుజాన్ బహూన్
తద్వనం బలమేఘేన శరధారేణ సంవృతం
వ్యరోచత మృగాకీర్ణం రాజ్ఞా హతమృగాధిపం.

తీవ్రతపస్సమాధిలో ఉండి నాకు సంతాపాన్ని కలిగిస్తున్నాడు. తపోదీక్షనుండి ఆయనను మరలించే గురుతరభారాన్ని నీమీద ఉంచుతున్నాను. పవిత్రాంతఃకరణుడైన విశ్వామిత్రుడు అసాధారణ శక్తిసంపన్నుడు. ఆయనను మరలించడం సామాన్యవిషయం కాదు. ఎలా అయినా నీవయోరూపలావణ్యాలతో మధురహావభావప్రదర్శనతో చిరునవ్వులు వెదజల్లుతూ సరససల్లాపాలు సాగించి విశ్వామిత్రుని తపోభంగం చెయ్యి- అన్నాడు.

మహాప్రభూ! మహా తపస్తేజస్సంపన్నుడైన విశ్వామిత్రుడు తీవ్రక్రోధి అనే విషయం మీ రెరుగనిది కాదు. ఆయన క్రోధమూ తేజస్సూ తపమూ కదా మీకు భయం కలిగిస్తున్నాయి. అటువంటి చోట నేను నిర్భయంగా వ్యవహరించగలనా? బ్రహ్మర్షి వసిష్ఠుని నూరుగురు కొడుకులనూ ఆయన క్రోధం ఆరగించిందే! క్షత్రియుడై పుట్టి బ్రహ్మత్వాన్ని పొందిన మహాతపస్సంపన్నుడే! సుఖస్నానార్థం దుర్గమమైన కౌశికీనదిని నిర్మించుకొన్న మహాపురుషుడనీ, మతంగమహామునిచేత నిర్భయంగా యజ్ఞం చేయించినప్పుడు చేసేది లేక మీరు కూడా సోమపానానికి వెళ్ళినవిషయమూ మరచిపోలేరు. బ్రహ్మర్షి వసిష్ఠుని శాపంనుంచి త్రిశంకుని యజ్ఞాన్ని ఏవిధంగా పరిక్షిస్తాడో చూద్దామని దేవత లందరూ యజ్ఞసామగ్రిని హరించినప్పుడు ఉత్తరక్షణంలో త్రిశంకు స్వర్గాన్ని నిర్మించిన అసాధారణ తేజస్వి. ఏతాదృశమహత్తరకార్యనిర్వహణ దక్షుడైన విశ్వామిత్రుని క్రోధానలజ్వాలాశిఖాచ్ఛటల ముందుకు నన్ను పంపకండి. తేజఃప్రసారమాత్రంచేత లోకాలనే దహించగలడే. పదాఘాతమాత్రంచేత పృథివీస్థలిని ప్రకంపింపజేయగలడే. మహామేరువును తృణప్రాయంగా భావించగలిగిన ప్రజ్వలితాగ్నిసదృశతేజశ్శాలి కదా విశ్వామిత్రుడు. ఆయన ముఖం అగ్ని. సూర్యచంద్రులు నేత్రాలు. యముడు జిహ్వ. ఆ మహర్షి ముందు నిలబడటానికి కూడా నాకు అర్హతలేదు. సాధ్యులూ విశ్వేదేవులూ మహర్షులు యముడూ చంద్రుడూ ఆ మహర్షి కనుసన్నలలో మెలగుతారు. ఆయన ముందు నేనెలా నడుచుకోవాలో ఆలోచించి పంపినట్లయితే మీ ఆదేశానుసారం కార్యసిద్ధితో తిరిగి వస్తాను.

ఆయన ముందుకు నేను వెడుతూండగా అవసరానుసారం నా చీనాంశుకాలను తొలగించడానికి వాయువు సహకరించాలి. అదేసమయంలో సుగంధవాయువులు మహర్షి నాసారంధ్రాలలో వర్తించాలి. మదనుడు నాకు క్షణక్షణం ఉద్దీపనం కలిగించాలి. ఈ ప్రకారంగా మీరు ఆజ్ఞలు పంపితే నేను కృషి చేస్తాను— అనగా విని జంభాసురారి ఆమె పెదవులనుండి వెలువడిన అక్షరాలను యథాతథంగా ఆజ్ఞారూపంలో ప్రవచించాడు. మేనక విశ్వామిత్రుని ఆశ్రమం వైపు కన్నులు త్రిప్పి అడుగు కదిపింది.

71 వ అధ్యాయము సమాప్తం.

## డెబ్బది రెండవ అధ్యాయం

ఇంద్రలోకం నుండి బయలుదేరిన మేనక వాయుదేవుడు వెంటరాగా తపోనిష్ఠలో ఉన్న విశ్వామిత్రుని ఆశ్రమం సమీపించింది. అపగతపాపుడైన విశ్వామిత్ర మహర్షికి అభినయపూర్వకంగా

## డెబ్బదియ వ అధ్యాయము

తతో మృగసహస్రాణి హత్వా సబలవాహనః
రాజా మృగప్రసంగేన వనమన్యద్వివేశ హ.
ఏక ఏవోత్తమబలః క్షుత్పిపాసాశ్రమాన్వితః
స వనస్యాన్తమాసాద్య మహచ్ఛూన్యం సమాసదత్.
తచ్చాప్యతీత్య నృపతిరుత్తమాశ్రమసంయుతం
మనఃప్రహ్లాదజననం దృష్టికాంతిమతీవ చ.
శీతమారుతసంయుక్తం జగామాన్యన్మహద్వనం
పుష్పితైః పాదపైః కీర్ణమతీవ సుఖశాద్వలమ్.
విపులం మధురారావైర్నాదితం విహగైస్తథా
పుంస్కోకిలనినాదైశ్చ ఝిల్లీకగణనాదితం.
ప్రవృద్ధవిటపైః వృక్షైః సుఖచ్ఛాయైః సమావృతం
షట్పదాఘూర్ణితతలం లక్ష్మ్యా పరమయాయుతం.
నాపుష్పః పాదపః కశ్చిన్నాఫలో నాపి కంటకీ
షట్పదైర్నాప్యపాకీర్ణస్తస్మిన్వై కాననేఽభవత్.
విహగైర్నాదితం పుష్పైరలంకృతమతీవ చ
సర్వర్తుకుసుమైర్వృక్షైః సుఖచ్ఛాయైః సమావృతం.
మనోరమం మహేష్వాసో వివేశ వనముత్తమమ్
మారుతాకలితాస్తత్ర ద్రుమాః కుసుమశాఖినః.
పుష్పవృష్టిం విచిత్రాం తు వ్యసృజంస్తే పునః పునః
దివస్పృశోఽథ సంఘుష్టాః పక్షిభిర్మధురస్వనైః.
విరేజుః పాదపాస్తత్ర సచిత్రకుసుమాంబరాః
తేషాం తత్ర ప్రవాళేషు పుష్పభారావనామిషు.
రువన్తి రావాన్ మధురాన్ షట్పదా మధులిప్సవః
తత్ర ప్రదేశాంశ్చ బహూన్ కుసుమోత్కరమండితాన్.
లతాగృహపరిక్షిప్తాన్ మనసః ప్రీతివర్ధనాన్
సంపశ్యన్ సుమహాతేజా బభూవ ముదితస్తదా.
పరస్పరాశ్లిష్టశాఖైః పాదపైః కుసుమాన్వితైః
అశోభత వనం తత్తు మహేన్ద్రధ్వజసంనిభైః.
సిద్ధచారణసంఘైశ్చ గన్ధర్వాప్సరసాం గణైః
సేవితం వన మత్యర్థం మత్తవానరకిన్నరం.
సుఖః శీతః సుగంధీ చ పుష్పరేణువహోఽనిలః
పరిక్రామన్ వనే వృక్షానుపైతీవ రిరంసయా.
ఏవం గుణసమాయుక్తం దదర్శ స వనం నృపః
నదీకచ్ఛోద్భవం కాన్తముచ్ఛ్రితధ్వజసంనిభమ్.
ప్రేక్షమాణో వనం తత్తు సుప్రహృష్టవిహంగమమ్
ఆశ్రమప్రవరం రమ్యం దదర్శ చ మనోరమమ్.
నానావృక్షసమాకీర్ణం సంప్రజ్వలితపావకమ్
తం తదాప్రతిమం శ్రీమానాశ్రమం ప్రత్యపూజయత్
యతిభిర్వాలఖిల్యైశ్చ వృతం మునిగణాన్వితమ్
అగ్న్యగారైశ్చ మహుభిః పుష్పసంస్తరసంస్తృతం.
మహాకచ్ఛైర్బృహద్భిశ్చ విభ్రాజితమతీవ చ
మాలినీమభితో రాజన్నదీం పుణ్యాం సుఖోదకామ్
నైకపక్షిగణాకీర్ణాం తపోవనమనోరమామ్
తత్ర వ్యాళమృగాన్ సౌమ్యాన్ పశ్యన్ ప్రీతిమవాప సః.
తం చాప్రతిరథః శ్రీమానాశ్రమం ప్రత్యపద్యత
దేవలోకప్రతీకాశం సర్వతః సుమనోహరమ్.
నదీం చాశ్రమసంశ్లిష్టాం పుణ్యతోయాం దదర్శ సః
సర్వప్రాణభృతాం తత్ర జననీమివ ధిష్ఠితామ్.
సచక్రవాకపులినాం పుష్పఫేనప్రవాహినీమ్
సకిన్నరగణావాసాం వానరర్క్షనిషేవితామ్.
పుణ్యస్వాధ్యాయసంఘుష్టాం పులినైరుపశోభితాం
మత్తవారణశార్దూలభుజగేంద్రనిషేవితామ్.
తస్యాస్తీరే భగవతః కాశ్యపస్య మహాత్మనః
ఆశ్రమప్రవరం రమ్యం మహర్షిగణసేవితమ్.

అంజలి ఘటించే ఆ లావణ్యలహరిపై ప్రసరించిన వాయువు ఆమె ధౌతవస్త్రాన్ని సమయానుసారంగా విదూరం చేయసాగాడు. గాలి విసురులో జారిన వల్లెవాటుతో లజ్జాదరహసితవదనయై విశ్వామిత్రుని క్రీగంట చూచువేళ ఆచీనాంశుకోత్తరీయం సమీపలతానికుంజంపై పడింది. వల్లెవాటుకోసం వయ్యారంగా అడుగులు వేస్తూ వెనుదిరిగి చూస్తూ సాగే సౌందర్యతేజోరాశిని ఆ తారుణ్యవతిని అప్సరఃకామినిని కన్నెత్తి చూచాడు విశ్వామిత్ర తపస్వి. మహేంద్రుని ఆజ్ఞానుసారం వాయువు నవవికసిత యౌవనశోభాసౌందర్యలావణ్యవతియైన మేనకను నగ్నంగా ప్రదర్శించాడు. అనాచ్ఛాదిత మేనకాసౌందర్యదర్శనవేళావిజృంభిత చిత్తవికారవశీవిభూత హృదయుడై మహాతపస్వి విశ్వామిత్రుడు మునివేళ్ళతో ఆమెను చేర బిలిచినాడు.

మహాతపస్వి విశ్వామిత్రుడు మేనకాదృఢపరిష్వంగంలో శృంగార తపస్సమాధి బద్ధుడైనాడు. కామక్రోధాలు జయించలేక ఆ మహర్షి దీర్ఘకాలం తపస్సుతో సాధించిన మహాశక్తి మేనకాసంయోగంతో సన్నగిల్లసాగింది. అంబరాన్ని చుంబించే హిమాలయశిఖరాగ్రాలమీద; ఆ పరిసరాలలో జలజలధ్వనులతో సాగే సెలయేటి ఇసుకతిన్నెలపై, మాలినీతీరభూములలో, విశ్వామిత్రుడు మేనకతో సాగించిన శృంగార యాత్రావధిగా ఒక బాలిక జన్మించింది. పుట్టిన బిడ్డను మాలినీ నదీతీరంలో విడిచి వారిరువురూ వెళ్ళిపోయారు.

సింహశార్దూలాది భయంకరమృగాలతో నిండిన ఆనిర్జనారణ్యంలో నిద్రించే శిశువును చూసి శకుంత పక్షులు తమరెక్కలతో ఆచ్ఛాదించటంవల్ల పచ్చిమాంసంతినే పక్షులేవీ ఆశిశువునేమీ చెయ్యలేకపోయాయి. ఆ ప్రకారంగా శకుంతల సంతతులు రక్షిస్తున్న సమయంలో మాలినీతీరానికి నేను నిత్యకర్మ నిర్వహణార్థం వెళ్ళాను. ఆ నిర్జన ప్రదేశంలో నన్ను చూసి ఆ పక్షులు నా కాళ్ళమీదపడి- బ్రహ్మవాదీ! ఈమె విశ్వామిత్రమహర్షి కూతురు. కామక్రోధాలను జయించలేక నీ ఆప్తమిత్రులు విశ్వామిత్రులు ఈ బిడ్డ నిక్కడ విడిచి వెళ్ళిపోయారు. దయార్ద్రహృదయులై ఈమెను మీ పుత్రికగా స్వీకరించండి- అన్నాయి.

సర్వప్రాణిభాషలూ ఎరిగిన నేను దయార్ద్రహృదయంతో ఈ బాలికను నా పుత్రికగా పరిగ్రహించాను. గర్భకారకుడూ అభయదాతా పోషకుడూ ఈ ముగ్గురూ తండ్రులే అని ధర్మశాస్త్రం. కనుక ఈమెను రక్షించి పోషించిన నేనుకూడా ఈమె తండ్రినే. శకుంతపక్షులచేత రక్షింపబడినది కనుక ఈమెకు శకుంతల అని పేరుపెట్టాను. ఈమె కూడా నన్ను తండ్రిగానే భావిస్తోంది.

మహారాజా! ఇది కణ్వమహర్షి తన మిత్రర్షితో చెప్పిన గాథ. నేను కణ్వునే తండ్రిగా భావిస్తున్నాను. కన్నతండ్రిని నే నెరగను— అని శకుంతల తనజన్మను విశుద్ధంగా వివరించింది.

72 వ అధ్యాయం సమాప్తం

నదీమాశ్రమసంబద్ధాం దృష్ట్వాఽఽశ్రమపదం తథా
చకారాభిప్రవేశాయ మతిం స నృపతిస్తదా.
అలంకృతం ద్వీపవత్యా మాలిన్యా రమ్యతీరయా
నరనారాయణస్థానం గంగయేవోపశోభితమ్.
మత్తబర్హిణసంఘుష్టం ప్రవివేశ మహద్వనమ్
తత్ స చైత్రరథ ప్రఖ్యం సముపేత్య నరర్షభః.
అతీవగుణసంపన్నమనిర్దేశ్యం చ వర్చసా
మహర్షిం కాశ్యపం ద్రష్టుమథ కణ్వం తపోధనమ్.
ధ్వజినీమశ్వసంబాధాం పదాతిగజసంకులామ్
అవస్థాప్య వనద్వారి సేనామిదమువాచ సః.
మునిం విరజసం ద్రష్టుం గమిష్యామి తపోధన
కాశ్యపం స్థీయతామత్ర యావదాగమనం మమ.
తద్వనం నందనప్రఖ్యమాసాద్య మనుజేశ్వరః
క్షుత్పిపాసే జహౌ రాజా ముదం చావాప
పుష్కలామ్.

సామాత్యో రాజలింగాని సోఽపనీయ నరాధిః
పురోహితసహాయశ్చ జగామాశ్రమముత్తమమ్.
దిదృక్షుస్తత్ర సమృషిం తపోరాశిమథావ్యయమ్
బ్రహ్మలోకప్రతీకాశమాశ్రమం సోఽభివీక్ష్య హ.
షట్పదోద్గీతసంఘుష్టం నానాద్విజగణాయుతమ్
ఋచో బహ్వృతముఖ్యైశ్చ ప్రేర్యమాణాః
పదక్రమైః.

శుశ్రావ మనుజవ్యాఘ్రో వితతేష్విహ కర్మసు
యజ్ఞవిద్యాంగవిద్భిశ్చ యజుర్విద్భిశ్చ శోభితమ్.
మధురైః సామగీతైశ్చ ఋషిభిర్నియతవ్రతైః
భారుండసామగీతాభిరథర్వశిరసోద్గతైః.
యతాత్మభిః సునియతైః శుశుభే స తదాశ్రమః
అథర్వవేదప్రవరాః పాకయజ్ఞీయసామగాః.

సంహితామీరయన్తి స్మ పదక్రమయుతాంతు తే
శబ్దసంస్కారసంయుక్తైర్బ్రువద్భిశ్చాపరైర్ద్విజైః.
నాదితః స బభౌ శ్రీమాన్ బ్రహ్మలోక ఇవాపరః
యజ్ఞసంస్తరవద్భిశ్చ క్రమశిక్షావిశారదైః.
న్యాయతత్త్వాత్మవిజ్ఞానసంపన్నైర్వేదపారగైః
నానావాక్యసమాహారసమవాయవిశారదైః.
విశేషకార్యవిద్భిశ్చ మోక్షధర్మపరాయణైః
స్థాపనాక్షేపసిద్ధాంతపరమార్థజ్ఞతాం గతైః
శబ్దచ్ఛన్దోనిరుక్తజ్ఞైః కాలజ్ఞానవిశారదైః
ద్రవ్యకర్మగుణజ్ఞైశ్చ కార్యకారణవేదిభిః.
పక్షివానరరుతజ్ఞైశ్చ వ్యాసగ్రన్థసమాశ్రితైః
నానాశాస్త్రేషు ముఖ్యైశ్చ శుశ్రావ స్వనమీరితం.
లోకాయతికముఖ్యైశ్చ సమన్తాదనునాదితం
తత్ర తత్ర చ విప్రేన్ద్రాన్ నియతాన్ సంశితవ్రతాన్.
జపహోమపరాన్ విప్రాన్ దదర్శ పరవీరహా
ఆసనాని విచిత్రాణి రుచిరాణి మహీపతిః.
ప్రయతోపహితానిస్మదృష్ట్వావిస్మయమాగమత్.
దేవతాయతనానాం చ ప్రేక్ష్య పూజాం కృతాం
ద్విజైః

బ్రహ్మలోకస్థమాత్మానం మేనే సనృజసత్తమః
స కాశ్యప తపోగుప్తమాశ్రమప్రవరం శుభమ్,
నాతృప్యత్ ప్రేక్షమాణో వై తపోవనగుణైర్యుతం
స కాశ్యపస్యాయతనం మహావ్రతైః
ర్వృతం సమన్తాదృషిభిస్తపోధనైః
వివేశ సామాత్యపురోహితోఽరిహా.
వివిక్తమత్యర్థమనోహరం శుభమ్.

70 వ అధ్యాయం సమాప్తం

# డెబ్బది మూడవ అధ్యాయం

## శకుంతలా దుష్యంతులు

కళ్యాణీ! ఈ గాథ నా నిశ్చయాన్ని ధృవీకరించి నువ్వు క్షత్రియ కన్యవే అని చెపుతూన్నది. విశ్వామిత్రుడు క్షత్రియుడే గదా. ఆ క్షత్రియశ్రేష్ఠుని బిడ్డవు కనక నన్ను భర్తగా స్వీకరించు. నీకోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. విచిత్రభూషణాలూ మణిమాలలూ రత్నకుండలాలూ సువర్ణహారాలూ సుందరదుకూలాలూ అన్నీ అర్పిస్తాను. ఇవన్నీ ఎందుకు! నారాజ్యం నీ కనుసన్నలలో నడిపిస్తాను.

అష్టవిధవివాహాలలో శ్రేష్ఠమైనది గాంధర్వం. గాంధర్వవిధితో నన్ను స్వీకరించు— అని అర్థించే దుష్యంతుని అవిచలితదృష్టితో చూస్తూ— మహారాజా! మహర్షి కణ్వులు ఫలాలతో రెండు ఘడియల్లో వస్తారు. రాగానే వారు నన్ను మీ సేవకు అర్పించవచ్చు ఆయనే నాకు సర్వమూ. ఆయననే దేవతగా పూజిస్తున్నాను. వారు నన్ను ఎవరికి అర్పిస్తే వారే నా భర్త. కన్యావస్థలో తండ్రి యౌవనంలో భర్తా వృద్ధాప్యంలో కొడుకూ స్త్రీకి రక్షకులు గదా. అయినప్పుడు స్త్రీ స్వతంత్రించి ఏపనీ చెయ్యకూడదు. ఆ ధర్మమార్గం వదలి నా తండ్రి అధికారం ధిక్కరించి ఆయనను అవమానించే సాహసం చెయ్యను- అన్నది శకుంతల.

తపస్సంపన్నుడు కణ్వుడు దయార్ద్రహృదయుడు- అని దుష్యంతుడు శకుంతల భయం తగ్గించడానికి పలికాడు.

మహారాజా! సూర్యుడు కిరణరశ్మితో, చక్రవర్తి దండనీతితో, ఇంద్రుడు వజ్రాయుధంతో ప్రతీకారం సాగించినట్లే విప్రుడు క్రోధ మాత్రంచేతనే దగ్ధం చేస్తాడు- అని వాస్తవం చెప్పింది శకుంతల.

ప్రశంసాపాత్రమైన శీలస్వభావాలు గల ఓ రమణీయ నితంబినీ! నువ్వు నేచ్ఛగా నన్ను వరించు నేను నీకోసమే ఆగాను. నా మనస్సు నిన్నే అభిలషిస్తున్నది. ఆత్మయే ప్రాణికి సర్వమూ. ఆత్మను మించిన మిత్రుడూ బంధువూ ఆశ్రయ వస్తువూ లేదు. కనక విశుద్ధాత్మతో ధర్మంగా నన్ను గ్రహించు.

బ్రాహ్మదైవ ఆర్ష ప్రాజాపత్య ఆసుర గాంధర్వ రాక్షస పైశాచ భేదాలతో వివాహాలు ఎనిమిది విధాలు. వీనిలో క్రమానుసారం వైశిష్ట్యం ఉన్నది. ముందు చెప్పబడినవే ఉత్తమోత్తమాలు అని మనువు ఘోషిస్తున్నాడు.

**బ్రాహ్మము:**

వస్త్రభూషణాలంకృతయైన కన్యను యోగ్యుడైన సజాతీయుని కర్పించేది.

**దైవము:**

నిజగృహంలో దైవయజ్ఞం చేసి యజ్ఞాంతంలో ఋత్విజునకు దక్షిణగా కన్య నీయటం.

**ఆర్షము:**

గోవునో వృషభమునో స్వీకరించి కన్యనీయటం.

**ప్రాజాపత్యం:**

యువతీ యువకులను ఎదురెదురుగా ఉంచి వారు ధర్మమార్గాన సాగుతారనే సంకల్పంతో చేసేది.

**ఆసురం:**

వరుని వద్ద అధికధనం గ్రహించి కన్య నీయటం.

## డెబ్బదిఒకట వ అధ్యాయము

తతో௨గచ్ఛన్మహాబాహురేకో௨మాత్యాన్ విసృజ్య తాన్
నాపశ్యచ్చాశ్రమే తస్మిం స్తమృషిం సంశితవ్రతమ్.
సో௨పశ్యమాన స్తమృషిం శూన్యం దృష్ట్వా తథా௨௨శ్రమమ్.
ఉవాచ క ఇహేత్యుచ్చైర్వనం సంనాదయన్నివ.
శ్రుత్వాథ తస్య తం శబ్దం కన్యా శ్రీరివ రూపిణీ
నిశ్చక్రామాశ్రమాత్ తస్మాత్ తాపసీవేషధారిణీ.
సా తం దృష్ట్వైవ రాజానం దుష్యన్తమసితేక్షణా
సువ్రతాభ్యాగతంతంతుపూజ్యం ప్రాప్తమథేశ్వరం.
రూపయౌవనసంపన్నా శీలాచారవతీ శుభా
సా తమాయతపద్మాక్షం వ్యూఢోరస్కంసుసంహతం
సింహస్కంధం దీర్ఘబాహుం సర్వలక్షణపూజితం.
విస్పష్టం మధురాం వాచం సాబ్రవీజ్జనమేజయ
స్వాగతం త ఇతి క్షిప్రమువాచ ప్రతిపూజ్య చ.
ఆసనేనార్చయిత్వా చ పాద్యేనార్ఘ్యేణ చైవ హి
పప్రచ్ఛానామయం రాజన్ కుశలం చ నరాధిపం.
యథావదర్చయిత్వాథ పృష్ట్వాచానామయం తదా
ఉవాచ స్మయమానేవ కిం కార్యం క్రియతామితి.
ఆశ్రమస్యాభిగమనే కిం త్వం కార్యం చికీర్షసి
క స్త్వమద్యేహ సంప్రాప్తో మహర్షేరాశ్రమంశుభం.
తామబ్రవీత్ తతో రాజా కన్యాం మధురభాషిణీం
దృష్ట్వాచైవానవద్యాంగీమ్యథావత్ ప్రతిపూజితః
రాజర్షేరస్మి పుత్రో௨హమిలిలస్య మహాత్మనః
దుష్యన్త ఇతి మే నామ సత్యం పుష్కరలోచనే.
ఆగతో௨హం మహాభాగ మృషింకణ్వముపాసితుం
క్వ గతో భగవాన్ భద్రే తన్మమాచక్ష్వ శోభనే.
గతః పితామేభగవాన్ ఫలాన్యాహర్తుమాశ్రమాత్
ముహూర్తం సంప్రతీక్షస్వ ద్రష్టాస్యేనముపాగతం.
అపశ్యమాన స్తమృషిం తథా చోక్త స్తయా చ సః
తాం దృష్ట్వాచ వరారోహాంశ్రీమతీంచారుహాసినీం
విభ్రాజమానాం వపుషా తపసా చ దమేన చ
రూపయౌవనసంపన్నా మిత్యువాచ మహీపతిః
కా త్వం కస్యాసి సుశ్రోణి కిమర్థం చాగతావనం
ఏవం రూపగుణోపేతా కుత స్త్వమసి శోభనే.
దర్శనా దేవ హి శుభేత్వయా మే௨పహృతం మనః
ఇచ్ఛామిత్వామహం జ్ఞాతుంతన్మమాచక్ష్వశోభనే
శ్రుణు మే నాగనాసోరు వచనం మత్త కాశిని
రాజర్షే రన్వయే జాతః పురోరస్మి విశేషతః
వృణే త్వామద్య సుశ్రోణి దుష్యన్తో వరవర్ణిని.
న మే௨న్యత్ర క్షత్రియాయాం మనో జాతు ప్రవర్తతే
ఋషిపుత్రీషు చాన్యాసు నా వర్ణాసు పరాసువా.
తస్మాత్ ప్రణిహితాత్మానం విద్ధిమాం కలభాషిణి
తస్య మే త్వయి భావో స్తి క్షత్రియా హ్యాసి వద.
న హి మే భీరు విప్రాయాం మనః ప్రసహతే గతిమ్
భజే త్వామాయతాపాంగిం భక్తం భజతుమర్హసి.
భుంక్ష్వ రాజ్యం విశాలాక్షి బుద్ధిం మాకృథా న్యథా కృథాః
ఏవముక్తా తు సా కన్యా తేన రాజ్ఞా తమాశ్రమే
ఉవాచ హసతీ వాక్యమిదం సుమధురాక్షరమ్.
కణ్వస్యాహం భగవతో దుష్యన్త దుహితా మతా
తపస్వినో ధృతిమతో ధర్మజ్ఞస్య మహాత్మనః.
అస్వతన్త్రాస్మి రాజేన్ద్ర కాశ్యపో మే గురుః పితా
తమేవ ప్రార్థయ స్వార్థం నాయుక్తం కర్తుమర్హసి.
ఊర్ధ్వరేతా మహాభాగే భగవాన్ లోకపూజితః

గాంధర్వం:
యువతీ యువకులు బద్ధానురాగులై పెండ్లి చేసికోవటం.

రాక్షసం:
యుద్ధకోలాహలం సాగించి సోదర బంధువుల మధ్య ఏడుస్తూ ఉన్న కన్యను అపహరించుకొని పోవటం.

పైశాచి:
అందరూ నిద్రావస్థలో ఉండగా కన్యను దొంగిలించటం.

బ్రాహ్మ దైవ ఆర్ష ప్రాజాపత్యాలు అగ్రజాతి వారు అనుసరించదగినవి. గాంధర్వపర్యంతం ఉన్న ఆరురీతులూ క్షత్రియులకు ఉచితం. రాక్షసం కూడా క్షత్రియాచారమే. వైశ్యశూద్రులు ఆసురాన్ని అనుసరించవచ్చు. ఇందులో ఆసురపైశాచీ మార్గాలు పరిగ్రాహ్యాలు కావు. ధర్మశాస్త్రవిషయాలు నీకు వివరించాను. గాంధర్వ రాక్షసాలు క్షత్రియోచితాలు. కనుక నువ్వు సందేహించవలసిన అవసరం లేదు. నా అభిమతం నీ అభిమతం ఏకముఖంగా ఉన్నాయి. గాంధర్వ విధితో నన్ను గ్రహించు-అన్నాడు దుష్యంతుడు.

పురురాజర్షి వంశోద్ధారకా! నువ్వు చెప్పినట్లు గాంధర్వం ధర్మసమ్మతమైతే, ఆత్మార్పణాధికారం ఆత్మకున్నట్లయితే నన్ను మీరు స్వీకరించండి. అయితే ఒక్క నియమం మాత్రం ఉంది. నీవల్ల నాకు కలిగే కుమారుడు యావరాజ్యాభిషిక్తుడు కావాలి. ఇందుకు మీ రంగీకరిస్తే నన్ను అర్ధాంగిగా స్వీకరించండి— అన్నది శకుంతల.

అనవుడు దుష్యంతుడు ఆమె అభ్యర్థనను అంగీకారసూచకంగా అనాలోచితంగా తలత్రిప్పి— శుచిస్మితా! నువ్వు నామాటలు విశ్వసించి తక్షణం నా వెంటరా! మా రాజధానీనగరంలో సుహోన్నత సౌధాలలో అంతఃపురాలను అలంకరించవలసిన దానవు నువ్వు— అని దుష్యంతుడు విశ్వజనస్తుతిశీలయైన శకుంతల పాణిని పరిగ్రహించాడు. పరిగ్రహించి కొంతసేపు ఆమెతో ఏకాంతంగా గడిపి ఆమెవద్ద సెలవు తీసుకొంటూ ఆమెను రాజధానికి తీసికొని రావటానికి చతురంగబలాలనూ పంపుతానని నమ్మించాడు. నమ్మించి చిరునవ్వుతో ఆమెను తన గాఢపరిష్వంగంలోకి తీసికొని ఒక్క చూపు చూశాడు. శకుంతల ప్రాణేశ్వరునకు ప్రదక్షిణించి నిలిచింది. దుష్యంతుడు ఆమెను గాఢంగా గుండెల కద్దుకున్నాడు. శకుంతలా సుందరవదనారవిందంనుండి అశ్రుధారలు ద్రవించి దుష్యంతుని చరణాబ్జాలమీద ప్రవహించినవి. దుష్యంతు డామె కన్నులలో కన్నులుంచి— రాజపుత్రీ! ఎందుకు వృథాగా విచారిస్తావు. నేను తప్పకుండా నిన్ను రాజధానికి రప్పిస్తాను. ఇది దుష్యంతుని ప్రతిజ్ఞ— అని ఆమెకు ధైర్యం చెప్పి రాజధానికి కదలిపోయే దుష్యంతుని గుండెలో సర్వవిషయజ్ఞుడై కణ్వమహర్షి ఈ వార్త విని ఏంచేస్తాడో అనే భయరేఖ మెదలకపోలేదు.

దుష్యంతుడు వెళ్ళి రెండుఘడియలు కాలేదు. కణ్వుడు ఆశ్రమంలో అడుగు పెట్టాడు. అడుగు పెట్టిన మహర్షికి ఆచారానుసారం ఎదురేగి అభివాదార్పించలేకపోయింది. లజ్జాభరావనత వదన శకుంతల కొద్దిక్షణాలలో స్వస్థచిత్తయై బెదురుగుండెతో బ్రహ్మర్షిని సమీపించి ఆసనం సమర్పించి, సిగ్గుతో పెదవులు కదపలేకపోయింది. ధర్మచ్యుతి కారణంగా ఆమె హృదయం భయంతో ప్రకంపిస్తున్నది. రెండు

చలేద్ధి వృత్తా ద్ధర్మోఽపి న చ లేత్ సంశితవ్రతః
కథం త్వం తస్య దుహితా సమ్భూతా వరవర్ణినీ
సంశయో మే మహానత్ర తన్మే ఛేత్తుమిహార్హసి.
యథాయమాగమో మహ్యం యథా చేదమభూత్ పురా

శ్రుణు రాజన్ యథా తత్త్వం యథాస్మి దుహితా మునేః
అన్యథా స న్తమాత్మాన మన్యథా సత్సు భాషతే
న పాపేనావృతో మూర్ఖః స్తేన ఆత్మాపహారకః.
ఋషిః కశ్చిదిహాగమ్య మమ జన్మాభ్యచోదయత్
ఊర్ధ్వ రేతా యథాసి త్వం కుత స్తేయం శకుంతలా
పుత్రీ త్వత్తః కథం జాతా సత్యం మే బ్రూహి కాశ్యప.
తస్మై ప్రోవాచ భగవాన్ యథా తచ్ఛృణు పార్థివ
తప్యమానః కిల పురా విశ్వామిత్రో మహ త్తపః
సుభృశం తాపయామాస శక్రం సురగణేశ్వరం.
తపసా దీప్తవీర్యోఽయం స్థానాన్మాం చ్యావయేదితి
భీతః పురందర స్తస్మా న్మేనకామిదమబ్రవీత్.
గుణై రప్సరసాం దివ్యై ర్మేనకే త్వం విశిష్యసే
శ్రేయో మే కురు కల్యాణి యత్త్వాం వక్ష్యామి తచ్ఛృణు.

అసావాదిత్యసంకాశో విశ్వామిత్రో మహాతపాః.
తప్యమాన స్తపో ఘోరం మమ కమ్పయతే మనః.
మేనకే తవ భారోఽయం విశ్వామిత్రః సుమధ్యమే
శంసితాత్మా సుదుర్ధర్ష ఉగ్రే తపసి వర్తతే.
స మాం నచ్యావయేత్ స్థానాత్ తం వై గత్వా ప్రలోభయ

చరతస్య తపోవిఘ్నం కురు మేఽవిఘ్నముత్తమం.
రూపయౌవనమాధుర్యచేష్టితస్మితభాషణైః
లోభయిత్వా వరారోహే తపస స్తం నివర్తయ.
మహాతేజాః స భగవాం స్తథైవ చ మహాతపాః
కోపనశ్చ తథా హ్యేనం జానాతి భగవానపి.

తేజస స్తపసశ్చైవ కోపస్య చ మహాత్మనః
త్వమప్యుద్విజసే యస్య నోద్విజేయమహం కథమ్.
మహాభాగం వసిష్ఠం యః పుత్రైరిష్టైర్వ్యయోజయత్
క్షత్రజాతశ్చ యః పూర్వమభవద్బ్రహ్మణో బలాత్.
శౌచార్థం యో నదీం చక్రే దుర్గమాం బహుభిర్జలైః
యాం తాం పుణ్యతమాం లోకే కౌశికీతి విదుర్జనాః
బభార యత్రాస్య పురా కాలే దుర్గే మహాత్మనః
దారాన్మతంగో ధర్మాత్మా రాజర్షి ర్వ్యాధతాం గతః
అతీతకాలే దుర్భిక్షే అభ్యేత్య పునరాశ్రమమ్
మునిః పారేతి నద్యా వై నామ చక్రే తదా ప్రభుః.
మతంగం యాజయాంచక్రే యత్ర ప్రీతమనాః స్వయం
త్వం చ సోమం భయాద్యస్య గతః పాతుం సురేశ్వర
చకారాన్యం చ లోకం వై క్రుద్ధో నక్షత్రసంపదా
ప్రతిశ్రవణపూర్వాణి నక్షత్రాణి చకార యః
గురుశాపహతస్యాపి త్రిశంకోః శరణం దదౌ.
బ్రహ్మర్షి శాపం రాజర్షిః కథం మోక్ష్యతి కౌశికః
అవమత్య తదా దేవై ర్యజ్ఞాంగం తద్వినాశితం.
అన్యాని చ మహాతేజా యజ్ఞాంగాన్యసృజత్ ప్రభుః
నినాయ చ తదా స్వర్గం త్రిశంకుం స మహాతపాః.
ఏతాని యస్య కర్మాణి తస్యాహం భృశముద్విజే
యథాసౌ న దహేత్ క్రుద్ధ స్తథాఽఽజ్ఞాపయ మాం విభో.

తేజసా నిర్దహేల్లోకాన్ కమ్పయేద్ధరణీం పదా
సంక్షిపేచ్చ మహామేరుం తూర్ణ మావర్తయేద్దిశః.
తాదృశం తపసా యుక్తం ప్రదీప్తమివ పావకం.
కథమస్మద్విధా నారీ జితేంద్రియమభిస్పృశేత్.
హుతాశనముఖం దీప్తం సూర్యచంద్రాక్షితారకం
కాలజిహ్వం సురశ్రేష్ఠ కథమస్మద్విధా స్పృశేత్.
యమశ్చ సోమశ్చ మహర్షయశ్చ
సాధ్యా విశ్వే వాలఖిల్యాశ్చ సర్వే

ఘడియల పూర్వం అచంచలబ్రహ్మచర్యదీక్షలో ఉన్న తాను ఆక్షణంలో ఆదీక్షాస్ఖలితదోషంతో ఉండడంవల్ల సిగ్గూ భయమూ ఆవరించాయి. నిరంతర శుచిస్మితముఖియై అలరారే ఆమె వదనంలో సిగ్గుతెరలు చూసి— అమ్మా ! దీర్ఘాయుష్మాన్భవ. ఇకముందు ఇతఃపూర్వంవలె చపలభావం నీలో ఉండదు. జరిగిన విషయం నిర్భయంగా చెప్పవమ్మా- అన్నాడు మహర్షి కణ్వుడు. సతతసదాచారసంపత్ స్వరూపిణియై చరించే ఆమె సిగ్గుతో గద్గదకంఠంతో పితృపూజ్యా, ఇలిల మహారాజు కుమారుడు దుష్యంతుడు ఈ అరణ్యానికివచ్చి దైవయోగంవల్ల మన ఆశ్రమానికి వచ్చారు. ఆయనను నేను భర్తగా స్వీకరించాను. అనంతరగాథ మీదివ్యదృష్టికి తెలియనిదికాదు. క్షత్రియవంశానికి అభయప్రదానం చేసి మమ్మల్ని అనుగ్రహించండి—అన్నది.

మహర్షి కణ్వుడు దివ్యదృష్టితో శకుంతలస్థితిని గ్రహించాడు. ప్రసన్నవదనంతో-అమ్మా! నాపరోక్షంలో నువ్వు ఒక పురుషునితో సంబంధం కలిగించుకున్నావు. అందువల్ల ధర్మచ్యుతి జరగలేదు. గాంధర్వం క్షత్రియోచితమే. అనురాగతరంగిత హృదయాలతో సమాకర్షితులయిన స్త్రీపురుషులు మంత్రరహితంగా ఏర్పరచుకొనే అనుబంధం గాంధర్వం. దుష్యంతుడు ధర్మాత్ముడు. ఆయనయందు నీహృదయం లగ్నమైంది. యోగ్యుడైన వరుడు నీకు లభించాడు. బలిష్ఠుడూ ధర్మాత్ముడూ అయిన కుమారునికి మాతృత్వం వహించే భాగ్యం నీకు లభించింది. నీ కొడుకు సర్వశత్రుసంహారకుడై ఈ భూమండలాన్ని నిష్కంటకంగా పరిపాలిస్తాడు— అన్నాడు.

అనంతరం శకుంతల ఆయన తెచ్చిన ఫలాలను ఉచితస్థానంలో ఉంచింది. మహర్షిపాదాలు కడిగింది. భోజనం చేసి విశ్రమించిన మహర్షిని చేరి తాను భర్తగా పొందిన దుష్యంతునియందూ అతని అనుచరులయందూ అనుగ్రహం ఉంచమని కోరగా కణ్వుడు అమ్మా! నీ శ్రేయస్సు కోసం వారందరినీ కృపాదృష్టితో నే చూస్తాను. ఋతుకాలంలో సక్రమక్రియ నిర్వర్తించావు. నీకు ఏపాపమూ లేదు. ఇప్పుడు నీకు కావలసిన వరం కోరుకో— అన్నాడు.

శకుంతల తనభర్త శ్రేయస్సును మనసులో ఉంచుకొని—పురువంశీయులు ధర్మబద్ధులై శాశ్వతంగా రాజ్యపాలకులు కావాలి—అనగా ధర్మాత్ముడైన కణ్వుడు 'తథాస్తు' అని మూర్తీభవించిన శ్రీదేవిలా ఉన్న శకుంతల రెండు చేతులూ పుచ్చుకొని—అమ్మా! మహాపురుషుడైన దుష్యంతుని గృహలక్ష్మివి. ఈ క్షణం నుండీ ప్రతివ్రతాశిరోమణుల ఆదర్శాలను అనుసరిస్తూ ఉండు— అని ఆశీర్వదించాడు.

73 వ అధ్యాయం సమాప్తం

## డెబ్బది నాలుగవఅధ్యాయం

### భరతుడు

నెమ్మదినెమ్మదిగా నెలలు నిండుతున్నవి. ఆమెకు ఏపని చెయ్యబోయినా దుష్యంతుడే కనిపిస్తున్నాడు. స్నాన భోజనాలవైపు ఆమె మనస్సు పోవటంలేదు. నిద్ర సరిగా పట్టటంలేదు. దుష్యంతుడు విప్రశ్రేష్ఠులవెంట చతురంగ బలాలనూ పంపి తనను తప్ప

ఏతేఽపి యస్యోద్విజంతే ప్రభావాత్
తస్మాత్ కస్మాన్మాదృశీ నోద్విజేత్.
త్వయ్యేవముక్తా చ కథం సమీపమ
మృషేర్న గచ్ఛేయమహం సురేంద్ర
రక్షాం తు మే చింతయ దేవరాజ
యథా త్వదర్థం రక్షితాహం చరేయం.
కామం తు మే మారుతస్తత్ర వాసః
ప్రక్రీడితాయా వివృణోతు దేవ
భవేచ్చ మే మన్మథస్తత్ర కార్యే
సహాయభూతస్తు తవ ప్రసాదాత్
వనాచ్చ వాయుః సురభిః ప్రవాయాత్
తస్మిన్ కాలే తమృషిం లోభయంత్యాః
తథేత్యుక్త్వా విహితే చైవ తస్మిం
స్తతో యయౌ సాఽఽశ్రమం కౌశికస్య.

71 వ అధ్యాయము సమాప్తం.

## డెబ్బదిరెండవ అధ్యాయము

ఏవముక్తస్తయా శక్రః సందిదేశ సదాగతిం
ప్రాతిష్ఠత తదా కాలే మేనకా వాయునా సహ.
అథాపశ్యద్వరారోహా తపసా దగ్ధకిల్బిషం
విశ్వామిత్రం తప్యమానం మేనకా భీరురాశ్రమే.
అభివాద్య తతః సా తం ప్రాక్రీడదృషిసన్నిధౌ
అపోవాహ చ వాసోఽస్యా మారుతః శశిసన్నిభం.
సాగచ్ఛత్ త్వరితా భూమిం వాసస్తదభిలిప్సతీ
స్మయమానేవ సవ్రీడం మారుతం వరవర్ణినీ.
పశ్యతస్తస్య తత్రర్షేరప్యగ్నిసమతేజసః
విశ్వామిత్రస్తతస్తాం తు విషమస్థామనిందితాం.
గృద్ధాం వాససి సంభ్రాంతాం మేనకాం మునిసత్తమః
అనిర్దేశ్యవయోరూపామపశ్యద్ వివృతాం తదా.
తస్యా రూపగుణాన్ దృష్ట్వా స తు విప్రర్షభస్తదా
చకార భావం సంసర్గాత్ తయా కామవశం గతః.
న్యమంత్రయత చాప్యేనాం సా చాప్యైచ్ఛదనిందితా
తౌ తత్ర సుచిరం కాలముభౌ వ్యహరతాం తదా.
రమమాణౌ యథాకామం యథైకదివసం తథా
కామక్రోధావజితవాన్ మునిర్నిత్యం క్షమాన్వితః.
చిరార్జితస్య తపసః క్షయం స కృతవానృషిః
తపసః సంక్షయో దేవ మునిర్మోహం సమావిశత్.
కామరాగాభిభూతస్య మునేః పార్శ్వం జగామ సా
జనయామాస స మునిర్మేనకాయాం శకుంతలాం.
ప్రస్థే హిమవతో రమ్యే మాలినీమభితో నదీం
జాతముత్సృజ్య తం గర్భం మేనకా మాలినీమను.
కృతకార్యా తతస్తూర్ణమగచ్ఛచ్ఛక్రసంసదం.
తం వనే విజనే గర్భం సింహవ్యాఘ్రసమాకులే.
దృష్ట్వా శయానం శకునాః సమంతాత్పర్యవారయన్
నేమాం హింస్యుర్వనే బాలాం క్రవ్యాదా మాంసగృద్ధినః.
పర్యరక్షంస్త తాం తత్ర శకుంతా మేనకాత్మజాం.
ఉపస్ప్రష్టుం గతశ్చాహమపశ్యం శయితామిమాం
నిర్జనే విపినే రమ్యే శకుంతైః పరివారితాం
మాందృష్ట్వైవాన్వపద్యంత పాదయోః పతితా ద్విజాః
అబ్రువఞ్ఛకునాః సర్వే కలం మధురభాషిణః.
విశ్వామిత్రసుతాం బ్రహ్మన్ న్యాసభూతాం భరస్వ వై.
కామక్రోధావజితవాన్ సఖా తే కౌశికం గతః
తస్మాత్ పోషయత్వప్రీత్యా దయావాని తితేఽబ్రువన్.
నిర్జనేఽపి మహారణ్యే శకుంతైః పరివారితమ్.

కుండా తీసికొని వెడతాడని ఏపూటకాపూట ఆమె ఆశతో గడుపుతున్నది. ఆమె ఆశ రోజులను లెక్క పెడుతూంటే కాలచక్రంలో పక్షాలూ మాసాలూ ఋతువులూ అయనాలూ దొర్లిపోతున్నాయి. అలా మూడు సంవత్సరాలు సాగిపోయాయి.

సాగిపోగా, ఒక శుభముహూర్తంలో అగ్నిసదృశ తేజోరూపసంపన్నుడైన కుమారుడు ఆమె గర్భం నుండి ప్రభవించాడు. ఆ సమయంలో దేవదుందుభులు మోగినవి. అప్సరో జనం నర్తించింది. పూలవాన కురిచింది. అదే సమయంలో సర్వదేవ గణాధీశుడు ఇంద్రుడు వచ్చి—శకుంలా! ఈబాలుడు అపూర్వ బలపరాక్రమాలతో అశ్వమేధం చేసి తన సంపదలన్నీ విప్రవరులకు దానం చేస్తాడు. రాజసూయాది యజ్ఞాలు భూరిదక్షిణలతో కొనసాగిస్తాడు— అనగా విని ఆశ్రమవాసు లందరూ శకుంతల అదృష్టాన్ని అభినందించారు. శకుంతల హృదయం ఆనంద తరంగిత మైంది.

మహర్షి కణ్వుడు బ్రాహ్మణ సమక్షంలో విధ్యుక్తంగా జాతకర్మాది సంస్కారాలు చేయించాడు. సింహసదృశ శరీరుడై ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు. అతని అరచేతులలో చక్రచిహ్నాలున్నాయి. పలువరుస మల్లిపూల వలె ఉన్నది. ఆరుసంవత్సరాల వయస్సు వచ్చేసరికి ఆబాలుడు సింహ శార్దూల మత్తేభ మహిషాలను యీడ్చుకొని వచ్చి ఆశ్రమ ప్రాంతంలో ఉండే చెట్లకు కట్టివేయసాగాడు. ఆ మృగాలమీద ఎక్కి అటూ యిటూ త్రిప్పుతూ ఆడిస్తూ ఆ పరిసరాలలో చరించే పిశాచరాక్షసులను ముష్టి ప్రహారాలతో మర్దిస్తూ మునులకూఋషులకూ సేవలుచేస్తూ చరిస్తున్నాడు. ఒకనాడు దైత్యుడు ఆ బాలుని ఎలా అయినా సంహరించాలనే కోపంతో వచ్చేసరికి వానిని రెండు చేతులమధ్య బిగించి ఎంత గింజుకున్నా వదలక పీక నులమసాగాడు. ఆ సమయంలో ఆదైత్యుని ఆర్తనాదాలకు సర్వ వన్య మృగాలూ ఋషులూ భయపడుతూంటే వాని గొంతు నులిమి వదిలేశాడు. రాక్షసుడునేలకూలాడు. ఆవిధంగా ఎందరో దైత్యులారాక్షసు చేతులలో మరణిస్తూండడంవల్ల వారెవరూ ఆ పరిసరాల వైపు కన్నెత్తి చూడలేక పోతున్నారు. శకుంతలా తనయుడీ విధంగా సమస్తజీవులనూ దమనం చేస్తూండడంవల్ల వానిని ఆ ఋషులు సర్వదమనుడు అని పిలవసాగాడు.

రోజులు గడిచిపోతున్నాయి. రాజధానికి వెళ్ళిన దుష్యంతునినుండి కబురులేదు. నానాటికి శకుంతల శరీరం శుష్కిస్తున్నది. సంస్కారం లేక ఆమె మున్నని జుత్తు వ్రేలాడుతూన్నది. చింతామగ్న హృదయంతో ఉన్నది. ఆమె వస్త్రాలు మాసిపోతున్నాయి. అంతకంతకు నీరసించే శకుంతలను చూసి కణ్వుని హృదయం చివుక్కుమంది. ఆ సమయంలో ఆయన తన తపశ్శక్తితో సర్వదమనునికి సమస్తవిద్యలూ నేర్పాడు. పన్నెండేండ్లు నిండిన శకుంతలా తనయుడు మహర్షి దయాప్రసారంతో సర్వశస్త్రాస్త్రవేదవిద్యావిదు డయాడు.

సర్వదమనుని అసాధారణకృత్యాలవలోకించి కణ్వుడు శకుంతలను పిలిచి— అమ్మా! ఇంతవరకూ నువ్వు రాజధానినుంచి ఎవరో ఒకరు వస్తారనే విశ్వాసంతో గడిపావు, పతివ్రతా ధర్మం అవలంబించమని నీకు నేను ఆనాడే చెప్పాను. నువ్వు ఏనాడో దుష్యంతుని సేవాకార్యంలో నిమగ్న

ఆనయిత్వా తతశ్చైనాం దుహితృత్వే న్యవేశయం.
శరీరకృత్ప్రాణదాతా యస్య చాన్నాని భుంజతే.
క్రమేణైతే త్రయోఽప్యుక్తాః పితరో ధర్మశాసనే
సర్వభూతరుతజ్ఞోఽహం దయావాన సర్వజన్తుషు
నిర్జనే తు వనే యస్మాచ్ఛకున్తైః పరివారితా.
శకున్తలేతినామాస్యాః కృతం చాపి తతో మయా

ఏవం దుహితరం విద్ధి మమ విప్ర శకుంతలాం.
శకుంతలా చ పితరం మన్యతే మామనిందితా
ఏతదాచష్ట పృష్టః సన్ మమ జన్మ మహర్షయే.
సుతాం కణ్వస్య మామేవం విద్ధి త్వం మనుజాధిప.
కణ్వం హి పితరం మన్యే పితరం స్వమజానతీ
ఇతి తే కథితం రాజన్ యథావృత్తం శ్రుతం మయా.

71 వ అధ్యాయము సమాప్తం.

## డెబ్బదిరెండవ అధ్యాయము

సువ్యక్తం రాజపుత్రి త్వం యథాకల్యాణి భాషసే
భార్యా మే భవసుశ్రోణి బ్రూహి కిం కరవాణి తే.
సువర్ణమాలాం వాసాంసి కుండలే పరిహాటకే
నానాపత్తనజే శుభ్రే మణిరత్నే చ శోభనే.
ఆహరామి తవాద్యాహం నిష్కాదీన్యజినాని చ
సర్వం రాజ్యం తవాద్యాస్తుభార్యా మే భవశోభనే
గాంధర్వేణ చ మాం భీరు వివాహేనైహి సుందరి
వివాహానాం హి రంభోరు గాంధర్వః శ్రేష్ఠ ఉచ్యతే.
ఫలహారో గతో రాజన్ పితా మే ఇత ఆశ్రమాత్
ముహూర్తంసంప్రతీక్షస్వసమాంతుభ్యంప్రదాస్యతి.
పితా హి మే ప్రభుర్నిత్యం దైవతం పరమం మతం
యస్య వా దాస్యతి పితా స మే భర్తా భవిష్యతి.
పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
పుత్రస్తు స్థవిరే భావే న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి.
అమన్యమానా రాజేన్ద్ర పితరం మే తపస్వినం
అధర్మేణ హి ధర్మిష్ఠ కథం వరముపాస్మహే.
మామైవం వద సుశ్రోణి తపోరాశిం దయాత్మకం
మన్యుప్రహరణా విప్రా న విప్రాః శస్త్రపాణయః
అగ్నిర్దహతి తేజోభిః సూర్యో దహతిరశ్మిభిః
రాజా దహతి దండేన బ్రాహ్మణో మన్యునా దహేత్
క్రోధితో మన్యునా హన్తి వజ్రపాణిరివాసురాన్

ఇచ్ఛామి త్వాం వరారోహే భజమానామనిన్దితే.
త్వదర్థ మాం స్థితం విద్ధి త్వద్గతం హి మనో మమ
ఆత్మనో బంధురాత్మైవ గతిరాత్మైవ చాత్మనః
ఆత్మనో మిత్రమాత్మైవ తథాఽఽత్మా చాత్మనః
పితాః

ఆత్మనైవాత్మనో దానం కర్తుమర్హసి ధర్మతః.
అష్టావేవ సమాసేన వివాహా ధర్మతః స్మృతాః
బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః
గాంధర్వో రాక్షసశ్చైవపైశాచశ్చాష్టమః స్మృతః.
తేషాం ధర్మ్యాన్ యథా పూర్వం మనుః స్వాయం
భువోఽబ్రవీత్.

ప్రశస్తాంశ్చతురఃపూర్వాన్ బ్రాహ్మణస్యోపధారయ
షడానుపూర్వ్యా క్షత్రస్య విద్ధి ధర్మ్యానసిన్దితే.
రాజ్ఞాం తు రాక్షసోఽప్యుక్తో విట్శూద్రేష్వాసుర
స్మృతః.
పంచానాం తు త్రయో ధర్మ్యా అధర్మ్యౌ ద్వౌ
స్మృతావిహ.
పైశాచ అసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన
అనేన విధినా కార్యో ధర్మస్యైషా గతిః స్మృతా.
గాంధర్వరాక్షసౌ క్షత్రేధర్మ్యౌ తౌ మా విశంకథాః

కాలమై ఉండవలసింది. కానీ దుష్యంతుడు ఆ ప్రయత్నం ఏమీ చేస్తున్నట్టు లేదు. ఇప్పుడు చూస్తే నీ కొడుకు యువరాజపదవిని అధిష్ఠించడానికి అర్హుడయాడు. ఇక నువ్వు ఆత్మశ్రేయస్సుకోసం దుష్యంతుని వద్దకు వెళ్ళి నీ కుమారుని యువరాజ పీఠం మీద కూర్చోబెట్టి సంతోషంగా గడపాలి.

శుచిస్మితా! దేవతల సామీప్యంలో గురువుల సన్నిధానంలో క్షత్రియుల సమ్ముఖంలో సాధుపురుషుల సంఘంలో ఆత్మనాథుని హృదయబంధంలో ఉండడం విశేషం హితకరమైనది. కనక నామాటను ఆజ్ఞగా స్వీకరించి నువ్వు భర్తృగృహానికి వెళ్ళు— అన్నాడు.

సర్వదమనుని (భరతుడు) తన ఒడిలో కూర్చోబెట్టుకుని శిరసు ముద్దాడి— నాయనా! చంద్రవంశంలో దుష్యంతుడనే పేరు గల ప్రఖ్యాత చక్రవర్తి ఉన్నాడు. ఆ ధర్మవ్రత పాలకుని పట్టపురాణి నీ తల్లి. ఇప్పుడు నువ్వు ఈమెతో వెళ్ళి నీ తండ్రి ఆజ్ఞలో యువరాజ పదవిని నిర్వహిస్తూ పితృపైతామహ ప్రాప్తమయిన రాజ్యాన్ని పరిపాలించుకో— అని శకుంతలవైపు తిరిగి— అమ్మా! పాతివ్రత్యపాలనమే స్త్రీకి పరమధర్మం. దేవతలు కూడా ఆమెకు సర్వవిధాలా సహకరిస్తారు. పతి అనుగ్రహమే స్త్రీకి పుణ్యగతుల నిస్తుంది. అందుచేత నువ్వు వెళ్ళి నీ భర్తను అనురక్తితో ఆరాధించు— అన్నాడు. అటు పిమ్మట శిష్యులను పిలిచి— మీరు ఈ శకుంతలనూ ఈమె కుమారునీ సత్వరమే భర్తృగృహానికి చేర్చండి. స్త్రీలు చిరకాలం బంధుసోదరగృహాలలో ఉండకూడదు. అలా ఉంటే వారి శీలం పాతివ్రత్యం శంకాస్పదములై భ్రష్టమవుతాయి. కనక ఈమెను వెంటబెట్టుకొని దుష్యంతుని ఇంటికి వెళ్ళండి— అని ఆజ్ఞాపించాడు.

కణ్వుని ధర్మసందేశాన్ని ఆలకించి సంతోషించింది శకుంతల. ఆ ఆదేశాన్ని శిరసావహించి భరతుడు— అమ్మా ఎందుకింకా ఆలస్యం. తక్షణం రాజధానికి పోదాం నడు— అని కణ్వమహర్షి పాదారవిందాలకు అభివాదంచేసి నతమస్తకుడై నిలబడ్డాడు. శకుంతల చేతులు జోడించి— మహాత్మా! నేను అజ్ఞానంతో మీమనస్సుకి కష్టంకలిగించే పని ఏదైనా చేస్తే క్షమించండి—అని ప్రదక్షిణం చేసినిలచిన శకుంతలవైపు తలఎత్తి చూడలేకపోయాడుమహర్షి.

ఆశ్రమాన్ని వీడబోతున్న శకుంతలవైపు చూడలేక మహర్షి కన్నులనుండి బాష్పధారలు కురియసాగాయి. ఆయన కంఠం గద్గదమైంది. హృదయం కరుణతో నిండిపోయింది. ఆ ఆశ్రమసీమలో పవనపర్ణాంబుభక్షులై వసించే జితేంద్రియులైన మహర్షు లెందరో ఉన్నారు. వారందరినీ చూస్తూ— సర్వలోకహితవాంఛారతులారా! ఈ యశస్విని ఇక్కడే పుట్టి పెరిగి పెద్దదైంది. లోకమంటే ఏమిటో తెలియని ఈ అమాయకురాలి మీద నా హృదయం ఎంతో మమకారాన్ని పెంచుకుంది. అయినా ఇప్పుడీమెను భర్త దగ్గరకు పంపక తప్పదు. మార్గాయాసం లేకుండా ఈమెను దుష్యంతుని దగ్గరకు చేర్చండి— అని బాష్పవృత్తికలుషితచింతాజడదృక్కులతో అవరుద్ధకంఠంతో ఆగాడు. మహర్షి ఆజ్ఞను శిరసావహించి శిష్యులు శకుంతలా దౌష్యంతులతో ఆశ్రమం వీడారు.

శకుంతలా భరతులు ఆశ్రమాన్ని వీడి అరణ్యం దాటి రాజధాని ప్రవేశించి మహారాజుకి తమరాక తెలియజేసి రాజసభలో ప్రవేశించారు. సభలో అడుగు పెడుతూనే మహారాజుకు తమ వచ్చిన పని చెప్పి తిరిగి వెళ్ళిపోయారు కణ్వశిష్యులు.

పృథగ్వా యదివా మిశ్రౌ కర్తవ్యౌనాత్ర సంశయః
సా త్వం మమ సకామస్య సకామా వరవర్ణిని
గాంధర్వేణ వివాహేన భార్యా భవితుమర్హసి.
యది ధర్మపథస్త్వేష యది చాత్మా ప్రభుర్మమ
ప్రదానే పౌరవశ్రేష్ఠ శ్రుణు మే సమయం ప్రభో.
సత్యం మే ప్రతిజానీహి యథావక్ష్యామ్యహంరహః
మయి జాయేత యః పుత్రః స భవేత్ త్వదనంతరః
యువరాజో మహారాజ సత్యమేతద్బ్రవీమి తే
యద్యేతదేవం దుష్యన్త అస్తు మే సంగమస్త్వయా.
ఏవమస్త్వితి తాం రాజా ప్రత్యువాచావిచారయన్
అపి చ త్వాం హి నేష్యామినగరంస్వం శుచిస్మితే.
యథా త్వమర్హా శుశ్రోణి సత్యమేతద్బ్రవీమి తే
ఏవముక్త్వా స రాజర్షిస్తామనిందితగామినీమ్.
జగ్రాహ విధివత్పాణావువాస చ తయా సహ
విశ్వాస్య చైనాం స ప్రాయాదబ్రవీచ్చ పునః పునః
ప్రేషయిష్యే తవార్థాయ వాహినీం చతురంగిణీమ్
తయా త్వా న్యాయయిష్యామి నివాసం స్వం
శుచిస్మితే.
ఏవముక్త్వా స రాజర్షిస్తామనిందితగామినీమ్
సంపరిష్వజ్య బాహుభ్యాం స్మితపూర్వముదైక్షత.
ప్రదక్షిణీకృతాం దేవీం రాజా సంపరిషస్వజే
శకుంతలా హ్యశ్రుముఖీ పపాత నృపపాదయోః.
తాం దేవీం పునరుత్థాప్య మా శుచేతి పునః పునః
శపేయం సుకృతే నైవ ప్రాపయిష్యే నృపాత్మజే.
ఇతి తస్యాః ప్రతిశ్రుత్య స నృపోజనమేజయ
మనసా చింతయన్ప్రాయాత్ కాశ్యపం ప్రతిపార్థివః.
భగవాంస్తపసా యుక్తః శ్రుత్వాకిం ను కరిష్యతి.

ఏవం స చింతయన్నేవ ప్రవివేశ స్వకం పురం.
ముహూర్తయాతే తస్మింస్తు కణ్వోఽప్యాశ్రమ
మాగమత్
శకుంతలా చ పితరం హ్రియానోపజగామ తమ్.
శంకితైవ చ విప్రర్షిముపచక్రామసాశ్వనైః
తతోఽస్యరాజజ్ఞగ్రాహాఆసనంచాప్యకల్పయత్
శకుంతలాంచసవ్రీడాంతమృషింనాభ్యభాషత
తస్మాత్ స్వధర్మాత్ స్ఖలితాభీతాసాభరతర్షభ.
అభవద్దోషదర్శిత్వాత్ బ్రహ్మచారిణ్యయంత్రితా
సతదావ్రీడితాం దృష్ట్వా ఋషిస్తాం ప్రత్యభాషత.
సవ్రీడైవచదీర్ఘాయుః పురేవభవితానచ
వృత్తం కథయరంభోరుమాత్రాసంచవ్రతకల్పయః.
తతఃకృచ్ఛ్రాదతిశుభా సవ్రీడాశ్రీమతీతదా.
సగద్గదమువాచేదం కాశ్యపంసా శుచిస్మితా.
రాజా తాతా జగామే హదుష్యన్త ఇలిలాత్మజః
మయా పతిర్వృతో యోఽసౌ దైవయోగాదిహా
గతః.
తస్య తాత ప్రసీదస్వ భర్తా మే సుమహాయశాః
అతః సర్వం తు యత్ వృత్తం దివ్యజ్ఞా నేనపశ్యసి,
అభయం క్షత్రియకులే ప్రసాదంకర్తు మర్హసి.
విజ్ఞాయాథ చకణ్వోదివ్యజ్ఞానో మహాతపాః
ఉవాచభగవాన్ ప్రీతఃపశ్యన్ దివ్యేన చక్షుషా.
త్వయాద్యభద్రేరహసిమామనాదృత్యయఃకృతః
పుంసాసహసమాయోగోనసధర్మోపఘాతకః.
క్షత్రియస్యహిగంధర్వోవివాహః శ్రేష్ఠఉచ్యతే
సకామాయాః సకామేన నిర్మంత్రోరహసిస్మృతః.
ధర్మాత్మాచమహాత్మాచదుష్యంతః పురుషోత్తమః

శకుంతల సిగ్గుతో వంగినమోముతో గారవంగా మహారాజును చూసి కుమారునివైపు తిరిగి— నాయనా! సత్యధర్మనిరతుడైన ఈ మహారాజు నీ తండ్రి. ఈయనను నమస్కరించు— అని ఒక ప్రక్కగా ఒదిగి నిలిచి చేతులుజోడించి— ప్రభూ! అనుగ్రహించండి— అన్నది. తల్లిని అనుసరించి భరతుడు నమస్కరించి ఉత్సాహ వికసిత నేత్రాలతో మహారాజువైపు తదేకంగా చూడసాగాడు.

ధర్మదృష్టిసంపన్నుడైన దుష్యంతుడు ఒక్క క్షణం ఆలోచించి— సుందరీ! నువ్వు నీకొడుకుని వెంటబెట్టుకొని ఏప్రయోజనంతో వచ్చావో చెప్పుకుంటే తప్పకుండా నెరవేరుస్తాను— అన విని శకుంతల— మహారాజా! వీడు మీ కుమారుడు. నీవల్ల నాకు కలిగిన ఈ కుమారుని యువరాజ్యాభిషిక్తుని చేస్తానని మనసమాగమానికిముందు కణ్వాశ్రమంలో మీరు చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చమని ప్రార్థిస్తున్నాను- అన్నది-

శకుంతల వాక్యాలు విని విదితవిషయజ్ఞుడు దుష్యంతుడు— ఓ దుష్టురాలా నువ్వెవరి భార్యవు? ధర్మార్థకామసంబంధమైన వివాహం మన ఇరువురికీ జరిగిన విషయమే నాకు స్మృతిలో లేదు. వ్యర్థ ప్రసంగాలు చెయ్యక నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళు- అన్నాడు. శిరీషకుసుమమృదులగాత్ర శకుంతల దుష్యంతుని మాటలు విని ఒక్క క్షణం స్తంభించిపోయింది. ఉత్తరక్షణంలో తేరుకొన్న ఆమె కన్నులలో ఎరజీరలు ప్రసరించినవి. తీవ్రక్రోధంతో ఆమె పెదవులు ప్రకంపిస్తున్నవి. ఆ సమయంలో ఆమె చూపులు ఎదుటివ్యక్తిని భస్మం చెయ్యటానికి సమర్థంగా ఉన్నాయి. క్రోధోద్రిక్తమైన శకుంతల తపశ్శక్తితో దాన్ని అణచి రెండు నిమేషాల కాలం ఆలోచించి క్రోధదుఃఖభరిత హృదయంతో భర్తవైపు చూస్తూ— మహారాజా! సర్వమూ తెలిసిన మీరు నీచజాతి వ్యక్తిలా ప్రవర్తిస్తారని నే ననుకోలేదు. సత్యాసత్యాలు మీ అంతరాత్మకి తెలుసు. గుండెమీద చేయి వేసి అంతరాత్మసాక్షిగా మీరు వాస్తవం చెప్పినట్లయితే అది మీకు శ్రేయోదాయక మవుతుంది. అంతరాత్మని మోసగించి దాన్ని అవహేళన చెయ్యకండి. నిజరూపాన్ని మరుగుపరుచుకొని కృత్రిమంగా ప్రవర్తించేవారు ఆత్మద్రోహు లౌతారు.

పురువంశశ్రేష్ఠ! నరపాలాగ్రణీ! ఆనాడు మన సమాగమవేళ ప్రత్యక్షసాక్షు లెవరూ లేరని మీరు భావిస్తున్నారు. కానీ సర్వహృదయాంతర్యామియైన సనాతనర్షి సర్వేశ్వరుడు ఆ విషయం ఎరగకపోడు. సమస్త పాపపుణ్యాలకూ సాక్షీభూతుడైన ఆ పరమేశ్వరుని కన్ను కప్పగలవారు లేరు. సత్యవాదులైన సాధుపురుషుల ధర్మబద్ధదృష్టి ఎన్నటికీ దుఃఖదాయకం కాదు. మానవుడు రహస్యంగా పాపకర్మలు చేసి ఎవరూ చూడలేదనుకోవటంకంటె భ్రమలేదు. సమస్త దేవతలూ సూర్య

అభ్యగచ్ఛః పతింయ త్త్వం భజమానం శకుంతలే.
మహాత్మాజనితాలోకేపుత్రి స్తవమహాబలః
యఇమాం సాగరాం పాంగీంకృత్స్నాంభోక్ష్యతి మేదినీమ్.

పరంచాభిప్రియాతస్యచక్రంతస్యమహాత్మనః
భవిష్యత్యప్రతీహతం సతతం చక్రవర్తినః.
తతఃప్రక్షాళ్యపాదాసావిశ్రాంతంమునిమబ్రవీత్
వినిధాయతతోభారం సంవిధాయఫలానిచ.
మయాపతిర్వృతో రాజాదుష్యంతః పురుషోత్తమః
తస్మైససచివాయత్వంప్రసాదంకర్తుమర్హసి.

ప్రసన్న ఏవతస్యాహంత్వత్కృతేవరవర్ణిని
ఋతవోబహావ స్తేవై గతావ్యర్థాఃశుచిస్మితే.
సార్థకంసాంప్రతంహ్యేతన్నచపాపోఽస్తితేఽనఘే.
గృహాణచవరంమత్తస్త్వంశుభేయదభీప్సితమ్.
తతో ధర్మిష్ఠతాం వవ్రే రాజ్యా చ్చాస్ఖలనం తథా
శకుంతలా పౌరవాణాం దుష్యంతహిత కామ్యయా.
ఏవమ స్త్వితితాం ప్రాహకణ్వోధర్మభృతాం వరః
పస్పర్శ చాపి పాణిభ్యాం సుతాం శ్రీమి వరూపిణీం.
అద్యప్రభృతి దేవీ త్వం దుష్యంతస్య మహాత్మనః
పతివ్రతానాం యాప్రవృత్తిస్తాం వృత్తి మనుపాలయ.

72 వ అధ్యాయం సమాప్తం.

## డెబ్బదిమూడ వ అధ్యాయము

ప్రతిజ్ఞాయ తు దుష్యంతే ప్రతియాతే శకుంతలాం
గర్భశ్చ వవృధే తస్యాం రాజపుత్ర్యాం మహాత్మనః.
శకుంతలా చింతయంతీ రాజానం కార్యగౌరవాత్
దివారాత్రమనిద్రైవ స్నానభోజనవర్జితా.
రాజప్రేషణికా విప్రాశ్చతురంగబలైః సహ
అద్య శ్వో వా పరశ్వోవాసమాయాంతీతి నిశ్చితా.
దివసాన్ పక్షానృతూన్ మాసానయనానిచసర్వశః
గణ్యమానేషు సర్వేషు వ్యతీయుస్త్రీణిభారత.
గర్భం సుషావ రామోరూః కుమారమమితౌజసం
త్రిషు వర్షేషు పూర్ణేషు దీప్తానలసమద్యుతిం.
రూపౌదార్యగుణోపేతం దౌష్యంతిం జనమేజయ
తస్మై తదాంతరిక్షాతు పుష్పవృష్టిః పపాత హ.
దేవదుందుభయో నేదుర్ననృతుశ్చాప్సరోగణాః
గాయంత్యో మధురంతత్రదేవైః శక్రోభ్యువాచహ.
శకుంతలే తవ సుతశ్చక్రవర్తీ భవిష్యతి

బలం తేజశ్చ రూపం చ న సమం భువి కేనచిత్.
ఆహర్తా వాజిమేధస్య శతసంఖ్యస్య పౌరవః
అనేకాని సహస్రాణి రాజసూయాదిభిర్మఖైః.
స్వార్థంబ్రాహ్మణసాత్ కృత్వా దక్షిణా మమితాం దదాత్

దేవతానాం వచః శ్రుత్వా కణ్వాశ్రమనివాసినః.
సభాజయంతి కణ్వస్య సుతాం సర్వే మహర్షయః
శకుంతలా చ తచ్ఛ్రుత్వా పరం హర్షమువాప సా.
ద్విజానాహూయమునిభిఃసత్కృత్యచ మహాయశాః
జాతకర్మాదిసంస్కారం కణ్వః పుణ్యకృతాం వరః
విధివత్కారయామాస వర్ధమానస్య ధీమతః.
దంతైః శుక్లైః శిఖరిభిః సింహసంహననో మహాన్
చక్రాంకితకరః శ్రీమాన్ మహామూర్ధా మహాబలః
కుమారో దేవగర్భాభః స తత్రాశు వ్యవర్ధత
షడ్వర్ష ఏవ బాలః స కణ్వాశ్రమపదంప్రతి.

చంద్రయమధర్మరాజులూ ఆకాశం వాయువు జలం అగ్ని పృథివీ అహోరాత్రాలూ ఉభయసంధ్యలూ ధర్మమూ మాత్రమే గాక వాని హృదయమూ ఆ హృదయాంతర్యామియైన పరమేశ్వరుడూ సర్వదా సాక్షులే. ఏ మానవుని హృదయంలో పరమేశ్వరుడు పరమసంతుష్టచిత్తుడై ఉంటాడో ఆ వ్యక్తిని ఏ పాపాలూ అంటవు. అలా కానివాడికి యమదండన తప్పదు. ఆత్మబుద్ధిని అతిక్రమించినవాడికి దేవతలుకూడా సహకరించరు. నేను స్వయంగా వచ్చిన కారణంచేత నన్ను మీరు తిరస్కరిస్తున్నారు. నాడు మీ ఆదరాభిమానాలు పొందిన నేను నేటికీ అందుకు అర్హురాలనే.

ఈ నిండుసభలో నామాటలు అరణ్యరోదనలా వినిపిస్తున్నట్లున్నాయి. ఇలా నన్ను అవమానించే నైచ్యానికి మీరెందుకు పాల్పడుతున్నారో నాకర్థం కావటంలేదు. సముచితమైన నా సంప్రార్థనం సమగ్రంగా మీరు ఆకర్ణించకపోతే మీతల సహస్రధా భిన్నమవుతుంది. భార్యాగర్భంలో భర్త పుత్రరూపంలో జన్మిస్తాడు. దీనినే జాయాత్వం అని విద్వాంసులంటారు. అలా ఉద్భవించిన సంతతివల్లనే పితృదేవతలు ఉద్ధరింపబడతారు. పున్నామనరకంనుండి రక్షిస్తాడు గనకనే వానిని పుత్రుడంటారు.

పితృదేవతలందరూ పుత్రపౌత్రులవల్ల అక్షయలోకాలు పొందుతారు. గృహకృత్య నిర్వహణ కౌశలం కలదీ, భర్తను ప్రాణాధికంగా చూసుకొనేదీ, పాతివ్రత్యధర్మాన్ని పరిపాలించేదీ, సంతానవతియైనదీ, ధర్మార్థకామాలతో సంసారసాగరం నుండి తరించే సంకల్పం గలపురుషునికి సాధనంగా ఉపకరించేదీ, ఉత్తమస్నేహధర్మాన్ని పాలించేదీ మాత్రమే భార్యగాపరిగణింపబడుతుంది. అట్టిభార్య కలవాడే యజ్ఞయాగాదికర్మలు చెయ్యడానికి అర్హుడు. భార్యాసహితుడైన పురుషుడే గృహస్థ జీవితంలో సుఖంగా ఉండగలడు. పత్నీయుక్తుడైనవాడు లక్ష్మీసంపన్నుడు. భార్యయే గృహలక్ష్మి. ధర్మకార్యాలలో తండ్రివలె భర్త హితవును కోరేదీ, దుఃఖసమయంలో తల్లివలె దుఃఖాన్ని పంచుకునేదీ, ఏకాంతంలో మిత్రునివలె ప్రియవచనాలు పలికేదీ భార్యయే. ఘోరారణ్యాలలో ఉన్నా భార్యాసహితుడైన పురుషునికి సుఖశాంతులు లభిస్తాయి. లోకవ్యవహారజ్ఞులు భార్యాసహితునే విశ్వసిస్తారు. ఇందువల్ల పురుషునికి స్త్రీ అత్యావశ్యమైనది. భర్త ఎక్కడఉంటే భార్య అక్కడే ఉంటుంది. భర్త మరణిస్తే ఆమెకూడా అనుసరిస్తుంది. ఒకవేళ ఆమె ముందుగా మరణిస్తే అతనికొరకై ఆ లోకాలలో నిరీక్షిస్తూ ఉంటుంది. ఇన్ని కారణాలవల్ల కులశీలసంపన్న స్త్రీ పాణిగ్రహణం అవసరం.

పురుషుని ఆత్మను పుత్రరూపంతో ప్రసవిస్తుంది కనకనే పుత్రవతికి మాతృగౌరవం ఇవ్వాలి. రూపగుణశీలాలలో బిడ్డ తండ్రిని పోలిఉంటాడు కదా. పితృసాంగత్యంవల్లనే వాని రూపురేఖలూ శీలవర్తనలూ ఏర్పడతాయి. పుత్రదర్శనం వల్ల తండ్రి అపూర్వానందం పొందుతాడు. అద్దంలో ప్రతిబింబంలా భార్యాగర్భంనుండి ప్రభవించే శిశువు హృదయానికి ఎంతో ఆహ్లాదం కలిగిస్తాడు.

సింహవ్యాఘ్రాన్ వరాహాంశ్చ మహిషాంశ్చ గజాం స్తథా
బబంధ వృక్షే బలవానాశ్రమస్య సమీపతః.
ఆరోహన్ దమయం శ్చైవ క్రీడంశ్చ పరిధావతి
తతశ్చ రాక్షసాన్ సర్వాన్ పిశాచాంశ్చ రిపూన్ రణే.
ముష్టియుద్ధేన తాన్ జిత్వా ఋషీనారాధయ త్తదా.
కశ్చిద్దితి సుత స్తం తు హంతుకామో మహాబలః
వధ్యమానాం స్తు దైతేయానమర్షితం సమభ్యయాత్.
తమాగతం ప్రహస్యైవ బాహుభ్యాం పరిగృహ్య చ
దృఢం చావధ్య బాహుభ్యాం పీడయామాస తం తదా.

మార్గితో న శశాకాస్య మోచితుం బలవ త్తయా
ప్రాక్రోశ ద్భైరవం తత్ర ద్వారేభ్యో నిఃసృతం త్వసృక్.
తేన శబ్దేన విత్రస్తా మృగాః సింహాదయో గణాః
సుస్రువుశ్చ శకృన్మూత్రమాశ్చమస్థాశ్చ సుస్రువుః
నిరసుం జానుభిః కృత్వా విససర్జ చ సోఽపతత్
తం దృష్ట్వా విస్మయం చక్రుః కుమారస్య విచేష్టితం.
నిత్యకాలం వధ్యమానా దైతేయా రాక్షసైః సహ
కుమారస్య భయాదేవ నైవ జగ్ము స్తదాశ్రమం
తతోఽస్య నామ చక్రు స్తే కణ్వాశ్రమనివాసినః.
అ స్త్వయం అర్వదమనః సర్వం హి దమయత్యసౌ
స సర్వదమనో నామ కుమారః సమపద్యత.
విక్రమేణౌజసా చైవ బలేన చ సమన్వితః
అపేక్షయతి దుష్యంతే మహిష్యా స్తనయస్య చ
పాండుభావపరీతాంగీం చింతయా సమభీప్లుతాం
లంబాలకాం కృశాం దీనాం తథా మలినవాససం
శకుంతలాం చ సంప్రేక్ష్య ప్రదధ్యౌ స ముని స్తదా.
శాస్త్రాణి సర్వవేదాశ్చ ద్వాదశాబ్దస్య చాభవన్
తం కుమారమృషిర్దృష్ట్వా కర్మ చాస్యాతిమానుషం.
సమయో యౌవరాజ్యాయేత్యబ్రవీచ్చ శకుంతలాం
శృణు భద్రే మమ సుతే మమ వాక్యం శుచిస్మితే
పతివ్రతానాం నారీణాం విశిష్టమితి చోచ్యతే.
పతిశుశ్రూషణం పూర్వం మనోవాక్కాయచేష్టితైః
అనుజ్ఞాతా మయా పూర్వం పూజయైతద్వ్రతం తవ.
ఏతేనైవ చ వృత్తేన విశిష్టాం లప్స్యసే శ్రియం
తస్మాద్భద్రే ప్రయాతవ్యం సమీపం పౌరవస్య హ.
స్వయం నాయాతి మత్వా తే గతం కాలం శుచిస్మితే
గత్వాఽఽరాధయ రాజానం దుష్యంతం హిత కామ్యయా.

దౌష్యంతిం యౌవరాజ్యస్థం దృష్ట్వా ప్రీతిమవాప్స్యసి
దేవతానాం గురూణాం చ క్షత్రియాణాం చ భామిని
భర్తౄణాం చ విశేషేణ హితం సంగమనం సతాం.
తస్మాత్ పుత్రకుమారేణ గంతవ్యం మత్ప్రియేప్సయా
ప్రతివాక్యం న దద్యా స్త్వం శాపితా మమ పాదయోః.
ఏవముక్త్వా సుతాం తత్ర పౌత్రం కణ్వోఽభ్య భాషత
పరిష్వజ్య చ బాహుభ్యాం మూర్ధ్న్యుపాఘ్రాయ పౌరవం.

సోమవంశోద్భవో రాజా దుష్యంతో నామ విశ్రుతః
తస్యాగ్రమహిషీ చైషా తవ మాతా శుచివ్రతా.
గంతుకామా భర్తృవశం త్వయా సహ సుమధ్యమా
గత్వాభివాద్య రాజానం యౌవరాజ్యమవాప్స్యసి.
స పితా తవ రాజేంద్ర స్తస్య త్వం వశగో భవ
పితృపైతామహం రాజ్యమనుతిష్ఠస్వ భావతః.
శకుంతలే శృణుష్వేదం హితం పథ్యం చ భామినీ
పతివ్రతాభావగుణాన్ హిత్వా సాధ్యం న కించనః.
పతివ్రతానాం దేవా వై తుష్టాః సర్వవరప్రదాః.
ప్రసాదం చ కరిష్యంతి హ్యాపదర్థే చ భామినీ.
పతిప్రసాదాత్ పుణ్యాగతిం ప్రాప్నువంతి న చాశుభం
తస్మాత్ గత్వా తు రాజానమారాధయ శుచిస్మితే
తస్య తద్వచనమాజ్ఞాయ కణ్వః శిష్యానువాచ హ.
శకుంతలామిమాం శీఘ్రం సహపుత్రామితో గృహాత్.

దేశభ్రష్టులై దుర్భరదారిద్ర్యం అనుభవించే వారుకూడా భార్యాసన్నిధానంలో అపురూప సంతోషంతో ఉంటారు. ధర్మం, ప్రీతీ, రతీ, అన్నీ భార్యాసంబంధమై ప్రాప్తించే ఐశ్వర్యాలని మురిసి పోతారు. ఇన్ని సౌఖ్యాలకు హేతుభూతమైన ఆమెపై ఏవిధమైన అనాదరంకానీ ఆమె హృదయాన్ని బాధించే మాటకానీ ప్రసరించి పలకరాదని శ్రుతి చెపుతున్నది. స్వర్గసుఖాలిచ్చే పుత్రులను భార్య లేకుండా ఋషులుకూడా పొందలేరు.

పసితనంలో కేరింతాలు కొడుతూ ఎక్కడ పడితే అక్కడ దొర్లుతూ ఆడుకుంటూ తండ్రి కనిపించేసరికి ఉరకలు వేసికొంటూ కిలకిల నవ్వుతూ వచ్చి రెండుకాళ్ళూ చుట్టవేసికొనే కొడుకుకంటె ఈ ప్రపంచంలో ఆనందదాయక మేమిటి మహారాజా! ఒక్కసారి ఇలా చూడండి. మీ ఒడిలో కూర్చుని రాచఠీవి ఒలికించాలనే కోరిక ఎంతగా వాడిలో తిరుగుతున్నదో ఇలా చూస్తే మీ కర్థం కాకపోదు. చిన్నిచిన్ని చీమలుకూడా తమ సంతానం మీద మమకారంతో వర్తిస్తాయే. కాకి తన గూటిలో ఉన్న కోకిలగుడ్లనుకూడా తన బిడ్డలేఅని పొదుగుతుందే. వానిలోనే అటువంటి వాత్సల్యం ఉంటే సర్వజ్ఞులయిన మీరు మీ కుమారుని ఆదరించలేకపోతున్నారా!

విపరీతప్రతిభాషలు దేనికి మహారాజా! ఒక్కసారి ఈబిడ్డను మీ గాఢపరిష్వంగంలోకి తీసికోండి; మలయానిల చందన చంద్రికా తుషారశీతలాలకంటె రమణీయరమణీమణీ సంస్పర్శనంకంటె సుఖతమంగా ఉండకపోతే చెప్పండి. మానవులలో బ్రహ్మవిదులూ జంతువులలో గోవూ పూజార్హులలో గురువూ శ్రేష్ఠులయినట్లే స్పర్శ సుఖవిషయంలో పుత్రుడు పరమశ్రేష్ఠుడు.

పుత్రగాత్ర పరిష్వంగంకంటె పురుషుడికి సుఖసంతోషదాయకమైనది లేదు. మీ వంశోద్ధారకుడు ఈ భరతుడు మూడు సంవత్సరాలు నాగర్భంలో పెరిగాడు. ఆరోజులలో వీడు నూరు అశ్వమేధాలు చేస్తాడని—ఆకాశవాణి పలికింది.

సామాన్య మానవులు కూడా ఇల్లుకదలి వెళ్ళి రాగానే ఒక్కసారి తమ బిడ్డను దగ్గరగా తీసికొని ముద్దాడతారు. అదీ కాక జాతకర్మ జరిపేటప్పుడు:— 'నా సర్వాంగాలనుండి నువ్వు జన్మించావు. నువ్వే నా హృదయానివి, ఆత్మవు. శతవత్సరాలు జీవించి సంతానవంతుడవై సుఖించు' అని తండ్రి పలుకుతాడే ఆవిషయమైనా మీ రెరుగరని నేననుకోనా! నిర్మల సరోవరంలో ప్రతిఫలించే బింబంలా ఉన్న మీ ఆత్మ ఈ బాలుడే. గార్హపత్యం నుండి ఆహవనీయం వచ్చినట్లు ఈ కుమారుడు మీకు కలిగాడు— అని ఎంత చెప్పినా తల ఊచని మహారాజు మనస్సుకి పూర్వస్మృతులు తెచ్చే సంకల్పంతో— మహారాజా!

సంవత్సరాలు గడిచిపోయాయి.

అప్పుడు మీరు వేటకోసం అడవికి వచ్చారు.

వచ్చిన పని చూసుకుంటూ మీ గుండెకి లొంగక పరుగెత్తే మృగంకోసం మా ఆశ్రమంలో ప్రవేశించారు.

ప్రవేశించి నన్ను గాంధర్వవిధిని గ్రహించారు.

భర్తుః ప్రాపయతాగారం సర్వలక్షణపూజితాం.
నారీణాం చిరవాసో హి బాంధవేషు నరోచతే
కీర్తిచారిత్రధర్మఘ్న స్తస్మాన్నయత మా చిరం.
ధర్మాభిపూజితం పుత్రం కాశ్యపేన నిశామ్య తు
కాశ్యపాత్ ప్రాప్యచానుజ్ఞాం ముముదేచశకుంతలా.
కణ్వస్య వచనం శ్రుత్వా ప్రతిగచ్ఛేతి చాసకృత్
తథేత్యుక్త్వాతుకణ్వంచమాతరం పౌరవోఽబ్రవీత్
కిం చిరాయసిమాత స్త్వం గమిష్యామోన్నృపాలయం
ఏవముక్త్వా తు తాం దేవీం దుష్యంతస్య మహాత్మనః
అభివాద్య మునేః పాదా గంతుమైచ్ఛత్ స పౌరవః
శకుంతలా చ పితరమభివాద్య కృతాంజలిః.
ప్రదక్షిణీకృత్య తదా పితరం వాక్యమబ్రవీత్
అజ్ఞానాన్మే పితా చేతి దురుక్తం వాపి చానృతం.
అకార్యం వాప్యనిష్టం వా క్షంతుమర్హాతి కాశ్యప
ఏవముక్తో నతశిరా మునిర్నోవాచ కించన.
మనుష్యభావాత్ కణ్వోఽపిమునిరశ్రూణ్యవర్తయత్
అబ్భక్షాన్ వాయుభక్షాంశ్చ శీర్ణపర్ణాశనాన్మునీన్.
ఫలమూలాశినో దాంతాన్ కృశాన్ ధమనిసంతతాన్
వ్రతినో జటిలాన్ ముండాన్ వల్కలాజినసంవృతాన్.
సమాహూయమునీన్ కణ్వః కారుణ్యాదిదమబ్రవీత్
మయా తు లాలితా నిత్యం మమ పుత్రీయశస్వినీ
వనే జాతా వివృద్ధా చ న చ జానాతి కించన.
అశ్రమేణ పథా సర్వైర్నీయతాం క్షత్రియాలయం
తథేత్యుక్త్వా తు తే సర్వే ప్రతిష్ఠంత మహౌజసః
శకుంతలాం పురస్కృత్య దుష్యంతస్య పురం ప్రతి.
గృహీత్వామరగర్భాభం పుత్రం కమలలోచనం
ఆజగామ తతః శుభ్రూర్దుష్యంతం విదితాద్వనాత్.
అభిసృత్య చ రాజానం విదితా చ ప్రవేశితా
సహ తేనైవ పుత్రేణ బాలార్కసమతేజసా.
నివేదయిత్వా తే సర్వే ఆశ్రమం పునరాగతాః
పూజయిత్వా యథాన్యాయమబ్రవీచ్చ శకుంతలా.
అభివాదయ రాజానం పితరం తే దృఢవ్రతం
ఏవముక్త్వా తు పుత్రం సా లజ్జానతముఖస్థితా.
స్తంభమాలింగ్య రాజానం ప్రసీదస్వేత్యువాచ సా
శకుంతలోఽపి రాజానమభివాద్య కృతాంజలిః.
హర్షేణోత్ఫుల్లనయనో రాజానం చాన్వవైక్షత
దుష్యంతో ధర్మబుధ్యాతుచింతయన్నేవసోఽబ్రవీత్.
కిమాగమనకార్యం తే బ్రూహి త్వం వరవర్ణిని
కరిష్యామి న సందేహః సపుత్రాయా విశేషతః.
ప్రసీదస్వ మహారాజ వక్ష్యామి పురుషోత్తమ
అయం పుత్రస్త్వయా రాజన్
యౌవరాజ్యేఽభిషిచ్యతాం.
త్వయా హ్యయం సుతో రాజన్ మయ్యుత్పన్నః
సురోపమః
యథాసమయమేతస్మిన్ వర్తస్వపురుషోత్తమ.
యథా మత్సంగమే పూర్వం యః కృతః
సమయస్త్వయా
తం స్మరస్వ మహాభాగ కణ్వాశ్రమపదం ప్రతి.
సోఽథశ్రుత్వైవ తద్వాక్యం తస్యారాజాస్మరన్నపి
అబ్రవీన్న స్మరామీతి కస్య త్వం దుష్టతాపసి.
ధర్మకామార్థ సంబంధం న స్మరామి త్వయా సహ
గచ్ఛ వా తిష్ఠ వా కామంయద్వాపీచ్ఛసి తత్ కురు.
సైవముక్తా వరారోహా వ్రీడితేవ తపస్వినీ
నిఃసంజ్ఞేవ చ దుఃఖేన తస్థౌ స్థాణేవ నిశ్చలా.
సంరంభామర్షతామ్రాక్షీ స్ఫురమాణౌష్ఠసంపుటా
కటాక్షైర్నిర్దహంతీవ తిర్యగ్ రాజానమైక్షత.

ఊర్వశి విశ్వాచి ఘృతాచి సహజన్య మేనక పూర్వచిత్తి— అప్సరో జనంలో ప్రథమశ్రేణివారు. అందులో బ్రహ్మ అనుగ్రహంవల్ల పుట్టిన మేనక సర్వోత్తమురాలు.

అటువంటి అపూర్వ లావణ్యవతి మేనకాదేవి నా తల్లి.

తేజోధర్మపరాయణుడైన కౌశికనందనుడు కుశనాభుడు. వాని కుమారుడు గాధి. గాధి నందనుడు తీవ్రతపస్వి విశ్వామిత్రుడు నా తండ్రి.

అగ్నిసదృశుడైన తండ్రి.

అపూర్వసౌందర్యలహరి తల్లి.

అటువంటివారు నన్ను హిమాలయపర్వత సానువులమీద విడిచి వెడితే శకుంతాలు రక్షిస్తూండగా కణ్వమహర్షి చూచి అరణి వలె నన్ను తన ఆశ్రమంలో ఉంచి పెంచాడు. ఎటు చూసినా సర్వోత్కృష్టమైనది నా జీవితం.

మహారాజా! మహర్షి కాశ్యపుని ఆశ్రమంలో పెరుగుతూ యౌవనం ప్రాప్తించిన నన్ను చూశారు మీరు. ఆనాడు ఆక్షణంలో ఆశ్రమంలో ఎవరూ లేరు. తియతియ్యని మాటలతో ధర్మార్థకామ ప్రస్తావనతో ఆశ్రమంలోనే నన్ను గాంధర్వరీతిని పరిగ్రహించారు. ఆనాటి మీ అనుగ్రహ విశేషం ఈ బాలుడు.

కులశీల సత్యధర్మ వర్తనం కల నేను మీ శరణు వేడుతున్నాను. విస్వసంరక్షకులు మీరు. నా ప్రాణనాథులు. మీ సేవతో తృప్తిపొందడానికి వచ్చిన ఈ నిరపరాధిని శిక్షించే యత్నం చేయవద్దు. ధర్మం వదలడం మంచిదికాదు. పూర్వజన్మలో నేను చేసిన పాపమేదో నన్ను ఆదినుండి బాధిస్తూనే ఉంది. కన్న తల్లిదండ్రులు వదిలేశారు. ఆదరించవలసిన భర్త అవమానించడం జరుగుతున్నది. ఇంత చెప్పినా మీరు నన్ను పరిత్యజించడానికే నిశ్చయిస్తే నేను నిశ్చింతగా తిరిగి వెళ్ళిపోతాను. కానీ ఈకుమారుణ్ణి తిరస్కరించే అధికారంమాత్రం మీకు లేదు— అని శకుంతల నిట్టూర్చి మౌనం వహించి నిలబడింది.

శకుంతలా! సర్వసాధారణంగా స్త్రీ అసత్యం పలకడానికి జంకదు. ఈ బాలుడెవరో నువ్వెవరవో నాకు తెలీదు. ఇంక నీమాటలు ఎలా నమ్మగలను. పైగా నీతల్లి మేనక వేశ్యఅని నువ్వే చెపుతున్నావు. ఆమె హృదయం లేకుండా నిన్ను వదిలేసింది గదా! ఆమెను చూస్తూనే కామవశీభూతుడైనాడు విశ్వామిత్రుడు. ఆయనకూ హృదయంలేనట్లు నీమాటలు చెపుతున్నాయి. ఎంత అసంగతంగా ఉంది నీ ప్రసంగం. అప్సరసలలో అగ్రశ్రేణికి చెందిన మేనక-మహర్షి శ్రేష్ఠుడైన విశ్వామిత్రునివల్ల నిన్ను కన్నదంటే నమ్మలేకపోతున్నాను. అటువంటి వారికి కలిగిన బిడ్డ ఇంత నీచంగా కులటలా మాట్లాడదు.

ఋషిప్రవరుడు విశ్వామిత్రు డెక్కడ! అప్సరోభామిని మేనక ఎక్కడ! అటువంటి వారికి ఇంతటి దైన్యంతో జీవించే తాపసకన్య పుట్టడమా? ఇంకా చూస్తే ఈబాలుడు వయస్సుకి మించిన శరీరంతో ఉన్నాడు. ఈ వయస్సులో ఇంతటి విశాల దేహమా! అసంభవం. నీకన్న నీచజాతియువతిని

ఆకారం గూహమానా చ మన్యునా చ సమీరితా
తపసా సంభృతం తేజో ధారయామాస వై తదా.
సాముహూర్తమివధ్యాత్వాదుఃఖామర్షసమన్వితా
భర్తారమభిసంప్రేక్ష్య క్రుద్ధా వచనమబ్రవీత్.
జానన్నపి మహారాజ కస్మాదేవం ప్రభాషసే
నజానామీతి నిఃశంకం యథాన్యః ప్రాకృతోజనః.
అత్ర తే హృదయం వేద సత్యస్యైవానృతస్య చ
కల్యాణంవదసాక్ష్యేణమాఽఽత్మానమవమన్యథాః.
యోఽన్యథా సంతమాత్మానమన్యథా ప్రతిపద్యతే
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా.

ఏకోహమస్మీతి చ మన్యసే త్వం
న హృచ్ఛయం వేత్సి మునిం పురాణం
యో వేదితా కర్మణః పాపకస్య
తస్యాంతికే త్వం వృజినంకరోషి.
ధర్మ ఏవ హి సాధూనాం సర్వేషాం హితకారణం
నిత్యంమిథ్యావిహీనానాంనచదుఃఖావహోభవేత్.
మన్యతే పాపం కృత్వా న కశ్చిద్ వేత్తిమామితి
విదంతి చైనం దేవాశ్చ యశ్చైవాంతరపూరుషః.
ఆదిత్యచంద్రావనిలానలౌ చ
ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తం.

యమో వైవస్వతస్తస్య సిర్యాతయతి దుష్కృతం
హృది స్థితః కర్మసాక్షీ క్షేత్రజ్ఞో యస్య తుష్యతి.
స తు తుష్యతి యస్యైన పురుషస్య దురాత్మనః
తం యమః పాపకర్మాణం వియాతయతి దుష్కృతం.
యోఽవమన్యాత్మనాఽఽత్మానమన్యథా ప్రతిపద్యతే
న తస్యదేవాః శ్రేయాంసోయస్యాత్మాపి నకారణం.

స్వయం ప్రాప్తేతి మామేవం మావమంస్థాః పతివ్రతాం.
అర్చ్యార్హాం నార్చయసి మాం స్వయం భార్యాముపస్థితాం

కిమర్థం మాం ప్రాకృతవదుపప్రేక్షసి సంసది
న ఖల్వహమిదం శూన్యే రౌమి కిం నశృణోషి మే.
యది మే యాచమానాయా వచనం న కరిష్యసి
దుష్యంత శతధా మూర్ధా తత స్తేఽద్య స్ఫుటిష్యతి.
భార్యాం పతిః సంప్రవిశ్య స యస్మాజ్జాయతే పునః
జాయాయాస్తద్ధి జాయాత్వం పౌరాణాః కవయో విదుః.

యదాగమవతః పుంస స్తదపత్యం ప్రజాయతే
తత్ తారయతి సంతత్యా పూర్వప్రేతాన్ పితా మహాన్
పున్నామ్నో నరకాద్యస్మాత్ పితరం త్రాయతే సుతః
తస్మాత్ పుత్రఇతిప్రోక్తఃస్వయమేవ స్వయంభువా.

పుత్రేణ లోకాన్ జయతి పౌత్రేణానంత్యమశ్నుతే
అథ పౌత్రస్య పుత్రేణ మోదన్తే ప్రపితామహాః
సా భార్యా యా గృహే దక్షా సా భార్యా యా ప్రజావతి
సా భార్యా యా పతిప్రాణా సా భార్యా యా పతివ్రతా.

అర్ధం భార్యా మనుష్యస్యభార్యా శ్రేష్ఠతమః సఖా
భార్యామూలం త్రివర్గస్య భార్యామూలంతరిష్యతః.
భార్యావంతః క్రియావంతః సభార్యా గృహమేధినః
భార్యావంతః ప్రమోదంతే భార్యావంతః శ్రియాన్వితాః.

నేను చూడలేదు. ఏదో దౌర్బల్యంతో మేనక నిన్ను కన్నదేమో! పైగా నువ్వు చెప్పేవేవీ నా స్మృతిలో కూడా లేవు. నువ్వు తక్షణం వెళ్ళిపో- అన్నాడు దుష్యంతుడు.

మహాప్రభూ! ఎదుటివారి స్వల్పదోషాలను చూడగల మీరు మీ మహానేరాలను ఎరిగీ ఎరగనట్లు మాట్లాడుతున్నారు. దేవలోకంలో అమరులందరూ మేనక వెనకాల నడవాలి. అటువంటి పూజ్యురాలి కూతురుని నేను. నా కులజన్మలు మీ కన్న శ్రేష్ఠమైనవి. నాకు ఆకాశయానశక్తి ఉంది. సూక్ష్మంగా విచారిస్తే మహామేరువుకీ ఆవగింజకూ ఉన్నంత తేడా ఉన్నది నాకూ మీకూ. ఇంద్ర వరుణ యమ కుబేర లోకాలకు స్వేచ్ఛగా పోయి రాగలశక్తి నాకున్నది.

కురూపి తన ప్రతిబింబం చూసుకోనంతవరకూ తానే సర్వలోకసుందరుణ్ణి అనుకుంటాడు. కానీ అద్దంలో ఒక్కసారి ఆముఖం కనబడితే మరుక్షణంలో తలదించుకుంటాడు. మహారాజా! ఇది లోకసహజం. సౌందర్యవంతులు ఎదుటివారిని అవమానించరు. అది లేనివారే కటువుగా ఎదుటివారిని అవహేళన చేస్తారు. మూర్ఖులు చెడ్డనే గ్రహిస్తారు. వరాహాలు అన్నిపదార్థాలూ వదలి అమేధ్యాన్నే ఆరగిస్తాయి. హంస నీటిని విడిచి పాలనే త్రాగుతుంది. విద్వాంసులు మంచినే గ్రహిస్తారు. ఎదుటివారిని నిందించడానికి వారెత బాధ పడతారో మూర్ఖులు ఆ అవకాశం కోసం అంతగా ఎదురుచూస్తారు.

ప్రపంచంలో ఇంతకంటె హాస్యాస్పద విషయం ఏముంది. దుర్జనులు సజ్జనులనే దుర్జనులు లంటూంటారు. ధర్మభ్రష్టుడు భయంకర విషసర్పసదృశుడు. వానికి నాస్తికులే భయపడతారంటే ఆస్తికుని విషయం చెప్పాలా. తనతో సమానుడైన కుమారుని గౌరవించలేని వాడికి ఉత్తమ గతులు లేవు. సర్వ ధర్మకర్మలకూ పుత్రుడు అవశ్యం. ధర్మపత్నికి జన్మించినవాడూ పరస్త్రీకి తనవల్ల కలిగినవాడూ కొనబడినవాడూ పోషితుడూ ఉపనయనాది సంస్కారాలు తనచే పొందినవాడూ— వీరయిదుగురూ పుత్రులే అని మనువు చెప్పాడు. వీరందరూ పురుషుని ధర్మకీర్తులను వృద్ధిపరుస్తూ మనస్సుకి ఆహ్లాదం కలిగిస్తారు. పుత్రుడనే ధర్మనౌక లేకపోతే వీరికి నరకం తప్పదు.

సత్యధర్మా! ఈ సమయంలో మీరు నన్ను మోసగించి మీ నెత్తిమీద పాపం పెట్టుకోకండి. మహారాజా! నుతజలపూరితంబులగు నూతులు నూరిటికంటె ఒక్క దిగుడు బావి మేలు. నూరు దిగుడు బావులకంటె ఒక క్రతువు శ్రేయస్కరం. అటువంటి నూరు యజ్ఞాలు ఒక్క పుత్రునితో సమానం కావు. నూరుగురు కుమారుల కంటె సత్యవాక్పరిపాలనం మేలు. సహస్రాశ్వమేధాలఫలం ఒకవైపూ సత్యపాలన ఫలం ఒకవైపూ ఉంచితే సత్యంవైపే ముల్లు మొగ్గు చూపుతుంది. వేదాధ్యయనఫలమూ సమస్తతీర్థ స్నానఫలమూ సత్యంతో తూగవు. సత్యభాషణమే సర్వోత్తమ ధర్మం. అసత్యంకంటె మహాపాపం లేదు. పరబ్రహ్మస్వరూపమైన సత్యమార్గం వదలకండి. ఇప్పటికీ మీరు నామాటలు విశ్వసించలేకపోతే నేను వచ్చిన దారినే వెళ్ళిపోతాను. మీవంటివారితో ఉండటం ఇక ఉచితం కాదు.

వీడు మీ కొడుకవునో కాదో నిర్ధారించుకోవాలంటే ఒక్కసారి మీ బుద్ధిని కేంద్రీకరించి

సఖాయః ప్రవివిక్తేషు భవంత్యేతాః ప్రియంవదాః
పితరో ధర్మకార్యేషు భవంత్యార్తస్య మాతరః.
కాంతారేష్వపి విశ్రామో జనస్యాధ్వనికస్య వై
యః సదారః స విశ్వాస్యస్తస్మాద్ దారాః
పరాగతిః.

సంసరంతమపి ప్రేతం విషమేష్వేకపాతినం
భార్యైవాన్వేతి భర్తారం సతతం యా పతివ్రతా.
ప్రథమం సంస్థితా భార్యా పతిం ప్రేత్య ప్రతీక్షతే
పూర్వం మృతం చ భర్తారం పశ్చాత్ సాధ్వ్యను
గచ్ఛతి.

ఏతస్మాత్ కారణాద్రాజన్ పాణిగ్రహణమిష్యతే
యదాప్నోతి పతిర్భార్యామిహలోకే పరత్ర చ.
ఆత్మాఽఽత్మనైవ జనితః పుత్రఇత్యుచ్యతే బుధైః
తస్మాద్భార్యాం నరః పశ్యేన్మాతృవత్ పుత్ర
మాతరం.

అంతరాత్మైవ సర్వస్య పుత్రనామ్నోచ్యతే సదా
గతీ రూపం చచేష్టా చ ఆవర్తా లక్షణాని చ.
పితౄణాం యాని దృశ్యంతే పుత్రాణాంసంతి తాని చ
తేషాంశీలాచారగుణాస్తత్సంపర్కాచ్ఛుభాశుభాః
భార్యాయాం జనితం పుత్ర మాదర్శేష్వివచాననం
హ్లాదతే జనితా ప్రేక్ష్య స్వర్గంప్రాప్యేవపుణ్యకృత్.
దహ్యమానామనోదుఃఖైర్వ్యాధిభిశ్చాతురానరాః
హ్లాదంతే స్వేషు దారేషు ఘర్మార్తాః సలిలేష్వివ.
విప్రవాసకృశా దీనా నరా మలినవాససః
తేఽపి స్వదారాంస్తుష్యంతి దరిద్రా ధనలాభవత్.
సుసంరబ్ధోఽపి రామాణాం న కుర్యాదప్రియం నరః
రతిం ప్రీతిం చ ధర్మం చ తాస్వాయత్తమవేక్ష్యహి.
ఆత్మనోఽర్ధమితి శ్రౌతం సా రక్షతి ధనం ప్రజాః
శరీరం లోకయాత్రాం వై ధర్మం స్వర్గమృషీన్
పితౄన్.

ఆత్మనో జన్మనః క్షేత్రంపుణ్యం రామాః సనాతనం
ఋషీణామపి కా శక్తిః స్రష్టుం రామామృతే
ప్రజాం.

ప్రతిపద్య యదా సూనుర్ధరణీరేణుగుంఠితః
పితురాశ్లిష్యతేంఽగాని కిమస్త్యభ్యధికం తతః.
స త్వం స్వయమభిప్రాప్తం సాభిలాషమిమం సుతం
ప్రేక్షమాణం కటాక్షేణ కిమర్థమవమన్యసే.
అండాని బిభ్రతి స్వాని న భిందంతి పిపీలికాః
న భరేథాః కథం ను త్వంధర్మజ్ఞఃసన్స్వమాత్మజం.
మమాండానీతి వర్ధంతే కోకిలానాపి వాయసాః
కిం పునస్త్వం న మన్యేథాః సర్వజ్ఞఃపుత్రమీదృశం.
మలయాచ్చందనం జాతమతిశీతం వదంతి వై
శిశోరాలింగ్యమానస్య చందనాదధికం భవేత్.
న వాససాం న రామాణాంనాపాంస్పర్శస్తథావిధః
శిశోరాలింగమానస్య స్పర్శః సూనోర్యథా సుఖః.
బ్రాహ్మణోద్విపదాం శ్రేష్ఠో గౌర్వరిష్ఠాచతుష్పదాం
గురుర్గరీయసాం శ్రేష్ఠః పుత్రః స్పర్శవతాం వరః
స్పృశతు త్వాం సమాశ్లిష్య పుత్రోఽయం ప్రియ
దర్శనః

పుత్రస్పర్శాత్ సుఖతరః స్పర్శో లోకే నవిద్యతే.
త్రిషు వర్షేషు పూర్ణేషు ప్రజాతాహమరిందమ
ఇమం కుమారం రాజేంద్ర తవ శోకవినాశనం.
ఆహర్తా వాజిమేధస్య శతసంఖ్యస్య పౌరవ
ఇతి వాగంతరిక్షే మాం సూతకేఽభ్యవదత్ పురా.
నను నామాంకమారోప్య స్నేహాద్ గ్రామాంతరం
గతాః

మూర్ధ్ని పుత్రానుపాఘ్రాయ ప్రతినందంతిమానవాః
వేదేష్వపి వదంతీమం మంత్రగ్రామం ద్విజాతయః
జాతకర్మాణి పుత్రాణాం తవాపి విదితం తథా.
అంగాదంగాత్ సంభవసి హృదయాదధిజాయసే

చూడండి. వీడి శీలస్వభావాలు ఆకార రేఖలు విజ్ఞానసాహసాలు ఆఖరికి వీడి కంఠస్వరం వీడి జుత్తు అంతటా మీ ప్రతిబింబం ఉన్నది. వీడు మిమ్మల్ని నాన్నా అని ఆశగా పిలుస్తున్నాడు. ఆ ఆశను భగ్నం చెయ్యవద్దు. మీ రంగీకరించినా తిరస్కరించినా నిస్సందేహంగా వీడు ఈ చతుస్సాగర మధ్యస్థమైన భూమండలాన్ని శాసించితీరతాడు— అని శకుంతల తిరిగి పోనున్న సమయంలో ఆకాశ వీధినుండి అదృశ్యవాణి ఇలా పలుకుతున్నది.

మహారాజా! వీడు నీ తనయుడు. నీ ఆత్మనుండి ఆవిర్భవించిన పుత్రుని తిరస్కరించకు. సర్వాత్మనా వీడు నీ కుమారుడు నీవల్లనే ఈ బాలుడు పుట్టాడు. నీయందు అనురాగం గల ఈమె నీ ధర్మపత్ని. ఆమెపై అనాదరం ప్రసరించకు. స్త్రీ పవిత్ర స్వరూపిణి. ధర్మమార్గాన స్త్రీని పురుషుడు స్వీకరిస్తాడు. ఆ స్త్రీలోని దోషాలన్నీ రజస్రావంవల్ల పోతాయి. స్త్రీ గర్భంలో వీర్యరూపంలో పురుషుడే ప్రవేశించి పుత్రరూపం పొంది పితృదేవతలను ఉద్ధరిస్తాడు. స్త్రీ భర్తనే పుత్రరూపంలో ప్రసవిస్తుంది. ఇప్పుడు శకుంతల పరమసత్యం చెప్పింది. నువ్వే ఈ బాలుని తండ్రివి. ఆత్మరూపమైన పుత్రుని విడిచిపెట్టడం కంటె దౌర్భాగ్యం లేదు.

ఈ బాలుడు మీ ఉభయులకూ నందనుడు. ఈతని భరణపోషణాదులు నువ్వే చేస్తావు. భరతుడనే పేరుతో వీడు ప్రఖ్యాతు డవుతాడు— అని దేవతలూ ఋషులూ ఎలుగెత్తి చాటి ఆమెపై పూలజల్లులు కురుస్తూంటే దుష్యంతుడు లేచి మహాసభలోని మంత్రి సామంతపురోహితులను చూస్తూ- మీరందరూ దేవదూతల వచనాలు శ్రద్ధగా ఆలకించండి. వాస్తవానికి వీడు నాకుమారుడే. అయితే శకుంతల వాక్యాలే ప్రమాణంగా పరిగ్రహించి నేను ఈ బాలుని స్వీకరిస్తే మీరు ఈకుమారుని విషయమై శంకాస్పదచిత్తు లవుతారని ఇంతవరకూ ఆగాను— అన్నాడు.

అలా పలికి ఆ బాలుని దగ్గరగా తీసికొని శిరసు ముద్దాడుతూంటే బ్రాహ్మణాశీర్వాదాలూ వందిమాగధుల కైవారాలు సాగినవి.

దుష్యంతుడు శకుంతలను దగ్గరగా తీసికొని— దేవీ! మన వివాహబంధం ఈ ప్రజ లెరగరు. సర్వజనసంపూజ్యశీల వైన నిన్ను నా ప్రజలు శంకిస్తారనే ఊహతో నేనలా మాట్లాడాను. అలా కాకపోతే నువ్వు కామవశచిత్తవై నాకు లొంగిపోయావనుకుంటారు. నన్నుకూడా కామాంధుడుగా భావిస్తారు. ఆ గుప్తశిశువులో నీకొడుకుకి రాజ్యాధికారం యిస్తానని వాగ్దానం చేశాననుకుంటారు. ధర్మబద్ధంగా మనవివాహం జరిగిందని విశ్వసించరు.

ఆ సమయంలో అత్యంత క్రోధంతో నువ్వు ఆడిన మాటలన్నీ నా మీద అనురాగంతోనే ఆడావని నాకు తెలుసు. అందుచేత ఆ అపరాధాలన్నీ క్షమించగలను. నాలానే నువ్వు కూడా నా కటూక్తులను అన్యథా భావించక క్షమించు. క్షమకూడా పతివ్రతా ధర్మమే— అని పలికి ఆమెను అనునయించి అనురాగంతో చూడసాగాడు.

సభాస్థలినుంచి దుష్యంతుడు శకుంతలా భరతులను వెంటబెట్టుకుని (తల్లి) రథంతర సమీపానికి వెళ్ళి— అమ్మా! వీడు నీ పౌత్రుడు. ఇదిగో నీ కోడలు. విశ్వామిత్రుని కూతురు. కణ్వుని దత్తపుత్రి. వీరిని అనుగ్రహించు— అనగా రథంతర తన పాదాలకు అభివాదాం చేసే శకుంతలను లేవనెత్తి

ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరదశ్శతం.
జీవితం త్వదధీనం మే సంతానమపి చాక్షయం
తస్మాత్ త్వం జీవ మే పుత్ర సుసుఖీశరదాంశతం.
త్వదంగేభ్యః ప్రసూతో౽యం పురుషాత్ పురు
షో౽పరః
సరసీవామలే౽౽త్మానం ద్వితీయం పశ్య వై సుతం.
యథా హ్యాహవనీయో౽గ్నిర్గార్హపత్యాత్ ప్రణీయతే
తథాత్వత్తః ప్రసూతో౽యంత్వమేకః సన్ ద్విధాకృతః
మృగావకృష్టేన పురా మృగయాం పరిధావతా
అహమాసాదితా రాజన్ కుమారీ పితురాశ్రమే.
ఊర్వశీ పూర్వచిత్తిశ్చ సహజన్యా చ మేనకా
విశ్వాచీ చ ఘృతాచీ చ షడేవాప్సరసాం వరాః.
తాసాం సామేనకానామబ్రహ్మయోనిర్వరాప్సరాః
దివః సంప్రాప్య జగతీం విశ్వామిత్రాదజీజనత్.
శ్రీమానృషిః ధర్మపరో వైశ్వానర ఇవాపరః
బ్రహ్మయోనిః కుశో నామవిశ్వామిత్రపితామహః.
కుశస్య పుత్రో బలవాన్ కుశనాభశ్చ ధార్మికః
గాధిస్తస్య సుతో రాజన్ విశ్వామిత్రస్తుగాధిజః
ఏవంవిధః పితా రాజన్ మేనకా జననీవర.
సా మాం హిమవతః ప్రస్థే సుషువే మేనకాప్సరాః
అవకీర్య చ మాం యాతా పరాత్మజమివాసతీ.
పక్షిణః పుణ్యవంతస్తే సహితా ధర్మతస్తదా
పక్షైస్తైరభిగుప్తా చ తస్మాదస్మి శకుంతలా.
తతో౽హమృషిణా దృష్టా కాశ్యపేన మహాత్మనా
జలార్థమగ్నిహోత్రస్య గతం దృష్ట్వా తు పక్షిణః.
న్యాసభూతామివ మునేః ప్రదదుర్మాం దయావతః
స మారణిమివాదాయ స్వమాశ్రమముపాగమత్.
సా వై సంభావితా రాజన్ననుక్రోశాన్మహర్షిణా
తేనైవ స్వసుతేవాహం రాజన్ వై పరమర్షిణా.
విశ్వామిత్రసుతా చాహం వర్ధితా మునినానృప
యౌవనే వర్తమానాం చ దృష్టవానసి మాం నృప.
ఆశ్రమే పర్ణశాలాయాం కుమారీం విజనే వనే
ధాత్రా ప్రచోదితాం శూన్యే పిత్రా విరహితాం
మిథః.
వాగ్భిస్త్వంసూనృతాభిర్మామపత్యార్థమచూచుదః
అకార్షీస్త్వాశ్రమే వాసం ధర్మకామార్థనిశ్చితం.
గాంధర్వేణ వివాహేన విధినా పాణిమగ్రహీః
సాహం కులం చ శీలం చ సత్యవాదిత్వమాత్మనః.
స్వధర్మంచ పురస్కృత్య త్వామద్యశరణం గతా
తస్మాన్నార్హసి సంశ్రుత్య తథేతి వితథం వచః.
స్వధర్మం పృష్ఠతః కృత్వా పరిత్యక్తుముపస్థితాం
త్వంనాథాం లోకనాథస్త్వం నార్హసిత్వమనాగసం.
కిం ను కర్మాశుభం పూర్వం కృతవత్యన్యజన్మని
యదహం బాంధవైస్త్యక్తా బాల్యే సంప్రతి చ
త్వయా.
కామం త్వయా పరిత్యక్తా గమిష్యామి
స్వమాశ్రమం
ఇమం తు బాలంసంత్యక్తుంనార్హస్యాత్మజమాత్మనః
న పుత్రమభిజానామి త్వయి జాతం శకుంతలే
అసత్యవచనా నార్యః కస్తే శ్రద్ధాస్యతే వచః.
మేనకా నిరనుక్రోశా బంధకీ జననీతవ
యయా హిమవతః పృష్ఠేనిర్మాల్యమివ చోజ్ఝితా.
న చాపి నిరనుక్రోశః క్షత్రయోనిః పితాతవ
విశ్వామిత్రో బ్రాహ్మణత్వే లుబ్ధః కామవశం గతః.
మేనకాప్సరసాం శ్రేష్ఠా మహర్షీణాం పితా చ తే
తయోరపత్యం కస్మాత్ త్వం పుంశ్చలీవ ప్రభాషసే.
అశ్రద్ధేయమిదం వాక్యం కథయంతీ న లజ్జసే.
విశేషతో మత్సకాశే దుష్టతాపసి గమ్యతాం.
క్వ మహర్షిః సచైవాగ్ర్యః సాప్సరాః క్వ చ మేనకా
క్వ చ త్వమేవం కృపణా తాపసీవేషధారిణీ.

మనుమని గుండెల కద్దుకుని—అమ్మాయీ నీకొడుకు మహారాజు. నీభర్త త్రిలోకవిజేత. నీకు దివ్యభోగ ప్రాప్తి— అని ఆశీర్వదించింది.

అనంతరం శకుంతలను పట్టపురాణిని చేసి ఆనందించాడు దుష్యంతుడు. భరతుని యువరాజుగా చేసి మరొక నూరేండ్లు భూమినేలి దుష్యంతుడు స్వర్గం చేరాడు. భరతుని చక్రవర్తిత్వం అవిచ్ఛిన్నంగా సాగుతున్నది. సర్వరాజులనూ జయించి ఎన్నో యజ్ఞాలు చేశాడు. కణ్వుని ఆధ్వర్యంలో గోవితత మనే అశ్వమేధం చేశాడు.

ఈ భరతుని పేరనే ఈదేశం భారత దేశమనీ, కురువంశ భరతవంశమనీ ప్రఖ్యాత మయాయి. దేవసమపరాక్రములూ తేజస్సంపన్నులూ ఐన రాజు లెందరో భరతవంశంలో జన్మించి సత్యధర్మనిరతులై భూమిని పాలించి ప్రజలకు శాంతి ప్రసాదించారు.

ఇది

## శకుంతలోపాఖ్యానము

మహాభారతేతిహాసాంతర్గత మయిన
ఆదిపర్వములోని ఆస్తీకాదిపర్వములతో
35 వ అధ్యాయమునుండి 74 వ అధ్యాయము
వరకూ ఆంధ్రవ్యాఖ్యానముతో ఇది

## ద్వితీయభాగము

అతికాయశ్చ తే పుత్రో బాలోఽతిబలవానయం
కథముత్పన్న కాలేన శాలస్తంభ ఇవోద్గతః.
సునికృష్టా చ తే యోనిః పుంశ్చలీవ ప్రభాషసే
యదృచ్ఛయా కామరాగాజ్జాతా మేనకయా హ్యసి
సర్వమేతత్ పరోక్షం మే యత్ త్వం వదసి తాపసి
నాహం త్వామభిజానామి యథేష్టం గమ్యతాం
త్వయా.

రాజన్ సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి
ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి న పశ్యసి.
మేనకా త్రిదశేష్వేవ త్రిదశాశ్చాను మేనకాం
మమైవోద్రిచ్యతే జన్మ దుష్యంత తవ జన్మనః.
క్షితావటసి రాజేంద్ర అంతరిక్షే చరామ్యహం
ఆవయోరంతరం పశ్య మేరుసర్షపయోరివ.
మహేంద్రస్య కుబేరస్య యమస్య వరుణస్య చ
భవనాన్యనుసంయామి ప్రభావం పశ్య మే నృప.
సత్యశ్చాపి ప్రవాదోఽయం యం ప్రవక్ష్యామి తేఽనఘ
నిదర్శనార్థం న ద్వేషాచ్ఛ్రుత్వా తం క్షంతుమర్హసి.
విరూపో యావదాదర్శే నాత్మనః పశ్యతే ముఖం
మన్యతే తావదాత్మానమన్యేభ్యో రూపవత్తరం.
యదా స్వముఖమాదర్శే వికృతం సోఽభివీక్షతే
తదాంతరం విజానీతే ఆత్మానం చేతరం జనం.
అతీవరూపసంపన్నో న కించిదవమన్యతే
అతీవ జల్పన్ దుర్వాచో భవతీహ విహేఠకః.
మూర్ఖో హి జల్పతాం పుంసాం శ్రుత్వా వాచః
శుభాశుభాః
అశుభం వాక్యమాదత్తే పురీషమివ సూకరః.
ప్రాజ్ఞస్తు జల్పతాం పుంసాం శ్రుత్వా వాచః
శుభాశుభాః
గుణవద్వాక్యమాదత్తే హంసః క్షీరమివాంభసః.
అన్యాన్ పరివదన్ సాధుర్యథా హి పరితప్యతే
తథా పరివదన్నన్యాంస్తుష్టో భవతి దుర్జనః.
అభివాద్య యథావృద్ధాన్ సంతో గచ్ఛంతి నిర్వృతిం
ఏవం సజ్జనమాక్రుశ్య మూర్ఖో భవతి నిర్వృతః
సుఖం జీవన్త్యదోషజ్ఞా మూర్ఖా దోషానుదర్శినః
యత్ర వాచ్యాః పరైః సంతః పరానాహుస్తథా
విధాన్.

అతో హాస్యతరం లోకే కించిదన్యన్న విద్యతే
యత్ర దుర్జనమిత్యాహ దుర్జనః సజ్జనం స్వయం.
సత్యధర్మచ్యుతాత్పుంసః క్రుద్ధాదాశీవిషాదివ
అనాస్తికోఽప్యుద్విజతే జనః కిం పునరాస్తికః
స్వయముత్పాద్య వై పుత్రం సదృశం యో న
మన్యతే
తస్య దేవాః శ్రియం ఘ్నంతి న చ లోకాను
పాశ్నుతే.

కులవంశప్రతిష్ఠాం హి పితరః పుత్రమబ్రువన్
ఉత్తమం సర్వధర్మాణాం తస్మాత్ పుత్రం న
సంత్యజేత్.
స్వపత్నీప్రభవాన్ పంచలబ్ధాన్ క్రీతాన్ వివర్ధితాన్
కృతానన్యాసు చోత్పన్నాన్ పుత్రాన్ వై
మనురబ్రవీత్.
ధర్మకీర్త్యావహా నృణాం మనసః ప్రీతివర్ధనాః
త్రాయన్తే నరకాజ్జాతాః పుత్రా ధర్మప్లవాః
పితౄన్.

న త్వం నృపతి శార్దూల పుత్రం న త్యక్తుమర్హసి
ఆత్మానం సత్యధర్మౌ చ పాలయన్ పృథివీపతే
నరేంద్రసింహ కపటం న వోఢుం త్వమిహార్హసి.
వరం కూపశతాద్వాపీ వరం వాపీశతాత్క్రతుః
వరం క్రతుశతాత్పుత్రః సత్యం పుత్రశతాద్వరం.
అశ్వమేధ సహస్రం చ సత్యం చ తులయాధృతం
అశ్వమేధసహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే.

సర్వవేదాధిగమనం సర్వతీర్థావగాహనం
సత్యంచవచనంరాజన్ సమం వాస్యాన్న వా సమం.
నాస్తి సత్యసమో ధర్మో న సత్యాద్విద్యతే పరం.
రాజన్ సత్యం పరంబ్రహ్మసత్యంచ సమయః పరః
మా త్యాక్షీః సమయం రాజన్ సత్యం సంగత
మస్తు తే.

అనృతే చేత్ ప్రసంగస్తే శ్రద్ధాసి న చేత్ స్వయం
ఆత్మనా హంత గచ్ఛామి త్వాదృశేనాస్తి సంగతం.
పుత్రత్వే శంకమానస్య బుద్ధిర్జ్ఞాపకదీపనా
గతిః స్వరః స్మృతిః సత్వం శీలవిజ్ఞానవిక్రమాః.
ధృష్టప్రకృతిభావౌ చ ఆవర్తా రోమరాజయః
సమా యస్య యతః స్యుస్తే తస్య పుత్రో న
సంశయః.

సాదృశ్యేనోద్ధృతం బింబం తవ దేహాద్విశాంపతే
తాతేతి భాషమాణం వై మాస్మ రాజన్ వృథా
కృథాః.

త్వామృతేఽపి హి దుష్యంత శైలరాజవతంసకాం
చతురంతామిమాముర్వీం పుత్రో మే పాలయిష్యతి.
శకుంతలే తవ సుతశ్చక్రవర్తీ భవిష్యతి
ఏవముక్తోమహేంద్రేణ భవిష్యతి న చాన్యథా.
సాక్షిత్వే బహవోఽప్యుక్తా దేవదూతాదయో
మతాః

నబ్రువంతి యథా సత్యముతాహోఽప్యనృతం కిల.
అసాక్షిణీమందభాగ్యాగమిష్యామియథాఽఽగతం
ఏతావదుక్త్వా రాజానం ప్రాతిష్ఠత శకుంతలా
అథాంతరిక్షాద్దుష్యంతం వాగువాచాశరీరిణీ.
ఋత్విక్పురోహితాచార్యైర్మంత్రిభిశ్చ వృతం తదా
భస్త్రా మాతా పితుః పుత్రో యేన జాతః స
ఏవ సః.

భరస్వ పుత్రం దుష్యంత మావమంస్థాః శకుంతలాం
సర్వాభ్యో హ్యంగమంగేభ్యః సాక్షాదుత్పద్యతే
సుతః

ఆత్మా చైష సుతో నామ తథైవ తవపౌరవ.
అహితంహ్యాత్మనాఽఽత్మానం పరిరక్ష ఇమం సుతం
అనన్యాం స్వాం ప్రతీక్షస్వ మావమంస్థాః
శకుంతలాం.

స్త్రియః పవిత్రమతులమేతద్దుష్యంత ధర్మతః
మాసి మాసి రజోహ్యాసాం దుష్కృతాన్యపకర్షతి
రేతోధాః పుత్ర ఉన్నయతి నరదేవ యమక్షయాత్
త్వం చాస్య ధాతా గర్భస్య సత్యమాహ శకుంతలా
జయా జనయతే పుత్రమాత్మనోఙ్గం ద్విధాకృతం
తస్మాద్భరస్వ దుష్యంత పుత్రం శాకుంతలం నృప
అభూతిరేషా యత్త్యక్త్వా జీవేజ్జీవంత మాత్మజం.
శాకుంతలం మహాత్మానం దౌష్యంతిం భర పౌరవ
భర్తవ్యోఽయం త్వయా యస్మాదస్మాకం
వచనాదపి.

తస్మాద్భవత్వయం నామ్నా భరతో నామ తే
సుతః

ఏవముక్త్వా తతో దేవా ఋషయశ్చ తపోధనాః
పతివ్రతేతి సంహృష్టాః పుష్పవృష్టిం వవర్షిరే.
తచ్ఛ్రుత్వాపౌరవోరాజావ్యాహృతంత్రిదివౌకసాం
పురోహితమమాత్యాంశ్చ సంప్రహృష్టోఽబ్రవీదిదం
శృణ్వంత్వేతద్భవంతోఽస్య దేవదూతస్య భాషితం
అహం చాప్యేవమేవైనం జానామిస్వయమాత్మజం
యద్యహం వచనాదస్యా గృహ్ణీయామిమమాత్మజం.
భవేద్ధి శంక్యో లోకస్య నైవ శుద్ధో భవేదయం
తం విశోధ్య తదా రాజా దేవదూతేన భారత
హృష్టః ప్రముదితశ్చాపి ప్రతిజగ్రాహ తం సుతం.
తతస్తస్య తదా రాజాపితృకర్మాణి సర్వశః
కారయామాస ముదితః ప్రీతిమానాత్మజస్య హ.
మూర్ధ్ని చైనముపాఘ్రాయ సస్నేహం పరిషస్వజే

సభాజ్య మానోవిప్రైశ్చ స్తూయమానశ్చ వందిభిః
స ముదం పరమాం లేభే పుత్రసంస్పర్శజాం నృపః.
తాం చైవ భార్యాం దుష్యంతః పూజయామాస ధర్మతః
అబ్రవీచ్చైవ తాంరాజాసాంత్వపూర్వమిదంవచః.
కృతో లోకపరోక్షో౽యం సంబంధో వై త్వయా సహ
తస్మాదేతన్మయా దేవి త్వచ్ఛుద్ధ్యర్థం విచారితం.
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చైవ పృథగ్విధాః
త్వాం దేవి పూజయిష్యంతి నిర్విశంకం పతివ్రతాం.
మన్యతే చైవ లోకస్తే స్త్రీభావాన్మయి సంగతం
పుత్రశ్చాయం వృతో రాజ్యే మయాతస్మా ద్విచారితం.
యచ్చ కోపితయాత్యర్థం త్వయోక్తో౽స్మ్యప్రియం ప్రియే
ప్రణయిన్యావిశాలాక్షితత్ క్షాంతం తేమయాశుభే.
అనృతం వాప్యనిష్టంవా దురుక్తంవాపి దుష్కృత
త్వయాప్యేవం విశాలాక్షిక్షంతవ్యంమమ దుర్వచః
క్షాంత్యాం పతికృతే నార్యఃపాతివ్రత్యంవ్రజంతితాః.
తామేవముక్త్వా రాజర్షి ర్దుష్యంతో మహిషీం ప్రియాం
వాసోభిరన్న పానైశ్చ పూజయామాస భారత.
స మాతరముపస్థాయ రథాంతర్యామభాషత
మమ పుత్రో వనే జాత స్తవ శోకప్రణాశనః
ఋణాదద్య విముక్తో౽హమస్మి పౌత్రేణ తే శుభే
విశ్వామిత్రసుతా చేయం కణ్వేన చ వివర్ధితా.
స్నుషా తవ మహాభాగే ప్రశీదస్వ శకుంతలాం
పుత్రస్య వచనం శ్రుత్వా పౌత్రం సా పరిషస్వజే.
పాదయోః పతితాం తత్ర రథంతర్యా శకుంతలాం
పరిష్వజ్య చ బాహుభ్యాం హర్షాదశ్రూణ్యవర్తయత్
ఉవాచ వచనం సత్యం లక్షయాల్లక్షణాని చ
తవ పుత్రో విశాలాక్షి చక్రవర్తీ భవిష్యతి.
తవ భర్తా విశాలాక్షి త్రైలోక్యవిజయీ భవేత్
దివ్యాన్ భోగానను ప్రాప్తా భవ త్వం వరవర్ణిని.
ఏవముక్తా రథంతర్యా పరం హర్ష మవాప సా
శకుంతలాం తథా రాజా శాస్త్రోక్తేనైవ కర్మణా.
తతో౽గ్రమహిషీం కృత్వా సర్వాభరణభూషితాం
బ్రాహ్మణేభ్యో ధనం దత్వా సైనికానాం చ భూపతిః,
దుష్యంతస్తు తదా రాజా పుత్రం శాకుంతలం తదా
భరతం నామతః కృత్వా యావరాజ్యే౽భ్యషేచయత్.
భరతే భారమావేశ్య కృతకృత్యో౽భవన్నృపః
తతో వర్షశతం పూర్ణం రాజ్యం కృత్వానరాధిపః
కృత్వాదానాని దుష్యంతః స్వర్గలోకముపేయివాన్
తస్య తత్ప్రథితం చక్రం ప్రావర్తత మహాత్మనః
భాస్వరం దివ్యమజితం లోకసంనాదనం మహత్.
స విజిత్య మహీపాలాంశ్చకార వశవర్తినః
చచార చ సతాం ధర్మం ప్రాప చానుత్తమం యశః.
స రాజా చక్రవర్త్యాసీత్సార్వభౌమః ప్రతాపవాన్
ఈజే చ బహుభిర్యజ్ఞైర్యథా శక్రో మరుత్పతిః.
యాజయామాస తం కణ్వో విధివద్భూరి దక్షిణం
శ్రీమాన్ గోవితతం నామ వాజిమేధమవాపసః
యస్మిన్ సహస్రం పద్మానాం కణ్వాయ భరతో దదౌ.
భరతాద్భారతీ కీర్తి ర్యేనేదం భారతం కులం
అప రే యే చ పూర్వేవై భారతా ఇతి విశ్రుతాః
భరతస్యాన్వవాయే హి దేవకల్పా మహౌజసః.

బభూవుర్బ్రహ్మకల్పాశ్చ బహవో రాజసత్తమాః తేషాం తుతేయథాముఖ్యం కీర్తయిష్యామి భారత
ఏషామపరిమేయాని నామధేయాని సర్వశః మహాభాగాన్ దేవకల్పాన్సత్యార్జవ పరాయణాన్.

ఇది

# శకుంతలోపాఖ్యానము

మహాభారతేతిహాసాంతర్గతమయిన
ఆదిపర్వములోని ఆస్తీకాదిపర్వములతో
35 వ అధ్యాయమునుండి 74 వ అధ్యాయము
వరకూ ఆంధ్రివ్యాఖ్యానముతో ఇది

# ద్వితీయభాగము

•

ప్రథమ ముద్రణ 1958 మార్చి
ద్వితీయ ముద్రణ 1958 నవంబరు

# * ఆంధ్ర మహాభారతము *

## ఆదిపర్వము

### సంచిక - 3

శ్రీ పురాణపండ రామమూర్తి

ఎడిటర్ :
పి. యస్. ప్రకాశదీక్షితులు

# శ్రీ మహాభారత ప్రచారక సంఘము

## కాకినాడ

పాలకవర్గము:

శ్రీ తోపల్లి కృష్ణబ్రహ్మశాస్త్రి, బి. ఎ., బి. ఎల్.
శ్రీ పైండా వెంకటనారాయణ, యం. పి.
శ్రీ దంటు భాస్కరరావు
శ్రీ రోళ్ళ సీతారామస్వామినాయుడు
శ్రీ బచ్చు సన్యాసిరావు

కార్యాచరణ వర్గము:

అధ్యక్షులు:
శ్రీ తెలికిచర్ల రామమూర్తి

ఉపాధ్యక్షులు:
శ్రీ ఆకెళ్ళ నరసింహచయనులు

సంయుక్త కార్యదర్శులు:
శ్రీ పలుకూరి రామమూర్తి
శ్రీ గొల్లపూడి చినవెంకటస్వామి

కోశాధికారి:
శ్రీ మాజేటి గోవిందరాజులు

## పాలకొల్లు

అధ్యక్షులు:
శ్రీ అద్దేపల్లి సత్యనారాయణమూర్తి, ఎం.ఎల్.ఎ.

ఉపాధ్యక్షులు:
శ్రీ బోళ్ళ వెంకటసుబ్బారావు

కార్యదర్శి:
శ్రీ కలగ శంభుప్రసాద్

సహాయ కార్యదర్శి:
శ్రీ పినిశెట్టి చినవెంకటేశ్వర్రావు

కోశాధికారి:
శ్రీ యిమ్మిడి సత్యనారాయణ

సభ్యులు:
శ్రీ చోడిశెట్టి సూర్యారావు
శ్రీ ఆచంట కేశవరావు
శ్రీ గాది వెంకట్రామయ్య
శ్రీ ఆబోతుల రామన్న

ఎడిటర్:
శ్రీ పి. యస్. ప్రకాశ దీక్షితులు

* * *

సంపాదక సహకారం:
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి (విశారద)

# వి ష య సూ చి



ము ద్ర ణ :
శ్రీ భారతీ ప్రింటింగు ప్రెస్, ఆలమూరు, తూ.గో.జిల్లా.

అమితాఖ్యానక శాఖలం బొలిచి
వేదార్థామలచ్ఛాయమై సుమహావర్గ
చతుష్క పుష్పవితతిఁ శోభిలి
కృష్ణార్జునోత్తమనానాగుణకీర్తనార్థఫలమై
ద్వైపాయనోద్యానజాత మహాభారత
పారిజాతమమరున్ ధాత్రీసురప్రార్థ్యమై.

# సంభవ పర్వము

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

# సంభవపర్వము

## కచదేవయాని

శ్రీసంపన్నములై పరమపవిత్రములై మంగళకర ఖ్యాతి గాంచిన దక్షప్రజాపతివంశచరిత్రా, వైవస్వతమనువుగాథా భరత కురు పూరు అజామీఢ యాదవ కౌరవాది భరతవంశీయుల యశోగాథలూ వినిపించే సత్సంకల్పంతో వైశంపాయనుడు జనమేజయుని అవలోకించి ఆరంభిస్తున్నాడు.

ప్రచేతసు కలిగిన పదిమందిబిడ్డలూ తమ తేజస్సుతో ప్రకాశిస్తూ సత్పురుషులుగా ప్రఖ్యాతి పొందారు. వారు తమ ముఖాలనుండి అగ్నిని పుట్టించి ప్రాణికోటిని పీడించే చెట్లను భస్మంచేశారు. వీరివల్ల దక్షుడు పుట్టాడు. దక్షునివల్ల మానవులు ప్రభవించారు. దక్షుడు వారుణీ సంయోగంతో గుణశీలసంపన్నులైన కుమారులను వెయ్యిమందిని కన్నాడు. వారందరికీ నారదుడు సాంఖ్యజ్ఞానం ఉపదేశించాడు. వారు విరక్తులై తపస్సుకి పోగా దక్షుడు తనపుత్రికనే పుత్రునిగా భావించి ఆమెకు ఏఁబదిమంది కుమార్తెలను ప్రసాదించాడు. వారిలో పదిమందిని యమధర్మరాజుకు పదముగ్గురిని కశ్యపునికీ నక్షత్రరూపులైన ఇరవైఏడుగురినీ చంద్రునికీ ఇచ్చి వివాహాలు చేశాడు. కశ్యపుని భార్యలలో పెద్దదైన అదితి మహాపరాక్రమవంతులైన ద్వాదశాదిత్యులనూ వివస్వంతునీ కన్నది. ఈ వివస్వంతునితనయులే వైవస్వతుడైన యముడూ, మనువూ. మనువు ధర్మశీలుడు. సూర్యవంశానికి ప్రతిష్ఠతెచ్చిన మనువు బ్రహ్మక్షత్రియాది మానవులకు పితృస్థానం వహించాడు. బ్రహ్మవంశీయులైన వారందరూ షడంగయుతమైన వేదాధ్యయనం చేశారు. వేనుడూ ధృష్ణుడూ నరిష్యంతుడూ నాభాగుడూ ఇక్ష్వాకుడూ కారూషుడూ శర్యాతీ ఇలుడూ వృషధ్రుడూ నాభాగారిష్టుడూ వీరు మనుపుత్రులు. వారిలో వారికి కలహాలు వచ్చి వారు నశించిపోయారు. ఇలాగర్భం నుండి పురూరవుడు జన్మించాడు. పురూరవునకు జననీ జనకుడు ఇలయే. ఈ మహాసాగరంలోని పదమూడు ద్వీపాలనూ పాలించి అనుభవించిన వాడు పురూరవుడు. (ఈ పురూరవుడు చంద్రనందనుడైన బుధుని కుమారుడు. ఒకప్పుడు ఇల తన రూపం పురుషుడుగా మార్చుకొని సుద్యుమ్న నామంతో వ్యవహరించింది. పురూరవునికి రాజ్యం ఇచ్చినప్పుడు సుద్యుమ్నుడుగా ఉన్నందువల్ల తండ్రి కూడా ఇలాదేవేనంటారు.

## క చ దే వ యా ని

ప్రజాపతేస్తు దక్షస్య మనోర్వైవస్వతస్య చ
భరతస్య కురోః పూరోరాజమీఢస్య చానఘ.
యాదవానామిమం వంశం కౌరవాణాం చ సర్వశః
తథైవ భరతానాం చ పుణ్యం స్వస్త్యయనం మహత్.
ధన్యం యశస్యమాయుష్యం కీర్తయిష్యామి తేఽనఘ
తేజోభిరుదితాః సర్వే మహర్షిసమతేజసః.
దశ ప్రాచేతసః పుత్రాః సంతః పుణ్యజనాః స్మృతాః.
ముఖజేనాగ్నినా యైస్తే పూర్వం దగ్ధా మహీరుహాః.
తేభ్యః ప్రాచేతసో జజ్ఞే దక్షో దక్షాదిమాః ప్రజాః
సంభూతాః పురుషవ్యాఘ్ర స హి లోకపితామహః.
వీరిణ్యా సహ సంగమ్య దక్షః ప్రాచేతసో మునిః
ఆత్మతుల్యానజనయత్ సహస్రం సంశితవ్రతాన్.
సహస్రసంఖ్యాన్ సంభూతాన్ దక్షపుత్రాంశ్చ నారదః
మోక్షమధ్యాపయామాస సాంఖ్యజ్ఞానమనుత్తమం.
తతః పంచాశతం కన్యాః పుత్రికా అభిసందధే
ప్రజాపతిః ప్రజా దక్షః సిసృక్షుర్జనమేజయ.
దదౌ దశ స ధర్మాయ కశ్యపాయ త్రయోదశ
కాలస్య నయనే యుక్తాః సప్తవింశతిమిందవే.
త్రయోదశానాం పత్నీనాం యా తు దాక్షాయణీ వరా
మారీచః కశ్యపస్తస్యామాదిత్యాన్ సమజీజనత్.
ఇంద్రాదీన్ వీర్యసంపన్నాన్ వివస్వంతమథాపి చ
వివస్వతః సుతో జజ్ఞే యమో వైవస్వతః ప్రభుః.
మార్తండస్య మనుర్ధీమానజాయత సుతః ప్రభుః
యమశ్చాపి సుతో జజ్ఞే ఖ్యాతస్తస్యానుజః ప్రభుః.
ధర్మాత్మా స మనుర్ధీమాన్ యత్ర వంశః ప్రతిష్ఠితః
మనోర్వంశో మానవానాం తతోఽయం ప్రథితోఽభవత్.
బ్రహ్మక్షత్రాదయస్తస్మాన్మనోర్జాతాస్తు మానవాః
తతోఽభవన్మహారాజ బ్రహ్మక్షత్రేణ సంగతం.
బ్రాహ్మణా మానవాస్తేషాం సాంగం వేదమధారయన్
వేనం ధృష్ణుం నరిష్యంతం నాభాగేక్ష్వాకుమేవ చ.
కారూషమథ శర్యాతింసితథా చైవాష్టమీమిలాం
పృషధ్రం నవమం ప్రాహుః క్షత్రధర్మపరాయణం.
నాభాగారిష్టదశమాన్ మనోః పుత్రాన్ ప్రచక్షతే
పంచాశత్తు మనోః పుత్రాస్తథైవాన్యేఽభవన్ క్షితౌ.
అన్యోన్యభేదాత్తే సర్వే వినేశురితి నః శ్రుతం
పురూరవాస్తతో విద్వానిలాయాం సమపద్యత.
సా వై తస్యాభవన్మాతా పితా చైవేతి నః శ్రుతం
త్రయోదశ సముద్రస్య ద్వీపానశ్నన్ పురూరవాః.
అమానుషైర్వృతః సత్త్వైర్మానుషస్సన్ మహాయశాః
విప్రైః స విగ్రహం చక్రే వీర్యోన్మత్తః పురూరవాః.
జహార చ విప్రాణాం రత్నాన్యుత్క్రోశతామపి
సనత్కుమారస్తం రాజన్ బ్రహ్మలోకాదుపేత్య హ.
అనుదర్శం తతశ్చక్రే ప్రత్యగృహ్ణాన్న చాప్యసౌ
తతో మహర్షిభిః క్రుద్ధైః సద్యః శప్తో వ్యనశ్యత.
లోభాన్వితో బలమదాన్నష్టసంజ్ఞో నరాధిపః
స హి గంధర్వలోకస్థానుర్వశ్యా సహితో విరాట్.
ఆనినాయ క్రియార్థేఽగ్నీన్ యథావద్విహితాంస్త్రిధా
షట్సుతా జజ్ఞిరే చైలాదాయుర్ధీమానమావసుః.
దృఢాయుశ్చ వనాయుశ్చ శతాయుశ్చోర్వశీసుతాః
నహుషం వృద్ధశర్మాణం రజిం గయమనేనసం.

పురూరవుడు సర్వప్రాణులతో చరిస్తూ బలోన్మత్తుడై బ్రాహ్మణ ధనాపహరణం చేస్తూండగా సనత్కుమారుడు బ్రహ్మలోకంనుండి వచ్చి హితబోధచేసినా వినకపోయినందువల్ల కుపితులైన మహర్షులు వానిని శపించి నశింపజేశారు. లోభహృదయంతో వివేకం కోల్పోయిన పురూరవుడే గంధర్వలోకంనుండి త్రివిధాగ్నులనూ ఊర్వశినీ భూలోకానికి తెచ్చాడు. ఆయువూ ధీమంతుడూ అమావసువూ దృఢాయువూ వనాయువూ శతాయువూ వాని పుత్రులు. వీరందరూ ఊర్వశికి కలిగారు. ఆయువు స్వర్భానువునుండి నహుష వృద్ధశర్మ రజి గయ అనేకుమారులను కన్నాడు. వీరిలో నహుషుడు ధీమంతుడూ సత్యపరాక్రముడూ అయాడు. దేవ గంధర్వ మానవ మహర్షు లందరనూ ధర్మంగా పాలించిన మహాపురుషుడు. అయితే ఈ నహుషుడు దారిదోపిడిగాండ్రనువధించి ఋషులనుండి పన్నులు గ్రహిస్తూ వారిని కూడా బాధించసాగాడు. ఇంద్ర పదవి ప్రాప్తించినపుడు మహర్షులనే వాహనాలుగా చేసికొన్నాడు నహుషుడు.

యతి యయాతి సంయాతి ఆయాతి అయతి ధృవుడు వాని కుమారులు. వీరిలో పెద్దవాడు యోగసాధనతో మునివృత్తి నవలంబించాడు. అందుచేత పరాక్రమాది గుణాన్వితుడు యయాతి రాజ్యచక్రం చేపట్టాడు. నిర్వక్రపరాక్రమోపేతుడైన యయాతి ఎన్నో యజ్ఞాలు చేశాడు. ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొని దేవతలనూ పితృదేవులనూ ఆరాధిస్తూ దేవయాని శర్మిష్ఠలనే భార్యల వల్ల సంతానవంతుడయాడు.

దేవయాని బిడ్డలు యదువు తుర్వసుడు. ద్రుహ్యుడు అనువు పూరువు శర్మిష్ఠ కొడుకులు. యయాతి ప్రజానురంజకుడై చిరకాలం పాలించాడు. అప్పటికాయనకు యౌవన సౌందర్యాలను నశింపజేసే వార్ధక్యం ప్రవేశించింది. ఆ సమయంలో తన కుమారులందరినీ పిలచి తనకింకా భోగవాంఛ తీరలేదు కనక వారిలో ఏ ఒకరయినా తనకు యౌవనప్రదానం చేయవలసిందిగా కోరాడు.

అది విని యదువు యౌవనంపొంది యయాతి చేయదలచుకున్న దేమిటో వివరింపుమనగా నేను ఇంతకాలం ధర్మదృష్టితో యజ్ఞకార్యాలకే నా జీవితం వినియోగించాను. తృతీయ పురుషార్థమైన కామం నన్ను వీడలేదు. కనక నీ యౌవనం ఇస్తే నేను దానితో విషయభోగాలు పొందుతాను—అని యయాతి బదులుపల్కగా వాని నలుగురుపుత్రులూ ఆయనకోరికను తిరస్కరించారు. కడసారపువాడు పూరువు తన యౌవనం తండ్రికిస్తూ—నా తల్లితో మీరు కామభోగా లనుభవించండి—అన్నాడు

ఉత్తరక్షణంలో యయాతి యౌవనసౌందర్యాలతో వెలుగొందాడు. అదేక్షణంలో పూరువు తండ్రియొక్క వార్ధక్యం మాత్రమేకాక ఆయన తపశ్శక్తిని కూడా పొంది రాజ్యపాలనం ఆరంభించాడు.

యయాతి వేయి సంవత్సరాలు యౌవనంతో భోగా లనుభవించే తన భార్యలతో తృప్తిపడలేక చైత్రరథం అనే పేరుగల వనంలో విహరిస్తూ అక్కడ విశ్వాచి అనే అప్సరసను కూడా అనుభవించి ఎప్పటికీ సంతృప్తి పొందక ఆలోచించి ఆలోచించి— విషయభోగాలకు హద్దు లేదు. వానివల్ల హృదయానికి శాంతిలేదు. అగ్నికి ఆజ్యం శాంతినివ్వకపోగా ప్రజ్వలింపజేసేటట్లే ఈ భోగాలు

స్వర్భానవీసుతానేతానాయోః పుత్రాన్ ప్రచక్షతే
ఆయుషో నహుషః పుత్రో ధీమాన్ సత్యపరాక్రమః.
రాజ్యం శశాస సుమహద్ధర్మేణ పృథివీపతే
పితౄన్ దేవాన్ ఋషీన్ విప్రాన్
గంధర్వోరగరక్షసాన్.

నహుషః పాలయామాస బ్రహ్మక్షత్రమథో విశః
స హత్వా దస్యుసంఘాతానృషీన్ కరమదాపయత్
పశువచ్చైవ తాన్ పృష్ఠే వాహయామాస వీర్యవాన్
కారయామాస చేంద్రత్వమభిభూయ దివౌకసః.
తేజసా తపసా చైవ విక్రమేణౌజసా తథా
యతిం యయాతిం సంయాతిమాయాతిమయతిం
ధ్రువం.

నహుషో జనయామాస షట్సుతాన్ ప్రియవాదినః
యతిస్తు యోగమాస్థాయ బ్రహ్మభూతోఽభవన్మునిః.
యయాతిర్నాహుషః సమ్రాడాసీత్సత్యపరాక్రమః
స పాలయామాస మహీమీజే చ బహుభిర్మఖైః.
అతిభక్త్యా పితౄనర్చన్ దేవాంశ్చ ప్రయతః సదా
అన్వగృహ్ణాత్ప్రజాస్సర్వా యయాతిరపరాజితః.
తస్య పుత్రా మహేష్వాసాస్సర్వైస్సముదితా గుణైః
దేవయాన్యాం మహారాజ శర్మిష్ఠాయాం చ జజ్ఞిరే.
దేవయాన్యామజాయేతాం యదుస్తుర్వసురేవ చ
ద్రుహ్యుశ్చానుశ్చ పూరుశ్చ శర్మిష్ఠాయాంచజజ్ఞిరే.
స శాశ్వతీః సమా రాజన్ ప్రజా ధర్మేణ పాలయన్
జరామార్ఛన్మహాఘోరాంనాహుషోరూపనాశినీం
జరాభిభూతః పుత్రాన్ స రాజా వచనబ్రవీత్
యదుం పూరుం తుర్వసుం చ ద్రుహ్యుం చానుం
చ భారత.

యౌవనేన చరన్ కామాన్ యువా యువతిభిస్సహ
విహర్తుమహమిచ్ఛామి సాహ్యం కురుత పుత్రకాః.
తం పుత్రో దైవయానేయః పూర్వజో
వాక్యమబ్రవీత్

కిం కార్యం భవతః కార్యమస్మాకం యౌవనేన తే.
యయాతిరబ్రవీత్తం వై జరా మే ప్రతిగృహ్యతాం
యౌవనేన త్వదీయేన చరేయం విషయానహం.
యజతో దీర్ఘసత్త్రైర్మే శాపాచ్చోశనసో మునేః
కామార్థః పరిహీణోఽయం తప్యేయం తేన పుత్రకాః
మామకేన శరీరేణ రాజ్యమేకః ప్రశాస్తు వః
అహం తన్వాభినవయా యువా కామమవాప్నుయాం.
తే న తస్య ప్రత్యగృహ్ణన్ యదుప్రభృతయో
జరాం

తమబ్రవీత్తతః పూరుః కనీయాన్సత్యవిక్రమః.
రాజంశ్చరాభినవయా తన్వా యౌవనగోచరః
అహం జరాం సమాదాయ రాజ్యే స్థాస్యామి
తేఽజ్ఞయా.

ఏవముక్తః స రాజర్షిస్తపోవీర్యసమాశ్రయాత్
సంచారయామాస జరాం తదా పుత్రే మహాత్మని.
పౌరవేణాథ వయసా రాజా యౌవనమాస్థితః
యయాతేనాపి వయసా రాజ్యం పూరురకారయత్.
తతో వర్షసహస్రాణి యయాతిరపరాజితః
స్థితః స నృపశార్దూలః శార్దూలసమవిక్రమః.
యయాతిరపి పత్నిభ్యాం దీర్ఘకాలం విహృత్య చ
విశ్వాచ్యా సహితో రేమే పునశ్చైత్రరథే వనే.
నాధ్యగచ్ఛత్ తదా తృప్తిం కామానాం స
మహాయశాః

అవేక్ష్య మనసా రాజన్నిమాం గాథాం తదా జగౌ.
న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.
పృథివీ రత్నసంపూర్ణా హిరణ్యం పశవః స్త్రియః
నాలమేకస్య తత్ సర్వమితి మత్వా శమం వ్రజేత్.
యదా న కురుతే పాపం సర్వభూతేషు కర్హిచిత్
కర్మణా మనసా వాచా బ్రహ్మ సంపద్యతే తదా.

మానవుడికిప్రశాంతతనివ్వదు. సర్వభోగాలూసమకూరినా అసంతృప్తి అలానే ఉంటుంది. కనక ప్రశాంత చిత్తంతో భోగవాంఛలు అణచుకోవాలి. త్రికరణ శుద్ధిగా సర్వప్రాణిహితం కోరేవాడు బ్రహ్మను పొందుతాడు. బ్రహ్మజ్ఞానికి ఏ భయమూలేదు. ఏ రాగద్వేషాలూ లేనివాడు ధన్యుడు-అని తెల్పుకొని మనోనిగ్రహంతో పుత్రుని చేరి అతని యౌవనం అతని కిచ్చి తన వార్ధక్యం తాను పరిగ్రహించి వానిని పట్టాభిషిక్తునిగా జేసి "నాయనా! నీవంటి కుమారు డుండడంవల్లనే నేను పుత్రవంతుణ్ణని భావిస్తున్నాను. ఇకనుంచి ఈవంశం నీపేరుతో వర్ధిల్లుతుంది. పౌరవంశం లోక విఖ్యాతమవుతుంది" అన్నాడు. ఆ ప్రకారంగా పుత్రుని దీవించి భార్యలతో కలసి మహాభృగుతుంగపర్వతం మీద తపస్సు సాగించి స్వర్గలోకం చేరాడు.

75 వ అధ్యాయం సమాప్తం

## డెబ్బది ఆరవఅధ్యాయం

పూర్వకాలంలో తీవ్రంగా దేవాసురసంగ్రామం జరుగుతూన్న రోజుల్లో దేవతలు విజయేచ్ఛతో అంగిరసతనయుడైన బృహస్పతిని పురోహితునిగా స్వీకరించారు. దైత్యులు శుక్రాచార్యుణ్ణి వరించారు. ఆ సంగ్రామంలో దేవతల ఆయుధాలవల్ల చచ్చే రాక్షసు లందరినీ శుక్రుడు మృతసంజీవినీ విద్యతో తిరిగి జీవింపజేసేవాడు. ఈ రహస్యం బృహస్పతికి తెలియదు. అందువల్ల దేవతలందరూ బృహస్పతి కుమారులలో జ్యేష్ఠుడైన కచు ని జేరి ఇలా పల్కారు- మేము తమ సేవకులము. మాయందు అనుగ్రహముంచి మహాతేజస్సంపన్నుడైన శుక్రాచార్యునివద్దకుపోయి మృతసంజీవినీవిద్యాభ్యాసం చేసివచ్చి మమ్మల్ని రక్షించండి. శుక్రుడు వృషపర్వుని ఆస్థానంలో ఉండి సర్వదానవుల్నీ రక్షిస్తున్నాడు. నూత్న యౌవనంలో ఉన్న మీరొక్కరే వారిని ఆరాధించి ఆవిద్యను సాధించటానికి సమర్థులు. ఆయన అనుంగుపుత్రి దేవయానిని అలరించటానికికూడా మీరే అర్హులు. మీ ఉదార శీలస్వభావాలూ సదాచారసంపత్తి ఇన్నిటినీ మించి సర్వమధురవ్యవహారాలనీ నడిపించగలశక్తీ ఉన్నాయి. దేవయానిని సంతృప్తిపరచినమీద శుక్రునినుండి విద్యాభ్యాసం సుగమం కాగలదు- అన విని కచుడు హుటాహుటి వృషపర్వుని నగరానికి వెళ్ళి శుక్రాచార్యుని ఎదుట అంజలి బద్ధుడై నిలిచి-మహాత్మా! అంగిరస పౌత్రుడను, బృహస్పతి నందనుడను, కచుడనువాడను. తమ శిష్యత్వము కోరి వచ్చితిని. అంతేవాసినై మిము సేవింప ననుగ్రహింపుడు. వెయ్యి సంవత్సరాల బ్రహ్మచర్యదీక్షతో తమ సేవకు ఆజ్ఞ ఇయ్యండి-అన్నాడు.

బార్హస్పతీ! నీయందు నాకు అనుగ్రహం కలిగింది. నా ఆదరాభిమానాలకు నువ్వు పాత్రుడవు. నిన్ను సమ్మానించి సత్కరిస్తే అవన్నీ బృహస్పతికి జరిగినట్లే భావిస్తాను-అని శుక్రు డనగా కచుడు సంతోషించి బ్రహ్మచర్యదీక్షను స్వీకరించి శుక్రాచార్యులనూ దేవయానినీ సేవిస్తూ చరించ

యదా చాయం న బిభేతి యదా చాస్మాన్న బిభ్యతి
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సంపద్యతే తదా.
ఇత్యవేక్ష్య మహాప్రాజ్ఞః కామానాం ఫల్గుతాం నృప
సమాధాయ మనో బుద్ధ్యా ప్రత్యగృహ్ణాజ్జరాం సుతాత్.
దత్త్వా చ యౌవనం రాజా పూరుం రాజ్యేఽభిషిచ్య చ
అతృప్త ఏవ కామానాం పూరుం పుత్రమువాచ హ.
త్వయా దాయాదవానస్మి త్వం మే వంశకరః సుతః
పౌరవో వంశ ఇతి తే ఖ్యాతిం లోకే గమిష్యతి.
తతః స నృపశార్దూల పూరుం రాజ్యేఽభిచ్య చ
తతః సుచరితం కృత్వా భృగుతుంగే మహాతపాః.
కాలేన మహతా పశ్చాత్ కాలధర్మముపేయివాన్
కారయిత్వా త్వనశనం సదారః స్వర్గమాప్తవాన్.

75 వ అధ్యాయం సమాప్తం.

## డెబ్బది ఆరవ అధ్యాయము

యయాతిః పూర్వజోఽస్మాకం దశమో యః ప్రజాపతేః
కథం స శుక్రతనయాం లేభే పరమదుర్లభాం.
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం విస్తరేణ తపోధన
ఆనుపూర్వ్యా చ మే శంస రాజ్ఞో వంశకరాన్ పృథక్.
యయాతిరాసీన్నృపతిర్దేవరాజసమద్యుతిః
తం శుక్రవృషపర్వాణౌ వవ్రాతే వై యథా పురా.
తత్ తేఽహం సంప్రవక్ష్యామి పృచ్ఛతే జనమేజయ
దేవయాన్యాశ్చ సంయోగం యయాతేర్నాహుషస్య చ.
సురాణామసురాణాం చ సమజాయత వై మిథః
ఐశ్వర్యం ప్రతి సంఘర్షస్త్రైలోక్యే సచరాచరే.
జిగీషయా తతో దేవా వవ్రిరేఽంగిరసం మునిం
పౌరోహిత్యేన యాజ్యార్థే కావ్యం తూశనసం పరే.
బ్రాహ్మణౌ తావుభౌ నిత్యమన్యోన్యస్పర్ధినౌ భృశం
తత్ర దేవా నిజఘ్నుర్యాన్ దానవాన్ యుధి సంగతాన్.
తాన్ పునర్జీవయామాస కావ్యో విద్యాబలాశ్రయాత్
తతస్తే పునరుత్థాయ యోధయాంచక్రిరే సురాన్.
అసురాస్తు నిజఘ్నుర్యాన్ సురాన్ సమరమూర్ధని
న తాన్ సంజీవయామాస బృహస్పతిరుదారధీః
న హి వేద స తాం విద్యాం యాం కావ్యో వేత్తి వీర్యవాన్
సంజీవినీం తతో దేవా విషాదమగమన్ పరమ్.
తే తు దేవా భయోద్విగ్నాః కావ్యాదుశనసస్తదా
ఊచుః కచముపాగమ్య జ్యేష్ఠం పుత్రం బృహస్పతేః
భజమానాన్ భజస్వాస్మాన్ కురు నః సాహాయ్యముత్తమం
యా సా విద్యా నివసతి బ్రాహ్మణేఽమితతేజసి.
శుక్రే తామాహర క్షిప్రం భాగభాఙ్నో భవిష్యసి
వృషపర్వసమీపే హి శక్యో ద్రష్టుం త్వయా ద్విజః.
రక్షతే దానవాంస్తత్ర న స రక్షత్యదానవాన్
తమారాధయితుం శక్తో భవాన్ పూర్వవయాః కలిమ్.
దేవయానీం చ దయితాం సుతాం తస్య మహాత్మనః
త్వమారాధయితుం శక్తో నాన్యః కశ్చన విద్యతే.
శీలదాక్షిణ్యమాధుర్యైరాచారేణ దమేన చ.

సాగాడు. నవయౌవనంలో ఉన్న కచుడు యౌవన వసంతంలో ఉన్న దేవయానికి సంతోషం కలిగేటట్లు పాటలుపాడుతూ వివిధవిధవాద్యాలతో నృత్యం చేస్తూ ఆమెకు ఆనందం కలిగించేవాడు. యౌవన రంగస్థలంమీద అడుగుపెట్టిన దేవయాని ఆజ్ఞలు పాలిస్తూ ఫలపుష్పాదులు తీసికొనివచ్చి సమర్పిస్తూ బ్రహ్మచర్యదీక్ష వదలక ఆమెను ప్రసన్నురాలిని చేసికొనేవాడు. నవయౌవనశోభనాంగి దేవయాని బ్రహ్మచర్యదీక్షలో ఏకాంతంగా ఉన్న కచుణ్ణి చేరి మధురమధురంగా పాటలు పాడుతూ సేవించేది.

కాలమహాప్రవాహం ఐదువందలసంవత్సరాలను కబళించింది. ఆనాటికి కచుని సమాచారం తెలిసిన దానవులు గోవులను కాస్తూన్న కచుని శరీరం ముక్కలు ముక్కలు చేసి కుక్కలకూ నక్కలకూ విందుచేశారు. బృహస్పతిపైగల విద్వేషమే కాక మృతసంజీవిని కచుని స్వాధీనం అవుతుందనే భీతి వల్లనే దానవులలా చేశారు.

యథాప్రకారం ఆవులన్నీ ఆశ్రమానికివచ్చాయి. వచ్చి గోవులవెంట కచుడు లేకపోవటం చూసి దేవయాని తండ్రిని చేరి-నాన్నా! మీ అగ్నికార్యం పూర్తి అయింది. వాడిమయూఖముల్ కలుగు వాడప రాంబుధిగ్రుంకె. ధేనువులు కచుడు లేకుండానే వచ్చాయి. కచుడు మరణించాడో లేక ఎవరైనా హతమార్చారో తెలియదు. ఇప్పుడు నీతో నిజం చెపుతున్నాను. కచుడు లేని క్షణం జీవించలేను-అని దీనవదనయై నిలిచిన దేవయానిని చూసి-అమ్మా! నువ్వు విచారించకు. ఈ క్షణంలోనే నేను బార్హస్పతిని నీముందు నిలబెడతాను - అంటూనే మృతసంజీవిని ఉపాసించి కచుని పిలిచాడు. ఆచార్య శుక్రుని అధరద్వయంనుండి వెలువడిన అక్షరసంపుటితో శునకోదరాలలోనుండే కచుని దేహం వానిగర్భాలను చీల్చుకొని ఏకాకృతిపొంది దేవయానిముందు నిలిచింది. నిలిచిన కచుని చూస్తూ- ఈరోజున రావటంలో ఇంత ఆలస్యమయిందే-అని దేవయాని ప్రశ్నించగా - రమణీ! నేను సమిధలూ దర్భలూ తెస్తూ మార్గాయాసం వల్ల ఒకమర్రిచెట్టు నీడలో గోవులతో విశ్రాంతి తీసుకొంటూండగా కొందరు అసురులు వచ్చి నన్ను గురించిన వివరాలు అడిగారు. నేను బృహస్పతుల వారి కుమారుడననీ నన్ను కచుడని పిలుస్తారనీ చెప్పాను. అది వింటూనే నన్ను ముక్కలు చేసి గృహాలకు వెళ్ళిపోయారు. అనంతరం మహాత్ములు భార్గవులు తమ విద్యాబలంతో నన్ను పిలవగా నీ సమీపానికి వచ్చాను-అన్నాడు కచుడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు దేవయాని కోరికమీద కచుడు పువ్వులకోసం అరణ్యంలోకి వెళ్ళాడు. అవకాశం కోసం ఎదురు చూస్తూన్న దానవులు కచుణ్ణి పిండిచేసి సముద్రంలో కలిపేశారు. సకాలానికి కచుడు తిరిగి రాకపోవటంతో దేవయాని తండ్రితో చెప్పగా శుక్రుడు కచుణ్ణి మళ్ళీ బ్రతికించాడు. కచుడు తిరిగివచ్చిఅసురకృత్యంవివరించాడు.

మరికొన్నిరోజులు గడిచాయి. ఆనాడు రాక్షసులందరూ గుమిగూడి కచుణ్ణి చంపి భస్మం చేసి ఆ బూడిద మద్యంలో కలిపి శుక్రునిచేత త్రాగించారు. ఆచార్య శుక్రుడు ఇంటికి తిరిగివచ్చాడు. వచ్చిన శుక్రునిచేరి— నాన్నా ! కచుడు నేను పంపగా పూలకోసం అడవికి వెళ్ళాడు. ఇప్పటి కింకా తిరిగి రాలేదు. నాహృదయం శంకిస్తోంది. ఆయనలేకుండా నేను జీవించలేనని నీకు తెలుసు— అని దేవయాని ప్రార్థించగావిని— అమ్మా ! బార్హస్పతిమరణించాడు

దేవయాన్యాం హి తుష్టాయాం విద్యాం తాం
ప్రాప్స్యసి ధ్రువం.
తథేత్యుక్త్వా తతః ప్రాయాద్బృహస్పతి సుతః కచః
తదాభిపూజితో దేవైః సమీపే వృషపర్వణః.
స గత్వా త్వరితో రాజన్ దేవైః సంప్రేషితః కచః
అసురేంద్రపురే శుక్రం దృష్ట్వా వాక్యమువాచ హ.
ఋషేరంగిరసః పౌత్రం పుత్రం సాక్షాద్ బృహస్పతేః
నామ్నా కచమితి ఖ్యాతం శిష్యం గృహ్ణాతు
మాం భవాన్.
బ్రహ్మచర్యం చరిష్యామిత్వయ్యహం పరమం గురో
అనుమన్యస్వ మాం బ్రహ్మన్ సహస్రం పరివత్సరాన్.
కగ సుస్వాగతం తేఽస్తు ప్రతిగృహ్ణామి తే వచః
అర్చయిష్యేఽహమర్చ్యం త్వామర్చితోఽస్తు
బృహస్పతిః.
కచస్తు తం తథేత్యుక్త్వా ప్రతిజగ్రాహ తద్ వ్రతం
ఆదిష్టం కవిపుత్రేణ శుక్రేణోశనసా స్వయమ్.
వ్రతస్య ప్రాప్తకాలం స యథోక్తం ప్రత్యగృహ్ణాత
ఆరాధయన్నుపాధ్యాయం దేవయానీం చ భారత.
నిత్యమారాధయిష్యంస్తాం యువా యౌవనగోచరే
గాయన్ నృత్యన్ వాదయంశ్చ
దేవయానీమతోషయత్.
సశీలయన్ దేవయానీం కన్యాం సంప్రాప్తయౌవనాం
పుష్పైః ఫలైః ప్రేషణైశ్చ తోషయామాస
భారత.
దేవయాన్యపి తం విప్రం నియమవ్రతధారిణం
గాయంతీ చ లలంతీ చ రహః పర్యచరత్తదా.
పంచవర్షశతాన్యేవం కచస్య చరతో వ్రతమ్
తత్రాతీయురథోబుద్ధ్వా దానవాస్తం తతః కచం.
గా రక్షంతం వనే దృష్ట్వా రహస్యేకమమర్షితాః
జఘ్నుర్బృహస్పతేర్ద్వేషాద్ విద్యారక్షార్థమేవ చ.

హత్వా సాలావృకేభ్యశ్చ ప్రాయచ్ఛల్లవశః కృతం
తతో గావో నివృత్తాస్తా అగోపాః స్వం నివేశనం.
సా దృష్ట్వా రహితా గాశ్చ కచేనాభ్యాగతా
వనాత్
ఉవాచ వచనం కాలే దేవయాన్యథ భారత.
ఆహుతం చాగ్నిహోత్రం తే సూర్యశ్చాస్తం
గతః ప్రభో
అగోపాశ్చాగతా గావః కచస్తాత న దృశ్యతే.
వ్యక్తం హతో మృతో వాపి కచస్తాత భవిష్యతి
తం వినా న చ జీవేయమితి సత్యం బ్రవీమి తే.
ఆయమేహీతి సంశబ్ద్య మృతం సంజీవయామ్యహం
తతః సంజీవనీం విద్యాం ప్రయుజ్య
కచమాహ్వయత్.
భిత్త్వా భిత్త్వా శరీరాణి వృకాణాం స వినిర్గతః
ఆహూతః ప్రాదురభవత్ కచో హృష్టోఽథ
విద్యయా.
కస్మాచ్చిరాయితోఽసీతి పృష్టస్తామాహ భార్గవీం
సమిధశ్చ కుశాదీని కాష్ఠభారం చ భావిని.
గృహీత్వా శ్రమభారార్తం వటవృక్షం సమాశ్రితః
గావశ్చ సహితాస్సర్వా వృక్షచ్ఛాయాముపాశ్రితాః.
అసురాస్తత్ర మాం దృష్ట్వా
కస్త్వమిత్యభ్యచోదయన్
బృహస్పతిసుతశ్చాహం కచ ఇత్యభివిశ్రుతః.
ఇత్యుక్తమాత్రే మాం హత్వా పిష్టం కృత్వా తు
దానవాః.
దత్త్వా సాలావృకేభ్యస్తు సుఖం జగ్ముః స్వమాలయం
ఆహూతో విద్యయా భద్రే భార్గవేణ మహాత్మనా
త్వత్సమీపమిహాయాతః కథంచిత్ సమజీవితః.
హతోఽహమితి చాచఖ్యౌ పృష్టో బ్రాహ్మణకన్యయా
స పునర్దేవయాన్యోక్తః పుష్పాహారో యదృచ్ఛయా.

చాడు. ఇదివరలో రెండుసార్లు బ్రతికించాను. ఇలా ఎన్నిసార్లని బ్రతికించను.

ఎవరో మరణిస్తే నీవంటి శక్తిమతి ఏడ్వడం మంచిపని కాదు. నీ గొప్ప నీకు తెలియటం లేదు. దేవబ్రాహ్మణులతో ఈ జగత్తులోని ప్రాణికోటి అంతా నీకు త్రిలోకాల్లోను తలలువంచి నమస్కరి స్తోంది. అదీకాక ఇప్పుడింక వాణ్ణి బ్రతికించటం కష్టం. బ్రతికించినా రాక్షసులు మళ్ళీ చంపి తీర తారు— అని శుక్రుడన్నాడు.

నాన్నా! అంగిరసుని మనుమడు బృహస్పతి కొడుకు మహాబ్రహ్మచర్య దీక్షితుడు అయిన కచుని కోసం విచారించకుండా ఉండలేను. సర్వ కార్య కుశలుడైన కచుడు నా మనోభీష్టానికి అను కూలంగా నడిచేవాడు. అటువంటి కచుడు లేకుండా నేనొకక్షణం జీవించలేను. ఆయన వెళ్ళినదారినే నేనూ వెళ్ళిపోతాను— అని దేవయాని విలపిస్తూంటే శుక్రుని హృదయం ద్రవించి—ఈ రాక్షసులు నన్ను ద్వేషిస్తున్నారనడంలో ఏమీ సందేహం లేదు. వీరు నా బ్రాహ్మణ్యంనుండి నన్ను పతనం చేయు స్తున్నారు. నాకు ఇష్టంలేని పనులే వీరు చేస్తు న్నారు. లేకపోతే నా శిష్యుని చంపవలసిన అవ సరం వీళ్ళకి ఏం కలిగింది. ఈ పాపానికి ప్రాయ శ్చిత్తం తప్పదు. బ్రహ్మహత్యా దోషం దేవేం ద్రుడినైనా వదలదు— అని మృతసంజీవిని ఉపా సించి కచుని ఆహ్వానించాడు.

ఆచార్యశుక్రుని ఉదరకోశంలో ఉన్న కచుడు భయకంపిత స్వరంతో మహాత్మా! నాయందు దయ ఉంచండి. తండ్రికి కొడుకుమీద ఉండే అభి మానంతో నన్ను అనుగ్రహించండి. నన్ను మీ స్నేహితునిగా భావించండి— అనగా శుక్రుడు— ఓ బాలకా! నువ్వు నా గర్భంలోకి ఎలా ప్రవేశించావు- అని ప్రశ్నించాడు.

గురుపూజ్యా! తమ అనుగ్రహవిశేషంవల్ల స్మృతి శక్తి నన్ను వీడలేదు. జరిగిన విషయాలన్నీ నాకు జ్ఞప్తిలో ఉన్నాయి. ఇప్పుడు నేను మీఉదరం ఛేదించి బయటపడగలను. అందువల్ల నా తపశ్శక్తి పోతుంది. అందుకంగీకరించలేక ఇక్కడ మహా క్లేశం అనుభవిస్తున్నాను. ఆచార్య! అసురులు నన్ను హత్యచేసి అగ్నిలో దగ్ధంచేసి ఆ భస్మం కల్లులో కలిపి మీచేత త్రాగించారు. బ్రాహ్మీ ఆసురీ దైవీ మాయలెరిగిన మిమ్మల్ని తిరస్కరించ గలవాడు లేడు— అని కచుడు పలికాడు.

అమ్మా! ఇప్పుడు నా ఉదరం చీలిస్తేగాని కచుడు బయటపడడు. నీ ఇష్టం ఏమిటో చెప్పు— అని శుక్రుడు దేవయానిని ప్రశ్నించగా— కచుడూ మీరూ ఇద్దరూ నాకు సమానులే. కచుడు లేకపోతే నాకు మనశ్శాంతి లేదు. మీరు లేకపోతే నాకు బ్రతుకు లేదు— అన్నదామె.

బార్హస్పతీ! నువ్వు దేవయానికి భక్తుడవు. ఆమె నిన్ను కోరుతోంది. నువ్వు కచునిరూపంలో ఉన్న దేవేంద్రుడవు కాకపోతే మృతసంజీవినీ విద్య నా నుండి గ్రహించు. ఒక్కనియమం మాత్రం మరిచి పోకు. శుక్రాచార్యుని ఉదరగోళంనుండి బ్రాహ్మ ణుడు వినా మరెవ్వడూ బ్రతికి బయటపడలేడు. ఈవిద్య గ్రహించి నా ఉదరం నుండి బయటకురా. పుత్రతుల్యుడవై నన్ను బ్రతికించు. ఈ విద్యను సముపార్జించి నీవు ధర్మదృష్టితోనే ఉండు. నీకు సిద్ధి ఇస్తున్నాను - అన్నాడు శుక్రాచార్యుడు.

వనం యయా కచోవిప్రో దదృశుర్దానవాశ్చ తే
పునస్తం పేషయిత్వాతుసముద్రాంభస్య మిశ్రయన్.
చిరం గతం పునః కన్యా పిత్రే తం సన్యవేదయత్
విప్రేణ పునరాహూతో విద్యయా గురుదేహజః
పునరావృత్య తద్ వృత్తంన్యవేదయతతద్ యథా.
తతస్తృతీయం హత్వా తం దగ్ధ్వా కృత్వా చ
చూర్ణశః.
ప్రాయచ్ఛన్ బ్రాహ్మణాయైవ సురాయా
మసురాస్తథా.
దేవయాన్యథ భూయోఽపి పితరంవాక్య మబ్రవీత్
పుష్పాహారః ప్రేషణకృత్ కచస్తాత న దృశ్యతే.
వ్యక్తం హతో మృతో వాపి కచస్తాత భవిష్యతి
తం వినా న చ జీవేయం కచం సత్యం బ్రవీమి తే.
బృహస్పతేః సుతః పుత్రి కచః ప్రేతగతిం గతః
విద్యయా జీవితోఽ ప్యేవం హన్యతే కరవామ కిమ్.
మైవం శుచో మా రుద దేవయాని
న త్వాదృశీ మర్త్యమనుప్రశోచతే
యస్యాస్తవ బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ
సేన్ద్రా దేవా వసవోఽథాశ్వినా చ.
సురద్విషశ్చైవ జగచ్చ సర్వ
ముపస్థానే సన్నమంతి ప్రభావాత్
అశక్యోఽసౌ జీవయితుం ద్విజాతిః
సంజీవితో బధ్యతే చైవ భూయః.
యస్యాంగిరా వృద్ధతమః పితామహో
బృహస్పతిశ్చాపి పితా తపోనిధిః
ఋషేః పుత్రం తమథో వాపి పౌత్రం
కథం న శోచేయమహం న రుద్యాం.
స బ్రహ్మచారీ చ తపోధనశ్చ
సదోత్థితః కర్మసు చైవ దక్షః

కచస్య మార్గం ప్రతిపత్స్యే న భోక్ష్యే
ప్రియో హి మే తాత కచోఽభిరూపః.
స పీడితో దేవయాన్యా మహర్షిః
సమాహ్వయత్ సంభ్రమాచ్చైవ కావ్యః
అసంశయం మామసురా ద్విషంతి
యే మే శిష్యానాగతాన్ సూదయంతి.
అబ్రాహ్మణం కర్తుమిచ్ఛంతి రౌద్రా
స్తే మాం యథా వ్యభిచరంతి నిత్యం
అప్యస్య పాపస్య భవేదిహాంతః
కం బ్రహ్మహత్యా న దహేదపీంద్రం.
గురోర్హి భీతో విద్యయా చోపహూతః
శనైర్వాక్యం జఠరే వ్యాజహార
ప్రసీద భగవన్ మహ్యం కచోఽహమభివాదయే
యథాబహుమతఃపుత్రస్తథామన్యతుమాంభవాన్
తమబ్రవీత్ కేనపథోపనీత
స్త్వం చోదరే తిష్ఠసి విప్ర బ్రూహి విప్ర.
తన ప్రసాదాన్న జహాతి మాం స్మృతిః
స్మరామి సర్వం యచ్చ యథా చ వృత్తం
న త్వేవం స్యాత్ తపసః సంక్షయో మే
క్లేశం తతః ఘోరమిమం సహామి.
అసురైః సురాయాం భవతోఽస్మి దత్తో
హత్వా దగ్ధ్వా చూర్ణయిత్వా చ కావ్య
బ్రాహ్మీం మాయాం చాసురీం విప్ర మాయాం
త్వయి స్థితేకథమేవాతివర్తేత్.
కిం తే ప్రియం కరవాణ్యద్య వత్సే
వధేన మే జీవితం స్యాత్ కచస్య
నాన్యత్ర కుక్షేర్మమ భేదనేన
దృశ్యేత్ కచో మద్గతో దేవయాని.
ద్వా మాం శోకావగ్నికల్పౌ దహేతాం

గురూపదేశంతో సంజీవనీ విద్యావిదుడై పూర్ణిమాసంధ్యలో ఉదయించే రోహిణీప్రియుని వలె కచుడు శుక్రుని గర్భంనుండి బయటకు వచ్చాడు.

వేదరాసివలె పడివున్న శుక్రునికి విద్యాసిద్ధి పొందిన కచుడు నమస్కరించి ఈ విద్యాదీక్షకు పూర్వం నా యందు అనుగ్రహం ఉంచి నా కర్ణమూలాలలో మృతసంజీవనీ విద్యామృతాన్ని ప్రసరించి జ్ఞానరూపమైన అమృతంతో అభిషేకం చేసినవారిని నేను జననీజనకులుగా భావిస్తున్నాను. గురువు అనుగ్రహానికి పాత్రుడై సిద్ధిపొందిన శిష్యుడు వారియందు ద్రోహచింతతో ఉండడు. సర్వవేదవిదులై ఉత్తమ జ్ఞానాన్ని ప్రసాదించే గురువులను అనాదరదృష్టితో చూసేవారికి ఉత్తమగతులు లేవు — అన్నాడు.

మద్యపానం చెయ్యటంవల్ల శుక్రుడు రాక్షసుల మాయకు లోబడి పోయాడు. అందువల్లనే తనకు అత్యంతప్రియతముడైన శిష్యుని భస్మావశేషాన్ని కూడా తాగేశాడు. ఈ విషయాలాలోచించిన శుక్రుని హృదయం మద్యపానం మీద అసహ్యభావంతో నిండిపోయింది. అప్పుడు బ్రాహ్మణహితదృష్టితో శుక్రుడిలా ఘోషించాడు - ఎంత మందమతికల బ్రాహ్మణుడైనా మద్యపానం చేసినట్లయితే బ్రహ్మహత్యాదోషం వానికి అంటుతుంది. ధర్మశాస్త్రవిధులలో కూడా ఈ నియమం పాటింపబడాలి. సాధువులూ, బ్రాహ్మణులూ అధ్యయనం చేసేవారూ దేవతలూ సమస్తమానవులూ ఈ మర్యాదను అతిక్రమించరాదు - అని పలికి దానవులను పిలిచి - మీ అంతటి మూర్ఖులు మరెవ్వరూ లేరు. ఈ నాడు కచుడు నావల్ల మృతసంజీవనీ విద్యలో సిద్ధిపొందాడు. ఇతడు నాతో సమానుడు బ్రహ్మస్వరూపుడైన ఈ కచుడు దేవకార్యార్థం ఇంతటి సాహసానికి ఏ శంకాలేకుండా వచ్చాడు. వీనికీర్తి ఆచంద్రతారార్కం, ఇకముందు యజ్ఞాలలో వీనికికూడా భాగం లభిస్తుంది - అని శుక్రుడు మౌనం వహించాడు. అసురులు వాలిపోయిన ముఖాలతో తమ గృహాలకు చేరుకున్నారు. కచుడు వేయి సంవత్సరాల బహ్మచర్యదీక్షను పూర్తిచేసుకుని స్వర్గలోకానికి ప్రయాణం అవుతున్నాడు.

76 వ అధ్యాయం సమాప్తం.

## డెబ్బది ఏడవ అధ్యాయము

వేయి సంవత్సరాల బ్రహ్మచర్యవ్రతదీక్షతో మృతసంజీవనీవిద్యసాధించి శుక్రాచార్యుని అనుమతితో దేవలోకానికి బయలుదేరబోతున్న కచునితో సదాచార విద్యాతపస్సంపన్నుడవై జితేంద్రియుడవై వెలుగొందే అంగిరస పౌత్రుడా! మీ పితామహులు మా తండ్రిగారికి ఎంత ఆదరనీయులో మీ తండ్రి బృహస్పతులువారు నాకంత పూజనీయులు. ఆ గౌరవభావంతో ఒక్క విషయం నీతో చెప్పుదామనుకుంటున్నాను. విద్యాదీక్షతో నువ్వు వచ్చి తీవ్రనియమాలతో ఇక్కడగడపిన రోజులలో నేను మీతో కష్టసుఖాలు పంచుకొన్న విషయం మీరు మరచిపోలేరు. ఇపుడు దీక్షాపరిసమాప్తి

కచస్య నాశే స్తవ చైవ కోపఘాతః
కచస్య నాశే మమ శర్మ నాస్తి
తవోపఘాతే జీవితుం నాస్మి శక్తా.
సంసిద్ధరూపోఽసి బృహస్పతేః సుత
యత్త్వాం భక్తం భజతే దేవయానీ
విద్యామిమాం ప్రాప్నుహి జీవనీం త్వం
న చేదిన్ద్రః కచరూపీ త్వమద్య.
న నివర్తేత్ పునర్జీవన్ కశ్చిదన్యో మమోదరాత్
బ్రాహ్మణం వర్జయిత్వైకం తస్మాద్ విద్యా
మవాప్నుహి.
పుత్రో భూత్వా భావయ భావితో మా
మస్మద్దేహా దుపనిష్క్రమ్య తాత
సమీక్షేథా ధర్మవతీ మవేక్షాం
గురోః సకాశాత్ ప్రాప్య విద్యాం సవిద్యః.
గురోః సకాశాత్ సమవాప్య విద్యాం
భిత్త్వా కుక్షిం నిర్విచక్రామ విప్రః
కచోఽభిరూప స్తత్క్షణాత్ బ్రాహ్మణస్య
శుక్లాత్యయే పౌర్ణమాస్యామివేన్దుః.
దృష్ట్వా చ తం పతితం బ్రహ్మరాశి
ముత్థాపయామాస మృతం కచోఽపి
విద్యాం సిద్ధాం తా మవాప్యాభివాద్య
తతః కచ స్తం గురు మిత్యువాచ.
యః శ్రోత్రయో రమృతం సంనిషించేత్
విద్యా మవిద్యస్య యథా మమాయం
తం మన్యేఽహం పితరం మాతరం చ
తస్మై న ద్రుహ్యేత్ కృతమస్య జానన్.
ఋతస్య దాతార మనుత్తమస్య
నిధిం నిధీనామపి లబ్ధవిద్యాః
యే నాద్రియన్తే గురుమర్చనీయం
పాపాన్లోకాం స్తే వ్రజన్త్య ప్రతిష్ఠాః.
సురాపానాద్వంచనాం ప్రాప్య విద్వాన్
సంజ్ఞానాశం చైవ మహాతిఘోరం
దృష్ట్వా కచం చాఽపి తథాభిరూపం
పీతం తదా సురయా మోహితేన.
సమన్యురుత్థాయ మహానుభావ
స్తదోశనా విప్రహితం చికీర్షుః
సురాపానం ప్రతి సంజాతమన్యుః
కావ్యః స్వయం వాక్యమిదం జగాద.
యో బ్రాహ్మణోఽద్యప్రభృతీహ కశ్చి
న్మోహాత్ సురాం పాస్యతి మందబుద్ధిః.
అపేతధర్మో బ్రహ్మహా చైవ స స్యా
దస్మిన్లోకే గర్హితః స్యాత్ పరే చ.
మయా చైతాం విప్రధర్మోక్తి సీమాం
మర్యాదాం వై స్థాపితాం సర్వలోకే
సన్తో విప్రాః శుశ్రువాంసో గురూణాం
దేవా లోకా శ్చోపశృణ్వంతు సర్వే.
ఇతీదముక్త్వా స మహానుభావ
స్తపోనిధీనాం నిధిరప్రమేయః
తాన్ దానవాన్ దైవవిమూఢబుద్ధీ
నిదం సమాహూయ వచోఽభ్యువాచ.
ఆచక్షే వో దానవా బాలిశాః స్థ
సిద్ధః కచో వత్స్యతి మత్సకాశే
సంజీవనీం ప్రాప్య విద్యాం మహాత్మా
తుల్యప్రభావో బ్రహ్మణో బ్రహ్మభూతః.
యోఽకార్షీ ద్దుష్కరం కర్మ దేవానాః కారణాత్కచః
న తత్కీర్తి ర్జరాం గచ్ఛేద్యజ్ఞియశ్చ భవిష్యతి.
ఏతావదుక్త్వా వచనం విరరామ స భార్గవః
దానవా విస్మయావిష్టాః ప్రయయుః స్వం నివేశనం.

అయింది. మీ అభీష్టం సిద్ధించింది. కనక మీ యందు ప్రేమగల నన్ను విధివిధానంగా పెండ్లాడండి. అని దేవయాని పలకగా కచుడు సమాధానం చెప్పుతున్నాడు.

ఆచార్య శుక్రుడు ఎంత పూజనీయుడో నువ్వూ అంతే. ఒకవిధంగా చూస్తే అంతకన్న అధికంగానే నువ్వు పూజార్హురాలవు. భార్గవులకు ప్రియపుత్రివైన నువ్వు ధర్మశాస్త్రదృష్ట్యా నాకు పూజనీయురాలవు. అంతటి ఉన్నతస్థానంలో ఉన్న నువ్వు ఇటువంటి ప్రసంగం చెయ్యకూడదు.

అదివిని దేవయాని—విప్రశ్రేష్ఠా! మీరు నా జనకుని గురువులైన అంగిరసుని మనుమలు. నాతండ్రికీ నాకూ మీరు సమ్మాన్యార్హులు. రాక్షసులు మిమ్ము చంపినపుడుమీయందు నేనుప్రదర్శించిన అభిమానానురాగాలు మరచిపోకండి. ఆ సౌహార్దం విస్మరించక ధర్మజ్ఞులై నన్ను పరిగ్రహించండి-అని ప్రార్థించే దేవయానివైపు చూస్తూ - ఉత్తమవ్రతశీలీ ! ఏది అనుచితమైన మార్గమో ఆ దారినే నన్ను నడిపించడానికి ప్రయత్నిస్తున్నావు. నాయందు ప్రసన్నురాలవైన న న్ననుగ్రహించు. గురువులకన్న గురుతరంగా నీయందు నాకు గౌరవభావ ముంది. శుక్రునిగర్భం నుంచి నువ్వు వచ్చినట్లే నేనూ వచ్చాను. సోదరీ! నువ్వు ఇటువంటిమాటలు మాట్లాడకూడదు. ఇంత కాలం నేను ఎంతో హాయిగా గడిపాను. నీమీద నాకు ఎటువంటి ద్వేషమూ రోషమూ లేదు. దేవలోకానికి వెళ్ళబోయేముందు నేను నీ ఆశీర్వాదాలు కోరుతున్నాను. నన్ను మరచిపోకుండా ఉండు. ఆచార్య శుక్రులను సేవించడంలో ఏమరుపాటు పడకు - అని కచుడు ఆగాడు.

బార్హస్పతీ ! ధర్మవిరుద్ధంకాని తృతీయ పురుషార్థమైన కామదృష్టితో చేసే నా ప్రార్థన తిరస్కరిస్తే ఈ మృతసంజీవనీవిద్య నీకు సిద్ధించదు - అని దేవయాని అనగా - గురుపుత్రీ! నీలో దోషం ఉందని తిరస్కరించడంలేదు. గురువుల ఆజ్ఞ లేదు. నువ్వు నన్ను శపించడానికి అర్హతకలదానివే. అయితే ధర్మబుద్ధితో కాక కామవశీభూతహృదయంతో నువ్వు నన్ను శపించావు, కనక నీ ఆశ నిరాశ అవుతుంది. నిన్ను ఏ ఋషిబాలుడూ వివాహం చేసికోడు. నీ శాపానుసారం యీవిద్య నాకు ఫలించకపోయినా నా వల్ల ఉపదేశంపొందినవారిద్వారా నాప్రయోజనం నెరవేరుతుంది - అని తీవ్రవేగంతో దేవలోకంచేరిన కచునికి దేవతలందరూ సంతోషంతో స్వాగతం ఇస్తూ - దేవహితార్థమై అద్భుతమైన మహత్తరకార్యాన్ని సాధించి వచ్చిన నీ కీర్తి చిరస్థాయిగా ఉంటుంది. నీకు యజ్ఞభాగాలలో ప్రాతినిధ్యం ఉంది — అన్నారు.

77 వ అధ్యాయం సమాప్తం

## డెబ్బది ఎనిమిదవ అధ్యాయం

**యయాతి**

బ్రహ్మచర్యవ్రతదీక్షతో మృతసంజీవని సాధించివచ్చిన కచుడు దేవతలందరకీ ఆవిద్య ఉపదేశించినవార్త విని దేవేంద్రుడు సంతోషించాడు.

గురోరష్య సకాశే తు దశవర్ష శతాని సః
అనుజ్ఞాతః కచో గంతుమియేష త్రిదశాలయం.

76 వ అధ్యాయం సమాప్తం.

## డెబ్బది ఏడవ అధ్యాయము

సమావృత వృతం తం తు విసృష్టం గురుణా తదా
ప్రస్థితం త్రిదశావాసం దేవయాన్యబ్రవీదిదమ్.
ఋషేరంగిరసః పౌత్ర వృత్తేనాభిజనేన చ
భ్రాజసే విద్యయా చైవ తపసా చ దమేన చ
ఋషిర్యథాఙ్గిరా మాన్యః పితుర్మమ మహాయశాః
తథామాన్యశ్చపూజ్యశ్చమమభూయోబృహస్పతిః.
ఏవం జ్ఞాత్వా విజానీహి యద్బ్రవీమి తపోధన
వ్రతస్థే నియమోపేతే యథావర్తామ్యహం త్వయి.
స సమావృత్తవిద్యో మాం భక్తాం భజితుమర్హసి
గృహాణ పాణిం విధివన్మమ మన్త్రపురస్కృతమ్.
పూజ్యో మాన్యశ్చ భగవాన్ యథా తవ పితా మమ
తథా త్వమనవద్యాంగ్ని పూజనీయతరా మమ.
ప్రాణేభ్యోఽపి ప్రియతరా భార్గవస్య మహాత్మనః
త్వం భద్రే ధర్మతః పూజ్యాగురుపుత్రీ సదామమ.
యథా మమగురుర్నిత్యంమాన్యః శుక్రః పితా తవ
దేవయాని తథైవ త్వం నైవం మాం వక్తుమర్హసి.
గురుపుత్రస్య పుత్రో వై న త్వంపుత్రశ్చ మేపితుః
తస్మాత్పూజ్యశ్చ మాన్యశ్చ మమాపి త్వం ద్విజోత్తమ.
అసురైర్హన్యమానే చ కచ త్వయి పునః పునః
తదా ప్రభృతి యా ప్రీతిస్తాంత్వమద్య స్మరస్వమే.
సౌహార్దే చానురాగేచవేత్థ మేభక్తి ముత్తమామ్
న మామర్హసి ధర్మజ్ఞ త్యక్తుం భక్తామనాగసం.
అనియోజ్యే నియోగే మాంనియునక్షి శుభవ్రతే
ప్రసీద సుభ్రు త్వం మహ్యాం గురోర్గురుతరా శుభే.
యత్రోషితం విశాలాక్షి త్వయా చంద్రనిభాననే
తత్రాహముషితో భద్రే కుక్షౌ కావ్యస్య భామిని.
భగినీ ధర్మతో మే త్వం మైవం వోచః సుమధ్యమే
సుఖమస్మ్యుషితో భద్రే న మన్యుర్విద్యతే మమ.
ఆపృచ్ఛే త్వాం గమిష్యామి శివమాశంస మేపథి
అవిరోధేన ధర్మస్య స్మర్తవ్యోఽస్మికథాంతరే
అప్రమత్తోత్థితా నిత్యమారాధయ గురుం మమ.
యది మాం ధర్మకామార్థే ప్రత్యాఖ్యాస్యసి యాచితః
తతః కచ న తే విద్యా సిద్ధి మేషా గమిష్యసి.
గురుపుత్రీతి కృత్వాహం ప్రత్యాచక్షే న దోషతః
గురుణా చాననుజ్ఞాతః కామమేవం శపస్వ మాం.
ఆర్షం ధర్మం బ్రువాణోఽహం దేవయాని యథా త్వయా
శప్తో నార్హోఽస్మి శాపస్యకామతోఽద్యన ధర్మతః.
తస్మాద్భవత్యా యః కామో న తథా స భవిష్యతి
ఋషిపుత్రో న తే కశ్చిజ్జాతు పాణిం గ్రహీష్యతి.
ఫలిష్యతి నతే విద్యా యత్వం మామాత్థ తత్తథా
అధ్యాపయిష్యామి తు యం తస్య విద్యాఫలిష్యతి.
ఏవముక్త్వా ద్విజశ్రేష్ఠో దేవయానీం కచస్తదా
త్రిదశేశాలయం శీఘ్రం జగామ ద్విజసత్తమః.
తమాగతమభిప్రేక్ష్య దేవా ఇంద్రపురోగమాః

యథేచ్ఛగా శత్రుసంహారం సాగించమని ఆజ్ఞాపించి విహారార్థం భూలోకానికి బయలుదేరాడు ఇంద్రుడు. విహరిస్తూ విహరిస్తూ చైత్రరథవనసదృశమైన ఒక ఉద్యానవనము చూశాడు. ఆవనాంతరసరోవరంలో ఎందరో యువతీమణులు జలక్రీడలో మునిగిఉండడం గమనించి వారు గట్టునవిడిచిన బట్టలన్నీ ఒక గాలి విసురుతో కలిపేశాడు. జలకేళిసవరింపులు కాగానే వారందరూ నగ్నదేహాలతో పైకివచ్చి హడావుడిగా చేతికందిన బట్టలు కట్టుకుంటున్నారు. వారిలో దేవయాని తనబట్టలుకట్టిన రాక్షస చక్రవర్తి కుమార్తె శర్మిష్ఠవైపు కొరకొరచూస్తూ- నీజాతికి గురుస్థానీయుడైన శుక్రాచార్యుని పుత్రిని నేను. నువ్వు కట్టివిడిచిన బట్టముట్టను — అంది.

శర్మిష్ఠకు ఆగ్రహం కలిగింది— ఓసి దేవయానీ! మాతండ్రి రాక్షసేశ్వరుడు వృషపర్వుడు. ఆయన పదసన్నిధానంలో చేతులు జోడించి నిలిచి స్తుతించి నీతండ్రి జీవిస్తున్నాడు. మా ఆదరానుగ్రహాలతో జీవించే నువ్వు కక్ష గట్టి సాధించే దేమీలేదు. నేను దయదలిచి నిన్ను వదులుతున్నాను. అస్త్రశస్త్ర సంపన్నులయిన సేవకు లెందరో నాకనుసన్నలలో నడుస్తున్నారు. నువ్వు అధికప్రసంగం చేస్తే నిన్ను నా దాసీలచేత అవమానింపజేస్తాను— అని రోషపూరిత వాక్యాలు పలికేసరికి దేవయాని ఆవేశం రెచ్చి శర్మిష్ఠ కట్టిన చీరను బలవంతంగా లాగబోయింది. శర్మిష్ఠ మరీక్రోధంతో వెనకా ముందూ చూడక ప్రక్కనే ఉన్న పాడునూతిలో దేవయానిని ద్రోసివేసి చరచర నిజసౌధానికి సాగిపోయింది.

శర్మిష్ఠ వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయింది. కొద్దిక్షణాల అనంతరం ఆప్రాంతానికే నహుష నందనుడు యయాతి వేటలో అలసి చేరాడు. అతని రథాన్ని లాగుతూన్న అశ్వాలతోపాటు ఆయనకూడా దాహంతో ఉండి ఆ నూతిలో నిర్మలోదకాలు లభిస్తాయేమో నని ఆశగా చూశాడు.

చూసిన యయాతి కనులకు అగ్నిశిఖవలె తేజస్సులీనుతూ దేవతాస్త్రీవలె సౌందర్యసుషమాన్వితమైన తరుణీమూర్తి గోచరించింది. ఆ సౌందర్యరేఖను చూస్తూనే మధురశబ్దాలతో— పదునారు వసంతాల తారుణ్యం తొణికిసలాడే బాలామణీ! నువ్వెవరవు. నీ వ్రేలిగోళ్ళ ఎర్రతనం నీ కర్ణకుండలాల మణి కాంతులూ కనులకు మిరిమిట్లు గొలుపుతున్నాయి. నీముఖం చూస్తూంటే ఏదో దుర్భర వ్యథ గోచరిస్తున్నది. గడ్డితో పొదలతో నిండిన ఈ శూన్యకూపంలో ఎలా పడిపోయావు. నువ్వెవరి తనయవు— అని ప్రశ్నించగా దేవయాని— మహాత్మా! దేవతలచే నిహతులయ్యే రాక్షసులందరినీ తన విద్యాశక్తితో పునరుజ్జీవింపజేసే శుక్రాచార్యుని ప్రియపుత్రికను. నేను ఈస్థితిలో ఉన్నట్లు నాతండ్రికింకా తెలిసి ఉండదు. ఇంతకీ తామెవరు. బలరూపసంపన్నులైన మీరిలా వచ్చి నా పరిచయం దేనికి కోరుతున్నారు. మీరీ ప్రాంతాలకు వచ్చినకారణ మేమిటి— అన్నది.

కళ్యాణీ! నేను నహుష రాజనందనుడను. యయాతి అని ప్రజలు నన్ను పిలుస్తారు. ఘాతుక మృగాలను వేటాడుతూ వచ్చి అలసి పిపాసతో నీటికోసం ఈ నూతిలోకి చూసేసరికి నువ్వు కనిపించావు— అన్నాడు యయాతి.

బృహస్పతిం సహాజ్యేదం కచం వచనమబ్రువన్.
యత్త్వయాస్మద్ధితం కర్మ కృతం వై పరమాద్భుతం
న తే యశః ప్రణశితాభాగభాక్త్వం భవిష్యసి.

77 వ అధ్యాయము సమాప్తం

## డెబ్బది ఎనిమిదవ అధ్యాయము

కృతవిద్యే కచే ప్రాప్తే హృష్టరూపా దివౌకసః
కచాదధీత్య తాం విద్యాం కృతార్థా భరతర్షభ.
సర్వ ఏవ సమాగమ్య శతక్రతు మథాబ్రువన్
కాల స్తే విక్రమస్యాద్య జహి శత్రూన్ పురందర.
ఏవము క్తస్తు సహితై స్త్రిదశై ర్మఘవాం స్తదా
తథేత్యుక్త్వా ప్రచక్రామసోఽపశ్యత వనే స్త్రియః.
క్రీడంతీనాం తు కన్యానాం వనే చైత్రరథోపమే
వాయుభూతః సవస్త్రాణి సర్వాణ్యేవ వ్యమిశ్రయత్
తతో జలాత్సముత్తీర్య కన్యాస్తా స్సహితా స్తదా
వస్త్రాణి జగృహుస్తాని యథా సన్నా న్యనేకశః.
తత్ర వాసో దేవయాన్యాః శర్మిష్ఠా జగృహే తదా
వ్యతిమిశ్రమజానంతీ దుహితా వృషపర్వణః.
తతస్త యోర్మిథ స్తత్ర విరోధః సమజాయత
దేవయాన్యాశ్చ రాజేంద్ర శర్మిష్ఠాయాశ్చ తత్కృతే.
కస్మాద్గృహ్ణాసి మేవస్త్రం శిష్యాభూత్వా మమాసురి
సముదాచారహీనాయా న తే సాధు భవిష్యతి.
ఆసీనం చ శయానం చ పితా తే పితరం మమ
స్తౌతి వందీవ చాభీక్ష్ణం నీచైః స్థిత్వా వినీతవత్.
యాచత స్త్వం హి దుహితా స్తువతః ప్రతిగృహ్ణతః
సుతాహం స్తూయమానస్య దదతోఽప్రతిగృహ్ణతః.
అదూన్వస్వ విదూన్వస్వ ద్రుహ్య కుప్యస్వ యాచకి
అనాయుధా సాయుధాయా రిక్తా క్షుభ్యసి భిక్షుకి
లప్స్యసే ప్రతియోద్ధారం న హి త్వాం గణయామ్యహం.
వసతికూలం వదసి చేదితః ప్రభృతి యాచకి
ఆకృష్య మమ దాసీభిః ప్రస్థాప్యసి బహిర్బహిః.
సముచ్ఛ్రియం దేవయానీం గతాం సక్తాంచవాససి
శర్మిష్ఠా ప్రాక్షిపత్ కూపే తతఃస్వపురమాగమత్.
హతేయమితి విజ్ఞాయ శర్మిష్ఠా పాపనిశ్చయా
అనవేక్ష్య యయౌ వేశ్మ క్రోధవేగపరాయణా
అథ తం దేశమభ్యాగాద్యయాతిర్నహుషాత్మజః.
శ్రాంతయుగ్యఃశ్రాంతహయోమృగలిప్సుఃపిపాసితః
స నాహుషః ప్రేక్షమాణ ఉదపానం గతోదకం.
దదర్శ రాజా తాం తత్ర కన్యామగ్ని శిఖామివ
తామపృచ్ఛత్ స దృష్ట్వైవ కన్యామమరవర్ణినీం.
సాంత్వయిత్వా నృపశ్రేష్ఠః సామ్నా పరమవల్గునా
కాత్వం తామ్రనఖీ శ్యామాసుమృష్టమణికుండలా.
దీర్ఘం ధ్యాయసి చాత్యర్థంకస్మాచ్ఛోచసిచాతురా
కథం చ పతితాస్యస్మిన్ కూపే వీరుత్తృణావృతే.
దుహితా చైవ కస్య త్వం వద సత్యం సుమధ్యమే
యోఽసౌ దేవై ర్హతాన్ దైత్యానుత్థాపయతి విద్యయా.
తస్య శుక్రస్య కన్యాహం స మాంనూనంనబుధ్యతే
పృచ్ఛసే మాం క స్త్వమసి రూపవీర్యబలాన్వితః

నృపశ్రేష్ఠా! అరుణారుణకాంతిలీనే గోళ్ళతో పరిశోభించే నా యీ దక్షిణహస్తం స్వీకరించి నన్ను ఉద్ధరించండి. మీరు దయాస్వభావులూ శాంతస్వరూపులూ అని మీ కీర్తిని గానం చేసే వారివల్ల విన్నాను. మహారాజా! ఈ అబలను ఉద్ధరించండి— అని దేవయాని కోరింది. యయాతి ఆమెను బ్రాహ్మణకన్యగా గ్రహించి ఆమె కుడిచేతిని పరిగ్రహించి నూతినుండి ఉద్ధరించి— ఇంక నువ్వు నిర్భయంగా ఇంటికి వెళ్ళు— అనగా— మహారాజా! నువ్వు నా దక్షిణ పాణిగ్రహించి నాకు ప్రియతమ భర్తవయావు. కనక నన్ను నీతో తీసుకువెళ్ళు— అన్నది. కళ్యాణీ! జగద్గురు స్థానీయులైన బ్రాహ్మణశ్రేష్ఠుడు శుక్రాచార్యులు. నువ్వు వారి అనుంగుపుత్రివి. నేను క్షత్రియుణ్ణి. మనకు వివాహం సాగదు. నావంటి సామాన్యుని నువ్వు వరించకూడదు. పైగా ఆచార్య శుక్రులకు ఇందువల్ల కలిగే ఆగ్రహం నన్ను భయకంపితుణ్ణి చేస్తున్నది— అని యయాతి సమాధానం యివ్వగా దేవయాని— నువ్వు ఇప్పుడు నన్ను నీతో తీసికొనివెళ్ళకపోతే నేను నా తండ్రి ఆజ్ఞతోనే నిన్ను వరిస్తాను. ఆనాడు నువ్వు నా యోగ్యతను మన్నించగలవు— అని యయాతికి సెలవిచ్చి ఒక చెట్టుకింద నిలచి తనకు జరిగిన అవమానానికి విలపిస్తూన్నది. ఆ సమయంలో ఆలస్యంగా అయినా ఆశ్రమానికి చేరని కుమార్తెను వెదకి తీసికొని రమ్మని ఘూర్ణిక అనేపేరుగల పరిచారికను శుక్రుడు పంపగా ఆమె దేవయాని పదచిహ్నాల సాహాయ్యంతో వెదకి వెదకి శ్రమాపూర్ణవదనంతో దీనంగా విలపించే దేవయానిని చేరింది.

దేవయానిని చేరి ఘూర్ణిక శుక్రాచార్యుల మాటలు చెప్పగా ఆమె జరిగిన విషయాలు వివరించి తాను వృషపర్వుని నగరంలో అడుగు పెట్టనంది. ఉత్తరక్షణంలో తిరిగివచ్చిన ఘూర్ణికా ముఖాన కుమార్తె దీనస్థితి విన్న ఆచార్య శుక్రుని కన్నులు క్రోధఘూర్ణితము లైనవి. రాక్షస చక్రవర్తి కూతురు తనప్రియపుత్రుని అవమానించడమా! అనుకుంటూ బయలుదేరి దేవయానిని సమీపించి గుండెలకు హత్తుకొని— అమ్మా! ప్రాణికోటి గుణదోషానుసారం శుభాశుభకర్మానుసారం సుఖదుఃఖా లనుభవిస్తుంది. అకారణంగా నీకీ అవమానం జరిగిందని నే ననుకోను. నువ్వేం చేశావో చెప్పు— అని బ్రతిమాలే తండ్రివైపు చూసి తలదించి— మహాత్మా! నా కర్మఫలం సిద్ధించినా సిద్ధించక పోయినా నాకు చింతలేదు. ముందీ విషయం చెప్పండి. మీరు వృషపర్వుని కొలువులో నిలిచి భట్టుపొగడ్తలు పొగుడుతుంటా రని శర్మిష్ఠ అంది. అది నిజమేనా? మీరు వృషపర్వుని అనుగ్రహంతో వారుపెట్టే భిక్షతో జీవిస్తున్నారా? ఈ మాటలన్నీ శర్మిష్ఠ గర్వంగా అరుణారుణనేత్రాలతో అంటూంటే నేను విన్నాను. ఇదంతా సత్యమేనా? అలానే అయితే నేనుకూడా శర్మిష్ఠదగ్గర దాసీపనిచేసి ఆమె అనుగ్రహం పొందుతాను. శర్మిష్ఠ కోపంతో నన్ను పాడునూతిలోకి త్రోసిపారేసి ఇంటికిపోయింది— అని చెప్పింది.

అనుంగుపుత్రి ఆవేదనతో పలికిన మాటలు విని ఆమె శిరస్సు నిమురుతూ ఆశ్వాసనపూర్వకంగా ఆచార్యశుక్రుడు పలుకుతున్నాడు— అమ్మా! శర్మిష్ఠ అన్నీ అసత్యాలే పలికింది. వృషపర్వుని స్తుతించి చేతులు చాచి యాచించేవాడు శుక్రాచార్యుడు కాడు. ఏమానవునీ ప్రస్తుతించకుండా సర్వమానవులచేతా నమస్కృతులూ కైవారాలూ అందుకొనే

బ్రూహ్యాత్రాగమనం కిం వా శ్రోతుమిచ్ఛామి తత్త్వతః
యయాతిర్నాహుషోఽహం తు శ్రాంతోఽద్య మృగలిప్సయా
కూపే తృణావృతే భద్రే దృష్టవానస్మి త్వామిహ.
ఏష మే దక్షిణో రాజన్ పాణిస్తామ్రనఖాంగులిః
సముద్ధర గృహీత్వా మాం కులీనస్త్వం హి మే మతః.
జానామి హి త్వాం సంశాంతం వీర్యవంతం యశస్వినం
తస్మాన్మాం పతితామస్మాత్ కూపాదుద్ధర్తుమర్హసి.
తామథో బ్రాహ్మణీం రాజా విజ్ఞాయ నహుషాత్మజః
గృహీత్వా దక్షిణే పాణావుజ్జహార తతోఽవటాత్.
ఉద్ధృత్య చైనాం తరసా తస్మాత్ కూపాన్నరాధిపః
గచ్ఛ భద్రే యథాకామం న భయం విద్యతే తవ
ఇత్యుచ్యమానా నృపతిం దేవయానీ తముత్తరం.
ఉవాచ మాం త్వమాదాయ గచ్ఛ శీఘ్రం ప్రియో హి మే
గృహీతాహం త్వయా పాణౌ తస్మాద్భర్తా భవిష్యసి.
ఇత్యేవముక్తో నృపతిరాహ క్షత్రకులోద్భవః
త్వం భద్రే బ్రాహ్మణీ తస్మాన్మయా నార్హసి సంగమం.
సర్వలోకగురుః కావ్యస్త్వం తస్య దుహితాసి వై
తస్మాదపి భయం మేఽద్య దస్మాత్కల్యాణి నార్హసి.
యదీ మద్వచనాదద్య మాం నేచ్ఛసి నరాధిప
త్వామేవ వరయే పిత్రా పశ్చాజ్జ్ఞాస్యసి గచ్ఛసి.
ఆమంత్రయిత్వా సుశ్రోణీం యయాతిః స్వపురం యయౌ
గతే తు నాహుషే తస్మిన్ దేవయాన్యప్యనిందితా.
క్వచిదార్తా చ రుదతీ వృక్షమాశ్రిత్య తిష్ఠతి
తతశ్చిరాయమాణాయాం దుహితర్యాహ భార్గవః.
ధాత్రి త్వమానయ క్షిప్రం దేవయానీం శుచిస్మితాం
ఇత్యుక్తమాత్రే సా ధాత్రీ త్వరితాఽఽహ్వాయితుం గతా.
యత్ర యత్ర సఖీభిః సా గతా పదమమార్గత
సా దదర్శ తథా దీనాం శ్రమార్తాం రుదతీం స్థితాం.
వృత్తం తే కిమిదం భద్రే శీఘ్రం వద పితాహ్వయత్
ధాత్రీమాహ సమాహూయ శర్మిష్ఠావృజినం కృతం.
ఉవాచ శోకసంతప్తా ఘూర్ణికామాగతాం పురః
త్వరితం ఘూర్ణికే గచ్ఛ శీఘ్రమాచక్ష్వ మే పితుః.
నేదానీం సంప్రవేక్ష్యామి నగరం వృషపర్వణః
సా తత్ర త్వరితం గత్వా ఘూర్ణికాసురమందిరం.
దృష్ట్వా కావ్యమువాచేదం సంభ్రమావిష్టచేతనా
ఆచచక్షే మహాప్రాజ్ఞం దేవయానీం వనే హతాం.
శర్మిష్ఠయా మహాభాగ దుహిత్రా వృషపర్వణః
శ్రుత్వా దుహితరం కావ్యస్తత్ర శర్మిష్ఠయా హతాం
త్వరయా నిర్యయౌ దుఃఖాన్మార్గమాణః సుతాం వనే
దృష్ట్వా దుహితరం కావ్యో దేవయానీం తతో వనే.
బాహుభ్యాం సంపరిష్వజ్య దుఃఖితో వాక్యమబ్రవీత్
ఆత్మదోషైర్నియచ్ఛంతి సర్వే దుఃఖసుఖే జనాః.
మన్యే దుశ్చరితం తేఽస్తి యస్యేయం నిష్కృతిః కృతా
నిష్కృతిర్మేఽస్తు వా మాస్తు శృణుష్వావహితో మమ.
శర్మిష్ఠయా యదుక్తాస్మి దుహిత్రా వృషపర్వణః
సత్యం కిలైతత్ సా ప్రాహ దైత్యానామసి గాయనః.
ఏవం హి మే కథయతి శర్మిష్ఠా వార్షపర్వణీ
వచనం తీక్ష్ణపరుషం క్రోధరక్తేక్షణా భృశం.
స్తువతో దుహితా నిత్యం యాచతః ప్రతిగృహ్ణతః
అహం తు స్తూయమానస్య దదతోఽప్రతిగృహ్ణతః.
ఇదం మామాహ శర్మిష్ఠా దుహితా వృషపర్వణః
క్రోధసంరక్తనయనా దర్పపూర్ణా పునః పునః.
యద్యహం స్తువతస్తాత దుహితా ప్రతిగృహ్ణతః

శుక్రాచార్యుని ప్రియపుత్రికవి నువ్వు. అద్వైతరూపమైన పరబ్రహ్మ మన ఐశ్వర్యం. ఈ విషయం వృషపర్వుడే కాదు దేవేంద్రాదులెరుగుదురు. ప్రజాపతి అనుగ్రహం పొంది వాని వరాలతో నేను ఈ లోకాలన్నిటికి నాథుడనై వారి శ్రేయస్సుకోసం సదా కృషిచేస్తూంటాను. నా వల్ల సకాలంలో వర్షాలు కురుస్తాయి. ఓషధులు ఉద్భవిస్తాయి — అని దేవయాని వదనంలోని దైన్యాన్ని తుడిచేశాడు.

78 వ అధ్యాయం సమాప్తం.

## డెబ్బదితొమ్మిదవ అధ్యాయము

అమ్మా! అద్వైత భావపూర్ణమైన విద్య నా ఐశ్వర్యం. ఆ ఐశ్వర్యంతో నేను కుటిలబుద్ధిని కాకుండా అధర్మమార్గాన చరించకుండా దైన్య దృష్టి లేకుండా ఉంటున్నాను. ఎదుటివారు ఎంత కఠోరంగా ప్రసంగించినా క్రోధం ప్రదర్శించినా ఏమీ పట్టించుకోకుండా పోయేవాడే ఉత్తముడు. క్రోధాన్ని నిగ్రహించగలవాడు మదించిన సింధుజాతి అశ్వాలను నడిపే సారథికంటే ఘనుడు. ఉరకలువేసే క్రోధాన్ని క్షమతో అణగద్రొక్కే వ్యక్తికి ఈ ప్రపంచంలో అపజయం లేదమ్మా! నూరుయజ్ఞాల చేసిన వానికంటే కోపం లేనివాడు గొప్పవాడు. తల్లీ బుద్ధిగలవారికి క్రోధము కొనియాడతగినది కాదు. ఎన్నియజ్ఞాలూ దానాలూ తపస్సులూ చేసినా ఒక్కసారి క్రోధంవస్తే అన్నిటి ఫలమూ పొల్లయిపోతుంది. కోపం లేనివానికే వీటి మహత్తరఫలం సిద్ధిస్తుంది. కోపిష్ఠి యజ్ఞయాగాదుల కసమర్థుడు. కర్మరహస్యం అజ్ఞాతకంగానే ఉంటుంది. వానికి ఇహపరాలు లేవు. క్రోధస్వభావులను భార్యాబిడ్డలతోపాటు సేవకులుకూడా విడిచేస్తారు. సత్యధర్మాలు దరిజేరవు. అజ్ఞానంచేత పిల్లలు పోట్లాడుకుంటారు. వారిని చూసి పెద్దవాళ్ళు కూడా అలానే నడుచుకోకూడదు— అని శుక్రుడు హితవు చెపుతూంటే దేవయానియథా పూర్వస్థితికి వచ్చి— పితృపూజ్యా! నేను బాలికనే అయినా ధర్మాధర్మాలు తెలీనిదాన్ని కాదు. ఓరిమియొక్క అవసరం శక్తికూడా నేను ఎఱుగుదును. అయితే గురువుపట్ల అమర్యాదగా చరించే రాక్షసులదేశంలో ఉండడానికి నా మనస్సు అంగీకరించడం లేదు.

దుష్టబుద్ధులై యితర కులాచారమర్యాదలను అవహేళన చేసే వారిమధ్య వివేకులుండలేరు. ఉండకూడదు. మర్యాద లెరిగిన యోగ్యజనులమధ్య విద్వాంసు లుంటారు. దరిద్రుడైనా జితేంద్రియుడైతే ఉత్తమపురుషుడే అవుతాడు. దురాచార నిరతుడైనవాడు మహాధనికుడైనా వాడు ఛండాలసముడే. అకారణద్వేషాలు పెంచుకొని నిందాలాపాలు సాగించేవారు నివసించే చోట సాధుజను లుండరాదు. అలా ఉంటే ఆ వాతావరణం వారినికూడా మార్చేస్తుంది. పాపమైనాపుణ్యమైనా సరే మానవుని బుద్ధి దేనిమీద లగ్నమైతే దాన్నే పరమప్రియంగా భావిస్తుంది.

వృషపర్వుని కూతురు ఆడినమాటలు అగ్నికోసం అరణిని మథించినట్లు నామనస్సును మథిస్తున్నాయి. అవే నన్ను అధికంగా వేధిస్తున్నాయి. మర్మమూలాలలో అవి బాధ రేకెత్తిస్తున్నాయి

ప్రసారదష్యే శర్మిష్ఠామిత్యుక్త్వా తు సఖీమయా.
ఉక్త్వావ్యేవం భృశం క్రుద్ధామాగృహ్యావిజనే వనే
కూపేప్రక్షేపయామాస పక్షిప్యైవగృహంయయా.
స్తువతో దుహితా న త్వంయాచతః ప్రతిగృహ్ణతః
అస్తోతుః స్తూయమానస్య దుహితా దేవయాన్యసి.
వృషపర్వైవ తద్వేద శక్రో రాజా చ నాహుషః
అచింత్యం బ్రహ్మ నిర్ద్వంద్వమైశ్వరంహి బలంమమ.

యచ్చకించిత్ సర్వగతంభూమౌ వా యది వాదివి
తస్యాహమీశ్వరో నిత్యం తుష్టేనోక్తః స్వయం భువా.
అహం జలంవిముంచామిప్రజానాం హితకామ్యయా
పుష్ణామ్యోషధయః సర్వా ఇతి సత్యం బ్రవీమితే.
ఏవం విషాదమాపన్నా మన్యునా సంప్రపీడితాం
వచనైర్మధురైః శ్లక్ష్ణైఃసాంత్వంతయామాసతాం పితా.

78 వ అధ్యాయము సమాప్తం

# డెబ్బది తొమ్మిదవ అధ్యాయము

మమ విద్యా హి నిర్ద్వంద్వా ఐశ్వర్యంహిఫలంమమ
దైన్యం శాఠ్యంచజైహ్మ్యంచనాస్తిమేయదధర్మతః.
యః పరేషాం నరో నిత్యమతివాదాం స్తితిక్షతే
దేవయానీ విజానీహి తేన సర్వమిదం జితం.
యః సముత్పతితం క్రోధం నిగృహ్ణాతిహయంయథా
స యంతేత్యుచ్యతే సద్భిర్న యో రశ్మిషు లంబతే.
యః సముత్పతితం క్రోధమక్రోధేన నిరస్యతి
దేవయాని విజానీహి తేన సర్వమిదం జితం
యః సముత్పతితం క్రోధః నిరస్యతి
యథోరగస్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే.
యః సంధారయతేమన్యుంయోఽతివాదాం స్తితిక్షతే
యశ్చ తప్తో న తపతి దృఢం సోఽర్థస్య భాజనం.
యో యజేదపరిశ్రాంతో మాసిమాసిశతం సమాః
న క్రుద్ధ్యేద్ యశ్చసర్వస్యతయోరక్రోధనోఽధికః.
క్రుద్ధస్య నిష్ఫలాన్యేవ దానయజ్ఞతపాంసి చ
తస్మాదక్రోధనే యజ్ఞస్తపోదానం మహాఫలం.

న పూతో న తపస్వీ చ న యజ్వా న చ కర్మవిత్
క్రోధస్య యో వశంగచ్ఛేత్ తస్యలోకద్వయంనచ.
పుత్రభృత్యసుహృన్మిత్రభార్యాధర్మశ్చ సత్యతా
తస్యైతాన్యపయాస్యంతి క్రోధశీలస్య నిశ్చితం.
యత్కుమారాః కుమార్యశ్చవైరం కుర్యురచేతసః
నతత్ప్రాజ్ఞోఽనుకుర్వీత న విదుస్తే బలాబలం.
నేదాహం తాత బాలాపిధర్మాణాం యదిహాంతరం
అక్రోధే చాతివాదే చ వేద చాపి బలాబలం.
శిష్యస్యాశిష్యవృత్తేస్తు న క్షంతవ్యం బుభూషతా
తస్మాత్సంకీర్ణవృత్తేషు వాసో మమ న రోచతే.
పుమాంసో యే హి నిందంతి వృత్తేనాభిజనేన చ
న తేషు నివసేత్ప్రాజ్ఞః శ్రేయోఽర్థీ పాపబుద్ధిషు.
యే త్వేనమభిజానంతి వృత్తేనాభిజనేన వా
తేషు సాధుషు వస్తవ్యం స వాసః శ్రేష్ఠ ఉచ్యతే.
సుయంత్రితా నరా నిత్యం విహీనాశ్చ ధనైర్నరాః
దుర్వృత్తాః పాపకర్మాణశ్చండాలాధనినోఽపివా.

కటూక్తులు పలికేవారిని బంధుమిత్రులు కూడా చేరరు. దరిద్రంతో బాధపడుతూ శత్రువుల ఐశ్వర్యాన్ని ఆరాధించడం కంటె చావు శ్రేయస్కరమైనది. నీచపురుష సాంగత్యం సదా అవమానభరితమే. వారి దుష్టభాషణలు శోకకారకాలు. విషశస్త్రాగ్నిదుఃఖం కంటె దుర్భాషల వల్లకలిగే దుఃఖం అధికబాధాకారి, అది ఆ క్షణం లోనే బాధించటం ఆరంభిస్తుంది. అందుచేతనే వివేకులు ఎన్నడూ కర్కశంగా మాట్లాడరు. బాణాఘాతం తిన్న వృక్షం చిగురించవచ్చు. గొడ్డలిచే నరకబడ్డ అరణ్యం తిరిగి పెరగవచ్చు. కానీ కర్కశవాక్‌శూలాలతో గాయపడ్డ హృదయానికి నిష్కృతి లేదు— అన్నది.

79 వ అధ్యాయము సమాప్తం

## ఎనుబదవ అధ్యాయము

దేవయాని మాటలతో క్రోధవశహృదయుడై శుక్రాచార్యులు సరాసరి వృషపర్వుని ఆస్థానానికి వెళ్ళాడు. సింహాసనంమీద ఉన్న మహారాజునుద్దేశించి— రాజా! ఆవును కొంతకాలం మేపినతరువాయి అది చూడుకొని ఈని పాలిస్తుంది. భూమిని దున్ని విత్తనాలు చల్లితే కొంతకాలానికి పంట పండుతుంది. అదేరీతిగా అధర్మంకూడా కొంతకాలానికి ఆ వ్యక్తిని నశింపజేస్తుంది. ఒకవేళ అది ఆ అధర్మపరుని విడిచిపెట్టినా పుత్రబాంధవులనయినా బాధించి తీరుతుంది. అతిగా అన్నం తింటే అది తాత్కాలికంగా ఏమీ చెయ్యకపోయినా కొంతసేపటికి ఉదరంలో బాధ కలిగించి తీరుతుంది. అలానే పాపంకూడా కుడుచబెడుతుంది.

జితేంద్రియుడై స్వాధ్యాయపరుడై జగద్ధితాభిలాషాతత్పరుడై క్షమాశీలంతో నావద్ద శిష్యుడుగా ఉన్న అంగీరసపౌత్రుని ఎన్నోసార్లు నువ్వు చంపించావు. ఏ యుగంలోనూ మరణదండన విధించకూడని బ్రాహ్మణబాలుని నువ్వు చంపించావు.

ఆ తరువాయి నా కుమార్తె దేవయానిని హతమార్చే ఉద్దేశంతో నూతిలోకి తోసేశారు. ఈరెండు మహాపరాధాలూ నీ ఏలుబడిలో సాగాయి. కనక నేను నీరాజ్యం వదలి పోతున్నాను. నీ ప్రమత్తత ఎంతమాత్రం తగ్గడం లేదు కనకనే నేను నిన్ను విడిచి పోతున్నాను—అన్నాడు.

మహాత్మా! గురుపుత్రిని అవమానింప జేసే పాపానికి నేను ఒడిగడితే నాకు సద్గతులు లేవు. శర్మిష్ఠచేత నేను ఆ పని చేయించలేదు. ఏనాడూ నేను మిమ్మల్ని ఏ విధంగానూ అవమానించ సంకల్పించలేదు. ధర్మమూర్తివీ సత్యమార్గ నిరతుడవూ అయిన నువ్వు మమ్మల్ని నట్టేటముంచి వెళ్ళిపోకు. మీరు వినా మాకేది దిక్కు. మీరు నా ప్రార్థన మన్నించకపోతే నేను మండే నిప్పులో దూకి మరణిస్తాను— అని దీనంగా పలికే వృషపర్వుని చూసి శుక్రాచార్యులు చలించకుండా— నువ్వు ఏమయినా నా కవసరంలేదు. నువ్వు మరణించినా దిక్కులేకుండా పోయినా చింతించను.

అకారణాద్యే ద్విషంతి పరివాదం వదంతి చ
న తత్రాస్య నివాసోఽస్తి పాపాన్మభిః పాసతాం వ్రజేత్
సుకృతే దుష్కృతే వాపి యత్ర సజ్జతి యోనరః
ధ్రువం రతిర్భవేత్తత్ర తస్మాద్దోషం న రోచయేత్
వాగ్దురుక్తం మహాఘోరం దుహితుర్వృషపర్వణః
మమ మథ్నాతి హృదయమగ్నికామ ఇవారణిం.
న హ్యతో దుష్కరతరం మన్యే లోకేష్వపి త్రిషు
నిఃసంశయోవిశేషేణపరుషంమర్మకృంతనం
సుహృన్మిత్రజనాస్తేషు సౌహృదం న చ కుర్వతే.

యః సపత్నశ్రియం దీప్తాం హీనశ్రీఃపర్యుపాసతే
మరణం శోభనం తస్య ఇతి విద్వజ్జనా విదుః.
అవమానమవాప్నోతి శనైర్నీచేషు సంగతః
వాక్సాయకా వదనాన్నిష్పతంతి
యైరాహతః శోచతి రాత్ర్యహాని
శనైర్దుఃఖం శస్త్రవిషాగ్నిజాతం
తాన్ పండితో నావసృజేత్పరేషు.
సంరోహతి శరైర్విద్ధం వనం పరశునాహతం
వాచా దురుక్తం భీభత్సం న సంరోహతి వాక్షతం.

78వ అధ్యాయం సమాప్తం

## డెబ్బది తొమ్మిదవ అధ్యాయం

తతః కావ్యో భృగుశ్రేష్ఠః సమన్యురుపగమ్య హ
వృషపర్వాణమాసీనమిత్యువాచావిచారయన్.
నాధర్మశ్చరితో రాజన్ సద్యః ఫలతి గౌరివ
శనైరావర్త్యమానో హి కర్తుర్మూలాని కృంతతి.
పుత్రేషు వా నప్తృషు వా న చేదాత్మని పశ్యతి
ఫలత్యేవ ధ్రువం పాపం గురుభుక్తమివోదరే.
అధీయానంహితంరాజన్‌క్షమావంతం జితేంద్రియం
యదఘాతయథా విప్రం కచమాంగిరసం తదా
అపాపశీలం ధర్మజ్ఞం శుశ్రూషం మద్గృహే రతం.
వధాదనర్హతస్తస్య వధాచ్చ దుహితుర్మమ
వృషపర్వన్నిబోధేదంత్యక్ష్యామిత్వాంసబాంధవం.
స్థాతుం త్వద్విషయే రాజన్నశక్ష్యామిత్వయాసహ.
అహో మామభిజానాసి దైత్య మిథ్యాప్రలాపినం
యథేమమాత్మనో దోషం న నియచ్ఛస్యుపేక్షసే.
యది బ్రహ్మన్ ఘాతయామి యది వాఽఽక్రోశ యామ్యహః
శర్మిష్ఠయా దేవయానీం తేన గచ్ఛామ్యసద్గతిం.

నాధర్మం న మృషావాదం త్వయి జానామి భార్గవ
త్వయి ధర్మశ్చ సత్యం చ తత్ప్రసీదతునోభవాన్.
యద్యస్మానపహాయ త్వమితో గచ్ఛసి భార్గవ
సముద్రం సంప్రవేక్ష్యామో నాన్యదస్తిపరాయణం.
యద్యేవ దేవాన్ గచ్ఛేస్త్వం మాం చ త్యక్త్వా గ్రహాధిప
సర్వతాగం తతః కృత్వా ప్రవిశామిహుతాశనం.
సముద్రం ప్రవిశధ్వం వా దిశో వా ద్రవతాసురాః
దుహితుర్నాప్రియం సోఢుంశక్తోఽహం దయితా హి మే.
ప్రసాద్యతాం దేవయానీ జీవితం యత్ర మే స్థితం
యోగక్షేమ కరస్తేఽహమింద్రస్యేవ బృహస్పతిః.
యత్కించిదసురేంద్రాణాం విద్యతే వసు భార్గవ
భువి హస్తిగవాశ్వం చ తస్య త్వం మమచేశ్వరః.
యత్కించిదస్తి ద్రవిణం దైత్యేంద్రాణాంమహాసుర
తస్యేశ్వరోఽస్మియద్యేషా దేవయానీప్రసాద్యతాం
ఏవముక్తస్తథేత్యాహ వృషపర్వా మహాకవిః

నా కూతురికి జరిగిన అవమానం నా హృదయాన్ని వేధిస్తోంది. నువ్వు ఆమె వేదనను ఉపశమింప చెయ్య గలిగితే ఆనాడు నేను మిమ్మల్ని మీ యోగక్షేమా లనూ పరిజూడ గలను— అన్నాడు.

వృషపర్వుడు వినయంతో—ఆచార్య! ఈ రాక్షస రాజ్యమంతకూ మీరే ప్రభువులు. సర్వ మూ మీదే— అనగా శుక్రాచార్యులు ఎలా అయినా సరే తన కుమార్తె ప్రసన్నవదనంతో తనముందు ఉండా లన్నాడు. అనంతరం వారిరువురూ దేవ యానిని సమీపించారు. శుక్రాచార్యులు దేవయా నికి విషయాలన్నీ చెప్పాడు.

పితృపూజ్య! ఈ మహారాజుయొక్క సర్వసంప దలకూ మీరే అధికారులని ఆ య న ముఖతః నేను వినాలి— అని దేవయాని పలకగా వృషప ర్వుడు— అమ్మాయీ! నీకు కావలసిం దేమిటో చెప్పు. అది ఎలాంటి ద యినా నీ ముందు అర్పి స్తాను— అనగా దేవయాని మహారాజా! నీకుమార్తె శర్మిష్ఠ వేయిమంది దాసీ కన్యలతో నన్ను సేవిం చాలి. నేను వివాహితనై వెళ్ళేటప్పుడుకూడా సహస్రకన్యకా పరివృతయైన శర్మిష్ఠ నా వెంట దాసీగా రావాలి— అన్నది.

దేవయాని పెదవులనుండి పై వాక్యాలు వెలు వడుతూండగానే వృషపర్వుడు వెంటవచ్చిన దాసీని చూసి— కులశ్రేయస్సుకోసం ఒక మనుష్య నీ గ్రామాభ్యుదయంకోసం ఒక కులాన్నీ జనపదహితా ర్థం గ్రామాన్నీ విడిచిపెట్టడానికి సంకోచించ నవ సరం లేదు. ఆత్మకళ్యాణార్థం జగత్తునే త్యాగం చెయ్యాలి. ఇప్పుడు నాజాతి భవిష్యత్తుకోసం శర్మి ష్ఠను వదలుకుంటున్నాను. నువ్వు తక్షణం వెళ్ళి శర్మిష్ఠను తీసికొనిరా— అన్నాడు.

మహారాజు వాక్యాలకు ఆచరణరూపం కల్పించే సంకల్పంతో దాసి శర్మిష్ఠను చేరి— అమ్మా! దేవ యానికి జరిగిన అవమానం వల్ల శుక్రాచార్యుల వారు మనరాజ్యం విడిచి పోతూంటే ఆయనను వదులుకోలేక నీతండ్రి నిన్ను ర మ్మ న్నా డు. రాక్షసజాతి శ్రేయస్సుకోసం నువ్వు నీ సోదరబంధు జనాన్ని విడిచిరా— అనగా విని శర్మిష్ఠ— ధాత్రీ! శుక్రాచార్యులుకానీ వారి కుమార్తె కానీ నేను కారణంగా మన రాజ్యం విడిచిపోవడం నా అభి మతం కాదు. కనక గురువుల ఆజ్ఞానుసారం నేను దేవయానిని సేవిస్తాను— అని పల్లకీమీద బయలు దేరింది. రాజకుమార్తె వెంటఉండే సహస్రకన్యా మణులూ అనుసరించారు.

దేవయానిని చేరి— దేవయానీ! నా వెయ్యిమంది సేవికలతో నేను నిన్ను సేవిస్తాను. నువ్వు ఏయింట కోడలుగా వెళ్ళినా నీతో మేమంతా వచ్చి పూజి స్తాము— అని శర్మిష్ఠ పలకగా దేవయాని తల ప్రక్కకు త్రిప్పి— ఎదుటివారిని ఆశ్రయించి అభినం దిస్తూ వారి అనుగ్రహంమీద బ్రతికేవాడి కూతు రికి నువ్వు సేవ చెయ్యగలవా. పైగా నీ తండ్రి అనుగ్రహవిశేషంవల్ల బ్రతికే మనుష్యుని కుమా ర్తెను సేవించే నైచ్యం భరించగలవా— అని ఎత్తి పొడిచింది.

దేవయానీ! నాజాతి భవిష్యత్తుకోసం నిన్ను సేవిస్తాను. నువ్వు ఎక్కడుంటే అక్కడే నీ సేవ చేస్తాను— అన్నది శర్మిష్ఠ.

దేవయాన్యంతికం గత్వా తమర్థం ప్రాహ భార్గవః.
యది త్వమీశ్వరస్తాత రాజ్ఞో విత్తస్య భార్గవ
నాభిజానామి తత్తేఽహం రాజా తువదతుస్స్వయం.
యంకామమభికామాసి దేవయాని శుచిస్మితే
తత్తేఽహం సంప్రదాస్యామియదివాపి హి దుర్లభం
దాసీం కన్యాసహస్రేణ శర్మిష్ఠామభికామయే
అను మాం తత్ర గచ్ఛేత్ సా యత్ర దద్యాచ్చ మే పితా.
ఉత్తిష్ఠ త్వం గచ్ఛ ధాత్రి శర్మిష్ఠాం శీఘ్రమానయ
యం చ కామయతే కామం దేవయానీకరోతు తం.
త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థేకులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్.
తతో ధాత్రీ తత్ర గత్వా శర్మిష్ఠాం వాక్యమబ్రవీత్
ఉత్తిష్ఠ భద్రే శర్మిష్ఠే జ్ఞాతీనాం సుఖమావహ.
త్యజతి బ్రాహ్మణఃశిష్యాన్ దేవయాన్యా ప్రచోదితః
సా యం కామయతే కామం స కార్యోఽద్య త్వయానఘే.
యం సా కామయతే కామంకరవాణ్యహమద్యతం
యద్యేవమాహ్వాయేచ్ఛుక్రోదేవయానీకృతేహివా
మద్దోషాన్మాగమచ్ఛుక్రో దేవయానీ చమత్కృతే.
తతః కన్యాసహస్రేణ వృతా శిబికయా తదా
పితుర్నియోగాత్ త్వరితా నిశ్చక్రామ పురోత్తమాత్
అహం దాసీసహస్రేణ దాసీ తే పరిచారికా
అను త్వాం తత్ర యాస్యామి యత్రదాస్యతి తేపితా
స్తువతో దుహితాహం తే యాచతః ప్రతిగృహ్ణత
స్తూయమానస్య దుహితా కథం దాసీ భవిష్యసి.
యేన కేనచిదార్తానాం జ్ఞాతీనాం సుఖమావహేత్
అతస్త్వామనుయాస్యామి యత్ర దాస్యతి తే పితా.
ప్రతిశ్రుతే దాసభావే దుహిత్రా వృషపర్వణః
దేవయానీ నృపశ్రేష్ఠ పితరం వాక్యమబ్రవీత్.
ప్రవిశామి పురం తాత తుష్టాస్మిద్విజసత్తమ
అమోఘం తవ విజ్ఞానమస్తి విద్యాబలం చ తే.
ఏవముక్తో దుహిత్రా స ద్విజశ్రేష్ఠో మహాయశాః
ప్రవివేశ పురం హృష్టః పూజితః సర్వదానవైః.

80 వ అధ్యాయం సమాప్తం.

## ఎనుబది ఒకటవ అధ్యాయము

అథ దీర్ఘస్యకాలస్య దేవయానీ నృపోత్తమ
వనం తదేవ నిర్యాతా క్రీడార్థం వరవర్ణినీ.
తేన దాసీ సహస్రేణ సార్థం శర్మిష్ఠయా తదా
తమేవ దేశం సంప్రాప్తాయథాకామం చచార సా.
తాభిస్సఖిభిస్సహితా సర్వాభిర్ముదితా భృశం
క్రీడంత్యోఽభిరతాః సర్వాపిబంత్యోమధుమాధవీం.
ఖాదంత్యో వివిధాన్ భక్ష్యాన్ విదశంత్యః ఫలాని చ
పునశ్చ నాహుషో రాజా మృగలిప్సుర్యదృచ్ఛయా.
తమేవ దేశం సంప్రాప్తో జలార్థీ శ్రమకర్శితః
దదృశే దేవయానీం స శర్మిష్ఠాం తాశ్చయోషితః.
పిబంతీర్లలమానాశ్చ దివ్యాభరణభూషితాః.
ఆసనే ప్రవరే దివ్యే సర్వాభరణభూషితే
ఉపవిష్టాం చ దదృశే దేవయానీం శుచిస్మితాం.

ఆమాటలు విని దేవయాని— నాన్నా ! తపో విద్యాబలాలశక్తి నాకు ఇప్పు డవగత మయింది. వాటిమీద విశ్వాసం ఏర్పడింది కనక నేను నగరం లోకి వస్తున్నాను— అనగా శుక్రాచార్యులు రాజ ధానిలో అడుగు పెట్టాడు. అడుగుపెట్టే ఆచార్యుని అధిక మర్యాదలతో తీసికొని వెళ్ళారు వృషపర్వుని అనుచర దానవులు. శుక్రాచార్యులు ఆదరాభి మానాలతో దేవయానిని ఆశ్రమానికి తీసికొని వెళ్ళాడు.

80వ అధ్యాయం సమాప్తం

## ఎనుబది ఒకటవ అధ్యాయం

### దేవయాని - యయాతి

రోజులు కొన్ని సాగినవి. వసంతశోభతో అల రారే వనంలో విహారానికి బయలుదేరింది దేవ యాని. దేవయాని వెంట శర్మిష్ఠ సహస్రకన్యాజను లతో సాగుతున్నది. సాగిసాగి వారందరూ మనో నయనాహ్లాదకరంగా ఉన్న ఆ వనంలో హాయిగా క్రీడిస్తూ రకరకాల మరందాలు త్రాగుతూ మధుర మధురఫలాలతో విందులు గుడుస్తూ అమందానంద కందళితహృదయులై ఉండగా ఆ ప్రాంతానికి యయాతి విచ్చేశాడు.

విజయం చేసిన యయాతిమహారాజు రసపాన మత్తులై క్రీడలు సాగించే దేవయానీవయోరూప లావణ్యవతులయిన యితర కన్యాజనాన్నీ తిలకిం చాడు. వారందరి మధ్యా ఆసనంమీద ఆసీను రాలై చిరునవ్వులు వెదజల్లే దేవయాని పదసేవ చేస్తూన్న శర్మిష్ఠకూడా ఆయనదృష్టిని ఆకర్షించక పోలేదు. ఆ మహారాజు వారిని సమీపించి— దశ శతాధిక కన్యకాజన సేనలు పొందే మీరెవరో తెలుసుకోవచ్చా ? అని ప్రశ్నించాడు.

మహారాజా ! సర్వరాక్షసులకూ ఆచార్యుడైన యశోధనుడు శుక్రాచార్యులు నా తండ్రి. నాపేరు దేవయాని. ఈమె రాక్షసచక్రవర్తియైన వృష పర్వుని కూతురు శర్మిష్ఠ, నాకు ఇష్టసఖిమాత్రమే కాక సేవిక కూడా. నేను వివాహమయాక ఎక్క డికి వెడితే అక్కడికి ఈ దాసీజనంతో వచ్చి నన్ను సేవిస్తుంది— అని దేవయాని మృదులహాసంతో పలు కగా విని యయాతి— ఓ రమణీయ రమణీ ! ఇంత సౌందర్యవతి వృషపర్వుని కూతురు నీకు దాసిగా ఉండవలసిన అవసరం ఏం వచ్చిందా అని ఆశ్చర్యపడుతున్నాను — అన్నాడు. దేవయాని ఒక్కసారి శర్మిష్ఠను చూసి కనుబొమ లెగరేసి— మహాత్మా ! ఇటువంటివానినే దైవ యోగా లంటారు. నా అదృష్ట విశేషంవల్ల ఆమె అలా అయింది అంతే. ఇంతకూ మీరెవరో తెలీ లేదు. మీరు మాట్లాడే తీరు చూస్తే విరుద్ధంగా ఉంది. స్వచ్ఛమైన సంస్కృతం స్ఫుటంగా ఉచ్ఛ రిస్తున్నారు. మీ పరిచయ భాగ్యం కలిగించండి— అనగా యయాతి— బ్రహ్మచర్యనియమంతోసమస్త వేదాలనూ అధ్యయనం చేసినవాడను. నహుష రాజ నందనుడను. నన్ను యయాతి అని పిలుస్తారు.

రూపేణాప్రతిమాం తాసాం స్త్రీణాం మధ్యే
వరాంగనాం
శర్మిష్ఠయా సేవ్యమానాం పాదసంవాహనాదిభిః.
ద్వాభ్యాం కన్యాసహస్రాభ్యాం ద్వే కన్యేపరివారితే
గోత్రే చ నామనీ చైవ ద్వయోః పృచ్ఛామ్యహం
శుభే.
ఆఖ్యాస్యామ్యహమాదత్స్వ వచనం మే నరాధిప
శుక్రో నామాసురగురుః సుతాంజానీహితస్యమాం.
ఇయం చ మే సఖీ దాసీ యత్రాహం తత్ర గామినీ
దుహితా దానవేంద్రస్య శర్మిష్ఠా వృషపర్వణః.
కథం తు తే సఖీ దాసీ కన్యేయం వరవర్ణినీ
అసురేంద్రసుతా సుభ్రూః పరం కౌతూహలంహి మే.
సర్వ ఏవ నరశ్రేష్ఠ విధానమనువర్తతే
విధానవిహితం మత్వామావిచిత్రాః కథాః కృథాః
రాజవద్రూపవేషౌ తే బ్రాహ్మీం వాచం బిభర్షి చ
కో నామ త్వం కుతశ్చాసి కస్య పుత్రశ్చ శంస మే.
బ్రహ్మచర్యేణ వేదో మే కృత్స్నః శ్రుతిపథః గతః
రాజాహం రాజపుత్రశ్చ యయాతిరితి విశ్రుతః.
కేనస్వర్థేన నృపతే ఇమం దేశముపాగతః
జిఘృక్షుర్వారిజం కించిదథవా మృగలిప్సయా.
మృగలిప్సురహం భద్రే పానీయార్థముపాగతః
బహుధాప్యనుయుక్తోఽస్మి తదనుజ్ఞాతుమర్హసి.
ద్వాభ్యాం కన్యాసహస్రాభ్యాం దాస్యా శర్మిష్ఠయా
సహ
త్వదదీనాస్మి భద్రం తే సఖా భర్తా చ మే భవ.
విద్ధ్యౌశనసి భద్రం తే న త్వామర్హోఽస్మి భావిని
అవివాహ్యా హి రాజానో దేవయాని పితుస్తవ.
సంసృష్టంబ్రాహ్మణాక్షత్రంక్షత్రేణబ్రహ్మసంహితం
ఋషిశ్చాప్యృషిపుత్రశ్చ నాహుషాంగ వహస్వ
మాం.

ఏకదేహోద్భవా వర్ణాశ్చత్వారోఽపి వరాంగనే
పృథగ్ధర్మాః పృథక్శౌచాస్తేషాం తు బ్రాహ్మణో
వరః.
పాణిధర్మో నాహుషాయం న పుంభిః సేవితః పురా
తంమే త్వమగ్రహీరగ్రే వృణోమి త్వామహంతతః
కథం ను మే మనస్విన్యాః పాణిమన్యః పుమాన్
స్పృశేత్
గృహీతమృషిపుత్రేణ స్వయం వాప్యృషిణా త్వయా
క్రుద్ధాదాశీవిషాత్ సర్పాజ్జ్వలనాత్
సర్వతోముఖాత్
దురాధర్షతరో విప్రో జ్ఞేయః పుంసా విజానతా.
కథమాశీవిషాత్ సర్పాజ్జ్వలనాత్ సర్వతోముఖాత్
దురాధర్షతరో విప్ర ఇత్యాత్థ పురుషర్షభ.
ఏకమాశీవిషో హంతి శస్త్రేణైకశ్చ వధ్యతే
హంతి విప్రః సరాష్ట్రాణి పురాణ్యపి హి కోపితః.
దురాధర్షతరో విప్రస్తస్మాద్భీరు మతో మమ
అతోఽదత్తాం చ పిత్రా త్వాం భద్రే న
వివహామ్యహం.
దత్తాం వహస్వ తస్మాత్వం పిత్రా రాజన్ వృతో
మయా
అయాచతో భయం నాస్తి దత్తాం చ ప్రతిగృహ్ణతః.
తిష్ఠ రాజన్ ముహూర్తం తు ప్రేషయిష్యామ్యహం
పితుః
గచ్ఛ త్వం ధాత్రికే శీఘ్రం బ్రహ్మకల్పమిహానయ
స్వయంవరే వృతం శీఘ్రం నివేదయ చ నాహుషం.
త్వరితం దేవయాన్యాథ సందిష్టం పితురాత్మనః
సర్వం నివేదయామాస ధాత్రీ తస్మై యథాతథం
శ్రుత్వైవచ స రాజానం దర్శయామాస భార్గవః
దృష్ట్వైవ చాగతం శుక్రం యయాతిః పృథివీపతిః
వవందే బ్రాహ్మణం కావ్యం ప్రాంజలిఃప్రణతఃస్థితః.

నేను మా దేశానికి మహారాజును— అన విని దేవయాని— మహారాజా ! మీ రేవసిమీద వచ్చారు. వేటకోసం వచ్చారా ? నిర్మలోదకాల కోసమా ? సుందర పద్మాలకోసమా— అని ఉత్కంఠతో ప్రశ్నించింది.

వేటకువచ్చి అలసి దాహంతో యిలావచ్చాను. అనుమతిస్తే దప్పి తీర్చుకు వెడతాను— అనే యయాతిని చూస్తూ— ప్రభూ ! శర్మిష్ఠతో సహా ఈసేవికలందరితోనూ నేను మీ సేవకు అంకిత మవుతున్నాను. నన్ను పత్నిగానూ సఖిగానూ స్వీకరించి శ్రేయస్సులు పొందండి— అన్నది దేవయాని.

ఆచార్యశుక్రుల అనుంగుపుత్రీ ! నీకు శుభమగు గాక. నీకు తగిన వరుణ్ణి కాను. రాజులబిడ్డను మీతండ్రి పరిగ్రహించడు— అని యయాతి జవాబిచ్చాడు.

నహుషనందనా ! బ్రహ్మ క్షత్రియ జాతులు రెండూ కలిసి మెలిసి ఉంటున్నాయి. అందులోనూ మీరు రాజర్షి పుత్రులు కనక ఏ అభ్యంతరం చెప్పక నన్ను స్వీకరించండి— అని దేవయాని అర్థించగా దేవయానీ ! సర్వలోకేశ్వరుని శరీరంనుండి నాలుగు జాతులూ ఆవిర్భవించినా వీరందరి ఆచార వ్యవహారాలలోనూ ఎంతో వ్యత్యాసం ఉంది. ఇందరిలోను శ్రేష్ఠుడు బ్రాహ్మణుడే— అని ప్రతిసమాధానం యిచ్చాడు యయాతి.

మహాత్మా ! స్త్రీకి పాణిగ్రహణం పరమధర్మం. అది ఇదివరకే జరిగిపోయింది. ఇంతవరకూ ఈ దక్షిణ పాణిని స్పృశించినవారు లేరు. రాజర్షి పాణిగ్రహణం చేశాక నేను మరొకరిని ఎలా వరిస్తాను— అని దేవయాని పూర్వగాథ కదలించింది.

దేవయానీ ! క్రోధంతో నిలచిన విప్రుడు తీవ్ర విషం కల పాముకంటె ప్రజ్వలిత వహ్నికంటె ప్రమాదకరుడు - అని యయాతి తన భయహేతువు వివరించగా అలా ఎందుకనుకోవలసి వచ్చిందో చెప్పమని కోరింది దేవయాని. సర్వశస్త్రాలవల్ల ఒకేవ్యక్తి మరణిస్తాడు కానీ బ్రాహ్మణక్రోధం నగరాన్నే కాదు రాష్ట్రాన్నే భస్మం చెయ్యగలదు. కనకనే శుక్రాచార్యుని అనుమతితో కానీ ఆమెను స్వీకరించలేనన్నాడు. అందుకు దేవయాని సమ్మతించి తన తండ్రిని తీసికొని రమ్మని దాసిని పంపింది. వచ్చిన శుక్రాచార్యునికి అభివాదం చేశాడు యయాతి.

తనవైపుతదేకంగా చూసే తండ్రితో సర్వమూ చెప్పి నహుషనందనుడైన యయాతికి తన నిచ్చి పెండ్లిచేయమని దేవయాని కోరగా శుక్రాచార్యుడు యయాతికి తన కన్యాపాణిగ్రహణం చేయుమని ఆజ్ఞ ఇచ్చాడు. అది విని యయాతి ఈ పాణిగ్రహణ కారణంగా వర్ణసాంకర్యం ఏర్పడుతుందనీ ఆ అధర్మం తనను బాధించరాదనీ కోరగా శుక్రాచార్యుడు తత్పాపఫలం యయాతిని చెందదని వరమిచ్చి శర్మిష్ఠతో సహా ఈ సేవికాజనం దేవయాని వెంట వస్తారనీ శర్మిష్ఠను గౌరవాదరాలతో సమ్మానించాలనీ చెప్పి శయనవిషయంలో మాత్రం శర్మిష్ఠతో సంబంధంలేకుండా మిగిలిన విషయాలలో దేవయానివలెనే ఆమెను చూస్తూ జీవితం సాగించమన్నాడు. శుక్రాచార్యునికి ప్రదక్షిణించి యయాతి విధ్యుక్తంగా దేవయానిని పెండ్లాడి శుక్రాచార్యుని మర్యాదలూ నిఖిలదైత్యుల సమ్మానాలూ స్వీకరించి సంతోషంతో రాజధానికి తరలినాడు.

రాజాయం నాహుషస్తాత దుర్గమే పాణిమగ్రహీత్.
నమ స్తే దేహి మామస్మిఁల్లోకే నాన్యం పతింవృణే
వృతోఽనయా పతిర్వీర సుతయా త్వం మమేష్టయా
గృహాణేమాం మయా దత్తాం మహిషీం
నహుషాత్మజ.
అధర్మో న స్పృశేదేష మహాన్ మామిహ భార్గవ
వర్ణ సంకరజో బ్రహ్మన్నితి త్వాం ప్రవృణోమహం.
అధర్మాత్త్వాం విముంచామి వృణు త్వం
వరమీప్సితం
అస్మిన్ వివాహే మా మ్లాసీరహం పాపం
నుదామి తే.
వహస్వభార్యాంధర్మేణ దేవయానీంసుమధ్యమాం
అనయా సహ సంప్రీతిమతులాం సమవాప్నుహి.
ఇయం చాపి కుమారీ తే శర్మిష్ఠా వార్ష పర్వణీ
సంపూజ్యా సతతం రాజన్ మా చైనాం శయనే
హ్వాయేః.
రహస్యేనాం సమాహూయ న వదేర్న చసంస్పృశేః
మహస్వభార్యాంభద్రం తేయథాకామమవాప్స్యసి.
ఏవముక్త యయాతిస్తు శుక్రం కృత్వా ప్రదక్షిణం
శాస్త్రోక్తవిధినా రాజా వివాహమకరోచ్ఛుభం.
లబ్ధ్వాశుక్రాన్మహద్విత్తందేవయానీంతదోత్తమాం
ద్విసహస్రేణ కన్యానాం తథా శర్మిష్ఠయా సహ.
సంపూజితశ్చ శుక్రేణ దైత్యైశ్చ నృపసత్తమః
జగామస్వపురంహృష్టోఽనుజ్ఞాతోఽథ మహాత్మనా.
యయాతిః స్వపురం ప్రాప్య మహేంద్రపురసన్నిభం
ప్రవిశ్యాంతఃపురం తత్ర దేవయానీం న్యవేశయత్
దేవయాన్యాశ్చానుమతేసుతాం తాం వృషపర్వణః
అశోకవనికాభ్యాశే గృహంకృత్వా న్యవేశయత్.
వృతాం దాసీ సహస్రేణ శర్మిష్ఠాం వార్షపర్వణీం
వాసోభిరన్నపానైశ్చ సంవిభజ్య సుసత్కృతాం.

అశోకవనికామధ్యే దేవయానీ సమాగతా
శర్మిష్ఠయా సా క్రీడిత్వా రమణీయే మనోరమే.
యత్రైవతాంతుసిద్దిశ్య రాజ్ఞాసహాయయాగృహం
ఏవ మేవ సహ ప్రీత్యా ముముదే బహూకాలతః.
దేవయాన్యా తు సహితః స నృపో నహుషాత్మజః
విజహార బహూనబ్దాన్ దేవవన్ముదితః సుఖీ.
ఋతుకాలే తు సంప్రాప్తే దేవయానీ వరాంగనా
లేభే గర్భం ప్రథమతః కుమారం చ వ్యజాయత.
గతే వర్ష సహస్రే తు శర్మిష్ఠా వార్ష పర్వణీ
దదర్శ యౌవనం ప్రాప్తాఋతుంసా
చాన్వచింతయత్.
శుద్ధా స్నాతా తు శర్మిష్ఠా సర్వాలంకార భూషితా
అశోకశాఖామాలంబ్య సుపుల్లైః స్తబకైర్వృతాం.
ఆదర్శే ముఖముద్వీక్ష్య భర్తృదర్శనలాలసా
శోకమోహసమావిష్టా వచనం చేదమబ్రవీత్.
అశోక శోకాపనుద శోకోపహత చేతనాం
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియసందర్శనాద్ధిమాం.
ఏవముక్తవతీ సాతు శర్మిష్ఠా పునరబ్రవీత్
ఋతుకాలశ్చ సంప్రాప్తో న చ మేఽస్తి పతిర్వృతః
కిం ప్రాప్తం కిం ను కర్తవ్యం కిం వా కృత్వా
కృతంభవేత్.
దేవయానీ ప్రజాతాసావృథాహం ప్రాప్తయౌవనా
యథా తయా వృతో భర్తా తథైవాహం
వృణోమితం.
రాజ్ఞా పుత్రఫలం దేయమితి మే నిశ్చితా మతిః
అపీదానీం స ధర్మాత్మా ఇయాన్మే దర్శనం రహః.
అథ నిష్క్రమ్య రాజసౌ తస్మిన్ కాలే
యదృచ్ఛయా
అశోకవనికాభ్యాసే శర్మిష్ఠాం ప్రేక్ష్య విష్ఠితం..
తమేకం రహితే దృష్ట్వా శర్మిష్ఠా చారుహాసినీ

## ఎనుబది రెండవ అధ్యాయము

మహేంద్రనగరంలా ఉన్న రాజధానికి దేవయానితో వచ్చి రమ్యహర్మ్యాంతఃపురంలో ఆమెను ఉంచి ఆమె ఆదేశానుసారం అశోకవనంలో శర్మిష్ఠకు సౌధం కట్టించి, అప్పుడప్పుడు దేవయానితో వచ్చి ఆ వనవిహారం చేస్తూ కొన్ని శరత్తులు గడిపాడు యయాతి. ఆ ప్రకారంగా సాంసారికజీవితం సాగిస్తూండగా ఋతుకాలం ప్రాప్తించగానే యయాతివల్ల దేవయాని గర్భవతియై కుమారుని కన్నది.

దశశతివర్షాల అనంతరం ప్రాప్తయౌవనయైన శర్మిష్ఠ తనస్థితి తలచుకొని విచారించసాగింది. ఋతుస్నాతయై సుందర సుమభూషణ వస్త్రాలంకృతయై వికసితపుష్ప గుచ్ఛాలతో అలరారే అశోక వృక్షచ్ఛాయలో నిలిచి స్త్రీజన సహజమైన పత్నీభావం బాధిస్తూండగా అన్నివిధాలయిన శోకాలనూ పోద్రోలే ఆ అశోకాన్ని తన బాధ నివారించమని కోరుతూ— నే నిప్పుడు యౌవనంలో ఉన్నాను. నావలె ఉండే దేవయాని మాతృత్వ గౌరవం పొందింది. నా యౌవనపుష్పం యిలా వాడి పోవలసిందేనా! దేవయానివలెనే నేనుకూడా ఆయననే భర్తగా ఎందుకు వరించకూడదు. నే నా మహారాజును యాచిస్తే తప్పకుండా అనుగ్రహించి పుత్రుణ్ణిస్తాడు. అయితే ఆయనను ఏకాంతంగా కలిసికొనే సాధనమేమిటి? అని కేల కపోల మూని చింతామగ్నయై ఉండగా ఆమె పుణ్య ఫలంలా యయాతి మహారాజు అశోకవన దర్శనార్థం అటురానే వచ్చాడు.

వచ్చిన యయాతి శర్మిష్ఠను చూస్తూ నిలిచి పోయాడు. ఏకాంతంగా వచ్చే యయాతిని చూసిన శర్మిష్ఠ కను లుత్ఫుల్లము లైనవి. అదృష్టదేవతను అభినందిస్తూ చేతులు జోడించి మహారాజుకి స్వాగతం పలుకుతూ ఎదురేగి— మహారాజా! ఈ సౌధంలోని స్త్రీ లెవరికీ ఏ పురుషునివైపూ కన్నెత్తి చూచే ఆస్కారంకూడా లేదు కనకనే నేను సురక్షితంగా ఉన్నాను. నీలగళోపమాన కమనీయ గుణశీలా! నా వయోరూపకులశీలాలు నీకు తెలియనివికావు. వాని ప్రస్తావన అవసరం లేదు. ఇప్పుడు నేను నిన్నొకవరం యాచిస్తున్నాను. అనుగ్రహించండి. ఋతుస్నాతయై ఉన్న నన్ను అనుగ్రహించి దాన్ని ఫలవంతం చెయ్యండి-అని అర్థించగా యయాతి పలుకుతున్నాడు.

అనిందితచరిత్రవుగా నిన్ను నే నెరుగుదును. అయితే నేను దేవయానీపాణిగ్రహణసమయంలో శుక్రాచార్యులవారి ఆదేశానుసారం నీతో శయన విషయం పరిహరిస్తానని వాగ్దానం చేశాను గదా— అనగా శర్మిష్ఠ— రాజా! పరిహాసానికి పలికే మాటలకూ వారిజాక్షులందూ వైవాహికములందూ ప్రాణవిత్త మానభంగమందూ అసత్యమాడినా దోషం లేదని విజ్ఞులంటారు. ఇప్పుడొక నిర్దోష ప్రాణిరక్షణార్థం నువ్వు అసత్యమాడినా ప్రమాదం లేదు. స్వ పర ప్రాణ హాని సమయంలో అసత్యమాడితే అది పరమప్రమాదకరం— అని శాస్త్ర మర్యాద వివరించింది.

నువ్వు చెప్పే మాటలు ఎలా ఉన్నా 'యథా రాజా తథా ప్రజా' అని నువ్వెరుగుదువు కదా.

ప్రత్యుద్గమ్యాంజలిం కృత్వా రాజానం వాక్య
మబ్రవీత్.
సోమస్యేంద్రస్య విష్ణోర్వా యమస్య వరుణస్య చ
తవ వానాహుష గృహేకః స్త్రియం ద్రష్టుమర్హతి.
రూపాభిజనశీలైర్హి త్వం రాజన్ వేత్థ మాం సదా
సా త్వాం యాచే ప్రసాద్యాహమృతుం దేహి
నరాధిప.
వేద్మి త్వాంశీలసంపన్నాం దైత్యకన్యామ నిందితాం
రూపం చ తేవ పశ్యామి సూచ్యగ్రమపి నిందితం.
అబ్రవీదుశనా కావ్యో దేవయానీం యదావహం
నేయమహ్వాయితవ్యా తే శయనే వార్షపర్వణి.
ననర్మయుక్తం వచనం హినస్తి
నస్త్రీషు రాజన్ నవివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారే
పంచానృతాన్యాహురపాతకాని.
పృష్టం తు సాక్ష్యే ప్రవదంతమన్యథా
వదంతి మిథ్యా పతితం నరేంద్ర
ఏకార్థతాయాం తు సమాహితాయాం
మిథ్యావదంతం త్వనృతం హినస్తి.
రాజా ప్రమాణం భూతానాం స నశ్యేత మృషా
వదన్
అర్థకృచ్ఛ్రమపి ప్రాప్య న మిథ్యా కర్తుముత్సహే.
సమావేతౌ మతౌ రాజన్ పతిః సఖ్యాశ్చ యః పతిః
సమంవివాహమిత్యాహుః సఖ్యామేऽసివృతః పతిః.
సహ దత్తాస్మి కావ్యేన దేవయాన్యామహర్షిణా
పూజ్యా పోషయితవ్యేతి న మృషా కర్తుమర్హసి.
సువర్ణమణిరత్నాని వస్త్రాణ్యాభరణాని చ
యాచితౄణాం దదాసి త్వం గోభూమ్యాదీవి
యానిచ.
వాహికం దానమిత్యుక్తం న శరీరాశ్రితం నృప
దుష్కరం పుత్రదానం చ ఆత్మదానం చ దుష్కరం.
శరీరదానాత్ తత్సర్వం దత్తం భవతి నాహుష
యస్య యస్య యథాకామస్తస్యతస్య దదామ్యహం
ఇత్యుక్త్వా నగరే రాజంస్త్రికాలం ఘోషితం
త్వయా.
అమృతః తత్తు రాజేంద్ర వృథా ఘోషితమేవ చ
తత్సత్యం కురు రాజేంద్ర యథా వైశ్రవణస్తథా.
దాతవ్యం యాచమానేభ్య ఇతి మే వ్రతమాహితం
త్వం చ యాచసి మాం కామం బ్రూహి కిం
కరవాణి తే.
అధర్మాత్ పాహి మాం రాజన్ ధర్మం చ
ప్రతిపాదయ
త్వత్తోऽపత్యవతీ లోకే చరేయం ధర్మముత్తమం.
త్రయ ఏవాధనా రాజన్ భార్యా దాసస్తథాసుతః
యత్తే సమధిగచ్ఛంతి యస్యైతే తస్య తద్ధనం
దేవయాన్యా భుజిష్యాస్మి వశ్యా చ తవ భార్గవీ
సా చాహం చ త్వయా రాజన్ భజనీయే
భజస్వమాం.
ఏవముక్తస్తు రాజా స తథ్యమిత్యభిజజ్ఞివాన్
పూజయామాసశర్మిష్ఠాంధర్మంచప్రత్యపాదయత్.
స సమాగమ్య శర్మిష్ఠాం యథాకామమవాప్య చ
అన్యోన్యం చాభిసంపూజ్య జగ్మతుస్తౌయథాగతం.
తస్మిన్ సమాగమే సుభ్రూః శర్మిష్ఠాచారుహాసినీ
లేభే గర్భం ప్రథమతస్తస్మాన్నృపతిసత్తమాత్.
ప్రజజ్ఞే చ తతః కాలే రాజన్ రాజీవలోచనా
కుమారందేవగర్భాభం రాజీవనిభలోచనం.

82 వ అధ్యాయం సమాప్తం.



అందువల్ల ఆదర్శంగా ఉండవలసిన మహారాజే అసత్యభాషణం ఆరంభిస్తే అతడు నశించిపోతాడు. కనక నేను అసత్యదోషాన్ని ఆహ్వానించలేను— అని యయాతి ప్రతిసమాధానమిచ్చాడు.

అయితే మహారాజా ! నువ్వు దేవయానిని భార్యగా స్వీకరించిననాడే మాకు పతివయావు. సఖి యొక్క భర్త నాకుకూడా భర్త అవడంలో దోషంలేదు. భార్యయొక్క సఖీజనానికి భర్తృత్వం వహించడానికి సంకోచం అవసరంలేదు. నేను నీ భార్యనే— అని శర్మిష్ఠ ఎదురు చెప్పి— శుక్రాచార్యులు దేవయానితో నన్ను పంపుతూ నా రక్షణపోషణలన్నీ జాగ్రత్తగా సాగించమని చెప్పిన విషయం మీరు మరిచిపోకండి. పైగా అనుదినం మీరు విప్రశ్రేష్ఠులకు గోదానాలూ భూదానాలు హిరణ్యదానాలూ రత్నభూషణ వస్త్రదానాలూ చేస్తున్నారు. అవన్నీ బాహ్యదానాలే కదా ! దేహాశ్రితమైన పుత్రదానం అన్నిటికంటె శ్రేష్ఠమైనది. అదీకాక ఈ పృథ్విలో ఎవరు ఏది కోరినా దాన్ని నెరవేరుస్తాను— అని మీరు దండోరా వేయించారు. ఇప్పుడు నా కోరిక నిరాకరిస్తే ఆ అసత్యదోషం మిమ్మల్ని వదలదు— అను శర్మిష్ఠ మాటలకు అలరి యయాతి ఆమె మనోభీష్టం చెప్పమన్నాడు.

మహారాజా ! నన్ను ధర్మమార్గాన పుత్రవతిని చెయ్యండి. ప్రభూ ! భార్యా, సేవికా, పుత్రుడూ అర్థాధికారులు కారు. అర్థరహితులకు ధర్మకార్యావకాశం లేదు. భార్యాధనం భర్త అధీనంలో ఉంటుంది. అలానే సేవక ధనానికి ప్రభువూ పుత్రధనానికి తండ్రీ అధికారులు. దేవయాని మా స్వామిని. ఆమె మీ ధర్మపత్ని. అందుచేత ఆమెవలెనే నేనుకూడా మిమ్మల్ని సేవించాలి— అని శర్మిష్ఠ మధురమధురంగా పలకగా యయాతి ఆమె మాటలు నిజమని నమ్మి భార్యగా పరిగ్రహించి ఆమెను సంతృప్తిపరచి యథేచ్ఛగా నిజ సదనానికి వచ్చాడు.

సంతోషతరంగిత స్వాంతమైన శర్మిష్ఠ ప్రథమ సమాగంలోనే గర్భం ధరించి క్రమానుసారం ఒక సుముహూర్తాన దేవబాలక సదృశుడైన కుమారుని ప్రసవించింది.

82వ అధ్యాయము సమాప్తం

## ఎనుబది మూడవ అధ్యాయము

### శర్మిష్ఠ

శర్మిష్ఠ పుత్రవతియైన వార్త దేవయాని విని కొద్దిగా దుఃఖించి కామదృష్టితో పాపకార్యం ఆచరించినందుకు ఆమెను మందలించగా శర్మిష్ఠ— వేదవేదాంగపారంగతుడైన ధర్మపురుషుని యాచించి పుత్రవతి నయ్యానేకాని ధర్మవిరుద్ధంగా నేను చరించలేను. ఆఋషి అనుగ్రహంవల్ల నాకు సంతానం కలిగింది— అనగా దేవయాని— అదే నిజమైతే ఆ బ్రహ్మవిదుని కులగోత్రాలు ఏమిటి ? అని ప్రశ్నించింది.

# ఎనుబదిమూడవ అధ్యాయం

శ్రుత్వా కుమారం జాతంతు దేవయానీ శుచిస్మితా
చింతయామాస దుఃఖార్తా శర్మిష్ఠాంప్రతిభారత.
అభిగమ్య చ శర్మిష్ఠాం దేవయాన్యబ్రవీదిదం
కిమిదం వృజినం సుభ్రు కృతం వై కామలుబ్ధయా.
ఋషిరభ్యాగతః కశ్చిద్ధర్మాత్మా వేదపారగః
స మయా వరదః కామం యాచితో ధర్మసంహితం.
నాహమన్యాయతః కామమాచరామి శుచిస్మితే
తస్మాదృషేర్మమాపత్యమితి సత్యం బ్రవీమి తే.
శోభనం భీరు యద్యేవమథ స జ్ఞాయతే ద్విజః
గోత్రనామాభిజనతో వేత్తుమిచ్ఛామి తం ద్విజం.
తపసా తేజసా చైవ దీప్యమానం యథా రవిం
తం దృష్ట్వామమ సంప్రష్టుం శక్తిర్నాసీచ్ఛుచిస్మితే.
యద్యేత దేవం శర్మిష్ఠే న మన్యుర్విద్యతే మమ
అపత్యంయదితేలబ్ధంజ్యేష్ఠాచ్ఛ్రేష్ఠాచ్చవై ద్విజాత్.
అన్యోన్యమేవముక్త్వా తు సంప్రహస్య చ తే మిథః
జగామ భార్గవీ వేశ్మ తథ్యమిత్యవజగ్ముషీ.
యయాతిర్దేవయాన్యాం తు పుత్రావజనయన్నృపః
యదుం చ తుర్వసుం చైవ శక్రవిష్ణూ ఇవాపరౌ.
తస్మాదేవ తు రాజర్షేః శర్మిష్ఠా వార్ష పర్వణీ
ద్రుహ్యుం చానుం చ పూరుం చ త్రీన్
కుమారానజీజనత్.

తతః కాలే తు కస్మింశ్చిద్దేవయానీ శుచిస్మితా
యయాతి సహితా రాజం జగామ రహితం వనం
దదర్శ చ తదా తత్ర కుమారాన్ దేవరూపిణః
క్రీడమానాన్ సువిశ్రబ్ధాన్ విస్మితా చేదమబ్రవీత్.
కస్యైతే దారకా రాజన్ దేవపుత్రోపమాః శుభాః
వర్చసా రూపతశ్చైవ సదృశా మే మతాస్తవ.
ఏవం పృష్ట్వా తు రాజానం కుమారాన్
పర్యపృచ్ఛత

కిం నామధేయం వంశో వః పుత్రకాః కశ్చ వః
పితా
ప్రబ్రూత మే యథాతథ్యం శ్రోతుమిచ్ఛామి తం
హ్యహం.
ఏవముక్తాఃకుమారాస్తే దేవయాన్యా సుమధ్యయా
తేఽదర్శయన్ ప్రదేశిన్యా తమేవ నృపసత్తమం
శర్మిష్ఠాం మాతరం చైవ తథాఽఽచఖ్యుశ్చ
దారకాః.
ఇత్యుక్త్వా సహితాస్తే తు రాజానముపచక్రముః
నాభ్యనందత తాన్ రాజా దేవయాన్యాస్తదాంతికే
రుదంతస్తేఽథ శర్మిష్ఠామభ్యయుర్బాలకాస్తతః
శ్రుత్వాతు తేషాం బాలానాం సవ్రీడ ఇవ పార్థివః.
దృష్ట్వాతు తేషాంబాలానాంప్రణయం పార్థివం ప్రతి
బుద్ధ్వా చ తత్త్వం సా దేవీ శర్మిష్ఠామిదమబ్రవీత్.
అభ్యాగచ్ఛతి మాం కశ్చిదృషిరిత్యేవమబ్రవీః
యయాతిమేవ నూనం త్వం ప్రోత్సాహయసి
భామిని.

పూర్వమేవమయాప్రోక్తంత్వయాతు వృజినంకృతం
మదధీనా సతీ కస్మాదకార్షీర్విప్రియం మమ
తమేవాసురధర్మం త్వమాస్థితా న బిభేషి మే.
యదుక్తమృషిరిత్యేవ తత్సత్యం చారుహాసిని
న్యాయతో ధర్మతశ్చైవ చరంతీ న బిభేమి తే.
యదా త్వయావృతో భర్తా వృతఏవతదా మయా
సఖీభర్తా హి ధర్మేణ భర్తా భవతి శోభనే.
పూజ్యాసి మమ మాన్యాచజ్యేష్ఠాచబ్రాహ్మణీహ్యసి
త్వత్తోఽపిమేపూజ్యతమోరాజర్షిః కిం నవేత్థతత్.
త్వత్పితా గురుణా మే చ సహ దత్తే ఉభే శుభే
తవభర్తాచపూజ్యశ్చపోష్యాం పోషయతీహమాం.
శ్రుత్వా తస్యాస్తతో వాక్యం దేవయాన్యబ్రవీదిదం

తాను ఆ మహర్షి దివ్యతేజస్సందర్శన సమయంలో ఈ విషయా లడగటం మరిచిపోయానని శర్మిష్ఠ పలకగా దేవయాని చింతారహితయై ఇంటికి పోయింది.

కాలక్రమాన దేవయాని మరియొక కుమారుని కన్నది. శర్మిష్ఠ యిరువురిని కన్నది. యదు తుర్వసులు దేవయాని ప్రియనందనులు. ద్రుహ్యుడు అనువు పూరుడు శర్మిష్ఠ తనయులు. ఆ బాలురందరూ పెద్దవాళ్ళౌతున్నారు. ఒకనాడు దేవయాని యయాతితో అశోకవనంలో విహరిస్తూ దివ్యసుందరాకారులైన బాలకులు క్రీడిస్తూండడం చూసి యయాతివైపు తిరిగి ఆశ్చర్యంతో— మహారాజా! ఆకారరేఖలలో అన్నివిధాలా నిమ్మల్నే పోలిఉన్న ఈ బాలకు లెవరు? అని ఆయన సమాధానంతో నిమిత్తం లేకుండా పిల్లలను చేరి వారి కులగోత్రనామధేయాలు ప్రశ్నించి వారి తండ్రిని గూర్చి గ్రుచ్చి గ్రుచ్చి అడిగింది. వారు తల్లి శర్మిష్ఠ అనీ తండ్రి యయాతి అనీ చెబుతూ మహారాజును సమీపించారు. యయాతి వారిని అనుగ్రహించనూలేదు, ఆగ్రహించనూలేదు. నిర్లిప్తంగా ఉండిపోయాడు. పిల్లలు దీనవదనాలతో తల్లిని చేరారు. యయాతి మ్లానవదనం దేవయానికి జరిగిన కథను తెలిపింది. ఆమె శర్మిష్ఠవైపు చూస్తూ నువ్వు నా అధికారంకింద ఉండి నామనస్సుకి బాధ కలిగించే పనులే చేస్తున్నావు. నేను అడిగినప్పుడు ఎవడో ఋషి అనుగ్రహించాడన్నావు. నీరాక్షస ప్రవృత్తి మారటంలేదు. నామీద నీకు ఏవిధమైన గౌరవమూలేదు— అని తీవ్రంగా పలికింది.

దేవయానీ! నువ్వు అన్నమాట నిజమే. అయితే నేను ధర్మమార్గవిరుద్ధంగా నడవటంలేదని మాత్రం మరిచిపోకు. నువ్వు యయాతిని భర్తగా వరించిన క్షణంలోనే నేనూ ఆయనను పతిగా స్వీకరించాను. నా సఖివైన నువ్వు యయాతిని వరించినప్పుడు నేను కూడా ఆయనకు భార్యనే అవుతాను. నువ్వు మా అందరిలోకి పెద్దదానివి. పైగా బ్రాహ్మణ బాలికవు. కనక నిన్ను అనుసరించటం మాకు విధి. నీతండ్రిగారు నిన్నూ నన్నూ ఒకేసారి ఈ మహారాజుకి అర్పించారు. ఈచక్రవర్తి రక్షణపోషణలో నేనుంటూన్న విషయం నీకు తెలియనిదికాదు—అని శర్మిష్ఠ పలుకగా దేవయాని కన్నుల నీరు నిండింది. అంతకన్న తనకు అవమానం లేదని భావించి శుక్రాచార్యుని ఆశ్రమానికి బయలుదేరింది. భయహృదయంతో వెంబడించాడు, బ్రతిమాలాడు, చలించలేదు దేవయాని. ఆమె ధవళనేత్రాలలో అరుణరోచులు ప్రసరిస్తున్నాయి. తీవ్రవేగంతో తండ్రి ఆశ్రమానికి చేరింది. చేరి నమస్కరిస్తూ నిలబడింది. ఆమెను అనుసరించివచ్చిన యయాతి కూడా అభివాదం చేసి నిలిచాడు.

పితృదేవతా! ధర్మాన్ని అధర్మం జయించింది. ఉన్నతులమీద నీచులు విజయం సాధించారు. శర్మిష్ఠ ముగ్గురు కుమారులను కన్నది. ఈ యయాతి మహారాజు మీ ఆజ్ఞను త్రోసిరాజన్నాడు— అని దేవయాని తీవ్రస్వరంతో పలకగా శుక్రుడు కుపితుడై— యయాతీ! ధర్మపరుడవైన నువ్వు అధర్మానికి పాలుపడ్డావు కనక ఈ క్షణంలోనే నిన్ను వృద్ధాప్యం ఆవహించుగాక! అనగా యయాతి తనదోషం ఈషత్తూ లేదని ఋతుకాలోచితంగా ప్రవర్తించమని శర్మిష్ఠ కోరటంవల్లనే అలా చేయవలసివచ్చిందనీ, ఋతుదానాన్ని అర్థించినప్పుడు

రాజర్షే వాద్యేహ వక్ష్యామి విప్రియం మే కృతం త్వయా
సహసోత్పతితాం శ్యామాం దృష్ట్వా తాం సాశ్రులోచనాం
తూర్ణం సకాశం కావ్యస్య ప్రస్థితాం వ్యథిత స్తదా.
అనువవ్రాజ సంభ్రాంతః పృష్ఠతః సాంత్వయన్నృపః
న్యవర్తత న చైవ స్మ క్రోధసంరక్తలోచనా.
అవిబ్రువంతి కించిత్ సా రాజానం సాశ్రులోచనా
అచిరాదేవ సంప్రాప్తా కావ్యస్యోశనసోఽంతికం.
సా తు దృష్ట్వైవ పితరమభివాద్యాగ్రతః స్థితా
అనంతరం యయాతిస్తు పూజయామాస భార్గవం.
అధర్మేణ జితో ధర్మః ప్రవృత్తమధరోత్తరం
శర్మిష్ఠయాతివృత్తాస్మి దుహిత్రా వృషపర్వణః.
త్రయోఽస్యాం జనితాః పుత్రా రాజ్ఞానేన యయాతినా
దుర్భగాయా మమ ద్వౌతు పుత్రౌ తాత బ్రవీమి తే.
ధర్మజ్ఞ ఇతి విఖ్యాత ఏష రాజా భృగూద్వహ
అతిక్రాంతశ్చ మర్యాదాం కావ్యైతత్ కథయామి తే
ధర్మజ్ఞః సన్ మహారాజ యోఽధర్మమకృథాః ప్రియం
తస్మాజ్జరా త్వామచిరాద్ధర్షయిష్యతి దుర్జయా.
ఋతుం వై యాచమానాయా భగవన్ నాన్యచేతసా
దుహితుర్దానవేంద్రస్య ధర్మ్యమేతత్ కృతం మయా.
ఋతుం వై యాచమానాయా న దదాతి పుమానృతుం
భ్రూణహేత్యుచ్యతే బ్రహ్మన్ స ఇహ బ్రహ్మవాదిభిః.
అభిగామాం స్త్రియం యశ్చ గమ్యాం రహసి యాచితః
నోపైతి స చ ధర్మేషు భ్రూణహేత్యుచ్యతే బుధైః.
యద్యద్యాచతి మాం కశ్చిత్ తత్తద్దేయమితి వ్రతం
త్వయా చ సాపి దత్తా మే నాన్యం నాథమిహేచ్ఛతి.
మత్వైతన్మే ధర్మ ఇతి కృతం బ్రహ్మన్ క్షమస్వ మాం
ఇత్యేతాని సమీక్ష్యాహం కారణాని భృగూద్వహ
అధర్మభయసంవిగ్నః శర్మిష్ఠాముపజగ్మివాన్
నన్వహం ప్రత్యవేక్ష్యస్తే మదధీనోఽసి పార్థివ
మిథ్యాచారస్య ధర్మేషు చౌర్యం భవతి నాహుష.
క్రుద్ధేనోశనసా శప్తో యయాతిర్నాహుష స్తదా
పూర్వం వయః పరిత్యజ్య జరాం సద్యోఽన్వపద్యత.
అతృప్తో యౌవనస్యాహం దేవయాన్యాం భృగూద్వహ
ప్రసాదం కురు మే బ్రహ్మన్ జరేయం న విశేచ్చ మాం.
నాహం మృషా బ్రవీమ్యేతజ్జరాం ప్రాప్తోఽసి భూమిప
జరాం త్వేతాం త్వమన్యస్మిన్ సంక్రామయ యదీచ్ఛసి
రాజ్యభాక్ స భవేద్బ్రహ్మన్ పుణ్యభాక్ కీర్తిభాక్ తథా
యో మే దద్యాద్వయః పుత్ర స్తద్భవాననుమన్యతాం
సంక్రామయిష్యామి జరాం యథేష్టం నహుషాత్మజ
మామనుధ్యాయ భావేన న చ పాపమవాప్స్యసి.
వయో దాస్యతి తే పుత్రో యః స రాజా భవిష్యతి
ఆయుష్మాన్ కీర్తిమాంశ్చైవ బహ్వపత్య స్తథైవ చ.
జరాం ప్రాప్య యయాతిస్తు స్వపురం ప్రాప్య చైవ హి
పుత్రం జ్యేష్ఠం వరిష్ఠం చ యదుమిత్యబ్రవీద్వచః.
జరా వలీ చ మాం తాత పలితాని చ పర్యగుః
కావ్యస్యోశనసః శాపాన్న చ తృప్తోఽస్మి యౌవనే.
త్వం యదో ప్రతిపద్యస్వ పాప్మానం జరయా సహ
యౌవనేన త్వదీయేన చరేయం విషయానహం.
పూర్ణే వర్ష సహస్రే తు పునస్తే యౌవనం త్వహం
దత్త్వా స్వం ప్రతిపత్స్యామి పాప్మానం జరయా సహ.
జరాయాం బహవో దోషాః పానభోజనకారితాః
తస్మాజ్జరాం న తే రాజన్ గ్రహీష్యే ఇతి మే మతిః.
సితశ్మశ్రుశిరా దీనో జరయా శిథిలీకృతః
వలీసంగతగాత్రస్తు దుర్దర్శో దుర్బలః కృశః.

అంగీకరించకపోతే భ్రూణహత్యాదోషం పీడిస్తుందని విద్వాంసు లనటంవల్ల ఏకాంతంలో అర్థించిన శర్మిష్ఠ యోగ్యురాలనే భావంతో అంగీకరించాననీ అదీకాక తన నియమానుసారం ఎవరు ఏది అడిగినా ఇచ్చి తీరాలనీ ఇన్నిటికీ తోడు ఆచార్యశుక్రులు అర్పించినందువల్ల శర్మిష్ఠ తననే భర్తగా భావించటంవల్ల తాను చేసింది అధర్మం కాకూడదనీ క్షమార్హమై అర్థించాడు.

అలానే జరిగినట్లయితే తన ఆదేశం అందేవరకూ ఆగి ఉండవలసిందనీ అలా కాకుండా చెయ్యడం వల్ల దోషి కాక తప్పదనీ, తన శాపం అనుభవించి తీరాలనీ— శుక్రాచార్యు డంటూన్న క్షణంలోనే యయాతిని వార్ధక్యం ఆవహించింది.

మహర్షీ ! నాయౌవనకాలంలో నేను దేవయానితో సంపూర్ణమైన అనుభూతిని పొందలేక పోయాను. నాకు ఆమెమీద అభిలాష ఇంకా తగ్గలేదు. అనుగ్రహించి శాపాన్ని ఉపసంహరించండి— అని ప్రార్థించే యయాతిమీద శుక్రాచార్యులకు దయ కలిగి— నామాటకు తిరుగు లేదు. అయినా ఏ యువకుడైనా అనుగ్రహించి నీ వార్ధక్యం స్వీకరిస్తే వాని యౌవనం నీవు పొందగలవు— అని ఉపాయం చెప్పాడు. అప్పుడు యయాతి తనవృద్ధాప్యం స్వీకరించే కుమారుడే తనసంపదల కన్నిటికి అధికారి కావాలని కోరగా శుక్రాచార్యులు సమ్మతించి ఆ కుమారుడు దీర్ఘాయువై కీర్తిశాలి అవుతాడని ఆశీర్వదించాడు.

83వ అధ్యాయము సమాప్తం

## ఎనుబది నాల్గవ అధ్యాయము

రాజధానికి వచ్చిన యయాతి తనపెద్దకొడుకుని పిలిచి—నాయనా! శుక్రాచార్యుల శాపంవల్ల నన్ను వృద్ధాప్యం పీడిస్తోంది. యౌవనభోగాలతో తృప్తి పడని నాకు నీ యౌవనం యిస్తే నేను తిరిగి ఆభోగాలనుభవిస్తాను. వెయ్యి సంవత్సరాల అనంతరం నా వార్ధక్యం నేను గ్రహిస్తాను— అని చెప్పగా యదువు— వార్ధక్యంవల్ల జీవితానికి ఏవిధమైన సంతోషం లేకపోగా ఎన్నో అవస్థలుకూడా పడవలసి వస్తుంది. ప్రపంచం అంతా వృద్ధుల్ని అసహ్యంగా చూస్తారు. యువతులూ సేవకులూ తిరస్కారం ప్రదర్శిస్తారు. మీరు నాకన్న అధికంగా ప్రేమించే మిగిలిన కుమారు లెవర్నైనా అడగండి— అన్నాడు.

నా కుమారుడవై కూడా నా ఆజ్ఞ ధిక్కరిస్తున్నావు. కనక నీ సంతానానికి రాజ్యాధికారం లేదు— అని యయాతి తుర్వసుని పిలిచి అదే విషయం చెప్పాడు. బలరూపాలను నశింపజేసి కామోపభోగాలకు యోగ్యంకాని ముసలితనాన్ని తుర్వసుడు కూడా నిరాకరించగా యయాతి కోపంతో— నీ సంతానం నశించిపోవుగాక! పచ్చిమాంసం తినే అనాగరక సంకరజాతులకే నువ్వు రాజు వవుతావు— అని శర్మిష్ఠ కుమారుడైన ద్రుహ్యుని పిలిచి తన కోరిక తెలిపాడు. ద్రుహ్యుడు వార్ధక్యం రాజభోగానుభూతియోగ్యం కాదు కనక స్వీకరించలేనన్నాడు. ఏనుగులూ గుర్రాలూ లాగే రథాలు

అశక్తః కార్యకరణే పరిభూతః స యౌవతైః
సహోపజీవిభిశ్చైవ తాం జరాం నాభికామయే.
సంతి తే బహవః పుత్రా మత్తః ప్రియతరా నృప
జరాం గ్రహీతుం ధర్మజ్ఞ తస్మాదన్యం వృణీష్వవై
యత్త్వం మే హృదయజ్జాతో వయః స్వం న
ప్రయచ్ఛసి
తస్మాదరాజ్యభాక్ తాత ప్రజా తవ భవిష్యతి.
తుర్వసో ప్రతిపద్యస్వ పాప్మానం జరయా సహ
యౌవనేన చరేయం వై విషయాంస్తవ పుత్రక.
పూర్ణేవర్ష సహస్రే తు పునర్దాశ్యామి యౌవనం
స్వం చైవ ప్రతిపత్స్యామి పాప్మానం జరయాసహ.
న కామయే జరాం తాత కామభోగ ప్రణాశినీం
బలరూపాంతకరణీంబుద్ధిప్రాణప్రణాశినీం,
యత్త్వం మే హృదయాజ్జాతో వయః స్వం న
ప్రయచ్ఛసి
తస్మాత్ప్రజా సముచ్ఛేదం తుర్వసో తవయాస్యతి.
సంకీర్ణాచారధర్మేషు ప్రతిలోమచరేషు చ
పిశితాశిషు చాంత్యేషు మూఢ రాజా భవిష్యసి.
గురుదారప్రసక్తేషు తిర్యగ్యోని గతేషు చ
పశుధర్మేషు పాపేషు మ్లేచ్ఛేషు త్వం భవిష్యసి.
ఏవం స తుర్వసుం శప్త్వా యయాతి సుతమాత్మనః
శర్మిష్ఠాయాః సుతం ద్రుహ్యుమిదం వచనమబ్రవీత్.
ద్రుహ్యో త్వం ప్రతిపద్యస్వ వర్ణరూపవినాశినీం
జరాం వర్ష సహస్రం మే యౌవనం స్వందదస్వ చ.
పూర్ణే వర్ష సహస్రే తు పునర్దాస్యామి యౌవనం
స్వం చాదాస్యామి భూయోఽహం పాప్మానం
జరయా సహ.
న గజం న రథం నాశ్వం జీర్ణో భుంక్తే న చ స్త్రియం
వాక్సంగశ్చాస్య భవతి తాం జరాం నాభికామయే.

యత్త్వం మే హృదయాజ్జాతో వయః స్వం న
ప్రయచ్ఛసి
తస్మాద్ద్రుహ్యో ప్రియః కామో న తే సంపత్స్యతే
క్వచిత్.
యత్రాశ్వరథముఖ్యానామశ్వానాం స్యాద్గతం న చ
హస్తినాం పీఠికానాం చ గర్దభానాం తథైవ చ.
బస్తానాం చ గవాం చైవ శిబికాయాస్తథైవ చ
ఉడుపప్లవసంతారో యత్ర నిత్యం భవిష్యతి
అరాజా భోజశబ్దం త్వం తత్ర ప్రాప్స్యసిసాంత్వయః.
అనో త్వం ప్రతిపద్యస్వ పాప్మానం జరయా సహ
ఏకం వర్ష సహస్రం తు చరేయం యౌవనేన తే.
జీర్ణః శిశువదాదత్తేఽకాలేఽన్నమశుచిర్యథా
నజుహోతిచ కాలేఽగ్నింతాంజరాంనాభికామయే.
యత్త్వం మే హృదయాజ్జాతో వయః స్వం న
ప్రయచ్ఛసి
జరాదోషస్త్వయాప్రోక్తస్తస్మాత్ త్వంప్రతిపత్స్యసే.
ప్రజాశ్చ యౌవనప్రాప్తా వినశిష్యంత్యనో తవ
అగ్నిప్రస్కందనపరస్త్వం చాప్యేవం భవిష్యసి.
పూరో త్వం మే ప్రియః పుత్రస్త్వం వరీయాన్
భవిష్యసి
జరా వలీ చ మాం తాత పలితాని చ పర్యగుః.
కావ్యస్యోశనసః శాపాన్న చ తృప్తోఽస్మి యౌవనే
పూరో త్వం ప్రతిపద్యస్వ పాప్మానం జరయా సహ
కంచిత్కాలం చరేయం వై విషయాన్
వయసా తవ.
పూర్ణే వర్ష సహస్రే తు పునర్దాస్యామి యౌవనం
స్వం చైవ ప్రతిపత్స్యామి పాప్మానం జరయా సహ.
ఏవముక్తః ప్రత్యువాచ పూరుః పితరమంజసా
యథాఽఽత్థ మాంమహారాజ తత్కరిష్యామి తే
వచః.

ప్రయాణంచేసే ప్రదేశాలమీద నీకు అధికారం లేకుండా చేస్తున్నాను. నువ్వూ నీ సంతానంతో జల ప్రదేశాలలో నావలమీద బ్రతుకు. అక్కడ నీ వంశీయులు భోజులు అనే పేరుతో వ్యవహరింప బడతారు— అని యయాతి అనువుకు పిలిచి కోరగా అతడూ తిరస్కరించాడు. దానికి యయాతి మరీ క్రోధంతో—నువ్వు నా వృద్ధాప్యం తీసికోకపోయినా నీ వృద్ధాప్యం నిన్ను వదలదు. నీసంతానం యావన వంతులు కాకుండానే మరణిస్తారు. వృద్ధుడవై నువ్వు అగ్నిహోత్రాలు కూడా చెయ్యలేకుండా పోతావు— అన్నాడు.

అనంతరం పూరుపును పిలిచి శుక్రాచార్యుని శాపంవల్ల ప్రాప్తమైన ఈ వార్ధక్యం స్వీకరించు మని కోరగా కనిష్ఠుడైనా గుణగరిష్ఠుడైనా పూరుడు సమ్మతించి శిరసావహించాడు. యయాతి శుక్రాచార్యులను ధ్యానించి తన వృద్ధాప్యం పూరుని కిచ్చి అతని యావనం పొంది—నాయనా! నీరాజ్యం లోని ప్రజలు సమస్త సుఖాలనూ పొంది సంతోషంగా జీవిస్తారు— అని ఆశీర్వదించాడు.

84వ అధ్యాయం సమాప్తం

## ఎనుబది ఐదవ అధ్యాయం

### పట్టాభిషేకం

కనిష్ఠపుత్రుని యావనంతో యయాతి సర్వ భోగాలనూ ధర్మమార్గాన సమయానుసారం అనుభ వించాడు. ఆకాలంలో యజ్ఞాలు చేసి దేవతలనూ శ్రాద్ధకర్మలతో పితృదేవతలనూ శ్రేష్ఠవస్తుదానంతో బ్రహ్మవిదులనూ పరితృప్తుల్ని చేసి అతిథిమర్యా దలు నిర్వర్తిస్తూ దీనజనులయందు దయచూపుతూ దోషులను దండిస్తూ భూమికి దిగివచ్చిన మహేం ద్రునివలె పరిపాలించాడు.

సింహాసనపరాక్రముడైన ఆ మహారాజు ధర్మ పథాన సర్వవిషయాలనూ అవగతం చేసికొంటూ సుఖభోగా లనుభవించే సమయాలలో సహస్ర వర్షాలూ పరిసమాప్తమవుతాయనే తలంపు వచ్చే సరికి ఆయనకు దుఃఖం కలిగేది. కాలతత్త్వం తెలి సిన యయాతి రోజులు లెక్కిస్తున్నాడు. అలా గణిస్తూనే నందనవనంలో అలకాపురిలో మేరునగ శిఖరాలపై యిచ్ఛానుసారం విశ్వాచి అనే పేరు గల అప్సరసతో భోగాలు పొందాడు. వేయేండ్లు సాగిపోయినవి.

ఆనాడు యయాతి తనమాట ప్రకారం సుమా రుని చేరి— నాయనా! ఈయావనంతో నేను సర్వ విషయోపభోగాలూ అనుభవించినా తృప్తిమాత్రం కలగలేదు. అయితే ఈ సుఖలాలసత్వంవల్ల ఆజ్యా హుతులు అందుకొనే అగ్నివలె హృదయ వాంఛలు పెరుగుతాయే కాని చల్లారవు. ఈ భూమండలం మీద సమస్తమైన సిరిసంపదలూకూడా సంతృప్తి కలిగించలేవు. ఈ నారీజనం పరితృప్తి నివ్వలేదు. ఇంతకూ మూలకారణం వాంఛలు, ఆశలు, తృష్ణ, వృద్ధాప్యం వచ్చి నెత్తిమీద పడ్డా మానవుడు వదులుకోలేనిది ఆశ ఒక్కటే. ఆ తృష్ణను వదలగల వాడే సుఖశాంతులు పొందగలడు.

గురోర్వై వచనం పుణ్యం స్వర్గ్యమాయుష్కరం నృణాం
గురుప్రసాదాత్ త్రైలోక్యమన్వశాసచ్ఛతక్రతుః
గురోరనుమతిం ప్రాప్య సర్వాన్ కామానవాప్నుయాత్.
ప్రతిపత్స్యామి తే రాజన్ పాప్మానం జరయా సహ
గృహాణ యౌవనం మత్తశ్చర కామాన్ యథేప్సితాన్.

జరయాహం ప్రతిచ్ఛన్నో వయోరూపధరస్తవ
యౌవనం భవతే దత్వా చరిష్యామి యథాఽఽత్థ మాం.
పూరో ప్రీతోఽస్మి తే వత్స ప్రీతశ్చేదం దదామి తే
సర్వకామసమృద్ధా తే ప్రజా రాజ్యే భవిష్యతి.
ఏవముక్త్వా యయాతిస్తు స్మృత్వా కావ్యం మహాతపాః
సంక్రామయామాస జరాం తదా పూరౌ మహాత్మని.

84వ అధ్యాయము సమాప్తం

## ఎనుబది ఐదవ అధ్యాయము

పౌరవేణాథ వయసా యయాతిర్నహుషాత్మజః
ప్రీతియుక్తో నృపశ్రేష్ఠశ్చచార విషయాన్ ప్రియాన్.
యథా కామం యథోత్సాహం యథాకాలం యథాసుఖం
ధర్మావిరుద్ధం రాజేంద్ర యథార్హ్యా స ఏవ హి.
దేవానతర్పయత్ యజ్ఞైః శ్రాద్ధైస్తద్వత్ పితౄనపి
దీనాననుగ్రహైరిష్టైః కామైశ్చ ద్విజసత్తమాన్.
అతిథీనన్నపానైశ్చ విశశ్చ పరిపాలనైః
ఆనృశంస్యేన శూద్రాంశ్చ దస్యూన్ సంనిగ్రహేణ చ.
ధర్మేణ చ ప్రజాః సర్వా యథావదనురంజయన్
యయాతిః పాలయామాస సాక్షాదింద్ర ఇవాపరః.
స రాజా సింహవిక్రాంతో యువా విషయగోచరః
అవిరోధేన ధర్మస్య చచార సుఖముత్తమం.
స సంప్రాప్య శుభాన్ కామాంస్తృప్తః ఖిన్నశ్చ పార్థివః
కాలం వర్షసహస్రాంతం సస్మార మనుజాధిపః.

పరిసంఖ్యాయ కాలజ్ఞః కాలాః కాష్ఠాశ్చ వీర్యవాన్
యౌవనం ప్రాప్య రాజర్షిః సహస్రపరివత్సరాన్.
విశ్వాచ్యా సహితో రేమే వ్యభ్రాజన్నందనే వనే
అలకాయాం స కాలం తు మేరుశృంగే తథోత్తరే.
యదా స పశ్యతే కాలం ధర్మాత్మా తం మహీపతిః
పూర్ణం మత్వా తతః కాలం పూరుం పుత్రమువాచ హ.
యథాకామం యథోత్సాహం యథాకాలమరిందమ
సేవితా విషయాః పుత్ర యౌవనే మయా తవ.
న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.
యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః
ఏకస్యాపి న పర్యాప్తం తస్మాత్ తృష్ణాం పరిత్యజేత్.
యా దుస్త్యజా దుర్మతిభిర్యా న జీర్యతి జీర్యతః
యోఽసౌ ప్రాణాంతికో రోగస్తాం తృష్ణాం త్యజతః సుఖం.
పూర్ణం వర్షసహస్రం మే విషయాసక్తచేతసః

విషయభోగాసక్తమత్తచిత్తంతో వెయ్యిసంవత్సరాలు గడిపాను. అయినా ఆమత్తు తగ్గలేదు. ఇప్పుడింక దాన్ని వదిలేసి మమత్వరహితంగా అరణ్యాలకు పోయి పరబ్రహ్మను సేవిస్తాను. నీ యౌవనంతోపాటు నా సర్వరాజ్యాధికారాలూ ఇస్తున్నాను. నీకు శుభమగు గాక—అని తన ముసలితనం పొంది తన యెదురుగా పూరుని రాజ్యాభిషిక్తుని చేయఁగోరగా— ప్రభూ! దేవయాని కుమారుడు శుక్రాచార్యుని దౌహిత్రుడు నీ జ్యేష్ఠ కుమారుడుండగా అతని తరువాయి తుర్వసు డుండగా, శర్మిష్ఠ కుమారు లింకా యిద్దరుండగా కనిష్ఠుడికి రాజ్యాధికారం ఈయడం ధర్మమా! అని ప్రజలు ప్రశ్నించారు.

సమస్త ప్రజానీకాన్నీ ఉద్దేశించి మహారాజు యయాతి పలుకుతున్నాడు— నేను యదువుకి రాజ్యాధికారం ఈయటంలేదు. వాడు నా ఆజ్ఞను తిరస్కరించాడు. తల్లిదండ్రుల మాటను విననివాడు సత్పురుషుడు కాలేడు కదా! పున్నామనరకం నుండి రక్షించేపుత్రుడు ఈలోకంలోనే తండ్రికి దుఃఖంకలిగిస్తే ఇంక వాడిమీద ఆశపెట్టుకునే తండ్రి ఎవడు? సద్గుణాన్వితుడే జ్యేష్ఠుడవుతాడని విద్వాంసులంటారు. మాతాపితరులకు వాడే ఇహపర సుఖాలు సమకూరుస్తాడు. అందుచేత ఉత్తమగుణాలు లేనివాడికి జ్యేష్ఠత్వప్రాప్తి లేదు. ధర్మవేత్తలు ఉత్తమ పుత్రులు కలవారినే మహానుభావులుగా గణిస్తారు. పెద్దవాళ్ళు నలుగురూ నన్ను అవమానించినా ఈకుమారుడే నాఆజ్ఞ శిరసావహించాడు. నాముసలితనాన్ని వరించాడు. కనక నా సర్వ సర్వస్వానికీ వీడే అధికారి. స్నేహభావంతో నా కోరికలు నెరవేర్చి నా కష్టా లనుభవించాడు. శుక్రాచార్యుల వారు కూడా నా వృద్ధత్వాన్ని స్వీకరించే కుమారుడికే రాజ్యాభిషేకం అనుగ్రహించారు. అందుచేత మీరందరూ ఈ పూరుని పట్టాభిషిక్తుని చేయండి— అనగా ప్రజలందరూ ఏకకంఠంతో యయాతి అభిమతాన్ని అంగీకరించి ఆచార్య శుక్రుని అనుగ్రహానుసారం పూరుడే చక్రవర్తి కావాలని నిశ్చయించారు.

ప్రజాసముదాయం తన అభిప్రాయంతో ఏకీభవించగా యయాతి వానిని పట్టాభిషిక్తుని చేసి వానప్రస్థాశ్రమ స్వీకారం చేసి తపస్వులైన బ్రాహ్మణులతో అరణ్యానికి వెళ్ళి తపోదీక్ష వహించాడు.

యదువువల్ల యాదవులూ తుర్వసునివల్ల యవనులూ ద్రుహ్యునివల్ల భోజులూ అనువు వల్ల మ్లేచ్ఛులూ జన్మించారు.

పూరుసంతతి పౌరవనామంతో ప్రఖ్యాతమయింది. జనమేజయనరపాలా! నువ్వు ఆ పౌరవ వంశీయుడవు. జితేంద్రియుడవై వెయ్యి సంవత్సరాలు నువ్వు రాజ్యపాలన సాగించాలి— అని వైశంపాయనుడు యయాతిచక్రవర్తి కథ కొనసాగిస్తున్నాడు.

85 వ అధ్యాయం సమాప్తం.

## ఎనుబది ఆరవ అధ్యాయము

ప్రియనందనుడికి పట్టాభిషేకం చేసి యయాతి దివ్యభోగాల నిచ్చే స్వర్గంచేరి తిరిగి భ్రష్టుడై తపోదీక్షలో జితేంద్రి డయాడు. కొంతకాలానికి భూమిమీద పడబోతూ మధ్యలోనే వసుమంత

తథాప్యనుదినం తృష్ణా మమైతేష్వభిజాయతే.
తస్మాదేనామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసం
నిర్ద్వంద్వోనిర్మమోభూత్వాచరిష్యామిమృగై స్సహ.
పూరో ప్రీతోఽస్మి భద్రం తే గృహాణేదం స్వయౌవనం
రాజ్యం చేదం గృహాణ త్వంహిమేప్రియకృత్సుతః.
ప్రతిపేదే జరాం రాజా యయాతిర్నాహుష స్తదా
యౌవనం ప్రతిపేదే చ పూరుః స్వం పునరాత్మనః.
అభిషేక్తుకామం నృపతిం పూరుం పుత్రం కనీయసం
బ్రాహ్మణప్రముఖా వర్ణా ఇదం వచనమబ్రువన్.
కథం శుక్రస్య నప్తారం దేవయాన్యాః సుతంప్రభో
జ్యేష్ఠం యదుమతిక్రమ్య రాజ్యం పూరోఃప్రయచ్ఛసి.
యదుర్జ్యేష్ఠస్తవ సుతో జాత స్తమను తుర్వసుః
శర్మిష్ఠాయాఃసుతోద్రుహ్యు స్తతోఽనుఃపూరురేవచ.
కథం జ్యేష్ఠానతిక్రమ్య కనీయాన్ రాజ్యమర్హతి
ఏతత్ సంభోధయామస్త్వాంధర్మంత్వం ప్రతిపాలయ.
బ్రాహ్మణప్రముఖా వర్ణాః సర్వేశృణ్వంతుమేవచః
జ్యేష్ఠం ప్రతి యథారాజ్యం న దేయంమేకథంచన.
మమ జ్యేష్ఠేన యదునా నియోగో నానుపాలితః
ప్రతికూలః పితుర్యశ్చ న స పుత్రః సతాం మతః.
మాతాపిత్రోర్వచనకృద్ధితః పథ్యశ్చ యః సుతః
స పుత్రః పుత్రవద్యశ్చ వర్తతే పితృమాతృషు.
పుదితి నరకస్యాఖ్యా దుఃఖం హి నరకం విదుః
పుత్రస్త్రాణా త్తతః పుత్రమిహేచ్ఛంతి పరత్ర చ.
ఆత్మనః సదృశః పుత్రః పితృదేవర్షిపూజనే
యో బహూనాం గుణకరః స పుత్రోజ్యేష్ఠఉచ్యతే.
జ్యేష్ఠాంశభాక్ స గుణకృదిహ లోకే పరత్ర చ
శ్రేయాన్ పుత్రో గుణోపేతః స పుత్రో నేతరో వృథా
వదంతి ధర్మం ధర్మజ్ఞాః పితౄణాంపుత్రకారణాత్.
యదునాహమవజ్ఞాత స్తథా తుర్వసునాపి చ
ద్రుహ్యునా చానునా చైవమయ్యవజ్ఞాకృతాభృశం.
పూరుణా తు కృతంవాక్యం మానితం చ విశేషతః
కనీయాన్ మమ దాయాదోధృతాయేనజరామమ.
మమ కామః స చ కృతః పూరుణా మిత్రరూపిణా
శుక్రేణ చ వరో దత్తః కావ్యేనోశనసా స్వయం.
పుత్రో యస్త్వానువర్తేత స రాజా పృథివీపతిః
భవతోఽనునయామ్యేవం పూరూ రాజ్యేఽభిషిచ్యతాం
యః పుత్రోగుణసంపన్నో మాతాపిత్రోర్హితః సదా
సర్వమర్హతి కల్యాణం కనీయానపి సత్తమః.
అర్హః పూరురిదంరాజ్యంయస్సుతః ప్రియకృత్ తవ
వరదానేన శుక్రస్య న శక్యం వక్తుముత్తరం.
పౌరజానపదైస్తుష్టైరిత్యుక్తో నాహుష స్తదా
అభ్యషించత్తతః పూరుంరాజ్యే స్వేసుతమాత్మనః.
దత్వా చ పూరవే రాజ్యం వనవాసాయ దీక్షితః
పురాత్ స నిర్యయౌ రాజా బ్రాహ్మణైస్తాపసైః సహ.
యదోస్తు యాదవాజాతా స్తుర్వసోర్యవనాఃస్మృతా
ద్రుహ్యోః సుతాస్తు వై భోజా అనోస్తు మ్లేచ్ఛజాతయః.
పూరోస్తు పౌరవో వంశో యత్రజాతోఽసి పార్థివ
ఇదం వర్ష సహస్రాణి రాజ్యం కారయితుం వశీ.

85 వఅధ్యాయం సమాప్తం

అష్టక ప్రతర్దన శిబి ప్రముఖ సాధుసాంగత్యంతో స్వర్గం చేరాడు— అని వైశంపాయనుడు యయాతి స్వర్గగమనపతన ఉత్థానాలను సంక్షిప్తంగా వివరించగా భూలోకదివ్యలోకాలలో ప్రసిద్ధుడైన తన వంశీయుని చరిత్ర సమగ్రంగా వినగోరిన జనమేజయునికి వైశంపాయనుడు చెపుతున్నాడు.

ఇహ పరాలలో సుఖ పుణ్యాలను ఇచ్చే యయాతి చరిత్ర నువ్వుకోరినట్లు చెపుతాను. పూరుని పట్టాభిషిక్తుని చేసి మిగిలిన నలుగురినీ రాజ్యపుహద్దులలో ఉంచి త్రికరణశుద్ధిగా దేవ పితృ తర్పణాలూ వానప్రస్థాశ్రమవిధి ననుసరించి అగ్నికార్యమూ చేస్తూ శిలోంఛవృత్తితో జీవితం సాగిస్తూ అతిథి మర్యాదలు నడుపుతూ మనోనిగ్రహంతో వెయ్యి సంవత్సరాలు గడిపాడు. నెమ్మది నెమ్మదిగా ఇంద్రియాలన్నింటినీ స్వాధీనం చేసికొని ముప్పై సంవత్సరాలకాలం జలమే ఆహారంగానూ ఒకసంవత్సరం వాయువే ఆహారంగానూ ఒక సంవత్సరం పంచాగ్నిమధ్యంలో నిలిచీ అనంతరం ఆరుమాసాలు ఏకపాదస్థితుడై వాయుభక్షణంతోనూ తపస్సు సాగించి సర్వలోకాలలో తనకీర్తిని ప్రతిష్ఠించి స్వర్గం చేరాడు,

86వ అధ్యాయం సమాప్తం

## ఎనుబది ఏడవ అధ్యాయము

దేవ వసు సాధ్య మరుద్గణాలు స్వాగతం పలుకుతూంటే యయాతి దేవేంద్రభవనానికి విచ్చేశాడు. దేవబ్రహ్మలోకాలలో యథేచ్ఛగా విహరిస్తూ ఒకనాడు దేవేంద్రుని చేరాడు.

యయాతీ ! నీకుమారుడికి నీరాజ్యం ఇచ్చినప్పుడు ఏం ఉపదేశించావు—అని ఇంద్రుడు ప్రశ్నించగా యయాతి— గంగా యమునా మధ్యస్థమైన సర్వభూమండలానికీ నువ్వే అధిపతివనీ మిగిలిన సోదరులు సరిహద్దు ప్రాంతాలలో ఆధిపత్యం వహిస్తారనీ చెప్పాను. అంతేగాక మనుష్యులు క్రోధ దైన్యమాత్సర్య మూర్ఖత్వకౌటిల్యాలు దరిచేరకుండా చూసుకుంటూ మాతాపితరులనూ విద్వాంసులనూ తపస్వులనూ పూజించాలి. క్షమాహృదయంతో చరించాలి. దుష్టులూ దుర్బలులూ అయిన వారే సాధువుల్నీ బలవంతుల్నీ హింసిస్తారు. కురూపి సుందరులనూ దరిద్రుడు ధనికులనూ కర్మహీనుడు కర్మిష్ఠులనూ గుణహీనుడు సద్గుణవంతుల్నీ ద్వేషిస్తాడు. క్రోధరహితుడూ సహనశీలుడూ అయినవాడే మానవశ్రేష్ఠుడు. నిందాద్వేషాలను సహించగల మానవుని హృదయం ఎదుటివారి పుణ్యసంపదను కొల్లగొడుతుంది. ఎంత ఆవేశం వచ్చినా ఎదుటివారి హృదయం నొచ్చేటట్లు మాట్లాడకూడదు. మర్మస్థానాల్లో కొట్టకూడదు. అక్రమమార్గాన శత్రువులను వశపరుచుకోకూడదు. అలా చరించేవాడు లక్ష్మీహీనుడవుతాడు. దుష్టుల కటువచనాలు సహించగలిగినవారినీ సాధుజన సత్కారం చేసేవారినీ సర్వసంపదలూ వరిస్తాయి. విద్వాంసుడైన పురుషుడు కఠోరంగా భాషించి ఎవరినీ హింసించడు. సర్వప్రాణికోటిపైనా దయా

## ఎనుబది ఆరవ అధ్యాయం

ఏవం స నాహుషో రాజా యయాతిః పుత్రమీప్సితం
రాజ్యేఽభిషిచ్య ముదితో వానప్రస్థోఽభవన్మునిః.
ఉషిత్వా చ వనే వాసం బ్రాహ్మణైః సంశితవ్రతః
ఫలమూలాశనో దాంత స్తతః స్వర్గమితో గతః.
స గతః స్వర్నివాసం తం నివసన్ ముదితః సుఖీ
కాలేన చాతిమహతా పునః శక్రేణ పాతితః.
నిపతన్ ప్రచ్యుతః స్వర్గాదప్రాప్తో మేదినీతలం
స్థిత ఆసీదంతరిక్షే స తదేతి శ్రుతం మయా.
తత ఏవ పునశ్చాపి గతః స్వర్గమితి శ్రుతం
రాజ్ఞా వసుమతా సార్ధమష్టకేన చ వీర్యవాన్.
ప్రతర్దనేన శిబినా సమేత్య కిల సంసది
కర్మణా కేన స దివం పునః ప్రాప్తో మహీపతిః.
సర్వమేతదశేషేణ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః
కథ్యమానం త్వయా విప్ర విప్రర్షి గణసంనిధౌ.
దేవరాజసమో హ్యాసీద్యయాతిః పృథివీపతిః
వర్ధనః కురువంశస్య విభావసుసమద్యుతిః.
తస్య వి స్తీర్ణ యశసః సత్యకీర్తేర్మహాత్మనః
చరితం శ్రోతుమిచ్ఛామి దివి చేహ చ సర్వశః.

హంత తే కథయిష్యామి యయాతేరు త్తమాం
కథాం
దివి చేహ చ పుణ్యార్థాం సర్వపాపప్రణాశినీం.
యయాతిర్నాహుషో రాజా పూరుం పుత్రం
కనీయసం
రాజ్యేఽభిషిచ్య ముదితః ప్రవవ్రాజ వనం తదా.
అంత్యేషు స వినిక్షిప్య పుత్రాన్ యదుపురోగమాన్
ఫలమూలాశనో రాజా వనే సంన్యవసచ్చిరం.
శంసితాత్మా జితక్రోధ స్తర్పయన్ పితృదేవతాః
అగ్నీంశ్చ విధివజ్జుహ్వన్ వానప్రస్థవిధానతః.
అతిథీన్ పూజయామాస వన్యేన హవిషా విభుః
శిలోంఛవృత్తిమాస్థాయ శేషాన్నకృతభోజనః.
పూర్ణం వర్షసహస్రం చ ఏవం వృత్తిరభూన్నృపః
అబ్భక్షః శరదస్త్రింశదాసీన్నియతవాఙ్మనాః.
తతశ్చ వాయుభక్షోఽభూత్ సంవత్సరమతంద్రితః
తథా పంచాగ్ని మధ్యే చ తప స్తేపే స వత్సరం.
ఏకపాదః స్థితశ్చాసీత్ షణ్మాసాననిలాశనః
పుణ్యకీ ర్తి స్తతః స్వర్గే జగామావృత్య రోదసీ.

86వ అధ్యాయము సమాప్తం

## ఎనుబది ఏడవ అధ్యాయము

స్వర్గతః స తు రాజేంద్రో నివసన్ దేవవేశ్మని
పూజితస్త్రిదశైః సాధ్యైర్మరుద్భిర్వసుభి స్తథా.
దేవలోకం బ్రహ్మలోకం సంచరన్ పుణ్యకృద్వశీ
అవసత్పృథివీపాలో దీర్ఘ కాలమితి శ్రుతిః.
సకదాచిన్నృపశ్రేష్ఠో యయాతిః శక్రమాగమత్
కథాంతే తత్ర శక్రేణ స పృష్టః పృథివీపతిః.

యదా స పూరు స్తవ రూపేణ రాజన్
జరాం గృహీత్వా ప్రచచార భూమౌ
తదా చ రాజ్యం సంప్రదాయైవ తస్మై
త్వయా కిము క్తః కథయేహ సత్యం.
గంగాయమునయోర్మ ధ్యే కృత్స్నోఽయం
విషయ స్తవ

దృష్టితో మైత్రీభావంతో దానశీలంతో మధుర వాక్కులతో చరించేవారికి ముల్లోకాలలోనూ కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. కనుకనే క్షమాహృదయం ప్రియభాషణం సాధుసత్కారం దేహీ అని చెయ్యి చాచని దాతృత్వం ఉత్తమపురుషునికి అవసరం— అని చెప్పానన్నాడు యయాతి.

87వ అధ్యాయం సమాప్తం

## ఎనుబది ఎనిమిదవ అధ్యాయము

యయాతి పలుకులు విని దేవేంద్రుడు— రాజా! రాజ్యసర్వస్వం విడిచి నువ్వు సాగించిన తపోదీక్ష ఎవరి తపస్సుతో ఉపమించతగ్గదో చెప్పుమనగా యయాతి తనతపస్సుతో దేవగంధర్వ మానవ మహర్షు లెవరితపస్సూ సరితూగదనగా దేవేంద్రుడు యయాతిలో అహంకారం పెరిగి సర్వులయందూ తిరస్కారదృష్టి ప్రబలిన కారణంగా పుణ్యక్షయం అయింది కనక దేవలోకంనుంచి పతనం తప్పదన్నాడు అప్పుడు యయాతి దేవగంధర్వ మానవ ఋషి సంఘాలను అవమానించిన కారణంగా తన పుణ్యరాశి క్షయమై తన పతనం తప్పని సరి అయితే సాధుజనమధ్యంలో పడాలని కోరుకున్నాడు. దేవేంద్రుడు అనుగ్రహించి యయాతికి తిరిగి దేవలోకం ప్రాప్తిస్తుందనీ అప్పుడు మళ్ళీ ఈ తిరస్కార దృష్టి కూడదనీ చెప్పాడు.

క్షీణపుణ్యుడైన యయాతి దేవలోకంనుండి పడిపోతూండగా అష్టకుడనే రాజర్షి శ్రేష్ఠుడు చూసి, ఇంద్రసమతేజస్వివైన ఓ మహాత్మా ! నీవెవరవు ? సాంద్రమేఘావృతమైన ఆకాశంలో వెలిగే సూర్యకాంతిని తిరస్కరించే ప్రకాశంకల అగ్నిసదృశరూపా ! ఏ హేతువుచేత ఇలా పడిపోతున్నావు. నిన్ను చూస్తూంటే అప్రమేయశక్తి అసదృశప్రతిభా కలవాడిలా గోచరిస్తున్నావు. నీశక్తి చూస్తూంటే నిన్ను ప్రశ్నించటానికి కానీ మమ్మల్ని పరిచయం చేసికోవటానికి కానీ సాహసం చాలటం లేదు. విషాదమోహాలను విడిచి వాస్తవం చెప్పండి. సాధుసాంగత్యంలో ఉన్న నిన్ను దేవేంద్రుడుకూడా ఏమీ చేయలేడు. స్థావరజంగమాత్మకమైన సర్వప్రాణికోటినీ శాసించగల సత్పురుషులమధ్య ఉన్న నీకు ఏభయమూ లేదు. అగ్నికి తపనశక్తి పృథ్వికి బీజగ్రహణశక్తి సూర్యునికి ప్రకాశప్రసారశక్తి సహజమైనట్లే అతిథికి సాధువులను శాసించే మహాత్తరశక్తి ఉంది— అన్నాడు.

88 వ అధ్యాయం సమాప్తం.

## ఎనుబది తొమ్మిదవ అధ్యాయము

అష్టకుని మాటలు విని యయాతి— మహాత్మా! నేను నహుషపుత్రుడను. పూరు పితరుడను. నన్ను యయాతి అని పిలుస్తారు. ప్రాణికోటిని అవమానించిన కారణంగా స్వార్జితపుణ్యం క్షయమై ఈస్థితికి

మధ్యేపృథివ్యాస్త్వంరాజాభ్రాతరోఽన్యాధిపాస్తవ.
న చ కుర్యాన్నరో దైన్యం శాఠ్యం క్రోధంతథైవచ
జైహ్మ్యం చ మత్సరం వైరం సర్వత్రైవ న
కారయేత్.
మాతరం పితరం చైవ విద్వాంసం చ తపోధనం
క్షమావంతంచ దేవేంద్ర నావమన్యేత బుద్ధిమాన్.
శక్తస్తు క్షమతే నిత్యమశక్తః క్రుధ్యతే నరః
దుర్జనః సుజనం ద్వేష్టి దుర్బలో బలవత్తరం.
రూపవంత మరూపీ చ ధనవంతం చ నిర్ధనః
అకర్మ కర్మిణం ద్వేష్టి ధార్మికం చ న ధార్మికః
నిర్గుణో గుణవంతం చ శక్రైతత్ కలిలక్షణం.
అక్రోధనః క్రోధనేభ్యో విశిష్ట
స్తథా తితిక్షురతితిక్షోర్విశిష్టః
అమానుషేభ్యో మానుషాశ్చ ప్రధానా
విద్వాంస్తథైవావిదుషః ప్రధానః.
ఆక్రుశ్యమానో నాక్రోశేన్మన్యురేవ తితిక్షతః
ఆక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విందతి.
నారుంతుదః స్యాన్న నృశంసవాదీ
న హీనతః పరమభ్యాదదీత
యయాస్య వాచా పర ఉద్విజేత
న తాం వేదమశతీ పాపలోక్యాం.
అరుంతుదం పురుషం తీక్ష్ణవాచం
వాక్కంటకైర్వితుదంతం మనుష్యాన్
విద్యాదలక్ష్మీకతమం జనానాం
ముఖే నిబద్ధాం నిరృతిం వహంతం.
సద్భిః పురస్తాదభిపూజితః స్యాత్
సద్భిస్తథా పృష్ఠతో రక్షితః స్యాత్
సదాసతామతివాదాంస్తితిక్షేత్
సతాంవృత్తం చాదదీతార్యవృత్తః.
వాక్సాయకా వదనాన్నిష్పతంతి
యైరాహతః శోచతి రాత్ర్యహాని
పరస్య నామర్మసు తే పతంతి
తాన్ పండితో నావసృజేత్పరేషు.
న హీదృశం సంవననం త్రిషు లోకేషు విద్యతే
దయా మైత్రీ చ భూతేషు దానం చ మధురా
చ వాక్.
తస్మాత్ సాంత్వం సదా వాచ్యం న వాచ్యం
పురుషం క్వచిత్
పూజ్యాన్ సంపూజయేత్ దద్యాన్న చ యాచేత్
కదాచన.

87 వ అధ్యాయం సమాప్తం.

## ఎనుబది ఎనిమిదవ అధ్యాయము

సర్వాణి కర్మాణి సమాప్య రాజన్
గృహం పరిత్యజ్య వనం గతోఽసి
తత్త్వాం పృచ్ఛామి నహుషస్య పుత్ర
కేనాసి తుల్యస్తపసా యయాతే.
నాహం దేవమనుష్యేషు గంధర్వేషు మహర్షిషు
ఆత్మనస్తపసా తుల్యం కంచిత్పశ్యామి వాసవ.
యదావమంస్థాః సదృశః శ్రేయసశ్చ
అల్పీయసశ్చావిదితప్రభావః
తస్మాల్లోకాస్త్వంతవంతస్తవేమే క్షీణే పుణ్యే
పతితాస్యద్య రాజన్.
సురర్షి గంధర్వనరావమానాత్
క్షయం గతా మే యది శక్ర లోకాః

వచ్చాను. వయస్సులో మీకన్న పెద్దవాణ్ణి కనక మీకు నమస్కరించటం మంచిపనికాదు. విద్య తపస్సు వయస్సుకల మనుష్యులు ద్విజన్ములలో పూజార్హులు— అనగా అష్టకుడు— బ్రహ్మవిదులకు మీ నియమం వర్తించదు. విద్యాతపస్సులే ప్రధానం కాని బ్రహ్మవిదులపట్ల వయస్సుకి ప్రాధాన్యం లేదు— అన్నాడు.

పుణ్యకర్మక్షయమే పాపం. పాపమే నరక హేతువు. సాధుపురుషులు దురాచారపరులు కాలేరు. నా పుణ్యధనం అంతా పరనిందతో నశించింది. అది ఇప్పుడు సాధించలేను. ధనవంతుడై యజ్ఞకర్మలతో దేవతలను ఆరాధించి విద్యావినయబుద్ధిమంతుడై వేదవేదాంగవిదుడై తపోలగ్నచిత్తుడైనవాడు స్వర్గభోగాలనుభవించగలడు. ధనమత్తుడై ఆనందరహితుడై అహంకారపరుడై చరించకూడదు. ఈ ప్రాణికోటి అంతా ప్రారబ్ధానికి ప్రాంజలించి ప్రవర్తించాలి. సుఖదుఃఖాలవల్ల మమకారవికారాలు పొందని ప్రాణి ఉత్తమమైనది. ఈ రెండూ ప్రారబ్ధంవల్లనే ప్రాప్తిస్తాయి. సుఖాలవల్ల సంతోషంకానీ దుఃఖంవల్ల విచారం కానీ పడకూడదు. బలీయమైన ప్రారబ్ధానుసారం అవి వచ్చిపోతుంటాయి. ఇప్పుడు నేను భయమోహాలతో మనస్తాపం చెందకుండా విధి ఎలా నడిపిస్తే అలా నడుస్తాను.

స్వేదజ అండజ ఉద్భిజ సరీసృప పర్వతాదులు కూడా ప్రారబ్ధం పూర్తికాగానే సహజరూపం పొందుతాయి. నాయనా! అశాశ్వతమైన సుఖదుఃఖాల స్వరూపం తెలిసిన నేను దేనికీ చింతించటంలేదు. దుఃఖాభిభూతుడు కాని ప్రాణి సుఖోన్మత్తుడుకూడా కాడు. సర్వసమభావంతో విధికి అంజలి ఘటించి పోతాడు— అని ఆగాడు యయాతి.

గుణసంపన్నుడైన యయాతి మనుమడే అష్టకుడు. అంతరిక్షంలో చరించే యయాతిని మళ్ళీ ఇలా ప్రశ్నించాడు అష్టకుడు— మహాపురుషా! మీరు ఏ ఏ పుణ్యలోకాలలో ఎంతెంతకాలం ఉన్నదీ వినగోరుతున్నాను— అనగా యయాతి— సాధుపురుషా! ఒకనాడు ఈభూమండలానికి అధిపతినై పుణ్యకర్మలు చేసి వేయి సంవత్సరాలు పాలించి ఉత్తమలోకాలు పొందాను. నూరుయోజనాల వైశాల్యంతో సహస్రద్వారాలతో అలరారే ఇంద్రలోకంలో వెయ్యేండ్లు గడిపి లోకపాలురకు దుర్లభమైన బ్రహ్మలోకంలో స్వేచ్ఛగా మరొక వెయ్యిసంవత్సరాలు గడపాను. అనంతరం అప్సరోభామలతో పదిలక్షల సంవత్సరాలు నందనవనంలో విహరించాను. అక్కడ సురభిళపుష్పసంపన్నమైన వృక్షచ్ఛాయలో కాలం గడుపుతూ ఉండగా ఒక దేవదూత వచ్చి పతనం చెందు అని ముమ్మారు పలికాడు. పుణ్యక్షయం కారణంగా నేనిలా అయాను. క్రిందకు పడుతూ— ఉత్తమకీర్తివంతుడైన యయాతి క్షీణపుణ్యుడై భూపతితుడవుతున్నాడు— అని పలికే దేవతల సానుభూతి వాక్యాలు విని సాధుపురుషమధ్యంలో పడే ఉపాయం అర్థించగా వారు నాకీదారి చూపించారు. పవిత్రమైన హవిస్సు వెలువరిచే ఈసుగంధధూమం నాహృదయానికి శాంతినీ మనస్సుకి ఆహ్లాదాన్నీ కలిగించింది— అన్నాడు.

89వ అధ్యాయం సమాప్తం

ఇచ్ఛామ్యహం సురలోకాద్ విహీనః
సతాం మధ్యే పతితుం దేవరాజ.
సతాం సకాశే పతితాసి రాజం
శ్చ్యుతః ప్రతిష్ఠాం యత్ర లబ్ధాసిభూయః
ఏతద్విదిత్వా చ పునర్యయాతే
త్వం మావమంస్థాః సదృశః శ్రేయసశ్చ.
తతః ప్రహాయామరరాజజుష్టాత్
పుణ్యాన్లోకాన్ పతమానం యయాతిం
సంప్రేక్ష్య రాజర్షి వరోఽష్టకస్త
మువాచ సద్ధర్మవిధానగోప్తా.
కస్త్వం యువా వాసవతుల్యరూపః
స్వతేజసా దీప్యమానో యథాగ్నిః
పతస్యుదీర్ణాంబుధరాన్ధకారాత్
ఖాత్ ఖేచరాణాం ప్రవరో యథార్కః.
దృష్ట్వా చ త్వాం సూర్యపథాత్ పతన్తం
వైశ్వానరార్కద్యుతి మప్రమేయం
కిం ను స్విదేతత్ పతతీతి సర్వే
వితర్కయన్తః పరిమోహితాః స్మః.
దృష్ట్వా చ త్వాం ధిష్ఠితం దేవమార్గే
శక్రార్కవిష్ణుప్రతిమప్రభావం
అభ్యుద్గతాస్త్వాం వయమద్య సర్వే
తత్త్వం ప్రపాతే తవ జిజ్ఞాసమానాః.
న చాపి త్వాం ధృష్ణుమః ప్రష్టుమగ్రే
న చ త్వమస్మాన్ పృచ్ఛసి యే వయం స్మః
తత్త్వాం పృచ్ఛామి స్పృహణీయరూప
కస్య త్వం వా కింనిమిత్తం త్వమాగాః.
భయం తు తే వ్యేతు విషాదమోహౌ
త్యజాశు చైవేంద్రసమప్రభావ
త్వాం వర్తమానం హి సతాం సకాశే
నాలం ప్రసోఢుం బలహాపి శక్రః.
సంతః ప్రతిష్ఠా హి సుఖచ్యుతానాం
సతాం సదైవామర రాజకల్ప
తే సంగతాః స్థావరజంగమేశాః
ప్రతిష్ఠితస్త్వం సదృశేషు సత్సు.
ప్రభురగ్నిః ప్రతపనే భూమిరావపనే ప్రభుః
ప్రభుః సూర్యః ప్రకాశిత్వే సతాం చాభ్యాగతః
ప్రభుః.

88వ అధ్యాయం సమాప్తం

## ఎనుబది తొమ్మిదవ అధ్యాయము

అహం యయాతిర్నహుషస్య పుత్రః
పూరోః పితా సర్వభూతావమానాత్
ప్రభ్రంశితః సురసిద్ధర్షిలోకాత్
పరిచ్యుతః ప్రపతామ్యల్పపుణ్యః.
అహం హి పూర్వో వయసా భవద్భ్య
స్తేనాభివాదం భవతాం న ప్రయుంజే
యో విద్యయా తపసా జన్మనా వా
వృద్ధః స పూజ్యో భవతి ద్విజానాం.
అవాదీస్త్వం వయసా యః ప్రవృద్ధః
స వై రాజన్ నాభ్యధికః కథ్యతే చ
యో విద్యయా తపసా సంప్రవృద్ధః
స ఏవ పూజ్యో భవతి ద్విజానాం.
ప్రతికూలం కర్మణాం పాపమాహు
స్తద్వర్తతేఽప్రవణే పాపలోక్యం

## తొంబదియవ అధ్యాయము

కృతయుగంలో జన్మించావు. పాపరహితుడవు. స్వేచ్ఛామయ రూపాలతో పదిలక్షల సంవత్సరాలు నందనోద్యానవనంలో సమస్తభోగాలూ అనుభవించిన మీరు స్వర్గాన్ని వదలి భూమండలానికి యెందుకు వచ్చారని అడిగిన అష్టకునికి యిలాసమాధానం చెపుతున్నాడు యయాతి— భూమండలంలో ధనం పోయినవాణ్ణి జ్ఞాతులూ మిత్రులూ దారా పుత్రాదులూ యెలావదలివేస్తారో అలాగే పుణ్యం నష్టమైపోతే సమస్తదేవతలూ ఇంద్రుడూకూడా వదిలివేస్తారు.

స్వర్గలోకంలో మనుష్యుల పుణ్యం యెలా క్షీణమైపోతుంది; పునరావృత్తి రహితమైన బ్రహ్మస్థానం ఎలా ఉంటుంది! ఏ పుణ్యకర్మలు చేసిన వారికి ఆ బ్రహ్మధామం లభిస్తుందో నాకు చెప్పు. నీవు ఆత్మజ్ఞానం కలవానివలె గోచరిస్తున్నా—వని పునః ప్రశ్న చేసిన అష్టకునికి యయాతి యిలా చెప్పడం మొదలుపెట్టాడు— భూసురోత్తమా! స్వర్గలోకానికి వెళ్ళిన ఏపుణ్యజీవి తాను చేసిన సత్కర్మలను తానే స్తుతించుకొంటుందో ఆ జీవి భూమి అనే నరకంలో పడి గ్రద్దలూ నక్కలూ కుక్కలూ తినే యీ శరీరం కోసం అనేక శ్రమలు పడి దారపుత్రధనాసక్తమవుతుంది. జరారోగములచే శరీరం క్షీణిస్తూఉంటే పుత్రపౌత్రాది మోహామును పొందుతూ తిరుగులాడు తుంటుంది. ఈ లోకమందు సుఖభ్రాంతియే గాని సుఖం లేదు. కనుక మానవు డీలోకంలో నింద్యకర్మలు చెయ్యక సత్కర్మలే ఆచరిస్తూ విజ్ఞానం ఆర్జించాలి. ఆత్మస్తుతీ పరనిందా ప్రమాద హేతువులు. నీకు సంగ్రహంగా విషయం వివరించాను. అనిన యయాతిని చూచి—రాజర్షి పుంగవా! మానవుడు మరణించిన తరువాత యీ కళేబరాన్ని గ్రద్దలు, నెమళ్ళు, మిడుతలు మొదలైన జంతువులు పొడుచుకుతింటే మళ్ళీ ఆజీవి యేరూపంలో ఎక్కడ ఎలా పుడతాడు. నేనింతవరకూ భూమ నరక మనే పేరే వినలేదు. ఇదంతా నాకు ఆశ్చర్యంగా ఉంది. సవిస్తరంగా చెప్పు.— అని అడిగిన అష్టకునికి యయాతి చెపుతున్నాడు— వత్సా! పుట్టుట, పెరుగుట లక్షణంగా గల యీ శరీరాన్ని ధరించి కర్మబద్ధుడై కర్మలుచేస్తూ సమస్త జీవ సముహంలో తిరుగుతూండడమే భూమనరకం. ఇందులో లెక్కలేకుండా సంవత్సరాలు గడిచిపోతూంటాయి. కాని వాడా కాలాన్ని గుర్తించడు. కొందరు జీవులు అరవై వేల సంవత్సరాలు మరికొందరు యెనభై వేల సంవత్సరాలు స్వర్గంలో ఉంటారు. ఆ భోగానుభవం పూర్తికాగానే యీ భూమీ అనే నరకంలో పడతారు. ఆ సమయంలో పెద్దపెద్దకోరలు గల భయంకర దుష్టప్రాణులా జీవులను హింసిస్తూ ఉంటాయి — అని చెప్పే యయాతిని అష్టకుడు మళ్ళీ అడిగాడు.

మహారాజా! తీక్ష్ణదంష్ట్రలు కల రాక్షసులు పాపవశంచేత భూమికిపతనమయే ఏజీవుల్ని ఎలా బాధిస్తారు? భూమియందు పతనమైన ఆజీవు లెలా బ్రతుకుతాయి? తిరిగి సర్వేంద్రియాలతోనూ ఎలా కూడుకుంటాయి. గర్భమం దెలా ప్రవేశిస్తాయి - అని అడిగిన అష్టకునికి సమాధానం యిస్తున్నాడు యయాతి. అంతరిక్షాన్నుండి పతనమయే జీవి జలరూపం పొంది ఓషధీరూపాన్ని ధరిస్తుంది. అటు తరువాత పురుషదేహంలో ప్రవేశించి రేతో రూపంతో కర్మతోకూడ స్త్రీ గర్భాశయమందు

సంయోగోఽసతాం నానువర్తంతి చైతద్
యథా చైషామనుకూలాస్తథాఽఽసన్.
అభూద్ధనం మే విపులం గతం తద్
విచేష్టమానో నాధిగంతా తదస్మి
ఏవం ప్రధార్యాత్మహితే నివిష్టో
యో వర్తతే స విజానాతి ధీరః.
మహాధనో యో యజతే సుయజ్ఞై
ర్యః సర్వవిద్యాసు వినీతబుద్ధిః
వేదానధీత్య తపసాఽఽయోజ్య దేహం
దివం సమాయాతు పురుషో వీతమోహః.
న జాతు హృష్యేన్మహతా ధనేన
వేదానధీయీతానహంకృతః స్యాత్
నానాభావా బహవో జీవలోకే
దైవాధీనా నష్టచేష్టాధికారాః.
తత్ తత్ ప్రాప్య న విహన్యేత ధీరో
దిష్టం బలీయ ఇతి మత్వాఽఽత్మబుద్ధ్యా.
సుఖం హి జంతుర్యది వాపి దుఃఖం
దైవాధీనం విందతే నాత్మశక్త్యా
తస్మాద్దిష్టం బలవన్మన్యమానో
న సంజ్వరేన్నాపి హృష్యేత్ కథంచిత్.
దుఃఖైర్న తప్యేన్న సుఖైః ప్రహృష్యేత్
సమేన వర్తేత సదైవ ధీరః
దిష్టం బలీయ ఇతి మన్యమానో
న సంజ్వరేన్నాపి హృష్యేత్ కథంచిత్.
భయే న ముహ్యాద్యష్టకాహం కదాచిత్
సంతాపో మే మానసో నాస్తి కశ్చిత్
ధాతా యథా మాం విదధీత లోకే
ధ్రువం తథాహం భవితేతి మత్వా.
సంస్వేదజా అండజాశ్చోద్భిదశ్చ
సరీసృపాః క్రిమయోఽథాప్సు మత్స్యాః

తథాశ్మానస్తృణకాష్ఠం చ సర్వే
దిష్టక్షయే స్వాం ప్రకృతిం భజంతి.
అనిత్యతాం సుఖదుఃఖస్య బుద్ధ్వా
కస్మాత్ సంతాపమష్టకాహం భజేయం
కిం కుర్యాం వై కిం చ కృత్వా న తప్యే
తస్మాత్ సంతాపం వర్జయామ్యప్రమత్తః.
దుఃఖే న ఖిద్యేన్న సుఖేన మాద్యేత్
సమేన వర్తేత స ధీరధర్మా
దిష్టం బలీయః సమవేక్ష్య దుద్ధ్యా
న సజ్జతే చాతి భృశం మనుష్యః.
ఏవం బ్రువాణం నృపతిం యయాతి
మథాష్టకః పునరేవాన్వపృచ్ఛత్
మాతామహం సర్వగుణోపపన్నం
తత్ర స్థితం స్వర్గలోకే యథావత్.
యే యే లోకాః పార్థివేంద్ర ప్రధానా
స్త్వయా భుక్తా యం చ కాలం యథావత్
తాన్ మే రాజన్ బ్రూహి సర్వాన్ యథావత్
క్షేత్రజ్ఞవద్భాషసే త్వం హి ధర్మాన్.
రాజాహమాసమిహ సార్వభౌమ
స్తతో లోకాన్ మహతశ్చాజయం వై
తత్రావసం వర్షసహస్రమాత్రం
తతో లోకం పరమస్మ్యభ్యుపేతః.
తతః పురీం పురుహూతస్య రమ్యాం
సహస్రద్వారాం శతయోజనాయతాం
అధ్యావసం వర్షసహస్రమాత్రం
తతో లోకం పరమస్మ్యభ్యుపేతః.
తతో దివ్యమజరం ప్రాప్య లోకం
ప్రజాపతేర్లోకపతేర్దురాపం
తత్రావసం వర్షసహస్రమాత్రం

ప్రవేశించి రజోయుక్తమై గర్భరూపాన్ని పొంది నవమాస పరిపూర్తికాగానే భూమియందు జని స్తుంది. ఇది జీవియొక్క కర్మపరిణామం. కర్మనను సరించి పశుపక్ష్యాది శరీరాలు క్రిమికీటకాది జన్మలు కలుగుతూంటాయి - అని చెప్పాడు యయాతి.

అది విన్న అష్టకుడు తిరిగి అడిగాడు - రాజా! మనుష్యశరీరాన్ని పొందే జీవి తన యీ శరీరం తోనే గర్భంలో ప్రవేశిస్తాడా ఇంకోశరీరంతో ప్రవేశిస్తాడా. గర్భంలో ప్రవేశించాక కళ్లు ముక్కు చెవులు మొదలగు భిన్న భిన్న ఇంద్రియాలు అవయ వాలు ఎలా పొందుతాడు? సవిస్తరంగా చెప్పు. మేమంతా నిన్ను ఆత్మజ్ఞానిగా భావిస్తున్నాము.

ఋతుకాలంలో పుష్పరసంతో కూడిన శుక్రాన్ని వాయువు గర్భాశయానికి చేరుస్తుంది. ఆ గర్భాశయంలోసూక్ష్మభూతాలు అధికారంవహించి గర్భాన్ని వృద్ధి చెందిస్తాయి. ఆ గర్భము క్రమంగా పూర్ణశరీరరూపాన్ని పొంది సమస్త అవయవము లతో కూడినదై భూమియందు జన్మించి మనుష్య నామధేయాన్ని పొందుతాడు. అక్కడనుండి చెవు లతో వినడం కండ్లతో చూడడం ఘ్రాణేంద్రియంతో వాసన నాలుకతో రుచి త్వక్కుతో స్పర్శ మన స్సుతో ఆంతరంగిక భావనలు గ్రహిస్తూంటాడు. అష్టకా! ఇదేరీతిగ జీవులు శరీరాన్ని ధరిస్తూంటారు. శరీరాన్నే జీవుడీస్తాడు.

మరణించిన వానిని దహించుట, పాతిపెట్టుట, నీటియందు వదలుట అనేవానిలో ఏదో యొక విధంగా స్థూలదేహం ధ్వంసం చేయబడుతుంది. అలాంటప్పుడీజీవి యేశరీరాన్ని ధరించి వ్యవహ రిస్తాడో చెప్పమన్నాడు అష్టకుడు.

స్వప్నావస్థలో మానవుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలు తీలుస్తూనే ఉంటాడు. కాని జీవిమాత్రం స్థూల దేహాన్ని విడచి చరిస్తాడు. అనేక అనుభవాలు పొందుతాడు. అలాగే మరణించినవాడు స్థూలశరీ రాన్ని విడిచి సూక్ష్మశరీరంతో కర్మను ముందుం చుకొని - వాయువేగంతో అన్యయోనిని పొందు తాడు.

పుణ్యకర్మలు చేసినవాడు పుణ్యయోనుల యందూ పాపకర్మలు చేసినవాడు క్రిమికీటకాది పాపయోనులందు పుడుతూంటాడు. ఈ విధంగా జీవు డనేకసార్లు గర్భమందు ప్రవేశిస్తూ ఆరు కాళ్లు, నాలుగు కాళ్లు, రెండుకాళ్లు కలవాడుగా జన్మిస్తూంటాడు. ఇదంతా నీకు సవిస్తరంగా చెప్పాను. ఇంకాయేంకావాలో అడుగు — అన్నాడు యయాతి.

మానవుడు ఏకర్మచేసి ఉత్తమలోకాన్ని పొందు తాడు. అది తపస్సుచే సిద్ధిస్తుందా విద్యచేతనా సత్కర్మానుష్ఠానంవల్ల సిద్ధిస్తుందా సవిస్తరంగా చెప్పమన్నాడు అష్టకుడు.

స్వర్గలోకద్వారాలను గూర్చి యిలా చెపుతు న్నారు - తపస్సు, దానము, శమము, దమము, ప్రజ్ఞ, సత్యము, భూతదయ, యీ ఏడును సత్పురు షులకు స్వర్గద్వారాలని పెద్దలు చెపుతున్నారు. సత్పురుషుడు యేదో ఒక మార్గాన్ని స్వర్గం చేర తాడు. తమోగుణం కలవాడు నశించిపోతాడు, వేదవిదుడైనా, అసూయాపరుడు గర్వి అయితే పుణ్యలోకాలు ప్రాప్తించవు. అగ్నిహోత్రము, మౌనము, వేదాధ్యయనము, యజ్ఞము అనే నాలు గూ మానవుని భయవిముక్తుడుగా చేస్తాయి. అవే కర్మలు సక్రమంగా చేయకపోతే మానవుణ్ణి నశింప జేస్తాయి. విద్వాంసుడైనవాడు సమ్మానానికి ఆనం

తతో లోకం పరమస్మ్యభ్యుపేతః
స దేవదేవస్య నివేశనే చ
విహృత్య లోకానవసం యథేష్టం
సంపూజ్యమానస్త్రిదశైః సమస్తై
స్తుల్యప్రభావద్యుతిరీశ్వరాణాం.
యథావసం నందనే కామరూపీ
సంవత్సరాణామయుతం శతానాం
సహాప్సరోభిర్విహరన్ పుణ్యగంధాన్
పశ్యన్ నాగాన్ పుష్పితాంశ్చారురూపాన్.
తత్రస్థితం మాం దేవసుఖేషు సక్తం
కాలేఽతితే మహతి తతోఽతిమాత్రం
దూతో దేవానామబ్రవీదుగ్రరూపో
ధ్వంసేత్యుచ్చైస్త్రిః ప్లుతేన స్వరేణ.
ఏతావన్మే విదితం రాజసింహ
తతో భ్రష్టోఽహం నందనాత్ క్షీణపుణ్యః
వాచోఽశ్రౌషం చాంతరిక్షే సురాణాం
సానుక్రోశాః శోచతాం మాం నరేంద్ర.
అహో కష్టం క్షీణపుణ్యో యయాతిః
పతత్యసౌ పుణ్యకృత్ పుణ్యకీర్తిః
తానబ్రువం పతమానస్తతోఽహం
సతాం మధ్యే నిపతేయం కథం ను.
తైరాఖ్యాతా భవతాం యజ్ఞభూమిః
సమీక్ష్య చేమాం త్వరితముపాగతోఽస్మి
హవిర్గంధం దేశికం యజ్ఞభూమే
ర్ధూమాపాంగం ప్రతిగృహ్య ప్రతీతః.

89 వ అధ్యాయం సమాప్తం

## తొంబదవ అధ్యాయము

యదావసో నందనే కామరూపీ
సంవత్సరాణామయుతం శతానాం
కిం కారణం కార్తయుగప్రధాన
హిత్వా చ త్వం వసుధామన్వపద్యః.
జ్ఞాతిః సుహృత్ స్వజనో వా యథేహ
క్షీణే విత్తే త్యజ్యతే మానవైర్హి
తథా తత్ర క్షీణపుణ్యం మనుష్యం
త్యజంతి సద్యః సేశ్వరా దేవసంఘాః.
తస్మిన్ కథం క్షీణపుణ్యా భవంతి
సమ్ముహ్యతే మేఽత్ర మనోఽతి మాత్రం
కిం వా విశిష్టాః కస్య ధామోపయాంతి
తద్వై బ్రూహి క్షేత్రవిత్ త్వ మతో మే.
ఇమం భౌమం నరకం తే పతంతి
లాలప్యమానా నరదేవ సర్వే
తే కంకగోమాయుబలాశనార్థే
క్షీణా వివృద్ధిం బహుధా ప్రజంతి.
తస్మాదేతద్వర్జనీయం నరేంద్ర
దుష్టం లోకే గర్హణీయం చ కర్మ
ఆఖ్యాతం తే పార్థివ సర్వమేవ
భూయశ్చేదానీం వద కిం తే వదామి.
యదా తు తాన్ వితుదంతే వయాంసి
తథా గృధ్రాః శితికంఠాః పతంగాః
కథం భవంతి కథమాభవంతి
న భౌమమన్యం నరకం శృణోమి.
ఊర్ధ్వం దేహాత్ కర్మణా జృంభమాణాద్
వ్యక్తం పృథివ్యామనుసంచరంతి

దం గాని అవమానానికి విచారం గాని పొందడు. నేను విద్వాంసుడను, దాతను, యజ్ఞాలు చేస్తున్నాను. నేను ఉత్తమ వ్రతాచారపరాయణుడను అని మనఃపూర్వకంగా అహంకరించి పలుకుతూంటాడో వాడు పతనమైపోతాడు. కాన అహంకారం త్యజించాలి. సమస్తమునకూ ఆశ్రయమై ప్రాచీనమైన దేదో మనస్సుయొక్క గతి యెక్కడైతే ఆగిపోతుందో ఆ పరబ్రహ్మ మీ కందరకు కళ్యాణదాయకమైనదని గ్రహించిన విద్వాంసుడు జీవబ్రహ్మైక్యసంధానము నంది నిరతిశయానందాన్ని పొందుతాడు.

90 వ అధ్యాయము సమాప్తం

## తొంబదిఒకటవ అధ్యాయము

సమస్త శాస్త్రానుసారభూతమైన ధర్మాలు బోధించగల యయాతిని తిరిగి అష్టకుడడిగాడు.

మహారాజా! సాంగవేదవిదులు పొందే ఉత్తమ లోకాలు చెప్పావు. బ్రహ్మచారి గృహస్థు వానప్రస్థు యతి యీ నలుగురూ యేయే ఉత్తమ కర్మాచరణలచే ఉత్తమలోకాన్ని పొందగలుగుతా రని అడిగిన అష్టకునికి యయాతి చెపుతున్నాడు.

గురువు చెప్పినట్లు చేస్తూ సకాలంలో నిత్యకర్మలు నెరవేరుస్తూ సర్వదా వేదాధ్యయనం అంగాధ్యయనం చేస్తూ గురువుకంటె ముందు నిద్రపోకుండా ముందు నిద్రనుండి లేస్తూ వినయము, జితేంద్రియత్వము, సావధానము, ధైర్యము కలిగి యుండేవాడే బ్రహ్మచర్యసిద్ధిని పొందగలుగుతాడు.

న్యాయార్జితమైన ధనంతో యజ్ఞాలు చేస్తూ దానధర్మాలు అతిథి అభ్యాగతులను పూజిస్తూ ఉండేవాడే సద్గృహస్థు. అతడే ఉత్తమలోకం పొందగలడు.

వనమందు నివాసము ఆహారవిహార నీమము స్వశక్తిమీదే ఆధారపడి జీవిస్తూ తా నార్జించిన దానిలో యితరులకుకూడా దానం చేస్తూ యేజీవికి బాధ లేకుండా చరించేవాడే వానప్రస్థు. ఉత్తమ లోకాధికారి.

శిల్పకళాదులచే జీవించకుండుట, శమదమాది శ్రేష్ఠగుణములు కలిగియుండుట, జితేంద్రియత్వం సర్వసంగపరిత్యాగం గృహస్థుల ఇండ్లలో శయనింపకుండుట, పరిగ్రహము లేకుండుట, ఒక్కడుగనే చరించుచుండుట, ఒకచోట నుండకుండుట యనునవి సన్యాసికి లక్షణములు. ఈతడే భిక్షువు. ఏసమయంలో రూప, రస, గంధాదులు తుచ్ఛములుగను విషయపరిత్యాగమే సుఖముగను తోచునో ఆసమయమందే విద్వాంసుడైనవాడు సమస్తమును త్యజించి వనవాసి కావలెను. వనవాసి యగు ముని వనంలోనే పాంచభౌతికశరీరాన్ని వదలుతే తాను తరిస్తూ ఇరువదియొక్క తరాన్ని తరింపజేస్తాడు—అని చెప్పిన యయాతిని అష్టకుడు తిరిగి ప్రశ్నిస్తున్నాడు.

రాజా! మునులు యెన్నితరగతులు. మౌనము ఎన్నివిధాలుగా ఉంటుందో వినాలని ఉంది చెప్పండి.

అష్టకా! అరణ్యంలో వసించేటప్పుడు గ్రామం గ్రామంలో ఉన్నప్పుడు అరణ్యం వెనుక భాగంలో

ఇమం భౌమం నరకం తే పతంతి
నావేక్షంతే వర్ష పూగాననేకాన్.
షష్టిం సహస్రాణి పతంతి వ్యోమ్ని
తథా అశీతిం పరివత్సరాణి
తాని వై తుదంతి పతతః ప్రపాతం
భీమా భౌమా రాక్షసా స్తీక్ష్ణదంష్ట్రాః.
యదేనస స్తే పతతస్తుదంతి
భీమా భౌమా రాక్షసా స్తీక్ష్ణదంష్ట్రాః
కథం భవంతి కథమాభవంతి
కథం భూతా గర్భభూతా భవంతి.
అస్రం రేతః పుష్పఫలానుపృక్త
మన్వేతి తద్వై పురుషేణ సృష్టం
స వై తస్యా రజ ఆపద్యతే వై
స గర్భభూతః సముపైతి తత్ర.
వనస్పతీనోషధీశ్చావిశన్తి
అపో వాయుం పృథివీం చాన్తరిక్షం
చతుష్పదం ద్విపదం చాపి సర్వ
మేవమ్భూతా గర్భభూతా భవన్తి.
అన్యద్ వపుర్విదధాతీహ గర్భ
ముతాహోస్విత్ స్వేన కామేన యాతి
ఆపద్యమానో నరయోనిమేతా
మాచక్ష్వ మే సంశయాత్ ప్రబ్రవీమి.
శరీరభేదాభిసముచ్ఛ్రయం చ
చక్షుఃశ్రోత్రే లభతే కేన సంజ్ఞాం
ఏతత్ త్వం సర్వమాచక్ష్వ పృష్టః
క్షేత్రజ్ఞం త్వాం తాత మన్యామ సర్వే.
వాయుఃసముత్కర్షతిగర్భయోని
మృతౌ రేతః పుష్పరసానుపృక్తం
సతత్రతన్మాత్రకృతాధికారః
క్రమేణాసంవర్ధయతీహ గర్భం.

స జాయమానో విగృహీతమాత్రః
సంజ్ఞామధిష్ఠాయ తతో మనుష్యః
సశ్రోత్రాభ్యాం వేదయతీహ శబ్దం
స వై రూపం పశ్యతి చక్షుషా చ.
ఘ్రాణేన గంధం జిహ్వయాథో రసం చ
త్వచా స్పర్శం మనసా వేదభావం
ఇత్యష్టకేహోపహితం హి విద్ధి
మహాత్మనాం ప్రాణభృతాం శరీరే.
యః సంస్థితః పురుషో దహ్యతే వా
నిఖన్యతే వాపి నికృష్యతే వా
అభావభూతః స వినాశమేత్య
కేనాత్మనా చేతయతే పరస్తాత్.
హిత్వా సోఽసూన్ సుప్తవన్నిష్టనిత్వా
పురోధాయ సుకృతం దుష్కృతం వా
అన్యాం యోనిం పవనాగ్రానుసారీ
హిత్వా దేహం భజతే రాజసింహ.
పుణ్యాం యోనిం పుణ్యకృతో వ్రజంతి
పాపాం యోనిం పాపకృతో వ్రజంతి
కీటాః పతంగాశ్చ భవంతి పాపా
న మే వివక్షాస్తి మహానుభావ.
చతుష్పదా ద్విపదాః షట్పదాశ్చ
తథాభూతా గర్భభూతా భవంతి
ఆఖ్యాతమేతన్నిఖిలేన సర్వం
భూయస్తు కిం పృచ్ఛసి రాజసింహ.
కింస్విత్ కృత్వా లభతే తాత లోకాన్
మర్త్యః శ్రేష్ఠాం స్తపసా విద్యయా వా
తన్మే పృష్టః శంస సర్వం యథావ
చ్ఛుభాంల్లోకాన్ యేన గచ్ఛేత్ క్రమేణ.
తపశ్చ దానం చ శమో దమశ్చ
హ్రీరార్జవం సర్వభూతానుకంపా

ఉంటాయో అలాంటివాడు ముని అని చెప్పబడతాడు.

అరణ్యంలో ఉన్నప్పుడు గ్రామం గ్రామంలో ఉన్నప్పుడు అరణ్యం మునికి వెనుక ఎలాఉంటాయి?

అరణ్యంలో ఉండేవాడు గ్రామంలో పదార్థాలు వాంఛించడు. అందువలననే వానప్రస్థునకు గ్రామం వెనుకబడినట్లే ఔతుంది. అగ్నిహోత్రము, గృహము యెవడు వదిలివేస్తాడో గోత్రము, వేద శాఖ జాతి అనువాని సంబంధము వదలుకుంటాడో మౌనంగా చరిస్తూ కౌపీనమాత్రధారియై ప్రాణ రక్షణార్థం ఆహారాన్ని వాంఛిస్తూంటాడో అలాంటి గ్రామవాసియగు ముని అరణ్యం వెనుకనే ఉన్నట్లు భావించాలి.

సమస్తకోర్కెలను వర్జించి, సర్వకర్మ పరిత్యక్తుడై, జితేంద్రియుడై మౌనముగ కూచుంటాడో అట్టి మౌని సిద్ధుడగుచున్నాడు. దంతములు పరిశుద్ధములై యుండుట, ముండనము త్రికాలముల యందు స్నాన మొనర్చుట గోళ్ళు తీసివేయుట యమనియమాది లక్షణములు కలిగియుండుట శీతోష్ణసహనంవల్ల శరీరము శ్యామ వర్ణము గనుండుట అను లక్షణములు కలిగి సదాచార సంపత్తి కలవాడే మానవునకు పూజనీయుడు కాడు. తపస్సువల్ల రక్తమాంసాలు క్షీణించి కృశీభూత శరీరుడైన వానప్రస్థు యీలోకాన్ని జయించును. సుఖదుఃఖాలు, రాగద్వేషాలు మొదలగు ద్వంద్వాలను జయించి మౌనం వహించినవాడు పరలోకాన్నికూడా జయిస్తాడు. ఆహారపానీయాలను నోటితోనే గ్రహిస్తూ గోముఖవ్రతావలంబియగు మౌని మోక్షార్హుడని గ్రహింపుము.

91వ అధ్యాయం సమాప్తం

## తొంబదిరెండవ అధ్యాయము

సూర్యచంద్రులవలె తమతమ లక్ష్యంవైపు పరుగెత్తే వానప్రస్థ సన్యాసులలో ఆత్మభావాన్ని ముందెవడు పొందగలుగుతాడు.

కామవృత్తిగల గృహస్థులమధ్య నివసిస్తూ కూడా జితేంద్రియుడై గృహంలేకుండాఉండే సన్యాసే ముందుగా మోక్షం పొందుతాడు.

వానప్రస్థుడైకూడ మధ్య మధ్య విషయోపభోగాలనుపొందుతూండేవాడు తిరిగి పశ్చాత్తప్తుడై తపస్సు చేస్తూనే ఉండాలి. వానప్రస్థాశ్రమంలో ఉన్నవాడు పాపకర్మలకు భయపడుతూ తనధర్మంలోనే చరిస్తూఉంటే సునాయాసంగా నిరతిశయానందాన్ని పొందగలుగుతాడు. పాపబుద్ధిగల మానవుడు అధర్మకార్యాలు చేస్తూంటాడు. వాడి ధనం కూడా అధర్మమైనదే అవుతుంది. ఇంద్రియాలను జయించలేడు. ఏదో ఒక రోజున సర్వనాశనమై పోతాడు. అలా కాకుండా శ్రేష్ఠమైన వానప్రస్థ విధులను గ్రహించి నడచుకునేవాడే సుఖించగలుగుతాడు.

మహారాజా! మిమ్ముల నిక్కడికి ఎవరు ఆహ్వానించారు? ఎవరు పంపారు? మీరు తరుణావస్థలో ఉండి పుష్పమాలాంకృతులై ఉన్నారు. మీ తేజస్సు చాలా గొప్పదిగా ఉంది. మీ రాకఎక్కడ

స్వర్గస్య లోకస్య వదంతి సంతోష
ద్వారాణి సప్తైవ మహాంతి పుంసాం
నశ్యంతి మానేన తమోఽభిభూతాః
పుంసః సదైవేతి వదంతి సంతః.
అధీయానః పండితం మన్యమానో
యో విద్యయా హంతి యశః పరేషాం
తస్యాంతవంతశ్చ భవంతి లోకా
న చాస్య తద్బ్రహ్మ ఫలం దదాతి.
చత్వారి కర్మాణ్యభయంకరాణి
భయం ప్రయచ్ఛంత్యయథాకృతాని
మానాగ్నిహోత్రముత మానమానం
మానేనేనాధీతముత మానయజ్ఞః.
న మానమాన్యోముదమాదదీత
న సంతాపం ప్రాప్నుయాంచ్చావమానాత్
సంతః సతః పూజయంతీహ లోకే
నాసాధవః సాధుబుద్ధిం లభంతే.
ఇతి దద్యామితి యజ ఇత్యధీయ ఇతివ్రతం
ఇత్యేతాని భయాన్యాహుస్తాని వర్జ్యాని సర్వశః
యే చాశ్రియం వేదయంతే పురాణం
మనీషిణో మానసమార్గరుద్ధం
తద్వః శ్రేయస్తేన సంయోగ మేత్య
పరాం శాంతిం ప్రాప్నుయుః ప్రేత్య చేహ.

90 వ అధ్యాయము సమాప్తం

## తొంబదిఒకటవ అధ్యాయము

చరన్ గృహస్థః కథమేతి ధర్మాన్
కథం భిక్షుః కథమాచార్య కర్మా
వానప్రస్థః సత్పథే సంనివిష్టో
బహూన్యస్మిన్ సంప్రతి వేదయంతి.
ఆహూతాధ్యాయీ గురుకర్మస్వచోద్యః
పూర్వోత్థాయీ చరమం చోపశాయీ
మృదుర్దాంతో ధృతిమానప్రమత్తః
స్వాధ్యాయశీలః సిధ్యతి బ్రహ్మచారీ.
ధర్మాగతం ప్రాప్య ధనం యజేత
దద్యాత్ సదైవాతిథీన్ భోజయేచ్చ
అనాదదానశ్చ పరైరదత్తం
సైషా గృహస్థోపనిషత్ పురాణీ.
స్వవీర్యజీవీ వృజినాన్నివృత్తో
దాతా పరేభ్యో న పరోపతాపీ
తాదృఙ్మునిః సిద్ధిముపైతి ముఖ్యాం
వసన్నరణ్యే నియతాహారచేష్టః.
అశిల్పజీవీ గుణవాంశ్చైవ నిత్యం
జితేంద్రియః సర్వతో విప్రయుక్తః
అనోకశాయీ లఘురల్పప్రచార
శ్చరన్ దేశానేకచరః స భిక్షుః.
రాత్ర్యా యయా వాభిజితాశ్చ లోకా
భవంతి కామభిజితాః సుఖాశ్చ
తామేవ రాత్రిం ప్రయతేత విద్వా
నరణ్యసంస్థో భవితుం యతాత్మా.
దశైవ పూర్వాన్ దశ చాపరాంశ్చ
జ్ఞాతీనథాత్మానమథైకవింశం
అరణ్యవాసీ సుకృతే దధాతి
విముచ్యారణ్యే స్వశరీరధాతూన్.
కతిస్విదేవ మునయః కతి మౌనాని చాప్యుత
భవంతీతి తదాచక్ష్వ శ్రోతుమిచ్ఛామహే వయం.

నుండి. మీ నివాసస్థాన మెక్కడ. సవిస్తరంగా చెప్పుమనే అష్టకునికి యయాతి వినిపిస్తున్నాడు.

నేను పుణ్యక్షయం కారణంగా యీ భౌమనరకంలో పతనమయే జీవిని. లోకపాలురు నన్ను పుణ్యలోకాన్నుండి త్రోసివేశారు. నేను పతనం కావడంలో సత్పురుషులమధ్య పడాలని ఇంద్రుని వల్ల వరం పొందాను. సత్సాంగత్యంవల్ల తిరిగి స్వర్గాన్ని పొందవచ్చుననే ఆశతో ఉన్నాను.

మీరు పారలౌకికజ్ఞానం కలవారనే విశ్వాసం నాకు ఉంది. నాకేదైనా పుణ్యలోకం ప్రాప్తించే కర్మఫలమే ఉంటే మీరు పతనం కాకుండాఉండురుగాక— అన్నాడు అష్టకుడు.

ఈ లోకంలో అరణ్యజీవులు గ్రామ్యపశువులు ఎన్నైతే ఉన్నాయో ఆ సంపత్తంతా నీకోరకై స్వర్గంలో ఉంది. నీవు పుణ్యాత్ముడవు.

యయాతి మాటలువిని అష్టకుడంటాడు. మహారాజా! స్వర్గంలో నా కే యే ప్రత్యేక స్థానాలు యేర్పడ్డాయో అవన్నీ నీకిచ్చేస్తున్నాను. అంతరిక్షంలో నాకై ఏర్పడిన పుణ్యలోకాలు నీకుప్రాప్తించుగాక. నీవు పతనం కాకుందువుగాక. నాపుణ్యఫలం అంతా నీకు నేను సమర్పిస్తున్నా నన్న అష్టకుని చూచి విప్రోత్తమ! బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణుడే ప్రతిగ్రహాధికారి. నేను క్షత్రియుడ నగుట ప్రతిగ్రహాధికారం లేదు. నేను గతంలో అనేక దానాలు విధివిధానంగా చేసాను. నేను బ్రాహ్మణుడను కాను. నా ధర్మం దానం చెయ్యడంకాని ప్రతిగ్రహించడంకాదు. సర్వధర్మాలు గ్రహించిన నేను ధర్మాన్నతిక్రమించలేనన్నాడు యయాతి.

అష్టక యయాతి సంవాదం వింటూన్న ప్రతర్దనుడు యయాతిని సంబోధించి అంటున్నాడు— మహారాజా! నీవు పరలోకజ్ఞానం కలవాడ వని గ్రహించాను. నాకేమైనా పరలోకా లున్నాయా? ఉంటే చెప్పు.

ప్రతర్దనా! అమృతప్రవాహము కలిగి ఘృతము తోకూడిన శోకరహితమైన లోకాలు నీ కొరకు చాలా ఉన్నాయి. ఒక్కొక్క లోకంలో ఏడేసి రోజులు నివసించడం మొదలుపెట్టినా యెప్పటికీ అంతం కానన్ని లోకాలు ఉన్నాయనీ అవన్నీ నీకొరకు ఎదురు చూస్తున్నాయనీ చెప్పే యయాతి మాటలు విని మహారాజా! ఆ లోకాలన్నీ నీవే అనుకో. మోహరహితుడవై ఆలోకాలకు వెళ్ళు. నీవు భూమియందు పడకు. అవి యెక్కడున్నా ఆ లోకాలకు వెళ్ళిపో. ఆ ఫలం అంతా నీ కిచ్చివేస్తున్నా— అన్నాడు ప్రతర్దనుడు.

సమాన తేజశ్శాలియగు రాజు విద్వాంసుడైన వాడు దైవవశంవల్ల ఆపత్కాలంలో కూడా పాప కార్యాలు చెయ్యడు. ఆలాగే ఇతరులనుండి యోగక్షేమాలు వాంఛించడు. వాంఛించరాదుకూడాను. రాజైనవాడు ధర్మమార్గమందే సంచరించాలు. ధర్మమం దాసక్తి కలవాడు దైన్యకార్యాలు చెయ్యడు. యశోహాని కలిగించే ప్రతిగ్రహం చెయ్యలేను. శుభకర్మలు చేసే వాంఛకలవాడు ఇలాంటి పనులు చెయ్యడు. ధర్మాధర్మ నిర్ణయం చెయ్యగలిగి కర్తవ్యా కర్తవ్య పరిజ్ఞానం కలవాడే విద్వాంసుడు. సత్యప్రతిజ్ఞ కలవాడే మానవంతుడుబౌతాడు. అలాంటివాడు తన స్వశక్తిమీదనే లోకపాలుడు కాగలడు. ధర్మకార్యంలో సంశయం కలిగినప్పుడు న్యాయతః ప్రాప్తించినా అర్థకామ్యాలను విడిచి ధర్మాన్నే అనుసరించాలి. అదే పరమధర్మము- అని పలుకుచున్న యయాతిని వసుమానుడు అడుగు

అరణ్యే వసతో యస్య గ్రామో భవతి పృష్ఠతః
గ్రామే వా వసతోఽరణ్యం మునిః స్యాజ్జనాధిప.
కథంస్విద్ వసతోఽరణ్యే గ్రామో భవతి పృష్ఠతః
గ్రామే వా వసతోఽరణ్యం కథం భవతి పృష్ఠతః.
న గ్రామ్యముపయుంజీత య ఆరణ్యోమునిర్భవేత్
తథాస్య వసతోఽరణ్యే గ్రామో భవతి పృష్ఠతః.
అనగ్నిరనికేతశ్చాప్యగోత్రచరణో మునిః
కౌపీనాచ్ఛాదనం యావత్ తావదిచ్ఛేచ్చ చీవరం.
యావత్ ప్రాణాభిసంధానం తావదిచ్ఛేచ్చ భోజనం
తథాస్య వసతో గ్రామేఽరణ్యం భవతి పృష్ఠతః.
యస్తు కామాన్ పరిత్యజ్య త్యక్తకర్మాజితేంద్రియః
ఆతిష్ఠేచ్చ మునిర్మౌనం సలోకే సిద్ధిమాప్నుయాత్.
ధౌతదంతం కృత్తనఖం సదా స్నాతమలంకృతం
అసితం సితకర్మాణం కస్తమర్హతి నార్చితుం.
తపసా కర్శితః క్షామః క్షీణమాంసాస్థిశోణితః
న చ లోకమిమం జిత్వా లోకం విజయతే పరం.
యథా భవతి నిర్ద్వంద్వో మునిర్మౌనం సమాస్థితః
అథ లోకమిమం జిత్వా లోకం విజయతే పరం.
ఆస్యేన తు యదాహారం గోవన్మృగయతే మునిః
అథాస్య లోకః సర్వోఽయం సోఽమృతత్వాయ కల్పతే.

91 వ అధ్యాయం సమాప్తం

## తొంబదిరెండవ అధ్యాయము

కతరస్త్వనయోః పూర్వం దేవానామేతి సాత్మతాం
ఉభయోర్ధావతో రాజన్ సూర్యాచంద్రమసోరివ.
అనికేతో గృహస్థేషు కామవృత్తేషు సంయతః
గ్రామ ఏవ వసన్ భిక్షుస్తయోః పూర్వతరంగతః.
అప్రాప్య దీర్ఘమాయుస్తుయఃప్రాప్తో వికృతిం చరేత్
తప్యేత యది తత్కృత్వా చరేత్ సోఽన్యత్ తపస్తతః.

పాపానాంకర్మణాం నిత్యం బిభ్యాద్యస్తు మానవః
సుఖమప్యాచరన్ నిత్యం సోఽత్యంతం సుఖమేధతే.
తద్వై నృశంసం తదసత్యమాహుః
ర్యః సేవతేధర్మమనర్థబుద్ధిః
అర్థోఽప్యనీశస్య తథైవ రాజం
స్తదార్జవం స సమాధిస్తదార్యం.
కేనాసి దూతః ప్రహితోఽద్య రాజన్
యువా స్రగ్వీ దర్శనీయః సువర్చాః
కుత ఆయాతః కతరస్యాం దిశి త్వ
ముతాహోస్విత్ పార్థివం స్థానమస్తి.
ఇమం భౌమం నరకం క్షీణపుణ్యః
ప్రవేష్టుముర్వీం గగనాద్విప్రహీణః
ఉక్త్వాహం వః ప్రపతిష్యామ్యనంతరం
త్వరంతి మాం లోకపా బ్రాహ్మణో యే.
సతాం సకాశే తు వృతః ప్రపాత
స్తే సంగతా గుణవంతస్తు సర్వే
శక్రాచ్చ లబ్ధో హి వరో మయైష
పతిష్యతా భూమితలం నరేంద్ర.
పృచ్ఛామి త్వాం మా ప్రపత ప్రపాతం
యది లోకాః పార్థివ సంతి మేఽత్ర
యద్యంతరిక్షే యది వా దివి స్థితాః
క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే.

తున్నాడు.

92వ అధ్యాయం సమాప్తం

## తొంబదిమూడవ అధ్యాయము

మహారాజా! నేను ఉపదశ్వుని కుమారుణ్ణి నాపేరు వసుమానుడంటారు. నీవు సర్వలోకాలయొక్క పరిజ్ఞానం కలవాడవని గ్రహించాను. నాకొరకు స్వర్గాదులలో ఎక్కడేనా స్థానం ఉందా— అని అడిగిన వసుమానునకు యయాతి చెపుతున్నాడు— రాజా! సూర్యకిరణ ప్రకాశ మెంత వరకూ వ్యాపిస్తూంటుందో అంతవరకూ నీకొరకై ఉత్తమలోకాలు యేర్పడి ఉన్నాయి. నాశనరహితాలైన ఆలోకాలు నీ రాకకెదురు చూస్తున్నాయి— అనడంతోనే వసుమాను డిలా అన్నాడు.

మహారాజా! నీవు పతనం చెందకు. ఆ లోకాలన్నీ నీకు యిచ్చివేస్తున్నాను. ప్రతిగ్రహం దోషమంటావా! ఐతే ఒక గడ్డిపోచ మూల్యంగా నాకిచ్చి ఆ లోకాలు తీసుకో.

వసుమాన్! నీ యౌదార్యం మెచ్చదగ్గదే కాని నీచక్రియుంతో నే నెన్నడూ యే వస్తువునూ పరిగ్రహించను. విజ్ఞులైన పూర్వు లెవరూ ఈ పని చెయ్యలేదు. నేనూ చెయ్యను. నేను ధర్మమార్గాన్నే చరిస్తాను—అనే యయాతిని సమాధాన పరచటానికి వసుమాను డీవిధంగా మళ్ళీ చెపుతున్నాడు— మహారాజా! నీచక్రియం నీ కభిమతం కాకపోతే నావల్ల అర్పించబడే పుణ్యలోకాలు ఉచితంగా నేగ్రహించు. నేను ఆలోకాలకు వెళ్ళను. నీవు నిస్సంశయంగా అలోకాలకు వెళ్ళు- అన్నాడు.

యయాతి వసుమానుల సంభాషణ వింటున్న శిబి మాట్లాడ్డం ఆరంభించాడు- తాతా! నేను ఉశీనర కుమారుణ్ణి. నాపేరు శిబి. నాకై స్వర్గాది లోకాలేవైనా ఉన్నాయేమో చెప్పు—అనగా శిబి వైపు తిరిగి వత్సా! నీవు దాతవు. సత్పురుషులకు అనేక దానాలు చేశావు. నీదగ్గరకొచ్చినవారి నెవరినీ మనోవాక్కాయాలలో దేనితోనూ యెవరినీ అవమానించలేదు. అందువల్ల నీకు అనంతమైన పుణ్యలోకాలున్నాయి. ఆ లోకాలన్నీ తేజోమయములు. అక్కడ మధురశబ్దాలేగాని అమంగళ వాక్యాలు వినపడవు-- అని చెప్పిన యయాతితో శిబి యిలా పలికాడు— మహారాజా! నీవు మూల్యానికి, నాకై నిర్ణయమైన లోకాలను తీసుకొనుటకు ఇష్టపడకపోతే నావల్ల ఉచితంగానే తీసుకో. ఆలోకాలలో నివసించుటకు నాకు ఇష్టంలేదు. ఆలోకాలకు వెళ్ళినవారెవ్వరూ శోకాన్ని పొందరు— అని చెప్పగా ఓరాజా! నీవు ఇంద్రసమాన తేజోవంతుడవు. నీ పుణ్యలోకాలు గూడ అనంతాలు. అయినప్పటికీ ఇతరులకై ఏర్పరుపబడిన లోకాలను నేను కోరను. ఆ కారణంచేత నేను ఆపుణ్యలోకాలను గ్రహించి నిన్ను అభినందించలేను— అని యయాతికి శిబి చెప్పాడు.

అప్పుడు అష్టకుడు ఈవిధంగా యయాతితో చెప్పడం ప్రారంభించాడు. ఓ రాజా! మే మందరము నీకొరకై యివ్వదలచుకొన్న పుణ్యలోకాలను నీవు ప్రసన్నుడవై తీసుకోకపోతే మేమే ఆలోకాలను మీకు సమర్పించి మేము నరకానికి వెళ్ళుటకు సిద్ధంగా ఉన్నాము—అని అష్టకుడు చెప్పగా— యయాతి ఇలా చెప్పాడు.

యావత్ పృథివ్యాం విహితం గవాశ్వం
సహారణ్యైః పశుభిః పార్వతైశ్చ
తావల్లోకా దివి తే సంస్థితా వై
తథా విజానీహి నరేంద్రసింహ.
తాంస్తే దదామి మా ప్రపత ప్రపాతం
యే మే లోకా దివి రాజేంద్ర సంతి
యద్యంతరిక్షే యది వా దివి శ్రితా
స్తానాక్రమ క్షిప్రమపేతమోహః.
నాస్మద్విధో బ్రాహ్మణో బ్రహ్మవిచ్చ
ప్రతిగ్రహే వర్తతే రాజ్యముఖ్య
యథా ప్రదేయం సతతం ద్విజేభ్య
స్తథాదదం పూర్వమహం నరేంద్ర.
నాబ్రాహ్మణః కృపణో జాతు జీవేద్
యాచాపి స్యాద్బ్రాహ్మణీ వీరపత్నీ
సోఽహం నైవాకృతపూర్వం చరేయం
విధిత్సమానః కిము తత్ర సాధు.
పృచ్ఛామి త్వాం స్పృహణీయరూప
ప్రతర్దనోఽహం యది మే సంతి లోకాః
యద్యంతరిక్షే యది వా దివి శ్రితాః
క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే.
సంతి లోకా బహవస్తే నరేంద్ర
అప్యేకైకః సప్తసప్తాప్యహాని
మధుచ్యుతో ఘృతపృక్తా విశోకా
స్తే నాంతవంతః ప్రతిపాలయంతి.

తాంస్తే దదాని మా ప్రపత ప్రపాతం
యే మే లోకాస్తవ తే వై భవంతు
యద్యంతరిక్షే యది వా దివి శ్రితా
స్తానాక్రమ క్షిప్రమపేతమోహః.
న తుల్యతేజాః సుకృతం కామయేత
యోగక్షేమం పార్థివ పార్థివః సన్
దైవాదేశాదాపదం ప్రాప్య విద్వాం
శ్చరేన్నృశంసం న హి జాతు రాజా.
ధర్మ్యం మార్గం యతమానో యశస్యం
కుర్యాన్నృపో ధర్మమవేక్షమాణః
న మద్విధో ధర్మబుద్ధిః ప్రజానన్
కుర్యాదేవం కృపణం మాం యథాఽఽత్థ.
కుర్యాదపూర్వం న కృతం యదన్యై
ర్విధిత్సమానః కిము తత్ర సాధు
ధర్మాధర్మౌ సువినిశ్చిత్య సమ్యక్
కార్యాకార్యేష్వప్రమత్తశ్చరేద్యః.
స వై ధీమాన్ సత్యసంధః కృతాత్మా
రాజా భవేల్లోకపాలో మహిమ్నా
యదా భవేత్ సంశయో ధర్మకార్యే
కామార్థే వా యత్ర విందంతి సమ్యక్.
కార్యం తత్ర ప్రథమం ధర్మకార్యం
న తౌ కుర్యాదర్థకామౌ స ధర్మః
బ్రువాణమేనం నృపతిం యయాతిం
నృపోత్తమో వసుమానబ్రవీత్తం

92 వ అధ్యాయం సమాప్తం

## తొంబది మూడవ అధ్యాయము

పృచ్ఛామి త్వాం వసుమానౌషదశ్వి
ర్యద్యస్తి లోకో దివి మే నరేంద్ర
యద్యంతరిక్షే ప్రథితో మహాత్మన్
క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే

నేను పూర్వకాలంలో ఏపని అయితే చేయలేదో ఇప్పుడు కూడ ఆ పని నేను చేయలేను. చేయుట కూడ సమంజసం కాదు. ఏపనైతే యోగ్యం అని నాకు తోచిందో ఆపనినే పూర్వం చేశాను. అట్టిపనులనే సాధుసత్పురుషులు అభినందించారు. కనుక మీరు చెప్పినట్లు నేనుపూర్వం ఆచరించని ఏపనినీ ఇప్పుడు చేయలేను— అని చెప్పిన యయాతితో అష్టకుడు ఇలా అన్నాడు— ఆకాశంలో బంగారు వికారమైన అయిదురథాలు పుణ్యలోకాలకు తీసుకొని వెళ్ళుటకు సిద్ధంగా వున్నాయి. ఆ రథాలను అధిరోహించి మానవులు స్వర్గాది లోకాలకు వెళ్ళుటకు కోరుతారు— అని చెప్పగా ఆ రథాలు అన్నీ మీకొరకై ఏర్పరచబడినవే అనియూ అవి మిమ్ములనే స్వర్గానికి తీసికొని వెడతాయి. అనియు యయాతి అష్టకునకు చెప్పాడు. ఈ సమయమందే తపఃప్రభావసంపన్నురాలైన మాధవి అక్కడకు చేరింది. మాధవి మృగచర్మ ధారిణియై, మృగాలతో వనములలో సంచారంచేస్తూ ఆహార పానీయాలు మృగముల లాగే చేస్తూ ఏఒక్కజీవికి హానిచేయని మృగవ్రతావలంబినై మృగసమూహంతో కూడిన యజ్ఞవాటికను ప్రవేశించి అత్యంత మనోహరమైన యజ్ఞధూమాన్ని ఆఘ్రాణిస్తూ అక్కడ సంచారం చేయసాగింది. అలా సంచారం చేసే సమయంలో యజ్ఞమహిమాన్వితులైన తన కుమారులను మాధవి చూచిచాలా ఆనందించింది. నహుష నందనుడైన యయాతి క్రిందికివచ్చి భూమిమీద కాలుమోపక అంతరాళమందేయుండి ఆమెను చూశాడు. మాధవి తనతండ్రియైన యయాతిని గుర్తించి ప్రణామం చేసింది.

తపస్వినియైన మాధవితో అప్పుడు వసుమంతుడు ఈలా చెప్పాడు— తల్లీ! నీవు వర్ణించతగిన దేవతలలో శ్రేష్ఠురాలవు. ఈమహాపురుషునకు నీవు నమస్కరించావు. ఈయన ఎవరు? ఈయన ఏ దేవత? లేక ఏ రాజు? నీకు తెలిసినట్లయితే నాకు చెప్పు— అని వసుమంతుడు తల్లియైన మాధవిని కోరగా ఆమె ఈలా చెప్పింది— కుమారా! మీరందరూకూడ ఈ విషయం వినాలి. ఈయన నహుష నందనుడైన యయాతి మహారాజు. నాకు తండ్రి. నా కుమారులైన మీకందరకూ మాతామహుడు ఇతడే. గొప్ప యశస్సు నార్జించాడు. ఈతడు నా సోదరుడైన పురునకు రాజ్యాభిషేకం చేసి స్వర్గలోకాన్ని పొందాడు కాని ఏకారణంచేత స్వర్గాన్నుండి తిరిగి భూలోకానికి వచ్చాడో తెలియదు— అని మాధవి చెప్పగా వసుమంతుడు ఆమెతో ఇలా అన్నాడు.

అమ్మా! ఈతడు తన స్థానమైన స్వర్గాన్నుండి చ్యుతుడయ్యాడు— అని చెప్పగా మాధవి సంభ్రమాశ్చర్యచిత్తం కలదై కుమారులతో కూడిన ఆమె తన తండ్రియైన యయాతితో ఈలా చెప్పింది— తండ్రీ! నేనుఅమోఘమైనతపస్సువల్ల ఈలోకాలన్నిటినీ జయించాను. వాటిని నీకు ఇస్తాను. నీవు గ్రహించవలసింది. వేదవేదాంగ విదులైన మహర్షులు ఏంచెపుతున్నారంటే— పుత్రులు పౌత్రులు ఆచరించు కర్మల్లాగే పుత్రికలు దౌహిత్రులు ధర్మాచరణవల్ల ఆర్జించిన పుణ్యం కూడా నీవు పొందవచ్చు. కనక మావల్ల ఆపుణ్యాన్ని గ్రహించే నీవు స్వర్గలోకాన్ని పొందమని మాధవి తండ్రిని కోరింది.

యావత్పృథివ్యాం విహితం గవాశ్వం
సహారణ్యైః పశుభిః పార్వతైశ్చ
లోకాస్తావంతో దివి సంస్థితా వై
తే నాంతవంతః ప్రతిపాలయంతి.
తాంస్తే దదాని మా ప్రపత ప్రపాతం
యే మే లోకాస్తవ తే వై భవంతు
క్రీణీష్వైతాంస్తృణకేనాపి రాజన్
ప్రతిగ్రహస్తే యది ధీమన్ ప్రదుష్టః.
న మిథ్యాహం విక్రయం వై స్మరామి
వృథా గృహీతం శిశుకాచ్ఛంకమానః
కుర్యాం న చైవాకృతపూర్వమన్యైః
వివిత్సమానః కిముతత్ర సాధు.
తాంస్త్వ లోకాన్ ప్రతిపద్యస్వ రాజన్
మయా దత్తాన్ యది నేష్టః క్రయస్తే
అహం న తాన్ వై ప్రతిగంతా నరేంద్ర
సర్వే లోకాస్తవ తే వై భవంతు.
పృచ్ఛామి త్వాం శిబిరౌశీనరోఽహం
మమాపి లోకా యది సన్తీహ తాత
యద్యన్తరిక్షే యది వా దివి శ్రితాః
క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే.
యత్ త్వాం వాచా హృదయేనాపి సాధూన్
పరీప్సమానాన్ నావమంస్థా నరేంద్ర
తేనానన్తా దివి లోకాః శ్రితాస్తే
విద్యుద్రూపాః స్వనవన్తో మహాన్తః.
తాంస్త్వం లోకాన్ ప్రతిపద్యస్వ రాజన్
మయా దత్తాన్ యది నేష్టః క్రయస్తే.
న చాహం తాన్ ప్రతిపత్స్యే హ దత్వా
యత్ర గత్వా నానుశోచన్తి ధీరాః.
యథా త్వమింద్రప్రతిమప్రభావ
స్తే చాప్యనన్తా నరదేవ లోకాః

తథాద్య లోకే న రమేఽన్యదత్తే
తస్మాచ్ఛిబే నాభినందామి దేయం.
న చేదేకైకశో రాజల్లోకాన్ నః ప్రతినన్దసి
సర్వే ప్రదాయ భవతే గన్తారో నరకం వయమ్.
యదర్హోఽయం తదద్య తద్వ్యంసన్తః సత్యాభినందినః
అహం తన్నాభిజానామి యత్ కృతం నమయా పురా.
కిస్యైతే ప్రతిదృశ్యన్తే రథాః పంచ హిరణ్మయాః
యానారుహ్య నరో లోకానభివాంఛతి శాశ్వతాన్.
యుష్మానేతి వహిష్యన్తి రథాః పంచ హిరణ్మయాః
ఉచ్చైః సన్తః ప్రకాశన్తే జ్వలన్తోఽగ్నిశిఖా ఇవ.
ఏతస్మిన్నంతరే చైవ మాధవీ తు తపోధనా
మృగచర్మపరీతాంగీ పరిణామే మృగవ్రతమ్.
మృగైః సహ చరన్తీ సా మృగాహారవిచేష్టితా
యజ్ఞవాటం మృగగణైః ప్రవిశ్య భృశవిస్మితా.
ఆఘ్రాయన్తీ ధూమగంధం మృగైరేవ చచార సా
యజ్ఞవాటమటన్తీ సా పుత్రాంస్తాన్ స పరాజితాన్.
పశ్యన్తీ యజ్ఞమాహాత్మ్యం ముదం లేభే చ మాధవీ
అసంస్పృశన్తం వసుధాం యయాతిం నాహుషం తదా.
దివిష్ఠం ప్రాప్తమాజ్ఞాయ వవన్దే పితరం తదా
తతో వసుమనాః పృచ్ఛన్ మాతరం వై తపస్వినీం.
భవత్యా యత్ కృతమిదం వన్దనం వరవర్ణిని
కోఽయం దేవోఽథవా రాజా యది జానాసి మే వద.
శృణుధ్వం సహితాః పుత్రా నాహుషోఽయం
పితా మమ
యో మాతృత్వం మమ పుత్రాణాం మాతామహ ఇతి శ్రుతః.
పూరుం మే భ్రాతరం రాజ్యే సమావేశ్య దివంగతః
కేన వా కారణేనైవ ఇహ ప్రాప్తో మహాయశాః.
తస్యాస్తద్వచనం శ్రుత్వా స్థానభ్రష్టే చాబ్రవీత్
సా పుత్రస్య వచః శ్రుత్వా సమ్భ్రమాన్నష్టచేతనా.
మాధవీ పితరం ప్రాహ దౌహిత్రపరివారితం
తపసా నిర్జితాన్లోకాన్ ప్రతిగృహ్ణీష్వ మామకాన్.

తమయొక్క పుణ్య కర్మఫలాన్ని తీసుకొని స్వర్గధామాన్ని పొందుట న్యాయమేనని మాధవి చెప్పగా తండ్రియైన యయాతి ఈలా చెప్పాడు– ధర్మజనితమైన ఫలము లన్నియూ శుభములనే చేకూరుస్తాయి. నేను ధర్మాచరణ పరులైన నా కుమార్తె, నా దౌహిత్రులు నన్ను తిరిగి స్వర్గ ధామానికి పంపుతున్నారు. కనక ఈ రోజునుంచి పితృకర్మములలో దౌహిత్రులకు పూర్ణంగా అధికారం ఉంటుంది. దౌహిత్రులు ఆచరించే పితృ కర్మలన్నీ పవిత్రములే అవుతాయి. వారు పితరులను సంతోషపెట్టుటకు యోగ్యమైనవారు కనక ఇందుకు సందేహం లేదు.

శ్రాద్ధకర్మలలో పవిత్రమైనవి మూడుమాత్రమే ఉన్నాయి. అవి దౌహిత్రుడు, కుతప, తిలలు, ఈ కర్మలలో ప్రశంసనీయమైన గుణాలు మూడు ఉండాలి. పవిత్రత, అక్రోధం, తొందరలేకపోవుట, ఇదిగాక పితృకర్మలందు వేదపురాణాదిపఠనం జరుగుతూండగా భోక్తలు, వడ్డించువారు, యజమాని. వినేవారు, వినిపించేవారు, కూడ పవిత్రత గలవారే. కుతపకాల మనగా పగటిభాగమందు ఎనిమిదవ భాగం. ఆ కాలమందే పితరులను గూర్చి చేయు దానములు అక్షయ మవుతాయి. తిలలు పిశాచముల బారినుండి పితృకర్మలను రక్షిస్తాయి. దర్భలు రాక్షస బారినుండి రక్షిస్తాయి. శ్రోత్రియులైన బ్రాహ్మణులు పంక్తిని రక్షిస్తారు. యతీశ్వరులు గనక శ్రాద్ధ అన్నమును భుజించినచో ఆ కర్మ అక్షయ మవుతుంది. ఉత్తమ వ్రతాచరణ గల పవిత్ర శ్రోత్రియ బ్రాహ్మణులు పితృకర్మలలో ఉత్తమపాత్రత గలవారు. ఉత్తమమైన బ్రాహ్మణులు ఎప్పుడు లభిస్తారో అప్పుడే పితృకర్మాచరణకు యోగ్యమైన కాలము. అట్టివారి కిచ్చేదానమే ఉత్తమమైనది. ఇంతకు మించిన ఉత్తమ కాలమనేది లేనేలేదు.– అని ప్రజ్ఞానిధియైన యయాతి పల్కి తన దౌహిత్రులకు ఇంకా చెప్పడం ఆరంభించాడు.

మీరు ఆరంభించిన పవిత్రయాగమును మంగళాంతంగా సమాప్తినొందించుటకు మీరు అవబృధ స్నానం చేయాలి. అప్పుడు కాని ఆ కార్యంయొక్క సఫలితం సిద్ధించదు–అని చెప్పగా అష్టకుడు ఇలా అన్నాడు–ఓ మహారాజా! మేము అవబృధస్నానం చేసేవరకూ నీవు ఈ రథాన్ని అధిరోహించి సిద్ధంగా వుండాలి. ఎప్పుడు సమయం ఆసన్న మవుతుందో అప్పుడు మేముకూడ నిన్ను అనుసరించి స్వర్గలోకానికి వస్తాము– అని చెప్పాడు.

అప్పుడు యయాతి ఇలా అన్నాడు-మనమందరం కలసి స్వర్గధామానికి ప్రయాణం చేయుటకు అనుకూలమైన కాలం ఇప్పుడు చేకూరింది. దేవలోక యాత్రకు యోగ్యమైన సాత్వికమార్గం ఎలాగో నేను పూర్వం చూచివున్నాను–అని చెప్పి వారందరూ అవబృధ స్నానానంతరం ఆ రథాలను అధిరోహించి ధర్మబల సంపన్నులై స్వర్గారోహణకై ప్రయాణసన్నద్ధు లయ్యారు. ఆసమయంలో మంగళ సూచకమైన వారి తేజోపుంజం ఆకాశంఅంతా వ్యాపించింది. అష్టకుడు శిబి ప్రతర్దనుడు వసుమానుడు ఈ నలుగురూ ఒక్క సారిగా స్వర్గలోకానికి చేరారు.

ఆ సమయంలో అష్టకుడు యయాతిని ఈలా ప్రశ్నించాడు– మహారాజా! మహాత్ముడగు ఇంద్రుడు నాకు సర్వదా ప్రాణస్నేహితుడు. నేను ఒక్కడనే వానివద్దకు వెళ్ళగలిగాను. కాని ఈ

పుత్రాణామివ పౌత్రాణాం ధర్మాదధిగతం ధనం
స్వార్థమేవ వదన్తీహ ఋషయో వేదపారగాః.
తస్మాద్ దానేన తపసా అస్మాకం దివమావ్రజ
యది ధర్మఫలం హ్యేతచ్ఛోభనం భవితా తథా.
దుహితాత్రైవ దౌహిత్రైస్తారితోఽహం
మహాత్మభిః
తస్మాత్ పవిత్రం దౌహిత్రమద్యప్రభృతి పైతృకే.
భవిష్యతి న సందేహః పితౄణాం ప్రీతివర్ధనమ్
త్రీణి శ్రాద్ధే పవిత్రాణి దౌహిత్రః కుతపస్తిలాః.
త్రీణి చాత్ర ప్రశంసన్తి శౌచమక్రోధమత్వరాం
భోక్తారః పరివేష్టారః శ్రావితారః పవిత్రకాః.
దివసస్యాష్టమే భాగే మందీభవతి భాస్కరే
సకాలః కుతపో నామ పితౄణాం దత్తమక్షయం.
తిలాః పిశాచాద్ రక్షంతిదర్భారక్షంతి రాక్షసాత్
రక్షంతి శ్రోత్రియాఃపంక్తింయతిభిర్భుక్తమక్షయమ్.
లబ్ధ్వా పాత్రం తు విద్వాంసం శ్రోత్రియం
సువ్రతం శుచిమ్
సకాలః కాలతో దత్తం నాన్యథా కాల ఇష్యతే.
ఏవముక్త్వా యయాతిస్తు పునః ప్రోవాచ బుద్ధిమాన్
సర్వేహ్యవబృథస్నాతా స్త్వరధ్వంకార్యగౌరవాత్
ఆతిష్ఠస్వ రథాన్ రాజన్ విక్రమస్వ విహాయసం
వయమప్యనుయాస్యామో యదా కాలో భవిష్యతి
సర్వైరిదానీం గంతవ్యం సహ స్వర్గజితో వయమ్
ఏష నో విరజాః పన్థా దృశ్యతే దేవసద్మనః.
తేఽధిరుహ్య రథాన్ సర్వే ప్రయాతా నృపసత్తమా
ఆక్రమన్తో దివం భాభిర్ధర్మేణావృత్య రోదసీ.
అష్టకశ్చ శిబిశ్చైవ కాశిరాజః ప్రతర్దనః
ఐక్ష్వాకవో వసుమనాశ్చత్వారో భూమిపాశ్చ హ
సర్వే హ్యవబృథస్నాతాః స్వర్గగాః సాధవః సహ.
అహం మన్యే పూర్వమేకోఽస్మి గన్తా
సఖా చేంద్రః సర్వథా మే మహాత్మా
కస్మాదేవం శిబిరౌశీనరోఽయ
మేకోఽత్యగాత్ సర్వవేగేన వాహాన్.
అదదద్ దేవయానాయ యావద్ విత్తమవిందత
ఉశీనరస్యపుత్రోఽయంతస్మాచ్ఛ్రేష్ఠోహివహాశిబిః.
దానం తపః సత్యమథాపి ధర్మో
హ్రీః శ్రీ క్షమా సౌమ్యమథో విధిత్సా
రాజన్నేతాన్యప్రమేయాణి రాజ్ఞ
శిబేః స్థితాన్యప్రతిమస్య బుద్ధ్యా.
ఏవం వృత్తో హ్రీనిషేవశ్చ యస్మాత్
తస్మాచ్ఛిబిరత్యగాద్ వై రథేన
అథాష్టకః పునరేవాన్వపృచ్ఛ
న్మాతామహం కౌతుకేనేంద్రకల్పమ్.
పృచ్ఛామి త్వాం నృపతే బ్రూహి సత్యం
కుతశ్చ కశ్చాసి సుతశ్చ కస్య
కృతం త్వయా యద్ధి న తస్య కర్తా
లోకే త్వదన్యః క్షత్రియో బ్రాహ్మణో వా.
యయాతిరస్మి నహుషస్య పుత్రః
పూరోః పితా సార్వభౌమస్త్విహాసమ్
గుహ్యం చార్థం మామకేభ్యో బ్రవీమి
మాతామహోఽహం భవతాం ప్రకాశం.
సర్వామిమాం పృథివీం నిర్జిగాయ
ప్రాదామహం ఛాదనం బ్రాహ్మణేభ్యః
మేధ్యానశ్వానేకశతాన్ సురూపాం
స్తదా దేవాః పుణ్యభాజో భవన్తి.
అదామహం పృథివీం బ్రాహ్మణేభ్యః
పూర్ణామిమామఖిలాం వాహనేన
గోభిః సువర్ణేన ధనైశ్చ ముఖ్యై
స్తదాదదం గాః శతమర్బుదాని.
సత్యేన వై ద్యౌశ్చ వసుంధరా చ

స్వర్గలోక యాత్రలో మా రథాలను మించిన వేగంతో శిబి యొక్క వాహనం ముందుగా స్వర్గాన్ని ఎట్లు చేరింది. ఇందులకు కారణమే మున్నది? ఇది ఏలా జరిగింది— అని ప్రశ్నించిన అష్టకునకు యయాతి ఇలా అన్నాడు— ఉశీనరపుత్రుడైన శిబి బ్రహ్మలోకప్రాప్తి నొందుటకు తనయొక్క సర్వస్వాన్ని ధారపోసిన త్యాగి కావడంచేత అతనికే ఆశక్తి లిగింది. దానం తపస్సు సత్యం ధర్మం హ్రీ శ్రీ క్షమ సాత్వికభావం ఉత్తమ వ్రతాచరణ యందు అభిలాష అనే సద్గుణా లన్నిటికీ శిబి ఆకరం. ఈసద్గుణరాసి కారణంగా అతడు మహా బుద్ధిమంతుడు. అతనితో సమానుడు ఎవడూ లేడు. అతడు చాలా అభిమానశాలి. అందుచేతనే శిబి మనకందరికంటె వేగంగా వెళ్ళగలిగాడు— అని చెప్పిన యయాతిని అష్టకుడు తిరిగి ఇలా ప్రశ్నించాడు— ఓ తాతా! నేను నిన్ను ఒక్క విషయం అడగదల్చాను. ఆవిషయం నాకు చెప్పాలి. నీవు ఎక్కడనుండి వచ్చావు? నీవు ఎవరికుమారుడవు? ఏదైనా పుణ్యకర్మను ఆచరించడంలో నిన్ను మించిన మహారాజుగాని బ్రాహ్మణోత్తముడు గాని ఈ ప్రపంచంలో లేడని తలుస్తా. నా సందేహం తీర్చుమని కోరగా యయాతి యిలా చెప్పాడు.

నేను నహుషుని కుమారుడను. యయాతి అనువాడను. నా కుమారుడు పురు అనువాడు. ఈ లోకంలో నేను ఒక చక్రవర్తిగా వుండేవాడిని. మీ అందరకూ మాతామహుడను. మీదగ్గరకూడ రహస్యంగా వుంచవలసిన విషయం తెలియ పరుస్తున్నాను. ఈ భూమండలాన్నంతనీ నేను జయించాను. బ్రాహ్మణులకు అన్నవస్త్ర దానాదులు చేశాను. ఏమనుజుడైతే ఒక్కసారిగా అందమైన పవిత్రమైన అశ్వాలను నూరింటిని దానం చేస్తాడో అట్టివాడు పుణ్య పురుషుడై దేవతా సమానుడవుతాడు. నేను గుర్రములు, గోవులు సువర్ణము, ధనముతో కూడిన ఈ భూమండలాన్నంతనూ బ్రాహ్మణుల కొరకై దానం చేశాను. నూరు అర్బుతముల గోవులనుకూడ దానమిచ్చాను. సత్యపరిపాలనవల్లనే పృథివి అంతరిక్షములు నిశ్చలంగా వున్నాయి. అలాగే సత్యం కారణంగా మానవలోకంలో అగ్ని శాంతియాపంగా ప్రజ్వరిల్లుతోంది. నేను ఎప్పుడూ వ్యర్థవాక్యాలను ఉచ్చరించలేదు. సాధుపురుషు లెప్పుడూ సత్యాన్నే ఆరాధిస్తారు.

ఒ అష్టకా! నీతోను ప్రతర్దనునితోను వసుమానునితోను నేను చెప్పిన విషయాలన్నీ సత్య సంగతములే. సత్యమును అనుష్టించుటవల్లనే అన్నిలోకాలు మునులు దేవతలూ పూజింపబడ తారని నా విశ్వాసం. ఏమానవులైతే ఈర్ష్య లేనివారై స్వర్గాన్ని పొందిన మనయొక్క యదార్థ చరిత్రను ద్విజశ్రేష్ఠుల ద్వారా విని ఆనందిస్తారో వారుకూడ మనతో సమానమై పుణ్యలోక ప్రాప్తి నొందుతారని యయాతి అష్టకునకు చెప్పాడు.

ఉత్తమకర్మాచరణుడు, అజేయుడు అయిన యయాతిమహారాజుతో సహా వారందరూ కీర్తి చంద్రికలను భూమండలం అంతా వ్యాపింపజేసి, స్వర్గధామాన్ని పొందారని వైశంపాయనుడు జనమేజయ మహారాజునకు విశదీకరించాడు.

93 వ అధ్యాయం సమాప్తం

తథ్యా వాగ్నిర్జ్వలతే మానుషేషు
న మే మృషా వ్యాహృతమేవ వాక్యం
సత్యం హి సంతః ప్రతిపూజయంతి.
యదష్టక ప్రబ్రవీమీహ సత్యం
ప్రతర్దనం చౌషదశ్విం తథైవ
సర్వే చ లోకా మునయశ్చ దేవాః
సత్యేన పూజ్యా ఇతి మే మనోగతం.

యో నః స్వర్గజితః సర్వాన్ యథా వృత్తం
నివేదయేత్
అనసూయుర్ద్విజాగ్రేభ్యః స లభేన్నః సలోకతాం.
ఏవం రాజా స మహాత్మా హ్యతీవ
ప్రియైర్దౌహిత్రైస్తారితోఽమిత్రసాహః
త్యక్త్వా మహీం పరమోదారకర్మా
స్వర్గం గతః కర్మభిర్వ్యాప్య పృథివీం.

93 వ అధ్యాయము సమాప్తం

## తొంబది నాల్గవ అధ్యాయము

భగవన్ శ్రోతుమిచ్ఛామి పూరోర్వంశకరాన్ నృపాన్
యద్వీర్యాన్ యాదృశాంశ్చాపి యావతో
యత్పరాక్రమాన్.
న హ్యస్మిన్ శీలహీనో వా నిర్వీర్యో వా నరాధిపః
ప్రజావిరహితో వాపిభూతపూర్వః కథంచన.
తేషాం పృథితవృత్తానాం రాజ్ఞాం విజ్ఞానశాలినాం
చరితం శ్రోతుమిచ్ఛామి విస్తరేణ తపోధన.
హంత తే కథయిష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి
పూరోర్వంశధరాన్ వీరాచ్ఛక్రప్రతిమతేజసః
భూరిద్రవిణవిక్రాంతాన్ సర్వలక్షణపూజితాన్.
ప్రవీరేశ్వరరౌద్రాశ్వాస్త్రయః పుత్రా మహారథా
పూరోః పౌష్ట్యామజాయంత ప్రవీరో వంశకృత్తత.
మనస్యురభవత్ తస్మాచ్ఛూరసేనీసుతః ప్రభుః
పృథివ్యాశ్చతురంతాయా గోప్తా రాజీవలోచనః.
శక్తః సంహననో వాగ్మీ సౌవీరీతనయాస్త్రయః
మనస్యురభవన్ పుత్రాః శూరాః సర్వే మహారథాః.
అన్వగ్భానుప్రభృతయో మిశ్రకేశ్యాం మనస్వినః
రౌద్రాశ్వస్య మహేష్వాసా దశాప్సరసి సూనవః.
యజ్వానో జజ్ఞిరే శూరాః ప్రజావంతో బహుశ్రుతాః
సర్వే సర్వాస్త్రవిద్వాంసః సర్వే ధర్మపరాయణాః.
ఋచేయురథ కక్షేయుః కృకణేయుశ్చ వీర్యవాన్
స్థండిలేయుర్వనేయుశ్చ జలేయుశ్చ మహాయశాః.
తేజేయుర్బలవాన్ ధీమాన్ సత్యేయుశ్చేంద్ర
విక్రమః
ధర్మేయుః సంనతేయుశ్చ దశమో దేవవిక్రమః.
అనాధృష్టిరభూత్ తేషాం విద్వాన్ భువి తథైకరాట్
ఋచేయురథ విక్రాంతో దేవానామివ వాసవః
అనాధృష్టిసుతస్త్వాసీద్ రాజసూయాశ్వమేధకృత్
మతినార ఇతి ఖ్యాతో రాజా పరమధార్మికః.
మతినారసుతా రాజంశ్చత్వారోఽమితవిక్రమాః
తంసుర్మహానతిరథో ద్రుహ్యుశ్చాప్రతిమద్యుతిః.
దుష్యంతం శూరభీమౌ చ ప్రవసుం వసుమేవ చ
తేషాం శ్రేష్ఠోఽభవద్రాజా దుష్యంతో జనమేజయ.
దుష్యంతాద్భరతో జజ్ఞే విద్వాఞ్ఛాకుంతలో నృపః
తస్మాద్భారతవంశస్య విప్రతస్థే మహద్యశః.
భరతస్తిసృషు స్త్రీషు నవ పుత్రానజీజనత్
నాభ్యనందత తాన్ రాజా నానురూపా మమేత్యుత.
తతస్తాన్ మాతరః క్రుద్ధాః పుత్రాన్ నిన్యుర్యమక్షయం

కథాకథన కుశలుడైన వైశంపాయనుని జనమేజయ మహారాజు అనంతర వృత్తాంతాన్ని గూర్చి ఈలా అడిగాడు.

మహర్షీ! ఇప్పుడు పురువంశాన్ని అభివృద్ధి చేసిన రాజన్యుల చరిత్ర వినగోరుతున్నాను. వారి బలపరాక్రమాలెట్టివి? వారందరూ ఎంతమంది సవిధంగా రాజ్యం పాలించారు? ఈ పురువంశంలో సంతానహీనులు పరాక్రమ శూన్యులు, శీలసద్గుణ రహితులు ఎవ్వరూ ఉండరని నా నమ్మకం. సదాచరణసంపన్నులు వివేకవంతులు ఈ పురువంశంలో విస్తారంగా కీర్తిని ఆర్జించారని నా ఉద్దేశం. వారి యొక్క చరిత్రను వినిపింపుము-అని జనమేజయుడు కోరగా వైశంపాయనుడు ఈలా చెప్పడం మొదలు పెట్టాడు.

ఓ జనమేజయా! నీవు అడిగిందంతా చెపుతాను. పురువంశంలో జన్మించిన రాజన్యులందరూ ఇంద్రసమానతేజోరూపులు. అత్యంత ధనవంతులు. సమస్త శుభలక్షణాలతో కూడిన మహాపరాక్రమ శీలురు. వారందరనీ గూర్చి చెపుతాను. విను — అన్నాడు వైశంపాయనుడు.

పురునకు పౌష్టిఅనే భార్యవల్ల ప్రవీర ఈశ్వర రౌద్రాశ్వ లను ముగ్గురుపుత్రులు ఉదయించారు. వారు మహారథులు. వీరిలో ప్రవీరుడు ప్రథముడు కావడంవల్ల రాజ్యానికి వచ్చాడు. ప్రవీరుని కుమారుడు మనస్యు అనువాడు సూరసేనుని గర్భమందు జన్మించాడు. వాడు మహాపరాక్రమవంతుడు. పద్మపత్రములవంటి నేత్రాలు కల మనస్యుడు చతుస్సముద్రవేలావలయిత భూమండలాన్ని జయించి పాలించాడు. ఈ మనస్యునకు సౌవీరి గర్భమందు ముగ్గురు కుమారులు జన్మించారు. వారు శక్త సంహనన వాగ్మినామాంకితులు. వీరు ముగ్గురూ మహారథులే. పురుమహారాజు మూడవ కుమారుడైన రౌద్రాశ్వునకు మిశ్రకేశియను అప్సరసవల్ల అన్వగ్భాను మొదలగు పదిమంది మహాధనుర్ధరు లుద్భవించారు. వారందరూ యాగాలు చేశారు. శూరులు సంతానవంతులు అస్త్ర శస్త్రములను సాధించాడు. సత్యధర్మపరాయణులు. వారిపేర్లు ఇవి: ఋచేయు కక్షేయు కృకణేయు స్థండిలేయు వనేయు జలేయు తేజేయు సత్యేయు ధర్మేయు సంనతేయులు అనువారలు.

వీరందరిలోను ఋచేయు అనునతడు మహాపరాక్రమవంతుడై దేవతలలో ఇంద్రునివలె ప్రకాశించాడు. భూమండలాన్నంతకూ చక్రవర్తి అయ్యాడు. ఈతనికి అనాధృష్టి అను మారుపేరు కూడ కలదు. ఈతని కుమారుడు మతినారుడు. ఈతడు రాజసూయం అశ్వమేధాది యాగాలను చేశాడు. మతినారునకు నల్గురుపుత్రులు. వారి పేర్లు తంసు మహానుడు అతిరథుడు దుహ్యుడు వీరిలో మహాపరాక్రమవంతుడైన తంసుడు పౌరవంశాన్ని వృద్ధిచేశాడు.

కంసుని కుమారుడు ఈలినుడు. ఈతడు విజయమును సాధించువారిలో శ్రేష్ఠుడు. భూమండలాన్నంతనీ పాలించాడు. ఈలినునకు రథంతరివల్ల దుష్యంతుడు మొదలుగా పంచభూతములతో సమానులు అగు అయిదుగురు పుత్రులు కలిగారు. వారి పేర్లు దుష్యంతుడు శూరుడు భీముడు ప్రవసుడు వసు అనువారలు. వీరిలో దుష్యంతుడు శ్రేష్ఠుడు. రాజ్యానికి వచ్చాడు.

దుష్యంతునికి శకుంతలవల్ల భరతుడు జన్మించాడు. వానివల్ల భరతవంశం ప్రసిద్ధికెక్కింది. భర

తతస్తస్య నరేంద్రస్య వితథం పుత్రజన్మ తత్.
తతో మహద్భిః క్రతుభిరీజానో భరతస్తదా
లేభే పుత్రం భరద్వాజాద్భుమన్యుం నామ భారత.
తతః పుత్రిణమాత్మానం జ్ఞాత్వా పౌరవనందనః
భుమన్యుం భరతశ్రేష్ఠ యౌవరాజ్యేఽభ్యషేచయత్.
తతో దివిరథో నామ భుమన్యోరభవత్ సుతః
సుహోత్రశ్చ సుహోతా చ సుహవిస్సుయజుస్తథా.
పుష్కరిణ్యామృచీకశ్చ భుమన్యోరభవన్ సుతాః
తేషాం జ్యేష్ఠః సుహోత్రస్తు రాజ్యమాప మహీక్షితాం.

రాజసూయాశ్వమేధాద్యైస్సోఽయజద్బహుభిస్సవైః
సుహోత్రః పృథివీం కృత్స్నాం బుభుజే సాగరాంబరాం.

పూర్ణాం హస్తిగజాశ్వైశ్చ బహురత్నసమాకులాం
మమజ్జేవ మహీం తస్య భూరిభారావపీడితా.
హస్త్యశ్వరథసంపూర్ణా మనుష్యకలిలా భృశం
సుహోత్రే రాజని తదా ధర్మతః శాసతి ప్రజాః.
చైత్యయూపాంకితా చాసీద్భూమిః శతసహస్రశః
ప్రవృద్ధజనసస్యా చ సర్వదైవ వ్యరోచత.
ఐక్ష్వాకీ జనయామాస సుహోత్రాత్ పృథివీపతేః.
అజమీఢం సుమీఢం చ పురుమీఢం చ భారత.
అజమీఢో వరస్తేషాం తస్మిన్ వంశః ప్రతిష్ఠితః
షట్ పుత్రాన్ సోఽప్యజనయత్ తిసృషు స్త్రీషు భారత.
ఋక్షం ధూమిన్యథో నీలీ దుష్యంతపరమేష్ఠినౌ
కేశిన్యజనయజ్జహ్నుం సుతౌ చ జనరూపిణౌ.
తథేమే సర్వపాంచాలా దుష్యంతపరమేష్ఠినోః
అన్వయాః కుశికా రాజన్ జహ్నోరమితతేజసః.
వ్రజనరూపిణయోర్జ్యేష్ఠమృక్షమాహుర్జనాధిపం
ఋక్షాత్ సంవరణో జజ్ఞే రాజన్ వంశకరః సుతః.
ఆర్క్షే సంవరణే రాజన్ ప్రశాసతి వసుంధరాం
సంక్షయః సుమహానాసీత్ ప్రజానామితి నః శ్రుతం.
వ్యశీర్యత తతో రాష్ట్రం క్షయైర్నానావిధైస్తదా
క్షున్మృత్యుభ్యామనావృష్ట్యా వ్యాధిభిశ్చ సమాహతం
అభ్యఘ్నన్ భారతాంశ్చైవ సపత్నానాం బలాని చ
చాలయన్ వసుధాం చేమాం బలేన చతురంగిణా.
అభ్యయాత్తం చ పాంచాల్యో విజిత్య తరసా మహీం
అక్షౌహిణీభిర్దశభిః స ఏనం సమరేఽజయత్.
తతః సదారః సామాత్యః సపుత్రః ససుహృజ్జనః
రాజా సంవరణస్తస్మాత్ పలాయత మహాభయాత్.
సింధోర్నదస్య మహతో నికుంజే న్యవసత్తదా
నదీవిషయపర్యంతే పర్వతస్య సమీపతః,
తత్రావసన్ బహూన్ కాలాన్ భారతా దుర్గమాశ్రితాః
తేషాం నివసతాం తత్ర సహస్రం పరివత్సరాన్.
అథాభ్యగచ్ఛద్భరతాన్ వసిష్ఠో భగవానృషిః
తమాగతం ప్రయత్నేన ప్రత్యుద్గమ్యాభివాద్య చ.
అర్ఘ్యమభ్యాహరంస్తస్మై తే సర్వే భారతాస్తదా
నివేద్య సర్వమృషయే సత్కారేణ సువర్చసే.
తమాసనే చోపవిష్టం రాజా వవ్రే స్వయం తదా
పురోహితో భవాన్నోఽస్తు రాజ్యాయ ప్రయతేమహి.

ఓమిత్యేవం వసిష్ఠోఽపి భారతాన్ ప్రత్యపద్యత
అథాభ్యషించత్ సామ్రాజ్యే సర్వక్షత్రస్య పౌరవం.
విషాణభూతం సర్వస్యాం పృథివ్యామితి నః శ్రుతం
భరతాధ్యుషితం పూర్వం సోఽధ్యతిష్ఠత్ పురోత్తమం.
పునర్బలిభృతశ్చైవ చక్రే సర్వమహీక్షితః
తతః స పృథివీం ప్రాప్య పునరీజే మహాబలః.
అజామీఢో మహాయజ్ఞైర్బహుభిర్భూరిదక్షిణైః
తతః సంవరణాత్ సౌరీ తపతీ సుషువే కురుం.
రాజత్వే తం ప్రజాః సర్వా ధర్మజ్ఞ ఇతి వవ్రిరే

తునియొక్క ముగ్గురుభార్యలకు తొమ్మండుగురు పుత్రులు జన్మించారు. తనకు అనురూపులు కాక పోవటంచేత వారిని భరతుడు అభినందించలేదు. ఆ కారణంచేత తన ముగ్గురు భార్యలను భరతుడు వధించాడు. భరతునకు ఆ పుత్రుల జననం వ్యర్థ మయింది.

మహారాజైన భరతుడు యజ్ఞయాగాదికములు అనేకములొనర్చి తుదకు భరద్వాజమహర్షి అను గ్రహంవల్ల భుమన్యువనే కుమారుని పొందాడు. పౌరవంశోద్ధారకుడైన భరతుడు భుమన్యునకు యౌవరాజ్యాభిషేకం చేశాడు. భరతుని అనంతరం భుమన్యుడు రాజ్యానికి వచ్చాడు. భుమన్యునకు దివిరథుడు అనువాడు కలిగాడు. దివిరథుడేగాక భుమన్యునకు సుహోత్రి సుహోత సుహవి సుయజు ఋచీకి అను కుమారులుకూడ కలరు. వీరందరూ పుష్కరిణికి జన్మించారు. వీరిలో సుహోత్రుడే జ్యేష్ఠుడు. వీనికే రాజ్యం వచ్చింది.

ఈ సుహోత్రుని రాజ్యంలో గుర్రములు, ఏనుగులు, రత్నములు, రథములు వృద్ధినొందాయి. రాజసూయం, అశ్వమేధం మొదలైన క్రతువులు ఆచరించాడు. నాల్గుసముద్రములపర్యంతం భూమండలాన్ని శాసించాడు. ధర్మబుద్ధితో రాజ్యపాలన చేసి ప్రజాసంరక్షణచేశాడు. ఈతని రాజ్యకాలంలో భూమి భారాన్ని భరించలేకపోయింది. ఈతని రాజ్యంలో లక్షలాది దేవమందిరాలు నిర్మింపబడ్డాయి. ప్రజలందరూ సంతుష్టితో జీవించారు. కృషివాణిజ్యాదికములు అభివృద్ధిచెందాయి. ఈతని రాజ్యం వైభవసంపదలతో తులతూగింది. ఈ సుహోత్రునకు ఏక్ష్వాకివల్ల అజామిడ, సుమీడ, పురుమీడ అను ముగ్గురు పుత్రులు కలిగారు. వీరిలో అజామీడు డనువాడు జ్యేష్ఠుడు. వీడు వంశ ప్రతిష్ఠను నిల్పి రాజ్యంచేశాడు. ఈతడు ముగ్గురు భార్యలవల్ల ఆరుగురు పుత్రులను బడశాడు.

ధూమినివల్ల ఋక్షుడు, నీలినివల్ల దుష్యంతుడు పరమేష్ఠి కేశినియందు జహ్ను ప్రజన రూపిణుడు అను ఆరుగురు జన్మించారు. వీరిలో దుష్యంతుడు పరమేష్ఠియొక్క పుత్రులందరూ పాంచాలురని పిలువబడ్డారు. అమిత తేజోవంతుడగు జహ్నుని వంశం కుశికవంశం అని ప్రసిద్ధకెక్కింది. ప్రజన రూపిణాదులలో జ్యేష్ఠసోదరుడగు ఋక్షుడు రాజ్యానికి వచ్చాడు. అతనికి సంవరణుడు జన్మించాడు. సంవరణుడు రాజ్యమును పాలించునపుడు ప్రజానాశనం ఎక్కువగా జరిగింది.

సంవరణుని రాజ్యకాలంలో అనావృష్టి, వ్యాధులు, క్షామములు మృత్యువు విలయతాండవం చేయడంవల్ల ప్రజానాశనం ఏర్పడి రాజ్యం వ్యాకులత చెందింది. శత్రుసైన్యాలు భరతవంశయోధులను నాశనంచేయడం మొదలుపెట్టాయి. పాంచాల నరేశుడు చతురంగబలోపేతుడై సంవరణునిమీదికి దండెత్తి పది అక్షౌహిణీల సైన్యంతో సంవరణుని జయించి పారదోలాడు. సంవరణుడు స్త్రీలను పుత్రులను మంత్రులను స్నేహితులను తీసికొని భయభ్రాంతచిత్తుడై సింధునదీప్రాంతానికి పారిపోయాడు. అక్కడ నదీతటమందు నికుంజములో నివాసం ఏర్పరచుకొన్నాడు. ఆప్రదేశం పర్వత సమీపంనుండి నదీతీరంవరకూ వ్యాపించింది. అక్కడే ఆదుర్గమప్రదేశాన్నే ఆశ్రయించుకొని భరతవంశక్షత్రియులు ఒక వేయిసంవత్సరాలవరకూ నివాసం చేశారు.

ఈసమయంలోనే వారివద్దకు మహర్షిశ్రేష్ఠుడైన వసిష్ఠుడు వచ్చాడు. ఆ వచ్చిన మహర్షిని

తస్య నామ్నాభివిఖ్యాతం పృథివ్యాం కురుజాంగలం.
కురుక్షేత్రం స తపసా పుణ్యం చక్రే మహాతపాః
అశ్వవంతమభిష్యంతం తథా చైత్రరథం మునిం.
జనమేజయం చ విఖ్యాతం పుత్రాంశ్చాస్యాను
శుశ్రుమ
పంచైతాన్ వాహినీపుత్రాన్వ్యజాయతమనస్వినీ.
అవిక్షితః పరిక్షిత్తు శబలాశ్వస్తు వీర్యవాన్
ఆదిరాజో విరాజశ్చ శాల్మలిశ్చ మహాబలః.
ఉచ్చైఃశ్రవా భంగకారో జితారిశ్చాష్టమఃస్మృతః
ఏతేషామన్వవాయే తు ఖ్యాతాస్తే కర్మజైర్గుణైః
జనమేజయాదయః సప్తతథైవాన్యే మహారథాః
పరిక్షితోఽభవన్ పుత్రాః సర్వే ధర్మార్థకోవిదాః
కక్షసేనోగ్రసేనౌ తు చిత్రసేనశ్చ వీర్యవాన్.
ఇంద్రసేనః సుషేణశ్చ భీమసేనశ్చ నామతః
జనమేజయస్య తనయా భువి ఖ్యాతామహాబలాః.
ధృతరాష్ట్రః ప్రథమజం పాండుర్బాహ్లీక ఏవ చ
నిషధశ్చ మహాతేజాస్తథా జాంబూనదో బలీ.
కుండోదరః ప్రదాతిశ్చ వసాతిశ్చాష్టమః స్మృతః
సర్వే ధర్మార్థకుశలాః సర్వభూతహితే రతాః.
ధృతరాష్ట్రోఽథ రాజాఽఽసీత్ తస్యపుత్రోఽథ
కుండికః
హస్తీ వితర్కః క్రాథశ్చ కుండినశ్చాపి పంచమః.
హవిఃశ్రవాస్తథేంద్రాభో భుమన్యుశ్చాపరాజితః
ధృతరాష్ట్రసుతానాంతుత్రీనేతాన్ప్రథితాన్ భువి
ప్రతీపం ధర్మనేత్రం చ సునేత్రం చాపి భారత
ప్రతీపః ప్రథితస్తేషాం బభూవాప్రతిమో భువి.
ప్రతీపస్య త్రయః పుత్రా జజ్ఞిరే భరతర్షభ
దేవాపిః శాంతనుశ్చైవ బాహ్లీకస్చ మహారథః.
దేవాపిశ్చ ప్రవవ్రాజ తేషాం ధర్మహితేప్సయా
శాంతనుశ్చ మహీం లేభే బాహ్లీకశ్చ మహారథః.
భరతస్యాన్వయే జాతాః సత్వవంతో నరాధిపాః
దేవర్షికల్పా నృపతే బహవో రాజసత్తమాః.
ఏవం విధాశ్చాప్యపరే దేవకల్పా మహారథాః
జాతా మనోరన్వవాయే ఐలవంశభివర్ధనాః.

94 వ అధ్యాయము సమాప్తం

## తొంబది ఐదవ అధ్యాయము

శ్రుతస్త్వత్తో మయా బ్రహ్మన్ పూర్వేషాం
సంభవో మహాన్
ఉదారశ్చాపి వంశేఽస్మిన్ రాజానో మేపరిశ్రుతాః
కింతు లఘ్వర్థసంయుక్తంప్రియాఖ్యానంనమామతి.
స త్వం భవాన్ భూయో విస్తరేణ బ్రవీతు మే.
ఏతామేవ కథాం దివ్యామాప్రజాపతితో మనోః
తేషామాజననం పుణ్యం కస్య న ప్రీతిమావహేత్.
సద్ధర్మగుణమహాత్మైరభివర్ధితముత్తమం
విష్టభ్య లోకాంస్త్రీనేషాం యశః స్ఫీతమవస్థితం.
గుణప్రభావవీర్యౌజః సత్వోత్సాహవతామహం
న తృప్యామి కథాంశృణ్వన్నమృతాస్వాదసమ్మితాం
శ్రీణ్ రాజన్ పురా సమ్యక్ మయా
ద్వైపాయనాచ్ఛ్రుతం
ప్రోచ్యమానమిదం కృత్స్నం స్వవంశజననం శుభం.
దక్షాదదితిరదితేర్వివస్వాన్ వివస్వతో మనుర్మనో
రిలా ఇలాయాః పురూరవాః పురూరవస
ఆయురాయుషో నహుషో నహుషాద్యయాతిః
యయాతే ర్ద్వేభార్యే బభూవతుః.

భరతవంశీయులందరూ ఆహ్వానించి ఉత్తమ ఆసనం యిచ్చి కూర్చుండబెట్టి సత్కారపూర్వకంగా వారి సర్వస్వాన్నీ సమర్పించి సంతుష్టునిచేసి ఈవిధంగా వసిష్ఠుని ప్రార్థించారు. ఓ మహర్షీ ! మేము తిరిగి రాజ్యంకొరకు ప్రయత్నం చేస్తున్నాము. తమరు మాకు పురోహితులుగా వుండాలని కోరుతున్నాము— అని కోరినవెంటనే వసిష్ఠుడు అందులకు అంగీకరించి భూమండలం అంతటికీ సంవరణుని సామ్రాజ్యాధిపతిగా చేశాడు. అప్పటినుంచి భరతవంశీయులు శ్రేష్ఠమైన నగరంలో నివాసం చేయడం మొదలుపెట్టారు. తిరిగి రాజ్యాన్నంతనూ వశంచేసుకున్నతర్వాత భూరిదక్షిణలతో కూడిన మహాయజ్ఞాలను సంవరణుడు చేశాడు. కొంతకాలానికి సూర్యకన్యయైన తపతివల్ల సంవరణునకు కురు అనే కుమారుడు కలిగాడు.

కురుయొక్క ధర్మబుద్ధికి ప్రజలు అతనిని ఆదరించి రాజ్యానికి రాజు చేశారు. వానికి అశ్వవానుడు అభిష్యంతుడు చిత్రరథుడు సుప్రసిద్ధుడగు జనమేజయుడు అను అయిదుగురు పుత్రులు వాహినీవల్ల జన్మించారు. అశ్వవానునియొక్క మారుపేరు అవిక్షితుడు. వానికి పరీక్షిత్తు శబలాశ్వుడు ఆదిరాజు విరాజు శాల్మలి ఉచ్చైశ్రవుడు భంగకారుడు జితారి అను ఎనమండుగురు కుమారులు జన్మించారు. సత్కర్మాచరణవల్ల అశ్వవానుడు ప్రసిద్ధికెక్కాడు. ఈతని వంశంలో జనమేజయుడు మొదలగు ఏడుగురు మహారథులుకూడా జన్మించారు. పరీక్షిత్తుయొక్క పుత్రులందరూ ధర్మార్థజ్ఞాన సంపన్నులు. కక్షసేనుడు ఉగ్రసేనుడు చిత్రసేనుడు ఇంద్రసేనుడు సుషేణుడు భీమసేనుడు అనువారలు అతని పుత్రులు. జనమేజయుని పుత్రులు విశ్వవిఖ్యాతి నార్జించారు. వారిలో ప్రథముడు. ధృతరాష్ట్రుడు. చిన్నవారు పాండు బాహ్లీక నిషధ జాంబూనద కుండోదర పదాతి వసాతి అనువారలు. వీరందరూకూడ ధర్మార్థ కుశలురు. సమస్తప్రాణుల హితవును కోరేవారు.

ధృతరాష్ట్రుడు రాజయ్యాడు. వీనియొక్క కుమారులు కుండిక వాస్తీ వితర్క క్రోధ కుండిన హవిశ్శ్రవుడు ఇంద్రాభుడు భుమన్యు అపరాజితుడు అనువారలు. వీరుగాక ప్రతీపుడు ధర్మనేత్రుడు సునేత్రుడు అను ముగ్గురుకూడ ధృతరాష్ట్రపుత్రులే. ఈ ముగ్గురే ధృతరాష్ట్రపుత్రులలో విఖ్యాతి నొందినవారు. వీరిలో ప్రతీపుని ఖ్యాతి అనంతము. ప్రతీపునకు దేవాపి శంతనుడు బాహ్లీకుడు అను ముగ్గురు పుత్రులు కలరు. వీరిలో దేవాపి ధర్మాచరణపరాయణుడై లోకకళ్యాణం కొరకు తపమాచరించుకొనుటకై వనానికి వెళ్ళాడు. ఆకారణంచేత శంతనుడు బాహ్లీకుడు రాజ్యాధికారాన్ని పొందారు. వీరందరూ ధైర్య శౌర్య గుణసంపన్నులైన భరతవంశీయులు. ఈవంశంలో శ్రేష్ఠులైన రాజన్యచూడామణులు అందరూ దేవర్షులవలె విశేషఖ్యాతి నార్జించారు. వీరందరూ పూరువంశమును వృద్ధిచేసినవారే.

94 వ అధ్యాయం సమాప్తం

ఉశనసో దుహితా దేవయానీ వృషపర్వణశ్చ దుహితా శర్మిష్ఠానామ.

యదుం చ తుర్వసుం చైవం దేవయానీ వ్యజాయత దృహ్యుం చానుం చ పూరుం చ శర్మిష్ఠా వార్షపర్వణీ.

తత్ర యదోర్యాదవాః పూరోః పౌరవాః.

పూరోస్తు భార్యా కౌసల్యా నామ తస్యామస్య జజ్ఞే జనమేజయో నామ యస్త్రీనశ్వమేధానాజహార విశ్వజితా చేష్ట్వా వనం వివేశ.

జనమేజయః ఖల్వనంతాంనామోపయేమేమాధవీం తస్యామస్య జజ్ఞే ప్రాచిన్వాన్ యః ప్రాచీం దిశం జిగాయ యావత్ సూర్యోదయాత్ తత స్తస్య ప్రాచిన్వత్వం.

ప్రాచిన్వాన్ ఖల్వశ్మకీముపయేమే యాదవీం తస్యామస్య జజ్ఞే సంయాతిః.

సంయాతిః ఖలు దృషద్వతో దుహితరం వరాంగీం నామోపయేమే తస్యామస్య జజ్ఞే అహంయాతిః.

అహంయాతిః ఖలు కృతవీర్య దుహితర ముప యేమే భానుమతీం నామ తస్యామస్య జజ్ఞే సార్వభౌమః.

సార్వభౌమః ఖలు జిత్వా జహార కైకీయీం సునందాం నామ తాముపయేమే తస్యామస్య జజ్ఞే జయత్సేనో నామ.

జయత్సేనోఖలు వై దర్భీముప యేమే సుశ్రవాం నామ తస్యామస్య జజ్ఞే అవాచీనః.

అవాచీనోఽపి వై దర్భీమపరా మే వోప యేమే మర్యాదాం నామ తస్యామస్య జజ్ఞే అరిహః.

అరిహః ఖల్వాంగీముపయేమే తస్యామస్య జజ్ఞే మహాభౌమః.

మహాభౌమః ఖలు ప్రాసేనజితీముపయేమే సుయజ్ఞాం నామ తస్యామస్య జజ్ఞే అయుతనాయీ యః పురుషమేధానామయుతమానయత్ తే నా స్యాయుతనాయిత్వం.

అయుతనాయీ ఖలు పృథుశ్రవసో దుహితర ముపయేమే కామాం నామ తస్యామస్య జజ్ఞే అక్రోధనః.

స ఖలు కాలింగీం కరంభాం నామోపయేమే తస్యామస్య జజ్ఞే దేవాతిథిః.

దేవాతిథిః ఖలు వైదేహీముపయేమే మర్యాదాం నామ తస్యామస్య జజ్ఞే అరిహో నామ.

అరిహః ఖల్వాంగ్గేయీముపయేమే సుదేవాం నామ తస్యాం పుత్రమజీజనదృక్షం.

ఋక్షః ఖలు త క్ష క దు హి త ర ముపయేమే జ్వాలాం నామ తస్యాం పుత్రం మతినారం నామో త్పాదయామాస.

మతినారః ఖలు సరస్వత్యాం గుణసమన్వితం ద్వాదశావర్షికం సత్రమాహరత్ సమాప్తే చ సత్రే సరస్వత్యభిగమ్య తం భర్తారం వరయామాస తస్యాం పుత్రమజీనసత్ తంసుం నామ.

తంసుం సరస్వతీం పుత్రం మతినారాదజేజనత్ ఈలినం జనయామాసకాలింగ్యాం తంసురాత్మజం.

ఈలినస్తు రథంతర్యాం దుష్యంతద్యాన్ పంచ పుత్రానజీజనత్.

దుష్యంతః ఖలు విశ్వామిత్రదుహితరం శకుంతలాం నామోపయేమే తస్యామస్య జజ్ఞే భరతః.

భస్త్రా మాతా పితుః పుత్రో యేన జాతః స ఏవ సః భరస్వ పుత్రం దుష్యంత మావమంస్థాః శకుంతలాం.

రేతోధాః పుత్ర ఉన్నయతి నరదేవ యమక్ష

## తొంబదిఐదవ అధ్యాయము

విప్రశ్రేష్ఠ ! నీకరుణచే పూర్వకాలపు రాజుల ఉత్పత్తి విన్నాను. పూరువంశంలో జన్మించిన ఉదారుల పేర్లుకూడా విన్నాను. కాని సంక్షేపంగా చెప్పడంవల్ల నాకింకా తృప్తికలగడంలేదు. సవిస్తరంగా ఆ కథలు వర్ణించి చెప్పకోర్తాను. మనువులతో ఆరంభమైన యీ దివ్యచరిత్ర వినాలని యెవరికుండదు. ఉత్తమ ధర్మగుణములు కలిగిన ఆ రాజన్యులయొక్క కీర్తి మూడుకాలాలయందు వ్యాప్తిచెందింది. ఆ మహారాజులందరూ పరాక్రమనంతులు. బలశౌర్యగుణాలు కలవారు కావటంచేత నాకింకా వారిచరిత్ర వినాలని ఉందని చెప్పే జనమేజయునకు వైశంపాయనుడు తరువాతి కథా వృత్తాంతం చెప్పడం ఆరంభించాడు.

జనమేజయా ! నేను పూర్వకాలంలో మంగళప్రదమైన మీ పూర్వులవృత్తాంతమంతా విన్నాను. అదే చెపుతున్నాను విను.

దక్షునివల్ల అదితి అదితికి సూర్యుడు సూర్యునకు మనువు మనువునకు ఇల ఇలవల్ల పురూరవుడు పురూరవునకు ఆయువు అతనికి నహుషుడు నహుషునకు యయాతి జన్మించారు. యయాతికి దేవయాని శర్మిష్ఠ అనే యిద్దరు భార్యలున్నారు.అందులో దేవయానివల్ల యదు తుర్వసులు శర్మిష్ఠవల్ల ద్రుహ్యుడు అనువు పూరుడూ ఉదయించారు. యదువునుండి యాదవవంశమూ పూరువల్ల పౌరవవంశము వృద్ధి చెందింది. పూరు భార్యపేరు. కౌసల్య లేక పౌష్టి అనేవారు. పౌష్టిగర్భాన్నుండి ప్రవీర నామాంతరం గల జనమేజయు డుద్భవించాడు. ఇతడు మూడశ్వమేధాలు చేసి వానప్రస్థుడయాడు. జనమేజయుడు మధువంశంలో పుట్టి అనంతను వివాహమై ప్రాచీన్వాను డనే పుత్రుని కన్నాడు. అతడు ఒకేరోజులో తూర్పుదిక్కంతా జయించడంవల్ల అతని కీనామం కలిగింది.

ప్రాచీన్వానుడు యదుకులకన్య అశ్మకిని పెండ్లాడాడు. ఆమెకు సంయాతి పుట్టాడు. సంయాతి దృషద్వంతుని కూతురు వరాంగిని వివాహమై అహంయాతి అనేవాణ్ణి కన్నాడు. ఆతనికి కృతవీర్య పుత్రి భానుమతివల్ల సార్వము డనేవాడు జనించాడు. ఈతడు స్వయంవరంలో అందరినీ జయించి కేకయనాథుని కూతురు సునందను హరించి తెచ్చాడు. ఆమెవల్ల జయత్సేనుడు జనించి విదర్భకుమారి సుశ్రవను పరిగ్రహించి అవాచీనుడనే కుమారుని కన్నాడు. అతడు విదర్భ రాజకన్య మర్యాదను వివాహమై అరిహుడనే పుత్రుని కన్నాడు. అరిహు డంగరాజకుమారివల్ల మహాభౌముని ఆతనికి ప్రశేనజిత్పుత్రికవల్ల అయుతనాయుడు కలిగాడు. ఈతడు పదివేల నరమేధాలు చేశాడు. కనకనే యీత డయుతనాయు డైనాడు. ఈతనివల్ల పృథుశ్రవస పుత్రిక కామకు అక్రోధనుడు జనించాడు.

కళింగదేశకన్య రంభవల్ల దేవాతిథి యీతనికి విదేహరాజనందిని మర్యాదవల్ల ఋక్షుడు జన్మించారు. ఋక్షునకు తక్షకపుత్రి జ్వాలవల్ల మతినారుడు పుట్టి సరస్వతీతీరంలో పన్నెండేండ్లు యజ్ఞానుష్ఠానంచేస్తే సరస్వతి ప్రసన్నురాలై భర్తగా వరించింది. సరస్వతివల్ల తంసు డుదయించాడు. అతనికి కళింగరాజకన్యవల్ల ఈలిను డుదయించి రథంతరివల్ల దుష్యంతుణ్ణి కన్నాడు. దుష్యంతునకు విశ్వామిత్రపుత్రి శకుంతలవల్ల భరతుడు జనించాడు. అప్పుడే శకుంతల దుష్యంతునితో అంటుంది— కుమారుడు తండ్రికిసంబంధించినవాడే కాని

యాత్ త్వం చాస్య ధాతా గర్భస్య సత్యమాహ శకుంతలా.

తతోఽస్య భరతత్వం భరతః ఖలు కాశేయీ ముపయేమే సార్వసేనీం సునందాం నామ తస్యా మస్య జజ్ఞే భుమన్యుః.

భుమన్యుః ఖలు దాశార్హీ ముపయేమే విజయాం నామ తస్యామస్యజజ్ఞే సుహోత్రః.

సుహోత్రః ఖల్విక్ష్వాకుకన్యాముపయేమే సువర్ణాంనామ తస్యామస్య జజ్ఞేహస్తీయఇదం హస్తినపురం స్థాపయామాస ఏతదస్య హాస్తినపురత్వం.

హస్తీ ఖలు త్రైగర్తీముపయేమే యశోధరాం నామ తస్యామస్య జజ్ఞే వికుంఠనో నామ.

వికుంఠనః ఖలు దశార్హీముపయేమే సుదేవాం నామ తస్యామస్యా జజ్ఞే అజమీఢో నామ.

అజమీఢస్య చతుర్వింశం పుత్రశతం బభూవ కైకేయ్యాం గాంధార్యాం విశాలాయామృక్షాయాంచేతి పృథక్పృథగ్వంశధరా నృపతయః తత్ర వంశకరః సంవరణః.

సంవరణః ఖలు వైవస్వతీం తపతీం నామోపయేమే తస్యామస్య జజ్ఞే కురుః.

కురుః ఖలు దాశార్హీముపయేమే శుభాంగీం నామ తస్యామస్య జజ్ఞే విదూరః.

విదూరస్తు మాధవీముపయేమే సంప్రియాం నామ తస్యామస్య జజ్ఞే అనశ్వా నామ.

అనశ్వా ఖలుమాగధీ ముపయేమే అమృతాం నామ తస్యామస్య జజ్ఞే పరిక్షిత్.

పరిక్షిత్ ఖలు బాహుదాముపయేమే సుయశాం నామతస్యామస్య జజ్ఞే భీమసేనః.

భీమసేనః ఖలు కైకేయీముపయేమే కుమారీం నామ తస్యామస్యజజ్ఞే ప్రతిశ్రవా నామ.

ప్రతిశ్రవసః ప్రతీపః ఖలు శైబ్యా ముపయేమే సునందాంనామ తస్యాం పుత్రానుత్పాదయామాస దేవాపిం శాంతనుం బాహ్లీకం చేతి.

దేవాపిః ఖలు బాల ఏవారణ్యం వివేశ శాంతనుస్తు మహీపాలో బభూవ.

యం యం కరాభ్యాం స్పృశతి జీర్ణం స సుఖమశ్నుతే పునర్యువాచ భవతి తస్మాత్తం శాంతనుం విదుః.

శాంతనుః ఖలు గంగాం భాగీరథీ ముపయేమే తస్యామస్య జజ్ఞే దేవవ్రతో నామ యమాహు ర్భీష్మమితి.

భీష్మః ఖలు పితుః ప్రియాచికీర్షయా సత్యవతీం మాతర ముదవాహయత్ యామాహుర్గంధకాలీతి.

తస్యాం పూర్వం కానీనో గర్భః పరాశరాద్ ద్వైపాయనోఽభవత్ తస్యామేవ శాంతనోరన్యౌ ద్వౌ పుత్రౌ బభూవతుః.

విచిత్రవీర్యశ్చిత్రాంగదశ్చ తయోర ప్రాప్త యౌవన ఏవ చిత్రాంగదో గంధర్వేణ హతః విచిత్ర వీర్యస్తు రాజాఽఽసీత్.

విచిత్రవీర్యః ఖలు కౌసల్యాత్మజే అంబికాంబాలికే కాశిరాజ దుహితరావుపయేమే.

విచిత్రవీర్యస్త్వనపత్య ఏవ విదేహత్వం ప్రాప్తః తతః సత్యవత్యచిన్తయన్మా దౌష్యన్తో వంశ ఉచ్ఛేదం వ్రజేదితి.

సాద్వైపాయనమృషిం మనసా చిన్తయామాస సతస్యాః పురతః స్థితః కింకరవాణీతి.

సా తమువాచ—భ్రాతా తవానపత్య ఏవ స్వర్యాతో విచిత్రవీర్యః సాధ్వపత్యం తస్యోత్పాదయేతి.

స తథేత్యుక్త్వాత్రీన్ పుత్రానుత్పాదయామాస ః ధృతరాష్ట్రం పాండుం విదురం చేతి.

తల్లికిసంబంధించినవాడుకాడు. పురుషరేతస్సునుండే పుత్రుడు ఉద్భవిస్తాడు. తల్లి గర్భధారణమాత్రానికే అధికారిణి. ఈపలుకులు ఆకాశవాణికూడా ఆమోదించింది. ఆకాశవాణి భరణపోషణాదులను గూర్చి పలకడంవల్ల ఇతడు భరతుడయాడు.

భరతునకు సర్వసేనపుత్రి సునందవల్ల భుమన్యు భుమన్యునకు దాశార్హకన్య విజయవల్ల సుహోత్రుడు ఇతనికి ఇక్ష్వాకుకులకన్య సువర్ణవల్ల హస్తి జనించారు హస్తినాపురం ఇతని పేరుతో కట్టబడినది. హస్తి త్రిగర్తరాజపుత్రి యశోధరను వివాహమై వికుంఠుణ్ణి కన్నాడు. దశార్హకులకన్య సుదేవవల్ల వికుంఠునకు అజమీఢుడు పుట్టాడు. అజమీఢునకు కైకేయీ గాంధారీ విశాలా అని ముగ్గురు భార్యలు. వీరివల్ల నూటఇరవై నలుగురు పుత్రులుదయించారు. వీరంతా వంశవివర్ధనులే అయారు. అందులో సంవరణుడు కురువంశ వివర్ధనుడయాడు.

సంవరణుడు సూర్యుని కూతురు తపతివలనకురువుని కన్నాడు. కురు దాశార్హకన్య శుభాంగిని వివాహమై ఆమెవలన విదూరుడు కలిగాడు. విదూరునకు మధువంశకన్య సంప్రియవల్ల అనశ్వుడు వానికి మగధరాజకన్య అమృతవల్ల పరీక్షిత్తు ఇతనికి సుయశవల్ల భీమసేనుడు ఆయనకు కేకయరాజకుమార్తెకుమారివల్ల ప్రతిశ్రవుడూ ప్రతిశ్రవునకు ప్రతీపుడూ జన్మించారు. ప్రతీపుడు సునందను పరిణయమాడాడు. ఆమె గర్భానుండి దేవాపి శాంతన బాహ్లీకులను ముగ్గురు కుమారుళ్ళుదయించారు.

వృద్ధులను తన చేతులతో స్పృశించినమాత్రాన వారికి సుఖశాంతులు కలిగి దానితో పాటు నవయౌవనంకూడా కలగడంచేత పరమానందరూపమైన శాంతి లభిస్తూండడంవల్ల ప్రతీపసంతానంలో రెండవవానిని శాంతను డన్నారు. దేవాపి బాల్యంలోనే అరణ్యానికి వెళ్ళడంవల్ల శంతనుడేరాజైనాడు. శంతనునకు గంగవలన దేవవ్రతుడు ఉదయించాడు. ఈతడే లోకంలో భీష్మనామంతో ప్రసిద్ధుడైనాడు. భీష్ముడు తండ్రి యిచ్ఛ ననుసరించి బ్రహ్మచర్యమతావలంబియై సత్యవతిని తండ్రికి వివాహం చేయడం కారణంగా గంధకాలుడనే నామంతో కూడా లోకంలో ప్రసిద్ధుడయాడు. సత్యవతి కన్యగా ఉండగానే పరాశరునివల్ల వ్యాసుడుదయించాడు. తరువాత శంతనుడు సత్యవతిని పరిణయమైనాడు. సత్యవతి గర్భాన్నుండి చిత్రాంగదుడు విచిత్రవీర్యుడు ఉదయించారు. చిత్రాంగదుడు చిన్నతనంలో గంధర్వునిచేతిలో హతుడవడంవల్ల విచిత్రవీర్యుడే కురుదేశానికి రాజయాడు.

కాశీరాజ కుమార్తెలు అంబికా అంబాలికలను విచిత్రవీర్యుడు వివాహమాడాడు. వారితల్లి కౌసల్య. విచిత్రవీర్యుడు సంతానం కలగక పూర్వమే మరణించడంచేత దుష్యంతుని వంశం యింతటితో ఆగిపోతుందేమోనని సత్యవతి విచారించి వ్యాసుని స్మరించింది. స్మరణ మాత్రాన ఎదుటనిలిచిన వ్యాసునకా సత్యవతి దేవరవిధానం చేత మరదళ్ళయందు సంతానోత్పత్తిని చేసి భరత వంశం వృద్ధిచెయ్యమని ఆజ్ఞాపించింది. తల్లి ఆజ్ఞను పొందిన వేదవ్యాసుడు ధృతరాష్ట్ర పాండురాజ విదురులను కని వంశాన్ని నిలిపాడు. అటుతరువాత వ్యాసవరప్రసాదంవల్ల ధృతరాష్ట్రపత్ని గాంధారికి నూరుగురు కుమారుళ్ళుదయించారు. వారిలోదుర్యోధన దుశ్శాసన వికర్ణ చిత్రసేనులు నలుగురూ ప్రధానులుగ పరిగణింపబడ్డారు.

తత్ర ధృతరాష్ట్రస్య రాజ్ఞః పుత్రశతం బభూవ గాంధార్యాం వరదానాద్ద్వైపాయనస్య.

తేషాం ధృతరాష్ట్రస్య పుత్రాణాం చత్వారః ప్రధానా బభూవుః; దుర్యోధనో దుశ్శాసనో వికర్ణ శ్చిత్రసేనశ్చేతి.

పాండోస్తు ద్వే భార్యే బభూవతుః కుస్తీ పృథా నామ మాద్రీ చ ఇత్యుభే స్త్రీరత్నే.

అథ పాండుర్మృగయాం చరన్ మైథునగత మృషిమపశ్యన్మృగ్యాం వర్తమానం తథైవాద్భుత మనసాదితకా మరసమతృప్తం చ బాణేనాజఘాన.

స బాణవిద్ధ ఉవాచ పాండుంచరతా ధర్మమిమం యేనత్వయాభిజ్ఞేన కామరసస్యాః హ్యమనవాప్త కామరసో నిహతస్తస్మాత్ త్వమప్యేతా మవస్థామాసాద్య అవాప్తకామరసః పంచ త్వమాప్స్యసి క్షిప్రమేవేతి స వివర్ణరూపస్తథా పాండుః శాపం పరిహరమాణో నోపాసర్పత భార్యే వాక్యంచోవాచ.

స్వచాపల్యాదిదం ప్రాప్తవానహం శృణోమి చ నానపత్యస్య లోకాః సన్తీతి సా త్వం మదర్థే పుత్రానుత్పాదయేతి కుస్తీమువాచ సా తథోక్తా పుత్రానుత్పాదయామాస ధర్మాద్యుధిష్ఠిరం మారు తాద్భీమసేనం శక్రాదర్జునమితి.

తాం సంహృష్టః పాండురువాచ ఇయం తే సపత్న్యనపత్యా సాధ్వస్యా అపత్యముత్పాద్యతా మితి ఏవమస్త్వితి కుస్తీ తాం విద్యాం మాద్రాః ప్రాయచ్ఛత్.

మాద్ర్యామశ్విభ్యాం నకులసహదేవౌ పుత్రావుత్పాదితౌ.

మాద్రీం ఖల్వలంకృతాం దృష్ట్వా పాండుర్భావం చక్రే చ తాం స్పృష్ట్వైవ విదేహత్వం ప్రాప్తః.

తత్రైనం చితాగ్నిస్థం మాద్రీ సమన్వారురోహ ఉవాచకుస్తీం యమయోరప్రమత్తయా త్వయా భవితవ్యమితి.

తతస్తే పాండవాః కున్త్యా సహితా హాస్తిన పురమానీయ తాపసైర్భీష్మస్య చ విదురస్య చ నివేదితాః సర్వవర్ణానాం చ నివేద్యాన్తర్హితాస్తాప సాబభూవుః ప్రేక్ష్యమాణానాం తేషాం.

తచ్చ వాక్యముపశ్రుత్య భగవతామన్తరిక్షాత్ పుష్పవృష్టిః పపాతః దేవదున్దుభయశ్చ ప్రణేదుః. ప్రతిగృహీతాశ్చ పాండవాః పితుర్నిధనమావేయన్ తస్యౌర్ధ్వదేహికం న్యాయతశ్చ కృతవన్తః తాం స్తత్ర నివసతః పాండవాన్ బాల్యాత్ప్రభృతి దుర్యోధనో నామర్షయత్.

పాపాచారో రాక్షసీం బుద్ధిమాశ్రితోఽనేకైరు పాయై రుద్ధర్తుం చ వ్యవసితః భావిత్వాచ్చార్థస్య న శక్తితాస్తే సముద్ధర్తుం.

తతశ్చ ధృతరాష్ట్రేన వ్యాజేన వారణావతి మనుప్రేషితా గమనమరోచయన్.

తత్రాపి జతుగృహే దగ్ధుం సమారబ్ధా న శకితా విదురమంత్రితేనేతి.

తస్మాచ్చ హిడింబమంతరా హత్వా ఏకచక్రాం గతాః.

తస్యామప్యేకచక్రాయాం బకం నామ రాక్షసం హత్వా పాంచాలనగరమభిగతాః.

తత్ర ద్రౌపదీం భార్యామవిందన్ స్వవిషయం చాభిజగ్ముః.

కుశలినః పుత్రాంశ్చోత్పాదయామాసుః ప్రతి విన్ధ్యం యుధిష్ఠిరః సుతసోమం వృకోదరః శ్రుత కీర్తి మర్జునః శతానీకం నకులః శ్రుతకర్మాణం సహదేవ ఇతి.

యుధిష్ఠిరస్తు గోవాసనస్య శైబ్యస్య దేవికాం

పాండుమహారాజునకు కుంతి, మాద్రి యను యిద్దరు భార్యలు. వీరు రూపగుణశీలసంపదలు కల వారగుట స్త్రీలలో రత్నములవలె ప్రకాశిస్తున్నారు. పాండుమహారాజు అరణ్యానికి వేటకు వెళ్ళి మృగరూపమున క్రీడిస్తున్న ఋషిదంపతులను సంగమం పూర్తికాకమున్నే వేధించిన కారణంగా పాండురాజును ఋషి యిలా శపించాడు— సర్వ ధర్మాలూ తెలిసిన నీవు దాంపత్యభోగ మనుభవించే మహానందాన్ని భగ్నపరిచినందువల్ల కామాసక్తుడవై స్త్రీనికూడిన క్షణంలోనే మరణిస్తావు గాక— అని. శాపగ్రస్తుడైన పాండురాజు యీవిషయాన్ని భార్యలతో చెప్పి కుంతిని సంబోధించి సంతానం లేనివానికి గతులులేవు కనుక నీవు ధర్మతః సంతానాన్ని కనమన్నాడు.

భర్త అనుజ్ఞచే కుంతి యమునివల్ల ధర్మరాజును వాయువు అనుగ్రహించే భీమసేనుని ఇంద్రానుగ్రహం వల్ల పార్థుని కన్నది. ఇదంతా చూచిన పాండురాజు ఆనందించి—కుంతీ! దూర్వాసప్రసాదితమైన విద్యను సవతి మాద్రికికూడా చెప్పి ఆమెకు కూడా సంతానాన్ని ప్రసాదించు—అన్నాడు. మాద్రి భర్తఆజ్ఞవలన కుంతినుండి ఆ విద్యను గ్రహించి అశ్వినీదేవతలవల్ల నకుల సహదేవులను యిద్దరు కుమారుల్ని కన్నది. ఒకనాడు మాద్రిసౌందర్యాన్ని చూసి మోహపరవశుడైన మహారాజామెనుకూడి వెంటనే మరణించాడు. మాద్రికుమారుల్ని కుంతికి వప్పజెప్పి భర్తతో సహగమనం చేసింది.

తరువాత మహర్షులు కుంతీసహితంగా పాండవులను వెంటబెట్టుకొని హస్తినాపురానికి వచ్చి జరిగిన విషయాలన్నీ చెప్పి పాండవులను భీష్మవిదురాదులకు వప్పజెప్పి వారంతా చూస్తూండగానే అంతర్ధాన మయ్యారు. ఆ మహర్షులు పలికేటప్పుడు పువ్వులవాన కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. ధృతరాష్ట్ర భీష్మాదులు పాండవులను చేరదీసి పాండురాజు మరణం విని దుఃఖించి అంత్యేష్టి పూర్తిచేసిన పిమ్మట పాండవులను హస్తినాపురంలోనే ఉంచి పెంచుతున్నారు.

దుర్యోధను డనేక కుతంత్రాలు పన్ని పాండవులను హత్య చెయ్యాలని ప్రయత్నించినా వారికి దైవానుగ్రహం ఉండటంవల్ల వారికేం ప్రమాదం కలగలేదు. తుదకు ధృతరాష్ట్రుని కుతంత్రం కారణంగా పాండవులు వారణావతంలో లాక్షాగృహ ప్రవేశమయ్యారు. లాక్షాగృహమందు పాండవుల్ని దగ్ధం చెయ్యాలనే దుర్యోధనుని ప్రయత్నం కూడా విఫలమైంది. పాండవులు ప్రచ్ఛన్నంగా అరణ్యంలో పోతూండగా హిడింబుడు ఎదురైతే వానిని సంహరించి ఏకచక్రనగరం చేరారు.

ఏకచక్రనగరంలో ఉండగానే బకాసురుణ్ణి భీముడు సంహరించాడు. పాంచాల రాజ్యంలో మత్స్యయంత్రాన్ని వేధించి పాండవులు ద్రౌపదిని పరిణయమై తిరిగి హస్తినాపురానికి వచ్చారు. హస్తినాపురంలో ఉండగానే ద్రౌపదికి వీరైదుగురివల్లా ఐదుగురు కొడుకులు జన్మించారు. అందులో ధర్మరాజునకు ప్రతివింధ్యుడు భీమునకు సుతసోముడు అర్జుననకు శ్రుతకీర్తి నకులునకు శతానీకుడు సహదేవునకు శ్రుతకర్మ ఉదయించారు. ఇంతేకాకుండా యుధిష్ఠిరునకు గోవాసనపుత్రికయగు దేవికనుండి యౌధేయుడు భీమునకు కాశీరాజకుమారి బలంధరయందు సర్వగుడూ జన్మించారు. బలంధర వివాహానికి బలపరాక్రమ ప్రదర్శనం పణంగా ఉంచారు. అందులో భీముడు తీర్ణుడై

నామ కన్యాం స్వయంవరే లేభే తస్యాం పుత్రం జనయామాస యౌధేయం నామ.

భీమసేనోఽపి కాశ్యాం బలంధరాం నామోప యేమే వీర్యశుల్కాం తస్యాం పుత్రం సర్వగం నామోత్పాదయామాస.

అర్జునః ఖలు ద్వారవతీం గత్వా భగినీం వాసుదేవస్య సుభద్రాం భద్రభాషిణీం భార్యాముదావహత్ స్వవిషయం చాభ్యాజగామ కుశలే తస్యాం పుత్రమభిమన్యుమతీవగుణసంపన్నం దయితం వాసుదేవస్యాజనయత్.

నకులస్తు చైద్యాం కరేణుమతీం నామ భార్యాముదావహత్ తస్యాం పుత్రం నిరమిత్రం నామాజనయత్.

సహదేవోఽపిమాద్రీమేవస్వయంవరే విజయాం నామోపయేమే మద్రరాజస్య ద్యుతిమతో దుహితరం తస్యాం పుత్రమజనయత్ సుహోత్రం నామ.

భీమసేనస్తుపూర్వమేవ హిడింబాయాం రాక్షసం ఘటోత్కచం పుత్రముత్పాదయామాస.

ఇత్యేత ఏకాదశ పాండవానాం పుత్రాః తేషాం వంశకరోఽభిమన్యుః.

స విరాటస్య దుహితరముపయేమే ఉత్తరాం నామ తస్యామస్య పరాసుర్గర్భోఽభవత్ తముత్సంగేన ప్రతిజగ్రాహ పృథానియోగాత్ పురుషోత్తమస్య వాసుదేవస్య షాణ్మాసికం గర్భమహమేనం జీవయిష్యామీతి.

స భగవతా వాసుదేవేనాసంజాత బలవీర్యపరాక్రమోఽకాలజాతోఽస్త్రాగ్నినా దగ్ధస్తేత సా స్వేనసంజీవితః జీవయిత్వా చైనమువాచ - పరిక్షీణే కులే జాతో భవత్వయం పరిక్షిన్నామేతి.

పరిక్షిత్ ఖలు మాద్రవతీం నామోపయేమే త్వన్మాతరం తస్యాం భవాన్ జనమేజయః.

భవతో వపుష్టమాయాం ద్వౌ పుత్రౌ జజ్ఞాతే శతానీకః శంకుకర్ణశ్చ శతానీకస్య వైదేహ్యాం పుత్ర ఉత్పన్నోఽశ్వమేధదత్త ఇతి.

ఏష పూరోర్వంశః పాండవానాం చ కీర్తితః ధన్యః పుణ్యః పరమపవిత్రః సతతం శ్రోతవ్యో బ్రాహ్మణైర్నియమవద్భిరనంతరం క్షత్రియైఃస్వధర్మనిరతైః ప్రజాపాలనతత్పరైర్వైశ్యైరపిచశ్రోతవ్యోఽధిగమ్యశ్చ తథాశూద్రైరపి త్రివర్ణశుశ్రూషుభిః శ్రద్దధానైరపి.

ఇతిహాసమిమం పుణ్యమశేషతః శ్రావయిష్యంతి యే నరాః శ్రోష్యంతి వా నియతాత్మనోవిమత్సరా మైత్రా వేదపరాస్తేఽపి స్వర్గజితః పుణ్యలోకా భవంతి సతతం దేవబ్రాహ్మణమనుష్యాణాం మాన్యాః సంపూజ్యాశ్చ.

పరం హీదం భారతం భగవతా వ్యాసేనప్రోక్తం పావనం యే బ్రాహ్మణాదయో వర్ణాః శ్రద్ధధానా అమత్సరా మైత్రావేదసంపన్నాః శ్రోష్యంతి తేఽపి స్వర్గజితః సుకృతినోఽశోచ్యాః కృతాకృతే భవంతి.

ఇదం హి వేదైః సమితం పవిత్రమపి చోత్తమం ధన్యం యశస్యమాయుష్యం శ్రోతవ్యం నియతాత్మభిః.

95 వ అధ్యాయము సమాప్తం

ఆమెను పరిగ్రహించాడు.

అర్జునుడు ద్వారకవెళ్ళి కృష్ణ సహోదరి భద్రభాషిణీయగు సుభద్రనుగ్రహించి తెచ్చి ఆమెయందభిమన్యుడను కుమారుని బడసినాడు. నకులుడు చేదిరాజపుత్రిక రేణుమతిని వివాహమైఆమెయందు నిరమిత్రుడనే కుమారుణ్ణి, సహదేవుడు స్వయంవరంలో మద్రదేశరాజపుత్రిని వివాహమాడి విజయ యను పేరుగల ఆమెయందు సుహోత్రుడనే వాడిని కన్నారు. భీమసేనుడ కింతకుపూర్వమే హిడింబయందు ఘటోత్కచుడు జన్మించాడు. ఈవిధంగా పాండవులకు పదకొండుగురు కుమారులుద్భవించారు. ఇందులో అభిమన్యుడే వంశవృద్ధికరుడైనాడు.

విరాటరాజనందని వివాహమాడిన అభిమన్యుని వల్ల ఆమె గర్భం ధరించి మృతశిశువును కన్నది. కుంతియొడిలో నున్న ఆ శిశువును బ్రతికించి రక్షిస్తానని అభయమిచ్చాడు వాసుదేవుడు. అశ్వత్థామ అస్త్రాగ్నిజ్వాలలచే నష్టమై తేజోహీనమైన ఆ మృతశిశువును తన తేజస్సును ప్రవేశపెట్టి జీవింపచెయ్యడమే కాకుండా తేజోవంతుడుగ కూడా చేశాడు శ్రీహరి. వంశమంతా పరిక్షీణమైనాక పుట్టినవాడు కనుక వీనికి పరీక్షిత్తు అని నామకరణం చేశారు. పరీక్షిత్తునీతల్లియగు మాద్రవతిని పరిణయమైనాడు. ఆమె గర్భాన్నుండే నీవు జనమేజయ నామంతో జన్మించావు. నీకు వపుష్టయను భార్యయందు శతానీక శంకుకర్ణుడూ అనే కుమారులుదయించారు. అందులో శతానీకునకు విదేహ రాజపుత్రియందు అశ్వమేధత్తు జన్మించాడు.

జనమేజయమహారాజా! పూరువంశవర్ణన అంతా నీకు చెప్పాను. సార్వజనీనకంగా యీ పూరువంశవర్ణన పఠించినా విన్నా ధనధాన్యాలు పుత్రపౌత్రాదులూ కలవారై ఇహపరసుఖాలు పొందుతారు. పుణ్యాత్ములై మనస్సును వశమందుంచుకొని సమస్తప్రాణులయందును మైత్రీభావము కలవారై వేదవేదాంగపారంగులైన బ్రాహ్మణుడీ ఇతిహాసాన్ని ఇతరులకు వినిపించినా విన్నా స్వర్గలోకాన్ని పొందుతాడు. అతడు సర్వజనాదరణీయుడేకాక పూజ్యుడుకూడా ఔతాడు. సర్వవర్ణముల వారుకూడా అసూయారహితులై మైత్రీభావము కలవారై శ్రద్ధగా వ్యాసప్రోక్తమైన యీ మహాభారతమనేతిహాసాన్ని వింటారో వారంతా స్వర్గలోకాన్నందుతారు. సర్వకర్మఫల ప్రదాతయగు మహాభారతేతిహాసము సతతశ్రవణాదులచే అనంత ఫలమును ప్రసాదిస్తుంది. శోకరాహిత్యాని కింతకంటె వేరు ఉపాయమే లేదు. ఈ మహాభారతము వేదముతో సమానమైనది. పరమపవిత్రమైనది. ధనధాన్యములను పుత్రపౌత్రాదులను ప్రసాదించునది. సర్వసౌభాగ్యాలనూ ప్రసాదించే మహాభారతం నిరంతరం పఠించుట వినుట సర్వజనసామాన్యధర్మమే కాక విశేష ధర్మంకూడాను.

95 వ అధ్యాయం సమాప్తం

## తొంబది ఆరవ అధ్యాయము

సత్యవాదీ సత్యపరాక్రముడూ అయిన ఇక్ష్వాకు వంశీయుడు మహాభిషుడు అశ్వమేధ సహస్ర

## తొంబదిఆరవవ అధ్యాయము

ఇక్ష్వాకువంశప్రభవో రాజాఽఽసీత్ పృథివీపతిః
మహాభిష ఇతి ఖ్యాతః సత్యవాక్ సత్యవిక్రమః.
సోఽశ్వమేధసహస్రేణ రాజసూయశతేన చ
తోషయామాస దేవేశం స్వర్గం లేభే తతః ప్రభుః.
తతః కదాచిద్బ్రహ్మాణముపాసాంచక్రిరే సురాః
తత్ర రాజర్షయో హ్యాసన్ స చ రాజా మహాభిషః.
అథ గంగా సరిచ్ఛ్రేష్ఠా సముపాయాత్ పితామహం
తస్యా వాసః సముద్ధూతం మారుతేన శశిప్రభం.
తతోఽభవన్ సురగణాః సహసావాఙ్ముఖాస్తదా
మహాభిషస్తు రాజర్షిరశంకో దృష్టవాన్నదీం.
సోఽపధ్యాతో భగవతా బ్రహ్మణా తు మహాభిషః
ఉక్తశ్చ జాతో మర్త్యేషు పునర్లోకానవాప్స్యసి.
యయాఽఽహృతమనాశ్చాసి గంగయా త్వం హి దుర్మతే
సా తే వై మానుషే లోకే విప్రియాణ్యాచరిష్యతి.
యదా తే భవితా మన్యుస్తదా శాపాద్విమోక్ష్యసే
స చింతయిత్వా నృపతిర్నృపానన్యాం స్తపోధనాన్.
ప్రతీపం రోచయామాస పితరం భూరితేజసం
మహాభిషం తు తం దృష్ట్వా నదీ ధైర్యాచ్చ్యుతం నృపం.
తమేవ మనసా ధ్యాయంత్యుపావర్తత్సరిద్వరా
సా తు విధ్వస్తవపుషః కశ్మలాభిహతాన్ నృప.
దదర్శ పథి గచ్ఛంతీ వసూన్ దేవాన్ దివౌకసః
తథారూపాంశ్చ తాన్ దృష్ట్వా పప్రచ్ఛ సరితాం వరా.
కిమిదం నష్టరూపాః స్థ కచ్చిత్ క్షేమం దివౌకసాం
తామూచుర్వసవో దేవాః శప్తాః స్మో వై మహానది.
అల్పేఽపరాధే సంరంభాద్వసిష్ఠేన మహాత్మనా
విమూఢా హి వయం సర్వే ప్రచ్ఛన్నమృషిసత్తమం.
సంధ్యాం వసిష్ఠమాసీనం తమత్యభిసృతాః పురా
తేన కోపాద్వయం శప్తా యోనౌ సంభవతేతి హ.
న నివర్తయితుం శక్యం యదుక్తం బ్రహ్మవాదినా
త్వమస్మాన్ మానుషీ భూత్వా సృజ పుత్రాన్ వసూన్ భువి.
న మానుషీణాం జఠరం ప్రవిశేమ వయం శుభే
ఇత్యుక్తా తైస్తు వసుభిస్తథేత్యుక్త్వా బ్రవీదిదం.
మర్త్యేషు పురుషశ్రేష్ఠః కో వః కర్తా భవిష్యతి
ప్రతీపస్య సుతో రాజా శాంతనుర్లోకవిశ్రుతః
భవితా మానుషే లోకే స నః కర్తా భవిష్యతి.
సమాప్యేవం మతం దేవా యథా మాం వదతానఘాః
ప్రియం తస్య కరిష్యామి యుష్మాకం చైతదీప్సితం.
జాతాన్ కుమారాన్ స్వానప్సు ప్రక్షేప్తుం వై త్వమర్హసి
యథా న చిరకాలం నో నిష్కృతిః స్యాత్ త్రిలోకగే.
ఏవమేతత్ కరిష్యామి పుత్రస్తస్య విధీయతాం
నాస్య మోఘః సంగమః స్యాత్ పుత్రహేతోర్మయా సహ.
తురీయార్ధం ప్రదాస్యామో వీర్యస్యైకైకశో వయం
తేన వీర్యేణ పుత్రస్తే భవితా తస్య చేప్సితః.
న సంపత్స్యతి మర్త్యేషు పునస్తస్య తు సంతతిః
తస్మాదపుత్రః పుత్రస్తే భవిష్యతి స వీర్యవాన్.
ఏవం తే సమయం కృత్వా గంగయా వసవః సహ
జగ్ముః సంహృష్టమనసో యథాసంకల్పమంజసా.
తతః ప్రతీపో రాజాఽఽసీత్ సర్వభూతహితః సదా
నిషసాద సమా బహ్వీర్గంగాద్వారగతో జపన్.
తస్య రూపగుణోపేతా గంగా స్త్రీరూపధారిణీ
ఉత్తీర్య సలిలాత్ తస్మాల్లోభనీయతమాకృతిః.
అధీయానస్య రాజర్షేర్దివ్యరూపా మనస్వినీ

రాజసూయ శతం నిర్వర్తించి స్వర్గం చేరాడు. ఆ రోజులలో బ్రహ్మలోకంలో దేవతలందరూ ఉన్న సమయాన గంగ బ్రహ్మ దర్శనార్థం వచ్చింది. వచ్చిన గంగ శరీరంమీది చంద్రికాధౌతదుకూలాం చలంగాలివిసురున లేచిపోగా దేవతలందరూ తలలు వాల్చారు. రాజర్షి మహాభిషుడు కన్నార్పకుండా అటే చూడసాగాడు. బ్రహ్మకి కోపంవచ్చింది. నువ్వు మానవజన్మ ఎత్తి గంగతోనే చరించి ఆమెకు నీపై ఆగ్రహం కలిగినప్పుడే స్వర్గానికి తిరిగి రాగలవు— అని శపించాడు బ్రహ్మ. మహాభిషుడు రాజశ్రేష్ఠుడైన ప్రతీపమహారాజును తన తండ్రిగా భావించుకున్నాడు. అదే సమయంలో గంగ మహాభిషునే మనస్సులో ధ్యానిస్తూ తరలిపోయింది. తిరిగి వెళుతోన్న గంగకు స్వర్గంనుండి పతనమవుతూన్న ఎనమండుగురు వసువులూ గోచరించారు. ఆమె వారి యోగక్షేమాలు విచారించి పతనస్థితికి హేతువు అడుగగా వారు— గంగా! వశిష్ఠమహర్షి ఆశ్రమధేనువుని మేము అపహరించిన కారణంగా మమ్మల్ని భూలోకంలో పుట్టమని శపించాడు. బ్రహ్మవాది పలుకులు అసత్యం కావు గదా. ఈ భూమిమీద నువ్వు ఏమానవేశ్వరుని పత్నివో అయి మమ్మల్ని పుత్రరూపంలో ప్రసవించు. మాకు మానవగర్భంలో ప్రవేశించడం ఇష్టంలేదు— అనగా గంగ నాకు భర్తకాదగ్గ ఉత్తమమానవుడెవడని ప్రశ్నించగా ప్రతీపరాజు పుత్రుడగు శంతనుడు మాకు తండ్రి కాగలడు— అన్నారువారు. అంగీకరించిది గంగ. అప్పుడు వసువులు తమకుజన్మప్రాప్తిస్తూండగనే మర్త్యలోకంనుండి విముక్తి కలిగించమన్నారు. అందుకు గంగ అంగీకరిస్తూ శంతనుడు పుత్రార్థియై తనతో సంబంధం కలిగించుకుంటాడు. గనక ఆయనకు ఒక్క పుత్రుడేనా ఉండితీరాలంది.

వారు తమ తేజంలోని ఎనిమిదవ భాగాన్ని ఇచ్చి ఒకకుమారుణ్ణి ఉంచడానికి అంగీకరిస్తూ ఆ బాలుడు స్వేచ్ఛాస్వతంత్రాలతో మహాపరాక్రమంతో వర్తిస్తాడేకాని అతనికి సంతానం ఉండదు— అని గంగను వప్పించి ప్రసన్నవదనులై వెళ్ళిపోయారు.

96 వ అధ్యాయం సమాప్తం.

## తొంబది యేడవఅధ్యాయము

ధర్మతత్పరుడై ప్రతీపమహారాజు ప్రజాహితరంజకంగా పరిపాలించి గంగానదీతీరాన తపస్సు చేస్తూండగా గంగ సుందరగుణరూప శీలవతియైన యువతీరూపంతో వచ్చి ఆ మహారాజు అంకసీమ మీద కూర్చుంది. దేవ సదృశ కాంతితో ప్రసన్న ముఖంతో తన తొడమీద కూర్చున్న ఆమెను చూచి—అమ్మాయీ! ఏ కోరికతో నువ్వు ఇలా వచ్చావమ్మా!— అని ప్రతీపుడడగగా గంగ—మహారాజా! నాకు తమయందు అనురాగం కలిగింది. నన్ననుగ్రహించండి. కామవశచిత్తయై వచ్చిన స్త్రీని సజ్జనులు నిరాకరించరు— అనగా ప్రతీపుడు— కళ్యాణీ! కామహృదయంతో పరస్త్రీ సమాగమం చెయ్యకూడదనే నియమం నాకు ఉంది. అన్యవర్ణ

దక్షిణం శాలసంకాశమూరుం భేజే శుభాననా.
ప్రతీపస్తు మహీపాలస్తామువాచ యశస్వినీం
కరోమి కిం తే కల్యాణి ప్రియం యత్తేఽభికాంక్షితం.
త్వామహం కామయే రాజన్ భజమానాం భజస్వ మాం
త్యాగః కామవతీనాం హి స్త్రీణాం సద్భిర్విగర్హితః.
నాహం పరస్త్రియం కామాద్గచ్ఛేయం వరవర్ణినీ
న చాసవర్ణాం కల్యాణి ధర్మ్యమేతద్ధి మే వ్రతం.
నాశ్రేయస్యస్మి నాగమ్యా న వక్తవ్యా చ కర్హిచిత్
భజంతీం భజ మాం రాజన్ దివ్యాం కన్యాం వరస్త్రియం.
త్వయా నివృత్తమేతత్తు యన్మాం చోదయసి ప్రియం
అన్యథా ప్రతిపన్నం మాం నాశయేద్ధర్మవిప్లవః.
ప్రాప్య దక్షిణమూరుం మే త్వమాశ్లిష్టా వరాంగనే
అపత్యానాం స్నుషాణాం చ భీరు విద్ధ్యేతదాసనం.
సవ్యతః కామినీభోగ్యస్త్వయా స చ వివర్జితః
తస్మాదహం నాచరిష్యే త్వయి కామం వరాంగనే.
స్నుషా మే భవ సుశ్రోణి పుత్రార్థం త్వాం వృణోమ్యహం
స్నుషాపక్షం హి వామోరు త్వమాగమ్య సమాశ్రితా.
ఏవమప్యస్తు ధర్మజ్ఞ సంయుజ్యేయం సుతేన మే
త్వద్భక్త్యా తు భజిష్యామి ప్రఖ్యాతం భారతం కులం.
పృథివ్యాం పార్థివా యే చ తేషాం యూయం పరాయణం
గుణా న హి మయా శక్యా వక్తుం వర్షశతైరపి.
కులస్య యే వః ప్రథితాస్తత్సాధుత్వమథోత్తమం
సమయేనేహ ధర్మజ్ఞ ఆచరేయం చ యద్విభో.
తత్సర్వమేవ పుత్రస్తే న మీమాంసేత కర్హిచిత్
ఏవం వసంతీ పుత్రే తే వర్ధయిష్యామ్యహం రతిం.
పుత్రైః పుణ్యైః ప్రియైశ్చైవ స్వర్గం ప్రాప్స్యతి తే సుతః
తథేత్యుక్త్వా తు సా రాజంస్తత్రైవాంతరధీయత.
పుత్రజన్మ ప్రతీక్షన్ వై స రాజా తదధారయత్
ఏతస్మిన్నేవ కాలే తు ప్రతీపః క్షత్రియర్షభః.

తపస్తేపే సుతస్యార్థే సభార్యః కురునందన
ప్రతీపస్య తు భార్యాయాం గర్భః శ్రీమానవర్ధత
శ్రియా పరమయా యుక్తః శరచ్ఛుక్లే యథా శశీ
తతస్తు దశమే మాసి ప్రాజాయత రవిప్రభం
కుమారం దేవగర్భాభం ప్రతీపమహిషీ తదా.
తయోః సమభవత్ పుత్రో వృద్ధయోః స మహాభిషః
శాంతస్య జజ్ఞే సంతానస్తస్మాదాసీత్ స శాంతనుః.
తస్య జాతస్య కృత్యాని ప్రతీపోఽకారయత్ప్రభుః
జాతకర్మాది విప్రేణ వేదోక్తైః కర్మభిస్తదా.
నామకర్మ చ విప్రాస్తు చక్రుః పరమసత్కృతం
శాంతనోరవనీపాల వేదోక్తైః కర్మభిస్తదా.
తతః సంవర్ధితో రాజా శాంతనుర్లోకపాలకః
స తు లేభే పరాం నిష్ఠాం ప్రాప్య ధర్మవివాదం నరః.
ధనుర్వేదే చ వేదే చ గతిం స పరమాం గతః
యౌవనం చాపి సంప్రాప్తః కుమారోపగతాంవరః.
స సంస్మరంశ్చాక్షయాన్లోకాన్ విజితాన్ స్వేనకర్మణా
పుణ్యకర్మకృదేవాసీచ్ఛాంతనుః కురుసత్తమః
ప్రతీపః శాంతనుం పుత్రం యౌవనస్థం తతోఽన్వశాత్
పురా స్త్రీ మాం సమభ్యాగాచ్ఛాంతనో భూతయే తవ
త్వామావ్రజేద్యది రహః సా పుత్ర వరవర్ణినీ.
కామయానాభిరూపాఢ్యా దివ్యా స్త్రీ పుత్ర కామ్యయా
సా త్వయా నానుయోక్తవ్యా కాసి కస్యాసి చాంగనే.
యచ్చ కుర్యాన్న తత్కర్మ సా ప్రష్టవ్యా త్వయానఘ
మన్నియోగాద్భజంతీం తాం భజేథా ఇత్యువాచ తం.
ఏవం సందిశ్య తనయం ప్రతీపః శాంతనుం తదా
స్వే చ రాజ్యేఽభిషిచ్యైనం వనం రాజా వివేశ హ.
స రాజా శాంతనుర్ధీమాన్ దేవరాజసమద్యుతిః
బభూవ మృగయాశీలః శాంతనుర్వనగోచరః.
స మృగాన్ మహిషాంశ్చైవ వినిఘ్నన్ రాజసత్తమః

స్త్రీ సంగమాన్ని నేను నిషేధించుకున్నాను— అన్నాడు.

మహారాజా! నేను కళంకచరితను కాను. నీకు అమంగళాన్ని కోరటంలేదు. అనురాగ హృదయంతో అర్థిస్తున్న దివ్యసుందరిని కనక నన్ననుగ్రహించండి— అన్నది గంగ. అప్పుడు ప్రతీపుడు— బాలా! నువ్వు ఏఉద్దేశంతో నాదగ్గరికి వచ్చావో దానికి విరుద్ధంగా నా కుడితొడమీద కూర్చున్నావు. ఇది ఆత్మసంతానానికీ సంతానవధూజనానికి ఆసనం. పురుషుని ఎడమతొడ కామినీజనానికి ఉపభోగ్యమైనది. నువ్వు ధర్మవిరుద్ధంగా సంచరించావు గనక నేను పరిగ్రహించలేను. నాయింటి కోడలుగా నిన్ను స్వీకరిస్తాను— అనగా గంగ అంగీకరించి— మహారాజా! లోకవిఖ్యాతమైన మీ భరతవంశానికి సేవ చేయటమే నా పరమావధి. మీవంశఖ్యాతి లోకవిశ్రుతము. అయితే ఒక నియమం ఉంది. నేను ఎలా ప్రవర్తించినా నీ కుమారుడు నన్ను నిశ్శంకగా చూడాలి. నాకు గలిగే కుమారులవల్ల మీకుమారునికి స్వర్గం సిద్ధిస్తుంది— అని గంగ అంతర్ధానమయింది.

ప్రతీపమహారాజు గంగ వచనాలు మనస్సులో ఉంచుకుని భార్యాసహితుడై పుత్రార్థియై వ్రతదీక్షితుడైనాడు. ఆ సమయంలో ప్రతీపపత్ని తేజోమయగర్భం ధరించింది. శుక్లపక్షచంద్రునివలె ప్రవర్ధమానమైన ఆ గర్భనుండి పదవమాసంలో సూర్యసమ ప్రకాశంతో మహాభిష రాజర్షియే పుత్రరూపంలో ప్రభవించాడు. మహారాజు జాతకర్మాదికృత్యాలన్నీ యథోక్తంగా నిర్వర్తించి శంతనుడు అనే పేరు పెట్టాడు. ఆబాలుడు పెరిగి యౌవనుడై వేదాధ్యయన తత్పరుడై ధనుర్వేదవిదుడై సామ్రాజ్యభారం నిర్వహించాడు.

సత్కర్మార్జిత పుణ్యలోక సంస్మరణతో కర్మానుష్ఠానపరుడైన కుమారుని బిలిచి— నాయనా! ఇదివరలో నాదగ్గరకు ఒక దివ్యస్త్రీ వచ్చింది. ఆమె రాకవల్ల నీకు శుభం కలుగుతుంది. ఆమె నీకు తటస్తపడి నీవల్ల సంతానవతి కాగోరితే ఆమె గుణశీలాలు విచారించకుండా ఆమెను భార్యగా పరిగ్రహించు. ఆమె స్వేచ్ఛకు ఎన్నడూ భంగం కలిగించకు— అని ప్రతీపుడు చెప్పి కుమారుని రాజ్యాభిషిక్తుని చేసి అరణ్యానికి వెళ్ళిపోయాడు.

శంతనుడు దేవేంద్రసదృశ తేజస్వియై పరిపాలన సాగిస్తూ ఘాతుకమృగ సంహారార్థం ఒకనాడు ఘోరారణ్యానికి పోయి అడవిదున్నలను హతమార్చి అలసి గంగాతీరానికి వచ్చాడు. ఆ సమయంలో నిజాంగదీప్తులతో దివ్యాంగనవలె మన్మథవశయై లక్ష్మీదేవి అవతారంలా ఎదురువచ్చే ఒక కాంతను ఏకాంతంలో చూశాడు శంతనుడు. ఆ సౌందర్యావలోకనంలో ఆయన నేత్రాలు తృప్తిపడలేకపోతున్నవి. ఆయన మనసు మనసులో లేదు. ఆయనను చూసిన ఆమెకూడా అదేస్థితిని పొందుతూండగా శంతనుడు నెమ్మదిగా ఆమెను సమీపించి— శుశ్రోణీ! దేవ దానవ గంధర్వ యక్ష రాక్షస నాగ మానవజాతి కన్యలలో నీయంతటి సౌందర్యవతి లేదు. నన్ననుగ్రహించి భర్తగా స్వీకరించు— అని యాచించాడు.

97 వ అధ్యాయము సమాప్తం

గంగామనుచచారైకః సిద్ధచారణసేవితాం.
స కదాచిన్మహారాజ దదర్శ పరమాం స్త్రియం
జాజ్వల్యమానాంవపుషాసాక్షాచ్ఛ్రియమివాపరాం.
సర్వానవద్యాం సుదతీం దివ్యాభరణభూషితాం
సూక్ష్మాంబరధరామేకాం పద్మోదరసమప్రభాం.
తాం దృష్ట్వా హృష్టరోమాభూద్విస్మితో రూపసంపదా
పిబన్నివ చ నేత్రాభ్యాం నాతృప్యత నరాధిపః.

సా చ దృష్ట్వైవ రాజానం విచరంతం మహాద్యుతిం
స్నేహాదాగతసౌహార్దా నాతృప్యత విలాసినీ
తామువాచతతో రాజాసాంత్వయన్ శ్లక్ష్ణయాగిరా
దేవీ వా దానవీ వా త్వం గంధర్వీ చాథ వాప్సరాః.
యక్షీ వా పన్నగీ వాపి మానుషీ వా సుమధ్యమే
యాచే త్వాం సురగర్భాభే భార్యా మే భవ శోభనే.

97వ అధ్యాయం సమాప్తం.

తొంబది ఎనిమిదవఅధ్యాయము

ఏతచ్ఛ్రుత్వా వచో రాజ్ఞః సస్మితం మృదు వల్గు చ
యశస్వినీచసాఽగచ్ఛచ్ఛాంతనోర్భూతయేతదా.
సా చ దృష్ట్వా నృపశ్రేష్ఠం చరంతం తీరమాశ్రితం
వసూనాంసమయంస్మృత్వాథాభ్యగచ్ఛదనిందితా.
ప్రజార్థినీ రాజపుత్రం శాంతనుం పృథివీపతిం
ప్రీతిపవచనం చాపి సంస్మృత్యైవ స్వయం నృప.
కాలోఽయమితి మత్వాసావసూనాం శాపచోదితా
ఉవాచ చైవ రాజ్ఞః సా హ్లాదయంతీ మనోగిరా
భవిష్యామి మహీపాల మహిషీ తే వశానుగా.
యత్తు కుర్యామహం రాజన్ శుభం వా యదివాశుభం
న తద్వారయితవ్యాస్మి న వక్తవ్యా తథాప్రియం
ఏవంహివర్తమానేఽహం త్వయి వత్స్యామి పార్థివ
వారితా విప్రియంచోక్తాత్యజేయంత్వామ సంశయం
తథేతి సా తదా తూక్తా తదా భరతసత్తమ
ప్రహర్షమతులం లేభే ప్రాప్య తం పార్థివోత్తమం.
రథమారోప్య తాం దేవీం జగామ స తయా సహ
సా చ శాంతనుమభ్యాగాత్ సాక్షాల్లక్ష్మీరివాపరా.

ఆసాద్య శాంతనుస్తాంచ బుభుజే కామతో వశీ
న ప్రష్టవ్యేతి మన్వానో న స తాం కించిదూచివాన్.
స తస్యాః శీలవృత్తేన రూపౌదార్యగుణేన చ
ఉపచారేణ చ రహస్తుతోష జగతీపతిః.
దివ్యరూపా హి సా దేవీ గంగా త్రిపథగామినీ
మానుషం విగ్రహం కృత్వా శ్రీమంతం వరవర్ణినీ.
భాగ్యోపనతకామస్య భార్యా చోపనతాభవత్
శాంతనోర్నృపసింహస్య దేవరాజసమద్యుతేః.
సంభోగస్నేహచాతుర్యైర్హావభావసమన్వితైః
రాజానం రమయామాస యథా రేమే తథైవ సః
స రాజా రతిసక్తత్వాదుత్తమస్త్రీగుణైర్హృతః
సంవత్సరానృతూన్ మాసాన్ బుబుధే న బహూన్ గతాన్

రమమాణస్తయా సార్థం యథాకామం నరేశ్వరః
అష్టావజనయత్ పుత్రాంస్తస్యామమరసన్నిభాన్.
జాతం జాతం చ సా పుత్రం క్షిపత్యంభసి భారత
ప్రీణామ్యహం త్వామిత్యుక్త్వా గంగా స్రోతస్యమజ్జయత్.

## తొంబదిఎనిమిదవ అధ్యాయము

### గంగాశంతనులు

మధుర మందస్మితవదనంతో శంతనుడు పలికిన మాటలు విని గంగ అతని ఐశ్వర్యాభివృద్ధి సూచకంగా సమీపించి వసువులకు తాను చేసిన వాగ్దానం స్మృతికి రాగా ప్రతీపమహారాజుతో జరిగిన సంభాషణ మనసులో మసలగా— మహారాజా! నేను మీకు రాణి నవుతాను. అయితే మీరు నేను చేసిన పనులకు అభ్యంతరం చెప్పకూడదు. నా మనస్సుకి బాధ కలిగించే మాటలాడకూడదు. ఈ నియమానికి అంగీకరిస్తే మీ పాణిగ్రహణం చేస్తాను. అందుకు విరుద్ధంగా జరిగిన ఉత్తరక్షణంలో మిమ్మల్ని వదిలేస్తాను— అనగా అన్నిటికీ తల ఊపి శంతనుడు ఆమెను భార్యగా చేసికొన్నాడు.

అక్కడనుంచి తన రథంమీద ఆమెను రాజధానికి తీసికొని వచ్చాడు. ఇంద్రియసంయమనం గల శంతనుడు ఆమెను రాణిగా చేసికొనియిచ్ఛానుసారం భోగించసాగాడు. పితృ వాక్యానుసారమే కాక ఆమెను తాను చేసినప్రతిజ్ఞ ప్రకారంఎన్నడూ ఏవిషయంలోనూ ఆమెకు ప్రశ్నించి నిరోధించకుండా సౌఖ్యసాగరంలో ఈదులాడుతున్నాడు.

దివ్యరూపిణి త్రిపథగామిని గంగ శంతనుని అదృష్టంవల్ల మానుషదేహంతో భార్య అయింది. సర్వ విషయ రహస్యా లెరిగిన గంగా శంతనుల దాంపత్యజీవితం ఉత్తమరీతులతో ఉదాత్త వీధులలో నడుస్తున్నది.

రోజులు నడుస్తున్నవి.

మాసాలు వెనుకబడుతున్నవి.

ఋతువులు దొర్లుతున్నవి.

వర్ష చక్రమే సాగిపోతున్నది— కాని మహారాజు విషయోపభోగపరుడై కాల పరిజ్ఞానం వదిలేశాడు. అలా సాగిస్తూ గంగ తాను కన్న బిడ్డను గంగలోకి విడుస్తూ— నీకు సంతోషం కలిగిస్తున్నాను— అనేది. ఈదృశ్యమైన ఆమెప్రవర్తన శంతన మహారాజుకి ఎంతమాత్రం నచ్చలేదు. అయినా సమయ భంగ భీతితో మౌనంగా సాగిపోనిస్తున్నాడు. అలా ఏడుసార్లు జరిగింది.

గంగ ఎనిమిదవబిడ్డను కన్నది. ఈబిడ్డకూడా అదే దశకు పాల్పడతాడని తెలిసి శంతనుడు పుత్ర వాత్సల్యం చంపుకోలేక ప్రతిజ్ఞాభంగమయినా సరే నని— గంగా! అసలు నువ్వెవరవు? ఇలా ఎందుకు చేస్తున్నావు. పుత్రహత్యా పాతకం నీమెడ నెందుకు చుట్టుకుంటున్నావు— అనగా గంగ— మహారాజా! ప్రతిజ్ఞాభంగం చేశావు. కనక నిన్ను విడిచి పెడుతున్నాను. ఈబాలుని నీకు విడిచేస్తున్నాను. నేను జహ్ను పుత్రిని. సర్వర్షి సేవితను. గంగను దేవకార్యార్థం ఇలా వచ్చాను. ఆసవుడైన వశిష్ఠ మహర్షి శాపంవల్ల వసువులే నా గర్భానపుట్టారు. వారికి జననీ జనకత్వం వహించే అర్హత మనకే ఉన్నది. ఈరీతిగా వసువులకు జన్మనిచ్చి నువ్వు అక్షయలోకాలు నిర్మించుకున్నావు. అయితే వారు జన్మిస్తూండగానే వారికి భూమినుండి ముక్తి నిస్తానని చేసిన నా వాగ్దానం నెరవేరింది. ఈ బాలుడు వారందరి అంశతో జన్మించాడు. నీ వంశానికి ఆనందకరుడై ఉంటాడు. ఇతడు అజేయ పరాక్రముడు. ఆసమయంలో వసువులకు నీకోసం నేను అర్థించి వీణ్ణి పొందాను. ఈ బాలుణ్ణి నా

తస్య తన్న ప్రియం రాజ్ఞః శాంతనోరభవత్తదా
న చ తాం కించనోవాచ త్యాగాద్భీతో మహీపతిః.
అథైనామష్టమే పుత్రే జాతే ప్రహసతీమివ
ఉవాచ రాజా దుఃఖార్తః పరీప్సన్ పుత్రమాత్మనః.
మావధీః కస్య కాసీతి కిం హింససి సుతానితి
పుత్రఘ్ని సుమహత్పాపం సంప్రాప్తం తే సుగర్హితం.
పుత్రకామ న తే హన్మి పుత్రం పుత్రవతాం వర
జీర్ణస్తు మమ వాసోఽయం యథా స సమయః కృతః.
అహం గంగా జహ్నుసుతా మహర్షిగణసేవితా
దేవకార్యార్థసిద్ధ్యర్థముషితాహం త్వయా సహ.
ఇమేఽష్టౌ వసవో దేవా మహాభాగా మహౌజసః
వసిష్ఠశాపదోషేణ మానుషత్వముపాగతాః.
తేషాం జనయితా నాన్యస్త్వదృతే భువి విద్యతే
మద్విధా మానుషీ ధాత్రీ లోకే నాస్తీహ కాచన.
తస్మాత్ తజ్జననీహేతోర్మానుషత్వముపాగతా
జనయిత్వా వసూనష్టౌ జితా లోకాస్త్వయాక్షయాః.
దేవానాం సమయస్త్వేష వసూనాం సంశ్రుతో మయా
జాతం జాతం మోక్షయిష్యే జన్మతో మానుషాదితి.
తత్తే శాపాద్వినిర్ముక్తా ఆపవస్య మహాత్మనః
స్వస్తి తేఽస్తు గమిష్యామి పుత్రం పాహి మహావ్రతం.
అయం తవ సుతస్తేషాం వీర్యేణ కులనందనః
సంభూతోఽతిజనానన్యాన్ భవిష్యతి న సంశయః.
ఏష పర్యాయవాసో మే వసూనాం సన్నిధౌ కృతః
మత్ప్రసూతిం విజానీహి గంగాదత్తమిమం సుతం.
ఆపవో నామ కో న్వేష వసూనాం కించ దుష్కృతం
యస్యాభిశాపాత్ తే సర్వే మానుషీం యోని మాగతాః.
అనేన చ కుమారేణ త్వయా దత్తేన కిం కృతం
యస్య చైవ కృతేనాయం మానుషేషు నివత్స్యతి.
ఈశా వై సర్వలోకస్య వసవస్తే చ వై కథం
మానుషేషూదపద్యంత తన్మమాచక్ష్వ జాహ్నవి.
ఏవముక్తా తదా గంగా రాజానమిదమబ్రవీత్
భర్తారం జాహ్నవీ దేవీ శాంతనుం పురుషర్షభ.
యం లేభే వరుణః పుత్రం పురా భరతసత్తమ
వసిష్ఠనామా స మునిః ఖ్యాత ఆపవ ఇత్యుత.
తస్యాశ్రమపదం పుణ్యం మృగపక్షిసమన్వితం
మేరోః పార్శ్వే నగేంద్రస్య సర్వర్తుకుసుమావృతం
స వారుణిస్తపస్తేపే తస్మిన్ భరతసత్తమ
వనే పుణ్యకృతాం శ్రేష్ఠః స్వాదుమూలఫలోదకే.
దక్షస్య దుహితా యా తు సురభీత్యభిశబ్దితా
గాం ప్రజాతా తు సా దేవీ కశ్యపాద్భరతర్షభ.
అనుగ్రహార్థం జగతః సర్వకామదుహాం వరా
తాం లేభే గాం తు ధర్మాత్మా హోమధేనుం స వారుణిః

సా తస్మింస్తాపసారణ్యే వసంతీ మునిసేవితే
చచార పుణ్యే రమ్యే చ గౌరపేతభయా తదా.
అథ తద్వనమాజగ్ముః కదాచిద్భరతర్షభ
పృథ్వాద్యా వసవః సర్వే దేవా దేవర్షిసేవితం.
తే సదారా వనం తచ్చ వ్యచరంత సమంతతః
రేమిరే రమణీయేషు పర్వతేషు వనేషు చ.
తత్రైకస్యాథ భార్యా తు వసోర్వాసవవిక్రమ
సంచరంతీ వనే తస్మిన్ గాం దదర్శ సుమధ్యమా.
నందినీం నామ రాజేంద్ర సర్వకామధుగుత్తమాం
సా విస్మయసమావిష్టా శీలద్రవిణసంపదా.
ద్యవే వై దర్శయామాస తాం గాం గోవృషభేక్షణా
ఆపీనాం చ సుదోగ్ధ్రీం చ సువాలధిఖురాం శుభాం.
ఉపపన్నాం గుణైః సర్వైః శీలేనానుత్తమేన చ
ఏవంగుణసమాయుక్తాం వసవే వసునందినీ.
దర్శయామాస రాజేంద్ర పురా పౌరవనందన
ద్యౌస్తదా తాం తు దృష్ట్వైవ గాం గజేంద్రేంద్రవిక్రమ.

కొడుకుగా భావించి 'గంగానందనుడు' అనిమాత్రం కోసం నిరీక్షిస్తూ నిలబడింది.

వ్యవహరించు— అని గంగ శంతనుని ప్రతివచనాలు

93 వ అధ్యాయం సమాప్తం

## తొంబది తొమ్మిదవ అధ్యాయము

### గాంగేయుడు

మృదుమధురంగా భాషించిన గంగ పలుకులు విని శంతనుడు వసువుల శాపకారణంతోపాటు ఆపవుని చరిత్ర ఈ బాలుని రమ్యగాథ వినిపించమనగా ఆ శుచిస్మిత పలుకుతున్నది— మహారాజా! పూర్వకాలంలో వరుణునకు గాంచిన పుత్రుడే ఆపవుడైన ఆ వశిష్ఠుడు ఆవశిష్ఠుని ఆశ్రమం మేరుపార్శ్వాన ఉన్నది. ఆ ఆశ్రమపరిసరవనాలలో ఋతుధర్మానుసారం కుసుమించే లతలూ ఫలించే వృక్షాలూ అలరారుతున్నవి. వానిమీద కలకల నాదాలతో శకుంత సంతతులు విహరిస్తున్నవి. మధుర జలపూర్ణ సరోవరా లున్నవి. ఆ ప్రదేశంలో ఆ మహర్షి తపస్సు సాగిస్తున్నాడు.

దక్షప్రజాపతికుమార్తె సురభి కశ్యప ప్రజాపతి అనుగ్రహంతో ఒకగోవును ప్రసవించింది. సమస్త వాంఛలనూ తీర్చగల ఆగోవు వశిష్ఠుని స్వాధీనంలోకి వచ్చింది. వశిష్ఠుని సేవలందుతూ ఆ ధేనువు ఆశ్రమపరిసరాలలో విహరించేది. ఇలా సాగుతూండగా పృథు ప్రభృతులైన వసువులూ ఇతర దేవతలూ తమతమ పత్నులతో ఆ సుందరవనానికి విహారార్థం వచ్చి స్వేచ్ఛగా క్రీడిస్తున్నారు. వారిలో ఒక వసువు భార్య ఆ నందినీధేనువును చూసి ద్యోనామధేయుడైన తనభర్తకు చూపింది. నిండైన పొదుగుతో అందమైన ఆకారంతో నయనపర్వంగా ఉన్న ఆనందినీధేనువును చూచి— కాంతా! ఇది వరుణపుత్రుడైన వశిష్ఠుని హోమధేనువు. ఈ ఆశ్రమంకూడా వారిదే. విశేషమేమంటే ఈ ఆవు పాలు త్రాగినవారు నిరంతరం యౌవనావస్థలోనే ఉంటారు పదివేల సంవత్సరాలు జీవిస్తారు. జీవితమంతా యౌవనమే వారిని వరిస్తుంది— అన్నాడాయన.

అది విని ఆ సుందరి— ప్రాణేశ్వరా! ఈ నరలోకంలో నా ప్రేమపాత్రురాలైన జితవతి అనే పేరుగల సఖి ఉన్నది. ఆమె ఉశీనర రాజర్షి పుత్రి. మానవజగత్తులో ఆమె సౌందర్యాన్ని కొనియాడని వారు లేరు. ఆమెకు మానవజాతి సహజాలయిన జరారోగాలు రాకుండా ఉండాలని నా కోరిక. నాయందు అనుగ్రహం ఉంచి ఈ ధేనువును మీరు తీసుకొనివెళ్ళి ఆమెకు సమర్పించాలి. ఇంతకన్న నాకు ప్రియమయినది లేదు— అన్నది.

తన పత్నికి సంతోషం కలిగించడంకంటె వేరే పరమార్థం లేదనుకొని ఆ ద్యోనాముడైన వసువు తన సోదరుల సహకారంతో నందినీధేనువును దాని సంతానంతో అపహరించే యత్నంలో ఆసమీపంలోనే తీవ్రతపోదీక్షలో ఉన్న వశిష్ఠుని గుర్తించనే లేదు. ఆ ఋషి క్రోధం తమకు స్వర్గాన్నికూడా పోగొట్టగలదని వారు భావించలేకపోయారు.

ఉవచ రాజంస్తాం దేవీం తస్యా రూపగుణాన్ వదన్
ఏషా గౌరుత్తమా దేవీ వారుణేరసితేక్షణా.
ఋషేస్తస్య వరారోహే యస్యేదం వనముత్తమం
అస్యాః క్షీరం పిబేన్మర్త్యః స్వాదు యో వై సుమధ్యమే.

దశవర్షసహస్రాణి స జీవేత్ స్థిరయౌవనః
ఏతచ్ఛ్రుత్వా తు సా దేవీ నృపోత్తమ సుమధ్యమా.
తమువాచానవద్యాంగీ భర్తారం దీప్తతేజసం
అస్తి మే మానుషే లోకే నరదేవాత్మజా సఖీ.
నామ్నా జితవతీ నామ రూపయౌవనశాలినీ
ఉశీనరస్య రాజర్షేః సత్యసంధస్య ధీమతః.
దుహితా ప్రథితా లోకే మానుషే రూపసంపదీ
తస్యా హేతోర్మహాభాగ సవత్సాం గాం మమేప్సితాం.

ఆనయస్వామరశ్రేష్ఠ త్వరితం పుణ్యవర్ధన
యావదస్యాః పయః పీత్వా సా సఖీ మమ మానద.
మానుషేషు భవత్వేకా జరారోగవివర్జితా
ఏతన్మమ మహాభాగ కర్తుమర్హస్యనిందిత.
ప్రియం ప్రియతరం హ్యస్యా నాస్తి మేఽన్యత్ కథంచన

ఏతచ్ఛ్రుత్వా వచస్తస్యా దేవ్యాః ప్రియచికీర్షయా.
పృథ్వాద్యైర్భ్రాతృభిః సార్ధం ద్యౌస్తదా తాం జహార గాం

తయా కమలపత్రాక్ష్యా నియుక్తో ద్యౌస్తదా నృప.
ఋషేస్తస్య తపస్తీవ్రం న శశాక నిరీక్షితుం
హృతా గౌః సా తదా తేన ప్రపాతస్తు న తర్కితః.

అథాశ్రమపదం ప్రాప్తః ఫలాన్యాదాయ వారుణిః
న చాపశ్యత్ స గాం తత్ర సవత్సాం కాననోత్తమే.
తతః స మృగయామాస వనే తస్మింస్తపోధనః
నాధ్యగచ్ఛచ్చ మృగయంస్తాం గాం మునిరుదారధీః.
జ్ఞాత్వా తథాపనీతాం తాం వసుభిర్దివ్యదర్శన
యయౌ క్రోధవశం సద్యః శశాప చ వసూంస్తదా.
యస్మాన్మే వసవో జహ్రుర్గాం వై దోగ్ధ్రీం సువాలధిం
తస్మాత్ సర్వే జనిష్యంతి మానుషేషు న సంశయః.
ఏవం శశాప భగవాన్ వసూంస్తాన్ భరతర్షభ
వశం క్రోధస్య సంప్రాప్త ఆపవో మునిసత్తమః.
శప్త్వా చ తాన్ మహాభాగస్తపస్యేవ మనో దధే
ఏవం స శప్తవాన్ రాజన్ వసూనష్టౌ తపోధనః.
మహాప్రభావో బ్రహ్మర్షిర్దేవాన్ క్రోధసమన్వితః
అథాశ్రమపదం ప్రాప్తాస్తే వై భూయో మహాత్మనః.
శప్తాః స్మ ఇతి జానంత ఋషిం తముపచక్రముః
ప్రసాదయంతస్తమృషిం వసవః పార్థివర్షభ.
లేభిరే న చ తస్మాత్ తే ప్రసాదమృషిసత్తమాత్
ఆపవాత్ పురుషవ్యాఘ్ర సర్వధర్మవిశారదాత్.
ఉవాచ చ స ధర్మాత్మా శప్తా యూయం ధరాదయః
అనుసంవత్సరాత్ సర్వే శాపమోక్షమవాప్స్యథ.
అయం తు యత్కృతే యూయం మయా శప్తాః స వత్స్యతి

ద్యౌస్తదా మానుషే లోకే దీర్ఘకాలం స్వకర్మణా.
నానృతం తచ్చికీర్షామి క్రుద్ధో యుష్మాన్ యదబ్రువం
న ప్రజాస్యతి చాప్యేష మానుషేషు మహాత్మనః.
భవిష్యతి చ ధర్మాత్మా సర్వశాస్త్రవిశారదః
పితుః ప్రియహితే యుక్తః స్త్రీభోగాన్ వర్జయిష్యతి.
ఏవముక్త్వా వసూన్ సర్వాన్ స జగామ మహానృషిః
తతో మాముపజగ్ముస్తే సమేతా వసవస్తదా.
అయాచంత చ మాం రాజన్ వరం తచ్చ మయా కృతం
జాతాన్ జాతాన్ ప్రక్షిపాస్మాన్ స్వయం గంగే త్వమంభసి.

ఏవం తేషామహం సమ్యక్ శప్తానాం రాజసత్తమ
మోక్షార్థం మానుషాల్లోకాద్యథావత్ కృతవత్యహం.

కాలం గడుస్తున్నది. వరుణపుత్రుడు వశిష్ఠుడు కందమూల ఫలాదులతో ఆశ్రమానికి వచ్చి చూడగా ధేనువు దాని సంతతి కూడా గోచరించక వనమంతా తిరిగి ఎక్కడా కనుపించక దివ్యదృష్టితో చూచి వసువులు అపహరించారని గ్రహించాడు. ఆక్షణంలో ఆ ఘనహృదయం క్రోధవశీభూతమై ఈ వసువులు నా నందినీధేనువును హరించారు. కనక మనుష్యులై పుట్టుదురుగాక—అని శపించాడు.

తపస్సంపన్నుడైన వశిష్ఠుని శాపవార్త విని వసువులు ఆమహర్షి ఆశ్రమానికి వచ్చి శాపోప సంహారం చెయ్యమని ఎన్నోవిధాల ప్రార్థించారు. మహర్షి ప్రసన్నుడుకాలేదు. పదేపదే అర్థించారు. పల్కు దారుణాఖండల శస్త్రతుల్యమైనా నవనీత సమానమనస్వియైన వశిష్ఠమహర్షి శాపవిమోచనం ప్రసాదిస్తూ మీరందరూ ఒక్కొక్క సంవత్సరం భూలోకవాసం చేసి శాపవిముక్తి పొందుతారు. అయితే నందినీధేనువును హరించిన వసువుమాత్రం దీర్ఘకాలం భూలోకంలో ఉండితీరాలి— అన్నాడు.

ద్యోనామధారి అయిన వసువే ఈ బాలుడు. వీడు ధర్మాత్ముడు సర్వశాస్త్ర విదురుడు పితృ హితాకాంక్షియై స్త్రీ భోగాలను పరిత్యజించి సంతానరహితుడౌతాడు— అనికూడా వశిష్ఠులే అన్నారు. ఈ విషయాలన్నీ తెలిపి వారు నన్ను ప్రార్థించగా వారి అభిమతానుసారం నేను శాప విమోచనం చేశాను. ఈ బాలుడు గాంగేయుడనీ దేవవ్రతుడనీ ప్రఖ్యాతి పొందుతాడు. ఈపసివాడు పెరిగి పెద్దవాడై మీ దగ్గరకు వస్తాడు. నాకుశలవు అనుగ్రహించండి. మీరు నన్ను తలంచినప్పుడల్లా మీముందు ఉంటాను— అని గంగ బిడ్డతో వెళ్ళి పోయింది.

శంతనుడు విచారంతో స్వగృహం చేరాడు. ఆ మహారాజుయొక్క గుణగణాలను వాని ఐశ్వర్యా లను వివరిస్తాను. ఆ శంతనవంశీయుల ఇతిహాసమే ఈ మహాభారతం అని వైశంపాయనుడు జనమే జయునికి చెప్పినట్లు సూతుడు శౌనకాది మహా మునులకు వివరిస్తున్నాడు.

99వ అధ్యాయం సమాప్తం.

## నూరవఅధ్యాయము

### సత్యవతి

దేవర్షులూ రాజర్షులూ గౌరవ ఆదరాలతో అభినందనలు పలికే విధంగా సత్యధర్మ స్వరూపుడై శంతనమహారాజు పరిపాలించాడు. దయాదాన క్షమాధైర్య తేజోమయ పరాక్రమాది సద్గుణాలతో ఇంద్రియసంయమనం కలిగి ప్రజాసంరక్షణంచేసే ఆ మహారాజు విశాలభుజుడు శంఖగ్రీవుడు రాజోచిత సర్వలక్షణసంపన్నుడు ఆమహారాజును చూడగానే అర్థకామాలకంటె ధర్మమే పరమలక్ష్యంగా కలవా డనిపించేది. ధర్మపరిపాలనలో ఆయన నిరుపమా నుడు. అందుచేత అన్యరాజలోకం ఆయనకు రాజ రాజేశ్వరపదవినిచ్చి సత్కరించింది. ప్రజలకూ పాల కులకూ శోకభయసంతాపాలు లేకుండా చేసి ఇంద్ర సమతేజస్సుతో కీర్తిశాలియై ఆదర్శప్రభువయ్యాడు.

అయం శాపాద్వృషే స్తస్య ఏక ఏవ నృపోత్తమ
ద్యౌః రాజన్ మానుషే లోకే చిరంవత్స్యతిభారత.
అయం దేవవ్రతశ్చైవ గంగాదత్తశ్చ మే సుతః
ద్వినామా శాంతనోఃపుత్రఃశాంతనోరధికో గుణైః.
అయం కుమారః పుత్రస్తే వివృద్ధః పునరేష్యతి
అహం చ తే భవిష్యామి ఆహ్వానోపగతా నృప.
ఏతదాఖ్యాయ సా దేవీ తత్రైవాంతరధీయత

ఆదాయ చ కుమారం తం జగామాథ యథేప్సితం.
స తు దేవవ్రతో నామ గాంగేయ ఇతి చాభవత్
ద్వినామా శాంతనోఃపుత్రః శాంతనోరధికోగుణైః
శాంతనుశ్చాపి శోకార్తో జగామ స్వపురం తతః
తస్యాహంకీర్తయిష్యామిశాంతనోరధికాన్ గుణాన్
మహాభాగ్యం చ నృపతేర్భారతస్య మహాత్మనః
యస్యేతిహాసో ద్యుతిమాన్ మహాభారతముచ్యతే.

99 వ అధ్యాయము సమాప్తం

## నూరవ అధ్యాయము

సరాజా శాంతనుర్ధీమాన్ దేవరాజర్షిసత్కృతః
ధర్మాత్మా సర్వలోకేషు సత్యవాగితి విశ్రుతః.
దమో దానం క్షమా బుద్ధిర్హ్రీర్ధృతిస్తేజ ఉత్తమం
నిత్యాన్యాసన్ మహాసత్వే శాంతనౌ పురుషర్షభే.
ఏవం స గుణసంపన్నో ధర్మార్థకుశలో నృపః
ఆసీద్భరతవంశస్య గోప్తా సర్వజనస్య చ.
కంబుగ్రీవః పృథువ్యంసో మత్తవారణవిక్రమః
అన్వితః పరిపూర్ణార్థైః సర్వైర్నృపతిలక్షణైః.
తస్య కీర్తిమతో వృత్తమవేక్ష్య సతతం నరాః
ధర్మ ఏవ పరః కామాదర్థాచ్చేతి వ్యవస్థితాః.
ఏతాన్యాసన్ మహాసత్వే శాంతనౌ పురుషర్షభే
న చాస్య సదృశః కశ్చిద్ధర్మతః పార్థివోఽభవత్.
వర్తమానం హి ధర్మేషు సర్వధర్మభృతాం వరం
తంమహీపామహీపాలం రాజరాజ్యేభ్యషేచయన్.
వీతశోకభయాబాధాః సుఖస్వప్నవిబోధనాః
పతిం భారత గోప్తారం సమపద్యంత భూమిపాః.
తేన కీర్తిమతా శిష్టాః శక్రప్రతిమతేజసా
యజ్ఞదానక్రియాశీలాః సమపద్యంత భూమిపాః.
శాంతనుప్రముఖైర్గుప్తే లోకే నృపతిభిస్తదా

నియమాత్ సర్వవర్ణానాం ధర్మోత్తరమవర్తత.
బ్రహ్మ పర్యచరత్ క్షత్రం విశః క్షత్రమనువ్రతాః
బ్రహ్మక్షత్రానురక్తాశ్చ శూద్రాః పర్యచరన్ విశః.
స హాస్తినపురే రమ్యే కురూణాం పుటభేదనే
వసన్ సాగరపర్యంతామన్వశాసద్వసుంధరాం.
స దేవరాజసదృశో ధర్మజ్ఞః సత్యవాగృజుః
దాన ధర్మ తపోయోగాచ్ఛ్రియా పరమయా యుతః.
అరాగద్వేషసంయుక్తః సోమవత్ప్రియదర్శనః
తేజసా సూర్యకల్పోఽభూద్వాయువేగసమో జవే
అంతకప్రతిమః కోపే క్షమయాపృథివీసమః.
వధః పశువరాహాణాం తథైవ మృగపక్షిణాం
శాంతనౌ పృథివీపాలే నావర్తత తథా నృప.
బ్రహ్మధర్మోత్తరే రాజ్యే శాంతనుర్వినయాత్మవాన్
సమం శశాస భూతాని కామరాగవివర్జితః.
దేవర్షి పితృయజ్ఞార్థమారభ్యంత తదాక్రియాః
న చాధర్మేణ కేషాంచిత్ ప్రాణినామభవ ద్వధః.
అసుఖానామనాథానాం తిర్యగ్యోనిషు వర్తతాం
స ఏవ రాజా సర్వేషాం భూతానామభవత్పితా.
తస్మిన్ కురుపతిశ్రేష్ఠే రాజరాజేశ్వరే సతి

ఆ మహారాజు ఏలుబడిలో ప్రజలందరూ వర్ణాశ్రమానుసారం ధర్మానికే ప్రాధాన్యమిచ్చి చరించేవారు. క్షత్రియులు బ్రాహ్మణులను సేవించేవారు. వైశ్యులు పై రెండు వర్ణాలవారియందూ అనురక్తితో చరించేవారు. శూద్రులు భూసురులయందూ క్షత్రియులయందూ అనురాగం ఉంచి వైశ్యసేవా తత్పరులై ఉండేవారు.

దానధర్మ తపోనిరతుడై దివ్య కాంతియుతుడై శంతనుడు రాగద్వేష రహితుడై రాజ్యభారాన్ని నిర్వహిస్తున్నాడు. సూర్యసమతేజుడై చంద్రసమ శీతలుడై వాయుసమ వేగుడై క్రోధయముడై పృథ్వీ క్షముడై జీవితాన్ని సాగిస్తున్నాడు. ఆమహారాజు పాలనలో భూతహింస జరిగేదికాదు. సర్వప్రాణులయందూ సమదృష్టితో ఉండేవారు. అధర్మభీతి చేత అందరూ ధర్మకార్యనిరతు లయేవారు. దేవ పితృకర్మలు సక్రమంగాసాగేవి. యజ్ఞాదికకార్యాలు విధ్యుక్తంగా నడిచేవి. ప్రజలందరూ సత్యదాన శీలురై చరించేవారు.

ఆమహారాజు ఇరువదినాల్గుసంవత్సరాలు కామ చింతన లేకుండా అరణ్యవాసం చేశాడు. అప్పటికి గాంగేయుడు సదాచార సంపన్నుడై లోకవ్యవహార కుశలుడై లౌకిక అలౌకిక అస్త్ర శస్త్రవిద్యాపారంగతుడై మహావీరుడయ్యాడు.

ఒకనాడు శంతనుడు ఒకానొక ఘాతుకమృగాన్ని వెంబడించి గంగాతీరానికి వచ్చాడు. నిర్మల జలాలతో నిండుగా ప్రవహించే గంగ శుష్కించి ఉండటం చూసి చింతించాడు. ఆ నది అలా శుష్కించడానికి కారణం తెలుసుకుందామని ముందుకు సాగుతుండగా సుందరదృఢశరీరుడైన దేవేంద్రసమ యువకుడు దివ్యాస్త్రాభ్యాసం చేస్తూ బాణపరంపరతో ఆ మహాప్రవాహాన్ని ఆపడం చూసి అతని అలౌకిక కార్యానికి ఆశ్చర్యపడ్డాడు. ఆబాలుడు తన కుమారుడే అని గుర్తించలేకపోయాడు. పుట్టిననాడు మాత్రమే చూసి ఉండడంచేత సర్వాంగ వికసితుడైన ఈ యువకుని పసిగట్టలేకపోయాడు. అంతలోనే ఆయువకుడు అంతర్ధానం కావడంతో శంతనుడు గంగనుపిలిచి తనకుమారుడేడి అని అడిగాడు. తరుణ సుందర లావణ్యలహరి గంగ దక్షిణ హస్తంతో కుమారుని తీసుకొనివచ్చి శంతనుని ఎదుట నిలిచింది. దివ్యాభరణభూషితయై స్వచ్ఛ శ్వేతవస్త్రధారిణియై ఎదుట నిలిచిన గంగను మహారాజు గుర్తించలేకపోయాడు. అది గ్రహించి గంగ మహారాజా! ఇదివరలో మీరు నానుండి ఈకుమారుని కన్నారు. నేను వీనిని పెంచి పెద్దచేశాను. మీరు వీణ్ణి వెంటబెట్టుకొని ఇంటికి వెళ్ళండి. ఈ కుమారుడు వశిష్టమహర్షి అనుగ్రహంవల్ల వేద వేదాంగా లభ్యసించాడు. వీడు సర్వశస్త్రాస్త్ర విదుడు, మహాధనుర్ధరుడు. నీతిశాస్త్రంలో శుక్రునంతటివాడు. అంగిరసపుత్రుడు దేవగురువు అయిన బృహస్పతితో సమమైన శాస్త్రజ్ఞానం కలవాడు. వీని పరాక్రమానికి ఎదురులేదు. మహాప్రతాపవంతుడైన జమదగ్నినందనుడు పరశురాముడు వీనికి అస్త్రవిద్యా గురువు—అని పలికి గంగ అదృశ్యురాలైంది.

ప్రభాకర సమతేజస్వియైన గాంగేయుని వెంటబెట్టుకొని అమరావతితో తులతూగే హస్తినాపురంలో అడుగుపెట్టి సంతోషచిత్తంతో సదాచార సద్గుణ సంపన్నుడైన కుమారునికి యువరాజ్య పట్టాభిషేకం చేశాడు. గాంగేయుడు తనశక్తితో సుగుణసౌహార్దాలతో తండ్రికి ప్రజలకూ ఆత్మవంశీ

శ్రితా వాగభవత్ సత్యం దానధర్మాశ్రితం మనః.
స సమాః షోడశాష్టౌ చ చతస్రోఽష్టౌ తథాపరాః
రతిమప్రాప్నువన్ స్త్రీషు బభూవ వనగోచరః
తథారూపస్తథాచారస్తథాశ్రుతః
గాంగేయస్తస్య పుత్రోఽభూన్నామ్నా దేవవ్రతో వసుః.

సర్వాస్త్రేషు స నిష్ణాతః పార్థివేష్వితరేషు చ
మహాబలో మహాసత్త్వో మహావీర్యో మహారథః.
స కదాచిన్మృగం విద్ధ్వా గంగామనుసరన్ నదీం
భాగీరథీమల్పజలాం శాంతనుర్దృష్టవాన్ నృపః.
తాం దృష్ట్వాచింతయామాస శాంతనుః పురుషర్షభః
స్యందతే కింత్వియంనాద్యసరిచ్ఛ్రేష్ఠాయథా పురా.
తతో నిమిత్త మన్విచ్ఛన్ దదర్శ స మహామనాః
కుమారం రూపసంపన్నం బృహంతంచారుదర్శనం.
దివ్యమస్త్రం వికుర్వాణం యథా దేవం పురందరం
కృత్స్నాం గంగాం సమావృత్య శరైస్తీక్ష్ణైరవస్థితం.
తాం శరైరచితాం దృష్ట్వా నదీం గంగాం తదంతికే
అభవద్విస్మితో రాజా దృష్ట్వా కర్మాతిమానుషం.
జాత మాత్రం పురాదృష్ట్వాతంపుత్రంశాంతనుస్తదా
నోపలేభే స్మృతిం ధీమానభిజ్ఞాతుం తమాత్మజం.
స తు తం పితరం దృష్ట్వా మోహయామాస మాయయా

సమ్మోహ్య తు తతః క్షిప్రం తత్రైవాంతరధీయత.
తదద్భుతం తతో దృష్ట్వా తత్రరాజా స శాంతనుః
శంకమానః సుతం గంగామబ్రవీద్ దర్శయేతి హ.
దర్శయామాస తంగంగా బిభ్రతీ రూపముత్తమం
గృహీత్వా దక్షిణే పాణౌ తం కుమారమలంకృతం
అలంకృతామాభరణైర్విరజోఽమ్బరసంవృతాం
దృష్టపూర్వామపి స తాం నాభ్యజానాత్ స శాంతనుః.

యం పుత్రమష్టమం రాజంస్త్వం పురా మయ్యవిందథాః
స చాయం పురుషవ్యాఘ్ర సర్వాస్త్రవిదనుత్తమః.
గృహాణేమం మహారాజ మయా సంవర్ధితం సుతం
ఆదాయ పురుషవ్యాఘ్ర నయస్వైనంగృహం విభో.
వేదానధిజగే సాంగాన్ వసిష్ఠాదేష వీర్యవాన్
కృతాస్త్రః పరమేష్వాసో దేవరాజసమో యుధి.
సురాణాం సమ్మతో నిత్యమసురాణాం చ భారత
ఉశనా వేదయచ్ఛాస్త్రమయం తద్వేద సర్వశః.
తథైవాంగిరసః పుత్రః సురాసురనమస్కృతః
యద్వేదశాస్త్రంతచ్చాపికృత్స్నమస్మిన్ ప్రతిష్ఠితం.
తవ పుత్రే మహాబాహౌ సాంగోపాంగం మహాత్మని
ఋషిః పరైరనాధృష్యో జామదగ్న్యః ప్రతాపవాన్.
యదస్త్రం వేద రామశ్చ తదేతస్మిన్ ప్రతిష్ఠితం
మహేష్వాసమిమం రాజన్ రాజధర్మార్థకోవిదం.
మయాదత్తం నిజం పుత్రం వీరం వీర గృహం నయ
ఇత్యుక్త్వా సా మహాభాగా తత్రైవాంతరధీయత
తయైవం సమనుజ్ఞాతః పుత్రమాదాయ శాంతనుః.
భ్రాజమానం యథాదిత్యమాయయౌ స్వపురంప్రతి
పౌరవస్తు పురీం గత్వా పురందరపురోపమాం.
సర్వకామసమృద్ధార్థంమేనేసోఽఽత్మానమాత్మనా
పౌరవేషు తతః పుత్రం రాజ్యార్థమభయప్రదం.
గుణవంతం మహాత్మానం యౌవరాజ్యేఽభ్యషేచయత్
పౌరవాన్ఛాంతనోః పుత్రః పితరం చ మహాయశాః.
రాష్ట్రం చ రంజయామాస వృత్తేన భరతర్షభ
స తథా సహ పుత్రేణ రమమాణో మహీపతిః.
వర్తయామాస వర్షాణి చత్వార్యమితవిక్రమః
స కదాచిద్ వనంయాతో యమునామభితో నదీం.
మహీపతిరనిర్దేశ్యమాజిఘ్రద్ గంధముత్తమం
తస్య ప్రభవమన్విచ్ఛన్ విచచార సమంతతః.

యులకూ ఆదరపాత్రుడై నాడు. అలా నాలుగేండ్లు గడిచాయి. అప్పుడు శంతనుడు యమునాతీరాన అరణ్యానికి విహారార్థం వెళ్ళాడు.

యమునానదీతీరాన విహరించే మహారాజు దూరంనుండివచ్చే సుగంధసౌరభాన్ని ఆఘ్రాణిస్తూ ఆదిశవైపు అడుగులు వేయసాగాడు. నడిచి నడిచి ఒక పల్లెపిల్లను చూశాడు. వినీలనేత్రాలతో దివ్య సౌందర్యంతో అలరారే ఆమెను చూస్తూనే — బాలా ! నీవెవరివి. నిన్ను కన్నతండ్రి ఎవరు ? ఏం చేస్తూంటావు—అనగా ఆమె — మహాత్మా ! నీకు శుభమగుగాక. నేను నిషాదకన్యను. నిషాదరాజు ఆజ్ఞానుసారం నావ నడుపుతూ బాటసారులను తరింపజేస్తున్నాను —. అన్నది. సుగంధమాధురీభరిత రూపవతియైన ఆమె తన మనస్సును హరించగా శంతనుడు నిషాదరాజువద్దకు వెళ్ళి — ఈ కన్యను నా భార్యగా అనుగ్రహించ కోరుతున్నాను — అనగా నిషాదరాజు — మహాపురుషా ! చిన్ననాటినుండి ఈమెను ఒక మహాపురుషునికిచ్చి వివాహం చేయాలనే అనుకుంటున్నాను. మీరు ఈమెను మీ ధర్మపత్నిగా స్వీకరించడానికి సంసిద్ధులైతే నాకు చాలాసంతోషం. మీకంటే ఉత్తమవరుడు నాకు లభించడు. అయితే ఒక నియమంమాత్రం ఉంది. దానికి అంగీకరిస్తే తప్పకుండా మీకు నాకుమార్తెను ఇస్తాను—అనగా విని శంతనుడు—ఆ నియమమేమిటో నేను విని దాని యోగ్యతాయోగ్యతలు చర్చించి గాని నీకు మాట యివను—అన్నాడు.

మహారాజా ! ఈమె కుమారుడు నీరాజ్యానికి సర్వాధికారి కావాలి, అదే నా కోరిక— అన్నాడు నిషాదరాజు. వినిన శంతనుడు ఆమెపై అధికంగా మోహం ఉన్నా అందుకు సమ్మతించలేకపోయాడు. మోహావశచిత్తుడై ఆమెను హృదయంలో ఉంచుకుని విచారహృదయంతో రాజధానికి వెళ్ళిపోయాడు. రోజులు గడుస్తున్నవి. శంతనుని విచారం తగ్గడంలేదు. ఆయన మనస్సు నిషాదకన్య మీదనే ఉన్నది. అలా ఆమెనుగూర్చి చింతిస్తూ ఆలోచిస్తూండగా ఒకనాడు గాంగేయుడు తండ్రిని సమీపించి— పితృపూజ్యా ! ఈ భూమండలంలోని చక్రవర్తులందరూ మీ కనుసన్నలలోచరిస్తున్నారు. ఈ పృథివిమీద మీకు లభించని భోగం చేకూరని సౌఖ్యం లేదు. అయినా మీరింత విచారంగా ఎందుకుంటున్నారో తెలియడంలేదు. మీ బాధాకారణం తెలిపితే నివారణకు ప్రయత్నిస్తాను — అనగా శంతనుడు నాయనా ! నా హృదయాన్ని బాధిస్తూన్న విషయం విను. ఈ పురువంశంలో నాకు నీ వొక్కడవే పుత్రుడవు. నువ్వు కూడా అస్త్రశస్త్రవిధుడవై పురుషార్థాలకోసంకృషిచేస్తున్నావు. ఈ స్థితిలో నీకేదన్నా ప్రమాదం సంభవిస్తే గత్యంతర మేమిటా అని ఆలోచిస్తున్నాను. నువ్వు ఒక్కడవే అయినా నేను శతాధిక పుత్రవంతుడ నని సంతోషిస్తూనే ఉన్నాను. కాని ఏ క్షణంలో నీకు ఆపద ఘటిల్లినా ఈ భరతవంశం అంతటితో ఆగిపోతుంది. పైగా ఏకపుత్రకుడు సంతానహీనుడే అని విద్వాంసులంటారు. ఏకపుత్రకుడు ఏకనేత్రుడు సములే. కళ్ళు లేనివాడికి శరీరమే లేదు. అలానే పుత్రరహితుడికి వంశం లేదు. వేదత్రయము అగ్నిహోత్రము శిష్య ప్రశిష్యక్రమమైన విద్యావంశపరంపర -ఈ మూడూ కలిసిన సంతానంలో పదహారో అంశం కావు. సంతానం యొక్క ఈ ఘనత సర్వప్రాణికోటిలో విశిష్టంగా ఉంది.

సంతాన విద్యా కర్మలు జ్యోతులనీ ఈ జ్యోతులలో సంతానం ఉత్తమమనీ వేదవిదులంటారు.

స దదర్శ తదా తస్యాం దశానాం దేవరూపిణీం
తామపృచ్ఛత్ స దృష్ట్వైవ కన్యామసితలోచనాం.
కస్య త్వమసి కా చాసి కిం చ భీరు చికీర్షసి
సాబ్రవీద్ దాశకన్యాస్మి ధర్మార్థం వాహయే తరీం.
పితుర్నియోగాద్ భద్రం తేదాశరాజ్ఞోమహాత్మనః
రూపమాధుర్యగంధైస్తాంసంయుక్తాం దేవరూపిణీం.
సమీక్ష్య రాజా దాశేయీం కామయామాస శాంతనుః
స గత్వా పితరం తస్యా వరయామాసతాం తదా.
పర్యపృచ్ఛత్ తతస్తస్యాః పితరం సోఽఽత్మకారణాత్
స చ తం ప్రత్యువాచేదం దాశరాజో మహీపతిం.
జాతమాత్రైవ మే దేయా వరాయ వరవర్ణినీ
హృది కామస్తు మే కశ్చిత్ తం నిబోధ జనేశ్వర.
యదీమాం ధర్మపత్నీంత్వంమత్తఃప్రార్థయసేఽనఘ
సత్యవాగసి సత్యేనసమయం కురు మే తతః.
సమయేన ప్రదద్యాం తే కన్యామహమిమాం నృప
న హి మే త్వత్సమః కశ్చిద్ వరో జాతు భవిష్యతి.
శ్రుత్వా తవ వరం దాశ వ్యవస్యేయమహం తవ
దాతవ్యం చేత్ ప్రదాస్యామినత్వదేయంకథంచన.
అస్యాం జాయేత యః పుత్రః స రాజా పృథివీపతే
త్వదూర్ధ్వమభిషేక్తవ్యో నాన్యః కశ్చన పార్థివ.
సకామయత తం దాతుంవరందాశాయ శాంతనుః
శరీరజేన తీవ్రేణ దహ్యమానోఽపి భారత.
న చింతయన్నేవ తదా దాశకన్యాం మహీపతిః
ప్రత్యయాద్ధాస్తినపురం కామోపహతచేతనః.
తతః కదాచిచ్ఛోచంతంశాంతనుం ధ్యానమాస్థితం
పుత్రో దేవవ్రతోఽభ్యేత్యపితరం వాక్యమబ్రవీత్.
సర్వతో భవతః క్షేమం విధేయాః సర్వపార్థివాః
తత్ కిమర్థమిహాభీక్ష్ణం పరిశోచసి దుఃఖితః.
ధ్యాయన్నివ చ మాం రాజన్నాభిభాషసి కించన
న చాశ్వేన వినిర్యాసి వివర్ణో హరిణః కృశః.
వ్యాధిమిచ్ఛామి తేజ్ఞాతుంప్రతికుర్యాంహితత్రవై
ఏవముక్తః స పుత్రేణ శాంతనుః ప్రత్యభాషత.
అసంశయం ధ్యానపరో యథావత్స తథా శృణు
అపత్యం నస్త్వమేవైకః కులే మహతి భారత.
శస్త్రనిత్యశ్చ సతతం పౌరుషే పర్యవస్థితః
అనిత్యతాం చ లోకానామనుశోచామి పుత్రక.
కథంచిత్ తవ గాంగేయ విపత్తౌనాస్తి నః కులం
అసంశయం త్వమేవైకః శతాదపి వరః సుతః.
న చాప్యహం వృథా భూయో దారాన్ కర్తుమిహోత్సహే
సంతానస్యావినాశాయ కామయే భద్రమస్తు తే.
అనపత్యతైకపుత్రత్వమిత్యాహుర్ధర్మవాదినః
చక్షురేకం చ పుత్రశ్చ అస్తి నాస్తి చ భారత.
చక్షుర్నాశే తనోర్నాశః పుత్రనాశే కులక్షయః
అగ్నిహోత్రంత్రయీవిద్యాసంతానమపిచాక్షయం.
సర్వాణ్యేతాన్యపత్యస్య కలాం నార్హంతి షోడశీం
ఏవమేతన్మనుష్యేషు తచ్చ సర్వప్రజాస్వితి.
యదపత్యం మహాప్రాజ్ఞ తత్ర మే నాస్తి సంశయః
ఏషాత్రయీపురాణానాం దేవతానాం చ శాశ్వతీ.
అపత్యం కర్మ విద్యా చ త్రీణి జ్యోతీంషి భారత
యదిదం కారణం తాత సర్వమాఖ్యాతమంజసా.
త్వం చ శూరః సదామర్షీ శస్త్రనిత్యశ్చ భారత
నాన్యత్ర యుద్ధాత్ తస్మాత్ తే నిధనం విద్యతే క్వచిత్
సోఽస్మిసంశయమాపన్నస్త్వయిశాంతేకథంభవేత్
ఇతి తే కారణం తాత దుఃఖస్యోక్తమశేషతః.
తతస్తత్కారణం రాజ్ఞో జ్ఞాత్వా సర్వమశేషతః
దేవవ్రతోమహాబుద్ధిః ప్రజ్ఞయా చాన్వచింతయత్.

ఈపాటికి నా చింతాకారణం నీకు అర్థమయి ఉంటుంది. అయితే నేను కామవశచిత్తంతో ఈ నాడు వివాహం చేసికోవాలని మాత్రం అనుకోవటం లేదు. ఈ వంశం నీతో ఆగకూడదనే ఆలోచిస్తున్నాను—అని శంతనుడు పలకగా గాంగేయుడు శ్రద్ధగా ఆలకించి ఆలోచించి వృద్ధమంత్రినిచేరి విషయం వివరించగా శంతనుని సచివుడు మహారాజు వివాహేచ్ఛతో ఉన్నాడని తెలుపగా గాంగేయుడు శంతనుని సారథిని పిలిచి — మహామతీ! నా తండ్రి మనస్సు నీకు తెలీకుండా ఉండదు. ఆయన హృదయం ఎవరిమీద లగ్నమై ఉన్నదో చెపితే ఆ ప్రకారం జరిపిస్తానన్నాడు.

అప్పుడు సారథి యమునాతటాన శంతన నిషాదులకు జరిగిన చర్చా, నిషాదరాజకన్యపై చక్రవర్తి మోహమూ తెలిపాడు.

గాంగేయుడు కురువృద్ధులను వెంటబెట్టుకుని నిషాదరాజును చేరి తన తండ్రికోసం ఆకన్యనువరిస్తున్నానన్నాడు. వచ్చిన గాంగేయాదులకు అతిథిసత్కారం సాగించి నిషాదుడు దాశరాజు — రాజపుత్రా! మహారాజ్యం శుల్కంగా యీ కన్యకు పెండ్లి చేస్తాను. ఈమె కుమారునికి రాజ్యాధికారం రావాలి—అనగా గంగానందనుడు కొద్దిక్షణాలాలోచించి అంగీకారదృక్కులు ప్రసరించాడు.

అది చూసి దాశరాజు—ఇదంయుగీన శస్త్రాస్త్ర విద్యావరుడా! ఇప్పుడు నీకు కొన్నివాస్తవాంశాలు చెప్పాలి. నా మనోఽభీష్టానుసారం ఉత్తమ వరుడు లభించినప్పుడు వివాహంచేయడానికి నా కభ్యంతరం లేదు. ఈకన్యఒకానొక ఆర్యపురుషుని పుత్రి. గుణగణాలలో ఆమె ఆయననే సర్వథా పోలి ఉన్నది. ఆయనే నాతో ఈ వివాహవిషయం చర్చించాడు. ఇతఃపూర్వమే నీ తండ్రి ఈమెను వాంఛించాడు. కానీ నా నియమానికి అంగీకరించక తిరస్కృతుడై వెళ్ళిపోయాడు. ఇప్పుడీమెను మీకు అర్పించడానికి సిద్ధంగా ఉన్నాను. దేవ దానవ గంధర్వులెవరయినా మీతో వైరం తెచ్చుకుని నిల్వలేరు. అటువంటివారితో వైరం తెచ్చుకోవడం నా అభిమతంకాదు. బలవంతులతో శత్రుత్వం సమర్థనీయంకాదు. ఒకవిధంగా యిది మీ శక్తియే అయినా అదిదోషంకూడా అగుగాక. నా నియమం అంగీకరిస్తే ఈ కన్యను గ్రహించవచ్చు - అన్నాడు దాశరాజు.

అదివిని గంగానందనుడు తండ్రికోరిక నెరవేర్చే నిశ్చయంతో — దాశరాజా! నీ నియమం అంగీకరిస్తున్నాను. సత్యవతీనందనుడే రాజ్యాధికారి అవుతాడు. సందేహంలేదు. ఇతః పూర్వంకానీ ఇక ముందుకానీ ఎవడూ ఇటువంటి ప్రతిజ్ఞ చెయ్యలేడు. చెయ్యబోడు. ఇది నాసత్య ప్రతిజ్ఞ - అనిఅందరూ వినేటట్లు ఘోషించాడు.

అయినా దాశరాజు సంతృప్తుడుకాక — దేవవ్రతా! శంతనమహారాజు రాజ్యానికి ఔరసులయిన మీరు సంపూర్ణాధికారాలతో వచ్చారు. రాజ్యంతో ఈ సత్యవతిమీద కూడా మీకు అధికారం ప్రాప్తిస్తుంది. అయితే నాది మరొక్క మనవి. ఇంటి ఆడుబిడ్డల మీద సోదరబాంధవులకుండే అమితానురాగంతో నేనీ ప్రార్థన చేస్తున్నాను. సత్యవతీహితార్థమై ఈసమయంలోమీరు చేసిన ప్రతిజ్ఞకుతిరుగుండదనే విశ్వాసం నాకున్నది. అయితే మీకు కలుగబోయే పుత్రులు కూడా మీవలెనే ఈ దృఢప్రతిజ్ఞను పాలిస్తారనే విశ్వాసం నాకు లేకపోవటం సహజంకదా — అని గాంగేయుని వైపు దృష్టి నిగుడించాడు.

అభ్యగచ్ఛత్ తథైవాసువృద్ధామాత్యం పితుర్హితం
తమపృచ్ఛత్ తదా భ్యేత్య పితుస్తచ్ఛోకకారణం.
తస్మై స కురుముఖ్యాయ యథావత్ పరిపృచ్ఛతే
వరం శశం సకన్యాం తాముద్దిశ్య భరతర్షభ.
సూతంభూయోఽపిసంత ప్తఆహ్వాయామాసవై పితుః
సూతస్తు కురుముఖ్యస్య ఉపయాత స్తదాజ్ఞయా
తమువాచ మహాప్రాజ్ఞో భీష్మోవై సారథిం పితుః.
త్వం సారథే పితుర్మహ్యం సఖాసి రథయుగ్యతః
అపి జానాసి యది వై కస్యాం భావో నృపస్య తు.
యథా వక్ష్యసి మే పృష్టః కరిష్యే న తదన్యథా
దాశకన్యా నరశ్రేష్ఠ తత్ర భావః పితుర్గతః
వృతః స నర దేవేన తదా వచనమబ్రవీత్.
యోఽస్యాంపుమాన్ భవేద్గర్భఃసరాజాత్వదనంతరం
నాకామయత తందాతుం పితా తవ వరం తదా.
స చాపి నిశ్చయ స్తస్య న చ దద్యామతోఽన్యథా
ఏవం తే కథితం వీర కురుష్వ యదనంతరం.
తతో దేవవ్రతో వృద్ధైః క్షత్రియైః సహిత స్తదా
అభిగమ్య దాశరాజం కన్యాం వవ్రే పితుః స్వయం.
తం దాశః ప్రతిజగ్రాహ విధివత్ ప్రతిపూజ్య చ
అబ్రవీచ్చైనమాసీనం రాజసంసది భారత.
రాజ్యశుల్కాప్రదాతవ్యాకన్యేయంయాచతాంవర
అపత్యం యద్భవేత్ తస్యాఃసరాజాస్తు పితుః పరం.
త్వమేవ నాథః పర్యాప్తః శాంతనోర్భరతర్షభ
పుత్రః శస్త్రభృతాం శ్రేష్ఠఃకింతువక్ష్యామి తే వచః.
కోహిసంబంధకంశ్లాఘ్యమీప్సితం యౌనమీదృశం
అతిక్రామన్న తప్యేత సాక్షాదపి శతక్రతుః
అపత్యం చైతదార్యస్యయోయుష్మాకంసమోగుణైః
యస్య శుక్రాత్ సత్యవతీ సంభూతా వరవర్ణినీ.
తేన మే బహుశస్తాత పితా తే పరికీర్తితః
అర్హః సత్యవతీం వోఢుం ధర్మజ్ఞ స నరాధిపః.
అర్థితశ్చాపి రాజర్షిః ప్రత్యాఖ్యాతః పురా మయా
స చాప్యాసీత్ సత్యవత్యా భృశమర్థీమహాయశాః.
కన్యాపితృత్వాత్ కించిత్ తువక్ష్యామిత్వాం నరాధిప
బలవత్సపత్నతామత్ర దోషం పశ్యామి కేవలం.
యస్యహిత్వంసపత్నఃస్యా గంధర్వస్యాసురస్య వా
న స జాతు చిరం జీవేత్ త్వయి క్రుద్ధే పరంతప.
ఏతావానత్ర దోషో హి నాన్యః కశ్చన పార్థివ
ఏతజ్జానీహి భద్రం తే దానాదానే పరంతప.
ఏవముక్తస్తు గాంగేయ స్తద్యుక్తం ప్రత్యభాషత
శృణ్వతాం భూమిపాలానాం పితురర్థాయ భారత.
ఇదం మే వ్రతమాదత్స్వ సత్యం సత్యవతాం వర
నైవ జాతో న వాజాత ఈదృశంవక్తుముత్సహేత్.
ఏవమేతత్ కరిష్యామి యథా త్వమనుభాషసే
యోఽస్యాం జనిష్యతే పుత్రః సనో రాజాభవిష్యతి.
ఇత్యుక్తః పునరేవాథ తం దాశః ప్రత్యభాషత
చికీర్షుర్దుష్కరం కర్మ రాజ్యార్థే భరతర్షభ.
త్వమేవ నాథః సంప్రాప్తః శాంతనోరమితద్యుతే
కన్యాయాశ్చైవధర్మాత్మన్ ప్రభుర్దానాయచేశ్వరః.
ఇదం తు వచనం సౌమ్య కార్యం చైవ నిబోధ మే
కౌమారికాణాం శీలేన వక్ష్యామ్యహమరిందమ.
యత్త్వయా సత్యవత్యర్థే సత్యధర్మపరాయణ
రాజమధ్యే ప్రతిజ్ఞాత మనురూపం తవైవ తత్
నాన్యథా తన్మహాబాహో సంశయోఽత్రన కశ్చన
తవాపత్యం భవేద్యత్తు తత్ర నః సంశయోమహాన్.
తస్యతన్మతమాజ్ఞాయ సత్యధర్మపరాయణః.
ప్రత్యజానాత్ తదా రాజన్ పితుః ప్రియచికీర్షయా.
దాశరాజ నిబోధేదం వచనం మే నరోత్తమ
ఋషయో వాథవాదేవా భూతాన్యంతర్హితాని చ
యాని యానీహశృణ్వంతునా స్తివక్తాహి మత్సమః.
ఇదం వచవ మాదత్స్వ సత్యేన మమజల్పతః

దేవవ్రితనామవిఖ్యాతుడు గాంగేయుడు దృఢ చిత్తుడై - ఓ ఋషిదేవతాగణములారా! అంతరిక్ష విహారశక్తిసంపన్నమైన ప్రాణులారా! ఈ సమయంలో నిశ్చయాత్మక బుద్ధితో నేను చేసే సత్య ప్రతిజ్ఞ ఆలకించండి. పితృహితబుద్ధితో సర్వభూమీశ సమక్షంలో ఈ ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఇంతకపూర్వ క్షణంలో నాకు రాజ్యంమీదకల అధికారం వదిలేశాను. ఇప్పుడు సంతానవాంఛకూడా వదులుతున్నాను. అద్యప్రభృతి నేను బ్రహ్మచర్యవ్రితం స్వీకరిస్తున్నాను. పుత్రరహితుణ్ణయినా నాకు అక్షయ లోకాలు ప్రాప్తిస్తాయి. జన్మాదిగా నేను అసత్యం పలకలేదు. ఆదీక్షతోనే ఇది చెపుతున్నాను. రాజ్యశ్రీభోగాలను ఈక్షణంనుండి వదలి పెడుతున్నాను. కనక నీకుమార్తెను నా తండ్రికి సమర్పించు— అన్నాడు.

దాశరాజు శరీరం పులకించిపోయింది. ఆక్షణంలో ఆయన తనకన్యను మహారాజపత్నిగా పంపడానికే అంగీకరించాడు.

ఆక్షణంలో ఆకసవీధినుండి పుష్పవృష్టితో— ఈ దృఢప్రతిజ్ఞుడు నేటినుండి భీష్ముడనే నామంతో వ్యవహరింపబడతాడు—అనే శబ్దం వినిపించింది. అప్పుడు భీష్ముడు పితృప్రియార్థమై సత్యవతిని తన రథంమీద కూర్చోబెట్టుకొని హస్తినాపురికి వచ్చి శంతనమహారాజుకి అర్పించగా రాజూ ప్రజలూ ప్రశంసాభాషలతో అతనిని అలంకరించారు. అనంతరం భీష్ముని ద్వారా సాగిన సాహసప్రజ్ఞాదికాలు విని శంతనుడు అతనికి స్వచ్ఛంద మరణం ప్రసాదిస్తూ— నాయనా! ఈ క్షోణీతలంమీద నువ్వు జీవించదలచినంతకాలం మృత్యువు నీ ఛాయలలోకి రాలేదు— అన్నాడు.

100వ అధ్యాయము సమాప్తం

## నూట ఒకటవ అధ్యాయము

సత్యవతి చేదినాథుడైన వసువుయొక్క ఔరస పుత్రి. దాశరాజామెను పెంచాడు. ఈ విషయం గుర్తించిన శంతనమహారాజు సత్యవతిని విధివిధానంగా పరిణయమై స్వగృహానికి తీసికొనివచ్చాడు. కొంతకాలానికి శంతనునివల్ల సత్యవతి చిత్రాంగదుడను కుమారుని కన్నది. అతడు శౌర్యధైర్య సాహసాదులందసమానుడు. మరికొంతకాలానికి సత్యవతికి విచిత్రవీర్యుడనే రెండవకుమారుడు కూడ జనించాడు. వీరి బాల్యావస్థయందే శంతనుడు పరలోకగతుడైనాడు. శంతనుని మరణానంతరం భీష్ముడు సత్యవతి ఆజ్ఞనుపొంది చిత్రాంగదునికి పట్టాభిషేకం చేశాడు. చిత్రాంగదుడు బలగర్వితుడై లోకంలో తనకు సాటియైన పురుషుడే లేడని భావించడమేగాక దేవతలూ రాక్షసులూకూడా తనకు సాటికారని యథేచ్ఛగా చరించేవాడు. ఇలా జరుగుతూండగా ఒకనాడు చిత్రాంగదుడనే పేరుగల గంధర్వుడీమహారాజుదగ్గరకు వచ్చాడు.

వచ్చిన గంధర్వుడు చిత్రాంగదుని చూసి- రాజకుమారా! నాపేరు చిత్రాంగదుడు. నువ్వుకూడా నాపేరుతో ఉన్నావు. కనక నాతో యుద్ధం చేసినా సరే పేరు మార్చుకున్నా సరే— అని గర్జించాడు.

శృణ్వతాం భూమిపాలానాం యద్బ్రవీమిపితుఃకృతే.
రాజ్యంతావత్ పూర్వమేవమయా త్యక్తం
నరాధిపాః
అపత్యహేతోరపి చ కరిష్యేద్య వినిశ్చయం.
అద్యప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి
అపుత్రిస్యాపి మే లోకా భవిష్యంత్యక్షయా దివి.
న హి జన్మప్రభృత్యుక్తం మమ కించిదహానృతం
యావత్ప్రాణాధ్రియంతేవైమమదేహంసమాశ్రితాః.
తావన్న జనయిష్యామి పిత్రే కన్యాం ప్రయచ్ఛమే
పరిత్యజామ్యహం రాజ్యం మైథునం చాపి సర్వశః
ఊర్ధ్వరేతా భవిష్యామి దాశ సత్యం బ్రవీమి తే.
తస్య తద్వచనం శ్రుత్వా సంప్రహృష్టతనూరుహః
దదానీత్యేవం తం దాశో ధర్మాత్మా ప్రత్యభాషత.

తతోఽన్తరిక్షేఽప్సరసో దేవాః సర్షిగణాస్తదా
అభ్యవర్షంత కుసుమైర్భీష్మోఽయమితి చాబ్రువన్.
తతః స పితురర్థాయ తామువాచ యశస్వినీం
అధిరోహ రథం మాతర్గచ్ఛావః స్వగృహానితి.
ఏవముక్త్వాతు భీష్మస్తాం రథమారోప్యభామినీం
ఆగమ్య హాస్తినాపురం శాంతనోః సన్యవేదయత్.
తస్య తద్దుష్కరం కర్మ ప్రశశంసుర్నరాధిపాః
సమేతాశ్చ పృథక్చైవ భీష్మోయమితి చాబ్రువన్.
తచ్ఛ్రుత్వాదుష్కరంకర్మకృతం భీష్మేణశాంతనుః
స్వచ్ఛందమరణం తుష్టో దదౌ తస్మై మహాత్మనే.
న తే మృత్యుః ప్రభవితా యావజ్జీవితుమిచ్ఛసి
త్వత్తో హ్యనుజ్ఞాం సంప్రాప్యమృత్యుఃప్రభవితానఘ

100వ అధ్యాయం సమాప్తం

## నూట ఒకటవ అధ్యాయము

చేదిరాజసుతాం జ్ఞాత్వా దాశరాజేన వర్ధితాం
వివాహం కారయామాస శాస్త్రదృష్టేన కర్మణా.
తతో వివాహే నిర్వృత్తే స రాజా శాన్తనుర్నృపః
తాం కన్యాం రూపసంపన్నాం స్వగృహేసంన్య
వేశయత్.
తతః శాన్తనవో ధీమాన్ సత్యవత్యామజాయత
వీరశ్చిత్రాంగదో నామ వీర్యవాన్ పురుషేశ్వరః.
అథాపరం మహేష్వాసం సత్యవత్యాంసుతం ప్రభుః
విచిత్రవీర్యం రాజానం జనయామాస వీర్యవాన్.
అప్రాప్తవతి తస్మింస్తు యౌవనం పురుషర్షభే
స రాజా శాన్తనుర్ధీమాన్ కాలధర్మముపేయివాన్.
స్వర్గతే శాన్తనౌ భీష్మశ్చిత్రాంగదమరిందమమ్
స్థాపయామాస వై రాజ్యే సత్యవత్యామతేస్థితః.

సతు చిత్రాంగదః శౌర్యాత్ సర్వాంశ్చిక్షేప
పార్థివాన్
మనుష్యం న హి మేనేసకంచిత్ సదృశమాత్మనః.
తంక్షిపంతం సురాంశ్చైవమనుష్యానసురాంస్తథా
గంధర్వరాజో బలవాంస్తుల్యనామాభ్యయాత్తదా.
త్వయాహంయుద్ధమిచ్ఛామిత్వత్సకాశాత్తునామతః
ఆగతోఽస్మి వృథాభాష్యో న
గచ్ఛేన్నామతో యథా.
తేనాస్య సుమహద్యుద్ధం కురుక్షేత్రే బభూవ హ
తయోర్బలవతోస్తత్ర గన్ధర్వకురుముఖ్యయోః.
నద్యాస్తీరే సరస్వత్యాః సమాస్తిస్రోఽభవద్రణః
తస్మిన్ విమర్దే తుములే శస్త్రవర్ష సమాకులే
మాయాధికోఽవధీద్వీరం గన్ధర్వఃకురుఃకురుసత్తమ.

గంధర్వునిమాటలు విన్న చిత్రాంగదుడు గంధర్వునితో కురుక్షేత్రంచేరాడు. ఇద్దరూ మహాబలశాలురూ సర్వశస్త్రాస్త్రకుశలురూ, వారు సరస్వతీ నదీతీరంలో మూడుసంవత్సరాలు యుద్ధంచేశారు. ఆయుద్ధంలో చిత్రాంగదుని వధించి గంధర్వుడు స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు. ఈ వార్తవిన్న భీష్ముడు యథావిధిగా చిత్రాంగదునకు అంత్యక్రియలు పూర్తిచేయించి చిన్నవయస్సువాడైనా విచిత్రవీర్యుని రాజుగా చేశాడు. ధర్మార్థాలను గ్రహించిన భీష్ముని అడుగుజాడలలోనే నడుస్తున్నాడు విచిత్రవీర్యుడు.

101వ అధ్యాయం సమాప్తం

## నూట రెండవ అధ్యాయము

సభాభవనంలో ఉండే రాజులందరూ భీష్ముణ్ణి చూసి భరతవంశశిరోమణి భీష్ముడు ధర్మాత్ముడని వింటున్నామే. ముసలివాడైపోయాడు. వెంట్రుకలు నెరిసాయి. దేహం ముడతలు పడుతోంది. అయినా సిగ్గులేకుండా ఇక్కడికి ఎందుకువచ్చాడో. పైగా బ్రహ్మచర్యవ్రతావలంబి గదా! స్వయంవరంలో ఇతనికేం పనుంది. అడిగితే యేం చెబుతాడు. తనముఖం నలుగురికీ యెలా చూపగలుగుతాడు. భీష్ముడు బ్రహ్మచారి అని వృథాప్రచారం జరిగి ఉంటుంది— అని అనేకరీతులుగా వారికి తోచినట్లల్లా అంటున్నారు. వారిలో వారు నవ్వుకుంటున్నారు.

ఈవిధంగా క్షత్రియ వీరులందరూ ప్రసంగిస్తూంటే భీష్ముడు ఆవేశంతో లేచి ఆముగ్గురు కన్యలనూ తన రథంమీద కూర్చోబెట్టుకొని వర్షాకాల మేఘగర్జనతో సమమైన కంఠంతో— ఓ మహావీరులారా! విద్వాంసులు వివాహాలు ఎనిమిది విధాలుగా వ్యవహరిస్తున్నారు.

వస్త్రాలంకారభూషితమైన కన్యను యథాశక్తి దక్షిణతో సమర్పించేది బ్రాహ్మం. రెండు ఆవులను ఎడ్లను తీసుకొని చేసే కన్యాదానం ఆర్షం. యథేచ్ఛగా ధనం తీసుకొని కన్యనివ్వటం ఆసురం. బలపరాక్రమాలతో కన్యాపహరణం చేస్తే అది రాక్షసం. వధూవరుల పరస్పరానురాగంతో చేసుకొనే పెండ్లి గాంధర్వం. అచేతన స్థితిలోఉన్న కన్యను దొంగిలించుకొనిపోవటం పైశాచికం. వధూవరులను సమావేశపరచి గార్హస్థ్యధర్మపరిపాలన ప్రయాణం చేయించి కన్యయొక్క తండ్రి ఉభయులను అర్చించి చేసే వివాహం ప్రాజాపత్యం. యజ్ఞం చేసి ఋత్విజునికి కన్యాదానం చెయ్యటం దైవం అనబడుతుంది.

క్షత్రియులు స్వయంవరం ప్రశస్తంగాభావిస్తారు. అందులో అన్యరాజులను జయించి స్వీకరించిన కన్యను పాణిగ్రహణం చేసికోవటం సర్వోత్తమం. ఆవిధానాన్నే నేను అవలంబిస్తున్నాను. మీ బలపౌరుషాలు ప్రదర్శించి నాతో యుద్ధం చెయ్యవచ్చును-అంటూనే భీష్ముడు తనరథాన్ని ముందుకు పోనిచ్చాడు. రాజులందరూ అవమానంతో పళ్ళు పటపట కొరుకుతూ రత్నకేయూరాద్యలం

స హత్వా తు నర శ్రేష్ఠం చిత్రాంగదమరిందమం
అంతా య కృత్వా గంధర్వో దివమాచక్రమే తతః.
తస్మిన్ పురుష శార్దూలే నిహతే భూరి తేజస
భీష్మః శాన్తనవో రాజా ప్రేతకార్యాణ్యకారయత్
విచిత్రవీర్యం చ తదా బాలమప్రాప్త యౌవనం
కురురాజ్యే మహాబాహురభ్యషించదనన్తరం.
విచిత్రవీర్యః స తదా భీష్మస్య వచనే స్థితః
అన్వశాసన్మహారాజ పితృపైతామహం పదం.
స ధర్మశాస్త్రకుశలం భీష్మం శాన్తనవం నృపః
పూజయామాస ధర్మేణ స చైనం ప్రత్యపాలయత్.

101 వ అధ్యాయం సమాప్తం.

## నూట రెండవ వ అధ్యాయము

హతే చిత్రాంగదే భీష్మో బాలే భ్రాతరి కౌరవ
పాలయామాస తద్రాజ్యం సత్యవత్యా మతే స్థితః
సంప్రాప్తయౌవనం దృష్ట్వా భ్రాతరం ధీమతాం వరః
భీష్మో విచిత్రవీర్యస్య వివాహాయాకరోన్మతిం.
అథ కాశిపతేర్భీష్మః కన్యాస్తిస్రోఽప్సరోపమాః
శుశ్రావ సహితా రాజన్ వృణ్వానా వై
స్వయంవరం.

తతః స రథినాం శ్రేష్ఠో రథే నైకేన శత్రుజిత్
జగమానుమతే మాతుః పురీం వారాణసీం ప్రభుః.
తత్ర రాజ్ఞః సముదితాన్ సర్వతః సముపాగతాన్
దదర్శ కన్యాస్తాశ్చైవ భీష్మః శాన్తనునన్దనః.
కీర్త్యమానేషు రాజ్ఞాం తు తదా నామసు సర్వశః
ఏకాకినం తదా భీష్మం వృద్ధం శాన్తనునందనమ్.
సోద్వేగా ఇవ తం దృష్ట్వా కన్యాః పరమశోభనాః
అపాక్రామన్త తాః సర్వా వృద్ధ ఇత్యేవ చింతయా.
వృద్ధః పరమ ధర్మాత్మా వలీపలితధారణః
కిం కారణ మిహాయాతో నిర్లజ్జో భరతర్షభః.
మిథ్యాప్రతిజ్ఞో లోకేషు కిం వదిష్యతి భారత
బ్రహ్మచారీతి భీష్మో హి వృథైవ ప్రథితో భువి.
ఇత్యేవం ప్రబ్రువన్తస్తే హసంతి స్మ నృపాధమాః.
క్షత్రియాణాం వచః శ్రుత్వా భీష్మశ్చుక్రోధ భారత
భీష్మస్తదా స్వయం కన్యా వరయామాస తాః ప్రభుః
ఉవాచ చ మహీపాలాన్ రాజన్ జలదనిస్వనః.
రథమారోప్య తాః కన్యా భీష్మః ప్రహరతాం వరః
ఆహూయ దానం కన్యానాం గుణవద్భ్యః స్మృతం బుధైః.
అలంకృత్య యథాశక్తి ప్రదాయ చ ధనాన్యపి
ప్రయచ్ఛన్త్యపరే కన్యా మిథునేన గవామపి.
విత్తేన కథితేనాన్యే బలేనాన్యేఽనుమాన్య చ
ప్రమత్తాముపయన్త్యన్యే స్వయమన్యే చ విన్దతే.
ఆర్షం విధి పురస్కృత్య దారాన్ విందంతి చాపరే
అష్టమం తమనో విత్త వివాహం కవిభిర్వృతమ్.
స్వయంవరం తు రాజన్యాః ప్రశంసన్త్యుపయాన్తి చ
ప్రమథ్య తు హృతామాహుర్జ్యాయసీం
ధర్మవాదినః.

తా ఇమాః పృథివీపాలాన్ జిహీర్షామి బలాదితః
తే యతధ్వం పరం శక్త్యా విజయాయేత రాయవా.
స్థితోఽహం పృథివీపాలా యుద్ధాయ కృతనిశ్చయః
ఏవముక్త్వా మహీపాలాన్ కాశిరాజంచ వీర్యవాన్.
సర్వాం కన్యాః స కౌరవ్యో రథమారోప్య చ స్వకమ్
ఆమన్త్ర్య చ స తాన్ ప్రాయాచ్ఛీఘ్రం కన్యాః
ప్రగృహ్య తాః.
తతస్తే పార్థివాః సర్వే సముత్పేతురమర్షితాః

కారాలు విడిచి కవచధారులై తమ వాహనాలను ముందుకు దూకించారు. తీవ్రవేగంతో సాగే ఆరథాలు భీష్ముని వెన్నాడి యుద్ధం ఆరంభించాయి. వారందరూ వేలకొద్దీ బాణాలు విడుస్తూంటే భీష్ముడు మధ్యేమార్గంలోనే ఛిన్నం చేస్తున్నాడు. పర్వతంమీద మేఘాలు వర్షిస్తూన్నట్లు సర్వతో ముఖంగా బాణాలు భీష్మునిమీదకు వస్తున్నాయి. ఒక్కొక్క ధనుస్సు నుండి ఏకకాలంలో ఐదేసి బాణాలు వెలువడుతున్నాయి.

దేవాసుర సంగ్రామంతో పోల్చదగినట్లు యుద్ధం సాగుతూన్నది. మహావీరులందరూ చూస్తూండగా భీష్ముడు వారి ధనస్సులను విరిచీ ధ్వజాగ్రాలను ఎగురగొట్టి కవచాలను ఛేదించి శిరస్సులను వేరు చేస్తున్నాడు. ధనుర్విద్యాకుశలుడైన భీష్ముడు ప్రతిపక్షులందరినీ ఓడించి ముగ్గురు కన్యలతో హస్తినాపురం చేరాడు. చేరుతూన్న సమయంలో మహారథికుడైన సాళ్వుడు కరిణిని వెంటాడు కరిణీపతివలె కన్యావిమోహితచిత్తుడై భీష్ముని ఉద్దేశించి— ఓరే భీష్మా! నిలు— అని గర్జించాడు. ఆమాటకు భీష్ముడు క్రోధపూరితహృదయుడై ధూమరహిత మైన అగ్నివలె జ్వలిస్తూన్నముఖంతో ధనుర్బాణ ధారియై సాళ్వునివైపు రథం తిప్పుతూనే సాళ్వ సారథిని హతమార్చాడు. గోవువెంట దగిలిన రెండు కోడెలవలె భీష్మ సాళ్వులు సాగించే యుద్ధాన్ని ఇతరరాజులు కళ్ళప్పగించి చూస్తూన్నారు. మహారథికుడైన సాళ్వుని బాణాలు భీష్ముని శరీరాన్ని తాకుతూ ఉంటే ప్రేక్షకులుగా ఉన్న రాజులందరూ వానిని ప్రశంసించసాగారు.

ప్రతిపక్షుల ప్రశంసానాదాలు భీష్ముని మరింత ఉద్రేకించగా— గరుడుడు సర్పాన్ని చీల్చినట్లు ఈ సాళ్వుణ్ణి చంపుతాను— అని సారథిని తొందర చేసి రథవేగం హెచ్చించి వారుణాస్త్రంతో సాళ్వుని రథాశ్వాలను నేలపాలు చేసి సాళ్వుని ప్రాణ మాత్రావశిష్టునిగా చేసి విజయశ్రీ విరాజితుడై నిజగృహానికి వచ్చాడు. అన్యరాజులూ సాళ్వుడూ గృహోన్ముఖులయారు.

హస్తినాపురంలో విచిత్రవీర్యులు శంతనుని వలెనే రాజ్యం పరిపాలిస్తున్నారు. ధర్మాత్ముడు గాంగేయుడు కాశీరాజకన్యలను పుత్రవధువులుగా చెల్లెండ్రుగా కుమార్తెలుగా భావిస్తూ తీసికొని వచ్చి తన సోదరుడైన విచిత్రవీర్యునకు సమర్పించి తల్లి సత్యవతి ఆజ్ఞానుసారం వివాహప్రయత్నాలు ఆరంభించాడు. ఆసమయంలో కాశీరాజ జ్యేష్ఠ పుత్రి భీష్ముని పిలిచి— ధర్మాత్మా! నేను ఇదివరకే సాళ్వపతిని వరించాను. ఆయనకూడా నన్ను వరించాడు. నన్ను సాళ్వునికిస్తానని మాతండ్రి మాట ఇచ్చాడు. స్వయంవరంలో ఆవిధంగా జరిగి ఉండేది. ఇప్పుడు మీరు ధర్మాధర్మాలు విచారించి మీ కార్యక్రమం కొనసాగించండి—అనగా భీష్ముడు ఇతర ధర్మవిదులతో సంప్రదించి ఆమెను సాళ్వుని వద్దకే వెళ్ళమని ఆజ్ఞాపించాడు.

మిగిలిన అంబికా అంబాలికలను విచిత్రవీర్యున కిచ్చి విధ్యుక్తంగా వివాహం చేశాడు. విచిత్రవీర్యుడు షోడశవసంతాలు దాటిన సుందరపత్నీ ద్వయంతో కామోపభోగాల ననుభవిస్తున్నాడు. అంబికా అంబాలికలు విచిత్రవీర్యుడు భర్తగా లభించటం తమ అదృష్టంగా భావించుకొని వానిని సేవిస్తున్నారు. నారీహృదయాకర్షణ విద్యాకుశలుడైన విచిత్రవీర్యుడు ఏడుసంవత్సరాలు నిర్విరామంగా సాగించిన కామయాత్ర ఫలితంగా

సంస్పృశన్తః స్వకాన్ బాహూన్ దశన్తో దశన
చ్ఛదాన్.
తేషామాభరణాన్యాశు త్వరితానాం విముఞ్చతాం
అముఞ్చతాంచవర్మాణిసమ్భ్రమఃసుమహానభూత్
తారాణామివ సంపాతో బభూవ జనమేజయ
భూషణానాం చ సర్వేషాం కవచానాం చ సర్వశః.
సవర్మభిర్భూషణైశ్చ ప్రకీర్యైర్భరితస్తతః
సక్రోధామర్షజిహ్మభ్రూకషాయీకృతలోచనాః.
సూతోపక్లృప్తాన్ రుచిరాన్ సదశ్వైరుపకల్పితాన్
రథానాస్థాయ తే వీరాః సర్వప్రహరణాన్వితాః.
ప్రయాన్తమథ కౌరవ్యమనుసస్రురుదాయుధాః
తతః సమభవ ద్యుద్ధం తేషాం తస్యచ భారత
ఏకస్య చ బహూనాం చ తుములం లోమహర్షణం.
తే త్విషూన్ దశ సాహస్రాం స్తస్మిన్ యుగ
పదాక్షిపన్
అప్రాప్తాంశ్చైవ తానాశుభీష్మఃసర్వాం స్తథాన్తరా
అచ్ఛిన్నచ్ఛరవర్షేణ మహతా లోమవాహినా
తతస్తే పార్థివాః సర్వే సర్వతః పరివార్య తమ్.
వవృషుః శరవర్షేణ వర్షేణేవాద్రిమమ్బుదాః
స తం బాణమయం వర్షం శరైరావార్య సర్వతః.
తతః సర్వాన్ మహీపాలాన్ పర్యవిధ్యాత్
త్రిభిస్త్రిభిః
ఏకైకస్తు తతో భీష్మం రాజన్ వివ్యాధ పంచభిః.
స చ తాన్ ప్రతివివ్యాధ ద్వాభ్యాం ద్వాభ్యాం
పరాక్రమన్
త ద్యుద్ధమాసీత్తుములం ఘోరం దేవాసురోపమం.
పశ్యతాం లోకవీరాణాం శరశక్తి సమాకులం
స ధనూంషి ధ్వజాగ్రాణి వర్మాణి చ శిరాంసి చ.
చిచ్ఛేద సమరే భీష్మః శతశోఽథ సహస్రశః
తస్యాతి పురుషానన్యాల్లాఘవం రథచారిణః.

రక్షణంచాత్మనఃసంఖ్యేశత్రవోఽప్యభ్యపూజయన్
తాన్ వినిర్జిత్య తు రణే సర్వశస్త్రభృతాం వరః.
కన్యాభిః సహితః ప్రాయాద్భారతోభరతాన్ ప్రతి
తతస్తం పృష్ఠతో రాజన్ సాళ్వరాజో మహారథః
అభ్యగచ్ఛదమేయాత్మా భీష్మం శాన్తనవం రణే
వారణం జఘనే భిన్దన్ దన్తాభ్యామపరో యథా.
వాసితామనుసంప్రాప్తో యూథపో బలినాం వరః
స్త్రీకామ స్తిష్ఠ తిష్ఠేతి భీష్మమాహ స పార్థివః.
సాళ్వరాజో మహాబాహు రమర్షేణ ప్రచోదితః
తతః స పురుషవ్యాఘ్రో భీష్మః పరబలార్దనః.
తద్వాక్యాకులితఃక్రోధాద్విధూమోఽగ్నిరివజ్వలన్
వితతేషుధనుష్పాణిర్వికుఞ్చితలలాటభృత్.
క్షత్రధర్మం సమాస్థాయ వ్యపేతభయసంభ్రమః
నివర్తయామాస రథం సాళ్వం ప్రతి మహారథః
నివర్తమానం తం దృష్ట్వా రాజానః సర్వ ఏవ తే
ప్రేక్షకాః సమపద్యన్త భీష్మసాళ్వసమాగమే.
తౌ వృషావివ నర్దన్తౌ బలినౌ వాసితాన్తరే
అన్యోన్యమభ్యవర్తేతాం బలవిక్రమశాలినౌ.
తతో భీష్మంశాన్తనవంశరైః శతసహస్రశః
సాళ్వరాజో నరశ్రేష్ఠః సమవాకిరదాశుగైః.
పూర్వమభ్యర్దితం దృష్ట్వా భీష్మం సాళ్వేనతేనృపాః
విస్మితాః సమపద్యన్త సాధు సాధ్వితి చాబ్రువన్.
లాఘవం తస్య తే దృష్ట్వా సమరే సర్వపార్థివాః
అపూజయన్త సంహృష్టావాగ్భిః సాళ్వం నరాధిపం.
క్షత్రియాణాం తతో వాచఃశ్రుత్వా పరపురంజయః
క్రుద్ధః శాన్తనవో భీష్మ స్తిష్ఠ తిష్ఠేత్యభాషత.
సారథిం చాబ్రవీ త్క్రుద్ధో యాహి
యత్రైష పార్థివః
యావదేనం నిహన్మ్యద్య భుజఙ్గమివ పక్షిరాట్.
తతోఽస్త్రం వారుణంసమ్యగ్యోజయామాసకౌరవః

వహానసంలోనే రాజయక్ష్మకు గురి అయాడు. రాజవైద్యులుకానీ ఆయుర్వేద విదులుకానీ మహారాజుకు చికిత్స చేయలేకపోయారు. నియమరహితంగా కామోపభోగాలనుభవించిన విచిత్రవీర్యుడు సాయంవేళ పశ్చిమాద్రికిపోయే సూర్యునివలె యమలోక గతుడైనాడు.

గాంగేయుడు విచారపూర్ణహృదయుడై తల్లి ఆజ్ఞానుసారం సోదరునికి దహనాదికాలు శాస్త్రోక్తంగా నెరవేర్చాడు.

102 వ అధ్యాయం సమాప్తం

## నూట మూడవ అధ్యాయము

సత్యవతి పుత్రశోకంతో కృశరాలై కొంత కాలం గడిపింది. కోడళ్ళుకాని భీష్ముడుకాని తమ విచారాన్ని దిగమ్రింగుకోలేకపోవటం చూసి తానే ధైర్యం తెచ్చుకొని భీష్ముని పిలిచి— నాయనా! శంతనుమహారాజుయొక్క కీర్తిప్రతిష్ఠలతో పారలౌకిక సుఖాలుకూడా నీమీద ఆధారపడి ఉన్నాయి. ధర్మకార్యాలవల్ల స్వర్గమూ సత్యవ్రతంవల్ల ఆయుర్వృద్ధి ప్రాప్తించునట్లు నీయందు ధర్మం ప్రవర్తిస్తున్నది. నానాధర్మవిదుడవై శుక్రబృహస్పతులవలె యుక్తిప్రయుక్తియుతుడవై చరించే నువ్వు నామాటల్ని శ్రద్ధగా విను. నీ సోదరుడు విచిత్రవీర్యుడు అతులిత పరాక్రమ సంపన్నుడు. వాడు నీకు ప్రాణసముడు. పుత్రరహితుడై స్వర్గానికి పోయిన వాని భార్యలిరువురూ యౌవనశ్రీసముపేతులై ఉన్నారు. వారి గర్భాలనుండి నా ఆజ్ఞానుసారం నువ్వు కుమారుల్ని కను. పితృదేవతలకు నరకం రాకుండా ఉండటానికి నువ్వీ ధర్మకార్యం చెయ్యి—అనగా భీష్ముడు—అమ్మా! నువ్వు చెప్పింది ధర్మసమ్మతమే కానీ ప్రలోభంతో రాజ్యాభిషేకానికిగాని స్త్రీ సమాగమానికికానీ నా మనస్సు అంగీకరించటం లేదు. నా ప్రతిజ్ఞ నీవెరుగనిది కాదు. ఒక్క విషయంమాత్రం మర్చిపోకు. దేవరాజ్యం కానీ త్రిలోకాధిపత్యంకానీ నిర్లిప్తంగా వదలగలను. నా ప్రతిజ్ఞమాత్రం భంగం చేసుకోను. పృథివి గంధాన్నీ అగ్ని తేజస్సునీ వాయువు స్పర్శనీ వదలినా ఆకాశం శబ్దాన్నీ చంద్రుడు శీతలత్వాన్నీ ఇంద్రుడు పరాక్రమాన్నీ సూర్యుడు ప్రకాశాన్నీ యముడు ధర్మాన్నీ విడిచినా నేను సత్యమార్గాన్ని విడువను— అని దృఢనిశ్చయంతో నిలిచిన కుమారుని చూచి సత్యవతి—నాయనా! నీ సత్యవ్రతపాలనం నే నెరుగుదును. త్రిలోకాలనూ సృష్టింపగల శక్తిశాలివి నువ్వు. ఆపద్ధర్మానుసారం ఈ రాజ్యభారాన్ని వహించు. వంశపరంపరని నిలబెట్టు— అని దీనంగా పలికే తల్లిని చూసి భీష్ముడు— అమ్మా! ధర్మమార్గం విడిచి మమ్మల్నందరినీ నాశనం చెయ్యకు. ఏధర్మమూ అధర్మంగా నడవమని బోధించదు. అయితే శంతనుమహారాజు వంశం ఇంతతో ఆగకుండా ఉండే ధర్మమార్గం నేను చెపుతాను. ఆపద్ధర్మవిదులవల్ల విన్న విషయం చెపుతున్నాను— అన్నాడు.

తేనాశ్వాం శ్చతురోఽమృగ్నచ్ఛాళ్వరాజస్య భూపతే.
అస్త్రైరస్త్రాణి సంవార్య సాళ్వరాజస్య కౌరవః
భీష్మో నృపతి శార్దూలమవధీత్తస్య సారథిం.
అస్త్రేణ చాస్యాథైన్ద్రేణాన్యవధీ త్తురగోత్తమాన్
కన్యాహేతోర్నరశ్రేష్ఠః భీష్మః శాన్తనవస్తదా.
జిత్వా విసర్జయామాస జీవన్తం నృపసత్తమం
తతః సాళ్వః స్వనగరం ప్రయయౌ భరతర్షభ.
స్వరాజ్యమన్వశాచ్చైవ ధర్మేణనృపతి స్తదా
రాజానో యే చ తత్రాసన్ స్వయంవరదిదృక్షవః.
స్వాన్యేవ తేఽపి రాష్ట్రాణి జగ్ముఃపరపురంజయాః
ఏవం విజిత్య తాః కన్యా భీష్మః ప్రహరతాం వరః
ప్రయయౌ హాస్తినపురం యత్ర రాజా స కౌరవః.
విచిత్రవీర్యో ధర్మాత్మా ప్రశాస్తి వసుధామిమాం.
యథా పితాస్య కౌరవ్యః శాన్తనుర్నృపసత్తమః
సోఽచిరేణైవ కాలేన అత్యక్రామన్నరాధిప.
వనాని సరితశ్చైవ శైలాంశ్చ వివిధాన్ ద్రుమాన్
అక్షతః క్షపయిత్వారీన్ సంఖ్యేఽసంఖ్యేయవిక్రమః.
ఆనయామాస కాశ్యస్య సుతాః సాగరగాసుతః
స్నుషా ఇవ స ధర్మాత్మా భగినీరివ చానుజాః.
యథాదుహితరశ్చైవపరిగృహ్యాయయౌకురూన్
ఆనిన్యే స మహాబాహుర్భ్రాతుఃప్రియచికీర్షయా.
తాః సర్వగుణసంపన్నా భ్రాతా భ్రాతేయవీయసే
భీష్మో విచిత్రవీర్యాయ ప్రదదౌ విక్రమాహృతాః.
ఏవం ధర్మేణ ధరజ్ఞః కృత్వా కర్మాతిమానుషం
భ్రాతుర్విచిత్రవీర్యస్య వివాహాయోపచక్రమే.
సత్యవత్యాసహమిథఃకృత్వానిశ్చయమాత్మవాన్
వివాహం కారయిష్యన్తం భీష్మం కాశిపతేః సుతా
జ్యేష్ఠా తాసామిదం వాక్యమబ్రవీద్ధ సతీ తదా.
మయా సౌభపతిః పూర్వంమనసా హి వృతః పతిః
తేన చాస్మి వృతా పూర్వమేష కామశ్చ మే పితుః.
మయా వరయితవ్యోఽభూత్ సాల్వస్తస్మిన్ స్వయంవరే
ఏత ద్విజ్ఞాయ ధర్మజ్ఞ ధర్మతత్త్వ సమాచర.
ఏవముక్తస్తయా భీష్మః కన్యయా విప్రసంసది
చిన్తామభ్యగమ ద్వీరో యుక్తాం తస్యైవ కర్మణః.
వినిశ్చిత్య స ధర్మజ్ఞో బ్రాహ్మణై ర్వేదపారగైః
అనుజజ్ఞే తదా జ్యేష్ఠామమ్బాం కాశిపతేః సుతాం.
అమ్బికామ్బాలికేభార్యేప్రాదాద్భ్రాత్రేయవీయసే
భీష్మో విచిత్రవీర్యాయ విధిదృష్టేన కర్మణా.
తయోః పాణీ గృహీత్వా తు రూపయౌవనదర్పితః
విచిత్రవీర్యో ధర్మాత్మా కామాత్మా సమపద్యత.
తే చాపి బృహతీ శ్యామే నీలకుఞ్చితమూర్ధజే
రక్తతుంగనఖోపేతే పీనశ్రోణిపయోధరే.
ఆత్మనః ప్రతిరూపోఽసౌ లబ్ధః ప్రతిరితి స్థితే
విచిత్రవీర్యం కళ్యాణ్యౌ పూజయామాసతుః శుభే
స చాశ్విరూపసదృశో దేవతుల్యపరాక్రమః
సర్వాసామేవ నారీణాం చిత్తప్రమథనో రహః.
తాభ్యాం సహ సమాః సప్త విహరన్ పృథివీపతిః
విచిత్రవీర్యస్తరుణో యక్ష్మణా సమగృహ్యత
సుహృదాం యతమానానామాప్తైఃసహ చికిత్సకైః
జగామాస్తమివాదిత్యః కౌరవ్యో యమసాదనం.
ధర్మాత్మా స తు గాంగేయశ్చిన్తాశోకపరాయణః
ప్రేతకార్యాణి సర్వాణి తస్య సమ్యగకారయత్.
రాజ్ఞో విచిత్రవీర్యస్య సత్యవత్యా మతే స్థితః
ఋత్విగ్భిఃసహితో భీష్మఃసర్వైశ్చ కురుపుంగవైః.

102 వ అధ్యాయం సమాప్తం.

## నూట నాల్గవ అధ్యాయము

అమ్మా! గుణవంతుడైన బ్రాహ్మణుణ్ణి పిలిపించి విచిత్రవీర్యుల భార్యల గర్భాలనుండి సంతానం ఉత్పత్తి చేయించవచ్చు. మనువు ఈ విధిని రాజవంశ సంరక్షణార్థమే అనుగ్రహించాడు— అని భీష్ముడనగా సత్యవతి విచిత్రంగా నవ్వుతూ— నాయనా! నువ్వు చెప్పింది నిజమే. అయితే నామీద ఉండే విశ్వాసంతో నేను చెప్పేమాటకూడా విను. మన వంశంలో సత్యధర్మపరుడవైన నువ్వే మాకు పరమగతివి. నువ్వు వసుమహారాజు పేరు విని ఉంటావు. నేను ఆయన వీర్యంవల్ల జన్మించాను. నన్నొక పల్లెవాడు పుత్రికగా భావించి పెంచుతూం డేవాడు. అక్కడ రేవులో బాటసారులను నావ మీద దాటిస్తూ ఉండేదాన్ని. ఆరోజులలో ధర్మమర్మజ్ఞుడూ ధీయుతుడూ అయిన పరాశరమహర్షి ఆదారినే వెళుతూ నన్ను చేరి కామదృష్టితో నన్ను అర్థించారు. ఒకవైపు తండ్రి అధికారం రెండో వైపు ఋషిశాపభీతి. ఈసంకటస్థితిలో నే నుండగా ఆయన మా చుట్టూ అంధకారాన్ని ప్రసరింపచేసి నాభీతిని తొలగించి నాశరీరంమీద మత్స్యగంధం పోయేటట్టు వరమిస్తూ నన్ను యోజనగంధిని చేసి నానుండి వ్యాసమహర్షిని ప్రభవింపచేసి నాకన్యాత్వం నాకు తిరిగి ప్రసాదించారు. వేదవిభాగం చెయ్యటంవల్ల వ్యాసుడనీ శ్యామలవర్ణుడు కావటంవల్ల కృష్ణుడనీ వానిని వ్యవహరిస్తారు. ఆబాలుడు జన్మిస్తూనే పెద్దవాడై తనతండ్రితో వెడుతూ తనను ఏసమయంలో తలచుకొన్నా నాముందు నిలుస్తానన్నాడు. నువ్వూ నేనూ పట్టుబడితే సోదరక్షేత్రంలో తపస్సంపన్నుడైన వ్యాసుడు సంతానోత్పత్తి చేస్తాడు అని సత్యవతి పలకగా భీష్ముడు— అమ్మా! ధర్మంవల్ల ధర్మమూ అర్థంవల్ల అర్థమూ కామంవల్ల కామమూ సుఖఫలాలనిస్తూ శుభంగా పరిణమిస్తాయి. ఈ విషయాలను ధీరపురుషుడు అదే దృష్టితో చూస్తాడు. నువ్వు చెప్పిన వ్యాసుడు ధీయుతుడే కనక మన వంశానికి హితం చేకూరుస్తాడని నాకు నమ్మకం కలిగింది—అని సమ్మతించగా సత్యవతి కృష్ణద్వైపాయనుని తలంచింది. ఉత్తరక్షణంలో వేదఋక్కులు వల్లించుకుంటూ వ్యాసుడు ప్రత్యక్షంకాగా సత్యవతీమాతృహృదయం పొంగిపొరలి ఆమె స్థనాల నుండి క్షీరధారలు ప్రవహించ సాగాయి. ఆనందాశ్రువులతో ఆమె ముఖం శోభామయమైంది.

వ్యాసుడు కమండలువులోని పవిత్రోదకాలతో తల్లి నభిషేకించి—అమ్మా! ఏమహోద్దేశంతో నన్ను రప్పించావు— అని చేతులు జోడించాడు.

రాజపురోహితుడు వ్యాసమహర్షిని విధివిధానంగా అర్చించాడు. మహర్షి వ్యాసుడు ప్రసన్నుడై సుఖాసీను డయాడు. సత్యవతి కుమారుని కుశలప్రశ్నలు వేసి— నాయనా! పుత్రునిమీద తలిదండ్రు లిద్దరికీ సమానాధికారం ఉంటుంది. కుమారునిమీద తండ్రికి ఉన్న అధికారం తల్లికీ ఉన్నది. నా పూర్వజన్మ సుకృతంవల్లనో దైవయోగంవల్లనో నువ్వు నా జ్యేష్ఠుడ వైనట్లే విచిత్రవీర్యుడు నా కనిష్ఠు డయాడు. ఈ విచిత్రవీర్యుని

## నూటమూడవ వఅధ్యాయము

తతః సత్యవతీ దీనా కృపణా పుత్రగృద్ధినీ
పుత్రస్య కృత్వా కార్యాణి స్నుషాభ్యాం సహ భారత.
సమాశ్వాస్య స్నుషే తే చ భీష్మం శస్త్రభృతాం వరం
ధర్మం చ పితృవంశం చ మాతృవంశం చ భావినీ
ప్రసమీక్ష్య మహాభాగా గాంగేయం
వాక్యమబ్రవీత్.

శాన్తనోర్ధర్మనిత్యస్య కౌరవ్యస్య యశస్వినః
త్వయి పిండశ్చ కీర్తిశ్చ సంతానం చ ప్రతిష్ఠితం
యథా కర్మ శుభం కృత్వా స్వర్గోపగమనం ధ్రువం
యథా చాయుర్ధ్రువం సత్యే త్వయి ధర్మస్తథా ధ్రువః.
వేత్థ ధర్మాంశ్చ ధర్మజ్ఞ సమాసేనేతరేణ చ
వివిధాస్త్వం శ్రుతీర్వేత్థ వేదాంగాని చ సర్వశః.
వ్యవస్థానం చ తే ధర్మే కులాచారం లక్షయే
ప్రతిపత్తిం చ కృచ్ఛ్రేషు శుక్రాంగిరసయోరివ.
తస్మాత్ సుభృశమాశ్వస్య త్వయి ధర్మభృతాం వర
కార్యే త్వాం వినియోక్ష్యామి తచ్ఛ్రుత్వా
కర్తుమర్హసి.

మమ పుత్రస్తవ భ్రాతా వీర్యవాన్ సుప్రియశ్చ తే
బాల ఏవ గతః స్వర్గమపుత్రః పురుషర్షభ.
ఇమే మహిష్యౌ భ్రాతుస్తే కాశిరాజసుతే శుభే
రూపయౌవనసంపన్నే పుత్రకామే చ భారత.
తయోరుత్పాదయాపత్యం సంతానాయ కులస్య నః
మన్నియోగాన్మహాభాహో ధర్మం కర్తుమిహార్హసి.
రాజ్యే చైవాభిషిచ్యస్వ భారతాననుశాధి చ
దారాంశ్చ కురు ధర్మేణ మా నిమజ్జీః పితామహాన్.
తథోచ్యమానో మాత్రా స సుహృద్భిశ్చ పరంతపః
ఇత్యువాచాథ ధర్మాత్మా ధర్మ్యమేవోత్తరం వచః.
అసంశయం పరో ధర్మస్త్వయా మాతరుదాహృతః
రాజ్యార్థే నాభిషిఞ్చేయం నోపేయాం జాతు మైథునం
త్వమపత్యం ప్రతి చ మే ప్రతిజ్ఞాం వేత్థ వై పరాం.
జానాసి చ యథావృత్తం శుల్కహేతోస్త్వదన్తరే
స సత్యవతి సత్యం తే ప్రతిజానామ్యహం పునః.
పరిత్యజేయం త్రైలోక్యం రాజ్యం దేవేషు వా పునః
యద్వాప్యధికమేతాభ్యాం న తు సత్యం కథంచన.
త్యజేచ్చ పృథ్వీ గంధమాపశ్చ రసమాత్మనః
జ్యోతిస్తథా త్యజేద్రూపం వాయుః స్పర్శగుణం
త్యజేత్.

ప్రభాం సముత్సృజేదర్కో ధూమకేతుస్తథోష్మతాం
త్యజేచ్ఛబ్దం తథాకాశం సోమః శీతాంశుతాం
త్యజేత్.

విక్రమం వృత్రహా జహ్యాద్ధర్మం జహ్యాచ్చ
ధర్మరాట్

న త్వహం సత్యముత్స్రష్టుం వ్యవసేయం కథంచన.
తన్న జాత్వన్యథా కుర్యాం లోకానామపి సంక్షయే
అమరత్వస్య వా హేతోస్త్రైలోక్యసదనస్య వా.
ఏవముక్తా తు పుత్రేణ భూరిద్రవిణతేజసా
మాతా సత్యవతీ భీష్మమువాచ తదనంతరమ్.
జానామి తే స్థితిం సత్యే పరాం సత్యపరాక్రమ
ఇచ్ఛన్ సృజేథాస్త్రీంల్లోకానన్యాంస్త్వం స్వేన
తేజసా.

జానామి చైవం సత్యం తన్మదర్థే యచ్చ భాషితం
ఆపద్ధర్మం త్వమావేక్ష్య వహ పైతామహీం ధురమ్.
యథా తే కులతన్తుశ్చ ధర్మశ్చ న పరాభవేత్
సుహృదశ్చ ప్రహృష్యేరంస్తథా కురు పరంతప.
లాలప్యమానాం తామేవం కృపణాం పుత్రగృద్ధినీం.
ధర్మాదపేతం బ్రువతీం భీష్మో భూయోఽబ్రవీదిదం.

తండ్రివల్ల భీష్ముడు జన్మించాడు. ఇది నీ సోదర సంబంధం. ఈ భీష్ముడు సత్యవ్రత పరాయణుడు. రాజ్యపాలనా సంతానదృష్టీ వీనికి లేవు. అందుచేత నీ సోదరుల పారలౌకిక సుఖంకోసం వంశ రక్షణ కోసం అంతఃకరణశుద్ధితో నీ సోదర భార్యలయందు సంతానోత్పత్తి చేయటానికి నువ్వే సమర్థుడవు. కనక నా ఆజ్ఞానుసారం భీష్ముని అభిమతానుసారం నువ్వు ఈ వంశాన్ని ఉద్ధరించు.

అనగా వేదధర్మవిదుడైన వ్యాసుడు మధుర ప్రసన్నదృక్కులతో తల్లినీ సోదరునీ చూస్తూ— అమ్మా ! నీకు తెలియని ధర్మం లేదు. ఐహిక పారలౌకిక ధర్మసూక్ష్మాలు తెలిసిన నీ ఆజ్ఞ నాకు శిరోధార్యం. నువ్వు సూచించిన మార్గంకూడా ధర్మశాస్త్ర చోదితమే. మీ అభిమతానుసారం సోదరుల పరలోకప్రాప్తికోసం వరుణసమతేజస్వంతులయిన కుమారులను ప్రభవింపచేస్తాను. అయితే విచిత్రవీర్య పత్నులిద్దరూ ఒక సంవత్సరంపాటు విశుద్ధాత్మలతో వ్రతానుష్ఠానం సాగిస్తేకాని నన్ను సమీపించలేరు కనక వారిచేత ఆవ్రతాన్ని నువ్వు నిర్వహింపచెయ్యి— అనగా సత్యవతి— నాయనా ! ఈ కార్యం ఎంత త్వరగా జరిగితే అంత మంచిది. రాజ్యంలో రాజు లేడు. ప్రజలు అనాథులై నశించిపోతారు. ధర్మకార్యాలు సక్రమంగా జరగవు. రాజులేని రాజ్యంలో ధర్మరక్ష లేకపోవటంవల్ల అధర్మం వ్యాపించి దేశాన్ని దేవతలు వదిలేస్తారు. అది అనావృష్టికి దోహదం చేస్తుంది. అనావృష్టి క్షామకారణం. ఈ కారణాలన్నీ ఆలోచించి నువ్వు శీఘ్రంగా పుత్రోత్పాదనం చెయ్యాలి. పుట్టిన బిడ్డలను భీష్ముడు తీర్చి దిద్దుతాడు— అని పలకగా వ్యాసుడు— తల్లీ ! నా నియమాన్ని పాటించకుండా కార్యం చెయ్యవలసివస్తే నా ఈ వికార రూపం చూసి వారిద్దరూ ఏమాత్రం భయపడకుండా ప్రశాంతంగా నన్ను పొందినట్లయితే నేడే అంబిక ఉత్తమగుణ సంపన్నుడైన బాలుని కనగలదు— అన్నాడు.

వ్యాసుని మాటలకు సమ్మతి తెలిపి సత్యవతి లేచింది. వ్యాసుడు అదృశ్యుడయాడు. సత్యవతి అంతఃపురంలో ఏకాంతంలోకి అంబికను పిలిచి— నా దురదృష్టంవల్ల ఇంతతో భరతవంశం నశించిపోయే ప్రమాదం ఏర్పడింది. ఆబాధతో విచారించే నన్ను చూసి భీష్ముడు నాకిచ్చినసలహా వంశాభివృద్ధికి ఏకైకమార్గంగా ఉన్నది. అదంతా నీ అధీనంలో ఉంది. ఈ వంశం నాశనంకాకుండా ఉండాలంటే నువ్వు పుత్రవతివి కావాలి. నీకుమారుడు రాజ్యాధిపతి అయి తీరతాడు— అని ధర్మసూక్ష్మాలెన్నో వివరించి సత్యవతి అంబికను అంగీకరింపచేసింది.

104 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఐదవ అధ్యాయము

ఋతుస్నాత యైన కోడలిని అలంకరించి శయ్యాగృహానికి తీసికొని వచ్చింది సత్యవతి. అం బిక హంసతూలికాతల్పంమీద ఆసీనురా లయింది. అప్పుడు సత్యవతి కోడలితో ఇలా అన్నది అమ్మా!

రాజ్ఞి ధర్మనవేక్షస్వ మా నః సర్వాన్ వ్యనీనశః
సత్యాచ్చ్యుతిః క్షత్రియస్య న ధర్మేషు ప్రశస్యతే.
శాంతనోరపి సంతానం యథా స్యాదక్షయం భువి
తత్తే ధర్మం ప్రవక్ష్యామి క్షాత్రం రాజ్ఞి సనాతనం.
శ్రుత్వా తం ప్రతిపద్యస్వ ప్రాజ్ఞైః సహపురోహితైః
ఆపద్ధర్మార్థకుశలైర్లోకతంత్రమవేక్ష్య చ.

103 వ అధ్యాయంసమాప్తం

## నూట నాలుగవ అధ్యాయము

పునర్భరతవంశస్య హేతుం సంతానవృద్ధయే
వక్ష్యామి నియతం మాతస్తన్మే నిగదతః శృణు.
బ్రాహ్మణో గుణవాన్ కశ్చిత్ ధనేనోపనిమంత్ర్యతాం
విచిత్రవీర్యక్షేత్రేషు యః సముత్పాదయేత్ ప్రజాః.
తతః సత్యవతీ భీష్మం వాచా సంసజ్జమానయా
విహసంతీవ సవ్రీడమిదం వచనమబ్రవీత్.
సత్యమేతన్మహాబాహో యథా వదసి భారత
విశ్వాసాత్ తే ప్రవక్ష్యామి సంతానాయ కులస్య నః.
న తే శక్యమాఖ్యాతుమాపద్ధర్మం తథావిధం
త్వమేవ నః కులే ధర్మస్త్వం సత్యం త్వం పరాగతిః.
తస్మాన్నిశమ్య సత్యం మే కురుష్వ యదనంతరం
యస్తు రాజా వసుర్నామ శ్రుతస్తే భరతర్షభ
తస్య శుక్రాదహం మత్స్యాద్ధృతా కుక్షౌ పురా కిల.
మాతరం మే జలాద్ధృత్వా దాశః పరమధర్మవిత్
మాం తు స్వగృహమానీయ దుహితృత్వే హ్యకల్పయత్
ధర్మయుక్తస్య ధర్మార్థం పితురాసీత్ తరీ మమ.
సా కదాచిదహం తత్ర గతా ప్రథమయౌవనం
అథ ధర్మవిదాం శ్రేష్ఠః పరమర్షిః పరాశరః
ఆజగామ తరీం ధీమాంస్తరిష్యన్ యమునాం నదీం
స తార్యమాణో యమునాం మాముపేత్యాబ్రవీత్తదా
సాంత్వపూర్వం మునిశ్రేష్ఠః కామార్తో మధురం వచః
ఉక్తం జన్మకులం మహ్యమస్మి దాశసుతేత్యహం.
తమహం శాపభీతా చ పితుర్భీతా చ భారత
వరైరసులభైరుక్తా న ప్రత్యాఖ్యాతుముత్సహే.
అభిభూయ స మాం బాలాం తేజసా వశమానయత్
తమసా లోకమావృత్య నౌగతామేవ భారత.
మత్స్యగంధో మహానాసీత్ పురా మమ జుగుప్సితః
తమపాస్య శుభం గంధమిమం ప్రాదాత్ స మే మునిః.
తతో మామాహ స మునిర్గర్భముత్సృజ్య మామకం
ద్వీపేఽస్యా ఏవ సరితః కన్యైవ త్వం భవిష్యసి.
పారాశర్యో మహాయోగీ స బభూవ మహానృషిః
కన్యాపుత్రో మమ పురా ద్వైపాయన ఇతి శ్రుతః
యో వ్యస్య వేదాంశ్చతురస్తపసా భగవానృషిః
లోకే వ్యాసత్వమాపేదే కార్ష్ణ్యాత్ కృష్ణత్వమేవ చ
సత్యవాదీ శమపరస్తపస్వీ దగ్ధకిల్బిషః.
సముత్పన్నః స తు మహాన్ సహ పిత్రా తతో గతః.
స నియుక్తో మయా వ్యక్తం త్వయా చాప్రతిమద్యుతిః
భ్రాతుః క్షేత్రేషు కల్యాణమపత్యం జనయిష్యతి
స హి మాముక్తవాంస్తత్ర స్మరేః కృచ్ఛ్రేషు మామితి
తం స్మరిష్యే మహాబాహో యది భీష్మ త్వమిచ్ఛసి.
తవ హ్యనుమతే భీష్మ నియతం స మహాతపాః
విచిత్రవీర్యక్షేత్రేషు పుత్రానుత్పాదయిష్యతి.
మహర్షేః కీర్తనే తస్య భీష్మః ప్రాంజలిరబ్రవీత్
ధర్మమర్థం చ కామం చ త్రీనేతాన్ యోఽనుపశ్యతి.

ఈ రాత్రి ఈ గృహంలో నువ్వు నీ బావగారికోసం నిరీక్షిస్తూ ఉండు. అర్ధరాత్రివేళ ఆయన వస్తారు. ప్రశాంతహృదయంతో ఆయనను అనుసరించు.

సత్యవతి మాటలు విని అంబిక కురువంశప్రముఖులైన భీష్మాది వీరుల్ని తలచుకొంటూ శయనించింది. సకాలానికి వ్యాసుడు శయనమందిరం ప్రవేశించాడు. శయ్యాగారంలోని రత్నదీపాలకాంతిలో వ్యాసుని నల్లని శరీరము మెరిసే కన్నులు బవిరి గడ్డము మీసాలు చూసి అంబిక భయంతో కన్నులు మూసుకుంది. తల్లి ఆజ్ఞప్రకారం వ్యాసుడు అంబికా గర్భాన పుత్రోత్పాదనం చేసి వచ్చాడు. శయ్యాగృహం వీడబోతూన్న వ్యాసునిచూసి సత్యవతి— నాయనా! అంబికా గర్భాన గుణశ్రేష్ఠుడైన కుమారుడు జన్మిస్తాడు కదా— అనగా వ్యాసుడు— అమ్మా! నీకోడలి గర్భాన ధీమంతుడూ పరాక్రమవంతుడూ అయిన కుమారుడు జన్మిస్తాడు. వాడు మహావిద్వాంసు డౌతాడు. పదివేల ఏనుగుల బలం వాని కుంటుంది. వాడు నూరుగురు కుమారులను కంటాడు. అయితే మాతృదోషంవల్ల వాడు అంధు డవుతాడు— అన విని సత్యవతి దీనవదనయై— నాయనా! కురువంశ నరపాలుడు గ్రుడ్డివాడు కావటం ఉచితం కాదు. కనక కురువంశోద్ధారణకోసం రాజ్యపాలనార్హుడైన మరొక పుత్రుని ప్రసాదించు— అనగా సరే అని వ్యాసుడు నిష్క్రమించాడు.

ప్రసవసమయం రాగానే అంబిక అంధపుత్రుని కన్నది.

అనంతరం సత్యవతి రెండవ కోడలిని పిలిచి ఆమెకు నచ్చచెప్పి శయ్యాగృహానికి పంపింది. సత్యవతీ స్మరణానుసారం వ్యాసుడు శయ్యాగృహానికి వచ్చి అంబాలికతో సమాగమానికి సన్నద్ధుడయాడు అంబాలిక వ్యాసుని చూసి భయకంపితయై వివర్ణ కాగా వ్యాసుడు— అంబాలికా! నన్నుచూసి నువ్వు తెల్లతెల్లపోయావు గనక నీ కుమారుడు పాండువర్ణంతోనే ఉంటాడు. జనులు వానిని పాండు నామంతో వ్యవహరిస్తారు— అని పలికి ఆమెకు పుత్రోత్పత్తి చేసి శయ్యాగృహం వీడుతోండగా సత్యవతి పూర్వరీతినే ప్రశ్నించింది. అప్పుడు వ్యాసుడు—అంబాలికకు పుట్టబోయే కుమారుడు పాండుదేహు డవుతా డని అన్నాడు. సత్యవతి యథాపూర్వం మరియొక కుమారుణ్ణి ప్రసాదించమని కోరింది. వ్యాసుడు అంగీకరించి అంతర్హితుడు అయాడు.

ప్రసవవేళ అంబాలిక పాండుదేహంతో ఉన్న కుమారుని కన్నది. ఆబాలుడు దివ్యకాంతితో ప్రకాశిస్తూ పెరుగుతున్నాడు. ఈపాండురాజ పుత్రులే పాండవులు.

అనంతరం ఋతుస్నాతయైన అంబికను సత్యవతి పిలిచి వ్యాసునితో కలియమంది. అంబిక వ్యాసుని తలచుకుంటూనే భయంతో అత్తగారి ఆజ్ఞను నిరాకరించలేక తన దాసిని అలంకరించి శయ్యాగృహానికి పంపింది. శయ్యామందిరానికి వచ్చే వ్యాసమహర్షిని చూసి సంతోషభరహృదయంతో దాసి ముందుకు సాగి స్వాగతమిచ్చి నమస్కరించింది. స్వాగతపరిచర్యలందిన వ్యాసుడు ఆమెను శయ్యమీద కూర్చోమన్నాడు. పానుపుమీదవరున్న వ్యాసునికి దాసి సేవచేసింది. వ్యాసుడు సంతుష్టుడై ఆమెతో శయనించి లేచి— శుభస్వరూపిణీ! నీ గర్భంలో ధర్మతేజస్సంపన్నుడైన బాలుడున్నాడు. వాడు పరమ బుద్ధశాలి. లోక ధర్మ

అర్థమర్థానుబంధం చ ధర్మం ధర్మానుబంధనం
కామం కామానుబంధంచవిపరీతాన్‌పృథక్ పృథక్.
యో విచింత్యధియా ధీరో వ్యవస్యతి స బుద్ధిమాన్
తదిదం ధర్మయుక్తం చ హితం చైవ కులస్య నః.
ఉక్తంభవత్యాయచ్ఛ్రేయ స్తన్మహ్యంరోచతేభృశం
తత స్తస్మిన్ ప్రతిజ్ఞాతే భీష్మేణ కురునందన.
కృష్ణద్వైపాయనం కాలీ చింతయామాస వై మునిం
సవేదాన్‌విబ్రువన్ ధీమాన్‌మాతుర్విజ్ఞాయ చింతితం.
ప్రాదుర్బభూవావిదితః క్షణేన కురునందన
తస్మైపూజాంతతః కృత్వాసుతాయవిధిపూర్వకం.
పరిష్వజ్య చ బాహుభ్యాం ప్రస్నవై రభ్యషించత
ముమోచ బాష్పం దాశేయీ పుత్రం దృష్ట్వా
చిరస్య తు.

తామద్భిః పరిషిచ్యార్తాం మహర్షి రభివాద్య చ
మాతరం పూర్వజః పుత్రో వ్యాసో వచనమబ్రవీత్
భవత్యా యదభిప్రేతం తదహం కర్తుమాగతః
శాధిమాం ధర్మతత్వజ్ఞే కరవాణి ప్రియం తవ.
తస్మైపూజాంతతోఽకార్షీత్ పురోధాఃపరమర్ష యే
స చ తాం ప్రతిజగ్రాహ విధివన్మంత్రపూర్వకం.
పూజితో మంత్రపూర్వం తు విధివత్ ప్రీతిమాప సః
తమాసనగతం మాతా పృష్ట్వా కుశలమవ్యయం.
సత్యవత్యథ వీక్ష్యైనమువాచేదమనంతరం
మాతాపిత్రోః ప్రజాయంతే పుత్రాః
సాధారణాః కవే.
తేషాం పితా యథాస్వామీ తథా మాతా న
సంశయః
విధానవిహితః సత్యం యథా మే ప్రథమః సుతః.
విచిత్రవీర్యో బ్రహ్మర్షే తథా మేఽవరజః సుతః
యథైవపితృతో భీష్మ స్తథా త్వమపి మాతృతః.
భ్రాతా విచిత్రవీర్యస్య యథా వా పుత్ర మన్యసే

అయం శాంతనవః సత్యం పాలయన్ సత్యవిక్రమః
బుద్ధిం న కురుతేఽపత్యే తథా రాజ్యానుశాసనే
స త్వం వ్యపేక్షయా భ్రాతుః సంతానాయ
కులస్య చ.
భీష్మస్య చాస్య వచనాన్నియోగాచ్చ మమానఘ
అనుక్రోశాచ్చభూతానాంసర్వేషాంరక్షణాయచ.
అనృశంస్యాచ్చ యద్ బ్రూయాం తచ్ఛ్రుత్వా
కర్తుమర్హసి
యవీయస స్తవ భ్రాతుర్భార్యే సురసుతోపమే.
రూపయౌవనసంపన్నే పుత్రకామే చ ధర్మతః
తయోరుత్పాదయాపత్యం సమర్థో హ్యసి పుత్రక.
అనురూపం కులస్యాస్య సంతత్యాః ప్రసవస్య చ
వేత్థ ధర్మం సత్యవతి పరం చాపరమేవ చ.
తథా తవ మహాప్రాజ్ఞే ధర్మే ప్రణిహితా మతిః.
తస్మాదహం త్వన్నియోగా ద్ధర్మముద్దిశ్య కారణం.
ఈప్సితం తే కరిష్యామి దృష్టం హ్యేతత్ సనాతనం
భ్రాతుః పుత్రాన్ ప్రదాస్యామి
మిత్రావరుణయోః సమాన్.
వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్టమిహ యన్మహ
సంవత్సరం యథాన్యాయం తతః శుద్ధే భవిష్యతః
నహిమామవ్రతోపేతాఉపేయాత్ కాచిదంగనా
సద్యో యథా ప్రపద్యేతే దేవ్యౌ గర్భం తథాకురు
అరాజకేషు రాష్ట్రేషు ప్రజానాథా వినశ్యతి
నశ్యంతి చ క్రియాః సర్వా నాస్తి వృష్టిర్న దేవతా.
కథ చారాజకం రాష్ట్రం శక్యం ధారయితుం ప్రభో
తస్మాద్గర్భం సమాధత్స్వ భీష్మః సంవర్ధయిష్యతి.
యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతురకాలికః
విరూపతాం మే సహతాం తయో రేతత్పరం వ్రతం.
యది మే సహతే గంధం రూపం వేషం తథా వపుః
అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతాం.

జ్ఞుడు. ఇక నీకు దాసీత్వం లేదు— అని వ్యాసుడు మందిరం వీడి వెలుపలికి వస్తూ ఎదురుపడిన తల్లికి నమస్కరిస్తూ— అంబిక తన దాసిని పంపింది. ఆమె యందే నేను పుత్రోత్పాదన చేశాను— అదృశ్యు డయాడు. ఈ దాసీపుత్రుడే విదురుడు. మాండవ్య మహాముని శాపకారణంగా యమధర్మరాజే విదురుడిగా జన్మించాడు. విదురుడు కామక్రోధ రహితుడు. అర్థశాస్త్రవిదుడు. వ్యాసుని అనుగ్రహం వల్ల జన్మించిన ఈ ముగ్గురు బాలురూ దేవతాసము తేజస్వులై కురువంశప్రవర్ధకు లయారు.

105 వ అధ్యాయంసమాప్తం

## నూట ఆఱవ అధ్యాయము

### మాండవ్యులు

యమధర్మరాజు ఆచరించిన ఏ అకృత్యంవల్ల బ్రహ్మర్షి శాపంతగిలి శూద్రయోనిలో జన్మించవలసి వచ్చిందో వివరింపుమని కోరిన జనమేజయునకు వైశంపాయనుడు మాండవ్యోపాఖ్యానం ప్రవచిస్తున్నాడు.

పూర్వకాలంలో సత్యధర్మనిష్ఠుడైన మాండవ్యుడనే బ్రాహ్మణ తపస్వి ఉండేవాడు. ఆయన తన ఆశ్రమ సమీపంలో ఒకచెట్టునీడను శీర్షాసనంతో మౌనవ్రతియై తీవ్రంగా తపస్సు సాగిస్తున్నాడు. ఆ తపోదీక్షలో సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ రోజులలో ఒకనాడు కొందరు దొంగలు ఆ ప్రాంతానికి పరుగెత్తుకు వచ్చారు. వారిని రాజభటులు వెన్నాడుతున్నారు. చోరులు భయపడి వారిదగ్గర ఉన్న వస్తువులను ఆముని ఆశ్రమంలో దాచి పారిపోయారు. రాజభటులు మహర్షిని సమీపించి చోరులు పోయిన జాడ చెప్పమన్నారు. ముని మాట్లాడలేదు. భటులు ఆశ్రమాన్నీ పరిసరాలనూ వెదకి దొంగలనూ సొత్తునూ పట్టుకొని మునిని కూడా శంకించి బంధించి తీసికొనివెళ్ళి మహారాజు ఎదుట నిలిపారు. వారందరికీ మరణవండన విధించాడు చక్రవర్తి. రాజాజ్ఞానుసారం భటులు ఆమునిని కూడా శూలానికి గుచ్చారు. ధర్మాత్ముడైన మాండవ్యుడు అన్నపానాలు లేకుండా గుచ్చిన శూలాగ్రభాగంమీద చిరకాలం ఉండిపోయాడు. అలానే ఉండి తన తపశ్శక్తితో ఇతర ఋషులను పిలువసాగాడు. వారు రాత్రివేళ పక్షిరూపాలతో వచ్చి— ఓ మాండవ్యమునీ! ఏకారణంచేత నీకీ కష్టస్థితి కలిగింది అని —ప్రశ్నించారు.

106 వ అధ్యాయంసమాప్తం

## నూట ఏడవ అధ్యాయము

మాండవ్యుడు తన ప్రారబ్ధానికి ఎవరిమీదనో దోషారోపణం చెయ్యటానికి అంగీకరించలేదు.

ఏవముక్త్వా మహాతేజా వ్యాసః సత్యవతీం తదా
శయనే సా చ కౌసల్యా శుచివస్త్రా హ్యలంకృతా.
సమాగమనమాకాంక్షేదితి సోఽన్తర్హితో మునిః
తతోఽభిగమ్య సా దేవీ స్నుషాం రహసి సంగతాం
ధర్మ్యమర్థసమాయుక్తమువాచ వచనం హితం
కౌసల్యేధర్మతంత్రంత్వాంయద్బ్రవీమినిబోధతత్.
భారతానాం సముచ్ఛేదో వ్యక్తం
మద్భాగ్యసంక్షయాత్
వ్యథితాం మాం చ సంప్రేక్ష్య పితృవంశం చ పీడితం.
భీష్మో బుద్ధిమదాన్మహ్యం కులస్యాస్య వివృద్ధయే
సా చ బుద్ధిస్త్వయ్యధీనా పుత్రిప్రాపయ మాం తథా
నష్టం చ భారతం వంశం పునరేవ సముద్ధర
పుత్రం జనయ సుశ్రోణి దేవరాజసమప్రభం.
స హి రాజ్యధురం గుర్వీముద్వక్ష్యతి కులస్య నః
సా ధర్మతోఽనునీయైనాం కథంచిద్ధర్మచారిణీం.

104 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఐదవ అధ్యాయము

తతః సత్యవతీ కాలే వధూం స్నాతాం మృతౌ తదా
సంవేశయంతీ శయనే శనైర్వచనమబ్రవీత్.
కౌసల్యే దేవరస్తేఽస్తిసోఽద్య త్వానుప్రవేక్ష్యతి
అప్రమత్తాప్రతీక్షైనం నిశీథే హ్యాగమిష్యతి.
శ్వశ్వాస్తద్వచనం శృత్వా శయానా శయనే శుభే
సాచింతయత్తదా భీష్మమన్యాంశ్చ కురుపుంగవాన్.
తతోఽమ్బికాయాం ప్రథమం నియుక్తః
సత్యవాగృషిః
దీప్యమానేషు దీపేషు శరణం ప్రవివేశ హ.
తస్య కృష్ణస్య కపిలాం జటాం దీప్తే చ లోచనే
బభ్రూణిచైవశ్మశ్రూణిదృష్ట్వాదేవీన్యమీలయత్.
సంబభూవ తయా సార్థం మాతుః ప్రియచికీర్షయా
భయాత్ కాశిసుతా తం తు నాశక్నోదభివీక్షితుం.
తతోనిష్క్రాంతమాగమ్య మాతాపుత్రమువాచహ
అప్యసా గుణవాన్ పుత్ర రాజపుత్రో భవిష్యతి.
నిశమ్య యద్వచో మాతుర్వ్యాసః సత్యవతీసుతః
నాగాయుతసమప్రాణో విద్వాన్ రాజర్షిసత్తమః.
మహాభాగో మహావీర్యో మహాబుద్ధిర్భవిష్యతి
తస్య చాపి శతం పుత్రా భవిష్యంతి మహాత్మనః.
కిం తు మాతుః స వై గుణ్యాదంధ ఏవ భవిష్యతి
తస్యతద్వచనంశ్రుత్వామాతాపుత్రమథాబ్రవీత్.
నాంధః కురుణాం నృపతిరనురూపస్తపోధన
జ్ఞాతివంశస్య గోప్తారం పితౄణాం వంశవర్ధనం.
ద్వితీయం కురువంశస్య రాజానం దాతుమర్హసి
స తథేతి ప్రతిజ్ఞాయ నిశ్చక్రామ మహాయశాః.
సాపి కాలేన కౌసల్యా సుషువేఽన్ధం తమాత్మజం
పునరేవ తు సా దేవీ పరిభాష్య స్నుషాం తతః.
ఋషిమావాహయత్ సత్యాయథాపూర్వమరిందమ
తతస్తేనైవ విధినా మహర్షిస్తామపద్యత.
అంబాలికామథాభ్యాగాదృషిందృష్ట్వాచసాపితం
వివర్ణా పాండుసంకాశా సమపద్యత భారత.
తాంభీతాఃపాండుసంకాశాంవిషణ్ణాంప్రేక్ష్య భారత
వ్యాసః సత్యవతీపుత్ర ఇదం వచనమబ్రవీత్.
యస్మాత్ పాండుత్వమాపన్నా విరూపం ప్రేక్ష్య
మామిహ
తస్మాదేష సుతస్తే వై పాండురేవ భవిష్యతి.

రాజభటులు మాండవ్యుడు శూలారోపితుడై నా మరణించకపోవటం చూసి ఆశ్చర్యంతో మహారాజుకి నివేదించారు. చకితుడై మహారాజు మాండవ్యుని వద్దకువచ్చి— మునివరా! నా అజ్ఞానాన్ని మన్నించి నన్ను అనుగ్రహించండి—అని ప్రార్థించాడు. మాండవ్యుడు ప్రసన్నుడయాడు. అనంతరం రాజాజ్ఞానుసారం భటులు శూలాన్ని బైటికి తీయబోయారు. వారిప్రయత్నం ఫలించలేదు. శూలాగ్రభాగాన్ని శరీరంలోనే ఉంచుకొని మాండవ్యుడు మిగిలిన భాగాన్ని ఛేదించాడు. శరీరంలో శూలమున్నా ఏబాధాలేకుండా చరిస్తూ ఆమహర్షి పుణ్యలోకాలు సాధించాడు. శూలాగ్రభాగాన్ని 'అణి' అని పిలుస్తారు. అణితో చరించిన కారణంగా ఈ మహర్షి అణీమాండవ్యుడయాడు.

ఆత్మతత్త్వజ్ఞాని అయిన అణీమాండవ్యుడు ఒకనాడు యమలోకానికి వెళ్ళి దివ్యాసనంమీద ఆసీనుడై ఉన్న యమధర్మరాజును సమీపించి— ఓ మహాత్మా! అజ్ఞానంలో నేను ఏపాపం చేసినందువల్ల శూలారోపణం చేశారో వివరింపుమని కోరాడు. అప్పుడు యముడు— ఓ మహర్షీ చిన్నతనంలో నువ్వు తూనీగల తోకలకు ముళ్ళు గ్రుచ్చి క్రీడించిన ఫలంగా ఈస్థితి ప్రాప్తించింది. అల్పదానమయినా మహాఫలానివ్వగలిగినట్లు స్వల్పపాపం అత్యంత కష్టదాయకం కాగలదు— అన్నాడు.

తాను ఏవయస్సులో ఆపాపం చేశాడో చెప్పుమనగా బాల్యావస్థలో అది జరిగిందన్నాడు యముడు. పన్నెండు సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ మానవుడికి ధర్మాధర్మవివేకం ఉండదు. కనుక అంతవరకూ వాడేది చేసినా అధర్మంకాదు. అయినా ఆస్వల్పాపరాధానికి తీవ్రదండన విధించావు. సర్వప్రాణివధకంటె బ్రహ్మహత్య పరమ భయంకరమైనది. ఆపాతకానికి నువ్వు వడికట్టావు కనక తత్ఫలితంగా శూద్రయోనిలో జన్మించు— అని శపించి— పదునాలుగు సంవత్సరాల వయస్సు ప్రాప్తించేవరకూ మానవప్రాణి చేసే పాపానికి ఆప్రాణికి బాధ్యతలేదు. ఇది నా శాసనం—అని అణీమాండవ్యుడు వెళ్ళిపోయాడు.

జనమేజయా! ఈశాపంవల్లనే యమధర్మరాజు విదురునిగా పుట్టాడు. విదురుడు ధర్మార్థశాస్త్ర విదురుడు. లోభక్రోధ రహితుడు. దూరదృష్టిసంపన్నుడు. సత్యవ్రతుడు. కౌరవవంశ శ్రేయోభిలాషి. మితభాషి— అని పలికి వైశంపాయనుడు కథాప్రవాహంలోకి వస్తున్నాడు.

107వ అధ్యాయంసమాప్తం

## నూటఎనిమిదవఅధ్యాయము

ధృతరాష్ట్ర పాండురాజ విదురులు దినదిన ప్రవర్ధమానులౌతున్నారు. వారివల్ల కురువంశానికీ కురుక్షేత్రానికీ కురుజాంగల దేశానికీ ప్రతిష్ఠ లభించింది. వారి జననానంతరం సకాల వర్షాలతో భూమి సస్యభరితమైంది. ఋతుకాలానుసారం ఫలపుష్పాలలో వృక్షాలు అలరారుతున్నాయి. పశుపక్షిమృగ సంతతులు సంతోషంగా జీవిస్తున్నాయి. వీర శూర విద్వాంసులు సముచితగౌరవాలు

నామ చాస్యైతదేవేహ భవిష్యతి శుభాననే
ఇత్యుక్త్వా స నిరకామద్భగవానృషిసత్తమః.
తతో నిష్క్రాంతమాలోక్య సత్యాపుత్రమథాబ్రవీత్
శశంస స పునర్మాత్రే తస్య బాలస్య పాండుతాం.
తం మాతా పునరేవాన్యమేకం పుత్రమయాచత
తథేతి చ మహర్షిస్తాం మాతరం ప్రత్యభాషత.
తతః కుమారం సా దేవీ ప్రాప్త కాలమజీజనత్
పాండుం లక్షణసంపన్నం దీప్యమానమివ శ్రియా.
యస్య పుత్రా మహేష్వాసా జజ్ఞిరే పంచపాండవాః
ఋతుకాలే తతో జ్యేష్ఠాం వధూం తస్మై
న్యయోజయత్ .

సా తు రూపం చ గంధం చమహర్షేఃప్రవిచింత్య తం
నాకరోద్వచనం దేవ్యా భయాత్ సురసుతోపమా
తతః స్వైర్భూషణైర్దాసీంభూషయిత్వాప్సరోపమాం
ప్రేషయామాస కృష్ణాయ తతః కాశిపతేః సుతా.
సా తమృషిమనుప్రాప్తం ప్రత్యుద్గమ్యాభివాద్య చ
సంవివేశాభ్యనుజ్ఞాతా సత్కృత్యోపచచార హ.

కామోపభోగేన రహస్తస్యాం తుష్టిమగాదృషిః
తయా సహోషితో రాజన్ మహర్షిః సంశితవ్రతః.
ఉత్తిష్ఠన్నబ్రవీదేనామభుజిష్యా భవిష్యసి
అయం చ తే శుభే గర్భః శ్రేయానుదరమాగతః
ధర్మాత్మా భవితా లోకే సర్వబుద్ధిమతాం వరః.
స జజ్ఞే విదురో నామ కృష్ణద్వైపాయనాత్మజః
ధృతరాష్ట్రస్య వై భ్రాతాపాండోశ్చైవమహాత్మనః.
ధర్మో విదురరూపేణ శాపాత్తస్య మహాత్మనః
మాండవ్యస్యార్థతత్త్వజ్ఞః కామక్రోధవివర్జితః.
కృష్ణద్వైపాయనోఽప్యేతత్ సత్యవత్యై
న్యవేదయత్

ప్రలంభమాత్మనశ్చైవశూద్రాయాః పుత్రజన్మచ.
సధర్మస్యానృణోభూత్వాపునర్మాత్రాసమేత్యచ
తస్యై గర్భం సమావేద్య తత్రైవాంతరధీయత.
ఏ తే విచిత్రవీర్యస్య క్షేత్రే ద్వైపాయనాదపి
జజ్ఞిరే దేవగర్భాభాః కురువంశవివర్ధనాః.

105 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఆరవ అధ్యాయము

కిం కృతం కర్మ ధర్మేణ యేన శాపముపేయివాన్
కస్య శాపాచ్చ బ్రహ్మర్షేః శూద్రయోనావజాయత.
బభూవ బ్రాహ్మణః కశ్చిన్మాండవ్య ఇతి విశ్రుతః
ధృతిమాన్ సర్వధర్మజ్ఞః సత్యే తపసి చ స్థితః.
స ఆశ్రమపదద్వారి వృక్షమూలే మహాతపాః
ఊర్ధ్వబాహుర్మహాయోగీ తస్థౌ మౌనవ్రతాన్వితః.
తస్య కాలేన మహతా తస్మింస్తపసి వర్తతః
తమాశ్రమమనుప్రాప్తా దస్యవో లోప్త్రహారిణః.

అనుసార్యమాణా బహుభీ రక్షిభిర్భరతర్షభ
తే తస్యావసథే లోప్త్రం దస్యవః కురుసత్తమః.
నిధాయ చ భయాల్లీనాస్తత్రైవానాగతే బలే
తేషులీనేష్వథో శీఘ్రం తతస్తదక్షిణాం బలం.
ఆజగామ తతోఽపశ్యంస్తమృషిం తస్కరానుగాః
తమపృచ్ఛంస్తతో రాజంస్తథావృత్తం తపోధనం
కతమేన పథా యాతా దస్యవో ద్విజసత్తమ
తేనగచ్ఛామహేబ్రహ్మన్ యథాశీఘ్రతరంవయం.

పొందుతున్నారు. నగరాలలో శిల్పకళానిపుణులు స్వేచ్ఛగా జీవిస్తున్నారు. వ్యాపారం సక్రమంగా కొనసాగుతున్నది. ప్రజలలో పాపచింతన లేదు. వారందరూ సత్యభాషులూ ధర్మపరాయణులూ నిత్యకర్మనిరతులూ క్రోధాభిమానరహితులూ పరస్పరానురాగసహితులూ సదాచారపరులూ అయి చరిస్తున్నారు. కౌరవ రాజధానీనగరం సముద్రం వలె సర్వసమృద్ధంగా ఉంది. సింహద్వార గోపుర ప్రాకారాలతో శతసహస్రాధిక భవనాలతో అమరావతివలె ఉంది హస్తినాపురం. ఆ నగరప్రజలు ఉద్యానవనాలలో సరోవరాలలో పర్వత శిఖరాలపై నదీజలాలలో సంతోషంగా గడుపుతున్నారు. ఉత్తర దక్షిణ కురుదేశీయులు దేవతాచరణ ఋషిగణాలతో పందెం వేసినట్లు అంతటా చరించేవారు. కురువంశాభి రక్షితమైన జనపదాలలో విధవలు లేరు. సర్వైశ్వర్యాలతో నిత్యోత్సాహంతో ఉత్సవాలతో ఆ ప్రజలు జీవిస్తున్నారు. భీష్ముని ద్వారా ధర్మరక్షితమై దేశవ్యవహారాలు సాగుతున్నాయి. దేవతానిలయాలతో యజ్ఞస్తంభాలతో కౌరవరాజ్యం శోభామయంగా ఉంది. అన్యదేశాలలో దానిది అగ్రస్థానం.

వయసువచ్చిన కుమారులకు భీష్ముడు ఉపనయనాది సంస్కారాలు సక్రమంగా చేయించాడు. ప్రజలందరూ మహోత్సాహంతో ఆ ఉత్సవాలలో పాల్గొనేవారు. నగరంలో ఏ గృహప్రాంగణంలో చూసినా అతిథిసంతర్పణం దానశీలత్వం గోచరించేవి.

బిడ్డలు ముగ్గురినీ భీష్ముడు తండ్రిలా సాకుతూ బ్రహ్మచర్యవ్రతుల్ని చేసి వేదాధ్యయన సంపన్నులను చేశాడు. దైహికపరిశ్రమలూ వ్యాయామమూ చేయించాడు. యౌవనం ప్రాప్తించగానే అశ్వారోహణ గజారోహణాలలో ఖడ్గచాలనంలో ధనుర్విద్యలో నీతిశాస్త్రంలో ఇతిహాసపురాణాదిక శిష్టాచారజ్ఞానంలో వారు ఆరితేరారు. ధనుర్విద్యలో పాండురాజు నాడు ప్రముఖుడయాడు. ధృతరాష్ట్రుడు దైహికబలంలో నిరుపమానుడయాడు. విదురుడు ఆత్మద్రష్టయై జగదారాధ్యుడయాడు. ఆ రాష్ట్రప్రజలు కురువంశాన్ని ఉద్ధరించిన కాశీరాజ పుత్రికలను నారీశిరోమణులుగా కీర్తించేవారు. జన్మభూమి అయిన కురుజాంగల దేశం ఉత్తమభూమిగా భావించేవారు. హస్తినాపురం రాజధానీనగరాలలో అగ్రశ్రేణిదని శ్లాఘించేవారు.

ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు కావటంచేతనూ విదురుడు శూద్రుడుకావటంచేతనూ వారికి రాజ్యార్హతలేక పాండురాజు సింహాసనం అధిష్ఠించాడు.

108 వ అధ్యాయంసమాప్తం

## నూటతొమ్మిదవఅధ్యాయము

ఈ ప్రకారంగా సాగుతోండగా ఒక నాడు భీష్ముడు విదురుని పిలిచి— నాయనా! ఈ కురువంశం గుణసంపదలతో విశ్వవిఖ్యాతమవుతున్నది. ఇతరరాజులను జయించి కురువంశీయులు సమ్రాట్టులయారు. ధర్మజ్ఞులూ మహాత్ములూ అయిన కౌరవనరేంద్రులు ఈ భూమిని పరిపాలించారు. వారి

తథా తు రక్షిణాం తేషాం బ్రువతో స తపోధనః
స కించిద్వచనం రాజన్నబ్రవీత్ సాధ్వసాధు వా
తత స్తే రాజపురుషా విచిన్వానా స్తమాశ్రమం
దదృశు స్తత్రలీనాంస్తాంశ్చోరాం స్తద్ద్రవ్యమేవచ.
తతః శంకా సమభవద్రక్షిణాం తం మునిం ప్రతి
సంయమ్యైనం తతో రాజ్ఞే దస్యూంశ్చైవ
న్యవేదయన్.
తం రాజా సహ తై శ్చోరై రన్వశాద్ వధ్యతామితి
స రక్షిభిస్తై రజ్ఞాతః శూలే ప్రోప్తో మహాతపాః.
తతస్తే శూలమారోప తం మునిం రక్షిణ స్తదా
ప్రతిజగ్ముర్మహీపాలం ధనాన్యాదాయ తాన్యథ.
శూలస్థః స తు ధర్మాత్మా కాలేన నుహతా తతః
నిరాహారోఽపి విప్రర్షి ర్మరణం నాభ్యపద్యత.
ధారయామాస చ ప్రాణానృషీంశ్చసముపానయత్
శూలాగ్రే తప్యమానేన తప స్తేన మహాత్మనా.
సంతాపం పరమం జగ్ముర్మునయ స్తపసాన్వితాః
తే రాత్రౌ శకునా భూత్వా సంనిపత్య తు భారత
దర్శయంతో యథాశ క్తితమపృచ్ఛన్ ద్విజో త్తమం.
శ్రోతుమిచ్ఛామహే బ్రహ్మన్ కిం పాపంకృతవ నసి
యేనేహ సమనుప్రా ప్తంశూలేదుఃఖభయంమహత్.

106 వ అధ్యాయము సమాప్తం

## నూట ఏడవ అధ్యాయం

తతః స మునిశార్దూలస్తానువాచ తపోధనాన్
దోషతః కంగమిష్యామినహిమేఽన్యోఽపరాధ్యతి
తం దృష్ట్వా రక్షిణ స్తత్ర తథా బహుతిథేఽహని
న్యవేదయం స్తథా రాజ్ఞే యథావృ త్తం నరాధిప.
శ్రుత్వా చ వచనం తేషాం నిశ్చిత్య సహ మంత్రిభిః
ప్రసాదయామాస తథా శూలస్థమృషిస త్తమం.
యన్మయాపకృతం మోహాదజ్ఞానాదృషిస త్తమ
ప్రసాదయే త్వాం తత్రాహం న మే త్వం
క్రోద్ధుమర్హసి
ఏవము క్త స్తతో రాజ్ఞా ప్రసాదమకరోన్మునిః
కృతప్రసాదం రాజా తం తతః సమవతారయత్.
అవతార్య చ శూలాగ్రాత్ తచ్ఛూలం నిశ్చకర్షహ
అశక్నువంశ్చ నిష్క్రష్టుం శూలం మూలే స
చిచ్ఛిదే
స తథాంతర్గతేనై వ శూలేన వ్యచరన్మునిః
తేనాతితపసా లోకాన్ విజిగ్యే దుర్లభా న్ పరై ః.
అణీమాండవ్య ఇతి చ తతో లోకేషు గీయతే
స గత్వా సదనం విప్రో ధర్మస్య పరమాత్మవిత్
ఆసన స్థం తతో ధర్మం దృష్ట్వోపాలభత ప్రభుః
కిం ను తద్దుష్కృతం కర్మ మయా కృతమజానత
యస్యేయం ఫలనిర్వృత్తిరీదృశ్యాసాదితా మయా
శీఘ్రమాచక్ష్వ మే తత్వం పశ్య మే తపసో బలం.
పతంగికానాం పుచ్ఛేషు త్వయేషీకా ప్రవేశితా
కర్మణ స్తస్య తే ప్రా ప్తం ఫలమేతత్ తపోధన.
స్వల్పమేవ యథా ద త్తందానం బహుగుణంభవేత్
అధర్మ ఏవం విప్రర్షే బహుదుఃఖఫలప్రదః.
కస్మిన్ కాలే మయా తత్ తు కృతం బ్రూహి
యథాతథం
తేనోక్తో ధర్మరాజేన బాలభావే త్వయాకృతం.
బాలోహిద్వాదశాద్ వర్షాజ్జన్మతో యత్కరిష్యతి
న భవిష్యత్యధర్మోఽత్ర న ప్రజ్ఞాస్యంతి వై దిశః.
అల్పేఽపరాధేఽపిమహాన్మమదండ స్త్వయాకృతః

వంశం విచ్ఛిన్నం కాబోయే సమయంలో నేనూ సత్యవతీ సంప్రదించి వ్యాసుని అనుగ్రహంవల్ల ఆపత్ప్రమాదంనుంచి రక్షించాం. కురుపరిజాతంతువు మీ ముగ్గురిమీదా ఆధారపడి ఉంది. ఈ కులాభివృద్ధికి ఇప్పుడు మనం ప్రయత్నించాలి.

గాంధార రాజైన సుబలునివద్ద కన్యలున్నట్టు విన్నాను. యదువంశీయుడైన శూరసేనునికుమార్తె పృథ అనే పేరు గలది కుంతిభోజుని ఇంట పెరుగుతోం దని విన్నాను. మన వంశానికి అనురూపాలయిన సంబంధా లవి. ఆక్షత్రియశ్రేష్ఠులతో వియ్యమందా లని ఉంది. నీ అభిప్రాయం ఇందుకు అనుకూలంగా ఉంటే సరే. లేకపోతే మార్గాంతరం చెప్పు— అన్నాడు.

మహాత్మా! మీరు మాకు పితృసములు గురుస్థానీయులు. మీ ఆలోచన కురుకుల హితానికే సాగుతుం దని నాకు తెలుసు కనక మీ అభిమతానుసారం సాగించండి— అన్నాడు విదురుడు.

గాంధార రాజపుత్రి శంకరుని ఆరాధించి నూరుగురు బిడ్డలను కనే వరాన్ని పొందిందని భీష్ముడు తాను పంపిన బ్రాహ్మణులవల్ల విని గాంధారదేశానికి దూతను పంపాడు. సుబలుడు ధృతరాష్ట్రుని అంధత్వాన్ని విని విచారించాడు. కాని కురుకుల ప్రతిష్ఠ నాలోచించి ధర్మాసక్తయైన గాంధారిని ఆఇంటి కోడలిగా ఇవ్వటానికి అంగీకరించాడు. తల్లిదండ్రులు తన వివాహప్రస్తావన చేస్తూండగా వినినగాంధారి ఉత్తరక్షణంలో ఒక వస్త్రంతో కళ్ళు బంధించుకున్నది. మహాపతివ్రతయైన గాంధారి తన భర్త నేత్రదోషాన్ని చూడడానికి కూడా అంగీకరించలేదు.

అనంతరం గాంధార రాజకుమారుడు శకుని లక్ష్మీసమసుందరియైన సోదరిని వెంటపెట్టుకొని హస్తినాపురం వచ్చి భీష్ముని ఆజ్ఞానుసారం వివాహం చేయించాడు. ఉభయ వంశాలవారూ యథోచితంగా లాంఛనాలు జరుపుకున్నారు.

గాంధారి తన శీలస్వభావాచారవ్యవహారాలతో గురువృద్ధజనసేవతో పరపురుష నామాన్నిసయితం ఉచ్చరించకుండగా కురువంశీయుల అభిమానానికి సామ్రాజ్య పౌరుల గౌరవానికీపాత్రురాలయింది.

109వ అధ్యాయము సమాప్తం

## నూట పదవ అధ్యాయము

### కుంతీదేవి

రాజవంశాలలో యదువంశంకూడ శ్రేష్ఠమైనది. ఆ వంశంలో శూరసేనుడనే మహారాజుకి పృథ అనే కుమార్తె ఉన్నది. ఆమె రూపయౌవనసంపదలు అందరినీ ఆకర్షించేవి. శూరసేనుడికి కుంతిభోజుడని మేనమామ. ఈయన సంతానహీనుడు కావడంవల్ల పృథ వీరిఇంటికి దత్తపుత్రిగా వచ్చింది. వచ్చిన పృథ దేవతాతిథి సత్కారాలలో శ్రద్ధగా చరించేది. కుంతిభోజుని ఇంట ఈ పృథ కుంతీ నామంతో ఉండేది.

## నూట ఎనిమిదవ అధ్యాయము

ధృతరాష్ట్రే చ పాండౌ చ విదురే చమహాత్మని
తేషు త్రిషు కుమారేషు జాతేషు కురుజాంగలం
కురవోఽథ కురుక్షేత్రం త్రయమేతదవర్ధత.
ఊర్ధ్వసస్యాభవద్భూమిః సస్యాని రసవంతి చ
యథర్తువర్షీ పర్జన్యో బహుపుష్పఫలా ద్రుమాః.
వాహనాని ప్రహృష్టాని ముదితా మృగపక్షిణః
గంధవంతి చ మాల్యాని రసవంతి ఫలాని చ.
వణిగ్భిశ్చాన్వకీర్యంత నగరాణ్యథ శిల్పిభిః
శూరాశ్చ కృతవిద్యాశ్చ సంతశ్చ సుఖినోఽభవన్.
నాభవన్ దస్యవః కేచిన్నాధర్మరుచయో జనాః
ప్రదేశేష్వపి రాష్ట్రాణాం కృతం యుగమవర్తత.
ధర్మక్రియా యజ్ఞశీలాః సత్యవ్రతపరాయణాః
అన్యోన్యప్రీతిసంయుక్తా వ్యవర్ధంత ప్రజాస్తదా.
మానక్రోధవిహీనాశ్చ నరా లోభవివర్జితాః
అన్యోన్యమభ్యనందంత ధర్మోత్తరమవర్తత.
తన్మహోదధివత్ పూర్ణం నగరం వై వ్యరోచత
ద్వారతోరణనిర్యూహైర్యుక్తమభ్రచయోపమైః.
ప్రాసాదశతసంబాధం మహేంద్రపురసన్నిభం
నదీషు వనఖండేషు వాపీపల్వలసానుషు
కాననేషు చ రమ్యేషు విజహ్రుర్ముదితా జనాః.
ఉత్తరైః కురుభిః సార్ధం దక్షిణాః కురవస్తథా
విస్పర్ధమానా వ్యచరం స్తథా దేవర్షి చారణైః.
నాభవత్ కృపణః కశ్చిన్నాభవన్విధవాః స్త్రియః
తస్మిన్ జనపదే రమ్యే కురుభిర్బహులీకృతే.
కూపారామసభావాప్యో బ్రాహ్మణావసథాస్తథా
బభూవు సర్వర్ధియుతాస్తస్మిన్ రాష్ట్రే సదోత్సవాః.
భీష్మేణ ధర్మతో రాజన్ సర్వతః పరిరక్షితే
బభూవ రమణీయశ్చ చైత్యయూపశతాంకితః.
స దేశః పరరాష్ట్రాణి విమృజ్యాభిప్రవర్ధితః
భీష్మేణ విహితం రాష్ట్రే ధర్మచక్రమవర్తత.
క్రియమాణేషు కృత్యేషు కుమారాణాంమహాత్మనాం
పౌరజానపదాః సర్వే బభూవుః సతతోత్సవాః.
గృహేషు కురుముఖ్యానాం పౌరాణాం చ నరాధిప
దీయతాం భుజ్యతాం చేతి వాచోఽశ్రూయంత సర్వశః.
ధృతరాష్ట్రశ్చ పాండుశ్చ విదురశ్చ మహామతిః
జన్మప్రభృతి భీష్మేణ పుత్రవత్ పరిపాలితాః.
సంస్కారైః సంస్కృతాస్తే తు వ్రతాధ్యయన సంయుతాః
శ్రమవ్యాయామకుశలాః సమపద్యంత యౌవనం.
ధనుర్వేదేఽశ్వపృష్ఠే చ గదాయుద్ధేఽసిచర్మణి
తథైవ గజశిక్షాయాం నీతిశాస్త్రేషు పారగాః
ఇతిహాసపురాణేషు నానాశిక్షాసు బోధితాః
వేదవేదాంగతత్త్వజ్ఞాః సర్వత్ర కృతనిశ్చయాః.
పాండుర్ధనుషి విక్రాంతో నరేష్వభ్యధికోఽభవత్
అన్యేభ్యో బలవానాసీద్ ధృతరాష్ట్రో మహీపతిః.
త్రిషు లోకేషు న త్వాసీత్ కశ్చిద్ విదురసమ్మితః
ధర్మనిత్యస్తథా రాజన్ ధర్మే చ పరమం గతః.
ప్రణష్టం శాంతనోర్వంశం సమీక్ష్య పునరుద్ధృతం
తతో నిర్వచనం లోకే సర్వరాష్ట్రేష్వవర్తత.
వీరసూనాం కాసిసుతే దేశానాం కురుజాంగలం
సర్వధర్మవిదాం భీష్మః పురాణాం గజసాహ్వయం.
ధృతరాష్ట్రస్త్వచక్షుష్ట్వాద్ రాజ్యం న ప్రత్యపద్యత
పారశవత్వాద్ విదురో రాజా పాండుర్బభూవ హ.
కదాచిదథ గాంగేయః సర్వనీతిమతాం వరః
విదురం ధర్మతత్త్వజ్ఞం వాక్యమాహ యథోచితం.

ఇలా ఉండగా ఒకనాడు ...

ధర్మనిష్ఠాగరిష్ఠుడూ కఠోర వ్రతపాలకుడూ అయిన దుర్వాస మహర్షి అక్కడికి విచ్చేశాడు. ఉగ్రకోపస్వభావుడైన ఆ దుర్వాసుడు కుంతీదేవి చేసిన పరిచర్యలతో సంతృప్తహృదయుడయాడు. తనదూరదృష్టితో ఆమె భవిష్యత్తును చూచాడు. కొద్దిగా క్లిష్టంగా గోచరించించి. ఆ కష్టదశ ఆమెకు కలగరాదని భావించాడు. భావించి ఆమె కొక దివ్యమంత్రం ఉపదేశించి — అమ్మాయీ! నువ్వీ మంత్రం జపించి ఏ దేవతని ఆహ్వానించినా వారు వచ్చి నీకు పుత్రుని అనుగ్రహిస్తారు — అని వెళ్ళి పోయాడు. కన్యగా ఉన్న కుంతి దుర్వాసుని మంత్ర శక్తి పరీక్షార్థం సూర్యభగవానుని ఆహ్వానించింది. దివ్యమంత్రప్రభావంవల్ల సూర్యుడు ఉత్తరక్షణంలో ఆమె యెదుట నిలచి — శ్యామలోచనా ! మహర్షి దుర్వాసుల మంత్రం జపించి నన్ను ఆహ్వానించావు. నీ కోరిక ప్రకారం నీకు కుమారుని ప్రసాదిస్తాను — అన్నాడు.

మహాత్మా ! ఆ బ్రహ్మవేత్త నాకు దయచేసిన మంత్రప్రభావపరీక్షార్థమే మిమ్ము పిలిచాను. అంతే. ఇదే అపరాధమయితే నన్ను క్షమించండి — అని పాదాలమీదవాలింది కుంతి. సూర్యుడు తన రాక వ్యర్థం కారాదనీ మంత్రశక్తి పొల్లుపోరాదనీ నిర్బంధించి దోషభీతి వివరించాడు.

కుంతి తన కన్యాత్వం పంతానార్హం కాదన్నది. సూర్యుడు వారించాడు. వినలేదు కుంతి. సోదరబంధుజనులలో తలయెత్తుకోలే నన్నది. సిగ్గుతో తల వాల్చి నిలబడింది.

ఓ సౌందర్యశాలినీ ! నీకు కలగబోయే కుమారుడు సామాన్యుడు కాడు. దేవతల తల్లి అదితి ఇచ్చిన కవచకుండలాలతో జన్మిస్తాడు. మహోదాత్తగా జీవిస్తాడు. వాడి జీవితంలో అనుచితం అయోగ్యం అయిన భావనకూడా చెయ్యడు. మానాభిమానధను డవుతాడు. పైగా ఇందువల్ల నీ కన్యాత్వంబు దూషితంబు గాదు — అని ఆమెను గ్రహించాడు. దివ్యతేజస్సంపన్నుడైన ఉజ్జ్వల కవచ కుండలాలతో ఉత్తరక్షణంలో బాలుడు ప్రభవించాడు. సమస్తలోకాలలో కీర్తి పొందిన కర్ణుడే ఆ బాలుడు. ఆవిధంగా కుంతిని అనుగ్రహించి సూర్యభగవానుడు అదృశ్యు డయాడు.

ఎదురుగా కుమారుని చూసి కన్య కుంతి భయంతో భావికార్యక్రమం గురించి ఆలోచించ సాగింది. ఆమె మనస్సు హృదయం సిగ్గుతో భయంతో గజగజలాడిపోతూంటే బంధువులందరూ అపహసించబోతారనే ఊహరాగా ఆ నవశిశువుని నదీజలాలలో విడిచింది. ఆ పసిబిడ్డడు ప్రవాహంలో నాగుతూంటే అతిరథుడనే పేరుగల సూతుడు తీసి తన భార్య రాధకిచ్చి ప్రేమతో పెంచసాగాడు. ఆ బాలుడు బంగారు కవచకుండలాలతో ఉన్నందు వల్ల వసుషేణుడని నామకరణం చేశారు. ఆ వసుషేణుడు పెరిగి పెద్దవా డయాడు. వయస్సుతో పాటు విద్యాబుద్ధులు వృద్ధిపొందుతున్నాయి. అనుదినం సూర్యభగవానుని ఆరాధిస్తూ వసుషేణుడు అస్త్రవిద్యాకుశలు డవుతున్నాడు. ఆ సమయంలో దేహీ అని అర్థించినవా రెవరూ వ్యర్థంగా పోలేదు.

అలా నడుస్తూండగా—

ఒకనాడు సూర్యుడు వృద్ధ బ్రాహ్మణవేషం ధరించి స్వప్నంలో కనిపించి— ఓ మహావీరుడా ! రేపు ఉదయం ఇంద్రుడు కుహనాబ్రాహ్మణుడుగా వచ్చి నిన్ను ఏం యాచించినా ఇవ్వకు. వాడు నీ కవచ

## నూట తొమ్మిదవ అధ్యాయము

గుణైః సముదితం సమ్యగిదం నః ప్రథితం కులం
అత్యన్యాన్ పృథివీపాలాన్ పృథివ్యామధిరాజ్యభాక్
రక్షితం రాజభిః పూర్వం ధర్మవిద్భిర్మహాత్మభిః
నోత్సాదమగమచ్చేదం కదాచిదిహ నః కులం.
మయా చ సత్యవత్యా చ కృష్ణేన చ మహాత్మనా
సమవస్థాపితం భూయో యుష్మాసు కులతంతుషు.
తచ్చైతద్ వర్ధతే భూయః కులం సాగరవద్యథా
తథా మయా విధాతవ్యం త్వయా చైవ న సంశయః.
శ్రూయతే యాదవీ కన్యా స్వనురూపా కులస్య నః
సుబలస్యాత్మజా చైవ తథా మద్రేశ్వరస్య చ.
కులీనా రూపవత్యశ్చ తాః కన్యాః పుత్ర సర్వశః
ఉచితాశ్చైవ సంబంధే తేఽస్మాకం క్షత్రియర్షభాః.
మన్యే వరయితవ్యాస్తా ఇత్యహం ధీమతాం వర
సంతానార్థం కులస్యాస్య యద్ వా విదుర మన్యసే.
భవాన్ పితా భవాన్ మాతా భవాన్ నః
పరమో గురుః
తస్మాత్ స్వయం కులస్యాస్య విచార్య కురు యద్ధితం
అథ శుశ్రావ విప్రేభ్యో గాంధారీం సుబలాత్మజాం
ఆరాధ్య వరదం దేవం భగనేత్రహరం హరం.
గాంధారీ కిల పుత్రాణాం శతం లేభే వరం శుభా
ఇతి శుశ్రావ తత్త్వేన భీష్మః కురుపితామహః.
తతో గాంధారరాజస్య ప్రేషయామాస భారత
అచక్షురితి తత్రాసీత్ సుబలస్య విచారణా.
కులం ఖ్యాతించ వృత్తంచ బుద్ధ్యా తు ప్రసమీక్ష్య సః
దదౌ తాం ధృతరాష్ట్రాయ గాంధారీం ధర్మచారిణీం.
గాంధారీ త్వథ శుశ్రావ ధృతరాష్ట్రమచక్షుషం
ఆత్మానం దిత్సితం చాస్మై పిత్రా మాత్రా చ భారత.
తతః సా పట్టమాదాయ కృత్వా బహుగుణం తదా
బబంధ నేత్రే స్వే రాజన్ పతివ్రతపరాయణా.
నాభ్యసూయాం పతిమహమిత్యేవం కృతనిశ్చయా
తతో గాంధారరాజస్య పుత్రః శకునిరభ్యయాత్.
స్వసారం వయసా లక్ష్మ్యా యుక్తమాదాయ
కౌరవాన్
తాం తదా ధృతరాష్ట్రాయ దదౌ పరమసత్కృతాం
భీష్మస్యానుమతే చైవ వివాహం సమకారయత్.
దత్త్వా స భగినీం వీరో యథార్హం చ పరిచ్ఛదం
పునరాయాత్ స్వనగరం భీష్మేణ ప్రతిపూజితః.
గాంధార్యపి వరారోహా శీలాచారవిచేష్టితైః
తుష్టిం కురూణాం సర్వేషాం జనయామాస భారత.
వృత్తేనారాధ్య తాన్ సర్వాన్ గురూన్
పతిపరాయణా
వాచాపి పురుషానన్యాన్ సువ్రతా నాన్వకీర్తయత్.

109 వ అధ్యాయము సమాప్తం

## నూట పదవ అధ్యాయం

శూరో నామ యదుశ్రేష్ఠో వసుదేవపితాభవత్
తస్య కన్యా పృథా నామ రూపేణాప్రతిమా భువి.
పితృష్వస్రీయాయ స తామనపత్యాయ భారత
అగ్ర్యమగ్రే ప్రతిజ్ఞాయ స్వస్యాపత్యం స సత్యవాక్.
అగ్రజామథ తాం కన్యాం శూరోఽనుగ్రహకాంక్షిణే
ప్రదదౌ కుంతిభోజాయ సఖా సఖ్యే మహాత్మనే.

కుండలాలకోసం వస్తున్నాడు. జాగ్రత్తసుమా— అని హెచ్చరించగా కర్ణుడు నవ్వి— ఓ మహాత్మా! దేవేంద్రుడే బ్రాహ్మణవేషంతో వచ్చి నాముందు చెయ్యిజాపితే నేను కాదనగలనా. దేవతలకు కూడా బ్రాహ్మణులు పూజార్హులే. అటువంటి విప్రరూపంలో అమరాధీశుడు వస్తే నేను అవమానించలేను— అన్నాడు. అయితే ఆయన నీ త్యాగశక్తికి తృప్తిపడి వరం అనుగ్రహిస్తాడు. అప్పుడు మాత్రం సర్వశస్త్రాలనూ తృణీకరించే శక్త్యస్త్రం కోరుకో— అని సూర్యుడు అదృశ్యుడయాడు. తెల్లవారింది.

కర్ణుడు స్వప్నవృత్తాంతమే ఆలోచించుకుంటున్నాడు. ఆసమయంలో వృద్ధబ్రాహ్మణవేషంతో దేవేంద్రుడు వచ్చి కవచకుండలాలు అర్థించాడు. కర్ణుడు పరమానందంతో అవి తీసియిచ్చాడు. దేవేంద్రుడు సంతోషంతో కర్ణుని అభినందించి వాని సాహసానికి వరం కోరుకోమనగా అమోఘమైన శక్తిని అర్థించాడు కర్ణుడు. దేవేంద్రుడు శక్తినిస్తూ ఈశక్తి ఒకేఒక వీరుని నాశనం చెయ్యడానికే ఉపయోగపడుతుం దన్నాడు.

నాటివరకూ వసుషేణ నామంతో వ్యవహరింపబడే కుంతీనందనుడు వైకర్తనుడనీ కర్ణుడనీ వ్యవహారంలోకి వచ్చాడు.

110 వ అధ్యాయంసమాప్తం

## నూట పదకొండవ అధ్యాయము

### కుంతికళ్యాణం

కులగుణరూపశీలాలకు ధర్మతత్పరత వన్నెపెట్టగా కుంతీదేవి సర్వయువరాజ హృదయాలనూ ఆకర్షించే యౌవనదశలో అడుగుపెట్టింది. ఈ వార్త ఆలకించిన రాజు లెందరో కుంతిని భార్యగా అర్థించారు. కుంతీభోజుడు స్వయంవరం ప్రకటించాడు.

నానాదేశాధీశులూ ఉచితాసనాలపై విరాజిల్లుతూన్న సమయంలో కుంతీకుమారి పూలమాలతో ఆ సభామధ్యంలోకి వచ్చింది. అందరినీ తిలకించే ఆ యువతి దృష్టి ఒక మహారాజుపై నిలిచింది. విశాలవక్షఃస్థలంతో సింహసమపరాక్రమంతో సుందరనేత్రాలతో అలరారే ఆ పాండు నరపాలుడు కుంతీ హృదయంలో కామవికారం కలిగించగా మరుక్షణంలో ఆయన మెడలో ఆమె సిగ్గుతో పుష్పదామం ఉంచింది. ఆ క్షణంలోనే ఇతరరాజులందరూ తమ తమ గృహాలకు తరలిపోయారు. అనంతరం అతివైభవంగా వివాహమహోత్సవం జరిగింది. శచీదేవితో దేవేంద్రునివలె కుంతీదేవితో పాండురాజు అలరారుతున్నాడు.

కుంతిభోజుడు కుమార్తెకూ అల్లునికీ లాంఛనాలన్నీ సాగించి ధన రత్న వస్తువాసు లిచ్చాడు. భూసురాశీర్వాదాలతో పాండురాజు హస్తినాపురానికి బయలుదేరాడు. సేనావాహిని ముందు

సా నియుక్తా పితుర్గేహే దేవాతిథిపూజనే
ఉగ్రం పర్యచరన్ తత్ర బ్రాహ్మణం సంశితవ్రతం.
నిగూఢనిశ్చయం ధర్మే యం తం దుర్వాససం విదుః
తముగ్రం సంశితాత్మానం సర్వయత్నైరతోషయత్.
తస్యై స ప్రదదౌ మంత్రమాపద్ధర్మాన్వవేక్షయా
అభిచారాభిసంయుక్తమబ్రవీచ్చైవ తాం మునిః.
యం యం దేవం త్వమేతేన మంత్రేణావాహయిష్యసి
తస్య తస్య ప్రసాదేన పుత్రస్తవ భవిష్యతి.
తథోక్తా సా తు విప్రేణ కుంతీ కౌతూహలాన్వితా
కన్యా సతీ దేవమర్కమాజుహావ యశస్వినీ.
సాదదర్శ తమాయాంతం భాస్కరం లోకభావనం
విస్మితా చానవద్యాంగీ దృష్ట్వా తన్మహదద్భుతం.
తాం సమాసాద్య దేవస్తు వివస్వానిదమబ్రవీత్
అయమస్మ్యసితాపాంగి బ్రూహి కిం కరవాణి తే.
ఆహూతోపస్థితం భద్రే ఋషిమంత్రేణ చోదితం
విద్ధి మాం పుత్రలాభాయ దేవమర్కం శుచిస్మితే.
కశ్చిన్మే బ్రాహ్మణః ప్రాదాద్వరం
విద్యాం చ శత్రుహన్
తద్విజిజ్ఞాసయాఽఽహ్వానం కృతవత్యస్మి తే విభో
ఏతస్మిన్నపరాధే త్వాం శిరసాహం ప్రసాదయే
యోషితో హి సదా రక్ష్యాః స్వాపరాద్ధాపి నిత్యశః
వేదాహం సర్వమేవైతద్ యద్ దుర్వాసా వరం దదౌ
సంత్యజ్య భయమేవేహ క్రియతాం సంగమో మమ.
అమోఘం దర్శనం మహ్యమాహూతశ్చాస్మి తే శుభే
వృథాహ్వానేఽపి తే భీరు దోషః స్యాన్నాత్ర సంశయః.
ఏవముక్తా బహువిధం సాంత్వపూర్వం వివస్వతా
సా తు నైచ్ఛద్ వరారోహా కన్యాహమితి భారత.
బంధుపక్షభయాద్భీతా లజ్జయా చ యశస్వినీ
తామర్కః పునరేవేదమబ్రవీద్ భరతర్షభ.
పుత్రస్తే నిర్మితః సుభ్రు శృణు యాదృక్ఛుభాననే
ఆదిత్యే కుండలే బిభ్రత్ కవచం చైవ మామకం.

శస్త్రాస్త్రాణామభేద్యం చ భవిష్యతి శుచిస్మితే
న చ కించన దేయం తు బ్రాహ్మణేభ్యో భవిష్యతి.
చోద్యమానో మయా చాపి నాక్షమం చింతయిష్యతి
దాస్యత్యేవ హి విప్రేభ్యో మానీ చైవ భవిష్యతి.
మత్ప్రసాదాన్న తే రాజ్ఞి భవితా దోష ఇత్యుత
ఏవముక్త్వా స భగవాన్ కుంతిరాజసుతాం తదా.
ప్రకాశకర్తా తపనః సంబభూవ తయా సహ
తత్ర వీరః పమభవత్ సర్వశస్త్రభృతాం వరః
ఆముక్తకవచః శ్రీమాన్ దేవగర్భః శ్రియాన్వితః.
సహజం కవచం బిభ్రత్ కుండలోద్ద్యోతితాననః
అజాయత సుతః కర్ణః సర్వలోకేషు విశ్రుతః.
ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం పునః స పరమద్యుతిః
దత్త్వా చ తపతాం శ్రేష్ఠో దివమాచక్రమే తతః.
దృష్ట్వా కుమారం జాతం సా వార్ష్ణేయీ దీనమానసా
ఏకాగ్రం చింతయామాస కిం కృత్వా సుకృతం
భవేత్.

గూహమానాపచారం సా బంధుపక్షభయాత్తదా
ఉత్ససర్జ కుమారం తం జలే కుంతీ మహాబలం.
తముత్సృష్టం జలే గర్భం రాధాభర్తా మహాయశాః
పుత్రత్వే కల్పయామాస సభార్యః సూతనందనః.
నామధేయం చ చక్రాతే తస్య బాలస్య తావుభౌ
వసునా సహ జాతోఽయం వసుషేణో భవిష్యతి.
స వర్ధమానో బలవాన్ సర్వాస్త్రేషూద్యతోఽ
భవత్

ఆ పృష్ఠతాపాదాదిత్యముపాతిష్ఠత వీర్యవాన్.
తస్మిన్ కాలే తు జపతస్తస్య వీరస్య ధీమతః
నాదేయం బ్రాహ్మణేష్వాసీత్ కించిద్ వసు
మహీతలే.

తతః కాలే తు కస్మింశ్చిత్ స్వప్నాంతేకర్ణమబ్రవీత్
ఆదిత్యో బ్రాహ్మణోభూత్వాశృణువీరవచోమమ.

నడువ కుంతీద్వితీయుడై ఆ మహారాజు హస్తినా పురం ప్రవేశించాడు. సహోఢను వెంటబెట్టుకొని రాజభవనంలో ప్రవేశించాడు మహారాజు.

111 వ అధ్యాయము సమాప్తం

## నూట పన్నెండవ అధ్యాయం

### విజయయాత్ర

నాటి రాజవంశాలలో మద్రదేశాధీశులుకూడా లబ్ధ ప్రతిష్ఠులు. శల్యుడు అనే పేరుగల మహా వీరుడు ఆ రోజులలో మద్రవిషయానికి అధీశుడు. శల్యునికి మాద్రి అని సోదరి. ఈ సహోదరి సద్గుణాలు ఆమె సౌందర్యం భరతవర్ష ప్రజానీకానికి ప్రసంగాంశాలు. ఆ గుణసౌందర్యవతినికూడా పాండురాజు కిచ్చి వివాహం చేయించాలని కురువంశాభిరక్షకుడు భీష్ముడు తలపోశాడు.

ఊహ కలిగిన ఉత్తరక్షణంలో భీష్ముడు సేనావాహినితో అవసరవస్తువులతో బయలుదేరాడు. మద్రరాజధానీనగిరం బహిర్ద్వారంలో భీష్మాచార్యులకు శల్యుడు స్వాగత పరిచర్యలు సాగించాడు. స్వయంగా రాజమందిరానికి తీసికొని వెళ్ళాడు. అర్ఘ్యపాద్యా లర్పించి కుశలు ప్రశ్నలు సాగించి ఉచితాసనం చూపాడు. భీష్ముడు మందహాసానసుడై ఆసీను డయారు.

శల్యుడు భీష్ములవారి రాకకు కారణ మడిగాడు. భీష్ముడు ఉభయవంశాల గౌరవప్రతిష్ఠలనూ ప్రస్తావించి మాద్రిని కురుకులానికి కోడలుగా ఇమ్మన్నాడు. శల్యుడు తమ వంశాచారం ప్రకారం కన్యాశుల్కం కొంత తీసికోక తప్పదనీ, చిరకాలంగా మద్రరాజవంశం ఆచారంగా దానిని స్వీకరిస్తున్నదనీ చెపుతూ కురువంశంతో వియ్యమందడానికి తన ఆనందం అంతా ఇంతా కాదన్నాడు.

వంశాచార మర్యాదాభిజ్ఞుడు భీష్మాచార్యులు శల్యుని కోరిక ప్రకారం సువర్ణరత్నాభరణాలు కన్యాశుల్కంగా అర్పించాడు. తన మాటను గౌరవించిన భీష్మునికి కృతజ్ఞతాపురస్సరంగా అభివాదాలర్పించి శల్యుడు తన సోదరిని వారికి సమర్పించాడు.

భీష్ముడు మాద్రిని తీసికొని హస్తినాపురం చేరి కాలవిదులతో సంప్రదించి సుముహూర్తం నిర్ణయించి ఆ శుభసమయాన వివాహం చేయించాడు. పాండురాజు పరమసంతోషంతో మాద్రీసహితుడై రాజమందిరంలో ప్రవేశించి ఇరువురు భార్యలతోనూ దాంపత్యధర్మనిర్వహణ సాగిస్తున్నాడు.

ఈప్రకారంగా ఒక నెల గడిచింది.

అనంతరం పాండురాజు భువనవిజయాభిలాషతో భీష్మాది కురువృద్ధులకూ అగ్రజుడైన ధృతరాష్ట్రునికీ పాదాభివాదంచేసి భూసురశ్రేష్ఠుల ఆశీర్వాదాలతో చతురంగబలాన్వితుడై జయశ్రీ సముపాసనతో రాజధానినుండి కదిలాడు.

కురువంశయశోవివర్ధనుడూ సింహసమపరాక్రముడూ అయిన పాండురాజు ప్రప్రథమంగా పూర్వదేశీయులైన దశార్ణరాజులను ఓడించి మగధదేశం

పరిభాతాయాం రాజన్యాం త్వామాగమిష్యతి వాసవః.
న తస్య భిక్షా దాతవ్యా విప్రరూపీ భవిష్యతి.
నిశ్చయోఽస్యాపహర్తుం తే కవచం కుండలే తథా
అతస్త్వాం బోధయామ్యేష స్మర్తాసి వచనం మమ.
శక్రో మాం విప్రరూపేణ యదివై యాచతే ద్విజ
కథంచాస్మైన దాస్యామి యథా చాస్మ్యవబోధితః
విప్రాః పూజ్యాస్తుదేవానాంనతతంప్రియమిచ్ఛతాం
తం దేవదేవం జానన్ వై న శక్నోమ్యవమంత్రణే.
యద్యేవం శృణు మే వీర వరం తే సోఽపి దాస్యతి
శక్తిం త్వమపి యాచేథాః సర్వశత్రువిబాధినీం
ఏవముక్త్వా ద్విజః స్వప్నే తత్రైవాంతరధీయత
కర్ణఃప్రబుద్ధస్తం స్వప్నం చింతయానోఽభవత్తదా.
తమింద్రో బ్రాహ్మణో భూత్వా భిక్షార్థీ సముపాగమత్
కుండలే ప్రార్థయామాస కవచం చ మహాద్యుతిః.
స్వశరీరాత్ సముత్కృత్య కవచం స్వం నిసర్గజం
కర్ణస్తు కుండలేఛ్చిత్వాప్రాయచ్ఛత్ స కృతాంజలిః
ప్రతిగృహ్య తు దేవేశస్తుష్టస్తేనాస్య కర్మణా
అహో సాహసమిత్యేవం మనసా వాసవో హసన్
దేవదానవయక్షాణాం గంధర్వోరగరక్షసాం.
న తం పశ్యామి కో హ్యేతత్ కర్మ కర్తా భవిష్యతి
ప్రీతోఽస్మి కర్మణా తేన వరం వృణు యమిచ్ఛసి.
ఇచ్ఛామి భగవద్దత్తాం శక్తిం శత్రునిబర్హణీం
దదౌ శక్తిం సురపతిర్వాక్యం చేదమువాచ హ.
దేవాసురమనుష్యాణాం గంధర్వోరగరక్షసాం
యమేకం జేతుమిచ్ఛేథాః సోఽనయా న భవిష్యతి.
ప్రాంజ్నామ తస్యకథితం వసుషేణ ఇతి క్షితౌ
కర్ణో వై కర్తనశ్చైవ కర్మణా తేన సోఽభవత్.

110 వ అధ్యాయంసమాప్తం

## నూట పదకొండవ అధ్యాయము

సత్యరూపగుణోపేతా ధర్మారామా మహావ్రతా
దుహితా కుంతిభోజస్య పృథా పృథులలోచనా.
తాం తు తేజస్వినీం కన్యాం రూపయౌవనశాలినీం
వ్యవృణ్వన్ పార్థివాః కేచిదతీవ స్త్రీగుణైర్యుతాం.
తతఃసాకుంతిభోజేన రాజ్ఞాఽఽహూయనరాధిపాన్
పిత్రా స్వయంవరే దత్తా దుహితా రాజసత్తమ.
తతః సా రంగమధ్యస్థం తేషాం రాజ్ఞాం మనస్వినీ
దదర్శ రాజశార్దూలం పాండుం భరతసత్తమం.
సింహదర్పం మహోరస్కం వృషభాక్షంమహాబలం.
ఆదిత్యమివసర్వేషాంరాజ్ఞాంప్రచ్ఛాద్యవై ప్రభాః.
తిష్ఠంతం రాజసమితౌ పురందరమివాపరం
తం దృష్ట్వా సానవద్యాంగీ కుంతిభోజసుతా శుభా.
పాండుం నరవరం రంగే హృదయేనాకులాభవత్
తతః కామపరీతాంగీ స కృత్ ప్రచలమానసా.
వ్రీడమానా స్రజం కుంతీ రాజ్ఞః స్కంధేసమాసజత్
తం నిశమ్యవృతంపాండుంకుంత్యాసర్వేనరాధిపాః.
యథాగతం సమాజగ్ముర్గజై రశ్వైర్రథై స్తథా
తతస్తస్యాః పితా రాజన్ వివాహమకరోత్ప్రభుః.
స తయా కుంతిభోజస్య దుహిత్రా కురునందనః
యుయుజేఽమితసౌభాగ్యఃపౌలోమ్యామఘవానివ.
కుంత్యాఃపాండోశ్చరాజేంద్ర కుంతిభోజోమహీపతిః
కృత్వోద్వాహం తదాం తం తు నానావసుభిరర్చితం

మీద దాడి చేసి దాన్ని పాలిస్తూన్న దీర్ఘుని హతమార్చాడు. ఆ మగధకోశాగారాన్నీ వస్తువాహనాలనూ తీసికొని ఖిధిలావిదేహాలను జయించాడు.

కాశీ సుహ్య పుండ్రి దేశాలలో విజయపతాక ప్రతిష్ఠించి అగ్నిసమతేజస్వియై ప్రజ్వలితాగ్నిశిఖాసదృశశస్త్రాలతో పాండురాజు జైత్రయాత్ర సాగిస్తూ శత్రుసైన్యాలపాలిటి కాలుడై ఆయా దేశాధీశులను సామంతులుగా చేసికొని వారివద్ద కానుకలు స్వీకరిస్తూ హస్తినాపురం చేరాడు. విజయోత్సాహంతో విచ్చేసే పాండురాజును చూసిన ప్రజలు భరత శంతనులు మళ్ళీ ప్రభవించారని ఆనందించారు. ఒకనాడు కురువంశీయులను పరాజితులను చేసినవారి నందరినీ పాండురాజు సామంతులుగా చేశాడు. వారినుండి ధన కనక వస్తు వాహనాలు తెచ్చి కురురాజ్యశ్రీని అధిక వైభవోపేతను చేశాడు. నానాదేశీయులైన ప్రజలూ పాండురాజు కీర్తిగానమే పరమావధిగా ప్రసంగాలు చేసికొంటున్నారు.

హస్తినాపురీనగర బహిర్ద్వారం సమీపించిన పాండురాజుని చూడడానికి నగరప్రజలందరూ సంతోషంతో వచ్చారు. నాలుగుదిక్కులూ జయించి వచ్చిన పాండురాజుకానీ అతని సేనానీకంకానీ ఏమాత్రం అలసిపోకపోవడం చూసి ప్రజ విస్తుపోయింది. భీష్మాదులైన కురువంశీయులందరూ ఎదురేగి పరమానందభరితులవుతూంటే పాండురాజు ప్రప్రథమంగా భీష్ములవారికి వందనా లర్పించాడు. భీష్మాచార్యులు పాండురాజుని గాఢంగా ఆలింగనం చేసికొని ఆనందాశ్రువులతో అభిషేకించాడు. శంఖధ్వానాలూ కాహళాస్వనాలూ నగారానాదాలు శ్రవఃపేయంగా సాగుతూంటే విజయశ్రీ విరాజిత తిలకాంచితవదనుడు పాండురాజు పురప్రవేశం చేశాడు.

112వ అధ్యాయము సమాప్తం

## నూట పదమూడవ అధ్యాయము

దిగ్విజయయాత్రలో పాండురాజు కానుకలుగా తెచ్చిన రత్నభూషణాంబరా లన్నీ ధృతరాష్ట్రుని ఆజ్ఞానుసారం సత్యవతికీ రాజమాతలకూ భీష్మ విదురులకూ అభివాదపురస్సరంగా సమర్పించాడు. తల్లు లిద్దరూ కుమారుని గాఢంగా కౌగలించుకొని శిరసు ముద్దాడారు.

పాండురాజు భుజబలంతో ధృతరాష్ట్రులు నూరు అశ్వమేధయాగాలు చేశాడు. లక్ష సువర్ణ ముద్రికలు దానం చేశాడు. ఇలా సాగుతూండగా పాండురాజు భార్యలకు వనవాసంమీద మక్కువ కలిగింది. వారి కోరిక నెరవేర్చడానికి పాండురాజు హిమాలయపర్వతంపైకి తీసికొని వెళ్ళి వారితో ఆ ఉన్నత శిఖరాలమీద సెలయేటి తిన్నెలమీద ఆడు ఏనుగుల మధ్య ఐరావతంలావిహరించసాగాడు. శస్త్రాస్త్రకవచబాణాలతో చరించే ఆ రాజును చూసి తత్ప్రాంతీయులు వీ రెవ్వరో దేవతలని భావించేవారు. అక్కడ చరించే ఆ దంపతులకు ధృతరాష్ట్రుడు సేవకులద్వారా సర్వభోగ సామగ్రి సమకూరుస్తూండేవాడు.

స్వపురం ప్రేషయామాస స రాజా కురుసత్తమ.
తతో బలేన మహతా నానాధ్వజపతాకినా
స్తూయమానః స చాశీర్భిర్బ్రాహ్మణైశ్చమహర్షిభిః.
సంప్రాప్య నగరం రాజా పాండుః కౌరవనందనః
న్యవేశయతతాంభార్యాంకుంతీంస్వభవనేప్రభుః.

111 వ అధ్యాయంసమాప్తం

## నూట పండ్రెండవఅధ్యాయము

తతః శాంతనవో భీష్మో రాజ్ఞః పాండుర్యశస్వినః
వివాహస్యాపరస్యార్థే చకార మతిమాన్ మతిం.
సోఽమాత్యైఃస్థవిరైఃసార్థంబ్రాహ్మణైశ్చమహర్షిభిః
బలేన చతురంగేణ యయౌ మద్రపతేః పురం.
తమాగతమభిశ్రుత్య భీష్మం వాహీకపుంగవః
ప్రత్యుద్గమ్యార్చయిత్వాచపురం ప్రావేశయన్నృపః.
దత్వా తస్యాసనం శుభ్రం పాద్యమర్ఘ్యం తథైవ చ
మధుపర్కం చ మద్రేశః పప్రచ్ఛాగమనేఽర్థితాం.
తం భీష్మః ప్రత్యువాచేదం మద్రరాజంకురూద్వహః
ఆగతం మాం విజానీహి కన్యార్థినమరిందమ.
శ్రూయతే భవతః సాధ్వీ స్వసా మాద్రీయశస్వినీ
తామహం వర యిష్యామిపాండోరర్థే యశస్వినీం.
యుక్తరూపో హి సంబంధే త్వం నో రాజన్ వయం తవ
ఏతత్ సంచిత్యమద్రేశగృహాణాస్మాన్యథావిధి.
తమేవంవాదినం భీష్మం ప్రత్యభాషత మద్రపః
న హి మేఽన్యో వరస్త్వత్తః శ్రేయానితిమతిర్మమ.
పూర్వైః ప్రవర్తితం కించిత్ కులేఽస్మిన్ నృపసత్తమైః
సాధువాయదివాసాధుతన్నాతిక్రాంతుముత్సహే.
వ్యక్తం తద్ భవతశ్చాపి విదితం నాత్రసంశయః
న చ యుక్తం తథా వక్తుం భవాన్ దేహీతి సత్తమ.
కులధర్మః స నో వీర ప్రమాణం పరమం చ తత్
తేన త్వాం న బ్రవీమ్యేతదసందిగ్ధం వచోఽరిహన్.
తం భీష్మః ప్రత్యువాచేదం మద్రరాజం జనాధిపః
ధర్మ ఏష పరో రాజన్ స్వయముక్తః స్వయంభువా.
నాత్ర కశ్చన దోషోఽస్తి పూర్వైర్విధిరయం కృతః
విదితేయం చ తే శల్య మర్యాదా సాధుసమ్మతా.
ఇత్యుక్త్వా స మహాతేజాః శాతకుంభం కృతాకృతం
రత్నాని చ విచిత్రాణి శల్యాయాదాత్ సహస్రశః.
గజానశ్వాన్ రథాంశ్చైవ వాసాంస్యాభరణాని చ
మణిముక్తాప్రవాలంచగాంగేయోవ్యసృజచ్ఛుభం
తత్ ప్రగృహ్య ధనం సర్వం శల్యఃసంప్రీత మానసః
దదౌ తాం సమలంకృత్య స్వసారం కౌరవర్షభే.
స తాం మాద్రీముపాదాయ భీష్మః సాగరగాసుతః
ఆజగామ పురీం ధీమాన్ ప్రవిష్టో గజసాహ్వయం.
తత ఇష్టేఽహని ప్రాప్తే ముహూర్తే సాధుసమ్మతే
జగ్రాహవిధివత్ పాణింమాద్ర్యాఃపాండుర్నరాధిపః.
తతో వివాహే నిర్వృత్తే స రాజా కురునందనః
స్థాపయామాసతాంభార్యాంశుభేవేశ్మనిభావినీం.
స తాభ్యాం వ్యచరత్ సార్థం భార్యాభ్యాం రాజసత్తమః
కుంత్యా మాద్ర్యా చ రాజేంద్రో యథాకామం యథాసుఖం.

ఆ కాలంలో దేవక మహారాజువద్గర ఒక బాలా మణి ఉన్నదని భీష్ముడు విన్నాడు. ఆమె బ్రాహ్మ బీజంవల్ల శూద్రగర్భంనుండి ఆవిర్భవించిందనీ తెలి సికొని ఆమెను తీసికొనివచ్చి ధీమంతుడైన విదు రునికిచ్చి వివాహం చేశాడు. విదురుడు ధర్మబద్ధంగా సంసారం సాగించి సద్గుణ సంపన్ను లయిన కుమా రులను కన్నాడు.

113 వ అధ్యాయం సమాప్తం.

## నూట పదునాల్గవ అధ్యాయము

గాంధారీ ధృతరాష్ట్రులకు నూరుగురు పుత్రులు కలిగారు. అంతఃపురంలో ఉండే మరొక వైశ్యస్త్రీ వల్ల ధృతరాష్ట్రుడు యుయుత్సుడనే పేరు గల కుమారుని కన్నాడు. కుంతీమాద్రీ దేవాంశలవల్ల అయిదుగురు బిడ్డలను కన్నారు. వీరు కురువంశోద్ధా రకులు— అని సంక్షిప్తంగా వైశంపాయనుడు సాగి పోతూంటే జనమేజయుడు కుతూహలంతో వారి వారి జనన, ఆయుర్దాయ వివరా లిమ్మన్నాడు. అంతే కాకుండా ధృతరాష్ట్రుడు ధర్మశీలయైన గాం ధారితో ఏవిధంగా చరించేవాడో మునిశాపగ్రస్తు డైన పాండురాజుకి కుమారు లేప్రకారంగా కలి గారో కూడా విశదం చేయుమనగా వైశంపాయ నుడు ఆరంభించాడు.

మహాభారతకథాశ్రవణ కౌతూహలచిత్తుడా! అయితే విను. ఒకనాడు వ్యాసమహర్షి మార్గా యాసంతో ఆకలితో హస్తినాపురం చేరాడు. చేరిన మహర్షిని గాంధారి పరిచర్యలతో సంతృప్తి పరచగా ఆమెయందు ప్రసన్నుడై వరం కోరుకో మన్నాడు. గాంధారి నూరుగురు బిడ్డలను కోరింది. వ్యాసుడు సరే నని వెళ్ళిపోయాడు.

అనంతరం గాంధారి ధృతరాష్ట్రునివల్ల గర్భం ధరించింది. రెండేళ్ళు గడిచాయి. అయినా ప్రసవిం చలేదు. అప్పటికే కుంతి కుమారుని కన్న వార్త విని దుఃఖంలో మూర్ఛ పొంది కొంతసేపటికి తేరు కొని గర్భం మీద బాదుకోసాగింది. ఆ తాడనంతో ఆమె గర్భంనుండి లోహసదృశంగా ఒక పిండం వెలువడింది. రెండు సంవత్సరా లయినా పిండం లోహకర్కశంగానే ఉండడం చూసి ఆవేశంతో విసిరి పారెయ్యా లనుకుంది. అదే సమయానికి వ్యాసమహర్షి అక్కడికి వచ్చి— గాంధారీ! ఈ పిం డాన్ని ఏం చేద్దామనుకుంటున్నావు— అని ప్రశ్నిం చగా ఆమె— అప్పుడే కుంతికి కుమారుడు కలిగాడనీ ఆ దుఃఖంతో నేను ఉదరతాడనం చేసుకున్నాననీ మీ వంప్రసాదానుసారం నూరుగురు బిడ్డలూ కలగలేదనీ అందుకు మారుగా ఈ పిండం బైట పడ్డదనీ చెప్పింది.

అది విని వ్యాసుడు తనవాక్కు అమోఘమైన దనీ ఆ వరానుసారమే ఇలా జరిగిందనీ తక్షణం నూరు నేతికుండలు తెప్పించి రహస్యస్థానంలో పెట్టించి ఈపిండాన్ని శీతలజలాలలో తడిపించు— అనగా గాంధారి ఆప్రకారం చేసింది. నీటితో తడి సిన ఆపిండం ఉత్తరక్షణంలో అంగుష్ఠపరిమాణంలో నూటొక్కభాగా లయింది. వ్యాసుని ఆదేశాను సారం ఆపిండాలను నేతికుండలలో ఉంచి వాటి రక్ష

తతః స కౌరవో రాజా విహృత్య త్రిదశా నిశాః
జిగీషయామహీంపాండుర్ని రక్రామత్ పురాత్ ప్రభో.
స భీష్మప్రముఖాన్ వృద్ధానభివాద్య ప్రణమ్య చ
ధృతరాష్ట్రంచకౌరవ్యంతథాన్యాన్ కురుసత్తమాన్
ఆమంత్ర్య ప్రియయా రాజా
తైశ్చైవాప్యనుమోదితః.
మంగళాచారయుక్తాభిరాశీర్భిరభినందితః
గజవాజిరథౌఘేన బలేన మహతాగమత్.
స రాజా దేవగర్భాభో విజిగీషుర్వసుంధరాం
హృష్టపుష్ట బలైః ప్రాయాత్ పాండుః శత్రూ
ననేకశః.

పూర్వమాగస్కృతో గత్వాదశార్ణాఃసమరే జితాః
పాండునా నరసింహేన కౌరవాణాం యశోభృతా.
తతః సేనాముపాదాయ పాండుర్నానావిధధ్వజాం
ప్రభూతహస్త్యశ్వయుతాం పదాతిరథసంకులాం.
ఆగస్కృత్ సర్వవీరాణాం వైరీ సర్వమహీభృతాం
గోప్తా మగధరాష్ట్రస్య దీర్ఘో రాజగృహే హతః.
తతః కోశం సమాదాయ వాహనాని చ భూరిశః
పాండునా మిథిలాం గత్వా విదేహాః సమరేజితాః.
తథా కాశిషు సుహ్మేషు పుండ్రేషు చ నరర్షభ
స్వబాహుబలవీర్యేణ కురూణామకరోద్యశః.
తం శరౌఘమహాజ్వాలం శస్త్రార్చిషమరిందమం
పాండుపావకమాసాద్య వ్యదహ్యంత నరాధిపాః.
తే ససేనాః ససేనేన విధ్వంసితబలా నృపాః
పాండునా వశగాః కృత్వా కురుకర్మసు యోజితాః.
తేన తే నిర్జితాః సర్వే పృథివ్యాం సర్వపార్థివాః
తమేకం మేనిరే శూరం దేవేష్వివ పురందరం.

తం కృతాంజలయః సర్వే ప్రణతా వసుధాధిపాః
ఉపాజగ్ముర్ధనం గృహ్య రత్నాని వివిధాని చ.
మణిముక్తాప్రవాలం చ సువర్ణం రజతం బహు
గోరత్నాన్యశ్వరత్నాని రథరత్నాని కుంజరాన్.
ఖరోష్ట్రమహిషీశ్చైవ యచ్చ కించిదజావికం
కంబలాజినరత్నాని రాంకవాస్తరణాని చ
తత్ సర్వం ప్రతిజగ్రాహ రాజ నాగపురాధిపః.
తదాదాయ యయౌ పాండుః పునర్ముదితవాహనః
హర్షయిష్యన్ స్వరాష్ట్రాణిపురంచగజసాహ్వయం.
శంతనో రాజసింహస్య భరతస్య చ ధీమతః
ప్రణష్టః కీర్తిజః శబ్దః పాండునా పునరాహృతః.
యే పురా కురురాష్ట్రాణి జహ్రుః కురుధనాని చ
తే నాగపురసింహేన పాండునా కరదీకృతాః.
ఇత్య భాషంతరాజానోరాజామాత్యాశ్చసంగతాః
ప్రతీతమనసో హృష్టాః పౌర జానపదైః సహ.
ప్రత్యుద్యయుశ్చతంప్రాప్తంసర్వేభీష్మపురోగమాః
తే నదూరమివాధ్వానం గత్వా నాగపురాలయాత్
ఆవృతం దదృశుర్హృష్టా లోకం బహువిధైర్ధనైః
నానాయానసమానీతై రత్నైరుచ్చావచైస్తదా.
హస్త్యశ్వరథరత్నైశ్చ గోభిరుష్ట్రైస్తథావిభిః
నాంతం దదృశురాసాద్య భీష్మేణ సహ కౌరవాః.
సోఽభివాద్య పితుః పాదౌ కౌసల్యానందవర్ధనః
యథార్హం మానయామాస పౌరజానపదానపి
ప్రమృద్య పరరాష్ట్రాణి కృతార్థం పునరాగతం
పుత్రమాశ్లిష్య భీష్మస్తు హర్షాదశ్రూణ్యవర్తయత్
స తూర్యశతశంఖానాం భేరీణాం చ మహాస్వనైః
హర్షయన్ సర్వశః పౌరాన్ వివేశ గజసాహ్వయం.

112వ అధ్యాయము సమాప్తం

ణకు ఏర్పాట్లు చేసింది. అనరతరం వ్యాసుడు తిరిగి వెడుతూ రెండుసంవత్సరాలవరకూ ఆకుండల మూతులు విప్పవద్దన్నాడు.

రెండేళ్ళు గడిచాయి. క్రమానుసారం దుర్యోధనాదులు జన్మించిన విషయం భీష్మవిదురులకు తెలియజేశారు. దుర్యోధనుడు జన్మించిన రోజునే భీమసేనుడు జన్మించాడు. ఇక్కడ దుర్యోధనుడు పుడుతూనే గాడిదఓండ్రపెట్టినట్లు రోదించసాగాడు. ఆరోదనధ్వనికి పరిసరాల్లోని గాడిదలు శృతి కలిపాయి. తుఫాను రేగింది. ఈ ఉత్పాతాలన్నీ చూసి ధృతరాష్ట్రుడు భయంతో భూసురశ్రేష్ఠుల్నీ భీష్మవిదురుల్నీ పిలిపించాడు.

వచ్చిన పెద్దలవైపు చూస్తూ ధృతరాష్ట్రుడు— గురుజనానికి అభివాదాలు. కురువంశకీర్తివర్ధనుడయే యుధిష్ఠిరుడు మావంశ జ్యేష్ఠుడు. వాడే రాజ్యాధికారి అనడానికేమీ సందేహంలేదు. అయితే అనంతరం పుట్టిన నా పెద్దకొడుకు యుధిష్ఠిరుని అనంతరం రాజ్యాధికారి కాగలడా! ఈ విషయం నిశితంగా విచారించి చెప్పండి— అంటూండగా అన్నివైపుల నుండీ జంతుధ్వానాలు చెలరేగాయి. అమంగళ సూచకంగా నక్క లరవసాగాయి.

ఈసూచనలన్నీ పరిశీలించి ధీమంతుడు విదురుడూ భూసురులూ ఇలా అన్నారు— మహారాజా! మీకుమారుని జననానంతరం కనిపించే ఈ అశుభ సూచనలు చూస్తూంటే వీడు వంశనాశకు డవుతాడనిపిస్తోంది. ఇప్పుడే వీడిని వదిలేసినట్లయితే కురుకులానికి అభ్యుదయం చేకూరుతుంది. మీరు వంశాభ్యుదయాన్ని కోరితే మిగిలిన తొంభైతొమ్మండుగురితోనే హాయిగా ఉండవచ్చు. అలా కాకపోతే వంశనాశనమే. అవశ్యం భావికులహితార్థం వ్యక్తినీ గ్రామాభ్యుదయంకోసం కులాన్నీ దేశక్షేమంకోసం గ్రామాన్నీ ఆత్మకళ్యాణార్థం భూమండలాన్నీ త్యాగం చెయ్యవచ్చునని నీతి శాస్త్రం చెబుతోంది.

పుత్రస్నేహబంధంతో ధృతరాష్ట్రుడు వారిమాట వినలేకపోయాడు.

ఒకేమాసంలో నూరుగురుకొడుకులూ ఒక కుమార్తె జన్మించారు. గాంధారి గర్భవతియైఉన్న రోజులలో ధృతరాష్ట్రుని సేవకువచ్చిన వైశ్య స్త్రీ గర్భంనుండి ధృతరాష్ట్రుడు ఒక కుమారుని కన్నాడు. వానిపేరే యుయుత్సుడు.

ఈ విధంగా ధృతరాష్ట్రునికి నూటఒక్కమంది కుమారులూ ఒకకుమార్తె కలిగారు.

114 వ అధ్యాయము సమాప్తం

## నూట పదిహేనవ అధ్యాయం

వ్యాసమహర్షి అనుగ్రహంవల్ల ధృతరాష్ట్రునికి నూరుగురు కుమారులు కలిగారని ఇదివరలో మీరు చెప్పినప్పుడు దుస్సలా జననం గురించి చెప్పలేదు. పైగా పిండం నూరు భాగాలే అయితే గాంధారి గర్భం ధరించకుండా దుస్సల ఎలా పుట్టిందో వివరంగా చెప్పండి— అని జనమేజయుడు కోరగా వైశంపాయనుడు— మహారాజా! నువ్వు అడగవలసిన ప్రశ్న అడిగావు. వ్యాసమహర్షి స్వహస్తాలతో

## నూట పదమూడవ అధ్యాయము

ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతః స్వబాహువిజితం ధనం
భీష్మాయ సత్యవత్యై చ మాత్రే చోపజహార సః.
విదురాయ చ వై పాండుః ప్రేషయామాసతద్ధనం
సుహృదశ్చాపి ధర్మాత్మా ధనేన సమతర్పయత్.
తతః సత్యవతీ భీష్మం కౌసల్యాం చ యశస్వినీం
శుభైః పాండుర్జితైర్రత్నైస్తోషయామాస భారత.
ననంద మాతా కౌసల్యా తమప్రతిమ తేజసం
జయంతమివ పౌలోమీ పరిష్వజ్య నరర్షభం
తస్య వీరస్య విక్రాంతైః సహస్రశతదక్షిణైః
అశ్వమేధశతైరీజే ధృతరాష్ట్రో మహామఖైః.
సంప్రయుక్తస్తు కుంత్యా చ మాద్ర్యాచభరతర్షభ
జితతంద్రిస్తదా పాండుర్బభూవ వనగోచరః.
హిత్వా ప్రాసాదనిలయం శుభాని శయనాని చ
అరణ్యనిత్యః సతతం బభూవ మృగయాపరః.
స చరన్ దక్షిణం పార్శ్వం రమ్యం హిమవతో గిరేః
ఉవాస గిరిపృష్ఠేషు మహాశాలవనేషు చ.
రరాజ కుంత్యా మాద్ర్యా చ పాండుః సహ వనేచరన్
కరేణ్వోరివ మధ్యస్థః శ్రీమాన్ పౌరందరో గజః.
భారతం సహ భార్యాభ్యాం ఖడ్గబాణధనుర్ధరం
విచిత్రకవచం వీరం పరమాస్త్రవిదం నృపం
దేవోఽయమిత్యమన్యంత చరంతం వనవాసినః.
తస్య కామాంశ్చభోగాంశ్చనరానిత్యమతంద్రితాః
ఉపాజహ్రుర్వనాంతేషు ధృతరాష్ట్రేణ చోదితాః.
అథ పారశవీం కన్యాం దేవకన్య మహీపతేః
రూపయౌవనసంపన్నాం స శుశ్రావాపగాసుతః.
తతస్తు వరయిత్వా తామానీయ భరతర్షభః
వివాహం కారయామాస విదురస్య మహామతేః.
తస్యాం చోత్పాదయామాస విదురః కురునందనః
పుత్రాన్ వినయసంపన్నానాత్మనః సదృశాన్గుణైః.

113 వ అధ్యాయంసమాప్తం

## నూట పదునాల్గవ అధ్యాయము

తతః పుత్రశతం జజ్ఞే గాంధార్యాం జనమేజయ
ధృతరాష్ట్రస్య వైశ్యాయామేకశ్చాపి శతాత్పరః.
పాండోః కుంత్యాం చ మాద్ర్యాం చ పుత్రాః పంచమహారథాః
దేవేభ్యః సముపద్యంత సంతానాయ కులస్య వై.
కథం పుత్రశతం జజ్ఞే గాంధార్యాం ద్విజసత్తమ
కియతా చైవ కాలేన తేషామాయుశ్చ కిం పరం.
కథం చైకః స వైశ్యాయాం ధృతరాష్ట్రసుతోఽభవత్
కథం చ సదృశీం భార్యాం గాంధారీంధర్మచారిణీం.
అనుకూలాం వర్తమానాం ధృతరాష్ట్రోఽభ్యవర్తత
కథం చ శప్తస్య సతః పాండోస్తేన మహాత్మనా
సముత్పన్నా దైవతేభ్యః పుత్రాః పంచమహారథా.
ఏతద్విద్వన్ యథాన్యాయం విస్తరేణ తపోధన.
కథయస్వ న మే తృప్తిః కథ్యమానేషు బంధుషు
క్షుచ్ఛ్రమాభిపరిగ్లానం ద్వైపాయనముపస్థితం.
తోషయామాస గాంధారీ వ్యాసస్తస్యై వరందదౌ
సా వవ్రే సదృశంభర్తుః పుత్రాణాంశతమాత్మనః.

ఆ పిండాన్ని చన్నీళ్ళలో తడిపి నూరు భాగాలు చేశాడు. ఆసమయంలో గాంధారి వ్యాసమహర్షి వరంవల్ల నూరుగురు కొడుకులూ కలిగి తీరతారనీ ఒక కుమార్తెకూడా జన్మిస్తే దౌహిత్రిలాభంవల్ల ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయనీ ముఖ్యంగా స్త్రీకి కన్న బిడ్డలమీదకంటె అల్లుళ్ళమీద ఆదరాభిమానాలు ఉంటాయనీ పైగా పుత్రిపౌత్రిదౌహిత్రి మధ్యంలో ఆనందంగా ఉండవచ్చు ననుకుంటూ తానే ధర్మపరాయణురాలయితే తప హోమ దానాసక్తురా లయితే గురుజనసేవారక్తిగలదైతే కుమార్తె కలిగి తీరాలి అనుకున్నది. అప్పటికి వ్యాస భగవానుడు పిండశకలాలు లెక్కించి— గాంధారీ! నా వాక్యానుసారం నీకు వందమంది బిడ్డలు-అయితే ఇక్కడ మరొక శకలం కనిపిస్తోంది. దీనివల్ల నీకు కుమార్తె కలుగుతుంది— అని మరొక నేతికుండను తెప్పించి అందులో ఉంచాడు— అన్నాడు.

115 వ అధ్యాయం సమాప్తం.

## నూట పదహారవ అధ్యాయము

జనమేజయుడు ఆ నూరుగురిపేర్లు చెప్పమన్నాడు. ధర్యోధన యుయుత్స దుశ్శాసన దుస్సహ దుశ్శల దుర్ముఖ వివింశతి వికర్ణ జలసంధ సులోచన వింద అనువింద దుర్ధర్ష సుబాహు దుష్ప్రధర్షణ దుష్కర్ణ కర్ణ చిత్రి ఉపచిత్రి చిత్రాక్ష చారచిత్రాంగద దుర్మద దుష్ప్రధర్ష వివిత్సు వికట సమ ఊర్ణనాభ పద్మనాభ నంద ఉపనంద సేనాపతి సుషేణ కుండోదర మహోదర చిత్రిబాహు చిత్రివర్మ సువర్మ దుర్విలోచన అయుబాహు చిత్రిచాప మహాబాహు సుకుండల భీమవేగ భీమబల బలాకి భీమ విక్రిమ ఉగ్రాయుధ భీమశర కనకాయువు దృఢాయుధ దృఢవర్మ దృఢక్షత్రి సోమకీర్తి అనూదర జరాసంధ దృఢసంధ సత్యసంధ సహస్రివాక ఉగ్రిశ్రివ ఉగ్రిసేన క్షేమమూర్తి అపరాజిత పండితక విశాలాక్ష దురాధన దృఢహస్త సుహస్త వాతవేగ సువర్చ ఆదిత్యకేతు బహ్వాసి నాగదత్త అనుయాయి కవచ నిషంగ దండి దండదారి ధనుర్గ్రిహ ఉగ్రి భీమరధ వీర వీరబాహు అలోలుప అభయ రౌద్రకర్మ దృఢరధ అనాధృష్య కుండభేది విరావి మహాబాహు వ్యూఢోర కనకాంగద కుండజ చిత్రిక— ఇవి వారి పేర్లు. వీరందరికీ దుస్సల చెల్లెలు.

వారేకాక వైశ్యస్త్రీవల్ల కలిగిన యుయుత్సు నితో ధార్తరాష్ట్రిలు నూట యిద్దరు. ఈ క్రమానుసారమే వారు పుట్టారు. వీరందరూ రధికశ్రేష్ఠులు. మహావీరులు. విద్యావంతులు. వీ రందరికీ వంశ మర్యాదానుసారం వివాహాలు జరిగాయి. శకుని ఆలోచనప్రికారం దుస్సలను సింధుదేశాధీశుని అర్ధాంగిగా చేశాడు దుర్యోధనుడు.

116 వ అధ్యాయంసమాప్తం

తతః కాలేన సా గర్భం ధృతరాష్ట్రాత్తథాగ్రహీత్
సంవత్సరద్వయం తం తు గాంధారీ గర్భమాహితం.
అప్రజా ధారయామాస తతస్తాం దుఃఖమావిశత్
శ్రుత్వా కుంతీసుతం జాతం బాలార్కసమతేజసం.
ఉదారస్యాత్మనః స్థైర్యముపలభ్యాన్వచింతయత్
అజ్ఞాతం ధృతరాష్ట్రస్య యత్నేన మహతా తతః.
సోదరం ఘాతయామాసగాంధారీ దుఃఖమూర్ఛితా
తతో జజ్ఞే మాంసపేశీ లోహాష్ఠీలేవ సంహతా.
ద్వివర్షసంభృతా కుక్షౌ తాముత్స్రష్టుం ప్రచక్రమే
అథద్వైపాయనో జ్ఞాత్వా త్వరితఃసముపాగమత్.
తాం స మాంసమయీం పేశీం దదర్శజయతాంవరః
తతోఽబ్రవీత్ సౌబలేయీం కిమిదం తే చికీర్షితం.
సా చాత్మనో మతం సత్యం శశంస పరమర్షయే
జ్యేష్ఠం కుంతీసుతం జాతం శ్రుత్వా రవిసమప్రభం.
దుఃఖేన పరమేణేదముదరం ఘాతితం మయా
శతం చ కిల పుత్రాణాం వితీర్ణం మే త్వయాపురా.
ఇయం చ మే మాంసపేశీ జాతా పుత్రశతాయవై
ఏవ మే తత్ సౌబలేయి నైతజ్జాత్వన్యథా భవేత్.
వితథం నోక్తపూర్వంమేస్వైరేష్వపి కుతోఽన్యథా
ఘృతపూర్ణం కుండశతం క్షిప్రమేవ విధీయతాం.
సుగుప్తేషు చ దేశేషు రక్షా చైవ విధీయతాం
శీతాభిరద్భిరష్ఠీలామిమాం చ పరిషేచయ.
సా సిచ్యమానా త్వష్ఠీలా బభూవ శతధా తదా
అంగుష్ఠపర్వమాత్రాణాం గర్భాణాం పృథగేవతు.
ఏకాధికశతం పూర్ణం యథాయోగం విశాంపతే
మాంసపేశ్యాస్తదారాజన్క్రమశఃకాలపర్యయాత్
తతస్తాంస్తేషు కుండేషు గర్భానవదధే తదా
స్వనుగుప్తేషు దేశేషు రక్షాం వై వ్యదధాత్ తతః.
శశంస చైవ భగవాన్ కాలేనైతావతా పునః
ఉద్ఘాటనీయాన్యేతాని కుండానీతి చసౌబలీం.

ఇత్యుక్త్వా భగవాన్ వ్యాసస్తథా ప్రతినిధాయ చ
జగామ తపసే ధీమాన్ హిమవంతం శిలోచ్చయం.
జజ్ఞే క్రమేణ చైతేన తేషాం దుర్యోధనో నృపః
జన్మతస్తు ప్రమాణేన జ్యేష్ఠో రాజా యుధిష్ఠిరః.
తదాఖ్యాతుం తు భీష్మాయ విదురాయ చ ధీమతే
యస్మిన్నహని దుర్ధర్షో జజ్ఞే దుర్యోధనస్తదా.
తస్మిన్నేవ మహాబాహుర్జజ్ఞే భీమోఽపి వీర్యవాన్
స జాతమాత్ర ఏవాథ ధృతరాష్ట్రసుతో నృప.
రాసభారావసదృశం రురావ చ ననాద చ
తంస్వరాఃప్రత్యభాషంతగృధ్రగోమాయువాయసాః
వాతాశ్చ ప్రవవుశ్చాపి దిగ్దాహశ్చాభవత్ తదా.
తతస్తు భీతవత్ రాజా ధృతరాష్ట్రోఽబ్రవీదిదం
సమానీయ బహూన్ విప్రాన్ భీష్మంవిదురమేవ చ
అన్యాంశ్చ సుహృదో రాజన్ కురూన్ సర్వాం
స్తథైవ చ.
యుధిష్ఠిరో రాజపుత్రో జ్యేష్ఠో నః కులవర్ధనః
ప్రాప్తః స్వగుణతో రాజ్యం న తస్మిన్
వాచ్యమస్తి నః.
అయం త్వనంతరస్తస్మాదపి రాజా భవిష్యతి
ఏతద్ విబ్రూత మే తథ్యం యదత్ర భవితా ధ్రువం
వాక్యస్యైతస్య నిధనే దిక్షు సర్వాసు భారత
క్రవ్యాదాఃప్రాణదన్ఘోరాఃశివాశ్చాశివశంసినః.
లక్షయిత్వా నిమిత్తాని తాని ఘోరాణి సర్వశః
తేఽబ్రువన్బ్రాహ్మణారాజన్విదురశ్చమహామతిః.
యథేమాని నిమిత్తాని ఘోరాణి మనుజాధిప
ఉత్థితాని సుతే జాతే జ్యేష్ఠే తే పురుషర్షభ.
వ్యక్తం కులాంతకరణో భవితైష సుతస్తవ
తస్య శాంతిః పరిత్యాగే గుప్తావపనయో మహాన్.
శతమేకోనమప్యస్తు పుత్రాణాం తే మహీపతే
త్యజైనమేకం శాంతించేత్ కులస్యేచ్ఛసి భారత.

## నూట పదిహేడవ అధ్యాయము

వ్యాసుని వరంవల్ల ధృతరాష్ట్రునికి కలిగిన పుత్రుల నామాలు విని జనమేజయుడు పాండవుల జన్మక్రమం సవిస్తరంగా చెప్పమనగా వైశంపాయనుడు ఆరంభించాడు.

పాండురాజు వేటకు బయలుదేరాడు. వేటసమయంలో రతిక్రియలో ఉన్న లేడిదంపతులను చూశాడు. చూస్తూనే తన బాణంతో వాటిని కొట్టాడు. ఆదెబ్బ తిని పడిపోతూన్న ఆడులేడిని చూసి, మగలేడిరూపములోఉన్న మునికుమారుడు మానుషరోదనంతో గిలగిల కొట్టుకుంటూ ఇలా అన్నాడు— బుద్ధిహీనుడు కామ క్రోధ సహితుడు అయిన మానవుడు కూడా ఇటువంటి ఘోర కృత్యం చెయ్యలేడు. ధర్మమార్గాన చరించవలసిన రాజవంశీయుడవు నువ్వు. అయితేనేం ప్రారబ్ధానుసారమే నీబుద్ధి చరించింది. ఇంతటి ధర్మచ్యుతికి ఎందుకు దిగజారావు ?— అనగా పాండురాజు— శత్రువధవలెనే వేటకూడా రాజధర్మమే. అయినా కామవశబుద్ధితో నువ్వు నా ధర్మాన్ని నిందించటం ఉచితం కాదు. సత్రియాగదీక్షతో ఉన్న అగస్త్యమహర్షి కూడా యజ్ఞవిఘ్నకారులయిన మృగాలను సంహరించాడు. ఆ ధర్మానుసారమే నేను చరించాను— అన్నాడు. అప్పుడు ఆలేడి— శత్రువు ఆపత్కాలంలో ఉన్నప్పుడు ఏమానవుడూ సంహరించడే! యుద్ధసమయంలోనే వధ ఉచితం— అనగా పాండురాజు— రాజులు ఎన్నో ఉపాయాలచేత మృగాలను వధించవచ్చు. ఇది ధర్మం— అనగా ఆ లేడి— వేట రాజధర్మమే కాని రతిక్రియా సమయంలో దయాహృదయంతో వర్తించడం అధర్మం కాదు. సంతోషభరిత హృదయాలతో చరించే ఆలుమగల్ని వివేకం కలవా డెవ్వడూ హింసించడు. ధర్మశాస్త్రవేత్తవూ స్త్రీసౌఖ్యవిషయజ్ఞుడవూ అయిన నువ్వు ఈ ప్రవర్తనతో నీకీర్తిని కోల్పోయావు. ధర్మార్థకామమార్గ విరహితుల్నీ పాపాసక్తుల్నీ దండించవలసిన నువ్వు కందమూలఫలాలతో జీవించే ఒక మునిని నిరపరాధిని హింసించినందుకు రతిక్రియలో ఉన్న దంపతుల్ని వధించినందుకు ఫలంగా మృత్యువు నిన్ను త్వరలో వరిస్తుంది. ఏక్షణంలో నీకు సురతవాంఛ కలిగి స్త్రీ సమాగమం చేస్తావో అప్పుడే మరణిస్తావు. నాపేరు కిందముడు. మానవదేహంలో రతిక్రియ సాగించేటప్పుడు అధికమైన సిగ్గు కలగటంవల్ల మే ముభయులమూ ఈ రూపంలో చరిస్తున్నాం. అయితే మే మెవరమో నీకు తెలియదు కనుక బ్రహ్మహత్యాదోషంమాత్రం నిన్ను బాధించదు. కాని వశచిత్తంతో ఉన్న మమ్మల్ని హింసించినందుకు ఫలంగా నువ్వుకూడా కామప్రేరితుడవై భార్యాసంగమంవల్ల మరణిస్తావు. ఏ భార్యయందు అనురక్తుడవై నువ్వు మరణిస్తే ఆమెయే నీ వెంట వస్తుంది— ఈ విధంగా పలికి ఆమృగం మరణించింది. పాండురాజు దుఃఖంతో వెనుకకు మరలాడు.

117 వ అధ్యాయంసమాప్తం

ఏకేన కురు వై క్షేమం కులస్య జగత స్తథా
త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్.
గ్రామంజనపదస్యార్థే ఆత్మార్థే పృథివీంత్యజేత్
స తథా విదురేణోక్త స్తైశ్చ సర్వై ర్ద్విజోత్తమైః.
న చకార తథా రాజా పుత్రస్నేహసమన్వితః
తతః పుత్రశతం పూర్ణం ధృతరాష్ట్రస్య పార్థివ.
మాసమాత్రేణ సంజజ్ఞే కన్యా చైకా శతాధికా
గాంధార్యాం క్లిశ్యమానాయాముదరేణ వివర్ధతా.
ధృతరాష్ట్రం మహారాజం వైశ్యా పర్యచరత్ కిల
తస్మిన్ సంవత్సరే రాజన్ ధృతరాష్ట్రాన్మహాయశాః
జజ్ఞే ధీమాం స్తత స్తస్యాం యుయుత్సుః కరణో నృప
ఏవం పుత్రశతం జజ్ఞే ధృతరాష్ట్రస్య ధీమతః.
మహారథానాం వీరాణాం కన్యా చైకా శతాధికా
యుయుత్సుశ్చ మహాతేజా వైశ్యాపుత్రః
ప్రతాపవాన్.

114వ అధ్యాయము సమాప్తం

## నూటపదిహేనవ అధ్యాయం

ధృతరాష్ట్రస్య పుత్రాణామాదితః కథితం త్వయా
ఋషేః ప్రసాదాత్ తు శతం నచకన్యా ప్రకీర్తితా.
వైశ్యాపుత్రో యుయుత్సుశ్చ కన్యా చైకా
శతాధికా
గాంధారరాజదుహితా శతపుత్రేతి చానఘ.
ఉక్తా మహర్షిణా తేన వ్యాసేనామితతేజసా
కథం త్విదానీం భగవన్ కన్యాం త్వంతు బ్రవీషిమే.
యది భాగశతం పేశీ కృతా తేన మహర్షిణా
న ప్రజాస్యతి చేద్ భూయః సౌబలేయీ కథంచన.
కథం తు సంభవ స్తస్యాదుశ్శలాయా వదస్వమే
యథావదిహ విప్రర్షే పరం మేఽత్ర కుతూహలం.
సాధ్వయం ప్రశ్న ఉద్దిష్టః పాండవేయ బ్రవీమి తే
తాం మాంసపేశీంభగవాన్ స్వయమేవ మహాతపాః.
శీతాభిరద్భిరాసిచ్య భాగం భాగమకల్పయత్
యో యథా కల్పితో భాగ స్తం తం ధాత్ర్యా
తథా నృప.
ఘృతపూర్ణేషు కుండేషు ఏకైకం ప్రాక్షిపత్ తదా
ఏతస్మిన్నంతరే సాధ్వీ గాంధారీ సుదృఢవ్రతా.
దుహితుః స్నేహసంయోగమనుధ్యాయవ రాంగనా
మనసాచింతయద్దేవీ ఏతత్ పుత్రశతం మమ.
భవిష్యతి న సందేహో న బ్రవీత్యన్యథా మునిః
మమేయం పరమా తుష్టిర్దుహితా మే భవేద్యది.
ఏకా శతాధికా బాలా భవిష్యతి కనీయసీ
తతో దౌహిత్రజాల్లోకాదబాహ్యోఽసౌపతిర్మమ.
అధికా కిల నారీణాం ప్రీతిర్జామాతృజా భవేత్
యది నామ మమాపి స్యాద్ దుహితైకాశ తాధికా.
కృతకృత్యా భవేయం వై పుత్రదౌహిత్రసంవృతా
యది సత్యం తప స్తప్తం దత్తంవాప్యథవాహుతం.
గురవస్తోషితా వాపి తథాస్తు దుహితా మమ
ఏతస్మిన్నేవ కాలే తు కృష్ణద్వైపాయనః స్వయం.
వ్యభజత్ స తదా పేశీం భగవానృషిస త్తమః
గణయిత్వా శతం పూర్ణ మంశానామాహ సౌబలీం.
పూర్ణం పుత్రశతం త్వేతన్నమిథ్యావాగుదాహృతా
దౌహిత్రయోగాయ భాగ ఏకః శిష్టః శతాత్ పరః
ఏషా తే సుభగా కన్యా భవిష్యతి యథేప్సితా.
తతోఽన్యంఘృతకుంభంచసమానాయ్య మహాతపాః

## నూట పదునెనిమిదవ అధ్యాయము

### వానప్రస్థము

అనంతరం పాండురాజు పత్నీసహితుడై శోక హృదయంతో సోదర బంధువులు మరణించినట్లు మునికోసం విచారిస్తూ రాజధానికి మరలాడు. ఉత్తమవంశీయులుకూడా కామవశచిత్తులై ఉచితానుచితాలు తెలియక అధర్మమార్గాన చరించి దుర్గతి పాలవుతూ ఉంటారు. శంతనమహారాజు కుమారుడయిన నా తండ్రి విచిత్రవీర్యుడుకూడా కామాసక్త హృదయంతోనే అకాలమరణం పొందాడు. వాగ్విదాంవరుడైన వ్యాసమహర్షి అనుగ్రహంవల్ల నేను జన్మించాను. అయినా నా మనస్సు వేటమీదనే లగ్నమవుతున్నది. అందువల్లనే నా బుద్ధి ఇంత నీచంగా వర్తించింది. దారాపుత్రాది బంధనం ఇంతకంటె నీచమైంది. కనక మోక్షదృష్టితో నేటినుండే నేనుకూడా వ్యాసులవారి మార్గాన్నే అనుసరిస్తాను. నా శరీరమూ మనస్సూ స్వాధీనంలో ఉంచుకుని ఏ చెట్టునీడనో ఏకాంతంగా ఫలహారంతో జీవిస్తాను. ముండనం చేయించుకుని యావన సన్యాసిలా ఉంటాను. చెట్టు పట్టు లే గృహాలుగా భావించుకుంటాను. ఆనాడునాకు నిందా స్తుతులు రెండూ సమంగానే ఉంటాయి. హర్ష శోకాల భేదం తెలియదు. ఆశీర్వాద నమస్కారాల ప్రమేయం నాకు లేదు. పరిహాసంతోకానీ క్రోధంతోకానీ ఎవరినీ హింసించను. సర్వభూత ప్రేమతో నాముఖం సర్వదా ప్రసన్నంగా ఉంటుంది. తండ్రి సంతానాన్ని ప్రేమించినట్లు నేను సర్వప్రాణికోటినీ ప్రేమిస్తాను. ఒకేసారి భిక్షాటనం చేస్తాను. అప్పుడు లభించకపోతే ఉపవాసం చేస్తాను. స్వల్పంగా భుజిస్తాను. చపలజిహ్వతో అధికంగామాత్రం ఆరగించను. ఎవరైనా నాచేతులు నరుకుతూన్నా చందనచర్చ చేస్తూన్నా నేను సమంగానే భావిస్తాను. జీవితప్రేమా మృత్యుద్వేషమూ నా కుండవు. అశాశ్వత ఫలాల నిచ్చే కార్యాలు నేను చెయ్యను. అంతఃకరణ శుద్ధితో పాప విముక్తుడనై అవిద్యాజనితమైన బంధనాలు త్రెంచుకుని గాలివలె స్వేచ్ఛగా చరిస్తాను. మోక్షమార్గం చూసుకుని ఈ దేహం వదులుతాను.

ఇది మొదలుగా సంతానార్థమై వీర్యక్షయం చేసికొంటూ గృహస్థాశ్రమంలో దైన్యజీవితం గడపను. కామవశుడైన పురుషునికీ శునకానికీ భేదం లేదు— ఈవిధంగా పాండురాజు వితర్కించుకుంటూ వేడి నిట్టూర్పులు విడుస్తూ కూడా ఉన్న కుంతీ మాద్రిలను చూసి ఇలా అన్నాడు— మీరిద్దరూ హస్తినాపురం వెళ్ళండి. అక్కడ సత్యవతినీ అంబికా అంబాలికలనీ భీష్ములవారినీ విదుర సంజయ బంధుసహితుడైన ధృతరాష్ట్రునీ భూసుర శ్రేష్ఠుల్నీ వృద్ధపురజనుల్నీ రాజవంశాలను ఆశ్రయించుకుని బ్రతికే సర్వప్రజలనూ సంతోష హృదయంతో కలిసి పాండురాజు సన్యాసియై అరణ్యానికి వెళ్ళాడని చెప్పండి— అన విని పాండుపత్నులు— మీరు పత్నీసమేతంగా తపోదీక్ష సాగించే ఆశ్రమాలు ఉన్నవి. సన్యాసమే అవసరంలేదు. ఆ ఆశ్రమాలలో చేసే తపస్సుకూడా స్వర్గాధిపత్యాన్ని ఇవ్వగలదు. మేముకూడా ఇంద్రియాలను జయించి మీతో ఉంటాము. అలా ఉండనివ్వకపోతే ఇప్పుడే మేము మరణిస్తాము— అనగా విని పాండురాజు— మీరు ధర్మయుక్తంగా నిశ్చయించారు. అక్షయ ఫలాల

తం చాపి ప్రాక్షిపత్ తత్ర కన్యాభాగం తపోధనః. బ్రూహిరాజేంద్రకింభూయోవర్తయిష్యామితేఽనఘ.
ఏతత్ తే కథితం రాజన్ దుఃశలాజన్మ భారత

115 వ అధ్యాయంసమాప్తం

## నూట పదహారవ అధ్యాయము

జ్యేష్ఠానుజ్యేష్ఠతాం తేషాం నామాని చ
పృథక్ పృథక్
ధృతరాష్ట్రస్య పుత్రాణామానుపూర్వ్యాత్
ప్రకీర్తయ.
దుర్యోధనో యుయుత్సుశ్చ రాజన్ దుఃశాసనస్తథా
దుఃసహో దుఃశలశ్చైవ జలసంధః సమః సహః.
విందానువిందౌ దుర్ధర్షః సుబాహుర్దుష్ప్రధర్షణః
దుర్మర్షణో దుర్ముఖశ్చ దుష్కర్ణః కర్ణ ఏవ చ.
వివింశతిర్వికర్ణశ్చ శలః సత్వః సులోచనః
చిత్రోపచిత్రౌ చిత్రాక్షశ్చారుచిత్రశరాసనః.
దుర్మదో దుర్విగాహశ్చ వివిత్సుర్వికటాననః
ఊర్ణనాభః సునాభశ్చ తథా నందోపనందకౌ.
చిత్రబాణశ్చిత్రవర్మా సువర్మా దుర్విరోచనః
అయోబాహుర్మహాబాహుశ్చిత్రాంగశ్చిత్రకుండలః.
భీమవేగో భీమబలో బలాకీ బలవర్ధనః
ఉగ్రాయుధః సుషేణశ్చ కుండోదరమహోదరౌ.
చిత్రాయుధో నిషంగీ చ పాశీ వృందారకస్తథా
దృఢవర్మా దృఢక్షత్రః సోమకీర్తిరనూదరః.
దృఢసంధో జరాసంధః సత్యసంధః సదః సువాక్
ఉగ్రశ్రవా ఉగ్రసేనః సేనానీర్దుష్పరాజయః.
అపరాజితః పండితకో విశాలాక్షో దురాధరః
దృఢహస్తః సుహస్తశ్చ వాతవేగ సువర్చసౌ.
ఆదిత్యకేతుర్బహ్వాశీ నాగదత్తోఽగ్రయాయ్యపి
కవచీ క్రథనః దండీ దండధారో ధనుర్గ్రహః.
ఉగ్రభీమరథౌ వీరౌ వీరబాహురలోలుపః
అభయో రౌద్రకర్మా చ తథా దృఢరథాశ్రయః.
అనాధృష్యః కుండభేదీ విరావీ చిత్రకుండలః
ప్రమథశ్చ ప్రమాథీ చ దీర్ఘరోమశ్చ వీర్యవాన్.
దీర్ఘబాహుర్మహాబాహుర్వ్యూఢోరుః కనకధ్వజః
కుండాశీ విరజాశ్చైవ దుఃశలా చ శతాధికాః
ఇతి పుత్రశతం రాజన్ కన్యా చైవ శతాధికా
నామధేయానుపూర్వ్యేణ విద్ధి జన్మక్రమం నృప.
సర్వే త్వతిరథాః శూరాః సర్వేయుద్ధవిశారదాః
సర్వే వేదవిదశ్చైవ సర్వే సర్వాస్త్రకోవిదాః.
సర్వేషామనురూపాశ్చ కృతా దారా మహీపతే
ధృతరాష్ట్రేణ సమయే పరీక్ష్య విధివన్నృప.
దుఃశలాం చాపి సమయే ధృతరాష్ట్రో నరాధిపః
జయద్రథాయ ప్రదదౌ విధినా భరతర్షభ.

116వ అధ్యాయము సమాప్తం

నిచ్చే జీవిత విధానం అనుసరించి ఆహారసుఖభోగాలు వదిలి తపస్సు చేస్తాను. వల్కలాలు ధరించి కందమూలాలు తింటూ స్నాన సంధ్యాగ్నిహోత్రాలు నిర్వహిస్తూ జటాధారినై అరణ్యంలో వసిస్తాను. శీతవాతాతపాలను సహిస్తూ ఏకాంతంగా ఆత్మవినికిత్సతో ఉంటాను. దేవతలకూ పితరులకూ వన్యఫలాలతో నిర్మలజలాలతో మంత్రపాఠాలతో తృప్తి కలిగిస్తాను. సాంసారిక జీవితం సాగించేవారికి ఏవిధమైన కష్టమూ కలిగించను. ఈ వానప్రస్థాశ్రమంలోనే జీవితయాత్రను ముగిస్తాను— అని పలికి సర్వాభూషణాలూ తీసేశాడు. కుంతీమాద్రుల ఆభరణాలు కూడా తీసి దానంచేసి చీనిచీనాంబరాలు విడిచి వల్కలాలు ధరించాడు. అన్నీ జరిగిన అనంతరం తమతో వచ్చిన సేవకులను హస్తినాపురం తిరిగి పొమ్మని పాండురాజు అర్థసుఖాలనూ కామభోగాలనూ విడిచి వానప్రస్థాశ్రమం స్వీకరించినట్లు రాజవంశానికి తెలియజేయమన్నాడు. ఆ మాటలు విని అనుచరులు భయకంపితులై దుఃఖించారు. శోకవదనాలతో హస్తినాపురం వెళ్ళి విషయాలన్నీ ధృతరాష్ట్రునికి నివేదించి పాండురాజు వదిలిన వస్త్రభూషణాలు అర్పించారు. ఈ వార్తవిని ధృతరాష్ట్రుడు విపరీతంగా దుఃఖించాడు. సోదరుని ఈ చర్య అతనికి ఏవిషయంపట్లా ఆసక్తిని కలిగించటం లేదు.

పాండురాజు భార్యలతో నాగశతపర్వతానికి వెళ్ళి కొంతకాలం ఉండి చైత్రరథవనంలో మరి కొంతకాలం గడిపి కాలకూట హిమాలయ పర్వతాలు దాటి గంధమాదనం చేరుకున్నాడు. అక్కడ మహాభూతాలూ సిద్ధులూ మహర్షులతోపాటు నేలమీదనే శయనిస్తూ గడిపి ఇంద్రద్యుమ్న సరోవరం చేరి నెమ్మదిగా శతశృంగ పర్వతంమీద నివసిస్తూ తపోదీక్ష సాగిస్తున్నాడు.

118 వ అధ్యాయం సమాప్తం.

## నూట పంతొమ్మిదవ అధ్యాయము

శతశృంగ పర్వతంమీద పాండురాజు సాగించే వానప్రస్థాశ్రమదీక్ష సిద్ధులకూ చారణులకూ సంతోషాన్ని కలిగించేది. పత్నీయుతుడై పాండురాజు మునులనూ ఋషులనూ సేవిస్తూ అహంకార దూరుడై చరించసాగాడు. వారు ముగ్గురూ ఇంద్రియాలను జయించి స్వర్గలోకప్రాప్తికి కృషి చేస్తున్నారు. అక్కడి ఋషు లందరికీ వారిమీద ఆదరాభిమానాలు కలిగాయి. చిరకాల తపస్సుతో ఆయన బ్రహ్మర్షితుల్యుడయాడు. ఆసమయంలో ఒక అమావాస్యనాడు అక్కడి ఋషు లందరూ ప్రయాణ మవుతూండడం చూసి పాండురాజు వారి ప్రయాణం ఏలోకానికో చెప్పమని అడిగాడు.

ఆనాడు ముని ఋషి దేవతామనీషులు బ్రహ్మలోకంలో సమావేశ మవుతున్నారు గనక అక్కడికే వెడుతున్నామని వారు చెప్పారు. అది విని పాండురాజు వారితో బయలుదేరి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. భార్య లిద్దరితో పాండురాజు తమవెంట రావటం చూసి ఆ ఋషులు ఇలా అన్నారు— భరతవంశశిరోమణీ! ఈ పర్వతం

## నూటపదిహేడవ అధ్యాయం

కథితో ధార్తరాష్ట్రాణామార్షః సంభవ ఉత్తమః
అమానుష్యో మనుష్యాణాం భవతా బ్రహ్మవాదినా
నామధేయాని చాప్యేషాం కథ్యమానాని భాగశః
త్వత్తః శ్రుతాని మే బ్రహ్మన్ పాండవానాం చ కీర్తయః.
తే హి సర్వే మహాత్మానో దేవరాజపరాక్రమాః
త్వయైవాంశావతరణే దేవభాగాః ప్రకీర్తితాః.
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుమతిమానుషకర్మణాం
తేషామాజననం సర్వే వై శంపాయన కీర్తయ.
రాజా పాండుర్మహారణ్యే మృగవ్యాలనిషేవితే
చరన్ మైథునధర్మస్థం దదర్శ మృగయూథపం.
తతస్తాం చ మృగీం తం చ రుక్మపుంఖైః సుపత్రిభిః
నిర్బిభేద శరైస్తీక్ష్ణైః పాండుః పంచభిరాశుగైః.
స చ రాజన్ మహాతేజా ఋషిపుత్రస్తపోధనః
భార్యయా సహ తేజస్వీ మృగరూపేణ సంగతః.
సంసక్తశ్చ తయా మృగ్యా మానుషీమీరయన్ గిరం
క్షణేన పతితో భూమౌ విలలాపాకులేంద్రియః.
కామమన్యుపరీతా హి బుధ్యా విరహితా అపి
వర్జయంతి నృశంసాని పాపేష్వపి రతా నరాః.
న విధిం గ్రసతే ప్రజ్ఞా ప్రజ్ఞాం తు గ్రసతే విధిః
విధిపర్యాగతానర్థాన్ ప్రాజ్ఞో న ప్రతిపద్యతే.
శశ్వద్ధర్మాత్మనాం ముఖ్యే కులే జాతస్య భారత
కామలోభాభిభూతస్య కథం తే చలితా మతిః.
శత్రూణాం యా వధే వృత్తిః సా మృగాణాం వధే స్మృతా
రాజ్ఞాం మృగ న మాం మోహాత్ త్వం గర్హయితుమర్హసి.
అచ్ఛద్మనా మాయయా చ మృగాణాం వధ ఇష్యతే
స ఏవ ధర్మో రాజ్ఞాం తు తద్ధి త్వం కిం ను గర్హసే.
అగస్త్యః సత్రమాసీనశ్చకార మృగయామృషిః
ఆరణ్యాన్ సర్వదేవేభ్యో మృగాన్ ప్రోక్షన్ మహావనే.
ప్రమాణదృష్టధర్మేణ కథమస్మాన్ విగర్హసే
అగస్త్యస్యాభిచారేణ యుష్మాకం విహితో వధః.
న రిపూన్ వై సముద్దిశ్య విముంచంతి నరాః శరాన్
రంధ్ర ఏషాం విశేషేణ వధః కాలే ప్రశస్యతే.
ప్రమత్తమప్రమత్తం వా వివృతం ఘ్నంతి చౌజసా
ఉపాయైర్వివిధైస్తీక్ష్ణైః కస్మాన్మృగ విగర్హసే.
నాహం ఘ్నంతం మృగాన్ రాజన్ విగర్హే చాత్మకారణాత్
మైథునం తు ప్రతీక్ష్యం మే త్వయేహాద్యానృశంస్యతః.
సర్వభూతహితే కాలే సర్వభూతేప్సితే తథా
కో హి విద్వాన్ మృగం హన్యాచ్చరంతం మైథునం వనే
అస్యాం మృగ్యాం చ రాజేంద్ర హర్షాన్మైథునమాచరం
పురుషార్థఫలం కర్తుం తత్ త్వయా విఫలీకృతం.
పౌరవాణాం మహారాజ తేషామక్లిష్టకర్మణాం
వంశే జాతస్య కౌరవ్య నానురూపమిదం తవ.
నృశంసం కర్మ సుమహత్ సర్వలోకవిగర్హితం
అస్వర్గ్యమయశస్యం చాప్యధర్మిష్ఠం చ భారత.
స్త్రీభోగానాం విశేషజ్ఞః శాస్త్రధర్మార్థతత్త్వవిత్
నార్హస్త్వం సురసంకాశ కర్తుమస్వర్గ్యమీదృశం.
త్వయా నృశంసకర్తారః పాపాచారాశ్చ మానవాః
నిగ్రాహ్యాః పార్థివశ్రేష్ఠ త్రివర్గపరివర్జితాః.
కిం కృతం తే నరశ్రేష్ఠ మామిహానాగసం ఘ్నతా
మునిం మూలఫలాహారం మృగవేషధరం నృప.
వసమానమరణ్యేషు నిత్యం శమపరాయణం

మీద సామాన్య మానవులు దర్శించలేని రమణీయ దృశ్యా లెన్నో చూశాము. ఎన్నో విమానాల మీద దేవ గంధర్వ స్త్రీలు మధురగీతాలతో వచ్చి ఇక్కడ ఉన్న కుబేరుని ఉద్యాన వనాలలో క్రీడించి పోయే ప్రదేశాలున్నాయి. ఆప్రాంతాలు మిట్టపల్లాలతో దుర్గమ నదీ తటాకాలతో లోయలతో మంచుతో నిండి ఉంటాయి. పశుపక్ష్యాదులు కానీ వృక్షాలు కానీ నామ మాత్రంగా అయినా ఉండవు. ఆప్రాంతాలలో పక్షులే చరించలేవు. ఒక వాయువే అక్కడ ప్రసరిస్తుంది. ఈ దారిని సిద్ధి పొందిన ఋషులు మాత్రమే వెళ్ళగలరు. కష్టాల్ని సహించలేని ఈ రాజపుత్రికలు అటు నడవలేరు. అందుచేత మీరు ఆగిపొండి— అన్నారు.

మహర్షులారా! సంతానహీనుడికి స్వర్గప్రాప్తి లేదని ప్రాజ్ఞులు అంటూ ఉంటారు. ఆబాధతో ఉన్న నేను పితౄఋణ విముక్తుణ్ణి కాలేకపోయాను. సంతానహీనుణ్ణయి నే ను న శి స్తే పితృదేవతలు ఉన్నతలోకాలనుండి పతనులై తీరతారు. మానవులు నాలుగు ఋణాలతో భూమిమీద జన్మిస్తారు. పితౄణము దేవఋణము ఋషిఋణము మనుష్యఋణము ఈ నాలిగింటినీ ధర్మబద్ధంగా తీర్చని వాడికి పుణ్యలోకాలు లేవు. యజ్ఞకర్మలతో దేవఋణాలనీ తపస్స్వాధ్యాయనిరతితో ముని ఋణాన్నీ శ్రాద్ధకర్మలతో పుత్రోత్పత్తితో పితౄణాన్నీ దయాపూర్ణ హృదయంతో మనుష్య ఋణాన్నీ తీర్చుకుంటాము. ఋషి దేవ మానవ ఋణవిముక్తి నేను పొందాను. పితౄణమే తీరలేదు. ఆ ఋణ విముక్తికి పుత్రరూపంలో జన్మించాలి. నేను నా పితృ క్షేత్రంలో వ్యాసమహర్షి వల్ల జన్మించినట్లే నాక్షేత్రంలో కూడా సంతానం కలిగే మార్గం చెప్పండి— అన్నాడు పాండురాజు.

అదివిని ఋషులు— ధర్మాత్మా! దేవసములైన పుత్రులు కలిగే యోగము నీకు ఉన్నట్లు మా దివ్య దృష్టివల్ల తెలిసింది. ధీశాలియైన మానవుడు క్లేశరహితంగా ప్రయత్నించి అదృష్టదేవత అనుగ్రహానుసారం అభీష్టసిద్ధి పొందుతాడు. నువ్వుకూడా అలానే ప్రయత్నించు. గుణవంతులూ మనోహ్లాదకారకులూ అయిన కుమారులు కలుగుతారు— అన్నారు.

పాండురాజు మనస్సు ఆలోచనాతరంగాలలో మునిగి తేలుతూఉంది. మునిశాపంవల్ల తనకు సంతానోత్పత్తి చేసే అవకాశంలేదు. ఆలోచించి ఆలోచించి ఒకనాడు కుంతిని పిలిచి— దేవీ! సర్వ లోకాల్లో సంతానవంతునికి మంచి ప్రతిష్ఠ లభిస్తుంది. సంతానహీనుడు తపో దాన యజ్ఞాదులు ఎన్నిచేసినా ప్రయోజనంలేదు. ఇప్పుడు మనకు అటువంటి ప్రమాదపరిస్థితి ఏర్పడింది. ఏదోమార్గం ఆలోచించి నువ్వు సంతానవతివి కావాలి. నీవల్లనే నాకు ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి. ఒకానొక దౌర్బల్యంతో చేసిన ఘాతుక కృత్యంవల్ల నేనీ అవస్థలో పడ్డాను. ఈ స్థితినుండి నువ్వు నన్ను తప్పించాలి.

దేవీ! ఈసమయంలో నీకు ధర్మశాస్త్రంలోని కొన్ని రహస్యాలు చెపుతాను విను— అని పాండురాజు బంధుత్వదాయాదాదులను గురించి వివరిస్తున్నాడు. వారేకాక ఆ బంధుదాయాదుల విషయం కూడా ప్రస్తావిస్తున్నాడు. ముఖ్యంగా వీరందరూ మానవుని సంపదలకు భోక్తలైనట్లే వాని ఉత్తర లోకాలకు హేతువవుతారు.

త్వియాహం హింసితో యస్మాత్ తస్మాత్
త్వామప్యహం శపే.
ద్వయోర్నృశంసకర్తారమవశం కామమోహితం
జీవితాంతకరో భావ ఏవమేవాగమిష్యతి.
అహం హి కిందమో నామ తపసా భావితో మునిః
వ్యపత్రపన్మనుష్యాణాం మృగ్యాం మైథునమాచరం.
మృగోభూత్వామృగైః సార్ధంచరామి గహనే వనే
న తు తే బ్రహ్మహత్యేయం భవిష్యత్యవిజానతః.
మృగరూపధరం హత్వామామేవం కామమోహితం
అస్య తు త్వం ఫలం మూఢ ప్రాప్స్యసీదృశమేవహి.
ప్రియయా సహ సంవాసం ప్రాప్యకామవిమోహితః
త్వమప్యస్యామవస్థాయాం ప్రేతలోకం గమిష్యసి.
అంతకాలేహిసంవాసంయయాగంతాసికాంతయా
ప్రేతరాజపురం ప్రాప్తం సర్వభూతదురత్యయం
భక్త్యామతిమతా శ్రేష్ఠ సైవ త్వామనుగమిష్యతి.
వర్తమానః సుఖేదుఃఖం యథాహంప్రాపితస్త్వయా
తథా త్వాం చ సుఖం ప్రాప్తం
దుఃఖమభ్యాగమిష్యతి.
ఏవముక్త్వా సుదుఃఖార్తో జీవితాత్ సవ్యముచ్యత
మృగః పాండుశ్చ దుఃఖార్తః క్షణేన సమపద్యత.

117 వ అధ్యాయంసమాప్తం

## నూట పదునెనిమిదవ అధ్యాయము

తం వ్యతీతమతిక్రమ్య రాజా స్వమివ బాంధవం
సభార్యః శోకదుఃఖార్తః పర్యదేవయదాతురః.
సతామపి కులే జాతాః కర్మణా బత దుర్గతిం
ప్రాప్నువంత్యకృతాత్మనః కామజాలవిమోహితాః
శశ్వద్ధర్మాత్మనా జాతో బాల ఏవ పితా మమ
జీవితాంతమనుప్రాప్తః కామాత్మైవేతి నః శ్రుతం.
తస్య కామాత్మనః క్షేత్రే రాజ్ఞఃసంయతవాగృషిః
కృష్ణద్వైపాయనఃసాక్షాద్భగవాన్ మామజీజనత్.
తస్యాద్య వ్యసనే బుద్ధిః సంజాతేయం మమాధమా
త్యక్తస్య దేవైరనయాన్మృగయాంపరిధావతః.
మోక్షమేవ వ్యవస్యామి బన్ధోహి వ్యసనం మహత్
సువృత్తి మనువర్తిష్యే తామహం పితురవ్యయాత్.
అతీవతపసాఽఽత్మానం యోజయిష్యామ్యసంశయం
తస్మాదేకోఽహమేకాకీ ఏకైకస్మిన్ వనస్పతౌ.
చరన్ భైక్ష్యం
మునిర్ముణ్డశ్చరిష్యామ్యాశ్రమాసిమాన్
పాంసునా సమవచ్ఛన్నః శూన్యాగారకృతాలయః.
వృక్షమూల నికేతో వా త్యక్తసర్వప్రియాప్రియః
న శోచన్ న ప్రహృష్యం చ
తుల్యనిందాత్మసంస్తుతిః.
నిరాశీర్నిర్నమస్కారో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః
నచాప్యవహసన్ కచ్చిన్న కుర్వన్ భ్రుకుటింక్వచిత్.
ప్రసన్నవదనో నిత్యం సర్వభూతహితే రతః
జంగమాజంగమం సర్వమవిహింసశ్చతుర్విధం.
స్వాసు ప్రజాస్వివ సదా సమః ప్రాణభృతాంప్రతి
ఏకకాలం చరన్ భైక్ష్యం కులాని దశ పంచ వా.
అసంభవే వా భైక్ష్యస్య చరన్ననశనాన్యపి
అల్పమల్పంచభుంజానఃపూర్వాలాభేనజాతుచిత్.
అన్యాన్యపి చరంల్లోభాదలాభే సప్త పూరయన్
అలాభే యది వా లాభే సమదర్శీ మహాతపాః.
వాస్యైకం తక్షతో బాహుం చన్దనేనైకముక్షతః

ఆత్మీయులతోపాటు మాతృ పితృ వంశాల వారు స్వకుటుంబీకులుగానే పరిగణనకు వస్తారు. ఈ బంధువులతోపాటు వ్యక్తి అనంతరం ఆ వ్యక్తి సిరిసంపదలకు పుణ్యాలోకాలకు అధికారి అయేవాడు దాయాది.

ఇక కుమారుల విషయం విను :

ధర్మరీత్యా భార్యయందు తనవల్ల కలిగిన పుత్రుడు ఔరసుడు.

భార్యయందు ఉత్తమ పురుషుడెవరో అనుగ్రహిస్తే కలిగినవాడు ప్రణీతుడు.

రెండవభార్యయందు తనకు కలిగిన వాడు పౌనర్భవుడు.

ఆత్మపుత్రికకు ధర్మవిధిగా కలిగినవాడు దౌహిత్రుడు

వివాహాత్పూర్వాపరాలలో కలిగే సంతానం నాదే నని కన్యను గ్రహించినట్లైతే ఆ కన్యా సంతతి కానీనులు.

సోదరీ పుత్రుడు షష్ఠనుడు.

ఈ ఆరుగురితో పాటు అబంధు దాయాదులున్నారు.

కన్న తలిదండ్రుల చేత హృదయపూర్వకంగా అర్పింపబడినవాడు దత్తుడు.

ధనసంపదలిచ్చి తెచ్చుకొన్న బాలుడు క్రీతుడు.

నన్ను తమబిడ్డగా భావించండి అని వచ్చిన వాడు కృత్రిముడు.

వివాహపూర్వం గర్భవతిగా ఉన్న ఆమెకు వివాహానంతరం కలిగినవాడు సహోఢుడు.

స్వకుల సంజాతబాలుడు జ్ఞాతిరేతుడు.

తన సంగమంవల్ల హీనజాతిస్త్రీకి కలిగినవాడు షష్ఠమపుత్రుడు (అపవిద్ధుడు).

అయితే క్రమానుసారం వీరి ప్రాధాన్యం తగ్గుతుంది. స్వయంజాతుడే శ్రేష్ఠుడు. వాడులేనప్పుడే మిగిలిన వారిలు చూడాలి. ఉత్తమపురుష సాంగత్యంవల్ల కలిగిన బిడ్డలుకూడా ధర్మరీత్యా పుత్రులేనని మనువు ఘోషిస్తున్నాడు కనక— కుంతీ ! నాహృదయశోక నివారణార్థం ఉత్తమలోక ప్రాప్తి కోసం మహాపురుషులవల్ల సంతానవతివి కావాలి— అని పాండురాజు మౌనం వహించాడు.

119 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువదవ అధ్యాయము

వ్యుషితాశ్వుడు

పాండురాజు మనోభావాలు విని కుంతి— మహారాజా ! నేను సర్వదా మిమ్మల్నే నా హృదయ పీఠంలో పూజిస్తున్నాను. మీ రిలా మాట్లాడి నా గుండె నొప్పించకండి. నా గర్భంనుండి మీవల్లనే మీవంటి కుమారులే జన్మించాలి. నేను మీ పదపద్మాలాశ్రయించుకుని స్వర్గానికైనా వస్తాను. పుత్రార్థులై నన్ను అనుభవించండి. నేను పరపురుష సంగమం చెయ్యను. ఆ ఊహకుకూడా నా మనస్సులో చోటులేదు. ఈ ప్రపంచంలో మిమ్మల్ని మించిన ఉత్తమధీరుడు లేడు. ఈ సమయంలో మీకొక గాథ చెపుదామనుకుంటున్నాను వినండి.

నాకల్యాణంనకల్యాణంచిన్తయన్నుభయోస్తయోః
న జిజీవిషువత్ కించిన్న ముమూర్షువదాచరన్
జీవితం మరణం చైవ నాభినందన్ న చ ద్విషన్
యాః కాశ్చిజ్జీవతా శక్యాః కర్తుమభ్యుదయక్రియాః
తాః సర్వాః సమతిక్రమ్య నిమేషాది వ్యవస్థితాః.
తాసు చాప్యనవస్థాసు త్యక్తసర్వేంద్రియక్రియః
సంపరిత్యక్తధర్మార్థః సునిర్ణిక్తాత్మకల్మషః.
నిర్ముక్తః సర్వపాపేభ్యో వ్యతీతః సర్వవాగురాః
న వశే కస్యచిత్ తిష్ఠన్ సధర్మా మాతరిశ్వనః.
ఏవయా సతతం ధృత్వా చరన్నేవంప్రకారయా
దేహం సంస్థాపయిష్యామి నిర్భయం మార్గమాస్థితః.
నాహం సుకృపణే మార్గే స్వవీర్యక్షయశోచితే
స్వధర్మాత్ సతతాపేతే చరేయం వీర్యవర్జితః
సత్కృతోఽసత్కృతో వాపి యోఽన్యం కృపణచక్షుసా
ఉపైతి వృత్తిం కామాత్మా స శునాం వర్తతే పథి.
ఏవముక్త్వా సుదుఖార్తో నిఃశ్వాసపరమో నృపః
అవేక్షమాణః కున్తీం చ మాద్రీం స సమభాషత.
కౌసల్యా విదురః క్షత్తా రాజా చ సహ బన్ధుభిః
ఆర్యా సత్యవతీ భీష్మస్తే చ రాజపురోహితాః.
బ్రాహ్మణాశ్చ మహాత్మానః సోమపాః సంశితవ్రతాః
పౌరవృద్ధాశ్చ యే తత్ర నివసన్త్యస్మదాశ్రయాః
ప్రసాద్య సర్వే వక్తవ్యాః పాండుః ప్రవ్రజితో వనం.
నిశమ్య వచనం భర్తుర్వనవాసే ధృతాత్మనః
తత్సమం వచనం కుంతీమాద్రీ చ సమభాషతాం.
అన్యేఽపి హ్యాశ్రమాః సంతి యే శక్యా భరతర్షభ
ఆవాభ్యాంధర్మపత్నీభ్యాంసహతప్త్వాతపోమహత్
శరీరస్యాపి మోక్షాయ స్వర్గ్యం ప్రాప్య మహాఫల
పమేవ భవితా భర్తా స్వర్గస్యాపి న సంశయః.
తణిధాయేంద్రియగ్రామం భర్తృలోక పరాయణే
త్యక్తకామసుఖే హ్యావాం తప్స్యావో విపులం తపః
యది చావాం మహాప్రాజ్ఞ త్యక్ష్యసి త్వం విశాంపతే
అద్యైవావాం ప్రహాస్యావో జీవితం నాత్రసంశయః
యదివ్యవసితం హ్యేతద్ యువయోర్ధర్మసంహితమ్
స్వవృత్తిమనువర్తిష్యే తామహం పితురవ్యయామ్
త్యక్త్వాగ్రామ్యసుఖాహారంతప్యమానోమహత్తపః
వల్కలీ ఫలమూలాశీ చరిష్యామి మహావనే.
అగ్నిం జుహ్వన్నుభౌ కాలావుభౌకాలావుపస్పృశన్
కృశః పరిమితాహారశ్చీరచర్మజటాధరః.
శీతవాతాతపసహః క్షుత్పిపాసానవేక్షకః
తపసా దుశ్చరేణేదం శరీరముపశోషయన్.
ఏకాన్తశీలీ విమృశన్ పక్వాపక్వేన వర్తయన్
పితౄన్ దేవాంశ్చవన్యేనవాగ్భిరద్భిశ్చ తర్పయన్.
వానప్రస్థజనస్యాపి దర్శనం కులవాసినామ్
నాప్రియాణ్యాచరిష్యామి కిం పునర్గ్రామవాసినామ్.
ఏవమారణ్యశాస్త్రాణాముగ్రముగ్రతరం విధిమ్
కాంక్షమాణోఽహమాస్థాస్యే దేహస్యాస్య సమాపనాత్.

ఇత్యేవముక్త్వా భార్యే తే రాజా కౌరవనందనః
తతశ్చూడామణిం నిష్కమంగదే కుండలాని చ.
వాసాంసి చ మహార్హాణి స్త్రీణామాభరణాని చ
ప్రదాయ సర్వం విప్రేభ్యః పాండుః పునరభాషత.
గత్వా నాగపురం వాచ్యం పాండుః ప్రవ్రజితో వనం
అర్థం కామం సుఖం చైవ రతిం చ పరమాత్మికాం.
ప్రతస్థే సర్వముత్సృజ్య సభార్యః కురునందనః
తతస్తస్యానుయాత్రాస్తే చైవ పరిచారకాః.
శ్రుత్వా భరతసింహస్య వివిధాః కరుణా గిరః
భీమమార్తస్వరం కృత్వా హాహేతి పరిచుక్రుశుః
ఉష్ణమశ్రు విముంచన్తస్తం విహాయ మహీపతిం
యయుర్నాగపురంతూర్ణంసర్వమాదాయతద్ధనం.
తే గత్వానగరం రాజ్ఞో యథావృత్తం మహాత్మనః

పూర్వకాలంలో పురువంశంలో వ్యుషితాశ్వు డనే పేరుగల మహారాజు ఉండేవాడు. ఆ మహారాజు చేసిన యజ్ఞానికి దేవర్షి సమేతులై ఇంద్రాదు లందరూ విచ్చేశారు. అక్కడి దేవేంద్రుడు సోమపానం చేసి ఆనందంతో ఉన్నాడు. భూరిదక్షిణలతో భూసురులు సంతుష్టులయారు. దేవతలూ బ్రాహ్మణులూ యజ్ఞకార్యాలు శ్రద్ధతో సాగింపజేస్తున్నారు. ఆ మహారాజు యశస్సు దిశాంతాలకు ప్రాకింది. సర్వభూతదయాహృదయంతో ఆ మహారాజు అశ్వమేధయజ్ఞం చేసి రాజులందరిలో సూర్యసముడై ప్రకాశిస్తున్నాడు.

వ్యుషితాశ్వ మహారాజు సముద్ర వలయిత భూమండలం జయించి తండ్రి బిడ్డలను చూసినట్లు ప్రజలను పాలించి పోషిస్తున్నాడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. అగ్నిష్టోమ అత్యగ్నిష్టోమాలు కూడా సాగించాడు. ఆయన ప్రియధర్మపత్ని కాక్షీవతియైన భద్ర. ఆదంపతులు పరస్పరానురాగతరంగిత హృదయాలతో సంతోషంతో చరించేవారు. ఆ మహారాజుకి ఆమెయందు మోహం విపరీతమై అధిక కామవ్యాసంగానికి లోనయిపోయాడు. ఫలితంగా రాజయక్ష్మ ఆయన దేహాన్ని వరించింది. తత్కారణంగా ఆయన మరణించాడు. హృదయవతి భద్ర విపరీతంగా దుఃఖించింది. భర్తృహీనస్త్రీ నిరంతర దుఃఖజీవితం గడుపుతుంది. కనక ఆమె తనను మృతతుల్యగానే భావించుకుంది— పతితోపాటు మరణమే పత్నికి శ్రేయస్కరం. అందుచేతనే నేను మిమ్మల్నే అనుసరిస్తా నంటున్నాను. మీరులేని క్షణం నేను బ్రతకలేను. ఎన్నికష్టాలయినా మీ అడుగుజాడల్లోనే నేనూ వస్తాను. నేను ఏజన్మలో ఏదంపతులకో వియోగం కలిగించడంవల్లనే ఈ ప్రమాదం ఏర్పడింది. లేకపోతే ఇంతటి దుఃఖం ప్రాప్తించేదికాదు. భర్త మరణానంతరం భార్య జీవితం నరకమయమే. మహారాజా! మరణపర్యంతం నేను కుశాసనం మీదనే శోకంతో శయనిస్తాను— అని మృతశరీరాన్ని కౌగిలించుకుని ఆమె రోదిస్తూండగా అదృశ్యవాణి— భద్రా! నువ్వు లేచి వెళ్ళు. ఋతుస్నాతవైన అనంతరం చతుర్దశినాడు కానీ అష్టమినాడు కానీ నీ శయ్యమీద నా యీ శవంతో శయనిస్తే నీకు పుత్రులు కలుగుతారు— అనగా విని భద్ర ఆ శాసనాన్ని అక్షరాలా పాలించి ఆశవంవల్ల ఏడుగురు కుమారులను కన్నది. వారిలో ముగ్గురు సాళ్వదేశాధీశులయారు. నలుగురు మద్రదేశాధిపతులయారు.

అందుచేత పాండుమహారాజా! మీ మనస్సంకల్పంతో నాకు పుత్రదానం చేయండి మీ తపోబలంతో నన్ను అనుగ్రహించండి— అన్నది. కుంతీదేవి.

మహాభారతేతిహాసాంతర్గతమయిన
ఆదిపర్వములోని సంభవపర్వములో
75 వ అధ్యాయము నుండి 120 అధ్యాయము
వరకూ ఆంధ్రవ్యాఖ్యానముతో ఇది
తృతీయ భాగము

కథయాంచక్రిరే రాజ్ఞ స్తద్ ధనం వివిధం దదుః
శ్రుత్వా తేభ్య స్తతఃసర్వంయథావృత్తంమహావనే
ధృతరాష్ట్రో నర శ్రేష్ఠః పాణ్డుమేవాన్వశోచత.
నశయ్యాసనభోగేషు రతిం విన్దతి కర్హిచిత్
భ్రాతృశోకసమావిష్ట స్తమేవార్థం విచిన్తయన్.
రాజపుత్రస్తు కౌరవ్య పాండుర్మూలఫలాశనః
జగామ సహ పత్నీభ్యాం తతో నాగశతం గిరిం.

స చైత్రరథమాసాద్య కాలకూటమతీత్య చ
హిమవ న్తమతిక్రమ్య ప్రయయౌ గన్ధమాదనం.
రక్ష్యమాణో మహాభూతైః సిద్ధైశ్చ పరమర్షిభిః
ఉవాస స మహారాజ సమేషు విషమేషు చ.
ఇన్ద్రద్యుమ్న సరః ప్రాప్య హంసకూటమతీత్య చ
శతశృంగే మహారాజ తాపసః సమతప్యత.

118వ అధ్యాయము సమాప్తం

## నూటపందొమ్మిదవ అధ్యాయం

తత్రాపి తపసి శ్రేష్ఠే వర్తమానః స వీర్యవాన్
సిద్ధచారణసంఘానాం బభూవ ప్రియదర్శనః.
శుశ్రూషురనహంవాదీ సంయతాత్మా జితేన్ద్రియః
స్వర్గం గన్తుం పరాక్రాన్తః స్వేన వీర్యేణ భారత.
కేషాంచిదభవద్ భ్రాతా కేషాంచిదభవత్ సఖా
ఋషయ స్త్వపరే చైనం పుత్రవత్ పర్యపాలయన్.
స తు కాలేన మహతా ప్రాప్య నిష్కల్మషం తపః
బ్రహ్మర్షిసదృశః పాండుర్బభూవ భరతర్షభ.
అమావాస్యాంతుసహితాఋషయఃసంశితవ్రతాః
బ్రహ్మాణం ద్రష్టుకామాస్తే సమ్ప్రతస్థుర్మహర్షయః.
సమ్ప్రయాతానృషీన్ దృష్ట్వా
పాండుర్వచనమబ్రవీత్
భవన్తః క్వగమిష్యన్తి బ్రూత మే వదతాం వరాః.
సమవాయో మహానద్య బ్రహ్మలోకే మహాత్మనాం
దేవానాంచ ఋషీణాంచ పితౄణాంచ మహాత్మనాం
వయంతత్ర గమిష్యామో ద్రష్టుకామాః
స్వయమ్భువం.
పాండురుత్థాయ సహసా గన్తుకామో మహర్షిభిః
స్వర్గపారం తితీర్షుః స శతశృంగాదుదఙ్ముఖః.

ప్రతస్థే సహ పత్నీభ్యామబ్రువం స్తం చ తాపసాః
ఉపర్యుపరి గచ్ఛన్తః శైలరాజముదఙ్ముఖాః.
దృష్టవన్తో గిరా రమ్యే దుర్గాన్ దేశాన్ బహూన్
వయం
విమానశతసమ్బాధాం గీతస్వరనినాదితాం.
ఆక్రీడభూమిం దేవానాం గంధర్వాప్సరసాం తథా
ఉద్యానాని కుబేరస్య సమాని విషమాణి చ.
మహానదీనితంబాంశ్చ గహనాన్ గిరిగహ్వరాన్
సంతి నిత్యహిమా దేశా నిర్వృక్షమృగపక్షిణః.
సంతిక్వచిన్మహాదర్యోదుర్గాఃకాశ్చిద్ దురాసదాః
నాతిక్రామేత పక్షీ యాన్ కుత ఏవేతరే మృగాః.
వాయు రేకో హి యాత్యత్రసిద్ధాశ్చ పరమర్షయః
గచ్ఛన్త్యౌశైలరాజేఽస్మిన్ రాజపుత్ర్యౌకథంత్విమే.
న సీదేతామదుఃఖార్హే మా గమో భరతర్షభ
అగ్రజస్య మహాభాగా న ద్వారం పరిచక్షతే.
స్వర్గే తేనాభితప్తోఽహమప్రజస్తు బ్రవీమి వః
పిత్ర్యాదృణాదనిర్ముక్త స్తేన తప్యే తపోధనాః.
దేహనాశే ధ్రువో నాశః పితౄణామేష నిశ్చయః
ఋణైశ్చతుర్భిఃసంయుక్తాజాయంతేమానవాభువి.

పితృదేవర్షిమనుజైర్దేయం తేభ్యశ్చ ధర్మతః
ఏతాని తు యథాకాలం యో న బుధ్యతి మానవః.
న తస్య లోకాః సంతీతి ధర్మవిద్భిః ప్రతిష్ఠితం
యజ్ఞైస్తు దేవాన్ ప్రీణాతి స్వాధ్యాయతపసా మునీన్.
పుత్రైః శ్రాద్ధైః పితౄంశ్చాపి ఆనృశంస్యేన
మానవాన్
ఋషిదేవమనుష్యాణాం పరిముక్తోఽస్మి ధర్మతః.
త్రయాణామితరేషాం తు నాశ ఆత్మని నశ్యతి
పిత్ర్యాదృణాదనిర్ముక్త ఇదానీమస్మి తాపసాః.
ఇహ తస్మాత్ ప్రజాహేతోః ప్రజాయంతే నరోత్తమాః
యథైవాహం పితుః క్షేత్రే జాతస్తేన మహర్షిణా.
తథైవాస్మిన్ మమ క్షేత్రే కథం వై సంభవేత్ ప్రజా
అస్తి వై తవ ధర్మాత్మన్ విద్మో దేవోపమం శుభం.
అపత్యమనఘం రాజన్ వయం దివ్యేన చక్షుషా
దైవోద్దిష్టం నరవ్యాఘ్ర కర్మణేహోపపాదయ.
అక్లిష్టం ఫలమవ్యగ్రో విందతే బుద్ధిమాన్ నరః
తస్మిన్ దృష్టే ఫలే రాజన్ ప్రయత్నం కర్తుమర్హసి.
అపత్యం గుణసంపన్నం లబ్ధ్వా ప్రీతికరం హ్యసి
తచ్ఛ్రుత్వా తాపసవచః పాండుశ్చింతా
పరోఽభవత్.
ఆత్మనో మృగశాపేన జానన్నుపహతాం క్రియాం
సోఽబ్రవీద్ విజనే కుంతీ ధర్మపత్నీం యశస్వినీం
అపత్యోత్పాదనే యత్నమాపది త్వం సమర్థయ.
అపత్యం నామ లోకేషు ప్రతిష్ఠా ధర్మసంహితా
ఇతి కుంతి విదుర్ధీరాః శాశ్వతం ధర్మవాదినః.
ఇష్టం దత్తం తపస్తప్తం నియమశ్చ స్వనుష్ఠితః
సర్వమేవానపత్యస్య న పావనమిహోచ్యతే.
సోఽహమేవం విదిత్వైతత్ ప్రపశ్యామి శుచిస్మితే
అనపత్యః శుభాల్లోకాన్ న ప్రాప్స్యామీతి
చింతయన్
మృగాభిశాపాన్నష్టం మే జననం హ్యకృతాత్మనః
నృశంసకారిణో భీరు యథైవోపహతం పురా.
ఇమే వై బంధుదాయాదాః షట్ పుత్రా ధర్మదర్శనే
షడేవాబంధుదాయాదాః పుత్రాస్తాఞ్ఛృణు మే పృథే.
స్వయంజాతః ప్రణీతశ్చ తత్సమః పుత్రికాసుతః
పౌనర్భవశ్చ కానీనః భగిన్యాం యశ్చ జాయతే
దత్తః క్రీతః కృత్రిమశ్చ ఉపగచ్ఛేత్ స్వయంచ యః
సహోఢో జ్ఞాతిరేతాశ్చ హీనయోనిధృతశ్చ యః.
పూర్వపూర్వతమాభావం మత్వా లిప్సేత వై సుతం
ఉత్తమాదవరాః పుంసః కాంక్షంతే పుత్రమాపది.
అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విందంతి మానవాః
ఆత్మశుక్రాదపి పృథే మనుః స్వాయంభువోఽబ్రవీత్.
తస్మాత్ ప్రహేష్యామ్యద్య త్వాం హీనః
ప్రజననాత్ స్వయం
సదృశాచ్ఛ్రేయసో వా త్వం విద్ధ్యపత్యం యశస్విని.

119 వ అధ్యాయం సమాప్తం

## నూట ఇరువదవ అధ్యాయము

ఏవముక్తా మహారాజ కుంతీ పాండుమభాషత
కురూణామృషభం వీరం తదా భూమిపతిం పతిం.
న మామర్హసి ధర్మజ్ఞ వక్తుమేవం కథంచన
ధర్మపత్నీమభిరతాం త్వయి రాజీవలోచనే.
త్వమేవ తు మహాబాహో మయ్యపత్యాని భారత
వీర వీర్యోపపన్నాని ధర్మతో జనయిష్యసి.

స్వర్గం మనుజశార్దూల గచ్ఛేయం సహితా త్వయా
అపత్యాయ చ మాం గచ్ఛ త్వమేవ కురునందన.
నహ్యహంమనసాప్యన్యంగచ్ఛేయంత్వదృతేవరం
త్వత్తః ప్రతివిశిష్టశ్చ కోఽన్యోఽస్తి భువి మానవః.
ఇమాం చ తావద్ ధర్మాత్మన్ పౌరాణీం శృణు మే కథాం
పరిశ్రుతాం విశాలాక్ష కీర్తయిష్యామి యామహం.
వ్యుషితాశ్వ ఇతి ఖ్యాతో బభూవ కిల పార్థివః
పురా పరమధర్మిష్ఠః పూరోర్వంశవివర్ధనః.
తస్మింశ్చ యజమానే వై ధర్మాత్మని మహాభుజే
ఉపాగమంస్తతో దేవాః సేంద్రా దేవర్షిభిః సహ.
అమాద్యదింద్రః సోమేన దక్షిణాభిర్ద్విజాతయః
వ్యుషితాశ్వస్య రాజర్షేస్తతో యజ్ఞే మహాత్మనః.
దేవా బ్రహ్మర్షయశ్చైవ చక్రుః కర్మస్వయం తదా
వ్యుషితాశ్వస్తతో రాజన్నతి మర్త్యాన్ వ్యరోచత.
సర్వభూతాన్ ప్రతి యథా తపనః శిశిరాత్యయే
స విజిత్య గృహీత్వా చ నృపతీన్ రాజసత్తమః.
ప్రాచ్యానుదీచ్యాన్ పాశ్చాత్యాన్ దాక్షిణాత్యానకాలయత్
అశ్వమేధే మహాయజ్ఞే వ్యుషితాశ్వః ప్రతాపవాన్.
బభూవ స హి రాజేంద్రో దశనాగబలాన్వితః
అప్యత్ర గాథాం గాయంతి యే పురాణవిదో జనాః.
వ్యుషితాశ్వే యశోవృద్ధే మనుష్యేంద్రే కురూత్తమ
వ్యుషితాశ్వః సముద్రాంతాం విజిత్యేమాం వసుంధరాం.
అపాలయత్ సర్వవర్ణాన్పితా పుత్రానివౌరసాన్
యజమానోమహాయజ్ఞైర్బ్రాహ్మణేభ్యోధనందదౌ.
అనంతరత్నాన్యాదాయ స జహార మహాక్రతూన్
సుషావచబహూన్సోమాన్సోమసంస్థాస్తతాన చ.
ఆసీత్ కాక్షీవతీ చాస్య భార్యా పరమసమ్మతా
భద్రా నామ మనుష్యేంద్ర రూపేణాసదృశీ భువి.
కామయామాసతుస్తౌ చ పరస్పరమితి శ్రుతం
స తస్యాం కామసంపన్నో యక్ష్మణా సమపద్యత.
తేనాచిరేణ కాలేన జగామాస్తమివాంశుమాన్
తస్మిన్ ప్రేతే మనుష్యేంద్రే భార్యాస్య భృశదుఃఖితా.
అపుత్రా పురుషవ్యాఘ్ర విలలాపేతి నః శ్రుతం
భద్రా పరమదుఃఖార్తా తన్నిబోధ జనాధిప.
నారీ పరమధర్మజ్ఞ సర్వా భర్తృవినాకృతా
పతిం వినా జీవతి యా నసా జీవతి దుఃఖితా.
పతిం వినా మృతం శ్రేయో నార్యాః క్షత్రియపుంగవ
త్వద్గతిం గంతుమిచ్ఛామి ప్రసీదస్వ నయస్వమాం.
త్వయా హీనా క్షణమపి నాహం జీవితుముత్సహే
ప్రసాదం కురు మే రాజన్నితస్తూర్ణం నయస్వమాం.
పృష్ఠతోఽనుగమిష్యామి సమేషు విషమేషు చ
త్వామహం నరశార్దూల గచ్ఛంతమనివర్తితుం.
ఛాయేవానుగతా రాజమ్ సతతం వశవర్తినీ
భవిష్యామి నరవ్యాఘ్ర నిత్యం ప్రియహితే రతా.
అద్యప్రభృతి మాంరాజమ్ కష్టా హృదయశోషణాః
అధయోఽభిభవిష్యంతి త్వామృతే పుష్కరేక్షణ.
అభాగ్యయామయానూనంవియుక్తాఃసహచారిణః
తేన మే విప్రయోగోఽయముపపన్నస్త్వయా సహ.
విప్రయుక్తా తు యా పత్యా ముహూర్తమపి జీవతి
దుఃఖం జీవతి సా పాపా నరకస్థేవ పార్థివ.
సంయుక్తావిప్రయుక్తాశ్చపూర్వదేహేకృతామయా
తదిదం కర్మభిః పాపైః పూర్వదేహేషు సంచితం.
దుఃఖం మామనుసంప్రాప్తం రాజంస్త్వద్విప్రయోగజం
అద్యప్రభృత్యహం రాజన్ కుశసంస్తరశాయినీ
భవిష్యామ్యసుఖావిష్టాత్వద్దర్శనపరాయణా.
దర్శయస్వ నరవ్యాఘ్ర శాధి మామసుఖాన్వితాం

కృపణాం చాథ కరుణం విలపంతీం నరేశ్వర.
ఏవం బహువిధం తస్యాం విలపంత్యాం పునః పునః
తం శవం సంపరిష్వజ్యవాక్ కిలాంతర్హితాబ్రవీత్.
ఉత్తిష్ఠ భద్రే గచ్ఛ త్వం దదానీహ వరం తవ
జనయిష్యామ్యపత్యాని త్వయ్యహం చారుహాసిని.
ఆత్మకీయే వరారోహే శయనీయే చతుర్దశీం
అష్టమీం వాఋతుస్నాతా సంవిశేథామయాసహ.

ఏవముక్తా తు సా దేవీ తథా చక్రే పతివ్రతా
యథోక్తమేవ తద్వాక్యం భద్రా పుత్రార్థినీ తదా.
సా తేన సుషువే దేవీ శవేన భరతర్షభ
త్రీన్ శాల్వాంశ్చతురో మద్రాన్ సుతాన్ భరతసత్తమ.
తథా త్వమపి మయ్యేవం మనసా భరతర్షభ
శక్తో జనయితుం పుత్రాం స్తపోయోగబలాన్వితః.

మహాభారతేతిహాసాంతర్గతమయిన
ఆదిపర్వములోని సంభవపర్వములో
75వ అధ్యాయము నుండి 120 అధ్యాయము
వరకూ ఆంధ్రవ్యాఖ్యానముతో ఇది

## తృతీయభాగము

# * ఆంధ్రమహాభారతము *

## ఆదిపర్వము

సంచిక — 4



శ్రీ పురాణపండ రామమూర్తి

# విషయసూచి

ధర్మవిదుడు పాండురాజు కుంతీభాషణం విని దేవసమతేజస్వియైన వృషితాశ్వునివలె తానుకూడా ఒక మార్గం ఉపదేశిద్దామనుకుంటూ ఇలా అన్నాడు— భర్తృవిషయం చెపితే అదే భార్యకు ఆచరణీయం. దాని మంచిచెడ్డల మీమాంస ఆమె కవసరంలేదు. అందులో సంతానవాంఛ కలిగి ఏత దుత్పత్తి శక్తిలోపించిన భర్త అనుశాసిస్తే ఆమార్గం అవశ్యం అనుసరింపదగింది. నేను పుత్రవదన సందర్శనోత్సుహితైనై నిన్ను అర్థిస్తున్నాను. నా ఆజ్ఞానుసారం నువ్వు ఏ మహాతపస్వితోనయినా సంగమించి సుగుణశాలిని ప్రసవించు.

ఆమె పతిహిత ప్రియమనస్వ కనుక— మహారాజా ! భార్య తనమాట వినమని భర్తను నిరోధించకూడదు. అయినా మీకు ఆనందం కలిగించేది కనక నేను చెపుతున్నాను. నా చిన్ననాడు నేను పితృగృహంలో అతిథిసేవాతత్పరతతో ఉండేదాన్ని. ఆరోజులలో ఒక మహర్షి మాయింటికి వచ్చాడు. ఆయనను ప్రజలు దుర్వాసుడని పిలిచేవారు. ఆయన పరమకోపిష్ఠి. ఆమహర్షిని అర్చించి ఆయన అనుగ్రహంతో ఒకవరం పొందాను. ఆమంత్రం జపించి ఎవరిని ఆహ్వానిస్తే వారువచ్చి నా అధీనంలో ఉంటారు. ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు అసత్యవాది అయి ఉండడు. కనక ఇప్పుడు ఆమంత్రం జపిస్తాను. తన్మూలంగా వచ్చే దేవతలవల్ల మనకు పుత్రప్రాప్తి కలుగుతుంది. ఇప్పుడు నేను ఏ దేవతాపురుషుని ఆహ్వానించాలో చెప్పండి— అనగా పాండురాజు సర్వధర్మమూర్తియైన యమధర్మరాజుని ఆహ్వానించ మన్నాడు.

యమధర్మరాజువల్ల కలిగే కుమారుడు కురువంశానికే ధర్మప్రభువవుతాడు. అతని మనస్సు సర్వదా ధర్మమార్గంమీదే నడుస్తుంది. అందుచేత నువ్వు యమధర్మరాజునే ఆహ్వానించు— అనిన మాటలు విని కుంతి భర్తకు ప్రదక్షిణ నమస్కారాలాచరించింది.

121 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది రెండవ అధ్యాయము

హస్తినాపురంలో -

గాంధారి గర్భం ధరించి సంవత్సరం గడిచింది. కుంతీదేవి దుర్వాస మహర్షి ప్రసాదించిన మంత్రోపాసనం చేయటంతో ప్రభాకరసమతేజస్సంపన్నమైన విమానంమీద యమధర్మరాజు వచ్చాడు. కుంతిని చూస్తూనే ఆమెకోరిక ఏమిటని అడిగాడు. కుంతి పుత్రదానం కోరింది. యమప్రభువు అనుగ్రహించాడు. అనంతరం కొంతకాలానికి సూర్యుడు తులారాశిలో చరిస్తూండగా చంద్రుడు జ్యేష్ఠానక్షత్రమందుండగా శుక్లపక్షంలో పూర్ణానామ్ని అయిన పంచమీ దినసాన కుంతీ గర్భాన్నుండి బాలుడు పుట్టాడు. ఆసమయంలో ఆకాశవాణి-ఈబాలుడు ధర్మవిదుడు కాగలడు. ఈ విశాల పృథ్వీస్థలి మీద మహాపరాక్రమవంతుడూ సత్యవాదీ

ఏవముక్తస్తయా రాజా తాం దేవీం పునరబ్రవీత్
ధర్మవిద్ ధర్మసంయుక్తమిదం వచనముత్తమం.
ఏవమేతత్ పురా కుంతీ వ్యుషితాశ్వశ్చకార హ
యథాత్వయోక్తంకల్యాణిసహ్యాసీదమరోపమః.
అథ త్విదం ప్రవక్ష్యామి ధర్మతత్త్వం నిబోధ మే
పురాణమృషిభిర్దృష్టం ధర్మవిద్భిర్మహాత్మభిః.
ధర్మమేవం జనా స్సంతః పురాణం పరిచక్షతే
భర్తాభార్యాం రాజపుత్రిధర్మ్యం వాధర్మ్యమేవవా.
యద్ బ్రూయాత్ తత్తథా కార్యమితి వేదవిదో విదుః
విశేషతః పుత్రగృధ్నీ హీనః ప్రజననాత్ స్వయం.
యథాహమనవద్యాంగి పుత్రదర్శనలాలసః
తథా రక్తాంగుళితలః పద్మపత్రనిభ శ్శుభే.
ప్రసాదార్థం మయా తేఽయం
శిరస్యభ్యుద్యతోఽఞ్జలిః
మన్నియోగాత్ సుకేశాంతే ద్విజాతేస్తపసాధికాత్
పుత్రాన్ గుణసమాయుక్తానుత్పాదయితుమర్హసి
త్వత్కృతేఽహం పృథుశ్రోణిగచ్ఛేయం పుత్రిణాం గతిం.
ఏవముక్తా తతః కుంతీ పాండుం పరపురంజయం
ప్రత్యువాచ వరారోహా భర్తుః ప్రియహితే రతా.
అధర్మ స్సుమహానేష స్త్రీణాం భరతసత్తమ
యత్ ప్రసాదయతే భర్తా ప్రసాద్యః క్షత్రియర్షభ
శృణు చేదం మహాబాహో మమ ప్రీతికరం వచః.
పితృవేశ్మన్యహం బాలా నియుక్తాతిథిపూజనే
ఉగ్రం పర్యచరం తత్ర బ్రాహ్మణం సంశితవ్రతం.
నిగూఢనిశ్చయం ధర్మే యం తం దుర్వాససం విదుః
తమహం సంశితాత్మానం సర్వయత్నైరతోషయం.
స మేఽభిచారసంయుక్తమాచష్ట భగవాన్ వరం
మంత్రం త్విమంచ మే ప్రాదాదబ్రవీచ్చైవమామిదం.
యం యం దేవంత్వమే తేనమంత్రేణావాహయిష్యసి
అకామో వా సకామో వా వశంతేసముపైష్యతి.
తస్యతస్య ప్రసాదాత్ తే రాజ్ఞి పుత్రో భవిష్యతి
ఇత్యుక్తాహం తదానేన పితృవేశ్మని భారత
బ్రాహ్మణస్య వచస్తథ్యం తస్య కాలోఽయమాగతః
అనుజ్ఞాతాత్వయా దేవమాహ్వయేయమహం నృప
తేన మంత్రేణ రాజర్షేయథాస్యాన్నౌప్రజాహితా.
యాం మేవిద్యాంమహారాజఅదదాత్ సమహాయశాః
తయాహూతః సురః పుత్రం ప్రదాస్యతి సురోపమం.
అనపత్యకృతం యస్తే శోకం హి వ్యపనేష్యతి
అపత్యకామ ఏవం స్యాన్మమాపత్యం భవేదితి.
ఆవాహయామి కం దేవం బ్రూహి సత్యవతాం వర
త్వత్తోఽనుజ్ఞాప్రతీక్షాం మాం విద్ధ్యస్మిన్ కర్మణి స్థితాం.
ధనోఽన్వఽస్యనుగృహీతో స్మిత్వం నో ధాత్రీకులస్య హి
నమో మహర్షయే తస్మై యేన దత్తో వరస్తవ.
న చాధర్మేణ ధర్మజ్ఞే శక్యాః పాలయితుంప్రజాః.
అద్యైవ త్వం వరారోహే ప్రయతస్వ యథావిధి
ధర్మమావాహయ శుభే స హి లోకేషు పుణ్యభాక్.
అధర్మేణ న నో ధర్మ స్సంయుజ్యతి కథంచన
లోకశ్చాయం వరారోహే ధర్మోయమితి మన్యతే.
ధార్మికశ్చ కురూణాం స భవిష్యతి న సంశయః
ధర్మేణ చాపి దత్తస్య నాధర్మే రంస్యతే మనః.
తస్మాద్ ధర్మంపురస్కృత్యనియతా త్వం శుచిస్మితే
ఉపచారాభిచారాభ్యాంధర్మమావాహయస్వ వై.
సా తథోక్తా తథేత్యుక్త్వా తేన భర్త్రా వరాంగనా
అభివాద్యాభ్యనుజ్ఞాతా ప్రదక్షిణమవర్తత.

అయి యుధిష్ఠిర నామంతో విఖ్యాతుడవుతాడు— అని పలికింది.

యుధిష్ఠిరుడు కలిగిన కొంతకాలానికి పాండురాజు కుంతిని పిలిచి— దేవీ! క్షత్రియుడు వీర్యపరాక్రమాలవల్ల ఉత్తమత్వాన్ని సాధించుకుంటాడు. కనక నువ్వు మరొక ప్రతాపవంతుడైన కుమారుని ప్రసవించు. యజ్ఞాలలో అశ్వమేధం కాంతిప్రసారక శక్తులలో సూర్యుడూ మానవులలో బ్రాహ్మణుడూ శ్రేష్ఠులైనట్లు బలవంతులలో వాయువు ఘనుడు. కనక వాయుదేవునిద్వారా నువ్వు పుత్రవతివి కావాలి— అనగా కుంతి విధ్యుక్తంగా ఉపాసించి వాయువును ఆహ్వానించింది. ప్రసన్నుడైన వాయుదేవుడు వచ్చి కుంతి వాంఛ తెలిసికొని ఆమెను అనుగ్రహించాడు. వాయుదేవుని అనుగ్రహం వల్ల విశాలదేహుడూ బలిష్ఠుడూ అయిన కుమారుని కుంతి ప్రసవించిన క్షణంలో ఆకాశవాణి— ఈపుత్రుడు బలవంతులలో అగ్రశ్రేణివాడు— అని పలికింది.

భీముడు జన్మించిన దశమదివసాన కుంతి కుమారునితో సరోవరానికి వెళ్ళి తిరిగి వస్తూండగా ప్రక్కనున్న పర్వతగుహనుండి పెద్దపులి గాండ్రిస్తూ వచ్చింది. అదిచూసి పాండురాజు మూడు వాడి బాణాలు వదిలాడు. పులి వికటంగా గర్జిస్తూ పడిపోయింది. కుంతి భయంతో పరుగెత్తడంలో భీముడు జారిపడ్డాడు. ఆ వజ్రశరీరుడు పర్వతశిలల మీద పడ్డాడు. పడిన భీముని తాకిడికి బండలు చూర్ణం కావడంచూసి పాండురాజు చకితుడయాడు. గురుచంద్రులిద్దరూ సింహరాశిలో ఉండగా మిత్రాముహూర్తంలో త్రయోదశి తిథి నాడు సూర్యుడు నడిమింట తీక్ష్ణద్యుతు లీనుతూండగా భీము డిక్కడ జన్మించినప్పుడే హస్తినాపురంలో దుర్యోధనుడు పుట్టాడు.

ఇరువురు కుమారులు కలిగినా పాండురాజుకి తృప్తి కలగలేదు. మరొక నరశ్రేష్ఠుడైన కుమారుడు కలగాలని ఆశించాడు. పురుషప్రయత్నానికి ప్రారబ్ధం తోడుపడితేనే కార్యం సఫలమవుతుంది. అయితే ఈ యత్నసిద్ధికి నేనే మార్గం అవలంబించాలి. సర్వదేవకోటిలో మహేంద్రుడు ప్రముఖుడని విన్నాను. పరాక్రమంలో తేజస్సులో అంతటివాడు లేడు. నేను తపస్సుతో ఇంద్రుని సంతృప్తునిచేసి మరొక కుమారుణ్ణి కంటాను. ఆ కుమారుడు సంగ్రామరంగంలో అజేయుడవుతాడు. త్రికరణశుద్ధిగా తపోదీక్ష సాగించి సాధిస్తాను— అని నిశ్చయించుకొని పాండురాజు మహర్షుల సూచనలతో కుంతికి సాంవత్సరికవ్రతం ఉపదేశించాడు.

మహావీరుడు పాండురాజు స్వయంగా దేవేంద్రుని ఆరాధిస్తూ ఒంటికాలుమీద నిలబడి తీవ్ర తపస్సు చేయసాగాడు. ఆయన తపస్సుకి దేవేంద్రుడు సంతృప్తుడై ప్రత్యక్షమై— పాండురాజా! నేను నీయందు అనుగ్రహంతో త్రిలోకారాధ్యుడైన కుమారుని ఇస్తున్నాను. ఆ బాలుడు గోబ్రాహ్మణ రక్షణ వహించి ఆప్తులకూ హితులకూ సంతోషాన్ని చేకూరుస్తాడు. శత్రుసంతాపకారి అవుతాడు— అని దేవేంద్రుడు అదృశ్యుడయాడు.

దేవేంద్రుని వచనాలు స్మరించుకుంటూ కుంతిని పిలిచి— దేవీ! నేను తీవ్రనిష్ఠతో దేవేంద్రుని ఆరాధించి సంతృప్తుని చేశాను. ఆయన అనుగ్రహం మనమీద ప్రసరించింది. ఈసారి నువ్వు ఆయనను ఆరాధించి వీరశిరోమణికాగల కుమారుణ్ణి ప్రసవించు— అన్నాడు.

## నూటఇరువది రెండవ అధ్యాయం

సంవత్సరధృతే గర్భే గాంధార్యా జనమేజయ
ఆహ్వాయామాస వై కుంతీ గర్భార్థే ధర్మమచ్యుతం.
సా బలిం త్వరితా దేవీ ధర్మాయోపజహార హ
జజాప విధివజ్జప్యం దత్తం దుర్వాససా పురా.
ఆజగామ తతో దేవో ధర్మో మంత్రబలాత్ తతః
విమానే సూర్యసంకాశే కుంతీ యత్ర జపస్థితా.
విహస్య తాం తతో బ్రూయాః కుంతి కిం తే
దదామ్యహం
సా తం విహస్యమానాపి పుత్రం దేహ్యబ్రవీదిదం
సంయుక్తా సా హి ధర్మేణ యోగమూర్తిధరేణహ
లేభే పుత్రం వరారోహా సర్వప్రాణభృతాం హితం.
ఐంద్రే చంద్రసమాయుక్తే ముహూర్తేఽభిజితేఽ
ష్టమే
దివామధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేఽతిపూజితే.
సమృద్ధయశసం కుంతీ సుషావ ప్రవరం సుతం
జాతమాత్రే సుతే తస్మిన్ వాగువాచాశరీరిణీ.
ఏష ధర్మభృతాం శ్రేష్ఠో భవిష్యతి నరోత్తమః
విక్రాంతస్సత్యవాక్ చైవ రాజా పృథ్వ్యాం భవిష్యతి.
యుధిష్ఠిర ఇతి ఖ్యాతః పాండోః ప్రథమజస్సుతః
భవితా ప్రథితో రాజా త్రిషు లోకేషు విశ్రుతః.
యశసా తేజసా చైవ వృత్తేన చ సమన్వితః
ధార్మికం తం సుతం లబ్ధ్వా పాండుస్తాం పునరబ్రవీత్.
ప్రాహుః క్షత్రం బలజ్యేష్ఠం బలజ్యేష్ఠం సుతం వృణు
అశ్వమేధః క్రతుశ్రేష్ఠో జ్యోతిశ్శ్రేష్ఠో దివాకరః.
బ్రాహ్మణో ద్విపదాం శ్రేష్ఠో బలశ్రేష్ఠస్తు మారుతః
మారుతం మరుతాం శ్రేష్ఠం సర్వప్రాణిభిరీడితం.
ఆవాహయ త్వం నియమాత్ పుత్రార్థం వరవర్ణిని
స నో యం దాస్యతి సుతం స ప్రాణబలవాన్ నృషు.
తతస్తథోక్తా భర్త్రా తు వాయుమేవాజుహావ సా
తతస్తామాగతో వాయుర్మృగారూఢో మహాబలః
కిం తే కుంతి దదామ్యద్య బ్రూహి యత్ తే హృది స్థితం.
సా సలజ్జా విహస్యాహ పుత్రం దేహి సురోత్తమ
బలవంతం మహాకాయం సర్వదర్పప్రభంజనం.
తస్మాజ్జజ్ఞే మహాబాహుర్భీమో భీమపరాక్రమః
తమప్యతిబలం జాతం వాగువాచాశరీరిణీ.
సర్వేషాం బలినాం శ్రేష్ఠో జాతోఽయమితి భారత
ఇదమత్యద్భుతం చాసీజ్జాతమాత్రే వృకోదరే.
యదంకాత్ పతితో మాతు శ్శిలాం
గాత్రైర్వ్యచూర్ణయత్
కుంతీ తు సహ పుత్రేణ యాత్వా సురుచిరం సర
స్స్నాత్వా తు సుతమాదాయ దశమేఽహని యాదవీ.
దైవతాన్యర్చయిష్యంతీ నిర్జగామాశ్రమాత్ పృథా
శైలాభ్యాసేన గచ్ఛంత్యాస్తదా భరతసత్తమ.
నిశ్చక్రామ మహాన్ వ్యాఘ్రో జిఘాంసన్
గిరిగహ్వరాత్.
తమాపతంతం శార్దూలం వికృష్యాథ కురూత్తమః
నిర్బిభేద శరైః పాండుస్త్రిభిస్త్రిదశవిక్రమః.
నాదేన మహతా తాం తు పూరయంతం గిరేర్గుహాం
కుంతీ వ్యాఘ్రభయోద్విగ్నా సహసోత్పతితా కిల.
నాన్వబుధ్యత సంసుప్తముత్సంగే స్వే వృకోదరం
తతస్స వజ్రసంఘాతః కుమారో న్యపతద్గిరౌ.
పతతా తేన శతధా శిలా గాత్రైర్విచూర్ణితా
తాం శిలాం చూర్ణితాం దృష్ట్వా పాండుర్విస్మయ
మాగతః.
మఘే చంద్రమసా యుక్తే సింహే చాభ్యుదితే గురౌ

కుంతి భర్త ఆజ్ఞను పాలించింది. దేవేంద్రుడు అనుగ్రహించాడు. ఫాల్గుణమాసంలో ఫల్గునీనక్షత్రంలో కుంతి ప్రసవించినబాలుడు ఫల్గుణనామంతో విఖ్యాతు డయాడు.

ఫల్గుణజననవేళ ఆకాశవాణి మధుర గంభీరగర్జనతో— ఈబాలుడు కార్తవీర్యార్జునునితో సమానమైన పరాక్రమం కలవాడు. పరమశివునితో సమమైన తేజస్సు కలవాడు దేవేంద్రునివలె అజేయుడు. విష్ణుదేవుడు వామనమూర్తియై దేవతాకోటికి సంతోషం కలిగించినట్లు ఈబాలుడు నీకు సంతోషం కలిగిస్తాడు. వీడు మద్ర సోమక చేది కాశీ కరూష సోమకదేశాలు జయించి కురురాజ్యశ్రీని పాలిస్తాడు ఈ వీరుని బాహుబలంతోనే అగ్ని ఖాండవవనం ఆహారంగా తీసికోగలడు. సమస్తరాజ్యాధీశులనూ జయించి మూడు అశ్వమేధాలు చేస్తాడు. పరశురామ సమవీరుడై విష్ణుసదృశ బలపరాక్రమోపేతుడై కీర్తిశాలి అవుతాడు. యుద్ధభూమిలో పరమేశ్వరునికి ప్రమోదం కలిగిస్తాడు. ఆయనవల్ల పాశుపతాస్త్రం పొందుతాడు. దేవతలను బాధించే నివాతకవచులను సంహరిస్తాడు. దివ్యాస్త్రాలు సాధిస్తాడు. మహాజ్ఞాని అవుతాడు— అన్నది.

సూతికాగృహంలో కుంతి మాత్రమేకాక ఆ శతశృంగ పర్వతంమీది తపస్వులూ దేవతలూ కూడా అశరీరవాణి వాక్యాలు విని ఆనందపులకితులయారు. దేవదుందుభులు మ్రోగాయి. పుష్పవర్షం కురిసింది.

నాగజాతిప్రముఖులూ గరుత్మంతుడూ ప్రజాపతులూ భరద్వాజ కశ్యప గౌతమ విశ్వామిత్ర వశిష్ఠ జమదగ్ని అత్రిప్రముఖులూ మరీచి అంగిరస పులస్త్య పులహ క్రతు దక్షులూ గంధర్వాప్సరోభామలూ నానాలంకారభూషితులై వచ్చి అర్జునుని గుణసంకీర్తనం చేశారు. తుంబురుడు మధురంగా గానం ఆరంభించాడు.

భీమసేన ఉగ్రసేన ఊర్ణాయు అనఘ గోపతి ధృతరాష్ట్ర సూర్యవర్చ యుగప తృణప కార్ష్ణి నంది చిత్రరథ శాలిశిర పర్జన్య కలి నారద ఋత్వా బృహత్వ బృహక కరాళ సువర్ణ విశ్వావసు భుమన్యు సుచంద్ర శరు హాహా హూహూ ప్రముఖ గంధర్వులూ అనూచాన అనవద్య గుణముఖ్య గుణావర అద్రిక సోమ మిశ్రకేశి అలంబుష మరీచి శుచిక విద్యుద్వర్ణ తిలోత్తమ అంబిక లక్షణ క్షేమదేవి రంభ మనోరమ అసిత సుబాహు సుప్రియవపు పుండరీక సుగంధ సురస ప్రమాథిని కామ్య శారద్వతి ప్రభృతి అప్సరసలు నర్తించసాగారు.

మేనక కర్ణిక సహజన్య పుంజికస్థల ఋతుస్థల విశ్వాచి ఘృతాచి ఉమ్లోచ ప్రమ్లోచ పూర్వచిత్తి ఊర్వశి ప్రముఖ అప్సరోగణశ్రేణి నర్తనానుకూలంగా గానం చేస్తున్నారు.

ధాత అర్యమ మిత్రావరుణ అంశ భగ వివస్వంత పూష త్వష్ట సవిత పర్జన్య విష్ణువు అనే పేర్లుగల ద్వాదశాదిత్యులూ అర్జున యశోవివర్ధనార్థం విచ్చేశారు.

మృగవ్యాధ సర్ప అజైకపాద అహిర్బుధ్న పినాకి దహన ఈశ్వర కపాలి స్థాణు భగ నామాలుగల ఏకాదశరుద్రులూ అశ్వినీకుమారులూ ఎనమండుగురు వసువులూ విశ్వేదేవ మరుత్ సాధ్యగణాలూ గగనవీథిలో విహరిస్తున్నారు. కర్కోటక కశ్యప తక్షక వాసుకి కుండ ప్రముఖ సర్పవీరులందరూ ఆనందంతో అర్జునుని అవలోకిస్తున్నారు.

దివామధ్యగతే సూర్యే తిథౌ పుణ్యే త్రయోదశే
మైత్రే ముహూర్తే సా కుంతీసుషువేభీమమచ్యుతం
యస్మిన్నహని భీమస్తు జజ్ఞే భరతసత్తమ
దుర్యోధనోఽపి తత్రైవ ప్రజజ్ఞే వసుధాధిప.
జాతే వృకోదరే పాండురిదం భూయోఽన్వచింతయత్
కథం ను మే వరః పుత్రో లోకశ్రేష్ఠో భవేదితి.
దైవే పురుషకారే చ లోకోఽయం సంప్రతిష్ఠితః
తత్ర దైవం తు విధినా కాలయుక్తేన లభ్యతే.
ఇంద్రో హి రాజా దేవానాం ప్రధానఇతి న శ్రుతం
అప్రమేయబలోత్సాహో వీర్యవానమితద్యుతిః.
తం తోషయిత్వా తపసా పుత్రం లప్స్యేమహాబలం
యం దాస్యతి స మే పుత్రం స వరీయాన్ భవిష్యతి.
అమానుషాన్మానుషాంశ్చసంగ్రామే స హనిష్యతి
కర్మణా మనసావాచాతస్మాత్ తప్స్యేమహత్ తపః.
తతః పాండుర్మహారాజో మంత్రయిత్వా మహర్షిభిః
దిదేశ కుంత్యాః కౌరవ్యోవ్రతంసాంవత్సరం శుభం.
ఆత్మనా చ మహాబాహురేకపాదస్థితోఽభవత్
ఉగ్రం స తప ఆస్థాయ పరమేణ సమాధినా.
ఆరిరాధయిషుర్దేవం త్రిదశానాం తమీశ్వరం
సూర్యేణ సహ ధర్మాత్మా పర్యతప్యత భారత.
తం తు కాలేన మహతా వాసవః ప్రత్యపద్యత
పుత్రం తవ ప్రదాస్యామి త్రిషులోకేషు విశ్రుతం.
బ్రాహ్మణానాంగవాంచైవసుహృదాంచార్థసాధకం
దుర్హృదాం శోకజననం సర్వబాంధవనందనం.
సుతంతేఽగ్ర్యం ప్రదాస్యామి సర్వామిత్రవినాశనం
ఇత్యుక్తః కౌరవో రాజా వాసవేన మహాత్మనా.
ఉవాచ కుంతీ ధర్మాత్మా దేవరాజవచ స్స్మరన్
ఉదర్కస్తవ కల్యాణి తుష్టో దేవగణేశ్వరః.
దాతుమిచ్ఛతి తే పుత్రం యథా సంకల్పితం త్వయా
అతిమానుషకర్మాణం యశస్వినమరిందమం.
నీతిమంతం మహాత్మానమాదిత్యసమతేజసం
దురాధర్షం క్రియావంతమతీవాద్భుతదర్శనం.
పుత్రం జనయ సుశ్రోణి ధామ క్షత్రియతేజసాం
లబ్ధః ప్రసాదో దేవేంద్రాత్ తమాహ్వయ శుచిస్మితే.
ఏవముక్తా తత శ్శక్రమాజుహావ యశస్వినీ
అథాజగామ దేవేంద్రో జనయామాస చార్జునం.
ఉత్తరాభ్యాం తు పూర్వాభ్యాం ఫల్గునీభ్యాం తతో దివా
జాతస్తు ఫాల్గునే మాసి తేనాసౌ ఫాల్గున స్స్మృతః.
జాతమాత్రే కుమారే తు వాగువాచాశరీరిణీ
మహాగంభీరనిర్ఘోషా నభో నాదయతీ తదా.
శృణ్వతాంసర్వభూతానాం తేషాంచాశ్రమవాసినాం
కుంతీమాభాష్య విస్పష్టమువాచేదం శుచిస్మితాం.
కార్తవీర్యసమః కుంతి శివతుల్య పరాక్రమః
ఏష శక్ర ఇవాజయ్యో యశస్తే ప్రథయిష్యతి.
అదిత్యా విష్ణునా ప్రీతిర్యథాభూదభివర్ధితా
తథా విష్ణుసమః ప్రీతిం వర్ధయిష్యతి తేఽర్జునః.
ఏషమద్రాన్ వశేకృత్వాకురూంశ్చసహసోమకైః
చేదికాశికరూషాంశ్చ కురులక్ష్మీం వహిష్యతి.
గత్వోత్తరదిశం వీరో విజిత్య యుధి పార్థివాన్
ధనరత్నౌఘమమితమానయిష్యతి పాండవః.
ఏతస్య భుజవీర్యేణ ఖాండవే హవ్యవాహనః
మేదసాసర్వభూతానాంతృప్తింయాస్యతివై పరాం.
గ్రామణీశ్చ మహీపాలానేష జిత్వా మహాబలః
భ్రాతృభి స్సహితో వీరస్త్రీన్ మేధానాహరిష్యతి.
జామదగ్న్యసమః కుంతి విష్ణుతుల్యపరాక్రమః
ఏష వీర్యవతాం శ్రేష్ఠో భవిష్యతి మహాయశాః.
ఏష యుద్ధే మహాదేవం తోషయిష్యతి శంకరం

తార్క్ష్య అరిష్టనేమి గరుడ అరుణ ఆరుణి ప్రభృతి వినతానందనులుకూడా విలోకిస్తున్నారు. ఆ మహోత్సవంలో ఋషులుకూడా ఉన్నారు. వీరందరూ విమానాలమీద పర్వతశిఖరాలమీద ఉన్నారు. ఆ ఉత్సవోత్సాహాలు తిలకించే మునులందరికీ పాండవులమీద ఆదరాభిమానాలు అధికం కాసాగాయి.

రోజులు గడిచాయి.

పాండురాజు హృదయంలో ఒకనాడు మళ్ళీ పుత్రలోభం మొలకెత్తి కుంతీదేవిని పిలిచి చెప్పబోతుండగా ఆయన హృదయం గ్రహించి కుంతి వారిస్తూ యిలా అన్నది.

ప్రమాద పరిస్థితులలో ముగ్గురుబిడ్డలను కనడానికే శాస్త్రం అంగీకరించింది. ఏ స్థితిలోనూ నాలుగోబిడ్డను కనడానికి శాస్త్రం సందివ్వలేదు. అది తెలిసికూడా నాలుగోబిడ్డను కనడానికి ముందడుగువేసే స్త్రీ స్వేచ్ఛాచారిణి అవుతుంది. అయిదో బిడ్డకోసం అర్రులు సాచేది పూర్తిగా జారిణి అవుతుంది. ధర్మవిషయాలు తెలిసిన నువ్వు ఎందుచేత మళ్ళీ అపమార్గాన పడి నన్ను సంతానంకోసం ప్రేరేపిస్తున్నావు.

122 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది మూడవ అధ్యాయము

### నకులసహదేవులు

కుంతికి ముగ్గురుబిడ్డలు కలిగారు.

గాంధారి నూరుగురుబిడ్డల తల్లి అయింది.

మాద్రి హృదయంలో మాతృత్వవాంఛ పొడసూపింది.

ఏకాంతంలో ఉన్న పాండురాజును సమీపించి మహారాజా! తమరు సంతానం కనటానికి అనర్హులైనందుకు కానీ కుంతీదేవికంటె నేను గొప్పదాన్ని అయినా ఆమెనే పట్టమహిషిగా అంగీకరించి నన్ను ద్వితీయపత్నిగా ఉంచినందుకు కానీ నేను చింతించలేదు. గాంధారి నూరుగురుబిడ్డల తల్లి అయినా నామనస్సు లేశమూ బాధపడలేదు. కానీ నాతో సమమైన కుంతీగర్భాన నా ప్రాణనాథుడు పుత్రవంతుడయాడు. నాకే ఆ సౌభాగ్యం ప్రాప్తించలేదని విచారిస్తున్నాను. కుంతికి నాయందు అపారమైన అభిమానం ఉంది. ఆ అభిమానంతో నన్నుకూడా సంతానవతిని చేస్తే అది మీకూ మంగళకరమే. కుంతీదేవి నాకు సవతి కావటంవల్ల ఆమెను అర్థించడానికి నామనస్సు కొద్దిగా బాధపడుతున్నది. మీరే దయతో ఆమెను ప్రోత్సహించండి— అన విని పాండురాజు— తన మనస్సులోకూడా అదేవిషయం కదులుతూన్నదనీ అయితే ఆ ప్రస్తావనవల్ల మాద్రిహృదయం ఎలా పరిణమిస్తుందో గ్రహించలేక పోయాననీ ఈనాటితో ఆ సందేహం నివారణ అయింది కనక కుంతితో ప్రస్తావిస్తే సఫలంకావచ్చుననీ అన్నాడు.

కుంతిని ఏకాంతానికి ఆహ్వానించి— దేవీ! మా వంశం విచ్ఛిన్నం కాకుండా ఉండే ఊహతో

అస్త్రం పాశుపతం నామ తస్మాత్ తుష్టాదవాప్స్యతి
నివాతకవచా నామ దైత్యా విబుధవిద్విష
శ్శక్రాజ్ఞయా మహాబాహుస్తాన్ వధిష్యతి తే సుతః
తథా దివ్యాని చాస్త్రాణి నిఖిలేనాహరిష్యతి
విప్రణష్టాం శ్రియం చాయమాహర్తా పురుషర్షభః.
ఏతామత్యద్భుతాం వాచం కుంతీ శుశ్రావసూతికే
వాచముచ్చారితాముచ్చైస్తాం నిశమ్య తపస్వినాం.
బభూవ పరమో హర్ష శ్శతశృంగనివాసినాం
తథా దేవనికాయానాం సేంద్రాణాంచదివౌకసాం.
ఆకాశే దుందుభీనాం చ బభూవ తుముల స్స్వనః
ఉదతిష్ఠన్మహాఘోషః పుష్పవృష్టిభిరావృతః.
సమవేత్య చ దేవానాం గణాః పార్థమపూజయన్
కాద్రవేయా వైనతేయా గంధర్వాప్సరస స్తథా
ప్రజానాం పతయ స్సర్వే సప్త చైవ మహర్షయః.
భరద్వాజః కశ్యపో గౌతమశ్చ
విశ్వామిత్రో జమదగ్నిర్వసిష్ఠః
యశ్చోదితో భాస్కరేఽభూత్ ప్రణష్టే
సోఽప్యత్రాత్రిర్భగవానాజగామ.
మరీచి రంగిరాశ్చైవ పులస్త్యః పులహః క్రతుః
దక్షప్రజాపతి శ్చైవ గంధర్వాప్సరస స్తథా.
దివ్యమాల్యాంభరధరా స్సర్వాలంకారభూషితః
ఉపగాయంతిబీభత్సుం నృత్యంతేఽప్సరసాంగణాః.
తథా మహర్ష యశ్చాపి జేపు స్తత్ర సమంతతః
గంధర్వైస్సహిత శ్శ్రీమాన్ప్రాగాయతచతుంబురుః.
భీమసేనోగ్రసేనౌచ ఊర్ణాయురనఘ స్తథా
గోపతిర్ధృతరాష్ట్రశ్చ సూర్యవర్చా స్తథాష్టమః.
యుగప స్తృణపః కార్ష్ణిర్నందిశ్చిత్రరథ స్తథా
త్రయోదశ శ్శాలిశిరాః పర్జన్యశ్చ చతుర్దశః.
కలిః పంచదశశ్చైవ నారదశ్చాత్రషోడశః
ఋత్వా బృహత్వాబృహకః కరాలశ్చమహామనాః.
బ్రహ్మచారీబహుగుణః సువర్ణ శ్చేతి విశ్రుతః

విశ్వావసుర్భుమన్యుశ్చ సుచంద్రశ్చ సురు స్తథా.
గీతమాధుర్య సంపన్నౌవిఖ్యాతౌచ హాహాహుహూ
ఇత్యేతేదేవగంధర్వా జగ్ము స్తత్ర నరాధిప
తథైవా ప్సరసో హృష్టా స్సర్వాలంకారభూషితాః
ననృతుర్వై మహాభాగాజగుశ్చాయతాతలోచనాః.
అనూచానానవద్యా చ గుణముఖ్యాగుణావరా
అద్రికా చ తథా సోమా మిశ్రకేశీత్వలంబుషా.
మరీచిశ్శుచికా చైవ విద్యుత్పర్ణా తిలోత్తమా
అంబికా లక్షణాక్షేమా దేవీ రంభామనోరమా.
అసితాచ సుబాహుశ్చ సుప్రియా చవపు స్తథా
పుండరీకా సుగంధా చ సురసా చ ప్రమాథినీ.
కామ్యా శారద్వతీ చైవ ననృతు స్తత్రసంఘశః
మేనకా సహజన్యా చ కర్ణికాపుంజికస్థలా.
ఋతుస్థలాఘృతాచీ చ విశ్వాచీపూర్వచిత్త్యపి
ఉమ్లోచేతి చ విఖ్యాతాప్రమ్లోచేతి చ తాదశా.
ఊర్వశ్యేకాదశీ తాసాం జగుశ్చాయితలోచనాః
ధాతార్యమా చ మిత్రశ్చ వరుణోంశో భగ స్తథా.
ఇంద్రో వివస్వాన్పూషా చ త్వష్టాచసవితాతథా
పర్జన్యశ్చైవ విష్ణుశ్చ ఆదిత్యాద్వాదశాస్మృతాః
మహిమానం పాండవస్య వర్ధయంతోంబరే స్థితాః.
మృగవ్యాధశ్చ సర్పశ్చ నిరృతిశ్చ మహాయశాః
అజైక పాదహిర్బుధ్న్యః పినాకీ చ పరంతప.
దహనోఽథేశ్వరశ్చైవ కపాలీ చ విశాంపతే
స్థాణుర్భగశ్చ భగవాన్ రుద్రా స్తత్ర వతస్థిరే.
అశ్వినౌ వసవశ్చాష్టౌ మరుతశ్చ మహాబలాః
విశ్వేదేవా స్తథా సాధ్యా స్తత్రాసన్పరితస్థితాః.
కర్కోటకోఽథ సర్పశ్చ వాసుకిశ్చ భుజంగమః
కశ్యపశ్చాథ కుండశ్చ తక్షకశ్చ మహోరగః.
ఆయయు స్తపసా యుక్తా మహాక్రోధా మహాబలాః
ఏతే చాన్యే చ బహవ స్తత్ర నాగా వ్యవస్థితాః.

జగత్కళ్యాణదృష్టితో నువ్వు నేను చెప్పబోయే పనిచెయ్యి. త్రిలోకాధిపత్యం వచ్చినా దేవేంద్రుడు కీర్తిప్రియుడై యజ్ఞాలు చేస్తాడనీ విద్యావిదులైన విప్రులు తపోవ్రతపాలకులై కూడా గురుజనులకు సేవలు చేసి కీర్తివృద్ధి చేసుకుంటారనీ రాజర్షులూ తపస్వులూ కూడా యశోధనార్థులై సాహసకార్యాలు చేస్తుంటారు. నువ్వు మాద్రిని అనుగ్రహించి ఆమెకుకూడా సంతానం ప్రసాదించి ఆ మహాత్ములవలెనే కీర్తి దక్కించుకో— అన్నాడు.

పాండురాజు మాటలు విని కుంతీదేవి మాద్రిని పిలిచి మంత్రోపదేశం చేసింది. అనంతరం కుంతి చెప్పినట్లు మాద్రి మనసా అశ్వినీదేవతలను తలచుకొన్న క్షణంలో అశ్వినీదేవతలు మాద్రి ఇచ్ఛానుసారం పుత్రులను ప్రసాదించారు. అనుగ్రహవిశేషంవల్ల మాద్రి ఇరువురుకుమారులను ప్రసవించింది. వారే నకుల సహదేవులు. వారు పుడుతూన్న సమయంలో ఆకాశవాణి యథాపూర్వం ఇలా పలికింది.

ఈ బాలు లిద్దరూ బుద్ధికుశలులై గుణరూపసంపన్ను లవుతారు. తమ శరీరకాంతితో లోకంలో ప్రకాశిస్తారు.

శతశృంగ వాసులయిన మునులందరూ పాండురాజనందనులకు అభిమానంతో జాతకర్మ నామకరణాదులు సకాలంలో సక్రమంగా సాగింపజేసారు. కుంతీదేవి పెద్దకొడుకు యుధిష్ఠిరుడు. రెండవవాడు భీమసేనుడు. మూడవవాడు అర్జునుడు. మాద్రీపుత్రులలో జ్యేష్ఠుడు నకులుడు. ద్వితీయుడు సహదేవుడు. వీరందరూ సంవత్సరాని కొక్కరుగా పుట్టినా దేవాంశకారణంగా అందరూ అయిదేళ్ళ బాలకుల్లా ప్రకాశిస్తున్నారు. బాలకులైదుగురూ ధైర్యవంతులూ పరాక్రమోపేతులూ వీర్యసంపన్నులూ కావటం చూసి పాండురాజు మనస్సు ఆనందకందళితమైంది. శతశృంగ పర్వతంమీద మునులకూ మునిపత్నులకూ కూడా ఆ బిడ్డలు ఆనందం కలిగిస్తూండేవారు. ఆ ప్రకారంగా కాలం నడుస్తున్నది.

పాండురాజు హృదయంలో పుత్రవాంఛ ఇంకా చల్లారలేదు. మరోసారి ఏకాంతంగా కుంతిని పిలిచి మాద్రి గర్భాన మరొక కుమారుని ప్రసాదించమన్నాడు. మహారాజా ! మాద్రికి ఒకకుమారుడు కలగటానికి సావకాశం యిస్తే నన్ను మోసగించి ఇరువురిని కన్నారు. సుగుణవతులు పోరాని మార్గాని ఆమె పోయింది. అశ్వినీకుమారుల నిరువురనూ ఆహ్వానిస్తే ఇద్దరుబిడ్డలు కలుగుతారనే జ్ఞానం నాకు లేకపోయింది. ఇప్పుడు మళ్ళీ నన్ను అటువంటి కార్యానికే వినియోగించవద్దని ప్రార్థిస్తున్నాను—అన్నది కుంతి.

పాండునందనుల దర్శనం ప్రజలకు శీతకిరణదర్శనసదృశంగా ఉండేది. వారందరూ పెరిగి పెద్దవారై కురుకులవర్ధనులై సర్వలక్షణలక్షితులయారు. మహాధనుస్సులు ధరించి సింహాలవలె వారు పరాక్రమంతో చరిస్తూ హిమవత్పర్వతసానువులపై విహరిస్తూ పెరుగుతున్నారు. శతశృంగవాసులైన మునులందరూ పాండునందనులను ఔరసపుత్రులుగా భావిస్తూ ప్రేమతో సాకుతున్నారు.

ద్వారకానగరంలో —

శృతశృంగపర్వతంమీద వీరిలా పెరుగుతున్నారు. అక్కడ ద్వారకలో వృష్ణివంశీయులైన వసుదేవాదులు తమ ప్రసంగాలలో పాండురాజు మునిశాపంవల్లశతశృంగపర్వతంమీద వానప్రస్థాశ్రమంతో ఉంటున్నాడనీ అక్కడి ముని ఋషి

తార్‌క్ష్య శ్చారిష్ట నేమిశ్చ గరుడశ్చా సితధ్వజః
అరుణ శ్చారుణిశ్చైవ వైనతేయా వ్యవస్థితాః.
తాంశ్చదేవగణాన్ సర్వాం స్తపస్సిద్ధా మహర్షయః
విమానగిర్యగ్రగతాన్ దదృశుర్నేతరే జనాః.
తద్దృష్ట్వా మహదాశ్చర్యం విస్మితా మునిసత్తమాః
అధికాం స్మతతో వృత్తి మవర్తన్ పాండవాన్ప్రతి.

పాండుస్తు పునరేవైనః పుత్రలోభా న్మహాయశాః
వక్తుమైచ్ఛ ద్ధర్మపత్నీం కుంతీ త్వేన మథాబ్రవీత్.
నాతశ్చతుర్థం ప్రసవమాపత్స్వపి వదంత్యుత
అతః పరం స్వైరిణీస్యాద్ బంధకీ పంచమే భవేత్.
సత్వం విద్వన్ ధర్మమిమ మధిగమ్య కథం నుమాం
అపత్యార్థం సముత్క్రమ్య ప్రమాదాదివభాషసే.

122 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది మూడవ అధ్యాయము

కుంతీపుత్రేషు జాతేషు ధృతరాష్ట్రాత్మజేషు చ
మద్రరాజసుతా పాండుం రహో వచనమబ్రవీత్.
న మేఽస్తి త్వయి సంతాపో విగుణోఽపి పరంతప
నావరత్వే వరార్హాయాః స్థిత్వా చానఘ నిత్యదా.
గాంధార్యాశ్చైవ నృపతే జాతం పుత్ర శతం తథా
శ్రుత్వా న మే తథా దుఃఖమభవత్ కురునందన.
ఇదం తు మే మహ ద్దుఃఖం తుల్యతాయామపుత్రతా
దిష్ట్యాత్విదానీం భర్తుర్మే కున్త్యామప్యస్తి సంతతిః.
యది త్వపత్యసంతానం కుంతిరాజసుతా మయి
కుర్యాదనుగ్రహోమేస్యాత్ తవచాపిహితంభవేత్.
సంరమ్భో హి సపత్నీత్వాద్వక్తుంకుంతిసుతాం ప్రతి
యదితుత్వంప్రసన్నో మే స్వయమేనాం ప్రచోదయ.
మమాప్యేష సదా మాద్రి హృద్యర్థః పరివర్తతే
న తు త్వాం ప్రసహే వక్తుమిష్టానిష్టవివక్షయా.
తవ త్విదం మతం మత్వా ప్రయతిష్యామ్యతః పరం
మన్యే ధ్రువం మయోక్తా సా వచనం ప్రతిపత్స్యతే.
తతః కుంతీం పునః పాండుర్వివిక్త ఇదమబ్రవీత్
కులస్య మమ సంతానం లోకస్య చ కురు ప్రియం.
మమ చాపిండనాశాయ పూర్వేషామపి చాత్మనః

మత్ప్రియార్థం చ కళ్యాణి కురు కళ్యాణముత్తమం.
యశసోఽర్థాయచైవ త్వం కురు కర్మ సుదుష్కరం
ప్రాప్యాధిపత్యమింద్రేణ యజ్ఞైరిష్టం యశోఽర్థినా.
తథా మన్త్రవిదో విప్రా స్తప స్తప్త్వా సుదుష్కరం
గురూనభ్యుపగచ్ఛన్తి యశసోఽర్థాయ భావిని.
తథా రాజర్షయః సర్వే బ్రాహ్మణాశ్చ తపోధనాః
చక్రురుచ్చావచంకర్మయశసోఽర్థాయ దుష్కరం.
సా త్వం మాద్రీం ప్లవేనేవ తారయైనామనిందితే
అపత్యసంవిభాగేన పరాం కీర్తిమవాప్నుహి.
ఏవముక్తాఽబ్రవీన్మాద్రీం సకృచ్చిన్తయ దైవతం
తస్మాత్ తే భవితాపత్యమనురూపమసంశయం.
తతో మాద్రీ విచార్యైవం జగామ మనసాశ్వినౌ
తావాగమ్యసుతౌ తస్యాం జనయామాసతుర్యమే.
నకులం సహదేవం చ రూపేణాప్రతిమౌ భువి
తథైవ తావపి యమౌ వాఽరువాచాశరీరిణీ.
సత్వరూపగుణోపేతౌ భవతోఽత్యశ్వినావితి
భాసత స్తేజసాత్యర్థం రూపద్రవిణసంపదా.
నామాని చక్రిరే తేషాం శతశృంగనివాసినః
భక్త్యా చ కర్మణా చైవ తథాశీర్భిర్విశాంపతే.

శ్రేష్ఠులను సేవిస్తూ కందమూలఫలాలతో జీవిస్తున్నాడనీ జితేంద్రియుడై తపోదీక్షలో ఉన్నాడనీ క్లేశమయజీవితం గడుపుతున్నాడనీ అనుకుంటూ దుఃఖించసాగారు. వారీవిధంగా ప్రసంగించుకుంటూన్నసమయంలో పాండురాజు పుత్రవంతుడయాడన్నవార్త విన్నారు. వారికి ఆనందం కలిగింది. వారిలో కొందరు పెద్దలు వసుదేవునితో పాండురాజనందనులకు సంస్కారాదికాలు జరిపించడానికి పురోహితుని పంపించమని చెప్పారు. పెద్దల ఆజ్ఞానుసారం వసుదేవుడు ధనధాన్యాదులూ వస్త్రభూషణాలూ గోవులూ కానుకలుగా ఇచ్చి పురోహితుని పంపాడు.

వచ్చిన పురోహితునికి ఎదురేగి పాండురాజు పూజించాడు. కుంతీ మాద్రి వసుదేవుని ఘనంగా ప్రస్తుతించారు. వచ్చిన ద్విజశ్రేష్ఠుడు పాండురాజనందనులకు సర్వ కర్మలూ పరిపూర్తిచేయించాడు. ఉపనీతులై పాండవులు వేదాధ్యయన పరులయారు.

శర్యాతి వంశీయుడైన శుకమహారాజు తన బలపరాక్రమాలతో ధనుర్బాణాలతో భూమండలాన్ని జయించి అశ్వమేధయాగాలు చేసి దేవతలనూ పితృదేవతలనూ పరితృప్తుల్ని చేసి నెమ్మదిగా రాజ్యభోగాలు విడిచి శతశృంగపర్వతానికి తపోదీక్షతో వచ్చాడు. ఆ ధనుర్విద్యాకుశలుడే పాండవులకు అస్త్రవిద్యలో శిక్షణ ఇచ్చి వారిని మహాధనుర్వేదవిదులుగా తీర్చి దిద్దాడు.

యుధిష్ఠిరుడు తోమరం విసరటంలో భీముడు గదాచాలనంలో అర్జునుడు ధనుర్బాణాలు విడవటంలో నకులసహదేవులు డాలుకత్తులతో యుద్ధం చేయటంలో ప్రవీణు లయారు. అర్జునుడు ధనుర్విద్యలో తనతో సమాను డయాడని శుకుడు గ్రహించి శక్తి ఖడ్గ బాణా లిచ్చాడు. తాలప్రమాణమైన ధనస్సూ విచిత్రాయుధాలూ కూడా ఇచ్చాడు. ఆ బాణాల మొదట గ్రద్ధరెక్కలు కట్టబడి ఉన్నాయి. అవి మహాసర్పాల్లా ఉండేవి. సర్వాస్త్రవిద్యాకుశలుడైన అర్జునుడు తనసాటి రాజు లేడని భావించేవాడు. జలాలలో పద్మాలవలె ధార్తరాష్ట్రులూ పాండవులూ దినదిన ప్రవర్ధమానులై యౌవను లయారు.

123 వ అధ్యాయంసమాప్తం

## నూటఇరువది నాల్గవ అధ్యాయం

### మాద్రి సహగమనము

అయిదుగురు కుమారులనూ చూచుకుంటూ పాండుమహారాజు ఆ అరణ్యప్రాంతంలో హాయిగా గడుపుతున్నాడు. అర్జునునికి పద్నాలుగో సంవత్సరం వచ్చింది. ఉత్తరఫల్గునీనక్షత్రదినాన భూసురులందరూ స్వస్తి పలుకుతున్నారు. వారందరి భోజనభాజనాలూ స్వయంగా చూచుకొనే కుంతీదేవి పాండురాజును గూర్చి ఆ క్షణాలలో శ్రద్ధ తీసికోలేకపోయింది.

అదే క్షణాన పాండురాజు మనస్సు కామమోహిత మయింది. మాద్రిని వెంటబెట్టుకొని తన ఆశ్రమం విడిచి దూరంగా సాగాడు.

జ్యేష్ఠం యుధిష్ఠిరేత్యేనం భీమసేనేతి మధ్యమం
అర్జునేతి తృతీయం చ కుంతీపుత్రానకల్పయన్.
పూర్వజం నకులేత్యేవం సహదేవేతి చాపరం
మాద్రీపుత్రావకథయం స్తే విప్రాః ప్రీతమానసాః.
అనుసంవత్సరం జాతా అపి తే కురుసత్తమాః
పాండుపుత్రా వ్యరాజన్త పంచ సంవత్సరా ఇవ.
మహాసత్వా మహావీర్యా మహాబలపరాక్రమాః
పాండుర్దృష్ట్వా సుతాంస్తాంస్తు దేవరూపాన్
మహౌజసః.

ముదం పరమికాం లేభే ననన్ద చ నరాధిపః
ఋషీణామపి సర్వేషాం శతశృంగనివాసినామ్.
ప్రియా బభూవుస్తాసాం చ తథైవ మునియోషితాం
కుస్తీమథ పునః పాండుర్మాద్ర్యర్థేసమచోదయత్.
తమువాచ పృథా రాజన్ రహస్యుక్తా తదా సతీ
ఉక్తా సకృ ద్ద్వన్ద్వమేషా లేభే తేనాస్మి వంచితా.
బిభేమ్యస్యాః పరిభవాత్ కుస్త్రీణాం గతిరీదృశీ
నాజ్ఞాసిషమహం మూఢాద్వన్ద్వాహ్వానేఫలద్వయం.
తస్మాన్నాహంనియోక్తవ్యాత్వయైషోఽస్తువరోమమ
ఏవం పాండోః సుతాః పంచదేవదత్తా మహాబలాః.
సంభూతాః కీర్తిమంతశ్చ కురువంశ వివర్ధనాః
శుభలక్షణసంపన్నాః సోమవ త్ప్రియదర్శనాః.
సింహదర్పా మహేష్వాసాః సింహవిక్రాంతగామినః
సింహగ్రీవా మనుష్యేన్ద్రా వవృధుర్దేవవిక్రమాః.
వివర్ధమానా స్తే తత్ర పుణ్యే హైమవతే గిరౌ.
విస్మయం జనయామాసుర్మహర్షీణాం సమేయుషాం.
జాతమాత్రానుపాదాయ శతశృంగనివాసినః
పాండోఃపుత్రానమన్య న్తతాపసాఃస్వానివాత్మజాన్.
తతస్తు వృష్ణయః సర్వే వసుదేవపురోగమాః
పాండుః శాపభయాద్భీతః శతశృంగముపేయివాన్.
తత్రైవముభినిః సార్థం తాపసోఽభూత్ తపశ్చరన్
శాకమూలఫలాహార స్తపస్వీ నియతేంద్రియః.

ధ్యానయోగపరో రాజా బభూవేతి చ వాదకాః
ప్రబ్రువంతి స్మ బహవ స్తచ్ఛ్రుత్వా శోకకర్శితాః.
పాండోఃప్రీతిసమాయుక్తాఃకదాశ్రోష్యామసత్కథాః
ఇత్యేవం కథయన్త స్తే వృష్ణయః సహ బాంధవైః.
పాండోఃపుత్రాగమంశ్రుత్వాసర్వేహర్ష సమన్వితాః
సభాజయన్త స్తేఽన్యోన్యంవసుదేవంచోఽబ్రువన్.
నభవేరన్ క్రియాహీనాఃపాండోఃపుత్రామహాయశః
పాండోఃప్రియహితాన్వేషీప్రేషయత్వం పురోహితం.
వసుదేవ స్తథేత్యుక్త్వా విససర్జ పురోహితం
యుక్తాని చ కుమారాణాం పారిబర్హాణ్యనేకశః.
కుంతీం మాద్రీం చ సందిశ్య దాసీదాసపరిచ్ఛదం
గాశ్చ రౌప్యం హిరణ్యంచప్రేషయామాసభారత.
తాని సర్వాని సంగృహ్య ప్రయయౌసపురోహితః
తమాగతం ద్విజశ్రేష్ఠం కాశ్యపం వై పురోహితం.
పూజయామాస విధివత్ పాండుః పరపురంజయః
పృథామాద్రీచసంహృష్టేవసుదేవంప్రశంసతాం
తతఃపాండుఃక్రియాస్సర్వాఃపాండవానామకారయత్
గర్భాధానాదికృత్యాని చౌలోపనయనాని చ.
కాశ్యపః కృతవాన్ సర్వముపాకర్మ చ భారత
చౌలోపనయనాదూర్ధ్వమృషభాక్షా యశస్వినః.
వైదికాధ్యయనే సర్వే సమపద్యంత పారగాః
శర్యాతేః పృషతః పుత్రః శ్శుకో నామ పరంతపః.
యేన సాగరపర్యంతా ధనుషా నిర్జితా మహీ
అశ్వమేధశతై రిష్ట్వా స మహాత్మామహామఖైః.
ఆరాధ్య దేవతాః సర్వాః పిత్ౄనపి మహామతిః
శతశృంగే తప స్తేపే శాకమూలఫలాశనః.
తేనోపకరణశ్రేష్ఠైః శిక్షయా చోపబృంహితాః
తత్ప్రసాదాద్ధనుర్వేదే సమపద్యంత పారగాః.
గదాయాం పారగో భీమస్తోమరేషు యుధిష్ఠిరః
అసిచర్మణి నిష్ణాతౌ యమౌ సత్వవతాం వరౌ.
ధనుర్వేదే గతః పారం సవ్యసాచీ పరంతపః

వసంతఋతుశోభతో అలరారే ఆ పరిసరారణ్యంలో పాండురాజు కామచిత్తంతో విహరిస్తున్నాడు. తిలక పలాశ రసాల చంపక తరువులన్నీ వికసిత పుష్పాలతో సౌరభం వెదజల్లుతున్నవి. అతని హృదయం సంతోషంతో నిండిపోయింది. సుందర వస్త్రాలతో యౌవనదేహంతో ఏకాంతంలో ఉన్న మాద్రిని చూసేకొద్దీ పాండురాజు మనస్సు కామావిల మయిపోయింది. సాంద్రారణ్యంలో దావాగ్నిలా అది ప్రజ్వలిస్తున్నది. మాద్రి ఎంత వారించినా పాండురాజు కామాన్ని ఆపలేక బలవంతంగా ఆమెను ఆలింగనం చేసికొన్నాడు. ఆ క్షణంలో పాండురాజు తన శాపంకూడా మరిచిపోయాడు.

యముడే కామరూపంలో పాండురాజుని ఆవహించాడు. మాద్రిని ఆలింగనం చేసికొన్నక్షణంలో ఆయన ప్రాణం పోయింది. ఆ బిగికౌగిలిలో మాద్రి దుఃఖిస్తున్నది. ఆక్షణానికే కుంతి బిడ్డలైదుగురూ వెంటరాగా ఆ ప్రదేశానికి వచ్చింది. వస్తూన్న కుంతిని చూసి— అక్కా! పిల్లలను తీసికొనిరాకు. నువ్వు ఒంటరిగారా—అన విని కుంతీదేవి అత్యంత దుఃఖంతో బిడ్డలను అక్కడే విడిచి వచ్చింది. వస్తూనే వారిరువురినీ చూసి కుంతి మరింతగట్టిగా రోదించసాగింది. కొంతసేపటికి తేరుకుని— మాద్రీ! మహావీరుడైన పాండురాజుని నేటివరకూ రక్షిస్తూ వచ్చాను. శాపవిషయం తెలిసికూడా మీరిద్దరూ ఎలా కలిశారు. ఆయనను రక్షించుకోవలసిన బాధ్యత నీమీద ఉండగా ఆయనను ఏకాంతంలో కలిసే సావకాశం ఎలా ఇచ్చావు. అయినా ఒక విధంగా నువ్వు అదృష్టవంతురాలవు. ఆనంద ప్రఫుల్లమైన ఆయన ముఖచంద్రుని దర్శించగలిగావు— అని కుంతి అన్నది.

అక్కా! నేను ఎంతో ప్రయత్నించాను. కానీ ఋషి శాపవాక్యం వ్యర్థం చేయకూడదనే తలంపుతో కాబోలు ఆయన నన్ను నిర్బంధించారు— అని మాద్రి పలికింది. మొదలు నరికిన చెట్టులా కుంతి కుప్పకూలిపోయింది. స్మృతి రహితంగా ఉన్న కుంతిని సేదదీర్చి మాద్రి ఆమెను లేవనెత్తి పాండు రాజును చూపింది. కుంతి లేస్తూనే పాండురాజు పాదాలమీద పడింది. ఆయన మోములో చిరునవ్వు చూస్తూంటే ప్రసంగించే సంకల్పంలోఉన్నట్టున్నాడు.

కుంతీ మాద్రి లిద్దరూ పాండురాజు మృతశరీరాన్ని గాఢంగా ఆలింగనం చేసికొని కన్నీరు విడువ సాగారు. అకస్మాత్తుగా ఇంకిపోయిన సముద్రంలా అస్తంగతుడైన సూర్యుడులా కనిపించిన పాండురాజును చూసి మునులందరూ విచారించారు. పాండునందనులనూ రాణులనూ అక్కడి భూసురులు ఓదార్చ సాగారు.

మహారాజా! నా దౌర్భాగ్యం ఎవరితో చెప్పుకోను. మమ్మల్నందరినీ ఎవరికి కప్పగించి వెళ్ళిపోయావు. మాద్రితో ఒంటరిగా ఎందుకిలా వచ్చావు. ఈరోజుతో నా సౌభాగ్యం మాసిపోయింది. ఈ పసిబిడ్డలందరినీ ఎవరి స్వాధీనంలో ఉంచి వెళ్ళిపోయావు. దేవతాప్రియుడవైన నీతో మేముకూడా స్వర్గానికే వస్తున్నాం— అని పదేపదే కుంతి విలపించ సాగింది. పాండవులూ రాణులూ అచేతనులై నేలమీద పడిపోయారు. మరికొంత సేపటికి తేరుకొని— మాద్రీ! నేను పట్టమహిషిని. ధర్మరీత్యా సర్వహక్కులూ నాకే ప్రథమంగా లభిస్తాయి. మృతుడైన భర్తను నేనే అనుసరిస్తాను. నువ్వు పిల్లలను చూసుకో. ఐహిక వాంఛలేమీ

శుకేన సమనుజ్ఞాతో మత్సమోఽయమితిప్రభో.
అనుజ్ఞాయ తతో రాజా శక్తిం ఖడ్గం తథా శరాన్
ధనుశ్చ దదతాం శ్రేష్ఠః తాలమాత్రం మహాప్రభం.
విపాఠక్షురనారాచాన్ గృధ్రపత్రైరలంకృతాన్
దదౌ పార్థాయ సంహృష్టో మహోరగసమప్రభాన్.
అవాప్య సర్వశస్త్రాణి ముదితో వాసవాత్మజః
మేనే సర్వాన్ మహీపాలాన్ అపర్యాప్తాన్ స్వతేజసః.
ఏకవర్షాంతరాస్త్వేవం పరస్పరమరిందమాః
అన్వవర్ధంత పార్థాశ్చ మాద్రీపుత్రౌ తథైవ చ.
తే చ పంచ శతం చైవ కురువంశవివర్ధనాః
సర్వే వవృధురల్పేన కాలేనాప్స్వివ నీరజాః.

123వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది నాల్గవ అధ్యాయము

దర్శనీయాంస్తతఃపుత్రాన్పాండుః పంచమహావనే
తాన్ పశ్యన్ పర్వతే రమ్యే స్వబాహుబలమాశ్రితః
పూర్ణే చతుర్దశే వర్షే ఫాల్గునస్య చ ధీమతః
తదా ఉత్తరఫల్గున్యాం ప్రవృత్తే స్వస్తివాచనే.
రక్షణే విస్మృతా కుంతీ వ్యగ్రా బ్రాహ్మణభోజనే
పురోహితేన సహితా బ్రాహ్మణాన్ పర్యవేషయత్
తస్మిన్ కాలేసమాహూయమాద్రీంమదనమోహితః
సుపుష్పితవనే కాలే కదాచిన్మధుమాధవే
భూతసమ్మోహనే రాజా సభార్యో వ్యచరద్వనం.
పలాశైస్తిలకైశ్చూతైశ్చంపకైః పారిభద్రకైః
అన్యైశ్చ బహుభిర్వృక్షైః ఫలపుష్పసమృద్ధిభిః.
జలస్థానైశ్చ వివిధైః పద్మినీభిశ్చ శోభితం
పాండోర్వనం తత్ సంప్రేక్ష్య ప్రజజ్ఞే హృది మన్మథః.

ప్రహృష్టమనసం తత్ర విచరంతం యథామరం
తం మాద్ర్యనుజగామైకా వసనం బిభ్రతీ శుభం.
సమీక్షమాణః స తు తాం వయఃస్థాం తనువాససం
తస్య కామః ప్రవవృధే గహనేఽగ్నిరివోద్గతః.
రహస్యేకాంతుతాందృష్ట్వారాజారాజీవలోచనాం
న శశాక నియంతుం తం కామం కామవశీకృతః.
తత ఏనాం బలాద్ రాజా నిజగ్రాహ రహోగతాం
వార్యమాణస్తయాదేవ్యావిస్ఫురంత్యాయథాబలం.
స తు కామపరీతాత్మా తం శాపం నాన్వబుధ్యత
మాద్రీం మైథునధర్మేణ సోఽన్వగచ్ఛద్బలాదివ.
జీవితాంతాయ కౌరవ్య మన్మథస్య వశం గతః
శాపజం భయముత్సృజ్య విధినా సంప్రచోదితః.
తస్యకామాత్మనోబుద్ధిః సాక్షాత్ కాలేనమోహితా
సంప్రమథ్యేంద్రియగ్రామం ప్రణష్టా సహ చేతసా.
స తయా సహ సంగమ్య భార్యయా కురునందనః
పాండుః పరమధర్మాత్మా యుయుజే కాలధర్మణా.
తతో మాద్రీ సమాలింగ్య రాజానం గతచేతసం
ముమోచ దుఃఖజం శబ్దం పునః పునరతీవహి.
సహ పుత్రైస్తతః కుంతీ మాద్రీపుత్రౌచపాండవౌ
ఆజగ్ముః సహితాస్తత్ర యత్ర రాజా తథాగతః.
తతో మాద్ర్యబ్రవీద్ రాజన్నార్తాకుంతీమిదంవచః
ఏకైవ త్వమిహాగచ్ఛ తిష్ఠన్త్వత్రైవ దారకాః.
తచ్ఛ్రుత్వావచనంతస్యాస్తత్రైవాధాయదారకాన్
హతాహమితి విక్రుశ్యసహసైవాజగామ సా.

నాకు లేవు. నేను ఈయనతో మరణించి పిరపత్ని నవుతాను— అన్నది కుంతి.

అక్కా! నువ్వు పెద్దదానివి కనక నాకు అనజ్ఞ ఇయ్యి. నేను ఏవిధమైన తృప్తినీ పొందలేక పోయాను. కనక ఆయనతో నే నే వెడితాను. పైగా నావల్లనే ఆయన మరణించారు. నేను స్వర్గం చేరి ఆయన కామవాసన తీర్చాలి. అంతేకాక ఈ బిడ్డలందరినీ నేను చూడలేను. నువ్వే ఉండి వీరందరినీ కాపాడుకో— అని మాద్రి విలపించ సాగింది.

ఆ ప్రాంతాలలోని ఋషులందరూ చేరి వారికి ధైర్యం చెప్పి ఓదారుస్తూ బిడ్డలింకా పసివారని వారిని అలావదిలేసి దేహత్యాగం చెయ్యడానికి వీల్లేదని భర్తతో మరణించడం ఫలప్రదమే అయినా అంతటిఘోరం చెయ్యనవసరంలేదనీ అంటూవారు మార్గాంతరం సూచిస్తున్నారు— భర్త లేని స్త్రీ బ్రహ్మచర్య నియమంతో త్రికరణశుద్ధిగా చాంద్రాయణాదివ్రతపాలనం చేస్తూ ఉప్పూకారం వదిలేసి క్రమంగా శరీరాన్ని శుష్కింపచేసుకుంటూ భర్తనే స్మరించుకుంటూ అందరినీ ఉద్ధరిస్తుంది.

ఇప్పుడు యీ బిడ్డలను హస్తినాపురం చేర్చి అక్కడ ధృతరాష్ట్రుడికి అప్పగిస్తాం. ధృతరాష్ట్రుడు లోభి. వీరికి ధర్మం జరగనివ్వడు. అయినా అటు వృష్ణివంశీయులూ కుంతిభోజుడూ ఇటు మాద్రి సోదరుడు శల్యుడూ వీరిని రక్షించగలరు—అన్నారు.

అది విని కుంతీదేవి పాండురాజు ఆజ్ఞవలెనే విప్రశ్రేష్ఠుల ఆనతికూడా శిరోధార్యమేననీ తాను వారు చెప్పినట్లే చేసి తనకూ బిడ్డలకూ శ్రేయస్సు కలిగించుకుంటాననీ అన్నది.

అరుంధతిని మించిన బుద్ధిమతి మా అక్క కుంతీదేవి. ఆవిడ శిశుపోషణలో రక్షణలో నిపుణురాలు. వృష్ణివంశీయులూ కుంతిభోజుడూ ఆమెకు అండదండలు. కనక ఆమె జీవించి ఉంటే తనబాధ్యతలు నెరవేరుస్తుంది. అక్కా! నువ్వు పాండురాజు దేవేరివి కనక నాకు అనుమతి ఇయ్యి. నేను సంయోగసుఖంతో పరితృప్తి పొందలేదు. ఆయనతో స్వర్గం వెళ్ళిపోతాను. ధర్మసత్యమార్గ నిరతుడూ కృతజ్ఞతామూర్తి అయిన ఆయన సేవతోనే నేను జీవిస్తాను— అని మాద్రి కుంతికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి తనబిడ్డ లిద్దరినీ అప్పగించి మహర్షులకు తలవంచి నమస్కరించి బిడ్డలందరినీ కౌగిలించుకొని శిరస్సు ముద్దాడి యుధిష్ఠిరుని చేయి పట్టుకుని మిగిలిన బిడ్డలవైపు చూస్తూ: అందరికీ తల్లి కుంతియేననీ, తాను పాలిచ్చి పెంచే దాదినని పాండురాజు మరణించినా ధర్మరాజే అందరికీ పితృతుల్యుడనీ ఎల్లప్పుడూ గురువృద్ధజన సేవ మానరాదనీ సత్యధర్మపరులై చరించాలనీ సోమరితనం తగదనీ అలా చేసినట్లయితే ఏవిధమైన అవమాన పరాజయాలూ అంటవనీ బోధించింది.

ఋషులకూ కుంతికీ పదేపదే నమస్కరించి: అక్కా! నీ సౌభాగ్యం నేను వర్ణించలేను. ఈ అయిదుగురు బిడ్డల బలపరాక్రమాలనూ చూసే అదృష్టం నీకు పట్టింది. నువ్వు నాకు అనుజ్ఞయిస్తే ధర్మమార్గాన స్వర్గమూ కీర్తీ నాకు లభిస్తాయి— అని మాద్రి కోరగా కుంతి అనుమతిస్తూ— అనేక వర్షాలు భర్తతో దివ్యభోగాలనుభవించు— అన్నది. మాద్రి తన శరీరాన్ని కూడా పాండురాజుతో చితిపై ఉంచమని చెపుతూ బిడ్డలను జాగ్రత్తగా చూడమంది.

వృష్ట్వా పాండుం చ మాద్రీంచ శయానౌధరణీతలే
కుంతీ శోకపరీతాంగీ విలలాప సుదుఃఖితా.
రక్ష్యమాణో మయా నిత్యం వీరః సతతమాత్మవాన్
కథం త్వామత్యతిక్రాంతః శాపం జానన్ వనౌకసః.
నను నాను త్వయా మాద్రి రక్షితవ్యో నరాధిపః
సా కథం లోభితవతీ విజనే త్వం నరాధిపం.
కథం దీనస్య సతతం త్వామాసాద్య రహోగతాం
తం విచింతయతః శాపం ప్రహర్షః సమజాయత.
ధన్యాత్వమసి బాహ్లీకి మత్తో భాగ్యతరా తథా
దృష్టవత్యసి యద్వక్త్రం ప్రహృష్టస్య మహీపతేః.
విలపన్త్యామయా దేవి వార్యమాణేన చాసకృత్
ఆత్మా న వారితోఽనేన సత్యం దిష్టం చికీర్షుణా.
తస్యాస్తద్వచనం శ్రుత్వా కుంతీ శోకాగ్ని తాపితా
పపాత సహసా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః.
నిశ్చేష్టా పతితా భూమౌ మోహాన్నైవ చచాలసా
కుంతీముత్థాప్య మాద్రీ చ మోహేనావిష్టచేతనాం
ఏహ్యేహీతి తాం కుంతీం దర్శయామాస కౌరవం.
పాదయోః పతితా కుంతీ పునరుత్థాయ భూమిపం
సస్మితేన తు వక్త్రేణ గదంతమివ భారత.
పరిరభ్య తదా మోహాద్విలలాపాకులేంద్రియా
మాద్రీ చాపి సమాలింగ్య రాజానం విలలాప సా.
తం తథాధిగతం పాండుమృషయః సహ చారణైః
అభ్యేత్యసహితాఃసర్వేశోకాదశ్రూణ్యవర్తయత్.
అస్తం గతమివాదిత్యం సుశుష్కమివ సాగరం
దృష్ట్వాం పాండుం నరవ్యాఘ్రం శోచంతి స్మ
మహర్షయః.
సమానశోకా ఋషయః పాండవాశ్చ బభూవిరే
తే సమాశ్వాసితే విప్రైః విలేపతురనిందితే.
హా రాజన్ కస్య నోహిత్వా గచ్ఛసి త్రిదశాలయం
హా రాజన్ మమ మందాయాః కథం మాద్రీ
సమేత్య వై.
నిదనం ప్రాప్తవాన్ రాజన్
మద్భాగ్యపరిసంక్షయాత్
యుధిష్ఠిరంమసేన మర్జునం చ యమావుభౌ.
కస్య హిత్వా ప్రియాన్ పుత్రాన్ ప్రయాతోఽసి
విశాంపతే
నూనం త్వాంత్రిదశా దేవాః ప్రతినందంతి భారత.
యథా హి తప ఉగ్రం తే చరితం విప్రసంసది
ఆవాభ్యాం సంహితో రాజన్ గమిష్యసి దివం శుభం.
ఆజమీఢాజమీఢానాం కర్మణా చరితాం గతిం
విలపిత్వా భృశం త్వేవం నిఃసంజ్ఞే పతితే భువి,
యుధిష్ఠిరముఖాః సర్వే పాండవా వేదపారగాః
తేఽప్యాగత్య పితుర్మూలే నిఃసంజ్ఞాః పతితా భువి.
పాండోః పాదౌ పరిష్వజ్య విలపంతి స్మ పాండవాః
అహం జ్యేష్ఠా ధర్మపత్నీ జ్యేష్ఠం ధర్మఫలం మమ.
అవశ్యంభావినో భావాన్మా మాం మాద్రినివర్తయ
అన్విష్యామీహ భర్తారమహం ప్రేతవశం గతం.
ఉత్తిష్ఠత్వంవిసృజ్యైనమిమాన్‌పాలయదారకాన్
అవాప్య పుత్రాన్లబ్ధాత్మా వీరపత్నీత్వమర్థయే.
అహమేవానుయాస్యామి భర్తారమపలాయినం
న హి తృప్తాస్మి కామానాం జ్యేష్ఠా
మామనుమన్యతాం.
మాం చాభిగమ్య క్షీణోఽయం
కామాద్భరతసత్తమః
తముచ్ఛింద్యామస్య కామం కథం ను యమసాదనే.
న చాప్యహం వర్తయంతీ నిర్విశేషం సుతేషు తే
వృత్తిమార్యేచరిష్యామిస్పృశేదేనస్తథాచమాం.
తస్మాన్మే సుతయోః కుంతి వర్తితవ్యం స్వపుత్రవత్
మాం చ కామయమానోఽయం రాజా
ప్రేతవశం గతః.

ఈవిధంగా పలికి మాద్రి పాండురాజు కాష్ఠ మీాద పడింది. అనంతరం కర్మవిదులంతా కూడి నెయ్యి పెరుగూ పాలూ బియ్యం నువ్వులూ నిం డిన కుండతో పాటు పరశువ్వూ అశ్వమేధాగ్ని తెప్పించి దహనసంస్కారం సాగించారు. నూతన వస్త్రాలు ధరించి యుధిష్ఠిరుడు నివాపాంజలు లర్పిం చాడు. శతశృంగవాసుల పర్యవేక్షణలో దహనా దిక క్రియలు పూర్తి అయాయి.

124 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది ఐదవ అధ్యాయము

ఈమహారాజు రాజ్యం విడిచి ఇంతకాలం మన రక్షణలో ఉన్నాడు. ఈనాడు బిడ్డలతో భార్యను విడిచి స్వర్గానికి వెళ్ళిపోయాడు. ఇప్పుడు మనం ఆ మహారాజు అస్థికలనూ బిడ్డలనూ కుంతినీ వెంట బెట్టుకొని హస్తినాపురం చేరి వారికి అప్పగించడం ధర్మం— అని నిశ్చయించుకొని అక్కడి మునులు ఉత్తరక్షణంలో బయలుదేరారు. కుంతికి కొంత కష్ట మనిపించినా పుత్రప్రేమకు తోడు స్వజనం దగ్గరకు వెడుతున్నామనే సంతోషంతో మార్గాయాసం సన్న గిల్లింది. కురుజాంగలదేశం ప్రవేశించి వర్ధమాన ద్వారం చేరాక మునులు ద్వారపాలుర నుద్దేశించి మహారాజుకి తమరాక తెలియజేయ మనగా వారు సమాచారం అందచేశారు. చారణులతో మునులు హస్తిపురి చేరినవార్త వింటూనే నగరనారీజనం ద్వారసమీాపానికి చేరారు. ఎందరో రాజులు వాహనాలమీాద వచ్చారు. అన్నిజాతులవారూ మహర్షులను దర్శించటానికి వచ్చారు.

భీష్మ సోమదత్త బాహ్లీక ధృతరాష్ట్ర సంజయ విదురులూ సత్యవతీ గాంధారీ వచ్చారు. దుర్యో ధనాదులు వందమందీ వచ్చారు. అందరూ తలలు వంచి ఋషులకు నమస్కరించారు. పురోహిత సహితులైన కౌరవులు ఋషుల సరసన కూర్చు న్నారు. జను లందరూ నిశ్శబ్దంగా ఉన్న సమ యంలో భీష్ముడు వచ్చిన ఋషులకు మర్యా దానుసారం అర్ఘ్యపాద్యా లర్పించి రాజ్యసమా చారాలు నివేదించాడు.

వచ్చిన మహర్షులలో వృద్ధుడు అందరి అనుమ తినీ తీసికొని—భీష్మా! తమ కుమారుడయిన పాండు రాజు విషయభోగాలు పరిత్యజించి శతశృంగపర్వ తానికి వచ్చాడు. ఆ మహాత్ము డక్కడ కంద మూల ఫలాలతో జీవిస్తూ విధ్యుక్తంగా తీవ్రమ యిన తపస్సు చేశాడు. బ్రహ్మచర్య వ్రతపరాయ ణుడై ఉండగా ఒకానొక అలౌకిక కారణంవల్ల యమధర్మరాజు ఈ ధర్మరాజుని పాండురాజుకి పుత్రుడుగా ప్రసాదించాడు. బహుబలిష్ఠుడైన ఈ భీముడు వాయుదేవుని అనుగ్రహంవల్ల కలిగాడు. ఇంద్రుని అంశవల్ల అర్జునుడు కలిగాడు. మహాధను ర్ధరులను తిరస్కరించగల శక్తి ఇతనిది. అశ్వనీ దేవతల అనుగ్రహంవల్ల మాద్రికి ఈబిడ్డ లిద్దరూ కలిగారు. అత్యంత తేజస్సంపన్నులైన వీరి పేర్లు నకుల సహదేవులు.

ధర్మతత్పరుడైన పాండురాజు అరణ్యవాసియైనా తన వంశాన్ని ఉద్ధరించాడు. ఈ పిల్లలందరూ వేదాధ్యయనపరులు. వీరందరినీ విడిచి పాండు

ఋషయస్తాన్ సమాశ్వాస్య పాండవాన్ సత్యవిక్రమాన్
ఊచుఃకుంతీంచమాద్రీంచసమాశ్వాస్యతపస్వినః.
సుభగే బాలపుత్రే తు న భర్తవ్యం కథంచన
పాండవాంశ్చాపినేష్యామఃకురురాష్ట్రంపరంతపాన్.
అధర్మేష్వర్థజాతేషు ధృతరాష్ట్రశ్చ లోభవాన్
న కదాచిన్న వర్తేత పాండవేషు యథావిధి.
కుంత్యాశ్చ వృష్ణయో నాథాః కుంతిభోజ స్తథైవ చ
మాద్ర్యాశ్చ బలినాం శ్రేష్ఠః శల్యో భ్రాతా మహారథః
భర్త్రా తు మరణం సార్థం ఫలవన్నాత్ర సంశయః
యువాభ్యాందుష్కరంచైతద్వదంతిద్విజపుంగవాః.
మృతే భర్తరియా సాధ్వీ బ్రహ్మచర్యవ్రతే స్థితా
యమైశ్చ నియమైః శ్రాంతా మనోవాక్కాయజైః శుభైః.
వ్రతోపవాసనియమైః కృచ్ఛ్రైశ్చాంద్రాయణాదిభిః
భూశయ్యాం క్షారలవణవర్జనం చైకభోజనం.
యేన కేనాపి విధినా దేహశోషణతత్పరా
దేహపోషణసంయుక్తా విషయైర్హృతచేతనా.
దేహవ్యయేన నరకం మహదాప్నోత్యసంశయః
తస్మాత్సంశోషయేద్దేహం విషయా నాశమాప్నుయుః.
బర్తారం చింతయంతీ సా భర్తారం నిస్తరేచ్ఛుభా
తారితశ్చాపి భర్త్రా స్యాదాత్మా పుత్ర స్తథైవ చ
తస్మాజ్జీవితమేవైతద్ యువయోర్విద్మ శోభనం.
యథా పాండోశ్చ నిర్దేశః తథా పిపృగణస్య చ
ఆజ్ఞా శిరసి నిక్షిప్తా కరిష్యామి చ తత్ తథా.
యథాఽహుర్భగనంతో హి తన్మన్యే శోభనం పరం
భర్తుశ్చ మమ పుత్రాణాం మమ చైవ న సంశయః.

కుంతీ సమర్థా పుత్రాణాం యోగక్షేమస్యధారణే
అన్యా హి న సమా బుద్ధ్యా యద్యపి స్యాదరుంధతీ.
కుంత్యాశ్చ వృష్ణయో నాథాః కుంతిభోజ స్తథైవచ
నాహం త్వమివ పుత్రాణాం సమర్థాధారణే తథా.
సాహం భర్తారమన్వేష్యే అతృప్తా నన్వహం తథా
భర్తృలోకస్య తు జ్యేష్ఠాదేవీ మామనుమన్యతాం.
ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సత్యధర్మస్య ధీమతః
పదౌ పరిచరిష్యామి తదార్యే హ్యనుమన్యతాం
ఏవముక్త్వా మహారాజ మద్రరాజసుతా శుభా
దత్వా కుంత్యై యమౌ మాద్రీ శిరసాభిప్రణమ్య చ.
అభివాద్య ఋషీన్ సర్వాన్ పరిష్వజ్యచ పాండవాన్
మూర్ధ్న్యుపఘ్రాయ బహుశః పార్థానాత్మసుతౌతథా
హస్తే యుధిష్ఠిరం గృహ్య మాద్రీవాక్యమభాషత.
కుంతీమాతాఅహంధాత్రీయుష్మాకంతుపితామృతః
యుధిష్ఠిరః పితా జ్యేష్ఠశ్చతుర్ణా ధర్మతః సదా.
వృద్ధానుశాసనేసక్తాః సత్యధర్మపరాయణాః
తాదృశా నవినశ్యంతి నైవ యాంతి పరాభవం.
తస్మాత్ సర్వేకురుధ్వంవై గురువృత్తిమతంద్రితాః
ఋషీణాం చ పృథాయాశ్చ నమస్కృత్య స్నుషాపునఃపునః
ఆయాసకృపణా మాద్రీ ప్రత్యువాచ పృథాంతథా.
ధన్యా త్వమసి వార్ష్ణేయినాస్తి స్త్రీ సదృశీ త్వయా
వీర్యంతేజశ్చయోగంచమాహాత్మ్యంచయశస్వినాం
కుంతి ద్రక్ష్యసి పుత్రాణాంపంచానామమితౌజసాం
ఋషీణాం సంనిధావేషాం మయా వాగభ్యుదీరితా.
స్వర్గం దిదృక్షమాణాయాఃమమైషానవృథాభవేత్
ఆర్యా చాప్యభివాద్యా చ మమ పూజ్యాచసర్వతః.
జ్యేష్ఠా వరిష్ఠాత్వం దేవి భూషితా స్వగుణైఃశుభైః
అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి త్వయా యాదవనందినీ.
ధర్మంస్వర్గంచకీర్తిం చత్వత్కృతేఽహమవాప్నుయాం
యథా తథా విధత్స్వేహ మాచకార్షీర్విచారణాం.

రాజు పదిహేడు రోజులక్రితం పితృలోకాలకు పోయాడు. అగ్నిముఖంగా ఆయనకు ఆహుతులు అర్పిస్తుండగా మాద్రి ఆ చితిమీదనే తన దేహాన్ని త్యజించింది. వారిరువురికీ జరపవలసిన కర్మకాండ జరిపించండి. మీ అధీనంలోకి వచ్చిన కుంతినీ, పాండవుల్నీ స్వీకరించి అనుగ్రహించండి. ఇదుగో ఇవి మరణించినవారి అస్థికలు. వీటినికూడ పుచ్చుకోండి. సపిండీకరణపర్యంతం ప్రేతకార్యం పూర్తి కావటంతో పాండురాజుకి పితృమేధలాభంకలగాలి- అని పలికాడు.

కౌరవు లందరూ చూస్తూండగా ఆ మహర్షులు అంతర్ధానం అయారు. గంధర్వనగరంలా క్షణంలో మాయమైపోయిన వారిని చూసి కౌరవులు ఆశ్చర్యపోయారు.

125వ అధ్యాయంసమాప్తం

## నూట ఇరువది ఆరవ అధ్యాయము

ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి మాద్రికీ పాండురాజుకీ రాజోచితంగా సంస్కారాలు చేయించమన్నాడు. వస్త్ర రత్న పశు ధన దానాలన్నీ యథావిధిగా సాగించమనీ కుంతి ఏం తల్చుకుంటే అవన్నీ జరిపించమనీ వాయువు సూర్యుడూ చూడని రీతిగా వారి అస్థికలు వస్త్రంతో కప్పించమనీ అన్నాడు.

ప్రశంసా పాత్రుడైన పాండురాజు దేవసములైన కుమారుల్ని పొందాడు— అని ధృతరాష్ట్రుడు పలుకగా విని విదురుడు భీష్మసహితుడై దహన సంస్కారార్థం బయలుదేరాడు. పుష్పాలతో సుగంధాలతో అలంకరించిన వాహనంమీద అస్థికలుంచి వస్త్రంతో ఆచ్ఛాదించి మంత్రి బాంధవ సోదరులు పరివేష్టించి రాగా బయలుదేరారు విదురాదులు. ఆ వాహనంమీద శ్వేతచ్ఛత్రం అలరారుతోంది. చామరాలు వీస్తున్నారు. సర్వవిధవాద్యాలూ మోగుతున్నాయి. ఆ దినాన పురప్రజలు విరివిగా దానాలు చేశారు. శ్వేతచ్ఛత్రాలూ చామరాలూ వస్త్రాలూ తీసుకొనివచ్చి అగ్నిలో వేస్తున్నారు. నాలుగు జాతులవారూ విచారవదనాలతో 'శిబిక' వెంట సాగుతున్నారు. వారందరూ పాండురాజు తమ్మ అనాధుల్ని చేసి శాశ్వతదుఃఖంలో ముంచేసి వెళ్ళిపోయాడు— అని రోదించసాగారు. భీష్మవిదురులుకూడా కంట తడి పెట్టకుండా ఉండలేకపోయారు.

నెమ్మదిగా 'శిబిక' గంగాతీరం చేరింది. సమతలప్రదేశంమీద 'శిబిక' ను ఉంచారు. ఆ అస్థికలు తీసి సుగంధాలువేసి అగరు ధూపంతో అర్చించారు. చందనచర్చచేసి బంగారు పాత్రలతో తెచ్చిన నీటితో సోదరబాంధవులందరూ అభిషేకించారు. అగరుతో కూడిన చందనంతో అలంకరించి శ్వేతవస్త్రాలు కప్పారు. వస్త్రాచ్ఛాదనలో ఆ అస్థికలు సజీవమానవునివలెనే శోభిస్తున్నాయి. పురోహితులు అశ్వమేధాగ్నితో వేదమంత్రోచ్చారణతో సమస్తక్రియలూ పరిపూర్తి చేయించారు. సుగంధద్రవ్యాలతో యుధిష్ఠిరుని ద్వారా విధిపూర్వకంగా దహనసంస్కారం జరిగింది. ఆసమయంలో అంబాలిక పుత్రశోకంతో

బాష్పసందిగ్ధయా వాచా కుంత్యువాచ యశస్వినీ
అనుజ్ఞాతాసి కల్యాణి త్రిదివే సంగమోఽస్తు తే.
భర్త్రా సహ విశాలాక్షి క్షిప్రమద్యైవ భామిని
సంగతా స్వర్గలోకే త్వం రమేథాః శాశ్వతీః సమాః.
రాజ్ఞః శరీరేణ సహ మమాపీదం కలేవరం
దగ్ధవ్యం సుప్రతిచ్ఛన్న మేతదార్యే ప్రియం కురు.
దారకేష్వప్రమత్తా చ భవేథాశ్చ హితా మమ
అతోఽన్యన్న ప్రపశ్యామి సందేష్టవ్యం హి కించన.
ఇత్యుక్త్వా తం చితాగ్నిస్థం ధర్మపత్నీ నరర్షభం
మద్రరాజసుతా తూర్ణమన్వారోహద్ యశస్వినీ.

తతః పురోహితః స్నాత్వా ప్రేతకర్మణి పారగః
హిరణ్యశకలాన్యాజ్యం తిలాన్ దధి చ తండులాన్,
ఉదకుంభం సపరశుం సమానీయ తపస్విభిః
అశ్వమేధాగ్నిమాహృత్య యథాన్యాయం సమంతతః.
కాశ్యపః కారయామాస పాండోః ప్రేతస్య తాం
క్రియాం.
అహతాంబరసంవీతో భ్రాతృభిః సహితోఽనఘః
ఉదకం కృతవాంస్తత్ర పురోహితమతే స్థితః.
అర్హాతస్తస్య కృత్యాని శతశృంగనివాసినః
తాపసా విధివచ్చక్రుశ్చారణా ఋషిభిః సహ.

124వ అధ్యాయం సమాప్తం

## నూట ఇరువది ఐదవ అధ్యాయము

పాండోరుపరమం దృష్ట్వా దేవకల్పా మహర్షయః
తతో మంత్రవిదః సర్వే మంత్రయాంచక్రిరే మిథః.
హిత్వా రాజ్యం చ రాష్ట్రం చ స మహాత్మా మహా
యశాః
అస్మిన్ స్థానే తపస్తప్తుం తాపసాన్ శరణం గతః.
స జాతమాత్రాన్ పుత్రాంశ్చ దారాంశ్చ భవతామిహ
ప్రాదాయోపనిధిం రాజా పాండుః స్వర్గమితో గతః.
తస్యేమానాత్మజాన్ దేహం భార్యాం చ సుమహాత్మనః
స్వరాష్ట్రం గృహ్య గచ్ఛామో ధర్మ ఏష హి నః స్మృతః.
తే పరస్పరమామంత్ర్య దేవకల్పా మహర్షయః
పాండోః పుత్రాన్ పురస్కృత్య నగరం నాగసాహ్వయం
ఉదారమనసః సిద్ధా గమనే చక్రిరే మనః
భీష్మాయ పాండవాన్ దాతుం ధృతరాష్ట్రాయ చైవ హి
తస్మిన్నేవ క్షణే సర్వే తానాదాయ ప్రతస్థిరే
పాండోర్దారాంశ్చ పుత్రాంశ్చ శరీరే తే చ తాపసాః.

సుఖినీ సా పురా భూత్వా సతతం పుత్రవత్సలా
ప్రపన్నా దీర్ఘమధ్వానం సంక్షిప్తం తదమన్యత.
సా త్వదీర్ఘేణ కాలేన సంప్రాప్తా కురుజాంగలం
వర్ధమానపురద్వారమాససాద యశస్వినీ.
ద్వారిణం తాపసా ఊచూ రాజానం చ ప్రకాశయ
తే తు గత్వా క్షణేనైవ సభాయాం వినివేదితాః.
తం చారణసహస్రాణాం మునీనామాగమం తదా
శ్రుత్వా నాగపురే నౄణాం విస్మయః సమపద్యత.
ముహూర్తోదిత ఆదిత్యే సర్వే బాలపురస్కృతాః
సదారాస్తాపసాన్ ద్రష్టుం నిర్యయుః పురవాసినః.
స్త్రీసంఘాః క్షత్రసంఘాశ్చ యానసంఘ సమాస్థితాః
బ్రాహ్మణైః సహ నిర్జగ్ముర్బ్రాహ్మణానాం చ
యోషితః.
తథా విట్శూద్రసంఘానాం మహాన్ వ్యతికరోఽభవత్
న కశ్చిదకరోదీర్ష్యామభవన్ ధర్మబుద్ధయః.

మూర్ఛపోయింది. ఆమెను చూసి నగరవాసులూ జానపదులూ దుఃఖంతో వెక్కి వెక్కి ఏడువ సాగారు. కుంతీదేవి తీవ్రంగా దుఃఖించింది. ఆమె దుఃఖం పశుపక్ష్యాదులను కూడ కదలించింది. భీష్మ విదుర కౌరవులు దుఃఖాన్ని ఆపుకోలేక పోయారు. ఇంతసేపు ఏడ్చి వారందరూ జలాంజలు లిచ్చారు. పాండవులు తండ్రికోసం మరీ అధికంగా విచారించారు. అనంతరం వారిని ఓదార్చారు ప్రజలూ ప్రభువులూ పన్నెండు రోజులవరకూ పాండవులతో పాటు హస్తినాపురవాసులందరూ భూమి మీదనే నిద్రించారు. ఆబాలగోపాలం ఆపన్నెండు రోజులూ దుఃఖసాగరంలో మునిగిపోయింది.

126 వ అధ్యాయంసమాప్తం

## నూట ఇరువదిఏడవఅధ్యాయము

భీష్మ ధృతరాష్ట్ర కుంతీదేవులు అమృతస్వరూపమైన స్వధామయశ్రాద్ధదానం పాండురాజుకోసం చేశారు. విప్రశ్రేష్ఠులకు సంతర్పణలు చేయించి రత్నరాసులతో పాటు ఉత్తమగ్రామాలు కూడ దానం చేశారు. శౌచనివృత్తులై స్నానశుద్ధులైన పాండవులను వెంటబెట్టుకొని నగరప్రవేశం చేశారు.

శ్రాద్ధక్రియలు పరిసమాప్తి అయిన అనంతరం దుఃఖంలో ఉన్న వారిని ఓదార్చే సంకల్పంతో వ్యాసులవారు విచ్చేసి తల్లియైన సత్యవతితో ఇలా అంటున్నారు!

అమ్మా ! సుఖమయకాలం గడిచిపోయింది. చెడురోజులు వస్తున్నాయి. భయంకరవిపత్తు అదృశ్యంగా భావిలో ఉన్నది. భూమికి యౌవనం గతించింది. గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్. మాయ సర్వత్రా అధికారం సాగించేరోజులు వస్తున్నాయి. ప్రపంచం దోషమయ మౌతోంది. సదాచార ధర్మ కర్మలు లోపిస్తాయి. ధార్తరాష్ట్రుల అన్యాయంతో సర్వవీరనాశనం జరుగుతుంది. ఈ ఉపద్రవం నీకళ్ళముందు జరగకుండా నువ్వు మోహాన్ని ఆశ్రయించి అరణ్యానికి పోయి తపస్సు చేసికో. రానున్న హింసకాండ నీ కళ్ళతో నువ్వు చూడకు.

సత్యవతి వ్యాసుని మాటలు విని లోపలికి వెళ్ళి కోడలిని పిలిచి- అంబికా ! నీ మనుమని అన్యాయ దృష్టివల్ల భరతవంశంతోపాటు మహావీరు లందరూ మరణిస్తారని విన్నాను. నే నింక ఇక్కడ ఉండదల్చుకోలేదు. పుత్రశోకంతో విచారించే అంబాలికతో నేను అరణ్యానికి వెడుతున్నాను. నీకు శుభమగుగాక- అన్నది. అంబిక తానుకూడ అత్తగారితో వస్తానంది. సత్యవతి భీష్మునితో సంప్రదించి కోడళ్ళను వెంటబెట్టుకొని అరణ్యానికి నడిచింది. అక్కడ వారు ముగ్గురూ తపస్సుతో శరీరాన్ని కృశింపజేసి అభీష్టసిద్ధి పొందారు.

పాండవులకు వేదోక్తంగా సంస్కారాలు జరిగాయి. వారు రాజభోగా లనుభవిస్తూ దుర్యోధనాదులతో ఆడుకొంటూ ప్రవృద్ధు లౌతున్నారు. పరుగు పందెములలో, అన్నపానాదులలో, పాద ఘట్టన క్రీడలలో భీమసేనుడు దుర్యోధనాదులను మర్దించేవాడు. కౌరవు లందరినీ పట్టుకొని వారి తలలతో పాండవుల తలలు 'ఢీ' కొటేవాడు.

తథా భీష్మః శాంతనవః సోమదత్తోఽథ బాహ్లికః
ప్రజ్ఞాచక్షుశ్చ రాజర్షిః క్షత్తా చ విదురః స్వయం.
సాచ సత్యవతీ దేవీ కౌసల్యా చ యశస్వినీ
రాజదారైః పరివృతా గాంధారీ చాపి నిర్యయౌ.
ధృతరాష్ట్రస్య దాయాదా దుర్యోధనపురోగమాః
భూషితా భూషణైశ్చిత్రైః శతసంఖ్యా వినిర్యయుః
తాన్ మహర్షిగణాన్ దృష్ట్వా శిరోభిరభివాద్య చ
ఉపోపవివిశుః సర్వే కౌరవ్యాః సపురోహితాః.
తథైవ శిరసా భూమావభివాద్య ప్రణమ్య చ
ఉపోపవివిశుః సర్వే పౌరా జానపదా అపి.
తమకూజమభిజ్ఞాయ జనౌఘం సర్వశస్తదా
పూజయిత్వా యథాన్యాయం పాద్యేనార్ఘ్యేణ చ
ప్రభో.
భీష్మో రాజ్యం చ రాష్ట్రం చ మహర్షిభ్యో న్యవే
దయత్

తేషామథో వృద్ధతమః ప్రత్యుత్థాయ జటాజినీ
ఋషీణాం మతమాజ్ఞాయ మహర్షిరిదమబ్రవీత్.
యః స కౌరవ్యదాయాదః పాండుర్నామ నరాధిపః
కామభోగాన్ పరిత్యజ్య శతశృంగమితోగతః.
స యథోక్తం తపస్తేపే తత్ర మూలఫలాశనః
పత్నీభ్యాం సహధర్మాత్మాకంచిత్ కాలమతంద్రితః.
తేన వృత్తసమాచారైస్తపసా చ తపస్వినః
తోషితాస్తాపసా స్తత్ర శతశృంగనివాసినః.
బ్రహ్మచర్యవ్రతస్థస్య తస్య దివ్యేన హేతునా
సాక్షాత్ ధర్మాదయంపుత్రస్తత్రజాతో యుధిష్ఠిరః.
తథైనం బలినాం శ్రేష్ఠం తస్య రాజ్ఞో మహాత్మనః
మాతరిశ్వా దదౌ పుత్రం భీమం నామ మహాబలం.

పురుహూతాదయం జజ్ఞే కుంత్యామేవ ధనంజయః
యస్య కీర్తిర్మహేష్వాసాన్ సర్వానభిభవిష్యతి.
యౌ తు మాద్రీమహేష్వాసావసూతపురుషోత్తమౌ
అశ్విభ్యాం పురుషవ్యాఘ్రావిమౌ తావపి పశ్యత.
నకులః సహదేవశ్చ తావప్యమిత తేజసౌ
పాండవౌ నరశార్దూలావిమావప్యపరాజితౌ.
చరతా ధర్మనిత్యేన వనవాసం యశస్వినా
నష్టః పైతామహో వంశః పాండునా పునరుద్ధృతః.
పుత్రాణాం జన్మవృద్ధిం చ వైదికాధ్యయనాని చ
పశ్యంత, సతతం పాండోః పరాం ప్రీతిమవాప్స్యథ.
వర్తమానః సతాం వృత్తే పుత్రలాభమవాప్య చ
పితృలోకం గతః పాండురితః సప్తదశేఽహని.
తం చితాగతమాజ్ఞాయ వైశ్వానర ముఖే హుతం
ప్రవిష్టా పావకం మాద్రీ హిత్వా జీవితమాత్మనః.
సా గతా సహ తేనైవ పతిలోకమనువ్రతా
తస్యాస్తస్య చ యత్కార్యం క్రియతాం
తదనన్తరమ్

పృథాం చ శరణం ప్రాప్తాం పాండవాంశ్చ యశస్వినః.
యథావదనుగృహ్ణంతు ధర్మో హ్యేష సనాతనః
ఇమే తయోః శరీరే ద్వే పుత్రాశ్చేమే తయోర్వరాః
క్రియాభిరనుగృహ్యన్తాం సహమాత్రా పరంతపాః.
ప్రేతకార్యే నివృత్తే తు పితృమేధం మహాయశాః
లభతాం సర్వధర్మజ్ఞః పాండుః కురుకులోద్వహః.
ఏవముక్త్వా కురూన్ సర్వాన్ కురూణామేవపశ్యతాం
క్షణేనాంతర్హితాః సర్వే తాపసా గుహ్యకైః సహ.
గంధర్వనగరాకారం తత్రైవాంతర్హితం పునః
ఋషిసిద్ధగణం దృష్ట్వా విస్మయం తే పరం యయుః.
కౌరవాః సహసోత్పత్య సాధు సాధ్వితి విస్మితాః.

ఇది 125 వ అధ్యాయము సమాప్తం

దుర్యోధనాదులు మహాబలిష్ఠులే అయినా భీముడు వారందరినీ లొంగదీసేవాడు. వారి జట్టు పట్టుకొని వారు ఏడుస్తున్నా విడవకుండా నేలమీద పడవేసి ఈడ్చేవాడు. స్నాన సమయంలో తన రెండు భుజాలక్రిందా పదిమందిని నీటిలో ముంచి ఉంచేవాడు. వారు ఉక్కిరి బిక్కిరయే సమయంలో వదిలేవాడు. చెట్ల మీద కౌరవు లుండగా కాలితో వాటిని తన్నేవాడు. ఆతాపుకి చెట్టుమీంచి కాయల్లా వారు క్రిందపడేవారు. పరుగులో కుస్తీలలో కౌరవులందరూ భీముని ద్వేషించినా అతనితో సమంగా ఉండలేకపోయారు. భీముడు స్పర్థతో వారిని బాధించేవాడు. ద్వేషంతో భీముడీపనులు చేయులేదు. బాల్య క్రీడలుగా మాత్రం చేసేవాడు. దుర్యోధనునిలో ఈర్ష్యకు భీమునిబలం అంకురార్పణచేసింది. తత్కారణంగా దుర్యోధనుడు దుష్టబుద్ధియై ధర్మదూరుడై పాపకర్మరతుడై పెరగసాగాడు. అతడు తన సోదరులతో సంప్రదించి బలిష్ఠుడైన భీముడు కౌరవశతాన్ని ఏకైకవీరుడుగానే హింసిస్తున్నాడు కనక ఎలా అయినా బంధించాలని నిశ్చయించాడు. ఉద్యానవనంలో నిద్రపోయే భీమున్ని గంగలో పారేసి అనంతరం ధర్మరాజునీ అర్జునుణ్ణీ బంధించి రాజ్యం అంతా తానే పాలించాలని నిశ్చయించుకున్నాడు.

అవకాశంకోసం ఎదురుచూచే దుర్యోధనుడు గంగానదీతీరంలో ఉన్నిగుడ్డతో నూలు బట్టలతో విచిత్రమైన విశాలగృహాలు నిర్మింపజేసి సర్వసామగ్రి అందులో ఉంచాడు. ఆగృహాలలో రకరకాల గదులు నిర్మింపజేశాడు. ప్రమాణకోటి తీర్థం దగ్గర ఈ ఏర్పాట్లన్నీ చేయించి ఆ స్థలానికి 'ఉదకక్రీడనము' అని పేరు పెట్టాడు. పాకశాస్త్ర ప్రవీణులు మంచి మంచి వంటకాలు సిద్ధంచేశారు. ఏర్పాట్లన్నీ పూర్తయాయని దుర్యోధనుడు తెలిసికొని పాండవులను పిలిచి గంగాతీరాన సుందరోద్యానవనాలలో క్రీడించి జలవిహారం చేద్దామని అనగా ధర్మరాజు అంగీకరించాడు.

కౌరవులూ పాండవులూ రథాలమీదా ఏనుగుల మీదా గంగాతీరానికి వచ్చారు. సింహం గుహలో ప్రవేశించేటట్లువారందరూ ఆవనంలో ప్రవేశించారు. ఆఉద్యానవనం క్రీడాభవనం పరిశుభ్రంగాఉన్నాయి. జలశీకరాలను వర్షించే యంత్రాలు నిర్విరామంగా పనిచేస్తున్నాయి, శ్వేతవస్త్రాలచేత ఆచ్ఛాదింపబడి ఉంది భూమి. నానావిధ చిత్రాలతో అలరారుతోంది, దిగుడుబావులూ చెరువులూ వికసిత పద్మాలతో నయనమనోహరంగా ఉన్నాయి. రాలిన పూలతో భూమి నిండిపోయింది.

కౌరవ పాండవులు యోగ్యాసనాలమీద ఆసీనులై క్రీడలు సాగించి భోజనాలు ప్రారంభించారు. ఒకరి నోటికి ఒకరు ముద్దలందివ్వ సాగారు. దుష్ట దుర్యోధనుడు భీముని ఆహారంలో కాలకూటం కలిపించాడు. చురకత్తివలె పదునైన హృదయంకల దుర్యోధనుడు మాటలలో అమృతంఒలికిస్తున్నాడు. దుర్యోధనుడు స్వయంగానే భీమునికి వడ్డిస్తున్నాడు. భీముడు అనుమానరహితంగా తినేస్తున్నాడు. దుష్ట దుర్యోధనుడు తన ప్రయత్నం నెరవేరినందుకు లోలోపల ఆనందించాడు.

భోజనానంతరం కురు పాండవులు జలక్రీడలు సాగించి దినాంతంలో అలసిపోయి బట్టలు మార్చుకొని ఆ భవనంలోనే గడప నిశ్చయించారు. భీముడు అధికపరిశ్రమ చేసిన కారణంగా అలసిపోయి ఆగృహంలో ఒకమూల నిద్రపోయాడు

పాండోర్విదుర సర్వాణి ప్రేతకార్యాణి కారయ
రాజవ ద్రాజసింహస్య మాద్ర్యాశ్చైవ విశేషతః.
పశూన్ వాసాంసి రత్నాని ధనాని వివిధాని చ
పాణ్డోః ప్రయచ్ఛ మాద్ర్యాశ్చ యేభ్యో యావచ్ఛ వాంఛితం.
యథాచకున్తీ సత్కారంకుర్యాన్మాద్ర్యాస్తథాకురు
యథా న వాయుర్నాదిత్యః పశ్యేతాం తాం సుసంవృతాం.
నశోచ్యః పాణ్డురనఘః ప్రశస్యః స నరాధిపః
యస్య పఞ్చ సుతావీరా జాతాః సురసుతోపమాః.
విదురస్తం తథేత్యుక్త్వా భీష్మేణ సహ భారత
పాణ్డుం సంస్కారయామాస దేశే పరమపూజితే.
తతస్తు నగరాత్ తూర్ణమాజ్యగన్ధపురస్కృతాః
నిర్హృతాః పావకాదీప్తాః పాణ్డోరాజన్పురోహితైః
అథైనామార్తవైః పుష్పైర్గన్ధైశ్చ వివిధైర్వరైః
శిబికాంతామలంకృత్యవాససాఽఽచ్ఛాద్యసర్వశః.
తాం తథా శోభితాం మాల్యైర్వాసోభిశ్చ మహాధనైః
అమాత్యాజ్ఞాతయశ్చైనం సుహృదశ్చోపతస్థిరే.
నృసింహం నరయుక్తేన పరమాలంకృతేన తం
అవహన్ యానముఖ్యేనసహమాద్ర్యాసుసంయుతం.
పాణ్డురేణాతపత్రేణ చామరవ్యజనేన చ
సర్వవాదిత్రనాదైశ్చ సమలంచక్రిరే తతః.
రత్నాని చాప్యుపాదాయ బహూని శతశో నరాః
ప్రదదుః కాంక్షమాణేభ్యః పాణ్డోస్తస్యౌర్ధ్వదేహికే.
అథచ్ఛత్రాణి శుభ్రాణి చామరాణి బృహన్తి చ
ఆజహ్రుః కౌరవస్యార్థే వాసాంసి రుచిరాణి చ
యాజకైః శుక్లవాసోభిర్హూయమానా హుతాశనాః
అగచ్ఛన్నగ్రతస్తస్య దీప్యమానాః స్వలంకృతాః.
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చైవ సహస్రశః
రుదన్తః శోకసంతప్తా అనుజగ్ముర్నరాధిపమ్.
అయమస్మానపాహాయ దుఃఖే చాధాయ శాశ్వతే
కృత్వాచాస్మాననాథాంశ్చ క్వ యాంస్యతినరాధిపః.
క్రోశంతః పాణ్డవాః సర్వే భీష్మో విదుర ఏవ చ
రమణీయే వనోద్దేశే గంగాతీరే సమే శుభే.
న్యాసయామాసురథ తాం శిబికాం సత్యవాదినః
సభార్యస్య నృసింహస్య పాండోరక్లిష్టకర్మణః.
తతస్తస్య శరీరం తం సర్వగంధాధివాసితం
శుచికాలీయకాదిగ్ధం దివ్యచందనరూషితం.
పర్యషిఞ్చన్జలేనాశు శాతకుమ్భమయైర్ఘటైః
చందనేన చ శుక్లేన సర్వతః సములోపయన్.
కాలాగురువిమిశ్రేణ తదా తుంగరసేన చ
అథైనం దేశజైః శుక్లైర్వాసోభిస్సమయోజయన్.
సంఛన్నః స తు వాసోభిర్జీవన్నివ నరాధిపః
శుశుభే స నరవ్యాఘ్రో మహార్హశయనోచితః.
హయమేధాగ్నినా సర్వే యాజకాః సపురోహితాః
వేదోక్తేన విధానేన క్రియాశ్చక్రుః సమన్త్రకం.
యాజకైరభ్యనుజ్ఞాతే ప్రేతకర్మణ్యనుష్ఠితే
ఘృతావసిక్తం రాజానం సహ మాద్ర్యా స్వలంకృతం.
తుంగపద్మకమిశ్రేణ చందనేన సుగంధినా
అన్యైశ్చ వివిధైర్గన్ధైర్విధినా సమదాహయన్.
తతస్తయోః శరీరే ద్వే దృష్ట్వా మోహవశంగతా
హా హా పుత్రేతి కౌసల్యా పపాత సహసా భువి
తాం ప్రేక్ష్య పతితామార్తాం పౌరజానపదో జనః
రురోద దుఃఖసంతప్తో రాజభక్త్యా కృపాన్వితః.
కున్త్యాశ్చైవార్తనాదేన సర్వాణి చ విచుక్రుశుః
మానుషైః సహ భూతాని తిర్యగ్యోని గతాన్యపి.
తథా భీష్మః శాన్తనవో విదురశ్చ మహామతిః

జలక్రీడవల్ల కలిగిన అలసట ఆహారంలో విషం కలిసి అచేతనని చేశాయి, జడీభూత దేహుడై పడి ఉన్నాడు భీముడు.

ఆసమయంలో దుర్యోధనుడు లతలతో భీముని బంధించాడు. మృతతుల్యుడయే భీముని గంగలోకి విసరేశాడు. భీముడు సరాసరి నాగలోకం చేరాడు. అతని దేహంక్రింద పడి ఎన్నో పాములు మరణించాయి. కొన్ని విషసర్పాలు భీముని కాటువేశాయి. ఆకాటువల్ల అంతకు ముందు దుర్యోధనుడు తినిపించిన విషం విరిగిపోసాగింది.

భీమసేనుని దేహం లోహంకర్కశంగా ఉన్నందువల్ల పాములు మర్మస్థానాల్లో కాటువేశాయి. నెమ్మదిగా భీమునికి మెలకువ వచ్చింది. బంధనాలన్నీ త్రెంచుకొని చుట్టూ ఉన్న పాములను నేల కేసి కొట్టసాగాడు. చాలా పాములు పారిపోయాయి. మిగిలినవి వాసుకిని చేరి- మహారాజా! విషపానం చేసిన మనుష్యుడు జలమార్గంగుండా మనలోకం చేరాడు. మూర్ఛలో వచ్చిన ఆమనుష్యుడు మన వారి కోరలు దిగటంతో తెలివి గన్నాడు. స్మృతి రాగానే బంధాలన్నీ త్రెంపుకొని మమ్మల్ని చంప నారంభించాడు. మీరు వచ్చి అతని గుర్తులు చూడండి- అనగా వాసుకి వచ్చాడు. అదే సమయానికి ఆర్యకుడు కూడా వచ్చాడు. ఆర్యకుడు శూరసేనుని తాత. శూరసేనుని కుమార్తె కుంతి. కనక కుంతీనందనుని గాఢంగా కౌగిలించుకున్నాడు. అప్పుడు వాసుకి భీముని కేవిధమైన ప్రమాదం కలిగించకుండా రత్నరాసు లిచ్చి పంపించమని ఆజ్ఞాపించాడు.

ఆర్యకుడు అడ్డు తగిలి- భీమునికి రత్నరాసుల కంటె బలం కలిగించే రసం ఇప్పించండి. అతను ఎంత త్రాగగలిగితే అంతా ఇవ్వండి-అని కోరగా వాసుకి అంగీకరించాడు. నాగులు భీముని ప్రస్తుతించారు. భీముడు పరిశుద్ధదేహుడై కూర్చొని రసపానం ఆరంభించాడు. అలాగుక్కకొకకుండగా ఎనిమిదికుండలు త్రాగి నాగజాతివారిచ్చిన సుఖశయ్యమీద హాయిగా నిద్రించాడు.

127 వ అధ్యాయంసమాప్తం

## నూట యిరువదిఎనిమిదవ అధ్యాయము

విలాసవిహారాలు పూర్తిచేసికొని కురు పాండవులు తమతమ వాహనాలమీద హస్తినాపురం బయలు దేరారు. భీమసేనుడు అందరికంటె ముందే వెళ్ళిపోయి ఉంటాడని వారు భావించారు. దుష్ట దుర్యోధనుడు పరమసంతోషంతో నగరం ప్రవేశించాడు. ధర్మరాజు దుర్యోధన దుష్టాత్మున్ని ఏవిధంగానూ శంకించ లేకపోయాడు. అందరూ తనవలెనే సాధువులని భావించాడు. ఇంటికి వస్తూనే కుంతిని చేరి-భీమసేనుడు వచ్చాడా? అని ప్రశ్నించాడు. అక్కడ భవనంలో అన్నిమూలలా వెదికామనీ అయినా కనిపించకపోవడంవల్ల ఇక్కడకు వచ్చి ఉంటాడని భావించాననీ అన్నాడు. తాను భీముని గురించి వ్యాకులహృదయంతో ఉన్నాననీ, అతన్ని అక్కడే ఎవరైనా చంపి ఉంటారని అనుమానంగా

సర్వశః కౌరవాశ్చైవ ప్రాణదన్ భృశదుఃఖితాః.
తతో భీష్మోఽథ విదురో రాజా చ సహ పాండవైః
ఉదకం చక్రిరే తస్య సర్వాశ్చ కురుయోషితః.
చుక్రుశుః పాండవాః సర్వే భీష్మః శాన్తనవస్తథా
విదురో జ్ఞాతయశ్చైవ చక్రుశ్చాప్యుదకక్రియాః.
కృతోదకాంస్తానాదాయ పాండవాన్ శోకకర్శితాన్
సర్వాః ప్రకృతయో రాజన్ శోచమానా
న్యవారయన్.
తత్రైవ పాండవా భూమౌ సుషుపుః సహ బాన్ధవైః
తత్రైవ నాగరా రాజన్ శిశ్యిరే బ్రాహ్మణాదయః.
తద్గతానన్దమస్వస్థమాకుమారమహృష్టవత్
బభూవ పాండవైః సార్ధం నగరం ద్వాదశ క్షపాః.

126 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది ఏడవ అధ్యాయము

తతః కుంతీ చ రాజా చ భీష్మశ్చ సహ బంధుభిః
దదుః శ్రాద్ధం తదా పాండోః స్వధామృతమయం తదా.
కురూంశ్చ విప్రముఖ్యాంశ్చ భోజయిత్వా సహస్రశః
రత్నౌఘాన్ విప్రముఖ్యేభ్యో దత్త్వా గ్రామవరాం
స్తథా.
కృతశౌచాంస్తతస్తాంస్తు పాండవాన్ భరతర్షభాన్
ఆదాయ వివిశుః సర్వే పురం వారణసాహ్వయం.
సతతం స్మానుశోచంతస్తమేవ భరతర్షభం
పౌరజానపదాః సర్వే మృతం స్వమివ బాంధవం.
శ్రాద్ధావసానే తు తదా దృష్ట్వా తం దుఃఖితం జనం
సమ్మూఢాం దుఃఖశోకార్తాం వ్యాసో
మాతరమబ్రవీత్.
అతిక్రాంతసుఖాః కాలాః పర్యుపస్థితదారుణాః
శ్వః శ్వః పాపిష్ఠదివసాః పృథివీ గతయౌవనా.
బహుమాయాసమాకీర్ణో నానాదోషసమాకులః
లుప్తధర్మక్రియాచారో ఘోరః కాలో భవిష్యతి.
కురూణామనయాచ్చాపి పృథివీ న భవిష్యతి
గచ్ఛ త్వం యోగమాస్థాయ యుక్తా వస తపోవనే.
మా ద్రాక్షీస్త్వం కులస్యాస్య ఘోరం
సంక్షయమాత్మనః
తథేతి సమనుజ్ఞాయ సా ప్రవిశ్యాబ్రవీత్ స్నుషాం.
అంబికే తవ పౌత్రస్య దుర్నయాత్ కిల భారతాః
సానుబంధా వినంక్ష్యంతి పౌరాశ్చైవేతి నః శ్రుతం.
తత్ కౌసల్యామిమామార్తాం పుత్రశోకాభిపీడితాం
వనమాదాయ భద్రం తే గచ్ఛామి యది మన్యసే.
తథేత్యుక్తా త్వంబికయా భీష్మమామంత్ర్య సువ్రతా
వనం యయౌ సత్యవతీ స్నుషాభ్యాం సహ భారత.
తాః సుఘోరం తపస్తప్త్వా దేవ్యో భరతసత్తమ
దేహం త్యక్త్వా మహారాజ గతిమిష్టాం యయుస్తదా.
అథాప్తవంతో వేదోక్తాన్ సంస్కారాన్
పాండవాస్తదా
సంవ్యవర్ధంత భోగాంస్తే భుంజానాః పితృవేశ్మని.
ధార్తరాష్ట్రైశ్చ సహితాః క్రీడంతో ముదితాః సుఖం
బాలక్రీడాసు సర్వాసు విశిష్టాస్తేజసాభవన్.
జవే లక్ష్యాభిహరణే భోజ్యే పాంసువికర్షణే
ధార్తరాష్ట్రాన్ భీమసేనః సర్వాన్ స పరిమర్దతి.
హర్షాత్ ప్రక్రీడమానాంస్తాన్ గృహ్య రాజన్
నిలీయతే
శిరస్సు వినిగృహ్యైతాన్ యోధయామాస
పాండవైః.

ఉందనీ పలకగా కుంతి భీతహృదయంతో దుఃఖిస్తూ భీము డిక్కడికి రాలేదని తక్షణం వారిని అన్వేషించే ప్రయత్నం చేయుమని చెప్పి విదుర్ణి పిలిచి- వన విహారానికి వెళ్ళిన వారందరూ తిరిగి వచ్చారు. మహాబలిష్ఠుడైన భీముడు మాత్రం రాలేదు. దుష్టాత్ముడైన దుర్యోధనుడు భీముణ్ణి చంపి ఉంటాడని నామనస్సు శంకిస్తోంది. నా హృదయం విచారమయ మౌతోంది- అనగా విదురుడు- కళ్యాణీ ! అటువంటి మాటలు నువ్వు మాట్లాడ కూడదు. ఈ విషయమై దుష్టదుర్యోధనుణ్ణి ప్రశ్నిస్తే వాడు మిగిలిన వారినికూడా హతమార్చగలడు. నీకొడుకులందరూ దీర్ఘాయువులని వ్యాసులవారు చెప్పారు. భీముడు తప్పకుండా తిరిగి వస్తాడు. నువ్వు విచారించకు- అని విదురుడు వెళ్ళిపోయాడు.

కుంతి విచారపూర్ణ హృదయంతో నలుగురు బిడ్డలను దగ్గరకు తీసికొని నిశ్శబ్దంగా కాలం గడుపుతున్నది.

భీమసేనుడు నాగలోకంలో తాను త్రాగిన రసం మత్తుతో ఎనిమిది రోజులు నిద్రపోయి తొమ్మిదో రోజున లేచాడు. అపరిమిత బలంతో మేల్కాంచిన భీముని చుట్టూ నాగులుచేరి- మహాబాహూ! నువ్వు త్రాగిన రసంవల్ల నీకు పదివేల ఏనుగుల బలం వచ్చింది. యుద్ధభూమిలో ఇకనిన్ను జయించేవాడు లేడు. ఈరోజున నువ్వు ఈదివ్యజల స్నానం చేసి స్వగృహానికి వెళ్ళు. నీకోసం నీసోదరులందరూ విచారిస్తున్నారు- అన విని భీముడు స్నానశుద్ధుడయాడు. అనంతరం శ్వేతవస్త్రాలూ శ్వేతపుష్పాలూ ధరించాడు. విషాన్నిహరించే ఓషధులతో పాటు నాగజాతివా రిచ్చిన పరమాన్నంకూడా ఆరగించాడు. వారి ఆదరసత్కారాలూ ఆశీర్వాదాలూ పొంది దివ్యభూషణాలు ధరించి ఇంటికి బయలు దేరాడు. అప్పుడు ఒక నాగుడు భీముని తీసికొనివచ్చి వనంలో విడిచాడు. భీముడు చూస్తూండగానే ఆనాగుడు అంతర్ధానమయి పోయాడు. మరుక్షణంలో భీముడు నగరానికి వచ్చి తల్లికీ సోదరులకూ నమస్కరించి చిన్నితమ్ముల శిరస్సుముద్దాడాడు. కుంతీ ధర్మరాజాదులూ పరమ సంతోషంతో వానిని కౌగలించుకున్నారు. అనంతరం భీముడు దుష్టదుర్యోధనుని నికృష్టకార్యమూ నాగలోకంలో జరిగిన సంఘటనలూ సమగ్రంగా వివరించాడు.

అది విని ధర్మరాజు జరిగిన విషయాలు ఎవరితోనూ చెప్పవద్దనీ ఏమీ జరగనట్లే ప్రవర్తించమనీ అన్నాడు. నాటినుంచి ధర్మరాజు తమ్ములందరినీ జాగ్రత్తగా చూసుకొంటూ గడపసాగాడు. దుర్యోధనుడు ఒకనాడు భీముని రథసారథిని పీకపిసికి చంపేశాడు. ఈవిషయం ధీమంతుడయిన విదురునికి చెప్పగా అవిషయంకూడా పైకి పొక్క నివ్వవద్దన్నాడు విదురుడు.

దుర్యోధనుడు భీమునిభోజనంలో కాలకూటం కలిపించాడు. ఈవిషయం యుయుత్సుడు పాండవులకు తెలియజేసాడు. భీముడు కాలకూటవిషాక్తమైన అన్నాన్ని జీర్ణించుకున్నాడు. భీముని ఉదరంలో వృకనామకమైన అగ్ని ఉన్నకారణంచేత ఏపదార్థమయినా జీర్ణమైపోయేది.

దుర్యోధనాదులతో పాటు కర్ణుడూ శకునీ ఎన్నో విధాల పాండవులను చంపడానికి యత్నిస్తున్నా విదురుని అజ్ఞానుసారం పాండవులు ప్రతీకారం తలపెట్టకుండా మౌనంగానే గడుపుతున్నారు.

శతమేకోత్తరం తేషాం కుమారాణాం మహౌజసాం
ఏక ఏవ నిగృహ్ణాతి నాతికృచ్ఛ్రాద్ వృకోదరః.
కచేషు చ నిగృహ్యైనాన్ వినిహత్య బలాద్ బలీ
చకర్ష క్రోశతో భూమౌ ఘృష్టజానుశిరోంఽసకాన్.
దశ బాలాంజలే క్రీడన్ భుజాభ్యాం పరిగృహ్య సః
ఆస్తే స్మ సలిలే మగ్నో మృతకల్పాన్ విముఞ్చతి.
ఫలాని వృక్షమారుహ్య విచిన్వంతి చ తే తదా
తదా పాదప్రహారేణ భీమః కంపయతే ద్రుమాన్.
ప్రహారవేగాభిహతా ద్రుమా వ్యాఘూర్ణితా స్తతః
సఫలాః ప్రపతంతి స్మ ద్రుతం త్రస్తాః కుమారకాః
న తే నియుద్ధే న జవే న యోగ్యాసు కదాచన
కుమారా ఉత్తరం చక్రుః స్పర్ధమానా వృకోదరం.
ఏవం స ధార్తరాష్ట్రాంశ్చ స్పర్ధమానో వృకోదరః
అప్రియేఽతిష్ఠదత్యంతం బాల్యాన్న ద్రోహచేతసా.
తతో బలమతిఖ్యాతం ధార్తరాష్ట్రః ప్రతాపవాన్
భీమసేనస్య తజ్జ్ఞాత్వా దుష్టభావమదర్శయత్
తస్య ధర్మాదపేతస్య పాపాని పరిపశ్యతః
మోహాదైశ్వర్యలోభాచ్చ పాపా మతిరజాయత.
అయం బలవతాం శ్రేష్ఠః కుంతీపుత్రో వృకోదరః
మధ్యమః పాండుపుత్రాణాం నికృత్యా సంనిగృహ్యతాం.
ప్రాణవాన్ విక్రమీ చైవ శౌర్యేణ మహతాన్వితః
స్పర్ధతే చాపి సహితానస్మానేకో వృకోదరః.
తంతుసుప్తం పురోద్యానే గంగాయాం ప్రక్షిపామహే
అథ తస్మాదవరజం శ్రేష్ఠం చైవ యుధిష్ఠిరం.
ప్రసహ్య బంధనే బద్ధ్వా ప్రశాసిష్యే వసుంధరాం
ఏవం స నిశ్చయం పాపః కృత్వా దుర్యోధనస్తదా
నిత్యమేవాంతరప్రేక్షీ భీమస్యాసీన్మహాత్మనః.
తతో జలవిహారార్థం కారయామాస భారత
చైలకంబలవేశ్మాని విచిత్రాణి మహాంతి చ.
సర్వకామైః సుపూర్ణాని పతాకోచ్ఛ్రాయవంతి చ
తత్ర సంజనయామాస నానాగారాణ్యనేకశః
ఉదకక్రీడనం నామ కారయామాస భారత
ప్రమాణకోట్యాం తం దేశం స్థలం కించిదుపేత్య హ.
భక్ష్యం భోజ్యం చ పేయం చ చోష్యం లేహ్యమథాపి చ
ఉపపాదితం నరైస్తత్ర కుశలైః సూదకర్మణి.
న్యవేదయం స్తత్ పురుషా ధార్తరాష్ట్రాయ వై తదా
తతో దుర్యోధనస్తత్ర పాండవానాహ దుర్మతిః.
గంగాం చైవానుయాస్యామ ఉద్యానవనశోభితాం
సహితా భ్రాతరః సర్వే జలక్రీడామవాప్నుమః
ఏవమస్త్వితి తం చాపి ప్రత్యువాచ యుధిష్ఠిరః
తే రథైర్నగరాకారైర్దేశజైశ్చ గజోత్తమైః.
నిర్యయుర్నగరాచ్ఛూరాః కౌరవ్యాః పాండవైః సహ
ఉద్యానవనమాసాద్య విసృజ్య చ మహాజనం.
విశంతి స్మ తదా వీరాః సింహా ఇవ కిరేర్గుహాం
ఉద్యానమభిపశ్యంతో భ్రాతర స్సర్వ ఏవ తే.
ఉపస్థానగృహైః శుభ్రైర్వలభీభిశ్చ శోభితం
గవాక్షకైస్తథా జాలైర్యంత్రైః స్సంచారికైరపి.
సమ్మార్జితం సౌధకారైశ్చిత్రకారైశ్చ చిత్రితం
దీర్ఘికాభిశ్చ పూర్ణాభిస్తథా పద్మాకరైరపి.
జలం తచ్ఛుశుభే ఛన్నం ఫుల్లైర్జలరుహైస్తథా
ఉపచ్ఛన్నా వసుమతీ తథా పుష్పైర్యథర్తుకైః.
తత్రోపవిష్టాస్తే సర్వే పాండవాః కౌరవాశ్చ హ
ఉపపన్నాన్ బహూన్ కామాంస్తే భుంజంతి తత స్తతః.
అథోద్యానవరే తస్మిం స్తథా క్రీడాగతాశ్చ తే
పరస్పరస్య వక్త్రేభ్యో దదుర్భక్ష్యాంస్తత స్తతః.
తతో దుర్యోధనః పాపస్తద్భక్ష్యే కాలకూటకమ్
విషం ప్రక్షేపయామాస భీమసేన జిఘాంసయా.
స్వయముత్థాయ చైవాథ హృదయేన క్షురోపమః
స వాచాఽమృతకల్పశ్చ భ్రాతృవచ్చ సుహృద్ యథా.
స్వయం ప్రక్షిపతే భక్ష్యం బహు భీమస్య పాపకృత్

ధృతరాష్ట్రుడు రాజకుమారుల క్రీడా సమాచారాలు విని వారికి విద్యాభ్యాసం చేసేసంకల్పంతో గౌతమగోత్రికుడైన కృపాచారుని గురువుగా నియోగించాడు. ధనుర్వేదవిదుడయిన కృపాచార్యుని శిక్షణలో కురుపాండవులు శిక్షణ పొందుతున్నారు.

128 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఇరువది తొమ్మిదవ అధ్యాయము

### కృపాచార్యుడు

కుతూహలంతో వింటున్న జనమేజయుడు కృపాచార్యుని జన్మవృత్తాంతాదికాలలను కోరగా కథాకథనకుశలుడైన వైశంపాయనుడు వివరిస్తున్నాడు.

గౌతమమహర్షికి శరద్వంతు డనే కుమారుడు ఉన్నాడు. అతడు శరసమూహంతో పుట్టాడు. తండ్రి ఎంతప్రయత్నించినా శరద్వంతుడు వేదాధ్యయనంలోకంటె ధనుర్విద్యాభ్యాసంలో కుతూహలం చూపేవాడు. ఆ కుతూహలంతో తపోనిష్ఠాగరిష్ఠుడై సర్వాస్త్రవిదుడయినాడు. అతని తపస్సుకు దేవేంద్రుడు భయపడి 'జలపద' అనేపేరుగల అప్సరసను పంపాడు. ఆమె శరద్వంతుని ఆశ్రమానికి వెళ్ళి అతనిని కామమోహితుణ్ణి చేసింది. ఆ సౌందర్యరాశిని చూసి శరద్వంతుడు ధనుర్బాణాలు విడిచేశాడు. అతని మనస్సులో ఒక వికారం పొడచూపింది. అయినా కదలలేదు శరద్వంతుడు. కాని శరద్వంతునికి వీర్యస్ఖలనం అయింది. తక్షణం శరద్వంతుడు ధనుర్బాణాలు అక్కడే విడిచి ఆశ్రమాన్ని వదలి వెళ్ళిపోయాడు.

ఆ వీర్యం శరస్తంబముమీదపడి రెండుభాగాలై ఒకపురుషుడుగా ఒకస్త్రీగా మారింది.

ఆసమయానికి శంతనమహారాజు అప్రాంతానికే వచ్చాడు. ఆయన సైనికు డొకడు ఆ బిడ్డలనూ ధనుర్బాణాలనూ చూసి ధనుర్వేదపారంగతుడైన ఒకానొక బ్రాహ్మణుని సంతానమై ఉంటుందని ఆవిషయం మహారాజుకి తెలియజేశాడు. శంతనుడు దయాహృదయుడై వారితో స్వగృహానికి వచ్చాడు. ఆ బిడ్డ లిరువురూ తనబిడ్డలనే చెప్పేవాడు. వారిరువురిపోషణాదులూ చూస్తూ విధ్యుక్తకర్మలు నిర్వర్తించాడు.

శరద్వంతుడు వేరొకప్రాంతంలో ఆశ్రమం నిర్మించుకొని ధనుర్వేదాభ్యాసం చేస్తున్నాడు.

శంతనుడు కృపాపూర్వకంగా వారిని ఆదరించి పోషించడంవల్ల వారికి కృపుడు కృపి అని పేర్లు పెట్టాడు. శరద్వంతుడు తన సంతానసమాచారం దివ్యదృష్టితో తెలుసుకున్నాడు. ఒకనాడు వచ్చి రహస్యంగా కుమారుని నిజగోత్రాదులు చెప్పి సర్వశస్త్రరహస్యాలూ ఉపదేశించి వెళ్ళాడు. ఆకారణంచేత కృపాచార్యుడు అత్యల్పకాలంలో ధనుర్వేదాచార్యు డయినాడు.

(ధనుర్విద్య నాలుగు భాగాలుగావేరొక్కబడింది. సామాన్యంగా బాణాలు విడవడం ముక్త అనబడుతుంది. చేతితో పట్టుకొని కొట్టే ఖడ్గాద్యాయుధ

ప్రతీచ్ఛితం స్మ భీమేన తం వై దోషమజానతా.
తతో దుర్యోధనస్తత్ర హృదయేన హసన్నివ
కృతకృత్యమివాత్మానం మన్యతే పురుషాధమః.
తత స్తే సహితాః సర్వే జలక్రీడామకుర్వత
పాండవా ధార్తరాష్ట్రాశ్చ తదా ముదితమానసాః.
క్రీడావసానే తే సర్వే శుచివస్త్రాః స్వలంకృతాః
దివసాన్తే పరిశ్రాన్తా విహృత్య చ కురూద్వహాః.
విహారావసథేష్వేవ వీరా వాసమరోచయన్
ఖిన్నస్తు బలవాన్ భీమో వ్యాయామాభ్యధికం తదా.
వాహయిత్వా కుమారాంస్తాన్ జలక్రీడాగతాం స్తదా
ప్రమాణకోట్యాం వాసార్థీ సుష్వాపావాప్య తత్ స్థలం
శీతం వాతం సమాసాద్య శ్రాన్తో మదవిమోహితః
విషేణ చ పరీతాంగో నిశ్చేష్టః పాండునందనః.
తతో బద్ధ్వా లతాపాశైః భీమం దుర్యోధనః స్వయం
మృతకల్పం తదా వీరం స్థలాజ్జలమపాతయత్.
స నిస్సంజ్ఞో జలస్యాన్తమథ వై పాండవోఽవిశత్
ఆక్రామన్నాగభవనే తదా నాగకుమారకాన్.
తతః సమేత్య బహుభిస్తదా నాగైః మహావిషైః
అదశ్యత భృశం భీమో మహాదంష్ట్రైర్విషోల్బణైః.
తతోఽస్య దశ్యమానస్య తద్విషం కాలకూటకం
హతం సర్పవిషేణైవ స్థావరం జంగమేన తు.
దంష్ట్రాశ్చ దంష్ట్రిణాం తేషాం మర్మస్వపి నిపాతితాః
త్వచం నైవాస్య బిభిదుః సారత్వాత్ పృథువక్షసః.
తతః ప్రబుద్ధః కౌంతేయః సర్వం సంఛిద్య బంధనం
పోథయామాస తాన్ సర్వాన్ కేచిద్ భీతాః
ప్రదుద్రువుః.
హతావశేషా భీమేన సర్వే వాసుకిమభ్యయుః
ఊచుశ్చ సర్పరాజానం వాసుకిం వాసవోపమం.
అయం నరో వై నాగేంద్ర హ్యప్సు బద్ధ్వా ప్రవేశితః
యథా చ నో మతిర్వీర విషపీతో భవిష్యతి.
నిశ్చేష్టోఽస్మాననుప్రాప్తః స చ దష్టోఽన్వబుధ్యత
ససంజ్ఞశ్చాపి సంవృత్తశ్ఛిత్వా బంధనమాశు నః.
పోథయంతం మహాబాహుం త్వం వై తం జ్ఞాతుమర్హసి
తతో వాసుకిరభ్యేత్య నాగైరనుగతస్తదా.
పశ్యతి స్మ మహాబాహుం భీమం భీమపరాక్రమం
ఆర్యకేణ చ దృష్టః స పృథాయా ఆర్యకేణ చ.
తదా దౌహిత్రదౌహిత్రః పరిష్వక్తః సుపీడితం
సుప్రీతశ్చాభవత్ తస్య వాసుకిః స మహాయశాః.
అబ్రవీత్ తం చ నాగేంద్రః కిమస్య క్రియతాం ప్రియం
ధనౌఘో రత్ననిచయో వసు చాస్య ప్రదీయతాం
ఏవముక్తస్తదా నాగో వాసుకిం ప్రత్యభాషత
యది నాగేంద్ర తుష్టోఽసి కిమస్య ధనసంచయైః.
రసం పిబేత్ కుమారోఽయం త్వయి ప్రీతే మహాబలః
బలం నాగసహస్రస్య యస్మిన్ కుండే ప్రతిష్ఠితం.
యావత్ పిబతి బాలోయం తావదస్మై
ప్రదీయతామ్
ఏవమస్త్వితి తం నాగం వాసుకిః ప్రత్యభాషత.
తతో భీమస్తదా నాగైః కృతస్వస్త్యయనః శుచిః
ప్రాఙ్ముఖశ్చోపవిష్టశ్చ రసం పిబతి పాండవః
ఏకోచ్ఛ్వాసాత్ తతః కుండం పిబతి స్మ మహాబలః
ఏవమష్టౌ స కుండాని హ్యపిబత్ పాండునందనః.
తతస్తు శయనే దివ్యే నాగదత్తే మహాభుజః
అశేత భీమసేనస్తు యథాసుఖమరిందమః.

127 వ అధ్యాయః సమాప్తం

యుద్ధ అ ముక్త అంటారు. ప్రయోగోపసంహారాలతో సాగించేది ముక్తాముక్త అంటారు. మంత్రం పఠించి అస్త్రంప్రయోగించి ఉపసంహారం తెలీక పోతే దాన్ని మంత్రముక్త మంటారు. ఆదాన సంధాన విమోక్షసంహారాలని కూడా ధనుర్వేద వేత్తలు వ్యవహరిస్తారు).

ధార్తరాష్ట్రులూ యాదవపాండవులూ కృపాచార్యునివద్దనే ధనుర్వేదం అభ్యసించసాగారు. వృష్ణివంశీయులూ అన్యరాజకుమారులూ కూడా కృపాచార్యుని శిష్యత్వం పొందారు.

కృపాచార్యునివద్ద విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాయి మరింత విద్యాకుశలుల్ని చేసేఊహతో భీష్ముడు మరొక ఆచార్యునికోసం అన్వేషించ సాగాడు. పరాక్రమసంపన్నుడైతే తప్ప సామాన్యుడెవడూ కౌరవులను అరిశేరినవారుగా తయారు చెయ్యలేడని నిశ్చయించుకొని అన్వేషణ ఆరంభించాడు.

సర్వశస్త్రాస్త్ర విదుడూ భరద్వాజనందనుడూ అయిన ద్రోణుని రావించి భీష్మాచార్యులు శాస్త్ర విధిగా సత్కారాలు జరిపి రాకుమారులందరినీ శిష్యులుగా అర్పించాడు. ఆచార్యద్రోణుని శిక్షణలో వారందరూ స్వల్పకాలంలోనే ధనుర్విద్యా కుశలు లయారు-అని వైశంపాయనుడు సంక్షిప్తంగా సాగుతూండగా వివరంగా వినగోరిన జనమేజయుడు ద్రోణాచార్యుని జన్మక్రమాదులనూ ఆయన అస్త్ర విద్యాపాటవాన్నీ స్థూలంగా చెప్పమని కోరగా వ్యాస శిష్యుడు భారద్వాజుని చరిత్ర ప్రారంభించి కొనసాగిస్తున్నాడు.

జనమేజయ మహారాజా! పవిత్రగంగానదీ ద్వారంలో భరద్వాజుడనే ప్రఖ్యాత ఋషిచంద్రుడుండేవాడు. ఆ మహర్షి కఠోరనియమవ్రతపాలకుడు. ఆయన ఒకనాడు యజ్ఞదీక్షితుడై ఆశ్రమవాసులైన ఋషులతో గంగాస్నానానికి వెళ్ళి అక్కడ ఘృతాచి అనే పేరుగల అప్సరసను చూశాడు. ఘృతాచి అతిలోకసౌందర్యవతి. ఆమె ఆ సమయంలో స్నానం చేసి తడిబట్టలు విడుస్తున్నది. ఆ లావణ్యలహరిని చూసిన భరద్వాజుని మనస్సు వికలమైంది. యౌవనోన్మత్తకామిని ఘృతాచి ఆక్షణంలో నగ్నంగా ఉన్నది. అర్ధనగ్నదేహంతో ఘృతాచి భరద్వాజని మనసులో ఏవో కోరికలను రేపింది. ఫలితంగా భరద్వాజునికి వీర్యం స్ఖలన మయింది. ఆశుక్లాన్ని భరద్వాజుడు దగ్గర ఉన్న కుండలో ఉంచాడు. అనంతరం ఆ ద్రోణంనుండి పుత్రు డుద్భవించాడు. ద్రోణమునుండి పుట్టినవాడు కనక ద్రోణాచార్యుడు అని పిలువసాగారు. ద్రోణుడు వేదవేదాంగ విదుడయాడు.

భరద్వాజుడు నాటికే అస్త్రవేత్తలలో ప్రసిద్ధుడు. అగ్నిపుత్రుడయిన అగ్నివేశునిచేత ఆగ్నేయాస్త్రం అభ్యసింపజేసినవాడు భరద్వాజుడు. అగ్నివేశుడు గురుపుత్రుడైన ద్రోణునకు ఆగ్నేయాస్త్రం ప్రసాదించాడు. భరద్వాజమహర్షికి పృషతుడనే మహారాజు స్నేహితుడుగా ఉండేవాడు. ఆరోజులలోనే పృషతునికి ద్రుపదుడనే కుమారుడు కలిగాడు. ద్రుపదుడు భరద్వాజాశ్రమానికి వచ్చి ద్రోణునికి స్నేహితుడై అధ్యయనం చేసేవాడు.

పృషతుని అనంతరం ద్రుపదుడు ఉత్తర పాంచాలదేశానికి అధీశుడయాడు. క్రమంగా భరద్వాజుడుకూడా స్వర్గవాసి అయాడు. ద్రోణుడు ఆ ఆశ్రమంలోనే ఉంటూ తపోదీక్ష వహించాడు. ద్రోణుని కీర్తి దశదిశలా వ్యాపించింది. ఆ సమ

తతస్తే కౌరవాః సర్వే వినా భీమం చ పాండవాః
వృత్తక్రీడావిహారాస్తు ప్రతస్థుర్గజసాహ్వయం.
రథైర్గజై స్తథా చాశ్వైర్యానైశ్చాన్యైరనేకశః
బ్రువంతో భీమసేనస్తు యాతో హ్యగ్రత ఏవ నః.
తతో దుర్యోధనః పాప స్తత్రాపశ్యన్ వృకోదరం
భ్రాతృభిః సహితో హృష్టో నగరం ప్రవివేశ హ.
యుధిష్ఠిరస్తు ధర్మాత్మా హ్యవిదన్ పాపమాత్మని
స్వేనానుమానేన పరం సాధుం సమనుపశ్యతి.
సోఽభ్యుపేత్య తదా పార్థో మాతరం భ్రాతృవత్సలః
అభివాద్యాబ్రవీత్ కుంతీమంబ భీమ ఇహాగతః.
క్వ గతో భవితా మాతర్నేహ పశ్యామి తం శుభే
ఉద్యానాని వనం చైవ విచిత్రాని సమంతతః.
తదర్థం న చ తం వీరం దృష్టవంతో వృకోదరం
మన్యమానా స్తత స్సర్వే యాతో నః పూర్వమేవ సః.
ఆగతాః స్మ మహాభాగే వ్యాకులేనాంతరాత్మనా
ఇహాగమ్య క్వ ను గత స్త్వయా వా ప్రేషితః క్వ ను.
కథయస్వ మహాబాహుం భీమసేనం యశస్విని
న హి మే శుధ్యతే భావ స్తం వీరం ప్రతి శోభనే.
యతః ప్రసుప్తం మన్యేఽహం భీమం నేతిహతస్తు సః
ఇత్యుక్తా చ తతః కుంతీ ధర్మరాజేన ధీమతా.
హాహేతికృత్వాసంభ్రాంతా ప్రత్యువాచయుధిష్ఠిరం
న పుత్ర భీమం పశ్యామి న మామభ్యేత్యసావితి.
శీఘ్రమన్వేషణే యత్నం కురు తస్యానుజైః సహ
ఇత్యుక్త్వాతనయంజ్యేష్ఠంహృదయేనవిదూయతా.
క్షత్తారమానాయ్య తదా కుంతీ వచనమబ్రవీత్
క్వ గతో భగవన్ క్షత్తర్భీమసేనో న దృశ్యతే.
ఉద్యానాన్నిర్గతాః సర్వే భ్రాతరో భ్రాతృభిః సహ
తత్రైకస్తు మహాబాహుర్భీమో నాభ్యేతిమామిహ.
న చ ప్రీణయతే చక్షుః సదా దుర్యోధనస్య సః
క్రూరోఽసౌదుర్మతిఃక్షుద్రో రాజ్యలుబ్ధోఽనపత్రపః.

నిహన్యాదపి తం వీరం జాతమన్యుః సుయోధనః
తేన మే వ్యాకులం చిత్తం హృదయం దహ్యతీవచ.
మైవం వదస్వ కల్యాణి శేషసంరక్షణం కురు
ప్రత్యాదిష్టోహిదుష్టాత్మా శేషేఽపి ప్రహరేత్ తవ.
దీర్ఘాయుష స్తవ సుతా యథోవాచ మహామునిః
ఆగమిష్యతి తే పుత్రః ప్రీతిం చోత్పాదయిష్యతి.
ఏవముక్త్వా యయౌ విద్వాన్విదురఃస్వం నివేశనం
కుంతీ చింతాపరా భూత్వా సహాసీనా సుతైర్గృహే.
తతోఽష్టమే తు దివసే ప్రత్యబుధ్యత పాండవః
తస్మి స్తదా రసే జీర్ణే సోఽప్రమేయబలో బలీ.
తం దృష్ట్వాప్రతిబుధ్యంతంపాండవం తే భుజంగమాః
సాంత్వయామాసురవ్యగ్రా వచనం చేదమబ్రువన్.
యత్ తే పీతో మహాబాహో రసోఽయం వీర్య సంభృతః
తస్మాన్నాగా యుతబలో రణేఽధృష్యో భవిష్యసి.
గచ్ఛాద్యత్వంచస్వగృహంస్నాతోదివ్యైరిమైర్జలైః
భ్రాతర స్తేఽనుతప్యంతి త్వాం వినా కురుపుంగవ.
తతః స్నాతో మహాబాహుః శుచిః శుక్లాంబరస్రజః
తతో నాగస్య భవనే కృతకౌతుకమంగళః.
ఓషధీభిర్విషఘ్నీభిః సురభీభిర్విశేషతః
భుక్తవాన్ పరమాన్నం చ నాగైర్దత్తం మహాబలః
పూజితో భుజగైర్వీర ఆశీర్భిశ్చాభినందితః
దివ్యాభరణసంఛన్నో నాగానామంత్ర్యపాండవః.
ఉదతిష్ఠత్ ప్రహృష్టాత్మా నాగలోకాదరిందమః
ఉత్క్షిప్తః స తు నాగేన జలాజ్జలరుహేక్షణః.
తస్మిన్నేవ వనోద్దేశే స్థాపితః కురునందనః
తే చాంతర్దధిరేనాగాః పాండవస్యైవ పశ్యతః
తత ఉత్థాయ కౌంతేయో భీమసేనోమహాబలః
ఆజగామ మహాబాహుర్మాతురంతికమఞ్జసా.
తతోఽభివాద్య జననీం జ్యేష్ఠం భ్రాతరమేవ చ

యంలో పితృదేవతలు అతని మనస్సులో సంతానేచ్ఛ కలిగించారు. ద్రోణుడు పుత్రవాంఛతో శరద్వంతుని పుత్రి అయిన కృపిని అర్ధాంగిగా స్వీకరించాడు.

కృపి ధర్మకార్యాలలోనూ అగ్నిహోత్రాదులవద్దనూ వినయంతో భర్తను అనుసరించేది. ఆదంపతుల గార్హస్థ్యజీవిత ఫలంగా అశ్వత్థామ ఆవిర్భవించాడు. వాడు పుడుతూనే ఉచ్చైశ్శ్రవసదృశంగా శబ్దం చేశాడు. ఆ అరుపు విని ఆకాశవాణి- ఈబాలుడు అశ్వంవోలె రోదించాడు. కనక ఇతనిని అశ్వత్థామ అని పిలుస్తారు— అని పలికింది. ద్రోణుడు పుత్రజననంతో అమితోత్సాహం పొందాడు.

ద్రోణుడు తన ఆశ్రమాన్ని వీడలేదు. తపోనిష్ఠ వదలించలేదు. అలానే కాలం గడుపుతూండగా జమదగ్నినందనుడయిన పరశురాముడు విప్రశ్రేష్ఠులకు మహాదానాలు చేస్తున్నాడని విని పరశురామునివద్దకు పోయి సర్వశస్త్రాస్త్ర విద్యారహస్యాలూ నీతిశాస్త్రమూ అభ్యసించాలని బ్రహ్మచర్యవ్రతపరాయణులైన శిష్యులతో బయల్దేరి మహేంద్రపర్వతం మీదఉన్న రేణుకానందనుని చేరాడు.

లోకోత్తర చరిత్రుడైన పరశురాముని ఎదుట నిలిచి అంజలిఘటించి- మహర్షీ! నేను అంగిరసగణంలోని భరద్వాజనందనుడను. ద్రోణుడను. నేను అర్థార్థినై వచ్చాను- అని సాష్టాంగపడ్డాడు.

సర్వక్షత్రియ సంహారకుడైన జమదగ్నినందనుడు ద్రోణుని చేరబిలిచి వాని వాంఛలడిగాడు. ధనరత్నరాసులు ధర్మంచేసే పరశురాముని చూస్తూ ద్రోణుడు ఎన్నడూ తరగని అర్థం అనుగ్రహించమనగా పరశురాముడు కల ధనమెల్ల విప్రులకిచ్చేశాననీ సముద్రమేఖలయైన నిఖిలోర్వినీ కశ్యపుని కిచ్చేశాననీ తనశరీరమూ శస్త్రాస్త్రాలూ మాత్రమే ఉన్నాయనీ వానిలో ఏదికోరినా ఇస్తాననీ అన్నాడు; అది విని ద్రోణుడు ప్రయోగోపసంహారరహస్యాలతో శస్త్రాస్త్రాలు అనుగ్రహించమని కోరగా పరశురాముడు సర్వమర్మసహితంగా సంపూర్ణ శస్త్రాస్త్రజ్ఞానం ప్రసాదించాడు. ద్రోణుడు ధనురాచార్యుడయి తన ప్రియమిత్రుడైన ద్రుపదునివద్దకు వెళ్ళాడు.

129 వ అధ్యాయము సమాప్తం

## నూటముప్పదవ అధ్యాయము

### ద్రుపదుడు

ధనుర్వేదవేత్త ద్రోణుడు ద్రుపదుని రాజధానికి పోయి తనపేరు ద్రోణుడనీ ద్రుపదుని బాల్యమిత్రుడననీ తెలియజేశాడు. ఆ బ్రాహ్మణుని మాటలు విన్న ద్రుపదుని ముఖం జేవురించింది. అతని కనుబొమలు ముడివడ్డాయి .ధనమదం కన్నులలో ప్రవరిస్తూ- ఓ బ్రాహ్మవిదుడా! నీబుద్ధి చాలా సంకుచితమైంది. నీకు సంస్కారంలేదు, కనకనే మహారాజుకే స్నేహితుడనని చెప్పుకుంటున్నావు. నీవంటి వాడికి నాఅంతటి చక్రవర్తి మిత్రుడా! మానవుడు వయస్సు పెరిగేకొద్దీ వృద్ధుడైనట్లే స్నేహంకూడా కాలక్రమానుసారం క్షీణిస్తుంది. పూర్వం మన

కనీయసః సమాఘ్రాయ శిర స్స్వరివిమర్దనః.
తై శ్చాపి సంపరిష్వక్త స్సహ మాత్రా నరర్షభైః
అన్యోన్యగతసౌహార్దాద్ దిష్ట్యా దిష్ట్యేతిచాబ్రువన్
తత స్తత్ సర్వమాచష్ట దుర్యోధనవిచేష్టితం
భ్రాతౄణాం భీమసేనశ్చ మహాబలపరాక్రమః.
నాగలోకే చ యద్వృత్తం గుణదోషమశేషతః
తచ్చ సర్వమశేషేణ కథయామాస పాండవః
తతో యుధిష్ఠిరో రాజా భీమమాహ వచోర్థవత్
తూష్ణీం భవ న తే జల్ప్యమిదం కార్యం కథంచన.
ఏవముక్త్వా మహాబాహుర్ధర్మరాజో యుధిష్ఠిరః
భ్రాతృభిః సహితః సర్వైరప్రమత్తోఽభవత్ తదా.
సారథిం చాస్య దయితమపహస్తేన జఘ్నివాన్
ధర్మాత్మావిదుర స్తేషాం పార్థానాం ప్రదదా మతిం.
భోజనే భీమసేనస్య పునః ప్రాక్షేపయద్ విషం
కాలకూటం నవం తీక్ష్ణం సంభృతం లోమహర్షణం.
వైశ్యాపుత్ర స్తదాచష్ట పార్థానాం హితకామ్యయా
తచ్చాపి భుక్త్వాజరయదవికారం వృకోదరః.
వికారం న హ్యజనయత్ సుతీక్ష్ణమపి తద్విషం
భీమసంహననే భీమే అజీర్యత వృకోదరే.
ఏవం దుర్యోధనః కర్ణః శకునిశ్చాపి సౌబలః
అనేకై రభ్యుపాయైస్తాంజిఘాంసంతి స్మ పాండవాన్.
పాండవాశ్చాపి తత్ సర్వం ప్రత్యజానన్నమర్షితాః
ఉద్భావనమకుర్వంతో విదురస్య మతే స్థితాః.
కుమారాన్ క్రీడమానాంస్తాన్ దృష్ట్వా రాజాతిదుర్మదాన్
గురుం శిక్షార్థమన్విష్య గౌతమం తాన్న్యవేదయత్
శర స్తంబే సముద్భూతం వేదశాస్త్రార్థపారగం
అధిజగ్ముశ్చ కురవో ధనుర్వేదం కృపాత్ తే.

128 వ అధ్యాయంసమాప్తం

## నూటయిరువది తొమ్మిదవ అధ్యాయము

కృపస్యాపి మమ బ్రహ్మన్ సంభవం వక్తుమర్హసి
శర స్తంబాత్ కథం జజ్ఞే కథం వాస్త్రాణ్యవాప్తవాన్
మహర్షేర్గౌతమస్యాసీచ్ఛరద్వాన్ నామ గౌతమః
పుత్రః కిల మహారాజ జాతః సహ శరైర్విభో.
న తస్య వేదాధ్యయనే తథా బుద్ధిరజాయత
యథాస్య బుద్ధిరభవద్ ధనుర్వేదే పరంతప.
అధిజగ్ముర్యథా వేదాం స్తపసా బ్రహ్మచారిణః
తథా స తపసో పేతః సర్వాణ్యస్త్రాణ్యవాప హ.
ధనుర్వేదపరత్వాచ్చ తపసా విపులేన చ
భృశం సంతాపయామాస దేవరాజం స గౌతమః.
తతో జానపదీం నామ దేవకన్యాం సురేశ్వరః
ప్రాహిణోత్ తపసో విఘ్నం కురు తస్యేతి కౌరవ.
సా హి గత్వాఽఽశ్రమం తస్య రమణీయం శరద్వతః
ధనుర్బాణధరం బాలా లోభయామాస గౌతమం.
తామేకవసనాం దృష్ట్వా గౌతమోఽప్సరసం వనే
లోకేఽప్రతిమసంస్థానాం ప్రోత్ఫుల్లనయనోఽభవత్
ధనుశ్చ హి శరా స్తస్య కరాభ్యామపతన్ భువి
వేపథుశ్చాపి తాం దృష్ట్వా శరీరే సమజాయత.
స తు జ్ఞానగరీయస్త్వాత్ తపసశ్చ సమర్థనాత్
అవతస్థే మహాప్రాజ్ఞో ధైర్యేణ పరమేణ హ.
యస్తస్య సహసా రాజన్ వికార స్సమదృశ్యత
తేన సుస్రావ రేతోఽస్య స చ తన్నాన్వబుధ్యత.
ధనుశ్చ సశరం త్యక్త్వా తథా కృష్ణాజినాని చ
స విహాయాశ్రమం తం చ తాం చైవాప్సరసం మునిః.

మైత్రి శక్తిసామర్థ్యానుసారం ఏర్పడింది. కాలగతిలో మన మైత్రి దూరమైంది. స్నేహం శాశ్వతమైనదికాదు. ఏదోరకంగా అది విచ్ఛిన్నమవుతుంది. మనమైత్రి బాల్యక్రీడలకూ అధ్యయనానికీ ఏర్పడింది. ధనపతితో దరిద్రుడికీ తత్వవిదునితో మూర్ఖునికి శూరునితో భీరునికి స్నేహం ఉండదు. సమశీల శ్రుతియుతులకూ సమధనవంతులకూ మాత్రమే స్నేహ వివాహసంబంధాలుంటాయి.అంతేకాదు బలిష్ఠుడూ దుర్బలుడూ,రథికుడూ అరథికుడూ, మిత్రులు కాలేరు. అదేరీతిగా రాజుకూ రాజుకీ మధ్యనే స్నేహం ఉంటుంది. కానీ నీకూనాకూ స్నేహం లేదు- అని ద్రుపదుడు పలికాడు.

అభిమానధనుడైన ద్రోణుడు అవమానజనిత క్రోధంతో రెండుక్షణాలు నిలిచి గిరుక్కున వెనుదిరిగి ప్రతీకారదృష్టితో హస్తినాపురం వైపు అడుగులు వేశాడు. కౌరవరాజధానిలో కృపాచార్యుని ఇంట ప్రవాసం చేస్తున్నాడు.

అలా ఉండగా ఒకనాడు రాకుమారులందరూ నగరంవెలుపల ఉద్యానవనంలో కందుకక్రీడ సాగిస్తుండగా ఆబంతి నూతిలో పడింది. దాన్ని పైకి తీయటానికి వారు వ్యర్థప్రయత్నం చేస్తూన్న సమయంలో శ్యామవర్ణుడైన ఒకానొక విప్రశ్రేష్ఠుడు వారికి కనిపించాడు. అప్పటికాయన అగ్నికార్యం పూర్తి అయింది. ఆ ముఖంలో ఏదో నిరాశ గోచరిస్తూన్నది. రాకుమారులు ఆయన చుట్టూ చేరారు. అంతవరకూ వారి అవస్థను కనిపెడుతూన్న ద్రోణుడు వారి వాంఛితం నెరవేర్చే ఊహతో- ఓభరతవంశీయులారా! ఎంత అవమానం ప్రాప్తించింది మీకు, నూతిలోపడ్డ బంగారు బంతి తీయలేని మీ అస్త్రవిద్యాపాటవం మీక్షత్రియత్వానికే అవమానకరం. ఇలారండి నేను తీస్తాను. నా జీవనాధారం ఏర్పాటు చేయించండి- అని నూతిని సమీపించాడు. అప్పుడు ధర్మరాజు- కృపాచార్యులవారి అంగీకృతితో మీరు ఇక్కడే ఉండండి- అని ద్రోణుని అర్థించాడు.

ద్రోణుడు గుప్పెడు దర్భలు తీసి ఒకొక్కటే నూతిలోకి విడువసాగాడు. అవి ఒకదానికొకటి గుచ్చుకోసాగాయి. అనంతరం వారి అభిమతానుసారం ద్రోణుడు బాణాలతో ఆకందుకాన్ని బైటికి తీశాడు. ఆయన అస్త్రవిద్యాకౌశలానికి వారందరూ ఆశ్చర్యచకితులయ్యారు. ద్రోణుడు అచంచలంగా నిలబడ్డాడు. అప్పుడు వారందరూ ద్రోణాచార్యునికి నమస్కరించి-మహాశయా! ఇంతటి అద్భుత కార్యం ఇలా సాధించవచ్చునని మేము వినలేదు. మీరెవరి పుత్రులు? మీ నామధేయ మేమి? తమకు ఏసేవకావలసినా మేము చేస్తాం- అన్నారు.

ద్రోణుడు వారిమాటలు విని భీష్మాచార్యులకు తనను గురించి విశదంగా చెప్పమనీ ఆ మహాత్ముడు తనను గుర్తించగలడనీ అనగా వారందరూ భీష్మునికి ద్రోణాచార్యుని పరిచయం చేశారు. వారి మాటలు విని భీష్ముడు స్వయంగా వచ్చి ద్రోణుని గూర్చి "వినినట్లు చూచి" వానిని సత్కరించి ఇంటికి తీసికొని వెళ్ళి వాని సమాచారం అడిగాడు.

ద్రోణుడు భీష్ముని సగౌరవంగా సంబోధించి- నేను అగ్నివేశమహర్షి దగ్గర వేదవిద్యతో పాటు విలువిద్యకూడా అభ్యసిస్తూ బ్రహ్మచర్య వ్రతంతో గడుపుతున్నాను. పాంచాల రాజకుమారుడు ద్రుపదు డనేవాడు అక్కడికే అధ్యయనానికి వచ్చాడు. మా ఉభయులకూమైత్రి కలిగింది. ద్రుపదుడు నాప్రాణస్నేహితుడుగా చరిస్తూ తాను రాజ

జగామ రేతస్తత్ తస్య శరస్తంబే పపాత చ
శరస్తంబే చ పతితం ద్విధా తదభవన్నృప.
తస్యాథ మిథునం జజ్ఞే గౌతమస్య శరద్వతః
మృగయాం చరతో రాజ్ఞః శంతనోఽస్తు
యదృచ్ఛయా.
కశ్చిత్ సేనాచరోఽరణ్యే మిథునం తదపశ్యత
ధనుశ్చ సశరం దృష్ట్వా తథా కృష్ణాజినాని చ.
జ్ఞాత్వా ద్విజస్య చాపత్యే ధనుర్వేదాంతగస్య హ
స రాజ్ఞే దర్శయామాస మిథునం సశరం ధనుః
స తదాదాయ మిథునం రాజా చ కృపయాన్వితః
ఆజగామ గృహానేవ మమ పుత్రావితి బ్రువన్.
తతః సంవర్ధయామాస సంస్కారైశ్చాప్యయోజయత్
ప్రాతీపేయో నరశ్రేష్ఠో మిథునం గౌతమస్య తత్.
గౌతమోఽపి తతోఽభ్యేత్య ధనుర్వేదపరోఽభవత్
కృపయా యన్మయా బాలావిమౌ సంవర్ధితావితి.
తస్మాత్ తయోర్నామ చక్రే తదేవ స మహీపతిః
గోపితౌ గౌతమస్తత్ర తపసా సమవిందత.
ఆగత్య తస్మై గోత్రాది సర్వమాఖ్యాతవాంస్తదా
చతుర్విధం ధనుర్వేదం శాస్త్రాణి వివిధాని చ.
నిఖిలేనాస్య తత్ సర్వం గుహ్యమాఖ్యాతవాంస్తదా
సోఽచిరేణైవ కాలేన పరమాచార్యతాం గతః.
తతోఽధిజగ్ముః సర్వే తే ధనుర్వేదం మహారథాః
ధృతరాష్ట్రాత్మజాశ్చైవ పాండవాస్సహ యాదవైః.
వృష్ణయశ్చ నృపాశ్చాన్యే నానాదేశసమాగతాః
విశేషార్థీ తతో భీష్మః పౌత్రాణాం వినయేప్సయా.
ఇష్వస్త్రజ్ఞాన్ పర్యపృచ్ఛదాచార్యాన్
వీర్యసమ్మతాన్
నాల్పధీర్నామహాభాగస్తథానానాస్త్రకోవిదః.
నాదేవసత్త్వో వినయేత్ కురూనస్త్రే మహాబలాన్
ఇతి సంచింత్య గాంగేయస్తదా భరతసత్తమః.
ద్రోణాయ వేదవిదుషే భారద్వాజాయ ధీమతే

పాండవాన్ కౌరవాంశ్చైవ దదౌ శిష్యాన్ నరర్షభ
శాస్త్రతః పూజితశ్చైవ సమ్యక్ తేన మహాత్మనా
స భీష్మేణ మహాభాగస్తుష్టోఽస్త్రవిదుషాం వరః
ప్రతిజగ్రాహ తాన్ సర్వాన్ శిష్యత్వేన మహాయశాః
శిక్షయామాస చ ద్రోణో ధనుర్వేదమశేషతః.
తేఽచిరేణైవ కాలేన సర్వశస్త్రవిశారదాః
బభూవుః కౌరవా రాజన్ పాండవాశ్చామితతేజసః
కథం సమభవద్ ద్రోణః కథం చాస్త్రాణ్యవాప్తవాన్
కథం చాగాత్ కురూన్ బ్రహ్మన్ కస్య పుత్రః
స వీర్యవాన్.
కథం చాస్య సుతో జాతః సోఽశ్వత్థామాస్త్రవిత్తమః
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం విస్తరేణ ప్రకీర్తయ.
గంగాద్వారం ప్రతి బ్రహ్మన్ బభూవ భగవానృషిః
భరద్వాజ ఇతి ఖ్యాతః సతతం సంశితవ్రతః.
సోఽభిషేక్తుం తతో గంగాం పూర్వమేవాగమన్నదీం
మహర్షిభిర్భరద్వాజో హవిర్ధానే చరన్ పురా.
దదర్శాప్సరసం సాక్షాద్ ఘృతాచీమాప్లుతామృషిః
రూపయౌవనసంపన్నాం మదదృప్తాం మదాలసాం.
తస్యాః పునర్నదీతీరే వసనం పర్యవర్తత
వ్యపకృష్టాంబరాం దృష్ట్వా తామృషిశ్చకమే తతః.
తత్ర సంసక్తమనసో భరద్వాజస్య ధీమతః
తతోఽస్య రేతశ్చస్కంద తదృషిర్ద్రోణ ఆదధే.
తతః సమభవద్ ద్రోణః కలశే తస్య ధీమతః
అధ్యగీష్ట స వేదాంశ్చ వేదాంగాని చ సర్వశః.
అగ్నివేశం మహాభాగం భరద్వాజః ప్రతాపవాన్
ప్రత్యపాదయదాగ్నేయమస్త్రమస్త్రవిదాం వరః.
అగ్నేస్తు జాతః స మునిస్తతో భరతసత్తమ
భరద్వాజం తదాగ్నేయం మహాస్త్రం
ప్రత్యపాదయత్.
భరద్వాజసఖా చాసీత్ పృషతో నామ పార్థివః
తస్యాపి ద్రుపదో నామ తదా సమభవత్ సుతః.

కాగానే సమస్త రాజభోగాలూ నాకు సమకూరస్తా నని వాగ్దానం చేశాడు ఆమాటలు నామనస్సులో మెసలుతూనే ఉన్నాయి. ఇలా ఉండగా నా పితృ దేవతలప్రేరణవల్ల నాకు పుత్రవాంఛ కలిగింది. కలగటంవల్ల నేను అర్ధాంగికోసం అన్వేషించి శర ద్వంతుని కుమార్తె సదాచారవ్రత పరాయణు రాలూ అయిన కృపి అనే కన్యకను వివాహం చేసికొన్నాను. ఆమెవల్ల అశ్వత్థామ అనే కుమా రుడు కలిగాడు. వాడు సమస్త పురుషార్థప్రదాయ కుడు. మహాతేజస్వి. భరద్వాజుడు నన్ను నందను నిగా పొంది పొందిన ఆనందమే అశ్వత్థామవల్ల నాకు కలిగింది.

కాలం నడుస్తూన్నది. అశ్వత్థామ పెరుగు తున్నాడు మా పొరుగు ఆశ్రమంలోని ఋషికి గోవులు అధికంగా ఉన్నందువల్ల వారి బాలుడు ఆవు పాలు తాగుతూండటం చూసి అశ్వత్థామ పాల కోసం ఏడుస్తూంటే నాకెంతో బాధకలిగి అధికంగా ఆవులున్న వారిని గోవుకోసం యాచిద్దామని దేశం తిరిగాను. కానీ ప్రయోజనంలేకపోయింది. తిరిగి వచ్చేసరికి పిండిపాలతో అశ్వత్థామను ఊరిస్తున్నారు. ఆ పాలే తాగి అశ్వత్థామ సంతోషిస్తూంటే నా మనస్సు చివుక్కుమంది. ధనార్జన చేయనివాడికిదే అవమానం అని నలుగురూ అంటూండటం విని నామనస్సు క్షోభించింది. దరిద్రంవల్లనే ఇతర బ్రాహ్మ ణులు నన్ను వదిలేశారు. అయినా నేను ధనంకోసం ఒకరిని సేవించి పాపకార్యాలు చెయ్యను. అను కుంటూ భార్యనూ బిడ్డనూ వెంటబెట్టుకొని ద్రుపదమహారాజు దగ్గరకు వెళ్ళాను. అప్పటికే ద్రుపదుడు రాజ్యాభిషిక్తుడయాడని విని ఎంతో సంతోషంతో అతన్ని సమీపించాను. ఆక్షణాలలో నాకు బాలస్మృతులన్నీ గుర్తుకొచ్చాయి. స్నేహ భావంతో నేను సమీపించేసరికి ద్రుపదుడు ఐశ్వర్య గర్వంతో నన్ను దూషించాడు. పైగా నాకూ తనకూ మైత్రి అసంభవం అన్నాడు. మైత్రి అజ రామరం కాదన్నాడు. అంటూ ద్రోణుడు ద్రుప దుని ప్రసంగాన్ని వివరించి. ఆరాత్రికి నాకు భోజ నంమాత్రం పెట్టించగలనన్నాడు. నాకు అవమానం పట్టరానిదైంది. ప్రతీకారవాంఛతో నేను తక్షణం తిరిగి వచ్చాను. శిష్యులద్వారా నా అభీష్టం నెర వేర్చుకోవాలని ఇక్కడకు వచ్చాను. మీరు ఏమి కోరుతున్నారో చెప్పండి. అనగా భీష్ముడు సంతో షించి. ద్విజశ్రేష్ఠా! మీ ధనుర్విద్యాకౌశలం అంతా మా రాజపుత్రులకు నేర్పుతూ ఇక్కడే ఉండండి. కౌరవ రాజభవనంలో మీరు ఉండ వచ్చు, రాజభోగాలన్నీ మీకు జరుగుతాయి. ఈ కురు రాజవంశీయులందరూ మీఅధీనంలో ఉంటారు. మీకు ఏవిధమైన కష్టమూ ఉండదు. నిరభ్యంత రంగా యథేచ్ఛగా మీరిక్కడ ఉండవచ్చు. మీ రిలా దయచేయటం మాఅదృష్టం. మా సౌభాగ్య ఫలంగా మీరు వీళ్ళని శిష్యులుగా గ్రహించి మీ మనోభీష్టం నెరవేర్చుకోండి. అన్నాడు.

130వ అధ్యాయం సమాప్తం.

స నిత్యమాశ్రమం గత్వా ద్రోణేన సహ పార్థివః
చిక్రీడాధ్యయనం చైవ చకార క్షత్రియర్షభః.
తతో వ్యతీతే పృషతే స రాజా ద్రుపదోఽభవత్
పంచాలేషు మహాబాహురుత్తరేషు నరేశ్వర.
భరద్వాజోఽపి భగవానారురోహ దివం తదా
తత్రైవ చ వసన్ ద్రోణస్తపస్తేపే మహాతపాః.
వేదవేదాంగవిద్వాన్ స తపసా దగ్ధకిల్బిషః
తతః పితృ నియుక్తాత్మా పుత్రలోభాన్మహాయశాః.
శారద్వతీంతతోభార్యాంకృపీం ద్రోణోఽన్వవిందత
అగ్నిహోత్రే ధర్మే చ దమే చ సతతం రతాం.
అలభద్ గౌతమీ పుత్రమశ్వత్థామానమేవ చ
సజాతమాత్రోవ్యవదద్ యథైవోచ్చైఃశ్రవాహయః
తచ్ఛ్రుత్వాంతర్హితం భూతమంతరిక్షస్థమబ్రవీత్
అశ్వస్యేవాస్య యద్ స్థామ నదతః ప్రదిశో గతం.
అశ్వత్థామైవ బాలోఽయం తస్మాన్నామ్నా భవిష్యతి
సుతేన తేన సుప్రీతో భారద్వాజస్తతోఽభవత్.
తత్రైవ చ వసన్ ధీమాన్ ధనుర్వేదపరోఽభవత్
స శుశ్రావ మహాత్మానం జామదగ్న్యం పరంతపం.
సర్వజ్ఞానవిదం విప్రం సర్వశస్త్రభృతాం వరం
బ్రాహ్మణేభ్యస్తదా రాజన్ దిత్సంతం వసు సర్వశః.
స రామస్య ధనుర్వేదం దివ్యాన్యస్త్రాణి చైవ హ
శ్రుత్వా తేషు మనశ్చక్రే నీతిశాస్త్రే తథైవ చ.
తతః స వ్రతిభిః శిష్యైస్తపోయుక్తైర్మహాతపాః
వృతః ప్రాయాన్మహాబాహుర్మహేన్ద్రం పర్వతోత్తమం
తతో మహేన్ద్రమాసాద్య భారద్వాజో మహాతపాః
క్షాన్తం దాన్తమమిత్రఘ్నమపశ్యత్ భృగునన్దనం
తతోద్రోణోవృతఃశిష్యైరుపగమ్యభృగూద్వహం
ఆచఖ్యావాత్మనో నామ జన్మ చాంగిరసః కులే.
నివేద్యశిరసాభూమౌపాదౌచైవాభ్యవాదయత్
తతస్తం సర్వముత్సృజ్య వనం జిగమిషుం తదా.
జామదగ్న్యంమహాత్మానంభారద్వాజోఽబ్రవీదిదం
భరద్వాజాత్ సముత్పన్నం తథా త్వం మామయోనిజం.
ఆగతం విత్తకామం మాం విద్ధి ద్రోణం ద్విజర్షభ
తమబ్రవీన్మహాత్మా స సర్వక్షత్రియమర్దనః.
స్వాగతం తే ద్విజశ్రేష్ఠ యదిచ్ఛసి వదస్వ మే
ఏవముక్తస్తు రామేణ భారద్వాజోఽబ్రవీద్వచః.
రామం ప్రహరతాం శ్రేష్ఠం దిత్సన్తం వివిధంవసు
అహం ధన మనన్తం హి ప్రార్థయే విపులవ్రత.
హిరణ్యం మమ యచ్చాన్యద్వసు కించిదిహ స్థితం
బ్రాహ్మణేభ్యో మయాదత్తం సర్వమేతత్తపోధన.
తథైవేయం ధరా దేవీ సాగరాన్తా సపత్తనా
కశ్యపాయ మయా దత్తా కృత్స్నా నాగరమాలినీ.
శరీరమాత్రమేవాద్య మమేదమవశేషితం
అస్త్రాణి చ మహార్హాణి శస్త్రాణి వివిధాని చ.
అస్త్రాణి వా శరీరం వా వరయైతన్మయోద్యతం
వృణీష్వకింప్రయచ్ఛామితుభ్యంద్రోణవదాశుతత్.
అస్త్రాణి మే సమగ్రాణి ససంహారాణి భార్గవ
సప్రయోగరహస్యాని దాతుమర్హస్యశేషతః.
తథేత్యుక్త్వా తతస్తస్మై పాదాదస్త్రాణి భార్గవః
సరహస్యవ్రతం చైవ ధనుర్వేదమశేషతః.
ప్రతిగృహ్య తు తత్సర్వం కృతాస్త్రో ద్విజసత్తమః
ప్రియం సఖాయం సుప్రీతో జగామ ద్రుపదం ప్రతి.

129 వ అధ్యాయము సమాప్తం

## ఏకలవ్యుడు

మహాతేజస్సంపన్నుడైన ద్రోణాచార్యుడు కౌరవ రాజభవనంలో సముచిత సత్కారాలు పొంది భీష్మునిచేత సత్కృతుడై విశ్రాంతి తీసికొన్నాడు. ఆసమయంలో కురువంశీయులైన బాలకులను వెంట బెట్టుకొని వచ్చి శిష్యులుగా అర్పించి అధిక ధనధాన్యరాసు లర్పించాడు భీష్ముడు. ఆవాససౌధం కూడా అత్యంతరమణీయమైనది ఆచార్య ద్రోణునకు ఇచ్చారు. భరద్వాజ కుమారుడు ద్రోణుడు సంతుష్టహృదయంతో ధార్తరాష్ట్రులనూ పాండవులనూ శిష్యులుగా స్వీకరించాడు.

వారందరూ పరివేష్టించి ఉండగా ఒకనాడు ద్రోణాచార్యులు- రాజపుత్రులారా! అస్త్రవిద్యానిపుణులైన అనంతరం మీరందరూ నా కొక మహత్కార్యం చేసిపెట్టాలి. నామనోఽభీష్టాన్ని నెరవేర్చడంలో మీఅభిప్రాయం చెప్పండి- అనగా ధృతరాష్ట్ర సుతులు మౌనంగా ఉండిపోయారు. అర్జునుడు లేచి నిలబడి గురుకార్యం నెరవేరుస్తానని ప్రతిజ్ఞ తీసికొన్నాడు.

ద్రోణాచార్యుని హృదయం ఆనందంతో నిండిపోయింది. అర్జునుని గాఢంగా కౌగిలించుకొన్నాడు. అతని శిరస్సు ముద్దాడాడు. అది మొదలు పాండవులందరికీ దివ్యాస్త్రాలుకూడా నేర్పసాగాడు.

క్రమ క్రమంగా ఇతర రాజకుమారులు కూడా ద్రోణునివద్దకు విద్యాభ్యాసం కోసం రాసాగారు. వారిలో వృష్టివంశీయులూ అంధకవంశీయులూ ఉన్నారు. రాధానందనుడు సూతపుత్రుడు కర్ణుడు కూడా ద్రోణునివద్ద విద్యాభ్యాసానికి చేరాడు. అస్త్ర విద్యావిషయంలో అర్జునునితో పోటీపడుతూ స్పర్థతో మత్సరంతో ఉండేవాడు. ఎప్పుడూ దుర్యోధనునితో ఉంటూ పాండవులను అవహేళన చేసేవాడు.

అర్జునుడు ధనుర్వేదంలో అభిమానం కలవాడు కావడంవల్ల శ్రద్ధతో అది అభ్యసిస్తూ సర్వవిధ ప్రయోగోప సంహారాలలోనూ కుశలుడై ద్రోణునితో సముడుగా నిలిచేవాడు. శిష్యులందరిలో అర్జునుడే అగ్రేసరుడుగా ఉండేవాడు.

అభ్యాస సమయంలో అందరికంటె అర్జునుడు అభినివేశంతో అస్త్రవిద్య గ్రహించటం ఆచార్య ద్రోణుడు గుర్తించాడు. అయినా అందరికీ సమంగానే విద్య నేర్పుతున్నాడు. ద్రోణాచార్యులు నీటిని తెప్పించడానికి అందరికీ ఇచ్చే ఘటాలకంటె చిన్నది అశ్వత్థామ కిచ్చేవాడు. ముందుగా వచ్చిన అశ్వత్థామకు ఇతరులెవ్వరూ చూడకుండా అస్త్రలాఘవాలు నేర్పటం అర్జునుడు గమనించాడు.

అశ్వత్థామ నీటితో వచ్చే సమయానికి వారుణాస్త్రంతో తనఘటం నింపి ఆచార్యునివద్దకు వచ్చేవాడు అర్జునుడు. అది మొదలు అశ్వత్థామకంటె అర్జును డేనాడూ వెనుకబడలేదు. గురుసేవానిరతిలో కూడా అర్జునుడు ఎవ్వరికీ తీసికట్టుగా ఉండేవాడు కాడు. ఇన్ని కారణాలచేత గురుపాదులకు అత్యంత ప్రీతిపాత్రుడయాడు. నిరంతరవిద్యాసాధనతో ఉండే అర్జునునికి ఏనాడూ చీకటిలో అన్నంపెట్ట వద్దని వంటవానిని హెచ్చరించి, ఆవిషయం అర్జునునికి తెలీనివ్వద్దన్నాడు ద్రోణుడు. అలా ఉండగా ఓ ప్రొద్దు అర్జునుడు భోజనం చేస్తుండగా గట్టిగాలి విసరి అక్కడ దీపం ఆరిపోయింది. అయినా అలవాటుకొద్దీ అన్నం నోటికే అందిస్తున్నది చెయ్యి. అది చూసి కుంతీకుమారుడు ఆశ్చర్యంతో—

తతో ద్రుపద మాసాద్య భారద్వాజః ప్రతాపవాన్
అబ్రవీత్ పార్థివం రాజన్ సఖాయం విద్ధి మామిహ.
ఇత్యేవముక్తః సఖ్యా స ప్రీతిపూర్వం జనేశ్వరః
భారద్వాజేన పాంచాలో నామృష్యత వచోఽస్య తత్.
స క్రోధామర్షజిహ్మభ్రూః కషాయీకృతలోచనః
ఐశ్వర్యమదసంపన్నో ద్రోణం రాజాబ్రవీదిదం.
అకృతేయం తవ ప్రజ్ఞా బ్రహ్మన్ నాతిసమంజసా
యన్మాం బ్రవీషి ప్రసభం సఖా తేఽహమితి ద్విజ.
నహి రాజ్ఞా ముదీర్ణానామేవం భూతైర్నరైః క్వచిత్
సఖ్యం భవతి మందాత్మన్ శ్రియా హీనైర్ధనచ్యుతైః.
సౌహృదాన్యపి జీర్యంతే కాలేన పరిజీర్యతః
సౌహృదం మే త్వయా హ్యాసీత్ పూర్వం సామర్థ్యబంధనం.
న సఖ్యమజరం లోకే హృది తిష్ఠతి కస్యచిత్
కాలో హ్యేనం విహరతి క్రోధో వైనం హరత్యుత.
మైవం జీర్ణముపాస్స్వ త్వం సఖ్యం భవత్వపాకృధి
ఆసీత్ సఖ్యం ద్విజశ్రేష్ఠ త్వయా మేఽర్థనిబంధనం.
న దరిద్రో వసుమతో నావిద్వాన్ విదుషః సఖా
న శూరస్య సఖా క్లీబః సఖిపూర్వం కిమిష్యతే.
యయోరేవ సమం విత్తం యయోరేవ సమం శ్రుతం
తయోర్వివాహః సఖ్యం చ న తు పుష్టవిపుష్టయోః.
నాశ్రోత్రియః శ్రోత్రియస్య నారథీ రథినః సఖా
నారాజా పార్థివస్యాపి సఖిపూర్వం కిమిష్యతే.
ద్రుపదేనైవముక్తస్తు భారద్వాజః ప్రతాపవాన్
ముహూర్తం చింతయిత్వా తు మన్యునాభిపరిప్లుతః
స వినిశ్చిత్య మనసా పాంచాలం ప్రతి బుద్ధిమాన్
జగామ కురుముఖ్యానాం నగరం నాగసాహ్వయం.
స నాగపురమాగమ్య గౌతమస్య నివేశనే
భారద్వాజోఽవసత్ తత్ర ప్రచ్ఛన్నం ద్విజసత్తమః
తతోఽస్య తనుజః పార్థాన్ కృపస్యానంతరం ప్రభుః
అస్త్రాణి శిక్షయామాస నాబుధ్యంత చ తం జనాః.
ఏవం స తత్ర గూఢాత్మా కంచిత్ కాలముపాస హ
కుమారాస్త్వథ నిష్క్రమ్య సమేతా గజసాహ్వయం.
క్రీడంతో వీటయా తత్ర వీరాః పర్యచరన్ ముదా
పపాత కూపే సా వీటా తేషాం వై క్రీడతాం తదా.
తతస్తే యత్నమాతిష్ఠన్ వీటాముద్ధర్తుమాదృతాః
న చ తే ప్రత్యపద్యంత కర్మ వీటోపలబ్ధయే.
తతోఽన్యోన్యమవైక్షంత వ్రీడయావనతాననాః
తస్యా యోగమవిందంతో భృశం చోత్కంఠితాభవన్.
తేఽపశ్యన్ బ్రాహ్మణం శ్యామమాపన్నం పలితం కృశం
కృత్యవంతమదూరస్థమగ్నిహోత్రపురస్కృతం.
తే తం దృష్ట్వా మహాత్మానముపగమ్య కుమారకాః
భగ్నోత్సాహక్రియాత్మానో బ్రాహ్మణం పర్యవారయన్.
అథ ద్రోణః కుమారాంస్తాన్ దృష్ట్వా కృత్యవతస్తదా
ప్రహస్య మందం పైశల్యాదభ్యభాషత వీర్యవాన్.
అహో నో ధిగ్బలం క్షాత్రం ధిగేతాం వః కృతాస్త్రతాం
భరతస్యాన్వయే జాతా యే వీటాం నాధిగచ్ఛత.
వీటాం చ ముద్రికాం చైవ హ్యహమేతదపి ద్వయం
ఉద్ధరేయమిషీకాభిర్భోజనం మే ప్రదీయతాం.
ఏవముక్త్వా కుమారాంస్తాన్ ద్రోణః స్వాంగులివేష్టనం
కూపే నిరుదకే తస్మిన్న పాతయదరిందమః.
తతోఽబ్రవీత్ తదా ద్రోణం కుంతీపుత్రో యుధిష్ఠిరః
కృపస్యానుమతే బ్రహ్మన్ భిక్షామాప్నుహి శాశ్వతీం.
ఏవముక్తః ప్రత్యువాచ ప్రహస్య భరతానిదం
ఏషా ముష్టిరిషీకాణాం మయాస్త్రేణాభిమంత్రితా.
అస్యా వీర్యం నిరీక్షధ్వం యదన్యస్య న విద్యతే
భేత్స్యామీషీకయా వీటాం తామిషీకాం తథాన్యయా.

అభ్యాసంచేస్తే చీకటిలోకూడా విద్యాసాధన సాగించవచ్చునని-ఆప్రకారం ఆరంభించాడు.

నిద్రలోఉన్న ద్రోణునికి అర్జునుని ధనుష్టంకారం వినపడింది. ఆయన లేచి వెళ్ళి శిష్యుని కౌగిలించుకొని-ఈవిశాలపృథ్విలో నీఅంతటి విలువిద్యానిపుణుడు ఉండకూడదని నేను ప్రయత్నిస్తున్నాను-అని పలికి నాటినుండి అశ్వ గజ రథాదుల మీద ఉండి యుద్ధంచేయటంతో పాటు భూమి మీద కూడా ఏవిధంగా అస్త్ర విద్యాప్రదర్శనం చెయ్యాలో అందులో సులువు లేమిటో వివరించ సాగాడు.

గదాయుద్ధమూ ఖడ్గచాలనమూ నేర్పుతూ ప్రాస తోమర శక్తి ఆదిగాగల ఆయుధాలతో యుద్ధంచేయడంకూడా అభ్యసింపజేశాడు. ఒకేసారి అనేకాస్త్రాలు విదలడం ఎందరో వీరులతో ఏకైకంగా పోరాడడం నేర్పాడు ఈవిధంగా ద్రోణాచార్యులు అస్త్రవిద్యాసూక్ష్మాలు నేర్పడం విని దూరదేశాల రాజపుత్రులుకూడా వేలకొద్దీ ఆయనకు శిష్యులుగా రాసాగారు.

హిరణ్యధనువ్వ డనేపేరుగల ఎఱుకరాజు కొడుకు ఏకలవ్యుడు ద్రోణాచార్యునివద్దకు వచ్చాడు. కానీ ఎరుకలవాడయిన కారణంచేత ద్రోణుడు వానిని శిష్యునిగా అంగీకరించలేదు. ఏకలవ్యుడు ద్రోణుని చరణకమలాలకు నమస్కరించి తిరిగి పోయాడు. తన అరణ్యంలో ద్రోణుని ప్రతిమను మట్టితో నిర్మించుకొని గురువుగా పూజిస్తూ దృఢసంకల్పంతో ధనుర్విద్యాభ్యాసం ఆరంభించాడు. గురువుమీద భక్తి శ్రద్ధలుంచి ధనుర్విద్యారహస్యాలన్నీ అభ్యాసం చేస్తూ సాధించాడు.

ఒకనాడు ఆచార్యుని అనుజ్ఞపొంది రాజపుత్రులందరూ ఘాతుకమృగహింసకోసం రథాలమీద అరణ్యానికి బయలు దేరారు. వేటకు అవసరమైన సామగ్రితో నాగరకులుకూడా వారిని అనుసరించారు. రాజపుత్రులు తమవెంట వేటకుక్కను కూడా తీసికొనివెళ్ళారు. వారందరూ వేటాడుతూ అన్ని దిక్కులూ తిరుగుతున్నారు. ఆసమయంలో వేటకుక్క ఏకలవ్యుని కుటీరంవైపు పోయింది. నల్లని శరీరంతో మలినదేహంతో ఉన్న ఏకలవ్యుని చూచి ఆకుక్క మొరగసాగింది. అంతతో ఏకలవ్యుడు తన అస్త్రనైపుణ్యం ప్రదరిస్తూ ఒకేమారు ఏడుబాణాలు దాని నోట్లోకి వదిలాడు. ఆబాధతో అది అలానే పాండవులవద్దకు వచ్చింది. దాన్ని చూసి పాండవులు ఆశ్చర్యపోయారు. ఆ విధంగా బాణాలు వదిలిన అజ్ఞాతవీరుని శక్తికి వారు సిగ్గుపడ్డారు, అయినా వానిని ప్రశంసించకుండా ఉండలేకపోయారు. ఆధనుర్ధారిని చూడాలనే ఇచ్ఛతో వారు అన్వేషిస్తూ బయల్దేరి నిర్విరామంగా బాణాలురావడం చూసి అప్రాంతానికి వెళ్ళి వికృత రూపంతో ఉన్న ఏకలవ్యుని చూసి-నువ్వెవరివాడివి? నీ కులగోత్రాలేమిటి-అని ప్రశ్నించారు.

నిషాదరాజు హిరణ్యధన్వుడు నాతండ్రి. నేను ద్రోణాచార్యుల శిష్యుడను. విలువిద్యలో పరిశ్రమ చేస్తున్నాను- అన్నాడు ఏకలవ్యుడు.

ఆవివరాలన్నీ తెలిసికొని నగరానికి తిరిగివచ్చి ద్రోణాచార్యునికి నివేదించారు. అర్జునుడు ఏకలవ్యునే స్మరిస్తూ ఏకాంతంలో ద్రోణాచార్యుని చేరి-ఆచార్యా! మీశిష్యులలో నన్ను మించినవాడు లేడని మీరే అన్నారు. కానీ ఈ ఎరుకలవాడు విలువిద్యలో నన్ను మించిపోయాడు. అతనికి తెలీని అస్త్రవిద్యారహస్యం లేదు-అనవిని ద్రోణుడు

తామన్వయాసమాయోగేషీకాయాగ్రహణంమమ
తతో యథోక్తం ద్రోణేనతత్ సర్వంకృతమంజసా.
తదవేక్ష్య కుమారాస్తే విస్మయోత్ఫుల్లలోచనాః
ఆశ్చర్యమిదమత్యంతమితి మత్వా వచోఽబ్రువన్.
ముద్రికామపి విప్రర్షే శీఘ్రమేతాం సముద్ధర
తతః శరం సమాదాయ ధనుర్ద్రోణో మహాయశాః.
శరేణ విద్ధ్వా ముద్రాం
తామూర్ధ్వమావాహయత్ప్రభుః
సశరం సముపాదాయ కూపాదంగుళివేష్టనం.
దదౌ తతో కుమారాణాం విస్మితానామవిస్మితః
ముద్రికాముద్ధృతాం దృష్ట్వా తమాహుస్తే
కుమారకాః.
అభివాదయామహే బ్రహ్మన్ నైతదన్యేషు విద్యతే
కోఽసి కస్యాసి జానీమో వయం కిం కరవామ హే.
ఏవముక్తస్తతో ద్రోణః ప్రత్యువాచ కుమారకాన్
ఆచక్షధ్వంచభీష్మాయరూపేణచగుణైశ్చమాం
స ఏవ సుమహాతేజాః సాంప్రతం ప్రతిపత్స్యతే
తథేత్యుక్త్వాసగత్వాచభీష్మమూచుఃకుమారకాః
బ్రాహ్మణస్య వచస్తథ్యం తచ్చ కర్మ తథావిధం
భీష్మఃశ్రుత్వాకుమారాణాం ద్రోణం తం ప్రత్యజానత
యుక్తరూపః స హి గురురిత్యేవమనుచింత్య చ.
అథైనమానీయ తదా స్వయమేవ సుసత్కృతం
పరిపప్రచ్ఛ నిపుణం భీష్మః శస్త్రభృతాం వరః
హేతుమాగమనేతచ్చ ద్రోణఃసర్వంన్యవేదయత్
మహర్షేరగ్నివేశస్య సకాశమహమచ్యుత.
అస్త్రార్థమగమం పూర్వం ధనుర్వేదజిఘృక్షయా
బ్రహ్మచారీ వినీతాత్మా జటిలో బహులాః సమాః.
అవసం సుచిరం తత్ర గురుశుశ్రూషణే రతః
పాంచాల్యో రాజపుత్రశ్చ యజ్ఞసేనో మహాబలః.
ఇష్వస్త్రహేతోర్న్యవసత్ తస్మిన్నేవ గురౌ ప్రభుః
స మే తత్ర సఖా చాసీదుపకారీ ప్రియశ్చ మే.

తేనాహం సహ సంగమ్య వర్తయన్ సుచిరం ప్రభో
బాల్యాత్ ప్రభృతి కౌరవ్య సహాధ్యయనమేవ చ.
స మే సఖా సదా తత్ర ప్రియవాదీ ప్రియంకరః
అబ్రవీదితి మాం భీష్మ వచనం ప్రీతివర్ధనం
అహం ప్రియతమః పుత్రః పితుర్ద్రోణ మహాత్మనః
అభిషేక్ష్యతిమాంరాజ్యేసపాంచాల్యోయదాతదా.
త్వద్భోగ్యం భవితా తాత సఖే సత్యేన తే శపే
మమ భోగాశ్చ విత్తం చ త్వదధీనం సుఖాని చ.
ఏవముక్త్వాథ వవ్రాజ కృతాస్త్రః పూజితో మయా
తచ్చ వాక్యమహం నిత్యం మనసా ధారయంస్తదా.
సోఽహంపితృనియోగేనపుత్రలోభాద్ యశస్వినీం
నాతికేశీం మహాప్రజ్ఞాముపయేమే మహావ్రతాం.
అగ్నిహోత్రే చ సత్రే చ దమే చ సతతం రతాం
అలభద్గౌతమీ పుత్రమశ్వత్థామానమౌరసం.
భీమవిక్రమకర్మాణమాదిత్యసమతేజసం
పుత్రేణ తేనప్రీతోఽహంభరద్వాజోమయాయథా.
గోక్షీరం పిబతో దృష్ట్వా ధనినస్తత్ర పుత్రకాన్
అశ్వత్థామారుదద్బాలస్తన్మే సందేహతాం దిశః.
న స్నాతకోఽవసీదేత వర్తమానః స్వకర్మసు
ఇతి సంచింత్య మనసా తం దేశం బహుశో భ్రమన్.
విశుద్ధమిచ్ఛన్ గాంగేయ ధర్మోపేతం ప్రతిగ్రహం
అంతాదంతం పరిక్రమ్యనాధ్యగచ్ఛం పయస్వినీం.
అథ పిష్టోదకేనైనం లోభయంతి కుమారకాః
పీత్వా పిష్టరసం బాలః క్షీరం పీతం మయాపి చ.
ననర్తోత్థాయకౌరవ్యహృష్టోబాల్యాద్విమోహితః
తందృష్ట్వానృత్యమానంతుబాలైఃపరివృతంసుతం.
హాస్యతాముపసంప్రాప్తంకశ్మలం తత్ర మేఽభవత్
ద్రోణం ధిగస్త్వధనినం యో ధనం నాధిగచ్ఛతి.
పిష్టోదకం సుతో యస్య పీత్వా క్షీరస్య తృష్ణయా
నృత్యతి స్మ ముదావిష్టః క్షీరం పీతం మయాప్యుత.

కొంతసేపు ఆలోచించి అర్జునుని వెంటబెట్టుకొని ఏక లవ్యుని ఆశ్రమం చేరాడు.

మలిన దేహుడూ చర్మధారీ అయిన ఏకలవ్యుడు ధనుస్సునుండి శరవర్షం కురిపించడం చూశాడు ద్రోణుడు. ద్రోణాచార్యుని చూస్తూనే ఏకల వ్యుడు త్వరగా ఎదురేగి ఆయనపాదాలకు నమస్క రించాడు. అనంతరం శిష్యునివలె పూజించి నమ స్కరిస్తూ నిలిచాడు. అంజలిబద్ధుడై నిలచిన ఏకల వ్యునిచూస్తూ ద్రోణుడు గురుదక్షిణ సమర్పించ మన్నాడు. ఏకలవ్యుడు సంతోషహృదయంతో- గురుపూజ్యా! తమకు కావలసిందేమిటో ఆజ్ఞాపిం చండి. బ్రహ్మవిదులయిన తమరు ఏదికోరినా ఇవ్వ డానికి సిద్ధంగా ఉన్నాను— అనగా ద్రోణుడు ఏకల వ్యుని కుడిచేతి బొటనవ్రేలు కోరాడు. సత్యవ్రత పాలకుడైన ఏకలవ్యుడు ద్రోణాచార్యుని వాంఛ విని ఏమాత్రం సంకోచించకుండా ఉత్తరక్షణంలో తన దక్షిణహస్తం నుండి బొటనవ్రేలు కోసి యిచ్చాడు. ద్రోణుడు వాని సత్యపాలనకు ప్రీతుడైనాడు. అప్పుడుకూడా ఏకలవ్యుడు మిగి లినవేళ్ళతోనే యథాపూర్వం బాణాలు వదలగలి గాడు. అర్జునుడుమాత్రం సంతుష్టుడయాడు. ఆవి ధంగా చేసి ద్రోణుడు అర్జునునికి చేసినవాగ్దానం నిలబెట్టుకున్నాడు.

ద్రోణాచార్యుని శిష్యులలో భీమదుర్యోధనులు ప్రఖ్యాతులయారు. వారిరువురూ ఒకరియెడ ఒకరు మత్సరంతో ఉండేవారు. ధనుర్విద్యలో అశ్వత్థామా, ఖడ్గయుద్ధంలో నకుల సహదేవులు అనుపమలయారు. రథంమీద ఉండి యుద్ధంచేయటంలో ధర్మరాజు ప్రముఖుడయాడు. సముద్రపర్యంత పరివ్యాప్త భూభాగంలోని రథికులెవరూ అర్జునుని ఎదుట నిలవ లేకపోయారు.

స్థిరచిత్తబలోత్సాహాలుకల వారందరూ అస్త్ర విద్యాకుశలు లయారు. విద్యాభ్యాసంలో కనబరిచే కౌశలంతో అర్జునుడు గురువుగారి అనురాగం అధి కంగా పొందసాగాడు. అందరికీ ఒకే రీతిని నేర్పు తున్నా అర్జునుడు తనప్రతిభతో ఆ రాకుమారులలో అగ్రగణ్యుడయాడు. దుష్టాత్ములైన దుర్యోధనాదులు భీముని బలపరాక్రమాలూ అర్జునుని అస్త్రవిద్యా నైపుణ్యం చూసి అసూయ పడేవారు.

రాకుమారులందరూ అస్త్రవిద్యాకుశలు లయిన అనంతరం ఒకనాడు వారి వారి శక్తిని పరీ క్షించే సంకల్పంతో ద్రోణుడు కృత్రిమమైన 'భాస' మనే పక్షిని తయారుచేయించి ఒక చెట్టుకొమ్మ చివర ఉంచాడు. అది కృత్రిమపక్షి అనేవిషయం ఆకుమారులెవరికీ తెలీనివ్వలేదు. వారందరినీ పిలచి మీరంతా ధనుర్బాణధరులై నిలబడండి. నా ఆజ్ఞ అలకిస్తూనే ఆ పక్షి శిరస్సు ఛేదించాలి. మీ అందరినీ విడివిడిగా ఆజ్ఞాపిస్తాను. ఆ ప్రకారమే మీరు దానిని కొట్టాలి— అని పలికి ధర్మరాజుని పిలిచి ధనుస్సుకి బాణం సంధించి సిద్ధంగా ఉండ మన్నాడు. గురుని ఆజ్ఞానుసారం ధర్మరాజు అస్త్రం సంధించి నిలిచాడు. నిలిచిన ధర్మజు నుద్దేశించి ద్రోణుడు—ఆ వృక్షాగ్రాన ఉన్న పక్షిని చూశావా— అని ప్రశ్నించాడు. ధర్మరాజు చూస్తున్నా నన్నాడు. అయితే ఆపక్షితోపాటు నన్నూ నీ సోదరులనూ ఆ వృక్షాన్నీకూడా చూస్తున్నావా అనగా అన్నీ చూస్తున్నా నన్నాడు ధర్మరాజు.

ఆ మాటలు విని ధర్మజుడు ఆ లక్ష్యం సాధించ లేడని వెనక్కి పిలిచి ద్రోణుడు దుర్యోధనాదులను

ఇతి సంభాషతాం వాచం శ్రుత్వా మే బుద్ధిరచ్యవత్
ఆత్మానం చాత్మనా గర్హన్ మనసేదం వ్యచిన్తయం.
అపి చాహం పురా విప్రైర్వర్జితో గర్హితో వసే
పరోపసేవాం పాపిష్ఠాం న చ కుర్యాం ధనేప్సయా.
ఇతి మత్వా ప్రియం పుత్రం భీష్మాదాయ తతో హ్యహం
పూర్వస్నేహానురాగిత్వాత్ సదారః సౌమకిం గతః.
అభిషిక్తం తు శ్రుత్వైవ కృతార్థో౽స్మీతి చిన్తయన్
ప్రియం సఖాయం సుప్రీతో రాజ్యస్థం సముపాగమం.
సంస్మరన్ సంగమం చైవ వచనం చైవ తస్య తత్
తతో ద్రుపదమాగమ్య సఖిపూర్వమహం ప్రభో.
అబ్రువం పురుషవ్యాఘ్ర సఖాయం విద్ధి మామితి
ఉపస్థితస్తు ద్రుపదం సఖివచ్చాస్మి సంగతః.
స మాం నిరాకారమివ ప్రహసన్నిదమబ్రవీత్
అకృతేయం తవ ప్రజ్ఞా బ్రహ్మన్ నాతిసమంజసా.
యదాత్థ మాం త్వం ప్రసభం సఖా తే౽హమితి ద్విజ
సంగతానీహ జీర్యన్తి కాలేన పరిజీర్యతః.
సౌహృదం మే త్వయా హ్యాసీత్ పూర్వం సామర్థ్యబన్ధనం
నాశ్రోత్రియః శ్రోత్రియస్య నారథీ రథినః సఖా.
సామ్యాద్ధి సఖ్యం భవతి వైషమ్యాన్నోపపద్యతే
న సఖ్యమజరం లోకే విద్యతే జాతు కస్యచిత్ .
కాలో వైనం విహరతి క్రోధో వైనం హరత్యుత
మైనం జీర్ణముపాస్స్వ త్వం సఖ్యం భవత్వపాకృధి.

ఆసీత్ సఖ్యం ద్విజశ్రేష్ఠ త్వయా మే౽ర్థనిబన్ధనం
నహ్యనాఢ్యః సఖాఢ్యస్య నావిద్వాన్ విదుషః సఖా.
న శూరస్య సఖా క్లీబః సఖిపూర్వం కిమిష్యతే
నహి రాజ్ఞాముదీర్ణానామేవంభూతైః నరైః క్వచిత్.
సఖ్యం భవతి మందాత్మన్ శ్రియాహీనైర్ధనచ్యుతైః
నాశ్రోత్రియః శ్రోత్రియస్య నారథీ రథినః సఖా.
నారాజా పార్థివస్యాపి సఖిపూర్వం కిమిష్యతే
అహం త్వయా న జానామి రాజ్యార్థే సంవిదం కృతాం.
ఏకరాత్రం తు తే బ్రహ్మన్ కామం దాస్యామి భోజనం
ఏవముక్తస్త్వహం తేన సదారః ప్రస్థితస్తదా.
తాం ప్రతిజ్ఞాం ప్రతిజ్ఞాయ యాం కర్తాస్మ్యచిరాదివ
ద్రుపదేనైవముక్తో౽హం మన్యునాభిపరిప్లుతః.
అభ్యాగచ్ఛం కురూన్ భీష్మ శిష్యైరర్థీ గుణాన్వితైః
తతో౽హం భవతః కామం సంవర్ధయితుమాగతః.
ఇదం నాగపురం రమ్యం బ్రూహి కిం కరవాణి తే
ఏవముక్తస్తదా భీష్మో భారద్వాజమభాషత.
అపజ్యం క్రియతాం చాపం సాధ్వస్త్రం ప్రతిపాదయ
భుంక్ష్వ భోగాన్ భృశం ప్రీతః పూజ్యమానః కురుక్షయే.
కురూణామస్తి యద్విత్తం రాజ్యం చేదం సరాష్ట్రకం.
త్వమేవ పరమో రాజా సర్వే చ కురవస్తవ.
యచ్చ తే ప్రార్థితం బ్రహ్మన్ కృతం తదితి చిన్త్యతాం
దిష్ట్యా ప్రాప్తో౽సి విప్రర్షే మహాన్మే౽నుగ్రహః కృతః.

150 వ అధ్యాయం సమాప్తం.

## నూటముప్పది ఒకటవ అధ్యాయము

తతః సంపూజితో ద్రోణో భీష్మేణ ద్విపదాం వరః
విశశ్రామ మహాతేజాః పూజితః కురువేశ్మని.
విశ్రాన్తే౽థ గురౌ తస్మిన్ పౌత్రానాదాయ కౌరవాన్
శిష్యత్వేన దదౌ భీష్మో వసూని వివిధాని చ.

గృహం చ సుపరిచ్ఛిన్నం ధనధాన్యసమాకులం
భారద్వాజాయ సుప్రీతః ప్రత్యపాదయత ప్రభుః.
స తాన్ శిష్యాన్ మహేష్వాసః ప్రతిజగ్రాహ కౌరవాన్
పాండవాన్ ధార్తరాష్ట్రాంశ్చ ద్రోణో ముదితమానసః.

క్రమానుసారం ఆహ్వానించి పూర్వరీతినే ప్రశ్నించి దేవులూ ఇతర రాజపుత్రులూ అదే సమాధానం అదేసమాధానం పొందాడు. భీమసేన నకులసహ ఇచ్చారు.

131 వ అధ్యాయము సమాప్తం

## నూట ముప్పది రెండవ అధ్యాయం

### అర్జునుడు

అనంతరం ద్రోణాచార్యులు అరునుని పిలిచి చిరునవ్వుతో ధనుస్సు సంధించి సిద్ధంగా ఉండమనీ రెండు ఘడియల్లో తన ఆజ్ఞ వినగానే లక్ష్యాన్ని ఛేదించమనీ అన్నాడు.

అర్జునుడూ ధనుస్సును మండలాకారంగా లాగి సంధించి ఆ చెట్టుమీది కృత్రిమపక్షివైపు దృష్టి ప్రసారిస్తూ నిలబడ్డాడు. రెండు ఘడియలు గడిచాక ద్రోణాచార్యులు— అర్జునా! నువ్వు నన్నూ ఆవృక్షాన్నీ ఆపక్షినీ చూస్తున్నావా ?— అన్నాడు. అర్జునుడు సమాధానంగా తాను ఆపక్షిని తప్ప మరేవస్తువునూ చూడటం లేదన్నాడు. ద్రోణాచార్యులు ప్రసన్నుడై ఆపక్షియొక్క అవయవాలెలాఉన్నాయో చెప్పమన్నాడు. అర్జునుడు తాను దాని శిరస్సును మాత్రమే చూస్తున్నాననగా ద్రోణుడు పులకితదేహుడై బాణం వదలమని ఆజ్ఞాపించాడు. అర్జునుడు విడిచిన క్షురనామకాస్త్రం ఆపక్షితలను ఛేదించింది. ద్రోణుడు అర్జునునివల్లనే ద్రుపదుడికి పరాభవం జరుగుతుందనీ నిశ్చయించుకొని గాఢంగా కౌగలించుకొన్నాడు.

ఒకనాడు ద్రోణుడు శిష్యులతో గంగానదికి స్నానానికి వెళ్ళాడు. స్నానంచేసే ద్రోణుని ఒక మొసలి పట్టుకొన్నది. ద్రోణుడు దానిని విడిపించుకోగలిగికూడా శిష్యుల్ని పిలిచి తనను రక్షించమన్నాడు. ద్రోణునిమాట వింటూనే అర్జునుడు అయిదుబాణాలు విడిచాడు. మిగిలినవారందరూ తెల్లబోయి చూస్తున్నారు. అర్జునుని బాణాలతో మొసలి ద్రోణుని విడిచి గిలగిల తన్నుకుచచ్చింది. ద్రోణుడు పరమసంతోషంతో అస్త్రాలలో శ్రేష్ఠమయిన బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ఉపదేశిస్తూ ఆ అస్త్రాన్ని సామాన్యమానవులపై ప్రయోగించవద్దనీ అలాచేస్తే అది ప్రపంచాన్నే ధ్వంసంచేస్తుందనీ ఇంద్రియసంయమనంతో ఉపాసిస్తూ అమానుష శత్రువు ఎవరయినా యుద్ధానికి వస్తే వానిమీద ప్రయోగించమన్నాడు. అర్జునుడు గురువు ఆజ్ఞను శిరసావహించాడు. నేను మొదలు ఈప్రపంచంలో నీతో సమమైన వీరుడుండడన్నాడు. ద్రోణుడు.

132 వ అధ్యాయంసమాప్తం

## నూట ముప్పది మూడవ అధ్యాయం

ధార్తరాష్ట్రులూ పాండవులూ అస్త్రవిద్యలో బాహ్లీక విదుర పరివేష్టితుడై ఉన్న ధృతరాష్ట్రు ఆరితేరిన అనంతరం వ్యాస భీష్మ కృప సోమదత్త నితో ద్రోణాచార్యులు ఇలాఅన్నాడు.

ప్రతిగృహ్య చ తాన్ సర్వాన్ ద్రోణో వచనమబ్రవీత్
రహస్యేకః ప్రతీతాత్మా కృతోపసదనాంస్తథా.
కార్యం మే కాంక్షితం కించిద్ధృది సంపరివర్తతే
కృతాస్త్రైస్తత్ ప్రదేయం మే తదేతద్వదతానఘాః.
తచ్ఛ్రుత్వా కౌరవేయాస్తే తూష్ణీమాసన్ విశాంపతే
అర్జునస్తు తతః సర్వం ప్రతిజజ్ఞే పరంతప.
తతోఽర్జునం తదా మూర్ధ్ని సమాఘ్రాయ పునః పునః
ప్రీతిపూర్వం పరిష్వజ్య ప్రరురోద ముదా తదా.
తతో ద్రోణః పాండుపుత్రానస్త్రాణి వివిధాని చ
గ్రాహయామాస దివ్యాని మానుషాణి చ వీర్యవాన్.
రాజపుత్రాస్తథా చాన్యే సమేత్య భరతర్షభ
అభిజగ్ముస్తతో ద్రోణమస్త్రార్థే ద్విజసత్తమం.
వృష్ణయశ్చాంధకాశ్చైవ నానాదేశ్యాశ్చ పార్థివాః
సూతపుత్రశ్చ రాధేయో గురుం ద్రోణమియాత్తదా.
స్పర్ధమానస్తు పార్థేన సూతపుత్రోఽత్యమర్షణః
దుర్యోధనం సమాశ్రిత్య సోఽవమన్యత పాండవాన్.
అభ్యయాత్ స తతో ద్రోణం ధనుర్వేదచికీర్షయా
శిక్షాభుజబలోద్యోగైస్తేషు సర్వేషు పాండవః.
అస్త్రవిద్యానురాగాచ్చ విశిష్టోఽభవదర్జునః
తుల్యేష్వస్త్రప్రయోగేషు లాఘవే సౌష్ఠవేషు చ.
సర్వేషామేవ శిష్యాణాం బభూవాభ్యధికోఽర్జునః
ఐంద్రిమప్రతిమం ద్రోణ ఉపదేశేష్వమన్యత.
ఏవం సర్వకుమారాణామిష్వస్త్రం ప్రత్యపాదయత్
కమండలుం చ సర్వేషాం ప్రాయచ్ఛచ్చిరకారణాత్.
పుత్రాయ చ దదౌ కుంభమవిలంబనకారణాత్
యావత్తే నోపగచ్ఛంతి తావదస్మై పరాం క్రియాం.
ద్రోణ ఆచష్ట పుత్రాయ తత్కర్మ జిష్ణురౌహత
తతః స వారుణాస్త్రేణ పూరయిత్వా కమండలుం.
సమమాచార్యపుత్రేణ గురుమభ్యేతి ఫాల్గునః
ఆచార్యపుత్రాత్ తస్మాత్తు విశేషోపచయేఽపృథక్
న వ్యహీయత మేధావీ పార్థోఽప్యస్త్రవిదాం వరః

అర్జునః పరమం యత్నమాతిష్ఠద్గురుపూజనే.
అస్త్రే చ పరమం యోగం ప్రియో ద్రోణస్య చాభవద్
తం దృష్ట్వా నిత్యముద్యుక్తమిష్వస్త్రం ప్రతి ఫాల్గుణం.
ఆహూయ వచనం ద్రోణో రహః సూతమభాషత
అంధకారేఽర్జునాయాన్నం న దేయం తే కదాచన.
న చాఖ్యేయమిదం చాపి మద్వాక్యం విజయే త్వయా
తతః కదాచిద్భుంజానే ప్రవవౌ వాయురర్జునే.
తేన తత్ర ప్రదీపః స దీప్యమానో విలోపితః
భుంక్త ఏవ తు కౌంతేయో నాస్యాదన్యత్ర వర్తతే.
హస్తస్తేజస్వినస్తస్య అనుగ్రహణకారణాత్
తదభ్యాసకృతం మత్వా రాత్రావపి స పాండవః.
యోగ్యాం చక్రే మహాబాహుర్ధనుషా పాండునందనః
తస్య జ్యాతలనిర్ఘోషం ద్రోణః శుశ్రావ భారత.
ఉపేత్య చైనముత్థాయ పరిష్వజ్యేదమబ్రవీత్
ప్రయతిష్యే తథా కర్తుం యథా నాన్యో ధనుర్ధరః.
త్వత్సమో భవితా లోకే సత్యమేతద్బ్రవీమి తే
తతో ద్రోణోఽర్జునం భూయో హయేషు చ
గజేషు చ.
రథేషు భూమావపి చ రణశిక్షామశిక్షయత
గదాయుద్ధేఽసిచర్యాయాం తోమరప్రాసశక్తిషు.
ద్రోణః సంకీర్ణయుద్ధే చ శిక్షయామాస కౌరవాన్
తస్య తత్ కౌశలం శ్రుత్వా ధనుర్వేదజిఘృక్షవః
రాజానో రాజపుత్రాశ్చ సమాజగ్ముః సహస్రశః
తతో నిషాదరాజస్య హిరణ్యధనుషః సుతః.
ఏకలవ్యో మహారాజ ద్రోణమభ్యాజగామ హ
న స తం ప్రతిజగ్రాహ నైషాదిరితి చింతయన్.
శిష్యం ధనుషి ధర్మజ్ఞస్తేషామేవాన్వవేక్షయా
స తు ద్రోణస్య శిరసా పాదౌ గృహ్య పరంతపః.
అరణ్యమనుసంప్రాప్య కృత్వా ద్రోణం మహీమయం
తస్మిన్నాచార్యవృత్తిం చ పరమామాస్థితస్తథా.
ఇష్వస్త్రే యోగమాతస్థే పరం నియమమాస్థితః

మహారాజా! మీ కుమారులందరూ అస్త్రవిద్యలో ఆరితేరారు. మీరు అనుమతిస్తే అస్త్రవిద్యాప్రదర్శనం చేయిస్తాను— అన విని ధృతరాష్ట్రుడు ద్రోణుని అభినందించి అస్త్రవిద్యాప్రదర్శనానికి కావలసిన ఏర్పాట్లూ సమయస్థలాలూ చెప్పినట్లయితే ఆ ప్రకారం చేయిస్తాననగా నేను అంధుణ్ణయినందుకు విచారిస్తున్నాను. నాకు కన్నులే ఉంటే వీరందరి అస్త్రవిద్యాప్రదర్శనాన్ని చూడగలిగేవాడిని— అని పలికి విదురుని పిలిచి ద్రోణుని ఆజ్ఞను అక్షరాలా పాలించమన్నాడు.

ద్రోణుడు రాజసభ వీడి విద్యాప్రదర్శనానికి రంగభూమిని నిశ్చయించి దానిని కొలిపించాడు. ఆ భూమిని లతావృక్షగుల్మకంటకరహితంగా సమతలం చేయించాడు ఉత్తరదిక్కున పల్లంగా ఉంచాడు. రంగస్థల వాస్తుపూజా దర్శనానికి రావలసిందిగా దండోరా వేయించాడు. శుభ తిథివార నక్షత్రాలు చూసి వాస్తుపూజ చేయించాడు. అనంతరం మహాశిల్పులు వాస్తుశాస్త్ర మర్యాదానుసారం విశాలమైన ప్రేక్షకాగారానికి పునాదులు వేశారు. రాజులూ అంతఃపురస్త్రీలూ సుఖంగా దర్శించడానికి సుందరభవనాలు నిర్మించారు. జానపదులకోసం ఎత్తైన మంచెలు కట్టారు. ముహూర్త దినంనాడు ధృతరాష్ట్రుడు భీష్మ కృప సోమదత్త బాహ్లీక భూరిశ్రవసులతో నగరం వెలుపల ప్రేక్షకగృహానికి వచ్చాడు. మణులతో రత్నాలతో అలరారే మందిరంలో ప్రవేశించాడు. ఆమందిరం చుట్టూ ముత్యాల తోరణాలు వ్రేలాడుతున్నాయి.

సౌభాగ్యవతి గాంధారీ, కుంతీ, దాసదాసీ జనంతో అవసరవస్తుసామగ్రితో ఆనందంగా విచ్చేశారు. నగరప్రజలందరూ రాకుమారుల విద్యాదర్శన కుతూహలంతో వచ్చారు. మంగళవాద్యాలు చెలరేగాయి. జనులఘోష పెల్లురేగింది. రంగస్థలం మహాసాగరంలా కనిపిస్తోంది. ధవళయజ్ఞోపవీతంతో శ్వేతవస్త్రధారియై ద్రోణుడు అశ్వత్థామతో మేఘరహితమైన ఆకాశంలో చంద్రునివలె ప్రవేశించాడు. ద్రోణాచార్యుని తల గడ్డము మీసము నెరసి ఉన్నాయి శ్వేతచందనంతో తెల్లని పూలమాలతో శోభిల్లే ఆయన సుముహూర్తసమయానికి దేవతాపూజ చేసి మంత్రవేత్తలచేత మంత్రపాఠం జరిపించాడు.

ధృతరాష్ట్రుడు మణిరత్న సువర్ణభూషణాలనూ చీనిచీనాంబరాలనూ కృపాచార్యునికీ ద్రోణునికీ అర్పించాడు. పుణ్యాహవాచనం హోమాది కార్యాలు సక్రమంగా నడిచాయి. అప్పుడు రంగస్థలంలోకి నానావిధాలయిన శస్త్రాలు వచ్చాయి. భరతవంశ రాజకుమారులు కవచధారులై ధనుర్బాణధరులై రథాలమీద రంగస్థలప్రవేశం చేశారు. ధర్మరాజాదులు జ్యేష్ఠానుక్రమణికగా ద్రోణాచార్యులకూ కృపాచార్యులకూ నమస్కార సత్కారాలు జరిపి ఆశీర్వాదాలు పొంది ప్రసన్నమనస్కులై పుష్పాలతో నిండిన అస్త్రశస్త్రాలకు రక్తచందనంతోనూ పూలమాలలతోనూ పూజలు జరిపారు. వారందరూ రక్తచందనం పూసుకున్నారు. అరుణవర్ణ పుష్పమాలలు ధరించారు. వారి నేత్రాంచలాలు అరుణకాంతులీనుతున్నాయి. రథాలమీద రక్తారుణపతాకా లెగురుతున్నాయి.

ద్రోణాచార్యుని ఆజ్ఞానుసారం కౌరవులు నారి తొడిగి ధనుష్టంకారం చేసి శరసంధానించి తమ తమ అస్త్రకౌశల ప్రదర్శనం ప్రారంభించారు. వారు విడిచే బాణాలు తమ తలలకు తగులుతాయని భయంతో చాలామంది తలలు వంచుకొంటు

పరయా శ్రద్ధయోపేతో యోగేన పరమేణ చ.
విమోక్షే దానసంధానే లఘుత్వం పరమాప సః
అథ ద్రోణాభ్యనుజ్ఞాతాః కదాచిత్ కురుపాండవాః
రథైర్వినిర్యయుః సర్వే మృగయామరిమర్దనః
తత్రోపకరణం గృహ్య నరః కశ్చి ద్యదృచ్ఛయా.
రాజన్ననుజగామైకః శ్వానమాదాయ పాండవాన్
తేషాం విచరతాం తత్ర తత్తత్కర్మచికీర్షయా.
శ్వాచరన్ సవనేమూఢో నైషాదిం ప్రతిజగ్మివాన్
స కృష్ణం మలదిగ్ధాంగం కృష్ణాజినజటాధరం.
నైషాదిం శ్వా సమాలక్ష్య భష స్తస్థౌ తదన్తికే
తదా తస్యాథ భషతః శునః సప్త శరాన్ ముఖే.
లాఘవం దర్శయన్నస్త్రే ముమోచ యుగపద్యథా
స తు శ్వా శరపూర్ణాస్యః పాండవానాజగామహ.
తం దృష్ట్వా పాండవావీరాః పరంవిస్మయమాగతాః
లాఘవం శబ్దవేధిత్వం దృష్ట్వా త త్పరమం తదా.
ప్రేక్ష్య తం వ్రీడితాశ్చాసన్ ప్రశశంసుశ్చ సర్వశః
తంతతోఽన్వేషమాణా స్తే వనే వననివాసినం.
దదృశుః పాండవా రాజన్నస్యన్తమనిశం శరాన్
న చైనమభ్యజానం స్తే తదా వికృతదర్శనం.
అథైనం పరిపప్రచ్ఛుః కో భవాన్ కస్య వేత్యుత
నిషాదాధిపతేర్వీరా హిరణ్యధనుషః సుతం.
ద్రోణశిష్యం చ మాం విత్త ధనుర్వేదకృతశ్రమం
తే తమాజ్ఞాయ తత్త్వేన పునరాగమ్య పాండవాః.
యథావృత్తం వనేసర్వం ద్రోణాయాచఖ్యురద్భుతం
కౌన్తేయ స్త్వర్జునో రాజన్నేకలవ్యమనుస్మరన్
రహో ద్రోణం సమాసాద్య ప్రణయాదిదమబ్రవీత్
తదాహం పరిరభ్యైకః ప్రీతిపూర్వమిదం వచః.
భవతోక్తో న మే శిష్య స్త్వద్విశిష్టో భవిష్యతి
అథ కస్మాన్మద్విశిష్టో లోకాదపి చ వీర్యవాన్.
అన్యోఽస్తి భవతః శిష్యో నిషాదాధిపతేః సుతః
ముహూర్తమివతం ద్రోణశ్చిన్తయిత్వావినిశ్చయం.

సవ్యసాచినమాదాయ నైషాదిం ప్రతిజగ్మివాన్
దదర్శ మలదిగ్ధాంగం జటిలం చీరవాససం.
ఏకలవ్యం ధనుష్పాణిమస్యన్తమనిశం శరాన్
ఏకలవ్యస్తుతం దృష్ట్వా ద్రోణమాయాన్తమన్తికాత్.
అభిగమ్యోపసంగృహ్య జగామ శిరసా మహీం
పూజయిత్వా తతో ద్రోణం విధివత్ స నిషాదజః.
నివేద్య శిష్యమాత్మానం తస్థౌ ప్రాంజలిరగ్రతః
తతో ద్రోణోఽబ్రవీ ద్రాజన్నేకలవ్యమిదం వచః.
యది శిష్యోఽసి మే వీర వేతనం దీయతాం మమ
ఏకలవ్యస్తు తచ్ఛ్రుత్వాప్రీయమాణోఽబ్రవీదిదం.
కిం ప్రయచ్ఛామి భగవన్నాజ్ఞాపయతుమాం గురుః
న హి కించిద దేయం మే గురవే బ్రహ్మ విత్తమ.
తమబ్రవీత్ త్వయాంగుష్ఠో దక్షిణో దీయతామితి
ఏకలవ్యస్తు తచ్ఛ్రుత్వా వచో ద్రోణస్య దారుణం.
ప్రతిజ్ఞామాత్మనో రక్షన్ సత్యే చ నియతః సదా
తథైవ హృష్టవద నస్తథైవాదీనమానసః.
ఛిత్వావిచార్య తం ప్రాదా

ద్ద్రోణాయాంగుష్ఠమాత్మనః
స సత్యసంధం నైషాదిం దృష్ట్వా ప్రీతోఽబ్రవీదిదం.
ఏవం కర్తవ్యమితి వా ఏకలవ్యమభాషత
తతః శరం తు నైషాదిరంగుళీభిర్వ్యకర్షత.
న తథా చ సశీఘ్రోభూద్యథా పూర్వం నరాధిప
తతోఽర్జునః ప్రీతమనా బభూవ విగతజ్వరః.
ద్రోణశ్చ సత్యవాదాసీన్నాన్యోఽభిభవితార్జునం
ద్రోణస్యతుతదాశిష్యౌగదా యోగ్యౌబభూవతుః.
దుర్యోధనశ్చ భీమశ్చ సదా సంరబ్ధమానసౌ
అశ్వత్థామా రహస్యేషు సర్వేష్వభ్యధికోఽభవత్.
తథాతి పురుషానన్యాన్ త్సారుకౌ యమజావుభౌ
యుధిష్ఠిరో రథశ్రేష్ఠ స్సర్వత్ర తు ధనంజయః
ప్రథిత స్సాగరాంతాయాం రథయూథపయూథపః
బుద్ధియోగబలోత్సాహైస్సర్వాస్త్రేషు చ నిష్ఠితః.

న్నారు. కొందరు నిర్భయంగా ఆశ్చర్యంగా చూస్తున్నారు. రాకుమారులందరూ గుఱ్ఱాలమీద ఎక్కి తమతమ పేర్లు చెక్కబడిన బాణాలు విచిత్రంగా విడుస్తున్నారు. గంధర్వనగర సదృశంగా ఉన్న ఆ రంగస్థలాన్ని చూసి జనులు ఆనందంతో నినాదాలు చేస్తున్నారు. ప్రప్రథమతః బాణకౌశలం ప్రదర్శించి అనంతరం రథం నడపడంలో నేర్పు ప్రకటించారు. ఏనుగులమీదనూ గుర్రాలమీదనూ కూర్చుని యుద్ధంచేయడం ప్రదర్శించారు. కత్తీ డాలూ పట్టుకుని యుద్ధప్రదర్శనం చూపించారు. రకరకాలప్రదర్శనాలతో ప్రేక్షకులు చకితులౌతూండగా దుర్యోధనభీమసేనులు గదాధరులై పర్వతాలవలె రంగస్థలం ప్రవేశించారు. ఒకరికెదురుగా ఒకరు నిలిచి మదపుటేనుగుల్లా ఘీంకరిస్తూ చరించసాగారు. ఈ వివరాలన్నీ విదురుడు ధృతరాష్ట్రునికీ కుంతి గాంధారికీ ప్రత్యక్షరా వ్యాఖ్యానించి చెబుతున్నారు.

133 వ అధ్యాయము సమాప్తం

## నూట ముప్పది నాల్గవ అధ్యాయం

భీమ దుర్యోధనులిద్దరూ రంగస్థలంలో తీవ్రంగా తమ శక్తిని ప్రదర్శిస్తున్నారు. ప్రేక్షకులు తమ తమ అభిమానాలనుబట్టి రెండుభాగాలుగా చీలారు. కొందరు దుర్యోధనుని గదాయుద్ధాన్ని ప్రశంసిస్తూంటే మరికొందరు భీమసేనుని హస్తకౌశలాన్ని అభినందిస్తున్నారు. ప్రేక్షకాగారంనుండి అభినందనపరంపరలకోలాహలం దశదిశలా వ్యాప్తిస్తున్నది. పరస్పరవిద్వేషాలతో భీమదుర్యోధనులు రంగభూమిని సంక్షుభితసాగరంగా మారుస్తూంటే ద్రోణాచార్యుడు చూసి అశ్వత్థామను పిలిచి —

నాయనా! ఈమహావీరు లిద్దరూ అస్త్రవిద్యలో ఆరితేరినవారు. ఇప్పుడు వీరిని ఈ ప్రదర్శనంనుండి ఆపుచెయ్యి. లేకపోతే విద్వేషం ప్రబలిపోతుంది— అన విని అశ్వత్థామ రంగభూమి ప్రవేశించి భీమ దుర్యోధను లిద్దరినీ ఉద్దేశించి— గురువుల ఆజ్ఞ ప్రకారం మీరిద్దరూ యుద్ధం ఆపు చెయ్యండి. మీరు చేసే ఈపని ఎవరూ హర్షించడంలేదు. ఈ అనుచిత కార్యాన్ని ఇంతతో ఆపండి— అని ప్రళయకాలంలో లేచే సముద్రతరంగాల్లా విజృంభించే భీమసేన దుర్యోధనుల్ని వారించాడు. అనంతరం ద్రోణాచార్యులు రంగభూమిలో వినిపించే నానావిధవాద్యాల కోలాహలాన్నీ ఆపుతూ—

ఓ ప్రేక్షక జనులారా! నాకుమారునికంటె ప్రియతముడయిన అర్జునుని అస్త్రవిద్యాకౌశలం ఇప్పుడు మీరు చూస్తారు. భగవంతుడయిన నారాయణునితో సమానమయిన పరాక్రమంగల ఇంద్రనందనుడు కుంతీపుత్రుడు తన శస్త్ర అస్త్ర విద్యాకౌశలం ప్రదర్శిస్తాడు— అన్నాడు.

ద్రోణాచార్యుని స్వస్తివాక్యాలతో అర్జునుడు ధనుర్బాణధరుడై రంగమంటపంలో ప్రవేశించాడు. అతని నీలిశరీరంపై బంగారుకవచం ప్రకాశిస్తోంది. సూర్యునివలె ఇంద్రధనుస్సువలె మెరుపువలె సంధ్యామేఘంవలె అర్జునుడు ప్రకాశిస్తున్నాడు. ప్రేక్షకాగారంనుంచి హర్షధ్వానాలు చెలరేగాయి.

అస్త్రే గుర్వనురాగే చ విశిష్టోఽభవదర్జునః
తుల్యేష్వస్త్రోపదేశేషు సౌష్ఠవేన చ వీర్యవాన్.
ఏక స్సర్వకుమారాణాం బభూవాతిరథోఽర్జునః
ప్రాణాధికం భీమసేనం కృతవిద్యం ధనంజయమ్.
ధార్తరాష్ట్రా దురాత్మానో నామృష్యన్త పరస్పరమ్
తాంస్తు సర్వాన్ సమానీయ
సర్వవిద్యాస్త్రశిక్షితాన్,
ద్రోణః ప్రహరణజ్ఞానే జిజ్ఞాసుః పురుషర్షభః
కృత్రిమం భాసమారోప్య వృక్షాగ్రే శిల్పిభిఃకృతమ్,
అవిజ్ఞాతం కుమారాణాం లక్ష్యభూతముపాదిశత్
శీఘ్రం భవన్తస్సర్వేఽపి ధనూంష్యాదాయ సర్వశః
భాసమేతం సముద్దిశ్య తిష్ఠధ్వం సంధితేషవః
మద్వాక్యసమకాలం తు శిరోఽస్య వినిపాత్యతామ్,
ఏకైకశో నియోక్ష్యామి తథా కురుత పుత్రకాః
తతో యుధిష్ఠిరం పూర్వమువాచాంగిరసాం వరః,
సంధత్స్వ బాణం దుర్ధర్ష మద్వాక్యాన్తే విముంచ తమ్
తతో యుధిష్ఠిరః పూర్వం ధనుర్గృహ్య పరంతపః,
తస్థౌ భాసం సముద్దిశ్య గురువాక్యప్రచోదితః
తతో వితతధన్వానం ద్రోణస్తం కురునన్దనమ్.
స ముహూర్తాదువాచేదం వచనం భరతర్షభ
పశ్యైనం తం ద్రుమాగ్రస్థం భాసం నరవరాత్మజ.
పశ్యామీత్యేవమాచార్యం ప్రత్యువాచ యుధిష్ఠిరః
స ముహూర్తాదివ పునర్ద్రోణస్తం ప్రత్యభాషత.
అథ వృక్షమిమం మాం వా భ్రాతౄన్వాపి ప్రపశ్యసి
తమువాచ స కౌన్తేయః పశ్యామ్యేనం వనస్పతిమ్,
భవన్తం చ తథా భ్రాతౄన్ భాసం చేతి పునః పునః
తమువాచాపసర్పేతి ద్రోణోఽప్రీతమనా ఇవ.
నైతచ్ఛక్యం త్వయా వేద్ధుం లక్ష్యమిత్యేవ కుత్సయన్
తతో దుర్యోధనాదీంస్తాన్ ధార్తరాష్ట్రాన్
మహాయశాః,
తేనైవ క్రమయోగేన జిజ్ఞాసుః పర్యపృచ్ఛత
అన్యాంశ్చ శిష్యాన్ భీమాదీన్
రాజ్ఞశ్చైవాన్యదేశజాన్
తథా చ సర్వే తత్ సర్వం పశ్యామ ఇతి కుత్సితాః,

181 వ అధ్యాయం సమాప్తం,

## నూటముప్పది రెండవ అధ్యాయము

తతో ధనంజయం ద్రోణః స్మయమానోఽభ్యభాషత
త్వయేదానీం ప్రహర్తవ్యమేతల్లక్ష్యం విలోక్యతామ్.
మద్వాక్యసమకాలం తే మోక్తవ్యోఽత్ర భవేచ్ఛరః
వితత్య కార్ముకం పుత్ర తిష్ఠ తావన్ముహూర్తకమ్,
ఏవముక్తః సవ్యసాచీ మండలీకృతకార్ముకః
తస్థౌ భాసం సముద్దిశ్య గురువాక్యప్రచోదితః.
ముహూర్తాదివ తం ద్రోణస్తథైవ సమభాషత
పశ్యస్యేనం స్థితం భాసం ద్రుమం మామపి చార్జున.
పశ్యామ్యేకం భాసమితి ద్రోణం పార్థోఽభ్యభాషత
న తు వృక్షం భవన్తం వా పశ్యామీతి చ భారత,
తతః ప్రీతమనా ద్రోణో ముహూర్తాదివ తం పునః
ప్రత్యభాషత దుర్ధర్షః పాండవానాం మహారథమ్.
భాసం పశ్యసి యద్యేనం తథా బ్రూహి పునర్వచ
శ్శిరః పశ్యామి భాసస్య న గాత్రమితి సోఽబ్రవీత్.
అర్జునేనైవముక్తస్తు ద్రోణో హృష్టతనూరుహః
ముంచస్వేత్యబ్రవీత్ పార్థం స
ముమోచావిచారయన్.
తతస్తస్య నగస్థస్య క్షురేణ సిశితేన చ

శంఖధ్వానమూ వాద్యఘోషా మిన్నుముట్టాయి.

పాండవమధ్యముడైన కుంతీపుత్రుడితడే! వీడే దేవతాధీశుడైన ఇంద్రుని ప్రియనందనుడు, కౌరవ వంశ రక్షకుడు, అస్త్రవిద్యావిదులలో అగ్రేసరుడు, ధర్మజ్ఞుడు, శీలవంతుడు, జ్ఞాననిధి— అంటూ మహాజనులందరూ అభివందిస్తూంటే కుంతి కన్నులనుండి ఆనందబాష్పాలూ స్తనములనుండి క్షీరధారలూ ప్రవించాయి.

ఈ కోలాహలం అంతా విని ధృతరాష్ట్రుడు ఏం జరుగుతోందని విదురుని యడిగాడు.

పాండునందను డయిన అర్జునుడు కవచధారియై రంగభూమిలో అడుగుపెట్టాడు. ఆ కారణం వల్లనే ఇంత ఉత్సాహకోలాహలం జరుగుతోంది— అన్నాడు విదురుడు.

కుంతీయావమయిన అరణిలోంచి ధర్మజ భీమసేన అర్జునులనే అగ్నులు మూడూ పుట్టాయి. వీరి ముగ్గురివల్లా నాకు రక్షణ జరుగుతుంది— అన్నాడు ధృతరాష్ట్రుడు.

క్రమ క్రమంగా ప్రేక్షకాగారంలో ప్రశాంతత ప్రవేశించింది. ద్రోణాచార్యుని ఆదేశానుసారం అర్జునుడు అస్త్రవిద్యా ప్రదర్శనం ఆరంభించాడు. ప్రప్రథమంగా ఆగ్నేయాస్త్రం ప్రయోగించి అగ్నిని ఉద్భవింపజేసి అనంతరం వారుణాస్త్రంతో దానిని ఉపసంహరించి వాయవ్యాస్త్రంతో తనశక్తిని ప్రదర్శించి పర్జన్యాస్త్రంతో మేఘాలను సృష్టించాడు. భౌమాస్త్రంతో భూమినీ పార్వతాస్త్రంతో పర్వతాలనూ సృష్టించి అంతర్ధానాస్త్రంతో వానిని అదృశ్యం చేశాడు. ఒకక్షణంలో సాలప్రాంశుడుగా మరొక క్షణంలో అంగుష్ఠదేహుడుగా ఒక నిమేషంలో రథంమీద నిలబడీ, మరొక నిమిషంలో భూమిమీద నిలిచీ తన అస్త్రకౌశలాన్ని ప్రదర్శిస్తున్నాడు. ద్రోణాచార్యునికి అత్యంతప్రియు డయిన అర్జునుడు నానాప్రకారాలుగా బాణాలు విడుస్తున్నాడు. ఆరంగమంటపంలో లోహనిర్మితమయిన వరాహాలు అన్నివైపులా చరిస్తుంటే అర్జునుడు ఒకేసారి అయిదు బాణాలు వాని ముఖాలలోకి వదిలాడు. ఒక ప్రాంతంలో కొమ్ములకు తాళ్ళుపోసి కట్టబడిన ఆవులున్నాయి. వానిమీద ఒకేసారి పందొమ్మిదిబాణాలు విడిచాడు అర్జునుడు. ఈప్రకారంగా అర్జునుడు గదా ఖడ్గ ధనుస్సులతో తనశక్తిని ప్రదర్శిస్తున్నాడు.

ఆ సమయంలో రంగమంటపద్వారంలో ఒక్క మహావీరుని భుజాస్ఫాలన ధ్వని వినబడింది. ఆధ్వని విని సభాసదులు ఏపర్వతమో బద్దలయిందో భూమి బీటలు వారిందో జలపూర్ణమయిన మేఘం గర్జిస్తోందో అని తర్కించుకోసాగారు. అలా తర్కించుకుంటూ శబ్దం వచ్చినవైపు తలలు త్రిప్పారు. ఆ సమయంలో అయిదు నక్షత్రాలతో ప్రకాశించే హస్త సమీపంలో చంద్రునివలె ద్రోణాచార్యులు ప్రకాశిస్తున్నాడు.

దుర్యోధనుడు ఒక్కసారి లేచి నిలబడ్డాడు. దుర్యోధన సోదరులందరూ అశ్వత్థామతో సహా అతనిని అనుసరించి నిలిచారు. దానవసంహారార్థమై దేవతలమధ్య నిలిచిన దేవేంద్రునివలె గదాధారియైన దుర్యోధనుడు ప్రకాశిస్తున్నాడు.

134 వ అధ్యాయంసమాప్తం

శిఉత్కృత్య తరసా పాతయామాస పాండవః.
తస్మిన్ కర్మణి సంసిద్ధే పర్యష్వజత పాండవం
మేనే చ ద్రుపదం సంఖ్యే సానుబంధం పరాజితం.
కస్యచి త్త్వథ కాలస్య సశిష్యోఽంగిరసాంవరః
జగామ గంగామభితో మజ్జితుం భరతర్షభ.
అవగాఢమథో ద్రోణం సలిలే సలిలేచరః
గ్రాహో జగ్రాహ బలవాన్ జంఘాంతే కాలచోదితః
ససమర్థోఽపిమోక్షాయశిష్యాన్ సర్వానచోదయత్
గ్రాహం హత్వా మోక్షయధ్వం మామితి
త్వరయన్నివ.
తద్వాక్యసమకాలం తు బీభత్సుర్నిశితైః శరైః
అవార్యైః పంచభిర్గ్రాహమగ్నమంభస్యతాడయత్
ఇతరే త్వథ సమ్మూఢా స్తత్ర తత్ర ప్రపేదిరే
తం తు దృష్ట్వా క్రియోపేతంద్రోణోఽమన్యత
పాండవం.
విశిష్టం సర్వశిష్యేభ్యః ప్రీతిమాంశ్చాభవత్ తదా
స పార్థబాణై ర్బహుధా ఖండశః పరికల్పితః.
గ్రాహః పంచత్వమాపేదే జంఘాం త్యక్త్వా మహాత్మనః
అథాబ్రవీన్మహాత్మానం భారద్వాజో మహారథం.
గృహాణేదం మహాబాహో విశిష్టమతిదుర్ధరం
అస్త్రం బ్రహ్మశిరో నామ సప్రయోగ నివర్తనం.
నచతేమానుషేష్వేతత్ప్రయోక్తవ్యం కథంచన
జగద్ వినిర్దహేదేతదల్పతేజసి పాతితం.
అసామాన్యమిదం తాత లోకేష్వస్త్రం నిగద్యతే
త ద్ధారయేథాః ప్రయతశ్శృణు చేదం వచో మమ.
బాధేతామానుషశ్శత్రుర్యది త్వాం వీర కశ్చన
తద్వధాయ ప్రయుంజీథా స్తదస్త్రమిదమాహవే.
తథేతి సంప్రతిశ్రుత్య బీభత్సు స్సకృతాంజలిః
జగ్రాహ పరమాస్త్రం తదాహ చైనం పునర్గురుః
భవితా త్వత్సమో నాన్యః పుమాల్లోకే ధనుర్ధరః.

132 వ అధ్యాయం సమాప్తం

## నూట ముప్పది మూడవ అధ్యాయం

కృతాస్త్రాన్ ధార్తరాష్ట్రాంశ్చ పాండుపుత్రాంశ్చ
భారత
దృష్ట్వా ద్రోణోఽబ్రవీత్ రాజన్ ధృతరాష్ట్రం
జనేశ్వరం.
కృపస్య సోమదత్తస్య బాహ్లీకస్య చ ధీమతః
గాంగేయస్య చ సాంనిధ్యే వ్యాసస్య విదురస్య చ.
రాజన్ సంప్రాప్తవిద్యాస్తే కుమారాః కురుసత్తమ
తే దర్శయేయు స్స్వా శిక్షాం రాజన్ననుమతేతవ.
తతోఽబ్రవీన్మహారాజః ప్రహృష్టేనాంత రాత్మనా
భారద్వాజ మహత్ కర్మకృతం తే ద్విజసత్తమ.
యదానుమన్యసే కాలంయస్మిన్ దేశే యథాయథా
తథాతథా విధానాయ స్వయమాజ్ఞాపయస్వమాం.
స్పృహయామ్యద్య నిర్వేదాద్ పురుషాణాం
సచక్షుషాం
అస్త్రహేతోః పరాక్రాంతా న్ యే మే ద్రక్ష్యంతి
పుత్రకాన్.
క్షత్తర్యద్ గురురాచార్యో బ్రవీతి కురు తత్ తథా
న హీదృశం ప్రియం మన్యే భవితా ధర్మవత్సల.
తతో రాజానమామంత్ర్య నిర్గతో విదురో బహిః
భారద్వాజో మహాప్రాజ్ఞోమాపయామాసమేదినీం.
సమామవృక్షాం నిర్గుల్మాముదక్ప్రస్రవణాన్వితాం
తస్యాం భూమౌ బలిం చక్రేతిథౌ నక్షత్రపూజితే.

## కర్ణుడు

ఆశ్చర్యచకిత దృక్కులతో ద్వారపాలకులు దారి ఈయగా సాలప్రాంశుడూ నిజోజ్వలద్దివ్య కవచుడూ విజయశీలుడూ ఐనకర్ణుడూ ధనుష్పాణియై ఖడ్గధారియై అస్త్రప్రదర్శనమండపంలో అడుగు పెట్టాడు. తీక్ష్ణకిరణుడైన సూర్యుని అంశవల్ల కుంతికి కన్యావస్థలో జన్మించిన ఆమహావీరుని ఖ్యాతి అప్పటికే దశదిశలా వ్యాపించింది. కర్ణుని నేత్రాలు సువిశాలసుందరంగా ఉన్నాయి. సింహసమబలుడూ వృషభసదృశవీర్యుడూ మత్తేభసమపరాక్రముడూ సూర్యసమప్రభుడూ చంద్రికాంతియుతుడూ అగ్నిసమతేజుడుగా వెలుగుతున్నాడు. కర్ణుడు.

అతని శరీరం ఎత్తైన స్వర్ణతాళవృక్షంలా ఉంది. సింహంవలె బలిష్ఠములైన అవయవాలూ అసంఖ్యాకమైన సద్గుణాలూ కలిగి సూర్యునివల్ల జన్మించాడు గనుక ఆదిత్యునివలెనే ప్రకాశిస్తూ రంగస్థలంలో ప్రవేశించిన కర్ణుని చూచి యీతడెవరో గ్రహించాలని ప్రయత్నిస్తున్నారు.

కర్ణుడు పాండవులకు సోదరుడై కూడా అజ్ఞాతావస్థలో అర్జునుని చేరి— అర్జునా! నీవీసభ్యుల ఎదుట ఎట్టి అద్భుతకార్యాన్ని చేశావో దానిని మించిన కార్యం నేను చేస్తాను. నీవు గర్వించకు— అని కర్ణుడు పలుకుతూండగానే యంత్రంవల్ల లేవదీసినట్లుగా సభలోని వారందరూ ఒక్కసారిగా లేచి నిలిచారు. ఆసమయంలో దుర్యోధనుని కానందం అర్జునునకు లజ్జాక్రోధాలూ ప్రభవించాయి. యుద్ధప్రియుడగు కర్ణుడు ద్రోణుని ఆజ్ఞపై అర్జునుడు చూపిన శస్త్రాస్త్రకౌశలమంతా చూపాడు. కర్ణుని అస్త్రవిద్యాపాటవం చూసి దుర్యోధనుడు సోదరులతోకూడా కర్ణుని కౌగిలించుకొని— కర్ణా! నీకు స్వాగతం. నీవిక్కడకు రావడం మా మహాభాగ్యం. ఈకౌరవ రాజ్యమంతా నీది. నీవు స్వేచ్ఛగా యీరాజ్యాన్ని అనుభవించవచ్చు— అనే దుర్యోధనునితో కర్ణుడిలా అంటున్నాడు.

రాజరాజా! నీవు చెప్పినదంతా చేసినట్లే నేనానందిస్తున్నాను. నాకు నీతో మైత్రి, అర్జునునితో ద్వంద్వయుద్ధం కావాలి. ఇంతే నాకోరిక-అనేసరికి— కర్ణా! నీమనోవాంఛ నెరవేరుగాక. నీవు నాతో సమానభోగాలు అనుభవిస్తూ నా బంధువులకు ఆనందాన్ని కలిగిస్తూ శత్రువుల శిరములందు పాదాలుంచు—అని దుర్యోధనుడు కర్ణుని సమ్మానించాడు.

ఇదంతా చూస్తూన్న అర్జునుడు కర్ణునిచే తాను తిరస్కృతుడైనట్లు భావించి కర్ణా! అనాహూతులై వచ్చినవారూ, ప్రశ్నించకుండా మాట్లాడేవారూ ఏలోకాన్నైతే పొందుతారో ఆలోకాన్నే నీవు నాశస్త్రధారలచే పొందుదువుగాక— అని పలికిన అర్జునునితో కర్ణుడు— అర్జునా! అస్త్రవిద్యాప్రదర్శనకేర్పడిన యీరంగమండపం అందరికీ సమానమైనదే. నీకెంతో నాకూ అంతే. బలపరాక్రమాలు కలిగినవాడల్లా ప్రభువనే చెప్పబడతాడు. ధర్మం కూడా వానినే అనుసరిస్తుంది. ఆక్షేపణ చేయడం దుర్బలలక్షణం. దీనివల్ల లాభంలేదు. సాహసం ఉంటే బాణాలతో మాట్లాడు. నేనీరోజు నీగురు సన్నిధానంలోనే నీశిరస్సు తుంచివేస్తాను— అన్నాడు. ఆమాటలు విన్న అర్జునుడు సోదరులను కౌగిలించుకొని ద్రోణాచార్యుని అనుజ్ఞ పొంది కర్ణునివైపు కదిలాడు. అప్పుడు దుర్యోధనుడుకూడా సోదరసమేతంగా కర్ణుని గాఢాలింగనం చేసుకున్నాడు. ఆసమయంలోఆకాశమంతామేఘావృతమైంది. ఉరుములు

అవఘుష్టే సమాజే చ తదర్థం వదతాం వరః
రంగభూమౌ సువిపులం శాస్త్రదృష్టం యథావిధి.
ప్రేక్షాగారం సువిహితం చక్రుస్తే తస్య శిల్పినః
రాజ్ఞః సర్వాయుధోపేతం స్త్రీణాం చైవ నరర్షభ.
మఞ్చాంశ్చ కారయామాసు స్తత్ర జానపదా జనాః
విపులానుచ్ఛ్రయోపేతాన్ శిబికాశ్చ మహాధనాః
తస్మిం స్తతోఽహని ప్రాప్తే రాజా ససచివ స్తదా
భీష్మం ప్రముఖతః కృత్వా కృపంచాచార్యసత్తమం.
బాహ్లీకం సోమదత్తం చ భూరిశ్రవసమేవ చ
కురూనన్యాంశ్చ సచివానాదాయ నగరాద్బహిః.
ముక్తాజాలపరిక్షిప్తం వైదూర్యమణి శోభితం
శాతకుంభమయందివ్యం ప్రేక్షాగార ముపాగమత్.
గాంధారీచమహాభాగా కుంతీ చ జయతాం వర
స్త్రియశ్చ రాజ్ఞస్సర్వాస్తాస్సప్రేష్యాస్సపరిచ్ఛదాః.
హర్షాదారురుహుర్మఞ్చాన్ మేరుం దేవస్త్రియో యథా
బ్రాహ్మణక్షత్రియాద్యం చ చాతుర్వర్ణ్యంపురాద్ద్రుతం.
దర్శనేప్సు సమభ్యాగాత్ కుమారాణాం కృతాస్త్రతాం
క్షణేనైకస్థతాం తత్ర దర్శనేప్సు జగామహ.
ప్రవాదితైశ్చ వాదిత్రై ర్జనకౌతూహలేన చ
మహార్ణవ ఇవ క్షుబ్ధ స్సమాజస్సోఽభవ త్తదా
తతః శుక్లాంబరధరః శుక్ల యజ్ఞోపవీతవాన్
శుక్లకేశ స్సితశ్మశ్రు శ్శుక్ల మాల్యానులేపనః.
రంగమధ్యం తదాఽఽచార్యః సపుత్రః ప్రవివేశహ
నభో జలధరైర్హీనం సాంగారక ఇవాంశుమాన్.
స యథాసమయం చక్రే బలిం బలవతాం వరః
బ్రాహ్మణాంస్తు సుమంత్రజ్ఞాన్ కారయామాస మంగళం.

సువర్ణ మణిరత్నాని వస్త్రాణి వివిధాని చ
ప్రదదౌ దక్షిణాం రాజా ద్రోణస్య చ కృపస్య చ.
సుఖపుణ్యాహఘోషస్య పుణ్యస్య సమనంతరం
వివిశుర్వివిధం గృహ్య శస్త్రోపకరణం నరాః.
తతో బద్ధాంగుళిత్రాణా బద్ధకక్ష్యా మహారథాః
బద్ధతూణా స్సధనుషో వివిశుర్భరతర్షభాః.
అనుజ్యేష్ఠం తు తే తత్ర యుధిష్ఠిరపురోగమాః
రణమధ్యేస్థితం ద్రోణమభివాద్య నరర్షభాః
పూజాం చక్రుర్యథాన్యాయం ద్రోణస్యచకృపస్యచ.
ఆశీర్భిశ్చ ప్రయుక్తాభి స్సర్వే సంహృష్టమానసాః
అభివాద్య పునశ్శస్త్రాన్ బలిపుష్పై స్సమన్వితాన్.
రక్తచందనసమ్మిశ్రై స్స్వయమార్చంత కౌరవాః
రక్తచందనదిగ్ధాశ్చ రక్తమాల్యానుధారిణః.
సర్వే రక్తపతాకాశ్చ సర్వే రక్తాంతలోచనాః
ద్రోణేన సమనుజ్ఞాతా గృహ్య శస్త్రం పరంతపాః.
ధనూంషిపూర్వంసంగృహ్య తప్త కాంచనభూషితా
న్సజ్యాని వివిధాకారై శ్శరై స్సంధాయ కౌరవాః.
జ్యాఘోషం తలఘోషం చ కృత్వా భూతాన్య పూజయన్.
చక్రుశ్శస్త్రం మహావీర్యాః కుమారాః పరమాద్భుతం.
కేచిచ్ఛరాక్షేపభయాచ్ఛిరాంస్యవననామి రే
మనుజాధృష్టమపరే వీక్షాఞ్చక్రు స్సువిస్మితాః.
తే స్మలక్ష్యాణి బిభిదుర్బాణై ర్నామాంకశోభితైః
వివిధైర్లాఘవోత్సృష్టైరుహ్యంతో వాజిభిర్ద్రుతం.
తత్ కుమారబలం తత్ర గృహీతశరకార్ముకం
గంధర్వనగరాకారం ప్రేక్ష్య తే విస్మితాభవన్.
సహసా చుక్రుశుశ్చాన్యే నరా శ్శతసహస్రశః
విస్మయోత్ఫుల్లనయనా సాధు సాధ్వితి భారత.
కృత్వా ధనుషి తేమార్గాన్ రథచర్యాసుచాసకృత్

మెరుపులు బయలుదేరాయి. పుత్రవాత్స ల్యంచేత ఇంద్రుడు రంగస్థలాన్ని చూస్తున్నాడు. ఆదిత్యుడు ఆమేఘాలన్నింటినీ తన కిరణప్రసారంచే ఛిన్నాభిన్నం చేశాడు. అప్పుడు అర్జునుడు మేఘ చ్ఛాదితుడైనట్లు కర్ణుడు సూర్యప్రకాశభాసమాను డైనట్లు కనపడుతున్నారు. కర్ణునివైపు దుర్యో ధనాదులూ, అర్జునునివైపు భీష్మద్రోణ కృపా దులూ నిలిచారు.

రంగస్థలమంతా రెండు పక్షాలైపోయింది. కర్ణుని కొందరూ, పార్థుని కొందరు సమర్థిస్తు న్నారు. సత్యం తెలిసిన కుంతి మాత్రం ఇద్దరూ తనకుమాళ్ళే కావటంవల్ల దుఃఖంతో మూర్ఛితురా లైంది. అదిచూచిన విదురుడు సేవికలద్వారా కుంతికి చైతన్యాన్ని కలిగించాడు. కుంతికి మన శ్శాంతి లేదు. కుమారులిద్దరిమధ్యా జరిగే ద్వంద్వ యుద్ధంలో యెవరికేప్రమాదం కలుగుతుందో అనీ, ఈ ద్వంద్వయుద్ధం ఆపేమార్గమేముందనీ ఆలోచి స్తూన్నది. ఆమె ఆలోచన ఆలోచనగానే ఉండిపో యింది. ఆ మహాయోధు లిద్దరూ విశాలమైన ధను స్సులు తీసుకుని ద్వంద్వయుద్ధానికి సిద్ధంకావడం చూసిన కృపాచార్యులు ద్వంద్వయుద్ధ మర్మం ధర్మం తెలిసినవాడవడంవల్ల కర్ణునివైపు చూచి— కర్ణా! కురువంశరత్నమూ కుంతీ పుత్రుడూ పాం డవమధ్యముడూ అయిన అర్జునుడు నీతో ద్వంద్వ యుద్ధం చేస్తాడు. అతని కులశీలాదు లందరికీ తెలుసు. నీవంశంకూడా తెలియాలి. అప్పుడుకాని ద్వంద్వయుద్ధం చెయ్యడానికి శాస్త్రమంగీకరించదు. శాస్త్రమర్యాద నతిక్రమించడం పతనహేతువౌ తుంది. కనక నీతలిదండ్రు లెవరు. నీదేశమేది. నీ కులగోత్రాలు సవిస్తరంగా చెప్పు. రాజకుమా రులు నీచకులసంజాతులతోనూ నీచమైన ఆచార గుణాదులు కలవారితోనూ యుద్ధం చేయరు— అని పలికే కృపాచార్యుని పలుకులు వినడంతోనే వర్షంలో కమలములు విక్లిన్నములైనట్లే లజ్జచే కర్ణునిముఖం వివర్ణమైపోయింది. అదంతా చూస్తూ ఉన్న దుర్యోధనుడు లేచి— ఆచార్యా! వందనం. మీరు చెప్పినదంతా సత్యమే. శాస్త్రమర్యాదను అతిక్రమించడం పతనహేతువే. అయినా శాస్త్ర సిద్ధాంతాల్లోనే రాజులకు త్రివిధయోని లక్షణం చెప్పబడింది. ఉత్తమకులంలో పుట్టడం, మహావీర శూర లక్షణాలు కలవాడవటం, సైన్యాధిపత్యం యీ మూడూ శాస్త్రీయమైన క్షత్రియ లక్ష ణాలే. అర్జునుడిప్పుడు రణభూమియందు రాజుతోవినా యుద్ధం చేయకపోతే ఇదే సమ యంలో నేనీ కర్ణుణ్ణి అంగదేశాధిపతిగా చేస్తు న్నాను— అని చెప్పి ధృతరాష్ట్ర భీష్మాదుల అను జ్ఞపై స్వర్ణసింహాసనంమీద కర్ణుని ఆసీనుణ్ణి చేసి మంత్రివేత్తల ద్వారా పట్టాభిషేకం చేయించి అంగరాజుగా చేశాడు.

కిరీట హార కేయూరాదులచే అలంకరించి ఛత్ర చామరాదులు సమర్పించి జయజయధ్వానాలతో కర్ణుణ్ణి ప్రభువుగా చెయ్యడంతోనే కర్ణుడు నూతన శోభతో ప్రకాశించాడు. బ్రాహ్మణులకు ధన కనక వస్త్రాలు సమర్పించి రారాజును చూసి— దుర్యో ధనా! నీవిప్పుడు నాకు రాజ్య ప్రదానరూపంగా చేసిన సమ్మానానికి సమానమైన ప్రత్యుపకారంగా నీవేం చెపితే అది చెయ్యడానికి సిద్ధంగా ఉన్నా— నన్ను కర్ణుణ్ణి చూసి దృఢాలింగనం చేసుకుని కర్ణా! నీతో అఖండమైన మైత్రినే వాంఛిస్తున్నాను. మన మైత్రి ఆ చంద్రతారా ర్కంగా ఉండుగాక. మనమధ్య యెన్నడూ అభి

గజపృష్ఠేఽశ్వపృష్ఠే చ నియుద్ధే చ మహాబలః.
గృహీతఖడ్గచర్మాణస్తతో భూయః ప్రహారిణః
త్సరుమార్గాన్ యథోద్దిష్టాంశ్చేరు స్సర్వాసు భూమిషు.
లాఘవం సౌష్ఠవం శోభాం స్థిరత్వం దృఢముష్టితాం
దదృశుస్తత్ర సర్వేషాం ప్రయోగం ఖడ్గచర్మణోః.
అథ తౌ నిత్యసంహృష్టౌ సుయోధన వృకోదరౌ
అవతీర్ణౌ గదాహస్తావేకశృంగావివాచలౌ.
బద్ధకక్షౌ మహాబాహూ పౌరుషే పర్యవస్థితౌ
బృంహంతౌ వాసితాహేతో స్సమదావివకుంజరౌ.
తౌ ప్రదక్షిణసవ్యాని మండలాని మహాబలౌ
చేరతుర్మండలగతౌ సమదా వివ కుంజరౌ.
విదురో ధృతరాష్ట్రాయ గాంధార్యాః పాండవారిణః
న్యవేదయేతాం తత్సర్వం కుమారాణాం విచేష్టితమ్.

133 వ అధ్యాయం సమాప్తం.

## నూటముప్పది నాల్గవ అధ్యాయము

కురురాజే హి రంగస్థే భీమే చ బలినాం వరే
పక్షపాత కృతస్నేహా స్సద్విధేవ భజజ్జనః.
హే వీర కురురాజేతి హే భీమ ఇతి జల్పతాం
పురుషాణాం సువిపులాః ప్రణాదా స్సహసోత్థితాః.
తతః క్షుబ్ధార్ణవనిభం రంగమాలోక్య బుద్ధిమాన్
భారద్వాజః ప్రియంపుత్రమశ్వత్థామానమబ్రవీత్.
వారయైతౌ మహావీర్యౌ కృతయోగ్యావుభావపి.
మాభూద్రంగప్రకోపోఽయం భీమదుర్యోధనోద్భవః
తత ఉత్థాయ వేగేన అశ్వత్థామా న్యవారయత్
కురోరాజ్ఞా భీమ ఇతి గాంధారే గురుశాసనమ్.
అలం యోగ్యకృతం వేగమలం సాహసమిత్యుత
తతస్తావుద్యతగదౌ గురుపుత్రేణ వారితౌ.
యుగాంతానిలసంక్షుబ్ధౌ మహావేలావివార్ణవౌ.
తతో రంగాంగణగతో ద్రోణో వచనమబ్రవీత్
నివార్య వాదిత్రగణం మహామేఘనిభస్వనం.
యో మే పుత్రాత్ ప్రియతర స్సర్వశస్త్రవిశారదః
ఐన్ద్రిరిన్ద్రానుజసమ స్స పార్థో దృశ్యతామితి.
ఆచార్యవచనేనాథ కృతస్వస్త్యయనో యువా
బద్ధగోధాంగుళిత్రాణః పూర్ణతూణ స్సకార్ముకః.
కాంచనం కవచం బిభ్రత్ ప్రత్యదృశ్యత ఫాల్గున
స్సార్కస్సేంద్రాయుధతడిత్ ససంధ్య ఇవతోయదః
తత స్సర్వస్య రంగస్య సముత్పింజలకోఽభవత్
ప్రావాద్యంత చ వాద్యాని సశంఖాని సమంతతః.
ఏష కుంతీసుత శ్శ్రీమానేష మధ్యమపాండవః
ఏష పుత్రో మహేంద్రస్య కురూణామేష రక్షితా.
ఏషోఽస్త్రవిదుషాం శ్రేష్ఠ ఏషధర్మభృతాంవరః
ఏష శీలవతాం చాపి శీలజ్ఞాననిధిః పరః.
ఇత్యేవంతుములావాచః శృణ్వత్యాః ప్రేక్షకేరితాః
కుంత్యాః ప్రస్రవసంయుక్తై రస్రైః క్లిన్నమురోఽభవత్
తేన శబ్దేన మహతా పూర్ణశ్రుతిరథాబ్రవీత్
ధృతరాష్ట్రో నరశ్రేష్ఠో విదురం హృష్టమానసః
క్షత్తః క్షుబ్ధార్ణవనిభః కిమేష సుమహాస్వన
స్సహసైవోత్థితో రంగే భిందన్నివ నభస్థలం.
ఏష పార్థో మహారాజ ఫాల్గునః పాండునందనః
అవతీర్ణ స్సకవచ స్తత్రైష సుమహాస్వనః.
ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి రక్షితోఽస్మి మహామతే

ప్రియభేదం కలగకుండా ఉండుగాక— అని పలికే దుర్యోధనుణ్ణి హృదయపూర్వకంగా కౌగిలించుకొని 'తథాస్తు' అంటూ ఆ మైత్రిని సుస్థిరమైత్రిగా ప్రకటించాడు కర్ణుడు.

135 వ అధ్యాయం సమాప్తం

నూట ముప్పది ఆరవ అధ్యాయం

జనమేజయా! అనంతరం కర్ణుణ్ణి పెంచిన అధిరథుడు కంపిస్తూ వణికిపోతూ కర్ణుని కేకవేస్తూ కంగారుగా రావడంలో ఉత్తరీయం క్రింద పడిపోయింది. ఒడలంతా ముచ్చెమటలూ కారుతున్నాయి. అలా ఆతురతగా వచ్చే అతిరథుని యందుండే పితృగౌరవం చేత సింహాసనాన్నుండి లేచి ఆయన పాదాలకు అభివందనం చేసిన కర్ణుని అధిరథుడు హృదయపూర్వకంగా కౌగిలించుకొని అంగదేశాధీశుడైన కర్ణుని ఆనంద బాష్పాలచే పునః అభిషేకించాడు అధిరథుడు. అది చూస్తూ ఉన్న భీమసేనుడు కర్ణుణ్ణి సూతపుత్రుడుగా గ్రహించి నవ్వుతూ— అరే! సూతపుత్రా! నీవు ప్రతోదం చేతబట్టి రథసారథ్యం చేయవలసినవాడవు. నీవు మా అర్జునుని చేతుల్లో మరణించడానికూడా అర్హుడవు కావు. యజ్ఞవేదిక దగ్గర పురోడాశాన్ని శ్వానం (కుక్క) ఎలాగైతే ముట్టడానికి అధికారం లేదో అలాగే అంగదేశాధిపత్యానికి నీకూ అధికారం లేదు— అని పలుకుతూన్న భీముని మాటలు వింటూన్న కర్ణుడు క్రోధోద్రేకంవల్ల పెదవులు కంపిస్తూ ఉండగా సూర్యునివైపు చూడసాగాడు— అదే సమయాన క్రోధోద్రిక్తహృదయుడైన దుర్యోధనుడు మదించిన ఏనుగువలె భ్రాతృసమూహంనుండి లేచి— భీమసేనా! క్షత్రియులలో బలమే ప్రధానం. బలవంతుడైతే హీనక్షత్రియుడైనా యుద్ధానికి అర్హుడే కాడు. క్షత్రియ మిత్రుడుకూడా అర్హత కలవాడే. శూరులయొక్క నదులయొక్క ఉత్పత్తి స్థానం తెలుసుకోనట చాలాకష్టం కర్ణుడు శూరుడూ వీరుడూ, రారాజునైన నాకు మిత్రుడూ, అవడం వల్ల యుద్ధంచెయ్యడానికి అర్హుడే. చరాచర జగద్వ్యాప్తమైన అగ్నిజలాన్నుండీ, సర్వదా నవ సంహారకారకమైన వజ్రం దధీచి ఎముకలనుండీ జన్మించడం అందరకూ తెలిసినదే. సర్వగుహ్యస్వరూపుడైన కుమారస్వామిని అగ్ని షట్కృత్తికలూ రుద్రుడూ గంగా జన్మింపజేశారు. అనేకులు బ్రాహ్మణులు క్షత్రియుల వల్ల జన్మించారు. విశ్వామిత్రాది క్షత్రియులు బ్రాహ్మణత్వాన్ని పొందారు. సమస్తశస్త్రధారులలో అగ్రేసరుడైన మనగురువు ద్రోణాచార్యులు కమండలంలోనుంచి జన్మించలేదా! గౌతమవంశంలో కృపాచార్యులు శరస్థంభాన్నుండీ ఆవిర్భవించలేదా! మీఅన్నదమ్ములంతా ఎలా జన్మించారు. అదంతా పూర్తిగా నే నెరుగుదును. సహజ కవచకుండలాలతో ప్రకాశించే మహావీరుడు కర్ణుడు సూతజాతి స్త్రీయందు జన్మించడం అసంభవం. లేడికి పులిపిల్ల పుడుతుందా! సూర్యసమతేజుడై సర్వక్షత్రియలక్షణలక్షితుడైన కర్ణుడు రణరంగానికంతకూ శోభను కలిగించే మహారథికుడు సూతజాతివాడని నేను విశ్వసించను. ఈకర్ణుడు అంగదేశాన్నేకాదు సమస్తభూమండలాన్నీ కూడా పరిపాలింపగల సమర్థుడూ అర్హుడూకూడా. నా యీ

పృథారణిసముద్భూతై స్త్రిభిః పాండవవహ్నిభిః
తస్మిన్ ప్రతిహతే రంగే కథంచిత్ ప్రత్యుపస్థితే
దర్శయామాసబీభత్సురాచార్యాయాస్త్రలాఘవం
ఆగ్నేయేనాసృజద్వహ్నింవారుణేనాసృజత్పయః
వాయవ్యేనాసృజద్ వాయుః పార్జన్యేనాసృజత్ ఘనాన్
భౌమేన ప్రావిశద్ భూమిం పార్వతేనాసృజద్గిరీన్
అంతర్ధానేన చాస్త్రేణ పునరంతర్హితోఽభవత్.
క్షణాత్ ప్రాంశుః క్షణాద్ధ్రస్వః క్షణాచ్చ రథధూర్గతః
క్షణేన రథ్య మధ్యస్థః క్షణేనావతరన్మహీం.
సుకుమారంచ సూక్ష్మం చ గురుం చాపి గురుప్రియ
స్సౌష్ఠవేనాభిసంక్షిప్త స్సోఽవిధ్యద్ వివిధై శ్శరైః
భ్రమతశ్చ వరాహస్య లోహస్య ప్రముఖే సమం
పంచబాణానసంయుక్తాన్సమ్ముమోచైకబాణవత్.
గవ్యే విషాణకోషే చ చరే రజ్జ్వవలంబిని
నిచకాన మహావీర్య స్సాయకానేకవింశతిం.
ఇత్యేవమాది సుమహత్ ఖడ్గే ధనుషి చానఘ
గదాయాంశస్త్రకుశలో మండలాని వ్యదర్శయత్.
తత స్సమాప్త భూయిష్ఠే తస్మిన్ కర్మణి భారత
మందీభూతే సమాజే చ వాదిత్రస్య చ నిస్వనే.
ద్వారదేశాత్ సముద్భూతో మాహాత్మ్యబల సూచకః
వజ్రనిష్పేషసదృశ శ్శుశ్రువే భుజనిస్వనః.
దీర్యంతే కిం ను గిరయః కింస్విద్ భూమిర్విదీర్యతే
కింస్విదాపూర్యతే వ్యోమ జలధారాఘనైర్ఘనైః.
రంగస్యైవం మతిరభూత్ క్షణేన వసుధాధిప
ద్వారం చాభిముఖాస్సర్వే బభూవుః ప్రేక్షకాస్తదా.
పంచభిర్భ్రాతృభిః పార్థైర్ద్రోణః పరివృతో బభౌ
పంచతారేణ సంయుక్త స్సావిత్రేణేవ చంద్రమాః.
అశ్వత్థామ్నా చ సహితం భ్రాతౄణాం శతమూర్జితం
దుర్యోధనమమిత్రఘ్న ముత్థితం పర్యవారయత్.
స తై స్తదా భ్రాతృభిరుద్యతాయుధై
ర్గదాగ్రపాణి స్సమవస్థితై ర్వృతః
బభౌ యథా దానవసంక్షయే పురా
పురందరో దేవగణైస్సమావృతః.

134 వ అధ్యాయం సమాప్తం.

## నూటముప్పది అయిదవ అధ్యాయము

దత్తేఽవకాశే పురుషైర్విస్మయోత్ఫుల్లలోచనైః
వివేశ రంగం విస్తీర్ణం కర్ణః పరపురంజయః.
సహజం కవచం బిభ్రత్ కుండలోద్ద్యోతితాననః
స్సధనుర్బద్ధనిస్త్రింశః పాదచారీవ పర్వతః
కన్యాగర్భః పృథుయశాః పృథాయాః పృథులోచనః
తీక్ష్ణాంశోర్భాస్కరస్యాంశః కర్ణోఽరిగణసూదనః.
సింహర్షభగజేంద్రాణాం బలవీర్యపరాక్రమః
దీప్తికాంతిద్యుతిగుణై స్సూర్యేందుజ్వలనోపమః.
ప్రాంశుః కనకతాలాభ స్సింహసంహననో యువా
అసంఖ్యేయగుణ శ్శ్రీమాన్ భాస్కరస్యాత్మసంభవః.
స నిరీక్ష్య మహాబాహు స్సర్వతో రంగమండలం
ప్రణామం ద్రోణకృపయోర్నాత్యాదృతమివాకరోత్.
స సమాజజన స్సర్వో నిశ్చల స్థిరలోచనః
కోఽయమిత్యాగతక్షోభః కౌతూహలపరోఽభవత్.

మాటలు ఎవరి కంగీకారం కావో వారు రథా రోహణం చేసి ధనుర్బాణధారులై నాతో యుద్ధం చెయ్యడానికి సన్నద్ధులు కావచ్చు— అని చెపుతూం డగా దుర్యోధన సహచరులలో కోలాహలం బయలు దేరింది.

అంతలో సూర్యాస్తమయమయింది. దుర్యోధనుడు కర్ణుని చేయి పట్టుకుని రంగమండపాన్నుండి బయటకు వచ్చాడు. పాండవులూ ద్రోణ కృపాచార్యభీష్మాదులూ కూడా వారి వారి నివాసాలకు వెళ్ళిపోయారు. ఆ రంగమంటపంలో జరిగిన విషయమంతా చూచినవారిలో కొందరు కర్ణుణ్ణీ, కొందరు అర్జునునీ, మరికొందరు దుర్యోధనునీ స్తుతిస్తూ వెడుతున్నారు. కర్ణుడు అంగరాజు కావడం చూసిన కుంతీదేవి మనస్సులోనే ఆనందించింది. కర్ణుని మిత్రుడుగా పొందడంవల్ల దుర్యోధనుడు అర్జునునివల్ల కలిగే భయాన్ని వదిలేశాడు.

వీరుడైన కర్ణుడు సర్వశస్త్రాస్త్రవేత్త, ధనుర్వేద నిష్ణాత- దుర్యోధనునితో అతనిస్నేహం క్రమంగా వృద్ధిచెందుతూన్నది. ధర్మరాజుకూడా కర్ణునితో సమానమైన ధనుర్ధారి యీ భూమండలంలో లేడనే విశ్వాసంలోనే ఉన్నాడు.

136 వ అధ్యాయము సమాప్తం

## నూట ముప్పది ఏడవ అధ్యాయం

### ద్రుపదపరాభవం

పాండవులూ ధార్తరాష్ట్రులూ అస్త్రవిద్యాకుశలులయారు. అప్పుడు ద్రోణాచార్యులు గురుదక్షిణస్వీకరించే తలంపుతో మనస్సులో నిశ్చయించుకున్నాడు. వారందరినీ పిలిచి— మీకందరికీ శుభమగుగాక. మీరు గురుదక్షిణగా పాంచాల దేశాధీశ్వరుడైన ద్రుపదుని బంధించి తెచ్చి నాముందుంచండి ఇంతకన్న నేనుకోరేదేమీలేదు—అనగా వారందరూ అంగీకరించి అదేక్షణంలో రథారూఢులై యుద్ధకాంక్షతో బయలుదేరారు. ద్రోణాచార్యులుకూడా వారివెంట ఉన్నాడు.

క్రమక్రమంగా పాంచాలదేశంలో ప్రవేశించి ఆ నగరాలమీద దాడి సాగిస్తూ దుర్యోధన కర్ణ యుయుత్సు దుశ్శాసన వికర్ణ జలసంధ సులోచనాముఖులైన మహావీరులందరూ అహమహమికతో ద్రుపదుని బంధిస్తామంటూ ముందుకు దూకుతున్నారు. రథారూఢులైన రాజపుత్రులందరూ రాజధానిలో ఘంటాపథంమీద సాగుతున్నారు.

కురుసేన తనరాజధానిని ముట్టడించిన వార్త విని ద్రుపదుడు సోదరసహితుడై కోటవెలుపలకు వచ్చాడు. వస్తూనే సేనావాహినిని తిలకించాడు. ద్రుపదసోదరులు కవచధారులై బాణాలతో కౌరవులను ఎదుర్కొన్నారు. ఉభయులమధ్యా శరవర్షం కురుస్తున్నది. రాజకుమారులందరూ ఉద్రేకావేశాలతో యుద్ధం చేస్తున్నారు. అప్పుడు అర్జునుడు ద్రోణాచార్యుని చేరి— వీరందరూ తమతమ శక్తి ప్రదర్శించాక మనం యుద్ధరంగంలో ప్రవేశిద్దాం. వీరెవ్వరూ ద్రుపదుణ్ణి బంధించలేరు— అని పలికి తన అన్నదమ్ములతో నగరానికి అర్ధక్రోశదూరంలో నిలిచిపోయాడు.

సోఽబ్రవీన్మేఘగంభీరస్వరేణ వదతాం వరః
భ్రాతా భ్రాతరమజ్ఞాతం సావిత్రః పాకశాసనిం.
పార్థ యత్తే కృతం కర్మ విశేషవదహం తతః.
కరిష్యే పశ్యతాం నృణాం మాఽఽత్మనా విస్మయం గమః.
అసమాప్తే తతస్తస్య వచనే వదతాం వర
యంత్రోత్క్షిప్త ఇవోత్తస్థౌ క్షిప్రం వై సర్వతో జనః.
ప్రీతిశ్చ మనుజవ్యాఘ్ర దుర్యోధనముపావిశత్
హ్రీశ్చ క్రోధశ్చ బీభత్సుం క్షణేనాన్వావివేశహ.
తతో ద్రోణాభ్యనుజ్ఞాతః కర్ణః ప్రియరణస్సదా
యత్ కృతం తత్ర పార్థేన తచ్చకార మహాబలః.
అథ దుర్యోధనస్తత్ర భ్రాతృభిస్సహ భారత
కర్ణం పరిష్వజ్య ముదా తతో వచనమబ్రవీత్.
స్వాగతం తే మహాబాహో దిష్ట్యా ప్రాప్తోఽసి మానద
అహం చ కురురాజ్యం చ యథేష్టముపభుజ్యతాం
కృతం సర్వమహం మన్యే సఖిత్వం చ త్వయా వృణే
ద్వంద్వయుద్ధం చ పార్థేన కర్తుమిచ్ఛామ్యహం ప్రభో.
భుంక్ష్వ భోగాన్ మయా సార్థం బంధూనాం ప్రియకృద్భవ
దుర్హృదాం కురు సర్వేషాం మూర్ధ్ని పాదమరిందమ.
తతః క్షిప్తమివాత్మానం మత్వా పార్థోఽభ్యభాషత
కర్ణం భ్రాతృసమూహస్య మధ్యేఽచలమివ స్థితమ్.
అనాహూతోపసృష్టానామనాహూతోపజల్పినామ్
యే లోకాస్తాన్ హతః కర్ణ మయా త్వం ప్రతిపత్స్యసే.
రంగోఽయం సర్వసామాన్యః కిమత్ర తవ ఫాల్గున
వీర్యశ్రేష్ఠాశ్చ రాజానో బలం ధర్మోఽనువర్తతే.
కిం క్షేపైర్దుర్బలాయాసైః శరైః కథయ భారత
గురోస్సమక్షం యావత్తే హరామ్యద్య శిరశ్శరైః
తతో ద్రోణాభ్యనుజ్ఞాతః పార్థః పరపురంజయః
భ్రాతృభిస్త్వరయాఽఽశ్లిష్టో రణాయోపజగామ తం.

తతో దుర్యోధనేనాపి సభ్రాత్రా సమరోద్యతః
పరిష్వక్తః స్థితః కర్ణః ప్రగృహ్య సశరం ధనుః.
తతస్సవిద్యుత్స్తనితైస్సేంద్రాయుధపురోగమైః
ఆవృతం గగనం మేఘైర్బలాకాపంక్తిహాసిభిః.
తతస్స్నేహాద్ధరిహయం దృష్ట్వా రంగావలోకినం
భాస్కరోఽప్యనయన్నాశం సమీపోపగతాన్ ఘనాన్.
మేఘచ్ఛాయోపగూఢస్తు తతోఽదృశ్యత ఫాల్గునః
సూర్యాతపపరిక్షిప్తః కర్ణోఽపి సమదృశ్యత.
ధార్తరాష్ట్రా యతః కర్ణస్తస్మిన్ దేశే వ్యవస్థితాః
భారద్వాజః కృపో భీష్మో యతః పార్థస్తతోఽభవత్.
ద్విధా రంగస్సమభవత్ స్త్రీణాం ద్వైధమజాయత
కుంతిభోజసుతాం మోహం విజ్ఞాతార్థా జగామహ.
తాం తథా మోహమాపన్నాం విదురస్సర్వధర్మవిత్
కుంతీమాశ్వాసయామాస ప్రేష్యాభిశ్చందనోదకైః
తతః ప్రత్యాగతప్రాణా తావుభౌ పరదంశితౌ
పుత్రౌ దృష్ట్వా సుసంభ్రాంతా నాన్వపద్యత కించన.
తావుద్యతమహాచాపౌ కృపశ్శారద్వతోఽబ్రవీత్
ద్వంద్వయుద్ధసమాచారే కుశలస్సర్వధర్మవిత్.
అయం పృథాయాస్తనయః కనీయాన్ పాండునందనః
కౌరవో భవతా సార్థం ద్వంద్వయుద్ధం కరిష్యతి.
త్వమప్యేవం మహాబాహో మాతరం పితరం కులమ్
కథయస్వ నరేంద్రాణాం యేషాం త్వం కులభూషణం.
తతో విదిత్వా పార్థస్త్వాం ప్రతియోత్స్యతి వా న వా
వృథాకులసమాచారైర్న యుధ్యంతే నృపాత్మజాః.
ఏవముక్తస్య కర్ణస్య వ్రీడావనతమాననమ్
బభౌ వర్షాంబువిక్లిన్నం పద్మమాగలితం యథా.
ఆచార్య త్రివిధా యోనీ రాజ్ఞాం శాస్త్రవినిశ్చయే
సత్కులీనశ్చ శూరశ్చ యశ్చ సేనాం ప్రకర్షతి.
యద్యయం ఫాల్గునో యుద్ధే నారాజ్ఞా యోద్ధుమిచ్ఛతి
తస్మాదేషోఽంగవిషయే మయా రాజ్యేఽభిషిచ్యతే.

ద్రుపదుడు నారి సారించి బాణాలు విడిచేసరికి కౌరవసేన సమ్మూర్ఛితమైంది. అస్త్రకౌశలుడైన ద్రుపదుడు రథంమీదనుండి విడిచే బాణాలు సహస్రాధికాలుగా కౌరవులకు గోచరిస్తున్నాయి.

ద్రుపదుని బాణవర్షం కౌరవులను పరాజితులను చేయటంతో రాజధానిలో విజయభేరులు మోగాయి. శంఖధ్వానాలూ, మృదంగవాద్యాలూ చెలరేగాయి. పాంచాలసేన ఉత్సాహంతో సింహనాదాలు చేసింది. వారి ధనుష్టంకారాలు ఆకాశాన్నంటాయి.

క్రోధోద్దీపితులై దుర్యోధన దుశ్శాసన దీర్ఘలోచన వికర్ణ సుబాహులు బాణాలు తీవ్రంగా వదిలారు. పరాజయ మెరుగని ద్రుపదుడు తన శరవర్షంతో శత్రుసేనను చెల్లాచెదరు చేస్తున్నాడు. మహావీరు లందరినీ పాంచాలచక్రవర్తి తన శరజాలంతో చీకాకు పరుస్తున్నాడు. పది బాణాలతో దుశ్శాసనునీ ఇరవై శరాలతో వికర్ణునీ ముప్పై తీక్ష్ణశరాలతో శకునినీ పరాజితుల్ని చేశాడు. కర్ణ దుర్యోధనుల అంగసంధులలో వర్ధనిమిదేసి వాడి తూపులు వదిలాడు. అయిదు బాణాలతో సుబాహుని తరిమాడు. మిగిలిన యోధులందరిమీదా బాణాలు విడిచి సింహనాదం చేశాడు.

విలువిద్యలో ఆరితేరిన ద్రుపదుడు విడిచే వాడి నారాచాలు శత్రురథాలనూ ఏనుగులనూ గుర్రాలనూ జెండాలనూ చీకాకు పరచినవి. ద్రుపదసైనికులే కాక నగరపౌరు లందరూ ముసలముద్గరాది ఆయుధాలతో శత్రువులపై బడ్డారు. ఆషాఢమేఘాలవలె వారు తాడనవర్షం సాగిస్తున్నారు. ఆబాలగోపాలం యుద్ధానికి వచ్చిన వార్త విని కౌరవులు నీరుకారిపోయి పాండవుల సమీపానికి దీనవదనులై వచ్చారు. ద్రుపదుని చేతులలో కర్ణుని అవయవ సంధులన్నీ సడలిపోయాయి. దానితో నిఖిలసైన్యం ఆర్తనాదాలతో పాండవులను సమీపించేసరికి ధర్మరాజాదులకు ఆశ్చర్యం కలగింది. వారందరూ ఆచార్య ద్రోణునికి అభివాదా లర్పించి యుద్ధానికి బయలుదేరారు. అర్జునుడు ధర్మరాజును యుద్ధానికి రానవసరం లేదని ఆపాడు. నకుల సహదేవులు రథరక్షకులుగా వస్తూండగా భీముడు గదాదండధారియై అగ్రగామిగా సాగ అర్జునుడు తన సేనతో ద్రుపదరాజ వాహినీసముగ్రం సమీపించాడు.

దూరంనుండి శత్రుసేనల సింహనాదాలాకర్ణించిన అర్జునుడు తన సేనను తీవ్రవేగంతో నడిపించాడు. ఉల్లోలకల్లోలిత తరంగసమూహంతో ఘోషిస్తూన్న మహాసముద్రంలా ఉన్న ద్రుపదుని సేనలో దండధరప్రతిముడైన భీముడు మహాగ్రాహంలా ప్రవేశించాడు. ప్రప్రథమంగా గజయూథంలో ప్రవేశించి అద్భుతభుజబలంతో ఆ మత్తేభాలను సంహరించసాగాడు. పర్వతసమ దేహాలతో ఉన్న ఆ యేనుగులు భీమగదాఘాతాలతో వజ్రచ్ఛేదిత పర్వతాలవలె నేల వ్రాలుతున్నవి. రథాశ్వబలాలుకూడా భీముని చేతులలో నలిగిపోతున్నవి. పదాతులనూ రథికులనూ అవలీలగా యమసదనానికి పంపుతున్నాడు. చేతికర్రతో గోపాలకుడు గోవులను అదలించినట్లే భీముడు గదాదండంతో గజయూథాన్ని గజగజలాడిస్తున్నాడు.

ఆదేసమయంలో అర్జునుడు తన తీవ్రశరవర్షంతో ద్రుపదునివైపు నడిచాడు. ప్రళయకాలాగ్నిశిఖలా అర్జునుడు ద్రుపదుని చెండాడుతున్నాడు. సింహనాదాలతో పాంచాల సృంజయ వీరులు అర్జునుణ్ణి ఎదుర్కొంటున్నారు. ఆ భయా

తతో౽రాజానమాహు స్త్వగాంగేయం చ పితామహం
అభిషేకస్య సంభారాన్ సమానీయ ద్విజాతిభిః.
తత స్తస్మిన్ క్షణే కర్ణః సలాజకుసుమైర్ఘటైః
కాంచనైః కాంచనే పీఠే మంత్రవిద్భిర్మహారథః.
అభిషిక్తో౽ఙ్గరాజ్యే స శ్రియా యుక్తో మహాబలః
సమాళిహారకేయూరైః స్సహస్తాభరణాఙ్గదైః.
రాజలింగై స్తథాన్యైశ్చ భూషితో భూషణైశ్శుభైః
సచ్ఛత్రవాలవ్యజనో జయశబ్దోత్తరేణ చ.

సభాజ్యమానో విప్రైశ్చ ప్రదత్వా హ్యమితంవసు
ఉవాచ కౌరవం రాజన్ వచనం స వృష స్తదా.
అస్య రాజ్యప్రదానస్య సదృశం కిం దదాని తే
ప్రబ్రూహి రాజశార్దూల కర్తా హ్యస్మి తథా నృప
అత్యంతంసఖ్యమిచ్ఛామీత్యాహతంససుయోధనః
ఏవముక్త స్తతః కర్ణ స్తథేతి ప్రత్యువాచ తం
హర్షాచ్చోభౌ సమాశ్లిష్య పరాంముదమవాపతుః.

135 వ అధ్యాయం సమాప్తం.

## నూటముప్పది ఆరవ అధ్యాయము

తతస్స్రస్తోత్తరపట స్సప్రస్వేద స్సవేపథుః.
వివేశాధిరథో రంగం యష్టిప్రాణో హ్వయన్నివ.
తమాలోక్య ధను స్త్యక్త్వా పితృగౌరవయంత్రితః
కర్ణో౽భిషేకార్ద్రశిరా శ్శిరసా సమవందత.
తతః పాదావవచ్ఛాద్య పటాంతేన ససంభ్రమః
పుత్రేతి పరిపూర్ణార్థమబ్రవీద్ రథసారథిః.
పరిష్వజ్య చ తస్యాథ మూర్ధానం స్నేహవిక్లవః
అంగరాజ్యాభిషేకార్ద్రమశ్రుభి స్సిషిచే పునః!
తం దృష్ట్వా సూతపుత్రో౽యమితి సంచింత్య పాండవః
భీమసేన స్తదా వాక్యమబ్రవీత్ ప్రహసన్నివ.
న త్వమర్హసి పార్థేన సూతపుత్ర రణే వధం
కులస్య సదృశస్తూర్ణం ప్రతోదో గృహ్యతాం త్వయా.
అంగరాజ్యం చ నార్హ స్త్వముపభోక్తుం నరాధమ
శ్వా హుతాశసమీపస్థం పురోడాశమివాధ్వరే.
ఏవముక్త స్తతః కర్ణః కించిత్ప్రస్ఫురితాధరః
గగనస్థం వినిఃశ్వస్య దివాకరముదైక్షత

తతో దుర్యోధనః కోపాదుత్పపాత మహాబలః
భ్రాతృపద్మవనాత్ తస్మాన్మదోత్కట ఇవ ద్విపః
సో౽బ్రవీద్ భీమకర్మాణం భీమసేనమవస్థితం
వృకోదర న యుక్తం తే వచనం వక్తుమీదృశం.
క్షత్రియాణాం బలం జ్యేష్ఠం యోద్ధవ్యం క్షత్రబంధునా
శూరాణాం చ నదీనాం చ దుర్విదాః ప్రభవాః కిల.
సలిలాదుత్థితో వహ్ని ర్యేన వ్యాప్తం చరాచరం
దధీచస్యాస్థితో వజ్రం కృతం దానవసూదనం.
ఆగ్నేయః కృత్తికాపుత్రో రౌద్రో గాంగేయ ఇత్యపి
శ్రూయతే భగవాన్ దేవస్సర్వగుహ్యమయో గుహః.
క్షత్రియేభ్యశ్చ యే జాతా బ్రాహ్మణా స్తే చ తే శ్రుతాః
విశ్వామిత్రప్రభృతయః ప్రాప్తా బ్రహ్మత్వమవ్యయం.
ఆచార్యః కలశాజ్జాతో ద్రోణ శ్శస్త్రభృతాంవరః
గౌతమస్యాన్వవాయే చ శరస్తంబాచ్చ గౌతమః.
భవతాం చ యథా జన్మ తదప్యాగమితం మయా

కాద్భుతనన్ని వేళంలో సింహనాదం విని అర్జునుడు కుపితుడైనాడు. ఒక్కసారిగా ద్రుపదునిమీదకు వాడిబాణాలు వదిలి మీదకు దూకాడు. శరసంధాన విమోచనాలలో కాలవ్యయం లేకుండా విచిత్రాస్త్రాలు ప్రయోగిస్తున్నాడు. ఆ అస్త్ర వర్షంతో అంధకారం వ్యాపించిపోయింది.

పాండవసేన జయజయధ్వానాలతో సింహనాదం చేసింది. ద్రుపదుడు తన సోదరుడైన సత్యజిత్తుతో అర్జునునిపై ప్ర తీవ్రంగా వచ్చాడు. దేవేంద్రుని వైపు వచ్చే శంబరాసురునిలా ఉన్న ద్రుపదుని మధ్యలోనే అడ్డుకున్నాడు అర్జునుడు. సింహం ఏనుగును పట్టబోతున్నట్లు అర్జునుడు ద్రుపదుని పట్టబోతుండగా సత్యజిత్తు అడ్డుతగిలి తీవ్రయుద్ధం ఆరంభించాడు. బలి-ఇంద్రులవలె సత్యజిత్తూ అర్జునుడూ పోరుసాగిస్తున్నారు.

ఎదురువచ్చిన సత్యజిత్తుమీద అర్జునుడు అయిదు బాణాలు విడిచాడు. ప్రతిగా సత్యజిత్తు వంద బాణాలు విడిచాడు. మహారథికుడైన అర్జునుడు నారి సారించి శరవర్షం కురిపించి సత్యజిత్తుయొక్క ధనుస్సును భగ్నం చేశాడు. చేస్తూనే ద్రుపదుని మీద పడ్డాడు. సత్యజిత్తు మరుక్షణంలోనే మరొక ధనుస్సు తీసికొని అర్జునుని మీదికి వచ్చాడు. సత్యజిత్తు విడిచే బాణాలకి ప్రతిగా అర్జునుడు అస్త్రాలు విడవసాగాడు. ఆ అస్త్రాలు రథాన్నీ సారథినీ, గుర్రాలనూ ధ్వంసం చేశాయి. సత్యజిత్తు ధనుస్సుకూడా విరిగిపోవటంతో అతడు సమరభూమినికూడా విడిచి పోయాడు. అర్జునుడు ఖడ్గధారియై నిర్భయంగా ద్రుపదునిమీద పడ్డాడు. పడుతూనే గరుత్మంతుడు సర్పాన్ని పట్టినట్టు ద్రుపదుని పట్టుకొన్నాడు. పాంచాలసేన భయంతో చెల్లాచెదరై పోయింది. అర్జునుడు సింహనాదం చేశాడు. ఇతర సైనికులూ రాకుమారులూ నగరాన్ని ధ్వంసం చేయసాగారు. అప్పుడు అర్జునుడు భీముణ్ణి పిలిచి ద్రుపదుడు కురువంశీయ బాంధవుడనీ వానిసేనను సంహరించడం సముచితం కాదనీ కేవలం గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తేవడమే తమకర్తవ్యమనీ భీముని వారించాడు. అనంతరం ద్రుపదునీ వాని మంత్రులనూ బంధించి ద్రోణునికి గురుదక్షిణగా తీసికొనివచ్చారు. అభిమానచ్యుతుడయాడు ద్రుపదుడు. బంధితుడయి ఉన్న ద్రుపదుని చూసి— మహారాజా! నాబలంతో నేను నీరాజ్యాన్ని గెలిచాను. నీరాజధాని మట్టిపాలు చేయగలిగాను. ఇప్పుడు నీవు శత్రుహస్తాలలో ఉన్నావు. ఇప్పటికయినా నువ్వు పూర్వసఖ్యాన్ని కోరుతున్నావా?— అని చిరునవ్వు నవ్వుతూ— మహారాజా! నీప్రాణాలు పోతాయని నువ్వు భయపడనక్కరలేదు. నేను క్షమాశీలుడనయిన బ్రాహ్మణుణ్ణి. బాల్యస్నేహమూ ప్రేమా నీమీద నాకున్నాయి. పూర్వమైత్రిని పునరుద్ధరించుకోవాలనికూడా నాకుంది. ఈ రాజ్యంలో సగభాగాన్ని నీకు నేను వరంగా అనుగ్రహిస్తున్నాను. రాజ్యాధికారి కానివాడు రాజమిత్రుడు కాడన్నావు కనక నీరాజ్యంలో భాగాన్ని తీసికొనేందుకు ప్రయత్నించాను. ఇది మొదలుగా గంగకు దక్షిణభాగానికి నువ్వూ ఉత్తరభాగానికి నేనూ చక్రవర్తులం. ఇప్పుడిది నీకు ఉచితంగా తోస్తే మనమైత్రి నిర్విఘ్నంగా కొనసాగుతుంది— అన విని ద్రుపదుడు— మహాత్మా! మీ పరాక్రమ ఔదార్యాలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించడంలేదు. నేను తమతో బద్ధసఖ్యం నెరపాలని కోరుతున్నాను— అన్నాడు.

సుకుండలం సకవచం సర్వలక్షణలక్షితం.
కథమాదిత్యసదృశం మృగీ వ్యాఘ్రం జనిష్యతి
కథమాదిత్యసంకాశం సూతోఽముం జనయిష్యతి
ఏవం క్షత్రిగుణైర్యుక్తం శూరం సమితిశోభనం.
పృథివీరాజ్యమర్హోఽయం నాంగరాజ్యం నరేశ్వరః
అనేన బాహువీర్యేణ మయా చాజ్ఞానువర్తినా.
యస్య వా మనుజస్యేదం న క్షాంతం మద్విచేష్టితం
రథమారుహ్య పద్భ్యాం స వినామయతు కార్ముకం.
తతస్సర్వస్య రంగస్య హాహాకారో మహానభూత్
సాధువాదానుసంబద్ధస్సూర్యశ్చాస్తముపాగమత్.
తతో దుర్యోధనః కర్ణమాలంబ్యాగ్రకరే నృపః
దీపికాగ్నికృతాలోకస్తస్మాద్ రంగాద్ వినిర్యయౌ.

పాండవాంశ్చ సహద్రోణాస్సకృపాశ్చ విశాంపతే
భీష్మేణ సహితా స్సర్వే యయుస్స్వంస్వం నివేశనం.
అర్జునేతి జనః కశ్చిత్ కశ్చిత్ కర్ణేతి భారత
కశ్చిద్ దుర్యోధనేత్యేవం బ్రువంతః ప్రస్థితాస్తదా.
కుంత్యాశ్చ ప్రత్యభిజ్ఞాయ దివ్యలక్షణసూచితం
పుత్రమంగేశ్వరం స్నేహాచ్ఛన్నా ప్రీతిరజాయత.
దుర్యోధనస్యాపి తదా కర్ణమాసాద్య పార్థివ
భయమర్జునసంజాతం క్షిప్రమంతరధీయత.
స చాపి వీరః కృతశస్త్రనిశ్రమః
పరేణ సామ్నాభ్యవదత్ సుయోధనం
యుధిష్ఠిరస్యాప్యభవత్ తదా మతి
ర్న కర్ణతుల్యోఽస్తి ధనుర్ధరః క్షితౌ.

136 వ అధ్యాయం సమాప్తం

## నూట ముప్పది యేడవ అధ్యాయం

పాండవాన్ ధార్తరాష్ట్రాంశ్చ కృతాస్త్రాన్
ప్రసమీక్ష్య సః
గుర్వర్థం దక్షిణాకాలే ప్రాప్తేఽమన్యత వై గురుః.
తతశ్శిష్యాన్ సమానీయ ఆచార్యోఽర్థమచోదయత్
ద్రోణః సర్వానశేషేణ దక్షిణార్థం మహీపతే.
పాంచాలరాజం ద్రుపదం గృహీత్వా రణమూర్ధని
పర్యానయత భద్రం వ స్సా స్యాత్ పరమదక్షిణా.
తథేత్యుక్త్వాతు తే సర్వే రథైస్తూర్ణం ప్రహారిణః
ఆచార్యధనదానార్థం ద్రోణేన సహితా యయుః.
తతోఽభిజగ్ముః పాంచాలాన్ నిఘ్నంతస్తే నరర్షభాః
మమృదుస్తస్య నగరం ద్రుపదస్య మహౌజసః.
దుర్యోధనశ్చ కర్ణశ్చ యుయుత్సుశ్చ మహాబలః
దుశ్శాసనో వికర్ణశ్చ జలసంధస్సులోచనః
ఏతే చాన్యే చ బహవః కుమారా బహువిక్రమాః

అహంపూర్వమహంపూర్వమిత్యేవం క్షత్రియర్షభాః.
తతో వరరథారూఢాః కుమారా స్సాదిభి స్సహ
ప్రవిశ్య నగరం సర్వే రాజమార్గముపాయయుః.
తస్మిన్ కాలేతుపాంచాలశ్శ్రుత్వాదృష్ట్వామహద్బలం
భ్రాతృభి స్సహితో రాజ స్త్వరయా నిర్యయౌ
గృహాత్.
తతస్తు కృతసంనాహో యజ్ఞసేన సహోదరా
శ్శరవర్షాణి ముంచంతః ప్రణేదు స్సర్వ ఏవ తే.
తతో రథేన శుభ్రేణ సమాసాద్య తు కౌరవాన్
యజ్ఞసేన శ్శరాన్ ఘోరాన్ వవర్ష యుధిదుర్జయః.
పూర్వమేవతుసమ్మంత్ర్యంపార్థోద్రోణమథాబ్రవీత్
దర్పోద్రేకాత్ కుమారాణామాచార్యం
ద్విజసత్తమం
ఏషాం పరాక్రమస్యాంతేవయం కుర్యామ సాహసం

ద్రోణుడు సంతుష్టచిత్తుడై ద్రుపదుని విడిపించి ఆదరించి సత్కరించి అర్ధరాజ్యమిచ్చి పంపించాడు. ద్రుపదుడు దీనహృదయుడై రాజధానికి పోయి కాంపిల్య నగరంలో వసిస్తూ చర్మణ్వతీనదికి దక్షిణ భాగాన్ని ఏలసాగాడు. ద్రుపదుడు తన క్షాత్రబలంతో ద్రోణాచార్యుని ఓడించలేకపోయాడు. బ్రాహ్మణబలాధిక్యాన్ని గుర్తించి ద్రుపదుడు ద్రోణుణ్ణి జయించే శక్తిశాలియైన పుత్రునికోసం యోచించసాగాడు. ద్రోణుడు అహిచ్ఛత్రాన్ని రాజధానిగా చేసికొని ఉత్తరపాంచాలాన్ని పాలిస్తున్నాడు. అర్జునుడు ఈ విధంగా గురుదక్షిణ చెల్లించి తన కృతజ్ఞత వెలిబుచ్చుకొన్నాడు.

137 వ అధ్యాయము సమాప్తం

## నూట ముప్పది ఎనిమిదవ అధ్యాయం

### యౌవరాజ్యాభిషేకము

ఒకసంవత్సరం గడిచింది. ధర్మరాజుయొక్క ధైర్యస్థైర్యాలూ, సద్గుణసౌహార్దాలూ దయాక్షమలూ ధృతరాష్ట్రుడు గుర్తించి యౌవరాజ్యాభిషిక్తుని చేశాడు. యువరాజు ధర్మరాజు తన సదాచార శీలసంపత్తితో పాండురాజును మించినకీర్తి సంపాదించాడు.

భీమసేనుడు బలరాముని శిక్షణలో గదాఖడ్గచాలనాలు అభ్యసిస్తున్నాడు. అర్జునుడు అస్త్రలాఘవం బాణపాతం ఆదిగాగలవానిలో చతురుడయ్యాడు. క్షుర నారాచ భల్ల విపాఠాలలో ఋజు వక్ర విశాలాస్త్రచాలన రహస్యాలు సమగ్రంగా గ్రహించాడు. అంతతో ద్రోణాచార్యులు అర్జునునితో సమమయిన వీరుడు లేడని సంతోషించాడు.

ఒకనాడు కురురాజసభాభవనంలో ద్రోణాచార్యుడు— అర్జునా! అగ్నివేశనామవిఖ్యాతులు మా గురువులు. వారు అగస్త్యుల శిష్యులు. అగస్త్యులవారు ధనుర్వేదంలో అగ్నివేశులకు శిక్షణ ఇచ్చారు. అగ్నివేశులు మాకిచ్చారు. గురుపరంపరగావచ్చే ఈ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని నా తపశ్శక్తితో సాధించే నీకిచ్చాను. ఈ అస్త్రము అజ్వలనమైనది. సమస్తభూమండలాన్ని అది ధ్వంసం చేయగలదు. అయితే మాగురువులు ఆ అస్త్రాన్ని ఇస్తూ మనుష్యులమీద అల్పప్రాణులమీదా ప్రయోగించవద్దన్నారు. ఆ నియమాన్ని నువ్వు కూడా పాలించాలి. ఈ అస్త్రం నీకు వినా మరెవరికీ లభ్యంకాలేదు. కనక ఇప్పుడు నువ్వు నాకు గురుదక్షిణ ఇవ్వాలి—అన విని అర్జునుడు-తమ ఆజ్ఞ అన్నాడు. అప్పుడు ద్రోణుడు—అర్జునా! యుద్ధమే సిద్ధమయితే నువ్వు నా ఎదురుగా నిలిచి పోరాడాలి! ఇదే నేను కోరే గురుదక్షిణ— అన్నాడు. అర్జునుడు పరమసంతోషంతో అంగీకరించి గురుచరణాలకు నమస్కరించాడు. సముద్రపర్యంత వ్యాప్తమయిన భూమండలంలో అర్జునునితో సమమయిన అస్త్రవిద్యాకుశలుడు లేడని మారుమ్రోగింది.

గదాధారియై, ఖడ్గపాణియై,ధనుర్ధరుడై, రథస్థుడై యుద్ధం చేయడంలో అర్జునుడు ఆరితేరాడు.

పతైరశక్యః పాంచాలో గ్రహీతుం రణమూర్ధని.
ఏవముక్త్వాతుకౌంతేయో భ్రాతృభిస్సహితోఽనఘః
అర్ధక్రోశే తు నగరాదతిష్ఠద్ బహిరేవ సః.
ద్రుపదః కౌరవాన్ దృష్ట్వా ప్రాధావత సమంతత
శ్శరజాలేన మహతా మోహయన్ కౌరవీంచమూం.
తముద్యతం రథేనైకమాశుకారిణమాహవే
అనేకమివ సంత్రాసాన్మేనిరే తత్ర కౌరవాః.
ద్రుపదస్య శరాఘోరా విచేరు స్సర్వతో దిశం
తత శ్శంఖాశ్చ భేర్యశ్చ మృదంగాశ్చ సహస్రశః.
ప్రావాద్యంత మహారాజ పాంచాలానాం నివేశనే
సింహనాదశ్చ సంజజ్ఞే పాంచాలానాం మహాత్మనాం.
ధనుర్జ్యాతలశబ్దశ్చ సంస్పృశ్య గగనం మహాన్
దుర్యోధనో వికర్ణశ్చ సుబాహుర్దీర్ఘలోచనః.
దుశ్శాసనశ్చ సంక్రుద్ధ శ్శరవర్షైరవాకిరన్
సోఽతివిద్ధో మహేష్వాసః పార్షతో యుధిదుర్జయః.
వ్యధమత్ తాన్యనీకాని తత్క్షణాదేవ భారత
దుర్యోధనం వికర్ణం చ కర్ణం చాపి మహాబలం.
నానానృపసుతాన్ వీరాన్ సైన్యాని వివిధాని చ
అలాతచక్రవత్ సర్వం చరన్ బాణైరతర్పయత్.
దుశ్శాసనం చ దశభిర్వికర్ణం వింశకై శ్శరై
శ్శకునిం వింశకై స్తీక్ష్ణైర్దశభిర్మర్మభేదిభిః.
కర్ణదుర్యోధనౌ చోభౌ శరై స్సర్వాంగసంధిషు
అష్టావింశతిభి స్సర్వైః పృథక్ పృథగరిందమః.
సుబాహుం పంచభిర్విద్ధ్వా తథాన్యాన్వివిధైః శరైః
వివ్యాధ సహసా భూయో ననాద బలవత్తరం
వినద్య కోపాత్ పాంచాల స్సర్వశస్త్రభృతాంవరః
ధనూంషి రథయంత్రం చ హయాంశ్ఛత్రధ్వజానపి
చకర్త సర్వపాంచాలాః ప్రణేదు స్సింహసంఘవత్.
తతస్తు నాగరా స్సర్వే ముసలై ర్యష్టిభి స్తదా
అభ్యవర్షంత కౌరవ్యాన్ వర్షమాణా ఘనా ఇవ.

సబాలవృద్ధా స్తే పౌరాః కౌరవానభ్యయు స్తదా
శ్రుత్వా సుతుములం యుద్ధం కౌరవానేవ భారత.
ద్రవంతి స్మ నదంతి స్మ క్రోశంతః పాండవాన్ ప్రతి
పాంచాలశరభిన్నాంగో భయమాసాద్యవై వృషః
కర్ణో రథాదవప్లుత్య పలాయనపరోఽభవత్.
పాండవాస్తు స్వనం శ్రుత్వా ఆర్తానాం లోమహర్షణం
అభివాద్య తతో ద్రోణం రథానారురుహు స్తదా
యుధిష్ఠిరం నివార్యాశు మా యుధ్యస్వేతి పాండవం.
మాద్రేయౌ చక్రరక్షౌ తు ఫాల్గునశ్చ తదాకరోత్
సేనాగ్రగో భీమసేన స్సదాభూద్ గదయా సహ.
తదాశత్రుస్వనం శ్రుత్వా భ్రాతృభిస్సహితోఽనఘః
అయాజ్జవేన కౌంతేయో రథేనానాదయన్ దిశః
పాంచాలానాం తత స్సేనాముద్ధతార్ణవనిఃస్వనాం
భీమసేనో మహాబాహుర్దండపాణిరివాంతకః.
ప్రవివేశ మహాసేనాం మకర స్సాగరం యథా
స్వయమభ్యద్రవద్ భీమో నాగానీకం గదాధరః.
స యుద్ధకుశలః పార్థో బాహువీర్యేణ చాతులః
అహనత్ కుంజరానీకం గదయా కాలరూపధృత్.
తే గజా గిరిసంకాశాః క్షరంతో రుధిరం బహు
భీమసేనస్య గదయా భిన్నమస్తకపిండకాః.
పతంతి ద్విరదా భూమౌ వజ్రఘాతాదివాచలాః
గజానశ్వాన్ రథాంశ్చైవ పాతయామాస పాండవః.
పదాతీంశ్చ రథాంశ్చైవ న్యవధీదర్జునాగ్రజః
గోపాల ఇవ దండేన యథా పశుగణాన్ వనే.
చాలయన్ రథనాగాంశ్చ సంచచాల వృకోదరః
భారద్వాజప్రియం కర్తుముద్యతః ఫాల్గున స్తదా.
పార్షతం శరజాలేన క్షిపన్నాగాత్ స పాండవః
హయౌఘాంశ్చ రథౌఘాంశ్చ గజౌఘాంశ్చ సమంతతః
పాతయన్ సమరే రాజన్ యుగాంతాగ్నిరివజ్వలన్
తత స్తే హన్యమానా వై పాంచాలాస్సృంజయా స్తథా.
శరై ర్నానావిధై స్తూర్ణం పార్థం సంఛాద్య సర్వశ

సహదేవుడు బృహస్పతితుల్యుడైన ద్రోణునివద్దనే నీతిశాస్త్రాన్ని అభ్యసించి సోదరుల చెప్పుచేతలలో ఉంటున్నాడు. నకులుడు ఆచార్యద్రోణుని శిక్షణలో శస్త్రాస్త్రవిద్యాకుశలుడయాడు. వారుకూడా యుద్ధవిద్యలో ఆరితేరి అతిరథులనే పేరుపొంది అన్నలకు ప్రీతి కలిగేటట్లు చరించేవారు.

గంధర్వులు కలిగించే విఘ్నాలను లక్ష్యం చేయకుండా మూడుసంవత్సరాలు యజ్ఞం సాగించిన సౌవీరదేశాధీశుణ్ణి పాండురాజుకూడా జయించలేకపోయాడు. అటువంటివానితోపాటు యావనదేశాధీశుణ్ణికూడా అర్జునుడు జయించాడు.

దత్తామిత్రి సుమిత్రులనుకూడా అర్జునుడు జయించాడు. భీముని సహాయంతో రథారూఢుడై బయలుదేరి తూర్పు దిక్కున ఉన్న పదివేలమంది రథికులనూ, యోధులనూ స్వాధీనం చేసికొన్నాడు. అదేరీతిగా దక్షిణదిగ్విజయం చేసి ధనరాసులు గ్రహించి ధనంజయ నామం సార్థకం చేసికొన్నాడు ఈప్రకారంగా అర్జునుడు అన్యదేశాధీశులను జయించి రాజ్యాన్ని అభివృద్ధిచేశాడు.

పాండవుల బలపరాక్రమాలూ వారి విజయాలూ ఆకర్ణించే ధృతరాష్ట్రుని మనస్సు చింతామగ్నం అయిపోయింది. ఆయనకు రాత్రివేళ ఆ విచారంవల్ల నిద్రపట్టడంలేదు.

138 వ అధ్యాయం సమాప్తం

## నూట ముప్పది తొమ్మిదవ అధ్యాయం

### కణికుని కూటనీతి

పాండురాజ నందనుల తేజోబలపరాక్రమాలు వినేధృతరాష్ట్రునికి హృదయంలో శోకం మరీ వృద్ధిపొందుతోంది. దానిని నివారించుకొనే ఉపాయం కోసం అర్థశాస్త్రవిదుడూ రాజనీతివేత్తా అయిన కణికుడనే మంత్రిని పిలిచి ధృతరాష్ట్రుడు— మంత్రీ! నానాటికీ పాండవులకీర్తి వృద్ధిపొందుతోంది. అది నాహృదయాన్ని వేధిస్తోంది. ఇప్పుడు నేను వారితో మైత్రి నెరపాలో యుద్ధం సాగించాలో నువ్వు చెపుతే ఆప్రకారంగా నడుచుకుంటాను—అన్నాడు.

అది విని కణికుడు సంతుష్టచిత్తుడై రాజనీతిని ప్రవచించే సంకల్పంతో— మహారాజా! ఇటువంటి సందర్భాలలో రాజనీతివిదులు చెప్పే విషయాలను నేను చెబుతున్నాను. అందువల్ల నన్ను దోషదృక్కుగా భావించకండి. సర్వవేళలా పురుషార్థసాధనకు దండప్రయోగం అవశ్యం. మీ దౌర్బల్యాలనీ ప్రమాదాలనూ ప్రకటించుకోకుండా శత్రువుల దుర్బలత్వంమీదా వారి ఛిద్రాలమీదా దృష్టిఉంచి స్వాధీనం చేసికొనేందుకు ప్రయత్నించాలి. సమయోచితంగా రాజదండాన్ని ప్రయోగించే మహారాజుకి పాలితులు భయపడతారు. కనకనే దండనీతి సాధించలేనిది లేదు. చక్రవర్తి తన ఆత్మఛిద్రాలను ఇతరులకు తెలియనివ్వకుండా ఇతరులదౌర్బల్యాలనుగమనించి ఆ అవకాశాన్ని వినియోగించుకోవాలి. ఆరంభించిన కార్యాన్ని నిర్విఘ్నంగా పరిసమాప్తి చేసికోవాలి. తనకు ప్రమాదాలు కలిగించేశత్రువులను హతమార్చేవారిని నీతిశాస్త్రజ్ఞులు ప్రశంసిస్తారు.

స్సింహనాదంముఖ్యైః కృత్వాసమయుధ్యంత పాండవం
తత్ యుద్ధమభవద్ఘోరం సుమహాద్భుతదర్శనం
సింహనాదస్వనం శ్రుత్వానామృష్యత్ పాకశాసనిః.
తతః కిరీటీ సహసా పాంచాలాన్ సమరేఽద్రవత్
ఛాదయన్నిషుజాలేన మహతా మోహయన్నివ.
శీఘ్రమభ్యస్యతో బాణాన్ సందధానస్య చాసకృత్
నాంతరం దదృశే కించిత్ కౌంతేయస్య యశస్వినః.
న దిశో నాంతరిక్షం చ తదా నైవ చ మేదినీ
అదృశ్యత మహారాజ తత్ర కించన సంయుగే.
బాణాంధకారే బలినా కృతే గాండీవధన్వనా
సింహనాదశ్చ సంజజ్ఞే సాధుశబ్దేన మిశ్రితః
తతః పంచాలరాజస్తు తథా సత్యజితా సహ.
త్వరమాణోఽభిదుద్రావ మహేంద్రం శంబరో యథా
మహతా శరవర్షేణ పార్థః పాంచాలమావృణోత్
తతో హలహలాశబ్ద ఆసీత్ పాంచాలకే బలే
జిఘృక్షతి మహాసింహో గజానామివ యూథపం.
దృష్ట్వా పార్థం తదాఽఽయాంతం సత్యజిత్ సత్యవిక్రమః
పాంచాలం వై పరిప్రేప్సుర్ధనంజయముపాద్రవత్.
తతస్త్వర్జునపాంచాలౌ యుద్ధాయ సముపాగతౌ
వ్యక్షోభయేతాం తౌ సైన్యమింద్రవైరోచనావివ.
తతస్సత్యజితం పార్థో దశభిర్మర్మభేదిభిః
వివ్యాధ బలవద్ గాఢం తదద్భుతమివాభవత్.
తతశ్శరశతైః పార్థం పాంచాలశ్శీఘ్రమార్దయత్
పార్థస్తు శరవర్షేణ చ్ఛాద్యమానో మహారథః.
వేగం చక్రే మహావేగో ధనుర్జ్యామవమృజ్య చ
తతస్సత్యజితశ్చాపంఛిత్వారాజానమభ్యయాత్.
అథాన్యద్ ధనురాదాయ సత్యజిద్వేగవత్తరం
సాశ్వం ససూతం సరథం పార్థం వివ్యాధ సత్వరః.
స తం న మమృషే పార్థః పాంచాలేనార్దితో యుధి
తతస్తస్య వినాశార్థం సత్వరం వ్యసృజచ్ఛరాన్.

హయాన్ ధ్వజం ధనుర్ముష్టిముభౌ తౌ పార్ష్ణిసారథీ
స తథా ఛిద్యమానేషు కార్ముకేషు పునః పునః
హయేషు వినియుక్తేషు విముఖోఽభవదాహవే
స సత్యజితమాలోక్య తథా విముఖమాహవే.
వేగేన మహతా రాజన్నభ్యవర్షత పాండవం
తదా చక్రే మహద్ యుద్ధమర్జునో జయతాం వరః.
తస్య పార్థో ధనుశ్ఛిత్త్వా ధ్వజం చోర్వ్యామపాతయత్
పంచభిస్తస్య వివ్యాధ హయాన్ సూతం చ సాయకైః.
తత్ ఉత్సృజ్య తచ్చాపమాదదానశ్శరావరం
ఖడ్గముద్ధృత్య కౌంతేయః సింహనాదమథాకరోత్.
పాంచాలస్య రథస్యేషామాప్లుత్య సహసాపతత్
పాంచాలరథమాస్థాయ అవిత్రస్తో ధనంజయః.
విక్షోభ్యాంభోనిధిం పార్థస్తం నాగమివ సోఽగ్రహీత్
తతస్తు సర్వపాంచాలా విద్రవంతి దిశో దశ.
దర్శయన్ సర్వసైన్యానాం స బాహ్వోర్బలమాత్మన
సింహనాదస్వనం కృత్వా నిర్జగామ ధనంజయః.
ఆయాంతమర్జునం దృష్ట్వా కుమారాస్సహితాస్తదా
మమృదుస్తస్య నగరం ద్రుపదస్య మహాత్మనః.
సంబంధీ కురువీరాణాం ద్రుపదో రాజసత్తమః
మా వధీస్తద్బలం భీమ గురుదానం ప్రదీయతాం.
భీమసేనస్తదా రాజన్నర్జునేన నివారితః
అతృప్తో యుద్ధధర్మేషు న్యవర్తత మహాబలః.
తే యజ్ఞసేనం ద్రుపదం గృహీత్వా రణమూర్ధని
ఉపాజహ్రుస్సహామాత్యం ద్రోణాయ భరతర్షభ.
భగ్నదర్పం హృతధనం తం తథా వశమాగతం
స వైరం మనసాధ్యాత్వా ద్రోణో ద్రుపదమబ్రవీత్.
విమృద్య తరసా రాష్ట్రం పురం తే మృదితం మయా
ప్రాప్య జీవం రిపువశం సఖిపూర్వం కిమిష్యతే.
ఏవముక్త్వా ప్రహస్యైనం కించిత్ స పునరబ్రవీత్
మా భైః ప్రాణభయాద్వీర క్షమిణో బ్రాహ్మణా వయం.

సావకాశం చూసికొని శత్రువుపై దాడి చెయ్యాలి. ప్రతిపక్షులు ప్రమాదస్థితుల్లో ఉన్నప్పుడు వారిని సంహరించడానికి వెనుకంజ వేయకూడదు. ఆసమయాలలో వారిపట్ల ఏమాత్రం దయాప్రసారం చేయకూడదు. శత్రువు దుర్బలుడైనా ఉపేక్ష మంచిదికాదు. అగ్నికణం మహావనాన్నికూడా భస్మంచేసినట్లు శత్రువు సామాన్యుడైనా మహావీరుల సహకారంతో వినాశనం చేయగల్గుతాడు. తాను శక్తిహీనుడైనప్పుడు శత్రువులదోషాలను గుర్తించకుండా వారి నిందలు వినకుండా కాలం గడుపుకుపోవాలి. తనకు శక్తి సమకూరేవరకూ వేచిఉండి సామాన్యుపాయాలతో శత్రువును నమ్మించి వధించాలి. శత్రువు తనను శరణువేడినాడని వానిపై దయచూపరాదు. శత్రుమరణంతో కాని మనస్సుకి శాంతి ఉండదు. దానంతో అయినా శత్రువుని వశపర్చుకోవాలి. ప్రథమంలో శత్రువుగా ఉండి అనంతరం సేవకుడుగా మారినవానిని ఉపేక్షించరాదు. శత్రువుల ఐశ్వర్యఉత్సాహమంత్రశక్తులనే త్రివర్గాలనూ అమాత్య రాష్ట్ర దుర్గకోశ సేనలనే పంచవర్గాలనూ సామ దాన భేద దండ ఉద్బంధన విషప్రయోగ అగ్నిప్రసరణలనే సప్తవర్గాలనూ సమూలంగా నాశనం చెయ్యాలి. శత్రువుయొక్క బలాన్ని మూలచ్ఛేదంచేసి అనంతరం వాని బంధుమిత్రులను సంహరించాలి. మూలచ్ఛేదంతో ఆశ్రయ వస్తుజాలం నశిస్తుంది.

శత్రువుయొక్క సర్వవ్యవహారాలనూ గమనిస్తూ తన రాజ్యాంగాన్ని గుప్తంగా నడుపుకోవాలి. సర్వదా శత్రువుయొక్క దౌర్బల్యాన్ని గమనిస్తూ సావధానచిత్తుడై ఉండాలి. అగ్నిహోత్రాది కార్యాలు నిర్వర్తిస్తూ కాషాయాంబరధారియై జటాముండితుడై చరిస్తూ సందుచూసి తోడేలులా శత్రువుమీద పడాలి. అభీష్టఫలసిద్ధికోసం ఎంత కాలమైనా వేచియుండాలి. దీనహృదయంతో క్షమాభిక్ష నర్థించే శత్రువును దయదల్చరాదు. సామదానభేదదండోపాయాలతో స్వాధీనం చేసుకోవడానికే ప్రయత్నించాలి—అన్నాడు.

కణికునిమాటలు విని ధృతరాష్ట్రుడు సామ దాన భేద దండోపాయ స్వరూపాల్ని సమగ్రంగా వివరించి శత్రువును వశంచేసుకొనే ఉపాయాన్ని తెలియచెప్పమన్నాడు.

ఒక ఉపాఖ్యానంద్వారా ధృతరాష్ట్రునికి కణికుడు చతుర్విధోపాయాలను వివరిస్తున్నాడు— మహారాజా! ఒకానొక అరణ్యంలో ఓ జంబూకం ఉండేది. దానికి నీతిశాస్త్రం బాగా తెలుసు. స్వార్థప్రయోజనాలను అది ఎంతో నేర్పుతో సాధించుకొనేది. దానికి పులి తోడేలు ఎలుక ముంగిస స్నేహితులుగా ఉండేవి. ఒకనాడు తన నలుగురి స్నేహితులతో నక్క ఒక లేడిని చూసింది. అది బాగా బలిసి ఉంది. ఎలా అయినా ఆ లేడిని పట్టుకోవాలని అవి ప్రయత్నించాయి. కాని ఫలించలేదు. అప్పుడు నక్క వాటిని చూస్తూ ఈలేడి యౌవనంలో ఉంది. బలంగా ఉంది. దీనికి తెలివితేటలుకూడా ఉండిఉంటాయి. అందుచేత నే ఇది పులికికూడా దొరకడంలేదు. ఆ లేడి నిద్రపోతున్న సమయంలో ఎలుక వెళ్ళి దాని రెండు కాళ్ళు కొరికేయాలి. అదేసమయంలో పులి దాన్ని పట్టుకోవాలి. అప్పుడు మనమందరం హాయిగా దానిని తినవచ్చు—అన్నది.

నక్కచెప్పినట్టుగానే ఎలుక దానికాళ్ళు కొరుకుతూండగా పులివెళ్ళి చంపేసింది. చచ్చి పడివున్న

అస్త్రమేక్రీడితం యత్తుత్వయాబాల్యేమయాసహ
తేన సంవర్ధిత స్స్నేహః ప్రీతిశ్చ క్షత్రియర్షభ.
పార్థయేయం త్వయా సఖ్యం పునరేవ జనాధిప
వరం దదామి తే రాజన్ రాజ్యస్యార్థ మవా
ప్నుహి.
అరాజా కిల నో రాజ్ఞః సఖా భవితుమర్హసి
అతః ప్రయతితం రాజ్యే యజ్ఞసేన మయా తవ.
రాజాసి దక్షిణే కూలే భాగీరథ్యాహముత్తరే
సఖాయం మాం విజానీహి పాంచాల యదిమన్యసే.
అనాశ్చర్యమిదం బ్రహ్మన్విక్రాంతేషు మహాత్మసు
ప్రీయేత్వయాహం త్వత్తశ్చ ప్రీతి మిచ్ఛామి
శాశ్వతీం.
ఏవముక్త స్సతం ద్రోణో మోక్షయామాస భారత
సత్కృత్యచైనం ప్రీతాత్మారాజ్యార్థం ప్రత్యపా
దయత్.
మాకందీమథ గంగాయా స్తీరే జనపదాయుతాం
సోఽధ్యావసద్దీనమనాః కాంపిల్యం చ పురోత్తమం.
దక్షిణాంశ్చాపి పంచాలాన్ యావచ్చర్మణ్వతీ నదీ
ద్రోణేన చైవం ద్రుపదః పరిభూయాథ పాలితః.
క్షాత్రేణ చ బలేనాస్య నాపశ్యత్ స పరాజయం
హీనం విదిత్వా చాత్మానం బ్రాహ్మేణ స బలేనతు.
పుత్రజన్మ పరీప్సన్ వై పృథివీమన్వసంచరత్
అహిచ్ఛత్రం చ విషయం ద్రోణ సమభిపద్యత.
ఏవం రాజన్నహిచ్ఛత్రా పురీ జనపదాయుతా
యుధి నిర్జిత్య పార్థేన ద్రోణాయ ప్రతిపాదితా.

138 వ అధ్యాయం సమాప్తం.

## నూటముప్పది తొమ్మిదవ అధ్యాయము

తత స్సంవత్సరస్యాంతే యౌవరాజ్యాయ పార్థివ
స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః.
ధృతిస్థైర్యసహిష్ణుత్వాదానృశంస్యాత్ తథార్జవాత్
భృత్యానా మనుకంపార్థం తథైవ స్థిరసౌహృదాత్.
తతోఽదీర్ఘేణ కాలేన కుంతీపుత్రో యుధిష్ఠిరః
పితురంతర్దధే కీర్తిం శీలవృత్తసమాధిభిః.
అసియుద్ధే గదాయుద్ధే రథయుద్ధే చ పాండవ
స్సంకర్షణాదశిక్షద్వై శశ్వచ్ఛిక్షాం వృకోదరః.
సమాప్తశిక్షో భీమస్తు ద్యుమత్సేన సమోబలే
పరాక్రమేణ సంపన్నో భ్రాతౄణామచరద్వశే.
ప్రగాఢదృఢముష్టిత్వే లాఘవే వేధనే తథా
క్షురనారాచభల్లానాం విపాఠానాం చ తత్త్వవిత్.
ఋజువక్రవిశాలానాం ప్రయోక్తా ఫాల్గునోఽభవత్
లాఘవే సౌష్ఠవే చైవ నాన్యః కశ్చన విద్యతే.
బీభత్సుసదృశో లోకే ఇతి ద్రోణో వ్యవస్థితః
తతోఽబ్రవీద్గుడాకేశం ద్రోణః కౌరవసంసది.
అగస్త్యస్య ధనుర్వేదే శిష్యో మమ గురుః పురా
అగ్నివేశ ఇతి ఖ్యాత స్తస్య శిష్యోఽస్మి భారత.
తీర్థాత్ తీర్థం గమయితుమహ మేతత్ సముద్యతః
తపసా యన్మయా ప్రాప్తమమోఘమశనిప్రభం.
అస్త్రం బ్రహ్మశిరోనామ యద్దహేత్ పృథివీమపి
దదతా గురుణా చోక్తం న మనుష్యే ష్విదం
త్వయా.
భారద్వాజ విమోక్తవ్యమల్పవీర్యేష్వపి ప్రభో
త్వయా ప్రాప్తమిదం వీరదివ్యం నాన్యోఽర్హతి
త్విదం.

లేడిదగ్గర నక్క కూర్చుని — మిత్రులారా ! మీరంతా వెళ్ళి స్నానంచేసి రండి. నేను దీనిని చూస్తూంటాను — నావుడు ఆ నాలుగు జంతువులూ నదికి స్నానానికి వెళ్ళాయి. పులి అన్నిటికన్నా ముందుగా స్నానం చేసి వచ్చింది. వచ్చేసరికి నక్క విచారిస్తూ కూర్చోవడం చూసి — ఓమిత్రమా ! నువ్వెందుకు విచారిస్తున్నావు ? మా అందరిలోకీ తెలివిగలదానవు నువ్వు. నువ్వెందుకు చింతిస్తున్నావో నాకు తెలియడం లేదు. హాయిగా ఈలేడి మాంసం తిని విహరిద్దాం—అన్నది. అప్పుడు నక్క— ఓ శార్దూలమా ! ఎలుక తానే ఈలేడిని చంపాననీ దానిభుజబలంవల్ల నువ్వు ఆకలితీర్చుకు బ్రతుకుతున్నావనీ నాతో అన్నది. అందుచేత ఈ క్షుద్రమైనఆహారాన్ని ఆరగించడం నాకిష్టంలేదు—అన్నది.

అప్పుడు పెద్దపులి ఇలా అన్నది— మూషికం నాకళ్ళు తెరిచింది. ఇది మొదలుగా నేను నాశక్తితో నా ఆహారం సంపాదించుకుంటాను— అని అరణ్యంలోకి వెళ్ళిపోయింది. ఉత్తరక్షణంలో ఎలుక వచ్చింది. దానిని చూసి నక్క— ఓ మూషికమా! పులిముట్టడంవల్ల ఈమాంసం విషపూరితమయిందనీ అందుచేత దీనిని నేను ముట్టుకోననీ, నువ్వు అంగీకరిస్తే ఎలుకనే తినేస్తాననీ ముంగిస చెప్పింది— అని అన్నది. అది విని ఎలుక బిలంలోనికి దూరిపోయింది. అనంతరం వచ్చిన తోడేలుతో నక్క ఇలా అన్నది— సోదరా ! ఈరోజున పులికి నీమీద చాలాకోపంగా ఉంది. అది తన ఆడపులితో రావడానికి వెళ్ళింది. అది తిరిగి వచ్చేలోగా నువ్వు ఏం చేయదల్చుకున్నావో అది చెయ్యి— ఆమాటలతో తోడేలు పారిపోయింది. అప్పుడు వచ్చిన ముంగిసను బెదిరిస్తూ నక్క తనశక్తితో మిగిలిన ముగ్గురినీ ఓడించాననీ ముంగిసకు బలంఉంటే తనను జయించి మాంసం తినవచ్చుననీ అన్నది. ముంగిస భయపడి పులీ, తోడేలూ, ఎలుకా కూడ పరాజయం పొందినట్లయితే నేను నిన్ను గెలవలేనని వెళ్ళిపోయింది. అన్నీ వెళ్ళిపోయిన తర్వాత ఆ జంబుకం సంతోషంతో లేడిమాంసాన్ని ఆరగించింది.

ధృతరాష్ట్రమహారాజా ! ఎవడయినా ఈ ప్రకారంగా చరిస్తేనే ఔన్నత్యం పొందుతాడు. పిరికివందల్ని భయపెట్టి, సమబలుడితో సఖ్యంచేసి లోభికి ధనమిచ్చి బలహీనుడిమీద పరాక్రమం ప్రదర్శించి స్వాధీనపరుచుకోవాలి. ఇది నీతిశాస్త్రవిదులు చెప్పేవిషయం. కొడుకయినా స్నేహితుడయినా గురువైనా సోదరుడయినా ఆఖరికి తండ్రియినా శత్రువుగా మారితే అనాలోచితంగా వారిని హతమార్చాలి. ధనలోభం కల్పించికానీ, విషం తినిపించి కానీ ఆఖరికి మోసగించయినా శత్రువును చంపాలి. ఉపేక్షమాత్రం ఎన్నడూ పనికిరాదు. జయాపజయాలు సందేహాస్పదంగా ఉన్నప్పుడు నీతిశాస్త్రమర్యాదలను అనుసరించేవాడే వృద్ధిలోకి వస్తాడు. గర్వంతో దుర్మార్గాన నడిచే గురువు నయినా సరే శిక్షించాలి. శత్రువు ముందు క్రోధభావం ప్రదర్శించకూడదు. పరుషవాక్యాలు పలుకకూడదు. చిరునవ్వుతో మధురంగా భాషిస్తూ దయను అభియిస్తూ ధర్మమార్గం తెలియజేసి వాడికి తనయందు విశ్వాసం కలిగేటట్లుగా మార్చుకొని సావకాశం చిక్కగానే సంహరించాలి. పర్వతం కారుమేఘావృత మైనట్లు శత్రుగృహానికినిప్పుఅంటించాలి. దరిద్రులనూ చోరులనూ నాస్తికులనూ రాజ్యంలో ఉండనీయకూడదు. శత్రువుమనయింటికి వచ్చినట్లయితేఆతిథ్యమర్యాదలు

సమయస్తు త్వయా రక్ష్యో మునిసృష్టో విశాంపతే
ఆచార్యదక్షిణాం దేహి జ్ఞాతిగ్రామస్య పశ్యతః.
దదానీతి ప్రతిజ్ఞాతే ఫాల్గునేనాబ్రవీద్గురుః
యుద్ధేఽహం ప్రతియోద్ధవ్యో యుధ్యమాన స్త్వయానఘ.
తథేతి చ ప్రతిజ్ఞాయ ద్రోణాయ కురుపుంగవః
ఉపసంగృహ్య చరణౌ స ప్రాయాదుత్తరాం దిశం.
స్వభావాదగమచ్ఛబ్దో మహీం సాగరమేఖలాం
అర్జునస్య సమో లోకే నాస్తి కశ్చిద్ధనుర్ధరః.
గదాయుద్ధేఽసియుద్ధే చ రథయుద్ధే చ పాండవః
పారగశ్చ ధనుర్యుద్ధే బభూవాథ ధనంజయః.
నీతిమాన్ సకలాం నీతిం విబుధాధిపతే స్తదా
అవాప్య సహదేవోఽపి భ్రాతౄణాం వవృతే వశే.
ద్రోణేనైవ వినీతశ్చ భ్రాతౄణాం నకులః ప్రియః
చిత్రయోధీ సమాఖ్యాతో బభూవాతిరథోదితః.
త్రివర్షకృతయజ్ఞస్తు గంధర్వాణాముపప్లవే
అర్జునప్రముఖైః పార్థైః సౌవీరః సమరే హతః.
న శశాక వశే కర్తుం యం పాండురపి వీర్యవాన్
సోఽర్జునేన వశం నీతో రాజాఽఽసీద్యవనాధిపః.
అతీవ బలసంపన్న స్సదా మానీ కురూన్ ప్రతి
విపులో నామ సౌవీర శ్శస్తః పార్థేన ధీమతా.
దత్తామిత్ర ఇతి ఖ్యాతం సంగ్రామే కృతనిశ్చయం
సుమిత్రం నామ సౌవీరమర్జునోఽదమయచ్ఛరైః.
భీమసేన సహాయశ్చ రథానామయుతం చ సః
అర్జున స్సమరే ప్రాచ్యాన్ సర్వానేక రథోఽజయత్.
తథైవైకరథో గత్వా దక్షిణామజయద్దిశం
ధనౌఘం ప్రాపయామాస కురురాష్ట్రం ధనంజయః.
ఏవం సర్వే మహాత్మానః పాండవా మనుజోత్తమాః.
పరరాష్ట్రాణి నిర్జిత్య స్వరాష్ట్రం వవృధుః పురా.
తతో బలమతిఖ్యాతం విజ్ఞాయ దృఢధన్వినాం
దూషిత స్సహసా భావో ధృతరాష్ట్రస్య పాండుషు
స చింతాపరమో రాజా న నిద్రామలభన్నిశి.

139 వ అధ్యాయంసమాప్తం

# ఇది సంభవపర్వము

జరిపి విశ్వాసపాత్రంగా చరించి పామువలె కాటువేయాలి. ఒక వ్యక్తివల్ల ప్రమాదం వస్తుం దనే శంక కలిగితే అతన్ని సంపూర్ణంగా హత మార్చాలి. అటువంటి వారియందు ఏమాత్రం విశ్వాసం ఉంచకూడదు. అలా విశ్వసించినట్లయితే రాజుకి మహావిపత్తు సంభవిస్తుంది. శత్రుదేశాలలో గూఢచారుల్నీ పాషండవేషధారుల్నీ నియోగించు కోవాలి. ఉద్యానవనాలలో విహారస్థలాలలో పాన శాలలలో తీర్థప్రదేశాలలో దేవాలయ ప్రాంతా లలో శృంగాటకాలలో జనసమూహాలదగ్గర గూఢ చారులను ఉంచాలి. చక్రవర్తి కాగోరువాడు సరససంభాషణాచతురుడై ఉండాలి. ఎటువంటి ఘాతుకకృత్యం చెయ్యబోతున్నా చిరునవ్వు నవ్వు తూ చేతులు జోడించి శిరసువంచి అవకాశం దొరికి నప్పుడు తనపని నెరవేర్చుకోవాలి.

పుష్పసంభరితమూ ఫలరహితమూ అయిన వృక్షంలా ఉండాలి. ఫలసంపన్నమైనా అవి అందు బాటులో ఉండకూడదు. అపక్వంగా ఉన్నపుడు పండినట్లు గోచరించాలి. తనకోశంనుంచి శత్రువు లను పోషించకూడదు. ధర్మార్థకామనిర్వహణలో ఉన్న కష్టం ఎంతటిదయినా దానిఫలం ఉపభోగ్య మయినదీ శుభప్రదమైనదీ, ధర్మమార్గం వదల కుండా చరించే పురుషుడికి అర్థంవల్లా కామంవల్లా కొన్నిబాధలు ప్రాప్తిస్తాయి. లోభికీ భోగాసక్తు నికీ మిగిలినవి బాధాకరా లవుతాయి.

చక్రవర్తికి చిత్తప్రకాగ్రతా అహంకార రాహి త్యమూ ప్రియభాషిత్వమూ అవశ్యం. సర్వవిష యాలనూ గ్రహిస్తూ విషయవేత్తలతో చర్చిస్తూం డాలి. రాజు ప్రమాదంలో ఉంటే ఏనకేనాప్యు పాయేన దానినుండి రక్షణపొందాలి. కష్టపడని ప్రాణికి సుఖంలేదు. కష్టాలను సహించి జీవించ గలిగితే మేలు ప్రాప్తిస్తుంది. చిత్తశాంతికోసం విద్వాంసులను పరితృప్తులను చేయాలి.

చెట్టుకొమ్మచివర కూర్చున్నవాడు భూపతితు డైన అనంతరం తన తెలివితక్కువతనాన్ని గుర్తిం చుకున్నట్లే శత్రువును విశ్వసించినవాడు అతనిచే మోసగింపబడి నరకమార్గం చేరుతాడు.

చక్రవర్తి గూఢచారులను బహుజాగ్రత్తగా చూసుకుంటూ ఉండాలి. తన ఆలోచనను ఎన్నడూ బహిర్గతం చెయ్యకూడదు. జాలరివలె ఎన్నో ప్రాణాలను హరించకుండా రాజు వృద్ధిపొందలేడు. శత్రువు దుర్బలుడై రోగగ్రస్తుడై ప్రమాదాలలో చిక్కుకున్నప్పుడే అంత మొందించాలి. ఏపనీ లేని వాడు గడపదాటడు. ధనవంతుడు మరోధనికుని ఆశ్రయించడు. తనపనిని నేర్పుతో నిర్వర్తించు కుంటాడు. మిత్రునికీ శత్రువుకీ ఏం చెయ్యదల చుకున్నా అది వ్యక్తం చెయ్యకూడదు. ప్రజ లకు కార్యానంతరమే తెలియాలి. నిరంతరం నిర్భయంగా చరించాలి. దండనీతితో శత్రువు స్వాధీనుడైతే ఆశత్రువుమీద దయాప్రసారం చెయ్యకూడదు. ఆలోచనలేకుండా ఏపనీ చెయ్య కూడదు. దేశకాలాలను గమనించి కార్యానికి పూనుకోవాలి. సంతోషంతో సర్వకార్యాలూ సాగించాలి. దేశకాలాలను గమనించి నడిచేవారికే శ్రేయస్సు కలుతుంది. శత్రువు దుర్బలుడని విడిస్తే అగ్నికణం మహారణ్యాన్ని ధ్వంసం చేసినట్లే ఆశత్రువు తనను నాశనం చేస్తాడు. ఆశను రేకెత్తించి దాన్ని అలానే సాగిస్తూండాలి. నెరవేర్చక తప్పని సరిఅయితే ఏదో సాకు చెప్పి తప్పించాలి. లోహం తో చేసినకత్తిని చర్మకవచంలో ఉంచి అవసరం

శ్రుత్వా పాండుసుతాన్ వీరాన్ బలోద్రిక్తాన్ మహౌజసః
ధృతరాష్ట్రో మహీపాలశ్చింతామగమదాతురః.
తత ఆహూయ మంత్రజ్ఞం రాజశాస్త్రార్థవిత్తమం
కణికం మంత్రిణాం శ్రేష్ఠం ధృతరాష్ట్రోఽబ్రవీద్వచః
ఉత్సిక్తాః పాండవా నిత్యం తేభ్యోఽసూయే ద్విజోత్తమ
తత్ర మే నిశ్చితతమం సంధివిగ్రహకారణం
కణికత్వం మమాచక్ష్వ కరిష్యే వచనం తవ.
స ప్రసన్నమనాస్తేన పరిపృష్టో ద్విజోత్తమః
ఉవాచ వచనం తీక్ష్ణం రాజశాస్త్రార్థదర్శనం.
శ్రుణు రాజన్నిదం తత్ర ప్రోచ్యమానం మయానఘ
న మేఽభ్యసూయా కర్తవ్యా శ్రుత్వైతత్ కురుసత్తమ
నిత్యముద్యతదండ స్స్యాన్నిత్యం వివృతపౌరుషః
అచ్ఛిద్రశ్ఛిద్రదర్శీ స్యాత్ పరేషాం వివరానుగః.
నిత్యముద్యతదండాద్ధి భృశముద్విజతే జనః
తస్మాత్సర్వాణి కార్యాణి దండేనైవ విధారయేత్
నాస్యచ్ఛిద్రం పరః పశ్యేచ్ఛిద్రేణ పరమన్వియాత్
గూహేత్ కూర్మ ఇవాంగాని రక్షేద్వివరమాత్మనః.
నాసమ్యక్కృతకారీ స్యాదుపక్రమ్య కదాచన
కంటకో హ్యపి దుశ్ఛిన్న ఆస్రావం జనయేచ్చిరం.
వధమేవ ప్రశంసంతి శత్రూణామపకారిణాం
సువిదీర్ణం సువిక్రాంతం సుయుద్ధం సుపలాయితం
ఆపద్యాపది కాలే చ కుర్వీత న విచారయేత్
నావజ్ఞేయో రిపుస్తాత దుర్బలోఽపి కథంచన.
అల్పోఽప్యగ్నిర్వనం కృత్స్నం దహత్యాశ్రయసంశ్రయాత్
అంధస్స్యాదంధవేలాయాం బాధిర్యమపి చాశ్రయేత్ .
కుర్యాత్తృణమయం చాపం శయీత మృగశాయికాం
సాంత్వాదిభిరుపాయైస్తు హన్యాచ్ఛత్రుం వశే స్థితం.
దయా న తస్మిన్ కర్తవ్యా శరణాగత ఇత్యుత
నిరుద్విగ్నో హి భవతి న హతాజ్జాయతే భయం.
హన్యాదమిత్రం దానేన తథా పూర్వాపకారిణం
హన్యాత్ త్రీన్ పంచ సప్తేతి పరపక్షస్య సర్వశః.
మూలమేవాదితశ్ఛింద్యాత్ పరపక్షస్య నిత్యశః.
తత స్సహాయాంస్తత్పక్షాన్ సర్వాంశ్చ తదనంతరం
ఛిన్నమూలే హ్యధిష్ఠానే సర్వే తజ్జీవినో హతాః
కథం ను శాఖాస్తిష్ఠేరంశ్ఛిన్నమూలే వనస్పతౌ.
ఏకాగ్ర స్స్యాదవివృతో నిత్యం వివరదర్శకః
రాజన్నిత్యం సపత్నేషు నిత్యోద్విగ్న స్సమాచరేత్
అగ్న్యాధానేన యజ్ఞేన కాషాయేణ జటాజినైః
లోకాన్ విశ్వాసయిత్వైవ తతో లుంపేద్యథా వృకః.
అంకుశం శౌచమిత్యాహురర్థానాముపధారణే
ఆనామ్య ఫలితాం శాఖాం పక్వం పక్వం ప్రశాతయేత్
ఫలార్థోఽయం సమారంభో లోకే పుంసాం విపశ్చితాం
వహేదమిత్రం స్కంధేన యావత్ కాలస్య పర్యయః.
తతః ప్రత్యాగతే కాలే భింద్యాద్ఘటమివాశ్మని
అమిత్రో న విమోక్తవ్యః కృపణం బహ్వపి బ్రువన్.
కృపా న తస్మిన్ కర్తవ్యా హన్యాదేవాపకారిణం
హన్యాదమిత్రం సాంత్వేన తథా దానేన వా పునః.
తథైవ భేదదండాభ్యాం సర్వోపాయైః ప్రశాతయేత్
కథం సాంత్వేన దానేన భేదైర్దండేన వా పున.
అమిత్రశ్శక్యతే హంతుం తన్మే బ్రూహి యథాతథం
శృణు రాజన్ యథావృత్తం వనే నివసతః పురా.
జంబుకస్య మహారాజ నీతిశాస్త్రార్థదర్శినః
అథ కశ్చిత్ కృతప్రజ్ఞ శ్శృగాలః స్వార్థపండితః.
సఖిభిర్న్యవసత్ సార్ధం వ్యాఘ్రాఖువృకబభ్రుభిః
తేఽపశ్యన్ విపినే తస్మిన్ బలినం మృగయూథపం.
అశక్తా గ్రహణే తస్య తతో మంత్రమమంత్రయన్
అసకృద్యతితో హ్యేష హంతుం వ్యాఘ్ర వనే త్వయా.

కలిగినప్పుడు తీసి కేశఖండనచేసినట్లు అవసరావకా శాల ననుసరించి మనోభీష్టాలు నెరవేర్చుకోవాలి. అందుచేత ధృతరాష్ట్రమహారాజా! మీరు కూడా ఈ నీతిని విచారించి ప్రవర్తించాలి.

మనం ఏపనిచేసినా అది ఆపత్తులు తెచ్చిపెట్ట కూడదు. తనకు కళ్యాణం చేకూర్చే కార్యాలే చేసుకోవాలి. ఈవిషయాలన్నీ సమగ్రంగాగ్రహించి పాండవులపట్ల ఏవిధంగా ప్రవర్తించాలో నిశ్చ యించుకోండి. పాండవులు బలవంతులు. కనక నీతిమార్గం చూసి ప్రవర్తిస్తే తరువాయి పశ్చా త్తాపం అవసరంలేదు-అని కణికుడు గృహోన్ముఖు డయాడు. ధృతరాష్ట్రుడు శోక హృదయంతో అలానే ఉండి పోయాడు.

139 వ అధ్యాయంసమాప్తం

# ఇది సంభవపర్వము

## జ తు గృ హ ప ర్వ ము

దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు సమా వేశమై కుంతినీ పాండవులనూ అగ్నిలో దగ్ధం చేయడానికి ధృతరాష్ట్రుని అనుమతి పొందాలని నిశ్చయించారు. ముఖకవళికలను చూసి అంతరం గాన్ని గ్రహించగల విదురుడు వారి దురాలోచన లను సులభంగా తెలుసుకొన్నాడు. కుంతినీ పాండ వులనూ రక్షించాలని దృఢంగా నిశ్చయించు కొన్నాడు. వారి రక్షణకోసం ఒకనావను తయారు చేయించాడు. దానిలో ఒకయంత్రం ఉంచాడు. ఆయంత్రం ద్వారా అది ఎటువంటి కెరటాలనైనా ప్రక్కకు నెట్టుకుంటూ ముందుకు పోగలదు. దాని మీద జెండాలు ఎగురవేయించాడు. ఈఏర్పాటు లన్నీ పూర్తియైన తరువాత కుంతివద్దకు వచ్చి— పాండురాజ పత్నీ! ధృతరాష్ట్రుడు కురువంశాన్ని సర్వనాశనంచేయడానికే పుట్టాడు. పుత్రవ్యామో హంతో అధర్మమార్గాన నడుస్తున్నాడు. మీ రక్షణకోసం ఈనావ తయారు చేయించాను. ఇది ఎటువంటి ప్రవాహాలలోనైనా సుఖంగా పోతుంది. నువ్వు నీపుత్రులతో ఈనావమీద ప్రయాణించి మృత్యువునుండి విముక్తి పొందగలవు—అన్నాడు.

ఆమాటలు విని కుంతి చాలా విచారించింది. బిడ్డలను తీసికొని ఆనౌకమీద గంగానదిలో ప్రయాణం చేసి ఒక అరణ్యంలో ప్రవేశించింది.

వారణావతంలోని లాక్షాగృహంలో ఎఱుకల జాతికి చెందిన ఒకస్త్రీ తనఐదుగురుబిడ్డలతో భస్మం అయిపోయింది. ఆగృహాన్ని నిర్మించిన మహాపాపి పురోచనుడు కూడా అందులోనే మరణించాడు. కౌరవులు తమ దురాలోచన ఫలించిందని భ్రమ పడ్డారు.

విదురుని ఆలోచనల ననుసరించి జీవితం సాగించే పాండవులు సురక్షితంగా ఉన్నారు. కాని ప్రజలు మాత్రం పాండవులు మరణించారని దుఃఖించారు. దుఃఖంతో ధృతరాష్ట్రునికి ఆవార్తనందజేశారు— ఓ ధృతరాష్ట్రమహారాజా! నీ మనోరథం నెర వేరింది. నువ్వు పాండవులను హతమార్చ గలిగావు. ఇప్పుడు నిశ్చింతగా రాజ్యభోగాల ననుభవించు—

యువా వై జవసంపన్నో బుద్ధిశాలీ న శక్యతే
మూషికోఽస్య శయానస్య చరణౌ భక్షయత్వయం.
యథైనం భక్షితైస్తైః పాదైర్వ్యాఘ్రో గృహ్ణాతు వై తతః
తతో వై భక్షయిష్యామ స్సర్వే ముదితమానసాః.
జంబుకస్య తు తద్వాక్యం తథా చక్రు స్సమాహితాః
మూషికాభక్షితైః పాదైర్మృగం
వ్యాఘ్రోఽవధీత్తదా.
దృష్ట్వైవాచేష్టమానం తు భూమౌ మృగకలేవరం
స్నాత్వాఽఽగచ్ఛత భద్రం వో రక్షామీత్యాహ
జంబుకః.
శృగాలవచనాత్తేఽపి గతాః సర్వే నదీం తత
స్సచింతాపరమో భూత్వా తస్థౌ తత్రైవ జంబుకః.
అథాజగామ పూర్వం తు స్నాత్వా వ్యాఘ్రో
మహాబలః.
దదర్శ జంబుకం చైవ చింతాకులితమానసం.
కిం శోచసి మహాప్రాజ్ఞ త్వం నో బుద్ధిమతాం వరః
అశిత్వా పిశితాన్యద్య విహరిష్యామహే వయం.
శృణు మే త్వం మహాబాహో యద్వాక్యం
మూషికోఽబ్రవీత్
ధిగ్బలం మృగరాజస్య మయాద్యాయం మృగో హతః.
మద్బాహుబలమాశ్రిత్య తృప్తిమద్య గమిష్యతి
గర్జమానస్య తస్యైవమతో భక్ష్యం న రోచయే.
బ్రవీతి యది స హ్యేవం కాలే హ్యస్మిన్ ప్రబోధిత
స్స్వబాహుబలమాశ్రిత్య హనిష్యేఽహం వనేచరాన్.
ఖాదిష్యే తత్ర మాంసాని ఇత్యుక్త్వా ప్రస్థితో వనం
ఏతస్మిన్నేవ కాలే తు మూషికోఽప్యాజగామ హ.
తమాగతమభిప్రేక్ష్య శృగాలోఽప్యబ్రవీద్వచ
శ్శృణు మూషిక భద్రం తే నకులో యదిహాబ్రవీత్
మృగమాంసం న ఖాదేయం గరమేతన్న రోచతే
మూషికం భక్షయిష్యామి తద్భవాననుమన్యతాం.

తచ్ఛ్రుత్వా మూషికో వాక్యం సంత్రస్తః ప్రగతో బిలం
తత స్స్నాత్వా స వై తత్ర ఆజగామ వృకో నృప.
తమాగతమిదం వాక్యమబ్రవీజ్జంబుక స్తదా
మృగరాజో హి సంక్రుద్ధో న తే సాధు భవిష్యతి.
సకలత్ర స్త్విహాయాతి కురుష్వ యదనంతరం
ఏవం సంచోదిత స్తేన జంబుకేన తదా వృకః.
తతోఽవలుంపనం కృత్వా ప్రాయాత్ పిశితాశనః
ఏతస్మిన్నేవ కాలే తు నకులోఽప్యాజగామ హ.
తమువాచ మహారాజ నకులం జంబుకో వనే
స్వబాహుబలమాశ్రిత్య నిర్జితా స్తేఽన్యతో గతాః.
మమ దత్త్వా నియుద్ధం త్వం భుంక్ష్వ మాంసం
యథేప్సితం
మృగరాజో వృకశ్చైవ బుద్ధిమానపి మూషికః.
నిర్జితా యత్త్వయా వీర స్తస్మాద్వీరతరో భవాన్
న త్వయాప్యుత్సహే యోద్ధుమిత్యుక్త్వా
సోఽప్యుపాగమత్.
ఏవం తేషు ప్రయాతేషు జంబుకో హృష్టమానసః
ఖాదతిస్మ తదా మాంసమేకస్సన్ మంత్రనిశ్చయాత్.
ఏవం సమాచరన్నిత్యం సుఖమేధేత భూపతిః
భయేన భేదయేద్భీరుం శూరమంజలికర్మణా.
లుబ్ధమర్థప్రదానేన సమం న్యూనం తథౌజసా
ఏవం తే కథితం రాజన్ శృణు చాప్యపరం తథా.
పుత్రస్సఖా వా భ్రాతా వా పితా వా యది వా గురుః
రిపుస్థానేషు వర్తంతో హంతవ్యా భూతిమిచ్ఛతా.
శపథేనాప్యరిం హన్యాదర్థదానేన వా పునః
విషేణ మాయయా వాపి నోపేక్షేత కథంచన.
ఉభౌ చేత్సంశయోపేతౌ శ్రద్ధావాం స్తత్ర వర్ధతే
గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః
ఉత్పథ ప్రతిపన్నస్య న్యాయ్యం భవతి శాసనం
క్రుద్ధోఽప్యక్రుద్ధరూప స్స్యాత్

అని విని ధృతరాష్ట్రుడు శోకసంతప్త హృదయుడై భీష్మ విదురులను పిలచి పాండవులకు అపరకర్మలను నిర్వర్తించాడు.

సంక్షిప్తంగా చెప్పిన లాక్షాగృహదహన విషయాలను సమగ్రంగా వినగోరిన జనమేజయునికి వివరంగా వివరిస్తున్నాడు వైశంపాయనుడు—భీమసేనుని బలసంపత్తి అర్జునుని అస్త్ర విద్యాకౌశలమూ అనుక్షణమూ దుర్యోధనుని గుండెలో శూలంలా మసిలేవి. కర్ణుడూ శకునీ పాండవులను చంపడానికి ఎన్నో ఉపాయాలు చెప్పారు. ధీమంతులైన పాండవులు విదురుని సహాయంతో ఆ ప్రమాదాల నుండి తప్పించుకో గలిగారు.

నగరంలో ఏమూల చూసినా పాండవులను గూర్చిన ప్రశంసలే వినిపిస్తున్నాయి. వారి అభినందనలే మారుమ్రోగుతున్నాయి. లోకవ్యవహారాలను పరిశీలించటానికి అవశ్యమైన నేత్రాలులేని ధృతరాష్ట్రుడు రాజ్యార్హుడుకాడు. భీష్ముడు ఏనాడో రాజ్యత్యాగం చేశాడు. ఇప్పుడు సర్వవిషయజ్ఞుడూ దయాహృదయుడూ సత్యవ్రత పరాయణుడూ అయిన పాండవజ్యేష్ఠుని రాజ్యాభిషిక్తుని చెయ్యాలి. ధర్మరాజు రాజయితే భీష్మునీ ధృతరాష్ట్రునీ వారి కుమారులనీ ఆదరించి పోషిస్తాడు— అని ప్రజలు అనుకుంటూండగా వినిన దుర్యోధనుని మనస్సు లోలోపల మండుతూ ఉండేది. దుష్టదుర్యోధనుడు అసూయాగ్నితో బాధపడుతూ ధృతరాష్ట్రుని సమీపించి ఇంతసేపు దుఃఖించి—మహారాజా! ఈ ప్రజలందరూ ధర్మరాజును చక్రవర్తిగా చేయగోరుతున్నారు. సర్వభోగాలూ త్యజించిన భీష్ముడు ఈ విషయమై ఏ అభ్యంతరమూచెప్పడు. కాని ఈప్రజలవల్ల మనకు ఎన్నో కష్టాలు కలుగుతాయి. పాండురాజు తన సద్గుణాలతో రాజ్యాన్నీ ప్రజాభిమానాన్నీ పొందాడు. మీరు అంధులు కావడంవల్ల రాజ్యాధికారం లేకుండాపోయింది. ఇప్పుడు పాండవ జ్యేష్ఠుడు రాజ్యాధికారి ఔతాడు. అతని తర్వాత అతని పుత్రుడు రాజవుతాడు. అందువల్ల మేమందరమువారి అభిమాన పోషణల క్రింద జీవించాలి. అంతకంటె నరకం వేరే లేదు. ఈరాజ్యాన్ని ఈ లోగానే మీరు సాధించినట్లయితే మాకు ఉత్తరోత్తరాధికారం ప్రాప్తిస్తుంది-అన్నాడు.

140 వ అధ్యాయం సమాప్తం

## నూట నలుబది ఒకటవ అధ్యాయం

### వారణావతం

ధృతరాష్ట్రుడు దుర్యోధనునివిచారవాక్యాలూ కణికుని నీతిసూత్రాలూ స్మరించి చింతించసాగాడు. దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు సమావేశమై ఆలోచన సాగించలేక దుర్యోధనుడు ధృతరాష్ట్రుని సమీపించి—మహారాజా! పాండవులవల్ల మనకు ఏవిధమైన ప్రమాదమూ కలగకుండా ఉండాలంటే ఏదో నెపం కల్పించి వారిని వారణావతం పంపాలి— అన్నాడు. ధృతరాష్ట్రుడు ఆలోచించి-నాయనా! పాండురాజు జీవితాంతం ధర్మబద్ధంగానే నడిచాడు. నన్నూ ఆప్తబంధువుల్నీ ఎంతో ప్రేమతో చూసేవాడు. ఈరాజ్యం మీదేనని ఎప్పుడూ నాతో

స్మితపూర్వాభిభాషితా

న చాప్యన్యమపధ్వంసేత్కదాచిత్కోపసంయుతః.

ప్రహరిష్యన్ ప్రియం బ్రూయాత్ప్రహరన్నపి భారత

ప్రహృత్య చ కృపాయీత శోచేత చ రుదేత చ.

ఆశ్వాసయేచ్చాపి పరం సాంత్వధర్మార్థవృత్తిభిః

అథాస్య ప్రహరేత కాలే యదా విచలితే పథి.

అపి ఘోరాపరాధస్య ధర్మమాశ్రిత్య తిష్ఠత

స హి ప్రచ్ఛాద్యతే దోషశ్శైలో మేఘైరివాసితైః.

యః స్యాదనుప్రాప్తవధస్తస్యాగారం ప్రదీపయేత్

అధనాన్నాస్తికాంశ్చోరాన్విషయేస్వేసవాసయేత్

ప్రత్యుత్థానాసనాద్యేన సంప్రదానేన కేనచిత్

ప్రతివిశ్రబ్ధఘాతీ స్యాత్ తీక్ష్ణదంష్ట్రో నిమగ్నకః.

అశంకితేభ్యశ్శంకేత శంకితేభ్యశ్చ సర్వశః

అశంక్యాద్భయముత్పన్నమపి మూలం నికృంతతి.

న విశ్వసేదవిశ్వస్తే విశ్వస్తే నాతివిశ్వసేత్

విశ్వాసాద్భయముత్పన్నం మూలాన్యపి నికృంతతి.

చారస్సువిహితః కార్య ఆత్మనశ్చ పరస్య వా

పాషండాంస్తాపసాదీంశ్చ పరరాష్ట్రేషు యోజయేత్.

ఉద్యానేషు విహారేషు దేవతాయతనేషు చ

పానాగారేషు రథ్యాసు సర్వతీర్థేషు చాప్యథ.

చత్వరేషు చ కూపేషు పర్వతేషు వనేషు చ

సమవాయేషు సర్వేషు సరిత్సు చ విచారయేత్.

వాచా భృశం వినీతస్స్యాద్ధృదయేన తథా క్షుర

స్మితపూర్వాభిభాషీ స్యాత్ సృష్టో రౌద్రాయ కర్మణే.

అంజలిశ్శపథస్సాంత్వం శిరసా పాదవందనం

ఆశాకరణమిత్యేవం కర్తవ్యం భూతిమిచ్ఛతా.

సుపుష్పితస్స్యాదఫలః ఫలవాన్ స్యాద్దురారుహః

ఆమస్స్యాత్పక్వసంకాశో న చ జీర్యేత కర్హిచిత్.

త్రివర్గే త్రివిధా పీడా హ్యనుబంధస్తథైవ చ

అనుబంధాశ్శుభా జ్ఞేయాః పీడాస్తు పరివర్జయేత్.

ధర్మం విచరతః పీడా సాపి ద్వాభ్యాం నియచ్ఛతి

అర్థం చాప్యర్థలుబ్ధస్య కామం చాతిప్రవర్తినః.

అగర్వితాత్మా యుక్తశ్చ సాంత్వయుక్తోఽన

సూయితా

అవేక్షితార్థశ్శుద్ధాత్మా మంత్రయీత ద్విజైస్సహ.

కర్మణా యేన కేనైవ మృదునా దారుణేన చ

ఉద్ధరేద్దీనమాత్మానం సమర్థో ధర్మమాచరేత్.

న సంశయమనారుహ్య నరో భద్రాణి పశ్యతి

సంశయం పునరారుహ్య యది జీవతి పశ్యతి.

యస్య బుద్ధిః పరిభవేత్తమతీతేన సాంత్వయేత్

అనాగతేన దుర్బుద్ధిం ప్రత్యుత్పన్నేన పండితం.

యోఽరిణా సహ సంధాయ శయీత కృతకృత్యవత్

స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే.

మంత్రసంవరణే యత్నస్సదా కార్యోఽనసూయతా

ఆకారమభిరక్షేత చారేణాప్యనుపాలితః.

నాచ్ఛిత్త్వా పరమర్మాణి నాకృత్వా కర్మ దారుణం

నాహత్వా మత్స్యఘాతీవ ప్రాప్నోతి మహతీం శ్రియం.

కర్శితం వ్యాధితం క్లిన్నమపానీయమఘాసకం

పరివిశ్వస్తమందం చ ప్రహర్తవ్యమరేర్బలం.

నార్థికోఽర్థినమభ్యేతి కృతార్థే నాస్తి సంగతం

తస్మిన్ సర్వాణి సాధ్యాని సావశేషాణి కారయేత్.

సంగ్రహే విగ్రహే యత్నః కార్యోఽనసూయతా

ఉత్సాహశ్చాపి యత్నేన కర్తవ్యో భూతిమిచ్ఛతా.

నాస్య కృత్యాని బుధ్యేరన్ మిత్రాణి రిపవస్తథా

ఆరబ్ధాన్యేవ పశ్యేరన్ సుపర్యవసితాన్యపి.

భీతవత్ సంవిధాతవ్యం యావద్భయమనాగతం

ఆగతం తు భయం దృష్ట్వా ప్రహర్తవ్యమభీతవత్

దండేనోపనతం శత్రుమనుగృహ్ణాతి యో నర

స్స మృత్యుముపగృహ్ణీయాద్గర్భమశ్వతరీ యథా.

అనాగతం హి బుధ్యేత యచ్చ కార్యం పురస్థితం

అనేవాడు. సద్గుణాలతో తన మహాఖ్యాతి సంపాదించుకొన్నాడు. పుత్రపౌత్రాములయందూ మంత్రులయందూ సైనికులయందూ అభిమానంతో ఉండేవాడు. ప్రజలతో సౌహార్దంతో చరించేవాడు. వీరందరికీ ఈనాడు పాండవులమీద అపారమైన ప్రేమాభిమానా లున్నాయి. అటువంటివారికి మనం ఏపాటివిద్రోహం తలపెట్టినా వీరు మనల్ని బ్రతకనియ్యరు-అన్నాడు.

పితృపూజ్యా! నేనుకూడా ఈవిషయమై ఆలోచించకపోలేదు. ఆప్రమాదనివారణార్థమే ఈ ప్రజలందరికీ దానధర్మాలు చేసి వారిమనస్సు మనవైపు మరలించాను. అందుచేత మీారు వారివిషయమై శంకించనక్కరలేదు. మంత్రులూ కోశాగారమూ మన ఆధీనంలో ఉన్నాయి. ఈ తరుణంలోనే పాండవులను వారణావతం పంపాలి. రాజ్యం సర్వాధికారాలతో నాకు సంక్రమించిన అనంతరం కుంతీదేవి తనపుత్రులతో వచ్చి స్వేచ్ఛగా ఇక్కడే ఉండవచ్చు—అన్నాడు దుర్యోధనుడు.

నాయనా! నామనస్సులోకూడా అదే ఆలోచన ఉంది. అయితే ఈదురాలోచనతో భీష్మద్రోణవిదుర కృపాచార్యాదు లెవరూ ఏకీభవించరు. ధర్మపరాయణులైన పాండవుల విషయంలో మన దురూహల్ని వీరెవరూ కొనసాగనియ్యరు. కురువంశీయులకు ధార్తరాష్ట్రులూ పాండవులూ సమానులే. ఈస్థితిగతుల్లో మనం ఏపాటి విపరీతంగా ప్రవర్తించినా వీరందరూ మనల్ని హతమార్చక మానరు—అని ధృతరాష్ట్రు డనగా దుర్యోధనుడు ప్రతిసమాధాన మిస్తున్నాడు.

అశ్వత్థామ ఎప్పుడూ నాపక్షంలోనే ఉంటాడు. పుత్రవ్యామోహంతో ద్రోణుడు మనల్ని వదలడు. భీష్ముడు తటస్థుడే! విదురుడు ఆర్థికవ్యవహారాల్లో మనతో బంధింపబడిఉన్నాడు, అయినా పాండవపక్షపాతంతో చెయ్యగలిగిం దేమీలేదు. అందుచేత నిశ్చింతగా పాండవులను వారణావతం పంపవచ్చు. వా రిక్కడ ఉన్నంతకాలం నా హృదయంలో కంటకంలా ఉండి అనుక్షణం వేధిస్తారు. కనక మీారీకార్యాన్ని త్వరలో నిర్వర్తించి నన్ను సంతోషంగా నడిపించండి-అన్నాడు.

141 వ అధ్యాయము సమాప్తం

## నూట నలుబది రెండవ అధ్యాయము

దుర్యోధనుడు తన కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగడానికి ప్రణాళికలు ప్రారంభించాడు. అమాత్యులకూ పరివారానికీ ఏదోవిధంగా ధనధాన్యాలు ముట్టజెపుతున్నాడు. కొందరిని నియోగించి వారణావతం చాలా సుందరమైనదనీ అక్కడ పరమశివునికి జరిగే ఉత్సవాలు అద్భుతంగా ఉంటాయనీ పాండవులకు చెప్పిస్తున్నాడు. వారి వారి ప్రసంగాలలోకూడా వారణావతసౌభాగ్యమే నడిపించేవాడు.

ఆ యీ ప్రస్తావనలతో పాండవులకు వారణావతంలోకొంతకాలం గడపాలనే ఆశ జనించింది. అదిక్రమక్రమంగా పెరుగుతూన్నవార్త ధృతరాష్ట్రుని

న తుబుద్ధిక్షయాత్ కించిదతిరిక్తమేత్ ప్రయోజనం.
ఉత్సాహశ్చాపి యత్నేన కర్తవ్యో భూతిమిచ్ఛతా
విభజ్య దేశకాలౌ చ దైవం ధర్మాదయస్త్రయః
నైశ్శ్రేయసౌ తు తౌ జ్ఞేయా దేశకావితి స్థితిః.
తాలవత్కురుతే మూలం బాల శ్శత్రురుపేక్షితః
గహనేఽగ్నిరివోత్సృష్టః క్షిప్రం సంజాయతే మహాన్.
అగ్నిం స్తోకమివాత్మానం సంధుక్షయతి యో నరః
స వర్ధమానో గ్రసతే మహాంతమపి సంచయం.
ఆశాంకాలవతీంకుర్యాత్కాలం విఘ్నేనయోజయేత్
విఘ్నంనిమిత్తతోబ్రూయాన్నిమిత్తంవాపిహేతుతః.

క్షురో భూత్వా హరేత్ప్రాణాన్ నిశితః కాలసాధనః
ప్రతిచ్ఛన్నో లోమహారీ ద్విషతాం పరికర్తనః.
పాండవేషు యథాన్యాయమన్యేషు చ కురూద్వహ
వర్తమానో న మజ్జేస్త్వం తథా కృతం సమాచర.
సర్వకల్యాణసంపన్నో విశిష్ట ఇతి నిశ్చయః
తస్మాత్త్వం పాండుపుత్రేభ్యో రక్షాత్మానం నరాధిప.
భ్రాతృవ్యా బలినో యస్మాత్పాండుపుత్రా నరాధిప
పశ్చాత్తాపోయథానస్యాత్తథానీతిర్విధీయతాం.
ఏవముక్త్వా సంప్రతస్థే కణిక స్స్వగృహం తతః
ధృతరాష్ట్రోవాపి కౌరవ్య శోకార్తః సమపద్యత.

# ఇది సంభవపర్వము

## జ తు గృ హ ప ర్వ ము

తత స్సుబలపుత్రస్తు రాజా దుర్యోధనశ్చ హ
దుశ్శాసనశ్చ కర్ణశ్చ దుష్టం మంత్రమమంత్రయన్.
తే కౌరవ్యమనుజ్ఞాప్య ధృతరాష్ట్రం నరాధిపం
దహనే తు సపుత్రాయాః కుంత్యా బుద్ధిమకారయన్
తేషామింగితభావజ్ఞో విదుర స్తత్త్వదర్శివాన్
ఆకారేణ చ తం మంత్రం బుబుధే దుష్టచేతసాం.
తతో విదితవేద్యాత్మా పాండవానాం హితేరతః
పలాయతేమతించక్రేకుంత్యాఃపుత్రైస్సహానఘః.
తతో వాతసహాం నావం యంత్రయుక్తాం పతాకినీం
ఊర్మిక్షమాందృఢాంకృత్వాకుంతీమిదమువాచహ.
ఏష జాతః కులస్యాస్య కీర్తివంశప్రణాశనః
ధృతరాష్ట్రః పరీతాత్మా ధర్మం త్యజతి శాశ్వతం.
ఇయం వారిపథే యుక్తా తరంగపవనక్షమా
నౌర్యథా మృత్యుపాశాత్ త్వంసపుత్రా మోక్ష్యసే శుభే.
తచ్ఛ్రుత్వా వ్యథితా కుంతీ పుత్రైస్సహ యశస్వినీ

నావమారుహ్య గంగాయాం ప్రయయౌ భరతర్షభ.
తతో విదురవాక్యేన నావం విక్షిప్య పాండవాః
ధనం చాదాయ తైర్దత్తమరిష్టం ప్రావిశన్ వనం.
నిషాదీ పంచపుత్రా తు జాతుషే తత్ర వేశ్మని
కారణాభ్యాగతా దగ్ధా సహ పుత్రైరనాగసా.
స చ మ్లేచ్ఛాధమః పాపో దగ్ధస్తత్ర పురోచనః
వంచితాశ్చదురాత్మానోధార్తరాష్ట్రాస్సహానుగాః.
అవిజ్ఞాతా మహాత్మానో జనానామక్షతా స్తథా
జనన్యా సహ కౌంతేయా ముక్తావిదురమంత్రితాః.
తత స్తస్మిన్ పురే లోకా నగరే వారణావతే
దృష్ట్వా జతుగృహం దగ్ధమన్వశోచంత దుఃఖితాః.
రాజ్ఞే చప్రేషయామాసుర్యథావృత్తం నివేదితుం
సంవృత్తస్తే మహాన్కామఃపాండవాన్దగ్ధవానసి.
సకామో భవ కౌరవ్య భుంక్ష్వ రాజ్యం సపుత్రకః
తచ్ఛ్రుత్వాధృతరాష్ట్రస్తుసహపుత్రేణశోచయన్.
ప్రేతకార్యాణి చ తథా చకార సహ బాంధవైః
పాండవానాం తథాక్షత్తా భీష్మశ్చ కురుసత్తమః.

చెవినిబడింది. ఆయన సంతోషంతో వారిని పిలిపించి-ప్రియనందనులారా! మీరు సమస్త శాస్త్రాలూ అధ్యయనం చేశారు. కృపాచార్య ద్రోణాచార్యుల శిక్షణలో శస్త్రాస్త్రవిద్యాకుశలు లయారు. నాకెంతో సంతోషంగా ఉంది. రాజ్యాంగకుశలులయిన మంత్రుల ప్రసంగాలు ఈ మధ్య విరివిగా వారణావత సౌందర్య సౌభాగ్యాలపై నడుస్తున్నవి. అక్కడ జరిగే ఉత్సవాలను తిలకించే సంకల్పం ఉంటే మీరు పరిజనులతో వెళ్ళి కొంత కాలం అక్కడ ఉండి రండి. అక్కడ ద్విజశ్రేష్ఠు ల్నూ కళాకోవిదులనూ సత్కార సమ్మానాలు చేయండి. అలా హాయిగా కొంతకాలం గడిపి మళ్ళీ హస్తినాపురం రండి—అన్నాడు.

ధర్మరాజు ధృతరాష్ట్రుని సంకల్పం అర్థంచేసి కొన్నాడు. అయినా తను చెయ్యగలిగిన ప్రతీ కారం లేక ఆయనమాటకు అంగీకరించాడు. భీష్మ విదుర కృప ద్రోణ బాహ్లిక సోమదత్త భూరిశ్రవ గాంధారీ ప్రముఖులనూ రాజ్య శ్రేయస్సునూ వాంఛించే బ్రాహ్మణులనూ కలిసీస్తూ—వారణా వతంలో జరుగుతూన్న ఉత్సవాన్ని చూడటానికి ధృతరాష్ట్రుని ఆదేశానుసారం మేము వెడుతున్నాం. మీరందరూ ఆశీర్వదిస్తే మేము సుఖంగా తిరిగి వస్తాం—అన్నాడు ధర్మరాజు.

వారందరూ పాండవులయందు అభిమానంతో ఆశీర్వాదాలు కురిపించారు. ఆశీర్వాదవర్షాస్నాతు డైన ధర్మరాజు సమస్త కార్యాలూ నెరవేర్చుకొని సోదరులతో తల్లితో వారణావతంబయలుదేరాడు.

142 వ అధ్యాయంసమాప్తం

## నూట నలుబది మూడవ అధ్యాయము

పాండవులు వారణావత ప్రయాణసన్నాహంలో ఉన్నారు.

ఆ వార్త దుర్యోధనునికి అపారమైన సంతోషం కలిగించింది.

దుష్టదుర్యోధనుడు తన అంతరంగికసచివుడైన పురోచనుని పిలిచి ఏకాంతంలో కూర్చున్నాడు. పురోచనుని దక్షిణహస్తం దుర్యోధనుని చేతులలో ఉన్నది-మంత్రీ! ఈరాజ్యం మనది, దీన్ని రక్షించు కోవలసిన భారం మనమీద ఉన్నది. అయితే వర్తమానంలో నిన్ను మించిన విశ్వాస పాత్రుడూ శక్తిశాలీ మరొకడు లేడు. అతిరహస్యంగా మనం ఒక కార్యం చెయ్యాలి—అది శత్రుసంహారం.

మహారాజు ఆదేశానుసారం పాండవులు వారణావతం వెడుతున్నారు. అక్కడ జరిగే ఉత్సవాలలో వారు విహరిస్తూంటారు. ఈలోగానే నువ్వు వారణావతం వెళ్ళి అక్కడ ఒక సుందర భవనం శీఘ్రంగా నిర్మింపజెయ్యి. ఆ భవనానికి వాడే వస్తువులన్నీ అగ్నిస్పర్శమాత్రంచేత భస్మంకావాలి. లక్కమన్ను నేతినూనెలతో మిళితం చేయించి భవననిర్మాణం సాగించు. ఇంటిచుట్టూ నెయ్యీ నూనె, కర్రలూ చేర్పించు

బహుసుందరమైన భవననిర్మాణంచేసి కుంతీ సమేతంగా పాండవులు రాగానే వారికి ఆదరసత్కారాలు జరిపించి ఆభవనంలో విడిది చేయించు.

పునర్వి స్తరశః శ్రోతుమిచ్ఛామి ద్విజసత్తమ
దాహంజతుగృహస్యైవపాండవానాంచమోక్షణం.
సుదృశంసమిదం కర్మ తేషాం క్రూరోపసంహితం
కీర్తియస్వ యథావృత్తం పరం కౌతూహలం మమ.
శృణు విస్తరశో రాజన్ వదతో మే పరంతప
దాహం జతుగృహస్యైతత్ పాండవానాం చ
మోక్షణం.

ప్రాణాధికం భీమసేనం కృతవిద్యం ధనంజయం
దుర్యోధనో లక్షయిత్వా పర్యతప్యత దుర్మనాః
తతో వైకర్తనః కర్ణః శ్శకునిశ్చాపి సౌబలః
అనేకై రభ్యుపాయైస్తే జిఘాంసంతి స్మ పాండవాన్.
పాండవా అపి తత్సర్వం ప్రతిచక్రుర్యథాగతం
ఉద్భావనమకుర్వంతో విదురస్య మతేస్థితాః.
గుణైస్సముదితాన్ దృష్ట్వా పౌరాః
పాండుసుతాస్తదా
కథయాంచక్రిరే తేషాం గుణాన్ సంసత్సు భారత.
రాజ్యప్రాప్తించసంప్రాప్తంజ్యేష్ఠంపాండుసుతంతదా
కథయంతి స్మ సంభూయ చత్వరేషు సభాసు చ.
ప్రజ్ఞాచక్షురచక్షుష్ట్వాత్ ధృతరాష్ట్రో జనేశ్వరః
రాజ్యంనప్రాప్తవాన్పూర్వంసకథంనృపతిర్భవేత్.
తథా శాంతనవో భీష్మ స్సత్యసంధో మహావ్రతః
ప్రత్యాఖ్యాయపురారాజ్యంనసజాతుగ్రహీష్యతి.
తే వయం పాండవజ్యేష్ఠం తరుణం వృద్ధశీలినం
అభిషించామ సాధ్వద్య సత్యకారుణ్యవేదినం.

స హి భీష్మం శాంతనవం ధృతరాష్ట్రం చ ధర్మవిత్
సపుత్రం వివిధై ర్భోగై ర్యోజయిష్యతి పూజయన్.
తేషాందుర్యోధనశ్శ్రుత్వాతానివాక్యానిజల్పతాం
యుధిష్ఠి రానురక్తానాం పర్యతప్యత దుర్మతిః.
స తప్యమానో దుష్టాత్మా తేషాం వాచో న చక్షమే
ఈర్ష్యయా చాపి సంతప్తో ధృతరాష్ట్రముపాగమత్.
తతో విరహితం దృష్ట్వా పితరం ప్రతిపూజ్య సః
పౌరానురాగసంతప్తః పశ్చాదిదమభాషత.
శ్రుత్వా మే జల్పతాం తాత పౌరాణామశివాగిరః
త్వామనాదృత్య భీష్మం చ పతిమిచ్ఛంతి పాండవం.
మతమేతచ్చ భీష్మస్య న స రాజ్యం బుభుక్షతి
అస్మాకం తు పరాం పీడాం చికీర్షంతి పురే జనాః.
పితృతఃప్రాప్తవాన్రాజ్యంపాండురాత్మగుణైఃపురా
త్వమంధగుణసంయోగాత్ ప్రాప్తం రాజ్యం న
లబ్ధవాన్.
సఏషపాండోర్దాయాద్యంయది ప్రాప్నోతి పాండవః
తస్య పుత్రోధ్రువం ప్రాప్తస్తస్య తస్యాపిచాపరః.
తే వయం రాజవంశేన హీనా స్సహ సుతైరపి
అవజ్ఞాతా భవిష్యామో లోకస్య జగతీపతే.
సతతం నిరయం ప్రాప్తాః పరపిండోపజీవినః
న భవేమ యథా రాజం స్తథా నీతిర్విధీయతాం.
యది త్వం హి పురారాజన్నిదంరాజ్యమవాప్తవాన్
ధ్రువం ప్రాప్స్యామ చ వయం రాజ్యమప్యవశే జనే.

141 వ అధ్యాయం సమాప్తం.

## నూట నలుబది రెండవ అధ్యాయము

ఏవం శ్రుత్వా తు పుత్రస్య ప్రజ్ఞాచక్షుర్నరాధిపః
కణికస్య చ వాక్యాని తాని శ్రుత్వా స సర్వశః.
ధృతరాష్ట్రో ద్విధాచిత్త శ్శోకార్తస్సమపద్యత
దుర్యోధనశ్చ కర్ణశ్చ శకుని స్సౌబలస్తథా.

అందులో సుందరమైన ఆసనాలూ రమణీయమృదు శయ్యలూ అమరించి ఉంచు. ఈ విషయాలన్నీ వార్తాహరులవల్ల విని ధృతరాష్ట్రుడు సంతోషిస్తాడు. పాండవులయందు మన కెంతో ప్రీతి ఉన్నదని ప్రజలందరూ భావించాలి. పాండవులు కూడా నిశ్చింతగా గడుపుతూండాలి. ఆరోజులలో వారు సుఖనిద్రలో ఉండగా గృహద్వారం దగ్గర నిప్పు ముట్టించి వారిని కడతేర్చాలి. అలాచేస్తే ప్రజలు కూడా పాండవులు అగ్నిలో దగ్ధమయారని భావిస్తారేకాని మనమీద నేరారోపణ చెయ్యరు— అని పలికిన దుర్యోధనుని మాటలు శిరసావహించి పురోచనుడు శీఘ్రవేగంతో పోయే రాసభరథాధిరూఢుడై వారణావతంచేరి దుర్యోధనుని ఆజ్ఞలు పాలిస్తున్నాడు.

143 వ అధ్యాయం సమాప్తం

## నూట నలుబది నాలుగవ అధ్యాయం

ధర్మరాజాదుల ప్రయాణానికి రథం సిద్ధమైంది. విచారహృదయంతో పాండవులు పితామహుడైన భీష్ముడికీ ద్రోణాచార్యునికీ కృపాచార్యునికీ విదురునికీ కురుగురువృద్ధులకూ ప్రణామాలాచరించారు. సమవయస్కులను కౌగిలించుకున్నారు. తల్లులకు ప్రదక్షిణించారు. నగరప్రజల అనుమతి తీసుకుని బయలుదేరబోతూండగా పౌరులహృదయాలు శోకవ్యాప్తము లయాయి. వారందరూ పాండవులనే అనుసరించి నడవసాగారు.

నడిచేవారిలో కొందరు బ్రాహ్మణులు విచారపూరిత కంఠాలతో—మందబుద్ధియైన ధృతరాష్ట్రుడు ధర్మదృష్టి లేకుండా పాండవులపట్ల దారుణంగా ప్రవర్తిస్తున్నాడు. పాపచింతనలేని ధర్మరాజూ మహాబలిష్ఠుడైన భీముడూ వారి సోదరులూ ఏనాడూ పాపకార్యాలు ఆచరించలేదు. సద్గుణసంపన్నులయిన పాండవులకు సంక్రమించిన రాజ్యాధికారాన్ని ధృతరాష్ట్రుడు సహించలేకపోతున్నాడు. సహించలేక ఇటువంటి ఘాతుకాలు తలపెడుతున్నాడు. పాండవులను వారణావతానికి పంపే దుష్టచింతనను కురువృద్ధుడైన భీష్ముడు ఎలా ఆమోదించాడో అర్థం కావడంలేదు. మారాజ్యానికి వరుసగా శంతనుడూ విచిత్రవీర్యుడూ పాలకులయారు. వారి అనంతరం పాండురాజు మహారాజుగావచ్చి మమ్మల్నందరినీ పితృ ప్రేమతో పాలించాడు. ఆయన స్వర్గవాసి అయ్యాక ఈ కుమారుల అధికారాన్ని ధృతరాష్ట్రుడు సహించలేకపోతున్నాడు. ఈదుష్టకార్యాన్ని మేము ఆమోదించలేము. కనక మేమందరం ధర్మరాజుతోనే వెళ్ళిపోతాము అన్నారు నిర్భయంగా.

ఆ మాటలు విని ధర్మరాజు— ధృతరాష్ట్రుడు నాకు గురుస్థానీయుడు. పితృతుల్యుడు. వారి ఆజ్ఞాపాలనమే నా దృఢవ్రతము. మీరందరూ మా శ్రేయస్సును కోరుతున్నారు. కనక ఆశీర్వాదాలను గ్రహించి పంపండి— అనగా వారందరూ ప్రసన్నచిత్తులై ధర్మజుని కోరిక నెరవేర్చి తరలిపోయారు.

అందరూ వెళ్ళిపోయిన తర్వాత విదురుడు ధర్మరాజుకు దుర్యోధనుని దురుద్దేశాన్ని మ్లేచ్ఛభాషలో వ్యక్తీకరించడానికి ఉద్యుక్తుడయాడు— నీతి

దుశ్శాసనచతుర్థాస్తే మంత్రయామాసురేకతః
తతో దుర్యోధనో రాజా ధృతరాష్ట్రమభాషత.
పాండవేభ్యో భయం నస్స్యాత్తాన్ వివాసయతాం భవాన్
నిపుణేనాభ్యుపాయేన నగరం వారణావతం.
ధృతరాష్ట్రస్తు పుత్రేణ శ్రుత్వా వచనమీరితం
ముహూర్తమివ సంచింత్య దుర్యోధనమథాబ్రవీత్.
ధర్మనిత్య స్సదా పాండు స్తథా ధర్మపరాయణః
సర్వేషు జ్ఞాతిషు తథా మయి త్వాసీద్విశేషతః.
నాసౌ కించిద్విజానాతి భోజనాది చికీర్షితం
నివేదయతి నిత్యం హి మమ రాజ్యం ధృతవ్రతః.
తస్య పుత్రో యథా పాండు స్తథా ధర్మపరాయణః
గుణవాంల్లోకవిఖ్యాతః పౌరవాణాం సుసమ్మతః.
స కథం శక్యతేఽస్మాభిరపాకర్తుం బలాదితః
పితృపైతామహాద్రాజ్యాత్ ససహాయో విశేషతః.
భృతా హి పాండునామాత్యా బలం చ సతతం భృతం
భృతాః పుత్రాశ్చ పౌత్రాశ్చ తేషామపి విశేషతః.
తే పురా సత్కృతాస్తాత పాండునా నాగరా జనాః
కథం యుధిష్ఠిరస్యార్థేననో హన్యుస్సబాంధవాన్
ఏవమేతన్మయా తాత భావితం దోషమాత్మని
దృష్ట్వా ప్రకృతయ స్సర్వా అర్థమానేన పూజితాః.
ధ్రువమస్మత్సహాయాస్తే భవిష్యంతి ప్రధానతః
అర్థవర్గ స్సహామాత్యో మత్సంస్థోఽద్య మహీపతే.
స భవాన్ పాండవానాశు వివాసయితుమర్హతి
మృదునైవాభ్యుపాయేన నగరం వారణావతం.
యదా ప్రతిష్ఠితం రాజ్యం మయి రాజన్ భవిష్యతి
తదా కుంతీ సహాపత్యా పునరేష్యతి భారత.
దుర్యోధన మమాప్యేతద్ధృది సంపరివర్తతే
అభిప్రాయస్య పాపత్వాన్నైతత్తు వివృణోమ్యహం.
న చ భీష్మో న చ ద్రోణో న చ క్షత్తా న గౌతమః
వివాస్యమానాన్ కౌంతేయాననుమంస్యంతి కర్హిచిత్.
సమా హి కౌరవేయాణాం వయం తే చైవ పుత్రక
నైతే విషమమిచ్ఛేయుర్ధర్మయుక్తా మనస్వినః.
తే వయం కౌరవేయాణామేషాం చ మహాత్మనాం
కథం న వధ్యతాం తాత గచ్ఛామ జగతస్తథా.
మధ్యస్థ స్సతతం భీష్మో ద్రోణపుత్రో మయి స్థితః
యతః పుత్ర స్తతో ద్రోణో భవితా నాత్ర సంశయః.
కృప శ్శారద్వతశ్చైవ యత ఏతౌ తతో భవేత్
ద్రోణం చ భాగినేయం చ న స త్యక్ష్యతి కర్హిచిత్.
క్షత్తార్థబద్ధ స్త్వస్మాకం ప్రచ్ఛన్నం సంయతః పరైః
న చైకస్స సమర్థోఽస్మాన్ పాండవార్థేఽధిబాధితుం.
స విశ్రబ్ధః పాండుపుత్రాన్ సహమాత్రా ప్రవాసయ
వారణావతమద్యైవ యథా యాంతి తథా కురు.
వినిద్రకరణం ఘోరం హృది శల్యమివార్పితం
శోకపావకముద్భూతం కర్మణైతేన నాశయ.

142 వ అధ్యాయము సమాప్తం

## నూట నలుబది మూడవ అధ్యాయము

తతో దుర్యోధనో రాజా సర్వాః ప్రకృతయశ్శనైః
అర్థమానప్రదానాభ్యాం సంజహార సహానుజః.
ధృతరాష్ట్రప్రయుక్తాస్తే కేచిత్ కుశలమంత్రిణః
కథయాంచక్రిరే రమ్యం నగరం వారణావతం
అయం సమాజ స్సుమహాన్ రమణీయతమో భువి
ఉపస్థితః పశుపతేర్నగరే వారణావతే.

శాస్త్రానుసారం శత్రువుయొక్క వ్యవహారాలను అవగతం చేసికొన్నవాడు ఆ ప్రమాదాలను తప్పించుకోవడానికి ప్రయత్నించాలి. లోహనిర్మితం కాని ఒక తీక్ష్ణమైన శస్త్రం ఉన్నది. ఆ శస్త్రఘాతంచేత రక్షణ నెరిగినవాడికి ఏ ప్రమాదమూ లేదు. గడ్డీ గాదంతో ఎండు మోళ్ళతో ఉన్న అరణ్యం భస్మం అవుతున్నా బిలాలలో ఉన్న ఎలుక భస్మంకానట్టు ఆత్మరక్షణోపాయం ఎరిగినవాడు నిశ్చయంగా జీవిస్తాడు. శత్రుదత్తమైన లోహనిర్మితం కాని అస్త్రాన్ని గ్రహించినవాడు కలుగులో దూరి అగ్నిబాధా రహితుడవుతాడు. అనంతరం సరియైన మార్గం తెలుసుకొని నక్షత్రసహాయంతో తనపథాని నిర్దేశించుకొంటాడు. పంచేంద్రియాలనూ స్వాధీనంలో ఉంచుకొన్నవాడు శత్రుపీడా విముక్తుడవుతాడు— అన్నాడు.

[అంతరార్థం—శస్త్రానికి శుద్ధ రూపం సద్మం. సద్మమంటే గృహమని అర్థం—అగ్నివల్ల దగ్ధమయ్యే గృహం నిర్మింపబడిందనీ అక్కడ మీతో చరించే పురోచనుడే మిమ్మల్ని అగ్నిలో భస్మం చేస్తాడనీ దానినుండి రక్షణకు సొరంగం నిర్మించుకోమనీ ఆ గృహపరిసరాలను ముందునుంచీ జాగ్రత్తగా చూసుకుంటే రాత్రివేళ నిర్భయంగా చరించవచ్చనీ తయారు చేసుకొన్న బిలంనుంచి బైటపడితే లాక్షాగృహం దహనమైనా మీ కేప్రమాదమూ ఉండదనీ సోదరు లైదుగురూ ఏకాభిప్రాయంతో చరిస్తే ప్రత్యర్థులెవరూ ఏమీ చేయలేరనీ విదురుడు ప్రయోగించిన మ్లేచ్ఛభాషకు అర్థం.]

ధీమంతుడయిన విదురుడు నిపుణంగా ప్రసంగించిన వాక్యాలను ఆకర్ణించిన ధర్మరాజు— మహామంత్రీ! మీ మాటలు నాకు అవగతమయాయి- అని పలికి అనుమతి పొంది సోదరులతో తల్లితో ముందుకు సాగాడు.

కొంతదూరం నడిచాక కుంతి ధర్మరాజును సమీపించి- నాయనా! విదురుడు చెప్పినమాటలు విని నాకు అవగతమయిందని నువ్వు అన్నావు. అదేమిటో మాకు అర్థంకాలేదు. అభ్యంతరం లేకపోతే ఆరహస్యం వివరించు—అని కోరగా ధర్మరాజు—అమ్మా! ధర్మసంపన్నుడైన విదురుడు సూక్ష్మసంకేతంతో మనం ఉండబోయే గృహానికి అగ్నిప్రమాదం ఉన్నదనీ ఆ ఇంటిని జాగ్రత్తగా కనిపెడుతూ చరించినట్లయితే ఏ ప్రమాదమూ ఉండదనీ చెప్పాడు. దానికే నేను సరే నన్నాను— అన్నాడు.

పాండవులు ఫాల్గుణ శుక్ల అష్టమీ తిథినాడు రోహిణీ నక్షత్రంలో ప్రయాణం చేసి సుఖంగా వారణావతం చేరి అక్కడ పౌరులతో ఇష్టాగోష్ఠి సాగించారు.

144 వ అధ్యాయము సమాప్తం

## నూట నలుబది అయిదవ అధ్యాయము

వారణావతానికిపాండవులు వచ్చినవార్త విని వారందరూ పాండవులకు జయజయధ్వానాలు నగరప్రజలందరూ కానుకలతో ఎదురు వెళ్ళారు. చేస్తూ చుట్టూ నిలబడ్డారు. దేవపరివృతుడైన

సర్వరత్నసమాకీర్ణేపుంసాం దేశే మనోరమే
ఇత్యేవం ధృతరాష్ట్రస్య వచనాచ్చక్రిరే కథాః.
కథ్యమానే తథా రమ్యే నగరే వారణావతే
గమనే పాండుపుత్రాణాం జజ్ఞే తత్ర మతిర్నృప.
యదా త్వమన్యత నృపో జాతకౌతూహలా ఇతి
ఉవాచైతానేత్య తదా పాండవానంబికాసుతః.
అధీతాని చ శాస్త్రాణి యుష్మాభిరిహకృత్స్నశః
అస్త్రాణి చ తథా ద్రోణాద్గౌతమాచ్చ విశేషతః.
ఇదమేవంగతే తాతాశ్చింతయామి సమంతతః
రక్షణే వ్యవహారే చ రాజ్యస్య సతతం హితే.
మమైతే పురుషా నిత్యం కథయంతి పునః పునః
రమణీయతమం లోకే నగరం వారణావతం.
తే తాతా యది మన్యధ్వముత్సవం వారణావతే
సగణాస్సాంత్వితాశ్చైవవిహరధ్వంయథామరాః.
బ్రాహ్మణేభ్యశ్చ రత్నాని గాయకేభ్యశ్చ సర్వశః
ప్రాయచ్ఛధ్వం యథాకామం దేవా ఇవ సువర్చసః.
కంచిత్కాలం విహృత్యైవమనుభూయ పరాంముదం
ఇదం వై హాస్తినపురం సుఖినః పునరేష్యథ.
ధృతరాష్ట్రస్య తం కామమనుబుధ్య యుధిష్ఠిరః
ఆత్మనశ్చాసహాయత్వం తథేతి ప్రత్యువాచ తం.
తతో భీష్మం శాంతనవం విదురం చ మహామతిం
ద్రోణం చ బాహ్లీకం చైవ సోమదత్తం చ కౌరవం.
కృపాచార్యంచపుత్రం చ భూరిశ్రవసమేవ చ
మాన్యానన్యానమాత్యాంశ్చ బ్రాహ్మణాంశ్చ తపోధనాన్.

పురోహితాంశ్చపౌరాంశ్చగాంధారీంచయశస్వినీం
యుధిష్ఠిర శ్శనైర్దీనం ఉవాచేదం వచస్తదా.
రమణీయే జనాకీర్ణే నగరే వారణావతే
సగణాస్తత్ర యాస్యామో ధృతరాష్ట్రస్య శాసనాత్.
ప్రసన్నమనసస్సర్వే పుణ్యా వాచో విముంచత
ఆశీర్భిర్బృంహితానస్మాన్ న పాపం ప్రసహిష్యతే.
ఏవముక్తాస్తు తే సర్వే పాండుపుత్రేణ కౌరవాః
ప్రసన్నవదనాభూత్వా తేఽన్వవర్తంతపాండవాన్.
స్వస్త్యస్తు వః పథి సదా భూతేభ్యశ్చైవ సర్వశః
మాచవోఽస్త్వశుభం కించిత్సర్వశః పాండునందనాః.
తతః కృతస్వస్త్యయనా రాజ్యలంభాయ పార్థివాః
కృత్వాసర్వాణికార్యాణిప్రయయుర్వారణావతం.
ఏవముక్తేషు రాజ్ఞా తు పాండుపుత్రేషు భారత
దుర్యోధనఃపరంహర్షమగచ్ఛత్ సదురాత్మవాన్.
స పురోచనమేకాంతమానీయ భరతర్షభ
గృహీత్వా దక్షిణే పాణౌ సచివం వాక్యమబ్రవీత్.
మమేయం వసుసంపూర్ణా పురోచన వసుంధరా
యథేయం మమ తద్వత్తే స తాం రక్షితుమర్హసి.
న హి మే కశ్చిదన్యోఽస్తి విశ్వాసికతరస్త్వయా
సహాయో యేన సంధాయ మంత్రయేయం యథాత్వయా.

సంరక్ష తాత మంత్రం చ సపత్నాంశ్చ మమోద్ధర
నిపుణేనాభ్యుపాయేన యద్బ్రవీమి తథా కురు,
పాండవా ధృతరాష్ట్రేణ ప్రేషితా వారణావతం
ఉత్సవే విహరిష్యంతి ధృతరాష్ట్రస్య శాసనాత్
స త్వం రాసభయుక్తేన స్యందనేనాశుగామినా
వారణావతమద్యైవ యథా యాసి తథా కురు.
తత్ర గత్వా చతుశ్శాలం గృహం పరమసంవృతం
నగరోపాంతమాశ్రిత్య కారయేథా మహాధనం.
శణసర్జరసాదీని యాని ద్రవ్యాణి కానిచిత్
ఆగ్నేయాన్యుత సంతీహ తాని తత్ర ప్రదాపయ.
సర్పిస్తైలవసాభిశ్చ లాక్షయా చాప్యనల్పయా
మృత్తికాంమిశ్రయిత్వాత్వంలేపంకుడ్యేషుదాపయ.
శణం తైలం ఘృతం చైవ జతు దారుణి చైవహి
తస్మిన్ వేశ్మని సర్వాణి నిక్షిపేథాస్సమంతతః

చేవేంద్రునివలె ధర్మరాజు ప్రకాశిస్తున్నాడు. ప్రజల సత్కారాలు స్వీకరించి పాండవులు వారందరితో ఆదరపూర్వకంగా భాషించి నగరప్రవేశం చేశారు. ధర్మనిరతులైన బ్రాహ్మణులను ప్రప్రథమంగా దర్శించి అనంతరం నగరరక్షకులైన క్షత్రియులతో అభిభాషించి మిగిలిన జాతుల గృహాలకు కూడా వెళ్ళి వారిసత్కారాలు స్వీకరించి పురోచనుని స్వాగతంతో వానివెంట నడిచారు. శ్రేష్ఠమయిన వస్తువాహనాలతో సుందర తల్పాలతో అలరారే రమణీయభవనంలో పురోచనుని కోరిక ననుసరించి వారు ప్రవేశించారు. వారికి అపూర్వమైన ఆదరసత్కారాలూ అతిథ్యమర్యాదలూ సాగుతున్నాయి. ఎందరో నగరవాసులూ సాధుపురుషులూవారి దర్శనానికి వస్తూ పోతూ ఉన్నారు. పది రోజులు గడిచాక పురోచనుడు పాండవులను సమీపించి నూతనగృహవిషయం ముచ్చటించాడు. వాస్తవానికి అశివ భవనమైన భవనానికి 'శివభవన' మని పురోచనుడు పేరుపెట్టాడు.

గుహ్యకగణం కైలాసానికి చేరినట్లు పాండవులు ఆభవనంలో ప్రవేశించారు. అందులో చేరిన తర్వాత ధర్మరాజు భీముని పిలిచి—సోదరా! ఇది అగ్నివల్ల దగ్ధమయే వస్తువులవల్ల నిర్మిత మయినట్లు తోస్తోంది. ఈగోడలు నేతితో కలిపిన లక్కవాసన వేస్తున్నవి. దీనినిబట్టి చూస్తే నిశ్చయంగా ఈ గృహానికి అగ్నిప్రమాదం ఉందనిపిస్తోంది. ఈగృహనిర్మాణంలో విశ్వసనీయమైన కర్మకారులు సర్వవస్తువులనూ నేతితో మిళితంచేసినట్లు తోస్తోంది. పాపాత్ముడైన పురోచనుడు దుర్యోధనుని ఆజ్ఞానుసారం, మన మందరం నిద్రిస్తూండగా ఈ ఇంటికి నిప్పు ముట్టించడానికి నిరీక్షిస్తున్నాడు. ధీమంతుడయిన విదురుడు మన శ్రేయస్సును కోరేవాడు కనక దుర్యోధనుని ఈ దౌర్మార్గ్యాన్ని ఆ నాడే నాకు తెలియజేసి మనకు రక్షణోపాయం చెప్పాడు- అనగా భీముడు అలా అయినట్లయితే మనం ముందు ప్రవేశించిన భవనానికే తిరిగి ఎందుకు వెళ్ళిపోకూడదు—అని ప్రశ్నించగా ధర్మరాజు-భీమసేనా! ఇక్కడ మనం మన మనోభావాలను పైకి వెలిబుచ్చకూడదు. అప్రమత్తులమై చరిస్తూ సావకాశం చూసి మన కార్యం నెరవేర్చుకోవాలి. మనం ఏపాటిబయటపడినా పురోచనుడు తనపని నెరవేర్చేస్తాడు. ఈ పురోచనుడికి ధర్మభీతి లేదు. దుర్యోధనుని ఆజ్ఞలను పాటించడమే వాని జీవిత లక్ష్యం. మన మిక్కడ అగ్నిలో దగ్ధమైతే ఆ వార్త విని భీష్ములవారు కౌరవులపై ఆగ్రహించ నచ్చు. కానీ అందువల్ల ప్రయోజన మేమిటి? పోనీ అని మనం ఇక్కడనుంచి తప్పించుకొనిపోయినా రాజ్యలోభంతో దుర్యోధనుడుగూఢచారులద్వారా తెలిసికొని పరిమారుస్తాడు.

ఈనాడు దుర్యోధనుడు అధికారపీఠం ఎక్కి మనల్ని మోసగించాడు. వాడికి కావలసిన అంగబలం ఉంది. మనం నిస్సహాయస్థితిలో ఉన్నాం. కోశాగారం వాని స్వాధీనంలో ఉంది. ఇన్నిటితో ఆదుష్టాత్ముడు ఏవిధంగా అయినా మనల్ని కడతేర్చడానికే చూస్తాడు. అందుచేత మనం ఈ పురోచన దుర్యోధనుల కనుగప్పి రహస్యస్థలంలో స్థావరం ఏర్పరుచుకోవాలి. ముందుగా మనం వేటనెపంతో బయల్దేరి ఈప్రాంతాలన్నీ పరిశీలించుకొని సమయం చూసి పలాయనం సాగించాలి. ఈ సమయంలోనే మనం సొరంగమార్గం నిర్మించుకోవాలి. దాని

యథా చ తన్న పశ్యేరన్ పరీక్షంతోఽపి పాండవాః
ఆగ్నేయమితి తత్కార్యమపి చాన్యేఽపి మానవాః.
వేశ్మన్యేవం కృతే తత్ర గత్వా తాన్పరమార్చితాన్
వాసయేథాః పాండవేయాన్కుంతీంచససుహృజ్జనాం
ఆసనాని చ దివ్యాని యానాని శయనాని చ
విధాతవ్యానిపాండూనాంయథాతుష్యేత్వై పితా.
యథా చ తన్న జానంది నగరే వారణావతే
తథా సర్వం విధాతవ్యం యావత్కాలస్య పర్యయః

జ్ఞాత్వాచతాన్సువిశ్వస్తాన్శయానానకుతోభయాన్
అగ్నిస్త్వయాతతోదేయోద్వారత స్తస్య వేశ్మనః.
దహ్యమానే స్వకే గేహే దగ్ధా ఇతి తతో జనాః
నగర్హయేయురస్మాన్ వై పాండవార్థాయకర్హిచిత్.
స తథేతి ప్రతిజ్ఞాయ కౌరవాయ పురోచనః
ప్రాయాద్రాసభయుక్తేన స్యందనేనాశుగామినా
స గత్వా త్వరితం రాజన్ దుర్యోధనమతే స్థితః
యథోక్తం రాజపుత్రేణ సర్వం చక్రే పురోచనః.

143 వ అధ్యాయంసమాప్తం

## నూట నలుబడి నాల్గవ అధ్యాయము

పాండవాస్తు రథాన్ యుక్త్వా సదశ్వైరనిలోపమైః
ఆరోహమాణాభీష్మస్యపాదౌజగృహురార్తవత్
రాజ్ఞశ్చ ధృతరాష్ట్రస్య ద్రోణస్య చ మహాత్మనః
అన్యేషాం చైవ వృద్ధానాం కృపస్య విదురస్య చ.
ఏవం సర్వాన్ కురూన్ వృద్ధానభివాద్య యతవ్రతా
స్సమాలింగ్యసమానాన్వైబాలైస్చాప్యభివాదితాః.
సర్వా మాతౄ స్తథాఽఽపృచ్ఛ్య కృత్వా చైవ ప్రదక్షిణం
సర్వాః ప్రకృతయశ్చైవ ప్రయయుర్వారణావతం.
విదురశ్చ మహాప్రాజ్ఞ స్తథాన్యే కురుపుంగవాః
పౌరాశ్చ పురుషవ్యాఘ్రానన్వీయు శ్శోకకర్శితాః.
తత్ర కేచిద్బ్రువంతి స్మ బ్రాహ్మణా నిర్భయా స్తదా
దీనాన్ దృష్ట్వా పాండుసుతానతీవ భృశదుఃఖితాః.
విషమం పశ్యతే రాజా సర్వథా స సుమందధీః
కౌరవ్యో ధృతరాష్ట్రస్తు న చ ధర్మం ప్రపశ్యతి.
న హి పాపమపాపాత్మా రోచయిష్యతి పాండవః
భీమోవాబలినాంశ్రేష్ఠఃకౌంతేయోవాధనంజయః

కుత ఏవ మహాత్మానౌ మాద్రీపుత్రౌ కరిష్యతః
తాన్ రాజ్యం పితృతః ప్రాప్తాన్ ధృతరాష్ట్రో న మృష్యతే.
అధర్మ్యమిదమత్యంతం కథం భీష్మోఽనుమన్యతే
వివాస్యమానానస్థానే నగరే యోఽభిమన్యతే
పితేవ హి నృపోఽస్మాకమభూచ్ఛాంతనవః పురా
విచిత్రవీర్యో రాజర్షిః పాండుశ్చ కురునందనః.
స తస్మిన్ పురుషవ్యాఘ్రే దేవభావం గతే సతి
రాజపుత్రానిమాన్ బాలాన్ధృతరాష్ట్రోనమృష్యతే.
వయమేతదనిచ్ఛంత స్సర్వ ఏవ పురోత్తమాత్
గృహాన్ విహాయ గచ్ఛామో యత్ర గంతా యుధిష్ఠిరః.
తాం స్తథావాదినఃపౌరాన్దుఃఖితాన్ దుఃఖకర్శితః
ఉవాచ మనసా ధ్యాత్వా ధర్మరాజో యుధిష్ఠిరః.
పితా మాన్యో గురు శ్శ్రేష్ఠో యదాహపృథివీపతిః
అశంకమానై స్తత్ కార్యమస్మాభిరితి నో వ్రతం.
భవంతస్సుహృదోఽస్మాకమస్మాన్కృత్వా ప్రదక్షిణం

ద్వారా మనం అగ్నిభీతినుండి వైదొలగవచ్చు. ఇక్కడ ఉంటూనే మనం శీఘ్రంగా ఈకార్యాలన్నీ పూర్తి చేసికోవాలి. పురోచనుడికీ పురవాసులకీ ఈ రహస్యాలు తెలియకూడదు.

145 వ అధ్యాయము సమాప్తం

## నూట నలుబది ఆరవఅధ్యాయము

విశ్వాసపాత్రుడూ కార్యనిర్వహణ కుశలుడూ అయినవ్యక్తిని విదురుడు వారణావతం పంపాడు. ఆ వచ్చినవాడు సొరంగాలు త్రవ్వటంలో నేర్పరి. అతడు పాండవులను సమీపించి—అయ్యా! నేను సొరంగనిర్మాణంలో నిపుణుడను. నన్ను విదురులు పంపారు. మీ శ్రేయస్సుకోసం ఏం చెప్పినా చేయమని ఆ ధీమంతుడు నాకు ఆజ్ఞాపించాడు. మీతో ఉండే పురోచనుడు కృష్ణచతుర్దశీ దినాన ఈ గృహానికి నిప్పు ముట్టిస్తాడు. దుష్టదుర్యోధనుడు మిమ్మల్ని దగ్ధం చేయడానికే ఈ ప్రయత్నం సాగించాడనీ దానినుండి తప్పించుకోవాలనీ విదురులు మీకు మ్లేచ్ఛభాషలో చెప్పారట. ఈ రహస్యం చెపితే మీరు నన్ను విశ్వసిస్తారని ఆయన అన్నారు. అని పలకగా కుంతీనందనుడు ఇలా అన్నాడు.

నువ్వు విదురునికి విశ్వాసపాత్రుడవనీ అత్యంతాప్తుడవనీ నాకు నమ్మకం కలిగింది. ఆయనయందు నీకు అచంచలమైన భక్తిగౌరవా లున్నాయని కూడా నాకు తెలుస్తోంది. వారివలెనే మేమూ నిన్ను విశ్వసిస్తున్నాము. ఆయనవలెనే నువ్వు కూడా మమ్మల్ని రక్షించాలి. ఈ గృహనిర్మాణంలో వాడిన వస్తువులన్నీ నిప్పుతగిలితే దగ్ధమయేవే. కనక ఆఅగ్నిప్రమాదంనుండి మమ్మల్ని కాపాడాలి. దుష్టదుర్యోధనుడు అంగ బలంతో అర్థబలంతో నిండిన గర్వంతో పాపాత్ముడై మాకు హాని తలపెడుతున్నాడు. ఈగృహంలో మేము సర్వనాశనమైతే అప్పుడు దుర్యోధనుడు నిశ్చింతంగా రాజ్యపాలనం చేద్దామనుకుంటున్నాడు.

ఈ గృహనిర్మాణంలో ఉన్న విశేషం ఏమంటే దీనిలోనుంచి ఏప్రకారంగానూ బైటికిపోయే సావకాశం లేదు. విద్వాంసుడైన విదురుడు ఈవిషయాలన్నీ ముందుగానే గ్రహించి మాకు తెలియజేశాడు. పురోచనుడికి ఏపాటి అనుమానం కలగకుండా నువ్వు మాకు రక్షణమార్గం ఏర్పరచాలి.

ధర్మజుని మాటలు విని అతడు తల ఊపి తన పనిలో నిమగ్నుడయాడు. కందకం పరిశుభ్రం చేస్తున్నాననే నెపంతో సొరంగం త్రవ్వటం మొదలు పెట్టాడు. భవనమధ్యంలో అతడీకార్యక్రమం ఆరంభించాడు. పురోచనుడికి దానివాసన సోకకుండా వారు జాగ్రత్తగా సాగిస్తున్నారు. పురోచనుడు నిరంతరం భవనద్వారం కాస్తున్నాడు. పాండవులు ఆయుధధారులై అప్రమత్తులై చరిస్తున్నారు. రాత్రివేళల వారు నిద్రించకుండా పురోచనుని కనిపెడుతున్నారు. పగటివేళల వేట నెపంతో పరిసరవనాలలో గుర్తులు చూసుకుంటున్నారు. పురోచనుడు ఏ స్వల్పమర్యాద నెరపినా వారు దానికే పరమానందం చెందుతున్నట్టు నటిస్తున్నారు. ఖనకుని కార్యక్రమం నిర్విఘ్నంగా సాగిపోతున్నది. పురోచనునివలెనే పురజనులకూ ఆ విషయాలేమీ తెలీటంలేదు.

ప్రతిసంధ్య తథాశీర్భిస్త్వివ ర్తధ్వం యథా గృహం.
యదా తు కార్యమస్మాకం భవద్భిరుపపత్స్యతే
తదా కరిష్యథాస్మాకం ప్రియాణి చ హితాని చ.
ఏవముక్తా స్తదా పౌరాః కృత్వా చాపి ప్రదక్షిణం
ఆశీర్భిశ్చాభినంద్యైతాన్జగ్ముర్నగరమేవ హి.
పౌరేషు వినివృత్తేషు విదురస్సర్వధర్మవిత్
బోధయన్ పాండవశ్రేష్ఠమిదం వచనమబ్రవీత్.
ప్రాజ్ఞః ప్రాజ్ఞ ప్రలాపజ్ఞః ప్రలాజ్ఞమిదం వచః
ప్రాజ్ఞం ప్రాజ్ఞః ప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞం వచోఽబ్రవీత్.
యో జానాతి పరప్రజ్ఞాం నీతిశాస్త్రానుసారిణీం
విజ్ఞాయేహ తథా కుర్యాదాపదం నిస్తరేద్యథా.
అలోహం నిశితం శస్త్రం శరీరపరికర్తనం
యో వేత్తి న తు తంఘ్నంతిప్రతిఘాతవిదం ద్విషః.
కక్షఘ్నః శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలౌకసః
న దహేదితి చాత్మానం యో రక్షతి స జీవతి.
నా చక్షుర్వేత్తి పంథానం నాచక్షుర్విందతే దిశః
నాధృతిర్బుద్ధిమాప్నోతి బుధ్యస్వైవం ప్రబోధితః.
అనాప్తైర్దత్తమాదత్తే నర శ్శస్త్రమలోహజం
శ్వావిచ్ఛరణమాసాద్యప్రముచ్యేతహుతాశనాత్.
చరన్ మార్గాన్ విజానాతి నక్షత్రైర్విందతే దిశః
ఆత్మనా చాత్మనః పంచ పీడయన్ నానుపీడ్యతే.
ఏవముక్తః ప్రత్యువాచ ధర్మరాజో యుధిష్ఠిరః
విదురం విదుషాం శ్రేష్ఠం జ్ఞాతమిత్యేవ పాండవః.
అనుశిక్ష్యానుగమ్యైతాన్ కృత్వా చైవ ప్రదక్షిణం
పాండవానభ్యనుజ్ఞాయవిదురః ప్రియయాగృహాన్.
నివృత్తే విదురే చాపి భీష్మే పౌరజనే తథా
అజాతశత్రుమాసాద్య కుంతీ వచనమబ్రవీత్
క్షత్తా యదబ్రవీద్వాక్యం జనమధ్యేఽబ్రువన్నివ
త్వయా చ స తథేత్యుక్తో జానీమో న చ తద్వయం
యదీదం శక్యమస్మాభిర్జ్ఞాతుం న చ సదోషవత్
శ్రోతుమిచ్ఛామి తత్సర్వం సంవాదం తవ తస్య చ.
గృహాదగ్నిశ్చ బోధవ్య ఇతి మాం విదురోఽబ్రవీత్
పంథాశ్చ వో నావిదితః కశ్చిత్ స్యాదితిధర్మధీః.
జితేంద్రియశ్చ వసుధాం ప్రాప్స్యతీతి చ మేఽబ్రవీత్
విజ్ఞాతమితి తత్సర్వం ప్రత్యుక్తో విదురో మయా.
అష్టమేఽహనిరోహిణ్యాం ప్రయాతాఃఫాల్గునస్యతే
వారణావతమాసాద్య దదృశుర్నాగరం జనం.

144 వ అధ్యాయంసమాప్తం

## నూట నలుబది ఐదవ అధ్యాయము

తత స్సర్వాః ప్రకృతయో నగరాద్వారణావతాత్
సర్వమంగళసంయుక్తా యథాశాస్త్రమతంద్రితాః.
శ్రుత్వాఽఽగతాన్ పాండుపుత్రాన్ నానాయానైస్సహస్రశః
అభిజగ్ముర్నరశ్రేష్ఠాన్ శ్రుత్వైవ పరయా ముదా.
తే సమాసాద్య కౌంతేయాన్ వారణావతకా జనాః
కృత్వా జయాశిషః సర్వే పరివార్యావతస్థిరే.
తైర్వృతః పురుషవ్యాఘ్రో ధర్మరాజోయుధిష్ఠిరః
విబభౌ దేవసంకాశో వజ్రపాణిరివామరైః.
సత్కృతాశ్చైవపౌరైస్తేపౌరాన్సత్కృత్యచానఘ
అలంకృతం జనాకీర్ణం వివిశుర్వారణావతం.
తే ప్రవిశ్య పురీం వీరాస్తూర్ణం జగ్మురథో గృహాన్
బ్రాహ్మణానాం మహీపాల రతానాం స్వేషు కర్మసు.
నగరాధికృతానాం చ గృహాణి రథినాం తదా

## నూట నలుబది యేడవ అధ్యాయం

### లాక్షాగృహదహనము

సంవత్సరం గడిచింది.

పాండవుల ప్రవర్తనలో పురోచనుడికి ఏవిధమైన శంకా కలగలేదు. పైగా పాండవులు తనను అనుమానించటం లేదనికూడా నిశ్చయించుకున్నాడు. అదేవిధంగా పాండవులు చరిస్తున్నారు. అలా ఉండగా ఓరోజున ధర్మరాజు సోదరులందరినీ ఉద్దేశించి— పురోచనుడు మనలను పూర్తిగా విశ్వసించి ఉండగానే మనం వెళ్ళిపోవాలి. అదేసమయంలో నీవిన్ని ప్రక్కనున్న ఆయుధాగారాన్ని అంటించాలి. ఇందులో మరికొన్ని ప్రాణులుండేటట్లు చూడాలి. పురోచనుడుకూడా దీనిలో మాడిపోవాలి— అని చెప్పి సమయసావకాశాల్లకోసం నిరీక్షిస్తున్నాడు.

ఒకనాడు కుంతీదేవి దానధర్మాలు సాగిస్తున్నది. బ్రాహ్మణసమారాధనం చేసి నగరపౌరులందరికీ భోజనాలు పెట్టిస్తున్నది. నగర జానపదులెందరో వచ్చి తృప్తులై వెళుతున్నారు. ఆ సమయంలో ఒక భిల్లజాతిస్త్రీ తన అయిదుగురు కొడుకులతో అక్కడికే భోజనార్థం వచ్చింది, తప్పతాగి వారంతా అక్కడే నిదురించారు.

అంధకారం దశదిశలా చుట్టుముట్టింది. ఆ సమయంలో భీమసేనుడు నెమ్మదిగా వెళ్ళి పురోచనుడు నిదురించే గదివద్ద నిప్పు ముట్టించాడు. అనంతరం సింహద్వారందగ్గర అగ్ని ఉంచాడు. తిరిగివచ్చి మిగిలిన మూడువైపులా పావకునికి ఆతిథ్యం ఇచ్చాడు. నలువైపులా అగ్నిహోత్రుడు విజృంభిస్తున్న సమయంలో కుంతీసహితుడై పాండవులు బిలమార్గంలో ప్రవేశించారు.

చుట్టుముట్టిన అగ్ని భీషణధ్వనులతో వ్యాపిస్తున్నది. నగరప్రజ ఆధ్వనికి మేలుకొని— అరరే! దుష్టదుర్యోధనుని ఆజ్ఞానువర్తియై పురోచనుడు ఈ గృహాన్ని నిర్మించి పాండుపుత్రులతో తాను కూడా భస్మమయాడు. ధృతరాష్ట్రుని బుద్ధి ఎంత విషమంగా తయారయింది. విశ్వసనీయులూ నిరపరాధులూ అయిన పాండవులనే ధ్వంసం చేశాడు పాపి— అని దీనారవాలతో లాక్షాగృహం చుట్టూ ప్రజలు మూగారు. తమకు కలిగే ప్రమాదాలను తలచుకొని లోలోపల దుఃఖిస్తూ పాండవులు మాతృసహితులై ఎవరికీ కనిపించకుండా వెళ్ళిపోయారు. నిద్రలేని నీరసంతో వారు వేగంగా నడవలేకపోతూంటే మహాబలిష్ఠుడైన భీమసేనుడు తల్లిని భుజసీమపై ఉంచుకొని నకులసహదేవులనూ ధర్మజ అర్జునులనూ కూడా భరిస్తూ భూమి ప్రకంపించేటట్లు అడుగులువేస్తూ వాయువేగంతో సాగుతున్నాడు.

147 వ అధ్యాయం సమాప్తం

## నూట నలుబది ఎనిమిదవ అధ్యాయము

గంగాతీరానికి పాండవులు చేరేసరికి అక్కడ వారు గంగావతరణాన్ని గురించి ఆలోచిస్తూంటే విదురుని ఆజ్ఞానుసారం ఒకనావికుడు వేచిఉన్నాడు. ఆ నావికుడు వాయువేగ మనోవేగాలతో సాగే

ఉపతస్థుర్నరశ్రేష్ఠా వైశ్యశూద్రగృహాణ్యపి.
అర్చితాశ్చ నరైః పౌరైః పాండవా భరతర్షభ
జగ్మురావసథం పశ్చాత్ పురోచనపురస్సరాః.
తేభ్యో భక్ష్యాణి పానాని శయనాని శుభాని చ
ఆసనాని చ ముఖ్యాని ప్రదదౌ స పురోచనః.
తత్ర తే సత్కృతాస్తేన సుమహార్హపరిచ్ఛదాః
ఉపాస్యమానాః పురుషైరూషుః పురనివాసిభిః.
దశరాత్రోషితానాం తు తత్ర తేషాం పురోచనః
నివేదయామాస గృహం శివాఖ్యమశివం తదా.

తత్ర తే పురుషవ్యాఘ్రా వివిశుః సపరిచ్ఛదాః
పురోచనస్య వచనాత్ కైలాసమివ గుహ్యకాః
తచ్చాగారమభిప్రేక్ష్య సర్వధర్మభృతాం వరః
ఉవాచాగ్నేయమిత్యేవం భీమసేనం యుధిష్ఠిరః.
జిఘ్రన్నస్య వసాగంధం సర్పిర్జతువిమిశ్రితం
కృతం హి వ్యక్తమాగ్నేయమిదం వేశ్మ పరంతప.
శణసర్జరసంవ్యక్తమానీయ గృహకర్మణి
ముంజబల్వజవంశాది ద్రవ్యం సర్వం ఘృతోక్షితం.
శిల్పిభిః సుకృతం హ్యాప్తైర్వినీతైర్వేశ్మకర్మణి
విశ్వస్తం మామయం పాపో దగ్ధుకామః పురోచనః.
తథా హి వర్తతే మందః సుయోధనవశే స్థితః
ఇమాంతు తాం మహాబుద్ధిర్విదురో దృష్టవాంస్తథా.
ఆపదం తేన మాం పార్థ స సంబోధితవాన్ పురా
తే వయం బోధితాస్తేన నిత్యమస్మద్ధితైషిణా.
పిత్రా కనీయసా స్నేహాద్బుద్ధిమంతోఽశివం గృహం
అనార్యైః సుకృతం గూఢైర్దుర్యోధనవశానుగైః.

యదీదం గృహమాగ్నేయం విహితం మన్యతే భవాన్
తత్రైవ సాధు గచ్ఛామో యత్ర పూర్వోషితా వయం.
ఇహాయత్తైర్నిరాకారైర్వస్తవ్యమితి రోచయే
అప్రమత్తైర్విచిన్వద్భిర్గతిమిష్టాం ధ్రువామితః.
యది విందేత చాకారమస్మాకం స పురోచనః
క్షిప్రకారీ తతో భూత్వా ప్రదహ్యాదపి హేతుతః.
నాయం బిభేత్యుపక్రోశాదధర్మాద్వా పురోచనః
తథా హి వర్తతే మందః సుయోధనవశే స్థితః.
అపి చేహ ప్రదగ్ధేషు భీష్మోఽస్మాసు పితామహః
కోపం కుర్యాత్ కిమర్థం వా కౌరవాన్ కోపయీత సః.
అథవాపీహ దగ్ధేషు భీష్మోఽస్మాకం పితామహః
ధర్మ ఇత్యేవ కుప్యేరన్ యే చాన్యే కురుపుంగవాః
వయం తు యది దాహస్య బిభ్యతః ప్రద్రవేమహి
స్పశైర్నో ఘాతయేత్సర్వాన్ రాజ్యలుబ్ధః సుయోధనః
అపదస్థాన్ పదే తిష్ఠన్నపక్షాన్ పక్షసంస్థితః
హీనకోశాన్ మహాకోశః ప్రయోగైర్ఘాతయేద్ధ్రువం.
తదస్మాభిరిమం పాపం తం చ పాపం సుయోధనం
వంచయద్భిర్నివస్తవ్యం ఛన్నావాసం క్వచిత్ క్వచిత్.

తే వయం మృగయాశీలాశ్చరామ వసుధామిమాం
తథా నో విదితా మార్గా భవిష్యంతి పలాయతాం.
భౌమం చ బిలమద్యైవ కరవామ సుసంవృతం
గూఢశ్వాసాన్న నస్తత్ర హుతాశః సంప్రధక్ష్యతి.
వసతోఽత్ర యథా చాస్మాన్న బుధ్యేత పురోచనః
పౌరో నాపి జనః కశ్చిత్ తథా కార్యమతంద్రితైః.

145వ అధ్యాయం సమాప్తం.

నావను పాండవుల ముందుంచాడు. ఆ నావ యంత్రసహాయంతో సాగుతుంది. అత్యంతసుందరంగా ఉన్న ఆనావను చూపుతూ-ధర్మాత్మా! నన్ను విదురులవారు పంపారు. నావిషయమై మీకు విశ్వాసం కలగటంకోసం విదురులు ఈ వాక్యం చెప్పారు. ఎండుటాకులతో మోడులతో నిండిన అరణ్యాన్ని భస్మంచేయగల అగ్ని బిలంలోని మూషికాన్ని ఏమీచెయ్యలేదు— అని వారు మీకు ఆనాడు మ్లేఛ్ఛభాషలో చెప్పారట. ఇప్పుడు మీరు నన్ను నమ్మవచ్చు. విద్వాంసులు విదురులు మరొకవిషయంకూడా చెప్పారు. సంగ్రామంలో దుర్యోధనాదులందరనీ మీరు హతమార్చగలరట- అని పలికి-ఈనావ నీటిమీద మహావేగంతో సాగిపోతుంది—అన విని వారందరూ ఆ నావమీదకు వచ్చారు. దీనవదనాలతో ఉన్న వారిని చూస్తూ నావికుడు—పూజ్యులారా! విదురులవారు అక్కడ నుంచే తమ హృదయంతో మిమల్ని ఆలింగనం చేసికొని శిరస్సు మూర్కొని ఆశీర్వదించానన్నారు. మీరందరూ శాంతంగా అప్రమత్తతతో చరిస్తూ ఉండాలనికూడా చెప్పారు—అని నావ విడిచాడు. అది క్షణాలలో రెండవగట్టు చేరింది. వారిని దింపి జయజయ ధ్వానం చేసి నావికుడు తిరిగి వెళ్ళిపోయాడు. విదురుని సందేశానికి పాండవులు సమాధానం చెప్పి నదీతీరం వెంట రహస్యంగా అరణ్యాలలోకి సాగిపోయారు.

148వ అధ్యాయం సమాప్తం.

## నూట నలుబది తొమ్మిదవ అధ్యాయం

తెల తెల్లవారుతూండగా నగరవాసులందరూ మండుతున్న లాక్షాగృహాన్ని ఆర్పేప్రయత్నంలో పడ్డారు. అప్పటికే ఆసౌధమంతా బూడిదయిపోయింది. అందులో పురోచనమంత్రికూడా దగ్ధమయాడు—ఈకార్యమంతా దుర్యోధనుడు ధృతరాష్ట్రుని అనుమతితోనే చేశాడు. ఈవిషయంలో భీష్ముడుకూడా ధర్మమార్గాన్ని అవలంబించలేకపోతున్నాడు. విదురద్రోణ కృపాచార్యాదులూ కురువృద్ధులూ అదేస్థితిలో ఉన్నారు. ఇప్పుడు ధృతరాష్ట్రుని మనోభీష్టం సంపూర్ణంగా నెరవేరిందని మనం వార్త పంపవచ్చు. పాండవులను దగ్ధం చెయ్యటంలో నువ్వు కృతకృత్యుడవయావని తెలియజేయాలి—అని ప్రజలందరూ అనుకుంటూ ఆబూడిదలో పాండవులకోసం వెదకసాగారు. అదే రాత్రి అక్కడ శయనించిన భిల్లస్త్రీ నీమె అయిదుగురు పుత్రులనీ అస్థులు గోచరించాయి. సారంగాన్ని త్రవ్విన ఖనకుడు ఆద్వారాన్ని తెలివిగా మూసివేయడంవల్ల ఎవరూ దాన్ని కనిపెట్టలేకపోయారు.

వారణావతపౌరులు ఆ సమాచారాన్ని ధృతరాష్ట్రునికి తెలియజేశారు. ధృతరాష్ట్రుడు లోలోపల సంతోషిస్తూ పైకి తీవ్రంగా దుఖించసాగాడు. మహావీరులైన పాండవులు తల్లితోసహా మరణించారు. ఈ వార్త వింటూనే నాసోదరుడైన పాండురాజు నేడే మరణించినట్లనిపిస్తోంది— అని ధృతరాష్ట్రుడు విలపిస్తూ కొందరు పరిజనులను

నిరతులై వేదవేదాంగాలూ నీతిశాస్త్రమూ అభ్య సిస్తున్నారు. అధ్యయనంలో ఉండగా ఒకనాడు వేదవ్యాసమహర్షి అక్కడకు వచ్చాడు. వచ్చిన వ్యాసునికి వారందరూ ప్రణామాలు చేశారు. వారిపై వ్యాసుడు ఆదరదృక్కులు ప్రసరిస్తూ–మీ అందరిపట్లా దుర్యోధనుడి ప్రవర్తన విన్నాను. మీ శ్రేయస్సుకోసమే నేనిలా వచ్చాను. మీ కు ఉజ్జ్వలభవిష్యత్తు ఉంది. నాకు మీరందరూ సమా నులే. అయితే ఎక్కడ బాల్యమూ దైన్యమూ ఉంటాయో అక్కడ సాధుపురుషులూ కృపా పూర్ణంగా చరిస్తారు. మీరు దీనస్థితిలో ఉన్నందు వల్ల నేనిలా వచ్చాను. ఈపరిసరాలలో ఒకనగరం ఉన్నది. ఆసుందరనగరంలో మీరు నిశ్చింతగా జీవిస్తూ ఉండండి–అని వారికి శ్రేయోమార్గం చెప్పి కృష్ణద్వైపాయనుడూ వారితో ఏకచక్రపురంవరకూ వెళ్ళి కుంతి నుద్దేశించి–ఓ పుత్రవతీ! ధర్మపరాయణు డైన నీధర్మరాజు ఈ భూమండలాన్ని జయించి సమస్తచక్రవర్తులనీ శాసిస్తాడు. భీమార్జునులు సముద్రపర్యంతవ్యాప్తమైన భూమిని స్వాధీనం చేసుకొంటారు. నకులసహదేవులుకూడ సుఖంగా నీదగ్గరే ఉంటారు. నీ కుమారులు రాజసూయ అశ్వమేధాలతో పరమేశ్వరుని పూజిస్తారు. ఆ ప్తు లకూ స్నేహితులకూ వృద్ధులకూ పూజ్యులకూ సర్వ విధసుఖాలు సమకూర్చి వారి గౌరవాలు పొందు తారు– అని పలికి వారందరినీ ఒక బ్రాహ్మణ గృహానికి తీసికొని వెళ్ళాడు. అక్కడ ధర్మరాజు నుద్దేశించి– నాయనా! దేశకాలాలను పరిశీలించు కుంటూ మన కార్యక్రమం కొనసాగిస్తే సుఖం ప్రాప్తిస్తుంది. ఒకమాసంలో నేను మళ్ళీ వస్తాను– అనగా పాండవులందరూ వ్యాసులకు నమస్కరిం చారు. వ్యాసమహర్షి వచ్చిన దారినే తిరిగి వెళ్ళి పోయారు.

155 వ అధ్యాయంసమాప్తం

## నూట ఏబది ఆరవ అధ్యాయము

బకాసురుడు

ఏకచక్రపురంలో ఒక బ్రాహ్మణ గృహంలో పాండవులు నివసిస్తున్నారు. వారు పరిసరాలలోని ఉద్యానవనాలనూ సరోవరాలనూ అరణ్యాలనూ రోజూచూసివస్తూ సంతోషంగా గడుపుతున్నారు. భిక్షాటనంతో జీవయాత్ర నిర్వహిస్తున్నారు. తమ గుణశీలాలతో ప్రజలకు గౌరవప్రీతిపాత్రులయారు. ఆ నాగరకులు పాండవుల ఆచారవ్యవహారాలనూ వేషభాషలనూ రూపసంపదనూ చూసి వీరు ఉత్తమబ్రాహ్మణులని ప్రశంసించేవారు. ఈ మహా పురుషులు భిక్షాటనం చేయవలసినవారు కాదు. రాజ్యపాలనార్హులు. ఈ సుకుమారులు సర్వ శుభ లక్షణాలతో ప్రకాశిస్తున్నారు. తపస్సంపన్నులయి ఉన్నారు. ఏదో విధివైపరీత్యం వల్ల ఈ రీదశలో ఉన్నారని కూడా ప్రజలు భావించేవారు.

వారు మానవ్రతంతో భిక్షార్థులై వచ్చేవేళకు సామాన్య ప్రజలందరూ వారికి ఎదురువచ్చి భిక్ష పెట్టేవారు. పాండవులను తమ బంధువులుగా తలపోసేవారు.ఏపాటి ఆలస్యమయినా తల్లికి అలసట కలుగుతుందని వారు త్వరత్వరగా భిక్షాటనం చేసి

తిస్యాస్తద్వచనం శ్రుత్వా కుంతీవచన మబ్రవీత్
యుధిష్ఠిరం మహాప్రాజ్ఞం సర్వశాస్త్రవిశారదం.
త్వంహిధర్మభృతాం శ్రేష్ఠమయోక్తం శృణుభారత
రాక్షస్యేషా హి వాక్యేన ధర్మ్యం వదతి సాధు వై.
భావేన దుష్టా భీమం సా కిం కరిష్యతి రాక్షసీ
భజతాం పాండవం వీరమపత్యార్థం యదీచ్ఛసి.
ఏవమేతద్యథాఽఽత్థ హిడింబే నాత్రసంశయః
స్థాతవ్యం తు త్వయా సత్యే యథా బ్రూయాం
సుమధ్యమే.
స్నాతం కృతాహ్నికం భద్రే కృతకౌతుకమంగళం
భీమసేనం భజేథాస్త్వం ప్రాగస్తగమనాద్రవేః.
అహస్సు విహరానేన యథాకామం మనోజవా
అయం త్వానమితవ్యస్తే భీమసేనః సదా నిశి.
ప్రాక్సంధ్యాతో విమోక్తవ్యో రక్షితవ్యశ్చనిత్యశః
ఏవం రమస్వ భీమేన యావద్గర్భస్య వేదనం.
ఏష తేసమయోభద్రేశుశ్రూష్యశ్చాప్రమత్తయా
నిత్యానుకూలయాభూత్వాకర్తవ్యంశోభనంత్వయా.
యుధిష్ఠిరేణైవముక్తా కుంత్యా చాంకేఽధిరోపితా
భీమార్జునాంతరగతాయమాభ్యాంచపురస్కృతా.
తిర్యగ్యుధిష్ఠిరే యాతి హిడింబా భీమగామినీ
శాలిహోత్రసరో రమ్యమాసేదుస్తే జలార్థినః.
తత్తథేతి ప్రతిజ్ఞాయ హిడింబా రాక్షసీ తదా
వనస్పతితలం గత్వా పరిమృజ్య గృహం యథా.
పాండవానాంచవాసంసాకృత్వాపర్ణమయంతథా
ఆత్మనశ్చ తథా కుంత్యా ఏకోద్దేశే చకార సా.
పాండవాస్తుతతఃస్నాత్వాశుద్ధాఃసంధ్యాముపాస్య
తృషితాః క్షుత్పిపాసార్తా జలమాత్రేణ వర్తయన్
శాలిహోత్రస్తతో జ్ఞాత్వా క్షుధార్తాన్
పాండవాంస్తదా
మనసాచింతయామాసపానీయంభోజనంమహత్

తతస్తేపాండవాఃసర్వే విశ్రాంతాః పృథయాసహ.
యథాజతుగృహేవృత్తంరాక్షసేనకృతంచయత్
కృత్వాకథా బహువిధాః కథాంతే పాండునందనం
కుంతిరాజసుతా వాక్యం భీమసేనమథాబ్రవీత్.
యథా పాండుస్తథా మాన్యస్తవ జ్యేష్ఠోయుధిష్ఠిరః
అహం ధర్మవిధానేన మాన్యా గురుతరా తవ.
తస్మాత్పాండుహితార్థం మే యువరాజ హితం కురు
నికృతా ధార్తరాష్ట్రేణ పాపేనాకృతబుద్ధినా
దుష్కృతస్య ప్రతీకారం న పశ్యామి వృకోదర.
తస్మాత్కతిపయాహేన యోగక్షేమం భవిష్యతి
క్షేమందుర్గమిమంవాసంవసిష్యామోయథాసుఖం.
ఇదమద్య మహద్దుఃఖం ధర్మకృచ్ఛ్రం వృకోదర
దృష్ట్వైవ త్వాం మహాప్రాజ్ఞ అనంగాభిప్రచోదితా.
యుధిష్ఠిరం చ మాం చైవ వరయామాస ధర్మతః
ధర్మార్థం దేహి పుత్రం త్వంస నః శ్రేయః కరిష్యతి
ప్రతివాక్యంతునేచ్ఛామిహ్యావాభ్యాంవచనంకురు.
తథేతి తత్ప్రతిజ్ఞాయ భీమసేనో బ్రవీదిదం
శృణు రాక్షసి సత్యేన సమయం తే వదామ్యహం.
యావత్కాలేన భవతి పుత్రస్యోత్పాదనం శుభే
తావత్కాలంగమిష్యామిత్వ యాసహసుమధ్యమే.
తథేతి తత్ప్రతిజ్ఞాయ హిడింబా రాక్షసీ తదా
భీమసేనముపాదాయ సోర్ధ్వమాచక్రమే.
శైలశృంగేషు రమ్యేషు దేవతాయతనేషు చ
మృగపక్షివిఘుష్టేషు రమణీయేషు సర్వదా.
కృత్వా చ పరమం రూపం సర్వాభరణభూషితా
సంజల్పతీ సుమధురం రమయామాస పాండవం.
తథైవ వనదుర్గేషు పుష్పితద్రుమవల్లిషు
సరస్సు రమణీయేషు పద్మోత్పలయుతేషు చ.
నదీద్వీపప్రదేశేషు వైదూర్యసికతాసు చ
సుతీర్థవనతో యాసు తథా గిరినదీషు చ.
కాననేషు విచిత్రేషు పుష్పితద్రుమవల్లిషు

తిరిగి వచ్చేవారు. తెచ్చిన ఆహారాన్ని వారు తల్లి దగ్గర వుంచేవారు. ఆమె ఆపదార్థాలను రెండు భాగాలుగా చేసి సగం భీమునికిచ్చి మిగిలినదానిని తక్కిన కొడుకులతో ఆమె భుజించేది.

రోజులు గడుస్తున్నాయి.

యథాప్రకారం పాండవులుభిక్షాటనకు వెళ్ళారు.

భీమసేనుడుమాత్రం తల్లితో ఇంటిదగ్గరే వుండిపోయాడు.

వారుభయులూ కష్టసుఖాలు విచారించుకుంటూండగా హృదయవిదారకమైన ఆర్తనాదాలు ఆగృహంలోంచి వినిపించాయి. తాము నివసించే గృహంలోని బ్రాహ్మణ కుటుంబీకు లందరూ విలపిస్తూన్నట్టు కుంతీదేవి గ్రహించింది. సాధుమతియైన కుంతీదేవి హృదయం ద్రవించింది. ఆమె భీమసేనుని తదేకంగా చూస్తూ— నాయనా! వీరి యింటిలో మనం నిశ్చింతగా ఉంటున్నాం. మన జాడకూడా దుర్యోధనుడికి తెలియకుండా కాలం గడుపుతున్నాం. వీరు చేసే ఈ ఉపకారానికి ఏవిధంగా కృతజ్ఞత తెలియజెయ్యాలో తెలీక నేను బాధపడుతున్నాను. ప్రత్యుపకారం చెయ్యడం ఉత్తమ మానవధర్మం.

ఇప్పుడు చూస్తూంటే వీరికేదో విపత్తు ప్రాప్తించినట్లు తోస్తోంది. ఆ ఆపదనుండి వారిని రక్షించే సావకాశం మనకు లభిస్తే ధన్యులం—అన్నది. వారికి కలిగిన కష్ట మేమిటో తెలిసికొనివస్తే దాన్ని వారించడానికి తనశక్తికొద్దీ కృషి చేస్తానన్నాడు భీముడు.

అలా ప్రసంగించుకుంటూండగా వారికి ఆర్తనాదాలు మరింత హృదయవిదారకంగా వినిపించాయి. ఇంట్లో ఉన్న లేగదూడకోసం వచ్చే గోమాతలా కుంతీదేవి వారివద్దకు వెళ్ళింది. ఆ బ్రాహ్మణుడూ వానిభార్యా పుత్రుడూ పుత్రికా దీనంగా వాల్చిన తలలతో కనిపించారు.

ఈ సాంసారికజీవితమే నిస్సారమైంది. పరమ దుఃఖావహం. భయనికేతనం. ఈ జీవితం పరాధీనం. ధర్మార్థకామభోగాలను అనుభవించటంవల్ల ఆనందం కలుగుతుంది. అవి అలభ్యమయితే అపారమైన దుఃఖం ప్రాప్తిస్తుంది. కనకనే మోక్షం పరమధర్మ మంటారు ప్రాజ్ఞులు. అదికూడా నాకు లభించటంలేదు. అసలు ఈదుఃఖాలన్నిటికీ ధనేచ్ఛ ప్రబలహేతువు.

విచారం ఎలాఉన్నా ఈనాడు నాకు కలిగిన దుఃఖనివారణోపాయం ఏదీ గోచరించటం లేదు. ఏమాత్రం అవకాశం ఉన్నా ఈభార్యాపుత్రులతో ఎక్కడకైనా పోయేవాణ్ణి. ఇదివరలో ఈవిషయం నీతో ప్రస్తావించాను. కానీ జన్మభూమి మీద వ్యామోహం వదలలేక నువ్వు యీవిపత్తు తెచ్చిపెట్టావు. నీ పితామహ ప్రపితామహు లందరూ ఇక్కడ ఉండేవారన్నావు. వారందరూ ఏనాడో ఈ లోకం విడిచి పోయారు. నీమూర్ఖత్వం ఈప్రమాదాన్ని మననెత్తికి తెచ్చింది. ఇప్పుడిది నాపీక్క చుట్టుకుంది. ఇప్పుడు మరెవరినీ బలిచెయ్యలేను. అంతటి క్రౌర్యం నాలోలేదు.

అగ్నిసాక్షిగా ధర్మవిధిని నిన్ను పరిగ్రహించాను. ఉత్తమకులగుణశీలవు. నావంశోద్ధారణార్థం పుత్రునికన్న ఉత్తమసాధ్వివి. నాకు పరమ అనుకూలవతివై కష్టకాలంలో కన్నతల్లిలా నన్నుచూసే నిన్ను విడిచిపెట్టలేను. బాల్యావస్థలో ఉన్న ఈకుమారునీ త్యాగం చెయ్యలేను. బ్రహ్మదేవుడు న్యాసంగా ఉంచిన ఈఅమ్మాయినీ బలిచెయ్యలేను.

హిమవద్గిరికుంజేషు గుహాసు వివిధాసు చ.
ప్రఫుల్లశతపత్రేషు సరస్స్వమలవారిషు
సాగరస్య ప్రదేశేషు మణిహేమచితేషు చ.
పల్వలేషు చ రమ్యేషు మహాశాలవనేషు చ
దేవారణ్యేషు పుణ్యేషు తథా పర్వతసానుషు.
గుహ్యకానాం నివాసేషు తాపసాయతనేషు చ
సర్వర్తుఫలరమ్యేషు మానసేషు సరస్సు చ.
బిభ్రతీ పరమం రూపం రమయామాస పాండవం
రమయంతీ తథా భీమం తత్ర తత్ర మనోజవా
ప్రజజ్ఞే రాక్షసీ పుత్రం భీమసేనాన్మహాబలం
విరూపాక్షం మహావక్త్రం శంకుకర్ణం విభీషణం.
భీమనాదం సుతామ్రోష్ఠం తీక్ష్ణదంష్ట్రం మహాబలం
మహేష్వాసం మహావీర్యం మహాసత్త్వం మహాభుజం.
మహాజవం మహాకాయం మహామాయమరిందమం
దీర్ఘఘోణం మహోరస్కం వికటోద్బద్ధపిండికం.
అమానుషం మానుషజం భీమవేగం మహాబలం
యఃపిశాచానతీత్యాన్యాన్ బభూవాతీవరాక్షసాన్.
బాలోఽపియౌవనంప్రాప్తోమానుషేషువిశాంపతే
సర్వాస్త్రేషు పరం వీరః ప్రకర్షమగమద్బలీ.
సద్యోహి గర్భాన్ రాక్షస్యోలభంతేప్రసవంతి చ
కామరూపధరాశ్చైవ భవంతి బహురూపికాః.

ప్రణమ్య వికచః పాదావగృహ్ణాత్ స పితుస్తదా
మాతుశ్చ పరమేష్వాసస్తౌ చ నామాస్య చక్రతుః.
ఘటో హాస్యోత్కచ ఇతి మాతా తం ప్రత్యభాషత
అబ్రవీత్తేన నామాస్య ఘటోత్కచ ఇతి స్మ హ.
అనురక్తశ్చ తానాసీత్పాండవాన్ స ఘటోత్కచః
తేషాం చ దయితో నిత్యమాత్మనిత్యోబభూవ హ.
సంవాససమయో జీర్ణ ఇత్యాభాష్య తతస్తు తాన్
హిడింబాసమయంకృత్వాస్వాంగతింప్రత్యపద్యత.
ఘటోత్కచోమహాకాయఃపాండవాన్పృథయాసహ
అభివాద్యయథాన్యాయమబ్రవీచ్చప్రభాష్యతాన్.
కింకరోమ్యహమార్యాణాం నిశ్శంకం వదతానఘాః
తం బ్రువంతం భైమసేనిం కుంతీ వచనమబ్రవీత్.
త్వం కురూణాంకులే జాతః సాక్షాద్భీమసమోహ్యసి
జ్యేష్ఠఃపుత్రోఽసిపంచానాంసాహాయ్యంకురుపుత్రక.
పృథయాప్యేవముక్తస్తుప్రణమ్యైవవచోఽబ్రవీత్
యథా హి రావణో లోకే ఇంద్రజిచ్చ మహాబలః
వర్షవీర్యసమో లోకే విశిష్టశ్చాభవం నృషు.
కృత్యకాల ఉపస్థాస్యే పితౄనితి ఘటోత్కచః
ఆమంత్ర్య రక్షసాం శ్రేష్ఠః ప్రతస్థే చోత్తరాం దిశం.
స హి సృష్టో మఘవతా శక్తిహేతోర్మహాత్మనా
కర్ణస్యాప్రతివీర్యస్య ప్రతియోద్ధా మహారథః

154 వ అధ్యాయం సమాప్తం

## నూట యేబది ఐదవ అధ్యాయము

తేవనేనవనంగత్వాఘ్నంతోమృగగణాన్ బహూన్
ఉపకృమ్యయయూరాజంస్త్వరమాణామహారథాః.
మత్స్యాంస్త్రిగర్తాన్పంచాలాన్కీచకానంతరేణచ
రమణీయాన్వనోద్దేశాన్ప్రేక్షమాణాఃసరాంసిచ.
జటాః కృత్వాఽఽత్మనః సర్వేవల్కలాజినవాససః
సహ కుంత్యా మహాత్మానో బిభ్రతస్తాపసం వపుః

క్వచిద్వహంతో జననీం త్వరమాణా మహారథాః
క్వచిచ్ఛందేన గచ్ఛంతస్తే జగ్ముః ప్రసభం పునః
బ్రాహ్మం వేదమధీయానా వేదాంగాని చ సర్వశః
నీతిశాస్త్రం చ సర్వజ్ఞా దదృశుస్తే పితామహం.
తేఽభివాద్యమహాత్మానంకృష్ణద్వైపాయనంతదా
తస్థుఃప్రాంజలయఃసర్వేసహమాత్రా పరంతపాః.

ఈమెకు కలిగే కుమారుడు నాకు ఉత్తరగతులిస్తాడు. కొందరు పుత్రునీ కొందరు పుత్రికనీ అధికంగా చూసుకుంటారు. నాకు ఇద్దరూ సమానులే. ఈ ఇరువురినీ మృత్యువుకి ఆహారంగా అర్పించలేను. అయితే నేను మరణించక తప్పదు. కానీ నామరణానంతరం వీరెలా జీవిస్తారా అనే భీతి నన్ను బాధిస్తోంది. అంతమాత్రంచేత ఈ పసికందుల్లో ఏ ఒకర్నీ బలిపెట్టలేను. ఎటువంటి ప్రమాదం సంభవించింది. ఒక్కటేమార్గం గోచరిస్తోంది. వీరందరితోనూ మరణించడమే ఉచితమార్గం — అని ఆ బ్రాహ్మణుడు భార్యతో పలకటం కుంతి ఆలకించింది.

156 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఏబదియేడవ అధ్యాయము

అన్నీ విషయాలూ తెలిసిన మీరే ఇలా విచారించటం మంచిపనికాదు. పైగా ఇది శోకించవలసిన సమయం కాదు. ఈప్రపంచంలో పుట్టిన ప్రాణి గిట్టక తప్పదు. దానికి విచారించటం విద్వాంసుల లక్షణం కాదు. మీరు స్థిరచిత్తంతో ఉండండి. మీ భార్యాబిడ్డలూ మీకు అనుకూలురు. ఈబిడ్డల్ని మీరు జాగ్రత్తగా చూసుకుంటూండండి నేనే ఆరాక్షసుడికి ఆహారంగా వెడతాను.

భర్తకు సేవచేయడంకంటె భర్తకోసం ప్రాణత్యాగం చేయడంకంటె పరమధర్మం లేదు. నాప్రాణాలను రాక్షసుడికోసం అర్పిస్తాను. అందువల్ల మీకూ బాధ ఉండదు. నాకూ స్వర్గం ప్రాప్తిస్తుంది. మరొక ముఖ్యాంశం కూడా ఉన్నది. సంతానార్థం పురుషుడు స్త్రీని పరిగ్రహిస్తాడు. నావల్ల బాలుడూ బాలికా కలిగారు. అందుచేత ఆప్రయోజనం నెరవేరింది. నేనుకూడా ఋణవిముక్తురాలి నయాను. ఇప్పుడు నేను ఒక్కర్తెనూ ఉండి వీళ్ళిద్దరినీ పాలించి పోషించలేను. మీరయితే వీళ్ళను రక్షించి వృద్ధిలోకి తెచ్చుకోగలరు. మీరే లేకపోతే వీళ్ళగతి ఏంకావాలి. అనాథనైన నేను సన్మార్గాన చరిస్తూ వీళ్ళను పెద్దవాళ్ళను చెయ్యలేను. పైగా మనకంటె తక్కువస్థితిలో ఉన్నవారు వచ్చి మనపిల్లను అర్థిస్తే నేను కాదనలేను. అలా అన్నా వారి అహంకారగర్వాలు నన్ను లక్ష్యం చేస్తాయా. దుర్మార్గులు నా శీలభంగానికి యత్నించినా నేను అడ్డుకోలేను కదా. మనవంశంలో ఆనుపూర్విగా వచ్చే ఆచారమర్యాదలను పాటిస్తూ ఈ ఏకైకపుత్రికను కాపాడలేను. ఈకుమారుణ్ణి సద్గుణాలతో అలరారేటట్లు చేసి లోకవిఖ్యాతుణ్ణి చేసే శక్తి నాకులేదు. భూమిమీద కనిపించిన మాంసాన్ని పక్షులన్నీ వాంఛించేటట్లే భర్తృహీనను లోకులు వాంఛిస్తారు. శూద్రులు శ్రుతిని ప్రార్థించినట్లు కులహీనులు ఈ కన్యను కోరితే కాదన్నప్పుడు కాకులు హవిర్భాగాలు హరించుకుపోయేటట్లు వారు తీసుకోపోవచ్చు. అటువంటిస్థితిలో నాకు మరణమే శరణ్యం. నీరు ఇంకిన-చోట చేపలు నశించినట్లు మనం లేకపోతే వీళ్ళూ అంతే అవుతారు.

అందుచేత మీరు ఒక్కరూ లేకపోతే మన సంసారమే నాశనమవుతుంది. అందుచేతనే నాకు ఆజ్ఞ యివ్వండి. భర్తకంటె ముందుగా మరణించ

మయేదం వ్యసనం పూర్వం విదితం భరతర్షభాః
యథా తు తైరధర్మేణ ధార్తరాష్ట్రైర్వివాసితాః.
తద్విదిత్వాస్మి సంప్రాప్తశ్చికీర్షుః పరమం హితం
న విషాదోఽత్ర కర్తవ్యః సర్వమేతత్సుఖాయ వః.
సమాస్తేచైవమేసర్వేయూయంచైవనసంశయః
దీనతో బాలతశ్చైవ స్నేహం కుర్వంతి మానవాః.
తస్మాదభ్యధికఃస్నేహోయుష్మాసుమమసాంప్రతం
స్నేహపూర్వం చికీర్షామి హితం వస్తన్నిబోధత.
ఇదం నగరమభ్యాసే రమణీయం నిరామయం
వసతేహ ప్రతిచ్ఛన్నా మమాగమనకాంక్షిణః.
ఏవం స తాన్ సమాశ్వాస్యవ్యాసః సత్యవతీసుతః
ఏకచక్రామభిగతః కుంతీమాశ్వాసయత్ ప్రభుః.
జీవత్పుత్రి సుతస్తేఽయం ధర్మనిత్యోయుధిష్ఠిరః
ధర్మేణ పృథివీం జిత్వా మహాత్మా పురుషర్షభః.
పృథివ్యాంపార్థివాన్సర్వాన్ప్రశాసిష్యతిధర్మరాట్
పృథివీమఖిలాం జిత్వా సర్వాం సాగరమేఖలాం
భీమసేనార్జున బలాద్భోక్ష్యతే నాత్రసంశయః.
పుత్రాస్తవ చ మాద్ర్యాశ్చ సర్వ ఏవ మహారథాః
స్వరాష్ట్రే విహరిష్యంతి సుఖం సుమనసః సదా.
యక్ష్యంతి చ నరవ్యాఘ్రా నిర్జిత్య పృథివీమిమాం
రాజసూయాశ్వమేధాద్యైః క్రతుభిర్భూరిదక్షిణైః.
అనుగృహ్య సుహృద్వర్గం భోగైశ్వర్య సుఖేన చ
పితృపైతామహంరాజ్యమిమేభోక్ష్యంతితేసుతాః.
ఏవముక్త్వా నివేశ్యైనాన్ బ్రాహ్మణస్య నివేశనే
అబ్రవీత్ పాండవశ్రేష్ఠమృషిర్ద్వైపాయనస్తదా
ఇహ మాసం ప్రతీక్షధ్వమాగమిష్యామ్యహం పునః
దేశకాలౌ విదిత్వైవ లప్స్యధ్వం పరమాం ముదం.
స తైః ప్రాంజలిభిః సర్వైస్తథేత్యుక్తో నరాధిప
జగామ భగవాన్వ్యాసోయథాగతమృషిః ప్రభుః.

155 వ అధ్యాయము సమాప్తం

## నూటఏబది ఆరవ అధ్యాయం

### బ క వ ధ ప ర్వ ము

ఏకచక్రాం గతాస్తే తు కుంతీపుత్రా మహారథాః
అత ఊర్ధ్వం ద్విజశ్రేష్ఠ కిమకుర్వత పాండవాః.
ఏకచక్రాం గతాస్తేతు కుంతీపుత్రామహారథాః
ఊషుర్నాతిచిరం కాలం బ్రాహ్మణస్య నివేశనే,
రమణీయాని పశ్యంతో వనాని వివిధాని చ
పార్థివానపి చోద్దేశాన్ సరితశ్చ సరాంసి చ.
చేరుర్భైక్షం తదా తే తు సర్వఏవ విశాంపతే
బభూవుర్నాగరాణాం చ స్వైర్గుణైః ప్రియదర్శనాః.
దర్శనీయా ద్విజాః శుద్ధా దేవగర్భోపమాః శుభాః
భైక్షానర్హాశ్చ రాజ్యార్హాః సుకుమారాస్తపస్వినః.
సర్వలక్షణసంపన్నా భైక్షం నార్హంతి నిత్యశః
కార్యార్థినశ్చరంతీతి తర్కయంత ఇతి బ్రువన్
బంధూనామాగమాన్నిత్యముపచింత్యతునాగరాః
భాజనాని చ పూర్ణాని భక్ష్యభోజ్యైరకారయన్.
మాతావ్రతేనసంయుక్తాభైక్షంగృహ్ణంతిపాండవాః
మాతాచిరగతాన్దృష్ట్వాశోచంతీతిచపాండవాః.
త్వరమాణా నివర్తంతే మాతృగౌరవయంత్రితాః.
నివేదయంతి స్మ తదా కుంత్యా భైక్షం సదా నిశి.
తథావిభక్తాన్భాగాంస్తేభుంజతేస్మపృథక్ పృథక్
అర్ధం తే భుంజతేవీరాః సహమాత్రా పరంతపాః.
అర్ధం సర్వస్య భైక్షస్య భీమో భుంక్తే మహాబలః

డంకంటె భార్యకు సౌభాగ్యం లేదు. తల్లిదండ్రులూ సంతానమూ ఇచ్చే సుఖం అతిస్వల్పమైనది. అపారమైన సుఖం భర్తవల్లనే లభిస్తుంది. అందుకోసమే నేను ఈ బిడ్డల నిద్దరినీ విడుస్తున్నాను. ప్రాణం కూడా వదులుతున్నాను. స్త్రీకి భర్త యందు ప్రియమూ హితము ఉండటంకంటె కావలసింది లేదు. దానివల్ల తపోయజ్ఞఫలాలు ప్రాప్తిస్తాయి. ఇది ధర్మసమ్మతకార్యం.

ఆపదలనుండి రక్షితులం కావటానికి ధనవంతులం కావాలి. ధనంతో స్త్రీని కాపాడుకోవాలి. ఈ రెంటితో ఆత్మరక్షణ జరుపుకోవాలి. అందుచేత ఎన్నివిధాల ఆలోచించినా మీరు నాకు అనుజ్ఞ యివ్వడమే మంచిదిగా తోస్తుంది. ఎటువంటిస్థితిలో అయినా స్త్రీని చంపరాదని వేదవిదులు అంటారు. రాక్షసులలోకూడా ధర్మబుద్ధులుండకపోరు. ఈ రాక్షసు డటువంటివా డయితే నన్ను విడిచిపెట్టవచ్చు. మీరు వెళ్ళినందువల్ల అటువంటి సావకాశం కలగదు. భోగభాగ్యాలన్నీ అనుభవించాను. సంతానవతి నయాను. వార్ధక్యం ప్రాప్తించింది. ఇక నాకు మృత్యుభీతిలేదు.

ఇన్నీకాక పునః వివాహం చేసికొనే అధికారం పురుషునికి ఉన్నది. మీరు నా మరణానంతరం మరొక కులస్త్రీని వరించి గార్హస్థ్యధర్మం నిర్వహించుకోవచ్చు. స్త్రీకి ఆ ధర్మం వర్తించదు. పైగా అలాచేస్తే పాతకం ప్రాప్తిస్తుంది. ఈ విషయాలన్నీ ఆలోచిస్తే మీరు మరణించడం శ్రేయస్కరం కాదనిపిస్తున్నది. నాకు ఆ అవకాశం యిచ్చి కులాన్ని రక్షించండి—,అని ఆగృహిణి నిశ్శంకగా పలకడం చూసి ఆమెభర్త దీనవదనుడై హృదయంలో విచారం నిండగా ఆమెను గాఢంగా గుండెలకు హత్తుకొన్నాడు.

157 వ అధ్యాయంసమాప్తం

## నూట ఏబది ఎనిమిదవ అధ్యాయము

పూజ్యులైన మీరు అన్నీ తెలిసిఉండి ఎంగుకింత దుఃఖిస్తున్నారో బోధపడడంలేదు. ఇప్పుడు నేను చెప్పబోయేదికూడా విని ఏది సముచితంగా కనిపిస్తే దానినే చేయండి— అని వారి కుమార్తె తన దేహత్యాగానికి అనుమతి కోరుతూన్నది.

ఆడపిల్ల అయినతరువాయి ఎప్పుడో ఒకప్పుడు పుట్టిన ఇల్లు విడిచి పోవలసిందే. అవశ్యం భావిని వర్తమానంలో ఆచరిస్తాను. కులసంరక్షణార్థం నన్ను విడిచి పెట్టండి. కష్టాలలో సాయపడటానికి కదా సంతానం. ఆ అవకాశం లభించినపుడు నాకు వినియోగావకాశంకూడా ఇవ్వండి. ఇహపరలోకాలలో తండ్రికి సుఖాన్ని కలిగించేవాడే పుత్రుడని వ్యవహరిస్తారు. దౌహిత్రులవల్ల పుణ్యలోకాలు ప్రాప్తించవచ్చు. కానీ ఆత్మరక్షణ అవశ్యం కదా. అందుచేత మీఆత్మరక్షణార్థం, నాసోదరుని జీవితం కోసం నేను ప్రాణత్యాగం చేస్తాను. మీరు దేహత్యాగం చేస్తే ఈ చిన్నతమ్ముడూ మరణిస్తాడు. అప్పుడు ఉత్తరగతులు లభించవు.

మాతాపితృసోదరులు లేకుండా నేను జీవించలేను. వాస్తవానికి అటువంటి దుఃఖమయజీవితం

తత్రూతు తేషాం వసతాం తస్మిన్ రాష్ట్రే మహాత్మనాం.
అతిచక్రామ సుమహాన్ కాలోఽథ భరతర్షభ
తతః కదాచిద్భరతశ్రేష్ఠ తే గతాస్తే పురుషర్షభాః.
సంగత్యా ఏకనుజేనస్తు తత్రాస్తే పృథయా సహ
అథార్తిజం మహాశబ్దం బ్రాహ్మణస్య నివేశనే.
భృశముత్పతితం ఘోరం కుంతీ శుశ్రావ భారత
రోరూయమాణాంస్తాన్ దృష్ట్వా పరిదేవయతశ్చసా.
కారుణ్యాత్ సాధుభావాచ్చ కుంతీ రాజన్ న చక్షమే
మథ్యమానేవ దుఃఖేన హృదయేన పృథా తదా.
ఉవాచ భీమం కల్యాణీ కృపాన్వితమిదం వచః
వసామ సుసుఖం పుత్ర బ్రాహ్మణస్య నివేశనే.
అజ్ఞాతా ధార్తరాష్ట్రస్య సత్కృతా వీతమన్యవః
సా చింతయే సదా పుత్ర బ్రాహ్మణస్యాస్య కిం న్వహం.
ప్రియం కుర్యామితి గృహే యత్కుర్యురుషితాః సుఖం
ఏతావాన్ పురుషస్తాత కృతం యస్మిన్ న నశ్యతి.
యావచ్చ కుర్యాదన్యోఽస్య కుర్యాదభ్యధికం తతః
తదిదం బ్రాహ్మణస్యాస్య దుఃఖమాపతితం ధ్రువం.
తత్రాస్య యది సాహాయ్యం కుర్యాముపకృతం భవేత్
జ్ఞాయతామస్య యద్దుఃఖం యతశ్చైవ సముత్థితం.
విదిత్వా వ్యవసిష్యామి యద్యపి స్యాత్ సుదుష్కరం
ఏవం తౌ కథయంతౌ చ భూయః శుశ్రువతుః స్వనం.
ఆర్తిజం తస్య విప్రస్య సభార్యస్య విశాంపతే.
అంతఃపురం తతస్తస్య బ్రాహ్మణస్య మహాత్మనః
వివేశ త్వరితా కుంతీ బద్ధవత్సేవ సౌరభీ.
తతస్తం బ్రాహ్మణం తత్ర భార్యయా చ సుతేన చ
దుహిత్రా చైవ సహితం దదర్శావనతాననం.
ధిగిదం జీవితం లోకే గతసారమనర్థకం
దుఃఖమూలం పరాధీనం భృశమప్రియభాగి చ.
జీవితే పరమం దుఃఖం జీవితే పరమో జ్వరః
జీవితే వర్తమానస్య దుఃఖానామాగమో ధ్రువః.

ఆత్మా హ్యేకో హి ధర్మార్థౌ కామం చైవ నిషేవతే
ఏతైశ్చ విప్రయోగోఽపి దుఃఖం పరమనంతకం.
ఆహుః కేచిత్పరం మోక్షం స చ నాస్తి కథంచన
అర్థప్రాప్తౌ తు నరకః కృత్స్న ఏవోపపద్యతే.
అర్థేప్సుతా పరం దుఃఖమర్థప్రాప్తౌ తతోఽధికం
జాతస్నేహస్య చార్థేషు విప్రయోగే మహత్తరం.
నహి యోగం ప్రపశ్యామి యేన ముచ్యేయమాపదః
పుత్రదారేణ వా సార్ధం ప్రాద్రవేయమనామయం.
యతితం వై మయా పూర్వం వేత్థ బ్రాహ్మణి తత్తథా
క్షేమం యతస్తతో గంతుం త్వయా తు మమ న శ్రుతం
ఇహ జాతా వివృద్ధాస్మి పితా చాపి మమేతి వై
ఉక్తవత్యసి దుర్మేధే యాచ్యమానా మయాసకృత్ .
స్వర్గతోఽపి పితా వృద్ధస్తథా మాతా చిరం తవ
బాంధవా భూతపూర్వాశ్చ తత్ర వాసే తు కా రతిః
సోయం తే బంధుకామాయా అశృణ్వత్యా వచో మమ
బంధుప్రణాశః సంప్రాప్తో భృశం దుఃఖకరో మమ.
అథవా మద్వినాశోఽయం న హి శక్ష్యామి కంచన
పరిత్యక్తుమహం బంధుం స్వయం జీవన్ నృశంసవత్
సహధర్మచరీం దాంతాం నిత్యం మాతృసమాం మమ
సఖాయం విహితాం దేవైర్నిత్యం పరమికాం గతిం.
పిత్రా మాత్రా చ విహితాం సదా గార్హస్థ్యభాగినీం
వరయిత్వా యథాన్యాయం మంత్రవత్పరిణీయ చ.
కులీనాం శీలసంపన్నామపత్యజననీమపి
త్వామహం జీవితస్యార్థే సాధ్వీమనపకారిణీం.
పరిత్యక్తుం న శక్ష్యామి భార్యాం నిత్యమనువ్రతాం
కుత ఏవ పరిత్యక్తుం సుతం శక్ష్యామ్యహం స్వయం.
బాలమప్రాప్తవయసమజాతవ్యంజనాకృతిం
భర్తురర్థాయ నిక్షిప్తాం న్యాసం ధాత్రా మహాత్మనా.
యయా దౌహిత్రజాంల్లోకానాశంసే పితృభిస్సహ

నాకు ప్రాప్తించకూడదు. కానీ మీరు మరణో న్ముక్తులయితేమాత్రం అది తప్పదు. మీరు జీవించి ఉంటే అమ్మా తమ్ముడూ అందరూ సుఖంగా ఉంటారు. ఇంకా సంతానం కలుగుతుంది. ఉత్త మలోకాలు ప్రాప్తిస్తాయి.

భార్యయే మిత్రుడనీ పుత్రుడే ఆత్మ అనీ అంటారు. ఆడబిడ్డ కష్టజనకమే. అందు చేత నే ఆకష్టనిముక్తి పొందండి. మీరు లేని క్షణంలో నేను దిక్కులేనిదాన్ని అవుతాను. ఇతరుల దయాబుద్ధి మీద జీవించవలసినదాన్ని అవుతాను. అన్ని వైపులా అవమానమే నన్ను వేధిస్తుంది. కనక నాకు మరణం ప్రసాదించండి. ఇందువల్ల నాజన్మ చరితార్థ మవుతుంది.

మీరే రాక్షసుడికి ఆహారంగా వెడితే నేను దుఃఖసాగరంలో పడిపోతాను. ధర్మరక్షణార్థ వంశోద్ధరణకోసం ఆత్మ శ్రేయోదృష్ట్యా నన్ను వెళ్ళ నివ్వండి. ఎప్పుడో ఒకప్పుడు నేను మీకు దూరం కావలసినదాన్నే కనక ఇప్పుడే వెడతాను మీమరణానంతరం మేమందరం అనాథులమై భిక్షాట నంతో జీవించవలసిన స్థితి కలుగుతుంది. నన్ను వెళ్ళనిస్తే నాకు శాశ్వతంగా ఉత్తమలోకాలు లభి స్తాయి. ఈ కార్యంవల్ల దేవతలూ పితృదేవతలూ సంతోషించరు. అయినా వారు మీ నివాపాంజ లులతో మిమ్మల్ని దయతో చూస్తారు—అని పలికే కుమార్తెమాటలతో వారి దుఃఖం మరీ అధికం కానాగింది. కన్న బిడ్డ నోటినుంచి ఇటువంటి మాటలు వినవలసి రావడంకంటె దుఃఖం వేరే లేదు. వారు ముగ్గురూ విపరీతంగా విలపిస్తూంటే చిన్న పిల్లవాడు చిరునవ్వుమోముతో చూస్తూ ముద్దుముద్దుగా ముద్దమాటలతో పలుకుతున్నాడు.

మీరెవ్వరూ ఏడవకండి. అక్కా! నువ్వు ఏడుపుమానెయ్యి—అని అందరిగడ్డమూ పుచ్చుకు బ్రతిమాలి ఓగడ్డిపరక తీసి విపరీతంగా నవ్వుతూ— మీరిలాగే ఉండండి. నేను ఈ ఆయుధంతో ఆరాక్షసుణ్ణి చంపేసి క్షణంలో వస్తాను—అన్నాడు.

వాని ముద్దుమాటలు వినేసరికి వారి దుఃఖం పటాపంచలయింది. విచిత్రమైన నవ్వు వారి ముఖాలలో తాండవిస్తున్నది.

ఇదే తన ప్రస్తావనకు మంచి సమయమని కుంతీ దేవి వారిదగ్గరగా వెళ్ళి జీవనప్రదాతలా మృదు మధురవాణితో ప్రసంగిస్తున్నది.

158 వ అధ్యాయము సమాప్తం

## నూట ఏబది తొమ్మిదవ అధ్యాయము

ఆర్ద్రహృదయంతో కుంతీదేవి వారి దీనదశా కారణం అడుగుతున్నది—

మహాత్మా! మీ దుఃఖానికి కారణం ఏమిటో చెప్పండి. నాశక్తివంచనలేకుండా ప్రయత్నించి మీకు సుఖం చేకూర్చడానికి ప్రయత్నిస్తాను— అని కుంతీదేవి దయాప్రసారవాక్కులు పలకగా ఆభూసు రుడు— అమ్మా! మీవంటి తపోధనులకు ఇతరుల కష్టాలు తొలగించాలనే ఊహ ఉంటుంది. అందుకు అనుకూలంగానే మీరు దయతో మాట్లాడారు.

స్వయముత్పాద్యతాం బాలాం కథముత్స్రష్టుముత్సహే.
మన్యంతే కేచిదధికం స్నేహం పుత్రే పితుర్నరాః
కన్యాయాం కేచిదపరే మమ తుల్యావుభౌ స్మృతౌ.
యస్యాంలోకాఃప్రసూతిశ్చస్థితానిత్యమథోసుఖం
అపాపాంతామహంబాలాంకథ ముత్స్రష్టుముత్సహే.
ఆత్మానమపి చోత్సృజ్య తప్స్యామి పరలోకగః
త్యక్తాహ్యేతేమయావ్యక్తంనేహశక్ష్యంతిజీవితుం.
ఏషాంచాన్యతమత్యాగోనృశంసోగర్హితోబుధైః
ఆత్మత్యాగే కృతే చేమే మరిష్యంతి మయా వినా.
స కృచ్ఛ్రామహమాపన్నో న శక్తస్తర్తుమాపదం
అహోధిక్ కాంగతింత్వద్యగమిష్యామిసబాంధవః
సర్వైస్సహమృతంశ్రేయోనచమేజీవితంక్షమం.

156వ అధ్యాయం సమాప్తం

## నూట యేబది ఏడవ అధ్యాయము

న సంతాపస్త్వయా కార్యః ప్రాకృతేనేవ కర్హిచిత్
న హి సంతాపకాలోఽయం వైద్యస్య తవ విద్యతే
అవశ్యం నిధనం సర్వైర్గంతవ్యమిహ మానవైః
అవశ్యంభావిన్యర్థే వై సంతాపో నేహ విద్యతే.
భార్యాపుత్రోఽథదుహితాసర్వమాత్మార్థమిష్యతే
వ్యథాంజహిసుబుద్ధ్యాత్వంస్వయంయాస్యామితత్రచ.
ఏతద్ధి పరమం నార్యాః కార్యం లోకే సనాతనం
ప్రాణానపి పరిత్యజ్య యద్భర్తృహితమాచరేత్.
తచ్చ తత్ర కృతం కర్మ తవాపీదం సుఖావహం
భవత్యముత్ర చాక్షయ్యంలోకేఽస్మింశ్చ యశస్కరం
ఏష చైవ గురుర్ధర్మో యం ప్రవక్ష్యామ్యహం తవ
అర్థశ్చ తవ ధర్మశ్చభూయానత్ర ప్రదృశ్యతే.
యదర్థమిష్యతేభార్యాప్రాప్తఃసోఽర్థస్తయామయి
కన్యాచైకా కుమారశ్చ కృతాహమనృణా త్వయా.
సమర్థః పోషణే చాసి సుతయో రక్షణే తథా
న త్వహం సుతయోః శక్తా తథా రక్షణపోషణే.
మమ హి త్వద్విహీనాయాః సర్వప్రాణధనేశ్వర
కథంస్యాతాంసుతౌబాలౌభరేయంచకథంత్వహం.
కథం హి విధవానాథా బాలపుత్రా వినా త్వయా
మిథునం జీవయిష్యామి స్థితా సాధుగతే పథి.
అహంకృతావలిప్తైశ్చప్రార్థ్యమానామిమాంసుతాం
అయుక్తైస్తవ సంబంధే కథం శక్ష్యామి రక్షితుం.
ఉత్సృష్టమామిషంభూమౌప్రార్థయంతియథాఖగాః
ప్రార్థయంతి జనాస్సర్వే పతిహీనాం తథా స్త్రియం
సాహంవిచాల్యమానావైప్రార్థ్యమానాదురాత్మభిః
స్థాతుం పథి న శక్ష్యామి సజ్జనేష్టే ద్విజోత్తమం.
కథం తవ కులస్యైకామిమాం బాలామనాగసం
పితృపైతామహే మార్గే నియోక్తుమహముత్సహే.
కథం శక్ష్యామి బాలేఽస్మిన్

గుణానాధాతుమీప్సితాన్

అనాథే సర్వతో లుప్తే యథా త్వం ధర్మదర్శివాన్.
ఇమామపి చ తే బాలామనాథాం పరిభూయమాం
అనర్హాఃప్రార్థయిష్యంతిశూద్రావేదశ్రుతింయథా.
తాంచేదహంనదిత్సేయంత్వద్గుణైరుపబృంహితాం
ప్రమథ్యైనాంహరేయుస్తేహవిర్ధ్వాంక్షాఇవాధ్వరాత్
సంప్రేక్షమాణా పుత్రం తే నానురూపమివాత్మనః
అనర్హవశమాపన్నామిమాం చాపి సుతాం తవ.
అవజ్ఞాతా చ లోకేషు తథాత్మానమజానతీ

కానీ మానవమాత్రుడు వారించలేని దుఃఖం నాకు సంప్రాప్తమైంది.

ఈనగరానికి సమీపంలో యమునాది ఒడ్డున ఒక కీకారణ్యం ఉన్నది. అక్కడే ఒక గుహ ఉంది. ఆగుహలో ఒక రాక్షసు డున్నాడు. వాడు నరభక్షకుడు. అతిక్రూరుడు. వాడే ఈ జనపదానికి ప్రభువు. వాడు ఈ ప్రజలను భక్షిస్తూ జీవిస్తున్నాడు. ఈప్రమాదంనుంచి రక్షించే ప్రభువు కానీ రక్షకుడు కానీ లేడు. వాడే ఈ జనపదాలనూ నగరాలనూ రాక్షసశక్తితో కాపాడుతున్నాడు. అందువల్ల మాకు శత్రుభీతి ఘాతుకమృగభయమూ లేదు.

అనుదినం ఒక బండెడు అన్నం దానికి అనుపాన సామగ్రి రెండు దున్నలూ వేసికొని ఒక మనిషి ఆరాక్షసుడికి ఆహారంగా వెళ్ళాలి. ఇది ఒక్కో రోజు ఒక్కో గృహానికి ప్రాప్తిస్తుంది. దీనినే ఆరాక్షసప్రభువుకి సుంకంగా చెల్లిస్తున్నాం. అయితే కొన్ని సంవత్సరాలవరకూ ఈవంతు ప్రతిగృహానికి తగలకపోయినాకాని దీని బాధ అపారమయినది. ఒకవేళ ఏ గృహస్థయినా ఆ నియమాన్ని ఉల్లంఘిస్తే వాని దారా పుత్రాదులనుకూడా ఆ రాక్షసుడు ఆరగించేస్తాడు. అయితే ఈ రాజ్యానికి అధిపతి అయినరాజు ఒకడు లేకపోలేదు. కానీ ఆమందబుద్ధి ఈ రాక్షసభీతి తొలగించే ఉపాయాన్ని గురించి ఆలోచించడు. అటువంటి దుర్బలుడి అధికారంలో జీవించే ప్రజలకు ఇటువంటి దౌర్భాగ్యాలే ప్రాప్తిస్తాయి.

బ్రాహ్మణుని శాసించేవారు లేరు. వారు యథేచ్ఛగా చరించవచ్చు. సద్గుణవంతుడైన చక్రవర్తి ఏలుబడిలో ఉన్నప్రాంతాన్ని విప్రుడు వాసభూమిగా గ్రహించి అనంతరం కులరూపగుణశీల అయిన భార్యను పరిగ్రహించి అప్పుడు ధనవంతుడై సోదరులనూ పుత్రులనూ రక్షించుకోవాలనీ నీతి విదు లంటారు. నేను మూర్ఖతతో విపరీతంగా చరించిన దానికి ఫలితం అనుభవిస్తున్నాను.

నియమానుసారం ఆరాక్షసుడికి ఆహారం పంపవలసిన వంతు మాకు సంప్రాప్తించింది. నేను వాసకొక మనుష్యుని ఆహారంగా ఇవ్వాలి. నేను ధనహీనుణ్ణి కావటంవల్ల మనిషిని కొని పంపలేను. ఆప్తులను చేతులారా ఆక్రూరుడికి తిండిగా పంపలేను. ఈవిపత్తునుండి బైటపడేదారి లేదు. అందుచేత మేమందరంవెళ్ళి ఆ రాక్షసుడికి ఆహారం అయిపోతాము—అన్నాడు.

159 వ అధ్యాయము సమాప్తం

## నూట అరువదవ అధ్యాయము

మహాపురుషా! ఈ ఆపద మీామీాద పడిందని మీారు విచారించకండి. మీా క్లిష్టితి తొలగించే ఉపాయం నాకు తోచింది. మీారు ఒక్కతే కూతురు. ఒక్కడే కొడుకు. అందుచేత మీారు ఎవరనీ బలిచెయ్యలేరు. నాకు అయిదుగురు కొడుకు లున్నారు. అందులో ఒకడు ఈనాడు రాక్షసుడికి ఆహారం తీసికొని వెడతాడు— అని కుంతి పలుకగా ఆవిప్రశ్రేష్ఠుడు మనోవ్యథతో కుంతికి సమాధాన మిస్తున్నాడు.

అవలి ప్తైనరై ర్బ్రిహ్మాక్షా మరిష్యామి స సంశయః.
తౌ చ హీనౌ మయా బాలౌ త్వయా చైవ
తథాఽఽత్మజా
వినశ్యేతాం న సందేహో మత్స్యావివ జలక్షయే.
త్రితయం సర్వథాప్యేవం వినశిష్యత్యసంశయం
త్వయావిహీనంతిస్మాత్త్వంమాంపరిత్యక్తుమర్హసి.
వ్యుష్టి రేషాపరాస్త్రీణాంపూర్వంభర్తుఃపరాంగతిం
గంతుం బ్రిహ్మన్ సపుత్రాణామితిధర్మవిదోవిదుః.
మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః
అమితస్య హి దాతారం కా పతిం నాభినందతి.
పరిత్యక్తఃసుతశ్చాయందు హితేయంయథామయా
బాంధవాశ్చ పరిత్యక్తాస్త్వదర్థం జీవితం చ మే.
యజ్ఞైస్తపోభిర్నియమైర్దానైశ్చ వివిధై స్తథా
విశిష్యతే స్త్రియా భర్తుర్నిత్యం ప్రియహితే స్థితిః.
తదిదం యచ్చికీర్షామి ధర్మం పరమసమ్మతం
ఇష్టం చైవ హితం చైవ తవ చైవ కులస్య చ.
ఇష్టాని చాప్యపత్యాని ద్రివ్యాణి సుహృదఃప్రియాః
ఆపద్ధర్మప్రిమోక్షాయ భార్యా చాపి సతాంమతం.
ఆపదర్థే ధనం రక్షేద్దారాన్ రక్షేద్ధనై రపి
ఆత్మానం సతతం రక్షేద్దారై రపి ధనై రపి.
దృష్టాదృష్టఫలార్థంహిభార్యాపుత్రోధనం గృహం
సర్వమేతద్విధాతవ్యం బుధానామేష నిశ్చయః.

ఏకతో వా కులం కృత్స్నమాత్మా వా కులవర్ధనః
న సమం సర్వమేవేతి బుధానామేష నిశ్చయః.
సకురుష్వమయాకార్యంతారయాత్మానమాత్మనా
అనుజానీహి మామార్య సుతౌ మే పరిపాలయ.
అవధ్యాం స్త్రియమిత్యాహుర్ధర్మజ్ఞా ధర్మనిశ్చయే
ధర్మజ్ఞాన్ రాక్షసానాహుర్న హన్యాత్ స చ
మామపి.

నిస్సంశయంవధఃపుంసాంస్త్రీణాంసంశయితో వధః
అతో మామేవ ధర్మజ్ఞ ప్రస్థాపయితుమర్హసి.
భుక్తం ప్రియాణ్యవాప్తాని ధర్మశ్చ చరితో మహాన్
త్వత్ప్రిసూతిఃప్రియాప్రాప్తానమాంతప్స్యత్యజీవితం.
జాతపుత్రా చ వృద్ధా చ ప్రియాకామా చ తేసదా
సమీక్ష్యై తదహం సర్వంవ్యవసాయం కరోమ్యతః.
ఉత్సృజ్యాపి హి మామార్య ప్రాప్స్యస్యన్యామపి
స్త్రియం
తతః ప్రతిష్ఠితో ధర్మో భవిష్యతి పునస్తవ.
న చాప్యధర్మః కల్యాణ బాహుపత్నీకృతాంనృణాం
స్త్రీణామధర్మఃసుమహాన్ భర్తుఃపూర్వస్యలంఘనే.
ఏతత్సర్వంసమీక్ష్యత్వమాత్మ త్యాగంచగర్హితం
ఆత్మానంతారయాద్యాశుకులంచే మాచదారకౌ.
ఏవముక్తస్తయా భర్తా తాం సమాలింగ్య భారత
ముమోచ బాష్పం శనకైః సభార్యోభృశదుఃఖితః.

157 వ అధ్యాయంసమాప్తం

## నూట ఏబది ఎనిమిదవ అధ్యాయము

తయోర్దుఃఖితయోర్వాక్యమతిమాత్రం నిశమ్య తు
తతో దుఃఖపరీతాంగీ కన్యా తావభ్యభాషత.
కిమేవం భృశదుఃఖార్తౌ రోరూయేతామనాథవత్
మమాపి శ్రూయతాం వాక్యం శ్రుత్వా చ
క్రియతాం క్షమం.

ధర్మతోఽహం పరిత్యాజ్యా యువయోర్నాత్ర
సంశయః
త్యక్తవ్యాం మాం పరిత్యజ్య త్రాహి సర్వం
మయైకయా.
ఇత్యర్థమిష్యతేఽపత్యం తారయిష్యతి మామితి

అమ్మా! ఇది ఊహించరానివిషయం. నామనస్సు అటువంటి ఆలోచననే అంగీకరించదు. ఇటు చూస్తే మీరు ఉత్తమద్విజులు. పైగా అతిథులు. అటువంటి పుణ్యాత్ములను స్వార్థంకోసం చంపలేను. మీరు నన్ను అటువంటి నీచుడుగా భావించవద్దు. ఎంతటి నీచుడయినా ఈకార్యం చెయ్యడు. బ్రహ్మహత్యకంటె ఆత్మహత్య శ్రేయస్కరం. పైగా ఇది ఆత్మహత్యకూడా కాదు. రాక్షసుని చేతుల్లో బలవన్మరణం పొందుతున్నాను. అందుచేత దానివల్ల నాకు పాపం రాదు. స్వయంగా ప్రేరేపించి బ్రాహ్మణుని చంపించడంకంటె క్రూరకృత్యమూ నీచకార్యమూ పాపమూ లేదు. అతిథినీ శరణార్థినీ స్వప్రయోజనార్థం వినియోగించుకొనే నైచ్యానికి ఒడిగట్ట లేను. ఘాతుకాలకూ అపఖ్యాతికర కార్యాలకూ పాలుపడటం నరకహేతువని విజ్ఞులంటారు. కనకనే నేను భార్యాసమేతం వాడిదగ్గరకు పోయి మరణిస్తాను. అంతేకానీ విప్రశ్రేష్ఠుని ప్రాణం బలిగా పుచ్చుకోలేను— అని ధర్మభీతితో ఆత్మత్యాగానికి సిద్ధపడుతూన్న ద్విజవరునితో కుంతి అంటున్నది.

బ్రహ్మవాదీ! విప్రరక్షణోద్దేశంతోనే నేను ఇలా వచ్చాను. నందమంది బిడ్డలున్న తల్లికికూడా ఏఒక్కణ్ణి చంపుకోవాలనిపించదు. నా కొడుకును ఆరాక్షసుడికి బలిగా ఇవ్వడానికి అంగీకరించి నేను మాట్లాడటం లేదు. మంత్రసిద్ధికల పరాక్రమవంతుడైన నాకుమారుడు మహాతేజస్వి. వాడు ఏ రాక్షసునీ విడిచిపెట్టడు. వాడిద్వారా ఆహారం పంపితే నిశ్చింతగా తిరిగి వస్తాడు. ఇదివరలో వాడిచేతుల్లో ఎందరో రాక్షసులు మరణించారు. ఈవిషయం మీరు రహస్యంగా ఉంచుతానని వాగ్దానం చెయ్యండి. లేకపోతే ఈప్రజలందరూ మంత్రోపాసనంకోసం మమ్మల్ని వేధిస్తారు. గురువుల ఆజ్ఞ లేకుండా వా రామంత్రాలను ఉపదేశిస్తే మళ్ళీ ఆశక్తి వీరికుండదు—అన విని విప్రుడు ఆమెమాటలు అమృతతుల్యంగా భావించాడు. వారందరూ పరమానందభరితులయారు. కుంతి భీముని చేరి చెయ్యవలసిన పని చెప్పింది. భీముడు అమితానందంతో అంగీకరించాడు.

160 వ అధ్యాయము సమాప్తం

## నూట అరువది ఒకటవఅధ్యాయము

భిక్షాటనం పూర్తిచేసికొని వచ్చిన ధర్మరాజు భీముని ముఖంలో ఉత్సాహాతిశయం చూసి కొద్దిగా ఆలోచనలో పడ్డాడు. ఈరోజున భీము డేదో ఘనకార్యం చేయనున్నాడని నిశ్చయించుకున్నాడు.

నెమ్మదిగా కుంతిని చేరాడు. ఏకాంతంలో ఉన్న కుంతిని ఉద్దేశించి— అమ్మా! ఈనాడు భీమసేనుడు పరమానందంతో ఉన్నాడు. కారణం తెలీటంలేదు. మీ రేమయినా ఆజ్ఞాపించారా? వీడే ఏ ఘనకార్యమైనా చెయ్యబోతున్నాడా— అని ప్రశ్నించగా—భీముడు తన ఆజ్ఞానుసారమే ఈనాడు మహత్కార్యసాధనకు ఉపక్రమించాడనీ, అందువల్ల తాము ఉండే గృహయజమానికే కాక ఆ నగ

అస్మిన్నుపస్థితే కాలే తరధ్వం ప్లవవన్మయా.
ఇహ వా తారయేద్దుర్గాదుత వా ప్రేత్య భారత
సర్వథా తారయేత్పుత్రః పుత్ర ఇత్యుచ్యతే బుధైః.
ఆకాంక్షంతే చ దౌహిత్రానపి నిత్యం పితామహాః
తత్స్వయం వై పరిత్రాస్యే రక్షంతీ జీవితం పితుః.
భ్రాతా చ మమ బాలోఽయం గతే లోకమముం త్వయి
అచిరేణైవ కాలేన వినశ్యేత న సంశయః.
తాతేఽపి హి గతే స్వర్గం వినష్టే చ మమానుజే
పిండః పితౄణాం వ్యుచ్ఛిద్యేత్ తత్ తేషాం విప్రియం భవేత్.
పిత్రా త్యక్తా తథా మాత్రా భ్రాత్రా చాహమసంశయం
దుఃఖాద్ దుఃఖతరం ప్రాప్య మ్రియేయమతథోచితా.
త్వయి త్వరోగే నిర్ముక్తే మాతా భ్రాతా చ మే శిశుః
సంతానశ్చైవ పిండశ్చ ప్రతిష్ఠాస్యత్యసంశయం.
ఆత్మా పుత్రః సఖా భార్యా కృచ్ఛ్రం తు దుహితా కిల
స కృచ్ఛ్రాన్మోచయాత్మానం మాం చ ధర్మే నియోజయ.
అనాథా కృపణా బాలా యత్ర క్వచనగామినీ
భవిష్యామి త్వయా తాత విహీనా కృపణా సదా
అథవాహం కరిష్యామి కులస్యాస్య విమోచనం
ఫలసంస్థా భవిష్యామి కృత్వా కర్మ సుదుష్కరం.
అథవా యాస్యసే తత్ర త్యక్త్వా మాం ద్విజసత్తమ
పీడితాహం భవిష్యామి తదవేక్షస్వ మామపి.
తదస్మదర్థం ధర్మార్థం ప్రసవార్థం చ సత్తమ
ఆత్మానం పరిరక్షస్వ త్యక్తవ్యాం మాం చ సంత్యజ.
అవశ్యకరణీయే చ మా త్వాం కాలోఽత్యగాదయం
కిం త్వతః పరమం దుఃఖం యద్వయం స్వర్గతే త్వయి.
యాచమానాః పరాదన్నం పరిధావేమహి శ్వవత్
త్వయి త్వరోగే నిర్ముక్తే క్లేశాదస్మాత్ సబాంధవే.
అమృతే వసతీ లోకే భవిష్యామి సుఖాన్వితా
ఇతః ప్రదానే దేవాశ్చ పితరశ్చేతి నః శ్రుతం.
త్వయా దత్తేన తోయేన భవిష్యంతి హితాయ వై
ఏవం బహువిధం తస్యా నిశమ్య పరిదేవితం.
పితా మాతా చ సా చైవ కన్యా ప్రరురుదుస్త్రయః
తతః ప్రరుదితాన్ సర్వాన్ నిశమ్యాథ సుతస్తదా.
ఉత్ఫుల్లనయనో బాలః కలమవ్యక్తమబ్రవీత్
మా పితా రుద మా మాతర్మా స్వసస్త్వితి చాబ్రవీత్.
ప్రహసన్నివ సర్వాంస్తానేకైకమనుసర్పతి
తతః స తృణమాదాయ ప్రహృష్టః పునరబ్రవీత్.
అనేనాహం హనిష్యామి రాక్షసం పురుషాదకం
తథాపి తేషాం దుఃఖేన పరీతానాం నిశమ్య తత్.
బాలస్య వాక్యమవ్యక్తం హర్షః సమభవన్మహాన్
అయం కాల ఇతి జ్ఞాత్వా కుంతీ సముపసృత్య తాన్
గతాసూనమృతేనేవ జీవయంతీదమబ్రవీత్.

158 వ అధ్యాయం సమాప్తం

## నూట ఏబది తొమ్మిదవ అధ్యాయము

కుతోమూలమిదం దుఃఖం జ్ఞాతుమిచ్ఛామి తత్త్వతః
విదిత్వాప్యపకర్షేయం శక్యం చేదపకర్షితుం.
ఉపపన్నం సతామేతద్యద్ బ్రవీషి తపోధనే
న తు దుఃఖమిదం శక్యం మానుషేణ వ్యపోహితుం.
సమీపే నగరస్యాస్య బకో వసతి రాక్షసః
పితోగవ్యూతిమాత్రేఽస్తి యమునాగహ్వరే గుహా.
తస్యాం ఘోరః స వసతి జిఘాంసుః పురుషాదకః
ఈశో జనపదస్యాస్య పురస్య చ మహాబలః.

రాసికే విపత్తు తొలగుతుందనీ—అన్నది కుంతీదేవి. గతగాథ వివరించటంతో ధర్మరాజు హృదయం బాధాకులమైపోయింది—అమ్మా! ఈ భూమిమీద ఎవరయినా ఇతరులకోసం తమ పుత్రులను బలి ఇస్తారా. ఈరోజున మీరు ఇటువంటి ఆలోచనతో ఉన్నారేమిటి. ఇహపరాలకు విరుద్ధమైన కార్యానికి మీరు సంకల్పించారు.

వీడి బలపరాక్రమాలు నమ్మిగదా మనం గుండెలపై చేతులుంచుకొని నిద్రపోగలుగుతున్నాం. వీడి ధైర్యసాహసాల అండతోనే మనం రాజ్యం సాధించగలమని మీరెరుగుదురు. వీడి భుజబలానికి భయపడికదా శకుని దుర్యోధనాదులు సుఖంగా నిద్ర కూడా పోవటంలేదు. ఈ మహావీరుడే లేకపోతే లాక్షాగృహాన్నుంచి మనకు విముక్తి లేదు. ఇటువంటి ప్రమాదాలెన్నో వీడివల్ల వైదొలగుతున్నాయి. ఇవన్నీ మీకు తెలీనివికావు. అయినా ఈ దుఃఖపరంపరల మీ మనస్సు వికలమై ఇటువంటి అకార్యానికి ప్రోత్సహించలేదు కదా— అని ధర్మరాజు సోదరవాత్సల్యంతో పలికాడు.

నాయనా! నామనస్సు దుర్బలస్థితిలో ఉండి నేనీసాహసం చెయ్యలేదు. మనం వీరి గృహంలో సుఖంగా ఉంటున్నాం. మనవార్తలేమీ హస్తినాపురంలోని దుర్యోధనాదులకు తెలియటంలేదు. ఇక్కడ మనం మన క్లేశాలన్నీ మరచిపోయి హాయిగా ఉంటున్నాం. ఈ ఋణవిముక్తికి నాకు ఒక్కటే ఉపాయం గోచరించింది.

ఉపకారికి ప్రత్యుపకారం అధికంగా చేసేవారే ఉత్తమపురుషులు. అది సాధుజనుల విధి. ఈసమయంలో నేను లాక్షాగృహవిషయం హిడింబాసురసంహార విషయం మరచిపోలేదు. వాడు పదివేల ఏనుగుల బలం కలవాడనికూడా ఎరుగుదును. గజబలులైన మిమ్మల్నందర్నీ వాడు మోసికొని వచ్చాడు. వాడి బలానికి ఎదురు నిలవగలశక్తి ఇంద్రునికే లేదు.

వాడు నెలగుడ్డుగా ఉన్నరోజులలో నా చంకలోంచి జారి పడిపోయినప్పుడు క్రిందనున్న బండరాళ్ళన్నీ చూర్ణమయాయి. ఆ ఒక్కటే చాలు వాడి బలం తెలుసుకోవటానికి, ఇన్ని హేతువులతోనే నేను ఈ విప్రశ్రేష్ఠుని రక్షించడానికి అంగీకరించాను. అంతేకాని ఏదో మోహావేశంవల్ల కలిగిన అజ్ఞానంతో నేనీ సాహసానికి వాణ్ణి ఆజ్ఞాపించలేదు. ధర్మవిధాన నా నిశ్చయం జరిగింది. ఇందువల్ల ప్రత్యుపకార ప్రయోజనమే కాదు; నగరవాసులందరికీ మేలు కలుగుతుంది. అప్పుడూ ధర్మపాలన సాగుతుంది. ఈమహోద్దేశంతో నేను అంగీకరించాను. పైగా బ్రాహ్మణరక్షణ క్షత్రియులకు వేదచోదితమైన విధి. క్షత్రియుడు క్షత్రియుడికి సహకరిస్తే ఇహపరాలలోకీర్తిపొందుతాడు. వైశ్యులకు సాహాయ్యంచేస్తే సర్వలోకవాసులూ ప్రసన్నులౌతారు. శూద్రసంరక్షణం చేసేవాడు ధనధాన్యసమృద్ధి కల రాజవంశంలో ప్రభవిస్తాడు-అని వ్యాసభగవానుడు నాకు ప్రబోధించిన అంశాలు కూడా మనసులో మసలి నేనీపనికి పురికొల్పుతున్నాను.

161 వ అధ్యాయం సమాప్తం.

పుష్టో మానుషమాంసేన దుర్బుద్ధిః పురుషాదకః
తేనేయం పురుషాదేన భక్ష్యమాణా దురాత్మనా.
అనాథా నగరీ నాథం త్రాతారం నాధిగచ్ఛతి
రక్షత్యసురరాణ్నిత్యమిమం జనపదం బలీ.
నగరం చైవ దేశం చ రక్షోబలసమన్వితః
తత్కృతే పరచక్రాచ్చ భూతేభ్యశ్చ ననో భయం.
వేతనంతస్య విహితం శాలివాహస్యభోజనం
మహిషౌ పురుషశ్చైకో యస్తదాదాయ గచ్ఛతి.
ఏకైకశ్చాపి పురుషస్తత్ ప్రయచ్ఛతి భోజనం
స వారో బహుభిర్వర్షైర్భవత్య సుకరో నరైః.
తద్విమోక్షాయ యే కేచి ద్యతంతి పురుషాఃక్వచిత్
సపుత్రదారాంస్తాన్హత్వా తద్రక్షో భక్షయత్యుత.
వేత్రకీయగృహే రాజా నాయం నయమిహాస్థితః
ఉపాయం తం న కురుతే యత్నాదపి స మందధీః.
అనామయం జనస్యాస్య యేన స్యాదద్య శాశ్వతం
ఏతదర్హా వయం నూనం వసామో దుర్బలస్య యే

విషయే నిత్యవాస్తవ్యాః కురాజానముపాశ్రితాః.
బ్రాహ్మణాఃకస్యవక్తవ్యాః కస్యవాచ్ఛందచారిణః
గుణై రేతేహి వత్స్యంతి కామగాః పక్షిణోయథా.
రాజానంప్రథమంవిందేత్ తతోభార్యాంతతోధనం
త్రయస్య సంచయేనాస్య జ్ఞాతీన్ పుత్రాంశ్చ
తారయేత్.

విపరీతం మయా చేదం త్రయం సర్వముపార్జితం
తదిమామాపదం ప్రాప్యభృశం తప్యామహేవయం.
సోఽయమస్మాననుప్రాప్తో వారః కులవినాశనః
భోజనం పురుషశ్చైకః ప్రదేయం వేతనం మయా.
న చ మే విద్యతే విత్తం సంక్రేతుం పురుషం క్వచిత్
సుహృజ్జనం ప్రదాతుం చ న శక్ష్యామి కదాచన.
గతిం చైవ న పశ్యామి తస్మాన్మోక్షాయ రక్షసః
సోఽహందుఃఖార్ణవేమగ్నో మహత్యసుకరేభృశం.
సహైవైతైర్గమిష్యామి బాంధవైరద్య రాక్షసం
తతో నః సహితాన్ క్షుద్రః సర్వానేవోపభోక్ష్యతి.

159వ అధ్యాయం సమాప్తం

## నూట అరువదవఅధ్యాయము

నవిషాదస్త్వయా కార్యో భయాదస్మాత్కథంచన
ఉపాయః పరిదృష్టోఽత్ర తస్మాన్మోక్షాయ రక్షసః.
ఏకస్తవ సుతో బాలః కన్యా చైకా తపస్వినీ
న చైతయోస్తథా పత్న్యా గమనం తవ రోచతే.
మమపంచసుతా బ్రాహ్మంస్తేషామేకో గమిష్యతి
త్వదర్థం బలిమాదాయ తస్యపాపస్య రక్షసః.
నాహమేతత్ కరిష్యామి జీవితార్థీ కథంచన
బ్రాహ్మణస్యాతిథేశ్చైవ స్వార్థే ప్రాణాన్
వియోజయన్.
న త్వేతదకులీనాసు నాధర్మిష్ఠాసు విద్యతే

యద్బ్రాహ్మణార్థం విసృజేదాత్మానమపి చాత్మజం.
ఆత్మనస్తు మయా శ్రేయో బోద్ధవ్యమితి రోచతే
బ్రహ్మవధ్యాఽఽత్మవధ్యా వా శ్రేయానాత్మవధో
మమ.

బ్రహ్మవధ్యా పరం పాపం నిష్కృతిర్నాత్రవిద్యతే
అబుద్ధిపూర్వం కృత్వాపి పరమాత్మవధో మమ.
న త్వహం వధమాకాంక్షే స్వయమేవాత్మనః శుభే
పరైః కృతే వధే పాపం న కించిన్మయి విద్యతే.
అభిసంధికృతే తస్మిన్ బ్రాహ్మణస్య వధే మయా
నిష్కృతిం న ప్రపశ్యామి నృశంసం క్షుద్రమేవ చ.

అమ్మా! సర్వవిషయాలూ తెలిసిన మీరు సముచిత నిర్ణయమే చేశారు. నిస్సందేహంగా భీమసేనుడు అసురసంహారంచేసి వస్తాడు. మీరు ఈవిప్రశ్రేష్ఠునియందు చూపిన అనుగ్రహం మాకు కూడా ఆనందదాయకంగా ఉంది. అయితే ఈవిషయం ఎవరికీ తెలియనివ్వరాదని ఆ బ్రాహ్మణునితో చెప్పాలి— అని ధర్మరాజు అనిన అనంతరం కుంతీదేవి లోపలకు వెళ్ళింది. పితృసముడైన జ్యేష్ఠుని అనుమతి పొందేవరకూ కుంతి వారిని సంపూర్ణంగా ఆశ్వాసించలేకపోయింది. అప్పుడు వెళ్ళి వారినందరినీ ఓదార్చింది. రాత్రి పొద్దు సాగిసాగి అర్ధరాత్రి సమీపించింది

భీమసేనుడు సంతోషంతో భోజనసామగ్రితో బండిమీద బయలుదేరాడు. బండి రాక్షసనివాస సమీపానికి చేరింది. బండి ఆపి భీముడు ఆరగించడం మొదలుపెట్టాడు. నెమ్మదిగా పదార్థాలునిండ గొంతుకూ రాక్షసుణ్ణి పిలవసాగాడు. వాని పిలుపు విని రాక్షసుడు తీవ్రక్రోధంతో వచ్చాడు. తీవ్రవేగంతో వచ్చే క్రోధారుణనయనుడైన విశాలకాయుని రక్తకేశాలూ శంఖంలా మొనదేరిన చెవులూ ముడివడ్డ భృకుటీ చూశాడు భీముడు. వాడు పెటపెట గీటుతున్నాడు పండ్లు. పెదవులు పంటితో కొరుకుతూ—నాకోసం సిద్ధమైన అన్నాన్ని తినే ఈప్రాణి యముని సన్నిధికి పోవలనుకుంటున్నాడు— అని అరిచాడు. ఆ కేకవిని భీముడు వికటంగా నవ్వి తనపని తాను చూసుకుంటున్నాడు. దానితో వాడిక్రోధం మిన్ను ముట్టింది. ఒక్కసారిగా భీముణ్ణి చంపివేయాలనే సంకల్పంతో రెండు చేతులూ పైకి పెట్టి భీమునిమీదికినడిచాడు. అంత జరుగుతున్నా భీముడు నిర్లక్ష్యంగా భోజనం చేస్తూనే ఉన్నాడు. బకాసురుని కోపం మరీ హెచ్చింది. వెడుతూనే రెండుచేతులతో భీముని వీపుమీద దట్టించాడు. అయినా భీముడు పర్వతంలా ఉండి తన ఆకలి తీర్చుకొంటున్నాడు. బకాసురుడు అటూ యిటూ చూసి ఓ చెట్టు పెరికి భీమునిమీద విసరబోయాడు. అప్పటికి భీముడు భోజనం పూర్తిచేసి ఆచమించి ప్రక్షాళనం చేసి క్రిందికి దిగి ఓ చెట్టు పీకాడు.

భీమ బకాసుర సంగ్రామంలో పరిసర ప్రదేశమంతా సమతలమైపోయింది. అందు బాటులో చెట్టులేక బకాసురుడు భీముని మీదపడి రెండు చేతులమధ్యా బిగించాడు. భీముడుకూడా అలానే బంధించి రెండుసార్లు విదిలించాడు. ఆపట్టుకు బకాసురుడు గిలగిల్లాడాడు. భీముడు గుంజటంలో బకుడు అలసిపోయాడు. ఊపిరి సలపక ఉక్కిరిబిక్కిరయాడు. వారి అహంకృతిధ్వనులూ వారి పదఘట్టనాలూ భూమినే కంపింపజేస్తున్నాయి. కాలయాపనకు ఇష్టపడక భీముడు బకుని నేలమీద పడేసి మోకాలితో పొడుస్తూ రెండుసార్లు ఎత్తి నేలమీద కొట్టాడు. ఆ దెబ్బలతో బకాసురుని నోటినుండి రక్తం వరదలుగా పారసాగింది. వాడు గిలగిల కొట్టుకుంటూ భయంకరంగా గర్జిస్తున్నాడు.

162 వ అధ్యాయం సమాప్తం

పరాక్రమసంపన్నుడైన భీమసేనుని మోకాలి పోట్లతో బకాసురుని ఎముకలు చూర్ణమయాయి. ఆరాక్షసుడు భీకరంగా గర్జిస్తూ మరణించాడు. వాని ఆర్తనాదం విని మిగిలిన రాక్షసులందరూ పరిచారకులతో అక్కడకు చేరారు. వారందరూ భయకంపితులై నిశ్చేష్టులయిపోయారు. భీముడు జాలిపడి - ఓ రాక్షసులారా ఈరోజు మొదలుగా మీరెవ్వరూ ఈ జనపదాలలోని మానవులను సంహరించరాదు. అలా ఎవడయినా చరిస్తే వాడు కూడా బకాసురుని దారినే వెడతాడు - అని శాసించాడు.

భీముని శాసనం వారు తలలువంచే స్వీకరించి తరలిపోయారు. భీముడు అమితోత్సాహంతో బకాసురుని కళేబరం భుజంమీద వేసికొని తెచ్చి నగరబహిర్ద్వారంలో పారేశాడు. అనంతరం ఎవరికీ కనిపించకుండా గృహం చేరాడు. రాక్షసులందరూ భయపడి ఆ వనం వదలి పోయారు.

ఇల్లుచేరి భీముడు బకాసురుని హతమార్చిన వృత్తాంతం యథాతథంగా ధర్మరాజుకి నివేదించాడు.

తూర్పుదిక్కులో ఉషోరాగాలువిహరిస్తున్నాయి.

ఏకచక్రపురవాసులు నిద్రలేచి నగరం వెలుపలికి వచ్చేసరికి రక్తసిక్తాంగుడై బకాసురుడు కనిపించాడు. వాడి కళేబరం చూసి ప్రజలందరూ భయపడిపోయారు. వచ్చినవారు తిరిగి నగరంలోకి వెళ్ళి సంతోషంతో ఆవార్త ప్రసారం చేశారు. బకాసురుని మరణవార్త నగరమంతా వ్యాపించింది. ఆబాలగోపాలం కదిలారు. నగరమే కదలివచ్చింది ఆరాక్షసుని చూడటానికి వారందరూ సంతోషాశ్చర్యాలతో చూశారు. ఇళ్ళకు పోయి దేవతాపూజలు చేసికొని సంతోషించారు.

ఈవిపత్తు తొలగించిన పుణ్యపురుషు డెవరా అని ఆలోచించారు. నిన్నటిరోజు ఎవరివంతో ఊహించి ఆబ్రాహ్మణుని ఇంటికిచేరి వానిని పదే పదే ప్రశ్నించారు. ఆ బ్రాహ్మణుడు చాలాసేపు సమాధానం ఇవ్వలేదు. ఏదో ఒకటి చెపితేకాని ప్రజలు కదిలేటట్లులేరు. అందుచేత ఆ బ్రాహ్మణుడు—నియమానుసారం నిన్న నావంతు వచ్చింది. నేను ఈ విపత్తు దాటేఉపాయం లేక విచారిస్తున్నాను- నా అదృష్టదేవతలా ఓ విప్రుడు వచ్చాడు. ఆయన మంత్రసిద్ధుడు. ఆయన నన్ను చూస్తూనే విచారకారణం అడిగాడు. నేను వివరంగా చెప్పాను. ఆయన తన శక్తిని ప్రకటించి చిరునవ్వుతో — మీరు విచారించకండి. ఈ రోజున నేనే ఆహారం తీసికొని వెడతాను. మీరు నాగురించి భయపడకండి — అని బండితోలుకొని వెళ్ళాడు. ఆయనే మననగరానికి ఈ ముప్పు తప్పించి ఉండాలి— అనగా వారందరూ పరమాశ్చర్యం పొందారు.

ఆ సంతోషంతో నగరవిప్రులందరూ మహోత్సవం సాగించారు. ఆఉత్సవానికి నాగరకులందరూ కౌతుకంతో వచ్చారు. పాండవులు యథాపూర్వంగా అక్కడే నివసిస్తున్నారు.

163 వ అధ్యాయం సమాప్తం.

బకవధపర్వము సమాప్తం

దృష్ట్వాభీమస్యవిక్రాన్తంతదాజతుగృహేమహత్.
హిడింబస్య వధాచ్చైవం విశ్వాసో మే వృకోదరే
బాహ్వోర్బలంహిభీమస్యనాగాయుతసమంమహత్.
యేన యూయం గజప్రఖ్యా నిర్వ్యూఢా వారణావతాత్
వృకోదరేణ సదృశో బలేనాన్యో న విద్యతే.
యోఽభ్యుదీయాద్యుధి(శ్రేష్ఠమపివజ్రధరంస్వయం
జాతమాత్రఃపురాచైవ మమాంకాత్ పతితో గిరౌ.
శరీర గౌరవాదస్య శిలా గాత్రైర్విచూర్ణితా
తదహం ప్రజ్ఞయా జ్ఞాత్వా బలం భీమస్య పాండవ.
ప్రతికార్యే చ విప్రస్య తతః కృతవతీ మతిం
నేదం లోభాన్న చ మోహా ద్వి[illegible]శ్చితం.
బుద్ధిపూర్వం తు ధర్మస్య వ్యవసాయః కృతో మయా
అర్థా ద్వావపి నిష్పన్నౌ యుధిష్ఠిర భవిష్యతః.
ప్రతీకారశ్చ వాసస్య ధర్మశ్చ చరితో మహాన్
యో బ్రాహ్మణస్య కుర్యాదర్థే కర్హిచిత్.
క్షత్రియః స శుభాల్లోకానాప్నుయాదితి మే మతిః
క్షత్రియస్యైవ కుర్వాణః క్షత్రియో వధమోక్షణం.
విపులాం కీర్తిమాప్నోతి లోకేఽస్మించ పరత్ర చ
వైశ్యస్యార్థేచనాహాయ్యంకుర్వాణఃక్షత్రియోభువి
స సర్వేష్వపి లోకేషు ప్రజా రంజయతే ధ్రువం
శూద్రం తు మోచయే ద్రాజా శరణార్థినమాగతం.
ప్రాప్నోతీహ కులే జన్మ సద్ద్రవ్యే రాజపూజితే
ఏవం మాం భగవాన్ వ్యాసః పురాపౌరవనందన.
ప్రోవాచాసుకరప్రజ్ఞ స్తస్మాదేవం చికీర్షితం.

161 వ అధ్యాయంసమాప్తం

## నూట అరువది రెండవఅధ్యాయము

ఉపపన్నమిదం మాత స్త్వయా య ద్బుద్ధిపూర్వకం
ఆర్తస్య బ్రాహ్మణస్యైతదనుక్రోశాదిదం కృతం.
ధ్రువమేష్యతి భీమోఽయం నిహత్య పురుషాదకం
సర్వథా బ్రాహ్మణస్యార్థే యదనుక్రోశవత్యసి.
యథా త్విదం న విన్దేయుర్నరా నగరవాసినః
తథాయం బ్రాహ్మణో వాచ్యః పరిగ్రాహ్యశ్చ యత్నతః.
యుధిష్ఠిరేణ సమ్మన్త్ర్య బ్రాహ్మణార్థమరిన్దమ
కున్తీప్రవిశ్యతాన్‌సర్వాన్‌సాన్త్వయామాసభారత.
తతో రాత్ర్యాం వ్యతీతాయామన్నమాదాయ పాండవః
భీమసేనో యయౌ తత్ర యత్రాసౌ పురుషాదకః.
ఆసాద్య తు వనం తస్య రక్షసః పాండవో బలీ
ఆజుహావ తతో నామ్నా తదన్నముపపాదయన్.
తతః స రాక్షసః క్రుద్ధో భీమస్య వచనా త్తదా
ఆజగామ సుసంక్రుద్ధో యత్ర భీమో వ్యవస్థితః.
మహాకాయో మహావేగో దారయన్నివ మేదినీం
లోహితాక్షః కరాళశ్చ లోహితశ్మశ్రుమూర్ధజః.
ఆకర్ణా ద్భిన్నవక్త్రశ్చ శంకుకర్ణో విభీషణః
త్రిశిఖాం భ్రుకుటిం కృత్వా సందశ్య దశనచ్ఛదం.
భుంజానమన్నం తం దృష్ట్వా భీమసేనం స రాక్షసః
వివృత్య నయనే క్రుద్ధ ఇదం వచనమబ్రవీత్.
కోఽయమన్నమిదం భుఙ్క్తే మదర్థముపకల్పితం
పశ్యతో మమ దుర్బుద్ధిర్యియాసుర్యమసాదనం.
భీమసేన స్తతః శ్రుత్వా ప్రహసన్నివ భారత
రాక్షసం తమనాదృత్య భుఙ్క్త ఏవ పరాఙ్ముఖః.
రవం స భైరవం కృత్వా సముద్యమ్య కరావుభౌ
అభ్యద్రవ ద్భీమసేనం జిఘాంసుః పురుషాదకః.

# చైత్రరథపర్వము

## నూట అరువది నాల్గవ ధ్యాయము

స్వాధ్యాయనిరతుడూ ఉపనిషత్తత్వప్రియుడూ బ్రహ్మపదార్థాన్వేషణ తత్పరుడూ అయిన ఆ విప్రశ్రేష్ఠుని గృహంలోనే పాండవులు మాతృదేవితో సుఖంగా కాలయాపన చేస్తున్నారు.

చేస్తూండగా ఓనాడు ఆయింటికి మరొక బ్రహ్మవేత్త వచ్చాడు. ఆయన పరమనిష్ఠాగరిష్ఠుడు. ఆతీవ్రనియమపరునికికూడా గృహస్థు ఆతిథ్య మర్యాదలు జరుపుతున్నాడు. నిత్యకర్మరతుడైన ఆ ప్రవరుడు విరామసమయాలలో ప్రసన్న వదనంతో రమణీయమైన కథలు చెపుతూండేవాడు. ఆ కథలను ఆకర్ణించే ఉత్కంఠ పాండవులకు కలిగింది. వారుకూడా వచ్చి ఆయనసమీపంలో కూర్చుని వినేవారు. బహుదేశాటనంచేసి వచ్చిన ఆ బహుశ్రుతిసాంగత్యంకల ధీవిశాలుడు ప్రాంతప్రాంతాల ఆచారాలనూ అందచందాలనూ వివరిస్తూ ఆనాడు పాంచాలదేశం వైపు తనకథ నడిపించాడు.

పాంచాలదేశాధీశుడు యజ్ఞసేనుడు. ఆయన యజ్ఞకుండంనుండి అతిలోకసౌందర్యవతి ద్రౌపదీ అవక్రపరాక్రముడు ధృష్టద్యుమ్నుడూ విచిత్రవ్యక్తి శిఖండీ ప్రభవించారు. ఇప్పుడు ఆ లోకోత్తరసౌందర్యసుషమాంగి స్వయంవరం జరుగబోతున్నది— అని సంక్షిప్తంగానే చెప్పాడు. ఆకథకుని నేర్పు వారి ఉత్కంఠను ప్రదీప్తంచేసింది. ఆకథ సమగ్రంగా వినాలని వారు— మహాభాగా! మీరు అద్భుతమైన విషయం అతి స్వల్పంగా చెప్పారు. యజ్ఞవేదినుండి వారందరూ ఎలా జన్మించారు. అస్త్రవిద్యావిదుడైన ద్రోణుడు ధృష్టద్యుమ్నుని సర్వాస్త్రవిదునిగా చేయడానికి అంగీకరించటంకూడా ఆశ్చర్యంగా ఉంది. ద్రుపద ద్రోణులకు మైత్రి ఎలా కలిగింది. వారిమధ్య విద్వేషం ఎందుకు వచ్చింది— అని కోరగా ఆ మహాకథకుడు ద్రౌపదీ జన్మవృత్తాంతం వివరిస్తున్నాడు.

### ద్రుపద — ద్రోణులు

పరమతపస్సంపన్నుడైన భరద్వాజమహర్షి పవిత్రగంగానదీతటాన ఆశ్రమం నిర్మించుకొని నివసించేవాడు. ఆయన కఠోరవ్రతపరాయణుడు. ఆమహర్షి నదిలో స్నానంచేయడానికి వెళుతున్నాడు. అప్పటికే ఘృతాచి స్నానంచేసి ఒడ్డుమీద నిలిచి బట్ట కట్టుకొంటున్నది. ఆ సమయంలో వీచిన గాలికి ఆమె శరీరంమీద వస్త్రం తొలగిపోయింది. నగ్నంగాఉన్న ఘృతాచి మహర్షి మనసులో మదనవికారం కలిగించింది. బ్రహ్మచర్యవ్రతుడైన భరద్వాజుని ఆ క్షణంలోనే వీర్యస్ఖలనమైంది. ఆ అమోఘవీర్యాన్ని కుండలో ఉంచాడు. ఆకుంభంనుండి వేదవేదాంగవిదుడైన ద్రోణుడు జన్మించాడు.

పాంచాల దేశాధిపతి పృషతుడు భరద్వాజుని మిత్రుడు. ఆపృషతుని కుమారుడు ద్రుపదుడు. ద్రుపదుడు అనుదినం భరద్వాజాశ్రమానికి వెళ్ళి ద్రోణునితో ఆడుకొనేవాడు. విద్యకూడా వారిరువురూ ఒకేగురువువద్ద అభ్యసించారు.

పృషతుడు మరణించాడు. ద్రుపదుడు రాజయాడు. ఇలా జరుగుతున్నవి రోజులు. ఆ రోజులలో పరశురాముడు తన సర్వస్వం దానం

తథాపి పరిభూయైనం ప్రేక్షమాణో వృకోదరః
రాక్షసం భుక్త ఏవాన్నం పాండవః పరవీరహా.
అమర్షేణ తు సంపూర్ణః కుంతీపుత్రం వృకోదరం
జఘానపృష్ఠే పాణిభ్యాముభాభ్యాం పృష్ఠతః స్థితః
తథా బలవతా భీమః పాణిభ్యాం భృశమాహతః
నైవావలోకయామాస రాక్షసం భుక్త ఏవ సః.
తతః స భూయః సంక్రుద్ధో వృక్షమాదాయ రాక్షసః
తాడయిష్యంస్తదా భీమం పునరభ్యద్రవ ద్బలీ.
తతో భీమః శనైర్భుక్త్వా తదన్నం పురుషర్షభః
వార్యుపస్పృశ్య సంహృష్ట స్తస్థౌ యుధి మహా బలః.
క్షిప్తం క్రుద్ధేన తం వృక్షం ప్రతిజగ్రాహ వీర్యవాన్
సవ్యేన పాణినా భీమః ప్రహసన్నివ భారత.
తతః స పునరుద్యమ్య వృక్షాన్ బహువిధాన్ బలీ
ప్రాహిణోద్భీమసేనాయ తస్మై భీమశ్చ పాండవః
త ద్వృక్షయుద్ధమభవన్మహీరుహవినాశనం
ఘోరరూపం మహారాజ నరరాక్షసరాజయోః.
నామ విశ్రావ్య తు బకః సమభిద్రుత్య పాండవం
భుజాభ్యాం పరిజగ్రాహ భీమసేనం మహాబలం.
భీమసేనోఽపి త ద్రక్షః పరిరభ్య మహాభుజః
విస్ఫురన్తం మహాబాహుం వివకర్ష బలాద్బలీ.
స కృష్యమాణో భీమేన కర్షమాణశ్చ పాండవం
సమయుజ్యత తీవ్రేణ క్లమేన పురుషాదకః.
తయోర్వేగేన మహతా పృథివీ సమకమ్పత
పాదపాంశ్చ మహాకాయాంశ్చూర్ణయామాస తుస్తదా.
హీయమానం తు త ద్రక్షః సమీక్ష్య పురుషాదకం
నిష్పిష్య భూమావాజానుభ్యాం సమాజఘ్నే వృకోదరః.
తతోఽస్య జానునా పృష్ఠమవపీడ్య బలాదివ
బాహునా పరిజగ్రాహ దక్షిణేన శిరోధరాం.
సవ్యేన చ కటీదేశే గృహ్యా వాససి పాండవః
తద్రక్షో ద్విగుణం చక్రే రువన్తం భైరవం రవం.
తతోఽస్య రుధిరం వక్త్రాత్ ప్రాదురాసీద్విశాంపతే
భజ్యమానస్య భీమేన తస్య ఘోరస్య రక్షసః

162 వ అధ్యాయం సమాప్తం.

## నూట అరువది మూడవ అధ్యాయము

తతః స భగ్నపార్శ్వాంగో నదిత్వా భైరవం రవం
శైలరాజప్రతీకాశో గతాసురభవ ద్బకః.
తేన శబ్దేన విత్రస్తో జనస్తస్యాథరక్షసః
నిష్పపాత గృహా ద్రాజన్ సహైవ పరిచారిభిః.
తాన్ భీతాన్ విగతజ్ఞానాన్ భీమః ప్రహరతాంవరః
సాన్త్వయామాస బలవాన్ సమయేచన్యవేశయత్.
నహింస్యామానుషాభూయో యుష్మాభిరితికర్హిచిత్
హింసతాం హి వధః శీఘ్రమేవమేవ భవేదితి.
తస్య తద్వచనం శ్రుత్వా తాని రక్షాంసి భారత
ఏవమస్త్వితి తం ప్రాహుర్జగృహుః సమయం చ తం.
తతః ప్రభృతి రక్షాంసి తత్ర సౌమ్యాని భారత
నగరే ప్రత్యదృశ్యన్త నరై ర్నగరవాసిభిః.
తతో భీమ స్తమాదాయ గతాసుం పురుషాదకం
ద్వారదేశే వినిక్షిప్య జగామానుపలక్షితః.
దృష్ట్వా భీమబలోద్భూతం బకం వినిహతం తదా
జ్ఞాతయోఽస్య భయోద్విగ్నాః ప్రతిజగ్ము స్తత స్తతః.
తతః స భీమ స్తం హత్వా గత్వా బ్రాహ్మణవేశ్మతత్
ఆచచక్షే యథావృత్తం రాజ్ఞః సర్వ మశేషతః.

చేసి తపోభూమికిపోనున్నాడని విన్నాడు ద్రోణుడు. ద్రోణుడు పరశురాముని సమీపించి కులగోత్రాలు చెప్పికొని ధనంకోసం వచ్చానన్నాడు. అది విన్న పరశురాముడు తన సంపదలన్నీ ఇదివరకే యిచ్చేశానని తన శరీరమూ విలువిద్యా ఉన్నాయనీఅంటే అస్త్రవిద్యారహస్యాలు ప్రయోగోపసంహారాలతో చెప్పనున్నాడు. పరశురాముడు అనుగ్రహించాడు. బ్రహ్మాస్త్రంకూడా అయనవద్ద తెలిసికొని ద్రోణుడు ప్రముఖపురుషుడయాడు.

అక్కడనుంచి బయలుదేరి పాంచాలదేశం చేరి ద్రుపదునికి బాల్యస్నేహం ఎరిగించాడు. ద్రుపదుడు సామాన్యబ్రాహ్మణునితో చక్రవర్తికి స్నేహం అసంభవమని అవమానపూర్వకంగా హేళన చేశాడు.

ద్రుపదునిమీద క్రోధం కలిగింది. ప్రతీకారదృష్టితో ద్రోణుడు హస్తినాపురం చేరాడు. హస్తిపురి కౌరవరాజధాని. ఆ ప్రతిభాసంపన్నుని సముచితంగా సత్కరించి భీష్మాచార్యులు తన మనుమలకు విలువిద్య నేర్పించేవాడు. ఆయన శిష్యులలో ప్రముఖులు పాండవులు. వారందరినీ ఆరితేరినవారుగా చేసి ద్రోణుడు గురుదక్షిణకోసం ప్రతిజ్ఞ తీసికొని ద్రుపదుని జయించి ఆ రాజ్యం తన కర్పించమన్నాడు.

ద్రోణాచార్యుని శిష్యులందరూ పాంచాలరాజధానీనగరం అహిచ్ఛత్రపురం చేరారు. కర్ణదుర్యోధనాది వీరులందరూ ద్రుపదుని ముందు నిలవలేక వెనుదిరిగివచ్చారు. అప్పుడు పాండవులు వెళ్ళి ద్రుపదునీ మంత్రులనూ బంధించి తెచ్చి ద్రోణుని ముందుంచారు. ఆ సమయంలో అర్జునుని పరాక్రమం చూసి పాంచాలవీరులందరూ విస్మితులయి ఇంతటి వీరుడుండబోడని వారిలో వారు చెప్పుకోసాగారు.

ద్రుపదుడు తనకాళ్ళముందుపడిఉండడంచూసిన ద్రోణునికి హృదయం ద్రవించింది. బాల్యస్నేహం మసలింది. ఇప్పుడైనా తాను మైత్రినే అపేక్షిస్తున్నానని రాజరికం లేనివాడు రాజమైత్రి పొందలేడు కనక పాంచాలంలో గంగకు ఉత్తరభూమి తన ఆధిపత్యం క్రింద ఉంటుందనీ చెప్పి వదిలాడు. ద్రుపదుడుకూడా ద్రోణుని నియమాలకు సమ్మతించి బాల్యమైత్రిని పునరుద్ధరించుకోవడానికి అంగీకరించాడు. అప్రకారంగా వారిద్దరూ ఆలింగనం చేసికొని యథాస్థానాలు చేరుకున్నారు.

ద్రుపదుడు పరిస్థితులకు లొంగి అంగీకరించినా అతని మనసులో ఆఅవమానం అగ్నిలా దహిస్తూనే ఉంది. హృదయం పరాభవ దుఃఖంతో శుష్కిస్తున్నది.

## ధృష్టద్యుమ్నుడు

ద్రుపదుని మనస్సు ద్రోణునిపై ద్వేషంతో రగులుకుంటూన్నది. ప్రతీకారకోసం ఆలోచన ఆరంభించాడు. సర్వకార్యవిదులయిన బ్రాహ్మణులకోసం అన్వేషణ ఆరంభించాడు. ద్రుపదుని మనస్సు బలిష్ఠుడైన పుత్రుని కోరుతున్నది.

ఆ దుఃఖంతో ద్రుపదుడు మంత్రి సోదర బాంధవులందరి మీదా చిరాకుపడేవాడు. ఒక్కోసారి మరీ పరుషంగా పలికేవాడు. ప్రతీకారానలజ్వాలాధూమం దీర్ఘంగా నిట్టూర్చేవాడు. ద్రోణుని విద్యావినయవివేకశక్తులు పరిశీలించేసరికి ద్రుపదునికి మార్గం దొరకలేదు. క్షాత్రంతో జయించలేనని నిశ్చయించుకున్నాడు.

గంగాయమునానదీతీరాల విహరిస్తూ ఒకఅగ్రహారం చేరాడు. ఆ అగ్రహారం అంతటా వేద

తత్రో నరా వినిష్క్రాన్తా నగరాత్కల్యమేవ తు
దదృశుర్నిహతం భూమౌ రాక్షసం రుధిరోక్షితం.
తమద్రికూటసదృశం వినిర్భిన్నం భయానకం
దృష్ట్వాసంహృష్టరోమాణో బభూవు స్తత్రనాగరాః.
ఏకచక్రాం తతో గత్వా ప్రవృత్తిం ప్రదదుః పురే
తతః సహస్రశో రాజన్ నరా నగరవాసినః.
తత్రాజగ్ముర్బకం ద్రష్టుం సస్త్రీవృద్ధకుమారకాః
తత స్తే విస్మితాః సర్వే కర్మ దృష్ట్వాతిమానుషం
దైవతాన్యర్చయాంచక్రుః సర్వ ఏవ విశాంపతే.
తతః ప్రగణయామాసుః కస్య వారోఽద్య భోజనే
జ్ఞాత్వా చాగమ్య తం విప్రంపప్రచ్ఛుఃసర్వ ఏవతే.
ఏవం పృష్టః స బహుశో రక్షమాణశ్చ పాండవాన్
ఉవాచ నాగరాన్ సర్వానిదం విప్రర్షభ స్తదా.

ఆజ్ఞాపితం మామశనే రుదన్తం సహ బంధుభిః
దదర్శ బ్రాహ్మణః కశ్చిన్మన్త్రసిద్ధో మహామనాః.
పరిపృచ్ఛ్య స మాం పూర్వం పరిక్లేశం పురస్య చ
అబ్రవీ ద్బ్రాహ్మణశ్రేష్ఠో విశ్వాస్య ప్రహసన్నివ.
ప్రాపయిష్యామ్యహం తస్మా అన్నమేత ద్దురాత్మనే
మన్నిమిత్తంభయం చాపి న కార్యమితి చాబ్రవీత్.
స తదన్నముపాదాయ గతో బకవనం ప్రతి
తేన నూనం భవేదేతత్ కర్మలోకహితం కృతం.
తత స్తే బ్రాహ్మణాఃసర్వేక్షత్రియాశ్చసువిస్మితాః
వైశ్యాఃశూద్రాశ్చముదితాశ్చక్రుర్బ్రహమహంతదా
తతో జానపదాః సర్వే ఆజగ్ముర్నగరం ప్రతి
తదద్భుతతమం ద్రష్టుం పార్థా స్తత్రైవ చావసన్.

163 వ అధ్యాయంసమాప్తం

## నూట అరువది నాలుగవ అధ్యాయము

### చైత్రరథ పర్వము

తే తథా పురుషవ్యాఘ్రా నిహత్య బకరాక్షసం
అతఊర్ధ్వం తతో బ్రహ్మన్ కిమకుర్వత పాండవాః.
తత్రైవ న్యవసన్ రాజన్ నిహత్య బకరాక్షసం
అధీయానాః పరం బ్రహ్మ బ్రాహ్మణస్య నివేశనే.
తతః కతిపయాహస్య బ్రాహ్మణః సంశితవ్రతః
ప్రతిశ్రయార్థీ త ద్వేశ్మ బ్రాహ్మణస్య జగామ హ.
స సమ్యక్పూజయిత్వా తం విప్రం విప్రర్షభ స్తదా
దదౌ ప్రతిశ్రయం తస్మై సదా సర్వాతిథివ్రతః.
తత స్తే పాండవాః సర్వే సహ కున్త్యా నరర్షభాః
ఉపాసాంచక్రిరే విప్రం కథయన్తం కథాః శుభాః.
కథయామాస దేశాంశ్చ తీర్థాని సరిత స్తథా
రాజ్ఞశ్చవివిధాశ్చర్యాన్దేశాంశ్చైవపురాణిచ.

స తత్రాకథయ ద్విప్రః కథాన్తే జనమేజయ
పంచాలేష్వద్భుతాకారంయాజ్ఞసేన్యాఃస్వయంవరం
ధృష్టద్యుమ్నస్య చోత్పత్తిముత్పత్తిం చ శిఖండినః
అయోనిజత్వం కృష్ణాయా ద్రుపదస్య మహామఖే.
తదద్భుతతమం శ్రుత్వా లోకే తస్యమహాత్మనః
విస్తరేణైవ పప్రచ్ఛుః కథాన్తే పురుషర్షభాః.
కథం ద్రుపదపుత్రస్య ధృష్టద్యుమ్నస్య పావకాత్
వేదీమధ్యాచ్చ కృష్ణాయాః సంభవః కథమద్భుతః.
కథంద్రోణాన్మహేష్వాసాత్ సర్వాణ్యస్త్రాణ్యశిక్షత
కథం విప్రసఖాయౌతౌ భిన్నౌ కస్యకృతేనవా.
ఏవం తైశ్చోదితో రాజన్ స విప్రః పురుషర్షభైః
కథయామాస తత్ సర్వం ద్రౌపదీసంభవంతదా.

సూర్యుడు ప్రసన్నుడై బ్రహ్మర్షికి స్వాగతం పలికి- మహర్షీ! నువ్వు ఏ సంకల్పంతో ఏ మహోద్దేశంతో వచ్చావో వివరిస్తే నీ అభిలాష తప్పకుండా నెరవేరుస్తాను. నువ్వు తీవ్రవ్రతనియమపరాయణుడివు. నీ మనోఽభీష్టం తప్పకుండా తీరుస్తాను. ఇప్పుడు నువ్వు చేసిన స్తుతి నాకెంతో ఆనందం కలిగించింది. నన్ను ఆరాధించే వారందరూ ఈ స్తుతితో నన్ను జపిస్తారు. నీకు కావలసిన వరం కోరుకో- అన్నాడు.

సూర్యభగవానుడా! తపతి అనే పేరుగల నీకుమార్తె సావిత్రీదేవి చెల్లెలు ఉన్నదే ఆమెను మా మహారాజైన సంవరణునికోసం అర్థించడానికి వచ్చాను. మహాయశస్సంపన్నుడైన సంవరణునికి నీకుమార్తె అనురూపవతి. సంవరణుడు తపతికి యోగ్యుడైన భర్త- అని వసిష్ఠు డనగా సూర్యుడు ప్రసన్నుడై మహర్షిని అభినందించి- బ్రహ్మర్షీ! మీరు ఋషిశ్రేష్ఠులు. సంవరణుడు రాజసింహుడు. తపతి యువతిమండలిలో అనుపమవతి. అందుచేత మీరు కోరినప్పుడు ఆ మహారాజుకి నాకన్యను దానంచేయటంకంటె కోరదగిందిలేదు. అని పలికి తపతిని పిలిచి సంవరణుని గృహిణిగా వసిష్ఠునికి అప్పగించాడు.

బ్రహ్మర్షి సూర్యనందినితో సంవరణుని ఆస్థానానికి వచ్చాడు. సంవరణుడు రాజధానిలో తపతీ ధ్యానంతో చింతలో ఉన్నాడు. అటువంటివాడు మందస్మితంతో దేవకన్యవలె మనోహరాకారంతో వచ్చే తపతిని చూచి పరమానందంతో లేచాడు. ఆకాశవీధినుండి అవతరించే తపతి మెరుపు తీగలా కనిపించింది. మహారాజు దృష్టికి. పన్నెండురాత్రులు తీవ్రక్లేశం అనుభవించినా విశుద్ధాంతఃకరణగల కులగురువు అనుగ్రహంవల్ల సంవరణుడు తపతిని పొంది బ్రహ్మర్షి ఆజ్ఞతో పాణిగ్రహణం చేసికొని గంధర్వాదిదేవయోని సేవితమైన ఆ పర్వతంమీదనే దాంపత్యజీవితం సాగిస్తున్నాడు. వసిష్ఠుడు తిరిగి వెళ్ళిపోయాడు.

ఈకాలంలో రాజ్యవ్యవహారాలన్నీ చక్రవర్తి ఆదేశానుసారం మహామంత్రి సక్రమంగా చూసేవాడు. సంవరణుడు దేవభోగానుభూతులతో కాలం గడుపుతున్నాడు.

అలా పన్నెండు సంవత్సరాలు గడిచాయి.

ఈ పన్నెండేళ్ళూ సంవరణుని రాజ్యంలో వానలులేవు. అనావృష్టి కారణంగా రాజ్యంలో ప్రజలూ ప్రాణికోటీ క్షయమవుతున్నాయి. ఆఖరికి మంచుకూడా పడలేదు. నేలమీద పచ్చికలేదు. ఆకలిబాధపడలేక ప్రజలు రాజ్యం విడిచి పోతున్నారు. ఆకలిదప్పికలు వారిచేత ఎటువంటి ఘాతుకాలయినా చేయిస్తున్నాయి. కన్న సంతానాన్నీ కట్టుకున్న భార్యల్నీ చంపుకుంటున్నారు. దోపిడీలు ప్రబలిపోయాయి. మృతతుల్యులతో నగరం కళావిహీనంగా ఉంది. సమూహాల చూసినా ప్రేతకళ తాండవిస్తోంది. అకస్మాత్తుగా చూస్తే యమలోకమే అనిపిస్తోంది. ఆ దుఃస్థితి తెలిసి వసిష్ఠ మహర్షి తన తపోబలంతో వర్షం కురిపించి బహువర్షాలుగా ప్రవాసం చేస్తూన్న తపతీ సంవరణులను కూడా నగరానికి రప్పించాడు.

సంవరణుడు నగరప్రవేశంచేయటంతో ఇంద్రుడు సకాలంలో వర్షాలు కురిపించసాగాడు. ఆ ప్రభువు పాలనలో ప్రజలందరూ సర్వసుఖభోగాలతో జీవించసాగారు. ఎటుచూచినా కలకలలాడే ముఖాలతో కిలకిల నవ్వులతో నగరం శోభామయంగా

బ్రాహ్మణో మానసః పుత్రో వసిష్ఠోఽరున్ధతీపతిః
తపసా నిర్జితౌ శశ్వదజేయావమరైరపి.
కామక్రోధావుభౌ యస్య చరణౌ సంవవాహతుః
ఇన్ద్రియాణాం వశకరో వసిష్ఠ ఇతి చోచ్యతే.
యస్తు నోచ్ఛేదనం చక్రే కుశికానాముదారధీః
విశ్వామిత్రాపరాధేన ధారయన్ మన్యుముత్తమం.
పుత్రవ్యసనసంతప్తః శక్తిమానప్యశక్తవత్
విశ్వామిత్రవినాశాయ న చక్రే కర్మ దారుణం.
మృతాంశ్చ పునరాహర్తుం శక్తః పుత్రాన్ యమక్షయాత్
కృతాన్తం నాతిచక్రామ వేలామివ మహోదధిః.
యం ప్రాప్య విజితాత్మానం మహాత్మానం నరాధిపాః
ఇక్ష్వాకవో మహీపాలా లేభిరే పృథివీమిమాం.
పురోహితమిమం ప్రాప్య వసిష్ఠమృషిసత్తమం
ఈజిరే క్రతుభిశ్చైవ నృపాస్తే కురునన్దన.
స హి తాన్ యాజయామాస సర్వాన్ నృపతిసత్తమాన్
బ్రహ్మర్షిః పాండవశ్రేష్ఠ బృహస్పతిరివామరాన్.
తస్మాద్ధర్మప్రధానాత్మా వేదధర్మవిదీప్సితః
బ్రాహ్మణో గుణవాన్ కశ్చిత్ పురోధాః ప్రతిదృశ్యతాం.
క్షత్రియేణాభిజాతేన పృథివీం జేతుమిచ్ఛతా
పూర్వం పురోహితః కార్యః పార్థ రాజ్యాభివృద్ధయే.
మహీం జిగీషతా రాజ్ఞా బ్రహ్మ కార్యం పురస్సరం
తస్మాత్పురోహితః కశ్చిద్గుణవాన్ విజితేన్ద్రియః
విద్వాన్ భవతు వో విప్రో ధర్మకామార్థతత్త్వవిత్.

173 వ అధ్యాయము సమాప్తం

## నూట డెబ్బది నాల్గవ అధ్యాయము

కింనిమిత్తమభూద్వైరం విశ్వామిత్రవసిష్ఠయోః
వసతోరాశ్రమే దివ్యే శంస నః సర్వమేవ తత్.
ఇదం వాసిష్ఠమాఖ్యానం పురాణం పరిచక్షతే
పార్థ సర్వేషు లోకేషు యథావత్తన్నిబోధ మే.
కన్యాకుబ్జే మహానాసీత్ పార్థివో భరతర్షభ
గాధీతి విశ్రుతో లోకే కుశికస్యాత్మసంభవః.
తస్య ధర్మాత్మనః పుత్రః సమృద్ధబలవాహనః
విశ్వామిత్ర ఇతి ఖ్యాతో బభూవ రిపుమర్దనః.
స చచార సహామాత్యో మృగయాం గహనే వనే
మృగాన్విధ్యన్ వరాహాంశ్చ రమ్యేషు మరుధన్వసు.
వ్యాయామకర్శితః సోఽథ మృగలిప్సుః పిపాసితః
ఆజగామ నరశ్రేష్ఠ వసిష్ఠస్యాశ్రమం ప్రతి.
తమాగతమభిప్రేక్ష్య వసిష్ఠః శ్రేష్ఠభాగృషిః
విశ్వామిత్రం నరశ్రేష్ఠం ప్రతిజగ్రాహ పూజయా.
పాద్యార్ఘ్యాచమనీయేన స్వాగతేన చ భారత
తథైవ పరిజగ్రాహ వన్యేన హవిషా తదా.
తస్యాథ కామధుగ్ధేనుర్వసిష్ఠస్య మహాత్మనః
ఉక్తా కామాన్ ప్రయచ్ఛేతి సా కామాన్ దుదుహే సదా.
గ్రామ్యారణ్యాశ్చౌషధీశ్చ దుదుహే పయ ఏవ చ
షడ్రసం చామృతనిభం రసాయనమనుత్తమం.
భోజనీయాని పేయాని భక్ష్యాణి వివిధాని చ
లేహ్యాన్యమృతకల్పాని చోష్యాణి చ తథార్జున.
రత్నాని చ మహార్హాణి వాసాంసి వివిధాని చ
తైః కామైః సర్వసంపూర్ణైః పూజితశ్చ మహీపతిః.
సామాత్యః సబలశ్చైవ తుతోష స భృశం తదా

ఉంది. తపతీసహితుడైన సంవరణుడు ఆ రోజుల లోనే ద్వాదశవార్షికయజ్ఞం చేశాడు— అని గంధర్వుడు అర్జునునికి ఉపాఖ్యానం చెప్పి ఆకారణం వల్లనే వారిని తపతీనందనులని పిలిచానన్నాడు.

అర్జునా! తపతీసంవరణుల గర్భశుక్తిముక్తాఫలంగా ఆవిర్భవించిన కుమారుడే కురువు. ఈకురువంశంలో జన్మించిన మీరందరూ కురువంశీయులు. మీ పూర్వీకులలో మహాఖ్యాతిగల పురుమహారాజు ఉండేవాడు. ఆయనపేరుమీద మిమ్మల్ని పౌరవులంటారు. అజామీఢ భరతాదుల వంశం గనక ఆ జ మీ ఢు ల నీ భరతవంశీయులనీకూడా మిమ్మల్ని వ్యవహరిస్తారు. ఇది మీవంశచరిత్ర. పురోహితునివల్ల సంవరణుని మనోఽభీష్టం నెరవేరినట్లే మీరు శ్రేష్ఠుడైన బ్రాహ్మణుని పురోహితునిగా తీసికొని సర్వశుభాలూ పొంది ఈపృథ్విని పాలించండి— అని గంధర్వుడు సాగుతున్నాడు.

172వ అధ్యాయం సమాప్తం.

## నూటడెబ్బది మూడవ అధ్యాయము

గంధర్వుడు చెప్పిన వంశచరిత్రను ఆకర్ణించిన అర్జునుని హృదయం సంతోషాతిశయంతో నిండి పోయింది. అతని ముఖం పూర్ణచంద్రశోభతో ప్రకాశిస్తోంది. కొంతసేపు ఆస్మృతితో ఉండి— సఖా! నువ్వు చెప్పినప్పట్నుంచే నాకు వసిష్ఠుని గురించి సమగ్రంగా తెలిసికోవాలనే కోరిక కలిగింది. ఆ వివరాలు చెప్పు— అన్నాడు.

వసిష్ఠుడు బ్రహ్మమానసపుత్రుడు. ఆ య న అర్ధాంగి అరుంధతి. దేవతలుకూడా జయించలేని కామక్రోధాలను ఆయన తపోదీక్షతో పరాభూతం చేశాడు. ఇంద్రియాలను వశీభూతం చేసికొన్న కారణంవల్లనే ఆయనను వసిష్ఠుడు అని పిలిచేవారు. విశ్వామిత్రుడు ఎంత ఘాతుకం సాగించినా బొమముడి ముడివడలేదు విడవలేదు. తన నూరుగురు బిడ్డలనూ విశ్వామిత్రుడు చేజేతులా చంపాడు. వాని మీద ప్రతీకారం తీసికోగలశక్తి లేకకాదు. కానీ క్రోధాన్ని జయించి ఆయన తిరిగి దానికి స్థానం ఇవ్వదలుచుకోలేదు. యమలోకంనుంచి తనపుత్రుల్ని పునరుజ్జీవింపచేసి తెచ్చుకోగలిగినా కాలమర్యాదను భిన్నం చెయ్యడం ఆయన కిష్టంకాలేదు.

అటువంటి మహాత్ముని కులగురువుగా పొంది ఇక్ష్వాకులు ఈ పృథ్విమీద అధికారం సాగించారు. ఈయన వారిచేత ఎన్నో యజ్ఞాలు చేయించాడు. దేవతలకు బృహస్పతి ఎంతటివాడో ఇక్ష్వాకులకు వసిష్ఠు డంతటివాడు. మీరుకూడా అటువంటి పురోహితునికోసం అన్వేషించండి. రా జ్యా ధి ప తి కాదలుచుకున్నవాడు పురోభాగాన బ్రాహ్మణుని ఉంచుకొని సాగాలి. అందుచేతనే గుణవంతుడూ పురుషార్థవిదుడూ వేదవేత్తా అయిన బ్రాహ్మణుని పు రో హి తు ని గా చేసికోమని పదే పదే చెపుతున్నాను.

షడున్నతాంసుపార్శ్వోరుంపృథుపంచసమావృతాం
మండూకనేత్రాం స్వాకారాం పీనోధసమనిందితాం
సువాలధిం శంకుకర్ణాంచారుశృంగాం మనోరమాం.
పృష్టాయతశిరోగ్రీవాం విస్మితః సోఽభివీక్ష్య తాం
అభినంద్య స తాం రాజా నందినీం గాధినందనః.
అబ్రవీచ్చ భృశం తుష్టః స రాజా తమృషిం తదా
అర్బుదేన గవాం బ్రహ్మన్ మమ రాజ్యేన వా పునః.
నందినీం సంప్రయచ్ఛస్వ భుంక్ష్వ రాజ్యం మహామునే
దేవతాతిథిపిత్రర్థం యాజ్యార్థం చ పయస్వినీ.
అదేయా నందినీయం వై రాజ్యేనాపి తవానఘ
క్షత్రియోఽహం భవాన్

విప్రస్తపస్స్వాధ్యాయసాధనః.

బ్రాహ్మణేషు కుతో వీర్యం ప్రశాంతేష్వధృతాత్మసు
అర్బుదేన గవాం యస్త్వం న దదాసి మమేప్సితం.
స్వధర్మం న ప్రహాస్యామి నేష్యామి చ బలేన గాం
క్షత్రియోఽస్మి న విప్రోఽహం

బాహువీర్యోఽస్మి ధర్మతః

తస్మాద్భుజబలేనేమాం హరిష్యామి హి పశ్యతః.
బలస్థశ్చాసి రాజా చ బాహువీర్యశ్చ క్షత్రియః
యథేచ్ఛసి తథా క్షిప్రం కురు మా త్వం విచారయ.
ఏవముక్తస్తథా పార్థ విశ్వామిత్రో బలాదివ
హంసచంద్రప్రతీకాశాం నందినీం తాం జహార గాం
కశాదండప్రణుదితాం కాల్యమానామితస్తతః.
హంభాయమానా కల్యాణీ వసిష్ఠస్యాథ నందినీ
ఆగమ్యాభిముఖీ పార్థ తస్థౌ భగవదున్ముఖీ.
భృశంచ తాడ్యమానా వై న జగామాశ్రమాత్తతః
శృణోమి తే రవం భద్రే వినదంత్యాః పునః పునః.
హ్రియసే త్వం బలాద్భద్రే విశ్వామిత్రేణ నందిని
కిం కర్తవ్యం మయా తత్ర క్షమావాన్ బ్రాహ్మణో

హ్యహం

సా భయాన్నందినీ తేషాం బలానాం భరతర్షభ
విశ్వామిత్రభయోద్విగ్నా వసిష్ఠం సముపాగతం.
కశాగ్రదండాభిహతాం క్రోశంతీం మామనాథవత్
విశ్వామిత్రబలైర్ఘోరైర్భగవన్ కిముపేక్షసే.
నందిన్యామేవం క్రందంత్యాం ధర్షితాయాం

మహామునిః

న చుక్షుభే తదా ధైర్యాన్న చచాల ధృతవ్రతః.
క్షత్రియాణాం బలం తేజో బ్రాహ్మణానాం

క్షమా బలం

క్షమా మాం భజతే యస్మాద్గమ్యతాం యది రోచతే.
కిం ను త్యక్తాస్మి భగవన్ యదేవం త్వం ప్రభాషసే
అత్యక్తాహం త్వయా బ్రహ్మన్ నేతుం శక్యా

న వై బలాత్.

న త్వాం త్యజామి కల్యాణి స్థీయతాం యది శక్యతే
దృఢేన దామ్నా బద్ధ్వైష వత్సస్తే హ్రియతే బలాత్.
స్థీయతామితి తచ్ఛ్రుత్వా వసిష్ఠస్య పయస్వినీ
ఊర్ధ్వాంచితశిరోగ్రీవా ప్రబభౌ రౌద్రదర్శనా.
క్రోధరక్తేక్షణా సా గౌర్హంభారవఘనస్వనా
విశ్వామిత్రస్య తత్ సైన్యం వ్యద్రావయత సర్వశః.
కశాగ్రదండాభిహతా కాల్యమానా తతస్తతః
క్రోధరక్తేక్షణా క్రోధం భూయ ఏవ సమాదధే.
ఆదిత్య ఇవ మధ్యాహ్నే క్రోధదీప్తవపుర్బభౌ
అంగారవర్షం ముంచంతీ ముహుర్వాలధితో మహత్.
అసృజత్ పహ్లవాన్ పుచ్ఛాత్

ప్రస్రావాద్ద్రవిడాన్ఛకాన్

యోనిదేశాచ్చ యవనాన్ శకృతః శబరాన్ బహూన్
మూత్రతశ్చాసృజత్ కాంశ్చిచ్ఛబరాంశ్చైవ

పార్శ్వతః

పౌండ్రాన్ కిరాతాన్ యవనాన్ సింహలాన్

బర్బరాన్ ఖసాన్.

# నూట డెబ్బదినాల్గవ అధ్యాయము

## విశ్వామిత్ర

వసిష్ఠ విశ్వామిత్రులు మహారణ్యాలలో ఆశ్రమాలలో కదా నివసిస్తున్నారు. అటువంటివారి మధ్య వైరం ఎలానడిచిందనికదా అడుగుతున్నావు. అయితే విను– ఇది త్రిలోక విఖ్యాతమైన ఉపాఖ్యానం.

కన్యాకుబ్జంలో గాధి అనే పేరుగల మహారాజుకి ప్రియపుత్రుడు విశ్వామిత్రుడు. గాధిరాజు తండ్రి కుశికుడు. అందుచేత వారిని కౌశికులనీ వ్యవహరిస్తారు. విశ్వామిత్రుడు అరివీర భయంకరుడు. అలావుండగా మంత్రి సేనాపరివారంతో విశ్వామిత్రుడు వేటకు వెళ్ళి వేటలో మతుకమృగాన్ని తరుముతూ అలసి అలసి దాహబాధలో వసిష్ఠుని ఆశ్రమప్రాంతం చేరాడు. అతిథి మర్యాద లెరిగిన వసిష్ఠుడు చక్రవర్తి రాక గమనించి ఎదురేగి ఆహ్వానించాడు. అర్ఘ్యపాద్యాచమనీయాదు లిచ్చి తన కామధేనువును పిలిచి మహారాజు మనోభీష్టానుసారం వర్తించమన్నాడు.

అది వారికి జిహ్వాతర్పణంగా సర్వరాజభోగ పదార్థాలతో విశ్వామిత్రుని ఆకలి తీర్చింది.

నయనమనోహరంగా ఉన్న ఆ కామధేనువు నోటికి రుచిగా చేసిన విందు విశ్వామిత్రునికి ఆశ్చర్యం కలిగించింది. ఆయన పరివారం పరమానందం పొందింది. అందరూ ఆ గోమాతనూ దాని యజమానినీ పదేపదే అభినందిస్తున్నారు. ఆ ధేనువు యొక్క తలా మెడా గంగడోలూ తోకా స్తనాలూ జఘనభాగమూ బలిష్ఠంగా విశాలంగా ఉన్నాయి. దాని పిక్కలూ పార్శ్వాలూ నిండుగా ఉన్నాయి. దాని అయిదు అంగాలు మరీ బలిష్ఠంగా ఉన్నాయి.

> శిరోగ్రీవా సక్థినీ చ సాస్నా పుచ్ఛ మథస్తనా
> శుభాన్యేతాని ధేనూనాం యుతాని ప్రచక్షతే
> లలాట శ్రవణౌ చైవ నయన ద్వితయం తథా
> పృథూన్యేతాని శస్యంతే ధేనూనాం పంచసూరిభిః

పైవాటిలో పంచాంగాలంటే లలాటమూ రెండు కన్నులూ చెవులూనూ, అవికూడా విశాలంగా ఉన్నాయి.

దాని కన్నులు పెద్దమండూకాల్లా ఉన్నాయి. పొదుగు పెద్దదిగా ఉంది. మొనదేరిన చెవులతో అందమైన తోకతో ఆనందినీధేనువు రాజుకీ రాజసేనకీ ఎంతసేపుచూసినా తృప్తితీరనివ్వటం లేదు. విశ్వామిత్రుడు ఆ నందినిని అదేపనిగా అభినందించాడు. అనంతరం వసిష్ఠునికి పదికోట్ల ఆవుల నిస్తానని నందినిని ఇమ్మని అడిగాడు. సామ్రాజ్యం అంతాకూడా ఇచ్చేస్తానన్నాడు. ఆ నందినిని ఇచ్చినట్లయితే రాజ్యభోగాలన్నీ అనుభవించవచ్చునన్నాడు. దేవతలకూ అతిథులకూ పితృదేవతలకూ మర్యాదానుసారం ఆరాధన సాగించడానికీ హవిస్సుకి అవసరమైన సామగ్రిని సమకూర్చడానికీ ఉపయోగపడే ధేనువును రాజ్యభోగంకోసం వదలలేనన్నాడు బ్రహ్మర్షి.

నేను క్షత్రియుణ్ణి. మీరు తపస్స్వాధ్యాయనిరతులైన బ్రాహ్మణులు. మీరు పరమశాంతచిత్తులై జితేంద్రియులై ఉంటారు. అటువంటి మీకు నన్నెదిరించే బలపరాక్రమాలుండవు కనక నామాటవిని

చిబుకాంశ్చ పులిందాశ్చ చీనాన్ హూణాన్ సకేరలాన్
ససర్జ ఫేనతః సా గౌర్మ్లేచ్ఛాన్ బహువిధానపి.
తైర్విసృష్టైర్మహాసైన్యైర్నానామ్లేచ్ఛగణైస్తదా
నానావరణసంఛన్నైర్నానాయుధధరైస్తథా.
అవకీర్యత సంరబ్ధైర్విశ్వామిత్రస్య పశ్యతః
ఏకైకశ్చ తదా యోధః పంచభిః సప్తభిర్వృతః.
అస్త్రవర్షేణ మహతా వధ్యమానం బలం తదా
ప్రభగ్నం సర్వతస్త్రస్తం విశ్వామిత్రస్య పశ్యతః.
నచప్రాణైర్వియుజ్యంతే కేచిత్ తత్రాస్యసైనికాః
విశ్వామిత్రస్య సంక్రుద్ధైర్వాసిష్ఠైర్భరతర్షభ.
సాగౌస్తత్ సకలం సైన్యం కాలయామాసదూరతః
విశ్వామిత్రస్యతత్ సైన్యంకాల్యమానంత్రియోజనం
క్రోశమానం భయోద్విగ్నం త్రాతారం నాధ్యగచ్ఛత
విశ్వామిత్రస్తతో దృష్ట్వా క్రోధావిష్టః స్వరోదసి
వవర్ష శరవర్షాణి వసిష్ఠే మునిసత్తమే.
ఘోరరూపాంశ్చ నారాచాన్ క్షురాన్ భల్లాన్ మహామునిః
విశ్వామిత్రప్రయుక్తాంస్తాన్ నైనవేన వ్యమోచయత్.
వసిష్ఠస్య తదా దృష్ట్వా కర్మకౌశలమాహవే
విశ్వామిత్రోఽపి కోపేన భూయః శత్రునిపాతనః
దివ్యాస్త్రవర్షం తస్మైతుప్రాహిణోన్మునయేరుషా.
ఆగ్నేయం వారుణం చైంద్రం యామ్యం వాయవ్యమేవ చ
విససర్జ మహాభాగే వసిష్ఠే బ్రాహ్మణః సుతే.
అస్త్రాణి సర్వతో జ్వాలాం విసృజంతి ప్రపేదిరే
యుగాంతసమయే ఘోరాః పతంగస్యేవ రశ్మయః.
వసిష్ఠోఽపి మహాతేజా బ్రహ్మశక్తిప్రయుక్తయా
యష్ట్యా నివారయామాస సర్వాణ్యస్త్రాణి స స్మయన్.
తతస్తే భస్మసాద్భూతాః పతంతి స్మ మహీతలే
అపోహ్య దివ్యాన్యస్త్రాణి వసిష్ఠో వాక్యమబ్రవీత్.
నిర్జితోఽసి మహారాజ దురాత్మన్ గాధినందన
యది తేఽస్తి పరం శౌర్యం తద్దర్శయ మయిస్థితే.
విశ్వామిత్రస్తథా చోక్తో వసిష్ఠేన నరాధిప
నోవాచ కించిద్ వ్రీడార్థో విద్రావితమహాబలః.
దృష్ట్వా తన్మహదాశ్చర్యం బ్రహ్మతేజో భవేతదా
విశ్వామిత్రః క్షత్రభావాన్నిర్విణ్ణో వాక్యమబ్రవీత్.
ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలం
బలాబలం వినిశ్చిత్య తప ఏవ పరం బలం
సరాజ్యం స్ఫీతముత్సృజ్య తాంచదీప్తాంనృపశ్రియం.
భోగాంశ్చ పృష్ఠతః కృత్వా తపస్యేవ మనో దధే
స గత్వా తపసా సిద్ధిం లోకాన్ విష్టభ్య తేజసా.
తతాపసర్వాన్ దీప్తౌజాబ్రాహ్మణత్వమవాప్తవాన్
అపిబచ్చ తతః సోమమింద్రేణ సహ కౌశికః.

174 వ అధ్యాయము సమాప్తం

## నూట డెబ్బది ఐదవ అధ్యాయము

కల్మాషపాద ఇత్యేవం లోకే రాజా బభూవ హ
ఇక్ష్వాకువంశజః పార్థ తేజసాసదృశో భువి.
సకదాచిద్వనంరాజామృగయాం నిర్యయౌ పురాత్
మృగాన్ విధ్యన్ వరాహాంశ్చ చచార రిపుమర్దనః

అర్బుదం గోవులను తీసికొని ఈ నందినీధేనువును ఇవ్వండి. నేను రాజాధికారంతో దీన్ని తోలుకు పోతానే కాని విడిచిపెట్టను. బాహుబలంతో స్వాధీనం చేసికొనే హక్కు మాకున్నది. మీకన్నుల ఎదురుగానే దీన్ని హరిస్తాను—అన్నాడు విశ్వామిత్రుడు.

మహారాజా! సేనాసమేతుడవు, బాహుబలపరాక్రమసంపన్నుడవూ అయిన నువ్వు తక్షణం ఆ నందినీధేనువును నీ భుజశక్తితో తోలుకొని వెళ్ళు. అనాలోచితంగా నీ సాహసం సాధించు— అని వసిష్ఠుడనగానే విశ్వామిత్రుడు తన సేనకు ఆజ్ఞ నుయిచ్చాడు. రాజహంసివలె పూర్ణచంద్రునివలె తెల్లని తెలుపుతో ఉన్న ఆధేనువు శరీరంమీద వారు కొరడాలతో కర్రలతో బాది నడిపించబోయారు. అది అంభారవంతో వచ్చి వసిష్ఠునిముందు దీనంగా నిలబడింది. దాని శరీరం మీద ఎంతగట్టి దెబ్బలు తగులుతున్నా అది వసిష్ఠునిపైనుండి కన్ను త్రిప్పటంలేదు.

నందినీ! కళ్యాణనామినీ! నిన్ను వీరు తమబాహుబలంతో హింసిస్తున్నారు. నీ అంభారవం నాహృదయాన్ని కలచివేస్తోంది. అయినా నేను చేయగలిగిందేమీలేదు. నేను క్షమాశీలం కల బ్రాహ్మణుణ్ణి— అన్నాడు వసిష్ఠుడు. నందినీధేనువు వారి ప్రహారాలకు తట్టుకోలేక అలానే ఆయనముందు నిలబడిపోయింది.

మహర్షీ! దయాహీనులైన వీరు నన్ను దారుణంగా బాధిస్తున్నారు. నేను మీ శరణు కోరుతూంటే మీరింత నిర్లిప్తంగా ఊరుకుంటారా? అని విలపిస్తున్నా కఠోరనియమ పాలనవ్రత పరాయణుడైన వసిష్ఠుడు ఏమాత్రం చలించలేదు. ఆయన కన్నులలో ప్రశాంతత సడలలేదు.

నందినీ! పరాక్రమ తేజస్సు క్షత్రియుల బలం. క్షమాతేజం బ్రహ్మబలం. నేను క్షమాశీలుణ్ణి కనక నిన్ను రక్షించలేను. నీదారినువ్వుచూసుకో—అన్నాడు వసిష్ఠుడు. ఆయన ఆవిధంగా ప్రస్తావించకపోతే ఈ క్షత్రియులెవరూ తన శరీరాన్ని తాకలేరని నందిని పలికింది.

అప్పుడు వసిష్ఠుడు తాను నందినిని విడవడంలేదనీ దాని శక్తితో అది ఉండగలిగితే ఉండవచ్చుననీ దాని బిడ్డను తీసికొనుపోతారనీ అన్నాడు. ఆ మాటలతో నందిని ఒక్కసారి తల పైకెత్తింది. మహాభీకరాకారం ధరించింది. దాని అంభారవం భయంకరంగా వినిపిస్తోంది. కన్నుల్లోంచి చింతనిప్పులు కురుస్తున్నాయి. ఆ తీవ్రంతో అది విజృంభించేసరికి విశ్వామిత్రుని సేనలు దశదిశలకూ పలాయనం చిత్తగిస్తున్నాయి. దాని శరీరంనుండి అగ్నిజ్వాలలు లేగుతున్నాయి. గ్రీష్మభానునివలె అది ప్రకాశిస్తోంది. తోకలోంచి అగ్నివర్షం కురుస్తోంది. అక్కడనుంచే పహ్లవజాతిని సృష్టించింది. దాని స్తనాలలోంచిద్రావిడులూ శకులూ ఉద్భవించారు. యోనినుండి యవనులూ గోమయంనుండి శబరులూ పుట్టారు. పార్శ్వాలనుండి పౌండ్ర కిరాత సింహళ బర్బర ఖసులజాతులూ నోటినురగలోంచి చీనా హూణ పుళింద కరూదిజాతులూ ఇంకా అనేక మ్లేచ్ఛజాతులనూ అది పుట్టించింది. ఈ మ్లేచ్ఛులందరూ విశ్వామిత్రుని సేనలను చెల్లాచెదరు చేస్తున్నారు. విశ్వామిత్రుని ఒక్కొక్కసైనికుని మ్లేచ్ఛులు అయిదారుగురుగా చుట్టు ముడుతున్నారు.

ఆసైన్యం కురిపించే అస్త్రశస్త్రవర్షంలో విశ్వామిత్రుని సేన ధైర్యం కోల్పోయింది. భయభీతులై

తస్మిన్ వనే మహాఘోరే ఖడ్గాంశ్చ బహుశో౽హనత్
హత్వా చ సుచిరం శ్రాంతో రాజా వినవృతే తతః
అకామయ త్తంయాజ్యార్థే విశ్వామిత్రః ప్రతాపవాన్
స తు రాజా మహాత్మానం వాసిష్ఠమృషిసత్తమం
తృషార్తశ్చ క్షుధార్తశ్చ ఏకాయనగతః పథి
అపశ్యదజితః సంఖ్యే మునిం ప్రతిముఖాగతం.
శక్తిం నామ మహాభాగం వసిష్ఠకులవర్ధనం
జ్యేష్ఠం పుత్రం పుత్రశతాద్వసిష్ఠస్య మహాత్మనః.
అపగచ్ఛ పథో౽స్మాకమిత్యేవం పార్థివో౽బ్రవీత్
తథాఋషిరువాచైనం సాంత్వయఞ్ శ్లక్ష్ణయాగిరా.
మమ పంథా మహారాజ ధర్మ ఏష సనాతనః
రాజ్ఞా సర్వేషు ధర్మేషు దేయః పంథా ద్విజాతయే.
ఏవం పరస్పరం తౌ తు పథో౽ర్థం వాక్యమూచతుః
అపసర్పాపసర్పేతి వాగుత్తరమకుర్వతాం.
ఋషిస్తు నాపచక్రామ తస్మిన్ ధర్మపథే స్థితః
నాపిరాజా మునేర్మానాత్ క్రోధాచ్చాపిజగామహ.
అముంచంతం తు పంథానం తమృషిం నృపసత్తమః
జఘాన కశయా మోహాత్తదా రాక్షసవన్మునిం.
కశాప్రహారాభిహతస్తతః స మునిసత్తమః
తం శశాప నృపశ్రేష్ఠం వాసిష్ఠః క్రోధమూర్ఛితః
హంసి రాక్షసవద్ యస్మాద్ రాజాపసద తాపసం
తస్మాత్ త్వమద్యప్రభృతి పురుషాదో భవిష్యసి.
మనుష్యపిశితే సక్తశ్చరిష్యసి మహీమిమాం
గచ్ఛ రాజాధమేత్యుక్తః శక్తినా వీర్యశక్తినా.
తతో యాజ్యనిమిత్తే తు విశ్వామిత్రవసిష్ఠయోః
వైరమాసీత్తదా తం తు విశ్వామిత్రో౽న్వపద్యత.
తయోర్వివాదతో నేవం సమీపముపచక్రమే
ఋషిరుగ్రతపాః పార్థ విశ్వామిత్రః ప్రతాపవాన్.
తతః స బుబుధే పశ్చాత్ తమృషిం నృపసత్తమః
ఋషేః పుత్రం వసిష్ఠస్య వసిష్ఠమివ తేజసా.

అంతర్ధాయ తదా౽౽త్మానం విశ్వామిత్రో౽పి భారత
తావుభావతిచక్రామ చికీర్షన్నాత్మనః ప్రియం.
స తు శప్తస్తదా తేన శక్తినా వై నృపోత్తమః
జగామ శరణం శక్తిం ప్రసాదయితుమర్హయన్.
తస్య భావం విదిత్వా స నృపతేః కురుసత్తమ
విశ్వామిత్రస్తతో రక్ష ఆదిదేశ నృపం ప్రతి.
శాపాత్తస్య తు విప్రర్షేర్విశ్వామిత్రస్య చాజ్ఞయా
రాక్షసః కింకరో నామ వివేశ నృపతిం తదా.
రక్షసా తం గృహీతం తు విదిత్వా మునిసత్తమః
విశ్వామిత్రో౽ప్యపాక్రామత్ తస్మాద్దేశా దరిందమ.
తతః స నృపతిస్తేన రక్షసాంతర్గతేన వై
బలవత్ పీడితః పార్థ నాన్వబుధ్యత కించన.
దదర్శాథ ద్విజః కశ్చిద్రాజానం ప్రస్థితం వనం
అయాచత క్షుధాపన్నః సమాంసం భోజనం తదా.
తమువాచాథ రాజర్షిర్ద్విజం మిత్రసహస్తదా
ఆస్స్వ బ్రహ్మంస్త్వమత్రైవ ముహూర్తం
ప్రతిపాలయన్.
నివృత్తః ప్రతిదాస్యామి భోజనం తే యథేప్సితం
ఇత్యుక్త్వా ప్రయయౌ రాజా తస్థౌ చ ద్విజసత్తమః.
తతో రాజా పరిక్రమ్య యథాకామం యథాసుఖం
నివృత్తో౽న్తఃపురం పార్థ ప్రవివేశ మహామనాః.
తతో౽ర్ధరాత్ర ఉత్థాయ సూదమానాయ్య సత్వరం
ఉవాచ రాజా సంస్మృత్య బ్రాహ్మణస్య ప్రతిశ్రుతం
గచ్ఛాముష్మిన్ వనోద్దేశే బ్రాహ్మణో మాం ప్రతీక్షతే
అన్నార్థీ తం త్వమన్నేన సమాంసేనోపపాదయ.
ఏవముక్తస్తతః సూదః సో౽నాసాద్యామిషం క్వచిత్
నివేదయామాస తదా తస్మై రాజ్ఞే వ్యథాన్వితః.
రాజా తు రక్షసా౽౽విష్టః సూదమాహ గతవ్యథః
అప్యేనం నరమాంసేన భోజయేతి పునః పునః.
తథేత్యుక్త్వా తతః సూదః సంస్థానం వధ్యఘాతినాం

నాకందరూ పలాయనం చిత్తగిస్తున్నారు. అయితే ఒక్కసైనికునీ మ్లేచ్ఛులు వధించటంలేదు. మూడు యోజనాలదూరం తరిమేశారు. ఆ సేన భయంతో ఆర్తనాదాలతో పోతోంది.

విశ్వామిత్రునికి క్రోధం రెచ్చింది. వసిష్ఠునిపై బాణవర్షం కురిపించ నారంభించాడు. పృథ్వ్యాకాశ మధ్యం అంతా విశ్వామిత్రుని బాణాలతో నిండి పోయింది. వసిష్ఠుడు తనచేతిలోని వెదురుదండంతో విశ్వామిత్రుడు విడిచే నారాచ క్షుర భల్ల బాణాలను భగ్నంచేస్తున్నాడు. వసిష్ఠుని తేజశ్శక్తికి చకితుడై విశ్వామిత్రుడు మరీ విజృంభించాడు. కోపపూరితంగా దివ్యాస్త్రాలు విడవసాగాడు. యామ్య వాయవ్య వారుణ ఐంద్ర ఆగ్నేయాస్త్రాలు ప్రయోగించాడు. ప్రళయకాలాగ్నివలె ప్రచండ తీక్ష్ణంగా అవి వస్తూంటే వసిష్ఠుడు చిరునవ్వుతో బ్రహ్మదండం ద్వారా నిరోధిస్తున్నాడు—చక్రవర్తివై దుర్మార్గబుద్ధితో చరించి నువ్వు పరాభూతుడ వయావు. ఇదికాక ఇంకా నీబలం ఏమయినా మిగిలి ఉంటే ప్రదర్శించు. ఇదిగో నీయెదుట నిలిచాను—అని వసిష్ఠుడన్నాడు.

విశ్వామిత్ర మహారాజు సిగ్గుతో తలవాల్చాడు అవమానంతో ఆయనహృదయం కుమిలిపోతున్నది. క్షాత్రతేజం పరాభూతం కాగా ఉదాసీనదృష్టితో—క్షత్రియత్వ మేం గొప్పది. క్షాత్రబలం కూడా బలమేనా! వాస్తవానికి బ్రాహ్మణ్యమే గొప్పది. బ్రహ్మబలమే బలం. బ్రహ్మతేజస్సును జయించేదిలేదు—అని ఆలోచించుకొని రాజశక్తికంటె విప్రశ్రేష్ఠుని తపశ్శక్తి ఘనమైనదని నిశ్చయించుకున్నాడు. ఆక్షణంలోనే విశ్వామిత్రునికి రాజ్యాధిపత్యం అసహ్యం కలిగించింది. శ్రీసంపన్నమైన రాజ్యాన్నీ రాజభోగాలను వదిలేసి ఆదేశంలో తపోదీక్ష వహించాడు. తీవ్రతపస్సుతో లోకాలనే దద్దరిల్ల చేసి బ్రహ్మత్వసిద్ధి పొందాడు. ఇంద్రునితో సమంగా సోమపానం చేసే అర్హతకూడా విశ్వామిత్రునికి లభించింది.

174 వ అధ్యాయము సమాప్తం

## నూట డెబ్బయి ఐదవ అధ్యాయము

### శక్తి

ఇక్ష్వాకువంశంలో కల్మాషపాదు డనే పేరుగల చక్రవర్తి ఉండేవాడు. ఆ రోజులలో కల్మాషపాదునితో పోల్చదగిన వ్యక్తి ఈ భూమండలంలో లేడు. అటువంటి కల్మాషపాదుడు విలాసంగా వేటకు బయలుదేరి ఘోరారణ్యంలో ప్రవేశించి అడవి పందులనూ ఇతర ఘాతుకమృగాలనూ సంహరిస్తూ తిరుగుతున్నాడు. ఎన్నో క్షుద్రమృగాలు ఆయనచేతులలో హతమారుతున్నాయి. వేటలో మహారాజు అలసిపోయాడు. నెమ్మదిగా వెనుదిరిగి నగరమార్గం పట్టాడు. ఆకలిదప్పులు అధికంగా వేధిస్తూండగా మహారాజు ఇరుకుదారుల వెంట సాగుతున్నాడు. దారిలో ఎదురుగా వసిష్ఠులవారి కుమారుడు శక్తి వస్తున్నాడు. ఆయనను చూసి కల్మాషపాదుడు—దారికి అడ్డురావద్దు—అని హెచ్చరించాడు.

గత్వా౽౽జహార త్వరితో నరమాంసమపేతిభిః.
ఏతత్ సంస్కృత్య విధివదన్నోపహితమాశు వై
తస్మై ప్రాదాద్బ్రాహ్మణాయ క్షుధితాయ తపస్వినే
స సిద్ధచక్షుషా దృష్ట్వా తదన్నం ద్విజసత్తమః
అభోజ్యమిదమిత్యాహ క్రోధపర్యాకులేక్షణః.
యస్మాదభోజ్యమన్నం మే దదాతి స నృపాధమః
తస్మాత్ తస్యైవ మూఢస్య భవిష్యత్యత్రలోలుపా
సక్తో మానుషమాంసేషు యథోక్తః శక్తినా తథా.
ఉద్వేజనీయో భూతానాం చరిష్యతి మహీమిమాం
ద్విరనువ్యాహృతే రాజ్ఞః స శాపో బలవానభూత్
రక్షోబలసమావిష్టో విసంజ్ఞశ్చాభవన్నృపః.
తతః స నృపతిశ్రేష్ఠో రక్షసాపహృతేంద్రియః
ఉవాచ శక్తిం తం దృష్ట్వా న చిరాదివ భారత.
యస్మాదసదృశః శాపః ప్రయుక్తోయంమయిత్వయా
తస్మాత్త్వత్తః ప్రవర్తిష్యే ఖాదితుం పురుషానహం.
ఏవముక్త్వా తతః సద్యస్తం ప్రాణైర్విప్రయుజ్య చ
శక్తినం భక్షయామాస వ్యాఘ్రః పశుమివేప్సితం.
శక్తినం తు మృతం దృష్ట్వా విశ్వామిత్రః పునః పునః
వసిష్ఠస్యైవ పుత్రేషు తద్రక్షః సందిదేశ హ.

స తాన్ఛక్త్యవరాన్ పుత్రాన్ వసిష్ఠస్య మహాత్మనః
భక్షయామాస సంక్రుద్ధః సింహః క్షుద్రమృగానివ.
వసిష్ఠో ఘాతితాన్ శ్రుత్వా విశ్వామిత్రేణ తాన్ సుతాన్
ధారయామాస తం శోకం మహాద్రిరివ మేదినీం
చక్రే చాత్మవినాశాయ బుద్ధిం స మునిసత్తమః
న త్వేవ కౌశికోచ్ఛేదం మేనే మతిమతాం వరః.
స మేరుకూటాదాత్మానంముమోచ భగవానృషిః
గిరేస్తస్య శిలాయాం తు తూలరాశావివాపతత్.
న మమార చ పాతేన స యదా తేన పాండవ
తదాగ్నిమిద్ధం భగవాన్ సంవివేశ మహావనే.
తం తదా సుసమిద్ధోఽపి న దదాహ హుతాశనః
దీప్యమానోఽప్యమిత్రఘ్న శీతోఽగ్నిరభవత్తతః.
స సముద్రమభిప్రేక్ష్య శోకావిష్టో మహామునిః
బద్ధ్వా కంఠే శిలాం గుర్వీం నిపపాత తదాంభసి.
స సముద్రోర్మివేగేన స్థలే న్యస్తో మహామునిః
న మమార యదా విప్రః కథంచిత్సంశితవ్రతః
జగామ స తతః ఖిన్నః పునరేవాశ్రమం ప్రతి.

175 వ అధ్యాయం సమాప్తం.

## నూట డెబ్బది ఆరవ అధ్యాయము

తతో దృష్ట్వాశ్రమపదం రహితం తైః సుతైర్మునిః
నిర్జగామ సుదుఃఖార్తః పునరప్యాశ్రమాత్తతః.
సోఽపశ్యత్సరితంపూర్ణాంప్రావృట్కాలేనవాంభసా
వృక్షాన్ బహువిధాన్ పార్థ హరంతీం తీరజాన్ బహూన్.
అథ చింతాం సమాపేదే పునః కౌరవనందన
అంభస్యస్యా నిమజ్జేయమితి దుఃఖసమన్వితః.

తతః పాశైస్తదా౽౽త్మానం గాఢం బద్ధ్వా మహామునిః,
తస్యా జలే మహానద్యా నిమమజ్జ సుదుఃఖితః
అథ ఛిత్త్వా నదీ పాశాంస్తస్యారి బలసూదన
స్థలస్థం తమృషిం కృత్వా విపాశం సమవాసృజత్.
ఉత్తతార తతః పాశైర్విముక్తః స మహానృషిః
విపాశేతి చ నామాస్యా నద్యాశ్చక్రే మహానృషిః.

శక్తి మృదుమధురస్వరంతో— మహారాజా! ఈభూమిమీద ఎవరైనా బ్రాహ్మణునికి దారియిచ్చి తరువాయి తమరు నడుస్తారు. అది ధర్మమార్గం. కనుక నేను వైదొలగవలసిన అవసరంలేదు— అన్నాడు.

కల్మాషపాదుని రాజసం అందుకు అంగీకరించలేదు.

శక్తి బ్రాహ్మణ్యమూ అదే దారిలో ఉన్నది.

ఉభయులూ ఒకరికొకరు దారిఇవ్వకుండా వాగ్వాదానికి సావకాశం ఇచ్చారు. బ్రహ్మర్షి నందనుడు శక్తి ధర్మమార్గంలో ఉన్నందువల్ల కల్మాషపాదుని మాటలు వినలేకపోయాడు. చక్రవర్తిని అభిమాన క్రోధాలు ఆవహించి కదలనివ్వలేదు. ఏమైనా వాదప్రతివాదాలే సాగుతున్నాయే కాని ఒకరికీ ముందడుగువేసే సందులేదు. చక్రవర్తి అహంకారం ప్రకోపించింది. మాటలతో ప్రయోజనంలేదని కొరడా తీసి శక్తిని కొట్టాడు. శక్తి ఉత్తరక్షణంలో కల్మాషపాదుని ఘాతుకాన్ని నిందిస్తూ సత్త్వగుణసంపన్నులను కొరడాతో హింసించి రాక్షసంగా ప్రవర్తించినందుకు ఫలంగా నరభక్షణ చేసే రాక్షసత్వం పొందమని శపించాడు. అప్పటికికాని కల్మాషపాదునికి శక్తి వసిష్ఠపుత్రుడని తెలియలేదు. అదేసమయానికి విశ్వామిత్రుడు ఆప్రాంతానికివచ్చి అదృశ్యంగా ఉన్నాడు. శక్తిమునిని శక్తి గ్రహించి కల్మాషపాదుడు దీనవదనంతో శరణు వేడడానికి ముందడుగు వేస్తున్నాడు. అప్పుడు విశ్వామిత్రుడు కల్మాషపాదుని శరీరంలో ఒక రాక్షసుని ప్రవేశపెట్టాడు. విశ్వామిత్రుని ఆజ్ఞ శక్తి శాపమూ తోడుకాగా రాక్షసుడు రాజును ఆవహించాడు. నెమ్మదిగా విశ్వామిత్రుడు వెళ్ళిపోయాడు.

రాక్షస ప్రవేశంతో రాజు విచక్షణాజ్ఞానం కోల్పోయాడు. అరణ్యంలోనే చరిస్తూండగా ఒక బ్రాహ్మణుడు ఎదురుపడి ఆకలిగా ఉందని ఆహారం పెట్టించమని అడిగాడు. కొంచెం ఘడియ లిక్కడే ఉండండి. నే నిప్పుడే వచ్చి మీకు భోజనము సమకూరుస్తాను— అని చెప్పి తిరిగి తిరిగి మధ్యాహ్నంతో నగరం చేరి అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

ఆ అర్ధరాత్రిలో కల్మాషపాదునికి తాను ఆతిథ్యం ఇస్తానన్న బ్రాహ్మణుని విషయం గుర్తుకొచ్చి వంటవాణ్ణి పిలిచి అరణ్యంలో ఉన్న బ్రాహ్మణునికి సంతృప్తిగా భోజనం పెట్టిరమ్మన్నాడు.

మాంసంతోసహా భోజనం తయారుచెయ్యాలని మరీ మరీ చెప్పాడు మహారాజు. కాని వంటవాడికి ఆసమయంలో మాంసం లభించక వెళ్ళి విచారంతో రాజుకి నివేదించాడు. రాక్షసప్రేరితుడై ఉన్న రాజు నరమాంసంతో బ్రాహ్మణసమారాధనం సాగించమన్నాడు. వంటవాడు సరేనని వెళ్ళాడు. వధ్యస్థానంలో తలారి ఇంటికి వెళ్ళి నర మాంసం తెచ్చి వండి భోజనం సిద్ధం చేసి అరణ్యంలో ఉన్న బ్రాహ్మణునికి అర్పించాడు.

ఒక్కసారి ఆ ఆహారాన్ని చూసేసరికే దివ్యదృష్టి కల ఆవిప్రశ్రేష్ఠునికి సర్వమూ అవగత మయింది. తక్షణం రాజుని శపించాడు— ఇటువంటి అశుచితాహారం నావంటివానికి పెట్టిన దాని ఫలంగా ఈమహారాజు ఇదే విధమైన నరమాంసభక్షణతో జీవించాలి. శక్తిముని శాపానుసారం ఈ రాజు ప్రాణికోటికి భయంకరుడై రాక్షసుడిలా చరిస్తాడు— అని రెండుసార్లు పలికాడు.

మహారాజుపై రాక్షసునికి సంపూర్ణాధికారంలభించింది. రాక్షసుని చెప్పుచేతలలో రాజు నడుస్తున్నాడు.

శోకబుద్ధిం తదా చక్రే న చైకత్ర వ్యతిష్ఠత
సోఽగచ్ఛత్పర్వతాంశ్చైవ సరితశ్చ సరాంసి చ.
దృష్ట్వా స పునరేవర్షిర్నదీం హైమవతీం తదా
చండగ్రాహవతీం భీమాం తస్యాః స్రోతస్యపాతయత్.
సా తమగ్నిసమం విప్రమనుచింత్య సరిద్వరా
శతధా విద్రుతా యస్మాచ్ఛతద్రురితి విశ్రుతా.
తతః స్థలగతం దృష్ట్వా తత్రాప్యాత్మానమాత్మనా
మర్తుం నశక్యమిత్యుక్త్వా పునరేవాశ్రమం యయౌ.
సగత్వా వివిధాన్ శైలాన్ దేశాన్ బహువిధాంస్తథా
అదృశ్యన్త్యాఖ్యయా వధ్వాథాశ్రమేఽనుసృతోఽ
భవత్.

అథ శుశ్రావ సంగత్యా వేదాధ్యయననిఃస్వనం
పృష్ఠతః పరిపూర్ణార్థం షడ్భిరంగైరలంకృతం.
అనువ్రజతి కో న్వేష మామిత్యేవాథసోఽబ్రవీత్
అహమిత్యదృశ్యంతీమం సా స్నుషా ప్రత్యభాషత
శక్తేర్భార్యా మహాభాగ తపోయుక్తా తపస్వినీ.
పుత్రి కస్యైష సాంగస్య వేదస్యాధ్యయనస్వనః
పురా సాంగస్య వేదస్య శక్తేరివ మయా శ్రుతః.
అయం కుక్షౌ సముత్పన్నః శక్తేర్గర్భః సుతస్య తే
సమా ద్వాదశ తస్యేహ వేదానభ్యస్యతో మునే.
ఏవముక్తస్తయా హృష్టో వసిష్ఠః శ్రేష్ఠభాగృషిః
అస్తి సంతానమిత్యుక్త్వా మృత్యోః పార్థ న్యవర్తత.
తతః ప్రతినివృత్తః స తయా వధ్వా సహానఘ
కల్మాషపాదమాసీనం దదర్శ విజనే వనే.
స తు దృష్ట్వైవ తం రాజా క్రుద్ధ ఉత్థాయ భారత
ఆవిష్టో రక్షసోగ్రేణ ఇయేషాత్తుం తదా మునిం.
అదృశ్యంతీ తు తం దృష్ట్వా క్రూరకర్మాణమగ్రతః
భయసంవిగ్నయా వాచా వసిష్ఠమిదమబ్రవీత్.
అసౌ మృత్యురివోగ్రేణ దండేన భగవన్నితః
ప్రగృహీతేన కాష్ఠేన రాక్షసోఽభ్యేతి దారుణః.

తం నివారయితుం శక్తో నాన్యోఽస్తి భువి కశ్చన
త్వదృతేఽద్య మహాభాగ సర్వవేదవిదాం వర.
పాహిమాం భగవన్ పాపాదస్మాద్దారుణదర్శనాత్
రాక్షసోఽయమిహాత్తుం వై నూనమావాం
సమీహతే.

మాభైః పుత్రి న భేతవ్యం రాక్షసాత్ తు కథంచన
నైతద్రక్షో భయం యస్మాత్ పశ్యసి త్వముపస్థితం
రాజా కల్మాషపాదోఽయం వీర్యవాన్ ప్రథితో భువి
స ఏషోఽస్మిన్ వనోద్దేశే నివసత్యతిభీషణః.
తమాపతంతం సంప్రేక్ష్య వసిష్ఠో భగవానృషిః
వారయామాస తేజస్వీ హుంకారేణైవ భారత.
మంత్రపూతేన చ పునః స తమభ్యుక్ష్య వారిణా
మోక్షయామాస వై శాపాత్
తస్మాద్యోగాన్నరాధిపం.
స హి ద్వాదశ వర్షాణి వాసిష్ఠస్యైవ తేజసా
గ్రస్త ఆసీద్గ్రహేణేవ పర్వకాలే దివాకరః.
రక్షసా విప్రముక్తోఽథ స నృపస్తద్వనం మహత్
తేజసా రంజయామాస సంధ్యాభ్రమివ భాస్కరః.
ప్రతిలభ్య తతః సంజ్ఞామభివాద్య కృతాంజలిః
ఉవాచ నృపతిః కాలే వసిష్ఠమృషిసత్తమం.
సౌదాసోఽహం మహాభాగ యాజ్యస్తే మునిసత్తమ
అస్మిన్ కాలే యదిష్టం తే బ్రూహి కిం కరవాణి తే
వృత్తమేతద్యథాకాలం గచ్ఛ రాజ్యం ప్రశాధి వై
బ్రాహ్మణాంతుమనుష్యేంద్రమావమంస్థాః కదాచన.
నావమంస్యే మహాభాగ కదాచిద్బ్రాహ్మణానహం
త్వన్నిదేశే స్థితః సమ్యక్ పూజయిష్యామ్యహం
ద్విజాన్.

ఇక్ష్వాకూణాంచయేనాహమనృణఃస్యాంద్విజోత్తమ
తత్ త్వత్తః ప్రాప్తుమిచ్ఛామి సర్వవేదవిదాం వర.
అపత్యమీప్సితం మహ్యం దాతుమర్హసి సత్తమ

సమ్మదిగా శక్తిని సమీపించి— నీ శాపంవల్లనే నేనిలా అనవలసివచ్చింది కనక నేను ముందు నిన్నే తినేస్తాను— అని పులిలా శక్తిమీదపడి చంపి తినేశాడు.

శక్తి మరణంతో విశ్వామిత్రుడు కొంత తృప్తిపడి ఆ రాక్షసుని వసిష్ఠపుత్రులనందరినీ ఆరగించమని ఆజ్ఞాపించాడు. క్రోధంతో ఉన్న సింహం అల్పమృగాలను కబళించినట్లు కల్మాషపాదుడు వసిష్ఠనందనుల నందరినీ తినేశాడు.

విశ్వామిత్రునివల్లనే ఈకార్యం అంతా జరుగుతూన్నదని తెలిసినా వసిష్ఠుడు మేరువు భూమిని ధరించినట్లు పుత్రశోకాన్ని భరించాడు. వసిష్ఠుడు ఆత్మత్యాగానికి సన్నద్ధుడయ్యాడే కాని ఆసమయంలో కూడా విశ్వామిత్రునిమీద కోపించలేదు.

వసిష్ఠుడు మేరుపర్వతశిఖరాగ్రాలనుండి క్రింద పడ్డాడు. ఆయన శరీరం చెక్కు చెదరలేదు. పత్తిరాసిమీద పడ్డట్లనిపించింది. ఇది కాదనుకొని మహారణ్యంలో దవానలమధ్యంలో దూకాడు. ప్రచండంగా ప్రజ్వరిల్లే ఆ అగ్నిజ్వాలలు వసిష్ఠుని తపఃప్రభావంవల్ల శీతలవాయుసమ్మిళితాలయాయి. అదికూడా నిష్ఫలంకాగా వసిష్ఠుడు సముద్రాన్ని చూసి అందులో మునిగిపోదామనుకున్నాడు. బండరాయి మెడకు కట్టుకుని సముద్రంలోకి దూకాడు. సముద్రతరంగాలు ఆ బ్రహ్మర్షికి ఏశ్రమా కలగకుండా గట్టుకు చేర్చాయి. పర్వత శిఖరంనుంచి జారినా దవానలంలోకి దూకినా సముద్రంలో మునిగినా మృత్యువు లభించకపోయేసరికి వసిష్ఠునికి దుఃఖం పెల్లుబికింది. విచారంతో ఆశ్రమమార్గాన సాగాడు.

175 వ అధ్యాయము సమాప్తం

## నూట డెబ్బది ఆరవ అధ్యాయము

నూరుగురు బిడ్డలతో కలకలలాడే ఆ శ్రమం శూన్యంగా కనిపించేసరికి దుఃఖం మరీ అధికమైంది. వసిష్ఠుడు ఆ ఆశ్రమంలో ఉండలేకపోయాడు. తక్షణం వెనుదిరిగాడు. వర్షాకాలం కావటంచేత నదులన్నీ నిండుగా ప్రవహిస్తున్నాయి. దారిలో ఒకనదీతీరం చేరాడు వసిష్ఠుడు. ఆప్రవాహ వేగానికి ఎన్నో వృక్షాలు సమూలంగా కూలిపోయి కొట్టుకుపోతున్నవి. విచారంతో ఉన్న వసిష్ఠుడు ఆనదీప్రవాహంలో పడి మరణిద్దామనుకున్నాడు. ప్రక్కనున్న వేళ్ళతో తాళ్ళతో శరీరాన్ని బంధించుకుని ఉరికాడు. కానీ ఆ ప్రవాహం వసిష్ఠుని బంధనాలను తెగ్గించి గట్టుకే చేర్చింది. పాశబంధం నుండి విముక్తి కలిగినందువల్ల ఆనదికి 'విపాశ' అని వసిష్ఠుడు నామకరణం చేశాడు.

అక్కడనుంచి మరోప్రాంతం చేరాడు. అక్కడా మనశ్శాంతి లేక మరోకప్రదేశం చేరాడు. ఆ వేదనతో ఉన్న ఆ ఋషి పర్వతప్రాంతాలూ నదీతీరాలూ గాఢారణ్యాలూ సరోవరప్రదేశాలూ తిరుగుతూ తిరుగుతూ హిమాలయపర్వత సానువులనుండి ప్రవహించివస్తూన్న ఓ నదిని చూశాడు. అది భయానకంగా మొసళ్ళతో నిండి ఉంది. ఆ ప్రవాహంలో దేహయాత్ర చాలించాలనుకు

శీలరూపగుణోపేతమిక్ష్వాకుకులవృద్ధయే.
దదానీత్యేవ తం తత్ర రాజానం ప్రత్యువాచ హ
వసిష్ఠః పరమేష్వాసం సత్యసంధో ద్విజోత్తమః.
తతః ప్రతియయౌ కాలే వసిష్ఠః సహ తేన వై
ఖ్యాతాం పురీమిమాం లోకేష్వయోధ్యాం మనుజేశ్వర.
తం ప్రజాః ప్రతిమోదంత్యః సర్వాః ప్రత్యుద్గతాస్తదా
విపాప్మానం మహాత్మానం దివౌకస ఇవేశ్వరం.
సుచిరాయ మనుష్యేంద్రో నగరీం పుణ్యలక్షణాం
వివేశ సహితస్తేన వసిష్ఠేన మహర్షిణా.
దదృశుస్తం మహీపాలమయోధ్యావాసినో జనాః
పురోహితేన సహితం దివాకరమివోదితం.
స చ తాం పూరయామాస లక్ష్మ్యా లక్ష్మీవతాం వరః
అయోధ్యాం వ్యోమ శీతాంశుః శరత్కాల ఇవోదితః.
సంసిక్తమృష్టపంథానం పతాకాధ్వజశోభితం
మనః ప్రహ్లాదయామాస తస్య తత్ పురముత్తమం.
తుష్టపుష్టజనాకీర్ణా సా పురీ కురునందన
అశోభత తదా తేన శక్రేణేవామరావతీ.
తతః ప్రవిష్టే రాజర్షౌ తస్మింస్తత్ పురముత్తమం
రాజ్ఞస్తస్యాజ్ఞయా దేవీ వసిష్ఠముపచక్రమే.
ఋతావథ మహర్షిః స సంబభూవ తయా సహ
దేవ్యా దివ్యేన విధినా వసిష్ఠః శ్రేష్ఠభాగృషిః.
తతస్తస్యాం సముత్పన్నే గర్భే స మునిసత్తమః
రాజ్ఞాభివాదితస్తేన జగామ మునిరాశ్రమం.
దీర్ఘకాలేన సా గర్భం సుషువే న తు తం యదా
తదా దేవ్యశ్మనా కుక్షిం నిర్బిభేద యశస్వినీ.
తతోఽపి ద్వాదశే వర్షే స జజ్ఞే పురుషర్షభః
అశ్మకో నామ రాజర్షిః పౌదన్యం యో న్యవేశయత్.

176 వ అధ్యాయం సమాప్తం

## నూట డెబ్బదియేడవ అధ్యాయము

ఆశ్రమస్థా తతః పుత్రమదృశ్యంతీ వ్యజాయత
శక్తేః కులకరం రాజన్ ద్వితీయమివ శక్తినం.
జాతకర్మాదికాస్తస్య క్రియాః స మునిసత్తమః
పౌత్రస్య భరతశ్రేష్ఠ చకార భగవాన్ స్వయం.
పరాసుః స యతస్తేన వసిష్ఠః స్థాపితో మునిః
గర్భస్థేన తతో లోకే పరాశర ఇతి స్మృతః.
అమన్యత స ధర్మాత్మా వసిష్ఠం పితరం మునిః
జన్మప్రభృతి తస్మింస్తు పితరీవాన్వవర్తత.
స తాత ఇతి విప్రర్షిర్వసిష్ఠం ప్రత్యభాషత
మాతుః సమక్షం కౌంతేయ అదృశ్యంత్యాః పరంతప.
తాతేతి పరిపూర్ణార్థం తస్య తన్మధురం వచః
అదృశ్యంత్యశ్రుపూర్ణాక్షీ శృణ్వతీ తమువాచ హ.
మా తాత తాత తాతేతి బ్రూహ్యేవం పితరం పితుః
రక్షసా భక్షితస్తాత తవ తాతో వనాంతరే.
మన్యసే యం తు తాతేతి నైష తాతస్తవానఘ
ఆర్యస్త్వేష పితా తస్య పితుస్తవ యశస్వినః.
స ఏవముక్తో దుఃఖార్తః సత్యవాగృషిసత్తమః
సర్వలోకవినాశాయ మతిం చక్రే మహామనాః.
తం తథా నిశ్చితాత్మానం స మహాత్మా మహాతపాః
ఋషిర్బ్రహ్మవిదాం శ్రేష్ఠో మైత్రావరుణిరంత్యధీః.
వసిష్ఠో వారయామాస హేతునా యేన తచ్ఛృణు
కృతవీర్య ఇతి ఖ్యాతో బభూవ పృథివీపతిః.

న్నాడు. అనుకుంటూనే దూకేశాడు ఆ నది బ్రహ్మర్షికి ఏ ప్రమాదమూ రాకుండా పాయలుపాయలుగా విడిపోయింది. దానినే 'శతద్రు' అని పిలుస్తారు.

ఆ ప్రయత్నంకూడా వ్యర్థంకావటంతో వసిష్ఠుడు తనకు మరణం లేదని నిశ్చయించుకొని తన ఆశ్రమానికి చేరాడు. అలా చేరేసరికి అక్కడ అదృశ్యంతి కనిపించింది. అదృశ్యంతి వసిష్ఠుని ఇంటి కోడలు. అనుక్షణం ఆమె మహర్షి వెనువెంటనే తిరుగుతూండేది. ఓ సమయంలో వసిష్ఠునికి ఉదాత్తానుదాత్తస్వరితస్వర సమ్మిళితంగా అర్థవంతంగా స్ఫుటంగా వేదమంత్రాలు వినిపించసాగాయి. అప్పుడు వసిష్ఠుడు వెనుదిరుగకుండానే తన వెనుక వచ్చేవా రెవరని ప్రశ్నించాడు. నిరంతర తపోదీక్షలో ఉండే శక్తిమహర్షి భార్యనని అనాథనని సమాధానం చెప్పింది అదృశ్యంతి.

అప్పుడు వసిష్ఠుడు తాను శక్తి ముఖతః సస్వరంతో వేదాధ్యయనం ఆకర్ణించానో అదేధ్వని ఇప్పుడు వినవస్తూన్నదనీ అలా అధ్యయనంచేస్తూన్నవా రెవరనీ అడిగాడు.

అప్పుడు అదృశ్యంతి—మహర్షి! మీ ప్రియనందనుడైన శక్తి ఆత్మ నాగర్భంలో పుత్రరూపంలో ఉన్నది. ఈబాలుడు గర్భంలో ఉండగానే వేదాధ్యయనం చేయించారు. అలా పన్నెండేళ్ళు గడిచాయి— అన్నది.

వసిష్ఠుని వదనం వికసించింది. తన వంశం మూలనాశనం కాలేదని గ్రహించి పరమానంద సంభరితుడయాడు. ఆక్షణంలోనే ఆయన మరణ సంకల్పం విరమించుకున్నాడు. కోడలును వెంట బెట్టుకుని ఆశ్రమంవైపు వస్తుండగా దారిలో ఉన్న కల్మాషపాదుడు వసిష్ఠుని ఆహారంగా చేసికోవాలని మీదికి వచ్చాడు. క్రూరస్వభావంతో వచ్చే వాణ్ణిచూచి అదృశ్యంతి— మహర్షి! ఈ రాక్షసుడు యమధర్మరాజులా వస్తున్నాడు. వీడిచేతిలోకూడా యమదండంవంటి కర్ర ఉంది. వీడు నిశ్చింతగా మనల్ని తినేస్తాడు. సర్వవేదవిదులైన మీరే ఈ అసురుణ్ణి ఆపకపోతే మనకు ప్రాణాలు లేవు. రక్షించండి— అని భయంతో వణికిపోతూన్నది.

అమ్మా! నువ్వు వీడికి భయపడకు. వీడు నిజంగా రాక్షసుడు కాడు. ఈ పృథివీచక్రాన్ని నడిపిన చక్రవర్తులలో పేరుపొందిన కల్మాషపాద మహారాజు. ఈ అరణ్యంలో ఈ భీకరరూపంలో చరిస్తూంటాడు. అందుచేత నీకు రాక్షసభయం అనవసరం—అంటూండగానే కల్మాషపాదుడు మీది మీదికి రావటం గమనించి ఒక్కసారి ముని హుంకరించి మంత్రజలం చల్లాడు. అంతలో కల్మాషపాదుడు రాహువిముక్తుడైన సూర్యునివలె ప్రకాశించసాగాడు. శక్తిశాపం పన్నెండు సంవత్సరాలవరకూ పీడించింది. ఆ క్షణంలోనే రాక్షసుడు తన దారినిపోయాడు.

సూర్యకిరణాలు సంధ్యావేళ మేఘాలను ప్రకాశింపజేసేటట్లు కల్మాషపాదుని కాంతి అరణ్యాన్ని వెలిగించింది. శాపవిముక్తుడౌతూనే వసిష్ఠుని పాదాలమీద పడి - మహాపురుషా! తమ అభీష్టం ఏమిటో చెప్పండి. తమ సేవలో నన్ను ఆజ్ఞాపించండి— అన్నాడు.

ఇప్పుడు తనకేమీ కోరిక లేదని యథేచ్ఛగా వెళ్ళవచ్చుననీ అంటూ ఇకముందు బ్రాహ్మణులకు అవమానం తలపెట్టవద్దని హెచ్చరించాడు వసిష్ఠుడు.

తనజీవితంలో ఎన్నడూ అటువంటి పనిచేయననీ ఎప్పుడూ వారిసేవనే సాగిస్తాననీ వారిని పూజించటం

యాజ్యో వేదవిదాం లోకే భృగూణాం పార్థివర్షభః
స తానగ్రభుజస్తాత ధాన్యేన చ ధనేన చ.
సోమాంతే తర్పయామాస విపులేన విశాంపతి
తస్మిన్ నృపతిర్దూలే స్వర్యాతేఽథ కథంచన.
బభూవ తత్కులేయానాం ద్రవ్యకార్యముపస్థితం
భృగూణాం తు ధనం జ్ఞాత్వా రాజానః సర్వ ఏవ తే.
యాచిష్ణవోఽభిజగ్ముస్తాంస్తతో భార్గవసత్తమాన్
భూమౌతు నిదధు కేచిద్ భృగవో ధనమక్షయమ్.
దదుః కేచిద్ద్విజాతిభ్యో జ్ఞాత్వా క్షత్రియతో భయం
భృగవస్తు దదుః కేచిత్తేషాం విత్తం యథేప్సితమ్.
క్షత్రియాణాం తదా తాత కారణాంతరదర్శనాత్
తతో మహీతలం తాత క్షత్రియేణ యదృచ్ఛయా.
స్వనతాధిగతం విత్తం కేనచిద్ భృగువేశ్మని
తద్విత్తం దదృశుః సర్వే సమేతాః క్షత్రియర్షభాః.
అవమన్య తతః క్రోధాద్ భృగూంస్తాన్ శరణాగతాన్
నిజఘ్నుః పరమేష్వాసాః సర్వాంస్తాన్ నిశితైః శరైః
ఆగర్భాదనుకృంతంతశ్చేరుః సర్వాం వసుంధరాం
తత ఉచ్ఛిద్యమానేషు భృగుష్వేవం భయాత్తదా.
భృగుపత్న్యో గిరిం దుర్గం హిమవంతం ప్రపేదిరే
తాసామన్యతమా గర్భం భయాద్దధ్రేమహౌజసమ్.
ఊరుణైకేన వామోరుర్భర్తుః కులవివృద్ధయే
తద్గర్భముపలభ్యాసు బ్రాహ్మణీ యా భయార్దితా.
గత్వైకా కథయామాస క్షత్రియాణాముపహ్వరే
తతస్తే క్షత్రియా జగ్ముస్తం గర్భం హంతుముద్యతాః
దదృశుర్బ్రాహ్మణీం తేఽథ దీప్యమానాం స్వతేజసా
అథ గర్భః స భిత్త్వోరుం బ్రాహ్మణ్యా నిర్జగామ హ.
ముష్ణన్ దృష్టీః క్షత్రియాణాం మధ్యాహ్న ఇవ భాస్కరః
తతశ్చక్షుర్విహీనాస్తే గిరిదుర్గేషు బభ్రముః.
తతస్తే మోహమాపన్నా రాజానో నష్టదృష్టయః
బ్రాహ్మణీం శరణం జగ్ముర్దృష్ట్యర్థం తామనిందితామ్.
ఊచుశ్చైనాం మహాభాగాం క్షత్రియాస్తే విచేతసః
జ్యోతిః ప్రహీణా దుఃఖార్తాః శాంతార్చిష
ఇవాగ్నయః.
భగవత్యాః ప్రసాదేన గచ్ఛేత్ క్షత్రం స చక్షుసం
ఉపారభ్య చ గచ్ఛేమ సహితాః పాపకర్మిణః.
సపుత్రా త్వం ప్రసాదం నః కర్తుమర్హసి శోభనే
పునర్దృష్టిప్రదానేన రాజ్ఞః సంత్రాతుమర్హసి

177 వ అధ్యాయం సమాప్తం.

## నూట డెబ్బది ఎనిమిదవ అధ్యాయము

నాహం గృహ్ణామి వస్తాతా దృష్టీర్నాస్మి రుషాన్వితా
అయం తు భార్గవో నూనమూరుజః కుపితోఽద్య వః
తేన చక్షూంషి వస్తాతా వ్యక్తం కోపాన్మహాత్మనా
స్మరతా నిహతాన్ బంధూనాదత్తాని న సంశయః.
గర్భానపి యదా యూయం భృగూణాం ఘ్నత పుత్రకాః
తదాయమూరుణా గర్భో మయా వర్షశతం ధృతః.
షడంగశ్చాఖిలో వేద ఇమం గర్భస్థమేవ హ
వివేశ భృగువంశస్య భూయః ప్రియచికీర్షయా.
సోఽయం పితృవధాద్వ్యక్తం క్రోధాద్ హంతుమిచ్ఛతి
తేజసా తస్య దివ్యేన చక్షూంషి ముషితాని వః.
తమేవ యూయం యాచధ్వమౌర్వం మమ
సుతోత్తమం
అయం వః ప్రణిపాతేన తుష్టో దృష్టీః ప్రమోక్ష్యతి
ఏవముక్తాస్తతః సర్వే రాజానస్తే తమూరుజం

కంటె తనకు కావలసింది లేదనీ అయితే వసిష్ఠుల వారు అనుగ్రహించి పుత్రప్రాప్తికి మార్గం చెప్పి ఇక్ష్వాకువంశాన్ని ఉద్ధరించాలనీ ఆ కుమారుడు ఉత్తమగుణశీల సంపన్నుడు కావాలనీ కోరాడు. వసిష్ఠుడు కల్మాషపాదుని కోరికకు సమ్మతించి వానితో అయోధ్యానగరం చేరాడు.

మహారాజు రాకవిని పురప్రజలు ఆనందంతో స్వాగతమిచ్చారు. పన్నెండు సంవత్సరాల అనంతరం వసిష్ఠునితో కలిసిరావడం మరీ ఆనందం కలిగించింది. ఆబాల గోపాలం కల్మాషపాదుని చూసి సూర్యభగవానుని దర్శించినట్లే సంతోషించారు.

శరద్రాత్రిలో చంద్రునివలె మహారాజు వారిపై చల్లనిచూపులు ప్రసారించాడు. నగరవీధులన్నీ సుగంధజలాలతో తడుపబడ్డాయి. అంతా అలంకరించారు. పతాకాలు ఎగురుతున్నాయి. ఇంద్రుడు అమరావతిలో ఉన్నట్లుంది. రాజాజ్ఞానుసారం మహారాణి మదయంతి ఋతుసమయంలో వసిష్ఠుని చేరింది. రాజపత్ని గర్భవతికాగానే మహర్షి ఆశ్రమానికి తిరిగాడు. ఎంతకాలమయినా ప్రసవించక పోయేసరికి ఆమె రాతితో గర్భతాడనం చేసికొనాగింది. పన్నెండేళ్ళ అనంతరం ఆమెకు బాలుడు పుట్టాడు. అతడే రాజర్షి అశ్మకుడు.

176 వ అధ్యాయము సమాప్తం

## నూట డెబ్బది ఏడవ అధ్యాయము

వసిష్ఠమహర్షి మరణసంకల్పంలో ఉండగా ఆయనకు జీవితాశకల్పించిన కారణంచేత ఆబాలునికి పరాశరుడు అని నామకరణం చేశారు. వసిష్ఠుడు పౌత్రునికి జాతకర్మాది సంస్కారాలన్నీ యథావిధిగా నిర్వర్తించాడు. ఆబాలుడు వసిష్ఠునే తండ్రిగా భావించేవాడు. ఆయననే తండ్రీ! అని పిలిచేవాడు. ఒకనాడు అదృశ్యంతి వింటూండగా వసిష్ఠుని ఆవిధంగా సంబోధించడంతో ఆమెకన్నుల నీరు నిండింది. ఆమె కుమారుని పిలిచి— నాయనా! ఈమహర్షి నీతండ్రి కాదు. వీరు నీకు తాతగారు. నీతండ్రిని ఒకరాక్షసుడు సంహరించి తినేశాడు. ఈవసిష్ఠులు నీతండ్రికి పూజ్యస్థానీయులైన జనకులు— అనగా విని పరాశరుడు దుఃఖంతో ఈ సమస్త ప్రపంచాన్ని నాశనంచెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. ఆ ఆలోచనను బ్రహ్మర్షి వసిష్ఠుడు గుర్తించి తక్షణం నిరోధించాడు.

నాయనా! కృతవీర్యుడనే పేరుగల మహారాజు ఈభూమండలాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆయన వేదవేదాంగ విషయజ్ఞుడు. భృగువంశీయులు ఆమహారాజుకి కులగురువులు. ఆరాజు సోమయాజ్ఞం చేసి భార్గవులకు విశేష ధనధాన్యాలు ఇచ్చి సత్కరించి సంతృప్తిపరచాడు.

రాజశ్రేష్ఠుడైన కృతవీర్యుడు కాలక్రమాన స్వర్గస్థుడైయాడు. అతని వంశీయులకు ధనాపేక్ష కలిగింది. కులగురువులైన భృగువంశీయుల వద్ద విశేష ధనధాన్యాలున్నాయని తెలిసికొని ఆరాకుమారులు వారివద్దకు వెళ్ళి యాచించారు. అప్పటికే ఆ బ్రాహ్మణులు తమ సంపదల్ని భూమిలో పాతిపెట్టారు. మరికొందరు ఇతర బ్రాహ్మణులకు ధర్మంచేశారు. మిగిలినవారు తమ ధనాన్ని రాకుమారులకు ఇచ్చి

ఊచుః ప్రసీదేతి తదా ప్రసాదం చ చకార సః.
అనేనైవ చ విఖ్యాతో నామ్నా లోకేషు సత్తమః
స ఔర్వ ఇతి విప్రర్షిరూరుం భిత్త్వా వ్యజాయత.
చక్షూంషి ప్రతిలభ్ధ్వా చ ప్రతిజగ్ముస్తతో నృపాః
భార్గవస్తు మునిర్మేనే సర్వలోకపరాభవం.
స చక్రే తాత లోకానాం వినాశాయ మహామనాః
సర్వేషామేవ కార్త్స్న్యేన మనః ప్రవణమాత్మనః.
ఇచ్ఛన్నపచితిం కర్తుం భృగూణాం భృగునందనః
సర్వలోకవినాశాయ తపసా మహతైధితః.
తాపయామాస తాంల్లోకాన్
సదేవాసురమానుషాన్
తపసోగ్రేణ మహతా నందయిష్యన్ పితామహాన్.
తతస్తం పితరస్తాత విజ్ఞాయ కులనందనం
పితృలోకాదుపాగమ్య సర్వ ఊచురిదం వచః.
ఔర్వ దృష్టః ప్రభావస్తే తపసోగ్రస్య పుత్రక
ప్రసాదం కురు లోకానాం నియచ్ఛ క్రోధమాత్మనః.
నానీశైర్హి తదా తాత భృగుభిర్భావితాత్మభిః
వధో హ్యుపేక్షితః సర్వైః క్షత్రియాణాం విహింసతాం.
ఆయుషా విప్రకృష్టేన యదా నః ఖేద ఆవిశత్
తదాస్మాభిర్వధస్తాత క్షత్రియైరీప్సితః స్వయం.
నిఖాతం యచ్చ వై విత్తం కేనచిద్ భృగువేశ్మని
వైరాయైవ తదా న్యస్తం క్షత్రియాన్ కోపయిష్ణుభిః.
కింహి విత్తేన నః కార్యం స్వర్గేప్సూనాం ద్విజోత్తమ
యదాస్మాకం ధనాధ్యక్షః ప్రభూతం ధనమాహరత్.
యదా తు మృత్యురాదాతుం న నః శక్నోతి సర్వశః
తదాస్మాభిరయం దృష్ట ఉపాయస్తాత సమ్మతః.
ఆత్మహా చ పుమాంస్తాత న లోకాన్ లభతే శుభాన్
తతోఽస్మాభిః సమీక్ష్యైవం నాత్మనాఽఽత్మా నిపాతితః
న చైతన్నః ప్రియం తాత యదిదం కర్తుమిచ్ఛసి.
నియచ్ఛేదం మనః పాపాత్ సర్వలోకపరాభవాత్:
మా వధీః క్షత్రియాంస్తాత న లోకాన్ సప్తపుత్రక
దూషయంతం తపస్తేజః క్రోధముత్పతితం జహి.

178 వ అధ్యాయం సమాప్తం.

## నూట డెబ్బది తొమ్మిదవ అధ్యాయము

ఉక్తవానస్మి యాం క్రోధాత్ ప్రతిజ్ఞాం పితరస్తదా
సర్వలోకవినాశాయ న సా మే వితథా భవేత్.
వృథారోషప్రతిజ్ఞో వై నాహం భవితుముత్సహే
అనిస్తీర్ణో హి మాం రోషో దహేదగ్నిరివారణిం.
యో హి కారణతః క్రోధం సంజాతం క్షంతుమర్హతి
నాలం స మనుజః సమ్యక్ త్రివర్గం పరిరక్షితుం.
అశిష్టానాం నియంతా హి శిష్టానాం పరిరక్షితా
స్థానే రోషః ప్రయుక్తః స్యాన్నృపైః సర్వజిగీషుభిః.
అశ్రౌషమహమూరుస్థో గర్భశయ్యాగతస్తదా
ఆరావం మాతృవర్గస్య భృగూణాం క్షత్రియైర్వధే.
సంహారో హి యదా లోకే భృగూణాం క్షత్రియాధమైః
ఆగర్భోచ్ఛేదనాత్ క్రాంతస్తదా మాం
మన్యురావిశత్.
సంపూర్ణకోశాః కిల మే మాతరః పితరస్తథా.
భయాత్ సర్వేషు లోకేషు నాధిజగ్ముః పరాయణం.
తాన్ భృగూణాం యదా దారాన్
కశ్చిన్నాభ్యవపద్యత
మాతా తదాదధారేయమూరుణైకేన మాం శుభా.
ప్రతిషేద్ధా హి పాపస్య యదా లోకేషు విద్యతే
తదా సర్వేషు లోకేషు పాపకృన్నోపపద్యతే.

వేశారు వారు తిరిగి వెళ్ళిపోయారు.

కొంతకాలం గడిచింది.

ఒకరోజున ఒకబ్రాహ్మణుని ఇంటిలో త్రవ్వగా కొంతధనం ఒకరాజుకి దొరికింది. దానితో వారు భార్గవులందరినీ తమ బాణాలతో హింసించి వారిని హతమార్చారు. భార్గవులు ఎంత దీనంగా వేడుకొంటున్నా వారు వినిపించుకోకుండా చంపివేశారు. తీవ్ర క్రోధంతో కన్నులు మూసికొనిపోయి ఆరాజులు భార్గవవంశీయుల వంశాంకురాలనుకూడా చిత్రవధ చేసి స్వేచ్ఛగా విహరించనాగారు. ఈప్రకారంగా భృగువంశ మూలచ్ఛేదం జరుగుతున్న సమయంలో ఆ కులస్త్రీలు హిమాలయగుహలలోకి వెళ్ళిపోయారు. వారు ఆత్మ రక్షణార్థమేకాక వంశ రక్షణార్థం అలా చేశారు. వారిలో ఒకస్త్రీ తన తొడ చీల్చికొని గర్భాన్ని అందులో ఉంచింది. అది తెలిసిన మరొకస్త్రీ ఆవిషయాన్ని క్షత్రియులకు తెలిపింది. వారు క్రోధోద్రిక్తులై ఆగర్భవిచ్ఛేదం చేయడానికి వచ్చారు. మహాతేజస్సుతో ప్రకాశించే ఆమెనుచూస్తూనే వారు నిర్విణ్ణులై నిలబడిపోయారు.

ఆసమయంలో ఆమెతొడనుండి ఒక బాలుడు ప్రభవించాడు. ఆబాలుడు గ్రీష్మభానుసిలా ప్రకాశిస్తూ ఆరాజులకు అంధత్వం కలిగించాడు. వారు గుడ్డివారై అటూ ఇటూ తిరుగుతూ ఆమెనే శరణువేడారు. వారిలో చైతన్యం నశించిపోతూన్నది. ఎంతో శాంతతో ఆమెపాదాలమీద పడి— అమ్మా! మీదయ మామీద ప్రసరించినట్లయితే మాకు ఈదురదృష్టం తొలగిపోతుంది. కన్నులు రాగానే మేము తిరిగి వెళ్ళిపోతాము. మీరు మీకుమారునితో ఈ రాజులందరిమీద అనుగ్రహం ఉంచి ప్రసన్నదృష్టి ప్రసరించి రక్షించండి. కొద్దిక్షణాల విశ్రాంతితో మేము వెళ్ళిపోతాము అన్నారు.

177 వ అధ్యాయం సమాప్తం

## నూట డెబ్బదియెనిమిదవ అధ్యాయము

ఆమెకు వారిమీద అనుగ్రహం కలిగింది. వారినందరినీ దయాదృష్టితో చూస్తూ నాయనా! నాకు మీమీద ఏవిధమైన ద్వేషమూ లేదు. నా కుమారుడే మీదృష్టిని హరించాడు. మావంశంలోని వారినందరినీ మీరు నాశనం చేస్తున్నందువల్ల ఈప్రమాదం జరిగింది. వంశబంధువులను వధిస్తూన్న కారణంచేతనే ఈ కార్యం వాడు చేశాడు. మీరీఘాతుకం తలపెట్టినతరువాత నేను నాగర్భాన్ని తొడలో ఉంచి చిరకాలం రక్షించాను. వాడు అలా నే ఉండి వేదవేదాంగ విదుడయినాడు. తన తండ్రిని చంపినవారి నందరినీ వాడు నాశనంచేసే ఊహతో ఉన్నాడు. ఈబాలుని తేజస్సుకే మీకన్నులు పోయాయి. అందుచేత మీరందరూ నాకుమారుడైన ఔర్వుని శరణు వేడండి. తలలు వంచి మీరు అర్థిస్తే వీడు ప్రసన్నుడై మీకు నేత్ర దానం చేయగలడు— అని పలికింది.

అప్పుడు వారందరూ ఔర్వునికి ప్రణామం చేసి నేత్రప్రదానం చేయవలసిందని కోరారు.

ఔర్వునిక్రోధం చల్లారింది. వారిమీద అనుగ్రహం కలిగింది. అందరికీ దృష్టి ప్రసాదించాడు.

యదా తు ప్రతిషేద్ధారం పాపో న లభతే క్వచిత్
తిష్ఠంతి బహవో లోకా స్తదా పాపేషు కర్మసు.
జానన్నపి చ యః పాపం శక్తిమాన్ న నియచ్ఛతి
ఈశః సన్ సోఽపి తేనైవ కర్మణా సంప్రయుజ్యతే.
రాజభిశ్చేశ్వరైశ్చైవ యది వై పితరో మమ
శక్తైర్న శకితాస్త్రాతుమిష్టం మత్వేహ జీవితం.
అత ఏషామహం క్రుద్ధో లోకానామీశ్వరోఽద్యహం
భవతాం చ వచో నాలమహం సమభివర్తితుం.
మమాపి చేద్ భవేదేవమీశ్వరస్య సతో మహత్
ఉపేక్షమాణస్య పునర్లోకానాం కిల్బిషాద్భయం.
యశ్చాయం మన్యుజో
మేఽగ్నిర్లోకానాదాతుమిచ్ఛతి
దహేదేష చ మామేవ నిగృహీతః స్వతేజసా.
భవతాం చ విజానామి సర్వలోకహితేప్సుతాం
తస్మాద్విధధ్వం యచ్ఛ్రేయో లోకానాం మమ
చేశ్వరాః.
య ఏష మన్యుజస్తేఽగ్నిర్లోకానాదాతుమిచ్ఛతి
అప్సుతం ముంచభద్రంతే లోకాహ్యప్సుప్రతిష్ఠితాః
ఆపోమయాః సర్వరసాః సర్వమాపోమయం జగత్
తస్మాదప్సు విముంచేమం క్రోధాగ్నిం ద్విజసత్తమ.
అయం తిష్ఠతు తే విప్ర యదీచ్ఛసి మహోదధౌ
మన్యుజోఽగ్నిర్దహన్నాపో లోకా హ్యాపోమయాః
స్మృతాః.
ఏవం ప్రతిజ్ఞా సత్యేయం తవానఘ భవిష్యతి
న చైవం సామరా లోకా గమిష్యంతి పరాభవం.
తతస్తం క్రోధజం తాత ఔర్వోఽగ్నిం వరుణాలయే
ఉత్ససర్జ స చైవాప ఉపయుంక్తే మహోదధౌ.
మహద్ధయశిరో భూత్వా యత్ తద్వేదవిదో విదుః
తమగ్నిముద్గిరన్ వక్త్రాత్ పిబత్యాపో మహోదధౌ.
తస్మాత్ త్వమపి భద్రం తే న లోకాన్ హంతుమర్హసి
పరాశర పరాంల్లోకాన్ జానన్ జ్ఞానవతాం వర.

179వ అధ్యాయం సమాప్తం.

## నూట యెనుబదవ అధ్యాయము

ఏవముక్తః స విప్రర్షిర్వసిష్ఠేన మహాత్మనా
న్యయచ్ఛదాత్మనః క్రోధం సర్వలోకపరాభవాత్.
ఈజే చ స మహాతేజాః సర్వవేదవిదాం వరః
ఋషీ రాక్షససత్రేణ శాక్తేయోఽథ పరాశరః.
తతో వృద్ధాంశ్చ బాలాంశ్చ రాక్షసాన్ స మహామునిః
దదాహ వితతే యజ్ఞే శక్తేర్వధమనుస్మరన్.
న హి తం వారయామాస వసిష్ఠో రక్షసాం వధాత్
ద్వితీయామస్య మాభాంక్షం ప్రతిజ్ఞామితి నిశ్చయాత్.
త్రయాణాం పావకానాం చ సత్రే తస్మిన్ మహామునిః
ఆసీత్ పురస్తాద్దీప్తానాం చతుర్థ ఇవ పావకః.
తేన యజ్ఞేన శుభ్రేణ హూయమానేన శక్తిజః
తద్విదీపితమాకాశం సూర్యేణేవ ఘనాత్యయే.
తం వసిష్ఠాదయః సర్వే మునయస్తత్ర మేనిరే
తేజసా దీప్యమానం వై ద్వితీయమివ భాస్కరం.
తతః పరమదుష్ప్రాపమన్యైః ఋషిరుదారధీః
సమాపిపయిషుః సత్రం తమత్రిః సముపాగమత్.
తథా పులస్త్యః పులహః క్రతుశ్చైవ మహాక్రతుః
తత్రాజగ్మురమిత్రఘ్న రక్షసాం జీవితేప్సయా
పులస్త్యస్తు వధాత్ తేషాం రక్షసాం భరతర్షభ
ఉవాచేదం వచః పార్థ పరాశరమరిందమం.

వారందరూ సంతోషంగా వెళ్ళిపోయారు.

తల్లితొడ (ఊరువు) నుంచి పుట్టినందువల్లనే వానిని ఔర్వుడు అని పిలిచేవారు. ఔర్వునికి క్రోధం పూర్తిగా తగ్గలేదు. తాత్కాలికంగా ఉపశమనం కలిగింది. ప్రపంచాన్ని నిర్మూలించాలనే ఊహ అతనిలో మొలకెత్తింది.

భృగుకులానందవర్ధనుడైన ఔర్వుడు తన పితృపితామహ ప్రపితామహులకు సంతోషం కలిగించటం కోసమే ఆ నిశ్చయానికి వచ్చాడు. ఆ మహాత్ముడు అందుకు తగినశక్తికోసం తపోదీక్ష వహించాడు. ఆ భార్గవుని తపస్సు తీవ్రమై దేవాసురమానవ లోకాలను తపింపచేయసాగింది. అతని ఈనిశ్చయం తెలిసి ఊర్ధ్వలోకాలలో ఉన్న భార్గవులందరూ వచ్చి— నాయనా! నీ ఉగ్రతపస్సుయొక్క ప్రభావం మేము చూశాము. నీక్రోధం ఇక ఉపసంహరించు. ఈ విశ్వంమీద దయాభావం ప్రసరించు. క్షత్రియులందరూ మనవంశీయులను సంహరిస్తున్నప్పుడు మేము శాంతచిత్తంతో క్షమాహృదయంతో దానిని అనుభవించాం. మా అంతట మేమే వారి దగ్గరకువెళ్ళి వధించమనికూడా అర్థించాము. మాలో ఒకడు తనధనాన్ని పాతిపెట్టాడు. అదికూడా వైర వృద్ధికే జరిగింది. వాస్తవానికి మాకు సంపద ఎందుకు. కుబేరుడు స్వయంగా వచ్చి మాకు ధనరాశులు ఇచ్చాడు. ఎంతకాలానికి మాకు మృత్యువు రాకపోయేసరికి మేమే ఈ ఉపాయం అన్వేషించి ఆత్మహత్యాదోషం లేకుండా చేసుకోగలిగాం. ఆత్మహత్య మహాపాతకంకదా దానివల్ల ఉత్తమలోకాలు సిద్ధించవు. అందు చేత అవిధంగా జరగాలను కున్నాము. ఇప్పుడు నువ్వు చెయ్య సంకల్పించిన ఈకార్యం మాకు ఎంతమాత్రమూ ఇష్టమైనది కాదు. లోకనాశనంకంటె మహాపాపం లేదు. అందు చేత ఆసంకల్పం సాగనివ్వకు. ఇంతటితో క్రోధం ఉపసంహరించి క్షత్రియనాశనోద్యమంనుంచి బుద్ధి మరలించు. తపస్సువల్ల సిద్ధించేమహాశక్తి క్రోధంతో కలుషితమవుతుంది. కనక నువ్వు క్రోధాన్ని సంహరించి తపశ్శక్తిని పవిత్రం చేసికో—అన్నారు.

178 వ అధ్యాయము సమాప్తం

## నూట డెబ్బది తొమ్మిదవ అధ్యాయము

పితృదేవతలు మాటలువిని ఔర్వుడు క్రోధంతో తానుచేసిన ప్రతిజ్ఞ వ్యర్థంకారాదనీ తన ప్రతిజ్ఞా క్రోధాలు నిష్ఫలంకావటం తనకిష్టంలేదనీ ఒకవేళ అలా జరిగినట్లయితే అది తనహృదయాన్ని వేధిస్తూంటుందనీ కోపాన్ని సంహరించినవాడు ధర్మార్థ కామాలను సంరక్షించుకోలేడనీ పైగా ప్రత్యేక ప్రయోజనంతో ప్రభవించిన క్రోధం దుష్టశిక్షణకూ శిష్టరక్షణకూ అవశ్యమయినదని అన్నాడు.

నేను తల్లితొడలో ఉన్న రోజులలో మన వంశీయులైన స్త్రీల ఆక్రందనాలు విన్నాను. ఈ క్షత్రియులు భార్గవకుల స్త్రీల గర్భస్థ శిశువులను కూడా వధించారు. వారిని ముక్కలు ముక్కలు చేశారు. బ్రాహ్మణవధ ప్రారంభమయినప్పుడే నాకు క్రోధావేశం కలిగింది. బ్రాహ్మణులూ వారి భార్యలూ భయభీతులై దిక్కులేకుండా అల్లాడు

కశ్చిత్ తాతాపవిఘ్నం తే కచ్చిన్నందసి పుత్రక
అజానతామదోషాణాం సర్వేషాం రక్షసాం వధాత్
ప్రజోచ్ఛేదమిమం మహ్యాం న హి కర్తుంత్వమర్హసి
నైష తాత ద్విజాతీనాం ధర్మో దృష్టస్తపస్వినాం.
శమ ఏవ పరో ధర్మస్తమాచర పరాశర
అధర్మిష్ఠం వరిష్ఠః సన్ కురుషే త్వం పరాశర.
శక్తిం చాపి హి ధర్మజ్ఞం నాతిక్రాంతుమిహార్హసి
ప్రజాయాశ్చ మమోచ్ఛేదం న చైవం కర్తుమర్హసి.
శాపాద్ధి శక్తేర్వాసిష్ఠ తదా తదుపపాదితం
ఆత్మజేన స దోషేణ శక్తిర్నీత ఇతో దివం.
న హి తం రాక్షసః కశ్చిచ్ఛక్తో భక్షయితుం మునే
ఆత్మనైవాత్మనస్తేన దృష్టో మృత్యుస్తదాభవత్.
నిమిత్తభూతస్తత్రాసీద్ విశ్వామిత్రః పరాశర
రాజా కల్మాషపాదశ్చ దివమారుహ్య మోదతే.
యే చ శక్త్యవరాః పుత్రా వసిష్ఠస్య మహామునే
తేచసర్వేముదాయుక్తామోదంతేసహితాః సురైః.
సర్వమేతద్ వసిష్ఠస్య విదితం వై మహామునే
రక్షసాం చ సముచ్ఛేద ఏష తాత తపస్వినాం.
నిమిత్తభూతస్త్వం చాత్ర క్రతౌ వాసిష్ఠవందన
తత్ సత్రం ముంచ భద్రం తే సమాప్తమిదమస్తు తే.
ఏవముక్తః పులస్త్యేన వసిష్ఠేన చ ధీమతా
తదా సమాపయామాస సత్రం శాక్తోమహామునిః.
సర్వరాక్షససత్రాయ సంభృతం పావకం తదా
ఉత్తరే హిమవత్పార్శ్వే ఉత్ససర్జ మహావనే.
స తత్రాద్యాపి రక్షాంసి వృక్షానశ్మన ఏవ చ
భక్షయన్ దృశ్యతే వహ్నిః సదా పర్వణి పర్వణి.

180 వ అధ్యాయం సమాప్తం

## నూట యెనుబది ఒకటవ అధ్యాయము

రాజ్ఞా కల్మాషపాదేన గురౌ బ్రహ్మవిదాం వరే
కారణంకిం పురస్కృత్య భార్యా వై సంనియోజితా
జానతా వై పరం ధర్మం వసిష్ఠేన మహాత్మనా
అగమ్యాగమనం కస్మాత్ కృతం తేన మహర్షిణా.
అధర్మిష్ఠం వసిష్ఠేన కృతం చాపి పురా సఖే
ఏతన్మే సంశయం సర్వం ఛేత్తుమర్హసి పృచ్ఛతః.
ధనంజయ నిబోధేదం యన్మాం త్వం పరిపృచ్ఛసి
వసిష్ఠం ప్రతి దుర్ధర్ష తథా మిత్రసహం నృపం.
కథితం తే మయా సర్వం యథా శప్తః స పార్థివః
శక్తినా భరతశ్రేష్ఠ వాసిష్ఠేన మహాత్మనా.
స తు శాపవశం ప్రాప్తః క్రోధపర్యాకులేక్షణః
నిర్జగామ పురాద్రాజా సహదారః పరంతపః.
అరణ్యం నిర్జనం గత్వా సదారః పరిచక్రమే
నానామృగగణాకీర్ణం నానాసత్త్వసమాకులం.
నానాగుల్మలతాచ్ఛన్నం నానాద్రుమసమావృతం
అరణ్యం ఘోరసంనాదం శాపగ్రస్తః పరిభ్రమన్.
సకదాచిత్క్షుధావిష్టో మృగయన్ భక్ష్యమాత్మనః
దదర్శ సుపరిక్లిష్టః కస్మింశ్చిన్నిర్జనే వనే.
బ్రాహ్మణం బ్రాహ్మణీం చైవమిథునాయోపసంగతౌ
తౌ తం వీక్ష్య సువిత్రస్తావకృతార్థౌ ప్రధావితౌ.
తయోః ప్రద్రవతోర్విప్రం జగ్రాహ నృపతిర్బలాత్
దృష్ట్వా గృహీతం భర్తారమథ బ్రాహ్మణ్యభాషత.
శృణురాజన్ మమవచోయత్ త్వంవక్ష్యామిసువ్రత
ఆదిత్యవంశప్రభవస్త్వం హి లోకే పరిశ్రుతః.
అప్రమత్తః స్థితో ధర్మే గురుశుశ్రూషణే రతః
శాపోపహత దుర్ధర్ష న పాపం కర్తుమర్హసి.

తూంటే వారికి ఏవిధంగానూ రక్షణ లభించలేదు. ఆరోజులలో నాతల్లి నన్ను తనతొడలో ఉంచి రక్షించింది.

ఈపృథివిమీద పాపకర్మలను నిరోధించేవారు లేనంతకాలం పాపకృత్యాలు సాగుతూనే ఉంటాయి. అటువంటివారు లేకపోతే ఈ మనుష్యులలో అనేకులు పాపకర్మరతులవుతారు. సర్వప్రాణికోటికీ అత్యంతప్రియమైనది కదా ప్రాణం. ఆప్రాణ సంరక్షణం చేయవలసిన బాధ్యత భుజశక్తి గల రాజులమీద ఉంది. ఉండగా వారు తద్వ్యతిరిక్తంగా హింసా ప్రవృత్తిరతులయారు. బ్రహ్మవిదులయిన భార్గవులనే వధించారు. ఇదే నా క్రోధానికి కారణం. ఈకార్యాన్ని నిర్వహించే శక్తి నాకున్నది. కనకనే నేను మీమాట వినలేక పోతున్నాను. శక్తికలిగి ఉండికూడా నేను ఊరుకున్నట్లయితే ఈపాపం నన్ను అంటుతుంది. ప్రజల పాపకర్మరతులైనప్పుడు వారిని సక్రమమార్గంలో నడపగలశక్తి ఉండీ ఉదాసీనంగా ఉంటే అంతకంటె పాపం వేరేలేదు.

ఈ నాక్రోధాగ్ని జ్వాలలతో లోకాలను భస్మం చేయనివ్వండి. అలాకాక నిరోధించినట్లయి అది నన్నే దహిస్తుంది. లోకకళ్యాణమే పరమాశయంగా కల మీరు ఈసమయంలో పరిష్కార మార్గం సూచించండి- అన్నాడు ఔర్వుడు.

నీక్రోధం ఈ సమస్తప్రపంచాన్ని ఆహారంగా తీసికోవాలని ప్రయత్నిస్తోంది. అది నిజమే కాని నువ్వు ఆక్రోధాన్ని జలంలో విడు. ఈలోకంఅంతా జలంలోనే ఉంది. రసాలన్నీ జలంయొక్క పరిణామ రూపాలే. ఈవిశ్వమే నీటినుండి వచ్చింది. అందుచేత ఆ క్రోధం నీటిలో ఉండి తన ఆకలి తీర్చుకుంటుంది. సముద్రంలో ఉండి అది తన ప్రయోజనం నెరవేర్చుకుంటుంది. అప్పుడు నీ ప్రతిజ్ఞ కూడా భగ్నం కాదు. అందువల్ల లోకాలూ నశించవు— అని శాంతింపజేశారు వారు.

ఈ ఉపాఖ్యానం చెప్పి వసిష్ఠుడు పరాశరునితో- నాయనా ! నాడు ఔర్వుడు విడిన క్రోధాగ్ని నేటికీ సాగరంలో గుర్రపుముఖంలో ఉండి జలాన్ని త్రాగుతూ ఉంటుంది. వేదవిదులందరూ దానిని ఎరుగుదురు. అది అగ్నిజ్వాలలు క్రక్కుతూంటుంది.

నాయనా ! నువ్వు పరలోకవిషయజ్ఞుడవు. సర్వవిదుడవు. అటువంటి నీకు లోకనాశన సంకల్పం కలగటం మంచిదికాదు— అన్నాడు.

179 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఎనుబదియవ అధ్యాయము

### రాక్షససత్రం

బ్రహ్మర్షి వసిష్ఠుని మాటలు విని పరాశరుడు క్రోధాన్ని ఉపసంహరించుకున్నాడు. లోకకళ్యాణ దృష్టికల పరాశరమహర్షి రాక్షససత్రయాగం ఆరంభించాడు. తనతండ్రిని సంహరించిన రాక్షసులందరినీ అగ్నికి ఆహుతి చేయసాగాడు. శక్తినందనుని హృదయం తండ్రికి జరిగిన ఘాతుకంతో పరమ దుఃఖావృతమైనది. ఆ విచారంతోనే రాక్షసులందరినీ హోమగుండంలో ఆహుతి చేయసాగాడు.

ఋతుకాలే తు సంప్రాప్తే భర్తృవ్యసనకర్శితా
అకృతార్థాప్యహం భర్తుః ప్రసవార్థం సమాగతా
ప్రసీద నృపతిశ్రేష్ఠ భర్తాయం మే విసృజ్యతాం
ఏవం విక్రోశమానాయాస్తస్యాస్తు స నృశంసవత్.
భర్తారం భక్షయామాస వ్యాఘ్రో మృగమివేప్సితం
తస్యాః క్రోధాభిభూతాయా యాన్యశ్రూణ్యపతన్ భువి.
సోఽగ్నిః సమభవద్దీప్తస్తం చ దేశం వ్యదీపయత్
తతః సా శోకసంతప్తా భర్తృవ్యసనకర్శితా.
కల్మాషపాదం రాజర్షిమశపద్ బ్రాహ్మణీ రుషా
యస్మాన్మమాకృతార్థాయాస్త్వయా క్షుద్ర నృశంసవత్.
ప్రేక్షంత్యా భక్షితో మేఽద్య ప్రియో భర్తా మహాయశాః.
తస్మాత్ త్వమపి దుర్బుద్ధే మచ్ఛాపపరివిక్షతః.
పత్నీమృతావనుప్రాప్య సద్యస్త్యక్ష్యసి జీవితం
యస్య చర్షేర్వసిష్ఠస్య త్వయా పుత్రా వినాశితాః.
తేన సంగమ్య తే భార్యా తనయం జనయిష్యతి
స తే వంశకరః పుత్రో భవిష్యతి నృపాధమ.
ఏవం శప్త్వా తు రాజానం సా తమాంగిరసీ శుభా
తస్యైవ సంనిధౌ దీప్తం ప్రవివేశ హుతాశనం.
వసిష్ఠశ్చ మహాభాగః సర్వమేతదవైక్షత
జ్ఞానయోగేన మహతా తపసా చ పరంతప.
ముక్తశాపశ్చ రాజర్షిః కాలేన మహతా తతః
ఋతుకాలేఽభిపతితో మదయంత్యా నివారితః.
న హి సస్మార స నృపస్తం శాపం కామమోహితః
దేవ్యాః సోఽథ వచః శ్రుత్వా సంభ్రాంతో నృపసత్తమః.
తం శాపమనుసంస్మృత్య పర్యతప్యద్భృశం తదా
ఏతస్మాత్ కారణాద్రాజా వసిష్ఠం సంన్యయోజయత్.
స్వదారేషు నరశ్రేష్ఠ శాపదోషసమన్వితః.

181 వ అధ్యాయం సమాప్తం

## నూట యెనుబది రెండవ అధ్యాయము

అస్మాకమనురూపో వై యః స్యాద్గంధర్వ వేదవిత్
పురోహితస్తమాచక్ష్వ సర్వం హి విదితం తవ.
యవీయాన్ దేవలస్యైష వనే భ్రాతా తపస్యతి
ధౌమ్య ఉత్కోచకే తీర్థే తం వృణుధ్వం యదీచ్ఛథ.
తతోఽర్జునోఽస్త్రమాగ్నేయం ప్రదదౌ తద్యథావిధి
గంధర్వాయ తదా ప్రీతో వచనం చేదమబ్రవీత్.
త్వయ్యేవ తావత్ తిష్ఠంతు హయా గంధర్వసత్తమ
కార్యకాలే గ్రహీష్యామః స్వస్తి తేఽస్త్వితి చాబ్రవీత్.
తేఽన్యోన్యమభిసంపూజ్య గంధర్వః పాండవాశ్చ హ
రమ్యాద్భాగీరథీతీరాద్యథాకామం ప్రతస్థిరే.
తత ఉత్కోచకం తీర్థం గత్వా ధౌమ్యాశ్రమం తు తే
తం వవ్రుః పాండవా ధౌమ్యం పౌరోహిత్యాయ భారత
తాన్ ధౌమ్యః ప్రతిజగ్రాహ సర్వవేదవిదాం వరః
వన్యేన ఫలమూలేన పౌరోహిత్యేన చైవ హ.
తే సమాశంసిరే లబ్ధాం శ్రియం రాజ్యం చ పాండవాః
బ్రాహ్మణం తం పురస్కృత్య పాంచాలీం చ స్వయంవరే.
పురోహితేన తేనాథ గురుణా సంగతాస్తదా
నాథవంతమివాత్మానం మేనిరే భరతర్షభాః.
స హి వేదార్థతత్త్వజ్ఞస్తేషాం గురురుదారధీః

పరాశరుని ఈప్రతిజ్ఞను భగ్నంచేయటానికి వసిష్ఠుని మనస్సంగీకరించలేదు. ఏవిధమైన అభ్యంతరమూ లేక పరాశరుడు నిర్విఘ్నంగా రాక్షససత్రం సాగిస్తున్నాడు. ఆసమయంలో ఆ మహర్షి అగ్నిసదృశంగా ప్రకాశిస్తున్నాడు. ఆ యజ్ఞం పరమనిర్మల పరిశుద్ధరూపంతో భాసిస్తున్నది. వర్షాకాలం పరిసమాప్తం కాగానే వెలిగే సూర్యునివలె పరాశరుడర్పించే ఆహుతులతో అగ్ని ప్రజ్వలిస్తున్నది. వసిష్ఠాది ఋషిశ్రేష్ఠుల తేజస్సుతో పరాశరుడు ప్రకాశిస్తున్నాడు. ఆ సమయంలో ఆయన చేసే యజ్ఞం ఆపుచేసేశక్తి ఎవరికీ లేకపోయింది.

ఏవిధంగానయినా ఆ సత్రం ఆపుచేయాలని ఉదారహృదయంతో అత్రిమహర్షి పరాశరునివద్దకు వచ్చాడు. పులస్త్య పులహ క్రతు మహాక్రతువు ఆదిగాగలవారుకూడా రాక్షసజాతిని ఉద్ధరించే ఊహతో విచ్చేసినారు. ఎందరో రాక్షసులు యజ్ఞకుండంలో ఆహుతికావటం చూసి పులస్త్య మహర్షి— పరాశరా! నీ యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగుతున్నదా— అని ప్రశ్నించి నెమ్మదిగా— నాయనా! నీతండ్రిని వధించిన వారినేకాక ఏ ఘాతుకమూచేయని నిరపరాధులయిన రాక్షసులెందరినో నువ్వు ఈయజ్ఞంలో ఆహుతి చేయటంవల్ల నీకు కలిగే ఆనందమేమిటి. నువ్వు నాసంతానాన్ని సర్వనాశనం చేయటం సముచితమైన పని కాదు. తపస్సంపన్నులైన బ్రాహ్మణులకు ఇది తగనిపని. బ్రాహ్మణుడు సదా శాంతంతో చరించాలి. బ్రాహ్మణశ్రేష్ఠుడవైన నువ్వు ఈవిధంగా అధర్మంగా ప్రవర్తించకూడదు. నీతండ్రి సర్వధర్మవిదుడు. ఆయన చరించిన మార్గాన్నే నువ్వు నడవాలి కానీ తద్భిన్నంగా చరించి ఆమర్యాదలను ఉల్లంఘించకూడదు. అదీకాక శక్తి శపించటంవల్ల అటువంటి ప్రమాదం సంభవించింది. అది స్వయంకృతాపరాధం. అందువల్లనే ఆయనను రాక్షసుడు తినగలిగాడు. లేకపోతే ఆయనను స్పృశించేశక్తి ఏ రాక్షసునికీ లేదు.

విశ్వామిత్రుడూ కల్మాషపాదుడూ నిమిత్త మాత్రులేకాని వారు సాహసించి చేసిందేమీలేదు. మరోవిషయం ఏమంటే ఇప్పుడు నీతండ్రి స్వర్గంలో సర్వభోగాలు అనుభవిస్తూ ఆనందంతో ఉంటాడు. ఆయనతోపాటు ఆయన సోదరులుకూడా హాయిగా దేవలోకంలో స్వర్గభోగాలనుభవిస్తూవుంటారు.

ఈవిషయాలన్నీ వసిష్ఠులవారెరుగుదురు. ఇప్పుడు జరిగే ఈరాక్షసయజ్ఞంలో నీవు నిమిత్తమాత్రుడవే. కేవలం నీవల్ల ఇది జరగటంలేదు. కనక ఈమారణహోమం ఆపుచెయ్యి. నీకు కళ్యాణం కలుగుతుంది— అన్నాడు.

పులస్త్యుల అభిప్రాయాన్ని వసిష్ఠులవారు సమర్థించారు. ఆమహర్షుల వాక్యాలు విని పరాశరుడు ఆక్షణంలోనే యజ్ఞం పరిసమాప్తం చేసినాడు. సర్వరాక్షససంహారార్థమై ప్రజ్వలింపజేసిన అగ్నిని ఉత్తర దిశలో ఉన్న హిమాలయప్రాంతాలలో విశాలారణ్యంలో విడిచినాడుపరాశరుడు. ఆ అగ్ని నేటికీ అక్కడ ఉండే వృక్షాలనూ రాక్షసులనూ పర్వదినాలలో భస్మం చేస్తూంటాడు— అని గంధర్వుడు అర్జునునికి చెప్పిన ఉపాఖ్యానాలను వైశంపాయనుడు జనమేజయునికి వివరిస్తున్నాడు.

180 వ అధ్యాయము సమాప్తం

తేన ధర్మవిదా పార్థా యాజ్యా ధర్మవిదః కృతాః. కృతస్వస్త్యయనాస్తేన తతస్తే మనుజాధిపాః
వీరాంస్తుసహితాన్మేనే ప్రాప్త రాజ్యాన్స్వధర్మతః మేనిరే సహితా గంతుం పాంచాల్యాస్తం
వృద్ధివీర్యబలోత్సాహైర్యుక్తాన్ దేవానివ ద్విజః. స్వయంవరం.

182వ అధ్యాయం సమాప్తం.

## నూట యెనుబది మూడవ అధ్యాయము

### స్వయంవర పర్వము

తతస్తే నరశార్దూలా భ్రాతరః పంచ పాండవాః
ప్రయయుర్ద్రౌపదీం ద్రష్టుం తంచదేశంమహోత్సవం.
తేప్రయాతానరవ్యాఘ్రాఃసహమాత్రాపరంతపాః
బ్రాహ్మణాన్ దదృశుర్మార్గే గచ్ఛతః సంగతాన్ బహూన్.

త ఊచుర్బ్రాహ్మణా రాజన్ పాండవాన్ బ్రహ్మచారిణః
క్వ భవంతో గమిష్యంతి కుతో వాభ్యాగతా ఇహ.
ఆగతానేకచక్రాయాః సోదర్యానేకచారిణః
భవంతో హి విజానంతు సహ మాత్రా ద్విజర్షభాః.
గచ్ఛతాద్యైవ పంచాలాన్ ద్రుపదస్య నివేశనే
స్వయంవరో మహాంస్తత్ర భవితా సుమహాధనః.
ఏకసార్థం ప్రయాతాః స్మ వయం తత్రైవ గామినః
తత్ర హ్యద్భుతసంకాశో భవితా సుమహోత్సవః.
యజ్ఞసేనస్య దుహితా ద్రుపదస్య మహాత్మనః
వేదీమధ్యాత్ సముత్పన్నా పద్మపత్రనిభేక్షణా.
దర్శనీయానవద్యాంగీ సుకుమారీ మనస్వినీ
ధృష్టద్యుమ్నస్య భగినీ ద్రోణశత్రోః ప్రతాపినః.
యో జాతః కవచీ ఖడ్గీ సశరః సశరాసనః
సుసమిద్ధే మహాబాహుః పావకే పావకోపమః.
స్వసా తస్యానవద్యాంగి ద్రౌపదీ తనుమధ్యమా
నీలోత్పలసమో గంధో యస్యాః క్రోశాత్ ప్రవాతి వై.
యజ్ఞసేనస్య చ సుతాం స్వయంవరకృతక్షణాం
చచ్ఛామో వై వయం ద్రష్టుం తం చ దివ్యం మహోత్సవం.
రాజానో రాజపుత్రాశ్చ యజ్వానో భూరిదక్షిణాః
స్వాధ్యాయవంతః శుచయో మహాత్మానో యతవ్రతాః.
తరుణా దర్శనీయాశ్చ నానాదేశసమాగతాః
మహారథా కృతాస్త్రాశ్చ సముపైష్యంతి భూమిపాః.
తే తత్ర వివిధాన్ దాయాన్ విజయార్థం నరేశ్వరాః
ప్రదాస్యంతి ధనంగాశ్చ భక్ష్యం భోజ్యం చ సర్వశః.
ప్రతిగృహ్యచతత్ సర్వం దృష్ట్వాచైవ స్వయంవరం
అనుభూయోత్సవంచైవ గమిష్యామోయథేప్సితం.
నటా వైతాలికాస్తత్ర నర్తకాః సూతమాగధాః
నియోధకాశ్చ దేశేభ్యః సమేష్యంతి మహాబలాః.
ఏవంకౌతూహలం కృత్వా దృష్ట్వాచ ప్రతిగృహ్యచ
సహాస్మాభిర్మహాత్మానః పునః ప్రతినివర్త్స్యథ.
దర్శనీయాంశ్చ వః సర్వాన్ దేవరూపానవస్థితాన్
సమీక్ష్య కృష్ణా వరయేత్ సంగత్యైకతమం వరం.
అయం భ్రాతాతవశ్రీమాన్ దర్శనీయోమహాభుజః
నియుజ్యమానో విజయే సంగత్యా ద్రవిణం బహు
ఆహరిష్యన్నయం నూనం ప్రీతిం వో వర్ధయిష్యతి.
పరమం భోగమిష్యామో ద్రష్టుంచైవ మహోత్సవం
భవద్భిః సహితాః సర్వే కన్యాయాస్తం స్వయంవరం.

183 వ అధ్యాయం సమాప్తం

## నూట యెనుబది ఒకటవ అధ్యాయము

కల్మాషపాదుడు వసిష్ఠులవారిని వెంటబెట్టుకొని వెళ్ళి సంతానార్థం తనపత్నిని ఆయనదగ్గరకు పంపవలసిన కారణమేమిటో ఋషిసత్తముడైన వసిష్ఠుడు పరదారాగమనానికి ఎందుకు అంగీకరించవలసి వచ్చిందో అంతటి వాడు అటువంటిపనికి పూనుకో వలసిన అగత్యం ఏమిటో వివరించమని అర్జునుడు కోరగా గంధర్వుడు సమగ్రంగా చెప్పుతున్నాడు.

అర్జునా! వసిష్ఠబ్రహ్మర్షి పుత్రుడైన శక్తివల్ల కల్మాషపాదుడు శాపంపొంది అనుభవించిన విషయాలన్నీ విన్నావు. శాపవశుడైన కల్మాషపాదుడు భార్యాసమేతంగా అరణ్యాలలో చరిస్తున్నాడు. ఆరోజులలో వాని కన్నులు క్రోధారుణిమతో నిండి ఉండేవి. ఆరాజు చరించే అరణ్యంలో ఘాతుక మృగాల భయంకరధ్వనులు నిరంతరం వినిపించేవి. ఆనిర్జనారణ్యంలో అల్లిబిల్లిగా పొదలు అల్లుకొని భీతావహంగా ఉండేవి. ఆఘోరారణ్యంలో చరిస్తూ ఉన్న కల్మాషపాదునికి ఒకనాడు అపారంగా దాహమూ ఆకలీ కలిగాయి. ఆహారార్థం అన్వేషిస్తూ తిరుగుతూండగా ఒక బ్రాహ్మణదంపతులు కనిపించారు. ఆసమయంలో వారు రతిక్రీడలో ఉన్నారు.

ఆస్థితిలో వారు రాక్షసావిష్టుడైన కల్మాషపాదుని చూసి భయంతో పారిపోయారు. అలా వెళ్ళిపోయే దంపతులలో భర్తను పట్టినాడు రాక్షసుడు. ఆ ఘాతుకంచేసే కల్మాషపాదుని చూస్తూ— మహారాజా! మీరు లోకవిఖ్యాతిమైన సూర్యవంశంలో పుట్టినవారు. సర్వలోకాలలో ఖ్యాతి సంపాదించారు. మీవంశంలో ధర్మాతిరేకంగా ప్రవర్తించిన వారులేరు. గురువృద్ధజన సేవావ్రతులు మీ వంశీయులు. ఇప్పుడు మీరు శాపగ్రస్తులైనా పాప కార్యం చేయకూడదు. నేను ఋతుస్నాతనై ఉన్న ఈసమయంలో నన్ను నాభర్తకు దూరంచేయడానికి మీరుప్రయత్నిస్తున్నారు. నేను సంతానవాంఛతో ఉన్నాను. నామనోవాంఛ తీరలేదు. నాభర్తను విడిచిపెట్టండి. నాయందు అనుగ్రహం ఉంచండి—అని పరిదీనవదనయై అర్థించింది.

పెద్దపులి తన పంజాలో ఉన్న మృగాన్ని నిశ్శంకగా తినేసినట్లే కల్మాషపాదుడు ఆమె దీనాలాపాలు వినకుండా ఆ బ్రాహ్మణుని ఆరగించాడు. ఆమెకు దుఃఖమూ క్రోధమూ కలిగాయి. ఆబాధలో ఆమె కన్నులనుండి జారే బాష్పాలన్నీ అగ్నిసదృశాలయి పోయాయి. ఆ అగ్నితో ఆప్రాంతమంతా భస్మమయిపోయింది. పతి వియోగం వల్ల కలిగిన దుఃఖంతో ఆమె— భార్యాభర్తృ సంబంధమైన వాంఛ తీరకుండా నువ్వు పరమనీచంగా ప్రవర్తించి నాభర్తను నాకనులయెదుటనే తిన్నావు. నువ్వు ఇంతక్రూరంగా మూర్ఖంగా నడిచినందుకు ఫలం అనుభవించక తప్పదు. ఋతుస్నాతయై ఉన్న నీ భార్యను కలిసినట్లయితే ఆక్షణంతో నువ్వుకూడా మరణిస్తావు. అంతతో నీపాపం నశించదు. వసిష్ఠ మహర్షి నూరుగురు కుమారులనూ నువ్వు వధించావు. అయినా ఆయననే అర్థించి ఆయన ద్వారా నీభార్య సంతానవతి అయ్యే స్థితి నీకు కలగాలని నేను శపిస్తున్నాను. ఆబాలునివల్లనే నీవంశం వృద్ధి పొందుతుంది—అని ఆమె ఆక్షణంలోనే కల్మాషపాదుడు చూస్తూండగనే మంటలలో దూకి ప్రాణ త్యాగం చేసికొన్నది. సర్వవిషయజ్ఞుడైన వసిష్ఠుడు తన తపశ్శక్తితో ఈవివరాలన్నీ గ్రహించినాడు.

## నూట యెనుబది నాల్గవ అధ్యాయము

ఏవముక్తాః ప్రయాతాస్తే పాండవా జనమేజయ
రాజ్ఞా దక్షిణపంచాలాన్ ద్రుపదేనాభిరక్షితాన్.
తతస్తే సుమహాత్మానం శుద్ధాత్మానమకల్మషం
దదృశుః పాండవా వీరా మునిం ద్వైపాయనం తదా.
తస్మై యథావత్ సత్కారం కృత్వా తేన చ సత్కృతాః
కథాంతే చాభ్యనుజ్ఞాతాః ప్రయయుర్ద్రుపదక్షయం.
పశ్యంతో రమణీయాని వనాని చ సరాంసి చ
తత్ర తత్ర వసంతశ్చ శనైర్జగ్ముర్మహారథాః.
స్వాధ్యాయవంతః శుచయో మధురాః ప్రియవాదినః
ఆనుపూర్వ్యేణ సంప్రాప్తాః పంచాలాన్ పాండునందనాః
తే తు దృష్ట్వా పురం తచ్చ స్కంధావారం చ పాండవాః
కుంభకారస్య శాలాయాం నివాసం చక్రిరే తదా.
తత్ర భైక్షం సమాజహ్రుర్బ్రాహ్మణీం వృత్తిమాశ్రితాః
తాన్ సంప్రాప్తాంస్తథా వీరాన్ జజ్ఞిరే న నరాః క్వచిత్
యజ్ఞసేనస్య కామస్తు పాండవాయ కిరీటినే
కృష్ణాం దద్యామితి సదా న చైతద్ వివృణోతి సః.
సోఽన్వేషమాణః కౌంతేయం పాంచాల్యో జనమేజయ
దృఢం ధనురనాయమ్యం కారయామాస భారత.
యంత్రం వైహాయసం చాపి కారయామాస కృత్రిమం
తేన యంత్రేణ సమితం రాజా లక్ష్యం చకార సః.
ఇదం సజ్యం ధనుః కృత్వా సజ్జైరేభిశ్చ సాయకైః
అతీత్య లక్ష్యం యో వేద్ధా స లబ్ధా మత్సుతామితి.
ఇతి స ద్రుపదో రాజా స్వయంవరమఘోషయత్
తచ్ఛ్రుత్వా పార్థివాః సర్వే సమీయుస్తత్ర భారత.
ఋషయశ్చ మహాత్మానః స్వయంవరదిదృక్షవః
దుర్యోధనపురోగాశ్చ సకర్ణాః కురవో నృప.
బ్రాహ్మణాశ్చ మహాభాగా దేశేభ్యః సముపాగమన్.
తతోఽర్చితా రాజగణా ద్రుపదేన మహాత్మనా.
ఉపోపవిష్టా మంచేషు ద్రష్టుకామాః స్వయంవరం
తతః పౌరజనాః సర్వే సాగరోద్ధూతనిఃస్వనాః.
శిశుమారశిరః ప్రాప్య న్యవిశంస్తే స్మ పార్థివాః
ప్రాగుత్తరేణ నగరాద్ భూమిభాగే సమే శుభే.
సమాజవాటః శుశుభే భవనైః సర్వతో వృతః
ప్రాకారపరిఖోపేతో ద్వారతోరణమండితః.
వితానేన విచిత్రేణ సర్వతః సమలంకృతః
తూర్యౌఘశతసంకీర్ణః పరార్ధ్యాగురుధూపితః.
చందనోదకసిక్తశ్చ మాల్యదామోపశోభితః
కైలాసశిఖరప్రఖ్యైర్నభస్తలవిలేఖిభిః.
సర్వతః సంవృతః శుభ్రైః ప్రాసాదైః సుకృతోచ్ఛ్రయైః
సువర్ణజాలసంవీతైర్మణికుట్టిమభూషణైః.
సుఖారోహణసోపానైర్మహాసనపరిచ్ఛదైః
స్రగ్దామసమవచ్ఛన్నైరగురూత్తమవాసితైః.
హంసాంశువర్ణైర్బహుభిరాయోజనసుగంధిభిః
అసంబాధశతద్వారైః శయనాసనశోభితైః.
బహుధాతుపినద్ధాంగైర్హిమవచ్ఛిఖరైరివ
తత్ర నానాప్రకారేషు విమానేషు స్వలంకృతాః.
స్పర్ధమానాస్తదాన్యోన్యం నిషేదుః సర్వపార్థివాః
తత్రోపవిష్టాన్ దదృశుర్మహాసత్త్వపరాక్రమాన్.
రాజసింహాన్ మహాభాగాన్ కృష్ణాగురువిభూషితాన్
మహాప్రసాదాన్ బ్రహ్మణ్యాన్ స్వరాష్ట్రపరిరక్షిణః
ప్రియాన్ సర్వస్య లోకస్య సుకృతైః కర్మభిః శుభైః
మంచేషు చ పరార్ధ్యేషు పౌరజానపదా జనాః.
కృష్ణాదర్శనసిద్ధ్యర్థం సర్వతః సముపావిశన్
బ్రాహ్మణైస్తే చ సహితాః పాండవాః సముపావిశన్.
ఋద్ధిం పాంచాలరాజస్య పశ్యంతస్తామనుత్తమాం

చిరకాలానికి కల్మాషపాదుడు శాపవిముక్తి పొందినాడు. అనంతరం ఒకసమయంలో మదయంతి ఋతుస్నాతయై ఉండగా ఆమెను కలియగోరినాడు. కానీ పూర్వవిషయ స్మృతితో మదయంతి అంగీకరించలేదు. కల్మాషపాదుని మోహం శాంతి పొందలేదు. అది అంతకంతకు జ్వలిస్తున్నది. ఆవేశంలో కల్మాషపాదునికి బ్రాహ్మణస్త్రీ శపించినట్లే గుర్తు లేదు. అప్పుడు మదయంతి శాపవిషయం చెప్పింది. కల్మాషపాదుని హృదయం విచార సాగరంలో మునిగిపోయింది. కొంతసేపటికి తేరుకొని అప్పుడు వసిష్ఠులవారిని అర్థించి సంతానార్థం మదయంతిని నియోగించినాడు.

181 వ అధ్యాయం సమాప్తం.

## నూట ఎనుబది రెండవ అధ్యాయము

గంధర్వుడు చెప్పిన కథలన్నీ వినినాడు అర్జునుడు. కులగురువుల అవసరం అర్జునునికి అవగాహనమైనది. తమకు తగిన పురోహితుని కూడా చూపించమని గంధర్వునే అడిగినాడు అర్జునుడు. అప్పుడు గంధర్వుడు ఇలా అన్నాడు.

కుంతీనందనా ! ఈ అరణ్యంలో ఉత్కోచమనే తీర్థం ఉంది. ఆపవిత్రప్రాంతంలో ధౌమ్యుడనే పేరుగల ఋషి తపస్సు చేసికొంటున్నాడు. ఆయన దేవలమహర్షి సోదరుడు. ఆయనను ప్రార్థించి మీ పురోహితునిగా వరించండి.

ఆమాటలు అర్జునునికి ఆనందం కలిగించాయి. అప్పుడు గంధర్వునికి విధివిధానంగా ఆగ్నేయాస్త్ర ప్రధానం చేసి— మిత్రుడా ! నువ్వు మాకిచ్చిన ఈగుర్రాలను నీదగ్గరే ఉండనియ్యి. మాకు అవసరం కలిగినప్పుడు తీసికోగలం. నీకు శుభమగుగాక— అన్నాడు.

ఆతరువాయి పాండవులూ గంధర్వుడూ సముచితంగా సత్కారసంభాషణలు సాగించుకొన్నారు. నెమ్మదిగా పాండవులు గంగారమణీయసైకతాలను విడిచి స్వేచ్ఛగా ముందుకు సాగుతున్నారు. సాగి సాగి గంధర్వుడు చెప్పిన గుర్తులనుపట్టి ఉత్కోచక తీర్థం చేరారు. ధౌమ్యులవారి ఆశ్రమం ప్రవేశించి ఆయనను పురోహితునిగా వరించారు. ధౌమ్యుడు అంగీకరించి వారికి కందమూలఫలాలతో ఆతిథ్యమిచ్చినాడు. ధౌమ్యులవారు అంగీకారసూచకంగా తలత్రిప్పిన క్షణంలోనే త్రిభువనసామ్రాజ్య శ్రీ విభవాభిరాములైనంత ఆనందం పాండవులకు కలిగింది. పాంచాలంలో జరుగుతున్న స్వయంవరంలో ద్రౌపది తమనే వరించి తీరుతుందనే ఆశ—కాదు—విశ్వాసం వారికి కలిగింది. ఆసమయంలో పాండవులకు ఎంతో ధైర్యం చిక్కింది. ధౌమ్యులే వారికి భగవంతునివలె గోచరించాడు. వేదవేదాంగవిదుడు ధౌమ్యుడు పరమసంతోషంతో పాండవపురోహితుడై వారిని తన యజమానులుగా భావించాడు.

బలవీర్య శ్రీ ధీరశక్తియుతులైన పాండవులకు తమ రాజ్యం లభించగలదనే నమ్మకం కలిగింది. ధౌమ్యుడు పవిత్రవాణితో వారిపై ఆశీస్సులు వర్షించాడు. పురోహిత పురోగాములై పాండవులు స్వయంవర సభాస్థలి ఉన్న పాంచాలదేశం వైపు నడుస్తున్నారు.

తతః సమాజో వవృధే స రాజన్ దివసాన్ బహూన్.
రత్నప్రదానబహులః శోభితో నటనర్తకైః
వర్తమానే సమాజే తు రమణీయేఽహ్ని షోడశే.
ఆప్లుతాంగీ సువాసనా సర్వాభరణభూషితా
మాలాంచ సముపాదాయ కాంచనీం సమలంకృతాం
అవతీర్ణా తతో రంగం ద్రౌపదీ భరతర్షభ
పురోహితః సోమకానాం మంత్రవిద్బ్రాహ్మణః
శుచిః.
పరిస్తీర్య జుహావాగ్నిమాజ్యేన విధివత్తదా
సంతర్పయిత్వా జ్వలనం బ్రాహ్మణాన్ స్వస్తివాచ్య చ.
వారయామాస సర్వాణి వాదిత్రాణి సమంతతః
నిఃశబ్దే తు కృతే తస్మిన్ ధృష్టద్యుమ్నో విశాంపతే.
కృష్ణామాదాయ విధివన్మేఘదుందుభినిఃస్వనః
రంగమధ్యే గతస్తత్ర మేఘగంభీరయా గిరా

వాక్యముచ్చైర్జగాదేదం శ్లక్ష్ణమర్థవదుత్తమం.
ఇదం ధనుర్లక్ష్యమిమే చ బాణాః
శృణ్వంతు మే భూపతయః సమేతాః
ఛిద్రేణ యంత్రస్య సమర్పయధ్వం
శరైః శితైర్వ్యోమచరైర్దశార్ధైః.
ఏతన్మహత్ కర్మ కరోతి యో వై
కులేన రూపేణ బలేన యుక్తః
తస్యాద్య భార్యా భగినీ మమేయం
కృష్ణా భవిత్రీ న మృషా బ్రవీమి.
తానేవముక్త్వా ద్రుపదస్య పుత్రః
పశ్చాదిదం తాం భగినీమువాచ
నామ్నా చ గోత్రేణ చ కర్మణా చ
సంకీర్తయన్ భూమిపతీన్ సమేతాన్.

184 వ అధ్యాయం సమాప్తం

## నూట యెనుబది ఐదవ అధ్యాయము

దుర్యోధనో దుర్విషహో దుర్ముఖో దుష్ప్రధర్షణః
వివింశతిర్వికర్ణశ్చ సహో దుఃశాసనస్తథా.
యుయుత్సుర్వాయువేగశ్చ భీమవేగరవస్తథా
ఉగ్రాయుధో బలాకీ చ కరకాయుర్విరోచనః.
కుండకశ్చిత్రసేనశ్చ సువర్చాః కనకధ్వజః
నందకో బాహుశాలీ చ తుహుండో వికటస్తథా.
ఏతే చాన్యే చ బహవో ధార్తరాష్ట్రా మహాబలాః
కర్ణేన సహితా వీరాస్త్వదర్థం సముపాగతాః.
అసంఖ్యాతా మహాత్మానః పార్థివాః క్షత్రియర్షభాః
శకునిః సౌబలశ్చైవ వృషకోఽథ బృహద్బలః.
ఏతే గాంధారరాజస్య సుతాః సర్వే సమాగతాః
అశ్వత్థామా చ భోజశ్చ సర్వశస్త్రభృతాం వరౌ.

సమవేతౌ మహాత్మానౌ త్వదర్థే సమలంకృతౌ
బృహంతో మణిమాంశ్చైవ దండధారశ్చ పార్థివః.
సహదేవజయత్సేనౌ మేఘసంధిశ్చ పార్థివః
విరాటః సహ పుత్రాభ్యాం శంఖేనైవోత్తరేణ చ.
వార్ధక్షేమిః సుశర్మా చ సేనాబిందుశ్చ పార్థివః
సుకేతుః సహపుత్రేణ సునామ్నా చ సువర్చసా.
సుచిత్రః సుకుమారశ్చ వృకః సత్యధృతిస్తథా
సూర్యధ్వజో రోచమానో నీలశ్చిత్రాయుధస్తథా.
అంశుమాంశ్చేకితానశ్చ శ్రేణిమాంశ్చ మహాబలః
సముద్రసేనపుత్రశ్చ చంద్రసేనః ప్రతాపవాన్.
జలసంధః పితాపుత్రౌ విదండో దండ ఏవ చ
పౌండ్రకో వాసుదేవశ్చ భగదత్తశ్చ వీర్యవాన్.

## నూట యెనుబది మూడవ అధ్యాయము

### స్వయంవర పర్వము

పాంచాలదేశ రమణీయ సౌభాగ్యాన్నీ ఆదేశపు రాకుమారినీ అక్కడ జరిగే మహోత్సవాన్నీ చూడాలనే కోరికతో పాండవులు కుంతీసహితులై ధౌమ్యులవారితో ప్రయాణం సాగిస్తున్నారు. దారిలో ఎందరో విప్రవరులూ బ్రహ్మచారులూ వారికి కలిశారు. వారు పాండవులను చూసి— ఎక్కడనుంచి వస్తున్నారు. ఎక్కడికి వెడుతున్నారు- అని ప్రశ్నించగా వారు తామైదుగురూ సోదరులనీ ఆమె తమతల్లి అనీ ఏకచక్రపురంనుంచి వస్తున్నామనీ అన్నారు. ధనధాన్య సమృద్ధమైన పాంచాల దేశంలో స్వయంవరమహోత్సవం జరుగనున్నదనీ అక్కడికే తాము వెడుతున్నామనీ ఆ బ్రాహ్మణులు చెపుతూ పాంచాలరాజు ద్రుపదుడు యజ్ఞం చేసినప్పుడు ఆ యజ్ఞకుండంనుండి ఒకకన్య ఆవిర్భవించినదనీ ఆమెనే యాజ్ఞసేని అని పిలుస్తారనీ ఆమె ప్రఫుల్ల నయనాలతో లోకమోహనంగా ఉంటుందనీ ఆమెను కన్నులార చూడటమే అదృష్టమనీ చెప్పి— యజ్ఞవేదినుండి ఖడ్గకవచాలతో ధనుర్బాణాలతో ప్రభవించిన ధృష్టద్యుమ్నుని చెల్లెలు ఆమె. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యునికి గర్భశత్రువు. ఆ రాకుమారుడు అగ్నికల్పుడు-అని వారు తిరిగి ద్రౌపదీ సౌందర్య వర్ణనోత్సుకులై— ఆ యాజ్ఞసేని తనుమధ్య, ఆమెశరీరం నవవికసితనీలోత్పల సుగంధ సౌరభాలను వెదజల్లుతూంటుంది. ఇప్పుడు ఆమెకే ద్రుపదమహారాజులుంగారు స్వయంవరం ప్రకటించారు. మేమందరమూ ఆ రాజపుత్రిని స్వయంవర ఉత్సాహోత్సాహంలో ఉన్న దానిని చూడాలని వెడుతున్నాము. దానధర్మ నిరతులూ యజ్ఞకర్మరతులూ నియమవ్రతపరాయణులూ యువవీరులూ అయిన రాకుమారులెందరో వస్తారు. అస్త్రవిద్యావిదులు అనేకులు వస్తారు. వారు విజయశ్రీని కోరుతూ విరివిగా ధనధాన్యాలు అర్పిస్తారు.

వారు అర్పించే ధనసంపదలు గ్రహించి స్వయంవరమహోత్సవాన్ని కన్నులారచూచి సంతోషంగా స్వగృహాలకు వెడతాం— అని ఆ బ్రాహ్మణులు ఇంకా అక్కడ జరిగే ఉత్సవవిశేషాలను పాండవవీరులకు చెపుతున్నారు. పాండవులు సంతోషంతో వారి మాటలు వింటున్నారు.

ఆ మహోత్సవానికి వందిమాగధ వైతాళిక బృందాలేకాక నర్తకీ గాయకనట సంఘాలు కూడా వస్తారు. బలవంతులైన మల్లయోధులు కూడా వస్తారు. వారి ప్రదర్శనాలను కని విని భూరిదక్షిణలు గ్రహించి వద్దాము. చూస్తూంటే మీరు దేవతాస్వరూపుల్లా ఉన్నారు. దైవం అనుకూలిస్తే మీలో ఒకర్ని ద్రౌపది వరించవచ్చు. మీ అర్జునుడు చూడ చక్కగా ఎంతో అందంగా ఉన్నాడు. ఈతడు కదలినట్లయితే విజయసాధకుడై సంపదలు సమకూర్చగలడు— అను వారిమాటలు విని ధర్మరాజు తాముకూడా ఆ స్వయంవర మహోత్సవ దర్శనోత్సుకత్వంతో ఉన్నామని వారివెంట బయలు దేరాడు.

183 వ అధ్యాయము సమాప్తం

కాళింగస్తామ్రలిప్తశ్చ పత్తనాధిపతిస్తథా
మద్రరాజస్తథా శల్యః సహపుత్రో మహారథః.
రుక్మాంగదేన వీరేణ తథా రుక్మరథేన చ
కౌరవ్యః సోమదత్తశ్చ పుత్రాశ్చాస్య మహారథాః.
సమవేతాస్త్రయః సూరా భూరిర్భూరిశ్రవాః శల
సుదక్షిణశ్చ కాంబోజో దృఢధన్వా చ పౌరవః.
బృహద్బలః సుషేణశ్చ శిబిరౌశీనరస్తథా
పటచ్చరనిహంతా చ కారూషాధిపతిస్తథా.
సంకర్షణో వాసుదేవో రౌక్మిణేయశ్చ వీర్యవాన్
సాంబశ్చ చారుదేష్ణశ్చ ప్రాద్యుమ్నిః సగదస్తథా.
అక్రూరః సాత్యకిశ్చైవ ఉద్ధవశ్చ మహామతిః
కృతవర్మా చ హార్దిక్యః పృథుర్విపృథురేవ చ.
విదూరథశ్చ కంకశ్చ శంకుశ్చ సగవేషణః
ఆశావహోఽనిరుద్ధశ్చ శమీకః సారిమేజయః.
వీరో వాతపతిశ్చైవ ఝిల్లీపిండారకస్తథా
ఉశీనరశ్చ విక్రాంతో వృష్ణయస్తే ప్రకీర్తితాః.
భాగీరథో బృహత్క్షత్రః సైంధవశ్చ జయద్రథః
బృహద్రథో బాహ్లికశ్చ శ్రుతాయుశ్చ మహారథః.
ఉలూకః కైతవో రాజా చిత్రాంగదశుభాంగదౌ
వత్సరాజశ్చ మతిమాన్ కోసలాధిపతిస్తథా.
శిశుపాలశ్చ విక్రాంతో జరాసంధస్తథైవ చ
ఏతే చాన్యే చ బహవో నానాజనపదేశ్వరాః.
త్వదర్థమాగతా భద్రే క్షత్రియాః ప్రథితా భువి
ఏతే భేత్స్యంతి విక్రాంతాస్త్వదర్థే లక్ష్యముత్తమం
విధ్యేత య ఇదం లక్ష్యం వరయేథాః శుభేఽద్య తం.

185 వ అధ్యాయం సమాప్తం

## నూట యెనుబది ఆరవ అధ్యాయము

తేఽలంకృతాః కుండలినో యువానః
పరస్పరం స్పర్ధమానా నరేంద్రాః
అస్త్రం బలం చాత్మని మన్యమానా
సర్వే సముత్పేతురుదాయుధాస్తే.
రూపేణ వీర్యేణ కులేన చైవ
శీలేన విత్తేన చ యౌవనేన
సమిద్ధదర్పా మదవేగభిన్నా
మత్తా యథా హైమవతా గజేంద్రాః.
పరస్పరం స్పర్ధయా ప్రేక్షమాణాః
సంకల్పజేనాభిపరిప్లుతాంగాః
కృష్ణా మమైవేత్యభిభాషమాణా
నృపాసనేభ్యః సహసోదతిష్ఠన్.
తే క్షత్రియా రంగగతాః సమేతా
జిగీషమాణా ద్రుపదాత్మజాం తాం
చకాశిరే పర్వతరాజకన్యాం
ఉమాం యథా దేవగణాః సమేతాః.
కందర్పబాణాభిపీడితాంగాః
కృష్ణాగతైస్తే హృదయైర్నరేంద్రాః.
రంగావతీర్ణా ద్రుపదాత్మజార్థం
ద్వేషం ప్రచక్రుః సుహృదోఽపి తత్ర
అథాయయుర్దేవగణా విమానై
రుద్రాదిత్యా వసవోఽథాశ్వినౌ చ
సాధ్యాశ్చ సర్వే మరుతస్తథైవ
యమం పురస్కృత్య ధనేశ్వరం చ.
దైత్యాః సుపర్ణాశ్చ మహోరగాశ్చ
దేవర్షయో గుహ్యకాశ్చారణాశ్చ

# నూట యెనుబది రెండవ అధ్యాయము

క్రమక్రమంగా సాగిసాగి వారు ద్రుపదుడు పరిపాలించే దక్షిణ పాంచాలరాజ్యంలో అడుగుపెట్టారు. అలా నడుస్తూండగా వారికి వ్యాసమహర్షి దర్శనభాగ్యం లభించింది. ఎదురువచ్చిన మహర్షికి యథోచితసత్కారాలు జరిపారు పాండవులు. పరస్పర కుశలవార్తాలాపానంతరం పాండవులు వ్యాసుల వారి అనుజ్ఞ తీసికొని ద్రుపదుని రాజధానికి బయలుదేరారు. వ్యాసులు నిజాశ్రమం వైపు తిరిగారు. వినిర్మలజలపూరిత సరోవరతటాలపై పర్ణశాలలో విశ్రాంతి తీసికొంటూ రమణీయవనాలను దర్శిస్తూ వారు ముందుకు నడిచి నడిచి దక్షిణపాంచాలదేశపు రాజధానీనగరంలో ప్రవేశించారు. ముందుగా ఆ నగర స్కంధావారం చూసి ఆ ప్రాకారం దాటి నగరులో ఒక కుమ్మరివాని యింట్లో నివాసం ఏర్పరచుకొన్నారు. యథాప్రకారం భిక్షాటనంతో వారు చరిస్తూంటే నాగరకులు వారిని పాండవులుగా గుర్తించలేకపోయారు.

పాంచాల దేశాధీశుడైన ద్రుపదుడు తన కుమార్తెను అర్జునునికే యిచ్చి పెండ్లిచెయ్యాలనే దృఢనిశ్చయంతో ఉండి అర్జునుడు మాత్రమే నారి తొడిగి సారించగల ధనుస్సు తయారుచేయించాడు. ఆకాశంలో కృత్రిమయంత్రం మత్స్యకృతితో ఉంచాడు. అన్ని యేర్పాట్లూ అయిన అనంతరం ద్రుపదుడు స్వయంవరోత్సవం ఇలా ప్రకటించాడు.

ఏ మహావీరుడు ఈధనుస్సు నెక్కుపెట్టి యెక్కుడి బాణాలతో పైనున్న లక్ష్యాన్ని ఈయంత్ర రంధ్రం లోంచి ఛేదిస్తాడో ఆ మహావీరుని నాకుమార్తె వరిస్తుంది.

స్వయంవర వార్త నానాదేశాలలో మారుమ్రోగింది. దేశదేశాల చక్రవర్తులూ మహారాజులూ మహర్షులూ మునిపుంగవులూ కూడా వచ్చారు. దుర్యోధనాదులు మారుగురూ కర్ణుని వెంటబెట్టుకొని వచ్చారు. ఆయా దేశాల బ్రాహ్మణులు కూడా విచ్చేశారు.

వచ్చిన చక్రవర్తులందరికీ ద్రుపదుడు సముచిత స్వాగతమర్యాదాది సత్కారాలు నడిపించాడు. వారందరూ స్వయంవర సభాస్థలిలో నిర్మింపబడిన వేదికలమీద ఆసీనులయ్యారు. నగర ప్రజలందరూ మంచెలమీద కూర్చున్నారు. వారందరి సంభాషణలతో అది సముద్రంలా ఉంది. శింశుమారాకృతిలో ఉన్న ఆ సభ శిరోభాగంలో చక్రవర్తులున్నారు. నగరానికి ఈశాన్యంలో సమతల ప్రదేశంమీద సుందరభవనావృత స్థలంలో మంటపనిర్మాణం జరిగింది. దానిచుట్టూ కందక ప్రాకారాలున్నాయి. ద్వారాలూ ముఖద్వారాలూ శోభాయమానంగా ఉన్నాయి. సుగంధసమ్మిళిత జలాలతో తడిసిన భూమిమీదనుండి వచ్చే గాలి సర్వతోముఖంగా వెలువడే అగరుధూమం ప్రేక్షకాగారాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. సురభిళపుష్పాలతో రచించిన పూలదండలు మండపం అంతా వ్రేలాడుతున్నాయి. సభాస్థలికి నాలుగువైపులా మహోన్నతసౌధాలు నిర్మించారు. వానిలోనా మణిరత్నదీపాలు అమర్చారు. వాని వాతాయన ద్వారాలపై బంగారు జాలరులు వ్రేలాడుతున్నాయి. మృదువైన శయ్యలు అమరించారు. చక్కగా సోపానాలు తీర్చారు. హంసలవలె చంద్రకిరణాలవలె ఆ భవనాలలోంచి అగరుధూమం వెలువడి దూరదూరాలకు వ్యాపి

విశ్వావసుర్నారదపర్వతౌ చ
గంధర్వముఖ్యాః సహసాప్సరోభిః.
హలాయుధస్తత్ర జనార్దనశ్చ
వృష్ణ్యంధకాశ్చైవ యథాప్రధానాం
ప్రేక్షాం స్మ చక్రుర్యదుపుంగవాస్తే
స్థితాశ్చ కృష్ణస్య మతే మహాంతః.
దృష్ట్వా తు తాన్ మత్తగజేంద్రరూపాన్
పంచాభిపద్మానివ వారణేంద్రాన్
భస్మావృతాంగానివ హవ్యవాహాన్
కృష్ణః ప్రదధ్యౌ యదువీరముఖ్యః.
శశంస రామాయ యుధిష్ఠిరం స
భీమం సజిష్ణుం చ యమౌ చ వీరౌ
శనైః శనైస్తాన్ ప్రసమీక్ష్య రామో
జనార్దనం ప్రీతమనా దదర్శ హ.
అన్యే తు వీరా నృపపుత్రపౌత్రాః
కృష్ణాగతైర్నేత్రమనఃస్వభావైః
వ్యాయచ్ఛమానా దదృశుర్న తాన్ వై
సందష్టదంతచ్ఛదతామ్రనేత్రాః.
తథైవ పార్థాః పృథుబాహవస్తే
వీరౌ యమౌ చైవ మహానుభావౌ
తాం ద్రౌపదీం ప్రేక్ష్య తదా స్మ సర్వే
కందర్పబాణాభిహతా బభూవుః.
దేవర్షిగంధర్వసమాకులం తత్
సువర్ణనాగాసురసిద్ధజుష్టం
దివ్యేన గంధేన సమాకులం చ
దివ్యైశ్చ పుష్పైరవకీర్యమాణం.
మహాస్వనైర్దుందుభినాదితైశ్చ
బభూవ తత్ సంకులమంతరిక్షం
విమానసంబాధమభూత్ సమంతాత్
సవేణువీణాపణవానునాదం.

తతస్తు తే రాజగణాః క్రమేణ
కృష్ణానిమిత్తం కృతవిక్రమాశ్చ
సకర్ణదుర్యోధనశాల్వశల్య
ద్రౌణాయనిక్రాథసునీథవక్రాః.
కలింగవంగాధిపపాండ్యపౌండ్రా
విదేహరాజో యవనాధిపశ్చ
అన్యే చ నానానృపపుత్రపౌత్రాః
రాష్ట్రాధిపాః పంకజపత్రనేత్రాః.
కిరీటహారాంగదచక్రవాలై
ర్విభూషితాంగాః పృథుబాహవస్తే
అనుక్రమం విక్రమసత్త్వయుక్తా
బలేన వీర్యేణ చ నర్దమానాః.
తత్కార్ముకం సంహననోపపన్నం
సజ్యం న శేకుర్మనసాపి కర్తుం
తే విక్రమంతః స్ఫురతా దృఢేన
విక్షిప్యమాణా ధనుషా నరేంద్రాః.
విచేష్టమానా ధరణీతలస్థా
యథాబలం శైక్ష్యగుణక్రమాశ్చ
గతౌజసః స్రస్తకిరీటహారా
వినిఃశ్వసంతః శమయాంబభూవుః.
హాహాకృతం తద్ ధనుషా దృఢేన
విస్రస్తహారాంగదచక్రవాలం
కృష్ణానిమిత్తం వినివృత్తకామం
రాజ్ఞాం తదా మండలమార్తమాసీత్.
సర్వాన్ నృపాంస్తాన్ ప్రసమీక్ష్య కర్ణో
ధనుర్ధరాణాం ప్రవరో జగామ
ఉద్ధృత్య తూర్ణం ధనురుద్యతం తత్
సజ్యం చకారాశు యుయోజ బాణాన్.
దృష్ట్వా సూతం మేనిరే పాండుపుత్రా
భిత్త్వా నీతం లక్ష్యవరం ధరాయాం

స్తోంది. విరివిగా రాకపోకలకు అనుకూలించేటట్లు ద్వారాలు నిర్మించారు. ఆభవనాలు హిమాలయ శిఖర సదృశకాంతితో భాసిస్తున్నాయి. ఆ భవన విమానాలలో నానాలంకార భూషణాలతో రాజులందరూ సుఖాసీనులై ఉన్నారు. ఆ పార్శ్వాలలో పరాక్రమవంతులు సౌభాగ్యశాలులు బ్రాహ్మణ భక్తులూ దేశరక్షకులు శుభపుణ్య కర్మలతో ప్రపంచానికి ఆహ్లాదం కలిగించే వారూ కూర్చున్నారు.

ద్రౌపదీసౌందర్య దర్శనాపేక్షతో వారు రంగస్థలమంతా చూడటానికి సావకాశం లభించేటట్లు ఆసనాలు అధిష్ఠించారు. పాండవులు పాంచాలానేతుని సంపత్సమృద్ధిని తిలకిస్తూ బ్రాహ్మణ సంఘంలో ఉన్నారు. మహారాజులు చేసే ధనధాన్య దానాదులతో కలకలలాడుతూ క్రిక్కిరిసిపోయింది నగరం. నటనర్తకులు తమ కళాకౌశల్యం ప్రదర్శిస్తూ సభాభవన శోభను పెంపొందింపజేస్తున్నారు. పదహారవరోజున ద్రౌపదీదేవి పరిశుభ్రస్నాతయై సర్వాభూషణాలంకృత శోభనగాత్రియై సువర్ణమయ నిర్మిత జయమాలతో రంగస్థలంలో అడుగుపెట్టింది.

సోమకవంశీయుల కులగురువైన పురోహితుడూ అగ్నికుండానికి నాలుగువైపులా దర్భలు ఉంచి వేదోక్తంగా ఆజ్యాహుతులు అర్పించాడు. అగ్నిని తృప్తిపరచి బ్రాహ్మణులచేత స్వస్తివాచనం చేయించి అంతవరకూ మోగుతూన్న వాద్యాలను ఆపుచేయించాడు.

నిశ్శబ్దంగా సభ అంతా రంగమధ్యంపైపు దృష్టి కేంద్రీకరించిన సమయంలో ధృష్టద్యుమ్నుడు ద్రౌపదితో వచ్చి మేఘమందుభి ధ్వానంతో—
ఈ స్వయంవర మహోత్సవానికి విజయంచేసిన మహారాజులందరూ సావధాన చిత్తంతో నామాటలు ఆకర్ణించండి. ఇదిగో ఈ ధనుస్సు ఎక్కుపెట్టి ఇక్కడ ఉన్న అయిదు బాణాలూ ఉపయోగించి పైనున్న యంత్ర రంధ్రంలోంచి లక్ష్యభేదనం చెయ్యాలి. ఉత్తమ వంశీయుడూ సుందరాకారుడూ బలసంపన్నుడూ అయిన ఏ మహావీరుడు ఈ లక్ష్యాన్ని భేదిస్తాడో వానిని నాసోదరి ద్రౌపది వరిస్తుంది. ఇది సత్యం— అన్నాడు.

ఆవిధంగా ఘోషించి అనంతరం ఆ రాజులందరి గోత్రాలనూ వివరిస్తూ వారి వంశఖ్యాతి చెపుతూ వారి నామధేయాలుకూడా ఉటంకిస్తూ ద్రౌపదితో ఇలా అంటున్నాడు.

184 వ అధ్యాయము సమాప్తం

## నూట యెనుబది ఐదవ అధ్యాయం

### వరపరిచయం

సోదరి ద్రౌపదిని వెంటపెట్టుకొని స్వయంవర సభామధ్యంలో అడుగుపెట్టిన ధృష్టద్యుమ్నుడు వచ్చినవారి నందరినీ పేరుపేరునా పరిచయం చేస్తున్నాడు.

సోదరీ! వీరు దుర్యోధనులు. కురువంశీయులైన ధృతరాష్ట్రమహారాజులుంగారి కుమారులు. దుర్వి

ధనుస్థిరా రాజసూత్రపరీక్షా
మత్స్యాగ్నిసోమార్కమథార్కపుత్రిం.
దృష్ట్వా తు తం ద్రౌపదీ వాక్యముచ్చై
ర్జగాద నాహం వరయామి సూతం
సామర్ష హాసం ప్రసమీక్ష్య సూర్యం
తత్యాజ కర్ణః స్ఫురితం ధనుస్తత్.
ఏవం తేషు నివృత్తేషు క్షత్రియేషు సమంతతః
చేదీనామధిపో వీరో బలవానంతకోపమః.
దమఘోషసుతో ధీరః శిశుపాలో మహామతిః
ధనురాదాయమానస్తు జానుభ్యామగమన్మహీం.
తతో రాజా మహావీర్యో జరాసంధో మహాబలః
ధనుషోఽభ్యాసమాగత్య తస్థౌ గిరిరివాచలః.
ధనుషా పీడ్యమానస్తు జానుభ్యామగమన్మహీం
తత ఉత్థాయ రాజా స స్వరాష్ట్రాణ్యభిజగ్మివాన్
తతః శల్యో మహావీరో మద్రరాజో మహాబలః
తదారోప్యమాణస్తు జానుభ్యామగమన్మహీం.
తతో దుర్యోధనో రాజా ధార్తరాష్ట్రః పరంతపః
మానీ దృఢాస్త్రసంపన్నః సర్వైశ్చ నృపలక్షణైః
ఉత్థితః సహసా తత్ర భ్రాతృమధ్యే మహాబలః
విలోక్య ద్రౌపదీం హృష్టో ధనుషోఽభ్యాశమాగమత్.
స జగ్రాహ ధనురాదాయ శక్రశ్చాపధరో యథా
ఆరోపయంస్తు తద్ రాజా ధనుషా బలినా తదా.
ఉత్తానశయ్యమపతదంగుల్యంతరతాడితః
స యయౌ తాడితస్తేన వ్రీడన్నివ నరాధిపః.
తస్మింస్తు సంభ్రాంతజనే సమాజే
నిక్షిప్తవాదేషు జనాధిపేషు
కుంతీసుతో జిష్ణురియేష కర్తుం
సజ్యం ధనుస్తత్ సశరం ప్రవీరః.
తతో వరిష్ఠః సురదానవానాం
ముదారధీర్వృష్ణికులప్రవీరః
జహర్ష రామేణ స వీక్ష్య హస్తం
హస్తం గతాం పాండుసుతస్య మత్వా.
జహ్రుర్న్యే నృపవీరముఖ్యాః
సంఛన్నరూపానథ పాండుపుత్రాన్.

186 వ అధ్యాయం సమాప్తం

## నూట యెనుబది ఏడవ అధ్యాయము

యదా నివృత్తా రాజానో ధనుషః సజ్యకర్మణః
అథోదతిష్ఠద్విప్రాణాం మధ్యాజ్జిష్ణురుదారధీః.
ఉదక్రోశన్ విప్రముఖ్యా విధున్వంతోఽజినాని చ
దృష్ట్వా సంప్రస్థితం పార్థమింద్రకేతుసమప్రభం.
కేచిదాసన్ విమనసః కేచిదాసన్ ముదాన్వితాః
ఆహుః పరస్పరం కేచిన్నిపుణా బుద్ధిజీవినః.
యత్ కర్ణశల్యప్రముఖైః క్షత్రియైర్లోకవిశ్రుతైః
నానతం బలవద్భిర్హి ధనుర్వేదపరాయణైః.
తత్ కథం త్వకృతాస్త్రేణ ప్రాణతో దుర్బలీయసా
వటుమాత్రేణ శక్యం హి సజ్యం కర్తుం ధనుర్ద్విజాః
అవహాస్యా భవిష్యంతి బ్రాహ్మణాః సర్వరాజసు
కర్మణ్యస్మిన్నసంసిద్ధే చాపలాదపరీక్షితే.
యద్యేష దర్పాద్ధర్షాద్వాప్యథ బ్రాహ్మణచాపలాత్
ప్రస్థితో ధనురాయంతుం వార్యతాం

సాధు మాగమత్.

నావహాస్యా భవిష్యామో న చ లాఘవమాస్థితాః
నచ విద్విష్టతాం లోకే గమిష్యామో మహీక్షితాం.
కేచిదాహుర్యువా శ్రీమాన్ నాగరాజకరోపమః

పీనస్కంధోరుబాహుశ్చ ధైర్యేణ హిమవానివ.
సింహఖేలగతిః శ్రీమాన్ మత్తనాగేంద్రవిక్రమః
సంభావ్యమస్మిన్ కర్మేదముత్సాహాచ్చానుమీయతే
శక్తిరస్య మహోత్సాహా నహ్యశక్తః స్వయం వ్రజేత్
న చ తద్విద్యతే కించిత్ కర్మ లోకేషు యద్భవేత్.
బ్రాహ్మణానామసాధ్యం చ నృషు సంస్థానచారిషు
అబ్భక్షా వాయుభక్షాశ్చ ఫలాహారా దృఢవ్రతాః.
దుర్బలా అపి విప్రా హి బలీయాంసః స్వతేజసా
బ్రాహ్మణో నావమంతవ్యః సదసద్వా సమాచరన్.
సుఖం దుఃఖం మహద్ధ్రస్వం కర్మ యత్ సముపాగతం
ధనుర్వేదే చ వేదే చ యోగేషు వివిధేషు చ
నతం పశ్యామి మేదిన్యాం బ్రాహ్మణాభ్యధికో భవేత్.
మంత్రయోగబలేనాపి మహతాఽఽత్మబలేన వా
జృంభయేయురముం లోకమథవా ద్విజసత్తమాః.
జామదగ్న్యేన రామేణ నిర్జితాః క్షత్రియా యుధి
పీతః సముద్రోఽగస్త్యేన హ్యగాధో బ్రహ్మతేజసా
తస్మాద్బ్రువంతు సర్వేఽత్ర వటురేష ధనుర్మహాన్.
ఆరోపయతు శీఘ్రం వై తథేత్యూచుర్ద్విజర్షభాః
ఏవం తేషాం విలపతాం విప్రాణాం వివిధా గిరః
అర్జునో ధనుషోఽభ్యాశే తస్థౌ గిరిరివాచలః
స తద్ధనుః పరిక్రమ్య ప్రదక్షిణమథాకరోత్.
ప్రణమ్య శిరసా దేవమీశానం వరదం ప్రభుం
కృష్ణం చ మనసా కృత్వా జగృహే చార్జునో ధనుః.
యత్ పార్థివై రుక్మసునీథవక్రైః
రాధేయదుర్యోధనశల్యశాల్వైః
తదా ధనుర్వేదపరైర్నృసింహైః
కృతం న సజ్యం మహతోఽపి యత్నాత్.
తదర్జునో వీర్యవతాం సదర్ప
స్తైంద్రిరింద్రావరజప్రభావః
సజ్యం చ చక్రే నిమిషాంతరేణ
శరాంశ్చ జగ్రాహ దశార్ధసంఖ్యాన్.
వివ్యాధ లక్ష్యం నిపపాత తచ్చ
ఛిద్రేణ భూమౌ సహసాతివిద్ధం
తతోఽంతరిక్షే చ బభూవ నాదః
సమాజమధ్యే చ మహాన్ నినాదః.
పుష్పాణి దివ్యాని వవర్ష దేవః
పార్థస్య మూర్ధ్ని ద్విషతాం నిహంతుః.
చైలాని దివ్యధుస్తత్ర బ్రాహ్మణాశ్చ సహస్రశః
విలక్షితాస్తతశ్చక్రుర్హాహాకారాంశ్చ సర్వశః
న్యపతంశ్చాత్ర నభసః సమంతాత్ పుష్పవృష్టయః.
శతాంగాని చ తూర్యాణి వాదకాః సమవాదయన్
సూతమాగధసంఘాశ్చాప్యస్తువంస్తత్ర సుస్వరాః.
తం దృష్ట్వా ద్రుపదః ప్రీతో బభూవ రిపుసూదనః
సహ సైన్యైశ్చ పార్థస్య సాహాయ్యార్థమియేష సః
తస్మింస్తు శబ్దే మహతి ప్రవృద్ధే
యుధిష్ఠిరో ధర్మభృతాం వరిష్ఠః
ఆవాస మేవోపజగామ శీఘ్రం
సార్ధం యమాభ్యాం పురుషోత్తమాభ్యాం.
విద్ధం తు లక్ష్యం ప్రసమీక్ష్య కృష్ణా
పార్థం చ శక్రప్రతిమం నిరీక్ష్య
ఆదాయ శుక్లం వరమాల్యదామ
జగామ కుంతీసుతముత్స్మయంతీ.
స్వాభ్యస్తరూపాపి నవేవ నిత్యం
వినాపి హాసం హసతీవ కన్యా
మదాదృతేఽపి స్ఖలతీవ భావై
ర్వాచా వినా వ్యాహరతీవ దృష్ట్యా.
సమేక్ష్య తస్యోపరి సోత్ససర్జ
సమాగతానాం పురతో నృపాణాం
విన్యస్త మాలాం వినయేన తస్థౌ
విహాయ రాజ్ఞః సహసా నృపాత్మజా.
శచీవ దేవేంద్రమథాగ్ని దేవం

## నూట యెనుబది ఆరవ అధ్యాయము

### విఫలప్రయత్నం

ద్రౌపదీ స్వయంవరోత్సవానికి విజయంచేసిన ఆ పృథ్వీభుజులందరూ నానారత్నవిచిత్రభూషణాలంకృతులై చీనచీనాంబరధారులై అస్త్రశస్త్రధరులై సభావైభవాన్ని వీక్షిస్తున్నారు. వారిలో అందరికీ స్వయంబలపరాక్రమాలపై అస్త్రవిద్యాకౌశలంపై విపరీతమైన విశ్వాసం ఉన్నది. కుల రూప గుణ శీల జీవనవిధానాలలో వారందరూ ఎవరికివారే అత్యధికులమని గర్విస్తున్నారు.

హిమాలయపర్వతాలపై విహరించే మత్తేభాల వలె ఉన్న ఆ మహారాజులందరూ పరస్పరం అసూయాదృక్కులు ప్రసరించుకుంటున్నారు. ఎవరికివారే ద్రౌపది తనభార్య అయి తీరుతుందని లేస్తున్నారు. వారందరినీ మన్మథుడు విపరీతంగా వేధిస్తున్నాడు. గిరిరాజపుత్రి పార్వతిని వివాహ సమయంలో చూడవచ్చిన దేవతలవలె ఉన్న రాజులతో నిండి ఉన్నది. సభామండపం వారందరి హృదయాలూ ద్రౌపదీసౌందర్యంకోసమే ఉవ్విళ్ళూరుతున్నాయి. ఆ సమయంలో ద్రౌపదిపై వారికి కలిగిన మోహం కారణంగా వారి ఆప్తమిత్రులనే విద్వేషభావంతో చూడసాగారు.

రుద్ర ఆదిత్య వసు మరుద్గణాలూ అశ్వినీకుమారులూ సాధ్యులూ యమధర్మరాజునూ కుబేరునీ ముందుంచుకొని అక్కడికే విచ్చేశారు. దైత్య గరుడ నాగులుకూడా వచ్చారు. దేవర్షులూ అప్సరఃకాంతలతో వచ్చారు. వారందరూ గగనతలంలో ఉండి ఆ వైభవాన్ని తిలకిస్తున్నారు. యదుశ్రేష్ఠులైన బలరామకృష్ణులూ వృష్ణి అంధకవంశీయులూ నిశ్శబ్దంగా ఆమహాసభలో ఆసీనులయారు.

బ్రాహ్మణసమూహంలో ఉన్న ఏనుగుల్లా నివురుగప్పిన నిప్పుల్లా భస్మాంగదేహులైన పాండవులను గుర్తుపట్టి బలరామునివైపు తిరిగి—అన్నా అటు చూడు. వారే ధర్మజ భీమార్జున నకుల సహదేవులు—అని కృష్ణుడనగా బలరాముడు ఆశ్చర్యచకితదృష్టులతో చూచి ఆనందించాడు. మిగిలిన రాజులూ మహారాజులూ వారి పుత్రపౌత్రులూ సర్వేంద్రియాలనూ ద్రౌపదిపైనే కేంద్రీకరించి చూస్తున్నారు. విచిత్రావేశంతో పెదవులు కొరుకుతూ ఒకరినొకరు స్పర్థతో చూసుకొంటూ కోపపూరితనయనులై ఉన్నారు. అన్యక్షత్రియ వీరులవలెనే పాండవులుకూడా ద్రౌపదీసౌందర్యంతో మదనుడు పెట్టే హింస భరిస్తూనే ఉన్నారు.

సిద్ధ గంధర్వ నాగాసుర సుపర్ణ దేవర్షి సంఘాలతో నిండిన ఆకాశవీధినుండి పుష్పవృష్టి కురుస్తోంది. సురభిళవాయువులు సభాసదులకు నానాతర్పణం చేస్తున్నాయి. దుందుభిధ్వానం అంతరిక్షంలో ప్రతిధ్వనిస్తోంది. వీణావేణుమృదంగాది మంగళవాద్యాలు శ్రావ్యంగా వినవస్తున్నాయి.

నెమ్మదిగా ఒక్కొక్కరే ద్రౌపదీ పాణిగ్రహణాలాలసులై మత్స్యయంత్రచ్ఛేదనకు ఉద్యుక్తులవుతున్నారు. కర్ణ దుర్యోధన సాళ్వ శల్య సునీథ వక్ర అశ్వత్థామ కళింగాధీశ పాండ్య పౌండ్ర వంగ యవన విదేహాదిదేశాధిపతులు వారిపుత్రులు పౌత్రులు కిరీటహారకేయూర భూషణాలంకృతులై తమ విశాల బాహువులతో ధనుస్సు నెక్కుపెట్టడానికి ప్రయత్నించారు. వారెంతశక్తితో బలంతో ఆ విల్లు వంచడానికి ప్రయత్నిస్తే అది అంతశక్తితోనూ వారిని విసరికొడుతూంది. వారి మనస్సు

స్వాహేవ లక్ష్మీశ్చ యథా ముకుందం
ఉషేవ సూర్యం మదనం రతిశ్చ
మహేశ్వరం పర్వతరాజపుత్రీ
రామం యథా మైథిలరాజపుత్రీ
భైమీ యథా రాజవరం నలం హి.

స తాముపాదాయ విజిత్య రంగే
ద్విజాతిభి స్తైరభిపూజ్యమానః
రంగాన్నిరక్రామదచింత్యకర్మా
పత్న్యా తయా చాప్యనుగమ్యమానః.

187 వ అధ్యాయం సమాప్తం.

## నూట యెనుబది ఎనిమిదవ అధ్యాయము

తస్మై దిత్సతి కన్యాం తు బ్రాహ్మణాయ తదా నృపే
కోప ఆసీన్మహీపానామాలోక్యాన్యోన్యమంతికాత్.
అస్మానయమతిక్రమ్య తృణీకృత్య చ సంగతాన్
దాతుమిచ్ఛతి విప్రాయ ద్రౌపదీం యోషితాం వరాం.
అవరోప్యేహ వృక్షం తు ఫలకాలే నిపాత్యతే
నిహన్మైనం దురాత్మానం యోఽయమస్మాన్ న మన్యతే.
న హ్యర్హత్యేష సమ్మానం నాపి వృద్ధక్రమం గుణైః
హన్మైనం సహ పుత్రేణ దురాచారం నృపద్విషం.
అయం హి సర్వానాహూయ సత్కృత్య చ నరాధిపాన్
గుణవద్భోజయిత్వాన్నం తతః పశ్చాన్న మన్యతే.
అస్మిన్ రాజసమావాయే దేవానామివ సంనయే
కిమయం సదృశం కంచిన్నృపతిం నైవ దృష్టవాన్.
న చ విప్రేష్వధీకారో విద్యతే వరణం ప్రతి
స్వయంవరః క్షత్రియాణామితీయం ప్రథితా శ్రుతిః.
అథవా యది కన్యేయం న చ కంచిద్ బుభూషతి
అగ్నావేనాం పరిక్షిప్య యామ రాష్ట్రాణి పార్థివాః.
బ్రాహ్మణో యది బాల్యాల్లోభాద్ వా కృతవానిదం
విప్రియం పార్థివేంద్రాణాం నైష వధ్యః కథంచన.
బ్రాహ్మణార్థం హి నో రాజ్యం జీవితం హి వసూని చ
పుత్రపౌత్రం చ యచ్చాన్యదస్మాకం విద్యతే ధనం.
అవమానభయాచ్చైవ స్వధర్మస్య చ రక్షణాత్
స్వయంవరాణామన్యేషాం మా భూదేవం విధా గతిః.
ఇత్యుక్త్వా రాజశార్దూలా హృష్టాః పరిఘబాహవః
ద్రుపదం తు జిఘాంసంతః సాయుధాః సముపాద్రవన్.
తాన్ గృహీతశరావాపాన్ క్రుద్ధానాపతతో బహూన్
ద్రుపదో వీక్ష్య సంత్రాసాద్ బ్రాహ్మణాం ఛరణం గతః.
వేగేనాపతతస్తాంస్తు ప్రభిన్నానివ వారణాన్
పాండుపుత్రౌ మహేష్వాసౌ ప్రతియాతావరిందమౌ.
తతః సముత్పేతురుదాయుధాస్తే
మహీక్షితో బద్ధగోధాంగులిత్రాః
జిఘాంసమానాః కురురాజపుత్రౌ
అమర్షయంతోఽర్జునభీమసేనౌ.
తతస్తు భీమోఽద్భుతభీమకర్మా
మహాబలో వజ్రసమానసారః
ఉత్పాట్య దోర్భ్యాం ద్రుమమేకవీరో
నిష్పత్రయామాస యథా గజేంద్రః.
తం వృక్షమాదాయ రిపుప్రమాథీ
దండీవ దండం పితృరాజ ఉగ్రం
తస్థౌ సమీపే పురుషర్షభస్య

కూడా నాగి నారించలేకపోతుంది.

వేడినిట్టూర్పులు విడుస్తూ జారిపడిపోయిన తార హారాలు చూసుకుంటూ నిరుత్సాహంతో వచ్చి వారి వారి ఆసనాలమీద కూర్చున్నారు. ఆవింటిదెబ్బ తిన్న రాజులందరూ ద్రౌపదిమీద ఆశ వదులుకొని తలలు వాల్చి విచారిస్తున్నారు. వారి అవస్థనంతరూ చూసిన మహాధనుర్ధరుడు కర్ణుడు విల్లుతీసి నారి ఎక్కించి బాణాలు సంధించాడు. సూర్య చంద్ర అగ్నిసమ తేజస్వియైన కర్ణుడు ద్రౌపదీ పాణిగ్రహణకుతూహలంతో ప్రతిజ్ఞాబద్ధుడై ధనుస్సు సమీపించే సరికి పాండవులకు కర్ణుని ధను ర్విద్యాకౌశలంమీద అంతటి విశ్వాసం ఏర్పడలేదు.

కర్ణుడు విల్లెత్తుతున్న సమయంలో ద్రౌపది తీవ్ర స్వరంతో—నేను సూతజాతి పురుషుని వరించను—అని ఘోషించింది. ఆమాటలతో కర్ణుని హృదయం సంక్షుభితమైనది. ఆకాశంలోకి కన్నులు పోనిచ్చి సూర్యభగవానుని చూస్తూ విల్లువిడిచి వచ్చేశాడు.

వచ్చిన రాజులందరూ తమ తమ అశక్తతను ప్రకటించారు. అప్పుడు లేచాడు చేదిదేశాధీశు డైన శిశుపాలుడు. ఆ మహావీరుడు ధనుస్సు నెత్తు తూనే ఆ బలాని కాగలేక నేలమీద పడ్డాడు. అనంతరం జరాసంధుడు మహాపర్వతంలా నిలబడి ధనుస్సెత్తేస్తూ శిశుపాలునివలెనే అయ్యాడు. దెబ్బ తిన్న జరాసంధుడు ఉత్తరక్షణంలో స్వదేశాభి ముఖంగా పోయాడు. మద్రదేశాధిపతి శల్యుడు కూడా శిశుపాలదేశాధీశులను అనుసరించాడు. అ ష్టమ స్థానం నుండి దుర్యోధనుడు. సమస్తరాజోచితలక్షణసంపన్నుడైన దుర్యోధనుడు ఉప్పొంగిన సంతోషహృదయంతో ధను స్సును సమీపించాడు. ధనుస్సు పైకెత్తాడు. ధను స్సునెత్తిన దుర్యోధనుడు దేవేంద్రునివలెనున్నాడు. నారి నారిస్తూ ఉండగా తగిలిన దెబ్బవల్ల అతని హృదయం గిలగిలలాడిపోయింది. అతని అభిమానం దెబ్బతిన్నది. సభలో నిశ్శబ్ద మావరించినది.

ఆసమయంలో అర్జునునికి శరసంధానం చేయా లనే సంకల్పం కలిగింది. వాని సంకల్పం దేవత లందరికీ సంతోషాన్ని కలిగించింది. అది గమనిం చిన శ్రీకృష్ణభగవానునికి ద్రౌపది అర్జునునికి లభించి తీరుతుందనే విశ్వాసం కలిగింది. అదే ఊహతో బలరామునికి సంజ్ఞ చేసి ఆనందించాడు. గుప్త రూపధారులైన పాండవుల నక్కడివా రెవరూ గుర్తుపట్టలేకపోయారు.

186 వ అధ్యాయము సమాప్తం

## నూట యెనుబది ఏడవ అధ్యాయం

స్వయంవరానికి వచ్చిన రాజులందరూ తమ అశక్తతను ప్రకటించి తలలు వంచుకున్నాక బ్రాహ్మణసమాజంలోవున్న అర్జునుడు లేచి నిల బడ్డాడు. మత్స్యయంత్రాన్ని ఛేదించే సంకల్పంతో ధనుస్సును సమీపించే అర్జునుడు ఇంద్రధ్వజంలా ఉన్నాడు. ఆసమయంలో వృద్ధబ్రాహ్మణులందరూ తమ మృగచర్మాలను ఊగిసలాడిస్తూ కోలాహలం చేశారు. కొందరు ఉదాసీనంగా ఉండిపోయారు. మరికొందరు ఆనందాశ్చర్యాలతో నిండిపోయారు. ధీమంతులైన మరికొందరు వారిలోవారు ఈవిధంగా

పార్థస్య పార్థః పృథుదీర్ఘబాహుః.
తత్ ప్రేక్ష్య కర్మాతిమనుష్యబుద్ధి
ర్జిష్ణుః స హి భ్రాతురచింత్యకర్మా
విసిస్మియే చాపి భయం విహాయ
తస్థౌ ధనుర్గృహ్య మహేంద్రకర్మా.
తత్ ప్రేక్ష్య కర్మాతిమనుష్యబుద్ధి
ర్జిష్ణోః సహ భ్రాతురచింత్యకర్మా
దామోదరో భ్రాతరముగ్రవీర్యం
హలాయుధం వాక్యమిదం బభాషే.
య ఏష సింహర్షభఖేలగామీ
మహద్ధనుః కర్షతి తాలమాత్రం
ఏషోఽర్జునో నాత్ర విచార్యమస్తి
యద్యస్మి సంకర్షణ వాసుదేవః.
య స్త్వేష వృక్షం తరసావభజ్య
రాజ్ఞాం నికారే సహసా ప్రవృత్తః
వృకోదరాన్నాన్య ఇహైతదద్య
కర్తుం సమర్థః సమరే పృథివ్యాం.
యోఽసౌ పురస్తాత్కమలాయతాక్ష
స్తనుర్మహాసింహగతిర్వినీతః
గౌరః ప్రలంబోజ్జ్వలచారుఘోణో
వినిఃసృతః సోఽచ్యుత ధర్మపుత్రః.
యౌ తౌ కుమారావివ కార్తికేయౌ
ద్వావశ్వినేయావితి మే వితర్కః.
ముక్తా హి తస్మాజ్జతువేశ్మదాహా
న్మయా శ్రుతాః పాండుసుతాః పృథా చ.
యథా నృపాః పాండవమాజిమధ్యే
తం ప్రాబ్రవీచ్చక్రధరో హలాయుధం
బలం విజానన్ పురుషోత్తమస్తదా
న కార్యమార్యేణ చ సంభ్రమస్త్వయా.
భీమానుజో యోధయితుం సమర్థ
ఏకో హి పార్థః ససురాసురాన్ బహూన్
అలం విజేతుం కిము మానుషాన్ నృపాన్
సహాయ్యమస్మాన్ యది సవ్యసాచీ.
స హాన్వతి స్మ ప్రియతామ వీర
పరాభవః పాండుసుతే న చాస్తి
తమబ్రవీన్నిర్జలతోయదాభో
హలాయుధోఽనంతరజం ప్రతీతః
ప్రీతోఽస్మి దృష్ట్వా హి పితృష్వసారం
పృథాం విముక్తాం సహ కౌరవాగ్ర్యైః.

188 వ అధ్యాయం సమాప్తం.

## నూట యెనుబది తొమ్మిదవ అధ్యాయము

అజినాని విధున్వంతః కరకాంశ్చ ద్విజర్షభాః
ఊచుస్తే భీర్న కర్తవ్యా వయం యోత్స్యామహే పరాన్
తానేవం వదతో విప్రానర్జునః ప్రహసన్నివ
ఉవాచ ప్రేక్షకా భూత్వా యూయం తిష్ఠత పార్శ్వతః.
అహమేనానజిహ్మాగ్రైః శతశో వికిరన్ శరైః
వారయిష్యామి సంక్రుద్ధాన్ మంత్రైరాశీవిషానివ.
ఇతి తద్ధనురాదాయ శుల్కావాప్తం మహాబలః
భ్రాత్రా భీమేన సహితస్తస్థౌ గిరిరివాచలః.
తతః కర్ణముఖాన్ దృష్ట్వా క్షత్రియాన్ యుద్ధదుర్మదాన్
సంపేతతురభీతౌ తౌ గజౌ ప్రతిగజానివ.
ఊచుశ్చ వాచః పరుషాస్తే రాజానో యుయుత్సవః

సంభాషించుకోసాగారు— కర్ణ శల్యాది ధనుర్వేద నిపుణులైన క్షత్రియవీరులే ఎక్కుపెట్టలేని విల్లును ఈ బ్రాహ్మణబాలుడు ఎలా సాధించగలడు. బ్రాహ్మ చాపల్యంవల్లనే కార్యాకార్యాలు తెలియక ఈ దు సాహసం చేస్తున్నాడు. ఇప్పుడు పరాభవం జరిగితే ఈ రాజులందరూ మనల్ని సంహరిస్తారు. బ్రాహ్మణసహజమైన చంచలత్వంతో వీడు వెడు కూడ ట్లయితే విఘ్నం ఇప్పుడే ఆపడం మంచిది— అని కొందరనగా మరికొందరు— మన కెన్నడూ అవమానం జరుగదు. ఇందులో సిగ్గుపడవలసిన విషయమేమీ లేదు— అన్నారు. మరికొందరు— ఈ సుందరాకారుడు నాగరాజైన ఐరావతంలా ఉన్నాడు. ఇతని భుజాలు బలంగా విశాలంగా ఉన్నాయి. సింహసదృశగమనంగల వీడు ధైర్యంలో హిమవత్పర్వతంలా ఉన్నాడు. వీడి శక్తికితగ్గ ఉత్సాహం కూడా కనిపిస్తోంది. ఈ ప్రపంచంలో బ్రాహ్మణులకు అసాధ్యమైన కార్యం లేదు. జలపానంతో వాయుభక్షణతో ఫలాహారంతో నియమవ్రతులై తేజస్సుతో అపూర్వకార్యాలను సాధించగలరు. మంచికాని చెడుకాని సుఖంకాని దుఃఖంకాని ఏదైనా వారు నిశ్శంకగా సాధిస్తారు. ఈ నాడు భూమండలంలో వేదవేదాంగాలలో ధనుర్వేదంలో బ్రాహ్మణులతో సమానమైనవారులేరు. యోగమంత్రబలాలతో ఆత్మబలంతో ఈ జగత్తును స్తంభింపజేయగలరు. జమదగ్నినందనుడు పరశురాముడు ఒంటరిగా సర్వక్షత్రియసంహారం చేసిన విషయం మనం మరచిపోకూడదు. అగస్త్యమహర్షి తన బ్రహ్మతేజస్సుతో మహాసాగరాన్ని తాగివేసిన విషయం మనకు తెలిసిందే. కనక ఈ బ్రహ్మచారి విజయం సాధించాలని మీరందరూ ఆశీర్వదించండి—ఆమాటలువిని వారందరూ ఉచ్చైస్స్వరంతో ఆశీర్వాదాలు వర్షించారు.

అర్జునుడు ధనుస్సును సమీపించి పర్వతమన్నిధంగా నిలబడ్డాడు. అనంతరం ధనుస్సుకి ప్రదక్షిణంచేసి పార్వతీపతికి అంజలి ఘటించి మనస్సులో కృష్ణుని స్మరించి విల్లు ఎత్తాడు. రుక్మ సునీథ వక్ర కర్ణ దుర్యోధన శల్య సాళ్వాదులు దృఢప్రయత్నం చేసి నారి సంధించలేని ఆ ధనుస్సును రెప్పపాటులో అర్జునుడు ఎక్కుపెట్టాడు. ఐదు బాణాలనూ సంధించి లక్ష్యాన్ని ఛేదించాడు. యంత్రరంధ్రములోంచి ఛిన్నాభిన్నమైన లక్ష్యం నేలమీద పడింది. గగనవీధిలో హర్షధ్వానాలు రేగాయి. పూలవాన కురిసింది. స్వయంవర సభామండపంలో బ్రాహ్మణులు తమ శాలువాలు ఎగురవేస్తూ హర్షధ్వానాలు చేశారు. రాజులందరూ హాహాకారాలు చేశారు. తూర్యధ్వానాలు చెలరేగాయి. సూతమాగధగణాలు మధురస్వరంతో కీర్తిగీతాలాపనం చేస్తున్నారు.

ద్రుపదుని ఆనందానికి అంతులేకుండా వుంది. ఆసమయంలో చెలరేగిన కల్లోలాన్ని నివారించడానికి ద్రుపదుడు సేనాసమేతంగా బయలుదేరాడు. నకులసహదేవులతో ధర్మరాజు వెళ్ళిపోయాడు.

లక్ష్యభేదనం జరిగిన క్షణంలోనే ద్రౌపది శ్వేతపుష్పవినిర్మితమైన జయమాలతో అర్జునుని సమీపించింది. ఆమె మోములో చిరునవ్వు చిందులు త్రొక్కుతూన్నది. రాజులందరూ చూస్తూండగా అర్జునుని మెడలో ఆ మాల వేసింది. శచీదేవి దేవేంద్రుని అగ్నిని స్వాహా లక్ష్మి నారాయణుని రతి మన్మథుని సూర్యభగవానుని ఉష పార్వతి

ఆహానే హి ద్విజస్యాపి వధో దృష్టో యుయుత్సవః.
ఇత్యేవముక్త్వా రాజానః సహసా దుద్రువుర్ద్విజాన్
తతః కర్ణో మహాతేజా జిష్ణుం ప్రతి యయౌ రణే.
యుద్ధార్థీ వాసితాహేతోర్గజః ప్రతిగజం యథా
భీమసేనం యయౌ శల్యో మద్రాణామీశ్వరో బలీ.
దుర్యోధనాదయః సర్వే బ్రాహ్మణైః సహసంగతా.
మృదుపూర్వమయత్నేన ప్రత్యయుధ్యంస్తదాహవే.
తతోఽర్జునః ప్రత్యవిధ్యదాపతంతం శితైః శరైః
కర్ణం వైకర్తనం శ్రీమాన్ వికృష్య బలవద్ధనుః.
తేషాం శరాణాం వేగేన శితానాం తిగ్మతేజసాం
విముహ్యమానో రాధేయో యత్నాత్తమనుధావతి.
తావుభావప్యనిర్దేశ్యౌ లాఘవాజ్జయతాం వరౌ
అయుధ్యేతాం సుసంరబ్ధావన్యోన్యవిజిగీషిణౌ.
కృతే ప్రతికృతం పశ్య పశ్య బాహుబలం చ మే
ఇతి శూరార్థవచనైరభాషేతాం పరస్పరం.
తతోఽర్జునస్య భుజయోర్వీర్యమప్రతిమం భువి
జ్ఞాత్వా వైకర్తనః కర్ణః సంరబ్ధః సమయోధయత్.
అర్జునేన ప్రయుక్తాంస్తాన్ బాణాన్ వేగవతస్తదా
ప్రతిహత్య ననాదోచ్చైః సైన్యాని తదపూజయన్.
తుష్యామి తే విప్రముఖ్య భుజవీర్యస్య సంయుగే
అవిషాదస్య చైవాస్య శస్త్రాస్త్రవిజయస్య చ.
కిం త్వం సాక్షాద్ధనుర్వేదో రామో వా విప్రసత్తమ
అథ సాక్షాద్ధరిహయః సాక్షాద్వా విష్ణురచ్యుతః.
ఆత్మప్రచ్ఛాదనార్థం వై బాహువీర్యముపాశ్రితః
విప్రరూపం విధాయేదం మన్యే మాం ప్రతియుధ్యసే.
న హి మామాహవే క్రుద్ధమన్యః సాక్షాచ్ఛచీపతేః
పుమాన్ యోధయితుం శక్తః పాండవాద్వా కిరీటినః.
తమేవం వాదినం తత్ర ఫాల్గునః ప్రత్యభాషత
నాస్మి కర్ణ ధనుర్వేదో నాస్మి రామః ప్రతాపవాన్.
బ్రాహ్మణోఽస్మి యుధాం శ్రేష్ఠః సర్వశస్త్రభృతాం వరః
బ్రాహ్మే పౌరందరే చాస్త్రే నిష్ఠితో గురుశాసనాత్.
స్థితోఽస్మ్యద్య రణే జేతుం త్వాం వై వీర స్థిరో భవ
ఏవముక్తస్తు రాధేయో యుద్ధాత్కర్ణో న్యవర్తత.
బ్రాహ్మం తేజస్తదాజయ్యం మన్యమానో మహారథః.
అపరస్మిన్ వనోద్దేశే వీరౌ శల్యవృకోదరౌ.
బలినౌ యుద్ధసంపన్నౌ విద్యయా చ బలేన చ
అన్యోన్యమాహ్వయంతౌ తు మత్తావివ మహాగజౌ.
ముష్టిభిర్జానుభిశ్చైవ నిఘ్నంతావితరేతరం
ప్రకర్షణాకర్షణయోరభ్యాకర్షవికర్షణైః.
ఆచకర్షతురన్యోన్యం ముష్టిభిశ్చాపి జఘ్నతుః
తతశ్చటచటాశబ్దః సుఘోరో హ్యభవత్ తయోః.
పాషాణసంపాతనిభైః ప్రహారైరభిజఘ్నతుః
ముహూర్తం తౌ తదాన్యోన్యం సమరే పర్యకర్షతాం.
తతో భీమః సముత్క్షిప్య బాహుభ్యాం శల్యమాహవే
అపాతయత్ కురుశ్రేష్ఠో బ్రాహ్మణా జహసుస్తదా.
తత్రాశ్చర్యం భీమసేనశ్చకార పురుషర్షభః
యచ్ఛల్యం పతితం భూమౌ నావధీద్బలినం బలీ
పాతితే భీమసేనేన శల్యే కర్ణే చ శంకితే
శంకితాః సర్వరాజానః పరివవ్రుర్వృకోదరం.
ఊచుశ్చ సహితాస్తత్ర సాధ్విమౌ బ్రాహ్మణర్షభౌ
విజ్ఞాయేతాం క్వజన్మానౌ క్వనివాసౌ తథైవ చ.
కో హి రాధాసుతం కర్ణం శక్తో యోధయితుం రణే
అన్యత్ర రామాద్ద్రోణాద్వా పాండవాద్వా కిరీటినః.
కృష్ణాద్వా దేవకీపుత్రాత్ కృపాద్వాపి శరద్వతః
కో వా దుర్యోధనం శక్తః ప్రతియోధయితుం రణే.
తథైవ మద్రాధిపతిం శల్యం బలవతాం వరం
బలదేవాదృతే వీరాత్ పాండవాద్వా వృకోదరాత్.
వీరాద్దుర్యోధనాద్వాన్యః శక్తః పాతయితుం రణే
క్రియతామవహారోఽస్మాద్ యుద్ధాద్ బ్రాహ్మణసంవృతాత్.

పరమేశ్వరుని దమయంతి నలుని వరించినట్లు ద్రుపద రాజపుత్రి పాండురాజనందనుని వరించి అర్జునుడితో రంగభూమినుండి కదిలింది. అక్కడి బ్రాహ్మణు లందరూ వారిని ఘనంగా సత్కరించారు.

187 వ అధ్యాయం సమాప్తం.

## నూట యెనుబది ఎనిమిదవ అధ్యాయము

ద్రుపదమహారాజు బ్రాహ్మణబాలునికి తన కుమార్తె నిచ్చి పెండ్లిచేయటానికి నిశ్చయించ టంతో రాజమండలానికి క్రోధం రేగింది. వారందరూ ఒకరితోనొకరు సంభాషణలు ఆరంభించారు.

ఈద్రుపదుడు తాను రాజై కూడా ఇతరక్షత్రియులను గడ్డిపరకలుగా తీసిపారేశాడు. తాను నాటినవృక్షం ఫలవంతం కాబోయే సమయంలో దానిని నేలమట్టం చేసుకుంటున్నాడు. అలాకాక పోతే తన కూతురును బ్రాహ్మణవరుడికి ఇస్తాడా. ఈసమయంలో మనం ఈ ద్రుపదుణ్ణి సంహరించి తీరాలి. కులవృద్ధులు పొందదగ్గ గౌరవ సమ్మానాలు పొందడానికి తగిన శ్రేష్ఠగుణాలేమీ వీనిలో లేవు. ఈ కార్యంతో వీనిలో రాజద్వేషం ఉన్నట్టు కూడా గోచరిస్తోంది. కనక మనం నిస్సంకోచంగా వీనిని వంశనాశనం చెయ్యాలి.

మనకందరికీ ఆహ్వానాలు పంపి రప్పించి స్వాగత సత్కారాలతో సమభ్యర్చనం చేసి విందుభోజనాలు సాగించి ఇంతా అయాక ఇలా అవమానిస్తున్నాడు. దేవతాసమప్రభులై ప్రకాశించే మనలో ఏ ఒక్కరూ తన పుత్రికకు తగిన వరుడు కాడా. స్వయంవరంలో కన్యనుపొందే అధికారం బ్రాహ్మణుడి కెక్కడిది. స్వయంవరం క్షత్రియజాతికే నిర్దేశింపబడింది.

ఈ ద్రుపదరాజపుత్రి మనలో ఎవరినీ వరించడానికి ఇష్టపడకపోతే ఆమెను అగ్నికి ఆహుతిచేసి మనం హాయిగా వెళ్ళిపోదాం. వాడు ఏచాపల్యం చేతనో వ్యామోహంవల్లనో యంత్రం ఛేదించాడు. అయినా బ్రాహ్మణుడు వధార్హుడు కాడు. మన రాజ్యభోగాలూ పుత్రమిత్ర కళత్రాదులూ ధనధాన్యరత్నరాసులూ ఒకటేమిటి—మన జీవితమే వారిది. అందుచేత మనం వారి నేమీ చెయ్య కూడదు. ఈ ద్రుపదరాజునే శిక్షించి ఇకముందు స్వయంవరాలలో ఎప్పుడూ ఇటువంటి అవమానం క్షత్రియజాతికి జరగకుండా చెయ్యాలి—అని తీర్మానించుకొని వారందరూ అస్త్రశస్త్రాలు ధరించి ద్రుపదుని హతమార్చే సంకల్పంతో కదిలారు.

క్రోధాగ్నితో ఎర్రవారిన కన్నులతో ధనుర్బాణాలతో వచ్చే అసంఖ్యాక క్షత్రియసమూహాన్ని చూసి ద్రుపదుడు బ్రాహ్మణుల శరణువేడాడు. మదగజాలవలె ఉన్న భీమార్జునులిద్దరూ ఎదురు వచ్చే రాజులకు ప్రతిగా నిలిచారు. అంతతో ఆ రాజుల ఆగ్రహం రెచ్చింది. ఉడుంతోలు తొడుగులు చేతులకు తొడిగి ఆయుధాలు ఝళిపిస్తూ వారందరూ భీమార్జునుల మీదకు తీవ్రవేగంతో వస్తున్నారు.

అద్భుతభయానక కార్యాలు చేయటంలో సమర్థుడైన వజ్రసదృశదేహుడు భీమసేనుడు ముందుకు

బ్రాహ్మణా హి సదా రక్ష్యాః సాపరాధాపి నిత్యదా
అజ్ఞానానుపలభ్యైహ పునర్యోత్స్యామ హృష్టవత్.
తాంస్తథావాదినః సర్వాన్ ప్రసమీక్ష్య క్షితీశ్వరాన్
అథాన్యాన్ పురుషాంశ్చాపి కృత్వా తత్ర గమ్యసంయుగే.
తత్కర్మ భీమస్య సమీక్ష్య కృష్ణః
కుంతీసుతౌ తౌ పరిశంకమానః
నివారయామాస మహీపతీంస్తాన్
ధర్మేణ లబ్ధేత్యనునీయ సర్వాన్.
ఏవం తే వినివృత్తాస్తు యుద్ధాద్ యుద్ధవిశారదాః
యథావాసం యయుః సర్వే విస్మితా రాజసత్తమాః.
వృత్తో బ్రహ్మోత్తరో రంగః పాంచాలీ
బ్రాహ్మణైర్వృతా
ఇతి బ్రువంతః ప్రయయుర్యే తత్రాసన్ సమాగతాః.
బ్రాహ్మణైస్తు ప్రతిచ్ఛన్నౌ రౌరవాజినవాసిభిః
కృచ్ఛ్రేణ జగ్మతుస్తౌ తు భీమసేనధనంజయౌ.
విముక్తౌ జనసంబాధాచ్ఛత్రుభిః పరివీక్షితౌ
కృష్ణయానుగతౌ తత్ర నృవీరౌ తౌ విరేజతుః.
పౌర్ణమాస్యాం ఘనైర్ముక్తౌ చంద్రసూర్యావివోదితౌ
తేషాం మాతా బహువిధం వినాశం పర్యచింతయత్
అనాగచ్ఛత్సు పుత్రేషు భైక్షకాలేఽభిగచ్ఛతి
ధార్తరాష్ట్రైర్హతా న స్యుర్విజ్ఞాయ కురుపుంగవాః.
మాయాన్వితైర్వా రక్షోభిః సుఘోరైర్దృఢవైరిభిః
విపరీతం మతం జాతం వ్యాసస్యాపి మహాత్మనః.
ఇత్యేవం చింతయామాస సుతస్నేహావృతా పృథా
తతః సుప్తజనప్రాయే దుర్దినే మేఘసంప్లుతే.
మహత్యథాపరాహ్ణే తు ఘనైః సూర్య ఇవావృతః
బ్రాహ్మణైః ప్రావిశత్తత్ర జిష్ణుర్భార్గవవేశ్మ తత్

189 వ అధ్యాయం సమాప్తం

## నూట తొంబదవ అధ్యాయము

గత్వా తు తాం భార్గవకర్మశాలాం
పార్థౌ పృథాం ప్రాప్య మహానుభావౌ
తాం యాజ్ఞసేనీం పరమప్రతీతౌ
భిక్షేత్యథావేదయతాం నరాగ్ర్యౌ.
కుటీగతా సా త్వనవేక్ష్య పుత్రౌ
ప్రోవాచ భుంక్తేతి సమేత్య సర్వే
పశ్చాచ్చ కుంతీ ప్రసమీక్ష్య కృష్ణాం
కష్టం మయా భాషితమిత్యువాచ.
సాధర్మభీత్వా పరిచింతయంతీ
తాం యాజ్ఞసేనీం పరమప్రతీతాం
పాణౌ గృహీత్వోపజగామ కుంతీ
యుధిష్ఠిరం వాక్యమువాచ చేదం.
ఇయం తు కన్యా ద్రుపదస్య రాజ్ఞః
తవానుజాభ్యాం మయి సంనిసృష్టా
యథోచితం పుత్ర మయాపి చోక్తం
సమేత్య భుంక్తేతి నృప ప్రమాదాత్.
మయా కథం నానృతముక్తమద్య
భవేత్ కురూణామృషభ బ్రవీహి
పాంచాలరాజస్య సుతామధర్మో
న చోపవర్తేత న విభ్రమేచ్చ.
స ఏవముక్తో మతిమాన్ నృవీరో
మాత్రా ముహూర్తం తు విచింత్య రాజా
కుంతీం సమాశ్వాస్య కురుప్రవీరో
ధనంజయం వాక్యమిదం బభాషే.

దూకి ఓ మహావృక్షం పెరికి ఒక్క విదిలింపుతో దాని ఆకులూ కొమ్మలూ రాలగొట్టి దండధారిలా వచ్చి అర్జునుని సరసన నిలిచాడు. అసాధారణ శక్తికి ఇంద్రసదృశపరాక్రమం తోడుకలిగిన అర్జునుడు భీముని చూసి పరమసంతోషంతో ధనుస్సు చేతబట్టాడు. లోకోత్తర ప్రతిభాసంపన్నుడైన శ్రీకృష్ణభగవానుడు భీమార్జునుల సాహస పరాక్రమాలకు పరమానందంపొందాడు. భయంకర పరాక్రమం కల బలరామునివైపు తిరిగి-అన్నా! ఈ మహాధనుస్సును సంధించి సింహంలా సాగుతూన్న మహావీరుడు అర్జునుడవటంలో ఇంకా సందేహ మేమిటి. మహావేగంతో కదిలి ఘనవృక్షాన్ని పీకిన బలిష్ఠుడు నిస్సందేహంగా భీమసేనుడే. భీముడు వినా మరెవరూ ఇంతటి సాహసం చెయ్యలేరు.

కమలదళవిశాలనేత్రాలు కలిగి. గౌరవర్ణంతో సింహగమనంతో వినయశీలుడై సుందర మనోహర నాసికాయుతుడై ఇతఃపూర్వం సభాస్థలి విడిచిన వాడు ధర్మరాజు. కార్తికేయులవలె ఆయన వెంట వెళ్ళిన వారిద్దరే అశ్వినీకుమారుల అనుగ్రహంవల్ల కలిగిన నకులసహదేవులు. లాక్షాగృహంలోంచి కుంతీ సహితులై పాండవులు పరిరక్షితులయారనే వార్త విన్నాక నాకు వీరే వారని నమ్మకం కలుగుతోంది. అన్నాడు.

రాజులందరూ తమతమ శక్తితో అర్జునుని ఎదిరిస్తూ పోరాడుతున్నారని విని కృష్ణుడు మళ్ళీ ఇలా అన్నాడు.

బలరామా! మనమేమీ భయపడనవసరం లేదు. దేవదానవులందరూ ఏకమై వచ్చినా అర్జునుడు ఏకైకవీరుడుగా నిలిచి జయించటానికి సమర్థుడు. అటువంటి మహావీరుడికి ఈ సామాన్యమానవులు లెక్కా. ఒకవేళ అతనికి సహకారం అవసరం అనిపిస్తే అప్పుడు మనం లేవవచ్చు. ఆ అవసరమే రాదు. పాండురాజనందనుడైన అర్జునునికి పరాజయమేమిటి — అని కృష్ణుడనటంతో బలరాముడూ నిశ్చింతంగా కూర్చున్నాడు. కురువంశోద్ధారకులైన పాండవవీరులూ మేనత్త కుంతీ క్షేమంగానే ఉన్నారని విని బలరాముడు ఎంతో సంతోషించాడు.

188 వ అధ్యాయము సమాప్తం

## నూట యెనుబది తొమ్మిదవ అధ్యాయం

అర్జునుని వీరవిహారం చూసి బ్రాహ్మణులందరూ పరమసంతోషంతో తాముకూడా శత్రువులతో యుద్ధంచేస్తామనగా ఆ మహావీరుడు వారి అవసరం లేదనీ అలా చూస్తూంటే తన వాడి బాణాలతో శత్రువులను పరాజితుల్ని చేస్తాననీ మాంత్రికుని చేతిలో మహాసర్పాలవలె వీరులందరూ తన బాణవర్షానికి తలలు వాలుస్తారనీ అంటూ సభామండపంలో లక్ష్యభేదనార్థం ఉంచిన విల్లు తీసికొని భీమసేనునితో నిలిచాడు.

మత్తేభాలు శాత్రవమదేభాలమీద ఉరికినట్లు భీమార్జునులు ఎదురువచ్చే కర్ణాది ప్రతిపక్షులపై దూకారు. అప్పుడు వారిలో కొందరు రాజులు ఈ

త్వయా జితా ఫాల్గుని యాజ్ఞసేనీ
త్వయైవ శోభిష్యతి రాజపుత్రీ
ప్రజ్వాల్యతామగ్నిరమిత్రసాహ
గృహాణ పాణిం విధివత్ త్వమస్యాః.
మా మాం నరేంద్ర త్వమధర్మభాజం
కృథా న ధర్మోఽయమశిష్టదృష్టః
భవాన్ నివేశ్యః ప్రథమం తతోఽయం
భీమో మహాబాహురచింత్యకర్మా.
అహం తతో నకులోఽనంతరం మే
పశ్చాదయం సహదేవస్తరస్వీ
వృకోదరోఽహం చ యమౌ చ రాజ
న్నియం చ కన్యా భవతో నియోజ్యాః.
ఏవం గతే యత్ కరణీయమత్ర
ధర్మ్యం యశస్యం కురు తద్విచింత్య
పాంచాలరాజస్య హితం చ యత్ స్యాత్
ప్రశాధి సర్వే స్మ వశే స్థితాస్తే
జిష్ణోర్వచనమాజ్ఞాయ భక్తిస్నేహసమన్వితం
దృష్టిం నివేశయామాసుః పాంచాల్యాం పాండునందనాః.
దృష్ట్వా తే తత్ర పశ్యంతీం సర్వే కృష్ణాం యశస్వినీం
సంప్రేక్ష్యాన్యోన్యమాసీనా హృదయైస్తామధారయన్
తేషాం తు ద్రౌపదీం దృష్ట్వా సర్వేషామమితౌజసాం
సంప్రమథ్యేంద్రియగ్రామం ప్రాదురాసీన్మనోభవః.
కామ్యం హి రూపం పాంచాల్యా విధాత్రా విహితం స్వయం
బభూవాధికమన్యాభ్యః సర్వభూతమనోహరం.
తేషామాకారభావజ్ఞః కుంతీపుత్రో యుధిష్ఠిరః
ద్వైపాయనవచః కృత్స్నం సంస్మరన్మనుజర్షభః.
అబ్రవీత్ సహితాన్ భ్రాతౄన్ మిథో భేదభయాన్నృపః
సర్వేషాం ద్రౌపదీ భార్యా భవిష్యతి హి నః శుభా.

భ్రాతుర్వచస్తత్ ప్రసమీక్ష్య సర్వే
జ్యేష్ఠస్య పాండోస్తనయాస్తదానీం
తమేవార్థం ధ్యాయమానా మనోభిః
సర్వే చ తే తస్థురదీనసత్త్వాః.
వృష్ణిప్రవీరస్తు కురుప్రవీరా
నాశంసమానః సహరౌహిణేయః
జగామ తాం భార్గవకర్మశాలాం
యత్రాసతే తే పురుషప్రవీరాః.
తత్రోపవిష్టం పృథుదీర్ఘబాహుం
దదర్శ కృష్ణః సహరౌహిణేయః
అజాతశత్రుం పరివార్య తాంశ్చా
ప్యుపోపవిష్టాన్ జ్వలనప్రకాశాన్.
తతోఽబ్రవీద్ వాసుదేవోఽభిగమ్య
కుంతీసుతం ధర్మభృతాం వరిష్ఠం
కృష్ణోఽహమస్మీతి నిపీడ్య పాదౌ
యుధిష్ఠిరస్యాజమీఢస్య రాజ్ఞః.
తథైవ తస్యాప్యను రౌహిణేయ
స్తౌ చాపి హృష్టాః కురవోఽభ్యనందన్
పితృష్వసుశ్చాపి యదుప్రవీరా
వగృహ్ణతాం భారతముఖ్య పాదౌ.
అజాతశత్రుశ్చ కురుప్రవీరః
పప్రచ్ఛ కృష్ణం కుశలం విలోక్య
కథం వయం వాసుదేవ త్వయేహ
గూఢా వసంతో విదితాశ్చ సర్వే.
తమబ్రవీద్ వాసుదేవః ప్రహస్య
గూఢోఽప్యగ్నిర్జ్ఞాయత ఏవ రాజన్
తం విక్రమం పాండవేయానతీత్య
కోఽన్యః కర్తా విద్యతే మానుషేషు.
దిష్ట్యా సర్వే పావకాద్విప్రముక్తా
యూయం ఘోరాత్ పాండవాః శత్రుసాహాః
దిష్ట్యా పాపో ధృతరాష్ట్రస్య పుత్రః

బ్రాహ్మణబాలుని చంపవచ్చునా అని శంకిస్తూండగా మిగిలినవారు యుద్ధరంగంలో బ్రాహ్మణుని వధించటం దోషంకాదని శాస్త్రసమ్మతమని ముందుకు నడిచారు. ఆహుపనుగుకోసం పోరాటం సాగించే గజరాజులా శల్యుడు భీముని ఢీకొనగా కర్ణుడు అర్జునివైపు ధనుస్సు ఎక్కుపెట్టాడు. దుర్యోధనాది రాజన్యులు బ్రాహ్మణులతో అనాయాసంగా పోరు సాగిస్తున్నారు. అర్జునుడు నారి సారించి తీక్ష్ణమైన మొనలుగల బాణాలు కర్ణుని శరీరంమీద వదలుతున్నాడు. ఆ బాణాల తాకిడికి తట్టుకోలేకపోయినా కర్ణుడు అతి ప్రయాసమీద అర్జుని సమీపించటానికి వస్తున్నాడు. కర్ణార్జునులు సాగించే యుద్ధంలో ఎవరు ఎవరికన్న బలశాలులో గ్రహించ శక్యంకాకుండా ఉంది. ఒకరు ప్రయోగించిన అస్త్రాలను ఒకరు ఛిన్నాభిన్నం చేస్తున్నారు. రణరంగంలో సాగే సంభాషణలుకూడా తీవ్రంగా సాగిస్తూనే ఉన్నారు. తనతోపోరాడేవీరుడు బలిష్ఠుడేనని అంతటి వీరుడు అవనీతలంలో ఉండడనీ అనుకుంటూనే కర్ణుడు తన అస్త్రకౌశలం ప్రదర్శిస్తున్నాడు. అర్జునుడు విడిచిన బాణాలను ఖండించి కర్ణుడు సింహనాదం చేసేసరికి మిగిలినవారందరూ కర్ణుని అభినందించారు.

అప్పుడు కర్ణుడు—విప్రశ్రేష్ఠా! ఈ యుద్ధంలో మీరు ప్రదర్శించిన శక్తి నాకు సంతోషం కలిగించింది. మీ ముఖంలో ఏవిధమైన విచారరేఖలూ లేవు. శరీరానికి అలసటలేదు. చూస్తూంటే తమకు అస్త్రశస్త్రాలన్నీ సేవ చేస్తున్నట్లున్నాయి. మీరు రూపుదాల్చిన ధనుర్వేదమో లేక ధనురాచార్యులైన పరశురాములో అనిపిస్తున్నారు. అలా కాకపోతే మీరు దేవేంద్రులో నారాయణభగవానులో కావాలి. నిజస్వరూపం ప్రకటించుకోవటానికి ఇష్టం లేక మీరు ఈ రూపంలో వచ్చారని భావిస్తున్నాను. బాహుబలమే పరమంగా ఎంచే నేను క్రోధమూర్తినై యుద్ధభూమిలో నిలిస్తే నిలింపపతికానీ ఆయన ప్రియపుత్రుడు కౌంతేయుడుకానీ ఎదుర్కోవాలే కాని ఇతరులు నిలువలేరు — అనగా అర్జునుడు—కర్ణా! నేను నువ్వు భావించినవారిలో ఏ ఒకర్నీ కాను. విలువిద్యావైదుష్యంకల ఉత్తమ బ్రాహ్మణుణ్ని. గురూపదేశంతో బ్రహ్మాస్త్రాలను సాధించుకున్నవాడిని. ఈ రోజున నిన్ను ఓడించడానికే ఇక్కడ నిలబడ్డాను. నువ్వు కూడా స్థిరబుద్ధితో సిద్ధంగా ఉండు—అన్నాడు.

ఈ మాటలు విని కర్ణుడు బ్రహ్మతేజస్సు ఇతర శక్తులవల్ల పరాభూతమయేది కాదని యుద్ధం మానేశాడు. అప్పటికే భీమసేనుడు శల్యునితో తీవ్రంగా పోరు సాగిస్తున్నాడు. నేలమీద పాదం తాటించి ఎదుర్కొనే మదపుటేనుగుల్లా వారు ఢీకొంటున్నారు. ఒకరినొకరు చేతులతో ఈడ్చుకుపోతూ నేలమీద పడగొట్టటానికి ప్రయత్నాలు చేస్తూభీషణముష్టిఘాతాలు నిర్విరామంగా సాగిస్తూ ఉన్నారు. నారి పిడికిటిపోటు దెబ్బల ధ్వని రెండు బండరాళ్ళు సంఘర్షిస్తున్నట్లుంది. సుమారు రెండు ఘడియలు వారు ఆ ప్రకారంగా యుద్ధంచేశారు. అప్పుడు భీమసేనుడు రెండుచేతులతోనూ శల్యుని పైకెత్తి నేలమీద పడేశాడు. అంతతో బ్రాహ్మణసమూహం హర్షధ్వానాలతో భీమసేనుని అభినందించింది. కర్ణుడూ శల్యుడూ ఈ విధంగా పరాజయం పొందడంతో రాజులందరూ చేరి పరశురాముడూ ద్రోణుడూ పాండవరాజనందనుడైన అర్జునుడూ తప్ప కర్ణుని ఎదిరించి నిలవగలవారెవరు. ఇప్పుడు మనం ఈ బ్రాహ్మణులెవరో వీరి

సహామాత్యో న సకామోఽభవిష్యత్.
భద్రం వోఽస్తు నిహితం యద్గుహాయాం
వివర్ధధ్వం జ్వలనా ఇవైధమానాః
మా వో విదుః పార్థివాః కేచిదేవ
యాంస్యావహే శిబిరాయైవ తావత్.
సోఽనుజ్ఞాతః పాండవేనావ్యయశ్రీః
ప్రాయాచ్ఛీఘ్రం బలదేవేన సార్ధం.

190 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది ఒకటవ అధ్యాయము

ధృష్టద్యుమ్నస్తు పాంచాల్యః పృష్ఠతః కురునందనౌ
అన్వగచ్ఛత్ తదా యాంతౌ భార్గవస్య నివేశనే.
సోఽజ్ఞాయమానః పురుషానవధాయ సమంతతః
స్వయమారాన్నిలీనోఽభూద్ భార్గవస్య నివేశనే.
సాయం చ భీమస్తు రిపుప్రమాథీ
జిష్ణుర్యమౌ చాపి మహానుభావౌ
భైక్షం చరిత్వా తు యుధిష్ఠిరాయ
నివేదయాంచక్రురదీనసత్త్వాః.
తతస్తు కుంతీ ద్రుపదాత్మజాం తాం
ఉవాచ కాలే వచనం వదాన్యా
త్వమగ్రమాదాయ కురుష్వ భద్రే
బలిం చ విప్రాయ చ దేహి భిక్షాం.
యే చాన్నమిచ్ఛంతి దదస్వ తేభ్యః
పరిశ్రితా యే పరితో మనుష్యాః
తతశ్చ శేషం ప్రవిభజ్య శీఘ్రం
మర్ధం చతురా మమ చాత్మనశ్చ.
అర్ధం తు భీమాయ చ దేహి భద్రే
య ఏష నాగర్షభతుల్యరూపః
గౌరో యువా సంహననోపపన్న
ఏషో హి వీరో బహుభుక్సదైవ.
సా హృష్టరూపేవ తు రాజపుత్రీ
తస్యా వచః సాధు విశంకమానా
యథావదుక్తం ప్రచకార సాధ్వీ
తే చాపి సర్వే బుభుజుస్తదన్నం.
కుశైస్తు భూమౌ శయనం చకార
మాద్రీపుత్రః సహదేవస్తరస్వీ
యథా స్వకీయాన్యజినాని సర్వే
సంస్తీర్య వీరాః సుషుపుర్ధరణ్యాం.
అగస్త్యశాస్తామభితో దిశం తు
శిరాంసి తేషాం కురుసత్తమానాం
కుంతీపురస్తాత్ తు బభూవ తేషాం
పాదాంతరే చాథ బభూవ కృష్ణా.
అశేత భూమౌ సహ పాండుపుత్రైః
పాదోపధానీవ కృతా కుశేషు
న తత్ర దుఃఖం మనసాపి తస్యా
న చావమేనే కురుపుంగవాంస్తాన్.
తే తత్ర శూరాః కథయాంబభూవుః
కథా విచిత్రాః పృతనాధికారాః
అస్త్రాణి దివ్యాని రథాంశ్చ నాగాన్
ఖడ్గాన్ గదాంశ్చాపి పరశ్వధాంశ్చ.
తేషాం కథాస్తాః పరికీర్త్యమానాః
పాంచాలరాజస్య సుతస్తదానీం
శుశ్రావ కృష్ణాం చ తదా విషణ్ణాం
తే చాపి సర్వే దదృశుర్మనుష్యాః.
ధృష్టద్యుమ్నో రాజపుత్రస్తు సర్వం
వృత్తం తేషాం కథితం చైవ రాత్రౌ

వాసస్థానం ఎక్కడో తెలిసికోవాలి. దేవకీ గర్భ సంభూతుడైన శ్రీకృష్ణుడో శరద్వంతనందనుడైన కృపాచార్యుడో వినా దుర్యోధనుని శిక్షించగలవారెవరు. బలదేవ దుర్యోధన భీమసేనులు తప్ప మద్ర పీఠాధిపుడైన శల్యుని శిక్షించగల వీరులెవరు. వీరి బలపరాక్రమాలు చూస్తూంటే మనం ఇక్కడ ఉండడం శ్రేయస్కరంగా తోచటంలేదు. ముందు వీరిని గూర్చిన వివరాలు తెలుసుకోవాలి. ఆ తరువాయి పరిస్థితులను చూసి యుద్ధం సాగించవచ్చు- అని వారిలోవారు అనుకుంటూండగా విని భీమార్జునులు పరమసంతోషంతో నిలిచారు.

ఆ సమయానికి శ్రీకృష్ణుడు అక్కడికిచేరి వారిరువురూ భీమార్జునులే అని నిశ్చయించుకొని చేరిన రాజులందరినీ ఉద్దేశించి — వీరు ధర్మబద్ధంగానే ద్రౌపదిని పరిగ్రహించారు — అనటంతో ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు. వచ్చిన ప్రేక్షకులందరూ బ్రాహ్మణులను అభినందిస్తూ తిరిగిపోయారు. మృగచర్మధారులైన బ్రాహ్మణులందరూ చుట్టుముట్టి వస్తూంటే భీమార్జునులు అతికష్టంమీద నెమ్మదిగా సాగుతున్నారు. అప్పటికి వారు జనసమూహంనుంచి బైటపడ్డారు. శత్రురాజులందరూ వారిని ఒక్కసారి సమగ్రంగా చూశారు.

ఆ వీరులిద్దరూ ముందుసాగుతుంటే వారివెనకనే ద్రౌపది నడుస్తూన్నది. పూర్ణిమాదివసాన మేఘమండలాలను తొలగించుకొని వచ్చే సూర్యచంద్రులవలె ఉన్నారు.

భిక్షాసమయం దాటినా కుమారులు ఇంటికి రాకపోయేసరికి కుంతీ హృదయం పరిపరివిధాల పోయింది. దుష్టబుద్ధులైన కౌరవులు పాండవులను గుర్తుపట్టి హతమార్చారో రాక్షసులెవరయినా వైరభావప్రేరితులై వచ్చి హింసించారో అని వ్యాసమహర్షి వాక్యం వ్యర్థంకావలసినదేనా అనీ చింతిస్తూన్నది. ఆ సమయంలో ఆకాశం కారుమేఘావృతమయింది. ప్రజలు ఎవరి గృహాలలో వారు అచేతనంగా కూర్చున్నారు. అప్పటికి అర్జునుడు ఇంటికి చేరాడు. సాయంసంధ్యాపూర్వం మేఘమండలంలో ఉన్న సూర్యునివలె అర్జునుడు బ్రాహ్మణులమధ్య ఉన్నాడు.

189 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబదియవ అధ్యాయము

భీమార్జునులు ప్రసన్నచిత్తులై తమ వాసగృహంలో ప్రవేశించి—అమ్మా! భిక్ష తెచ్చాము — అన్నారు. ఇంట్లో లోపలఉన్న కుంతీదేవి వారిని చూడకుండానే తెచ్చినదానిని అందరూ కలసి పొందండి—అన్నది. అనంతరం వెలుపలికి వచ్చి చూసేసరికి ద్రౌపది కనుపించింది. కుంతీదేవి చకితయై తననోటినుండి ఇటువంటి అనుచితవాక్యం ఎందుచేత రావలసి వచ్చిందీ అని చింతించసాగింది.

అనంతరం కుంతి ద్రౌపదిని వెంటబెట్టుకుని ధర్మరాజును సమీపించి—నాయనా! ఈమె ద్రుపదరాజ పుత్రి ద్రౌపది. భీమార్జునులీమెను తెచ్చి భిక్ష తెచ్చామన్నారు. నేను చూడకుండానే మామూలు ప్రకారంగా అందర్నీ అనుభవించమన్నాను. ఇప్పుడు నావాక్యం అసత్యంకాకూడదు. ద్రౌపదికి అధర్మభీతి కలుగరాదు. అటువంటిమార్గ

సర్వం రాజ్ఞే ద్రుపదాయాఖిలేన
నివేదయిష్యం స్త్వరితో జగామ.
పాంచాలరాజస్తు విషణ్ణరూప
స్తాన్ పాండవానప్రతివిందమానః
ధృష్టద్యుమ్నం పర్యపృచ్ఛన్మహాత్మా
క్వ సా గతా కేన నీతా చ కృష్ణా.
కచ్చిన్న శూద్రేణ న హీనజేన
వైశ్యేన వా కరదేనోపపన్నా
కచ్చిత్పదం మూర్ధ్ని న పంకదిగ్ధం
కచ్చిన్న మాలా పతితా శ్మశానే.
కచ్చిత్ సవర్ణ ప్రవరో మనుష్య
ఉద్రిక్తవర్ణోఽప్యుత ఏవ కచ్చిత్
కచ్చిన్న వామో మమ మూర్ధ్ని పాదః
కృష్ణాభిమర్శేన కృతోఽద్య పుత్ర.
కచ్చిన్న తప్స్యే పరమప్రతీతః
సంయుజ్య పార్థేన నరర్షభేణ
వదస్వ తత్త్వేన మహానుభావ
కోఽసౌ విజేతా దుహితుర్మమాద్య.
విచిత్రవీర్యస్య సుతస్య కచ్చిత్
కురుప్రవీరస్య ధ్రియంతి పుత్రాః
కచ్చిత్ తు పార్థేన యవీయసాద్య
ధనుర్గృహీతం నిహతం చ లక్ష్యం.

ఇ ది స్వ యం వ ర ప ర్వ ము

# వై వా హి క ప ర్వ ము

తతస్తథోక్తః పరిహృష్టరూపః
పిత్రే శశంసాథ స రాజపుత్రః
ధృష్టద్యుమ్నః సోమకానాం ప్రబర్హో
వృత్తం యథా యేన హృతా చ కృష్ణా.
యోఽసౌ యువా వ్యాయతలోహితాక్షః
కృష్ణాజినీ దేవసమానరూపః
యః కార్ముకాగ్ర్యం కృతవానధిజ్యం
లక్ష్యం చ యః పాతితవాన్ పృథివ్యాం.
అసజ్జమానశ్చ తత సరస్వీ
వృతో ద్విజాగ్ర్యైరభిపూజ్యమానః
చక్రామ వజ్రీవ దితేః సుతేషు
సర్వైశ్చ దేవై ఋషిభిశ్చ జుష్టః.
కృష్ణా ప్రగృహ్యాజినమన్వయాత్ తం
నాగం యథా నాగవధూః ప్రహృష్టా
అమృష్యమాణేషు నరాధిపేషు
క్రుద్ధేషు వై తత్ర సమాపతత్సు.
తతోఽపరః పార్థివసంఘమధ్యే
ప్రవృద్ధమారుజ్య మహీప్రరోహం
ప్రకాలయన్నేవ స పార్థివౌఘాన్
క్రుద్ధోఽంతకః ప్రాణభృతో యథైవ.
తౌ పార్థివానాం మిషతాం నరేంద్ర
కృష్ణాముపాదాయ గతౌ నరాగ్ర్యౌ
విభ్రాజమానావివ చంద్రసూర్యౌ
బాహ్యాం పురాద్ భార్గవకర్మశాలాం.
తత్రోపవిష్టార్చిరివానలస్య
తేషాం జనిత్రీతి మమ ప్రతర్కః
తథావిధై రేవ నరప్రవీరై
రుపోపవిష్టైస్త్రిభిరగ్నికల్పైః.
తస్యాస్తతస్తావభివాదం పాదా
ఉక్తా చ కృష్ణా త్వభివాదయేతి

ఏమైనా వుంటే చెప్పు — అన్నది. ధీమంతుడైన ధర్మరాజు రెండుమూడు క్షణాలాలోచించి కుంతిని ఓదార్చి అర్జునునితో ఇలా అన్నాడు — అర్జునా! నీవు ద్రౌపదిని స్వయంవరంలో పొందావు. ఈమె నీకు తగినకన్య. అగ్నిహోత్రుడు సాక్షిగా ఈ రాజపుత్రిని నీవు ధర్మపత్నిగా పరిగ్రహించు—అన్నాడు.

అన్నా! మీరు నన్నుధర్మవిరతుడుగా చేయకండి. అగ్రజుడు అవివాహితుడై ఉండగా అనుజన్ములు అర్థాంగిని పొందడం అనార్యులలో కనిపిస్తుంది. ముందుగా మీవివాహం జరగాలి. తరువాత భీమసేనుని పరిణయం కావాలి. అప్పుడు నేను భార్యను పరిగ్రహించాలి. నా తరువాయి నకుల సహదేవులు వివాహితులౌతారు. భీమసేనాది సహదేవ పర్యంతం ద్రౌపదీ సమేతంగా మీ ఆజ్ఞాబద్ధులము. మీరుకీర్తిప్రథాన్ని ధర్మమార్గాన్ని సుష్ఠుగా విచారించి పాంచాల రాజుకి హితమైన మార్గంలో మమ్మల్ని నడపండి—అన్నాడు అర్జునుడు స్నేహభరితము భక్తిభావ సంభరితము అయిన అర్జునుని మాటలువినిన పాండవులందరూ పాంచాల రాజపుత్రివైపు కన్నులు త్రిప్పారు. అదేసమయంలో వారినందర్నీ చూసింది. వారందరి హృదయాలు ఆమెమూర్తినే చిత్రించుకుంటున్నాయి. అదే సమయంలో మన్మథుడు వారందర్నీ వేధించ నారంభించాడు. ద్రౌపదీ రూపాన్ని తీర్చిదిద్దడంలో వాణీనాథుడు ప్రపంచసౌందర్యాన్నంతటినీ కేంద్రీకరించుకున్నట్లు అనిపిస్తోంది. సర్వప్రాణికోటిని ఆకర్షించే ఆసౌందర్యరాశిని చూస్తూ ధర్మరాజు ఆమె హృదయం గ్రహించిన క్షణంలో వేదవ్యాసుల వచనాలు స్మరణానికి వచ్చాయి. పైగా ఈద్రౌపది కారణంగా సోదరులమధ్య ఏవిధమయిన విభేదాలు పొడసూపకూడదనే నిశ్చయానికి వచ్చి—ద్రౌపది పాండవులందరికి భార్య అవుతుంది—అన్నాడు.

ధర్మవిదుడు సత్యవాది అయిన ధర్మరాజు ఆవిధంగా అభిభాషించడంతో ఉదారహృదయులైన పాండవులందరూ ఆయన నిశ్చయాన్ని అనుసరించి ఆలోచించుకోసాగారు.

అదే సమయానికి శ్రీకృష్ణుడు బలరామునితో పాండవులను కలుసుకోవడానికి వచ్చాడు. విశాల భుజుడైన ధర్మరాజును సోదరులను చూసి ధర్మజుని సమీపించి తన గోత్రనామాలు కలిపి పాదాలకు నమస్కరించాడు. రోహిణీనందనుడైన బలరాముడు కృష్ణుని అనుసరించాడు. తిరిగి వారిరువురూ మేనత్త కుంతికి నమస్కరించారు. వారిని చూసి పాండవులు పరమానందం పొందారు. శ్రీకృష్ణుడు వారి క్షేమ సమాచారాలు విచారించాక ధర్మరాజు తాము ఇంతగుప్తంగా ఉంటున్నా వారు ఎలాగుర్తించారో చెప్పవలసిందని కోరగా శ్రీకృష్ణుడు—అగ్నినిదాచగల వారెవరు. స్వయంవర రంగస్థల సమీపంలో అంతటి అద్భుతకార్యాన్ని సాధించినవారు పాండవులుకాక మరెవరవుతారు. ఆ శత్రు సమూహం నుండి మీరందరూ సురక్షితంగా తిరిగి రావడం కంటె అదృష్టంలేదు.

దుష్టుడైన దుర్యోధనుడు అమాత్యసహితుడై పన్నిన పన్నాగాలు విఫలంకావడం కంటె కోరదగిందిలేదు. మీరు నిరంతరం ప్రజ్వలించే అగ్నిలా ప్రకాశిస్తూండాలి. మీకు కళ్యాణం కలుగుతుంది. ఈ స్వయంవరానికి వచ్చిన రాజులెవరూ మిమ్మల్ని గుర్తుపట్టలేదు. ఇక మాకు సెలవు — అని శ్రీకృష్ణుడు బలరామసహితుడై త్వరితగతిని ఆ ప్రదేశం వీడి వెళ్ళిపోయాడు.

స్థితాం చ తత్రైవ నివేశ్య కృష్ణాం
భిక్షాప్రచారాయ గతా నరాగ్ర్యాః
తేషాం తు భైక్షం ప్రతిగృహ్య కృష్ణా
దత్త్వా బలిం బ్రాహ్మణసాచ్చ కృత్వా
తాం చైవ వృద్ధాం పరివేష్య తాంశ్చ
నరప్రవీరాన్ స్వయమప్యభుంక్త.
సుప్తాస్తు తే పార్థివ సర్వ ఏవ
కృష్ణా చ తేషాం చరణోపధానే
ఆసీత్ పృథివ్యాం శయనం చ తేషాం
దర్భాజినాగ్ర్యాస్తరణోపపన్నం.
తే నర్దమానా ఇవ కాలమేఘాః
కథా విచిత్రాః కథయాంబభూవుః
న వైశ్యశూద్రౌపయికీః కథాస్తా
న చ ద్విజానాం కథయంతి వీరాః.
నిఃసంశయం క్షత్రియపుంగవాస్తే
యథా హి యుద్ధం కథయంతి రాజన్
ఆశా హి నో వ్యక్తమియం సమృద్ధా
ముక్తాన్ హి పార్థాన్ శృణుమోఽగ్నిదాహాత్.
యథా హి లక్ష్యం నిహతం ధనుశ్చ
సజ్యం కృతం తేన యథా ప్రసహ్య
యథా హి భాషంతి పరస్పరం తే
ఛన్నా ధ్రువం తే ప్రచరంతి పార్థాః.
తతః స రాజా ద్రుపదః ప్రహృష్టః
పురోహితం ప్రేషయామాస తేషాం
విద్యామ యుష్మానితి భాషమాణో
మహాత్మనః పాండుసుతాస్తు కచ్చిత్.
గృహీతవాక్యో నృపతేః పురోధా
గత్వా ప్రశంసామభిధాయ తేషాం
వాక్యం సమగ్రం నృపతేర్యథావ
దువాచ చానుక్రమవిక్రమేణ.

విజ్ఞాతుమిచ్ఛత్యవనీశ్వరో వః
పాంచాలరాజో వరదో వరార్హాః
లక్ష్యస్య వేద్ధారమిమం హి దృష్ట్వా
హర్షస్య నాంతం ప్రతిపద్యతే సః.
ఆఖ్యాత చ జ్ఞాతికులానుపూర్వీం
పదం శిరస్సు ద్విషతాం కురుధ్వం
ప్రహ్లాదయధ్వం హృదయం మమేదం
పాంచాలరాజస్య చ సానుగస్య.
పాండుర్హి రాజా ద్రుపదస్య రాజ్ఞః
ప్రియః సఖా చాత్మసమో బభూవ
తస్యైష కామో దుహితా మమేయం
స్నుషాం ప్రదాస్యామి హి కౌరవాయ.
అయం హి కామో ద్రుపదస్య రాజ్ఞో
హృదిస్థితో నిత్యమనిందితాంగాః
యదర్జునో వై పృథుదీర్ఘబాహు
ర్ధర్మేణ విందేత సుతాం మమైతాం.
కృతం హి తత్ స్యాత్ సుకృతం మమేదం
యశశ్చ పుణ్యం చ హితం తదేతత్
అథోక్తవాక్యం హి పురోహితం స్థితం
తతో వినీతం సముదీక్ష్య రాజా.
సమీపస్థో భీమమిదం శశాస
ప్రదీయతాం పాద్యమర్ఘ్యం తథాస్మై
మాన్యః పురోధా ద్రుపదస్య రాజ్ఞః
తస్మై ప్రయోజ్యాభ్యధికా హి పూజా.
భీమస్తతస్తత్ కృతవాన్ నరేంద్ర
తాం చైవ పూజాం ప్రతిగృహ్య హర్షాత్
సుఖోపవిష్టం తు పురోహితం తదా
యుధిష్ఠిరో బ్రాహ్మణమిత్యువాచ.
పాంచాలరాజేన సుతా నిసృష్టా
స్వధర్మదృష్టేన యథా న కామాత్

## నూటతొంబదిఒకటవ అధ్యాయం

భీమార్జునులు ఇంటికి వెడుతున్న సమయంలో ధృష్టద్యుమ్నుడు రహస్యంగా వారివెంట వెళ్ళాడు. కొందరు సేవకులను వారి నివాసస్థానానికి నలువైపులా ఉంచి తానుకూడా గుప్తంగా అక్కడే ఉండిపోయాడు. సాయంకాలమయ్యాక భీమార్జున నకులసహదేవులు భిక్షలు తెచ్చి ధర్మజుని ముందు ఉంచారు. విశాలహృదయంకల కుంతీదేవి ద్రౌపదిని పిల్చి — అమ్మా! నువ్వీభిక్షలోని ఒకభాగం తీసి దేవతలకు నివేదించి కొంతభాగం బ్రాహ్మణులకు అర్పించు. మరికొంతతీసి మనలను ఆశ్రయించుకొని ఉన్న అన్నార్తులకు వడ్డించు. మిగిలిన దానిని రెండుభాగాలుచేసి ఒకభాగం ప్రక్కగా ఉంచు. మిగిలినసగాన్ని ఆరు భాగాలుచేసి నాలుగు వేరు వేరు భాగాలుగా ఉంచి ఎదురుగా ఉన్న దానిలో ఒకటి నువ్వు తీసికో. గజేంద్రునివలె ఉన్న ఈ గౌర వర్ణుడు భీముడు అధికంగా భుజిస్తాడు. కనుక అతనికి ప్రక్కనుంచిన సగభాగం ఇచ్చెయ్యి—అన్నది.

అత్తగారి ఆజ్ఞాపాలనమే తన అభ్యుదయానికి అవశ్యమని భావించిన ద్రౌపదీదేవి ఆమెమాటలను తూ. చ. తప్పకుండా ఆచరించింది. వారందరూ తృప్తిగా భుజించారు. భోజనానంతరం సహదేవుడు దర్భలతో నిర్మించుకున్న శయ్యమీద పరున్నాడు. పాండవులు తమతమ మృగచర్మాలమీద దక్షిణ దిశగా తలలు ఉంచుకొని నిద్రించారు. శిరో భాగాన్ని కుంతి పాదాలవద్ద ద్రౌపది నిద్రించారు. రాజపుత్రి ద్రౌపది ఆవిధంగా శయనించడానికి ఎంత మాత్రమూ చింతించలేదు. నిద్రకు ముందు పాండవులు కొంతసేపు వీరగాథలు చెప్పుకున్నారు. రథ గజ తురగాదుల విషయమూ అస్త్ర శస్త్ర ఖడ్గ గదాద్యాయుధాల ప్రయోగ విషయము కూడా ప్రసంగించుకున్నారు. వారి ప్రసంగమంతా ధృష్టద్యుమ్నుడు వివరంగా విన్నాడు. వింటూనే ఆవిశేషాలన్నీ తండ్రికి నివేదించడానికి రాజసౌధం చేరాడు. పాండవుల జాడ తెలియక విచారిస్తున్న ద్రుపదుని ధృష్టద్యుమ్నుడు సమీపించగానే — నాయనా! మన ద్రౌపది ఎక్కడకు వెళ్ళింది. ఆమెను శూద్రుడుకాని నీచజాతి పురుషుడుకాని నీచునివల్ల ఉత్తమజాతి స్త్రీకి కలిగినవాడుకాని పన్నులుకట్టే వైశ్యుడుకాని ఆమెను గ్రహించలేదుకదా. అలా చేసి వారు తమ ధూళిధూసరిత పాదాలను మాణిక్యఖచిత కిరీటంతో శోభించే నా తలమీద పెట్టుకొనలేదు కదా. సుమ సౌకుమార్యంతో శోభించే నా ప్రియకుమారి శ్మశాన సమానమైన అపవిత్రుని హస్తాలలో పడలేదుకదా. ద్రౌపదిని పరిగ్రహించిన పురుషుడు మనతో సమునేనా కాక అగ్రవర్ణస్థుడైన బ్రాహ్మణుడా నిమ్నజాతివాడెవడూ ఆమెని గ్రహించి వాడి ఎడమకాలు నా నెత్తిమీద ఉంచడుకదా. ద్రౌపదిని అర్జునునకిచ్చి నిర్విచారంగా పరమసంతోషంతో ఉండే అదృష్టం నాకు కలుగుతుందా. పాండురాజనందనులైన ధర్మరాజాదులు సుఖంగా ఉన్నారా—అన్నాడు.

191వ అధ్యాయం సమాప్తం

ప్రదిష్టశుల్కా ద్రుపదేన రాజ్ఞా
సా తేన వీరేణ తథానువృత్తా.
న తత్ర వర్ణేషు కృతా వివక్షా
న చాపి శీలే న కులే న గోత్రే
కృతేన సజ్యేన హి కార్ముకేణ
విద్ధేన లక్ష్యేణ హి సా విసృష్టా.
సేయం తథానేన మహాత్మనేహ
కృష్ణా జితా పార్థివసంఘమధ్యే
నైవంగతే సౌమకిరద్య రాజా
సంతాపమర్హత్యసుఖాయ కర్తుం.
కామశ్చ యోఽసౌ ద్రుపదస్య రాజ్ఞః
స చాపి సంపత్స్యతి పార్థివస్య
సంప్రాప్యరూపాం హి నరేంద్రకన్యా
మిమామహం బ్రాహ్మణ సాధు మన్యే.
న తద్ ధనుర్మందబలేన శక్యం
మౌర్వ్యా సమాయోజయితుం తథా హి
న చాకృతాస్త్రేణ న హీనజేన
లక్ష్యం తథా పాతయితుం హి శక్యం.
తస్మాన్న తాపం దుహితుర్నిమిత్తం
పాంచాలరాజోఽర్హతి కర్తుమద్య
న చాపి తత్పాతనమన్యథేహ
కర్తుం హి శక్యం భువి మానవేన.
ఏవం బ్రువత్యేవ యుధిష్ఠిరే తు
పాంచాలరాజస్య సమీపతోఽన్యః
తత్రాజగామాశు నరో ద్వితీయో
నివేదయిష్యన్నిహ సిద్ధమన్నం.

192 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది మూడవ అధ్యాయము

జన్యార్థమన్నం ద్రుపదేన రాజ్ఞా
వివాహహేతోరుపసంస్కృతం చ
తదాప్నువధ్వం కృతసర్వకార్యాః
కృష్ణాం చ తత్రైవ చిరం న కార్యం.
ఇమే రథాః కాంచనపద్మచిత్రాః
సదశ్వయుక్తా వసుధాధిపార్హాః
ఏతాన్ సమారుహ్య సమేత సర్వే
పాంచాలరాజస్య నివేశనం తత్.
తతః ప్రయాతాః కురుపుంగవాస్తే
పురోహితం తం పరియాప్య సర్వే
ఆస్థాయ యానాని మహాంతి తాని
కుంతీ చ కృష్ణా చ సహైకయానే.
శ్రుత్వా తు వాక్యాని పురోహితస్య
జిజ్ఞాసయైవాథ కురూత్తమానాం
ద్రవ్యాణ్యనేకాన్యుపసంజహార.
ఫలాని మాల్యాని చ సంస్కృతాని
వర్మాణి చర్మాణి తథాఽఽసనాని
గాశ్చైవ రాజన్నథ చైవ రజ్జూ
ర్బీజాని చాన్యాని కృషీనిమిత్తం.
అన్యేషు శిల్పేషు చ యాన్యపి స్యుః
సర్వాణి కృత్యాన్యఖిలేన తత్ర
క్రీడానిమిత్తాన్యపి యాని తత్ర
సర్వాణి తత్రోపజహార రాజా.
కర్మాణి చర్మాణి చ భానుమంతి
ఖడ్గా మహాంతోఽశ్వరథాశ్చ చిత్రాః

## నూట తొంబది రెండవ అధ్యాయం

ద్రుపదమహారాజు పలుకులు విని ధృష్టద్యుమ్న రాజకుమారుడు తండ్రివిచారాన్ని తొలగించే సమాచారం సత్వరం నివేదించసాగాడు — మహారాజా! విశాలనయనాలతో దేవసదృశకాంతితో మనోహర తారుణ్యంతో ప్రకాశించే ఆ యువవీరులు ఇక్కడ నుంచి అసహాయ శూరులుగానే వెళ్ళిపోయారు. వారిని పరివేష్టించి బ్రాహ్మణులు లిద్దరూ సాగారు. ఋషి దేవతాసేవితుడై వెలిగే దేవేంద్రుని వలె వారు బ్రాహ్మణ ప్రశంసలతో వెలుగుతున్నారు. దైత్యసేనామధ్యంలో దేవేంద్రునివలెనే శత్రురాజ మధ్యంలో వారువిహరించారు. ఆసమయంలో వారి వెనువెంట మనద్రౌపది పరమసంతోషంతో గజేంద్రుని అనుసరించే కరిణివలె నడిచింది. ఆ విధంగా వారు సాగిపోతూండగా రాజులందరి హృదయాలూ అసూయతో నిండిపోయాయి. వారందరూ రణభేరీమోగించి ముందుకు దూకేసరికి వారిలో రెండవవాడు క్రోధ సంభరితుడై ఒక మహా వృక్షాన్ని పీకి ఎదురుపోయాడు. ఆసమయంలో ఆ మహావీరుడు దండధారియైన యమునివలె ఉన్నాడు.

సూర్యచంద్రుల్లా ప్రకాశించే ఆ మహావీరులు నిర్భయంగా సాగిపోయి తాము ఉండే కుమ్మరివాని ఇంట్లో ప్రవేశించారు. ఆగృహంలో అగ్నిసమతేజస్వినియైన ఒక స్త్రీ ఉన్నది. ఆమె వారితల్లియని అనుకున్నాను. ఆమెప్రక్కగా వీరివంటివారే మరికొందరున్నారు. వీరు ఆమె చరణపద్మాలకు నమస్కరించి మన ద్రౌపదిచేత కూడా ప్రణామం చేయించారు.

తరువాయి భిక్షాటనం వెళ్ళి తిరిగి వచ్చారు. భిక్షాన్నం రాగానే ద్రౌపది దేవతాబలిసమర్పణం చేసి బ్రాహ్మణాతిథి సంతర్పణం పూర్తిచేసింది. అప్పుడు వారందరికీ పెట్టి తరువాయి తాను తిన్నది. భోజనానంతరం వారందరూ సుఖంగా నిద్రించారు. మన ద్రౌపది వారిపాదాలవద్ద నిద్రించింది. దర్భశయ్యలమీద మృగచర్మాలు పరుచుకు పడుకున్నారు. నిద్రకు ముందు వారు సాగించిన సంభాషణక్రమం చూస్తే వారు బ్రాహ్మణ వైశ్య శూద్రులవలె అనిపించటంలేదు. వారి ప్రసంగంలో సాగిన సంగ్రామవార్తలు వినగా వినగా వారు క్షత్రియశిరోమణులె అనిపిస్తున్నది.

కుంతీదేవి కుమారులు లాక్షాగృహంలోంచి తప్పించుకున్నారని మనం విన్నాం. ఇప్పుడు చూస్తే మీరు కోరినట్లు పాండవులతో సంబంధం సాగేటట్లున్నది. అతడు ధనుస్సును సంధించిన సంవిధానం దుర్భేద్యమైన లక్ష్యం ఛేదించిన వైఖరీ వారి ప్రసంగాలూ వింటే నిశ్శంకగా వారు బ్రాహ్మణ వేషంలో ఉన్న పాండవులే అనిపిస్తున్నది — అనగా విన్న ద్రుపదుని హృదయం సంతోషతరంగాలలో తేలసాగింది. అప్పుడు పురోహితుని పిలిచి — ఆర్యా! మీరు వారివద్దకు వెళ్ళి వారు పాండురాజపుత్రులో కాదో విచారించి మిగిలిన కార్యక్రమం నిర్వర్తించిరండి — అన్నాడు.

రాజాజ్ఞానుసారం ఆ బ్రాహ్మణుడు వెళ్ళి పాండవులను అభినందించి ద్రుపదుని మాటలన్నీ చెప్పి — కన్యాదానం చేయటానికి అర్హతతోపాటు సంసిద్ధత కూడా ఉన్న మా పాంచాలాధీశుడు తమ గోత్రనామాలు కోరుతున్నాడు. మీ వీరశౌర్యాలూ మీరు లక్ష్యాన్ని ఛేదించటంలో ప్రదర్శించిన నేర్పూ మా మహారాజుగారికి ఆనందం కలిగించాయి. ఇప్పుడు మీ కులగోత్రాలు తెలిపి మా మహారాజు సంతోషం పరివృద్ధం చేయండి.

పాండు నరపాలుడు ద్రుపదమహారాజులుం

ధనూంషి చాగ్ర్యాణి శరాశ్చ చిత్రాః
శక్త్యృష్టయః కాంచనభూషణాశ్చ.
ప్రాసా భుశుండ్యశ్చ పరశ్వధాశ్చ
సాంగ్రామికం చైవ తథైవ సర్వం
శయ్యాసనాన్యుత్తమవస్తువంతి
తథైవ వాసో వివిధం చ తత్ర.
కుంతీ తు కృష్ణాం పరిగృహ్య సాధ్వీ
మంతఃపురం ద్రుపదస్యావివేశ
స్త్రియశ్చ తాం కౌరవరాజపత్నీం
ప్రత్యర్చయామాసురదీనసత్త్వాః.
తాన్ సింహవిక్రాంతగతీన్ నిరీక్ష్య
మహర్షభాక్షానజినోత్తరీయాన్
గూఢోత్తరాంసాన్ భుజగేంద్రభోగ
ప్రలంబబాహూన్ పురుషప్రవీరాన్.
రాజా చ రాజ్ఞః సచివాశ్చ సర్వే
పుత్రాశ్చ రాజ్ఞః సుహృదస్తథైవ
ప్రేష్యాశ్చ సర్వే నిఖిలేన రాజన్
హర్షం సమాపేతురతీవ తత్ర.
తే తత్ర వీరాః పరమాసనేషు
సపాదపీఠేష్వవిశంకమానాః
యథానుపూర్వ్యం వివిశుర్నరాగ్ర్యాః
తథా మహార్హేషు న విస్మయంతః.
ఉచ్చావచం పార్థివభోజనీయం
పాత్రీషు జాంబూనదరాజతీషు
దాసాశ్చ దాస్యశ్చ సుమృష్టవేషాః
సంభోజకాశ్చాప్యుపజహ్రురన్నం.
తే తత్ర భుక్త్వా పురుషప్రవీరా
యథాత్మకామం సుభృశం ప్రతీతాః
ఉత్క్రమ్య సర్వాణి వసూని రాజన్
సాంగ్రామికం తే వివిశుర్నృవీరాః.
తల్లక్షయిత్వా ద్రుపదస్య పుత్రో
రాజా చ సర్వైః సహ మంత్రిముఖ్యైః
సమర్థయామాసురుపేత్య హృష్టాః
కుంతీసుతాన్ పార్థివరాజపుత్రాన్.

193వ అధ్యాయం సమాప్తం

## నూట తొంబది నాల్గవ అధ్యాయము

తత ఆహూయ పాంచాల్యో రాజపుత్రం యుధిష్ఠిరం
పరిగ్రహేణ బ్రాహ్మేణ పరిగృహ్య మహాద్యుతిః.
పర్యపృచ్ఛదదీనాత్మా కుంతీపుత్రం సువర్చసం
కథం జానీమ భవతః క్షత్రియాన్ బ్రాహ్మణానుత
వైశ్యాన్ వా గుణసంపన్నానథవా
శూద్రయోనిజాన్
మాయామాస్థాయ వా విప్రాంశ్చరతః సర్వతోదిశం.
కృష్ణాహేతోరనుప్రాప్తా దేవాః సందర్శనార్థినః
బ్రవీతు నో భవాన్ సత్యం సందేహో హ్యత్ర నో మహాన్.
అపి నః సంశయస్యాంతే మనః సంతుష్టిమావహేత్
అపి నో భాగధేయాని శుభాని స్యుః పరంతప.
ఇచ్ఛయా బ్రూహి తత్ సత్యం సత్యం రాజసు శోభతే
ఇష్టాపూర్తేన చ తథా వక్తవ్యమనృతం న తు.
శ్రుత్వా హ్యమరసంకాశ తవ వాక్యమరిందమ
ధ్రువం వివాహకరణమాస్థాస్యామి విధానతః.
మా రాజన్ విమనా భూస్త్వం పాంచాల్య
ప్రీతిరస్తు తే
ఈప్సితస్తే ధ్రువః కామః సంవృత్తోఽయమసంశయం.

గారి ప్రాణమిత్రులు. ఆయనతో వియ్యమందా లని మా మహారాజు కోరిక. తమ ప్రియపుత్రిని పాండురాజు కోడలుగా చెయ్యాలని ఆయన అభి లాషపడుతున్నాడు. విశాలభుజుడైన అర్జునునికే ద్రౌపది నివ్వాలని ఆయన హృదయం ఉవ్విళ్లూరు తున్నది. ఆ మహారాజు పుణ్యాన ఈ సంబంధం నాగ చేసే ఫలవంతమైనదిగా భావిస్తా నన్నారు. ఇం దు వల్ల తన పుణ్యమూ యశస్సూ పెరుగుతా యన్నారు—అని వినయంగా పురోహితుడు చెప్పగా ధర్మరాజు భీమునివైపు తిరిగి తమ్ముడూ! ముందుగా వీరికి అర్ఘ్యపాద్యా లర్పించు. ద్రుపదమహారాజుకే గౌరవస్థానీయులైన వీరిని మనం అభ్యర్చించాలి—అనగా భీముడు విధివిధానంగా పూజించాడు. వచ్చిన బ్రాహ్మణదేవత సంతృప్తుడై కూర్చున్నాక ధర్మ రాజు—బ్రహ్మవేత్తా! పాంచాలచక్రవర్తి మీ మహా రాజు తన కుమార్తెను ఆయన చిత్తానుసారం ఎవ రికీ అర్పించలేదు. రాజమర్యాదానుసారం స్వయం వరం ప్రకటించి లక్ష్యభేదనం పణంగా ఉంచాడు. ఆ లక్ష్యం ఛేదించి మావాడు ఈ కన్యను గ్రహిం చాడు. స్వయంవర ప్రకటనలో మీ మహారాజు కులగోత్రాలప్రస్తావన పెట్టలేదు. నారి సారించి యంత్రరంధ్రంలోంచి లక్ష్యం ఎవడు పడగొడితే వాడికిస్తాననేది మీ ప్రకటన సారాంశం. ఈ వీరుడు ఆప్రకారమే లక్ష్యం ఛేదించి ఆమెను గ్రహిం చాడు. ఇప్పుడింక ద్రుపదుడు విచారించటం అన వసరం. ఇందువల్ల ఆయన సంకల్పమూ సిద్ధిం చింది. మాకుకూడా ఈ బాలిక యోగ్యురాలుగా ఉత్తమురాలుగా గోచరిస్తోంది. సామాన్యబలహీను లెవరూ ఆ నారి సారించనేరేరు. అస్త్రవిద్యా నైపుణ్యం లేనివాడూ నీచుడూ ఆ లక్ష్యాన్ని ఛేదించలేరు గదా. అందుచేత ఇంక పాంచాలుడు నిశ్చింతగా ఉండడమే మంచిది. ఈ భూమిమీద వీడు వినా ఆ యంత్రరంధ్రంలోంచి లక్ష్యభేదనం చేసే సమర్థుడు లేడు — అని చెపుతూండగా ద్రుప దుని సేవకుడొకడు వచ్చి — రాజసౌధంలో భోజ నాలు సిద్ధమైనాయి గనక రావలసిందని మా మహా రాజు కోరిక—అన్నాడు వినయంగా.

192 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది మూడవ అధ్యాయము

ద్రుపదమహారాజు పెండ్లివారికోసం వి ం దు భోజనాలు సిద్ధంచేయించాడనీ సత్వరం సాంధ్య కృత్యాలు నిర్వర్తించుకుని రావలసిందనీ మహా రాజు లధిరోహించే బంగారు కమలాలవంటి రథాలు సిద్ధంగా ఉన్నాయనీ అక్కడే వివాహకార్యక్రమం జరిపించుకోవచ్చునని దూత పలకగా విని పాండ వులు పురోహితప్రవరునికి సెలవిచ్చి రథాలమీద బయలుదేరారు. కుంతీ ద్రౌపదీ ఒకే రథంమీద ఎక్కారు. ఈలోగానే పురోహితముఖాన ద్రుప దుడు సమాచారం గ్రహించాడు. వారి శీల స్వభావాలను గ్రహించే సంకల్పంతో రకరకాల వస్తువులను సమకూర్చి ఉంచాడు. అన్ని ఫలాలూ అలంకారాలూ చిత్రవిహారాలూ ఆసనాలూ ఖడ్గాలూ కవచాలూ బాణాలూ ఆవులూ బీజాలూ

వయం హి క్షత్రియా రాజన్ పాండోః పుత్రా మహాత్మనః
జ్యేష్ఠం మాం విద్ధి కౌంతేయం భీమసేనార్జునావిమౌ.
ఆభ్యాం తవ సుతా రాజన్ నిర్జితా రాజసంసది
యమౌ చ తత్ర కుంతీ చ యత్ర కృష్ణా వ్యవస్థితా.
వ్యేతు తే మానసం దుఃఖం క్షత్రియాః స్మో నరర్షభ
పద్మినీవ సుతేయం తే హ్రదాదన్యహ్రదం గతా.
ఇతి తథ్యం మహారాజ సర్వమేతద్ బ్రవీమి తే
భవాన్ హి గురురస్మాకం పరమం చ పరాయణం.
తతః స ద్రుపదో రాజా హర్షవ్యాకులలోచనః
ప్రతివక్తుం ముదా యుక్తో నాశకత్ తం యుధిష్ఠిరం.
యత్నేన తు స తం హర్షం సంనిగృహ్య పరంతపః
అనురూపం తదా వాచా ప్రత్యువాచ యుధిష్ఠిరం.
పప్రచ్ఛ చైనం ధర్మాత్మా యథా తే ప్రద్రుతాః పురాత్
స తస్మై సర్వమాచఖ్యావానుపూర్వ్యేణ పాండవః.
తచ్ఛ్రుత్వా ద్రుపదో రాజా కుంతీపుత్రస్య భాషితం
విగర్హయామాస తదా ధృతరాష్ట్రం నరేశ్వరం.
ఆశ్వాసయామాస చ తం కుంతీపుత్రం యుధిష్ఠిరం
ప్రతిజజ్ఞే చ రాజ్యాయ ద్రుపదో వదతాం వరః.
తతః కుంతీ చ కృష్ణా చ భీమసేనార్జునావపి
యమౌ చ రాజ్ఞా సందిష్టం వివిశుర్భవనం మహత్.
తత్ర తే న్యవసన్ రాజన్ యజ్ఞసేనేన పూజితాః
ప్రత్యాశ్వస్తస్తతో రాజా సహ పుత్రైరువాచ తం.
గృహ్ణాతు విధివత్ పాణిమద్యాయం కురునందనః
పుణ్యేఽహని మహాబాహురర్జునః కురుతాం క్షణం.
తమబ్రవీత్ తతో రాజా ధర్మాత్మా చ యుధిష్ఠిరః
మమాపి దారసంబంధః కార్యస్తావద్ విశాంపతే.
భవాన్ వా విధివత్ పాణిం గృహ్ణాతు దుహితుర్మమ
యస్య వా మన్యసే వీర తస్య కృష్ణాముపాదిశ.
సర్వేషాం మహిషీ రాజన్ ద్రౌపదీ నో భవిష్యతి
ఏవం ప్రవ్యాహృతం పూర్వం మమ మాత్రా విశాంపతే.
అహం చాప్యనివిష్టో వై భీమసేనశ్చ పాండవః
పార్థేన విజితా చైషా రత్నభూతా సుతా తవ.
ఏష నః సమయో రాజన్ రత్నస్య సహభోజనం
న చ తం హాతుమిచ్ఛామః సమయం రాజసత్తమ.
సర్వేషాం ధర్మతః కృష్ణా మహిషీ నో భవిష్యతి
ఆనుపూర్వ్యేణ సర్వేషాం గృహ్ణాతు జ్వలనే కరాన్.
ఏకస్య బహ్వ్యో విహితా మహిష్యః కురునందన
నైకస్యా బహవః పుంసః శ్రూయంతే పతయః క్వచిత్
లోకవేదవిరుద్ధం త్వం నాధర్మం ధర్మవిచ్ఛుచిః
కర్తుమర్హసి కౌంతేయ కస్మాత్ తే బుద్ధిరీదృశీ.
సూక్ష్మో ధర్మో మహారాజ నాస్య విద్మో వయం గతిం
పూర్వేషామానుపూర్వ్యేణ యాతం

వర్త్మానుయామహే.
న మే వాగనృతం ప్రాహ నాధర్మే ధీయతే మతిః
ఏవం చైవ వదత్యంబా మమ చైతన్మనోగతం.
ఏష ధర్మో ధ్రువో రాజంశ్చరైనమవిచారయన్
మా చ శంకా తత్ర తే స్యాత్ కథంచిదపి పార్థివ.
త్వం చ కుంతీ చ కౌంతేయ ధృష్టద్యుమ్నశ్చ మే సుతః
కథయంత్వితి కర్తవ్యం శ్వః కాలే కరవామహే.
తే సమేత్య తతః సర్వే కథయంతి స్మ భారత
అథ ద్వైపాయనో రాజన్నభ్యాగచ్ఛద్ యదృ

చ్ఛయా.

194 వ అధ్యాయము సమాప్తం



వ్యవసాయ పరికరాలూ ఇతర శస్త్రాగార వస్తువులూ అక్కడే ఉంచాడు. అశ్వాలూ రథాలూ ఎదురుగా ఉంచాడు.

కుంతీదేవి ద్రౌపదీసమేతంగా అంతఃపురంలోనికి వెళ్ళింది. అక్కడ ఆ మహారాజ్ఞికి అత్యధికంగా ఆదరాభిమానాలు జరిపారు.

వృషభసదృశనేత్రాలు కల పాండవులు వ్యాఘ్రచర్మాలే శాలువలుగా ధరించారు. భుజములు బలిసి ఉన్నాయి. వారినిచూచిన ద్రుపదునకూ ఆయన పుత్రులకూ మంత్రిసామంతులకూ ఆనందం కలిగింది. అక్కడ ఉన్న సువర్ణపీఠాలమీద పాండవులు సుఖాసీనులయ్యారు. వారందరూ అగ్రజ క్రమంలోనే కూర్చున్నారు. స్వచ్ఛసుందర వస్త్రాలు ధరించిన రాజదాసీజనం వెండి బంగారు పళ్ళెరాలలో వివిధభక్ష్యభోజ్యాలూ తెచ్చి వడ్డించారు. పాండవులు అభీష్టానుసారం భుజించారు. అనంతరం వారు సరాసరి యుద్ధావసరమైన ఆయుధాలున్న ప్రదేశం చేరారు. అంతతో ద్రుపదుని ఆనందం అవధులు దాటింది. రాజపుత్రులందరూ ప్రసన్నవదనులయ్యారు. అప్పటికి వీరు పాండవేయులే నన్న నిశ్చయం వారికి కలిగింది.

193 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది నాలుగవ అధ్యాయము

ఉదారహృదయుడైన ద్రుపదుడు స్వచ్ఛకాంతియుతుడైన ధర్మరాజుకు బ్రాహ్మణోచితమైన ఆతిథ్యమర్యాదలు నిర్వర్తించి ఆప్తుడుగా స్వీకరించి ఇలా అన్నాడు.

మీ కులగోత్రాలేమిటో మాకు బోధపడడం లేదు. మిమ్మల్ని క్షత్రియులనుకోమా; బ్రాహ్మణులుగా భావించమా, గుణసంపన్నులైన వైశ్యులుకానీ శూద్రులుకానీ అయి ఉంటారనుకోమా. రహస్యంగా బ్రాహ్మణవేషాలతో చరించే దేవతలే అనుకోవచ్చునా. ఈ కృష్ణను పరిగ్రహించటానికి దేవతలే ఈ రూపంలో వచ్చారనిపిస్తోంది. మీరు మా సంశయం నివారించి మా హృదయానికి శాంతి కలిగించండి. ఇష్టపూర్తులకంటే రాజులు సత్యభాషణానికే ప్రాధాన్యం యిస్తారు. కనక మీరు నిశ్చింతగా నిజం చెప్పండి.

(అగ్నిహోత్రమూ తపస్సూ సత్యపాలనా అతిథిసత్కారమూ బలీ వైశ్వదేవమూ విధి నిర్వహణా వీనిని ఇష్ట అంటారు. దేవాలయ ఆరామ వాపీ నిర్మాణం అన్నదానం పూర్తము లని వ్యవహరింపబడతాయి.)

మీ రీవిషయం తేల్చగానే నేను విధ్యుక్తంగా వివాహపు ఏర్పాట్లు సాగిస్తాను - అనగా ధర్మరాజు విని-మహారాజా! మీ మనోఽభీష్టం నెరవేరిందని విశ్వసించండి. మీరు మనస్సు పాడుచేసుకో నవసరం లేదు. మీరు సంతోషంగా ఉండండి. మేము క్షత్రియులమే. పాండురాజ నందనులము. నేను కుంతీదేవి పెద్దబిడ్డను. వీరిద్దరూ భీమార్జునులు. వీరే రాజవాహిని జయించిన వీరులు. వారిరువురూ నకులసహదేవులు. మా మాతృదేవి కుంతి భోజపుత్రి మీ రాకుమారితో అంతఃపురంలోకి

## నూట తొంబది ఐదవ అధ్యాయము

తత స్తే పాండవాః సర్వే పాంచాల్యశ్చమహాయశాః
ప్రొత్యుత్థాయ మహాత్మానం కృష్ణం
సర్వేఽభ్యవాదయన్.
ప్రతినంద్య స తాం పూజాం పృష్ట్వా కుశలమంతతః
ఆశనే కాంచనే శుద్ధే నిషసాద మహామనాః.
అనుజ్ఞాతాస్తు తే సర్వే కృష్ణేనామితతేజసా
ఆసనేషు మహార్హేషు నిషేదుర్ద్విపదాం వరాః.
తతోముహూర్తాన్మధురాంవాణీముచ్చార్యపార్షతః
పప్రచ్ఛ తం మహాత్మానం ద్రౌపద్యర్థం విశాంపతే.
కథమేకా బహూనాం స్యాద్ ధర్మపత్నీ న సంకరః
ఏతన్మే భగవాన్ సర్వం ప్రబ్రవీతు యథాతథం.
అస్మిన్ ధర్మే విప్రలబ్ధే లోకవేదవిరోధకే
యస్య యస్య మతం యద్ యచ్ఛ్రోతుమిచ్ఛామి
తస్య తత్.
అధర్మోఽయం మమ మతో విరుద్ధో లోకవేదయోః
న హ్యేకా విద్యతే పత్నీ బహూనాం ద్విజసత్తమ.
న చాప్యాచరితః పూర్వైరయం ధర్మోమహాత్మభిః
న చాప్యధర్మో విద్వద్భిశ్చరితవ్యః కథంచన.
తతోఽహంనకరోమ్యేనం వ్యవసాయం క్రియాంప్రతి
ధర్మః సదైవ సందిగ్ధః ప్రతిభాతి హి మే త్వయం
యవీయసః కథం భార్యాం జ్యేష్ఠో భ్రాతా ద్విజర్షభ
బ్రహ్మన్ సమభివర్తేత సంవృత్తః సంస్తపోధన.
న తు ధర్మస్య సూక్ష్మత్వాద్ గతిం విద్మ కథంచన
అధర్మో ధర్మ ఇతి వా వ్యవసాయో న శక్యతే.
కర్తుమస్మద్విధైర్బ్రహ్మం స్తతోఽయం న వ్యవస్యతే
పంచానాం మహిషీ కృష్ణా భవిష్యతి కథంచన.
న మే వాగనృతం ప్రాహ నాధర్మే ధీయతే మతిః
వర్తతే హి మనో మేఽత్ర నైషోఽధర్మః కథంచన.
శ్రూయతే హి పురాణేఽపి జటిలా నామ గౌతమీ
ఋషీనధ్యాసితవతీ సప్త ధర్మభృతాం వరా.
తథైవ మునిజా వార్క్షీం తపోభిర్భావితాత్మనః
సంగతాభూద్ దశ భ్రాతౄనేకనామ్నః ప్రచేతసః
గురోర్హి వచనం ప్రాహుర్ధర్మ్యం ధర్మజ్ఞసత్తమ
గురూణాం చైవ సర్వేషాం మాతాపరమకో గురుః.
సా చాప్యుక్తవతీ వాచం భైక్షవద్ భుజ్యతామితి
తస్మాదేతదహం మన్యే పరం ధర్మం ద్విజోత్తమ.
ఏవమేతద్యథా ప్రాహ ధర్మచారీ యుధిష్ఠిరః
అనృతాన్మే భయం తీవ్రం
ముచ్యేఽహమనృతాత్ కథం.
అనృతాన్మోక్ష్యసే భద్రే ధర్మశ్చైష సనాతనః
నతువక్ష్యామిసర్వేషాంపాంచాలశృణుమేస్వయం.
యథాయంవిహితోధర్మో యతశ్చాయంసనాతనః
యథా చ ప్రాహకౌంతేయ స్తథా ధర్మోనసంశయః.
తత ఉత్థాయ భగవాన్వ్యాసోద్వైపాయనః ప్రభుః
కరే గృహీత్వా రాజానం రాజవేశ్మ సమావిశత్.
పాండవాశ్చాపి కుంతీ చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః
వివిశుర్యత్ర తత్రైవ ప్రతీక్షంతే స్మ తావుభౌ.
తతో ద్వైపాయనస్తస్మై నరేంద్రాయ మహాత్మనే
ఆచఖ్యౌ తద్యథా ధర్మో బహూనామేకపత్నితా.

195 వ అధ్యాయము సమాప్తం

వెళ్ళింది. ఇప్పటికైనా మీ ఆందోళన తగ్గి మనస్సు ప్రశాంతంగా ఉన్నదా. మీ కుమారి కృష్ణ ఒక సరోవరంలోంచి మరొక సరోవరంలో ప్రవేశించే కమలంవలె ఉన్నది. మీరు మాకు పెద్దలయి ఆశ్రయభూతులయారు—అన్నాను.

ద్రుపదుని కన్నులలో ఆనందబాష్పాలు ఉదయించాయి. కొద్దిక్షణాల వరకూ ద్రుపదుడు ఏమీ మాట్లాడలేకపోయాడు. కొంతసేపటికి ఆ ఆనందప్రవాహానికి తట్టుకుని పాండవులు వారణావతంలో లాక్షాగృహంనుండి ఏ ప్రకారంగా తప్పించుకున్నదీ చెప్పమనగా ధర్మరాజు ఆ విషయాలన్నీ విస్తరించాడు. ఆ సమాచారం అంతా విని ద్రుపదుడు ధృతరాష్ట్రుని నిందించి ధర్మరాజును ఓదార్చి తానుతనశక్తితో వారిరాజ్యం వారికిఇప్పిస్తానన్నాడు.

అనంతరం ద్రుపదుడువీరికి ప్రత్యేకం ఒకభవనం ఇచ్చాడు. ధర్మరాజాదులు అయిదుగురూ కుంతీద్రౌపదీసమేతం అక్కడే నివసించసాగారు. ద్రుపదుడు వారికి యథోచితమర్యాదలు జరిపిస్తున్నాడు. వారిమీద ద్రుపదునికి సంపూర్ణమైన విశ్వాసంకలిగింది.

అలావుండగా ఒకనాడు ద్రుపదుడు ధర్మరాజును చేరి—కురుకులానందవర్ధకుడైన మీ అర్జునుడు ఈ పుణ్యదినాన ద్రౌపదీ పాణిగ్రహణం చెయ్యాలి. ఆమెను పత్నిగా గ్రహించిసమస్తశోభనాలూపొందడానికి ఉద్యుక్తుడుకావాలి—అనగా వివాహం నేను కూడా చేసుకోవాలి—అన్నాడు ధర్మరాజు.

మహాపురుషా! మీరే ఆమెను పెండ్లాడండి. లేదా మీసోదరులలో ఎవరిని ఆమె భర్తగా చేస్తారో చేయండి—అన్నాడు ద్రుపదుడు.

పూజ్యురాలయిన మా తల్లి ఈమెను మా అయిదుగురికీ భార్యగా ఆజ్ఞాపించింది. నేను మా భీముడునూ అవివాహితులము. అందుచేత ఈమె మాకుపట్టమహిషిఅవుతుంది. రత్నస్వరూపిణిఅయిన ఈమెను మా అర్జునుడు జయించి తెచ్చాడు. ఆ రత్నాన్ని మేమయిదుగురమూ సమంగాపొందాలి. ఇది జరిగిన నిశ్చయం. ఈ నిర్ణయానికిప్పుడు తిరుగులేదు. అందుచేతధర్మశాస్త్రరీత్యా ఈమెఅగ్నిసమక్షంగామాఅయిదుగురినీవరించాలి—అన్నాడుధర్మరాజు.

కురునందనా! చక్రవర్తికి ఎందరో భార్యలుండటం విన్నానుకానీ ఒకే స్త్రీకి ఇందరు భర్తలున్నారని వినలేదు—అని ధర్మసందేహం వెలిబుచ్చాడు ద్రుపదుడు. (ఏకస్య బహ్వో జాయా భవంతి నైకస్యై బహవస్సంతి పతయః.)

ధర్మజ్ఞులు పవిత్రాత్ములూ అయిన మీరు లోకవిరుద్ధంగా వేదవ్యతిరిక్తంగా చరించరాదు. అసలీ ఊహ మీకు కలగటమే సమంజసంకాదు—అని రాజనగా ధర్మరాజు ఆర్యా! ధర్మస్వరూపం పరమసూక్ష్మమైనది. మనం దానిరీతి గ్రహించలేము. ప్రచేతసాదులు నడిచిన మార్గాన్నే మేమూ నడుస్తున్నాము. నాబుద్ధి అధర్మపథాన చరించదు. నా వాక్కు అసత్యం కారాదు. పైగా మాతల్లి ఆజ్ఞ మాకు శిరోధార్యం. నా మనసు చేసిన నిర్ణయం అచంచలమైనది. మీరు ఎంత మాత్రం శంకించకుండా ఈ ప్రకారం నడవండి—అనగా కుంతీ ధృష్టద్యుమ్నుడూ ధర్మరాజూ కలిసి చర్చించి నిర్ణయించినట్టయితే ఆ ప్రకారం రేపు జరుపుతానన్నాడు ద్రుపదుడు.

వారందరూ విషయచర్చ సాగిస్తూండగా వేదవ్యాసభగవానులవారు అక్కడికి విజయంచేశారు.

194 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది ఆరవ అధ్యాయము

పురా వై నైమిశారణ్యే దేవాః సత్రముపాసతే
తత్ర వై వస్వతో రాజన్ శామిత్రమకరోత్తథా.
తతో యమో దీక్షిత స్తత్ర రాజన్
నామారయత్ కంచిదపి ప్రజానాం
తతః ప్రజాస్తా బహులా బభూవుః
కాలాతిపాతాన్మరణప్రహీణాః.
సోమశ్చ శక్రో వరుణః కుబేరః
సాధ్యా రుద్రా వసవోఽథాశ్వినౌ చ
ప్రజాపతిర్భువనస్య ప్రణేతా
సమాజగ్ము స్తత్ర దేవా స్తథాన్యే.
తతోఽబ్రువన్ లోకగురుం సమేతా
భయాత్ తీవ్రాన్మానుషాణాం చ వృద్ధ్యా
తస్మాద్ భయాదుద్విజంతః సుఖేప్సవః
ప్రయామ సర్వే శరణం భవంతం.
కిం వో భయం మానుషేభ్యో యూయం సర్వే యదామరా
మావో మర్త్యసకాశాద్ వై భయం భవితుమర్హతి
మర్త్యా అమర్త్యాః సంవృత్తా న విశేషోఽస్తి కశ్చన
అవిశేషాదుద్విజంతో విశేషార్థమిహాగతాః.
వైవస్వతో వ్యాపృతః సత్రహేతో
స్తేన త్విమే న మ్రియంతే మనుష్యాః
తస్మిన్నేకాగ్రే కృతసర్వకార్యే
తత ఏషాం భవితైవాంతకాలః.
వైవస్వతస్యైవ తనుర్విభక్తా
వీర్యేణ యుష్మాకముత ప్రయుక్తా
సైషామంతో భవితా హ్యంతకాలే
న తత్ర వీర్యం భవితా నరేషు.
తతస్తు తే పూర్వజదేవవాక్యం
శ్రుత్వా జగ్ముర్యత్ర దేవా యజంతే
సమాసీనాస్తే సమేతా మహాబలా
భాగీరథ్యాం దదృశుః పుండరీకం.
దృష్ట్వా చ తద్ విస్మితాస్తే బభూవు
స్తేషామింద్ర స్తత్ర శూరో జగామ
సోఽపశ్యద్ యోషామథ పావకప్రభాం
యత్ర దేవీ గంగా సతతం ప్రసూతా.
సా తత్ర యోషా రుదతీ జలార్థినీ
గంగాం దేవీం వ్యవగాహ్య వ్యతిష్ఠత్
తస్యాశ్రుబిందుః పతితో జలే య
స్తత్ పద్మమాసీదథ తత్ర కాంచనం.
తదద్భుతం ప్రేక్ష్య వజ్రీ తదాసీ
మపృచ్ఛత్ తాం యోషితమంతికాద్ వై
కా త్వం భద్రే రోదిషి కస్య హేతో
ర్వాక్యం తథ్యం కామయేఽహం బ్రవీహి.
త్వం వేత్స్యసే మామిహ యాస్మి శక్ర
యదర్థం చాహం రోదిమి మందభాగ్యా
ఆగచ్ఛ రాజన్ పురతో గమిష్యే
ద్రష్టాసి తద్ రోదిమి యత్కృతేఽహం.
తాం గచ్ఛంతీమన్వగచ్ఛత్ తదానీం
సోఽపశ్యదారాత్ తరుణం దర్శనీయం
సిద్ధాసనస్థం యువతీసహాయం
క్రీడంతమక్షైర్గిరిరాజమూర్ధ్ని.
తమబ్రవీద్ దేవరాజో మమేదం
త్వం విద్ధి విద్వన్ భువనం వశే స్థితం
ఈశోఽహమస్మీతి సమన్యురబ్రవీద్
దృష్ట్వా తమక్షైః సుభృశం ప్రమత్తం.
క్రుద్ధం చ శక్రం ప్రసమీక్ష్య దేవో
జహాస శక్రం చ శనైరుదైక్షత
సంస్తంభితోఽభూదథ దేవరాజ

## నూట తొంబది ఐదవ అధ్యాయము

వ్యాసమహర్షికి స్వాగతం పలుకుతూ అందరూ లేచి నిలిచారు. వారందరి ప్రణామాలూ ద్రుపదుని ఆతిథ్యమూ గ్రహించి వ్యాసుడు సువర్ణపీఠం అధిష్ఠించాడు. ఆయన ఆజ్ఞానుసారం వారందరూ తిరిగి తమ ఆసనాలపై కూర్చున్నారు. వ్యాసుడు కుశలప్రశ్నలు సాగించాడు.

అప్పుడు ద్రుపదుడు విషయమంతా చెప్పి ఒక స్త్రీ పలువురు పురుషులకు భార్య కావటం ఎలాగ? సంభవమా? న్యాయమా? అని ప్రశ్నిస్తూ ధర్మ సాంకర్యం జరగని రీతి చెప్పమన్నాడు.

ధర్మద్వారం పరమగహనమైనది. ముందుగా మీమీ అభిప్రాయాలు నాకు వివరించండి — అని ముని ఆజ్ఞాపించగా ద్రుపదుడు- మహర్షీ! నాదృష్టిలో ఇది అధర్మమే అనిపిస్తోంది. ఇది లోకాచార విరుద్ధమే కాక వేదధర్మానికికూడా వ్యతిరిక్తమైంది. ఒకస్త్రీని అనేకులు భార్యగా పొందడం నేనెరుగను. సనాతనులలో ఎవరూ దీనిని ఆచరించినట్లు వినలేదు. విద్వాంసులు ఎటువంటి క్లిష్టపరిస్థితులలోనూ అధర్మానికి అంజలి పట్టరు. అందుచేతనే నేను ధర్మవిరుద్ధమైన మార్గంలో అడుగుపెట్టడానికి అంగీకరించలేక పోతున్నాను. ధర్మసాంకర్యభీతి నన్ను వేధిస్తోంది— అన్నాడు.

మహర్షీ! మీరూ తపోధనులైన బ్రాహ్మణులు సదాచారపరాయణులైన వంశజ్యేష్ఠుడు అనుజుని భార్యతో ఏవిధంగా సంగమించవచ్చునో మాకు బోధపడడం లేదు. ఈ ధర్మాధర్మవిచారణ మాకు లొంగేది కాదు. అందుచేత మేము ద్రౌపదిని వీరైదుగురికీ భార్యగా అర్పించటానికి సందేహిస్తున్నాము. ఈ ధర్మసూక్ష్మాన్ని మీరు నిర్ణయించాలి- అన్నాడు ధృష్టద్యుమ్నుడు.

మహాత్మా! నా బుద్ధి అధర్మంపై ఎన్నడూ పోదు. నావాక్కు అసత్యం పలుకదు. ఈవిషయమై నా మనస్సు ఔచిత్యాన్ని శంకించడం లేదు. అధర్మమనే ఊహే నాకు కలగడం లేదు. గౌతమగోత్రీకురాలు ధర్మపరురాలు అయిన జటిల అనే కన్య సప్తమహర్షులను పెండ్లాడిందని పురాణాలు చెబుతున్నాయి. కండుమహర్షి కుమార్తె అయిన వార్క్షి తపోధనులైన పదునొకండుగురు ప్రచేతస సోదరులను వివాహమాడింది. ఇప్పుడు మీరు మరొక విషయంకూడా ఆలకించాలి. గురుస్థానీయురాలైన మాతల్లి ఆజ్ఞప్రకారం మేమైదుగురమూ ఈమెను అనుభవించాలి. గురువులలో తల్లిది గురుస్థానం కదా. గురువుల ఆజ్ఞపాలనం కంటె అతీతమైన ధర్మం లేదే.

ఈవిషయాలన్నీ పర్యాలోచించి నా మాటను ధర్మంగా అంగీకరించండి—అన్నాడు ధర్మరాజు.

ధర్మాచరణపరుడైన నాధర్మజుడు సత్యమే చెప్పాడు. నేను అసత్యానికి భయపడినంతగా దేనికీ భయపడను. ఆభీతినుండి నన్ను రక్షించండి— అన్నది కుంతి.

అసత్యభయం లేదు పోను కుంతీ మీరు చెప్పింది సనాతనధర్మమే. ద్రుపదమహారాజా! ఈ సందర్భంలో నీకు రహస్యంగా ఒక రహస్యవిషయం చెప్పాలి. ఇది ఎందుచేత సనాతనమైన ధర్మమో కౌంతేయుడు దీన్ని ఎందుచేత ధర్మమని చెప్పాడో మనంజాగ్రత్తగా ఆలోచించినట్లయితే నిస్సందేహంగా

స్తేనేక్షితః స్థాణురివావతస్థే.
యదా తు పర్యాప్తమిహాస్య క్రీడయా
తదా దేవీం రుదతీం తామువాచ
ఆనీయతామేష యతోఽహమారా
న్నైనం దర్పః పునరప్యావిశేషతః.
తతః శక్రః స్పృష్టమాత్రస్తయా తు
స్రస్తైరంగైః పతితోఽభూద్ ధరణ్యాం
తమబ్రవీద్ భగవానుగ్రతేజా
మైవం పునః శక్ర కృథాః కథంచిత్.
వివర్తయైనం చ మహాద్రిరాజం
బలం చ వీర్యం చ తవాప్రమేయం
ఛిద్రస్య చైవావిశ మధ్యమస్య
యత్రాసతే త్వద్విధాః సూర్యభాసః
స తద్ వివృత్య వివరం మహాగిరే
స్తుల్యద్యుతీం శ్చతురోఽన్యాన్ దదర్శ
స తానభిప్రేక్ష్య బభూవ దుఃఖితః
కచ్చిన్నాహం భవితా వై యథేమే.
తతో దేవో గిరిశో వజ్రపాణిం
వివృత్య నేత్రే కుపితోఽభ్యువాచ
దరీమేతాం ప్రవిశ త్వం శతక్రతో
యన్మాం బాల్యాదవమంస్థాః పురస్తాత్.
ఉక్తస్త్వేవం విభునా దేవరాజః
ప్రావేపతార్తో భృశమేవాభిషంగాత్
స్రస్తైరంగైరనిలేనేవ నున్న
మశ్వత్థపత్రం గిరిరాజమూర్ధ్ని.
స ప్రాంజలిర్వై వృషవాహనేన
ప్రవేపమానః సహసైవముక్తః
ఉవాచ దేవం బహురూపముగ్ర
స్రష్టాశేషస్య భువనస్య త్వం భవాద్య.
తమబ్రవీదుగ్రవర్చాః ప్రహస్య
నైవంశీలాః శేషమిహాప్నువంతి
ఏతేఽప్యేవం భవితారః పురస్తాత్
తస్మాదేతాం దరీమావిశ్య శేధ్వం.
తత్ర హ్యేవం భవితారో న సంశయో
యోనిం సర్వే మానుషీమావిశధ్వం
తత్ర యూయం కర్మ కృత్వావిషహ్యం
బహూనన్యాన్ నిధనం ప్రాపయిత్వా.
ఆగంతారః పునరేవేంద్రలోకం
స్వకర్మణా పూర్వజితం మహార్హం
సర్వం మయా భాషితమేతదేవం
కర్తవ్యమన్యద్ వివిధార్థయుక్తం.
గమిష్యామో మానుషం దేవలోకాద్
దురాధరో విహితో యత్ర మోక్షః
దేవాస్త్వస్మానాదధీరన్ జనన్యాం
ధర్మో వాయుర్మఘవానశ్వినౌ చ
అస్త్రైర్దివ్యైర్మానుషాన్ యోధయిత్వా
ఆగంతారః పునరేవేంద్రలోకం.

ఏతచ్ఛ్రుత్వా వజ్రపాణిర్వచస్తు
దేవశ్రేష్ఠం పునరేవేదమాహ
వీర్యేణాహం పురుషం కార్యహేతో
ర్దద్యామేషాం పంచమం మత్ప్రసూతం.
విశ్వభుగ్ భూతధామా చ శిబిరింద్రః ప్రతాపవాన్
శాంతిశ్చతుర్థస్తేషాం వై తేజస్వీ పంచమః స్మృతః
తేషాం కామం భగవానుగ్రధన్వా
ప్రాదాదిష్టం సంనిసర్గాద్ యథోక్తం
తాం చాప్యేషాం యోషితం లోకకాంతాం
శ్రియం భార్యాం వ్యదధాన్మానుషేషు.
తైరేవ సార్ధం తు తతః స దేవో
జగామ నారాయణమప్రమేయం
అనంతమవ్యక్తమజం పురాణం

నువివాహం ధర్మసమ్మతమే అవుతుంది-అని వ్యాస పాదాంతర్భాగంలోకి వెళ్ళాడు. మిగిలినవారందరూ మహర్షి ఆసనం దిగి దుర్పదుని చేయి పట్టుకుని వారి రాకకై ఎదురుచూడసాగారు.

195 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది ఆరవ అధ్యాయము

అతి ప్రాచీనకాలంలో నైమిశారణ్యక్షేత్రంలో దేవతల సమక్షంలో యమధర్మరాజు యజ్ఞం చేస్తున్నాడు. ఆయన యజ్ఞదీక్షలో ఉన్నందువల్ల మానవులు మృత్యుగ్రస్తులు కాకుండా వృద్ధులు కాసాగారు. జనసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. అది చూసి ఇంద్ర చంద్ర వరుణ కుబేరులు వసు రుద్ర సాధ్య దేవతాగణాలు అశ్వినీకుమారులూ ప్రజాపతివద్దకు వెళ్ళి— పరమేష్ఠీ! మానవజాతి అసంఖ్యాకంగా పెరిగిపోయి మాకు భయాన్ని కలిగిస్తూంది. అది చూస్తుంటే మాకు మనోవ్యాకులత్వం కలుగుతూంది. ఆ స్థితినుండి మమ్మల్ని రక్షించండి— అని ప్రార్థించగా అనివార్యమైన మరణం వారికి సహజధర్మమై ఉండగా అమరత్వం కల మీ కందరికీ ఎందుకు భయం కలుగుతూంది— అని ప్రశ్నించాడు బ్రహ్మ.

మహాత్మా! ఈనాడు మాకూ వారికీ ఏమీ తేడా లేదు. వారికి కూడా అమరత్వం ప్రాప్తించింది. అందుకే మేము భయపడుతున్నాము. మానవులకంటె మమ్మల్ని, విశిష్టంగా ఉంచమని ప్రార్థిస్తున్నాము—అనగా బ్రహ్మ— సూర్యనందనుడైన యముడు యజ్ఞదీక్షలో ఉండడంవల్ల ఈమానవులు మరణించడం లేదు. యముడు యజ్ఞదీక్ష ముగించగానే వీరిని మృత్యువువరిస్తుంది. మీశక్తి వినియోగించి ఆయనను యజ్ఞకార్యవిముఖుణ్ణి చేయగలిగితే మీకోరిక తీరుతుంది— అన్నాడు.

వారందరూ బ్రహ్మదేవుని మాటలప్రకారం నైమిశారణ్యం చేరి గంగాస్నానానికి వెళ్ళారు. ఆ సమయంలో నిర్మలభాగీరథీప్రవాహంలో పోతూన్న ఒకపద్మం కనిపించింది. దానిజాడకోసం వారందరూ గంగాజన్మస్థానంవైపు బయలుదేరారు. సాగిసాగి గంగోత్రి చేరారు. అక్కడ ఇంద్రుడు అగ్నిసమానతేజస్సుతో ప్రకాశించే ఒక స్త్రీని చూశాడు. ఆతరుణీమణి ప్రవాహమధ్యంలో నిల్చి శోకిస్తున్నది. ఆమె కన్నులనుండి జారే ఒక్కో జలకణం ఒక్కొక్క బంగారు కమలంగా మారుతున్నది. అది చూసి ఇంద్రుడు ఆమెను సమీపించి- తరుణీ! నువ్వెవరవు. ఇలా ఎందు కేడుస్తున్నావో చెప్పు అని ప్రశ్నించగా ఆమె దేవరాజా! నేనొక అభాగ్యురాలను. నువ్వు నావెనకాలే వస్తే నేనెవరినో ఎందు కేడుస్తున్నానో మీకు అర్థమవుతుంది— అని పలికి ఆమె నడవసాగింది. దేవేంద్రుడామె ననుసరించాడు. నడచి నడచి హిమవచ్ఛిఖరం చేరారు. అక్కడ ఒక తరుణసుందరపురుషుడు ఒకానొక రమణీమణితో క్రీడిస్తూండడం వీరిరువురూ చూశారు. వారు సర్వేంద్రియాలతోనూ క్రీడ సాగిస్తూ తన్మయులై వున్నారు. వారికి వీరిదృష్టి లేదు. దేవేంద్రునికి ఆగ్రహం కలిగింది. ఈ ప్రపంచమంతా నా అధీనంలో ఉంది. నా ఆజ్ఞానుసారం

సనాతనం విశ్వమనంతరూపం.
స చాపి తద్ వ్యదధాత్ సర్వమేవ
తతః సర్వే సంబభూవుర్ధరణ్యాం
స చాపి కేశౌ హరిరుద్బబర్హ
శుక్లమేకమపరం చాపి కృష్ణం.
తౌ చాపి కేశౌ నివిశేతాం యదూనాం
కులే స్త్రియౌ దేవకీం రోహిణీం చ
తయోరేకో బలదేవో బభూవ
యోఽసౌ శ్వేతస్తస్య దేవస్య కేశః
కృష్ణో ద్వితీయః కేశవః సంబభూవ
కేశో యోఽసౌ వర్ణతః కృష్ణ ఉక్తః.
యే తే పూర్వం శక్రరూపా నిబద్ధా
స్తస్యాం దర్యాం పర్వతస్యోత్తరస్య
ఇహైవ తే పాండవా వీర్యవంతః
శక్రస్యాంశః పాండవః సవ్యసాచీ.
ఏవమేతే పాండవాః సంబభూవు
ర్యే తే రాజన్ పూర్వమింద్రా బభూవుః
లక్ష్మీశ్చైషాం పూర్వమేవోపదిష్టా
భార్యా యైషా ద్రౌపదీ దివ్యరూపా.
కథం హి స్త్రీ కర్మణా తే మహీతలాత్
సముత్తిష్ఠేదన్యతో దైవయోగాత్
యస్యా రూపం సోమసూర్యప్రకాశం
గంధశ్చాస్యాః క్రోశమాత్రాత్ ప్రవాతి.
ఇదం చాన్యత్ ప్రీతిపూర్వం నరేంద్ర
దదాని తే వరమత్యద్భుతం చ
దివ్యం చక్షుః పశ్య కుంతీసుతాంస్త్వం
పుణ్యైర్దివ్యైః పూర్వదేహైరుపేతాన్.
తతో వ్యాసః పరమోదారకర్మా
శుచిర్విప్రస్తపసా తస్య రాజ్ఞః
చక్షుర్దివ్యం ప్రదదౌ తాంశ్చ సర్వాన్
రాజాపశ్యత్ పూర్వదేహైర్యథావత్.
తతో దివ్యాన్ హేమకిరీటమాలినః
శక్రప్రఖ్యాన్ పావకాదిత్యవర్ణాన్
బద్ధాపీడాంశ్చారురూపాంశ్చ యూనో
వ్యూఢోరస్కాంస్తాలమాత్రాన్ దదర్శ.
దివ్యైర్వస్త్రైరరజోభిః సుగంధై
ర్మాల్యైశ్చాగ్ర్యైః శోభమానానతీవ
సాక్షాత్ త్ర్యక్షాన్ వా వసూంశ్చాపి రుద్రా
నాదిత్యాన్ వా సర్వగుణోపపన్నాన్.
తాన్ పూర్వేంద్రానభివీక్ష్యాభిరూపాన్
శక్రాత్మజం చేంద్రరూపం నిశమ్య
ప్రీతో రాజా ద్రుపదో విస్మితశ్చ
దివ్యాం మాయాం తామవేక్ష్యాప్రమేయాం.
తాం చైవాగ్ర్యాం స్త్రియమతిరూపయుక్తాం
దివ్యాం సాక్షాత్ సోమవహ్నిప్రకాశాం
యోగ్యాం తేషాం రూపతేజోయశోభిః
పత్నీం మత్వా హృష్టవాన్ పార్థివేంద్రః.
స తద్ దృష్ట్వా మహదాశ్చర్యరూపం
జగ్రాహ పాదౌ సత్యవత్యాః సుతస్య
నైతచ్చిత్రం పరమర్షే త్వయీతి
ప్రసన్నచేతాః స ఉవాచ చైనం.
ఆసీత్ తపోవనే కాచిదృషేః కన్యా మహాత్మనః
నాధ్యగచ్ఛత్ పతిం సా తు కన్యా రూపవతీ సతీ.
తోషయామాస తపసా సా కిలోగ్రేణ శంకరం
తామువాచేశ్వరః ప్రీతో వృణు కామమితి స్వయం.
సైవముక్తాబ్రవీత్ కన్యా దేవం వరదమీశ్వరం
పతిం సర్వగుణోపేతమిచ్ఛామీతి పునః పునః.
దదౌ తస్యై స దేవేశస్తం వరం ప్రీతమానసః
పంచ తే పతయో భద్రే భవిష్యంతీతి శంకరః.
సా ప్రసాదయతీ దేవమిదం భూయోఽభ్యభాషత

సాగే ఈ విశ్వానికి నేనే అధిపతిని— అని పలికే ఇంద్రుని చూసి ఆ పురుషుడు నెమ్మదిగా నవ్వాడు. అతని దృష్టి పడుతున్న క్షణంలోనే దేవేంద్రుని శరీరం ఎండిన మోడువలె స్తంభించి పోయింది. తనకెదురైన పరసమాప్తమైన తిరువాయి ఆపురుషుడు ఈయువతిని దేవేంద్రునికోసమే తన వద్దకు రమ్మన్నాడు. ఆస్త్రీ ఇంద్రుణ్ణి స్పృశించడంతో ఇంద్రుని అవయవాలన్నీ శిథిలమయాయి. ఇంద్రుడు కుప్పలా కూలిపోయాడు.

ఉగ్రతేజస్వియైన రుద్రుడు— ఇంద్రా! నీఅనంత బలపరాక్రమాలకు తగినశాస్తి జరిగింది. ఇక ముందు ఎన్నడూ అహంకారంతో చరించకు. ఇదిగో ఈ గుహాద్వారందగ్గర ఉన్న పర్వతాన్ని ప్రక్కకు తప్పించి అటుచూడు. సూర్యతేజస్సుతో వెలిగే ఇంద్రులు నీవంటివారెందరో ఇక్కడ ఉన్నారు— అనగా ఇంద్రుడు గుహాద్వారం తెరచి నలుగురు ఇంద్రుల్ని చూశాడు. వారిని చూడగానే తనస్థితికూడా అంతే అవుతుందని ఇంద్రుడు భయపడ్డాడు. పరమశివుడు ఎఱ్ఱవారిన కన్నులతో— ఇంద్రా! మూఢుడవై నన్నవమానించావు కనక ఈగుహలో ప్రవేశించు— అన్నాడు. ఇంద్రుని హృదయం వజ్రాఘాతమై దుఃఖసాగరంలో మునిగిపోయింది. ప్రచండవాయువులో ఊగిసలాడే రావి యాకులా అతని శరీరం కంపిస్తూంది. అయినా మహేశ్వరుని ఆజ్ఞానుసారం మహేంద్రుడు గుహా ప్రవేశంచేసి చేతులు జోడించే జగత్స్రష్టా! ఈవిశాల విశ్వాన్ని సృష్టించే శక్తిగల ఆదిపురుషుడవు నువ్వే అని ప్రార్థించగా తేజోమయుడైన రుద్రుడు నవ్వి- నీవంటి శీలస్వభావాలు కల వ్యక్తిని అనుగ్రహించ కూడదు. ఇదివరలో వీరూ నీలానే సంచరించారు. వారివలెనే నువ్వుకూడా ఈగుహలో ఉండకతప్పదు. మీరందరూ మానవజన్మమెత్తి అసాధ్యకార్యాలు చేసి పుణ్యకర్మలతో అనేకులకు మృత్యుభీతి తొలగ జేసి ధర్మపరాయణులు నివసించడానికి యోగ్యమైన ఈలోకం చేరగలరు. మీవల్ల ఎన్నో ప్రయోజనాలు నెరవేరాలి— అన్నాడు.

పరమేశ్వరా! మీ ఆజ్ఞానుసారం మేము మానవలోకం చేరి అన్యజనదుర్లభమైన మోక్షం సాధించుకోగలం. అయితే మేము యమ వాయు ఇంద్ర అశ్వినీకుమారులవల్ల జన్మించే అవకాశం మాకు కల్గించండి. దివ్యాస్త్రాలతో సంగ్రామాలు సాగించి ఇంద్రలోకానికి వస్తాము— అని గుహలోని నలుగురు ఇంద్రులూ పలికారు. వారి మాటలు విని గుహాముఖద్వారంలోని ఇంద్రుడు తాను నిజవీర్యంతోనే తన అంశను పురుషునిగా సమర్పించి దేవకార్యం నిర్వర్తిస్తాను—అన్నాడు. రుద్రుడు అంగీకరించాడు. వారితోబాటే గంగాప్రవాహంలో కనిపించిన యువతిని వారికి భార్యగా నియమించాడు.

అనంతరం శివుడు వైకుంఠానికి విశ్వరూపుడైన నారాయణునికి విషయం అంతా నివేదించిన ఆయన అనుజ్ఞ పొందాడు. అప్పుడు నారాయణుడు తన తలనుండి రెండు వెంట్రుకలు తీశాడు. వానిలో ఒకటి శ్యామవర్ణంతోను రెండవది శ్వేతవర్ణంతోను ఉన్నవి. ఆరెండే బలరాముడుగాను కృష్ణుడుగాను యదువంశంలో పుట్టాయి. రోహిణికి బలరాముడు దేవకికి శ్రీకృష్ణుడు జన్మించారు. ఆగుహలో బంధింపబడిన విశ్వభుక్కు భూతధాముడు శిబి శాంతి అనే పేరులు గల ఇంద్రులే వీరు నలుగురు. సాక్షాత్తు ఇంద్రాంశసంభూతుడు అర్జునుడు.

ఏకం పతిం గుణోపేతం త్వత్తోఽర్థామీతి శంకరః.
తాం దేవదేవః ప్రీతాత్మా పునః ప్రాహ శుభం వచః
పంచకృత్వ_స్త్వయోక్తోఽహంపతిం దేహీతివై పునః.
తత్ తథా భవితా భద్రే ఏచ_స్తద్ భద్రమస్తుతే
దేహమన్యం గతాయాస్తే సర్వమేతద్ భవిష్యతి.
ద్రుపదై షా హి సా జజ్ఞే సుతా వై దేవరూపిణీ
పంచానాం విహితా పత్నీ కృష్ణా పార్షత్యనిందితాః
స్వర్గశ్రీః పాండవార్థం తు సముత్పన్నా మహామఖే
సేహతప్త్వా తపో ఘోరందుహితృత్వం తవాగతా.
సై షా దేవీ రుచిరా దేవజుష్టా
పంచానామేకా స్వకృతేనేహ కర్మణా
సృష్టా స్వయం దేవపత్నీ స్వయంభువా
శ్రుత్వా రాజన్ ద్రుపదేష్టం కురుష్వ.

196 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది ఏడవ అధ్యాయము

అశ్రుత్వైవం వచనం తే మహర్షే
మయా పూర్వం యతితం సంవిధాతుం
న వై శక్యం విహితస్యాపయానం
తదేవేదముపపన్నం విధానం.
దిష్టస్య గ్రంథిరనివ_ర్తనీయః
స్వకర్మణా విహితం నేహ కించిత్
కృతం నిమిత్తం హి వరైకహేతో
స్తదేవేదముపపన్నం విధానం.
యథైవ కృష్ణోక్తవతీ పురస్తా
న్నైకం పతిం మే భగవాన్ దదాతు
స చాప్యేవం వరమిత్యబ్రవీత్ తాం
దేవో హి వేత్తా పరమం యదత్ర.
యది వై వం విహితః శంకరేణ
ధర్మోఽధర్మో వా నాత్ర మమాపరాధః.
గృహ్ణంత్విమే విధివత్ పాణిమస్యా
యథోపజోషం విహితైషాం హి కృష్ణా.
తతోఽబ్రవీద్ భగవాన్ ధర్మరాజ
మద్యైవ పుణ్యాహముత వః పాండవేయ
అద్య పౌష్యం యోగముపైతి చంద్రమాః
పాణిం కృష్ణయాస్త్వం గృహాణాద్య పూర్వం.
తతో రాజా యజ్ఞసేనః సపుత్రో
జన్యార్థముక్తం బహు తద్ తదగ్ర్యం
సమానయామాస సుతాం చ కృష్ణా
మాప్లావ్య రత్నైర్బహుభిర్విభూష్య.
తతస్తు సర్వే సుహృదో నృపస్య
సమాజగ్ముః సహితా మంత్రిణశ్చ
ద్రష్టుం వివాహం పరమప్రీతా
ద్విజాశ్చ పౌరాశ్చ యథా ప్రధానాః.
తతోఽస్య వేశ్మాగ్ర్యజనోపశోభితం
విస్తీర్ణపద్మోత్పలభూషితాజిరం
బలౌఘ రత్నౌఘ విచిత్రమాబభౌ
నభో యథా నిర్మలతారకాన్వితం.
తతస్తు తే కౌరవరాజపుత్రా
విభూషితాః కుండలినో యువానః
మహార్హవస్త్రాంబరచందనోక్షితాః
కృతాభిషేకాః కృతమంగళక్రియాః.
పురోహితేనాగ్నిసమానవర్చసా
సహైవ ధౌమ్యేన యథావిధి ప్రభో

పాండవు లైదుగురూ ఇంద్రులే. ఈ ద్రౌపది స్వర్గలోక లక్ష్మియే. ఈదేవతా లక్ష్మి పూర్వం నుంచీ వీరి భార్యగా ఉంటోంది. ఈకారణంవల్లనే దేవతలందరూ నడుం కట్టి నీయజ్ఞవేదికనుండి ఈ సుందరస్వరూపిణిని ప్రభవింపజేశారు. నీయందు అనుగ్రహం కలిగి నీకు దివ్యదృష్టి ప్రసాదిస్తున్నాను. ఇప్పుడు నువ్వు పాండురాజనందనులనూ వారి పూర్వదేహాలనూ చూడు-అని వ్యాసమహర్షి దివ్యతపస్సంజనితమైన శక్తిని ద్రుపదునిపై ప్రసరించాడు.

ఆదృష్టితో చూచేసరికి పాండవులందరూ సూర్యాగ్నిసదృశతేజంతో కిరీటహారకేయూరాద్యలంకారాలతో ప్రకాశిస్తూ గోచరించారు. మనోహరంగా యౌవనస్థితిలో విరాజిల్లుతున్నారు. సర్వగుణసంపన్నులై కనిపిస్తున్నారు. అర్జునునికూడా సాక్షాత్తూ ఇంద్రస్వరూపంలో చూసి ద్రుపదుడు పరమానందభరితుడయ్యాడు. తన కుమార్తెగా ఉన్న ద్రౌపదినికూడా దివ్యాకారంతో చూసి ఆశ్చర్యచకితుడై ద్రౌపది వారి భార్యగా ఉండవలసిందే అని నిశ్చయించుకున్నాడు. కొంతసేపటికి లౌకికావస్థలోపడి అదేక్షణంలో ద్రుపదుడు వ్యాసమహర్షి చరణకమలాలు స్పృశించి-మహర్షీ! మీశక్తి నాకు సంతోషావహంగా ఉన్నదే కానీ ఆశ్చర్యకరంగా లేదు-అని అభివాదం చేశాడు. వ్యాసుడు ప్రసన్నచిత్తుడై-రాజా! ఒకానొక తపోవనంలో ఒక ముని ఉండేవాడు. ఆయన కొక కుమార్తె ఉండేది. ఆమె ఎంతసౌందర్యవతియో అంతటి సాధ్వి. ఆమె గుణరూపశీలాలకు యోగ్యుడైన వరుడు లభించలేదు. అప్పుడామె నియమవ్రతంతో తపస్సుచేసి పరమేశ్వరుని అనుగ్రహం సంపాదించింది. శివుడు ప్రసన్నుడై ప్రత్యక్షమై-అమ్మాయీ!నీమనోభీష్టం చెప్పు. నేను నెరవేరుస్తాను- అనగా ఆ తరుణి ఆవేగంతో అయిదుమార్లు ఇలాపలికింది-నాకు సర్వగుణసంపన్నుడైన భర్త కావాలి. ఆ ప్రకారంగా ఆమె అయిదుమార్లు కోరినందువల్ల ఆమె అయిదుగురికి భార్య కాగలదని పరమశివుడు వరమిచ్చాడు. కాని ఆమె గుణవంతుడైన ఒకేఒక్క పురుషుని భర్తగా కోరుతున్నా నన్నది. ఆమె కోరిక పరమశివునికి సంతోషమే కలిగించినా తన మాటకు తిరుగులేదనీ అయినా ఆమెకు ఈజన్మలో అది ప్రాప్తించదనీ మరొకజన్మలోనే అయిదుగురు భర్తలుగా ప్రాప్తిస్తారనీ చెప్పి వెళ్ళిపోయాడు. ఆ మునికన్యకయే పాండవపత్నిగా నీయజ్ఞవేదినుండి ఆవిర్భవించింది. తీవ్రంగా తపస్సుచేసి నీ యింట పుట్టటం నీసౌభాగ్యం. ఈమె సర్వదేవతలపూజలూ అందుకోదగ్గ సుందరి. బ్రహ్మ ఈమెను సృష్టించడంలోనే పంచభర్తృకగా సృష్టించాడు. ఇప్పుడు నువ్వు నీయిష్టప్రకారంచెయ్యి-అన్నాడు వ్యాసుడు.

196 వ అధ్యాయము సమాప్తం

## నూట తొంబది ఏడవ అధ్యాయం

వ్యాసభగవానుడు పురాతనాంశాలను వివరించటమే కాక ఆ ఇతివృత్తఛాయలను కనులయెదురుగా ప్రదర్శించటంతో ద్రుపదుని సంకల్పం పూర్తిగామారింది. ద్రౌపదిని సృష్టించటంలోనే

క్రమేణ సర్వే వివిశు స్తతః సదో
మహర్షభా గోష్ఠమివాభినందినః.
తతః సమాధాయ స వేదపారగో
జుహావ మంత్రైర్జ్వలితం హుతాశనం
యుధిష్ఠిరం చాప్యుపనీయ మంత్రవి
న్నియోజయామాస సహైవ కృష్ణయా.
ప్రదక్షిణం తౌ ప్రగృహీతపాణీ
సమానయామాస స వేదపారగః
తతోఽభ్యనుజ్ఞాయ తమాజిశోభినం
పురోహితో రాజగృహాద్ వినిర్యయౌ.
క్రమేణ చానేన నరాధిపాత్మజా
వరస్త్రియస్తే జగృహు స్తదా కరం
అహన్యహన్యుత్తమరూపధారిణో
మహారథాః కౌరవవంశవర్ధనాః.
ఇదం చ తత్రాద్భుతరూపముత్తమం
జగాద దేవర్షిరతీతమానుషం
మహానుభావా కిల సా సుమధ్యమా
బభూవ కన్యైవ గతే గతేఽహని.
కృతే వివాహే ద్రుపదో ధనం దదౌ
మహారథేభ్యో బహురూపముత్తమం
శతం రథానాం వరహేమమాలినాం
చతుర్యుజాం హేమఖలీనమాలినాం.
శతం గజానామపి పద్మినాం తథా
శతం గిరీణామివ హేమశృంగిణాం
తథైవ దాసీశతమగ్ర్యయౌవనం
మహార్హవేషాభరణాంబరస్రజం.
పృథక్ పృథగ్ దివ్యదృశాం పునర్దదౌ
తదా ధనం సౌమకిరగ్నిసాక్షికం
తథైవ వస్త్రాణి విభూషణాని
ప్రభావయుక్తాని మహానుభావః.
కృతే వివాహే చ తతస్తు పాండవాః
ప్రభూతరత్నాముపలభ్య తాం శ్రియం
విజహ్రురింద్రప్రతిమా మహాబలాః
పురే తు పాంచాలనృపస్య తస్య హ.
సర్వేఽప్యతుష్యన్ స్మ చ పాండవేయాః
స్త్రియః శుభైః శీలసమాధివృత్తైః
సా చాప్యేషా యాజ్ఞసేనీ తదానీం
నివర్తయామాస ముదం స్వసుత్రవృత్తైః.

197 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది ఎనిమిదవ అధ్యాయము

పాండవైః సహ సంయోగం గతస్య ద్రుపదస్యహ
న బభూవ భయం కించిద్ దేవేభ్యోఽపి కథంచన.
కుంతీమాసాద్య తా నార్యో ద్రుపదస్య మహాత్మనః
నామసంకీర్తయంత్యోఽస్యాజగ్ముః పాదౌస్వమూర్ధభిః
కృష్ణా చ క్షౌమసంవీతా కృతకౌతుకమంగళా
కృతాభివాదనా శ్వశ్ర్వా స్తస్థౌ ప్రహ్వా కృతాంజలిః.
రూపలక్షణసంపన్నాం శీలాచారసమన్వితాం
ద్రౌపదీమవదత్ ప్రేమ్ణాపృథాఽఽశీర్వచనంస్నుషాం
యథేంద్రాణీ హరిహయే స్వాహా చైవ విభావసౌ
రోహిణీ చ యథా సోమే దమయంతీ యథా నలే
యథా వైశ్రవణే భద్రా వసిష్ఠే చాప్యరుంధతీ
యథా నారాయణే లక్ష్మీ స్తథా త్వం భవభర్తృషు.
జీవసూర్వీరసూర్భద్రే బహుసౌఖ్యసమన్వితా
సుభగా భోగసంపన్నా యజ్ఞపత్నీ పతివ్రతా.

పరమేశ్వరుడు ప్రత్యేకసంకల్పంతో ఉన్నప్పుడు ఆ నిర్ణయాన్ని మార్చే శక్తి తనకు లేదని ఒప్పియించుకున్నాడు.

పూర్వజన్మలో ఆమె అయిదుసార్లు భర్త కావాలని కోరడంవల్లనే ఇది జరిగినట్లు నమ్మక తప్పనప్పుడు ఇప్పుడు పాండవులైదుగురూ ఈమెను వివాహమాడటంలో ధర్మాధర్మవిచారణకు నావకాశమే లేదని ద్రుపదుని మనస్సు సమాధానపడ్డది.

అతని నిశ్చయం తెలిసి వ్యాసుడు ధర్మరాజును సమీపించి—నాయనా! ఈరోజు పరమశుభప్రదమైనది. ప్రథమంగా నీవ్వారోజునే ఈమెను భార్యగా పరిగ్రహించు. చంద్రుడు పుష్యమీ నక్షత్రంలోకి నడుస్తున్న ఈశుభదినాన నీవివాహం జరగాలి— అన్నాడు.

ఆయన మాటలు వింటూనే ద్రుపదుడు వివాహావసరసామగ్రి సమాయత్తం చేశాడు. ద్రౌపదిని మంగళస్నానం చేయించి సర్వభూషణాలూ అలంకరించి సాలంకృతకన్యగా తీసికొనివచ్చారు. ద్రుపద మహారాజభవనం బంధుమిత్ర బ్రాహ్మణ మంత్రి సామంతపరివారంతో కలకలలాడుతూన్నది. భవనంఅంతా కలువలూ తామరలూ అలంకరించారు. ఒకవైపున సేనావాహిని ఉన్నది. ఈ ప్రక్కన రత్నరాసు లున్నాయి.

పాండురాజనందనులు కూడా మంగళాచారాలు నిర్వర్తించి సర్వాంగాలంకృతభూషణదేహులై అమూల్యవస్త్రాలతో సురభిగంధచందనశోభతో ధౌమ్యపురస్సరులై సభాప్రవేశం చేశారు. వారంతా ఉత్తమజాతి వృషభాలవలె క్రమానుసారం వచ్చారు.

అగణితతారకాగణంతో ప్రకాశించే ఆకాశం వలె ఆ సభామండపం వెలుగుతూన్నది. అప్పుడు ధౌమ్యులవారు అగ్నిని ప్రజ్వలింపజేసి మంత్రపూతమైన హవిస్సు అర్పించారు. ఆ వేదవేత్త ధర్మరాజునూ ద్రౌపదినీ చేరదీసి వారి కొంగులు ముడి వేశాడు. పాణిగ్రహణం చేయించి అగ్నికి ప్రదక్షిణం నిర్వర్తింపించి వివాహకార్యక్రమం సక్రమంగా సాగించి ఆయన రాజమందిరం విడిచారు.

అదేవిధంగా మిగిలిన పాండవులకు కూడా ఒక్కొక్క సుముహూర్తాన ధౌమ్యులవారు వివాహవిధి నడిపించారు. సుందరకటిస్థలం కల ద్రౌపది ఏరోజుకారోజే కన్యాత్వంతో ఉండేదని దేవర్షులు అభివర్ణించారు.

వివాహానంతరం ద్రుపదుడు జామాతలకు ఉత్తమజాతి అశ్వాలనూ సుందరస్యందనాలనూ గజశతాలనూ దుకూలాలనూ రత్నభూషణాలనూ నవయౌవనంలో ఉన్న దాసీజనాన్ని కానుకలుగా ఇచ్చాడు. పాండవులు పరిణయానంతరం సర్వలక్ష్మీసంపన్నులై సాక్షాల్లక్ష్మీరూపిణియైన ద్రౌపదితో హాయిగా పాంచాలదేశంలోనే నివసించసాగారు.

197 వ అధ్యాయం సమాప్తం

## నూట తొంబది ఎనిమిదవ అధ్యాయము

పాండవులకు తన ప్రియనందినిని ఇచ్చి పరిణయం చేయుటంలో ద్రుపదునికి శత్రుభీతిలేకుండా

అతిథీనాగతాన్ సాధూంశ్చ వృద్ధాన్ బాలాంస్తథా గురూన్
పూజయంత్యా యథాన్యాయం శశ్వద్ గచ్ఛంతు తే సమాః.
కురుజాంగళముఖ్యేషు రాష్ట్రేషు నగరేషు చ
అను త్వమభిషిచ్యస్వ నృపతిం ధర్మవత్సలా.
పతిభిర్నిర్జితాముర్వీం విక్రమేణ మహాబలైః
కురు బ్రాహ్మణసాత్ సర్వామశ్వమేధే మహాక్రతౌ.
పృథివ్యాం యాని రత్నాని గుణవంతి గుణాన్వితే
తాన్యాప్నుహి త్వం కల్యాణి సుఖినీ శరదాం శతం.
యథా చ త్వాభినందామి వధ్వద్య క్షౌమసంవృతాం
తథా భూయోఽభినందిష్యే జాతపుత్రాం గుణాన్వితాం
తతస్తు కృతదారేభ్యః పాండుభ్యః ప్రాహిణోద్ధరిః
వైదూర్యమణిచిత్రాణి హైమాన్యాభరణాని చ.
వాసాంసి చ మహార్హాణి నానాదేశ్యాని మాధవః
కంబళాజినరత్నాని స్పర్శవంతి శుభాని చ.
శయనాసనయానాని వివిధాని మహాంతి చ
వైదూర్యవజ్రచిత్రాణి శతశో భాజనాని చ.
రూపయౌవనదాక్షిణ్యైరుపేతాశ్చ స్వలంకృతాః
ప్రేష్యాఃసంప్రదదౌకృష్ణోనానాదేశ్యాఃస్వలంకృతాః
గజాన్ వినీతాన్ భద్రాంశ్చ సదశ్వాంశ్చ స్వలంకృతాన్
రథాంశ్చ దాంతాన్ సౌవర్ణైః శుభ్రైః పట్టైరలంకృతాన్.
కోటిశశ్చ సువర్ణం చ తేషామకృతకం తథా
వీథీకృతమమేయాత్మా ప్రాహిణోన్మధుసూదనః.
తత్ సర్వం ప్రతిజగ్రాహ ధర్మరాజో యుధిష్ఠిరః
ముదాపరమయా యుక్తో గోవిందప్రియ కామ్యయా.

## ఇది వైవాహికపర్వము

# రాజ్యలంభపర్వము

తతో రాజ్ఞాం చరైరాప్తైః ప్రవృత్తిరుపనీయత
పాండవైరూపసంపన్నా ద్రౌపదీ పతిభిః శుభా.
యేన తద్ ధనురాదాయ లక్ష్యం విద్ధమహాత్మనా
సోఽర్జునో జయతాం శ్రేష్ఠో మహాబాణధనుర్ధరః.
యః శల్యం మద్రరాజం వై ప్రోత్క్షిప్యాపాతయద్బలీ
త్రాసయామాస సంక్రుద్ధో వృక్షేణ పురుషాన్ రణే.
న చాస్య సంభ్రమః కశ్చిదాసీత్ తత్ర మహాత్మనః
స భీమో భీమసంస్పర్శః శత్రుసేనాంగపాతనః.
బ్రహ్మరూపధరాన్ శ్రుత్వా ప్రశాంతాన్ పాండునందనాన్
కౌంతేయాన్ మనుజేంద్రాణాం విస్మయః సమజాయత.
సపుత్రా హి పురా కుంతీ దగ్ధా జతుగృహే శ్రుతా
పునర్జాతానివ చ తాం స్తేఽమన్యంత నరాధిపాః.
ధిగకుర్వం స్తదా భీష్మం ధృతరాష్ట్రం చ కౌరవం
కర్మణాతినృశంసేన పురోచనకృతేన వై.
ధార్మికాన్ వృత్తసంపన్నాన్ మాతుః ప్రియహితే రతాన్
యదా తానీదృశాన్ పార్థానుత్సాదయితు మిచ్ఛతి.
తతః స్వయంవరే వృత్తే ధార్తరాష్ట్రాః స్మ భారత
మంత్రయంతే తతః సర్వే కర్ణసౌబలదూషితాః.

పోయింది. దేవతలుకూడా పాంచాలరాజ్యంపై పు ద్వేషభావంతో కన్నెత్తి చూడలేకపోయేవారు.

ద్రుపదుని అంతఃపురజనులందరూ కుంతీదేవి చరణాలకు నమస్కారాలుచేసి వెడుతూండేవారు. ద్రౌపదికూడా అనుదినం పరిశుభ్రస్నాతయై దేవతా పూజానంతరం అత్తగారికి పాదాభివందనాలర్పించేది. అంజలి ఘటించి వినయవినమితోత్తమాంగయై నిలిచిన కోడలిని ఇలా ఆశీర్వదించేది కుంతి.

అమ్మాయీ! శచీదేవి స్వాహాదేవతుష్టా రోహిణీ దమయంతీ భద్రా అరుంధతీ లక్ష్మీ ఇంద్రాగ్ని చంద్ర నల కుబేర వసిష్ఠ నారాయణులయందు ఏవిధమైన భక్తినీ ప్రేమనూ ప్రదర్శించి ప్రసరిస్తూ అనురాగంతో ఉండేదో అదేవిధమైన రక్తితో నువ్వుకూడా చరించి సమస్త సౌఖ్యాలూ అనుభవిస్తూ మహావీరులైన బిడ్డలను ప్రసవించు. సర్వ శోభనాంగివై యజ్ఞదీక్షితులైన భర్తపక్కన కూర్చునే అదృష్టం నీకు కలగాలి. అతిథిసత్కారాలూ సాధుజనసమాదరణమూ గురువృద్ధజనసేవ పసిపిల్లలయందు వాత్సల్యమూ ఉండాలి. నీ భర్తలు కురుజాంగల దేశాధిపతు లవుతారు. నీకు పట్టమహిషీత్వం ప్రాప్తిస్తుంది. ధర్మమార్గం వీడకు సుమీ.

పరాక్రమంతో నీభర్తలు జయించే ఈభూమండలాన్ని అశ్వమేధయజ్ఞంలో నీచేతులతో బ్రాహ్మణులకు అర్పించు. నువ్వు శతశరత్తులు సుఖంగా జీవించు. మాంగళ్యశోభతో కళ్యాణమూర్తివై ఉన్న నువ్వు అచిరకాలంలో మాతృమూర్తి వవుతావు. ఈవిధంగా కుంతీదేవి తనివితీరా ఆశీర్వదించింది.

ఆ శోభనదంపతులకు శ్రీకృష్ణుడు మణిరత్నాలతో పొదగబడిన సువర్ణాలంకారాలూ పట్టు కంబళ్ళూ శయ్యలూ ఆసనాలూ వాహనాలూ కానుకలుగా అర్పించాడు. అంతేకాక రూపలావణ్యాలకు నృత్యచాతుర్యం సహకరించే దేశదేశాల కన్యాజనాన్నికూడా సమర్పించాడు. ఉత్తమజాతి అశ్వాలూ మదమత్తేభాలూ అద్భుత రథాలూ సువర్ణ ముద్రికలూ కూడా బహూకరించాడు.

198 వ అధ్యాయం సమాప్తం.

## నూట తొంబది తొమ్మిదవ అధ్యాయము

### రాజ్యలంభ పర్వము

శోభనాంగి ద్రౌపది పాండవులైదుగురినీ పెండ్లాడిన వార్త గూఢచారులవల్ల నానారాజ్యాధీశులకూ తెలిసి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆనాడు స్వయంవర సభామంటపంలో బ్రాహ్మణవేషాలతో ఉన్న అయిదుగురూ పాండవులేననీ నారి సారించి యంత్రరంధ్రంలోంచి లక్ష్యభేదనంచేసిన అస్త్రవిద్యాకుశలుడు అర్జునుడేననీ పరమక్రోధంతో శల్యుని కుప్పగాకూలవేసినవాడూ ఘనవృక్షాన్ని అవలీలగా పెరికి శత్రుసేనానీకాన్ని చెండాడిన నిర్భీకుడు భీముడేననీ వారికి వివరంగా తెలిసింది. లక్కఇంటిలో వీరందరూ మరణించారని విన్నాక ఈమాట తెలిసేసరికి పాండవులు పునర్జన్మ ఎత్తినట్లే అనిపించింది. పురోచనుని క్రూరకర్మనూ ఆ కర్మా

కశ్చిచ్ఛత్రుః కర్శనీయః పీడనీయ స్తథాపరః
ఉత్సాదనీయాః కౌంతేయాః సర్వే క్షత్రస్య మే మతాః
ఏవం పరాజితాః సర్వే యది యూయం గమిష్యథ
అకృత్వా సంవిదం కాంచిత్ తద్వ స్తప్స్యత్యసంశయం.
అయం దేశశ్చ కాలశ్చ పాండవోద్ధారణాయ నః
న చేదేవం కరిష్యధ్వం లోకే హాస్యా భవిష్యథ.
యమేతే సంశ్రితా వస్తుం కామయంతే చ భూమిపం
సోఽల్పవీర్యబలో రాజా ద్రుపదో వై మతో మమ
యావదేతాన్ న జానంతి జీవతో వృష్ణిపుంగవాః
చైద్యశ్చ పురుషవ్యాఘ్రః శిశుపాలః ప్రతాపవాన్.
ఏకీభావం గతా రాజ్ఞా ద్రుపదేన మహాత్మనా
దురాధర్షతరా రాజన్ భవిష్యంతి న సంశయః.
యావదత్వరతాం సర్వే ప్రాప్నువంతి నరాధిపాః
తావదేవ వ్యవస్యామః పాండవానాం వధం ప్రతి.
ముక్తా జతుగృహాద్ భీమాదాశీవిషముఖాదివ
పునర్యదిహ ముచ్యంతే మహన్నో భయమావిశేత్
తేషామిహోపయాతానామేషాం చ పురవాసినాం
అంతరే దుష్కరం స్థాతుం మేషయోర్మహతోరివ.
హలధృక్ప్రగృహీతాని బలాని బలినాం స్వయం
యావన్న కురుసేనాయాం పతంతి పతగా ఇవ
తావత్ సర్వాభిసారేణ పురమేతద్ వినాశ్యతాం
ఏతదత్రం పరం మన్యే ప్రాప్తకాలం నరర్షభాః.
శకునేర్వచనం శ్రుత్వా భాషమాణస్య దుర్మతేః
సోమదత్తిరిదం వాక్యం జగాద పరమం తతః.
ప్రకృతీః సప్త వై జ్ఞాత్వా ఆత్మనశ్చ పరస్య చ
తథాదేశంచకాలంచ షడ్విధాంశ్చనయేద్గుణాన్.
స్థానం వృద్ధిం క్షయం చైవ భూమిం మిత్రాణివిక్రమం
సమీక్ష్యాథాభియుంజీత పరం వ్యసనపీడితం.
తతోఽహంపాండవాన్మన్యేమిత్రకోశసమన్వితాన్
బలస్థాన్ విక్రమస్థాంశ్చ స్వకృతైః ప్రకృతిప్రియాన్.

వపుషా హి తు భూతానాం నేత్రాణి హృదయాని చ
శ్రోత్రం మధురయా వాచా రమయత్యర్జునో నృణాం
న తు కేవలదైవేన ప్రజా భావేన భేజిరే
యద్ బభూవ మనఃకాంతం కర్మణా చ చకార తత్.
న హ్యయుక్తం న చాసక్తం నానృతం న చ విప్రియం
భాషితం చారుభాషస్య జజ్ఞే పార్థస్య భారతీ.
తానేవంగుణసంపన్నాన్ సంపన్నాన్ రాజలక్షణైః
న తాన్ పశ్యామి యే శక్తాః సముచ్ఛేత్తుం యథా బలాత్.

ప్రభావశక్తిర్విపులా మంత్రశక్తిశ్చ పుష్కలా
తథైవోత్సాహశక్తిశ్చ పార్థేష్వభ్యధికా సదా.
మౌలమిత్రబలానాం చ కాలజ్ఞో వై యుధిష్ఠిరః
సామ్నా దానేన భేదేన దండేనేతి యుధిష్ఠిరః.
అమిత్రం యతతే జేతుం న రోషేణేతి మే మతిః
పరిక్రీయ ధనైః శత్రూన్ మిత్రాణి చ బలాని చ
మూలంచసుదృఢంకృత్వాహంత్యరీన్ పాండవ స్తదా.
అశక్యాన్ పాండవాన్ మన్యే దేవైరపి సవాసవైః
యేషామర్థే సదా యుక్తౌ కృష్ణసంకర్షణావుభౌ.
శ్రేయశ్చ యది మన్యధ్వం మన్మతం యది వో మతం
సంవిదం పాండవైః సార్థంకృత్వాయామయథాగతం.
గోపురాట్టాలకైరుచ్చైరుపతల్పశతైరపి
గుప్తం పురవరశ్రేష్ఠమేతదద్భిశ్చ సంవృతం.
తృణధాన్యేంధనరసైః తథా యంత్రాయుధౌషధైః
యుక్తం బహుకపాటైశ్చ ద్రవ్యాగారతుషాదికైః.
భీమోచ్ఛ్రితమహాచక్రం బృహదట్టాలసంవృతం
దృఢప్రాకారనిర్యూహం శతఘ్నీజాలసంవృతం.
ఐష్టకో దారవో వప్రో మానుషశ్చేతి యః స్మృతః
ప్రాకారకర్తృభిర్వీరైః నృగర్భస్తత్ర పూజితః.
తదేతన్నరగర్భేణ పాండరేణ విరాజతే
సాలేనానేకతాలేన సర్వతః సంవృతం పురం.

చరణను నిరోధించని ధృతరాష్ట్రభీష్ములనూ నిందించసాగారు.

ధర్మాత్ములూ సదాచారపరాయణులూ మాత్రమే ప్రియతత్పరులూ అయిన పాండవులనే ఎగ్గుతెలపెట్టే దుర్బుద్ధి ధృతరాష్ట్రుడు— అని పరిపరివిధాల దూషించారు.

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు పుత్రప్రీతివృతుడై శకుని కర్ణులతో మంతనాలు ఆరంభించాడు. కొంతసాగాక శకుని— మహారాజా! ఈప్రపంచంలో శత్రువిషయంలో కొన్ని కొన్ని మార్గాలున్నాయి. కొందరిని బలహీనులుగా ఉంచుకోవాలి. కొందరిని నిరంతరం బాధించాలి. కొందరినిమాత్రం ఎప్పుడుపడితే అప్పుడు ఎక్కడపడితే అక్కడ ఎవరిచేపడితేవారు హతమార్చాలి. ఈమూడవతరగతికి చెందినవారు పాండవులు. ఇప్పుడైనా మించింది లేదు. మీరీవిధంగా చెయ్యకపోతే మాత్రం ఈపరాభవం మిమ్మల్ని పీడస్తూనే ఉంటుంది. అలాంటి కార్యక్రమం జరక్కపోతే ప్రపంచపరిహాసానికి ఒడిపట్టాలి. ఇప్పుడు మనకు అన్నీ అనుకూలంగా ఉన్నాయి. పాండవులకు ఆశ్రయమిచ్చిన ద్రుపదుని బలపరాక్రమాలు అత్యల్పమైనవి. పైగా వృష్ణివంశీయులకూ చేదిదేశాధీశుడైన శిశుపాలునికీ పాండవుల వార్త ఇంతవరకూ తెలీదు. వారికి తెలియకుండానే మనంమన కార్యక్రమం ముగించాలి. ఇప్పుడు రాజులందరూ ప్రశాంతంగానే ఉన్నారు. ఇది మనకు అనుకూలమైన కాలం. ఘోరవిషపూర్ణ దంష్ట్రలుకల సర్పం వంటి లాక్షాగృహగర్భంలోంచి వారు బయటపడిపోయారు. ఇప్పుడీఅవకాశం వినియోగించుకోకపోతే మనకు విపత్తు నెత్తిమీద పడుతుంది.

ఒకవేళ చేదిదేశసేన వృష్ణివంశవీరులూ వచ్చినా మనవారందరూ నాగరకులతోసహా ఎదుర్కోవాలి. ఆసమయంలో వీరిమధ్య ఎవరూ నిలవలేరు. భీషణ సంగ్రామంచేసే మందూకాలమధ్య నిలవటం ఎంత అసాధ్యమో ఈ సంగ్రామంలో అడుగుపెట్టడమూ అంతే. బలరాముని సైన్యాధిపత్యంలో వృష్ణి వీరులు వచ్చి కోటకాల్లా వాళ్లకుండానే నగరనాశనం చెయ్యాలి. ఇది మీ కందరకూ నచ్చుతుందను కుంటాను— అనగా సోమదత్తసుతుడైన భూరిశ్రవసుడు— స్వపరపక్షాల సప్తవిధ ప్రకృతులను సమగ్రంగా గ్రహించి దేశకాలాలను పరిశీలించు కుంటూ షడ్గుణాలనూ అవసరానుసారం ప్రయోగించుకోవాలని నీతిశాస్త్రం చెప్తోంది—అన్నాడు.

[రాజు అమాత్యులు స్నేహితులు కోశము రాష్ట్రము దుర్గము సేన— వీటిని సప్తప్రకృతు లంటారు. సంధి విగ్రహము యానము ఆసనము ద్వైధీభావము సమాశ్రయము— ఇవి షడ్గుణాలు. శత్రువుతో సఖ్యముగా ఉండుట సంధి. యుద్ధ ప్రకటనము విగ్రహము దండయాత్ర యానము సమయనిరీక్షణము ఆసనము ద్వివిధ నీతిప్రవర్తన ద్వైధీభావము. శత్రువు బలవంతుడైన శరణు వేడుట సమాశ్రయము. శత్రువుండే స్థానాన్ని వాని వృద్ధిక్షయాలను మిత్ర శత్రువులను పరీక్షించి వానిపై దాడిచేయాలి. ఇప్పుడు పాండవులు మిత్రసంపన్నులు ధనవంతులు బలపరాక్రమోపేతులు సత్క్రియాచరణరతులై ప్రజాహితాన్ని సాధించుకున్నారు.

అర్జునుడు శారీరకసౌష్టవంతో ప్రజాహృదయాలకు నేత్రాలకు పరితృప్తి కలిగిస్తూ శ్రవణప్రేయంగా మధురవాక్కులు పలుకుతారు. ప్రజాహృదయాల్ని

అనురక్తాః పరికృతయో ద్రుపదస్య మహాత్మనః.
దానమానార్చితాః సర్వే
బాహ్యాశ్చాభ్యంతరాశ్చ యే.
ప్రతిరుద్ధానిమాంజ్ఞాత్వా రాజభిర్బహువిక్రమైః
ఉపయాస్యంతిదాశార్హాఃసముద్రగోచ్ఛ్రితాయుధాః
తస్మాత్ సంధిం వయం కృత్వా ధార్తరాష్ట్రస్య
పాండవైః
స్వరాష్ట్రమేవ గచ్ఛామో యద్యాప్తవచనం మమ.
ఏతన్మమ మతం సర్వైః క్రియతాం యది రోచతే
ఏతద్ధి సుకృతం మన్యే క్షేమం చాపి మహీక్షితాం.
వృత్తే స్వయంవరే చైవ రాజానః సర్వ ఏవ తే
యథాగతం విప్రజగ్ముర్విదిత్వాతాండవాన్ వృతాన్.
అథ దుర్యోధనో రాజా విమనా భ్రాతృభిఃసహ
అశ్వత్థామ్నా మాతులేన కర్ణేన చ కృపేణ చ.
వినివృత్తో వృతం దృష్ట్వా ద్రౌపద్యా శ్వేతవాహనం
తంతుదుఃశాసనో వ్రీడన్మందంమందమివాబ్రవీత్.
యద్యసౌ బ్రాహ్మణోనస్యాద్ విందేతద్రౌపదీంనసః
న హి తం తత్వతోరాజన్ వేద కశ్చిద్ ధనంజయం.
దైవం చ పరమం మన్యే పౌరుషం చాప్యనర్థకం
ధిగస్తు పౌరుషం తాత ధ్రియంతే యత్ర పాండవాః.
ఏవ సంభాషమాణాస్తే నిందంతశ్చ పురోచనం
వివిశుర్హాస్తినపురం దీనా విగతచేతసః.
త్రస్తా విగతసంకల్పా దృష్ట్వా పార్థాన్ మహౌజసః
ముక్తాన్ హవ్యభుజశ్చైవ సంయుక్తాన్ ద్రుపదేన చ
ధృష్టద్యుమ్నం తు సంచింత్య తథైవ చ శిఖండినం
ద్రుపదస్యాత్మజాంశ్చాన్యాన్సర్వయుద్ధవిశారదాన్
విదురస్త్వథ తాం శ్రుత్వా ద్రౌపదీం
పాండవైర్వృతాం
వ్రీడితాన్ ధార్తరాష్ట్రాంశ్చ
భగ్నదర్పానుపాగతాన్.
తతః ప్రీతమనాః క్షత్తా ధృతరాష్ట్రం విశాంపతే
ఉవాచ దిష్ట్యా కురవో వర్ధంత ఇతి విస్మితః.
వైచిత్రవీర్యస్తు వచో నిశమ్య విదురస్య తత్
అబ్రవీత్ పరమప్రీతో దిష్ట్యా దిష్ట్యేతి భారత.
మన్యతే స వృతం పుత్రం జ్యేష్ఠం ద్రుపదకన్యయా
దుర్యోధనమవిజ్ఞానాత్ ప్రజ్ఞాచక్షుర్నరేశ్వరః.
అథ త్వాజ్ఞాపయామాసద్రౌపద్యా భూషణం బహు
ఆనీయతాం వై కృష్ణేతి పుత్రం దుర్యోధనం తదా.
అథాస్యపశ్చాద్ విదురఆచఖ్యౌ పాండవాన్వృతాన్
సర్వాన్ కుశలినో వీరాన్ పూజితాన్ ద్రుపదేనహ.
తేషాంసంబంధినశ్చాన్యాన్బహూన్ బలసమన్వితాన్
సమాగతాన్ పాండవైస్తస్మిన్నేవ స్వయంవరే.
ఏతచ్ఛ్రుత్వా తు వచనం విదురస్య నరాధిపః
ఆకారచ్ఛాదనార్థం తు దిష్ట్యా దిష్ట్యేతి చాబ్రవీత్
ఏవం విదురం భద్రం తే యది జీవంతి పాండవాః
సాధ్వాచారా తథా కుంతీ సంబంధో ద్రుపదేన చ.
అన్వవాయే వసోర్జాతః ప్రవిష్టే మాన్యకే కులే
వ్రతవిద్యాతపోవృద్ధః పార్థివానాం ధురంధరః.
పుత్రాశ్చాస్య తథా పౌత్రాః సర్వే సుచిరవ్రతాః
తేషాం సంబంధినశ్చాన్యే బహవః సుమహాబలాః.
యథైవ పాండోః పుత్రాస్తు తథైవాభ్యధికా మమ
యథా చాభ్యధికా బుద్ధిర్మమ తాన్ ప్రతితచ్ఛృణు
యత్ తే కుశలినో వీరా మిత్రవంతశ్చ పాండవాః
తేషాం సంబంధినశ్చాన్యే బహవశ్చ మహాబలాః.
కో హి ద్రుపదమాసాద్య మిత్రం క్షత్తఃసబాంధవం
న బుభూషేద్ భవేనార్థీ గతశ్రీరపి పార్థివః.
తం తథా భాషమాణం తు విదురః ప్రత్యభాషత
నిత్యం భవతు తే బుద్ధిరేషా రాజంఛ్ఛతం సమాః.
ఇత్యుక్త్వా ప్రయయౌరాజన్ విదురః స్వం నివేశనం
తతో దుర్యోధనశ్చాపి రాధేయశ్చ విశాంపతే

ఆకర్షించడాని కనసరమైన ప్రయత్నాలన్నీ అర్జునుడు చేస్తూనే ఉంటాడు.

పాండవులందరూ రాజలాంఛనాలతో సర్వసౌలతో అనుపమవీరులై మంత్రశక్తియుతులై ఉత్సాహపరులై వెలుగుతున్నారు. నిజబలాన్ని ఎప్పుడు ప్రయోగించాలో సంత్రిసేనల నెలా వినియోగించుకోవాలో ధర్మరాజుకి బాగా తెలుసు. సమయోచితంగా సామ దాన భేద దండోపాయాలు శత్రువుని నిర్జించడం ఆయనకు కరతలామలకం. ధనంతో సైన్యాలనే కాక మిత్రులనూ శత్రువులనూకూడా సాధించుకుని శత్రునాశనం చేస్తాడు. బలరామకృష్ణుల సహకారంతో ఉన్న పాండవులను దేవేంద్రాదులుకూడా ఏమీ చేయలేరు. ఇప్పుడు మీరు నాసూచనను అంగీకరించినట్లయితే మనం పాండవులతో చేతులు కలుపుకొని వెళ్ళిపోవడం మంచిది. ఈ నగరం గోపురప్రాకారాలతో కందకాలతో సర్వఆయుధయంత్రసామగ్రితో ఓషధీరసాలతో తృణకాష్ఠజలసమృద్ధమై ఉన్నది. ఈనగరాన్ని ఆవరించి ఉన్న ప్రాకారాలన్నీ శతఘ్నినామకాస్త్రాలతో నిండి ఉన్నాయి. మట్టితో కిరత్తో నిర్మించిన ప్రాకారాలే కాక మానవసేన ఒకప్రాకారంవలె నిలచి ఉంది. తాళవృక్షాలవలె ఉండే సాలతరువులతో ఉండే ఈ నగరం మహోన్నతంగా ఉంది.

ఈద్రుపదుని ప్రజలు మంత్రి సామంత పరిజనులు ఆంతరంగిక ఉద్యోగులు మహారాజుమీద పరమ గౌరవాదరాలతో ఉంటున్నారు. ఇప్పుడు మనం ఏమాత్రం సాహసించినా పరాక్రమవంతులైన రాజులందరూ యదువీరులతో ఎదురువస్తారు. అందుచేత మనం పాండవులతో సంధిచేసుకుని ఇతర రాజులవలెనే మనరాజ్యానికి వెళ్ళిపోదాం అన్నాడు.

అర్జునుడు బ్రాహ్మణవేషంలో ఉండటంవల్లనే ద్రౌపదిని పొందలేకపోయేవాడు. పురుషప్రయత్నంకంటె దైవమే ప్రబలమైనదని విశ్వసించక తప్పటంలేదు. పాండవులింకా జీవించి ఉన్నారంటే మనపౌరుషానికి ఇంకా అవమానమేముంది-అన్నాడు తిరిగి వెనుతున్న దుర్యోధనుడు. కర్ణ కృప అశ్వత్థామ నెమ్మదిగా హస్తినాపురం చేరారు. వారి వెంట నడిచే దుర్యోధనాదులు ద్రుపదరాజపుత్రుల బల పరాక్రమాలను ప్రశంసించుకుంటూ భయపడ్డారు. వారి అభిమానం దెబ్బతినడమేకాక పాండవులు ద్రౌపదిని పొందారని విని విదురుడు చాలా సంతోషించాడు.

ధృతరాష్ట్రునిసమీపించి విదురుడు మహారాజా! కౌరవవంశాభ్యుదయవార్త మన అదృష్టంవలన వినవచ్చింది కదా- అనగా ధృతరాష్ట్రుడు ఏమి నాఅదృష్టం-అన్నాడు.ఆసమయంలో ధృతరాష్ట్రుడు ద్రౌపది దుర్యోధనుని వరించినట్లనిపించింది. ఆఉత్సాహంతోనే రత్నభూషణాలు తెప్పించి ద్రౌపదీ దుర్యోధనులను మహోత్సాహంతో నగరంలోకి తీసికొని రమ్మని ఆజ్ఞాపించగా విదురుడు అడ్డుకొని ద్రౌపది పాండవులను వరించిందనీవారు పాంచాలంలోనే సుఖంగా ఉన్నారనీ అనగా వినిన ధృతరాష్ట్రుడు తనలో కలిగే వికారాలను దాచుకుంటూ—అహో! ఏమి నాభాగ్యము. పాండవులు జీవించి ఉండటం నా భాగ్యం. మహాసాధ్వి కుంతి. ద్రుపదుడు మాననీయవంశస్థుడు. తపోవిద్యావ్రతాలలో గరిష్ఠుడు. వారితో సంబంధం కలగడం మన అదృష్టం. ద్రుపదుని బంధుకోటిఅంతా పరాక్రమోపేతులై ఈనాడు నాకు పాండవులు ఎంత అభి

ధృతరాష్ట్రముపాగమ్య వచోఽబ్రూతామిదం తదా.
సంనిధౌ విదురస్య త్వాం దోషం వక్తుం న శక్నువః
వివిక్తమితి వక్ష్యావః కిం తవేదం చికీర్షితం.
సపత్నవృద్ధిం యత్ తాత మన్యసే వృద్ధిమాత్మనః
అభిష్టౌషి చ యత్ క్షత్తుః సమీపే ద్విషతాం వర.
అన్యస్మిన్ నృప కర్తవ్యే త్వమన్యత్ కురుషేఽనఘ
తేషాం బలవిఘాతో హి కర్తవ్యస్తాత నిత్యశః.
తే వయం ప్రాప్తకాలస్య చికీర్షాం మంత్రయామహే
యథా నో న గ్రసేయుస్తే సపుత్రబలబాంధవాన్.

199 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందలవ అధ్యాయము

అహమప్యేవమేవైతచ్చికీర్షామి యథా యువాం
వివేక్తుం నాహమిచ్ఛామి త్వాకారం విదురం ప్రతి.
తతస్తేషాం గుణానేవ కీర్తయామి విశేషతః
నావబుధ్యేత విదురో మమాభిప్రాయమింగితైః.
యచ్చ త్వం మన్యసే ప్రాప్తం తద్బ్రవీహి సుయోధన
రాధేయ మన్యసే యచ్చ ప్రాప్తకాలం వదాశు మే.
అద్య తాన్ కుశలైర్విప్రైః సుగుప్తైరాప్తకారిభిః
కుంతీపుత్రాన్ భేదయామో మాద్రీపుత్రౌ చ పాండవౌ.
అథవా ద్రుపదో రాజా మహద్భిర్విత్తసంచయైః
పుత్రాశ్చాస్య ప్రలోభ్యంతామమాత్యాశ్చైవ సర్వశః
పరిత్యజేద్ యథా రాజా కుంతీపుత్రం యుధిష్ఠిరం
అథ తత్రైవ వా తేషాం నివాసం రోచయంతు తే.
ఇహైషాం దోషవద్వాసం వర్ణయంతు పృథక్ పృథక్
తే భిద్యమానాస్తత్రైవ మనః కుర్వంతు పాండవాః
అథవా కుశలాః కేచిదుపాయనిపుణా నరాః
ఇతరేతరతః పార్థాన్ భేదయంత్వనురాగతః.
వ్యుత్థాపయంతు వా కృష్ణాం బహుత్వాత్
సుకరం హి తత్
అథవా పాండవాంస్తస్యాం భేదయంతు తతశ్చ తాం.
భీమసేనస్య వా రాజన్నుపాయకుశలైర్నరైః
మృత్యుర్విధీయతాం ఛన్నైః స హి తేషాం బలాధికః
తమాశ్రిత్య హి కౌంతేయః పురా చాస్మాన్ న మన్యతే
స హి తీక్ష్ణశ్చ శూరశ్చ తేషాం చైవ పరాయణం.
తస్మింస్త్వభిహతే రాజన్ హతోత్సాహా హతౌజసః
యతిష్యంతే న రాజ్యాయ స హి తేషాం వ్యపాశ్రయః.
అజేయో హ్యర్జునః సంఖ్యే పృష్ఠగోపే వృకోదరే
తమృతే ఫల్గునో యుద్ధే రాధేయస్య న పాదభాక్.
తే జానానాస్తు దౌర్బల్యం భీమసేనమృతే మహత్
అస్మాన్ బలవతో జ్ఞాత్వా న యతిష్యంతి దుర్బలాః.
ఇహాగతేషు వా తేషు నిదేశవశవర్తిషు
ప్రవర్తిష్యామహే రాజన్ యథాశాస్త్రం నిబర్హణం.
అథవా దర్శనీయాభిః ప్రమదాభిర్విలోభ్యతాం
ఏకైకస్తత్ర కౌంతేయస్తతః కృష్ణా విరజ్యతాం.
ప్రేష్యతాం చైవ రాధేయస్తేషామాగమనాయ వై
తైస్తైః ప్రకారైః సంనీయ పాత్యంతామాప్తకారిభిః
ఏతేషామప్యుపాయానాం యస్తే నిర్దోషవాన్ మతః
తస్య ప్రయోగమాతిష్ఠ పురా కాలోఽతివర్తతే.
యావద్ధ్యకృతవిశ్వాసా ద్రుపదే పార్థివర్షభే
తావదేవ హి తే శక్యా న శక్యాస్తు తతః పరం.
ఏషా మమ మతిస్తాత నిగ్రహాయ ప్రవర్తతే
సాధ్వీ వా యది వాసాధ్వీ కిం వా రాధేయ మన్యసే

200 వ అధ్యాయము సమాప్తం

మానసపాత్రులో పాంచాలురూ అంతే. పాండవులు జీవించి ఉండడమేకాక బలసంపన్నులతో బాంధవ్యమూ మైత్రీ సాధించుకుంటున్నారు. నాకు చాలా ఆనందంగా ఉంది— అని అంటూండగా విదురుడు మహారాజా! నీబుద్ధిలో ఈఊహ చిరస్థాయిగా ఉండుగాక అని స్వగృహానికి వెళ్ళాడు.

అనంతరం కర్ణదుర్యోధనాదులు సమీపించి మహారాజా! విదురుని ఎదురుగా మేము నీదోషాల్ని ఎత్తి చూపలేకపోయాము. మీ మాటలనుపట్టి చూస్తే మీరు శత్రువుల అభ్యున్నతినే కోరుతూన్నట్లు కనిపిస్తోంది. మనం చెయ్యవలసింది ఒకటైతే మీరు వేరుదారిలో ఉన్నారు. పాండవసర్వనాశనమే మన కర్తవ్యం. వారివల్ల మన మేవిధమైన నష్టాన్ని పొందకుండా మనకార్యం నెరవేరాలి— అన్నారు.

199 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందలవ అధ్యాయము

మీరిద్దరూ ఏంచేయదలచుకుంటే నేనూ అదే చేద్దామనుకుంటున్నాను. అయితే విదురుడు నన్ను ఏవిధంగానూ అనుమానించటానికి వీలులేకుండా ఆ సమయంలో పాండవులను ప్రశంసిస్తూంటాను. నా బాహ్యలక్షణాలు కానీ సంభాషణలుకానీ అనుమానాస్పదాలు కాకూడదు. అంతే. మీరు చెయ్యదలచుకున్న దేమిటో చెప్పండి— అన్నాడు ధృతరాష్ట్రుడు.

మహారాజా! మనం కొందరు బ్రాహ్మణులద్వారా ఈకార్యం సాధించాలి. కుంతీపుత్రులకూ మాద్రినందనులకూ మధ్య విభేదాలు కలిగించాలి. లేదా ద్రుపదునికి ధనప్రలోభం కలిగించి మన చేతుల్లో ఉంచుకోవాలి. తన్మూలంగా ద్రుపదుడు వారిని వెడలగొట్టాలి. అదీ సాధ్యంకాకపోతే పాండవులకు పాంచాలం విడిచిపెట్టకూడదనే అభిప్రాయం కలిగించాలి. హస్తినాపురంలో ఉండడం క్షేమంకాదనీ చెప్పాలి. అందువల్ల వారు ఇటురారు. బుద్ధికుశలులయిన మనుష్యులద్వారా పాండవులలో విద్వేషాలు కలిగించాలి.

ద్రౌపదికే భర్తలమీద అనురాగం సన్నగిల్లజేయడంకూడా సులభమే. అనేకపతులుండడం వల్ల ఈకార్యం అసాధ్యం కాదు. రహస్యంగా భీమసేనుని హతమార్చాలి. ఆ మహాబలిష్ఠుని నమ్ముకుని గదా వారు మనశక్తిని తృణీకరిస్తున్నారు. వాని మరణంతో పాండవుల బలమూ ఉత్సాహమూ నీరసిస్తాయి. వారికి రాజ్యకాంక్షకూడా ఉండదు. భీముడు లేని అర్జునుడు కర్ణునిముందు తృణప్రాయుడు.

ఇవేవీ కొనసాగకపోతే వారిని ఇక్కడే మన అధీనంలో ఉంచితే నీతిశాస్త్రాన్ని అనుసరించి ఆఉపాయాలతో వారికి ఈలోకంనుంచి విముక్తి కలిగించవచ్చు. పరమసౌందర్యరమణులతో పాండవులకు బంధం ఏర్పరచి ద్రౌపదికి విరక్తి కలిగించాలి. కర్ణుని పంపి పాండవులను రప్పించి విశ్వసనీయులైన వారిని నియోగించి చంపించాలి.

## రెండువందల ఒకటవ అధ్యాయం

దుర్యోధన తవ ప్రజ్ఞా న సమ్యగితి మే మతిః
న హ్యుపాయేన తే శక్యాః పాండవాః కురువర్ధన.
పూర్వమేవ హి తే సూక్ష్మైరుపాయైర్యతితాస్త్వయా
నిగ్రహీతుం తదా వీర న చైవ శకితాస్త్వయా.
ఇహైవ వర్తమానాస్తే సమీపే తవ పార్థివ
అజాతపక్షాః శిశవః శకితా నైవ బాధితుం.
జాతపక్షాః విదేశస్థా వివృద్ధాః సర్వశోఽద్య తే
నోపాయసాధ్యాః కౌంతేయా మమైషా మతిరచ్యుత.
న చ తే వ్యసనైర్యోక్తుం శక్యా దిష్టకృతేన చ
శకితాశ్చేప్సవశ్చైవ పితృపైతామహం పదం.
పరస్పరేణ భేదశ్చ నాధాతుం తేషు శక్యతే
ఏకస్యాం యే రతాః పత్న్యాం న భిద్యంతే పరస్పరం.
న చాపి కృష్ణా శక్యేత తేభ్యో భేదయితుం పరైః
పరిద్యూనాన్ వృతవతీ కిముతాద్య మృజావతః.
ఈప్సితశ్చ గుణః స్త్రీణామేకస్యా బహుభర్తృతా
తం చ ప్రాప్తవతీ కృష్ణా న సా భేదయితుం క్షమా.
ఆర్యవ్రతశ్చ పాంచాల్యో న స రాజా ధనప్రియః
న సంత్యక్ష్యతి కౌంతేయాన్ రాజ్యదానైరపి ధ్రువం
యథాస్య పుత్రో గుణవాననురక్తశ్చ పాండవాన్
తస్మాన్నోపాయసాధ్యాంస్తానహం మన్యే కథంచన.
ఇదం త్వద్య క్షమం కర్తుమస్మాకం పురుషర్షభ
యావన్న కృతమూలాస్తే పాండవేయా విశాంపతే.
తావత్ ప్రహరణీయాస్తేతత్ తుభ్యంతాతరోచతాం
అస్మత్పక్షో మహాన్ యావద్యావత్ పాంచాలకో లఘుః
తావత్ ప్రహరణంతేషాం క్రియతాంమావిచారయ.
వాహనాని ప్రభూతాని మిత్రాణి చ కులాని చ
యావన్న తేషాం గాంధారే తావద్ విక్రమ పార్థివ.
యావచ్చ రాజా పాంచాల్యో నోద్యమే కురుతేమనః
సహ పుత్రైర్మహావీర్యైస్తావద్ విక్రమ పార్థివ.
యావన్నాయాతి వార్ష్ణేయఃకర్షన్ యాదవవాహినీం
రాజ్యార్థే పాండవేయానాం పాంచాల్యసదనం ప్రతి.
వసూని వివిధాన్ భోగాన్ రాజ్యమేవ చ కేవలం
నాత్యాజ్యమస్తి కృష్ణస్య పాండవార్థే కథంచన.
విక్రమేణ మహీ ప్రాప్తా భరతేన మహాత్మనా
విక్రమేణ చ లోకాంస్త్రీన్జితవాన్ పాకశాసనః.
విక్రమం చ ప్రశంసంతి క్షత్రియస్య విశాంపతే
స్వకో హి ధర్మః శూరాణాం విక్రమః పార్థివర్షభ.
తే బలేన వయం రాజన్ మహతా చతురంగిణా
ప్రమథ్య ద్రుపదం శీఘ్రమానయామేహ పాండవాన్.
న హి సామ్నా న దానేన న భేదేన చ పాండవాః
శక్యాః సాధయితుంతస్మాద్విక్రమేణైవ తాన్ జహి.
తాన్ విక్రమేణ జిత్వేమామఖిలాం భుంక్ష్వ మేదినీం
అతో నాన్యం ప్రపశ్యామి కార్యోపాయం జనాధిప.
శ్రుత్వాతురాధేయవచోధృతరాష్ట్రః ప్రతాపవాన్
అభిపూజ్య తతః పశ్చాదిదం వచనమబ్రవీత్.
ఉపపన్నం మహాప్రాజ్ఞే కృతాస్త్రే సూతనందనే
త్వయి విక్రమసంపన్నమిదం వచనమీదృశం.
భూయ ఏవ తు భీష్మశ్చ ద్రోణో విదుర ఏవ చ
యువాంచకురుతంబుద్ధింభవేద్యానః సుఖోదయా.
తత ఆనాయ్య తాన్ సర్వాన్ మంత్రిణః సుమహాయశాః
ధృతరాష్ట్రో మహారాజ మంత్రయామాస వై తదా.

201 వ అధ్యాయం సమాప్తం

ఇందులో ఏది దోషరహితమైనదో దానినే అనుసరిద్దాము. ద్రుపదుడికి పాండవులమీద సంపూర్ణ విశ్వాసం ఏర్పడకుండానే మనం మన కార్యక్రమం ఆరంభించాలి. కాలం గడిచేకొద్దీ వారికి బంధం పెరుగుతుంది. అప్పుడు మనకు మరీ కష్టం కలుగుతుంది. శత్రువులను సాధించే ఉపాయాలన్నీ నాబుద్ధిలోకి వచ్చినవి మీకు చెప్పాను. వాని మంచిచెడ్డలు మీరే నిర్ణయించండి. కర్ణుడుకూడా తన అభిప్రాయాలు చెప్తాడు—అని దుర్యోధనుడు ప్రసంగం ముగించాడు.

200 వ అధ్యాయము సమాప్తము

## రెండువందల ఒకటవ అధ్యాయము

దుర్యోధనుని ఆలోచన లేమీ కర్ణునికి నచ్చలేదు. అవన్నీ ఆచరణయోగ్యంకాని ఊహలుగానే గోచరించాయి. అప్పుడు తన ఊహలు వివరించటం ఆరంభించాడు.

కురువంశవర్ధనా! నీ ఆలోచనలలో ఔచిత్యం లేదు. ఇదివరలో నువ్వు ఇటువంటి ఆలోచనలు సాగించి వానిని ఆచరించి విఫలుడయ్యావు. వారు బాలురుగా ఉన్ననాడు వారికి కేవిధమైన సాహాయ్యమూ లేనినాడు నువ్వీయుపాయాలు ప్రయోగించి ప్రయోజనం పొందలేకపోయావు. ఇప్పుడా—వారు నీఅధీనంలో లేరు. వారి బలమూ—పెరిగింది. అయినా నువ్వు నాటి ఆలోచనలే సాగిస్తున్నావు. అది ప్రయోజనం లేదు. అదృష్టం వారి వెంట నంటి ఉంది. పితృపైతామహమైన రాజ్యం పొందాలనే వాంఛ వారిలో ప్రబలమైంది.

వారిలో వారికి విభేదాలు కలిగించాలని కదా నువ్వు అంటున్నావు. అది అసంభవం. అయిదుగురు అన్నదమ్ములూ ఒకేభార్యయందు అనురక్తులై ఉన్నారంటే వారిని విడదీయటం మనతరం కాదు. ద్రౌపదినికూడా విరక్తను చెయ్యలేము. భిక్షాటనంతో జీవించే సమయంలోనే వారి నామె వరించింది. ఇప్పుడు వారు సర్వైశ్వర్యయుతులై స్వచ్ఛ సుందరాకారాలతో ఉన్నారు. ఇక ఆమె మనస్సు మారటం ఎలా. స్త్రీకి సహజంగా బహుపురుషాభిలాష ఉంటుంది. అది ద్రౌపదికి శాస్త్రబద్ధంగానే లభించింది.

ఉత్తమగుణనియమాలు కల ద్రుపదునిలో ధనప్రలోభం కలిగించటం మన తరంకాదు. నువ్వు నీరాజ్యాన్నిచ్చినా ద్రుపదుడు పాండవులను వీడడు. ధృష్టద్యుమ్నుడు పాండవులయందు అనురక్తుడే కద. ఈ కారణాలచేత నీఆలోచనలవల్లనే కార్యసాధన కాదని చెపుతున్నాను.

కాగా పోగా మనకు ఒకేఒక్క—మార్గం ఉన్నది. బహుశః నేను చెప్పబోయే అభిప్రాయంతో నువ్వు కూడా ఏకీభవించగలవని నమ్ముతున్నాను. అదే మంటే పాంచాలుడు బలాన్ని సమకూర్చుకోకుండా ఉన్ననాడే పాండవులు తమ రాజ్యాన్ని స్వాధీనం చేసుకోకుండా ఉన్ననాడే వారు తమ మిత్రమండలిని పెంచుకోకుండానే మనం మన బలంతో వారిని ఆక్రమించాలి. ద్రుపదుడు తన వీరపుత్రులతో మనమీద దాడి చెయ్యకుండానే శ్రీకృష్ణుడు వృష్ణి వంశసేనతో పాంచాలంచేరి పాండవులకు రాజ్యం

## రెండువందల రెండవ అధ్యాయము

న రోచతే విగ్రహో మే పాండుపుత్రైః కథంచన.
యథైవ ధృతరాష్ట్రో మే తథా పాండురసంశయం.
గాంధార్యాశ్చ యథా పుత్రాస్తథా కుంతీసుతా మమ
యథా చ మమ తే రక్ష్యా ధృతరాష్ట్ర తథా తవ.
యథా చ మమ రాజ్ఞశ్చ తథా దుర్యోధనస్య తే
తథా కురూణాం సర్వేషామన్యేషామపి పార్థివ.
ఏవం గతే విగ్రహం తైర్న రోచే
సంధాయ వీరైర్దీయతామర్థభూమిః
తేషామపీదం ప్రపితామహానాం
రాజ్యం పితుశ్చైవ కురూత్తమానాం.
దుర్యోధన యథా రాజ్యం త్వమిదం తాత పశ్యసి
మమ పైతృకమిత్యేవం తేఽపి పశ్యంతి పాండవాః
యది రాజ్యం న తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః
కుత ఏవ తవాపీదం భారతస్యాపి కస్యచిత్ .
అధర్మేణ చ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ
తేఽపి రాజ్యమనుప్రాప్తాః పూర్వమేవేతి మే మతిః.
మధురేణైవ రాజ్యస్య తేషామర్థం ప్రదీయతాం
ఏతద్ధి పురుషవ్యాఘ్ర హితం సర్వజనస్య చ.
అతోఽన్యథా చేత్ క్రియతే న హితం నో భవిష్యతి
తవాప్యకీర్తిః సకలా భవిష్యతి న సంశయః.
కీర్తిరక్షణమాతిష్ఠ కీర్తిర్హి పరమం బలం
నష్టకీర్తేర్మనుష్యస్య జీవితం హ్యఫలం స్మృతం.
యావత్కీర్తిర్మనుష్యస్య న ప్రణశ్యతి కౌరవ
తావజ్జీవతి గాంధారే నష్టకీర్తిస్తు నశ్యతి.
తమిమం సముపాతిష్ఠ ధర్మం కురుకులోచితం
అనురూపం మహాబాహో పూర్వేషామాత్మనః కురు.
దిష్ట్యా ధ్రియంతే పార్థా హి దిష్ట్యా జీవతి సా పృథా
దిష్ట్యా పురోచనః పాపో నసకామోఽత్యయం గతః.
యదా ప్రభృతి దగ్ధాస్తే కుంతీభోజసుతాసుతాః
తదా ప్రభృతి గాంధారే న శక్నోమ్యభివీక్షితుం.
లోకే ప్రాణభృతాం కంచిచ్ఛ్రుత్వా కుంతీం తథాగతాం
న చాపి దోషేణ తథా లోకో మన్యేత్ పురోచనం
యథా త్వాం పురుషవ్యాఘ్ర లోకో దోషేణ గచ్ఛతి.
తదిదం జీవితం తేషాం తవ కిల్బిషనాశనం
సమ్మంతవ్యం మహారాజ పాండవానాం చ దర్శనం.
న చాపి తేషాం వీరాణాం జీవతాం కురునందన
పిత్ర్యోంఽశః శక్య ఆదాతుమపి వజ్రభృతా స్వయం
తే సర్వేఽవస్థితా ధర్మే సర్వే చైవైకచేతసః
అధర్మేణ నిరస్తాశ్చ తుల్యే రాజ్యే విశేషతః.
యది ధర్మస్త్వయా కార్యో యది కార్యం ప్రియం చ మే
క్షేమం చ యది కర్తవ్యం తేషామర్థం ప్రదీయతాం.

202 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల మూడవ అధ్యాయము

మంత్రాయ సముపానీతైర్ధృతరాష్ట్రహితైర్నృప
ధర్మ్యమర్థ్యం యశస్యం చ వాచ్యమిత్యనుశుశ్రుమ.
మమాప్యేషా మతిస్తాత యా భీష్మస్య మహాత్మనః
సంవిభజ్యాస్తు కౌంతేయా ధర్మ ఏష సనాతనః.
ప్రేష్యతాం ద్రుపదాయాశు నరః కశ్చిత్ ప్రియంవదః
బహుళం రత్నమాదాయ షామర్థాయ భారత.
మిథః కృత్యం చ తస్మై స ఆదాయ వసు గచ్ఛతు
వృద్ధిం చ పరమాం బ్రూయాత్

ఇప్పించే యత్నం చేయకుండానే మనం కృషి సాగించాలి. భరతుడు పరాక్రమంతోనే పృథ్విని జయించాడు. దేవేంద్రుడూ తన బలంతోనే త్రిలోకాధిపతి అయాడు. పరాక్రమమే క్షత్రియులకు ప్రశస్తమార్గం. అదే శూరధర్మం. చతురంగ బలాలతో మనం వెళ్ళి ద్రుపదుని జయించి పాండవులను బంధించి తీసికొని రావాలి. సామ దాన భేదాలతో మనం వారిని సాధించలేము. నేను చెప్పిన దారి వినా మరొకమార్గం లేదు. కనక ఈకార్యక్రమంతో పాండవులను జయించి రాజ్య భోగాలనుభవించు అన్నాడు కర్ణుడు.

కర్ణుని మాటలు ధృతరాష్ట్రునికి ఆనందం కలిగించాయి. కర్ణుని అభినందించి— కర్ణా! నువ్వు శాస్త్రాస్త్రవిదుడవేకాక పరమధీమంతుడవు. సూతకులానందవర్ధకుడవైన నువ్వు సముచితపథం నిర్దేశించావు. అయితే భీష్మ ద్రోణ విదురులతో కూడా సంప్రదించి మీరు యుక్తమార్గం ఆలోచించండి—అని వారి నందరినీ మంత్రిమండలితో సహా సమావేశపరచి సమాలోచన సాగించ నారంభించాడు.

201 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల రెండవ అధ్యాయము

భీష్ముడు

పాండవులూ ధార్తరాష్ట్రులూ నాకు సమానులే. వారిని రక్షించినట్లే వీరినీ రక్షించాలి. నాకేకాదు ధృతరాష్ట్రా! ఈభారం నీకూ అంతే. నువ్వు దుర్యోధనాదులను చూసుకొన్నట్లే పాండవులనూ చూచుకోవాలి. ఎలాచూచినా పాండవులతో యుద్ధానికి నే నంగీకరించను. వారితో సంధి చేసికొని అర్ధరాజ్యం వారికివ్వటమే ఉభయులకూ శ్రేయస్కరం.

దుర్యోధనా! ఇది నీకు పితృపైతామహమైనట్లే వారికీనీ. ఈరాజ్యాధికారం పాండవులకు ప్రాప్తించకపోతే భరతవంశీయులకే ప్రాప్తించదన్నమాట. అధర్మమార్గాన నువ్వు ఈరాజ్యాన్ని సాధించావు. కానీ నీకన్న ముందుగానే వారికి దీనిమీద అధికారం వచ్చింది. ఇప్పుడు నువ్వు విద్వేషాలు పెంచక సౌహార్దంతో వారి రాజ్యం వారి కియ్యి. అలా కాకపోతే మనకు కీడు ప్రాప్తిస్తుంది. నీకు అపకీర్తి లభిస్తుంది. కీర్తి పోవడంకంటె మానవుడికి అవమానకరమైనది లేదు. కీర్తిలేనివాడు మృతకల్పుడు. నువ్వు నీ పూర్వులు పోయిన దారినే పోయి కురుకులఖ్యాతిని రక్షించు.

కుంతీసహితులై పాండవులు జీవించి ఉండటం ఎంత ఆనందదాయకమైన విషయం. పాపాత్ముడైన పురోచనుడికి యోగ్యమైన ప్రాయశ్చిత్తం జరిగింది. వారందరూ లాక్షాగృహంలో దగ్ధమయారని విన్నది మొదలు నేను తలయెత్తుకు తిరగలేకపోతున్నాను. ఆ సంఘటనలో ప్రజలు పురోచనుని కంటె నిన్నే దోషిగా నిర్ణయించుకున్నారు. ఇప్పుడు వారు సజీవులుగా ఉండటంవల్ల నీకళంకం మాసిపోతుంది. మరొకవిషయం— వారి కంఠంలో ప్రాణం ఉండగా పైతృక రాజ్యాన్ని దేవేంద్రుడు కూడా హరించలేడని మరచిపోకు. అయినగానీ

త్వత్సంయోగోద్భవాం తథా.
సంప్రీయమాణం త్వాం బ్రూయాద్ రాజన్
దుర్యోధనం తథా
అసకృద్ ద్రుపదే చైవ ధృష్టద్యుమ్నే చ భారత.
ఉచితత్వం ప్రియత్వం చ యోగస్యాపి చ వర్ణయేత్
పునః పునశ్చ కౌంతేయాన్ మాద్రీపుత్రౌ చ
సాంత్వయన్.
హిరణ్మయాని శుభ్రాణి బహూన్యాభరణాని చ
వచనాత్ తవ రాజేంద్ర ద్రౌపద్యాః సంప్రయచ్ఛతు
తథా ద్రుపదపుత్రాణాం సర్వేషాం భరతర్షభ
పాండవానాంచసర్వేషాంకుంత్యాయుక్తానియానిచ.
ఏవం సాంత్వసమాయుక్తం ద్రుపదంపాండవైః సహ
ఉక్త్వా సోఽనంతరం బ్రూయాత్
తేషామాగమనం ప్రతి.
అనుజ్ఞాతేషు వీరేషు బలం గచ్ఛతు శోభనం
దుఃశాసనో వికర్ణశ్చాప్యానేతుం పాండవానిహ.
తతస్తే పాండవాఃశ్రేష్ఠాఃపూజ్యమానాఃసదాత్వయా
ప్రకృతీనామనుమతే పదే స్థాస్యంతి పైతృకే.
ఏతత్ తవ మహారాజ పుత్రేషు తేషు చైవ హి
వృత్తమౌపయికం మన్యే భీష్మేణ సహ భారత.
యోజితావర్థమానాభ్యాం సర్వకార్యేష్వనంతరౌ
న మంత్రయేతాం త్వచ్ఛ్రేయః కిమద్భుతతరం తతః.
దుష్టేన మనసా యో వై ప్రచ్ఛన్నేనాంతరాత్మనా
బ్రూయాన్నిఃశ్రేయసం నామ కథం కుర్యాత్
సతాం మతం.
న మిత్రాణ్యర్థకృచ్ఛ్రేషు శ్రేయసే చేతరాయ వా
విధిపూర్వం హి సర్వస్య దుఃఖంవాయదివాసుఖం.
కృతప్రజ్ఞోఽకృతప్రజ్ఞో బాలో వృద్ధశ్చ మానవః
ససహాయోఽసహాయశ్చ సర్వం సర్వత్ర విందతి.
శ్రూయతే హి పురా కశ్చిదంబువీచ ఇతీశ్వరః
ఆసీద్ రాజగృహేరాజామాగధానాంమహీక్షితాం.
స హీనః కరణైః సర్వైరుచ్ఛ్వాసపరమో నృపః
అమాత్యసంస్థః సర్వేషు కార్యేష్వేవాభవత్ తదా.
తస్యామాత్యో మహాకర్ణిర్బభూవైకేశ్వరస్తదా
స లబ్ధబలమాత్మానం మన్యమానోఽవమన్యతే.
స రాజ్ఞ ఉపభోగ్యాని స్త్రియో రత్నధనాని చ
ఆదదే సర్వశో మూఢ ఐశ్వర్యం చ స్వయం తదా.
తదాదాయ చ లుబ్ధస్య లోభాల్లోభోఽభ్యవర్ధత
తథా హి సర్వమాదాయ రాజ్యమస్య జిహీర్షతి.
హీనస్య కరణైః సర్వైరుచ్ఛ్వాసపరమస్య చ
యతమానోఽపి తద్రాజ్యం న శశాకేతి నః శ్రుతం
కిమన్యద్ విహితా నూనం తస్య సా పురుషేంద్రతా
యది తే విహితం భవిష్యతి విశాంపతే.
మిషతః సర్వలోకస్య స్థాస్యతే త్వయి తద్ ధ్రువం
అతోఽన్యథాచేద్ విహితం యతమానోనలప్స్యసే.
ఏవం విద్వన్నుపాదత్స్వ మంత్రిణాం సాధ్వసాధుతాం
దుష్టానాం చైవ బోద్ధవ్యమదుష్టానాం చ భాషితం.
విద్మ తే భావదోషేణ యదర్థమిదముచ్యతే
దుష్ట పాండవహేతోస్త్వం దోషమాఖ్యాపయస్యుత.
హితం తు పరమం కర్ణ బ్రవీమి కులవర్ధనం
అథత్వంమన్యసేదుష్టం బ్రూహియత్ పరమంహితం
అతోఽన్యథాచేత్ క్రియతేయద్ బ్రవీమిపరంహితం
కురవో వై వినంక్ష్యంతి నచిరేణైవ మే మతిః.

203 వ అధ్యాయం సమాప్తం.

ఒకటేదారి సుమా. నువ్వు అధర్మంగా వారిని వెళ్ల గొట్టావు. రాజ్యంమీద సమానాధికారం ఉన్న వారికి అర్థరాజ్యం ఇచ్చి ధర్మంగా నడిచి నాకు సంతోషం కలిగించి నీ శ్రేయస్సును కాపాడుకో— అన్నాడు కురుపితామహుడు.

202 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల మూడవఅధ్యాయము

ద్రోణుడు

సమాలోచన ఆహూతులై వచ్చిన హితవాదులు ధర్మార్థ యశోమార్గాలు పరిశీలించి మరీ మాట్లాడాలి. పాండవులకు రాజ్యభాగ్యం ఇవ్వాలని గాంగేయుడు చెప్పిన అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. ప్రియవాక్యకుశలుని దూతను ఆస్థానానికి పంపించాలి. ఇంటికోడలికి రత్నమాణిక్యాలు కానుకగా పంపించాలి. ద్రుపదుని సంబంధంవల్ల మనకెంతో ఆనందం కలిగిందని చెప్పాలి. ఈ వివాహంవల్ల సమస్త కళ్యాణాలూ సమకూడతాయని పాండవులకు చెప్పాలి.

ద్రౌపదికీ ఆమె బంధువులకూ కుంతికీ పాండవులకూ సువర్ణాభరణాంబరాలు పంపే ఏర్పాట్లు చెయ్యండి. ద్రుపదునితో సముచితంగా సంభాషించి పాండవులను హస్తినాపురం తీసుకు రావాలి. ద్రుపదుడు అంగీకరించాక దుశ్శాసనవికర్ణులు సేనా సమేతంగా వెళ్ళి స్వాగతం పలికి తీసికొని రావాలి. వారిని ఇక్కడ ఆదరాభిమానాలతో ప్రజాభిమతానుసారం అర్ధరాజ్యాధిపతులను చెయ్యాలి. నీకుమారులవలెనే వారినీ చూసుకోవాలని భీష్ముడు చెప్పనే చెప్పాడు గదా— అని ద్రోణాచార్యులనగా కర్ణుడు తన అభిప్రాయం వెలిబుచ్చుతున్నాడు.

మహారాజా! భీష్మద్రోణులను మీరుసదాసన్మానిస్తూనే ఉన్నారు. మీ అంతరంగిక మంత్రిమండలిలో వారికి ప్రముఖస్థానం ఇచ్చారు. ఇన్ని చేస్తున్నా వారు మీ శ్రేయస్సును ఎంతమాత్రం ఆలోచించటం లేదు. వారి అంతఃకరణ దుర్భావాలతో నిండి ఉంది. వారిమీదనే మీకు అపారమైన విశ్వాసం. వారివల్ల మీకు ప్రియం జరగదు. క్లిష్ట పరిస్థితులు ఏర్పడితే మిత్రులైనా ఏమీ చెయ్యలేరు. సుఖదుఃఖాలు అదృష్టానుసారమే ప్రాప్తిస్తాయి. మానవుని మూర్ఖత్వం కాని ప్రజ్ఞశక్తికానీ బాల్యం కానీ వార్ధక్యం కానీ దేనికీ కారణం కాదు. సహాయుడైనా నిస్సహాయుడైనా దైవనిర్ణయానుసారం ఫలానుభూతి పొందుతాడు.

పూర్వకాలంలో రాజగృహాన్ని మగధవంశీయుడైన రాజు పాలిస్తూ ఉండేవాడు. అతని ఆరోగ్యం భ్రష్టమై అవయవాలన్నీ పనిచేయటం మానేశాయి. అతను ఏపనికయినా మంత్రి మీదనే ఆధారపడేవాడు. అతని మంత్రి మహాకర్ణి తానే రాజుగా సైన్యాన్ని అదుపులోఉంచుకొని పాలించ సాగాడు. మహారాజుని అవహాసిస్తూ ఉండేవాడు. ఆమంత్రి రాజోపభోగ్యమైన స్త్రీ ధనరత్నాలను కూడా అనుభవించేవాడు. సమస్త సంపదలూ హరించినా అతని లోభం తృప్తిపడక రాజ్యాన్నే

## రెండువందల నాల్గవ అధ్యాయము

రాజన్ నిఃసంశయం శ్రేయో వాచ్యస్త్వమసి బాంధవైః
న త్వశుశ్రూషమాణే వై వాక్యం సంప్రతితిష్ఠతి.
ప్రియంహితంచ తద్ వాక్యముక్తవాన్కురుసత్తమః
భీష్మః శాంతనవో రాజన్ ప్రతిగృహ్ణాసి తన్న చ.
తథా ద్రోణేన బహుధా భాషితం హితముత్తమం
తచ్చ రాధాసుతః కర్ణో మన్యతే న హితం తవ.
చింతయంశ్చ న పశ్యామి రాజంస్తవ సుహృత్తమం
ఆభ్యాం పురుషసింహాభ్యాం యో వా స్యాత్ ప్రజ్ఞయాధికః.
ఇమా హి వృద్ధా వయసా ప్రజ్ఞయా చ శ్రుతేన చ
సమాచ త్వయి రాజేంద్ర తథా పాండుసుతేషు చ.
ధర్మే చానవరా రాజన్ సత్యతాయాం చ భారత
రామాద్ దాశరథేశ్చైవ గయాచ్చైవనసంశయః
న చోక్తవంతాశ్రేయః పురస్తాదపి కించన
న చాప్యపకృతం కించిదనయోర్లక్ష్యతే త్వయి.
తావుభౌ పురుషవ్యాఘ్రావనాగసి నృపే త్వయి
నమంత్రయేతాత్వచ్ఛ్రేయః కథం సత్యపరాక్రమౌ.
ప్రజ్ఞావంతౌ నరశ్రేష్ఠావస్మింల్లోకే నరాధిప
త్వన్నిమిత్తమతో నేమౌ కించిజ్జిహ్మం వదిష్యతః
ఇతి మే నైష్ఠికీ బుద్ధిర్వర్తతే కురునందన
న చార్థహేతోర్ధర్మజ్ఞౌ వక్ష్యతః పక్షసంశ్రితం.
ఏతద్ధి పరమం శ్రేయో మన్యేహం తవ భారత
దుర్యోధనప్రభృతయః పుత్రా రాజన్ యథా తవ.
తథైవ పాండవేయాస్తే పుత్రా రాజన్ న సంశయః
తేషు చేదహితం కించిన్మంత్రయేయురతద్విదః.
మంత్రిణస్తే న చ శ్రేయః ప్రపశ్యంతి విశేషతః
అథ తే హృదయే రాజన్ విశేషః స్వేషు వర్తతే.
అంతరస్థం వివృణ్వానాః శ్రేయః కుర్యుర్న తేధ్రువం
ఏతదర్థమిమౌ రాజన్ మహాత్మానౌ మహాద్యుతీ
నోచతుర్వివృతం కించిన్న హ్యేష తవ నిశ్చయః.
యచ్చాప్యశక్యతాం తేషామాహతుః పురుషర్షభౌ
తత్ తథా పురుషవ్యాఘ్ర తవ తద్ భద్రమస్తు తే.
కథం హి పాండవః శ్రీమాన్ సవ్యసాచీ ధనంజయః
శక్యో విజేతుం సంగ్రామే రాజన్ మఘవతాపి హి.
భీమసేనో మహాబాహుర్నాగాయుతబలో మహాన్
కథం స్మ యుధి శక్యేత విజేతుమమరైరపి.
తథైవ కుంతినౌ యుద్ధే యమౌ యమసుతావివ
కథం విజేతుం శక్యౌ తౌ రణే జీవితుమిచ్ఛతా.
యస్మిన్ ధృతిరనుక్రోశః క్షమా సత్యం పరాక్రమః
నిత్యాని పాండవే జ్యేష్ఠే స జీయేత రణే కథం.
ఏషాం పక్షధరో రామో ఏషాం మంత్రీ జనార్దనః
కిం ను తైరజితక సంఖ్యే ఏషాం పక్షే చ సాత్యకిః.
ద్రుపదః శ్వశురో ఏషాం ఏషాం శ్యాలాశ్చపార్షతాః
ధృష్టద్యుమ్నముఖావీరా భ్రాతరో ద్రుపతాత్మజాః.
సోఽశక్యతాం చ విజ్ఞాయ తేషామగ్రే చ భారత
దాయాద్యతాం చ ధర్మేణ సమ్యక్ తేషుసమాచర.
ఇదం నిర్దిష్టమయశః పురోచనకృతం మహత్
తేషామనుగ్రహేణాద్య రాజన్ ప్రక్షాళయాత్మనః.
తేషామనుగ్రహశ్చాయం సర్వేషాం చైవ న కులే
జీవితం చ పరం శ్రేయః క్షత్రస్య చ వివర్ధనం.
ద్రుపదోఽపి మహాన్ రాజా కృతవైరశ్చ నః పురా
తస్య సంగ్రహణం రాజన్ స్వపక్షస్య వివర్ధనం.
బలవంతశ్చ దాశార్హా బహవశ్చ విశాంపతే
యతః కృష్ణస్తతః సర్వే యతః కృష్ణస్తతో జయః.
యచ్చ సామ్నైవ శక్యేత కార్యం సాధయితుం నృప
కో దైవశప్తస్తత్ కార్యం విగ్రహేణ సమాచరేత్
శ్రుత్వా చ జీవతః పార్థాన్ పౌరజానపదా జనాః

అపహరించ కోరింది. శ్వాసమాత్రశేషం జీవచ్ఛవంగా ఉన్న మహారాజు మంత్రిని కాదనలేకపోయేవాడు. అయినా అదృష్టం అతనివల్ల [illegible] రాజరికం మాత్రం కోలేదు. అందుచేత అదృష్టాన్ని ఏమి చేయ లేను.

ఈ రాజ్యాధికారం వీరి [illegible] అదృష్టంలోనే ఉన్నా మంచి దారి [illegible] ఎవరూ తీసికోలేదు. ఇలా శాస్త్రోక్త మీరు గ్రహించలేరు. ఈ విషయాలన్నీ [illegible] తెలుసుకొని. మీరు సర్వజ్ఞులు. మీ మంత్రుల మంచి సలహాల గ్రహించి వీరిలో [illegible] తెవరో సానుహృదయులెవరో నిర్ణయించుకోండి.

ఈ ప్రకారంగా కర్ణుడనగా ద్రోణుడు — ఓరి దుష్టుడా! నువ్వెలువంటి మాటలు ఎందుకు పలుకుతున్నావు. పాండవులమీద నీహృదయంలో ద్వేషం ఉండి ఇలా అనిపిస్తున్నది. నేను నా బుద్ధికుశలతతో ఉత్తమ మార్గాన్ని నిర్దేశించాను. అది నీ దృష్టికి దోషభూయిష్ఠంగా కనిపిస్తే హితకరమైన మార్గమేమిటో నువ్వే చెప్పు. నేను చెప్పినవిధానం కాక మరోదారిని పోయినా కౌరవులందరికీ నాశనం తప్పదనిమాత్రం మరిచిపోకు — అన్నాడు.

203 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల నాల్గవ అధ్యాయము

విదురుడు

భీష్మ ద్రోణ కర్ణుల ప్రసంగాలాకర్ణించిన మహానీతిశాలి విదురుడు ఇలా అంటున్నాడు — మహారాజా! తమమనస్సులో ఏవిధమైన శంకా సందేహమూ ఉండకుండా చేసే హితవు మీకు చెప్పటం బంధుజనుల కర్తవ్యం. అయితే వారి మాటలు వినాలనే ఊహ మీకు లేదు. కనక ఏం చెప్పినా ప్రయోజనం ఉండటం లేదు. కురువృద్ధుడైన శంతనపుత్రుడు ఆచార్య భీష్ముడు ప్రియమైన హితవు చెప్పాడు. అది మీకు రుచించలేదు. ద్రోణాచార్యులుకూడా మీహితవు కోరి పలికారు. అదీ మీచెవి కెక్కలేదు. కర్ణుడు వారి వాక్యాలలో హితవు లేదన్నాడు. ధీశక్తికీ ఆలోచనాపటిమను సహకరించుకొని మీకు శ్రేయోమార్గం నిర్దేశించిన ఈ ఇరువురు గురువృద్ధులకంటె మీకు స్నేహితులు లేని నేను ఘంటాపథంగా చెప్పుతున్నాను. శాస్త్రజ్ఞానమూ బుద్ధి శక్తి దాని నిశ్చలత కలవారు వీరు. అందులో వీరిని మించినవారు లేరు. వీరికి ధార్తరాష్ట్రులయందూ పాండవులయందూ సమానమైన భావం ఉన్నది. ధర్మసత్యపాలనలో వీరు శ్రీరామునికీ గయునికీ తీసిపోరు. వీరివల్ల మీకు అప్రియం ఎన్నడూ జరుగదు. వారు సదా మీ శ్రేయోభిలాషులు. మీరుకూడా ఎన్నడూ వీరిపట్ల అతిగా ప్రవర్తించలేదు. ఈస్థితిలో వీరు మీకు నష్టం కలిగే దారి చూపటం అసంభవం. కుటిలబుద్ధితో చరించవలసిన అవసరం వీరికి లేదు. స్వార్థదృష్టితో ఏ ఒకపక్షానికో ఉపయోగపడే దారి వారు త్రొక్కరు. అందుచేత వీరి సలహాను స్వీకరించడమే శ్రేయస్కరం.

దుర్యోధనాదులవలెనే పాండవులూ నీకు పుత్రులే. ఈ విషయం విస్మరించి నీ మంత్రులు

బలవద్ దర్శనే హ్యాస్తా స్తేషాం రాజన్ ప్రియం కురు
దుర్యోధనశ్చ కర్ణశ్చ శకునిశ్చాపి సౌబలః
అధర్మయుక్తే దుష్ప్రజ్ఞా బాలా మైషాం వచః కృథాః.
ఉక్తమేతద్ పురా రాజన్ మయా గుణవతస్తవ
దుర్యోధనాపరాధేన ప్రజేయం వై వినఙ్క్ష్యతి.

204 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల ఐదవ అధ్యాయం

భీష్మః శాంతనవో విద్వాన్ ద్రోణశ్చ భగవానృషిః
హితంచపరమం వాక్యం త్వంచసత్యం బ్రవీషిమాం
యథైవ పాండోస్తే వీరాః కుంతీపుత్రా మహారథా
తథైవ ధర్మతః సర్వే మమ పుత్రా న సంశయః.
యథైవ మమ పుత్రాణామిదం రాజ్యం విధీయతే
తథైవ పాండుపుత్రాణామిదం రాజ్యం న సంశయః
క్షత్తరానయగచ్ఛైతాన్ సహమాత్రాసు సత్కృతాన్
తథా చ దేవరూపిణ్యా కృష్ణయా సహ భారత.
దిష్ట్యా జీవంతి తే పార్థా దిష్ట్యా జీవతి సా పృథా
దిష్ట్యా ద్రుపదకన్యాం చ లబ్ధవంతో మహారథాః.
దిష్ట్యా వర్ధామహే సర్వే దిష్ట్యా శాంతః పురోచన
దిష్ట్యా మమ పరం దుఃఖమపనీతం మహాద్యుతే.
తతో జగామ విదురో ధృతరాష్ట్రస్య శాసనాత్
సకాశం యజ్ఞసేనస్య పాండవానాం చ భారత.
సముపాదాయ రత్నాని వసూని వివిధాని చ
ద్రౌపద్యాః పాండవానాం చ యజ్ఞసేనస్య చైవ హ.
తత్ర గత్వా స ధర్మజ్ఞః సర్వశాస్త్రవిశారదః
ద్రుపదంన్యాయతో రాజన్ సంయుక్తముపతస్థివాన్.
స చాపి ప్రతిజగ్రాహ ధర్మేణ విదురం తతః
చక్రతుశ్చ యథాన్యాయం కుశలప్రశ్నసంవిదం.
దదర్శ పాండవాంస్తత్ర వాసుదేవం చభారత
స్నేహాత్ పరిష్వజ్యసతాన్ పప్రచ్ఛానామయంతతః
తైశ్చాప్యమితబుద్ధిః సపూజితో హి యథాక్రమం
వచనాద్ ధృతరాష్ట్రస్య స్నేహయుక్తం పునః పునః.
పప్రచ్ఛానామయంరాజం స్తతస్తాన్ పాండునందనాన్
ప్రదదౌ చాపి రత్నాని వివిధాని వసూని చ.
పాండవానాంచకుంత్యాశ్చ ద్రౌపద్యాశ్చ విశాంపతే
ద్రుపదస్య చ పుత్రాణాం యథా దత్తాని కౌరవైః
ప్రోవాచ చామితమతిః ప్రశ్రితం వినయాన్వితః
ద్రుపదం పాండుపుత్రాణాం సంనిధౌ కేశవస్య చ.
రాజన్ శృణు సహామాత్యః సపుత్రశ్చ వచో మమ
ధృతరాష్ట్రః సపుత్రస్త్వాం సహామాత్యః సబాంధవః.
అబ్రవీత్ కుశలం రాజన్ ప్రీయమాణః పునః పునః
ప్రీతిమాంస్తే దృఢం చాపి సంబంధేన నరాధిప.
తథా భీష్మః శాంతనవః కౌరవైః సహ సర్వశః
కుశలం త్వాం మహాప్రాజ్ఞం సర్వతః పరిపృచ్ఛతి.
భారద్వాజో మహాప్రాజ్ఞో ద్రోణః ప్రియసఖస్తవ
సమాశ్లేషముపేత్య త్వాం కుశలం పరిపృచ్ఛతి.
ధృతరాష్ట్రశ్చ పాంచాల్య త్వయా
సంబంధమీయివాన్
కృతార్థంమన్యతేఽఽత్మానం తథాసర్వేఽపికౌరవాః.
న తథా రాజ్యసంప్రాప్తిస్తేషాం ప్రీతికరీ మతా
యథా సంబంధకం ప్రాప్య యజ్ఞసేన త్వయా సహ.
ఏతద్ విదిత్వాతుభవాన్ ప్రస్థాపయతుపాండవాన్
ద్రష్టుం హి పాండుపుత్రాశ్చ త్వరంతి కురవోభృశం.
విప్రోషితా దీర్ఘకాలమేతే చాపి నరర్షభాః

పాండవులకు అప్రియం కలిగించవలస్తే అది ఏవిధంగా నీకు కళ్యాణప్రద మవుతుందో అర్థంకావటం లేదు. మీకు పుత్రప్రేమ ప్రబలమైనా కే ప్రజలు దానికి సమాధానం చెప్తారు. ఈ మహా పురుషు లిద్దరూ ఇచ్చినసలహా సముచితమే అయినా దాన్ని మాత్రం మీరు అంగీకరించలేకపోతున్నారు. పాండవులు పురుషసింహాలని వీరు చెప్పినమాట నిజం. నీకు శుభ మగుగాక. సవ్యసాచిని ఎదిరించి నిలిచేశక్తి దేవేంద్రునికికూడా లేదు. పది వేల ఏనుగులబలం కల భీమసేనుని ముందు దేవతాలైన కూడా తలవాల్చవలసినదే. జీవితంమీద ఆశకల వాడెవడూ నకులసహదేవుల ఎదుట నిలబడలేడు. దయాధర్మక్షమాసత్యపరాక్రమాది సద్గుణసంపన్నుడైన ధర్మరాజుకి పరాజయం లేదు. బలరాముని హృదయమూ కృష్ణుని సహకారమూ సాత్యకి సాహాయ్యమూ కల పాండవులను ఓడించటం ఎవరి తరమూ కాదు. ఇన్నీ కాక వారికి ద్రుపదుడు బంధువయాడు. ధృష్టద్యుమ్నవీరుడు వారి అండ ఉండగా రణరంగంలో వారికి ఎదురు నిలవగల శక్తి ఎవరికీ లేదు.

పురోచనుడివల్ల జరిగిన దుర్మార్గ కార్యానికిమీ నెత్తిమీద అపఖ్యాతి వచ్చిపడింది. ఇప్పుడు మీరు సక్రమంగా వ్యవహరించి ఆ కళంకాన్ని కడుక్కోవాలి. పైగా వారికి రాజ్యాధికారం పైతృకమైనది. దానిని వారికివ్వటం ధర్మసమ్మతం. వారిపై మీరు అనుగ్రహించే అవకాశమే మీ కులవృద్ధికి అవస్యమైనది. సర్వక్షత్రియులకూ అదే శ్రేయోమార్గము.

ద్రుపదుడూ మనకు ప్రతిపక్షక్షత్రియుడైన వీరుడు. ఈనాడు వారితో జరిగిన ఈబాంధవ్యంవల్ల మనకు మేలు కలిగింది. యదువంశీయులసేన అసంఖ్యాకము. అవక్రపరాక్రమోపేతము. పైగా శ్రీ కృష్ణుడు వారి వాడు. ఈస్థితిలో విజయశ్రీ ఇటు రావటం అసంభవం. మహారాజా! ప్రశాంతంగా కార్యసాధనకు అవకాశం ఉంటే దైవోపహతుడైనవాడు తప్ప రణరంగంలోనే పరిష్కారం చేసికోనేవాడుండడు.

కుంతీపుత్రులు జీవించి ఉన్నారనే వార్త విని పౌరులూ జానపదులూ వారిని చూడాలని కుతూహలపడుతున్నారు. వారందరికీ సంతోషం కలిగించాలి. ఈ దుర్యోధన శకుని కర్ణులు మూర్ఖులు. గుణవంతులైన మీరు ఈ మూర్ఖుల అభిప్రాయాలు అంగీకరించి తన్మూలంగా ప్రజాక్షేమం నాశనం చేయకండి.

204 వ అధ్యాయము సమాప్తము

## రెండువందల ఐదవ అధ్యాయము

ధృతరాష్ట్రుడు

శంతనమహారాజనందనుడైన భీష్ముడు మహా జ్ఞాని. ఆచార్యద్రోణులు మహర్షి. వారి వాక్యాల కంటె హితకరమైనది లేదు. నీమాటలు కూడా పరమ సత్యాలు. పాండవులు నాకు పుత్రతుల్యులే. ఇది నాకుమారుల రాజ్యమైనట్లే పాండవుల రాజ్యముకూడా. అందుచేత నువ్వు వెళ్ళి కుంతినీ దేవతా రూపిణియైన ద్రౌపదినీ పాండవులనూ ఆదరంగా

ఉత్సుకా నగరం ద్రష్టుం భవిష్యంతి తథా పృథా.
కృష్ణామపి చ పాంచాలీం సర్వాః కురువరస్త్రియః
ద్రష్టుకామాః ప్రతీక్షంతే పురం చ విషయాశ్చ నః.
స భవాన్ పాండుపుత్రాణామాజ్ఞాపయతు మాచిరం
గమనం సహదారాణామేతదత్ర మతం మమ.
నిసృష్టేషు త్వయా రాజన్ పాండవేషు మహాత్మసు
తతోఽహం ప్రేషయిష్యామి ధృతరాష్ట్రస్య శీఘ్రగాన్
ఆగమిష్యంతి కౌంతేయాః కుంతీ చ సహ కృష్ణయా.

205 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల ఆరవ అధ్యాయము

ఏవమేతన్మహాప్రాజ్ఞ యథాఽఽత్థ విదురాద్య మాం
మమాపి పరమో హర్షః సంబంధేఽస్మిన్ కృతే ప్రభో.
గమనం చాపి యుక్తం స్యాద్ దృఢమేషాం మహాత్మనాం
న తు తావన్మయా యుక్తమేతద్ వక్తుం స్వయం గిరా.
యదా తు మన్యతే వీరః కుంతీపుత్రో యుధిష్ఠిరః
భీమసేనార్జునౌ చైవ యమౌ చ పురుషర్షభౌ.
రామకృష్ణౌ చ ధర్మజ్ఞౌ తదా గచ్ఛంతు పాండవాః
ఏతౌ హి పురుషవ్యాఘ్రావేషాం ప్రియహితే రతౌ.
పరవంతో వయం రాజంస్త్వయి సర్వే సహానుగాః
యథా వక్ష్యసి నః ప్రీత్యా తత్ కరిష్యామహే వయం.
తతోఽబ్రవీద్ వాసుదేవో గమనం రోచతే మమ
యథా వా మన్యతే రాజా ద్రుపదః సర్వధర్మవిత్.
యథైవ మన్యతే వీరో దాశార్హః పురుషోత్తమ.
ప్రాప్తకాలం మహాబాహుః సా బుద్ధిర్నిశ్చితా మమ
యథైవ హి మహాభాగాః కౌంతేయా మమ సాంప్రతం
తథైవ వాసుదేవస్య పాండుపుత్రా న సంశయః.
న తద్ ధ్యాయతి కౌంతేయః పాండుపుత్రో యుధిష్ఠిరః
యదైషాం పురుషవ్యాఘ్రః శ్రేయో ధ్యాయతి కేశవః.
పృథాయాస్తు తథా వేశ్మ ప్రవివేశ మహాద్యుతిః
పాదౌ స్పృష్ట్వా పృథాయాస్తు శిరసా చ మహీం గతః
దృష్ట్వా తు దేవరం కుంతీ శుశోచ చ ముహుర్ముహుః
వైచిత్రవీర్య తే పుత్రాః కథంచిజ్జీవితాస్త్వయా
త్వత్ప్రసాదాజ్జతుగృహే త్రాతాః ప్రత్యాగతాస్తవ.
కూర్మశ్చింతయతే పుత్రాన్ యత్ర వా తత్ర వా గతాన్
చింతయా వర్ధయేత్ పుత్రాన్ యథా కుశలినస్తథా.
తవ పుత్రాస్తు జీవంతి త్వం త్రాతా భరతర్షభ
యథా పరభృతః పుత్రానరిష్టా వర్ధయేత్ సదా.
తథైవ తవ పుత్రాస్తు మయా తాత సురక్షితాః
దుఃఖాస్తు బహవః ప్రాప్తాస్తథా ప్రాణాంతికా మయా
అతః పరం న జానామి కర్తవ్యం జ్ఞాతుమర్హసి
ఇత్యేవముక్త్వా దుఃఖార్తా శుశోచ పరమాతురా.
ప్రణిపత్యాబ్రవీత్ క్షత్తా మా శోచ ఇతి భారత
న వినశ్యంతి లోకేషు తవ పుత్రా మహాబలాః.
నచిరేణైవ కాలేన స్వరాజ్యస్థా భవంతి తే
బాంధవైః సహితాః సర్వైర్మా శోకం కురు మాధవి.
తతస్తే తమనుజ్ఞాతా ద్రుపదేన మహాత్మనా
పాండవాశ్చైవ కృష్ణశ్చ విదురశ్చ మహీపతే.
ఆదాయ ద్రౌపదీం కృష్ణాం కుంతీం చైవ యశస్వినీం
స విహారం సుఖం జగ్ముర్నగరం నాగసాహ్వయం.
సువర్ణకక్ష్యాగ్రైవేయాన్ సువర్ణాంకుశభూషితాన్
జాంబూనదపరిష్కారాన్ ప్రభిన్నకరటాముఖాన్.
అధిష్ఠితాన్ మహామాత్రైః సర్వశస్త్రసమన్వితాన్
సహస్రం ప్రదదౌ రాజా గజానాం వరవర్ణినాం.
రథానాం చ సహస్రం వై సువర్ణమణిచిత్రితం

తీసికొనిరా. పాండవులు సజీవులై ఉండటం ద్రుపద మహీశుతో సంబంధం కలిగించుకోవటం చాలా సంతోషించదగ్గ విషయం. మన అదృష్టంవల్ల ఈ అభ్యుదయం మనకు లభించింది. పాపాత్ముడైన పురోచనుడు మరణించటం కూడా మన అదృష్టమే— అన్నాడు ధృతరాష్ట్రుడు. మహారాజు ఆజ్ఞానుసారం మహామంత్రి విదురుడు నానావస్త్రాభరణాలూ తీసికొని ద్రుపదుని రాజధాని చేరాడు. ధర్మశాస్త్రవిదుడూ సర్వవిషయజ్ఞుడూ అయిన విదురుడు వయోవిద్యావృద్ధులకు క్రమానుసారం నమస్కారాలు జరిపి చిన్నలందరినీ దగ్గరగా తీసికొని కౌగిలించుకొన్నాడు.

కౌరవ సామ్రాజ్య చక్రాన్ని అతికౌశలంతో నడిపే మహామంత్రికి ద్రుపదుడు ఉచితరీతిని అతిథి మర్యాదలు నడిపించాడు. అనంతరం కుశలప్రశ్నలు సాగాయి. విదురుడు పాండవులనూ శ్రీకృష్ణుని గాఢాలింగనం చేసికొని వారి క్షేమసమాచారాలు విచారించి వారి మర్యాదలు స్వీకరించాడు. ధృతరాష్ట్రుని ఆదేశానుసారం పాండవుల యోగక్షేమాలన్నీ అడిగాడు. వారికి కానుకలుగా ధనరత్నరాసులు అర్పించాడు.

ధర్మరాజా! ధృతరాష్ట్రుడు పుత్రమిత్రమంత్రి బాంధవసమేతం మీయందు దయతో ఉన్నాడు. మీ కుశలం అడిగాడు. ద్రుపదమహారాజా! మీకూ మావారికీ వియ్యం జరగటం మా మహారాజుకి ఎంతో ఆనందం కలిగించింది. భీష్ముడు కౌరవసహితుడై మీ కుశలం అడిగాడు. మీ బాల్యమిత్రుడు భరద్వాజనందనుడు ద్రోణాచార్యులుకూడా హృదయాలింగనం చేసికొంటూ మీ అందరి యోగక్షేమాలూ అడుగుతున్నారు. మీ బాంధవ్యంవల్ల మా మహారాజు కృతార్థుడైనట్లు తెలుస్తున్నాడు. సామ్రాజ్య ప్రాప్తికంటె మీతోటి సంబంధం వారికి అధికంగా ఆనందం కలిగించింది.

చిరకాలంనుండి స్వదేశంలో లేని పాండవులను చూడాలని కౌరవులూ కౌరవరాజ్య పౌరులూ కుతూహలపడుతున్నారు. కనక పాండవులను హస్తినాపురం పంపవలసిందని మా మహారాజు కోరుతున్నాడు. పాండవులుకూడా తమ రాజధానిని చూడాలని ఉత్సాహపడుతూండవచ్చు. కురురాజవంశాంతఃపుర కాంతలూ హస్తినాపుర వాసులూ మా ప్రజలూ మీ యింటికోడలిని చూడాలని వేడుకపడుతున్నారు. ఆమె రాకకోసం కన్నులు కాయలు కాచేలా చూస్తున్నారు.

అందుచేత మీరు మీ అమ్మాయితో సహా పాండవులను హస్తినాపురం పంపించవలసిందని కోరుతున్నాను. మీరు అనుజ్ఞ ఇచ్చిన క్షణంలో నేను దూతను పంపి ఈ శుభవార్త మా మహారాజుకి తెలుపుతాను— అన్నాడు ధీమంతుడు విదురుడు.

205 వ అధ్యాయము సమాప్తం

చతుర్యుజాం భానుమచ్ఛ పంచానాం ప్రదదౌ తదా.
సువర్ణపరిబర్హాణాం వరచామరమాలినాం
జాత్యశ్వానాం చ పంచాశత్సహస్రం ప్రదదౌ నృపః.
దాసీనామయుతం రాజా ప్రదదౌ వరభూషణం
తతః సహస్రం దాసానాం ప్రదదౌ వరధన్వినాం.
హైమాని శయ్యాసనభాజనాని
ద్రవ్యాణి చాన్యాని చ గోధనాని
పృథక్ పృథక్ చైవ దదౌ స కోటిం
పాంచాలరాజః పరమప్రహృష్టః.
శిబికానాం శతం పూర్ణం వాహాన్ పంచశతంనరాన్
ఏవమేతాని పాంచాల్యో కుంత్యర్థే ప్రదదౌ ధనం.
హరణం చాపి పాంచాల్యాజ్ఞాతిదేయం తు సౌమకిః
ధృష్టద్యుమ్నో యయౌ తత్రభగినీం గృహ్య భారత.
నానద్యమానే బహుభిః తూర్యశబ్దైఃసహస్రశః
శ్రుత్వా చాప్యాగతాన్ వీరాన్ ధృతరాష్ట్రో
జనేశ్వరః
ప్రత్యుద్గ్రాహయ పాండూనాం ప్రేషయామాస
కౌరవాన్.
వికర్ణం చ మహేష్వాసం చిత్రసేనం చ భారత
ద్రోణం చ పరమేష్వాసం గౌతమం కృపమేవ చ.
తైస్తే పరివృతా వీరాః శోభమానా మహాబలాః
నగరం హాస్తినపురం శనైః ప్రవివిశుస్తదా.
పాండవానాగతాన్ శ్రుత్వా నాగరాస్తు
కుతూహలాత్
మండయాంచక్రిరే తత్ర నగరం నాగసాహ్వయం
ముక్తపుష్పావకీర్ణం తజ్జలసిక్తం తు సర్వశః
ధూపితం దివ్యధూపేన మండనైశ్చాపి సంవృతం.
పతాకోచ్ఛ్రితమాల్యం చ పురమప్రతిమం బభౌ
శంఖభేరీనినాదైశ్చ నానావాదిత్రనిఃస్వనైః.
కౌతూహలేన నగరం దీప్యమానమివాభవత్
తత్ర తే పురుషవ్యాఘ్రాః శోకదుఃఖవినాశనాః.
తత ఉచ్చావచా వాచః పౌరైః ప్రియచికీర్షుభిః
ఉదీరితా అశృణ్వంస్తే పాండవా హృదయంగమాః.
అయం స పురుషవ్యాఘ్రః పునరాయాతి ధర్మవిత్
యో నః స్వానివ దాయాదాన్ ధర్మేణ పరిరక్షతి.
అద్య పాండుర్మహారాజో వనాదివ జనప్రియః
ఆగతః ప్రియమస్మాకం చికీర్షుర్నాత్ర సంశయః.
కిం ను నాద్యకృతం తాత సర్వేషాం నః పరం ప్రియం
యన్నః కుంతీసుతా వీరా నగరం పునరాగతాః.
యది దత్తం యది హుతం విద్యతే యదినాస్తపః
తేన తిష్ఠంతు నగరే పాండవాః శరదాం శతం.
తతస్తే ధృతరాష్ట్రస్య భీష్మస్య చ మహాత్మనః
అన్యేషాం చ తదార్హాణాం చక్రుః పాదాభివందనం.
కృత్వా తు కుశలప్రశ్నం సర్వేం నగరేణ చ
వ్యవిశంతాథ వేశ్మాని ధృతరాష్ట్రస్య శాసనాత్.
దుర్యోధనస్య మహిషీ కాశిరాజసుతా తదా
ధృతరాష్ట్రస్య పుత్రాణాం వధూభిః సహితా తదా.
పాంచాలీం ప్రతిజగ్రాహ ద్రౌపదీం శ్రీమివాపరాం
పూజయామాస పూజార్హాం శచీదేవీమివాగతాం.
వవందే తత్ర గాంధారీం మాధవీ కృష్ణయా సహ
ఆశిషశ్చ ప్రయుక్త్వా తు పాంచాలీం పరిషస్వజే.
పరిష్వజ్య చ గాంధారీ కృష్ణాం కమలలోచనాం
పుత్రాణాం మమ పాంచాలీ మృత్యురేవేత్యమన్యత
సా చింత్య విదురం ప్రాహ యుక్తితః సుబలాత్మజా
కుంతీ రాజసుతాం క్షత్తః సవధూం సపరిచ్ఛదాం
పాండోర్నివేశనం శీఘ్రం నీయతాం యది రోచతే.
కరణేన ముహూర్తేన నక్షత్రేణ శుభే తిథౌ
యథాసుఖం తథాకుంతీరంస్యతే స్వగృహే సుతైః.
తథేత్యేవ తదా క్షత్తా కారయామాస తత్తదా
పూజయామాసురత్యర్థంబాంధవాః పాండవాంస్తదా

## హస్తినాపురం

విదురుని మాటలు విన్న ద్రుపదుడు ఇలా అంటున్నాడు—ప్రజ్ఞానిధీ! నువ్వు వాస్తవం చెప్పావు. కురువంశంలో సంబంధం నాకెంతో ఆనందం కలిగించింది. ఇప్పుడు పాండవులు తమ రాజధానికి వెళ్ళటమూ ఉచితమే. అయితే ఆ మాట నానోటితో నేను అనటం ఔచిత్యభంగమే. వీరందరికీ అక్కడికి వెళ్ళటం మంచిదనిపిస్తే బలరామకృష్ణులు కూడా దానికి అంగీకరిస్తే నా అభ్యంతరం లేదు. రామకృష్ణులకంటె పాండవహితం కోరేవారెవరు— అని ఆగగా ధర్మరాజు—మహారాజా! మేమూ మా పరివారమూ మీ ఆజ్ఞాబద్ధులము. మీరు ఎలా చేయమంటే అలానే చేస్తాము—అన్నాడు.

ఇప్పుడు మీరు వెళ్ళటమే ఉచితంగా కనిపిస్తోంది. అలాకాక ధర్మవిదుడైన ద్రుపదుడు ఏం చెపితే అదే చేయటం మంచిది—అన్నాడు కృష్ణుడు.

అప్పుడు ద్రుపదుడు పురుషోత్తముడైన కృష్ణుని అభిప్రాయాన్ని అనుసరించటమే మంచిదనీ కౌంతేయులు తనకూ కృష్ణునికీ సములేననీ పాండవశ్రేయస్సును కృష్ణుడు చూచినట్లు ధర్మరాజుకూడా చూడలేడనీ అన్నాడు.

నెమ్మదిగా విదురుడు కుంతీసౌధానికి వెళ్ళాడు. ఆమెకు తలవంచి నమస్కరించాడు. విదురుని చూచేసరికి కుంతీహృదయం దుఃఖంతో నిండిపోయింది.

మహామంత్రీ! పాండవులు నీదయాప్రసారంవల్ల లాక్షాగృహంనుంచి బ్రతికి బయటపడ్డారు. తాంబేలు తన సంతానాన్ని మనస్సుద్వారా పరివృద్ధం చేసికొన్నట్లు నీవల్ల పాండవులు కుశలంగా ఉన్నారు. కన్న వీరి రక్షణబాధ్యత వహించే వారెవరు. కాకి కోకిలబిడ్డలను పాలించి పోషించే రీతినే నేను బిడ్డలను చూస్తున్నాను. ఎన్నో క్లిష్టస్థితులూ ప్రాణాపాయపరిస్థితులూ నాతలమీంచి దాటిపోయాయి. అనంతరం కర్తవ్యమేమిటో చెప్పు— అన్నది కుంతి.

ఆమె శోకంలోనే ప్రసంగించి విచారించసాగింది. అప్పుడు విదురుడు— యదుకులానందవర్ధినీ! నువ్విలా విచారించకూడదు. నీ కొడుకులు మహాబలిష్ఠులు. వారి కేప్రమాదమూ లేదు. వీరు అనతికాలంలోనే రాజ్యాధికారులవుతారు— అన్నాడు.

తరువాత ద్రుపదుని అనుజ్ఞపొంది పాండవులు కుంతీ ద్రౌపదీ కృష్ణ విదురసమేతం ఆనందంతో హస్తినాపురంవైపు అడుగుపెట్టారు. మదజలధారలతో శోభించే వెయ్యి ఏనుగులను రత్నసువర్ణభూషణాంబరాలతో అలంకరించి ద్రుపదుడు వారికి కానుకగా ఇచ్చాడు. మణిభూషణశోభతో ప్రకాశించే అశ్వచతుష్టయంతో సాగే సుందర స్యందన సహస్రం చామరమాలాశోభితాశ్వాలూ దాసీజన సహస్రాలూ ధనుర్ధరులయిన సేవకులూ శయ్యాసన పాత్రాదులూ గోధనద్రవ్యాలూ పరమ సంతోషంతో ద్రుపదుడు బహూకరించాడు.

ధృష్టద్యుమ్నుడు తన చేతిసాయంతో ద్రౌపదిని పాలకి ఎక్కిస్తున్నప్పుడు మంగళవాద్యాలు మ్రోగాయి.

హస్తినాపురానికి పాండవులు పత్నీసహితులై వస్తున్నవార్త విని వారికి స్వాగతం పలకడానికి వికర్ణ చిత్రసేనులను పంపుతూ తోడుగా కృపద్రోణులనుకూడా పంపాడు. వీరందరిమధ్యా వెలుగుతూ పాండవులు రాజధానీప్రవేశం చేస్తున్నారు. వారి రాకకు తమ సంతోషం తెలుపుతూ

నాగరాః శ్రేణిముఖ్యాశ్చ పూజయంతిస్మ పాండవాన్
భీష్మో ద్రోణ స్తథా కర్ణో బాహ్లీకః ససుత స్తదా.
శాసనాద్ ధృతరాష్ట్రస్య అకుర్వన్నతిథిక్రియాం
ఏవం విహరతాం తేషాం పాండవానాం మహాత్మనాం
నేతా సర్వస్య కార్యస్య విదురో రాజశాసనాత్
విశ్రాంతా స్తేమహాత్మానః కంచిత్ కాలంమహాబలాః
ఆహూతా ధృతరాష్ట్రేణ రాజ్ఞా శాంతనవేన చ.
భ్రాతృభిః సహ కౌంతేయ నిబోధ గదతో మమ
పాండునావర్ధితం రాజ్యం పాండునా పాలితం జగత్.
శాసనాన్మమ కౌంతేయ మమ భ్రాతా మహాబలః
కృతవాన్ దుష్కరం కర్మ నిత్యమేవ విశాంపతే.
తస్మాత్ త్వమసి కౌంతేయ శాసనం కురు మాచిరం
మమపుత్రాదురాత్మానోదర్పాహంకారసంయుతాః.
శాసనం న కరిష్యంతి మమ నిత్యం యుధిష్ఠిర
స్వకార్యనిరతై ర్నిత్యమవలిప్తైదురాత్మభిః
పునర్వోవిగ్రహోమాభూత్ ఖాండవప్రస్థమావిశ.
న చ వసత స్తత్ర కశ్చిచ్ఛక్తః పరిబాధితుం
సంరక్ష్యమాణాన్ పార్థేన త్రిదశానివ వజ్రిణా.
అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థమావిశ
అభిషేకస్య సంభారాన్ క్షత్తరానయ మా చిరం
అభిషిక్తం కరిష్యామి అద్యవై కురునందనం.
బ్రాహ్మణా నైగమశ్రేష్ఠాః శ్రేణీముఖ్యాశ్చ సర్వశః
ఆహూయంతాం ప్రకృతయోబాంధవాశ్చ విశేషతః.
పుణ్యాహంవాచ్యతాంతాతగోసహస్రంతుదీయతాం
గ్రామముఖ్యాశ్చవిప్రేభ్యోదీయంతాంసహదక్షిణాః
అంగదే ముకుటం క్షత్తః హస్తాభరణమానయ
ముక్తావళీశ్చ హారం చ నిష్కాదీన్ కుండలాని చ.
కటిబంధశ్చ సూత్రం చ తథోదరనిబంధనం
అష్టోత్తరసహస్రం తు బ్రాహ్మణాధిష్ఠితా గజాః.

జాహ్నవీసలిలం శీఘ్రమానయంతు పురోహితైః
అభిషేకోదకక్లిన్నం సర్వాభరణభూషితం
ఔపవాహ్యోపరిగతం దివ్యచామరవీజితం.
సువర్ణమణిచిత్రేణ శ్వేతచ్ఛత్రేణ శోభితం
జయేతి ద్విజవాక్యేన స్తూయమానం నృపైస్తథా.
దృష్ట్వా కుంతీసుతం జ్యేష్ఠమాజమీఢం యుధిష్ఠిరం
ప్రీతాః ప్రీతేన మనసా ప్రశంసంతు పురే జనాః.
పాండోః కృతోపకారస్య రాజ్యం దత్త్వా మమైవచ
ప్రతిక్రియాకృతమిదం భవిష్యతి న సంశయః
భీష్మో ద్రోణః కృపః క్షత్తా సాధు సాధ్విత్యభాషత.
యుక్తమేతన్మహారాజ కౌరవాణాం యశస్కరం
శీఘ్రమద్యైవ రాజేంద్ర యథోక్తం కర్తుమర్హసి.
ఇత్యేవముక్త్వా వార్ష్ణేయ స్త్వరయామాస తం తదా
యథోక్తం ధృతరాష్ట్రస్య కారయామాస కౌరవః.
తస్మిన్ క్షణే మహారాజ కృష్ణద్వైపాయన స్తదా
ఆగత్య కురుభిః సర్వైః పూజితః స సుహృద్గణైః.
మూర్ధావసిక్తైః సహితో బ్రాహ్మణై ర్వేదపారగైః
కారయామాస విధివత్ కేశవానుమతే తదా.
కృష్ణో ద్రోణశ్చ భీష్మశ్చ ధౌమ్యశ్చ వ్యాసకేశవౌ
బాహ్లీకః సోమదత్తశ్చ చాతుర్వేద్యపురస్కృతాః.
అభిషేకం తదా చక్రుర్భద్రపీఠే సుసంయుతం
జిత్వాతుపృథివీంకృత్స్నాం వశేకృత్వానరర్షభాన్.
రాజసూయాదిభిర్యజ్ఞైః క్రతుభిర్భూరిదక్షిణైః
స్నాత్వా హ్యవభృథస్నానం మోదతాం బాంధవైస్సహ.
ఏవముక్త్వా తు తే సర్వే ఆశీర్భిరభిపూజయన్
మూర్ధాభిషిక్తః కౌరవ్యసర్వాభరణభూషితః.
జయేతి సంస్తుతో రాజా ప్రదదౌ ధనమక్షయం
సర్వమూర్ధావసిక్తైశ్చ పూజితః కురునందనః.

పురజనులు నగరాన్ని అద్భుతంగా అలంకరించారు. వీధులన్నీ పరిశుభ్రంచేసి తడిపి పువ్వులు జల్లారు. సుగంధధూపాలతో నగరం నింపారు. ఉన్నత గృహవిమానద్వారాలు పూలమాలలతో వెలుగుతున్నాయి. సౌధాగ్రాలపై జెండా లెగురుతున్నాయి. శంఖభేరీ వాద్యాలు మోగుతున్నాయి. నగరమంతా దేదీప్యమానంగా ఉన్నది. పాండవాభిమానులైన ప్రజలందరూ వారికి ఆనందంకలిగే రీతిగా నినాదాలు చేస్తున్నారు.

ప్రజలను కన్నబిడ్డలవలె రక్షించే ధర్మరాజు వస్తున్నాడు.

మనకు శాంతి సౌఖ్యాలు కలిగించటంకోసం పాండురాజే తిరిగి వస్తున్నాడు.

కౌంతేయులు రాజధానికి వస్తే మన కష్టాలన్నీ తీరినట్లే.

మన పుణ్యదాన జపహోమాలఫలంతో వీరు శతవర్షాలు జీవించాలి.

వీరి రాకకంటె మనకు ఆనందదాయకమైంది లేదు.

ఈవిధంగా నాగరకజనత పలుకుతూండే సమయంలోనే పాండవులు కురుగురువృద్ధులను సమీపించి వారికి అభివాదాలాచరించారు. అనంతరం ప్రజలందరినీ కుశలప్రశ్నలు వేశారు. ధృతరాష్ట్రుని అభిమతానుసారం వారు రాజసౌధంలోకి వెళ్ళారు.

కాశీరాజపుత్రియైన ధృతరాష్ట్రుని పెద్దకోడలు కురువంశస్త్రీలతోసహా యెదురువచ్చి లక్ష్మీదేవిలా ఉన్న ద్రౌపదిని లోపలకు తీసికొని వెళ్ళింది. శచీదేవివలె ఉన్న ద్రౌపదిని దుర్యోధనపత్ని భానుమతి పరమగౌరవంతో సత్కరించింది.

కుంతీదేవి కోడలితోసహా గాంధారికి నమస్కరించింది. గాంధారి ద్రౌపదిని గాఢాలింగనం చేసికొన్నది. ఆమె హృదయంమాత్రం ద్రౌపది తన పుత్రులపాలిట మృత్యువే అన్నది.

అనంతరం విదురుని రప్పించి గాంధారి— రాజపుత్రియైన కుంతిని ఆమె బిడ్డలనూ కోడలినీ పాండురాజుభవనంలో ప్రవేశపెట్టు. శుభకరణం శుభతిథి శుభముహూర్తం శుభనక్షత్రం చూసి పంపు. వారందరూ సుఖంగా ఉండాలి—అన్నది.

విదురుడు సరేనని దానికి తగిన ఏర్పాట్లన్నీ చేశాడు. బంధువులందరూ పాండవులను ఆదరించారు. నాగరకులూ శ్రేష్ఠులూ పాండవులను పూజించారు. భీష్మ ద్రోణ కర్ణ బాహ్లీకులందరూ ధృతరాష్ట్రుని ఆజ్ఞానుసారం పాండవులకు ఆతిథ్య సత్కారాలు సాగించారు. విదురుని అండదండలతో పాండవులు సుఖంగా హస్తినాపురంలో ఉంటున్నారు.

ఒకనాడు ధృతరాష్ట్రుడూ భీష్ముడూ పాండవులను పిలిపించారు—నాయనా! ధర్మరాజా! నా ఆజ్ఞానుసారం పాండురాజు ఈపృథ్విని జయించి పాలించాడు. అదేరీతిగానువ్వు నా ఆదేశాలను పాలించాలి. దుష్టులైన కౌరవులు అహంకారగర్వంతో ఉండి నామాట వినటంలేదు. ఆ దురాత్ములతో మీకు ఏవిధంగానూ కలహాలు రాకుండా ఉండడానికి మీరు నామాటప్రకారం ఖాండవప్రస్థంలో ఉండండి. వజ్రహస్తుడైన ఇంద్రునివలె అర్జునుడు మీ అందరినీ రక్షించగలడు. నీ అర్ధరాజ్యంతో ఖాండవప్రస్థంలో ఉండి పాలన సాగించు—అని ధృతరాష్ట్రుడు విదురుని పిలిచి— మహామంత్రీ! ఈరోజున నేను ధర్మరాజుకి రాజ్యాభిషేకం చేస్తున్నాను.

ఔపవాహ్యమథారుహ్య శ్వేతచ్ఛత్రేణ శోభితః
రరాజానుగతో రాజా మహేంద్ర ఇవ దైవతైః.
తతః ప్రదక్షిణీకృత్య నగరం నాగసాహ్వయం
ప్రవివేశ తతో రాజా నాగరైః పూజితో భృశం.
మూర్ధాభిషిక్తం కౌంతేయమభ్యనందంత బాంధవాః
గాంధారిపుత్రాః శోచంతః సర్వే తే సహ బాంధవైః.
జ్ఞాత్వా శోకం తు పుత్రాణాం ధృతరాష్ట్రోఽబ్రవీన్నృపం
సమక్షం వాసుదేవస్య కురూణాం చ సమక్షతః.
అభిషేకం త్వయా ప్రాప్తం దుష్ప్రాపమకృతాత్మభిః
గచ్ఛ త్వమద్యైవ నృప కృతకృత్యోఽసి కౌరవ.
ఆయుః పురూరవా రాజన్ నహుషశ్చ యయాతినా
తత్రైవ నివసంతిస్మ ఖాండవాహ్వే నృపోత్తమ.
రాజధానీ తు సర్వేషాం పౌరవాణాం మహాభుజ
వినాశితం మునిగణైర్లోభాద్ బుధసుతస్య చ.
తస్మాత్ త్వంఖాండవప్రస్థంపురం రాష్ట్రంచవర్ధయ
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చ
కృతనిశ్చయాః.
త్వద్భక్త్యా జంతవశ్చాన్యే భజంత్యేవ పురం శుభం
పురం రాష్ట్రం సమృద్ధం వై ధనధాన్యైః సమావృతం
తస్మాత్ గచ్ఛస్వకౌంతేయభ్రాతృభిః సహితోఽనఘ
ప్రతిగృహ్యాతు తద్వాక్యం నృపం సర్వే ప్రణమ్య చ.
ప్రతస్థిరే తతో ఘోరం వనం తన్మనుజర్షభాః
అర్ధం రాజస్య సంప్రాప్య ఖాండవప్రస్థమావిశన్.
తతస్తే పాండవాస్తత్ర గత్వా కృష్ణపురోగమాః
మండయాంచక్రిరే తద్ వై పురం స్వర్గపదచ్యుతాః.
వాసుదేవో జగన్నాథశ్చింతయామాస వాసవం
మహేంద్రశ్చింతితో రాజన్ విశ్వకర్మాణమాదిశత్.
విశ్వకర్మన్ మహాప్రాజ్ఞ అద్యప్రభృతి తత్ పురం
ఇంద్రప్రస్థమితి ఖ్యాతం దివ్యం రమ్యం భవిష్యతి.
మహేంద్రశాసనాద్గత్వా విశ్వకర్మా తు కేశవం
ప్రణమ్య ప్రణిపాతార్హం కిం కరోమీత్యభాషత.

వాసుదేవస్తు తచ్ఛ్రుత్వా విశ్వకర్మాణమూచివాన్
కురుష్వ కురురాజాయ మహేంద్రపురసంనిభం.
ఇంద్రేణ కృతనామానమింద్రప్రస్థం మహాపురం
తతః పుణ్యే శివే దేశే శాంతిం కృత్వా మహారథాః.
నగరం మాపయామాసుర్ద్వైపాయనపురోగమాః
సాగరప్రతిరూపాభిః పరిఖాభిరలంకృతం.
ప్రాకారేణ చ సంపన్నం దివమావృత్య తిష్ఠతా
పాండురాభ్రప్రకాశేన హిమరశ్మినిభేన చ.
శుశుభే తత్పురశ్రేష్ఠం నాగైర్భోగవతీ యథా
ద్విపక్షగరుడప్రఖ్యైర్ద్వారైః సౌధైశ్చ శోభితం
గుప్తమభ్రచయప్రఖ్యైర్గోపురైర్మందరోపమైః.
వివిధైరపి నిర్విద్ధైః శస్త్రోపేతైః సుసంవృతైః
శక్తిభిశ్చావృతం తద్ధి ద్విజిహ్వైరివ పన్నగైః.
తల్పైశ్చాభ్యాసికైర్యుక్తం శుశుభే యోధరక్షితం
తీక్ష్ణాంకుశశతఘ్నీభిర్యంత్రజాలైశ్చ శోభితం.
ఆయసైశ్చ మహాచక్రైః శుశుభే తత్ పురోత్తమం
సువిభక్తమహారథ్యం దేవతాబాధవర్జితం.
విరోచమానం వివిధైః పాండురైర్భవనోత్తమైః
తత్ త్రివిష్టపసంకాశమింద్రప్రస్థం వ్యరోచత
మేఘవృందమివాకాశే విద్ధం విద్యుత్సమావృతం
తత్ర రమ్యే శివే దేశే కౌరవ్యస్య నివేశనం.
శుశుభే ధనసంపూర్ణం ధనాధ్యక్షక్షయోపమం
తత్రాగచ్ఛన్ ద్విజా రాజన్ సర్వవేదవిదాం వరాః.
నివాసం రోచయంతి స్మ సర్వభాషావిదస్తథా
వణిజశ్చాయయుస్తత్ర నానాదిగ్భ్యో ధనార్థినః.
సర్వశిల్పవిదస్తత్ర వాసాయాభ్యాగమంస్తదా
ఉద్యానాని చ రమ్యాణి నగరస్య సమంతతః.
ఆమ్రైరామ్రాతకైర్నీపైరశోకైశ్చంపకైస్తథా
పున్నాగైర్నాగపుష్పైశ్చ లకుచైః పనసైస్తథా.
శాలతాలతమాలైశ్చ వకులైశ్చ సకేతకైః

అవసరమైన ఏర్పాట్లన్నీ చేయించు. వేదవిదులనూ నగర ప్రముఖవ్యాపారులనూ సమస్త బంధుజనులనూ ఆహ్వానించు. బ్రాహ్మణులకు భూరి దక్షిణలతో గోసహస్రాలు ఇప్పించు. పెద్ద పెద్ద గ్రామాలుకూడా అగ్రహారాలుగా ఇయ్యి. దండ ద్వయం కిరీటం భుజకీర్తులూ ముత్యాల హారాలూ కటిసూత్రం తెప్పించు. బ్రాహ్మణు లధిరోహించే ఏనుగులు వెయ్యిపైన ఎనిమిది తెప్పించు. ఆ ఏనుగులమీద గంగాజలం తేవటానికి పురోహితులను పంపు. అభిషేకజలపవిత్రుడై సర్వభూషణాలంకృత గాత్రుడై ధర్మరాజు రాజవాహనం అధిష్ఠించాలి. సువర్ణమణులతో అలరారే శ్వేతచ్ఛత్రంతో సాగే అతనికి దివ్యచామరాలు వెయ్యాలి. బ్రాహ్మణ శుభవాచకాలతో రాజులందరూ స్తుతించాలి. ఆ ఆనందోత్సాహంతో ఉన్న ధర్మరాజును చూసి ప్రజలందరూ ప్రమోదంతో ప్రశంసా పరంపరలు కురిపించాలి. ఈ కార్యక్రమంతో పాండురాజు మనకు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేసినట్లే అవుతుంది— అన్నాడు.

ఆ ఊహకు భీష్మ ద్రోణ కృప విదురులు ఆనందించారు.

అప్పుడు సభాస్థలిలో శ్రీకృష్ణుడు— మహారాజా! ఈ ఆలోచన సర్వోత్తమమయినది. కురువంశయశో వివర్ధనం. మీ ఊహప్రకారం ఈ కార్యక్రమం నేడే త్వరగా జరిగించండి— అన్నాడు.

విదురుడు రాజాజ్ఞానుసారం సర్వకార్యాలూ సాగించాడు. ఆ సమయానికే అక్కడకు వ్యాస మహర్షి విచ్చేశారు. వారికి కౌరవులందరూ గౌరవ సత్కారాలు జరిపించారు. వేదవేత్తలైన బ్రాహ్మణులూ మూర్ధాభిషిక్తులైన మహారాజులూ శ్రీకృష్ణుడూ అనుమతించాక వ్యాసమహర్షి పట్టాభిషేకకార్యం నిర్విఘ్నంగా నిర్వర్తించారు.

కృప ద్రోణ భీష్మ ధౌమ్య వ్యాస కృష్ణ బాహ్లీక సోమదత్తాదులు విద్వద్వర పురస్సరులై భద్రపీఠం మీద ఉన్న ధర్మరాజుని అభిషేకించారు.

మహారాజా! నువ్వు పృథ్వీమండలాన్ని జయించి నానా దేశాధీశులనూ వశపరచుకొని రాజసూయాదియాగాలు ప్రముగదక్షిణలతో సాగించి అవభృథస్నానానంతరం బంధుకోటితో సుఖంగా ఉండు— అని వారందరూ ఆశీర్వదించారు. మూర్ధాభిషిక్తుడైన ధర్మరాజు అక్షయంగా ధనధాన్యాలు దానంచేశాడు. ప్రజలందరూ జయజయ ధ్వానాలు చేశారు. శ్వేతవస్త్రాలంకృతుడైన ధర్మరాజు పట్టపు ఏనుగు ఎక్కాడు. ఆయన వెంట అనేకులు బయలు దేరారు. దేవతాగణపరివృతుడైన దేవేంద్రునివలె ధర్మరాజు హస్తినాపురం ప్రదక్షిణించి వచ్చాడు. బంధువులూ పురప్రజలూ ఆ నూతన చక్రవర్తిని ప్రస్తుతించారు.

ఆ ఉత్సవోత్సాహం గాంధారేయులకు శోక కారణమైంది.

ఉత్సవంనుంచి తిరిగి వచ్చాక ధృతరాష్ట్రుడు— నాయనా! జితేంద్రియులకు లభ్యమయే రాజ్యాధికారం నీకు లభించింది. నువ్వు నేడే ఖాండవప్రస్థం వెళ్ళి సుఖంగా ఉండు. పురూరవుడు ఆయువు నహుషుడు యయాతి ప్రముఖులందరూ అక్కడే ఉండేవారు. పౌరవరాజులందరకూ అదే రాజధాని. కాలాంతరంలో పృథాపుత్రుని లోభంవల్ల అది నాశనమైంది. నువ్వు దాన్ని పునర్నిర్మాణం చేసి రాష్ట్రవృద్ధి చేసుకో. చాతుర్వర్ణాలవారూ నీతో రావటానికి కుతూహలపడుతున్నారు. వారిని వెంట

మనోహరైః సుపుష్పైశ్చ ఫలభారావనామితైః.
ప్రాచీనామలకైర్లోధ్రైరంకోలైశ్చ సుపుష్పితైః
జంబూభిః పాటలాభిశ్చ కుబ్జకైరతిముక్తకైః.
కరవీరైః పారిజాతైరన్యైశ్చ వివిధైర్ద్రుమైః
నిత్యపుష్పఫలోపేతైర్నానాద్విజగణాయుతైః.
మత్తబర్హిణసంఘుష్టకోకిలైశ్చ సదామదైః
గృహైరాదర్శవిమలైర్వివిధైశ్చ లతాగృహైః.
మనోహరైశ్చిత్రగృహైస్తథాజగతిపర్వతైః
వాపీభిర్వివిధాభిశ్చ పూర్ణాభిః పరమాంభసా.
సరోభిరతిరమ్యైశ్చ పద్మోత్పలసుగంధిభిః
హంసకారండవయుతైశ్చక్రవాకోపశోభితైః.
రమ్యాశ్చ వివిధాస్తత్ర పుష్కరిణ్యో వనావృతా
తడాగాని చ రమ్యాణి బృహంతి సుబహూని చ.
చాతుర్వర్ణ్యసమాకీర్ణం మాన్యైః శిల్పిభిరావృతం
ఉపయోగసమర్థైశ్చ సర్వద్రవ్యైః సమావృతం
నిత్యమార్యజనోపేతం నరనారీగణైర్యుతం
మత్తవారణసంపూర్ణం గోభిరుష్ట్రైః ఖరైరజైః.
సర్వదాభిగతం సద్భిః కారితం విశ్వకర్మణా
తత్ త్రివిష్టపసంకాశమింద్రప్రస్థం వ్యరోచత.
పురీం సర్వగుణోపేతాం నిర్మితాం విశ్వకర్మణా
పౌరవాణామధిపతిః కుంతీపుత్రో యుధిష్ఠిరః.
కృతమంగళసత్కారో బ్రాహ్మణైర్వేదపారగైః
ద్వైపాయనం పురస్కృత్య ధౌమ్యస్యానుమతే స్థిత
భ్రాతృభిస్సహితో రాజన్ కేశవేన సహాభిభూః
తోరణద్వారసుముఖం ద్వాత్రింశద్ద్వారసంయుతం
వర్ధమానపురద్వారం ప్రవివేశ మహాద్యుతిః
శంఖదుందుభినిర్ఘోషాః శ్రూయంతే బహవో భృశం
జయేతి బ్రాహ్మణగిరః శ్రూయంతే చ సహస్రశః
సంస్తూయమానో మునిభిః సూతమాగధవందిభిః.
ఔపవాహ్యగతో రాజా రాజమార్గమతీత్య చ

కృతమంగళసత్కారం ప్రవివేశ గృహోత్తమం.
ప్రవిశ్య భవనం రాజా సత్కారైరభిపూజితః
పూజయామాస విప్రేంద్రాన్ కేశవేనయథాక్రమం.
తతస్తు రాష్ట్రం నగరం నరనారీగణాయుతం
గోధనైశ్చ సమాకీర్ణం సస్యవృద్ధిస్తదాభవత్.
తేషాం పుణ్యజనోపేతం రాష్ట్రమావిశతాంమహత్
పాండవానాం మహారాజ శశ్వత్ ప్రీతిగవర్ధత.
తతో భీష్మేణ రాజ్ఞా చ ధర్మప్రణయనే కృతే
పాండవాః సమపద్యంత ఖాండవప్రస్థవాసినః.
పంచభిస్తైర్మహేష్వాసైరింద్రకల్పైః సమన్వితం
శుశుభే తత్ పురశ్రేష్ఠం నాగైర్భోగవతీ యథా.
తతస్తు విశ్వకర్మాణం పూజయిత్వా విసృజ్య చ
ద్వైపాయనం చ సంపూజ్య విసృజ్య చ నరాధిప
వార్ష్ణేయమబ్రవీద్ రాజా గంతుకామం కృతక్షణం
తవప్రసాదాద్ వార్ష్ణేయరాజ్యం ప్రాప్తంమయానఘ
ప్రసాదాదేవ తే వీర శూన్యం రాష్ట్రం సుదుర్గమం.
తవైవ తు ప్రసాదేన రాజ్యస్థాశ్చ మహామతే
గతిస్త్వమంతకాలే చ పాండవానాం తు మాధవ
మాతాస్మాకం పితాదేవోనహ్యంషుం విద్మనైవయం.
జ్ఞాత్వాతుకృత్యం కర్తవ్యం కారయస్వభవాన్హినః
యదిష్టమనుమంతవ్యం పాండవానాం త్వయానఘ.
త్వత్ప్రభావాన్మహాభాగ రాజ్యం ప్రాప్తం స్వధర్మతః
పితృపైతామహం రాజ్యం కథంనస్యాత్ తవప్రభో.
ధార్తరాష్ట్రాదురాచారాః కిం కరిష్యంతిపాండవాన్
యథేష్టం పాలయ మహీం సదా ధర్మధురం వహ.
ధర్మోపదేశం సంశ్రేపాగ్ బ్రాహ్మణాన్ భజ కౌరవ
అద్యైవ నారదః శ్రీమానాగమిష్యతి సత్వరః
ఆదృత్య తస్య వాక్యాని శాసనం కురు తస్య వై.
ఏవముక్త్వా తతః కుంతీమభివాద్య జనార్దనః
ఉవాచశ్లక్ష్ణయా వాచా గమిష్యామి నమోఽస్తు తే

పెట్టుకొని వెళ్ళు. నీమీద భక్తికలవా రందరూ అక్కడే ఉంటారు. ధనధాన్యసమృద్ధమైన ఆ నగరంలో నీ సోదరులతో సుఖంగా ఉండు—అన్నాడు.

ఆయన ఆజ్ఞానుసారం పాండవులు భయంకరా రణ్యంలా ఉన్న ఖాండవప్రస్థంలో అడుగుపెట్టారు. శ్రీకృష్ణుని సహకారంతో సుందరనగరనిర్మాణం గురించి ఆలోచన చేశారు. లోకనాయకుడు శ్రీకృష్ణుడు ఇంద్రుని స్మరించాడు. స్మరణమాత్రం చేత ఇంద్రుడు కృష్ణుని ఊహ తెలిసి విశ్వకర్మను పిలిచి—మహాశిల్పీ! రమణీయ దివ్యనగరనిర్మాణం చెయ్యి. ఖాండవప్రస్థం నీహస్తకౌశలంతో ఇంద్రప్రస్థంగా మారాలి— అన్నాడు.

దేవేంద్రుని ఆజ్ఞానుసారం విశ్వకర్మ ఖాండవప్రస్థం చేరి కృష్ణభగవానునికి నమస్కరించి ఆజ్ఞకై నిలిచాడు. అప్పుడు కృష్ణుడు— అమరావతీసదృశమైన నగరాన్ని నిర్మించు. ఇంద్రునిశ్చయానుసారం అది ఇంద్రప్రస్థనామంతో పిలువబడుతుంది. అన్నాడు.

పవిత్రప్రదేశంలో శాంతికర్మ సాగించి పాండవులు వేదవ్యాసుని ముందుంచుకొని నగరనిర్మాణానికి భూమిని కొలిపించారు. అగాధంగా విశాలమైన కందకం త్రవ్వించారు. శ్వేతమేఘంలా చంద్రప్రాకారాలు నిర్మించారు. మందరాచలోన్నతితో గోపురనిర్మాణం జరిగింది. శస్త్రాగారాలు ఏర్పాటు చేశారు. లోహవినిర్మితయంత్రాలు నగరానికి నలువైపులా ఉంచారు. అవి రెండునాలుకల పాముల్లా ఉన్నాయి. అస్త్రవిద్యాభ్యాసార్థం అట్టాలికలు నిర్మించారు. శతఘ్నులు పెట్టించారు. విశాలమైన రథ్యలతో నగరం శోభావహంగా ఉంది. ప్రాకారపరీవృత సౌధాలు నగరానికి అలంకారాలుగా ఉన్నాయి.

రమణీయప్రాంతంలో ధర్మరాజు సౌధంకట్టారు. అది విద్యుత్ప్రభలా ఉన్నది. ధనరాశిసమృద్ధమై అది కుబేరభవనంలా ఉన్నది. వేదవిదులైన బ్రాహ్మణులూ వ్యాపార కుశలులయిన శ్రేష్ఠులూ శిల్పకళాకోవిదులూ ఇంద్రప్రస్థంలో సుఖావాసార్థం విచ్చేశారు.

కదంబ చంపక పున్నాగ నాగ అశోక ఏలా సాల తాల తమాల ఆమ్ర ఆమ్రాతకాది ఫలవృక్షసంతతులతో నిండిన ఉద్యానవనాలతో ఆ నగరం కన్నులపండువుగా ఉన్నది. వివిధవిధపక్షిసంఘాల కలరవాలతో శ్రవణశుభంగా ఉన్నవి ఉద్యానవనాలు. మయూరక్రేంకారాలు కోకిలాలాపనాలూ లతామండపాలూ క్రీడాభవనాలూ జనమనోహరంగా ఉన్నాయి.

ఆ వనాలలో చిత్రశాలలూ రాజక్రీడకు కృత్రిమగిరులూ నిర్మింపబడ్డాయి. దిగుడు బావులలో సరోవరాలలో సారస చక్రవాక కారండవ రాజహంసల కలకూజితాలు నిర్విరామంగా సాగుతున్నాయి. ఉత్పలాలతో పద్మాలతో నిండిన ఆ సరోవరాల నుండి సుగంధాన్ని తెచ్చేది గాలి. ఆ నగరంలో భోగ్యావసరవస్తు సమృద్ధి ఉన్నది. అగణితసుందర నరనారీజనంతో నగరం కలకలలాడుతున్నది. మద గజాలు ఒంటెలు గోవులు సమృద్ధిగా ఉన్నాయి. విశ్వకర్మ వినిర్మితమైన ఆ ఇంద్రప్రస్థనగరం సాధుజనసంఘ సంసేవ్యమానంగా ఉన్నది.

వేదపారంగతులు మంగళకార్యాలన్నీ సాగించాక ధౌమ్యులవారు ఆదేశానుసారం వ్యాసులవారిని ముందుంచుకొని ధర్మరాజు శ్రీకృష్ణుడూ సోదరులూ వెంటరాగా ముప్పదిరెండు ద్వారాలతో ఉన్న తోరణద్వారం ఎదుటకు వచ్చి వర్ధమాన

జాతుషం గృహమాసాద్యమయాప్రాప్తం చ కేశవ
ఆర్యేణ చాపి న జ్ఞాతం కుంతిభోజేన చానఘ.
త్వయా నాథేన గోవింద దుఃఖం తీర్ణం మహత్తరం
త్వంహి నాథస్త్వనాథానాం దరిద్రాణాం విశేషతః.
సర్వదుఃఖాని శామ్యంతి తవసందర్శనాన్మమ
స్మరస్యేవానాన్ మహాప్రాజ్ఞ తేన జీవంతి పాండవాః.
కరిష్యామీతి చామంత్ర్య అభివాద్య పితృష్వసాం
గమనాయ మతిం చక్రే వాసుదేవః సహానుగః.
తాం వివేశ్య తతో వీరో రామేణ సహ కేశవః
యయౌ ద్వారవతీం రాజన్పాండవానుమతే తదా.

206 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల ఏడవ అధ్యాయం

ఏవం సంప్రాప్య రాజ్యం తదింద్రప్రస్థం తపోధన
అత ఊర్ధ్వం మహాత్మానః కిమకుర్వత పాండవాః.
సర్వ ఏవ మహాసత్వా మమ పూర్వపితామహాః
ద్రౌపదీ ధర్మపత్నీ చ కథం తానన్వవర్తత.
కథం చ పంచ కృష్ణాయామేకస్యాం తే నరాధిపః
వర్తమానా మహాభాగా నాభిద్యంత పరస్పరం.
శ్రోతుమిచ్ఛామ్యహం సర్వం విస్తరేణ తపోధన
తేషాంచేష్టితమన్యోన్యం యుక్తానాం కృష్ణయాసహ.
ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతాః కృష్ణయా సహ పాండవాః
రేమిరే ఖాండవప్రస్థే ప్రాప్తరాజ్యాః పరంతపాః.
ప్రాప్య రాజ్యం మహాతేజాః సత్యసంధో యుధిష్ఠిరః
పాలయామాస ధర్మేణ పృథివీం భ్రాతృభిః సహ.
జితారయో మహాప్రాజ్ఞాః సత్యధర్మపరాయణాః
ముదంపరమికాంప్రాప్తాస్తత్రోషుః పాండునందనాః.
కుర్వాణాః పౌరకార్యాణి సర్వాణి పురుషర్షభాః
ఆసాంచక్రుర్మహార్హేషు పార్థివేష్వాసనేషు చ.
అథ తేషూపవిష్టేషు సర్వేష్వేవ మహాత్మసు
నారదస్త్వథ దేవర్షి రాజగామ యదృచ్ఛయా.
పథా నక్షత్రజుష్టేన సుపర్ణచరితేన స
చంద్రసూర్యప్రకాశేన సేవితేన మహర్షిభిః
నభఃస్థలేన దివ్యేన దుర్లభేనాతపస్వినాం.
భూతార్చితో భూతధరం రాష్ట్రం నగరభూషితం
అవేక్షమాణో ద్యుతిమానాజగామ మహాతపాః.
సర్వవేదాంతగో విప్రః సర్వవిద్యాసుపారగః
పరేణ తపసాయుక్తో బ్రాహ్మేణ తపసా వృతః.
నయే నీతౌ చ నిరతో విశ్రుతశ్చ మహామునిః
పరాత్ పరతరం ప్రాప్తో ధర్మాన్ సమభిజగ్నివాన్.
భావితాత్మా గతరజాః శాంతో మృదుఋజుర్ద్విజః
ధర్మేణాధిగతః సర్వైర్దేవదానవమానుషైః.
అక్షీణవృత్తధర్మశ్చ సంసారభయవర్జితః
సర్వథా కృతమర్యాదో వేదేషు వివిధేషు చ.
ఋక్సామయజుషాం వేత్తా న్యాయవృత్తాంతకోవిదః
ఋజురారోహవాన్శుక్లో భూయిష్ఠపథికోఽనఘః.
శ్లక్ష్ణయా శిఖయోపేతః సంపన్నః పరమత్విషా
అవదాతే చ సూక్ష్మే చ దివ్యే చ రుచిరే శుభే.
మహేంద్రదత్తే మహతీ బిభ్రత్ పరమవాససీ
ప్రాప్య దుష్ప్రాపమన్యేన బ్రహ్మవర్చసముత్తమం.
భవనే భూమిపాలస్య బృహస్పతిరివాప్లుతః
సంహితాయాం చ సర్వేషాం స్థితస్యోపస్థితస్య చ.
ద్విపదస్య చ ధర్మస్య క్రమధర్మస్య పారగః
గాథాసామానుధర్మజ్ఞః సామ్నాం పరమవల్గునాం
ఆత్మనా సర్వమోక్షిభ్యః కృతిమాన్ కృత్యవిత్తరః

మనే పేరుగల నగరద్వారంలో అడుగు పెడుతూండగా శంఖధ్వానాలూ నగారామ్రోతలూ సాగాయి.

ఉచ్చారణదక్షులైన వేదవిదులు ఆశీర్వాదాలు పలికారు. వందిమాగధసూతులు స్తుతులు నడిపించారు. రాజగజంమీద సాగే ధర్మరాజు రాజమార్గం పరిక్రమించి మంగళశోభతో ఉన్న సౌధంలో ప్రవేశించి సర్వసమ్మానాలూ పొంది బ్రాహ్మణులనూ శ్రీకృష్ణునీ యథోచితంగా పూజించాడు. విశ్వకర్మను సముచితంగా సత్కరించి పంపారు.

పుణ్యసంపన్నమైన ఆ రాష్ట్రం వ్యవసాయాభ్యుదయంతో పాటు వ్యాపారాభివృద్ధి కూడా పొందింది. పాండవవీరులతో ఇంద్రప్రస్థం నాగజాతీయుల రాజధానియైన భోగవతివలె ఉన్నది. వ్యాసమహర్షి కూడా ఆశ్రమాభిముఖులయారు. ప్రయాణోన్ముఖుడైన శ్రీకృష్ణునితో ధర్మరాజు— మహానుభావా! మీ కృపాప్రసాదంవల్ల మాకు రాజ్యం లభించింది. అడుగుపెట్టడానికి వీలులేని ఈప్రాంతం అంతా ధనధాన్యాలతో కలకలలాడుతూ సర్వజనాకర్షకంగా ఉన్నది. ఈ నిర్జనారణ్యం బహుజనాకీర్ణమైంది. మాకు ఎప్పుడూ మీరే శరణ్యం. మీరే మాకు తల్లిదండ్రులు. గురువూ దైవమూ మీరే. అన్నీ మీవల్లనే మాకు జరుగుతాయి. అయితే మీరు స్వయంగా కలగజేసికోవడానికి వీలులేని కార్యాలకు మమ్మల్ని నియోగించండి. మా శ్రేయోఽభివృద్ధులకు అవశ్యమైన ఆజ్ఞలు ఇవ్వండి— అనగా విని శ్రీకృష్ణుడు— మీ ఆత్మశక్తికి మీ ధర్మఫలం సహకరించి ఈ రాజ్యం లభించింది. అంతేకాదు పైతృకమైనరాజ్యం మీకు లభ్యంకాకుండా ఉండటం అసంభవం. దురాచారపరాయణులూ దుష్టబుద్ధులూ అయిన దుర్యోధనాదులు మిమ్మల్ని ఏమీ చెయ్యలేరు. ధర్మమర్యాదలను మీరకుండా సుఖంగా రాజ్యం పాలించండి. నిరంతరం బ్రాహ్మణసేవ చెయ్యండి. ఇదే నేను మీకు చెప్పవలసిన ధర్మం. త్వరలోనే నారదులవారు వస్తారు. వారిని ఉచితంగా సత్కరించి వారి మాటలు శ్రద్ధగా ఆలకించి ఆచరించండి—అన్నాడు.

అనంతరం కుంతీదేవిని సమీపించి నమస్కరించి— అత్తా! నేను వెడుతున్నాను. నాకు సెలవా— అనగా కుంతి— కేశవా! లాక్షాగృహంలో ప్రవేశించింది మొదలు నేననుభవించిన కష్టాలు ఇతరులెవరూ ఎరుగరు. సర్వమూ తెలిసిన నీవల్ల ఆ దుఃఖాలన్నీ పోయాయి. దుఃఖజీవనులకూ దీనులకూ అనాథులకూ నీవే శరణ్యం. నీ దర్శనమాత్రాన మా దుఃఖాలన్నీ పోయాయి. నీ మనస్సులో పాండవుల సౌఖ్యచింతన ఉంటే అదేచాలు— అన్నది.

కుంతీదేవి అనుజ్ఞ పొంది పరివారసమేతుడై పాండవుల వీడ్కోలు తీసికొని బలరామసహితుడై శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థం విడిచి ద్వారకానగరం వైపు అడుగులు వేశాడు.

206 వ అధ్యాయము సమాప్తము



మోక్షా ధర్మే బహువిధే మనో మతిమతాం వర.
విదితార్థః సమస్తైశ్చైవ ఛేత్తా నిగమసంశయాన్
అర్థనిర్వచనే నిత్యం సంశయచ్ఛిదసంశయః.
ప్రకృత్యా ధర్మకుశలో నానాధర్మవిశారదః
లోపేనాగమధర్మేణ సంక్రమేణ చ వృత్తిషు.
ఏకశబ్దాంశ్చ నానార్థానేకార్థాంశ్చ పృథక్శ్రుతీన్
పృథగర్థాభిధానాంశ్చ ప్రయోగాణామవేక్షితా.
ప్రమాణభూతో లోకస్య సర్వాధికరణేషు చ
సర్వవర్ణవికారేషు నిత్యం సకలపూజితః
స్వరేఽస్వరే చ వివిధే వృత్తేషు వివిధేషు చ.
సమస్థానేషు సర్వేషు సమామ్నాయేషు ధాతుషు
ఉద్దేశ్యానాం సమాఖ్యాతా సర్వమాఖ్యాతముద్దిశన్
అభిసంధిషు తత్త్వజ్ఞః పాదాన్యంగాన్యనుస్మరన్
కాలధర్మేణ నిర్దిష్టం యథార్థం చ విచారయన్.
చికీర్షితం చ యో వేత్తా యథా లోకేన సంవృతం
విభాషితం చ సమయం భాషితం హృదయంగమం
ఆత్మనే చ పరస్మై చ స్వరసంస్కారయోగవాన్.
ఏషాం స్వరాణాం వేత్తా చ బోద్ధా చ వచనస్వరాన్
విజ్ఞాతా చోక్తవాక్యానామేకతాం బహుతాం తథా.
బోద్ధా హి పరమార్థాంశ్చ వివిధాంశ్చ
వ్యతిక్రమాన్
అభేదతశ్చ బహుశో బహుశశ్చాపి భేదతః.
వచనానాం చ వివిధానాదేశాంశ్చ సమీక్షితా
నానార్థకుశలస్తత్ర తద్ధితేషు చ సర్వశః.
పరిభాషయితా వాచాం వర్ణతః స్వరతోఽర్థతః
ప్రత్యయాంశ్చ సమాఖ్యాతా నియతం ప్రతిధాతుకం
పంచ చాక్షరజాతాని స్వరసంజ్ఞాని యాని చ
తమాగతమృషిం దృష్ట్వా ప్రత్యుద్గమ్యాభివాద్య చ
ఆసనం రుచిరం తస్మై ప్రదదౌ స్వం యుధిష్ఠిరః
దేవర్షేరుపవిష్టస్య స్వయమర్ఘ్యం యథావిధి.
ప్రాదాద్ యుధిష్ఠిరో ధీమాన్ రాజ్యం తస్మై
న్యవేదయత్
ప్రతిగృహ్య తు తాం పూజామృషిః ప్రీతమనాస్తదా
ఆశీర్భిర్వర్ధయిత్వా చ తమువాచాస్యతామితి
నిషసాదాభ్యనుజ్ఞాతస్తతో రాజా యుధిష్ఠిరః.
కథయామాస కృష్ణాయై భగవంతముపస్థితం
శ్రుత్వైతద్ ద్రౌపదీ చాపి శుచిర్భూత్వా సమాహితా
జగామ తత్ర యత్రాస్తే నారదః పాండవైస్సహ
తస్యాభివాద్య చరణౌ దేవర్షేర్ధర్మచారిణీ.
కృతాంజలిః సుసంవీతా స్థితాథ ద్రుపదాత్మజా
తస్యాశ్చాపి స ధర్మాత్మా సత్యవాగృషిసత్తమః.
ఆశిషో వివిధాః ప్రోచ్య రాజపుత్ర్యాస్తు నారదః
గమ్యతామితి హోవాచ భగవాంస్తామనిందితాం
గతాయామథ కృష్ణాయాం యుధిష్ఠిరపురోగమాన్
వివిక్తే పాండవాన్ సర్వానువాచ భగవానృషిః.
పాంచాలీ భవతామేకా ధర్మపత్నీ యశస్వినీ
యథా వో నాత్ర భేదః స్యాత్ తథా నీతిర్విధీయతాం
సుందోపసుందౌ హి పురా భ్రాతరౌ సహితావుభౌ
ఆస్తామవధ్యావన్యేషాం త్రిషు లోకేషు విశ్రుతౌ.
ఏకరాజ్యావేకగృహావేకశయ్యాసనాశనౌ
తిలోత్తమాయాస్తౌ హేతోరన్యోన్యమభిజఘ్నతుః.
రక్ష్యతాం సౌహృదం తస్మాదన్యోన్యప్రీతిభావకం
యథా వో నాత్ర భేదః స్యాత్ తత్ కురుష్వ యుధిష్ఠిర.
సుందోపసుందావసురౌ కస్య పుత్రౌ మహామునే
ఉత్పన్నశ్చ కథం భేదః కథం చాన్యోన్యమఘ్నతాం
అప్సరా దేవకన్యా వా కస్య చైషా తిలోత్తమా
యస్యాః కామేన సమ్మత్తౌ జఘ్నతుస్తౌ పరస్పరం.
ఏతత్ సర్వం యథావృత్తం విస్తరేణ తపోధన
శ్రోతుమిచ్ఛామహే బ్రహ్మన్ పరం కౌతూహలం హి నః

207 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల పదవ అధ్యాయం

సుందోపసుందులు

ధృతరాష్ట్రుని అజ్ఞానుసారం పాండవులు ద్రౌపదీసమేతం ఖాండవప్రస్థం చేరారు. ఆ నగరం రాజధానిగా ధర్మరాజు ధర్మమార్గాన పరిపాలన సాగిస్తున్నాడు. శ్రీ శౌర్యశక్తియుతులైన భీమాదులుకూడా సత్యధర్మపరాయణులై చరిస్తున్నారు. నగరజనతకు సర్వవిధసౌకర్యాలూ సమకూరుస్తూ వారి హృదయాలను ఆకర్షించుకున్నారు. అలా సాగుతూన్నరోజులలో అక్కడకు చేరాడు దేవర్షి నారదుడు. సర్వనక్షత్రసేవాసంపన్నమై గరుత్మంతునికి విహారయోగ్యమై తపస్విజనలభ్యమైన ఆకాశగమనం కల నారదుడు నగరాలూ రాష్ట్రాలూ చూస్తూ వచ్చాడు.

నిఖిలవేదవేదాంత విషయజ్ఞుడూ నియమ వ్రత సంపన్నుడూ న్యాయసత్యమార్గనిరతుడూ త్రిలోక విఖ్యాతుడూ సరళస్వభావుడూ సంసారభయరహితుడూ ధవళదేహుడూ సర్వలోకసంచారీ ఇంద్రదత్త దివ్యాంబరధారీ బ్రహ్మతేజస్సంపన్నుడూ బృహస్పతి సముడూ సర్వధర్మవిదుడూ సామగాన రతుడూ ధర్మసంశయ విచ్ఛేదకుడూ స్వరవ్యంజన వర్ణసమామ్నాయ ఛందోగీతులతో శబ్దస్వరూపం తెలిసినవాడూ ధాతురూపవిదుడూ కాలస్వరూప విదుడూ ప్రాణిహృదయాభిజ్ఞుడూ ప్రత్యక్షస్వరాలూ వచనభేదాలూ తెలిసినవాడూ దోషాదోష నిర్ణయనిపుణుడూ తత్వచింతనరతుడూ అయిన బ్రహ్మ మానసపుత్రుని ఆగమనం గమనిస్తూనే ధర్మరాజు ఎదురుపోయి స్వాగతమర్యాదలు నిర్వర్తించాడు. అర్ఘ్యపాద్యాదు లర్పించాడు. మర్యాదలన్నీ అయాక నారదుడు సుఖాసీనుడై ధర్మరాజాదులను ఆశీర్వదించి వారినికూడా కూర్చోమన్నాడు.

దేవర్షి నారదులవారు విజయంచేసిన వార్త విని ద్రౌపదీదేవి వచ్చి ఆ మహర్షికి సాష్టాంగ నమస్కారం చేసింది. ఆమెకుకూడా ఆశీర్వాదాలు అనుగ్రహించి అంతఃపురం వెళ్ళవచ్చునన్నాడు. ద్రౌపది నిష్క్రమించింది.

అప్పుడు నారదుడు పాండవులతో ఇలా అన్నాడు—

యశోధనులారా! కీర్తిశాలియైన ద్రౌపదిని మీరైదుగురూ భార్యగా స్వీకరించారు. అందువల్ల మీలోమీకు విభేదాలురాకుండా ఉండడానికి ఒక నియమం అవసరం. ఈసందర్భంలో మీకు విఖ్యాతమైన ఉపాఖ్యానం ఒకటి చెప్పాలని ఉంది. పూర్వకాలంలో సుందుడూ ఉపసుందుడూ అనే పేరతో ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. వారు తీవ్రంగా తపస్సుచేసి ఎవరిచేతా మృత్యువుప్రాప్తించని వరం పొందారు. వారిరువురూ ఒకరినొకరు చంపగలరే కాని ఇతరులెవరూ వారి నేమీచెయ్యలేరు. వా రెప్పుడూ కలిసిమెలిసి సౌహార్దంతో సౌదర్యంతో చరిస్తూ సర్వలోకాలలో సంచరిస్తూ భువనభవనంలో తమ ఖ్యాతిధ్వజం ప్రతిష్ఠించారు. వారు శయ్యాసనభోజనాదులలోకూడా ఒకరిని విడిచి ఒకరు ఉండేవారుకాదు. అటువంటివారు తిలోత్తమ అనే అప్సరఃకామిని కారణంగా ఒకరి నొకరు పొడుచుకు చంపుకున్నారు— అని నారదుడు సంక్షిప్తంగా ఉపాఖ్యానం ముగించాడు.

అద్భుతకథాకథనదక్షుడైన నారదుడు కుతూహలాన్ని రేకెత్తించి విడనగా ధర్మజాదులు కథ సమగ్రంగా వినగోరారు.

శ్రుణు మే విస్తరేణేమమితిహాసం పురాతనం
భ్రాతృభిః సహితః పార్థ యథావృత్తం యుధిష్ఠిర.
మహాసురస్యాన్వవాయే హిరణ్యకశిపోః పురా
నికుంభో నామ దైత్యేంద్రస్తేజస్వీ బలవానభూత్.
తస్య పుత్రౌ మహావీర్యౌ జాతౌ భీమపరాక్రమౌ
సుందోపసుందౌ దైత్యేంద్రౌ దారుణౌ
క్రూరమానసౌ.
తావేకనిశ్చయౌ దైత్యావేకకార్యార్థసమ్మతౌ
నిరంతరమవర్తేతాం సమదుఃఖసుఖావుభౌ.
వినాన్యోన్యం న భుంజాతే వినాన్యోన్యం న జల్పతః
అన్యోన్యస్య ప్రియకరావన్యోన్యస్య ప్రియంవదౌ.
ఏకశీలసమాచారౌ ద్విధైవైకోఽభవత్ కృతః
తౌ వివృద్ధౌ మహావీర్యౌ కార్యేష్వప్యేకనిశ్చయౌ.
త్రైలోక్యవిజయార్థాయ సమాధాయైకనిశ్చయం
దీక్షాం కృత్వా గతౌ వింధ్యం తావుగ్రం తేపతుస్తపః.
తౌ తు దీర్ఘేణ కాలేన తపోయుక్తౌ బభూవతుః
క్షుత్పిపాసాపరిశ్రాంతౌ జటావల్కలధారిణౌ.
మలోపచితసర్వాంగౌ వాయుభక్షౌ బభూవతుః
ఆత్మమాంసాని జుహ్వంతౌ పాదాంగుష్ఠాగ్రనిష్ఠితౌ.
ఊర్ధ్వబాహూ చానిమిషౌ దీర్ఘకాలం ధృతవ్రతౌ
తయోస్తపఃప్రభావేణ దీర్ఘకాలం ప్రతాపితః.
ధూమం ప్రముముచే వింధ్యస్తదద్భుతమివాభవత్
తతో దేవా భయం జగ్మురుగ్రం దృష్ట్వా తయోస్తపః.
తపోవిఘాతార్థమథో దేవా విఘ్నాని చక్రిరే
రత్నైః ప్రలోభయామాసుః స్త్రీభిశ్చైవ పునఃపునః.
న చ తే చక్రతుర్భంగం వ్రతస్య సుమహావ్రతౌ
అథ మాయాం పునర్దేవాస్తయోశ్చక్రుర్మహాత్మనోః.
భగిన్యో మాతరో భార్యాస్తయోశ్చాత్మజనస్తథా
ప్రపాత్యమానా విస్రస్తాః శూలహస్తేన రక్షసా.
భ్రష్టాభరణకేశాంతా భ్రష్టాభరణవాససః
అభిభాష్య తతః సర్వాస్తౌ త్రాహీతి విచుక్రుశుః

న చ తౌ చక్రతుర్భంగం వ్రతస్య సుమహావ్రతౌ.
యదా క్షోభం నోపయాతి నార్తిమన్యతరస్తయోః
తతః స్త్రియస్తా భూతం చ సర్వమంతరధీయత.
తతః పితామహః సాక్షాదభిగమ్య మహాసురౌ
వరేణచ్ఛందయామాస సర్వలోకహితః ప్రభుః
తతః సుందోపసుందౌ తౌ భ్రాతరౌ దృఢవిక్రమౌ
దృష్ట్వా పితామహం దేవం తస్థతుః ప్రాంజలీ తదా.
ఊచతుశ్చ ప్రభుం దేవం తతస్తౌ సహితౌ తదా
ఆవయోస్తపసానేన యది ప్రీతః పితామహః.
మాయావిదావస్త్రవిదౌ బలినౌ కామరూపిణౌ
ఉభావప్యమరౌ స్యావః ప్రసన్నో యది నౌ ప్రభుః.
ఋతేఽమరత్వం యువయోః సర్వముక్తం భవిష్యతి
అన్యద్ వృణీతం మృత్యోశ్చ విధానమమరైః సమం.
ప్రభవిష్యావ ఇతి యన్మహదభ్యుద్యతం తపః
యువయోర్హేతునానేన నామరత్వం విధీయతే.
త్రైలోక్యవిజయార్థాయ భవద్భ్యామాస్థితం తపః
హేతునానేన దైత్యేంద్రౌ న వాం కామం కరోమ్యహం.
త్రిషు లోకేషు యద్భూతం కించిత్ స్థావరజంగమం
సర్వస్మాన్నౌ భయం న స్యాదృతేఽన్యోన్యం
పితామహ.
యత్ ప్రార్థితం యథోక్తం చ కామమేతద్ దదాని వాం
మృత్యోర్విధానమేతచ్చ యథావద్ వా భవిష్యతి.
తతః పితామహో దత్త్వా వరమేతత్ తదా తయోః
నివర్త్య తపసస్తౌ చ బ్రహ్మలోకం జగామ హ.
లబ్ధ్వా వరాణి దైత్యేంద్రావథ తౌ భ్రాతరావుభౌ
అవధ్యౌ సర్వలోకస్య స్వమేవ భవనం గతౌ.
తౌ తు లబ్ధవరౌ దృష్ట్వా కృతకామౌ మనస్వినౌ
సర్వః సుహృజ్జనస్తాభ్యాం ప్రహర్షముపజగ్మివాన్.
తతస్తౌ తు జటా భిత్త్వా మౌలినౌ సంబభూవతుః
మహార్హాభరణోపేతౌ విరజోఽంబరధారిణౌ.
అకాలకౌముదీం చైవ చక్రతుః సార్వకాలికీం

## రెండువందల ఎనిమిదవ అధ్యాయము

అతి ప్రాచీనకాలంలో హిరణ్యకశిపుని వంశంలో నికుంభుడనే రాక్షసుడుండేవాడు. వాడు మహాబలవంతుడు. ఆ బలశాలికి భయంకర పరాక్రమం కల కుమారు లిద్దరు జన్మించారు. వారే సుందోపసుందనామాలతో విరాజిల్లిన వీరులు. ఆ అన్నదమ్ములు ఏవిషయంలోనూ విడివడేవారుకారు. వారికి త్రిలోకాధిపత్యంమీద ఆశ కలిగింది. గురువుల అనుజ్ఞతో వింధ్యపర్వతంమీద కూర్చుని తపస్సు ప్రారంభించారు. జటాజూటాలతో నార చీరలతో వారు తపోదీక్ష సాగిస్తున్నారు. ఆకలి దప్పికలను జయించి వాయుసేవనంతో కాలిబొటనవ్రేలిమీద నిలిచి ఉపాసన సాగించారు.

ఆవిధంగా వారు దీర్ఘకాలం సాగించేసరికి ఆతీవ్రతవల్ల వింధ్యగిరినుండి ధూమంబయలుదేరింది. దానికి దేవతలు భయపడి వారి తపస్సు భంగపరచాలని ఎన్నో రత్నరాసులు పోశారు. రత్నాలవంటి రమణీయకాంతల్ని ప్రదర్శించారు. ప్రయోజనం లేకపోయింది. ఆఖరికి వారు మాయ ప్రయోగించి సుందోపసుందుల ఆత్మీయులను హింసిస్తున్నట్టు వారి ఆక్రందనాలు వినిపింపజేసినా వారు చలించలేదు.

సుందోపసుందుల దీక్షకు బ్రహ్మ ప్రసన్నుడై వరం కోరుకొమ్మన్నాడు. అప్పుడు వారిద్దరూ ఏకకంఠంతో— చతుర్ముఖా! మాకు సర్వశస్త్రాస్త్ర జ్ఞానమూ మాయా వైదుష్యమూ అనుగ్రహించండి. అమరత్వంకూడా ఇప్పించండి—అనగా బ్రహ్మ అమరత్వం వారి తపస్సంకల్పంలో లేదు కనక మిగిలినవే యిచ్చానని అంటూ మరొకవరం వేడుకోమన్నాడు. వారు తమలో తాము ఒకరినొకరు చంపాలేకానీ ఇతరు లెవరివల్లా మృత్యువు లేకుండా వరమిమ్మన్నారు. అంగీకరించి బ్రహ్మ స్వస్థానం చేరాడు.

బ్రహ్మ ప్రసాదించిన వరాలతో వారు స్వగృహానికి వచ్చారు. వారిని చూసి బంధుమిత్రులంతా ఆనందించారు. అంతటా భోజనపాన భోగేచ్ఛాప్రేరకధ్వానాలే వినవస్తున్నాయి. నగరం ఆనందకోలాహలంతో మేళతాళాలతో నిర్భయంగా సంవత్సరాలు గడుపుతూన్నది.

208 వ అధ్యాయము సమాప్తము

## రెండువందల తొమ్మిదవ అధ్యాయము

సుందోపసుందులకు త్రిలోకాలనూ జయించాలనేవాంఛ ప్రబలమైంది. విజయయాత్ర సాగించమని సేనకు ఆజ్ఞ లిచ్చారు. మఘానక్షత్రదినాన రాత్రివేళ యాత్రారంభం మంచిదని మంత్రి పరిషన్మధ్యంలో నిశ్చయించారు. కవచధారులై వివిధాయుధాలూ ధరించి చారణుల స్తోత్రపాఠాలు వింటూ విజయగాథలు ఆకర్ణిస్తూ కామరూపు కల సుందోపసుందులు సేనాసమేతం దేవలోకంవైపు

నిత్యప్రముదితః సర్వస్తయోశ్చైవ సుహృజ్జనః.
భక్ష్యతాం భుజ్యతాం నిత్యం దీయతాం రమ్యతామితి
గీయతాం పీయతాం చేతి శబ్దశ్చాసీద్ గృహే గృహే.
తత్ర తత్ర మహానాదైరుత్కృష్టతలనాదితైః
హృష్టం ప్రముదితం సర్వం దైత్యానామభవత్పురం
తైస్తైర్విహారైర్బహుభిర్దైత్యానాం కామరూపిణాం
సమాః సంక్రీడతాం తేషామహరేకమివాభవత్ .

208 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల తొమ్మిదవ అధ్యాయము

ఉత్సవే వృత్తమాత్రే తు త్రైలోక్యాకాంక్షిణావుభౌ
మంత్రయిత్వా తతః సేనాం తావాజ్ఞాపయతాం తదా.
సుహృద్భిరభ్యనుజ్ఞాతే దైత్యైర్వృద్ధైశ్చ మంత్రిభిః
కృత్వా ప్రాస్థానికం రాత్రౌ మఘాసు యయతుస్తదా.
గదాపట్టిశధారిణ్యా శూలముద్గరహస్తయా
ప్రస్థితౌ సహ ధర్మిణ్యా మహత్యా దైత్యసేనయా.
మంగళైః స్తుతిభిశ్చాపి విజయప్రతిసంహితైః
చారణైః స్తూయమానౌ తౌ జగ్మతుః పరయా ముదా.
తావంతరిక్షముత్పత్య దైత్యౌ కామగమావుభౌ
దేవానామేవ భవనం జగ్మతుర్యుద్ధదుర్మదౌ.
తయోరాగమనం జ్ఞాత్వా వరదానం చ తత్ ప్రభోః
హిత్వా త్రివిష్టపం జగ్ముర్బ్రహ్మలోకం తతః సురాః
తావింద్రలోకం నిర్జిత్య యక్షరక్షోగణాంస్తదా
ఖేచరాణ్యపి భూతాని జఘ్నతుస్తీవ్రవిక్రమౌ.
అంతర్భూమిగతాన్ నాగాన్ జిత్వా తౌ చ మహారథౌ
సముద్రవాసినీః సర్వా మ్లేచ్ఛజాతీర్విజిగ్యతుః.
తతః సర్వాం మహీం జేతుమారబ్ధావుగ్రశాసనౌ
సైనికాంశ్చ సమాహూయ సుతీక్ష్ణం వాక్యమూచతుః.
రాజర్షయో మహాయజ్ఞైర్హవ్యకవ్యైర్ద్విజాతయః
తేజో బలం చ దేవానాం వర్ధయంతి శ్రియం తథా.
తేషామేవం ప్రవృత్తానాం సర్వేషామసురద్విషాం
సంభూయ సర్వైరస్మాభిః కార్యః సర్వాత్మనా వధః.
ఏవం సర్వాన్ సమాదిశ్య పూర్వతీరే మహోదధేః
క్రూరాం మతిం సమాస్థాయ జగ్మతుః సర్వతోముఖౌ.
యజ్ఞైర్యజంతి యే కేచిద్ యాజయంతి చ యే ద్విజాః
తాన్ సర్వాన్ ప్రసభం హత్వా బలినౌ జగ్మతుస్తతః.
ఆశ్రమేష్వగ్నిహోత్రాణి మునీనాం భావితాత్మనాం
గృహీత్వా ప్రక్షిపంత్యప్సు విశ్రబ్ధం సైనికాస్తయోః.
తపోధనైశ్చ యే క్రుద్ధైః శాపా ఉక్తా మహాత్మభిః
నాక్రామంత తయోస్తేపి వరదాననిరాకృతాః.
నాక్రామంత యదా శాపా బాణా ముక్తాః శిలాస్వివ
నియమాన్ సంపరిత్యజ్య వ్యద్రవంత ద్విజాతయః.
పృథివ్యాం యే తపఃసిద్ధా దాంతాః శమపరాయణాః
తయోర్భయాద్ దుద్రువుస్తే వైనతేయాదివోరగాః.
మథితైరాశ్రమైర్భగ్నైర్వికీర్ణకలశస్రువైః
శూన్యమాసీజ్జగత్ సర్వం కాలేనేవ హతం తదా.
తతో రాజన్నదృశ్యద్భిరృషిభిశ్చ మహాసురౌ
ఉభౌ వినిశ్చయం కృత్వా వికుర్వాతే వధైషిణౌ.
ప్రభిన్నకరటౌ మత్తౌ భూత్వా కుంజరరూపిణౌ
సంలీనమపి దుర్గేషు నిన్యతుర్యమసాదనం.
సింహౌ భూత్వా పునర్వ్యాఘ్రౌ పునశ్చాంతర్హితావుభౌ
తైస్తైరుపాయైస్తౌ క్రూరావృషీన్ దృష్ట్వా నిజఘ్నతుః.

సాగారు. బ్రహ్మదత్తవరసంపన్నులైన ఆ మహావీరులను జయించడం సాధ్యంకాదని ఇంద్రాదులు దేవలోకం విడిచి వెళ్ళారు. వారు అక్కడనుంచి కదిలి భూలోక నాగలోకాలను జయించి యక్ష రాక్షస మ్లేచ్ఛులను జయించారు. అనంతరం వారందరూ యజ్ఞయాగాది సత్కర్మలాచరించే రాజర్షులమీదా బ్రహ్మర్షులమీదా కత్తులు నూరసాగారు. ఆ మహారక్షకుల సైనికులు తూర్పు సముద్రతీరాన యజ్ఞదీక్షితులనూ ఋత్విక్కులనూ హింసించసాగినారు. ఆశ్రమాలలోని సామగ్రిని సరోవరాలలోకి విసరుతూ అగ్నిహోత్రాలను ఆర్పుతూ నిరాఘాటంగా చరిస్తున్నారు. వారిమీద ప్రయోగింపబడే శాపాలు రాతిమీద బాణాల్లా పనికిరాకుండా పోతున్నవి. వారి ఘాతుకాలతో ప్రపంచమే అస్తవ్యస్తమైపోయింది. మృగరూపాలతో గుహాలలో ప్రవేశించి అక్కడ ప్రశాంతంగా తపస్సు చేసుకునే వారిని బాధిస్తున్నారు. రాక్షస భీతితో యజ్ఞయాగాదులేకాక వివాహాది మంగళ కార్యాలూ ఎక్కడా జరగటంలేదు. వ్యవసాయం లేదు. వ్యాపారం లేదు. హాహాకారాలూ అస్థిపంజరాలూ వినిపిస్తున్నాయి. కనిపిస్తున్నాయి. స్వాహాస్వధావషట్కారాలతో మంగళఘోషలతో నినదించే భూమండలం ఆర్తనాదాలతో ఆక్రందనలతో భీభత్సంగా ఉన్నది.

సుందోపసుందుల ఘాతుకాలను చూడలేక ఇనశశి కుజాది గ్రహాలూ తారకాగణాలు తలలు వాల్చాయి. ఈప్రకారంగా ఆసోదరవీరులు నిఖిల భువన విజేతలై కురుక్షేత్రం రాజధానిగా నివసించసాగారు.

209 వ అధ్యాయము సమాప్తము.

## రెండువందల పదవ అధ్యాయము

అహంకారరహితులూ భూతదయార్ద్ర హృదయులూ అయిన బ్రహ్మర్షులు ఈ దైత్యసోదరుల హింసాకాండను చూసి సహించలేక సిద్ధర్షి దేవతా పరివేష్టితుడై ఉన్న బ్రహ్మను సమీపించారు.

పద్మాసనాసీనుడై ఉన్నాడు బ్రహ్మ. అగ్ని చంద్రుడూ సూర్యుడూ వాయువూ మహాదేవుడూ సుఖాసీనులై ఉన్నారు. బ్రహ్మపుత్రులైన మహర్షులూ వైఖానస వాలఖిల్య వానప్రస్థ మరీచి అజన్మ అవిమూఢ తేజోగర్భాది ఋషిమండలం విచ్చేసి ఆ రాక్షసుల హత్యాకాండను వినిపిస్తూ లోకకళ్యాణోపాయం చెప్పమన్నారు.

వారి దీనాలాపాలాకర్ణించి బ్రహ్మ విశ్వకర్మను పిలిచి లోకోత్తరసౌందర్యవతిని సృష్టించమన్నాడు. నానారత్నవిచిత్రభూషణాలతో అలంకరించి ఒక సౌందర్యరాశిని ప్రవేశపెట్టాడు విశ్వకర్మ. ఆమె శరీరంలో నువ్వుగింజవాసి ప్రదేశంచాలు సర్వజన హృదయాలనూ ఆకర్షించడానికి. ఉత్తమ రత్నాల లోంచి తిలాంశం చొప్పున ఆకర్షించి ఆమెను సృష్టించడంవల్ల ఆమెకు తిలోత్తమ అని నామకరణం చేశారు. ఆ అతిలోకసుందరి బ్రహ్మకు అంజలి ఘటించి తన కర్తవ్యాన్ని పృచ్ఛించింది. బ్రహ్మ ఆమెను తిలకిస్తూ— నువ్వు సుందోపసుందుల వద్దకు

నివృత్తయజ్ఞస్వాధ్యాయా ప్రణష్టనృపతిద్విజా
ఉత్సన్నోత్సవయజ్ఞా చ బభూవ వసుధా తదా
హాహాభూతా భయార్తా చ నివృత్తవిపణాపణా
నివృత్త దేవకార్యా చ పుణ్యోద్వాహవివర్జితా.
నివృత్తకృషిగోరక్షా విధ్వస్తనగరాశ్రమా
అస్థికంకాళసంకీర్ణా భూర్బభూవోగ్రదర్శనా
నివృత్తపితృకార్యం చ నిర్వషట్కారమంగళం
జగత్ ప్రతిభయాకారం దుష్ప్రేక్ష్యమభవత్ తదా.
చంద్రాదిత్యౌ గ్రహాస్తారా నక్షత్రాణి దివౌకసః
జగ్ముర్విషాదం తత్కర్మ దృష్ట్వా సుందోపసుందయోః.
ఏవం సర్వా దిశో దైత్యౌ జిత్వా క్రూరేణ కర్మణా
నిఃసపత్నౌ కురుక్షేత్రే నివేశమభిచక్రతుః.

209 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల పదవ అధ్యాయము

తతో దేవర్షయః సర్వే సిద్ధాశ్చ పరమర్షయః
జగ్ముస్తదాపరామార్తిం దృష్ట్వా తత్ కదనం మహత్.
తేఽభిజగ్ముర్జితక్రోధా జితాత్మానో జితేంద్రియాః
పితామహస్య భవనం జగతః కృపయా తదా.
తతో దదృశురాసీనం సహ దేవైః పితామహం
సిద్ధైర్బ్రహ్మర్షిభిశ్చైవ సమంతాత్ పరివారితం.
తత్ర దేవో మహాదేవ స్తత్రాగ్నిర్వాయునా సహ
చంద్రాదిత్యౌ చ శక్రశ్చ పారమేష్ఠ్యాస్తథర్షయః.
వైఖానసా వాలఖిల్యా వానప్రస్థా మరీచిపాః
అజాశ్చైవావిమూఢాశ్చ తేజోగర్భాస్తపస్వినః.
ఋషయః సర్వ ఏవైతే పితామహముపాగమన్
తతోఽభిగమ్య తే దీనాః సర్వ ఏవ మహర్షయః.
సుందోపసుందయోః కర్మ సర్వమేవ శశంసిరే
యథా హృతం యథా చైవ కృతం యేన క్రమేణ చ.
న్యవేదయం స్తతః సర్వమఖిలేన పితామహే
తతో దేవగణాః సర్వే తే చైవ పరమర్షయః.
తమేవార్థం పురస్కృత్య పితామహమచోదయన్
తతః పితామహః శ్రుత్వా సర్వేషాం తద్ వచస్తదా
ముహూర్తమివ సంచింత్య కర్తవ్యస్య చ నిశ్చయం
తయోర్వధం సముద్దిశ్య విశ్వకర్మాణ మాహ్వయత్.
దృష్ట్వా చ విశ్వకర్మాణం వ్యాదిదేశ పితామహః
సృజ్యతాం ప్రార్థనీయైకా ప్రమదేతి మహాతపాః.
పితామహం నమస్కృత్య తద్వాక్యమభినంద్య చ
నిర్మమే యోషితం దివ్యాం చింతయిత్వా పునః పునః
త్రిషు లోకేషు యత్ కించిద్ భూతం స్థావరజంగమం
సమానయద్ దర్శనీయం తత్ తదత్ర స విశ్వవిత్.
కోటిశశ్చైవ రత్నాని తస్యా గాత్రే న్యవేశయత్
తాం రత్న సంఘాతమయీమసృజత్ దేవరూపిణీం.
సా ప్రయత్నేన మహతా నిర్మితా విశ్వకర్మణా
త్రిషు లోకేషు నారీణాం రూపేణాప్రతిమాభవత్.
న తస్యాః సూక్ష్మమప్యస్తి యద్ గాత్రేరూపసంపదా
నియుక్తా యత్ర వా దృష్టిర్న సజ్జతి నిరీక్షతాం.
సా విగ్రహవతీవ శ్రీః కామరూపా వపుష్మతీ
జహార సర్వభూతానాం చక్షూంషి చ మనాంసి చ.
తిలం తిలం సమానీయ రత్నానాం యద్ వినిర్మితా
తిలోత్తమేతి తత్ తస్యా నామ చక్రే పితామహః.
బ్రహ్మాణంసానమస్కృత్య ప్రాంజలిర్వాక్యమబ్రవీత్
కిం కార్యం మయి భూతేశ యేనాస్మ్యద్యేహనిర్మితా.
గచ్ఛ సుందోపసుందాభ్యామసురాభ్యాంతిలోత్తమే
ప్రార్థనీయేన రూపేణ కురు భద్రే ప్రలోభనం
త్వత్కృతే దర్శనాదేవ రూపసంపత్కృతేన వై

వెళ్ళి ప్రథమదర్శనంలోనే వారిని విమోహితుల్ని చేసి వారిలో వారికి కలహం కలిగించు. దానివల్ల లోకకళ్యాణం జరుగుతుంది— అన్నాడు. తిలోత్తమ ప్రజాపతి ఆజ్ఞలను శిరసావహించి ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించింది.

అనంతరం ఆ తిలోత్తమ బ్రహ్మకు కుడి ఎడమల ఉన్న మహేశునికి మహేంద్రునికి ప్రదక్షిణించసాగింది. ఆమె ప్రక్కవైపు తిరిగితే అవైపే శివునికి శిరస్సు లేచింది. దేవేంద్రుడు సహస్రాక్షుడే అయినాడు. దేవతలూ తదితరులూ తిలోత్తమ మీదనే తమ దృష్టులను కేంద్రీకరించారు. ఆమె చలనానుసారం వారి కన్నులు కదులుతున్నాయి. ఆమె సభ్యజనులకు ప్రదక్షిణచేసి తిరిగి వెడుతూంటే ఈ సౌందర్యరేఖ కార్యసాధనతో తిరిగి వస్తుందని వారు విశ్వసించి బ్రహ్మ ఆదేశానుసారం స్వస్థానాలు చేరారు.

210 వ అధ్యాయం సమాప్తం

## రెండువందల పదకొండవ అధ్యాయం

ఆ సోదరవీరులు దేవ మానవ నాగ యక్ష రాక్షసులందరినీ జయించి వారి ధనధాన్యాదులు హరించి త్రిలోకాధిపతులై మనోహరసుందరీమణులతో సర్వభోగాలూ అనుభవిస్తూ భోజనపానాలే నిత్యకర్మలుగా జీవిస్తున్నారు. అంతఃపురపార్శ్వాలలోని ఉపవనాలలో పర్వతశిఖరాలపై నగరోద్యానాలలో యథేచ్ఛావిహారం సాగిస్తున్నారు.

విహరిస్తూ విహరిస్తూ వింధ్య పర్వత శిఖరం చేరారు. ఒకానొక సాలవృక్షచ్ఛాయలో సౌకర్యాలన్నీ అమరించుకొని రమణీయకామినీజనంతో మృదుతల్పాలమీద గోష్ఠి నడుపుతున్నారు. వారి మనస్సులను రంజింపజేయటానికి వారనారీజనం కల గానంతో తాళలయాన్వితంగా నృత్యం చేస్తున్నది.

ఆ సమయంలో—

చూచుసంతలో కన్ను చెదరగొట్టి హృదయాన్ని ఆకర్షించే శక్తిగల తిలోత్తమ ఆ పరిసర లతలపై విడుస్తూన్న పుష్పాలను కోసికొంటూన్నట్లున్నది. అప్పు డామెశరీరం అరుణాంశుకాచ్ఛాదనతో అద్భుతంగా అవభాసిస్తున్నది. ఆమె అక్కడి నదీ సమీపంలోని కర్ణికారపుష్పాలను విలాసంగా తుంచుతున్నది. తుంచుతూ తుంచుతూ పరమ ముగ్ధలా సుందోపసుందుల కను చోటికి దగ్గరగా వచ్చింది.

సురాపానంతో ఎర్రవారిన కనులు కల ఆ మదమత్తులు లోకోత్తరసౌందర్యసుషమాన్వితమైన తిలోత్తమను చూస్తూనే మదనజ్వర పీడితులై ఒకేసారిగా లేచి ఆమెను సమీపించారు. సమీపిస్తూనే ఆమె కుడిచేతిని సుందుడూ ఎడమచేతిని ఉపసుందుడూ గ్రహించారు.

బలమదానికి భాగ్యమదం దానికి వరమదం సహకరిస్తూండగా మద్యపానమదం వారిని మదమత్తులనే చేసిపారేసింది. ఆ ఉన్మత్తులు ఒకరినొకరు అరుణారుణనయనాలతో బొమముడి బిగించి చూచుకొంటూండగా ఆ నారీశిరోమణి వారిని చెరోకంటితోనూ గిరుకరించసాగింది. ఆ లావణ్యలహరి చూపులతో ఆడిన నాటకంతో వారి మదనమత్తత పరాకాష్ఠకు పోయింది.

నిరోధః స్యాద్యథా తాభ్యామన్యోన్యేన తథా కురు.
సా తథేతి ప్రతిజ్ఞాయ నమస్కృత్య పితామహం
చకార మండలం తత్ర విబుధానాం ప్రదక్షిణం.
ప్రాఙ్ముఖో భగవానాస్తే దక్షిణేన మహేశ్వరః
దేవాశ్చైవోత్తరేణాసన్
సర్వత స్త్వృషయోఽభవన్.
కుర్వత్యా తు తదా తత్ర మండలం తత్ ప్రదక్షిణం
ఇంద్రః స్థాణుశ్చ భగవాన్ ధైర్యేణ ప్రత్యవస్థితౌ
ద్రష్టుకామస్య చాత్యర్థం గతాయాః పార్శ్వత స్తదా
అన్యదంచితపక్ష్మాంతం దక్షిణం నిఃసృతం ముఖం.
పృష్ఠతః పరివర్తంత్యా పశ్చిమం నిఃసృతం ముఖం
గతయా చోత్తరం పార్శ్వముత్తరం నిఃసృతం ముఖం.
మహేంద్రస్యాపి నేత్రాణాం పృష్ఠతః పార్శ్వతోఽగ్రతః
రక్తాంతానాం విశాలానాం సహస్రం సర్వతోఽభవత్
ఏవం చతుర్ముఖః స్థాణుర్మహాదేవోఽభవత్ పురా
తథా సహస్రనేత్రశ్చ బభూవ బలసూదనః.
తథా దేవనికాయానాం మహర్షీణాం చ సర్వశః
ముఖాని చాభ్యవర్తంత యేన యాతి తిలోత్తమా.
తస్యా గాత్రే నిపతితా దృష్టిస్తేషాం మహాత్మనాం
సర్వేషామేవ భూయిష్ఠమృతే దేవం పితామహం.
గచ్ఛంత్యా తు తయా సర్వాం దేవాశ్చ పరమర్షయః
కృతమిత్యేవ తత్ కార్యం మేనిరే రూపసంపదా
తిలోత్తమాయాం తస్యాం తు గతాయాం లోకభావనః
సర్వాన్ విసర్జయామాస దేవానృషిగణాంశ్చ తాన్.

210 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల పదకొండవ అధ్యాయము

జిత్వా తు పృథివీం దైత్యౌ నిఃసపత్నౌ గతవ్యథౌ
కృత్వా త్రైలోక్యమవ్యగ్రం కృతకృత్యౌ బభూవతుః
దేవగంధర్వయక్షాణాం నాగపార్థివరక్షసాం
ఆదాయ సర్వరత్నాని పరాం తుష్టిముపాగతౌ.
యదా న ప్రతిషేద్ధార స్తయోః సంతీహ కేచన
నిరుద్యోగౌ తదా భూత్వా విజహ్రాతేఽమరావివ.
స్త్రీభిర్మాల్యైశ్చ గంధైశ్చ భక్ష్యభోజ్యైః సుపుష్కలైః
పానైశ్చ వివిధైర్హృద్యైః పరాం ప్రీతిమవాపతుః.
అంతఃపురవనోద్యానే పర్వతేషు వనేషు చ
యథేప్సితేషు దేశేషు విజహ్రాతేఽమరావివ.
తతః కదాచిత్ వింధ్యస్య ప్రస్థే సమశిలాతలే
పుష్పితాగ్రేషు శాలేషు విహారమభిజగ్మతుః.
దివ్యేషు సర్వకామేషు సమానీతేషు తావుభౌ
వరాసనేషు సంహృష్టౌ సహ స్త్రీభిర్నిషీదతుః.
తతో వాదిత్రనృత్యాభ్యాముపాతిష్ఠంత తౌ స్త్రియః
గీతైశ్చ స్తుతిసంయుక్తైః ప్రీత్యా సముపజగ్మిరే.
తతస్తిలోత్తమా తత్ర వనే పుష్పాణి చిన్వతీ
వేషం సాఽఽక్షిప్తమాధాయ రక్తేనైకేన వాససా.
నదీతీరేషు జాతాన్ సా కర్ణికారాన్ ప్రచిన్వతీ
శనైర్జగామ తం దేశం యత్రాస్తాం తౌ మహాసురౌ
తౌ తు పీత్వా వరం పానం మదరక్తాంతలోచనౌ
దృష్ట్వైవ తాం వరారోహాం వ్యథితౌ సంబభూవతుః.
తావుత్థాయాసనం హిత్వా జగ్మతుర్యత్ర సా స్థితా
ఉభౌ చ కామసమ్మత్తావుభౌ ప్రార్థయతశ్చ తాం.
దక్షిణే తాం కరే సుభ్రూం సుందో జగ్రాహ పాణినా
ఉపసుందోఽపి జగ్రాహ వామే పాణౌ తిలోత్తమాం.
వరప్రదానమత్తౌ తావౌరసేన బలేన చ
ధనరత్నమదాభ్యాం చ సురాపానమదేన చ.
సర్వైరేతైర్మదైర్మత్తావన్యోన్యం భ్రుకుటీకృతౌ

ఈ సౌందర్యరేఖ తన భార్య కావటంవల్ల ఉపసుందునికి తల్లి అవుతుందని సుందుడనగా తనభార్య కావటంవల్ల సుందునికి కోడలవుతుందని ఉపసుందుడన్నాడు. అంతతో వారిరువురిమధ్యా సౌదర్యం నన్నగిల్లింది. వాక్కలహం రేగింది. నేను ముందు చూశాననీ నేను ముందు చేయిపట్టాననీ ఆరంభించారు. ఆమె చేతిని వదిలి వారిరువురూ చేతులు కలుపుకున్నారు నెమ్మదిగా గదాయుద్ధంలోకి దిగినా రన్నదమ్ములు.

వారి పర్వతదేహాలనుండి రక్తజలధారలు ప్రవహించసాగాయి. పోరు ఘోరమై అన్నదమ్ములను భూపతితులను చేసింది. వారి నారీజనుల హాహాకారాలతో ఆకాశం దద్దరిల్లింది. భయంతో వారందరూ పలాయనం సాగించారు. రాక్షసులందరూ పాతాళంవైపు పోయారు.

బ్రహ్మ ఋషి దేవతాగణాలతో వచ్చి తిలోత్తమను అభినందించి ఆమెవల్ల మహాభువనానికి మహోపకారం జరిగిందనీ ప్రతిఫలంగా ఆమెకు కామగమనమూ అన్యజనదర్శనదుర్లభమైన సౌందర్యతేజమూ అనుగ్రహిస్తున్నానని వెళ్ళిపోయాడు. ధర్మరాజా! సౌందర్యవతికారణంగా సౌదర్యపరమా పక్షంలో సాగే సుందోపసుందులు మరణించారు. అందుచేతనే మీరొకనియమం పాలించాలి— అనగా వారు ద్రౌపది సంవత్సరానికి ఒకరివద్ద ఉంటుందనీ ఆసమయంలో రెండోవారు అటువెడితే పన్నెండేళ్ళు బ్రహ్మచర్యంతో వనవాసం చెయ్యాలనీ నియమం ఉంచుకోగా నారదుడు సంతోషంతో వెళ్ళిపోయాడు.

211 వ అధ్యాయం సమాప్తం

## రెండువందల పన్నెండవ అధ్యాయం

### అర్జునవనగమనపర్వము

పాండవులు తమ నియమానుసారం చరిస్తూ వారి ఆజ్ఞానుసారం నడిచే ద్రౌపదితో భోగిస్తూ బలపరాక్రమాలతో రాజులను వశపరచుకుంటూ ధర్మరతులై భోగవతిలో నాగులవలె స్వేచ్ఛగా కాలం గడుపుతున్నారు. ఒకనాడొక బ్రాహ్మణుడు వచ్చి— పాండవులారా! దొంగలు నా గోవులను అపహరించారు. హవిస్సును కాకి హరించినట్లు సింహగుహను నక్క దూరినట్లు దొంగలు నాధనాన్ని దోచుకున్నారు. ప్రజాధనంలో ఆరవవంతు పన్నుగాగ్రహించే చక్రవర్తి ప్రజారక్షణ చెయ్యాలి. నాకు గోవులులేకపోతే ఘృతక్షీరాలు లభించవు అవిలేకపోతే ధర్మకార్యాలు సాగవు కనక మీరు వచ్చి ప్రభుధర్మానుసారం నా గోవులను నాకు అర్పించండి— అని అరిచాడు.

ఆ ఘోష వింటూనే అర్జునుడు ఎదురువచ్చి— విప్రశ్రేష్ఠా! మీరు భయపడకండి. మీకేం విచారం లేదు. నేను మీ గోవులు మీకర్పిస్తాను— అన్నాడు.

అదేసమయానికి అస్త్రశాలలో ధర్మరాజు ద్రౌపదితో ఉన్నాడు. అర్జునుడు ధర్మసంకటంలో పడ్డాడు. ఇప్పుడు అస్త్రాలకోసం వెడితే నియమభంగం అవుతుంది. వెళ్ళకపోతే ఆర్తజనరక్షణ ధర్మభంగమవుతుంది. ఏమయినా ఈ బ్రాహ్మణుని

తౌ కటాక్షేణ జైత్రేంద్రావాకర్షణముహుర్ముహుః
దక్షిణేన కటాక్షేణ సుందం జగ్రాహ కామినీ.
వామేనైవ కటాక్షేణ ఉపసుందం జిఘృక్షతీ
గంధాభరణరూపాభ్యాం వ్యామోహం జగ్మతుస్తదా.
మదకామసమావిష్టౌ పరస్పరమథోచతుః
మమ భార్యా తవ గురురితి సుందోఽభ్యభాషత.
మమ భార్యా తవవధూరుప సుందోఽభ్యభాషతః.
నైషా తవ మమైషేతి తతస్తౌ మన్యురావిశత్
తస్యా రూపేణ సమ్మత్తౌ విగతస్నేహసౌహృదౌ.
తస్యా హేతోర్గదే భీమే సంగృహ్ణీతావుభౌ తదా
ప్రగృహ్య చ గదే భీమే తస్యాం తౌ కామమోహితౌ.
అహంపూర్వమహంపూర్వమిత్యన్యోన్యం నిజఘ్నతుః
తౌ గదాభిహతౌ భీమౌ పేతతుర్ధరణీతలే.
రుధిరేణావసిక్తాంగౌ ద్వావివార్కౌ నభశ్చ్యుతౌ
తతస్తా విద్రుతా నార్యః స చ దైత్యగణస్తథా.
పాతాళమగమత్ సర్వో విషాదభయకంపితః
తతః పితామహస్తత్ర సహ దేవైర్మహర్షిభిః.
ఆజగామ విశుద్ధాత్మా పూజయంశ్చ తిలోత్తమాం
వరేణచ్ఛందయామాస భగవాన్ ప్రపితామహః.
వరం దిత్సుః స తత్రైనాం ప్రీతః ప్రాహ పితామహః
ఆదిత్యచరితాంల్లోకాన్ విచరిష్యసి భావిని.

జసా తే చ సుదృష్టాం త్వాం న కరిష్యతి కశ్చన
ఏవం తస్యై వరం దత్వా సర్వలోకపితామహః.
ఇంద్రే త్రైలోక్యమాధాయ బ్రహ్మలోకం గతః ప్రభుః
ఏవం తౌ సహితౌ భూత్వా సర్వార్థేష్వేకనిశ్చయౌ.
తిలోత్తమార్థం సంక్రుద్ధావన్యోన్యమభిజఘ్నతుః
తస్మాద్ బ్రవీమి వః స్నేహాత్ సర్వాన్ భరతసత్తమాః.
యథా వో నాత్ర భేదః స్యాత్ సర్వేషాం ద్రౌపదీకృతే
తథా కురుత భద్రం వో మమ చేత్ ప్రియమిచ్ఛథ.
ఏవముక్తా మహాత్మానో నారదేన మహర్షిణా
సమయం చక్రిరే రాజంస్తేఽన్యోన్యవశమాగతాః
సమక్షం తస్య దేవర్షేర్నారదస్యామితౌజసః.
ఏకైకస్య గృహే కృష్ణా వసేద్ వర్షమకల్మషా
ద్రౌపద్యా నః సహాసీనానన్యోన్యం యోఽభిదర్శయేత్
స నో ద్వాదశ వర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్
కృతే తు సమయే తస్మిన్ పాండవైర్ధర్మచారిభిః.
నారదోఽప్యగమత్ ప్రీత ఇష్టం దేశం మహామునిః
ఏవం తైః సమయః పూర్వం కృతో నారదచోదితైః
న చాభిద్యంత తే సర్వే తదాన్యోన్యేన భారత.
ఏతద్ విస్తరశః సర్వమాఖ్యాతం తే నరేశ్వర
కాలే చ తస్మిన్ సంపన్నం యథావజ్జనమేజయ.

211 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల పన్నెండవ అధ్యాయము

### అర్జునవనగమన పర్వము

ఏవం తే సమయం కృత్వా న్యవసంస్తత్ర పాండవాః
వశే శస్త్రప్రతాపేన కుర్వంతోఽన్యాన్ మహీక్షితః.
తేషాం మనుజసింహానాం పంచానామమితౌజసాం
బభూవ కృష్ణా సర్వేషాం పార్థానాం వశవర్తినీ.
తే తయా తైశ్చ సా వీరైః పతిభిః సహ పంచభిః
బభూవ పరమప్రీతా నాగైరోగ్భగవతీ యథా.
వర్తమానేషు ధర్మేణ పాండవేషు మహాత్మసు
వ్యవర్ధన్ కురవః సర్వే హీనదోషాః సుఖాన్వితాః.
అథ దీర్ఘేణ కాలేన బ్రాహ్మణస్య విశాంపతే
కస్యచిత్ తస్కరా జహ్రుః కాశ్చిద్ గా నృపసత్తమ.
హ్రియమాణే ధనే తస్మిన్ బ్రాహ్మణః క్రోధమూర్ఛితః

మనస్సు తృప్తిపడచాలి. ఇందువల్ల నాకు వనవాస గమనం ప్రాప్తిస్తుంది. వచ్చినా సరే అని ఆయుధ శాలలోకి వెళ్ళి త్వరగా శస్త్రాస్త్రాలు తీసికొని గోబ్రాహ్మణరక్షణ నియమపాలనోద్యుక్తుడయినాడు అర్జునుడు. దొంగలను వెంటాడి గోవులను తెచ్చి బ్రాహ్మణునకు అర్పించాడు. ఆ విప్రుడు పరమానందంతో తిరిగి వెళ్ళాడు.

అర్జునుడు గురువృద్ధు లందరికీ అభివాదా లర్పించాడు. వారందరూ అభినందించారు. అప్పుడు అర్జునుడు ధర్మరాజును చేరి—అన్నా! మీరు పత్నీయుతులై ఆస్త్రాగారంలో ఉన్నారని తెలిసికూడా నేను వచ్చి ప్రతిజ్ఞాభంగదోషానికి పాలుపడ్డాను. కనక ప్రాయశ్చిత్తంగా అరణ్యానికి వెడుతున్నాను. అనుజ్ఞ ఇవ్వండి— అన్నాడు.

ధర్మరాజుకి ఆమాట రుచించలేదు. అర్జునుడు చేసింది అపరాధం కాదన్నాడు. అన్నగారు భార్యాసమేతంగా అంతర్మందిరంలో ఉన్నా తమ్ముడు రావచ్చుననీ తమ్ముడు పత్నీయుతుడై ఉండే అన్న రాకూడదనీ శాస్త్రమర్యాద ప్రవచించి ఎలా అయినా అతని వనవాస సంకల్పం పరిత్యజించ చూశాడు. ఆఖరికి అన్నగారి మాట తిరస్కరించరాదనీ అన్నాడు. ధర్మమార్గాన్ని ఏవిధంగానూ వీడకూడదని మీరే చెప్పారు. ఇప్పుడు నా వనవాసంవల్ల మీకేమీ ధర్మహాని జరుగదు. ఈ సందర్భంలో నేను మీ ఆజ్ఞాధిక్కారం చేయుటంలేదని అస్త్రప్రమాణంతో చెపుతున్నాను. నాకనుజ్ఞ దయచేయండి— అని అర్జునుడు వేడగా ధర్మరాజు తమ్ముని నియమపాలనకు సంతోషించి అభ్యనుజ్ఞ ఇచ్చాడు.

212 వ అధ్యాయము సమాప్తము

## రెండువందల పదమూడవ అధ్యాయము

### తీర్థయాత్ర

అర్జునుడు వనవాసయాత్రకు సన్నాహం చేశాడు. ఆ కురుకులకీర్తివర్ధనునివెంట వేదవేదాంగవిదులూ తత్త్వచింతనపరులూ కథాకథనకుశలురూ బ్రహ్మచారులూ వానప్రస్థులూ యతీశ్వరులూ పౌరాణికులూ భిక్షోపజీవులూ ఎందరో బయలుదేరారు. ఇంద్రుడు దేవతాపరివృతుడై సాగుతూ ఉన్నట్లు వారందరితో అర్జునుడు బయలుదేరి రమణీయ వనాలూ సరోవరాలూ దర్శిస్తూ హరిద్వారం చేరి అక్కడ ఆశ్రమం నిర్మించాడు. ఆ గంగాతటాన వారందరూ ఆశ్రమాలు వేసుకుని అగ్నికుండాలు ఏర్పరచుకొని గంగాస్నానంతో పరిశుద్ధ మనస్సుతో భగవద్ధ్యానపరాయణులై ఉంటున్నారు.

అలాఉండగా ఒకనాడు అర్జునుడు గంగాస్నానం చేసి పితృదేవతలకూ దేవగణాలకూ తర్పణాలు అర్పించి అగ్నిహోత్రం చేయబోతూండగా నాగరాజపుత్రి ఉలూపి వానిని మోహించి జలాంతర్భాగంలోకి తీసికొని వెళ్ళింది. కన్నులు తెరిచి చూచిన అర్జునునికి ఎదురుగా ప్రజ్వలిస్తూన్న అగ్ని గోచరించింది. కాలాతిక్రమణదోషం పట్టకుండా ఆఅగ్నిలోనే హోమంచేసి వీతిహోత్రునికి తృప్తి కలిగించాడు.

ఆగమ్య ఖాండవప్రస్థముదక్రోశత్ స పాండవాన్.
హ్రియతే గోధనం క్షుద్రైర్నృశంసైరకృతాత్మభిః
ప్రసహ్య చాస్మద్విషయాదభ్యధావత పాండవాః.
బ్రాహ్మణస్య ప్రశాంతస్య హవిర్ధ్వాంక్షైః ప్రలుప్యతే
శార్దూలస్య గుహాం శూన్యాం నీచః క్రోష్టాభిమర్దతి.
అరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణం
తమాహుః సర్వలోకస్య సమగ్రం పాపచారిణం.
బ్రాహ్మణస్వే హృతే చోరైర్ధర్మార్థే చ విలోపితే
రోరూయమాణే చ మయి క్రియతామస్త్రధారణం.
రోరూయమాణస్యాభ్యాసే భృశం విప్రస్య పాండవః
తాని వాక్యాని శుశ్రావ కుంతీపుత్రో ధనంజయః.
శ్రుత్వైవ చ మహాబాహుర్మాభైరిత్యాహ తం ద్విజం
ఆయుధాని చ యత్రాసన్ పాండవానాం మహాత్మనాం.

కృష్ణయా సహ తత్రాస్తే ధర్మరాజో యుధిష్ఠిరః
సంప్రవేశాయ చాశక్తో గమనాయ చ పాండవః.
తస్య చార్తస్య తైర్వాక్యైశ్చోద్యమానః పునః పునః
ఆక్రందే తత్ర కౌంతేయశ్చింతయామాస దుఃఖితః.
హ్రియమాణే ధనే తస్మిన్ బ్రాహ్మణస్య తపస్వినః
అశ్రుప్రమార్జనం తస్య కర్తవ్యమితి నిశ్చయః.
ఉపప్రేక్షణజోఽధర్మః సుమహాన్ స్యాన్మహీపతేః
యద్యస్య రుదతో ద్వారి న కరోమ్యద్య రక్షణం.
అనాస్తిక్యం చ సర్వేషామస్మాకమపి రక్షణే
ప్రతితిష్ఠేత లోకేఽస్మిన్నధర్మశ్చైవ నో భవేత్.
అనాదృత్య తు రాజానం గతే మయి న సంశయః
అజాతశత్రోర్నృపతేర్మమ చైవానృతం భవేత్.
అనుప్రవేశే రాజ్ఞస్తు వనవాసో భవేన్మమ
సర్వమన్యత్ పరిహృతం ధర్షణాత్తు మహీపతేః
అధర్మో వై మహానస్తు వనే వా మరణం మమ
శరీరస్య వినాశేన ధర్మ ఏవ విశిష్యతే.
ఏవం వినిశ్చిత్య తతః కుంతీపుత్రో ధనంజయః
అనుప్రవిశ్య రాజానమాపృచ్ఛ్య చ విశాంపతే.
ధనురాదాయ సంహృష్టో బ్రాహ్మణం ప్రత్యభాషత
బ్రాహ్మణాగమ్యతాం శీఘ్రం యావత్ పరధనైషిణః.
న దూరే తే గతాః క్షుద్రాస్తావద్ గచ్ఛావహే సహ
యావన్నివర్తయామ్యద్య చౌరహస్తాద్ ధనం తవ.
సోఽనుసృత్య మహాబాహుర్ధన్వీ వర్మీ రథీ ధ్వజీ
శరైర్విధ్వస్య తాంశ్చోరానవజిత్య చ తద్ ధనం.
బ్రాహ్మణం సముపాకృత్య యశః ప్రాప్య చ పాండవః
తతస్తద్ గోధనం పార్థో దత్త్వా తస్మై ద్విజాతయే.
ఆజగామ పురం వీరః సవ్యసాచీ ధనంజయః
సోఽభివాద్య గురూన్ సర్వాన్ సర్వైశ్చాప్యభినందితః.

ధర్మరాజమువాచేదం వ్రతమాదిశ మే ప్రభో
సమయః సమతిక్రాంతో భవత్సందర్శనే మయా.
వనవాసో గమిష్యామి సమయో హ్యేష నః కృతః
ఇత్యుక్తో ధర్మరాజస్తు వాక్యమప్రియం.
కథమిత్యబ్రవీద్ వాచా శోకార్తః సజ్జమానయా
యుధిష్ఠిరో గుడాకేశం భ్రాతా భ్రాతరమచ్యుతం
ఉవాచ దీనో రాజా చ ధనంజయమిదం వచః
ప్రమాణమస్మి యది తే మత్తః శృణు వచోఽనఘ.
అనుప్రవేశే యద్ వీర కృతవాంస్త్వం మమ ప్రియం
సర్వం తదనుజానామి వ్యలీకం న చ మే హృది.
గురోరనుప్రవేశో హి నోపఘాతో యవీయసః
యవీయసోఽనుప్రవేశో జ్యేష్ఠస్య విధిలోపకః.
నివర్తస్వ మహాబాహో కురుష్వ వచనం మమ
న హి తే ధర్మలోపోఽస్తి న చ తే ధర్షణా కృతా.
న వ్యాజేన చరేద్ ధర్మమితి మే భవతః శ్రుతం
న సత్యాద్ విచలిష్యామి సత్యేనాయుధమాలభే.
ఆజ్ఞా తు మమ దాతవ్యా భవతా కీర్తివర్ధన
భవదాజ్ఞామృతే కించిన్న కార్యమితి నిశ్చితం.
సోఽభ్యనుజ్ఞాయ రాజానం వనచర్యాయ దీక్షితః
వనే ద్వాదశ వర్షాణి వాసాయానుజగామ హ.

అనంతరం ఉలూపిని చూసి— భామా! నువ్వెవరి కన్యవు. ఈదేశ మెవరిది. నన్నెందుకిలా తెచ్చావు. ఏమి టీసాహసం— అని ప్రశ్నించగా ఆమె— నేను ఐరావతవంశీయుడైన కౌరవ్యుని కుమార్తెను. నాగకన్యను. నేను ఉలూపిని. నువ్వు స్నానార్థం గంగలో దిగినక్షణంలోనే నీ సౌందర్యం నన్ను నిలవరపరిచింది. నా శరీరం కామాగ్నితో పరితపిస్తున్నది. నిన్ను వినా నేను ఎవరినీ వరించను. ఆత్మదానంతో నాకు ఆనందం కలిగించు —అన్నది.

నాగసుందరీ! పన్నెండేండ్ల బ్రహ్మచర్యదీక్ష సాగిస్తానని ధర్మరాజుకి మాట ఇచ్చి వచ్చాను. ఇప్పుడు నేను అసత్యమార్గాన చరించలేను. నిన్ను చూస్తుంటే నీకు హితవు చేకూర్చాలని ఉంది. ధర్మభంగం కాకుండా నీకు ప్రియం కలిగించటం ఎలా—అని అర్జును డనగా—రాజపుత్రా! నీ బ్రహ్మచర్యనియమానికీ నీఅన్న ఆజ్ఞకూ కారణం నే నెరుగుదును. ఆ బ్రహ్మచర్యం ద్రౌపదీవిషయంలోనే అని మరిచిపోకు. అందుచేత ధర్మభీతి నీకు లేదు. నేను ఆర్తురాలిని. మదనుడు నన్ను వేధిస్తున్నాడు. నా ప్రాణరక్షణభారం నీమీద ఉన్నది. ధర్మాన్ని నువ్వు రక్షించవాలి. ఆర్తజనరక్షణ సత్పురుషలక్షణం. నువ్వు నా మనోరథం నెరవేర్చకపోతే నేను ప్రాణత్యాగం చేస్తాను. ప్రాణదానం చేసి పుణ్యంకట్టుకో. అనుదినం ఎందరో అనాథుల్నీ దీనుల్నీ నువ్వు రక్షిస్తూనే ఉన్నావు. కనకనే నేను అర్థిస్తున్నాను. నీ సమాగమాన్ని వాంఛిస్తున్నాను— అని ఉలూపి ధర్మయుక్తంగా పలికేసరికి అర్జునుడు కాదన లేక ఆరాత్రి నాగరాజసౌధంలో ఉండి ఉలూపికి హృదయశాంతి కలిగించి ఉదయారుణకోమలంలో లేచి ఉలూపి సహాకారంతో గంగాద్వారం చేరాడు.

ఉలూపి అర్జునుని విడిచివెళుతూ— ఈక్షణం మొదలు నీకు జలభయం లేదు. జలచరాలన్నీ నీవశంలో ఉంటాయి— అని ఆనందంతో వెళ్ళిపోయింది. ఆమెవల్ల అర్జునుడు వరాలు పొందగా ఆమె అర్జునునివల్ల ఇరావంతుడనే పేరుగల కుమారుని కన్నది.

213 వ అధ్యాయం సమాప్తం

## రెండువందల పదునాల్గవ అధ్యాయం

అక్కడ విడిచేదిసినవా రందరికీ రాత్రి వృత్తాంతం నివేదించి హిమాలయంవైపు నడిచి అగస్త్యవటాన్నీ వసిష్ఠపర్వతాన్నీ దర్శించి భృగుతుంగలో శౌచస్నానాదికం ముగించుకొని బ్రాహ్మణులకు గోదానాలూ గృహదానాలూ చేసి హిరణ్యబిందుతీర్థంలో స్నానంచేసి ఆ శీతాచలంమీద పుణ్యక్షేత్రాలన్నీ చూసి తూర్పుదిక్కుగా ప్రయాణం సాగించి తీర్థాలను సేవించి నైమిశారణ్యంనుండి వెళ్ళే ఉత్పలినీ యశస్వినీ నందా అపరనందా కౌశికీ మహానదులనూ గంగనూ సేవించి గయా కాశీ క్షేత్రాలమీదుగా పవిత్రాశ్రమవాటికలను దర్శిస్తూ అంగ వంగ కళింగ రాజ్యాలను అవలోకిస్తూ భూరిదక్షిణలతో దానాలతో సాగుతున్నాడు. కళింగం చేరిన అనంతరం అతనివెంట వచ్చే బ్రాహ్మణులు వాని అనుమతిమీద నిజగృహాలవైపు తిరిగారు. వారి ఆశీస్సులతో కొలది పరివారాన్ని

## రెండువందల పదమూడవ అధ్యాయము

తంప్రయాంతంమహాబాహుంకౌరవాణాంయశస్కరం
అనుజగ్ముర్మహాత్మానో బ్రాహ్మణా వేదపారగాః.
వేదవేదాంగవిద్వాంస స్తథైవాధ్యాత్మచింతకాః
భైక్షాశ్చభగవద్భక్తాః సూతాః పౌరాణికాశ్చయే.
కథకాశ్చాపరే రాజన్ శ్రమణాశ్చ వనౌకసః
దివ్యాఖ్యానాని యే చాపి పఠంతి మధురం ద్విజాః.
ఏతైశ్చాన్యైశ్చ బహుభిఃసహాయైః పాండునందనః
వృతః శ్లక్ష్ణకథైః ప్రాయాన్మరుద్భిరివ వాసవః.
రమణీయాని చిత్రాణి వనాని చ సరాంసి చ
సరితః సాగరాంశ్చైవ దేశానపి చ భారత.
పుణ్యాన్యపి చ తీర్థాని దదర్శ భరతర్షభః
స గంగాద్వారమాశ్రిత్య నివేశమకరోత్ ప్రభుః.
తత్ర తస్యాద్భుతం కర్మ శృణుత్వం జనమేజయ
కృతవాన్ యద్ విశుద్ధాత్మా పాండూనాం ప్రవరో హి సః.

నివిష్టే తత్ర కౌంతేయే బ్రాహ్మణేషు చ భారత
అగ్నిహోత్రాణి విప్రాస్తే ప్రాదుశ్చక్రురనేకశః.
తేషుప్రబోధ్యమానేషు జ్వలితేషు హుతేషు చ
కృతపుష్పోపహారేషు తీరాంతరగతేషు చ.
కృతాభిషేకైర్విద్వద్భిర్నియతైఃసత్పథిస్థితైః
శుశుభేఽతీవతద్ రాజన్ గంగాద్వారంమహాత్మభిః.
తథా పర్యాకులే తస్మిన్ నివేశే పాండవర్షభః
అభిషేకాయ కౌంతేయో గంగామవతతార హ.
తత్రాభిషేకం కృత్వా స తర్పయిత్వా పితామహాన్
ఉత్తితీర్షుర్జలాద్ రాజన్నగ్నికార్యచికీర్షయా.
అపకృష్టో మహాబాహుర్నాగరాజస్య కన్యయా
అంతర్జలే మహారాజ ఉలూప్యా కామయానయా.
దదర్శ పాండవస్తత్ర పావకం సుసమాహితః
కౌరవ్యస్యాథ నాగస్య భవనే పరమార్చితే.

తత్రాగ్నికార్యం కృతవాన్ కుంతీపుత్రో ధనంజయః
అశంకమానేన హుతస్తేనాతుష్యద్ధుతాశనః.
అగ్నికార్యం స కృత్వా తు నాగరాజసుతాం తదా
ప్రహసన్నివ కౌంతేయ ఇదం వచనమబ్రవీత్.
కిమిదం సాహసం భీరు కృతవత్యసి భావిని
కశ్చాయంసుభగేదేశఃకాచత్వంకస్యవాఽఽత్మజా.
ఐరావతకులేజాతః కౌరవ్యోనామ పన్నగః
తస్యాస్మి దుహితా రాజన్నులూపీ నామ పన్నగీ.
సాహం త్వామభిషేకార్థమపతీర్ణం సముద్రగాం
దృష్ట్వైవ పురుషవ్యాఘ్ర కందర్పేణాభిమూర్ఛితా.
తాం మామనంగగ్లపితాం త్వత్కృతే కురునందన
అనన్యాం నందయస్వాద్య ప్రదానేనాత్మనోఽనఘ.
బ్రహ్మచర్యమిదం భద్రే మమ ద్వాదశవార్షికం
ధర్మరాజేన చాదిష్టం నాహమస్మి స్వయంవశః.
తవ చాపి ప్రియం కర్తుమిచ్ఛామి జలచారిణి
అనృతం నోక్తపూర్వం చ మయా కించనకర్హిచిత్.
కథం చ నానృతం మేస్యాత్ తవ చాపిప్రియంభవేత్
న చ పీడ్యేత మే ధర్మస్తథా కుర్యా భుజంగమే.
జానామ్యహం పాండవేయ యథా చరసి మేదినీం
యథా చ తే బ్రహ్మచర్యమిదమాదిష్టవాన్ గురుః.
పరస్పరం వర్తమానాన్ ద్రుపదస్యాత్మజాం ప్రతి
యోనోఽనుప్రవిశేన్మోహాత్ సవై ద్వాదశవార్షికం.
వనే చరేద్ బ్రహ్మచర్యమితి వః సమయః కృతః
తదిదం ద్రౌపదీహేతోరన్యోన్యస్య ప్రవాసనం.
కృతవాంస్తత్ర ధర్మార్థమత్ర ధర్మో న దుష్యతి
పరిత్రాణం చ కర్తవ్యమార్తానాం పృథులోచన.
కృత్వా మమ పరిత్రాణం తవ ధర్మో న లుప్యతే
యదివాప్యస్యధర్మస్యసూక్ష్మోఽపిస్యాద్ వ్యతిక్రమః
స చతేధర్మఏవస్యాద్ దత్త్వా ప్రాణా మమార్జున

వెంటబెట్టుకొని అర్జునుడు కళింగం విడిచి సముద్రతీరాన సాగి సాగి మణిపురం చేరాడు. మణిపుర రాజవీథులలో విహరించే ఆవీరుడు ఒకానొక నారీశిరోమణిని చూశాడు. ఆచూపులోనే అతని మనస్సు ఆమెమీద లగ్నమైంది. ఆమె ఆనగరాధీశుడైన చిత్రవాహనుని ముద్దులపట్టి. చిత్రాంగద అనే పేరుతో వ్యవహరింపబడుతూన్న ఆ తరుణి నిచ్చి పెండ్లిచేయవలసిందని అర్జునుడు మహారాజునే అడిగాడు.

అడుగగా ఆ మహారాజు అర్జునుని గోత్రనామాలడిగాడు. తాను పాండురాజనందనుడననీ ధనంజయ నామంతో నన్ను వ్యవహరిస్తారనీ అన్నాడు— అర్జునుడు.

ఈవంశంలో పూర్వం ప్రభంజనుడనే రాజు సంతానం లేక శివునికొరకు తపస్సు చేసి మెప్పించి తరతరాలకూ ఒక పుత్రుని వరంగా పొందాడు. నావరకూ ఆసంప్రదాయం సాగింది. కాని నాకు మాత్రం ఈకుమార్తె కలిగింది. నేనీమెనే కుమారునిగా భావిస్తున్నాను. ఈమెకు కలిగే ప్రథమసుతుడే ఈరాజ్యానికి ఔరసుడు కావాలి. వాడిక్కడే ఉండాలి. ఇందుకు నువ్వు సమ్మతిస్తే నా అభ్యంతరం లేదనగా అర్జునుడు సమ్మతించి మూడువత్సరాలక్కడే గడిపి కుమారుని ప్రసాదించి ఆమెను గాఢ పరిష్వంగంలోకి తీసుకొని సెలవు పొంది ముందుకు సాగాడు.

214 వ అధ్యాయం సమాప్తం.

## రెండువందల పదిహేనవ అధ్యాయము

అర్జునుడు దక్షిణ సముద్రతీరంవెంట యాత్ర సాగిస్తున్నాడు. ఆ ప్రాంతాలలో ఋషుల ఆశ్రమాలూ వారి నివాసంవల్ల పవిత్రమైన పుణ్యక్షేత్రాలూ సందర్శించాడు. అగస్త్య సౌభద్ర పౌలోమ క్షేత్రాలూ అశ్వమేధయాగ ఫలాన్నిచ్చే కరంధమతీర్థమూ సర్వపాపహారియైన భారద్వాజక్షేత్రమూ చూశాడు. ఈ తీర్థపంచకం ప్రశాంతవాతావరణంతో ఉన్నది. కానీ ఆ ఛాయలలో ఋషిమాత్రుడైనా కనబడలేదు. కొద్ది దూరాన కనిపించిన ఋషులను సమీపించి ఈ పంచతీర్థాలూ ఈస్థితికి రావడానికి హేతు వేమిటని అడుగగా ఈతీర్థాలలో పెద్ద పెద్ద మొసళ్ళు ఉండి స్నానానికి వచ్చేవారిని హింసించడంవల్ల ఇవి విసర్జించబడ్డాయి అన్నారు వారు. మహర్షులు వారిస్తున్నా అర్జునుడు వినక సౌభద్రంలో దిగాడు. ఉత్తర క్షణంలో మొసలి వచ్చి వాని కాలు పట్టి లాగసాగింది. అర్జునుడు తన ఘనబాహువులతో ఆమొసలిని ఒడ్డుకు లాగేసరికి అది మొసలిరూపం విడిచి దివ్యసుందరస్త్రీరూపంతో నిలిచింది.

ఆశ్చర్యంతో అర్జునుడు ఆమె వివరాలు అడిగాడు. ఆమె తనపేరు వర్గ అనీ కుబేరుని ప్రియురాలననీ తనకు చెలికత్తెలు నలుగున్నారనీ వారందరూ కుబేరసౌధానికి వెడుతూ దారిలో తపస్స్వాధ్యాయనిరతుడైన ఒక బ్రాహ్మణుని చూసి ఆ వనంలో దిగి ఆయన తపస్సుకి భంగం కలిగించాలని ప్రయత్నించగా ఆ మహర్షి అచంచలంగా

భక్తాం చ భజ మాం పార్థ సతామేతన్మతం ప్రభో.
న కరిష్యసి చేదేవం మృతాం మాముపధారయ
ప్రాణదానాన్మహాబాహో చర ధర్మమనుత్తమం.
శరణం చ ప్రపన్నాస్మి త్వామద్య పురుషోత్తమ
దీనాననాథాన్ కౌంతేయ పరిరక్షసి నిత్యశః.
సాహం శరణమభ్యేమి రోరవీమి చ దుఃఖితా
యాచే త్వాం చాభికామాహం తస్మాత్ కురు
మమ ప్రియం
స త్వమాత్మప్రదానేన సకామాం కర్తుమర్హసి.
ఏవముక్తస్తు కౌంతేయః పన్నగేశ్వరకన్యయా
కృతవాంస్తత్ తథా సర్వం ధర్మముద్దిశ్య కారణం.
స నాగభవనే రాత్రిం తాముషిత్వా ప్రతాపవాన్
ఉదితేఽభ్యుత్థితః సూర్యే కౌరవ్యస్య నివేశనాత్.
ఆగతస్తు పునస్తత్ర గంగాద్వారం తయా సహ
పరిత్యజ్య గతా సాధ్వీ ఉలూపీ నిజమందిరం.
దత్త్వా వరమజేయత్వం జలే సర్వత్ర భారత
సాధ్యా జలచరాః సర్వే భవిష్యంతి న సంశయః.
పుత్రముత్పాదయామాస స తస్యాం సుమనోహరం
ఇరావతం మహాభాగం మహాబలపరాక్రమం.

213 వ అధ్యాయము సమాప్తము

## రెండువందల పదునాల్గవ అధ్యాయము

కథయిత్వా చ తత్ సర్వం బ్రాహ్మణేభ్యః సభారత
ప్రయయౌ హిమవత్పార్శ్వం తతో వజ్రధరాత్మజః.
అగస్త్యవటమాసాద్య వసిష్ఠస్య చ పర్వతం
భృగుతుంగేచ కౌంతేయః కృతవాన్శౌచమాత్మనః.
ప్రదదౌ గోసహస్రాణి సుబహూని చ భారత
నివేశాంశ్చ ద్విజాతిభ్యః సోఽదదత్ కురుసత్తమః.
హిరణ్యబిందోస్తీర్థే చ స్నాత్వా పురుషసత్తమః
దృష్టవాన్ పాండవశ్రేష్ఠః పుణ్యాన్యాయతనాని చ.
అవతీర్య నరశ్రేష్ఠో బ్రాహ్మణైః సహ భారత
ప్రాచీం దిశమభిప్రేప్సుర్జగామ భరతర్షభః.
ఆనుపూర్వ్యేణ తీర్థాని దృష్టవాన్ కురుసత్తమః
నదీం చోత్పలినీం రమ్యామరణ్యం నైమిషం ప్రతి.
నందామపరనందాం చ కౌశికీం చ యశస్వినీం
మహానదీం గయాం చైవ గంగామపి చ భారత.
ఏవం తీర్థాని సర్వాణి పశ్యమానస్తథాశ్రమాన్
ఆత్మనః పావనం కుర్వన్ బ్రాహ్మణేభ్యో దదౌ చ గాః.
అంగవంగకళింగేషు యాని తీర్థాని కానిచిత్
జగామ తాని సర్వాణి పుణ్యాన్యాయతనాని చ.
దృష్ట్వా చ విధివత్ తాని ధనం చాపి దదౌ తతః
కళింగరాష్ట్రద్వారేషు బ్రాహ్మణాః పాండవానుగాః
అభ్యనుజ్ఞాయ కౌంతేయముపావర్తంత భారత.
స తు తైరభ్యనుజ్ఞాతః కుంతీపుత్రో ధనంజయః
సహాయైరల్పకైః శూరః ప్రయయౌ యత్ర సాగరః.
స కళింగానతిక్రమ్య దేశానాయతనాని చ
హర్మ్యాణి రమణీయాని ప్రేక్షమాణో యయౌ ప్రభుః.
మహేంద్రపర్వతం దృష్ట్వా తాపసైరుపశోభితం
సముద్రతీరేణ శనైర్మణిపూరం జగామ హ.
తత్ర సర్వాణి తీర్థాని పుణ్యాన్యాయతనాని చ
అభిగమ్య మహాబాహురభ్యగచ్ఛన్మహీపతిం.
మణిపూరేశ్వరం రాజన్ ధర్మజ్ఞం చిత్రవాహనం
తస్య చిత్రాంగదా నామ దుహితా చారుదర్శనా.
తాం దదర్శ పురే తస్మిన్ విచరంతీం యదృచ్ఛయా.

అలాగే ఉండి తమ నృత్యగీతాలకు హస్తం లేకపోవటంవల్ల ఈవిధంగా మొసళ్ళరూపంలో ఉండమని శపించారనీ నీకు చెలికత్తెలైన సౌరభేయీ సమీచీ బుద్బుదా లతా అనే పేర్లతో ఈ తీర్థాలలో ఉన్నారనీ అన్నది.

215 వ అధ్యాయః సమాప్తం

## రెండువందల పదహారవ అధ్యాయం

ఋషి శాపభయంతో వారందరూ ఆయనను సమీపించి అవధ్యులయిన స్త్రీలకు మరణతుల్యమైన ఈశాపం ప్రసాదించటం కరుణామయుడగు వానికి ధర్మంకాదనీ మహాత్ములు శరణార్థులను అనుగ్రహించాలనీ ప్రార్థించగా ఆయన అనుగ్రహించి అనంతకాలవాచకాలయిన శతసహస్రశబ్దాలతో తాను శపించినా అది నూరుసంవత్సరాలకే పరిమితమనీ అన్నాళ్ళూ మొసళ్ళరూపంతో ఉండి జీవహింస చేస్తూండగా ఒక మహాపురుషుడువచ్చి నీటినుండి ఒడ్డున పడవేసిన క్షణంలో శాపవిమోచన మవుతుందనీ తనవాక్కు సత్యబద్ధం కనక శాపం అనుభవించాలనీ అన్నాడు. అంతేకాకుండా అద్యఃప్రభృతి ఈతీర్థాలు నారీతీర్థాలుగా ప్రఖ్యాతాలై సర్వజన సంసేవ్యాలవుతాయనీకూడా ఆయన అన్నాడు.

వర్గ ఈవృత్తాంతమంతా పార్థునికి నివేదించి ఆ శాపస్థితిలో తాము దుఃఖహృదయంతో అనేక ప్రాంతాలు తిరుగుతూండగా భగవదనుగ్రహంవల్ల నారదమహర్షి దర్శనమయిందనీ ఆ మహర్షికి నమస్కరించి అవనతవదనులై ఉండగా ఆయన కారణం అడిగి తెలిసికొని దక్షిణసముద్రతీరంలో ఉన్న పంచతీర్థాలలో ఉండవలసిందనీ అచిరకాలంలో అర్జునుడు మీ దుఃఖం పోగొడతాడనీ అన్నారని చెప్పి అది నేటికి యథార్థమైందని పలికి మిగిలిన నలుగురికీ శాపవిమోచనం కలిగించమనగా అర్జునుడు ఆ ప్రకారంగా చేశాడు. అనంతరం చిత్రాంగదను చూడటానికి మణిపురం వెళ్ళాడు.

అప్పటికే ఆమె బభ్రువాహనుడనే కుమారుని కన్నది. అర్జునుడు కుమారుని వెంట బెట్టుకొని చిత్రాంగద తండ్రికర్పించి ఋణవిముక్తుణ్ణయానని చెప్పి అవసరమైనప్పుడు ఇంద్రప్రస్థం వచ్చి సమస్త భోగాలూ అనుభవించమని చిత్రాంగదతో పలికి అక్కడ తనతల్లి కుంతీ సోదరులైన భీమ నకుల సహదేవులూ అగ్రజుడు ధర్మజుడూ ఆమె రాకను ఎంతో సంతోషిస్తారనీ తన అన్న రాజసూయం చేసినప్పుడు నానాదేశాధీశులవలెనే చిత్రవాహనుడుకూడా కానుకలతో వచ్చేటప్పుడు ఆమెకూడా రావచ్చుననీ అంతవరకూ బభ్రువాహనుని జాగ్రత్తగా పోషించి పాలించమనీ ధర్మమర్యాదానుసారం వీడు చిత్రవాహననందనుడే అయినా పురువంశానికి ఆనందకరుడనీ తన వియోగానికి చింతించవద్దనీ లాలించి గోకర్ణంవైపు అడుగువేశాడు. దర్శనమాత్రాన మోక్షప్రాప్తినిచ్చే శివక్షేత్రం గోకర్ణం చేరాడు.

దృష్ట్వా చ తాం వరారోహాంచకమే చైత్రవాహినీం
అభిగమ్య చ రాజానమవదత్ స్వం ప్రయోజనం
దేహి మేఖల్విమాం రాజన్ క్షత్రియాయమహాత్మనే.
తచ్ఛ్రుత్వాత్వబ్రవీద్ రాజా కస్యపుత్రోఽసినామకిం
ఉవాచ తం పాండవోఽహం కుంతీపుత్రోధనంజయః
తమువాచాథ రాజా స సాంత్వపూర్వమిదం వచః
రాజా ప్రభంజనోనామకులేఽస్మిన్ సంబభూవ హ.
అపుత్రః ప్రసవేనార్థీ తప స్తేపే స ఉ త్తమం
ఉగ్రేణ తపసా తేన దేవదేవః పినాకధృత్.
ఈశ్వరస్తోషితః పార్థ దేవదేవ ఉమాపతిః
స తస్మై భగవాన్ ప్రాదాదేకై కం ప్రసవం కులే.
ఏకై కః ప్రసవ స్తస్మాద్ భవత్యస్మిన్ కులే సదా
తేషాంకుమారాః సర్వేషాంపూర్వేషాంమమజజ్ఞిరే.
ఏకా చ మమ కన్యేయం కులస్యోత్పాదినీ భృశం
పుత్రో మమాయమితి మే భావనా పురుషర్షభ.
పుత్రికా హేతువిధినా సంజ్ఞితా భరతర్షభ
తస్మాదేకః సుతో యోఽస్యాం జాయతే భారత త్వయా.
ఏతచ్ఛుల్కం భవత్వస్యాః కులకృజ్జాయతామిహ
ఏతేన సమయేనేమాం ప్రతిగృహ్ణీష్వ పాండవ.
స తథేతి ప్రతిజ్ఞాయ తాం కన్యాం ప్రతిగృహ్య చ
ఉవాస నగరే తస్మిం స్త్రిసః కుంతీసుతః సమాః
తస్యాం సుతే సముత్పన్నే పరిష్వజ్య వరాంగనాం
ఆమంత్ర్య నృపతిం తం తు జగామ పరివ ర్తితుం.

214 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల పదిహేనవ అధ్యాయము

తతః సముద్రే తీర్థాని దక్షిణే భరతర్షభ
అభ్యగచ్ఛత్ సుపుణ్యాని శోభితాని తపస్విభిః.
వర్జయంతి స్మ తీర్థాని తత్ర పంచ స్మ తాపసాః
అవకీర్ణాని యాన్యాసన్ పురస్తాత్ తు తపస్విభిః.
అగ స్త్యతీర్థం సౌభద్రం పౌలోమం చ సుపావనం
కారంధమం ప్రసన్నం చ హయమేధఫలం చ తత్.
భారద్వాజస్య తీర్థం తు పాపప్రశమనం మహత్
ఏతా ని పంచ తీర్థాని దదర్శ కురుస త్తమః.
వివిక్తానుపలక్ష్యాథ తాని తీర్థాని పాండవః
దృష్ట్వా చ వర్జ్యమానాని మునిభిర్ధర్మబుద్ధిభిః.
తపస్వినస్తతోఽపృచ్ఛత్ ప్రాంజలిః కురునందనః
తీర్థానీమాని వర్జ్యంతే కిమర్థం బ్రహ్మవాదిభిః.
గ్రాహాః పంచ వసంత్యేషు హరంతి చ తపోధనాన్
తత ఏతాని వర్జ్యంతే తీర్థాని కురునందన.
తేషాంశ్రుత్వామహాబాహుర్వార్యమాణ స్తపోధనైః
జగామ తాని తీర్థాని ద్రష్టుం పురుషస త్తమః.
తతః సౌభద్రమాసాద్య మహర్షే స్తీర్థము త్తమం
విగాహ్య సహసా శూరః స్నానం చక్రే పరంతపః.
అథ తం పురుషవ్యాఘ్రమంతర్జలచరో మహాన్
జగ్రాహ చరణే గ్రాహః కుంతీపుత్రం ధనంజయం.
స తమాదాయ కౌంతేయో విస్ఫురంతం జలేచరం
ఉదతిష్ఠన్మహాబాహుర్బలేన బలినాం వరః.
ఉత్కృష్ట ఏవ గ్రాహస్తు సోఽర్జునేన యశస్వినా
బభూవ నారీ కల్యాణీ సర్వాభరణభూషితా.
దీప్యమానా శ్రియారాజన్ దివ్యరూపా మనోరమా
తదద్భుతం మహాద్ దృష్ట్వా కుంతీపుత్రోధనంజయః.
తాం స్త్రియం పరమప్రీత ఇదం వచనమబ్రవీత్
కా వై త్వమసి కల్యాణి కుతో వాసి జలేచరీ.

## రెండువందల పదిహేడవ అధ్యాయము

ద్వారక

అప్పుడు గోకర్ణంలో పరమశివునిదర్శించి పశ్చిమ సముద్రతీరం వెంట సాగి సాగి పుణ్యక్షేత్రాలు చూస్తూ దేవతలను దర్శిస్తూ పవిత్రరమణీయమైన ప్రభాసక్షేత్రం చేరాడు. ఆ వార్త తెలిసి శ్రీకృష్ణుడు వచ్చాడు. బావమరదు లిద్దరూ కుశల ప్రశ్నలు వేసికొన్నారు. నరనారాయణరూపులైన వారుభయులూ ఏకాంతంలో ఆసీనులయారు. అప్పుడు శ్రీకృష్ణుడు ఈయాత్రకు కారణ మేమని అడుగగా అర్జునుడు వివరంగా చెప్పాడు.

అనంతరం కొంతసేపు ఆక్షేత్రంలో విహరించి రాత్రివేళకు రైవతకాద్రి చేరారు. కృష్ణుని ఆజ్ఞానుసారం అంతకుముందే అక్కడ శయ్యాగారాలు ఏర్పాటయాయి. రాత్రి భోజనానంతరం కొంత సేపు నర్తకీమణుల కళాకౌశలం దర్శించి వారిని యథోచితంగా సమ్మానించి ఉభయులూ సుఖ నిద్రకు చేరారు. ప్రక్కలమీద పరుండి వారిద్దరూ ఇష్టాగోష్ఠి సాగించారు. అర్జునుడు తాను దర్శించిన తీర్థక్షేత్రాశ్రమాల విశేషాలన్నీ విచిత్రానుభూతిజనకంగా చెప్పాడు. వీణావేణుమృదంగాది మంగళవాద్యాలతో తూరుపు తెల్లవారుతూండగా స్తోత్రపాఠాలు వింటూ వారు నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొన్నారు.

శ్రీకృష్ణుని ఆజ్ఞానుసారం అర్జునుడు సువర్ణ రథం అధిరోహించి వానివెంట ద్వారక చేరాడు. అర్జునునికి స్వాగతం పలకటానికి నగరం అంతా అలంకరింపబడింది. ఆబాలగోపాలం ఆమహావీరుని సందర్శనార్థం ఎదురు వచ్చారు. రాజవీథి కిరువైపులా బారులుతీర్చి ఉన్న ప్రజల ఆనంద సత్కారాలు స్వీకరిస్తూ పెద్దలకు నమస్కారాలూ పిన్నలకు ఆశీస్సులూ అర్పిస్తూ సర్వభోగసమృద్ధమైన శ్రీకృష్ణుని సౌధంలో అడుగు పెట్టాడు. అలాచేరిన అర్జునుడు కొన్ని రోజులు గడిపాడు.

ఇది 212 నుండి 217 వరకూ

# అర్జునవనగమనపర్వము సమాప్తం

కిమర్థం చ మహాన్ పాపమిదం కృతవతీ పురా
అప్సరాస్మి మహాబాహో దేవారణ్యవిహారిణీ.
ఇష్టా ధనపతేర్నిత్యం వర్గా నామ మహాబల
మమ సఖ్యశ్చ తస్రోఽన్యాః సర్వాః కామగమాః శుభాః.
తాభిః సార్థం ప్రయాతాస్మి లోకపాలనివేశనం
తతః పశ్యామహే సర్వా బ్రాహ్మణం సంశితవ్రతం.
రూపవంతమధీయానమేకమేకాంత చారిణం
తస్యైవ తపసా రాజన్ తద్ వనం తేజసాఽఽవృతం.
ఆదిత్య ఇవ తం దేశం కృత్స్నం సర్వం వ్యకాశయత్
తస్య దృష్ట్వా తపస్తాదృగ్ రూపంచాద్భుతముత్తమం.
అవతీర్ణాః స్మ తం దేశం తపోవిఘ్నచికీర్షయా
అహం చ సౌరభేయీ చ సమీచీ బుద్ బుదా లతా

యోగపద్యేన తం విప్రమభ్యగచ్ఛామ భారత
గాయంత్యోఽథ హసంత్యశ్చ లోభయిత్వా చ తం ద్విజం.
స చ నాస్మాసు కృతవాన్ మనో వీర కథంచన
నాకంపత మహాతేజాః స్థితస్తపసి నిర్మలే.
సోఽశపత్ కుపితోఽస్మాసు బ్రాహ్మణః క్షత్రియర్షభ
గ్రాహభూతా జలే యూయం చరిష్యథ శతం సమాః.

215 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల పదహారవ అధ్యాయము

తతో వయం ప్రవ్యథితాః సర్వా భారతసత్తమ
అయామ శరణం విప్రం తం తపోధనమచ్యుతం.
రూపేణ వయసా చైవ కందర్పేణ చ దర్పితాః
అయుక్తం కృతవత్యః స్మ క్షంతుమర్హసి నో ద్విజ.
ఏష ఏవ వధోఽస్మాకం సుపర్యాప్తస్తపోధన
యద్ వయం సంశితాత్మానం ప్రలోబ్ధుం త్వామిహాగతాః.
అవధ్యాస్తు స్త్రియః సృష్టా మన్యంతే ధర్మచారిణః
తస్మాద్ ధర్మేణ వర్ధత్వం నాస్మాన్ హింసితుమర్హసి.
సర్వభూతేషు ధర్మజ్ఞ మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే
సత్యో భవతు కల్యాణి ఏష వాదో మనీషిణాం.
శరణం చ ప్రపన్నానాం శిష్టాః కుర్వంతి పాలనాం
శరణం త్వాం ప్రపన్నాః స్మస్తస్మాత్ త్వం క్షంతుమర్హసి.
ఏవముక్తః స ధర్మాత్మా బ్రాహ్మణః శుభకర్మకృత్
ప్రసాదం కృతవాన్ వీర రవిసోమసమప్రభః
శతం శతసహస్రం తు సర్వమక్షయ్యవాచకం
పరిమాణం శతం త్వేతన్నైతదక్షయ్యవాచకం.
యదా చ వో గ్రాహభూతా గృహ్ణంతీః పురుషాన్ జలే
ఉత్కర్షతి జలాత్ తస్మాత్ స్థలం పురుషసత్తమః.
తదా యూయం పునః సర్వాః స్వం రూపం ప్రతిపత్స్యథ
అనృతం నోక్తపూర్వం మే హసతాపి కదాచన.
తాని సర్వాణి తీర్థాని ఇతః ప్రభృతి చైవ హ
నారీతీర్థాని నామ్నేహ ఖ్యాతిం యాస్యంతి సర్వశః
పుణ్యాని చ భవిష్యంతి పావనాని మనీషిణాం.
తతోఽభివాద్య తం విప్రం కృత్వా చాపి ప్రదక్షిణం
అచింతయామోపసృత్య తస్మాద్ దేశాత్ సుదుఃఖితాః.
క్వ ను నామ వయం సర్వాః కాలేనాల్పేన తం నరం
సమాగచ్ఛేమ యో నస్తద్ రూపమాపాదయేత్ పునః.
తా వయం చింతయిత్వైవ ముహూర్తాదివ భారత
దృష్టవత్యో మహాభాగం దేవర్షిముత నారదం.
సంప్రహృష్టాః స్మ తం దృష్ట్వా దేవర్షిమమితద్యుతిం
అభివాద్య చ తం పార్థ స్థితాః స్మ వ్రీడితాననాః.
స నోఽపృచ్ఛద్ దుఃఖమూలముక్తవత్యో వయం చ తం
శ్రుత్వా తత్ర యథావృత్తమిదం వచనమబ్రవీత్.
దక్షిణే సాగరానూపే పంచతీర్థాని సంతి వై
పుణ్యాని రమణీయాని తాని గచ్ఛత మా చిరం.
తత్రాశు పురుషవ్యాఘ్రః పాండవేయో ధనంజయః
మోక్షయిష్యతి శుద్ధాత్మా దుఃఖాదస్మాన్న సంశయః.
తస్య సర్వా వయం వీర శ్రుత్వా వాక్యమిహాగతాః.
తదిదం సత్యమేవాద్య మోక్షితాహం త్వయానఘ.
ఏతాస్తు మమ తాః సఖ్యశ్చతస్రోఽన్యా జలే శ్రితాః

# సుభద్రాహరణపర్వము

## రెండువందల పదునెనిమిదవ అధ్యాయం

కొన్నిరోజులు గడిచాయి.

ద్వారకానగరవాసులైన యదు వృష్ణి భోజాంధక వంశీయులందరూ రైవతకాద్రిమీద ఉత్సవం చేసికొనేందుకు వెళ్ళారు. ఆపర్వతానికి నాలుగు వైపులా రత్నఖచితమైన రాజభవనాలూ కల్ప వృక్షాలూ అలరారుతున్నాయి. వీణా వేణుమృదంగ వాద్యానుకూలంగా నృత్యం సాగిస్తున్నారు నటులు. స్వర్గశోభనే పరిహసిస్తూన్న ఆకాశంపై సువర్ణాందలాలమీద వృష్ణివంశీయ బాలురు విహరిస్తున్నారు. నరనారీజనులు వాహనాలమీద విహరిస్తున్నారు. కొందరు పాదచారులై చరిస్తున్నారు. గంధర్వ గానం నేపథ్యంలో సాగుతూన్నది. వృష్ణి వంశాధిపతి ఉగ్రసేనుడు పరమానందంతో చరిస్తున్నాడు. ఆయన వెన్నంటి గీతనృత్యాలు సాగుతున్నాయి. ప్రద్యుమ్నుడూ సాంబుడూ ఒళ్ళు మరిచి తిరుగుతున్నారు. అక్రూర సారణ గద బభ్రు విదూరథ నిశఠ చారుదేష్ణ పృథు విపృథు సత్యక సాత్యకి భంగకార మహారవ కృతవర్మ ఉద్ధవాదులందరూ ఆ ఉత్సవశోభను ఇనుమడికం చేస్తున్నారు.

కృష్ణార్జును లిద్దరూ ఉత్సవాన్ని తిలకిస్తూ పర్యటిస్తున్నారు.

అపూర్వసౌందర్యవతి సుభద్ర సర్వాలంకార సంశోభితాంగియై ఆసమయంలో సఖీజనపరివృతయై అటే వచ్చింది. ఆమెను వా రుభయులూ చూశారు.

ఆ చూపులోనే అర్జునుని హృదయం సుభద్రమీద లగ్నమైంది. అది గ్రహించి కృష్ణుడు నవ్వుతూ—వనవాసులకుకూడా మనోవికారం కలుగుతుందా. ఈమె నాకూ సారణుడికీ సోదరి. ఈమెను సుభద్ర అంటారు. ఈమె మాతండ్రికి ఎంతో అభిమానమైన పుత్రిక. నీకు ఈమెను వివాహం చేసికోవాలని ఉంటే నేను మానాన్నగారితో సంప్రదిస్తాను—అన్నాడు. ఈ వసుదేవనందినీ సౌందర్యం ఎవరి మనస్సు నాకర్షించదు! నీ సోదరి నాకు రాణి కావటంకంటె కోరతగింది లేదు. ఈమె ఏవిధంగా నాకు లభ్యమవుతుందో చెప్పు. మానవప్రయత్నం ఎంతవరకూ ఉంటే అంతా చేస్తాను—అన విని క్షత్రియులకు స్వయంవర మర్యాద ఉన్నది. కానీ దాని పరిణామం మనం చెప్పలేము. ఏమంటే చంచల హృదయం కల స్త్రీ ఎవరినయినా వరించవచ్చు. బలాత్కారంగా హరించే వివాహపద్ధతికూడా ఉన్నది. అది వీరలక్షణమని ధర్మవేత్త లంగీకరించారు. నువ్వు నీపరాక్రమంతో ఆమెను హరించు. స్వయంవరంలో ఆమె ఎవరిని వరిస్తుందో ఏం చెప్పగలం. అందుచేత నువ్వు రాక్షసవిధిని ఆమెను గ్రహించు—అని కృష్ణుడనగా అర్జునుడు ఆనందంతో అంగీకరించి ఆవృత్తాంతమంతా లేఖాముఖంగా ఇంద్రప్రస్థంలోని ధర్మరాజుకి తెలియజేశాడు. ధర్మరాజు పూర్వాపరాలు విచారించి ఆమోదాన్ని తెలిపాడు.

218 వ అధ్యాయము సమాప్తం

కురు కర్మ శుభం ఏవ ఏతాః సర్వా విమోక్షయ.
తతస్తాః పాండవశ్రేష్ఠః సర్వా ఏవ విశాంపతే
తస్మాచ్ఛాపాదదీనాత్మా మోక్షయామాస వీర్యవాన్.
ఉత్థాయ చ జలాత్ తస్మాత్ ప్రతిలభ్య వపుః స్వకం
తాస్తదాప్సరసో రాజన్నదృశ్యంత యథా పురా.
తీర్థాని శోధయిత్వా తు తథానుజ్ఞాయ తాః ప్రభుః
చిత్రాంగదాం పునర్ద్రష్టుం మణిపూరం పునర్యయౌ.
తస్యామజనయత్ పుత్రం రాజానం బభ్రువాహనం
తందృష్ట్వాపాండవోశ్చిత్రవాహనమబ్రవీత్.
చిత్రాంగదాయాః శుల్కం త్వం గృహాణ బభ్రువాహన
అనేన చ భవిష్యామి ఋణాన్ముక్తో నరాధిప.
చిత్రాంగదాం పునర్వాక్యమబ్రవీత్ పాండునందనః
ఇహ వై భవ భద్రం తే వర్ధేథా బభ్రువాహనం.
ఇంద్రప్రస్థనివాసం మే త్వం తత్రాగత్య రంస్యసి
కుంతీం యుధిష్ఠిరం భీమం భ్రాతరౌ మే కనీయసౌ.
ఆగత్య తత్ర పశ్యేథా అన్యానపి చ బాంధవాన్
బాంధవైః సహితా సర్వైర్నందసే త్వమనిందితే.
ధర్మే స్థితః సత్యధృతిః కౌంతేయోఽథ యుధిష్ఠిరః
జిత్వా తు పృథివీం సర్వాం రాజసూయం కరిష్యతి.
తత్రాగచ్ఛంతి రాజానః పృథివ్యాం నృపసంజ్ఞితాః
బహూని రత్నాన్యాదాయ ఆగమిష్యతి తే పితా.
ఏకసార్థం ప్రయాతాసి చిత్రవాహనసేవయా
ద్రక్ష్యామి రాజసూయే త్వాం పుత్రం పాలయ మా శుచః.
బభ్రువాహననామ్నా తు మమ ప్రాణో మహీచరః
తస్మాద్ భరస్వ పుత్రం వై పురుషం వంశవర్ధనం.
చిత్రవాహనదాయాదం ధర్మాత్ పౌరవనందనం
పాండవానాం ప్రియం పుత్రం తస్మాత్ పాలయ సర్వదా.
విప్రయోగేన సంతాపం మా కృథాస్త్వమనిందితే
చిత్రాంగదామేవముక్త్వా గోకర్ణమభితోఽగమత్.
ఆద్యం పశుపతేః స్థానం దర్శనాదేవ ముక్తిదం
యత్ర పాపోఽపి మనుజః ప్రాప్నోత్యభయదం పదం.

216 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల పదిహేడవ అధ్యాయము

సోఽపరాంతేషు తీర్థాని పుణ్యాన్యాయతనాని చ
సర్వాణ్యేవానుపూర్వ్యేణ జగామామితవిక్రమః.
సముద్రే పశ్చిమే యాని తీర్థాన్యాయతనాని చ
తాని సర్వాణి గత్వా స ప్రభాసముపజగ్మివాన్.
ప్రభాసదేశం సంప్రాప్తం బీభత్సుమపరాజితం
సుపుణ్యం రమణీయం చ శుశ్రావ మధుసూదనః.
తతోఽభ్యగచ్ఛత్ కౌంతేయం సఖాయం తత్ర మాధవః
దదృశాతే తదాన్యోన్యం ప్రభాసే కృష్ణపాండవౌ.
తావన్యోన్యం సమాశ్లిష్య పృష్ట్వా చ కుశలం వనే
ఆస్తాం ప్రియసఖాయౌ తౌ నరనారాయణావృషీ.
తతోఽర్జునం వాసుదేవస్తాం చర్యాం పర్యపృచ్ఛత
కిమర్థం పాండవైతాని తీర్థాన్యనుచరస్యుత.
తతోఽర్జునో యథావృత్తం సర్వమాఖ్యాతవాంస్తదా
శ్రుత్వోవాచ చ వార్ష్ణేయ ఏవమేతదితి ప్రభుః.
తౌ విహృత్య యథాకామం ప్రభాసే కృష్ణపాండవౌ
మహీధరం రైవతకం వాసాయైవాభిజగ్మతుః.
పూర్వమేవ తు తు కృష్ణస్య వచనాత్ తం మహీధరం
పురుషా మండయాంచక్రురుపజహ్రుశ్చ భోజనం.
ప్రతిగృహ్యార్జునః సర్వముపభుజ్య చ పాండవః

## రెండువందల పంతొమ్మిదవ అధ్యాయము

ధర్మరాజు ఆజ్ఞ శ్రీకృష్ణుని కార్యక్రమం విని అర్జునుడు విశ్రాంతిమందిరానికి వచ్చాడు. శ్రీకృష్ణుని ఆజ్ఞానుసారం సారథి దారుకుడు రథాన్ని సిద్ధం చేశాడు. చిరుగంటలమోతతో సర్వాలంకారాలతో ఉన్న ఆరథానికి శైబ్యసుగ్రీవాది గుర్రాలను కట్టాడు దారుకుడు. ఆరథం మీద ఎక్కి అర్జునుడు రైవతకాద్రికి వచ్చాడు. అదేసమయానికి సుభద్ర పర్వతరాజునూ దేవతలనూ అర్చించి బ్రాహ్మణ స్వస్తి చేయించి రైవతకాద్రికి ప్రదక్షిణం చేసి ద్వారకవైపు ప్రయాణమై ఉన్నది. మదనబాధతో ఉన్న అర్జునుడు పరువెత్తి వెళ్ళి ఆమెను చేతులతో ఎత్తి తన రథంమీద కూర్చోబెట్టుకుని ఇంద్రప్రస్థంవైపు ప్రయాణం సాగిస్తున్నాడు.

అది చూచిన సేవకులందరూ త్వర త్వర గా సుధర్మ సభకు పోయి సభాపాలకునితో అర్జునుని సాహసాన్ని అభివర్ణించారు. వింటూనే సభాపాలకుడు రణసన్నాహానికి అవశ్యమైన నగారా మ్రోయించాడు. ఆశబ్దం చెవులకు సోకిన క్షణంలోనే వృష్ణి భోజాంధకవీరులందరూ ఎలా ఉన్నవా రలాలేచి సాగారు. బంగారుతో నిర్మించిన తివాసీలు పరువబడ్డ సుధర్మ సభలో రత్న మాణిక్య సింహాసనాల మీద ఆవీరులందరూ ఆసీనులయ్యారు. వారందరూ ప్రజ్వలితాగ్నులవలె ప్రకాశిస్తున్నారు. వారందరికీ సుభద్రాపహరణవార్తను వినిపించేసరికి యుద్ధోన్మాదంతో లేచి రథా లాయత్తం చేసి క్రోధ హృదయంతో ధనుర్బాణాలుతీసికొని కవచధారులై కోలాహలంతో బయలుదేరారు.

కైలాసశిఖరసదృశ గౌరవర్ణుడైన బలరాముడు నీలివస్త్రాలు ధరించాడు. ఆయన తన యాదవుల నుద్దేశించి కుమారులారా! మనలో ధీయుతుడైన శ్రీకృష్ణునితో సంప్రదించకుండా మీరెందు కింత సాహసం చేస్తారు. ఆయన మౌనంగా చూస్తూ కూర్చుంటే మీరెందు కింత తొందర. వాని అభిప్రాయం తెలిసికొని ఉచితమార్గాన ప్రవర్తించండి. అని బలరాము డనగా వారందరూ నిశ్శబ్దంగా సభలో ఉండిపోయారు.

కృష్ణా! ఇంతాచూస్తూ ఏమిటి నువ్విలా మౌనంగా కూర్చున్నావు. నీసంతోషంకోసం మేము అర్జునునికి సాదరంగా సత్కారాలు సాగిస్తే వాడు ఇటువంటిది చేశాడు. తనకు తానే కులీనుడని చెప్పుకునేవాడూ తన భోజనపాత్రే తానే బ్రద్దలుకొట్టుకొనేవాడూ సముడే. మన సంబంధాన్ని వాడు వాంఛించవచ్చు. కానీ ఇలాంటిపని చేస్తాడా ఎవడేనా? మనం చేసిన ఉపకృతిని విస్మరించి ఎంత దుస్సాహసం చేశాడు. మనలనందరినీ అవమానించి కులకన్యను హరించాడు. తోక తొక్కితే త్రాచు ఊరుకోలేనట్లే ఈనాడు పార్థుడు నానెత్తిమీద కాలుపెడితే నేనూ సహించలేను. ఈనాడు నేను ఏకైక వీరుడుగా వెళ్ళి కురువంశాన్ని మూలనాశనం చేస్తాను_అన్నాడు. మేఘదుందుభివలె బలరాముడు గర్జించేసరికి ఆ మహావీరులందరూ సంతోషంతో అటే చూడసాగారు.

219 వ అధ్యాయము సమాప్తము

ఇ ది సు భ ద్రా హ ర ణ ప ర్వ ము

సహైవ వాసుదేవేన దృష్టవాన్ నటనర్తకాన్.
అభ్యనుజ్ఞాయ తాన్ సర్వానర్చ్చ్వతా యిపాండవః
సత్కృతః శయనం దివ్యమభ్యగచ్ఛన్మహామతిః.
తతస్తత్ర మహాబాహుః శయానః శయనే శుభే
తీర్థానాం పల్వలానాం చ పర్వతానాం చ దర్శనం
ఆపగానాం వనానాం చ కథయామాస సాత్వతే.
ఏవం స కథయనేకేవ నిద్రయా జనమేజయ
కౌంతేయోఽపి హృతస్తస్మిన్ శయనే స్వర్గసంనిభే.
మధురేణైవ గీతేన వీణాశబ్దేన చైవ హ
ప్రబోధ్యమానో బుబుధే స్తుతిభిర్మంగళైస్తథా.
స కృత్వావశ్యకార్యాణి వార్ష్ణేయేనాభినందితః
రథేన కాంచనాంగేన ద్వారకామభిజగ్మివాన్.

అలంకృతా ద్వారకా తు బభూవ జనమేజయ
కుంతీపుత్రస్య పూజార్థమపి నిష్కుటకేష్వపి.
దిదృక్షంతశ్చ కౌంతేయం ద్వారకావాసినో జనాః
నరేంద్రమార్గమాజగ్ముస్తూర్ణం శతసహస్రశః.
అవలోకేషు నారీణాం సహస్రాణి శతాని చ
భోజవృష్ణ్యంధకానాంచసమవాయో మహానభూత్.
స తథా సత్కృతః సర్వైర్భోజవృష్ణ్యంధకాత్మజైః
అభివాద్యాభివాద్యాంశ్చ సర్వైశ్చ ప్రతినందితః.
కుమారైః సర్వశో వీరః సత్కారేణాభిచోదితః
సమానవయసః సర్వానాశ్లిష్య స పునః పునః.
కృష్ణస్య భవనే రమ్యే రత్నభోజ్యసమావృతే
ఉవాస సహ కృష్ణేన బహులాస్తత్ర శర్వరీః.

217 వ అధ్యాయః సమాప్తం

ఇది అర్జునవనగమన పర్వము

## సు భ ద్రా హ ర ణ ప ర్వ ము

తతః కతిపయాహస్య తస్మిన్ రైవతకే గిరౌ
వృష్ణ్యంధకానామభవదుత్సవో నృపసత్తమ.
తత్ర దానం దదుర్వీరా బ్రాహ్మణేభ్యః సహస్రశః
భోజవృష్ణ్యంధకాశ్చైవ మహే తస్య గిరేస్తథా.
ప్రాసాదై రత్నచిత్రైశ్చ గిరేస్తస్య సమంతతః
స దేశః శోభితో రాజన్ కల్పవృక్షైశ్చ సర్వశః.
వాదిత్రాణి చ తత్రాన్యే వాదకాః సమవాదయన్
ననృతుర్నర్తకాశ్చైవ జగుర్గేయాని గాయనాః.
అలంకృతాః కుమారాశ్చ వృష్ణీనాం సుమహౌజసాం
యానైర్హాటకచిత్రైశ్చ చంచూర్యంతే స్మ సర్వశః.
పౌరాశ్చ పాదచారేణ యానైరుచ్చావచైస్తథా
సదారాః సానుయాత్రాశ్చ శతశోఽథ సహస్రశః.
తతో హలధరః క్షీబో రేవతీసహితః ప్రభుః
అనుగమ్యమానో గంధర్వైరచరత్ తత్ర భారత.
తథైవ రాజా వృష్ణీనాముగ్రసేనః ప్రతాపవాన్
అనుగీయమానో గంధర్వైః స్త్రీసహస్రసహాయవాన్.
రౌక్మిణేయశ్చ సాంబశ్చ క్షీబౌ సమరదుర్మదౌ
దివ్యమాల్యాంబరధరౌ విజహ్రాతేఽమరావివ.
అక్రూరః సారణశ్చైవ గదో బభ్రుర్విదూరథః
నిశఠశ్చారుదేష్ణశ్చ పృథుర్విపృథురేవ చ.
సత్యకః సాత్యకిశ్చైవ భంగకారమహారవౌ
హార్దిక్య ఉద్ధవశ్చైవ యే చాన్యే నానుకీర్తితాః.
ఏతే పరివృతాః స్త్రీభిర్గంధర్వైశ్చ పృథక్ పృథక్
తముత్సవం రైవతకే శోభయాంచక్రిరే తదా.

# హరణాహరణపర్వము

## రెండువందల ఇరవయ్యవ అధ్యాయం

అప్పుడు ఆ మహాసభలలోని వీరులందరూ ఎవరి శక్తిననుసరించి వారు ప్రతీకారవాక్యాలు పలికారు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు లేచి గొంతు సవరించి— వీరశిరోమణులారా! నిద్రను జయించిన మహావీరుడైన అర్జునుడు యాదవవంశానికి చేసిన అపచారమేమీలేదు. పైగా ఇందువల్ల మన ప్రతిష్ఠ ఇనుమడించిందే కానీ ఏమాత్రం తగ్గిపోలేదు. మన వంశానికి ధనలోభం లేదని ఎరిగినందువల్ల తాను మన సుభద్రను శుల్కం ఇచ్చి తీసికోలేననీ నిశ్చయించుకున్నాడు.

ఇక స్వయంవరం దాని పరిణామం ఇదమిత్థమని తేల్చలేము. పోతే పశువులతో సమానంగా కన్యాదానాన్ని నిరీక్షించే మూర్ఖుడూ శుల్కం తీసికొని కన్యనిచ్చే మూర్ఖుడూ ఉండరు. ఈవిషయాలన్నీ పర్యాలోచించాకనే అర్జునుడు క్షత్రియోచిత మార్గాన సుభద్రను తీసికొని వెళ్ళిఉంటాడు. మనల్ని అవమానించే ఊహతో ఈపని చేసిఉండడు.

సుభద్రార్జునులు యశోధనులు. వారిరువురికీ అది తగినది. భరతశంతనులు ప్రభవించిన ప్రఖ్యాత వంశంలో పుట్టాడు. పైగా కుంతిభోజుని కుమార్తెయైన కుంతీదేవికి కలిగిన ఆ మహావీరునితో బాంధవ్యం సర్వజనవాంఛనీయం. ఇంద్రరుద్రాదిలోకాలలో భగదేవతానేత్రవినాశనంచేసే వికరాళనేత్రాలుకల రుద్రుడు వినా అర్జునుని ఓడించగల వారు లేరు. ఆ పరాక్రమానికి తోడు ఇప్పుడు నా రథంకూడా అతని అధీనంలో ఉంది. సర్వశస్త్రాస్త్రప్రయోగోపసంహారవిదుడైన అర్జునుని యెదుట నిలిచి పోరగల వీరు డెవడు. అందుచేత మీరందరూ త్వరగావెళ్ళి సగౌరవంగా ఈనగరానికి తీసికొని రండి. అంతేకాని యుద్ధానికని వెళ్ళి పరాభూతులై రావటం ఎంతమాత్రం నాకు నచ్చదు. ఉభయులకూ శ్రేయస్కరమైనమార్గం ఇది. అనగా వారందరూ సమ్మతించి ఆ ప్రకారంగా అర్జునుని ద్వారకను తెచ్చారు.

ద్వారకానగరానికి తిరిగి వచ్చాక సుభద్రార్జునులకు వివాహమహోత్సవం జరిగింది. ఆ నవవధూవరులు సంవత్సరకాలం అక్కడే సుఖంగా గడిపారు. ఆవిధంగా పన్నెండేళ్ళు గడిచాయి.

అర్జునుడు ఇంద్రప్రస్థం తిరిగి వచ్చాడు. వస్తూనే ధౌమ్యులకూ కుంతికీ ధర్మజభీములకూ నమస్కారాలు జరిపాడు. నకుల సహదేవులు అన్నకు నమస్కరించారు. వారిరువురినీ గాఢాలింగనం చేసికొన్నాడు. బ్రాహ్మణపూజ పూర్తిచేశాడు.

అన్నీ అయాక ద్రౌపదిని సమీపించాడు. ఆమె ప్రణయకలహాకంఠంతో— అక్కడే ఉండలేకపోయావా. సాత్వత వంశియుగాలైన సుభద్రతోనే ఉండలేకపోయావా. ద్వితీయబంధం ప్రథమబంధంలోని బిగిని సడలిస్తుందనే వార్త మన విషయంలో ఋజువైంది— అని పరిపరివిధాల పలుకుతూంటే ధీరార్జునుడు ఆమెను నేర్పుతో అనునయించాడు. తన అపరాధాన్ని క్షమించమని వేడి ఆమెను ప్రసన్నురాలిని చేసుకొన్నాడు.

చిత్రకౌతూహలే తస్మిన్ వర్తమానే మహాద్భుతే
వాసుదేవశ్చ పార్థశ్చ సహితౌ పరిజగ్మతుః.
తత్ర చంక్రమమాణౌ తౌ వసుదేవసుతాం శుభాం
అలంకృతాం సఖీమధ్యే భద్రాం దదృశతుస్తదా.
దృష్ట్వైవ తామర్జునస్య కందర్పః సమజాయత
తం తథైకాగ్రమనసం కృష్ణః పార్థమలక్షయత్.
అబ్రవీత్ పురుషవ్యాఘ్రః ప్రహసన్నివ భారత
వనేచరస్య కిమిదం కామేనాలోడ్యతే మనః.
మమైషా భగినీ పార్థ సారణస్య సహోదరా
సుభద్రా నామ భద్రం తే పితుర్మే దయితా సుతా
యది తే వర్తతే బుద్ధిర్వక్ష్యామి పితరం స్వయం.
దుహితా వసుదేవస్య వాసుదేవస్య చ స్వసా
రూపేణ చైషా సంపన్నా కమిషైషా న మోహయేత్.
కృతమేవ తు కల్యాణం సర్వం మమ భవేద్ ధ్రువం
యది స్యాన్మమ వార్ష్ణేయీ మహిషీయం స్వసా తవ.
ప్రాప్తౌ తు క ఉపాయః స్యాత్ తం బ్రవీహి జనార్దన
ఆస్థాస్యామి తదా సర్వం యది శక్యం నరేణ తత్.
స్వయంవరః క్షత్రియాణాం వివాహః పురుషర్షభ
స చ సంశయితః పార్థ స్వభావస్యానిమిత్తతః.
ప్రసహ్య హరణం చాపి క్షత్రియాణాం ప్రశస్యతే
వివాహహేతుః శూరాణామితి ధర్మవిదో విదుః.
స త్వమర్జున కల్యాణీం ప్రసహ్య భగినీం మమ
హర స్వయంవరే హ్యస్యాః కో వై వేద చికీర్షితం
తతోఽర్జునశ్చ కృష్ణశ్చ వినిశ్చిత్యేతికృత్యతాం
శీఘ్రగాన్ పురుషానన్యాన్ ప్రేషయామాసతుస్తదా.
ధర్మరాజాయ తత్ సర్వమింద్రప్రస్థగతాయ వై
శ్రుత్వైవ చ మహాబాహురనుజజ్ఞే స పాండవః.
భీమసేనస్తు తచ్ఛ్రుత్వా కృతకృత్యోఽభ్యమన్యత
ఇత్యేవం మనుజైః సార్ధముక్త్వా ప్రీతి ముపేయివాన్.
తతః సంవాదితే తస్మిన్ననుజ్ఞాతో ధనంజయః
గతాం రైవతకే కన్యాం విదిత్వా జనమేజయ.
వాసుదేవాభ్యనుజ్ఞాతః కథయిత్వేతికృత్యతాం
కృష్ణస్య మతమాదాయ ప్రయయౌ భరతర్షభః.
రథేన కాంచనాంగేన కల్పితేన యథావిధి
శైబ్యసుగ్రీవయుక్తేన కింకిణీజాలమాలినా.
సర్వశస్త్రోపపన్నేన జీమూతరవనాదినా
జ్వలితాగ్నిప్రకాశేన ద్విషతాం హర్షఘాతినా.
సంనద్ధః కవచీ ఖడ్గీ బద్ధగోధాంగులిత్రవాన్
మృగయావ్యపదేశేన ప్రయయౌ పురుషర్షభః.
సుభద్రా త్వథ శైలేంద్రమభ్యర్చ్యైవ హి రైవతం
దైవతాని చ సర్వాణి బ్రాహ్మణాన్ స్వస్తి వాచ్య చ.
ప్రదక్షిణం గిరేః కృత్వా ప్రయయౌ ద్వారకాం ప్రతి
తామభిద్రుత్య కౌంతేయః ప్రసహ్యారోపయద్ రథం
సుభద్రాం చారుసర్వాంగీం కామబాణప్రపీడితః.
తతః స పురుషవ్యాఘ్రస్తామాదాయ శుచిస్మితాం
రథేన కాంచనాంగేన ప్రయయౌ స్వపురం ప్రతి.
హ్రియమాణాం తు తాం దృష్ట్వా సుభద్రాం సైనికా జనాః
విక్రోశంతోఽద్రవన్ సర్వే ద్వారకామభితః పురీం
తే సమాసాద్య సహితాః సుధర్మామభితః సభాం
సభాపాలస్య తత్ సర్వమాచఖ్యుః పార్థవిక్రమం.
తేషాం శ్రుత్వా సభాపాలో భేరీం సాన్నాహికీం తతః
సమాజఘ్నే మహాఘోషాం జాంబూనదపరిష్కృతాం
క్షుబ్ధాస్తేనాథ శబ్దేన భోజవృష్ణ్యంధకాస్తదా
అన్నపానమపాస్యాథ సమాపేతుః సమంతతః.
తత్ర జాంబూనదాంగాని స్పర్ధ్యాస్తరణవంతి చ
మణివిద్రుమచిత్రాణి జ్వలితాగ్నిప్రభాణి చ.
భేజిరే పురుషవ్యాఘ్రా వృష్ణ్యంధకమహారథాః
సింహాసనాని శతశో ధిష్ణ్యానీవ హుతాశనాః.
తేషాం సముపవిష్టానాం దేవానామివ సంనయే

అక్కడనుంచి వెళ్ళి సుభద్ర శరీరంమీద అలంకారాలన్నీ తీయించి రక్తవర్ణం గల పట్టుచీర కట్టించి గోపికావేషంతో ద్రౌపదీ సౌధానికి పంపాడు. ఆ వేషంలోకూడా సుభద్ర ఎంతో శోభతో ఉన్నది. విశాలములూ కించిదరుణములూ అయిన నేత్రాలు కల సుభద్ర రాజభవనానికి వెళ్ళి కుంతీదేవికి నమస్కరించింది. ఆ రాజమాత తన కోడలిని గాఢంగా కౌగిలించుకొని శిరస్సు మూర్కొని ఆ అనుపమసౌందర్యరాశిని ఆశీర్వదించింది. అక్కడనుంచి కదలి ద్రౌపదీపాదాలకు నమస్కరించి— దేవీ! నేను నీ దాసిని— అన్నది. ఆ మాట వింటూనే ద్రౌపది సుభద్రను దగ్గరగా తీసికొని— సోదరీ! నీభర్త శత్రురహితుడు అగుగాక!—అని ఆశీర్వదించింది.

పాండవులందరూ ఆనందించారు. కుంతీదేవి ఆనందవివశురాలయింది.

అర్జునుడు ఇంద్రప్రస్థం చేరినవార్త విని బలరాముడూ కృష్ణుడూ వృష్ణి అంధక వంశాలలోని ప్రముఖులను వెంటబెట్టుకొని వచ్చారు. సోదర బాంధవసమేతం బయలుదేరిన శ్రీకృష్ణుని వెంట యాదవసైన్యాధిపతీ దానపతి అయిన అక్రూరుడూ అనాధృష్టీ బృహస్పతిశిష్యుడు ఉద్ధవుడూ సత్య సాత్యకి కృతవర్మ ప్రద్యుమ్న సాంబాది ప్రధానులందరూ ఉన్నారు.

వారందరికీ స్వాగతం పలికి తీసికొని రమ్మని నకులసహదేవులను పంపాడు ధర్మరాజు. వారి ప్రవేశానికి ముందుగా నగరవీధులన్నీ పరిశుభ్రం చేసి నీరు చల్లారు. పూలమాలలతో సుగంధశీతల జలసౌరభాలతో అగరుధూమంతో నయన నాసా మనోహరంగా ఉన్నది. ఆబాలగోపాలం సంతోషంతో ఉన్నది. వర్తకులు మరెంత శోభానంతో షాలు కలిస్తున్నారు. క్షత్రియుల బ్రాహ్మణుల సత్కారాలు పొందిన శ్రీకృష్ణుడు రాజభవనంలో ప్రవేశించాడు. ధర్మరాజు ఎదురువచ్చి సత్కరించి వారి శిరసు మూర్కొన్నాడు. అనంతరం శ్రీకృష్ణుడు ధర్మజ భీములను యథోచితంగా సన్మానించాడు. వచ్చిన యాదవవీరులందరినీ వయోభేదాలనుబట్టి గౌరవాదరాలతో చూశాడు ధర్మరాజు. నూతన వధూవరులకు వారి బంధువులకు శ్రీకృష్ణుడు కానుకలర్పించాడు. వివాహకాలంలో జరగవలసిన లాంఛనాలన్నీ ఇప్పుడే సాగించాడు.

చిరుగంటలమాలలతో అలంకరింపబడిన సువర్ణ రథాలు వెయ్యి ఇచ్చాడు. ఆ రథాలకి ఒక్కొక్కదానికి నాలుగేసి గుర్రాలూ సుశిక్షితులైన సారథులూ ఉన్నారు. చంద్రకాంతి సదృశమైన కాంతిగల అశ్వసహస్రమూ మధురాపురీగోవులోక పదివేలూ అశ్వతరి అనే పేరుగల జాతికి చెందిన వాయుసమవేగంగల తెల్లని గుర్రాలు అయిదు వందలూ నల్లనివి అయిదువందలూ ఇచ్చాడు. స్నాన పాన సమయాలలో ఉత్సవాలలో ఉపయోగపడే వయస్సు గల సేవకనారీజనాన్ని రత్నభూషణాలతో అలంకరించి వేయిమందిని అర్పించాడు. బాహ్లీకాశ్వాలూ సువర్ణముద్రికలూ కానుకగా ఇచ్చాడు.

బలరాముడుకూడా పరమానందంతో వెయ్యి ఏనుగులు కానుకగా ఇచ్చాడు. ఆ ఏనుగులకు మెడలలో సువర్ణహారాలూ ప్రక్కలందు చిరుగంటలూ కుంభస్థలంమీద రత్నాలంకారాలూ ఉన్నాయి. అవి యుద్ధభూమిలో వెనుకడుగు వేయటం ఎరుగవు.

అచఖ్యౌ చేష్టితం జిష్ణోః సభాపాలః సభానుగః.
తచ్ఛ్రుత్వా వృష్ణివీరాస్తే మదసంరక్తలోచనాః
అమృష్యమాణాః పార్థస్య సముత్పేతురహంకృతాః.
యోజయధ్వం రథానాశు ప్రాసానాహరతేతి చ
ధనూంషి చ మహార్హాణి కవచాని బృహంతి చ.
సూతానుచ్చుక్రుశుః కేచిద్ రథాన్ యోజయతేతిచ
స్వయంచతురగాన్ కేచిదయుంజన్హేమభూషితాన్.
రథేష్వానీయమానేషు కవచేషు ధ్వజేషు చ
అభిక్రందే నృవీరాణాంతదాసీత్ తుములంమహత్.
వనమాలీ తతః క్షీబః కైలాసశిఖరోపమః
నీలవాసా మదోత్సిక్త ఇదం వచనమబ్రవీత్.
కిమిదం కురుథాప్రాజ్ఞాస్తూష్ణీంభూతే జనార్దనే
అస్య భావమవిజ్ఞాయ సంక్రుద్ధా మోఘగర్జితాః.
ఏష తావదభిప్రాయమాఖ్యాతుం స్వం మహామతిః
యదస్య రుచిరం కర్తుం తత్ కురుధ్వమతంద్రితాః.
తతస్తే తద్ వచః శ్రుత్వా గ్రాహ్యరూపం హలాయుధాత్
తూష్ణీంభూతాస్తతః సర్వే సాధుసాధ్వితిచాబ్రువన్.
సమం వచో నిశమ్యైవ బలదేవస్య ధీమతః
పునరేవ సభామధ్యే సర్వే తే సముపావిశన్.
తతోఽబ్రవీద్ వాసుదేవం వచో రామః పరంతపః
కిమవాగుపవిష్టోఽసి ప్రేక్షమాణో జనార్దన.
సత్కృతస్త్వత్కృతే పార్థః సర్వైరస్మాభిరచ్యుత
నచసోఽర్హతి తాంపూజాం దుర్బుద్ధిః కులపాంసనః.
కో హి తత్రైవ భుక్త్వాన్నం భాజనం భేత్తుమర్హతి
మన్యమానః కులేజాతమాత్మానం పురుషః క్వచిత్.
ఇచ్ఛన్నేవహిసంబంధంకృతం పూర్వంచమానయన్
కో హి నామ భవేనార్థీ సాహసేన సమాచరేత్.
సోఽవమన్య తథాస్మాకమనాదృత్య చ కేశవం
ప్రసహ్యహృతవానద్యసుభద్రాంమృత్యుమాత్మనః.
కథం హి శిరసో మధ్యే కృతం తేన పదం మమ
మర్షయిష్యామి గోవింద పాదస్పర్శమివోరగః.
అద్య నిష్కౌరవామేకః కరిష్యామి వసుంధరాం
న హి మే మర్షణీయోఽయమర్జునస్య వ్యతిక్రమః.
తం తథా గర్జమానం తు మేఘదుందుభినిఃస్వనం
అన్వపద్యంత తే సర్వే భోజవృష్ణ్యంధకాస్తదా.

219 వ అధ్యాయము సమాప్తం

## ఇ ది సు భ ద్రా హ ర ణ ప ర్వ ము

## హ ర ణా హ ర ణ ప ర్వ ము

### రెండువందల ఇరువదవ అధ్యాయము

ఉక్తవంతో యథా వీర్యమసకృత్ సర్వవృష్ణయః
తతోఽబ్రవీద్ వాసుదేవోవాక్యంధర్మార్థసంయుతం
నావమానం కులస్యాస్య గుడాకేశః ప్రయుక్తవాన్
సమ్మానోఽభ్యధికస్తేన ప్రయుక్తోఽయం న సంశయః.

మహాప్రవాహం సముద్రంవైపు సాగుతున్నట్లు సాగాయి. వారర్పించిన రథగజతురగపదాతి సేనలు ఆ నీటిలో నురగవలె రత్నభూషణాంబరాలున్నవి. మకరాలవలె మత్తగజాలున్నవి. పాండవ సేనా సాగరంలో ఈ ఉపాయనవాహినులు సంగమించినవి. వారు సమర్పించిన కానుకలను గ్రహించి యదు వృష్ణి భోజాంధక వీరులను గౌరవ పూర్వకంగా సత్కరించారు. పుణ్యాత్ములు దేవలోకంలో ఆనందంగా విహరించేరీతిగా యాదవ పాండవులు యథేచ్ఛగా సుఖంగా ఇంద్రప్రస్థంలో గడిపారు.

అనంతరం ధర్మరాజిచ్చిన కానుకలతో వారు బలరామ పురస్సరులై ద్వారకకు ప్రయాణమయారు. కృష్ణుడు అర్జునునితోనే ఉండి అరణ్యాలకు వేటకువెళ్ళి విహారాలుచేస్తూ గడుపుతున్నాడు.

ఆ రోజులలో ఒక సుముహూర్తంలో సుభద్ర ప్రసవించింది. ఆమె కన్న బాలుడు విశాలవక్షంతో ఘనబాహువులతో వృషభనేత్రాలతో శత్రుదమనుడై ప్రకాశిస్తున్నాడు. వాడు నిర్భయుడే కాక క్రుద్ధుడై యుద్ధంచేసేవాడు కావటంచేత అభిమన్యుడని నామకరణం చేశారు.

మథనంవల్ల అగ్ని పుట్టినట్లు అర్జునునిద్వారా సుభద్రకు అభిమన్యుడు ఆవిర్భవించాడు. అభిమన్యుని జననంవల్ల ధర్మరాజుహృదయం సంతోషతరంగితమైంది. ఆ ఆనందంతో ఆయన పదివేల గోవులూ సువర్ణముద్రికలూ దానం చేశాడు. శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానుడయ్యే అభిమన్యుని లాలనపోషణలన్నీ శ్రీకృష్ణుడే నిర్వహించాడు. బాల్యంనుంచి మేనల్లునిమీద శ్రీకృష్ణునికి ప్రేమాభిమానాలు అధికమయాయి. అభిమన్యుడు వేదాధ్యయనపరుడైనాడు. తండ్రివద్దనే ధనుర్వేదం సాంగంగా అధ్యయనం చేశాడు. శస్త్రాస్త్రప్రయోగోపసంహార క్రమంలో అర్జునుడు ఆత్మనందనుని సుశిక్షితుణ్ణి చేశాడు. అభిమన్యుడు అర్జునునితో సమానుడయాడు. బాల్యంలోనే సర్వవిద్యలూ గ్రహించి ధనుర్విద్యావిదుడైన ఆ బాలుడు పాండవులందరికీ అభిమానపాత్రుడై వారికి ఆనందం కలిగించాడు. సమస్తసద్గుణసంపన్నుడైన అలనాటి అభిమన్యుని స్కంధం వృషభసదృశంగా ఉండేది. విప్పిన పడగవంటి ముఖంతో ఉండే అతని దర్పం సింహసదృశంగా పరాక్రమం మత్తేభసమంగా మేఘదుందుభితుల్యంగా కంఠధ్వనీ ఉండేవి. పూర్ణిమాచంద్రునివలె అతని దర్శనం సర్వజన హృదయాహ్లాదకంగా ఉండేది. శౌర్యపరాక్రమరూపాలలో కృష్ణుని పోలి ఉన్నాడు. ఇంద్రుడు అర్జునుని చూచుకొన్నట్లే అర్జునుడు అభిమన్యుని చూచుకోసాగాడు.

పతివ్రతాశిరోమణి ద్రౌపదీదేవి యుధిష్ఠిరునివల్ల ప్రతివింధ్యునీ భీమునివల్ల సుతసోమునీ అర్జునునిద్వారా శ్రుతకర్మనూ నకులునివల్ల శతానీకునీ సహదేవునిద్వారా శ్రుతసేనునీ ప్రసవించింది. అదితి ద్వాదశాదిత్యులనూ ప్రసవించినట్లు ద్రౌపది మహావీరులూ పర్వతసములూ అయిన కుమారులను కన్నది. అర్జునుడు మహత్తరమైన కార్యం (కర్మ) సాధించి వచ్చాక కలిగిన కుమారుడు కనక వానికి శ్రుతకర్ముడని పేరుపెట్టారు.

కౌరవకులంలో రాజర్షిగా ప్రఖ్యాతుడైన శతానీకుని ప్రఖ్యాతనామం నకులపుత్రునకు పెట్టారు. అగ్నిదేవతాసంబంధం కల కృత్తికా నక్షత్రంలో సహదేవసూనుడు కలగటంచేత వానికి శ్రుతసేనుడని పేరు పెట్టారు. వీరందరికీ యేడాది యేడాది

అర్థలుబ్ధాన్ న వః పార్థో మన్యతే సాత్వతాన్ సదా
స్వయంవరమనాధృష్యం మన్యతే చాపి పాండవః.
ప్రదానమపి కన్యాయాః పశువత్ కోఽనుమన్యతే
విక్రయం చాప్యపత్యస్య కః కుర్యాత్ పురుషో భువి.
ఏతాన్ దోషాంస్తు కౌంతేయో దృష్టవానితి మే మతిః
అతః ప్రసహ్య హృతవాన్ కన్యాం ధర్మేణ పాండవః.
ఉచితశ్చైవ సంబంధః సుభద్రాం చ యశస్వినీం
ఏష చాపీదృశః పార్థః ప్రసహ్య హృతవానితి.
భరతస్యాన్వయే జాతం శాంతనోశ్చ యశస్వినః
కుంతిభోజాత్మజాపుత్రం కో బుభూషేత నార్జునం.
న చ పశ్యామి యః పార్థం విజయేత రణే బలాత్
వర్జయిత్వా విరూపాక్షం భగనేత్రహరం హరం.
అపి సర్వేషు లోకేషు సేంద్రరుద్రేషు మారిష
న చ నామ రథస్తాదృక్ మదీయాస్తే చ వాజినః.
యోద్ధా పార్థశ్చ శీఘ్రాస్త్రః కో ను తేన సమో భవేత్
తమభిద్రుత్య సాంత్వేన పరమేణ ధనంజయం.
న్యవర్తయత సంహృష్టా మమైషా పరమా మతిః
యది నిర్జిత్య వః పార్థో బలాద్ గచ్ఛేత్ స్వకం పురం.
ప్రణశ్యేద్ వో యశః సద్యో నతు సాంత్వే పరాజయః
తచ్ఛ్రుత్వా వాసుదేవస్య తథా చక్రుర్జనాధిప.
నివృత్తశ్చార్జునస్తత్ర వివాహం కృతవాన్ ప్రభుః
ఉషిత్వా తత్ర కౌంతేయః సంవత్సరపరాః క్షపాః.
విహృత్య చ యథాకామం పూజితో వృష్ణినందనైః
పుష్కరే తు తతః శేషం కాలం వర్తితవాన్ ప్రభుః.
పూర్ణే తు ద్వాదశే వర్షే ఖాండవప్రస్థమాగతః
వవందే ధౌమ్యమాసాద్య మాతరం చ ధనంజయః.
స్పృష్ట్వా చ చరణౌ రాజ్ఞో భీమస్య చ ధనంజయః
యమాభ్యాం వందితో హృష్టః సస్వజే తౌ ననంద చ
అభిగమ్య చ రాజానం నియమేన సమాహితః
అభ్యర్చ్య బ్రాహ్మణాన్ పార్థో ద్రౌపదీమభిజగ్మివాన్

తం ద్రౌపదీ ప్రత్యువాచ ప్రణయాత్ కురునందనం.
తత్రైవ గచ్ఛ కౌంతేయ యత్ర సా సాత్వతాత్మజా
సుబద్ధస్యాపి భారస్య పూర్వబంధః శ్లథాయతే.
తథా బహువిధం కృష్ణాం విలపంతీం ధనంజయః
సాంత్వయామాస భూయశ్చ క్షమయామాస చాసకృత్.
సుభద్రాం త్వరమాణశ్చ రక్తకౌశేయవాసినీం
పార్థః ప్రస్థాపయామాస కృత్వా గోపాలికావపుః.
సాధికం తేన రూపేణ శోభమానా యశస్వినీ
భవనం శ్రేష్ఠమాసాద్య వీరపత్నీ వరాంగనా.
వవందే పృథుతామ్రాక్షీ పృథాం భద్రా యశస్వినీ
తాం కుంతీ చారుసర్వాంగీముపాజిఘ్రత మూర్ధని.
ప్రీత్యా పరమయా యుక్తా ఆశీర్భిర్యుంజతాతులాం
తతోఽభిగమ్య త్వరితా పూర్ణేందుసదృశాననా.
వవందే ద్రౌపదీం భద్రా ప్రేష్యాహమితి చాబ్రవీత్
ప్రత్యుత్థాయ తదా కృష్ణా స్వసారం మాధవస్య చ.
పరిష్వజ్యావదత్ ప్రీత్యా నిఃసపత్నోఽస్తు తే పతిః
తథైవ ముదితా భద్రా తామువాచైవమస్త్వితి.
తతస్తే హృష్టమనసః పాండవేయా మహారథాః
కుంతీ చ పరమప్రీతా బభూవ జనమేజయ.
శ్రుత్వా తు పుండరీకాక్షః సంప్రాప్తం స్వం పురోత్తమం
అర్జునం పాండవశ్రేష్ఠమింద్రప్రస్థగతం తదా.
ఆజగామ విశుద్ధాత్మా సహ రామేణ కేశవః
వృష్ణ్యంధకమహామాత్రైః సహ వీరైర్మహారథైః.
భ్రాతృభిశ్చ కుమారైశ్చ యోధైశ్చ బహుభిర్వృతః
సైన్యేన మహతా శౌరిరభిగుప్తః పరంతపః.
తత్ర దానపతిర్ధీమానాజగామ మహాయశాః
అక్రూరో వృష్ణివీరాణాం సేనాపతిరరిందమః.
అనాధృష్టిర్మహాతేజా ఉద్ధవశ్చ మహాయశాః
సాక్షాద్ బృహస్పతేః శిష్యో మహాబుద్ధిర్మహామనాః.
సత్యకః సాత్యకిశ్చైవ కృతవర్మా చ సాత్వతః

వయో భేదం ఉన్నది. వీరందరికీ ధౌమ్యులవారు యథాక్రమంగా జాతకర్మ నామకరణ అన్నప్రాశన చౌలోపనయనాలు పూర్తిచేశారు. వారందరూ బ్రహ్మచర్యవ్రతావలంబులై ధౌమ్యులవారివద్దనే వేదాధ్యయనం చేసి అర్జునుని శిక్షణలో ధనుర్వేదం అభ్యసించారు. దేవతాబాలురవలె శోభించే వారు. పాండవులకు ఆనందంగా [illegible] లవుతున్నారు.

(ఉపసంహారరహితంగా మంత్రం ద్వారా ప్రయోగింపబడినది ముక్తం. హస్తమూలాన ధనుస్సులో ప్రయోగించేది పాణిముక్తం. ప్రయోగోపసంహారాలతో కూడినది ముక్తాముక్తం. మంత్రసాధితములైన ధ్వజాదులు దర్శనమాత్రం చేత శత్రుక్షోభ కలిగిస్తాయి; వానినే అముక్త మంటారు. వీనినే నాలుగుపాదా లంటారు. ధనుర్వేదవేత్త భరద్వాజుడు సూత్రమూ శిక్షా ప్రయోగమూ రహస్యమూ అనే వానిని నాలుగు పాదా లన్నారు.

అమ్ములపొదినుండి బాణం తీయటం ఆదానం. నారికి తొడగటం అనుసంధానం. లక్ష్యంచూసి వదలటం మోక్షణం. ఆ బాణంవల్ల శత్రువు బలహీనుడైతే దానిని మంత్రంతో వెనుదిప్పటం వినివర్తనం. శరసంధానసమయంలో మధ్యప్రదేశం స్థానం. మూడు నాలుగు వేళ్ళకలిపి బాణం పట్టటం ముష్టి. తర్జనీమధ్యమాంగుళులతో కాని అంగుష్ఠమధ్యమాంగుళులతో బాణాన్ని సంధించటం ప్రయోగం. ధనుష్టంకారశోధనం ప్రాయశ్చిత్తం. చక్రాకృతిలో తిరిగే రథంలో ఉరికే బాణం ప్రయోగించటం మండలం. శబ్దాన్ని అనుసరించి బాణం విదలటం పరంపరం బాణాలు వదలటం వీనిలోనే చేరుతాయి.

బ్రాహ్మ వాయవ్య ఆగ్నేయాదులు దివ్యాస్త్రాలు. ఖడ్గ తోమర భిండివాలాదులు మానుషాలు. వీనినే నాలుగుపాదాలూ పది అంగాలూ అని ధనుర్వేదం చెప్పుతుంది. అభిమన్యుడు ఇన్నిటా నేర్పరి అయినాడు.)

220వ అధ్యాయము సమాప్తము

ఇది హరణాహరణ పర్వము

# ఖాండవదహన పర్వము

భీష్మ ధృతరాష్ట్రుల ఆజ్ఞానుసారం పాండవులు ఇంద్రప్రస్థంలో ఉంటూ శత్రురాజులెందరినో జయించి పుణ్యఫలానుభవం పొందే జీవునివలె వారు సుఖంగా ఉంటున్నారు. నీతివిదుల మార్గాన యుధిష్ఠిరుడు ధర్మార్థకామాలను ఆత్మతుల్యంగా చూసుకుంటూ పాలిస్తున్నాడు. ధర్మార్థకామాలు ఈ ప్రకారంగా భూమిమీద సక్రమంగా ఉంటే చతుర్థపురుషార్థమైన మోక్షం ధర్మరాజురూపంలో ప్రభవించినట్లుంది. పరబ్రహ్మచింతనతో విధ్యుక్తంగా యజ్ఞాలను ఆచరిస్తూ లోకకళ్యాణేచ్ఛతో పాలించే ధర్మరాజు ఏలుబడిలో ప్రజలు అమితానందం పొందుతున్నారు. ధర్మరాజు ఆధిపత్యంక్రింద ఉన్న

ప్రద్యుమ్నశ్చైవ సాంబశ్చ నిశఠః శంకురేవ చ.
చారుదేష్ణశ్చ విక్రాంతో ఝిల్లీ విపృథురేవ చ
సారణశ్చ మహాబాహుర్గదశ్చ విదుషాం వరః.
ఏతే చాన్యే చ బహవో వృష్ణిభోజాంధకాస్తథా
ఆజగ్ముః ఖాండవప్రస్థమాదాయ హరణం బహు.
తతో యుధిష్ఠిరో రాజా శ్రుత్వా మాధవమాగతం
ప్రతిగ్రహార్థం కృష్ణస్య యమౌ ప్రాస్థాపయత్ తదా.
తాభ్యాం ప్రతిగృహీతంతువృష్ణిచక్రం మహర్ధిమత్
వివేశ ఖాండవప్రస్థం పతాకాధ్వజశోభితం.
సమ్మృష్టసిక్తసంస్థానం పుష్పప్రకరశోభితం
చందనస్య రసైః శీతైః పుణ్యగంధైర్నిషేవితం
దహ్యతాగురుణా చైవ దేశే దేశే సుగంధినా
హృష్టపుష్టజనాకీర్ణం వణిగ్భిరుపశోభితం.
ప్రతిపేదే మహాబాహుః సహ రామేణ కేశవః
వృష్ణ్యంధకైస్తథా భోజైః సమేతః పురుషోత్తమః.
సంపూజ్యమానః పౌరైశ్చ బ్రాహ్మణైశ్చసహస్రశః
వివేశ భవనం రాజ్ఞః పురందరగృహోపమం.
యుధిష్ఠిరస్తు రామేణ సమాగచ్ఛద్ యథావిధి
మూర్ధ్ని కేశవమాఘ్రాయ బాహుభ్యాం పరిషస్వజే.
తం ప్రీయమాణో గోవిందో వినయేనాభిపూజయన్
భీమంచపురుషవ్యాఘ్రం విధివత్ ప్రత్యపూజయత్.
తాంశ్చవృష్ణ్యంధకశ్రేష్ఠాన్ కుంతీపుత్రో యుధిష్ఠిరః
ప్రతిజగ్రాహ సత్కారైర్యథావిధి యథాగతం.
గురువత్పూజయామాస కాంశ్చిత్ కాంశ్చిద్
వయస్యవత్
కాంశ్చిదభ్యవదత్ ప్రేమ్ణా కైశ్చిదప్యభివాదితః.
తేషాం దదౌ హృషీకేశో జన్యార్థే ధనముత్తమం
హరణంవై సుభద్రాయా జ్ఞాతిదేయంమహాయశాః.
రథానాం కాంచనాంగానాం కింకిణీజాలమాలినాం
చతుర్యుజాముపేతానాం సూతైః కుశలశిక్షితైః.
సహస్రం ప్రదదౌ కృష్ణో గవామయుతమేవ చ
శ్రీమాన్ మథురదేశ్యానాం దోగ్ధ్రీణాం
పుణ్యవర్చసాం.
వడవానాం చ శుద్ధానాం చంద్రాంశుసమవర్చసాం
దదౌ జనార్దనః ప్రీత్యా సహస్రం హేమభూషితం.
తథైవాశ్వతరీణాం చ దాంతానాం వాతరంహసాం
శతాన్యంజనకేశీనాం శ్వేతానాం పంచ పంచ చ.
స్నానపానోత్సవే చైవ ప్రయుక్తం వయసాన్వితం
స్త్రీణాంసహస్రంగౌరీణాం సువేషాణాంసువర్చసాం.
సువర్ణశతకంఠీనామరోమాణాం స్వలంకృతాం
పరిచర్యాసు దక్షాణాం ప్రదదౌ పుష్కరేక్షణః.
పృష్ఠ్యానామపి చాశ్వానాం బాహ్లికానాం జనార్దనః
దదౌ శతసహస్రాఖ్యం కన్యాధనమనుత్తమం.
కృతాకృతస్య ముఖ్యస్య కనకస్యాగ్నివర్చసః
మనుష్యభారాన్ దాశార్హో దదౌ దశ జనార్దనః.
గజానాంతుప్రభిన్నానాం త్రిధా ప్రస్రవతాంమదం
గిరికూటనికాశానాం సమరేష్వనివర్తినాం.
క్లృప్తానాం పటుఘంటానాం చారూణాం
హేమమాలినాం
హస్త్యారోహైరుపేతానాం సహస్రం సాహసప్రియః.
రామః పాణిగ్రహణికం దదౌ పార్థాయ లాంగలీ
ప్రీయమాణో హలధరః సంబంధంప్రతిమానయన్.
స మహాధనరత్నౌఘో వస్త్రకంబళఫేనవాన్
మహాగజమహాగ్రాహః పతాకాశైవలాకులః.
పాండుసాగరమావిద్ధః ప్రవివేశ మహాధనః
పూర్ణమాపూరయంస్తేషాం
ద్విషచ్ఛోకావహోఽభవత్.
ప్రతిజగ్రాహ తత్ సర్వం ధర్మరాజో యుధిష్ఠిరః
పూజయామాసతాంశ్చైవవృష్ణ్యంధక మహారథాన్.
తే సమేతా మహాత్మానః కురువృష్ణ్యంధకోత్తమాః
విజహ్రురమరావాసే నరాః సుకృతినో యథా.

నరేశులను చంచలస్వభావంకల లక్ష్మి విడువలేక పోతున్నది. చక్రవర్తులలో కీర్తి ధర్మనిష్ఠా నానాటికి పెరుగుతున్నాయి. బృహస్పతి ప్రముఖదేవతలు ఇంద్రుని పరివేష్టించి ఉన్నట్లు ధౌమ్యాదులు తపస్వులూ ధర్మరాజువద్ద ఉన్నారు.

ప్రజలకు ధర్మరాజమీద రాజభయం కాక ప్రేమాభిమానాలు అధికమయి గౌరవభావం పెంపొందింది. ప్రజాహితకార్యాచరణతో ధర్మరాజు వారి భక్తి విశ్వాసాలు సాధించుకున్నాడు. ప్రియహితమధురవాక్యాలే పలికేవాడు కాని అనుచితమూ అగ్రాహ్యమూ అసత్యమూఅయిన మాటలు మాట్లాడేవాడు కాదు.

ఆవిధంగా కాలం గడుస్తున్నది.

ఆరోజుల్లో గ్రీష్మం వచ్చింది.

గ్రీష్మతాపాన్ని సహించలేక ఒకనాటి సాయంసంధ్యలో అర్జునుడు కృష్ణుని జలవిహారానికి ఆహ్వానించాడు. కృష్ణార్జునులు మిత్రపరివారంతో యమునానదికి జలక్రీడకు వెళ్ళారు. వారివెంట వచ్చిన నారీజనం క్రీడాభవనంలోకి వెళ్ళారు. అది లతలతో వృక్షాలతో శోభిస్తున్నది. వాటినిండా భోజనపదార్థాలూ సుగంధద్రవ్యాలూ ఉన్నాయి. వారందరూ యథేచ్ఛగా జలక్రీడలు సాగించారు. కృష్ణార్జునులు వారి అభిరుచి ననుసరించి వనవిహారంలో జలక్రీడలలో సౌధకేళిలో పాల్గొన్నారు. మధుపాన మదోన్మత్త విలాసినీజనం యథాశక్తిగా గీతనృత్యాలతో ఆనందం కలిగిస్తున్నారు. ద్రౌపదీ సుభద్రలు భూషణాంబరాలు కానుకలుగా ఇస్తున్నారు.

ఆ ఉత్సవంలో కొందరు ఏకాంతంగా విహరిస్తుంటే మరికొందరు మృదుచపలాలతో పరిహాస వాక్యాలతో సాగుతున్నారు. వీణావేణు మృదంగవాద్యాలతో రాజభవనాలన్నీ ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ ఉత్సవోత్సాహంలో కొంతసేపు పాల్గొని కృష్ణార్జునులు అక్కడికి సమీపంలో ఉన్న రమణీయ ప్రాంతానికి వెళ్ళి విశ్రాంతిగా కూర్చుని తాము సాగించిన సంగ్రామవిశేషాలు ముచ్చటించుకుంటున్నారు.

అశ్వినీ దేవతలవలె కూర్చుని వారుభయులూ ప్రసంగించుకుంటూన్న సమయంలో ఒకానొక బ్రాహ్మణుడు వచ్చాడు. ఆ బ్రాహ్మణుని శరీరం స్వర్ణచ్ఛాయతో ఉన్నది. గడ్డమూ వెంట్రుకలూ అగ్నివర్ణంతో ఉన్నాయి. విశాలసాలవృక్షసమంగా ఉన్న ఆయన ముఖం వికసితకమలంలా ఉన్నది. ప్రాతఃకాలసూర్యభగవానునివలె ఉన్న ఆయనను చూస్తూనే కృష్ణార్జునులు లేచి తలవంచి చేతులు జోడించారు.

221 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల ఇరువదిరెండవ అధ్యాయం

ఖాండవవనసమీపంలో నిలిచి ఆ బ్రాహ్మణుడు వారితో ఇలా అన్నాడు - నేను భోజనప్రియుడను. నిరంతరం ఏదో ఒకటి ఆరగిస్తూ ఉంటాను. ఈ రోజున మీరు నాకు భిక్షాప్రదానం చేసి నన్ను తృప్తిపరచండి.

తతశ్చ తతశ్చ మహానాదైరుత్కృష్టతలనాదితైః
యథాయోగం యథాప్రీతివిజహ్రుః కురువృష్ణయః.
ఏవముత్తమవీర్యాస్తే విహృత్య దివసాన్ బహూన్
పూజితాః కురుభిర్జగ్ముః పునర్ద్వారవతీం ప్రతి.
రామం పురస్కృత్య యయుర్వృష్ణ్యంధకమహారథాః
రత్నాన్యాదాయ శుభ్రాణి దత్తాని కురుసత్తమైః.
వాసుదేవస్తు పార్థేన తత్రైవ సహ భారత
ఉవాస నగరే రమ్యే శక్రప్రస్థే మహాత్మనా.
వ్యచరద్ యమునాతీరే మృగయాం స మహాయశాః
మృగాన్ విధ్యన్ వరాహాంశ్చ రేమే సార్ధం కిరీటినా.
తతః సుభద్రా సౌభద్రం కేశవస్య ప్రియా స్వసా
జయంతమివ పౌలోమీ ఖ్యాతిమంతమజీజనత్.
దీర్ఘబాహుం మహోరస్కం వృషభాక్షమరిందమం
సుభద్రా సుషువే వీరమభిమన్యుం నరర్షభం.
అభిశ్చ మన్యుమాంశ్చైవ తతస్తమరిమర్దనం
అభిమన్యుమితి ప్రాహురార్జునిం పురుషర్షభం.
స సాత్వత్యామతిరథః సంబభూవ ధనంజయాత్
మఖే నిర్మథనేనేవ శమీగర్భాద్ధుతాశనః.
యస్మిన్ జాతే మహాతేజాః కుంతీపుత్రో యుధిష్ఠిరః
అయుతం గా ద్విజాతిభ్యః ప్రాదాన్నిష్కాంశ్చ భారత.
దయితో వాసుదేవస్య బాల్యాత్ ప్రభృతి చాభవత్
పితౄణామివ సర్వేషాం ప్రజానామివ చంద్రమాః.
జన్మప్రభృతి కృష్ణశ్చ చక్రే తస్య క్రియాః శుభాః
స చాపి వవృధే బాలః శుక్లపక్షే యథా శశీ.
చతుష్పాదం దశవిధం ధనుర్వేదమరిందమః
అర్జునాద్ వేద వేదజ్ఞః సకలం దివ్యమానుషం.
విజ్ఞానేష్వపి చాస్త్రాణాం సౌష్ఠవే చ మహాబలః
క్రియాస్వపి చ సర్వాసు విశేషానభ్యశిక్షయత్.
ఆగమే చ ప్రయోగే చ చక్రే తుల్యమివాత్మనా
తుతోష పుత్రం సౌభద్రం ప్రేక్షమాణో ధనంజయః.
సర్వసంహననోపేతం సర్వలక్షణలక్షితం
దుర్ధర్షమృషభస్కంధం వ్యాత్తాననమివోరగం.
సింహదర్పం మహేష్వాసం మత్తమాతంగవిక్రమం
మేఘదుందుభినిర్ఘోషం పూర్ణచంద్రనిభాననం.
కృష్ణస్య సదృశం శౌర్యే వీర్యే రూపే తథాఽఽకృతౌ
దదర్శ పుత్రం బీభత్సుర్మఘవానివ తం యథా.
పాంచాల్యపి తు పంచభ్యః పతిభ్యః శుభలక్షణా
లేభే పంచ సుతాన్ వీరాన్ శ్రేష్ఠాన్ పంచాచలానివ.
యుధిష్ఠిరాత్ ప్రతివింధ్యం సుతసోమం వృకోదరాత్
అర్జునాచ్ఛ్రుతకర్మాణం శతానీకం చ నాకులిం.
సహదేవాచ్ఛ్రుతసేనమేతాన్ పంచ మహారథాన్
పాంచాలీ సుషువే వీరానాదిత్యానదితిర్యథా.
శాస్త్రతః ప్రతివింధ్యం తమూచుర్విప్రా యుధిష్ఠిరం
పరప్రహరణజ్ఞానే ప్రతివింధ్యో భవత్వయం.
సుతే సోమసహస్రే తు సోమార్కసమతేజసం
సుతసోమం మహేష్వాసం సుషువే భీమసేనతః.
శ్రుతం కర్మ మహత్ కృత్వా నివృత్తేన కిరీటినా
జాతః పుత్రస్తథేత్యేవం శ్రుతకర్మా తతోఽభవత్.
శతానీకస్య రాజర్షేః కౌరవ్యస్య మహాత్మనః
చక్రే పుత్రం సనామానం నకులః కీర్తివర్ధనం.
తతస్త్వజీజనత్ కృష్ణా నక్షత్రే వహ్నిదైవతే
సహదేవాత్ సుతం తస్మాచ్ఛ్రుతసేనేతి యం విదుః.
ఏకవర్షాంతరాస్త్వేతే ద్రౌపదేయా యశస్వినః
అన్వజాయంత రాజేంద్ర పరస్పరహితైషిణః.
జాతకర్మాణ్యానుపూర్వ్యాచ్చూడోపనయనాని చ
చకార విధివద్ ధౌమ్యస్తేషాం భరతసత్తమ.
కృత్వా చ వేదాధ్యయనం తతః సుచరితవ్రతాః
జగృహుః సర్వమిష్వస్త్రమర్జునాద్ దివ్యమానుషం.
దివ్యగర్భోపమైః పుత్రైర్వ్యూఢోరస్కైర్మహారథైః
అన్వితో రాజశార్దూల పాండవా ముదమాప్నువన్.

ఆమాటలువిని ఆయనకు ఏవిధమయిన భోజనం తృప్తి కలిగిస్తుందో చెపితే యథాశక్తిగా వారి ఆకలి తీరుస్తామన్నాడు. అప్పుడు బ్రాహ్మణుడు తాను అగ్నిహోత్రుడనని తనకు ఏ ఆహారం రుచ్యమో వారే నిర్ణయించాలని అంటూ ఈ ఖాండవ వనం ఇంద్రరక్షితమై తక్షకపరివారవృతమై ఉన్నదని ఇంద్రుని రక్షణలో ఉన్న ఆ వనాన్ని ఆరగించలేకపోతున్నానని ప్రయత్నించినప్పుడల్లా ఇంద్రుడు మేఘావృతంచేసి వర్షధారలతో నిరోధిస్తున్నాడని ఆ విఘ్నం రాకుండా నిరోధించమని ప్రార్థించ వచ్చానని సర్వశస్త్రాస్త్ర విదులైన కృష్ణార్జునుల సహకారం ఉంటే తనపని నెరవేరుతుందని అన్నాడు.

ఎన్నో ప్రాణులు సుఖంగా జీవించాయి. ఖాండవ వనాన్ని దహించాలనే కోరిక అగ్నిహోత్రుడికి ఏ ఉద్దేశంచేత కల్గింది — ఆ విషయాన్ని సవిస్తరంగా వివరించమని జనమేజయుడు కోరగా వైశంపాయనుడు చెబుతున్నాడు.

పూర్వకాలంలో శ్వేతకి అనే మహారాజు ఉండేవాడు. యజ్ఞయాగాదులకే అతని జీవితం అంకితమైంది. ఆ హోమధూమంతో ఆయన నేత్రాలు కూడా దెబ్బతిన్నాయి. ఐనా మానలేదు. కాని ఋత్విక్కులు ధూమబాధ భరించలేక వెళ్ళిపోయారు. శ్వేతకి శతసంవత్సర యాగంకోసం ఋత్విక్కులను అన్వేషించ సాగాడు. ఎందరిని ప్రార్థించినా పాదాలపై పడి వేడినా ధనమిచ్చినా ఎవరూ అంగీకరించలేదు. మహారాజుకి ఆగ్రహం కల్గింది. ఆశ్రమవాసులైన ఋషులను సమీపించి— నేను పతితుడనై మీ సేవకు వచ్చాను. బ్రాహ్మణులందరూ నన్ను వదిలేశారు. మీరు నన్ను అనుగ్రహించి నా యజ్ఞం సక్రమంగా పరిసమాప్తి చేయించండి. మీరుకూడా వదిలితే మరొకరిదగ్గరికి వెళ్ళాలి—అన్నాడు.

అప్పుడు వారు ఆమహారాజు నిత్యం చేసేయజ్ఞాల వల్ల మాకు కలిగినశ్రమ ఇంకా తగ్గలేదని ఈస్థితిలో మళ్ళీ మొదలుపెట్టటం ఉచితం కాదని ఐనా పట్టువిడలేకపోతే పరమశివునిదగ్గరకు పోయి ఆయనచేత చేయించుకోమని అన్నారు. పరిహాసంగా వారు పలికిన పలుకులతో కోపం మరీ ఎక్కువకాగా కైలాసానికి పోయి ఇంద్రియసంయమనంతో తీవ్ర నియమాలతో తపస్సు ఆరంభించాడు. నిరాహార దీక్షతో ఫలాహారంతో ఏకాగ్రదృష్టితో స్థాణువు వలె ఆరుమాసాలు నిలబడుతూ ఏకాగ్రచిత్తంతో చేసే ఆతపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయాడు.

ప్రత్యక్షమైన శివునికి సాష్టాంగ నమస్కారం చేసి—పరమేశ్వరా! నీకు నాయందు అనుగ్రహం కలిగితే నువ్వు నాచేత యజ్ఞం చేయించాలి—అనగా విని పరమశివుడు నవ్వుతూ యజ్ఞం చేయించటం నా పనికాదు ఐనా నువ్వు ఆ సంకల్పంతో తపస్సు చేసి వరం కోరావు కనుక నేను వస్తాను. ఐతే యజ్ఞం జరుగుతున్న పన్నెండు సంవత్సరాలూ నిరంతరం ఆజ్యధారతో అగ్ని పరితృప్తుడౌతూండాలి. ఇందుకు నువ్వు అంగీకరిస్తే నేను వస్తానని పలుకగా శ్వేతకి అంగీకరించి యజ్ఞానికి అవసరమైన సామగ్రి అంతా సిద్ధం చేసుకున్నాడు.

పన్నెండు సంవత్సరాల అనంతరం పరమశివుడు వచ్చి యజ్ఞంచేయించే అధికారం పవిత్రంగానూ తనకు లేదని తన అంశచేత భూమండలంలో జన్మించిన దూర్వాసునిచేత ఈ యజ్ఞం చేయిస్తానని అన్నాడు. యజ్ఞారంభానికి సన్నద్ధుడై శ్వేతకి పరమ

# ఇది ఖాండవ దహన పర్వము

## రెండువందల ఇరువది ఒకటవ అధ్యాయము

ఇంద్రప్రస్థే వసంతస్తే జఘ్నురన్యాన్ నరాధిపాన్
శాసనాద్ ధృతరాష్ట్రస్య రాజ్ఞః శాంతనవస్య చ.
ఆశ్రిత్య ధర్మరాజానం సర్వలోకోఽవసత్ సుఖం
పుణ్యలక్షణకర్మాణం స్వదేహమివ దేహినః.
స సమం ధర్మకామార్థాన్ సిషేవే భరతర్షభ
త్రీనివాత్మసమాన్ బంధూన్ నీతిమానివ మానయన్
తేషాం సమవిభక్తానాం క్షితౌ దేహవతామివ
బభౌ ధర్మార్థకామానాం చతుర్థ ఇవ పార్థివః.
అధ్యేతారం పరం వేదాన్ ప్రయోక్తారం మహాధ్వరే
రక్షితారం శుభాంల్లోకాన్ లేభిరే తం జనాధిపం.
అధిషానవతీ లక్ష్మీః పరాయణవతీ మతిః
వర్ధమానోఽఖిలో ధర్మస్తేనాసీత్ పృథివీక్షితాం.
భ్రాతృభిః సహితో రాజా చతుర్భిరధికం బభౌ
ప్రయుజ్యమానైర్వితతైర్వేదైరివ మహాధ్వరః.
తం తు ధౌమ్యాదయో విప్రాః పరివార్యోపతస్థిరే
బృహస్పతిసమా ముఖ్యాః ప్రజాపతిమివామరాః.
ధర్మరాజే హ్యతిప్రీత్యా పూర్ణచంద్ర ఇవామలే
ప్రజానాం రేమిరే తుల్యం నేత్రాణి హృదయాని చ
న తు కేవలదైవేన ప్రజాభావేన రేమిరే
యద్ బభూవ మనఃకాంతం కర్మణా స చకార తత్.
నహ్యయుక్తం న చాసత్యం నాసహ్యం న చ వాఽప్రియం
భాషితం చారుభాషస్య జజ్ఞే పార్థస్య ధీమతః.
నహి సర్వస్య లోకస్య హితమాత్మన ఏవ చ
చికీర్షన్ సుమహాతేజా రేమే భరతసత్తమ.
తథా తు ముదితాః సర్వే పాండవా విగతజ్వరాః
అవసన్ పృథివీపాలాంస్తాపయంతః స్వతేజసా.
తతః కతిపయాహస్య బీభత్సుః కృష్ణమబ్రవీత్
ఉష్ణాని కృష్ణ వర్తంతే గచ్ఛావో యమునాం ప్రతి.
సుహృజ్జనవృతౌ తత్ర విహృత్య మధుసూదన
సాయాహ్నే పునరేష్యావో రోచతాం తే జనార్దన.
కుంతీమాతర్మమాప్యేతద్ రోచతే యద్ వయం జలే
సుహృజ్జనవృతాః పార్థ విహరేమ యథాసుఖం.
ఆమంత్ర్య తౌ ధర్మరాజమనుజ్ఞాప్య చ భారత
జగ్మతుః పార్థగోవిందౌ సుహృజ్జనవృతౌ తతః.
విహారదేశం సంప్రాప్య నానాద్రుమమనుత్తమం
గృహైరుచ్చావచైర్యుక్తం పురందరపురోపమం
భక్ష్యైర్భోజ్యైశ్చ పేయైశ్చ రసవద్భిర్మహాధనైః
మాల్యైశ్చ వివిధైర్గంధైర్యుక్తం వార్ష్ణేయపార్థయోః
వివేశాంతఃపురం తూర్ణం రత్నైరుచ్చావచైః శుభైః
యథోపజోషం సర్వశ్చ జనశ్చిక్రీడ భారత.
స్త్రియశ్చ విపులశ్రోణ్యశ్చారుపీనపయోధరాః
మదస్ఖలితగామిన్యశ్చిక్రీడుర్వామలోచనాః.
వనేకాశ్చిజ్జలేకాశ్చిత్ కాశ్చిద్ వేశ్మసుచాంగనాః
యథాయోగ్యం యథాప్రీతి చిక్రీడుః పార్థకృష్ణయోః.
ద్రౌపదీ చ సుభద్రా చ వాసాంస్యాభరణాని చ
ప్రాయచ్ఛతాం మహారాజ తేతు తస్మిన్ మదోత్కటే.
కాశ్చిత్ ప్రహృష్టా ననృతుశ్చుక్రుశుశ్చ తథాపరాః
జహసుశ్చ పరా నార్యో జగుశ్చాన్యా వరస్త్రియః.
రురుధుశ్చాపరాస్తత్ర ప్రజఘ్నుశ్చ పరస్పరం
మంత్రయామాసురన్యాశ్చ రహస్యాని పరస్పరం.
వేణువీణామృదంగానాం మనోజ్ఞానాం చ సర్వశః
శబ్దేన పూర్యతే హర్మ్యం తద్ వనం సుమహర్ధిమత్.
తస్మింస్తదా వర్తమానే కురుదాశార్హనందనౌ

దేవుని చేరి తన మనోభీష్టం నెరవేర్చుమన్నాడు. రుద్రుడు దూర్వాసుని పిలిచి ఈ మహారాజుచేత యజ్ఞం చేయించు అన్నాడు.

దూర్వాసుడు సంతోషంతో అంగీకరించి విధి విధానంగా యజ్ఞకర్మ పరిసమాప్తి చేయించాడు. ఆ యజ్ఞంలో మహాత్ములైన ఋత్విజులు సదస్యులు దీక్షితులు ధనసత్కారాలు పొంది దూర్వాసునివద్ద సెలవు తీసుకొని నిజనివాసాలకు వెళ్ళారు. విప్రశ్రేష్ఠుల ఆశీర్వాదాలతో మహారాజు రాజధానికి తరలాడు. కాలక్రమానుసారం శ్వేతకి స్వర్గధామం చేరాడు.

శ్వేతకి నిర్విరామంగా పన్నెండు సంవత్సరాలు ఆజ్యధారతో యజ్ఞం చేయటంవల్ల అగ్ని మరే యజ్ఞంలోనూ హవిస్సులు అందుకోలేకపోయాడు. పైగా అజీర్ణవ్యాధితో శరీరం పాండువర్ణమైపోయింది. ఉదరవ్యాధితో తేజోహీనుడై అగ్ని బ్రహ్మలోకానికి వెళ్ళి శ్వేతకి యజ్ఞంవల్ల తనకు సంపూర్ణమైన సంతృప్తి కలిగినా అజీర్ణవ్యాధితో బలహీనత ఏర్పడిందని అనుగ్రహించి ఆరోగ్యం ప్రసాదించమని బ్రహ్మను పరిపరివిధాల ప్రార్థించాడు. బ్రహ్మ చిరునవ్వుతో-అగ్నిహోత్రా! నువ్వు పన్నెండు సంవత్సరాలు ఘృతపానం చెయ్యటంవల్ల ఈవ్యాధి సంక్రమించింది. దానివల్లనే తేజోహీనుడవయ్యావు. సమయం రాగానే నేను నీకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాను. నువ్వు విచారించకు. ఇదివరలో ఒకమారు దేవతల ఆజ్ఞానుసారం నువ్వు ఖాండవవనాన్ని దహించావు. ఇప్పుడా వనంలో శతసహస్రసంఖ్యాకమైన జీవకోటి నివసిస్తున్నది. ఆ జీవుల మేధ ఆహారంగా తీసుకుంటే నీకు ఆరోగ్యం చేకూరుతుంది. నువ్వు తక్షణం బయలుదేరి వెళ్ళి ఖాండవవనాన్ని దహించు - అనగా అగ్నిహోత్రుడు సంతోషంతో ఖాండవవనంచేరి వాయుదేవుని సహకారంతో మండుతూ దహించసాగాడు. ఆ వనంలోని జీవులు అగ్నిని చల్లార్చటానికి ఎంతో ప్రయత్నించాయి. ఏనుగుల గుంపులు తొండాలతో నీరు తెచ్చి జల్లసాగాయి. ఎన్నో తలలుగల పాములుకూడా నీటిని తెచ్చి పోస్తున్నాయి. కొన్నిజీవులు అగ్నిమీద దుమ్ము జల్లుతున్నాయి. వాటికృషి ఫలించింది. అగ్ని చల్లారాడు. ఈ విధంగా ఏడుమార్లు అగ్నిహోత్రుడు విఫలప్రయత్నుడయ్యాడు.

222వ అధ్యాయము సమాప్తము

## రెండువందల ఇరువదిమూడవ అధ్యాయము

అజీర్ణవ్యాధిగ్రస్తుడైన అగ్నిదేవుడు అనేక పర్యాయాలు ప్రయత్నించి ప్రయోజనం పొందలేక విసిగి వేసారి బ్రహ్మలోకానికి వెళ్ళి తన విఫలకృషి వివరించుకున్నాడు. చతురాననుడు ముహూర్తకాలం విచారించి అగ్నిని ఓదార్చి నరనరాయణులు కొద్దికాలంలో భూమిమీద అవతరించనున్నారని వారి సహకారంతో ఖాండవవనాన్ని దహించవచ్చుని అంతవరకూ వేచిఉండమనీ వారు కృష్ణార్జుననామాలతో అవతరిస్తారనీ చెప్పాడు.

సమీపం జగ్మతుః కంచిదుద్దేశం సుమనోహరం.
తత్ర గత్వా మహాత్మానౌ కృష్ణౌ పరపురంజయౌ
మహార్హాసనయో రాజం స్తతస్తౌ సంనిషీదతుః.
తత్ర పూర్వవ్యతీతాని విక్రాంతాన్యితరాణిచ
బహూని కథయిత్వా తౌ రేమాతే పార్థమాధవౌ.
తత్రోపవిష్టౌ ముదితౌ నాకపృష్ఠేఽశ్వినావివ
అభ్యాగచ్ఛత్ తదా విప్రో వాసుదేవధనంజయౌ.
బృహచ్ఛాలప్రతీకాశః ప్రతప్తకనకప్రభః
హరిపింగోజ్జ్వలశ్మశ్రుః ప్రమాణాయామతః సమః.
తరుణాదిత్యసంకాశశ్చీరవాసా జటాధరః
పద్మపత్రాననః పింగ స్తేజసా ప్రజ్వలన్నివ.
ఉపసృష్టం తు తం కృష్ణౌ భ్రాజమానం ద్విజోత్తమం
అర్జునో వాసుదేవశ్చ తూర్ణముత్పత్య తస్థతుః.

221 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల ఇరువదిరెండవ అధ్యాయము

సోఽబ్రవీదర్జునం చైవ వాసుదేవం చ సాత్వతం
లోకప్రవీరౌ తిష్ఠంతౌ ఖాండవస్య సమీపతః.
బ్రాహ్మణో బహుభోక్తాస్మి భుంజేఽపరిమితం సదా
భిక్షే వార్ష్ణేయపార్థౌ వామేకాం తృప్తింప్రయచ్ఛతం.
ఏవముక్తౌ తమబ్రూతాం తతస్తౌ కృష్ణపాండవౌ
కేనాన్నేన భవాం స్తృప్యేత్ తస్యాన్నస్య
యతావహే
ఏవముక్తః స భగవానబ్రవీత్ తావుభౌ తతః
భాషమాణౌ తదా వీరౌ కిమన్నం క్రియతా మితి.
నాహమన్నం బుభుక్షే వై పావకం మాంనిబోధతం
యదన్నమనురూపం మే తద్ యువాం
సంప్రయచ్ఛతం.
ఇదమింద్రః సదా దావం ఖాండవం పరిరక్షతి
న చశక్నోమ్యహం దగ్ధుంరక్ష్యమాణం మహాత్మనా.
వసత్యత్ర సఖా తస్య తక్షకః పన్నగః సదా
సగణ స్తత్కృతే దావం పరిరక్షతి వజ్రభృత్.
తత్ర భూతాన్యనేకాని రక్షతేఽస్య ప్రసంగతః
తం దిధక్షుర్న శక్నోమి దగ్ధుం శక్రస్య తేజసా.
స మాం ప్రజ్వలితం దృష్ట్వా మేఘాంభోభిఃప్రవర్షతి
తతో దగ్ధుం న శక్నోమి దిధక్షుర్దావమీప్సితం.
స యువాభ్యాం సహాయాభ్యామస్త్రవిద్భ్యాం
సమాగతః
దహేయం ఖాండవం దావమేతదన్నం వృతంమయా.
యువాం హ్యుదకధారాస్తా భూతానిచ సమంతతః
ఉత్తమాస్త్రవిదౌ సమ్యక్ సర్వతో వారయిష్యథః.
కిమర్థం భగవానగ్నిః ఖాండవం దగ్ధుమిచ్ఛతి
రక్ష్యమాణం మహేంద్రేణ నానాసత్త్వసమాయుతం.
న హ్యేతత్ కారణం బ్రహ్మన్నల్పం సంప్రతిభాతి మే
యద్ దదాహసుసంక్రుద్ధః ఖాండవంహవ్యవాహనః.
ఏతద్ విస్తరశో బ్రహ్మన్ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః
ఖాండవస్య పురా దాహో యథా సమభవన్మునే.
శ్రుణు మే బ్రువతో రాజన్ సర్వమేతద్ యథాతథం
యన్నిమిత్తం దదాహాగ్నిః ఖాండవం పృథివీపతే.
హంత తే కథయిష్యామి పౌరాణీమృషిసంస్తుతాం
కథామిమాం నరశ్రేష్ఠ ఖాండవస్య వినాశినీం.
పౌరాణః శ్రూయతే రాజన్ రాజా హరిహయోపమః
శ్వేతకిర్నామ విఖ్యాతో బలవిక్రమసంయుతః.
యజ్వా దానపతిర్ధీమాన్ యథా నాన్యోఽస్తి కశ్చన
ఈజే చ స మహాయజ్ఞైః క్రతుభిశ్చాప్తదక్షిణైః.
తస్య నాన్యాభవద్ బుద్ధిర్దివసే దివసే నృప

కాలం గడిచింది. నరనారాయణులు కృష్ణార్జున రూపాలలో అవతరించారని అగ్ని తెలిసికొని బ్రహ్మలోకానికి వెళ్ళి ఆ విషయం చెప్పి అనంతర కర్తవ్యం అడిగాడు. అప్పుడు బ్రహ్మ అగ్నిని కృష్ణార్జునులవద్దకు వెళ్ళి వారి సాహాయ్యం అర్థించమని వారి అండవుంటే ఇంద్రుడుకూడా ఏమీ చేయ లేడని వారు ఆ వనంలోని నివాసితుల కాలుస్తుంటే చూస్తారని చెప్పగా అగ్ని అపరిమిత సంతోషంతో కృష్ణార్జునులవద్దకు వచ్చి తన కార్యం నివేదించుకొన్నాడు.

ఖాండవ వన దహనం ఇంద్రునికి అయిష్టాన్ని కలిగిస్తుందని తెలిసికూడా అర్జునుడు అగ్నికి అభయం ఇచ్చి— ఓ వహ్నిభట్టారకా! దివ్యశస్త్రాస్త్రాలెన్నో నా స్వాధీనంలో ఉన్నాయి. ఇంద్రుడు ప్రతిపక్షియై వచ్చినా నా ఎదుట నిలవలేడు. కానీ ప్రస్తుతంలో నా వేగానికి తగ్గ ధనస్సు లేదు. ఇప్పుడున్న ఈ ధనస్సు తీవ్రసంగ్రామంలో పనికిరాదు. పరంపరగా వదలవలసివస్తే అవసరమైన అక్షయ తూణీరాలను ధరించే రథమూలేదు. వాయుసమ వేగంగల గుర్రాలూ లేవు. వాటిచేత లాగబడే మేఘగంభీరంగా ఘోషించే రథమూలేదు. ఈ వనంలో ఉండే పిశాచ నాగజాతులను నిరోధించే ఆయుధ సామగ్రి ప్రస్తుతం కృష్ణునివద్దలేదు. ఇన్ని సమకూర్చే సాధనం ఏదైనా నీకు తోస్తే చెప్పు. పురుష యత్నంతో సాధ్యమయ్యే కార్యాన్ని నెరవేర్చటానికి మేము సన్నద్ధులము. ఇది సామాన్యమైన కార్యంకాదు. అపాయంలేని ఉపాయం ఆలోచించు— అన్నాడు.

223 వ అధ్యాయము సమాప్తం

## రెండువందల ఇరువది నాల్గవ అధ్యాయము

అదితిపుత్రుడూ జలాధిదేవతా అయిన వరుణుని అగ్ని ప్రార్థించాడు. వరుణుడు ప్రసన్నుడై అగ్ని ఎదుట నిలిచాడు. అగ్ని స్వాగత పూజాదులు నిర్వర్తించి— ఓ జలదేవతా! మహారాజు సోముడు నీకు ప్రసాదించిన దివ్యధనుస్సు అక్షయతూణీరం కపికేతనయుతమైన దివ్యరథమూ నాకు ప్రసాదించు. కుంతీనందనుడైన అర్జునుడు గాండీవధారియై వసుదేవనందనుడైన శ్రీకృష్ణుడు చక్రధారియై నాకోరిక నెరవేర్చటానికి సిద్ధంగా ఉన్నారు— అని ప్రార్థించగా వరుణుడు అనుగ్రహించాడు.

అప్రతిహతమూ యశోవృద్ధికరమూ శక్తిప్రసాదకమూ విచిత్రవర్ణశోభితమూ ఛిద్రరహితము దేవ దానవ గంధర్వ పూజితమూ అయిన గాండీవమూ అక్షయతూణీరాలూ శ్వేతాశ్వచతుష్టయయుతమైన దివ్యస్యందనమూ వరుణుడిచ్చాడు. ఆ గుర్రాల మెడలలో సువర్ణహారాలున్నాయి. మనోవేగ వాయువేగాలను అధఃకరించే గమనం వాని కున్నది. దేవదానవులకు అజేయమైన సాధనసంపత్తితో ఆ రథం నిండివున్నది. అది కదులుతూంటే ఉరుముల వలె ధ్వనిస్తూ శత్రువులకు భయం కలిగిస్తూంది. సర్వ జగదధినాయకుడైన విశ్వకర్మ తీవ్రతపస్సుతో నిర్మించిన ఆ రథం సూర్యసమతేజస్సుతో ప్రకాశిస్తున్నది. ఆ రథంమీదనే సాగి చంద్రుడు పూర్వ కాలంలో శత్రుదానవులను జయించాడు. అటువంటి

సత్రేష్టియాసమారంభే దానేషు వివిధేషు చ.
ఋత్విగ్భిః సహితో ధీమానేవమీజే స భూమిపః
తతస్తు ఋత్విజశ్చాస్య ధూమవ్యాకులలోచనాః.
కాలేన మహతా ఖిన్నాస్తత్యజుస్తే నరాధిపం
తతః ప్రచోదయామాస ఋత్విజస్తాన్ మహీపతిః
చక్షుర్వికలతాం ప్రాప్తా న ప్రపేదుశ్చ తే క్రతుం
తతస్తేషామనుమతే తద్ విప్రైస్తు నరాధిపః.
సత్రం సమాపయామాస ఋత్విగ్భిరపరైః సహ
తస్యైవం వర్తమానస్య కదాచిత్ కాలపర్యయే.
సత్రమాహర్తుకామస్య సంవత్సరశతం కిల
ఋత్విజో నాభ్యపద్యన్త సమాహర్తుం మహాత్మనః.
స చ రాజాకరోద్ యత్నం మహాన్తం ససుహృజ్జనః
ప్రణిపాతేన సాన్త్వేన దానేన చ మహాయశాః.
ఋత్విజోఽనునయామాస భూయో
భూయస్త్వతన్ద్రితః
తే చాస్య తమభిప్రాయం న చక్రురమితౌజసః.
స చాశ్రమస్థాన్ రాజర్షిస్తానువాచ రుషాన్వితః
యద్యహం పతితో విప్రాః శుశ్రూషాయాం న చ స్థితః.
ఆశు త్యాజ్యోఽస్మి యుష్మాభిర్బ్రాహ్మణైశ్చ జుగుప్సితః
తన్నార్హథ క్రతుశ్రద్ధాం వ్యాఘాతయితుమద్య తాం.
అస్థానే వా పరిత్యాగః కర్తుం మే ద్విజసత్తమాః
ప్రపన్న ఏవ వో విప్రాః ప్రసాదం కర్తుమర్హథ.
సాన్త్వదానాదిభిర్వాక్యైస్తత్త్వతః కార్యవత్తయా
ప్రసాదయిత్వా వక్ష్యామి యన్నః కార్యం
ద్విజోత్తమాః
అథావాహం పరిత్యక్తో భవద్భిర్ద్వేషకారణాత్
ఋత్విజోఽన్యాన్ గమిష్యామి యాజనార్థం
ద్విజోత్తమాః.
ఏతావదుక్త్వా వచనం విరరామ స పార్థివః
యదా న శేకూ రాజానం యాజనార్థం పరన్తప.

తతస్తే యాజకాః క్రుద్ధాస్తమూచుర్నృపసత్తమం
తవ కర్మాణ్యజస్రం వై వర్తన్తే పార్థివోత్తమ.
తతో వయం పరిశ్రాన్తాః సతతం కర్మవాహినః
శ్రమాదస్మాన్ పరిశ్రాన్తాన్ సత్వాన్ స త్యక్తుమర్హసి.
బుద్ధిమోహం సమాస్థాయ త్వరా సంభావితోఽనఘ
గచ్ఛ రుద్రసకాశం త్వం స హి త్వాం యాజయిష్యతి
సాధిక్షేపం వచః శ్రుత్వా సంక్రుద్ధః శ్వేతకిర్నృపః
కైలాసం పర్వతం గత్వా తప ఉగ్రం సమాస్థితః.
ఆరాధయన్ మహాదేవం నియతః సంశితవ్రతః
ఉపవాసపరో రాజన్ దీర్ఘకాలమతిష్ఠత.
కదాచిద్ ద్వాదశే కాలే కదాచిదపి షోడశే
ఆహారమకరోద్ రాజా మూలాని చ ఫలాని చ.
ఊర్ధ్వబాహుస్త్వనిమిషస్తిష్ఠన్ స్థాణురివాచలః
షణ్మాసానభవద్ రాజా శ్వేతకిః సుసమాహితః
తం తదా నృపశార్దూలం తప్యమానం మహత్ తపః
శంకరః పరమప్రీత్యా దర్శయామాస భారత.
ఉవాచ చైనం భగవాన్ స్నిగ్ధగంభీరయా గిరా
ప్రీతోఽస్మి నరశార్దూల తపసా తే పరన్తప.
వరం వృణీష్వ భద్రం తే యం త్వమిచ్ఛసి పార్థివ
ఏతచ్ఛ్రుత్వా తు వచనం రుద్రస్యామితతేజసః.
ప్రణిపత్య మహాత్మానం రాజర్షిః ప్రత్యభాషత
యది మే భగవాన్ ప్రీతః సర్వలోకనమస్కృతః.
స్వయం మాం దేవదేవేశ యాజయస్వ సురేశ్వర
ఏతచ్ఛ్రుత్వా తు వచనం రాజ్ఞా తేన ప్రభాషితం.
ఉవాచ భగవాన్ ప్రీతః స్మితపూర్వమిదం వచః
నాస్మాకమేష విషయో వర్తతే యాజనం ప్రతి.
త్వయా చ సుమహత్ తప్తం తపో రాజన్ వరార్థినా
యాజయిష్యామి రాజంస్త్వాం సమయేన పరన్తప.
సమా ద్వాదశ రాజేన్ద్ర బ్రహ్మచారీ సమాహితః
సతతం త్వాజ్యధారాభిర్యది తర్పయసేఽనలం.

